## భాష్యమ్

పశ్వాదిభిశ్చావిశేషాత్. యథా హి పశ్వాదయః శబ్దాదిభిః శ్రోత్రాదీనాం సంబన్ధే సతి, శబ్దాదివిజ్ఞానే ప్రతికూలే జాతే తతో నివర్తన్తే, అనుకూలే చ ప్రవర్తన్తే, యథా దణ్డోద్యతకరం పురుషమభిముఖముపలభ్య మాం హన్తుమయమిచ్ఛతీతి పలాయితుమారభన్తే, హరితతృణపూర్ణపాణిముపలభ్య తం ప్రత్యభిముఖీభవన్తి, ఏవం పురుషా అపి వ్యుత్పన్నచిత్తాః క్రూరదృష్టీనాక్రోశతః ఖడ్గోద్యతకరాన్ బలవతః ఉపలభ్య తతో నివర్తన్తే, తద్విపరీతాన్ ప్రతి ప్రవర్తన్తే. అతః సమానః పశ్వాదిభిః పురుషాణాం ప్రమాణప్రమేయవ్యవహారః. పశ్వాదీనాం చ ప్రసిద్ధోఽవివేకపురఃసరః ప్రత్యక్షాదివ్యవహారః. తత్సామాన్యదర్శనాత్ వ్యుత్పత్తిమతామపి పురుషాణాం ప్రత్యక్షాదివ్యవహారః తత్కాలః సమాన ఇతి నిశ్చీయతే.

### బాలానందిని

అవ. నువ్వు చెప్పిన దంతా పామరుల విషయంలో సత్యమే కావచ్చు; పండితుల విషయంలో ఇది సత్యం కాదు కదా అని ఆశంకించుకొని అవిద్య (అధ్యాస) తొలగనంతవరకు పండితులు కూడ పామరుల వంటివారే, పశువుల వంటివారే అని సమాధానం చెపుతున్నారు. పశ్వాదిభిరితి:- కేవలం శాస్త్రపాండిత్యం మాత్రమే ఉన్న పండితులకీ పశువులు మొదలైన తిర్యగ్జంతువులకీ ఏ మాత్రం భేదం లేదు. పశ్వాదులు వాటి శ్రోత్రాదీంద్రియాలకు శబ్దాదులతో సంబంధం ఏర్పడగానే ఆ శబ్దాదుల జ్ఞానం ప్రతికూలంగా ఉంటే మరలి వెళ్లిపోతాయి, అనుకూలంగా ఉంటే ముందుకు సాగుతాయి. చేతిలో కఱ్ఱ ఎత్తి వస్తున్న మనిషిని చూడగానే "ఇతడు నన్ను కొట్టడానికి వస్తున్నాడు" అని తెలుసుకొని పారిపోవడానికి ప్రారంభిస్తాయి; చేతి నిండా పచ్చగడ్డి తీసికొని వస్తూన్నవానిని చూడగానే అతని వైపు వెడతాయి. అదే విధంగా శాస్త్రాధ్యయనం చేసిన వాళ్లే అయినా (వ్యుత్పన్నచిత్తా అపి) పురుషులు, ఎవరైనా తమకంటె ఎక్కువ బలం కలవాళ్లు చేతిలో ఖడ్గం ఎత్తి, క్రూరమైన చూపులతో నిందిస్తూ మీదికి వస్తూంటే వాళ్లను చూచి వాళ్లనుండి దూరంగా వెళ్లిపోతారు. అందుకు విరుద్ధంగా ఎవరైనా తమ విషయంలో ఆదరం చూపుతూ వస్తే వాళ్ల దగ్గరకు వెడతారు. అందుచేత పురుషుల ప్రమాణప్రమేయవ్యవహారానికీ పశ్వాదుల ప్రమాణప్రమేయవ్యవహారానికీ ఏమీ తేడా లేదు. పశువులలో ఉన్న ప్రత్యక్షాదివ్యవహారం అవివేకంతో నిండి ఉంటుం దనే

విషయం ప్రసిద్ధమే. అదే విధంగా ఉండడంవల్ల వ్యుత్పత్తిమంతులైన పురుషుల (పండితుల) ప్రత్యక్షాదివ్యవహారం కూడా, ఆ సమయంలో, అనగా అధ్యాస ఉన్నంత వరకు, పశ్వాదివ్యవహారంతో సమానమే అనే మాట నిశ్చితం.

## భాష్యమ్

శాస్త్రీయే తు వ్యవహారే యద్యపి బుద్ధిపూర్వకారీ నావిదిత్వా ఆత్మనః పరలోకసంబన్ధమ్ అధిక్రియతే తథాపి న వేదాన్తవేద్యమ్, అశనాయాద్యతీతమ్, అపేతబ్రహ్మక్షత్రాదిభేదమ్, అసంసారి ఆత్మతత్త్వమ్ అధికారేఽపేక్ష్యతే; అనుపయోగాత్; అధికారవిరోధాచ్చ. ప్రాక్చ తథాభూతాత్మవిజ్ఞానాత్ ప్రవర్తమానం శాస్త్రమ్ అవిద్యావద్విషయత్వం నాతివర్తతే. తథా హి- "బ్రాహ్మణో యజేత" ఇత్యాదీని శాస్త్రాణి ఆత్మని వర్ణాశ్రమవయోవస్థాది విశేషాధ్యాసమాశ్రిత్య ప్రవర్తన్తే.

అధ్యాసో నామ అతస్మింస్తద్బుద్ధిరిత్యవోచామ. తద్యథా పుత్రభార్యాదిషు వికలేషు సకలేషు వా అహమేవ వికలః సకలో వేతి బాహ్యధర్మానాత్మన్యధ్యస్యతి; తథా దేహధర్మాన్ - స్థూలోఽ హమ్, కృశోఽహమ్, గౌరోఽహమ్, తిష్ఠామి, గచ్ఛామి, లఙ్ఘయామి చేతి. తథేన్ద్రియధర్మాన్ - మూకః, కాణః, క్లీబః, బధిరః, అన్ధోఽహమితి. తథాన్తఃకరణధర్మాన్ కామసంకల్పవిచికిత్సాధ్యవసాయాదీన్. ఏవమహంప్రత్యయినమశేషస్వ ప్రచారసాక్షిణి ప్రత్యగాత్మన్యధ్యస్య తం చ ప్రత్యగాత్మానం సర్వసాక్షిణం తద్విపర్యయేణ అన్తఃకరణాదిష్వధ్యస్యతి. ఏవమయమనాదిరనన్తో నైసర్గికోఽధ్యాసః మిథ్యాప్రత్యయరూపః, కర్తృత్వభోక్తృత్వప్రవర్తకః సర్వలోకప్రత్యక్షః, అస్యానర్థహేతోః ప్రహాణాయ ఆత్మైకత్వవిద్యాప్రతిపత్తయే సర్వే వేదాన్తాః ఆరభ్యన్తే. యథా చాయమర్థః సర్వేషాం, వేదాన్తానాం తథా వయమస్యాం శారీరకమీమాంసాయాం ప్రదర్శయిష్యామః.

## బాలానందిని

అవ. లౌకికవ్యవహారం అంతా అధ్యాసమూలాన జరుగుచున్నా కూడ అగ్నిష్టోమాది యాగాలు చేయడం వంటి వైదికకర్మ అధ్యాసమూలకం కాదు కదా? శరీరం కంటె భిన్నమైన ఆత్మ ఉన్నది. అది స్వర్గగమనాదులు చేస్తూ ఉంటుంది అనే నమ్మకం కలవాడే కదా ఆ యాగాదులలో ప్రవర్తిస్తాడు అని ఆశంకించుకొని సమాధానం

చెపుతున్నారు- శాస్త్రీయే ఇతి:- శాస్త్రీయమైన, అనగా వేదాదిశాస్త్రాలచేత బోధింపబడిన వ్యవహారంలో, యాగాదులలో, బుద్ధిపూర్వంగా చేసేవాడు అనగా, ఎవరో చెప్పారు చేస్తున్నాం అన్నట్లు కాకుండా విషయం తెలుసుకొని చేసేవాడు, ఆత్మకు పరలోకసంబంధం ఉన్న దని తెలిసినవా డౌతేనే అధికారి అవుతాడు (యాగాదులు చేయడానికి తగిన అర్హత కలవా డవుతాడు) అనే మాట నిజమే. అయినా వేదాంతాల ద్వారా తెలియబడేది, ఆకలి మొదలైన దుఃఖాలను అతిక్రమించి ఉన్నది (అనగా ఆ దుఃఖాలేవీ లేనిది), బ్రాహ్మణత్వక్షత్రియత్వాది భేదాలు ఏవీ లేనిది, సంసారవిహీనమూ అయిన ఆత్మతత్త్వం అధికారంలో అపేక్షించబడదు. అనగా శాస్త్రీయకర్మాచరణ చేసే అధికారం ఇలాంటి ఆత్మతత్త్వానికే ఉంటుం దని చెప్పడానికి అవసరం లేదు. ఎందువల్ల ననగా వైదికకర్మాచరణానికి అలాంటి ఆత్మతత్త్వంయొక్క ఉపయోగం లేదు. ఉపయోగం లేకపోవడమే కాదు; అలాంటి ఆత్మతత్త్వం అధికారానికి (కర్మాచరణ యోగ్యత్వానికి) విరుద్ధం కూడ. అలాంటి ఆత్మతత్త్వాన్ని తెలుసుకొనడానికి పూర్వం ప్రవర్తించే శాస్త్రం అవిద్యావంతునికి మాత్రమే చెందినదిగా ఉంటుంది. కాని అవిద్యావిముక్తునికి సంబంధించినదిగా ఉండదు. ఎందువల్లననగా- "బ్రాహ్మణో యజేత" (బ్రాహ్మణుడు యజ్ఞం చెయ్యాలి) ఇత్యాది శాస్త్రాలు ఆత్మమీద వర్ణం, ఆశ్రమం, వయస్సు, అవస్థ మొదలైనవాటి అధ్యాసను ఆశ్రయించి ప్రవర్తిస్తాయి. అనగా ఆత్మమీద "నేను బ్రాహ్మణుడను", ఇత్యాద్యధ్యాస ఉన్నవాని విషయంలో ఆ శాస్త్రాలు ప్రవర్తిస్తాయి; అలాంటి అధ్యాస లేనివానికి ఆ శాస్త్రాలతో పని లేదు, ఆ కర్మలు చేసే అధికారం లేదు అని అర్థం.

"అది కానిదానిని అది అని భావించడం అధ్యాస" అని వెనుక చెప్పి ఉన్నాం. అది ఎట్లనగా - పుత్రులు, భార్య మొదలైన వాళ్ళువికలు లైనా (ఏవో లోపాలతో కష్టపడుతున్నా), సకలులైనా (ఏ లోపాలు లేక సుఖంగా ఉన్నా) బాహ్యులైన (తనకంటె వేరుగా ఉన్న) వాళ్ళ ధర్మాలను తనమీద ఆరోపించుకొని "నేనే వికలుడను" లేదా "నేనే సకలుడను" అని అనుకొంటూ ఉంటాడు. అదే విధంగా దేహధర్మాలను తనమీద ఆరోపించుకొని "నేను లావుగా ఉన్నాను, నేను సన్నగా ఉన్నాను, నేను తెల్లగా ఉన్నాను, నేను నిలబడ్డాను, నేను నడుస్తున్నాను, దుముకుతున్నాను" అని అనుకొంటూ ఉంటాడు. అట్లే ఇంద్రియధర్మాలను తనమీద ఆరోపించుకొని "నేను మూగవాడను, ఒంటికన్నువాడను, నపుంసకుడను, చెవిటివాడను, గ్రుడ్డివాడను అని అనుకొంటూ ఉంటాడు. అట్లే అంతఃకరణధర్మాలైన కామం, సంకల్పం, సంశయం, నిశ్చయం మొదలైన వాటిని తనపై ఆరోపించుకొంటాడు. ఈ విధంగా అంతఃకరణను

(అహంప్రత్యయినమ్) దాని (అంతఃకరణంయొక్క) సమస్తవృత్తులకు సాక్షియైన ప్రత్యగాత్మమీద అధ్యసించి, దానికి విరుద్ధంగా, అన్నింటికి సాక్షియైన ప్రత్యగాత్మను అంతఃకరణాదుల మీద అధ్యసిస్తున్నాడు.

వి. ప్రాతిలోమ్యేన=అసత్తులు, జడాలు, దుఃఖాత్మకాలు అయిన అహంకారాదుల కంటె విలక్షణంగా, భిన్నస్వభావంగా సచ్చిత్సుఖాత్మకమై, అఞ్చతి=ప్రకాశించుచున్నది, కాబట్టి "ప్రత్యక్". ప్రత్యక్ అయిన ఆత్మ ప్రత్యగాత్మ అని అర్థం. "తద్విపర్యయేణ" అనగా అంతఃకరణాన్ని ఆత్మమీద అధ్యసించడానికి విపరీతంగా (ఆత్మను అంతః కరణం మీద అధ్యసిస్తున్నాడు) అని అక్షరార్థం. దీనికి "జడమైన అంతఃకరణాదికానికి అధిష్ఠానంగా ఉన్న (ఆత్మ)" అని వ్యాఖ్యాతలు అర్థం చెప్పి ఉన్నారు.

ఏవమితి:- ఈ విధంగా ఆది లేనిది, అంతం లేనిది (జ్ఞానం కలిగితేనే కాని నశించనిది అవడంచేత అనంతం) స్వభావసిద్ధ మైనది, అసత్యజ్ఞానరూపమైనది, కర్తృత్వభోక్తృత్వాలను కలిగించేది అయిన ఈ అధ్యాస సర్వజనులకు ప్రత్యక్ష మైనదే. ("మిథ్యాప్రత్యయరూపః" అనేదానికి-మాయచేత కనబడే ప్రపంచమూ, దాని జ్ఞానమూ, వాటి రూపం గల అని వ్యాఖ్యాతలు. అస్యేతి- సకలానర్థాలకీ హేతువైన ఈ అధ్యాస తొలగిపోవడానికి, తద్వారా ఆత్మైకత్వజ్ఞానం లభించడానికి వేదాంతాలు అన్నీ చెప్పబడుచున్నవి, అనగా విచారించబడుచున్నవి. సకలవేదాంతాలకీ ఇదే ప్రయోజనం అనే విషయం ఈ శారీరకమీమాంసలో మేం ప్రదర్శించనున్నాం.

వి. విచారించ నున్న వేదాంతాలలో ప్రతిపాదించబడిన విషయం బ్రహ్మాత్మైక్యం; ఫలం మోక్షం అని చెప్పిన ట్లయింది. దీనిని పట్టి వేదాంతవిచారరూపమైన ఈ శాస్త్రానికి కూడా అవే విషయఫలాలు. ప్రత్యగాత్మకున్న బంధాదికం అధ్యాసవల్ల ఏర్పడినది గాన ఈ అధ్యాస తొలగిపోతే బంధాదికం తొలగిపోతుంది. అధ్యాస తొలగడానికి ఆత్మతత్త్వజ్ఞానం ఒక్కటే మార్గం. అందుచేత ఏతచ్ఛాస్త్రారంభం ఆవశ్యకమే అని భగవత్పాదులు ఈ అధ్యాస లక్షణ-స్వరూపనిరూపణాదుల ద్వారా సూచించి ఉన్నారు. శారీరకమీమాంస అనగా శారీరకుని (శరీరంతో సంబంధించిన జీవుని) బ్రహ్మత్వాన్ని గూర్చిన విచారం అని అర్థం. ఆత్మతత్త్వానికి వేదాంతాలకీ (ఉపనిషత్తులకీ) ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధం. అనగా ఉపనిషత్తులు ఆత్మతత్త్వప్రతిపాదకాలు ఆత్మతత్త్వంఉపనిషత్ప్రతిపాద్యం అని అర్థం. ఉపనిషదర్థవిచారాత్మకమైన ఈ శాస్త్రానికీ, ఆత్మతత్త్వానికీ కూడ అదే సంబంధం. నిత్యానిత్యవివేకాదు లున్నవాడు ఈ శాస్త్రం చదవడానికి అధికారి అని ముందు స్పష్టం కాగలదు. ఈ విధంగా ఈ శాస్త్రానికి అనుబంధచతుష్టయం చెప్పబడింది.

శ్రీ శంకరభగవత్పాదుల సాక్షాచ్ఛిష్యులలో ఒకరైన పద్మపాదులు ఈ సూత్ర భాష్యానికి పంచపాదిక అనే ఒక వ్యాఖ్య వ్రాశారు. అది మొదటి నాలుగు సూత్రాలకు మాత్రమే లభిస్తున్నది. పంచపాదికకు ప్రకాశాత్మయతి వివరణం అనే ప్రామాణికమైన వ్యాఖ్యానం వ్రాశారు. పంచపాదికానుసారం చతుస్సూత్రిమీద ఉన్న భాష్యం తొమ్మిది వర్ణకాలుగా విభజించబడింది. వర్ణకం అనగా ఒక విషయాన్ని వర్ణించే, ప్రతిపాదించే ఒక ఘట్టం. "అస్యాం శారీరకమీమాంసాయాం ప్రదర్శయిష్యామః" అనే వాక్యంతో ప్రథమవర్ణకం పూర్తి అయినది.

## భాష్యమ్

వేదాన్తమీమాంసాశాస్త్రస్య వ్యాచిఖ్యాసితస్యేదమాదిమం సూత్రమ్-

**సూత్రమ్: అథాతో బ్రహ్మజిజ్ఞాసా. 1.1.1**

## బాలానందిని

ఈ శాస్త్రం వేదాంతాలను (ఉపనిషత్తులను) విచారించడానికి ఉద్దిష్ట మైనది. వీటి విచారం పూర్వమే జరిగిపోయినదా లేదా అని సందేహం. సమస్తవేదవాఙ్మయమూ కూడ ఏదో ఒక కర్మ మొదలైనదానిని విధించడానికి ఉద్దేశించబడినది. విధిపరమైన ఆ వేదభాగా న్నంతనీ పూర్వమీమాంసలో "అథాతో ధర్మజిజ్ఞాసా" ఇత్యాది సూత్రాలలో జైమిని విచారించి ఉన్నాడు. అందుచేత వేదాంతాల అర్థం కూడ విచారించి నట్లే గాన ఈ శాస్త్రం ప్రారంభించవలసిన పని లేదు. వీటికి ప్రత్యేకించి విషయం ఏదీ లేదు అని పూర్వపక్షం. దానికి సమాధానంగా భగవత్పాదులు ప్రథమసూత్రావతరణికారూపంలో "వేదాన్తమీమాంసాశాస్త్రస్య" ఇత్యాదివాక్యం వ్రాసి ఉన్నారు. మేం వ్యాఖ్యానింప దలచిన ఈ వేదాంతమీమాసాశాస్త్రానికి (అనగా ఈ శాస్త్రం వేదాంతాలకి సంబంధించిన పూజనీయమైన విచారం రూపంలో ఉన్న శాస్త్రం, అట్టి ఈ శాస్త్రానికి) ఇది మొదటి సూత్రం అని ఈ వాక్యానికి అర్థం. బ్రహ్మ జ్యోతిష్టోమాదికర్మల వలె కొత్తగా విధించబడేది కాదు. ఎప్పుడూ ఉన్నదే. పూర్వమీమాసాశాస్త్రం విధిరూపవేదభాగాన్నే విచారించింది గాని నిత్యసిద్ధరూపమైన బ్రహ్మను గూర్చి విచారించలేదు. సిద్ధవస్తువిచారం చేయవలసిన పని లేదు అనడానికి వీలు లేదు. అట్లయితే బాదరాయణుడు ఈ బ్రహ్మసూత్రాలను రచించి ఉండేవాడు కాదు. అందుచేత ఈ శాస్త్రారంభం చేయదగినదే అని 'వ్యాచిఖ్యాసితస్య' అనే పదంచేత సూచించబడింది.

ద్వితీయవర్ణకం సమాప్తం.

## భాష్యమ్

అత్ర అథశబ్దః ఆనన్తర్యార్థకః పరిగృహ్యతే, నాధికారార్థః, బ్రహ్మజిజ్ఞాసాయాః అనధికార్యత్వాత్. మఙ్గలస్య చ వాక్యార్థే సమన్వయాభావాత్. అర్థాన్తర ప్రయుక్త ఏవ హ్యథశబ్దః శ్రుత్యా మఙ్గలప్రయోజనో భవతి. పూర్వ ప్రకృతాపేక్షాయాశ్చ ఫలత ఆనన్తర్యావ్యతిరేకాత్. సతి చానన్తర్యార్థత్వే యథా ధర్మజిజ్ఞాసా పూర్వవృత్తం వేదాధ్యయనం నియమేనాపేక్షతే ఏవం బ్రహ్మజిజ్ఞాసాపి యత్పూర్వవృత్తం నియమేనాపేక్షతే తద్వక్తవ్యమ్. స్వాధ్యాయానన్తర్యం తు సమానమ్. నన్విహ కర్మావబోధానన్తర్యం విశేషః? న. ధర్మజిజ్ఞాసాయాః ప్రాగప్యధీతవేదాన్తస్య బ్రహ్మజిజ్ఞాసోపపత్తేః. యథా చ హృదయాద్యవదానానామానన్తర్యనియమః, క్రమస్య వివక్షితత్వాత్; న తథేహ క్రమో వివక్షితః, శేషశేషిత్వే అధికృతాధికారే వా ప్రమాణాభావాత్ ధర్మబ్రహ్మజిజ్ఞాసయోః, ఫలజిజ్ఞాస్యభేదాచ్చ. అభ్యుదయఫలం ధర్మజ్ఞానం, తచ్చానుష్ఠానాపేక్షమ్. నిఃశ్రేయసఫలం తు బ్రహ్మవిజ్ఞానం న చానుష్ఠానాన్తరాపేక్షమ్. భవ్యశ్చ ధర్మో జిజ్ఞాస్యో న జ్ఞాన కాలేఽస్తి, పురుషవ్యాపారతన్త్రత్వాత్. ఇహ తు భూతం బ్రహ్మ జిజ్ఞాస్యం నిత్యత్వాన్న పురుషవ్యాపారతన్త్రమ్. చోదనాప్రవృతిభేదాచ్చ. యా హి చోదనా ధర్మస్య లక్షణం సా స్వవిషయే నియుఞ్జానైవ పురుషమవబోధయతి. బ్రహ్మ చోదనా తు పురుషమవబోధయత్యేవ కేవలమ్. అవబోధస్య చోదనాజన్యత్వాన్న పురుషోఽవబోధే నియుజ్యతే. యథాఽక్షార్థసంనికర్షేణ అర్థావబోధే తద్వత్. తస్మాత్ కిమపి వక్తవ్యం యదనన్తరం బ్రహ్మజిజ్ఞాసోపదిశ్యత ఇతి.

## బాలానందిని

తత్రేతి:- సూత్రంలోని అథశబ్దానికి తరవాత అని అర్థం. అంతే కాని ఈ పదాన్ని అధికారార్థంలో తీసికొనగూడదు.

వి. అధికారం అనగా ప్రారంభం. ఇక్కడ బ్రహ్మజిజ్ఞాస ప్రారంభించబడుతున్నది అని అర్థం చెప్పకూడదు అని భావం. ఎందువల్ల ననగా బ్రహ్మజిజ్ఞాసను ప్రారంభించడం అనేది కుదరదు. ఏదైన ఒక కార్యం ప్రారంభించబడుచున్నది అని చెప్పవచ్చును కాని "ఇప్పుడు కోరిక ప్రారంభించబడుచున్నది" అని అనం కదా? కోరిక అనేది ప్రారంభిస్తే ప్రారంభమై మానేస్తే ఆగిపోదు కదా? ఐతే ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది.

'బ్రహ్మజిజ్ఞాసా' అన్నదానికి బ్రహ్మవిచారం అని కొందరు వ్యాఖ్యాతలు లాక్షణికార్థం అంగీకరించారు. అపుడు అథశబ్దాన్ని పట్టి "బ్రహ్మవిచారం ప్రారంభించబడుచున్నది" అని అర్థం చెప్పవచ్చును కదా? దీనికి వీరు చెప్పే సమాధానం ఏ మనగా - విచారం అని లాక్షణికార్థం చెప్పినప్పుడు 'కర్తవ్యా' అని అధ్యాహారం తెచ్చుకొని "బ్రహ్మవిచారం చెయ్యదగినది" అని అర్థం చెప్పవలసి ఉన్నది. దానికి బ్రహ్మవిచారం ప్రారంభించాలి అనే కదా భావం? అందుచేత మళ్లీ అథశబ్దానికి ప్రారంభార్థం చెప్పడం అనావశ్యకం అని వ్యాఖ్యాతలు చెప్పినారు. అయితే 'అథ'కి ప్రారంభార్థం చెపితే సరిపోతుంది గాన 'కర్తవ్యా' అనే పదం అధ్యాహారం తెచ్చుకోకుండా ఉండవచ్చు కదా అని మరొక ప్రశ్న ఉదయిస్తుంది. దీనికి సమాధానం ఆలోచించాలి. అందుచేత మనం ముందు చెప్పిన భామతీకారాద్యభిమతమైన అర్థమే బాగున్నది.

అవ: అథశబ్దానికి "మఙ్గలానన్తరారమ్భప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ" అని నిఘంటువులో చెప్పినట్లు మంగళార్థం కూడా ఉంది కదా; గ్రంథారంభంలో మంగళాచరణ యుక్తం కదా? అందుచేత దీనికి ఆ అర్థం చెప్పవచ్చును కదా అని ఆశంకించుకొని చెప్పుచున్నారు. మఙ్గలస్యేతి:- అథశబ్దానికి 'మంగళము' అని అర్థం చెపితే ఆ అర్థానికి మొత్తం వాక్యార్థంతో అన్వయం కుదరదు. (మంగళము, అందువలన బ్రహ్మజిజ్ఞాస" అంటే ఇది దశదాడిమాదివాక్యం వలె నిరర్థకంగా ఉంటుంది కదా అని అర్థం). అర్థాన్తరేతి:- ఈ అథ మంగళార్థం కాక మరొక అర్థం చెప్పినా ఈ శబ్దాన్ని వినినంత మాత్రంచేతనే మంగళప్రదం గాన మంగళాచరణం చేయడం అనే ప్రయోజనాన్ని సాధించినట్లు కూడా అవుతుంది.

వి. ఎవరో కార్యాంతరం మీద తీసికొని వెడుతున్న జలపూర్ణకుంభం చూచిన వాళ్ళకి మంగళప్రదం అయినట్లు అథశబ్దం వినినంత మాత్రం చేతనే మంగళప్రదం. "ఓంకారము" అథశబ్దము బ్రహ్మదేవుని నోటినుండి అప్రయత్నంగా బయటకు వచ్చాయి. అందుచేత ఆ రెండూ సహజంగా శ్రవణమాత్రంచేతనే మంగళప్రదములు" అని ప్రసిద్ధమైన ఈ క్రింది శ్లోకం చెపుతున్నది.

"ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా,
కణ్ఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాఙ్గలికావుభౌ."

పూర్వేతి:- 'అథ' శబ్దం పూర్వం ప్రకృతమైనదాని, పేర్కొనబడినదాని, అపేక్షను సూచిస్తుంది. ఉదాహరణకి "ఆత్మా నిత్యః, అథ అనిత్యః" (ఆత్మ నిత్యమైనదా లేక అనిత్యమైనదా) అనే వాక్యంలోని 'అథ' శబ్దం ముందు చెప్పబడిన 'నిత్యము' అనే దానిని పురస్కరించుకొని 'లేక' (అనిత్యమా') అనే అర్థాన్ని బోధిస్తున్నది. ఇలాంటి

పూర్వప్రకృతాపేక్ష అనే అర్థాన్ని ఇక్కడ అథశబ్దం సూచిస్తుంది అని చెప్పవచ్చును కదా అని ఆశంకించుకొని "పూర్వప్రకృతాపేక్ష" అనేది కూడా చివరికి ఆనంతర్యము అనే అర్థంలోనే అంతర్గతం అవుతుంది. (అనగా ముందు 'నిత్యః' అనే ఒక పక్షం చెప్పడంవల్లనే 'అథ' అని దాని తరువాతి పక్షంగా, మరొక పక్షంగా చెప్పబడుచున్నది గాన ఫలాన్ని పట్టి చూస్తే ఆనంతర్యం అనే అర్థమే చెప్పినట్లు అవుతుంది అని భావం). అందుచేత ఆనంతర్యం అనే అర్థం (తరవాత అనే అర్థం) చెపితే స్పష్టంగా ఉంటుంది. అధికారిని నిర్దేశించి నట్లు అవుతుంది. అందువల్ల ఆ అర్థమే యుక్తమైన దని భావం.

సతి చేతి:- ఈ విధంగా ఇక్కడ ఉన్న అథశబ్దానికి ఆనంతర్యం అనే అర్థం చెప్పవలసి ఉంది గాన ధర్మజిజ్ఞాస తనకు పూర్వం ఉన్న వేదాధ్యయనాన్ని ఏ విధంగా తప్పక అపేక్షిస్తుందో అదే విధంగా బ్రహ్మజిజ్ఞాస తనకు పూర్వం దేనిని అపేక్షిస్తుందో దానిని చెప్పాలి. "స్వాధ్యాయాధ్యయనం చేసిన తరవాత" అనేది రెండింటికీ సమానమే.

వి. జైమినివిరచితపూర్వమీమాంసాశాస్త్రానికి "అథాతో ధర్మజిజ్ఞాసా" అనేది మొదటి సూత్రం. ధర్మాన్ని గూర్చి తెలుసుకోవా లంటే ముందుగా ధర్మప్రతిపాదకమైన వేదం చదువుకొని ఉండాలి. కాబట్టి అక్కడ 'అథ' అనేదానికి "వేదాధ్యయనం చేసిన తరవాత" అనే అర్థం చెప్పబడింది. వేదాధ్యయనం చేయడం ధర్మజిజ్ఞాసువునకు తప్పనిసరి అయినది. అందుచేత ఆ అర్థం చెప్పడం అవసరం. బ్రహ్మ కూడ వేదప్రతిపాద్యమే. అందుచేత బ్రహ్మజిజ్ఞాసకు ముందు కూడ వేదాధ్యయనం (బ్రహ్మ ప్రతిపాదకోపనిషద్భాగాధ్యయనం) తప్పక అవసరమే. ఆ విషయం మళ్లీ విశేషించి చెప్పవలసిన పని లేదు. పూర్వమీమాంసాశాస్త్రప్రథమసూత్రంలో చెప్పిన ఆ న్యాయాన్నే ఇక్కడ కూడా ప్రవర్తింప చేసుకుంటే ఆ అర్థం లభిస్తుంది. పూర్వమీమాంసాశాస్త్రం వేరు, ఈ ఉత్తరమీమాంసా శాస్త్రం వేరు. అయినా కూడ సైద్ధాంతికవిరోధం లేనప్పుడు ఆ శాస్త్రంలోని న్యాయాలను ఈ శాస్త్రంలో కూడా ప్రవర్తింప చేసికోవడం అలవాటులో ఉన్న పద్ధతే. అందుచేత ఇక్కడ 'అథ' శబ్దానికి వేదాధ్యయనానంతరం అని అర్థం చెప్పవలసిన పని లేదు అని భావం.

నన్వితి:- ఇక్కడ 'కర్మజ్ఞానం తరవాత' అనేది ఒక విశేషం కదా? కాదు. వేదాంతాలు చదువుకొన్నవానికి ధర్మజిజ్ఞాస కలగడానికి ముందుగానే కూడ బ్రహ్మజిజ్ఞాస కలగవచ్చును కదా? హృదయాద్యవదానాలలో క్రమం వివక్షితం గాన ఆనంతర్య నియమం ఉన్నట్లు ఇక్కడ (కర్మజిజ్ఞాసాబ్రహ్మజిజ్ఞాసల మధ్య) క్రమం

వివక్షితం కాదు. ఎందువల్ల ననగా వీటి మధ్య శేషశేషిత్వం గాని అధికృతాధికారం గాని ఉన్నదని చెప్పడానికి తగిన ప్రమాణం ఏదీ లేదు.

వి. వేదాధ్యయనానంతరం బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి అని చెప్పకపోయినా పూర్వమీమాంసాశాస్త్రం ద్వారా కర్మను గూర్చి తెలుసుకొని ఆ కర్మజ్ఞానం తరవాత బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి అని అర్థం చెప్పవచ్చును కదా అని ప్రశ్న. దానికి సమాధానం ఏ మనగా అలా అర్థం చెపితే కర్మజ్ఞానం తరవాత కాని బ్రహ్మజ్ఞానం కలగదు అన్నట్లు అవుతుంది. అది యుక్తం కాదు. సరి యైన అధికారం ఉన్న వ్యక్తికి కర్మజిజ్ఞాస కలగకుండానే బ్రహ్మజిజ్ఞాస కలగవచ్చు.

మరొక ప్రశ్న - "బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహాద్వనీ భూత్వా ప్రవ్రజేత్" (జాబాలోపనిషత్) "బ్రహ్మచర్యం పూర్తి చేసికొని గృహస్థుడు కావాలి, గృహస్థుడైన తరవాత వానప్రస్థుడై తరవాత సంన్యసించాలి" అని శ్రుతి చెప్పుచున్నది. అట్లే

**"అధీత్య విధివద్వేదాన్ పుత్రాంశ్చోత్పాద్య ధర్మతః,**

**ఇష్ట్వా చ శక్తితో యజ్ఞైర్మనో మోక్షే నివేశయేత్".**

"యథాశాస్త్రంగా వేదాధ్యయనం చేసి ధర్మానుసారం పుత్రులను కని, యథాశక్తిగా యజ్ఞాలు చేసి తరవాత మనస్సును మోక్షమార్గంలో నిలపాలి" అని స్మృతులు చెప్పుచున్నాయి. అందుచేత బ్రహ్మజిజ్ఞాసకు ముందు కర్మజ్ఞానం సంపాదించి కర్మాచరణం చెయ్యాలి కదా? దీనికి సమాధానం1-(పనులు చాలా ఉండి కర్త ఒకడే అయి ఉన్నప్పుడు ఈ పని తరవాత ఈ పని చెయ్యాలి అని క్రమం చెప్పబడుతుంది.)"హృదయస్యాగ్రే 2వద్యత్యథ జిహ్వాయాః అథ వక్షసః" అనే శ్రుతివాక్యంలో "ముందు యజ్ఞపశువుయొక్క హృదయం ఖండించాలి. తరవాత నాలుక ఖండించాలి. తరవాత వక్షస్థలం ఖండించాలి" అని చెప్పబడింది. ఇక్కడ హృదయం తరవాత జిహ్వ, జిహ్వ తరవాత వక్షఃస్థలం అని క్రమం వివక్షితం (చెప్పడానికి ఉద్దేశించపబడినది) గాన అథ శబ్దానికి క్రమార్థం చెప్పబడింది. అందుకు కారణం ఈ అవదానాలు అగ్నిష్టోమం అనే పశుయాగానికి శేషాలు అనగా అంగాలు అవడం. (పశుయాగం శేషి అనగా అంగి) ఈ విధంగా ఇక్కడ అవదానాలకీ, పశుయాగానికీ మధ్య శేషశేషిభావసంబంధం ఉంది కాబట్టి ఆ అవదానాలని ఆ క్రమంలోనే చెయ్యాలని నియమం. అందుచేత అక్కడ 'అథ' శబ్దం క్రమాన్ని బోధిస్తుంది. ప్రస్తుతం కర్మజిజ్ఞాస-బ్రహ్మజిజ్ఞాసల మధ్య శేషశేషిభావం (కర్మజిజ్ఞాస శేషం, బ్రహ్మజిజ్ఞాస శేషి అనే మాట) లేదు గాన **'అథ'** శబ్దానికి క్రమార్థం చెప్పకూడదు.

౨. ( ఒక కర్మ చేయడానికి అధికారం ఉన్నవానికే ఆ కర్మ తరవాత మరొక కర్మ చేయడానికి అధికారం ఉంది అని చెప్పినప్పుడు అది అధికృతాధికారం - అధికారం ఉన్న వానికి అధికారం.) ఉదాహరణకి- "దర్శపూర్ణమాసాభ్యామిష్ట్వా సోమేన యజేత" అనే వాక్యం "దర్శపూర్ణమాసయాగాలు చేసి సోమయాగం చెయ్యాలి" అని బోధిస్తున్నది. అనగా దర్శపూర్ణమాసయాగాలు చేయడానికి ఎవనికి అధికారం ఉందో అతడే అవి చేసిన తరవాత సోమయాగం చెయ్యాలి అని అర్థం. ఇలాంటి స్థలాలలో కూడ క్రమం వివక్షితం. ఇలాంటి అధికృతాధికారం కర్మమీమాసా-బ్రహ్మమీమాంసల విషయంలో లేదు గాన వాటికి క్రమం వివక్షితం కాదు. పైన ఉదహరించిన శ్రుతిస్మృతి వాక్యాలు చిత్తశుద్ధి లేనివాని విషయంలో చెప్పినవి. అలాంటివాడే బ్రహ్మచర్యం పూర్తి చేసికొని తరవాత గార్హస్థ్యవానప్రస్థాలు స్వీకరించి, కర్మలు ఆచరించి, చిత్తశుద్ధి సంపాదించుకొని, సన్యాసియై బ్రహ్మజిజ్ఞాసకు పూన్కోవాలి. కర్మాచరణకోసం అతడు కర్మజ్ఞానం సంపాదించవలసిన అవసరం ఉంటుంది. మొదటినుండి చిత్తశుద్ధి ఉన్నవా డైతే కర్మల జోలికి వెళ్ల వలసిన పని లేదు. అందుచేతనే "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ (జాబాలోప) (బ్రహ్మచర్యాశ్రమంనుంచే సంన్యసించవచ్చును), "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" (ఏ రోజున వైరాగ్యవంతుడౌతాడో ఆ రోజునే సంన్యసించవచ్చును), 'ఆసాదయతి శుద్ధాత్మా మోక్షం వై ప్రథమాశ్రమే" (శుద్ధ హృదయం గలవాడు బ్రహ్మచర్యాశ్రమంలోనే మోక్షం పొందుతాడు) అని అనేక శ్రుతిస్మృతివాక్యాలు బోధిస్తున్నాయి.

ఫలేతి: ఫలం, జిజ్ఞాస్యం (తెలియదగిన వస్తువు), వీటి విషయంలో కూడ కర్మజిజ్ఞాసా-బ్రహ్మజిజ్ఞాసలకు చాలా భేదం ఉంది. ధర్మజ్ఞానానికి ఫలం అభ్యుదయం అనగా విషయాధీనమైన సుఖం, స్వర్గాదికం. ఆ ఫలం లభించాలంటే ఆ కర్మలను గూర్చి తెలుసుకుంటే సరిపోదు, ఆ కర్మలను అనుష్ఠించాలి. బ్రహ్మవిజ్ఞానానికి ఫలం అయితే మోక్షం. బ్రహ్మజ్ఞానం తరవాత ఇంక అనుష్ఠించవలసినది ఏదీ ఉండదు. ఆ జ్ఞానమే మోక్షరూపఫలాన్ని సాక్షాత్తుగా ఇస్తుంది. అదేవిధంగా జిజ్ఞాస్యమైన, తెలుసుకొనడానికి కోరబడుతున్న, ధర్మాన్ని తెలుసుకొన్న తరవాత సాధించవలసి ఉంటుంది. జ్ఞానసమయంలో ఆ ధర్మం ఉండదు. అది పురుషుని వ్యాపారంమీద, ప్రయత్నంమీద ఆధారపడి ఉంటుంది కదా? ఈ శాస్త్రంలో జిజ్ఞాస్యమైన బ్రహ్మ అయితే ఎప్పుడూ ఉన్నదే. అది నిత్యమైనది. అది పురుషుని వ్యాపారం మీద ఆధారపడి ఉండేది కాదు.

మరొక విషయం ఏమనగా- చోదనాప్రవృత్తిలో కూడా ఈ రెండు శాస్త్రాలకీ భేదం ఉంది. (చోదన అనగా విధివాక్యం. ఇది ఇలా చెయ్యాలి అని చెప్పే వాక్యం).

ధర్మానికి లక్షణమైన (ప్రమాణమైన) చోదన తాను ఏ ధర్మాన్ని బోధిస్తుందో ఆ ధర్మం విషయంలో నువ్వు ప్రవర్తించాలి, ఆ ధర్మం నువ్వు ఆచరించాలి అని అంటూనే పురుషుడికి ధర్మాన్ని బోధిస్తుంది. బ్రహ్మచోద నైతే (బ్రహ్మను బోధించే వాక్యజాల మైతే) పురుషునికి బ్రహ్మస్వరూపాన్ని గూర్చి బోధిస్తుంది. అంత మాత్రమే. జ్ఞానం అనేది చోదనవల్ల పుట్టేది కాదు. అందుచేత పురుషుణ్ణి జ్ఞానం విషయంలో (ఇది ఇలా తెలుసుకో అని) ఆజ్ఞాపించే ప్రసక్తి లేదు. ఇంద్రియాలకి విషయాలతో సంబంధం ఏర్పడితే ఎట్లో అట్లే.

వి. "స్వర్గకామో యజేత" (స్వర్గం కావాలనుకొన్నవాడు యాగం చెయ్యాలి) ఇత్యాది విధివాక్యాలు యాగాన్నిగూర్చి బోధిస్తున్నాయి. అయితే ఆ యాగాన్ని గూర్చి విన్నంత మాత్రంచేత ప్రయోజనం ఏమీ లేదు. దాన్ని గూర్చి తెలుసుకొని యథావిధిగా ఆ యాగం చెయ్యాలి. ఆ యాగం తెలుసుకొన్న తరవాత చేయవలసినది కర్మ. బ్రహ్మ విషయం అలాంటిది కాదు. బ్రహ్మస్వరూపం ఇది అని తెలుసుకుంటే చాలు. బ్రహ్మ అనేది అన్ని కాలాలలోనూ ఉండేదే. లేని యాగాన్ని సాధించినట్లు బ్రహ్మను సాధించడం అనేది ఉండదు. ఒకని ఎదుటికి ఒక వస్తువును తీసికొని వచ్చి దానిని అతని ముందు ఉంచితే చాలు. ఆ వస్తువుమీద వాని కళ్లు పడగానే దాని జ్ఞానం వానికి కలుగుతుంది. "దీనిని నువ్వు చూడాలి" అని ఆజ్ఞాపించనవసరం లేదు. చెవి దగ్గర ఒక శబ్దం చేస్తే అది వానికి వినిపిస్తుంది. "ఇది విను" అని చెప్పనవసరం లేదు. అదే విధంగా బ్రహ్మస్వరూపాన్ని గూర్చి వర్ణించి చెపితే చాలు; వాని కా జ్ఞానం కలుగుతుంది. "నువ్వు బ్రహ్మను తెలుసుకో" అని ఆజ్ఞాపించనవసరం లేదు. ఈ విధంగా ధర్మజిజ్ఞాసా - బ్రహ్మజిజ్ఞాసల విషయంలో చోదనాప్రవృత్తిభేదం కూడా ఉన్నది గాన కర్మజిజ్ఞాస తరవాత బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి అని చెప్పడం యుక్తం కాదు.

తస్మాదితి: అందువల్ల దేనితరవాత బ్రహ్మజిజ్ఞాస ఉపదేశించబడుతుందో అలాంటి దానిని ఏదైన ఒక దానిని చెప్పాలి.

## భాష్యమ్

ఉచ్యతే-నిత్యానిత్యవస్తువివేకః, ఇహాముత్రార్థభోగవిరాగః, శమదమాది సాధనసంపత్, ముముక్షుత్వం చ. తేషు హి సత్సు ప్రాగపి ధర్మజిజ్ఞాసాయా ఊర్ధ్వం చ శక్యతే బ్రహ్మ జిజ్ఞాసితుం జ్ఞాతుం చ, న విపర్యయే. తస్మాదథశబ్దేన యథోక్తసాధనసంపత్త్యానన్తర్యముపదిశ్యతే. అతః శబ్దో హేత్వర్థః. యస్మాద్వేద ఏవ అగ్నిహోత్రాదీనాం శ్రేయఃసాధనానామనిత్య ఫలతాం దర్శయతి-

"తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే "(ఛా.ఉ. 8.1.6) ఇత్యాదిః; తథా బ్రహ్మవిజ్ఞానాదపి పరం పురుషార్థం దర్శయతి "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై. ఉ. 2.1) ఇత్యాదిః. తస్మాద్యథోక్తసాధనసంపత్త్యనన్తరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా.

బాలానందిని

**ఉచ్యతే ఇతి:-** దేని తరవాత బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలో చెప్పబడుచున్నది - ఏది నిత్యవస్తువు ఏది అనిత్యవస్తువు అనే వివేకజ్ఞానం, ఇహలోకానికి సంబంధించిన విషయాల భోగమునందు, పరలోకానికి సంబంధించిన విషయాల భోగమునందు వైరాగ్యం, శమదమాదిసాధనసంపద, మోక్షం పొందాలనే తీవ్రమైన వాంఛ- ఇవి ఉన్న తరవాత అని 'అథ' శబ్దానికి అర్థం. ఇవి నాలుగూ ఉంటే ధర్మజిజ్ఞాసకు ముందుగానే కాని, ధర్మ జిజ్ఞాస తరవాత గాని బ్రహ్మను తెలుసుకోవాలనే ఇచ్ఛ కలగడానికి, తెలుసుకొనడానికీ కూడ శక్యం అవుతుంది. ఇవి లేకపోతే శక్యం కాదు. అందువల్ల అథశబ్దం పైన చెప్పిన సాధన చతుష్టయసంపత్తి ఉన్న తరవాత అనే అర్థాన్ని బోధిస్తుంది.

వి. శమదమాదిసాధన సంపద అనగా "శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః సమాహితః శ్రద్ధావిత్తో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" (బృ.ఉ.2.4.5) అని శ్రుతిలో చెప్పబడిన శమ-దమ-ఉపరతి-తితిక్షా - సమాధాన-శ్రద్ధలు. కాణ్వపాఠంలో సమాహితో భూత్వా అని ఉన్నది. శమం అనగా మనోనిగ్రహం, దమం అనగా మనస్సును ఆత్మజ్ఞానానుకూలంగా చేసుకొనడం అని భామతి. బాహ్యేంద్రియాల నిగ్రహం అని కొందరు. ఉపరతి అనగా విషయాలనుండి మరలడం అని భామతి. సంన్యాసం అని కొందరు. తితిక్ష అనగా కష్టాలను సహించడంలో ఓర్పు. సమాధానం అనగా ఆత్మతత్త్వం మీద నిలకడ. శ్రద్ధ అనగా గురుశాస్త్రాదుల విషయంలో పరిపూర్ణమైన విశ్వాసం.

**అతః శబ్ద ఇతి:-** అతఃశబ్దానికి ఆ కారణంవలన అని అర్థం. 'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" (ఈ లోకంలో కృష్యాదికర్మచేత సంపాదించిన వస్తువు ఏ నాటికైనా ఎలా నశిస్తుందో కర్మలచేత సాధించుకొన్న పరలోకానికి సంబంధించిన భోగాదికం కూడా అదే విధంగా నశిస్తుంది) ఇత్యాదివాక్యాలలో శ్రేయః సాధనా లని అనుకుంటున్న అగ్నిహోత్రాదులవల్ల కలిగే ఫలం అనిత్యమైనది అని వేదమే చెప్పుచున్నది. అదే విధంగా "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (బ్రహ్మను తెలుసుకొన్నవాడు ఆ బ్రహ్మనే పొందుతాడు, అనగా బ్రాహ్మస్థితిని పొందుతాడు) ఇత్యాది వాక్యాలలో వేదమే బ్రహ్మవిజ్ఞానంవల్ల పరమపురుషార్థమైన మోక్షం కలుగుతుంది అని

చెప్పుచున్నది. ఆ కారణంవల్ల అని తస్మాత్‌కు అర్థం. అందువల్ల పైన చెప్పిన సాధనసంపత్తి సమకూరిన తరవాత బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి అని (సూత్రానికి) అర్థం.

## భాష్యమ్

బ్రహ్మణో జిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసా. బ్రహ్మ చ వక్ష్యమాణలక్షణం "జన్మాద్యస్య యతః" ఇతి. అత ఏవ న బ్రహ్మశబ్దస్య జాత్యాద్యర్థాన్తరమాశఙ్కితవ్యమ్. బ్రహ్మణః ఇతి కర్మణి షష్ఠీ న శేషే; జిజ్ఞాస్యాపేక్షత్వాజ్జిజ్ఞాసాయాః, జిజ్ఞాస్యాన్తరానిర్దేశాచ్చ. నను శేషషష్ఠీపరిగ్రహేఽపి బ్రహ్మణః జిజ్ఞాసాకర్మత్వం న విరుధ్యతే, సంబన్ధసామాన్యస్య విశేషనిష్ఠత్వాత్. ఏవమపి ప్రత్యక్షం బ్రహ్మణః కర్మత్వముత్సృజ్య సామాన్యద్వారేణ పరోక్షం కర్మత్వం కల్పయతః వ్యర్థః ప్రయాసః స్యాత్. న వ్యర్థః; బ్రహ్మాశ్రితాశేషవిచారప్రతిజ్ఞానార్థత్వాదితి చేన్న; ప్రధానపరిగ్రహే తదపేక్షితానామర్థాక్షిప్తత్వాత్. బ్రహ్మ హి జ్ఞానేన ఆప్తుమిష్టతమత్వాత్ ప్రధానమ్. తస్మిన్ ప్రధానే జిజ్ఞాసాకర్మణి పరిగృహీతే యైః జిజ్ఞాసితైః వినా బ్రహ్మ జిజ్ఞాసితం న భవతి తాన్యర్థాక్షిప్తాన్యేవేతి న పృథక్ సూత్రయితవ్యాని. యథా రాజాఽసౌ గచ్ఛతీత్యుక్తే సపరివారస్య రాజ్ఞో గమనముక్తం భవతి తద్వత్. శ్రుత్యనుగమాచ్చ. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాద్యాః శ్రుతయః, "తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" ఇతి ప్రత్యక్షమేవ బ్రహ్మణో జిజ్ఞాసాకర్మత్వం దర్శయన్తి. తచ్చ కర్మణి షష్ఠీపరిగ్రహే సూత్రేణానుగతం భవతి. తస్మాత్ 'బ్రహ్మణ' ఇతి కర్మణి షష్ఠీ. జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా. అవగతిపర్యన్తం జ్ఞానం సన్వాచ్యాయాః ఇచ్ఛాయాః కర్మ, ఫలవిషయత్వాదిచ్ఛాయాః. జ్ఞానేన హి ప్రమాణేన అవగన్తుమిష్టం బ్రహ్మ. బ్రహ్మావగతిర్హి పురుషార్థః, నిఃశేషసంసారబీజావిద్యాద్యనర్థనిబర్హణాత్. తస్మాద్ బ్రహ్మ విజిజ్ఞాసితవ్యమ్.

### బాలానందిని

"బ్రహ్మణః జిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసా" (బ్రహ్మను తెలుసుకోవా లనే కోరిక) అని విగ్రహవాక్యం. ఇక్కడ 'బ్రహ్మ' అనగా 'జన్మాద్యస్య యతః" అనే రాబోయే సూత్రంలో దేని లక్షణం చెప్పబడనున్నదో అది. అందుచేత ఈ శబ్దానికి 'బ్రాహ్మణజాతి' మొదలైన ఇతరార్థా లేవీ చెప్పకూడదు. 'బ్రహ్మణః' అనేది కర్మార్థంలో వచ్చిన షష్ఠియే కాని

శేషార్థంలో ప్రయోగించిన షష్ఠి కాదు. జిజ్ఞాస జిజ్ఞాస్యాన్ని అపేక్షిస్తుంది కదా. ఇక్కడ మరొకదానిని దేనినీ జిజ్ఞాస్యంగా పేర్కొనలేదు.

వి. ఏ విభక్తిని ఏ అర్థంలో ఉపయోగించాలి అనే విషయంలో వ్యాకరణశాస్త్రం కొన్ని నియమాలు విధించింది. కర్మను బోధించడానికి ద్వితీయ, కర్తృ-కరణాలను బోధించడానికి తృతీయ, సంప్రదానార్థంలో చతుర్థి, అపాదానార్థంలో పంచమి, అధికరణార్థంలో సప్తమి ప్రయోగించాలి. ఈ కర్మ మొదలైనవి విశేషసంబంధాలు. ఇవి కాక మిగిలిన ఏ సంబంధమైనా చెప్పవలసి వచ్చి నప్పుడు షష్ఠీవిభక్తి ఉపయోగించాలి. ఉదాహరణకు- "రామస్య రాజ్యమ్" అన్నప్పుడు రామునికీ రాజ్యానికీ ఉన్న సంబంధం స్వస్వామిభావసంబంధం (సొత్తు, సొత్తు కలవాడు అనే సంబంధం). "రామస్య భార్యా" అన్నప్పుడు దాంపత్యసంబంధం. ఇలాంటి సంబంధ సామాన్యానికి శేషం అని ఈ సందర్భంలో పేరు. అయితే కొన్ని కృత్ప్రత్యయాలు ప్రయోగించినపుడు కర్మవాచకాన్ని షష్ఠీవిభక్తిలో ప్రయోగించాలి అని ఒక నియమం ("కర్తృకర్మణోః కృతి" పా.సూ. 2.3.65) ఉంది. ఈ నియమం ప్రకారం "ఫలస్య భోక్తా" (ఫలమును తినేవాడు) ఇత్యాదులలో కర్మయైన ఫలశబ్దాన్ని షష్ఠీ విభక్తిలో ప్రయోగించాలి. ద్వితీయావిభక్తిలో ప్రయోగించకూడదు. దీనికి "కర్మణి షష్ఠీ" (కర్మార్థంలో షష్ఠి) అని పేరు. "రామస్య భార్యా" ఇత్యాదులలో "శేషే షష్ఠీ" (సామాన్య సంబందార్థంలో షష్ఠి) అని పేరు. "బ్రహ్మణః జిజ్ఞాసా బ్రహ్మజిజ్ఞాసా" అనే చోట "బ్రహ్మణః" అనేది కర్మణి షష్ఠియా లేక శేషే షష్ఠియా అని ప్రశ్న. ఎలా చెప్పినా 'బ్రహ్మజిజ్ఞాసా'. అనేది కుదురుతుంది. అయితే ఇక్కడ "కర్మణి షష్ఠి' ' చెప్పడమే యుక్తం. ఒకడు క్రియ ద్వారా దేనిని సంపాదించా లని మిక్కుటమైన కోరికతో ఉంటాడో అది కర్మ. జిజ్ఞాస అనగా తెలుసుకోవాలనే కోరిక. ఏదైనా ఒక జిజ్ఞాస్యం తెలుసుకోవాలని (కోరబడే వస్తువు) ఉంటేనే జిజ్ఞాస కలుగుతుంది. ఆ విధంగా జిజ్ఞాస జిజ్ఞాస్యం మీద ఆధారపడి ఉంటుంది. అనగా ఒకడు జిజ్ఞాస ద్వారా పొందా లని తీవ్రంగా అభిలషించేది వస్తువు. ఆ విధంగా అది జిజ్ఞాసలో కర్మ అవుతుంది. ఇక్కడ మరొక జిజ్ఞాస్యం ఏదీ చెప్పలేదు. గాన బ్రహ్మయే జిజ్ఞాస్యం. అనగా జిజ్ఞాసాకర్మ. అందుచేత ఇక్కడ కర్మణి షష్ఠియే అంగీకరించాలి గాని శేషే షష్ఠిని గ్రహించకూడదు.

నన్వితి:- (ప్రశ్న) శేషషష్ఠిని అంగీకరించినా కూడ సంబంధసామాన్యం అనేది చివరికి ఇక్కడ ప్రకరణాన్ని పట్టి కర్మరూపవిశేషసంబంధంగానే పరిణమిస్తుంది గాన బ్రహ్మ జిజ్ఞాసాకర్మ అవడానికి అవరోధం ఏదీ లేదు కదా? (సమాధానం). అయినా కూడ బ్రహ్మకు ప్రత్యక్షంగా కర్మత్వం కాదని సామాన్యసంబంధం ద్వారా పరోక్షమైన కర్మత్వాన్ని ప్రతిపాదించే ఈ ప్రయాస అంతా వ్యర్థమే కదా? (ప్రశ్న) వ్యర్థం కాదు.

శేషషష్ఠిని గ్రహిస్తే కేవలం ఒక్క బ్రహ్మను గూర్చి మాత్రమే కాక బ్రహ్మకు సంబంధించిన అన్ని విషయాల విచారాన్ని ప్రతిజ్ఞ చేసిన ట్లవుతుంది కదా? (సమాధానం) అది యుక్తం కాదు. ప్రధానమైనదానిని స్వీకరిస్తే దానికి సంబంధించిన, దానికి కావలసినవాటిని అన్నింటినీ అర్థాన్ని పట్టి ఊహించుకొనవచ్చును కదా? జ్ఞానంచేత సంపాదించాలని ఎక్కువగా కోరబడేది కాబట్టి బ్రహ్మ ప్రధానమైనది. (అందుచేత అది జిజ్ఞాసలో కర్మ). ఈ విధంగా జిజ్ఞాసాకర్మయైన ప్రధానమైన ఆ బ్రహ్మను (కర్మగా) గ్రహించినప్పుడు బ్రహ్మజ్ఞానానికి సంబంధించిన ఏ ఇతరవస్తువులను గ్రహించనంతవరకు బ్రహ్మయొక్క జిజ్ఞాస కుదరదో వాటి నన్నింటినీ అర్థాన్ని పట్టి (అవసరాన్ని పట్టి) గ్రహించడం కుదురుతుంది గాన వాటిని వేరుగా సూత్రంలో పేర్కోవలసిన పని లేదు. ఉదాహరణకి 'ఇడిగో, రాజు వెడలుతున్నాడు' అని చెప్పగానే ఒక్క రాజే కాకుండా అతని పరివారం అంతా కూడ ఆతనితో కలసి వెడుతున్నది అని చెప్పకపోయినా అర్థం అవుతుంది. (అర్థాత్సిద్ధం అవుతుంది.) అదే విధంగా ఇక్కడ కూడ.

వి. సంబంధసామాన్యార్థక మైన శేషషష్ఠిని గ్రహిస్తే జిజ్ఞాసలో కర్మ అయిన బ్రహ్మను ఎలాగా గ్రహించడం జరుగుతుంది; దానితోపాటు దానికి (బ్రహ్మకు) సంబంధించిన లక్షణం, ప్రమాణం, యుక్తి, జ్ఞానం, సాధనాలు, ఫలం మొదలైన వాటిని కూడా గ్రహించి వాటి అన్నింటి జిజ్ఞాసను ప్రతిజ్ఞ చేసి నట్లు అవుతుంది; అందుచేత శేషషష్ఠిని అంగీకరించాలి అని పూర్వపక్షి అభిప్రాయం. లక్షణ ప్రమాణాదులు కూడ అవసర మైనవి అనే మాట నిజమే అయినా 'జిజ్ఞాసా' అనగానే దేని జిజ్ఞాస అని కలిగే కర్మను గూర్చిన ప్రశ్నకు సమాధానంగా ప్రక్కనే ఉన్న బ్రహ్మను కర్మగా అన్వయించుకొనడం యుక్తం. అప్పు డది కర్మణి షష్ఠి అవుతుంది. ''పుస్తకం చూడాలి'' అనగానే దేనిని చూడాలి అనే ప్రశ్నకు సమాధానంగా పుస్తకం అనేది కర్మగా అన్వయిస్తుంది. దీపం ఏర్పాటు చేసుకోవాలి; కళ్లు తెరవాలి; పుస్తకం కళ్లకి కొంత దగ్గరగా ఉంచుకోవాలి ఇత్యాది విషయాలన్నీ అర్థాత్సిద్ధా లవుతాయి. అదే విధంగా ఇక్కడ ముందు కావలసిన కర్మను బోధించిన తరవాత, కర్మయైన ఆ బ్రహ్మకు సంబంధించిన విషయాల జిజ్ఞాస అర్థాత్సిద్ధం అవుతుంది అని సిద్ధాంతి అభిప్రాయం.

ఇక్కడ కర్మణి షష్ఠినే గ్రహించడానికి మరొక కారణం కూడా చెపుతున్నారు - శ్రుత్యనుగమాచ్చేతి:- 'కర్మణి షష్ఠి'ని అంగీకరించడంలో శ్రుతివాక్యాన్ని అనుసరించి నట్లు కూడ అవుతుంది. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" (ఏ బ్రహ్మనుండి ఈ భూతా లన్నీ జనిస్తున్నాయో) ఇత్యాది శ్రుతులు, ''తద్విజిజ్ఞాసస్వ; తద్ బ్రహ్మ'' (దానిని తెలుసుకొనడానికి ప్రయత్నం చెయ్యి; అదే బ్రహ్మ) అని చెపుతూ జిజ్ఞాసలో (జ్ఞానేచ్ఛలో)

బ్రహ్మ ప్రత్యక్షంగానే కర్మ అని చూపుతున్నాయి. సూత్రంచేత కూడ కర్మణిషష్ఠీవిభక్తిని గ్రహిస్తేనే అది (శ్రుతిబోధితమైన బ్రహ్మయొక్క కర్మత్వం) అనుగుణంగా ఉంటుంది. అందువల్ల బ్రహ్మణః అనేది కర్మణి షష్ఠియే. తెలిసికొనడానికి ఇచ్ఛ జిజ్ఞాస. ('జ్ఞా' అనే ధాతువునకు ఇచ్ఛ అనే అర్థాన్ని బోధించే 'సన్' అనే ప్రత్యయం చేర్చడంచేత "జిజ్ఞాసా" అనే పదం తయారయింది). 'సన్' ప్రత్యయంచేత బోధించబడే ఇచ్ఛకు అవగతిపర్యంతమైన, అనగా ఆత్మసాక్షాత్కారానికి దారి తీసే, జ్ఞానం కర్మ. (కేవలం పరోక్షజ్ఞానం కర్మ కాదు). ఎందువల్ల ననగా ఇచ్ఛ అనేది ఫలాన్నిగూర్చి మాత్రమే ఉంటుంది. జ్ఞానం అనే ప్రమాణం ద్వారా సాక్షాత్కరింపచేసికోవా లని కోరబడేది బ్రహ్మ కదా? బ్రహ్మసాక్షాత్కారమే పురుషార్థం కదా? ఎందువల్ల ననగా అది (బ్రహ్మ సాక్షాత్కారం) సంసారానికి బీజమైన అవిద్య మొదలైన లేదా అవిద్యతో ప్రారంభమైన, అనర్థాన్ని పూర్తిగా నశింపచేస్తుంది. అందువల్ల బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి. అనగా బ్రహ్మజ్ఞానేచ్ఛ చెయ్యాలి. కొందరు వ్యాఖ్యాతల ప్రకారం బ్రహ్మజ్ఞానంకొరకు విచారం చెయ్యాలి.

తృతీయవర్ణకం సమాప్తమైనది.

## భాష్యమ్

*A*. తత్పునర్బ్రహ్మ ప్రసిద్ధమప్రసిద్ధం వా స్యాత్. యది ప్రసిద్ధం న జిజ్ఞాసితవ్యమ్. అథాప్రసిద్ధం నైవ శక్యం జిజ్ఞాసితుమితి. ఉచ్యతే - అస్తి తావద్బ్రహ్మ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమ్, సర్వజ్ఞమ్, సర్వశక్తిసమన్వితమ్. బ్రహ్మశబ్దస్య హి వ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధత్వాదయోఽర్థాః ప్రతీయన్తే. బృహతేర్ధాతోరర్థానుగమాత్. సర్వస్యాత్మత్వాచ్చ బ్రహ్మాస్తిత్వప్రసిద్ధిః. సర్వో హ్యాత్మాస్తిత్వం ప్రత్యేతి, న నాహమస్మీతి. యది హి నాత్మాస్తిత్వప్రసిద్ధిః స్యాత్ సర్వో లోకో నాహమస్మీతి ప్రతీయాత్. ఆత్మా చ బ్రహ్మ. యది తర్హి లోకే బ్రహ్మాత్మత్వేన ప్రసిద్ధమస్తి తతో జ్ఞాతమేవేత్యజిజ్ఞాస్యత్వం పునరాపన్నమ్. న; తద్విశేషం ప్రతి విప్రతిపత్తేః. దేహమాత్రం చైతన్యవిశిష్టమాత్మేతి ప్రాకృతా జనా లౌకాయతికాశ్చ ప్రతిపన్నాః. ఇన్ద్రియాణ్యేవ చేతనాన్యాత్మేత్యపరే. మన ఇత్యన్యే. విజ్ఞానమాత్రం క్షణికమిత్యేకే. శూన్యమిత్యపరే. అస్తి దేహాది వ్యతిరిక్తః సంసారీ కర్తా భోక్తేత్యపరే. భోక్తైవ కేవలం న కర్తేత్యేకే. అస్తి

తద్వ్యతిరిక్త ఈశ్వరః సర్వజ్ఞః సర్వశక్తిరితి కేచిత్. ఆత్మా స భోక్తురిత్యపరే. ఏవం బహవో విప్రతిపన్నాః యుక్తివాక్యతదాభాససమాశ్రయాః సన్తః. తత్రావిచార్య యత్కించిత్ ప్రతిపద్యమానః నిఃశ్రేయసాత్ ప్రతిహన్యేత, అనర్థం చేయాత్. తస్మాద్బ్రహ్మజిజ్ఞాసోపన్యాసముఖేన వేదాన్తవాక్యమీమాంసా తదవిరోధితర్కోపకరణా నిఃశ్రేయసప్రయోజనా ప్రస్తూయతే.

బాలానందిని

అవ. బంధం సత్యమే అయిన పక్షంలో బ్రహ్మజ్ఞానం కలిగినా కూడ ఆ బంధం తొలగదు గాన బ్రహ్మజిజ్ఞాస నిష్ప్రయోజనమే అనే ఆశంకకు సమాధానంగా, అధ్యాసనిరూపణ ద్వారా బంధం కల్పితమైనది గాన జ్ఞానంచేత అది తొలగిపోతుంది; అందుచేత బ్రహ్మజిజ్ఞానకు ప్రయోజనం ఉన్నది అని ప్రథమవర్ణకంలో నిరూపించబడినది. ఇప్పుడు బ్రహ్మజిజ్ఞాసకు విషయమైన బ్రహ్మయే ప్రసిద్ధమా అప్రసిద్ధమా అని ఆశంకించి రెండు విధాలా కూడ బ్రహ్మవిచారం అనావశ్యకమే అను పూర్వపక్షానికి సమాధానం చెప్పబడుచున్నది- తత్పునరితి:- (ప్రశ్న) ఆ బ్రహ్మ ప్రసిద్ధమా, అప్రసిద్ధమా? ప్రసిద్ధమే అయితే అందరికీ తెలిసిన విషయం అవడంచేత దానిని గూర్చి జిజ్ఞాస అనావశ్యకం. అలా కాక బ్రహ్మ అప్రసిద్ధం (బ్రహ్మ అనేది ఒకటి ఉందని ఎవరికీ తెలియదు) అన్నట్లయితే దానిని గూర్చి జిజ్ఞాస చేయడమే శక్యం కాదు. దీనికి సమాధానం చెపుతున్నాం. విను. నిత్యము, శుద్ధము (అవిద్యాది దోషరహితము), బుద్ధము, అనగా జ్ఞానరూపము, ముక్తము (బంధకాలంలో కూడ వాస్తవంలో బంధం లేనిది) అయిన బ్రహ్మ అనేది ఒకటి ఉన్నది. బ్రహ్మశబ్దంయొక్క వ్యుత్పత్తిని పరీక్షించగా 'బృహి'ధాతువు అర్థాన్ని పట్టి నిత్యత్వము, శుద్ధత్వము మొదలైన అర్థాలు తెలుస్తాయి.

వి. "బృహి వృద్ధౌ" అను వృద్ధ్యర్థకమైన ధాతువునుండి బ్రహ్మశబ్దం నిష్పన్నమైనది. ఇది ఇంత అని చెప్పడానికి తగిన కారణం లేకపోవడంచేత దీని వృద్ధి నిరవధికము అని చెప్పాలి. అందుచేత దేశాన్ని పట్టి గాని, కాలాన్ని పట్టి గాని దీనికి అవధి లేదు గాన ఇది అనంతం. దీనికి కొన్ని విషయాలు మాత్రమే తెలియును అని చెప్పినట్లయితే దీని జ్ఞానానికి అవధి చెప్పినట్లు అవుతుంది. అది పైన చూపిన ధాత్వర్థానికి విరుద్ధం. అందుచేత సర్వజ్ఞం అని చెప్పాలి. అవిద్యాదిదోషా లున్నట్లయితే కూడ దీని వృద్ధికి భంగం వాటిల్లుతుంది. అందుచేత ఇది శుద్ధం, బుద్ధం (జాడ్యరహితమూ కూడ). ఈ విధంగా బ్రహ్మశబ్దానికి ఉన్న వ్యుత్పత్త్యర్థం పరిశీలిస్తేనే బ్రహ్మకు సంబంధించిన నిత్యత్వ-శుద్ధత్వాదులు స్పష్టంగా తెలుస్తాయి అని అర్థం.

బ్రహ్మ ఉన్నది అనే విషయం అందరికీ తెలిసినదే. అందుచేత బ్రహ్మ ప్రసిద్ధమైనది అని చెప్పుచున్నారు- సర్వస్యేతి- ప్రతి ఒక్కనికి ఆత్మయే గాన బ్రహ్మ ఉన్న దనే విషయం ప్రసిద్ధమే. ఎందువల్ల ననగా ప్రతివాడు "నేను ఉన్నాను" అనే అనుకొంటాడు గాని "నేను లేను" అని అనుకొనడు కదా? ఆత్మ ఉన్నది అనే ప్రసిద్ధి లేని పక్షంలో, అనగా ఆత్మ లేని పక్షంలో, ప్రతి ఒక్కడు "నేను లేను" అని అనుకొనవలసి ఉంటుంది. (దీనిని పట్టి ఆత్మ అనేది ఒకటి ఉంది అనే విషయం తెలుస్తూన్నది. ఆ ఆత్మయే బ్రహ్మ). (ప్రశ్న) బ్రహ్మ ఆత్మగా ప్రసిద్ధమే అయిన పక్షంలో బ్రహ్మను గూర్చి అందరికీ తెలిసియే ఉంది గాన బ్రహ్మజిజ్ఞాస అనావశ్యకం అనేది మళ్లీ వచ్చిపడింది కదా? (సమాధానం) ఇది యుక్తం కాదు. ఎందువల్ల ననగా ఆత్మ అనేది ఒకటి ఉందని సామాన్యరూపంలో తెలిసినా దాని విశిష్టస్వరూపాన్ని గూర్చి అభిప్రాయభేదా లున్నాయి. చైతన్యంతో కూడిన దేహమే ఆత్మ అని సామాన్యజనులు, లౌకాయతికులు అంటారు. చేతనాలైన ఇంద్రియాలే ఆత్మ అని కొందరు. మనస్సు ఆత్మ అని మరికొందరు, క్షణికమైన విజ్ఞానమే ఆత్మ అని కొందరు. శూన్యమే ఆత్మ అని మరికొందరు. దేహాదులకంటె భిన్నంగా సంసారియైన ఆత్మ ఒక టున్నది. అదే కర్త, భోక్త అని మరికొందరు. భోక్త మాత్రమే కాని కర్త కాదని కొందరు. ఆ ఆత్మకంటె వేరుగా సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన ఈశ్వరు డున్నా డని కొందరు. ఆ ఈశ్వరుడే భోక్తయైన జీవాత్మయొక్క నిజస్వరూపం అని మరికొందరు. ఈ విధంగా అనేకులు అనేకమైన యుక్తులను యుక్త్యాభాసలను (పైకి యుక్తుల వలె కనబడే కుయుక్తులను), శ్రుతివాక్యాలను, వాక్యాభాసలను (తమ సిద్ధాంతానికి అనుగుణంగా ఉన్నట్లు పైకి కనబడే వాక్యాలను) ఆధారంగా చేసికొని వేరు వేరు అభిప్రాయాలు వ్యక్తపరచారు. అలాంటి పరిస్థితిలో జాగర్తగా విచారించకుండా ఏదో ఒక మతం అనుసరించేవాడు మోక్షమార్గం నుంచి దూరం అవడమే కాకుండా అనర్థం కూడా పొందుతాడు. అందువల్ల బ్రహ్మజిజ్ఞాసను ఉపన్యసించడం ద్వారా (బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి అని చెప్పడం ద్వారా) వేదాంతవాక్యాలకి విరుద్ధం కాని తర్కం కూడ సాధనంగా తీసికొని మోక్షం ప్రయోజనంగా గల వేదాంతవాక్యమీమాంస, ప్రారంభించబడుచున్నది.

వి. ఇక్కడ భగవత్పాదులు "దేహమాత్రమ్" ఇత్యాది వాక్యాలలో తొమ్మిది మతాల ప్రస్తావన చేస్తూ ఈ మతాలు ప్రతిపాదించినవా ళ్లందరూ ఏవేవో యుక్తులు ప్రమాణ వాక్యాలు చూపించారు అని చెప్పారు.

(1) విద్యాగంధం లేని సామాన్యజనులు దేహమే ఆత్మ అనుకుంటారు. అహం అనే ప్రతీతికి గోచర మైనది దేహమే. అందుచేతనే "కృశోఽహమ్" (నేను సన్నగా

ఉన్నాను) "స్థూలోఽహమ్ (నేను లావుగా ఉన్నాను) అనే అనుభవం కూడా దేహమే ఆత్మ అని సూచిస్తున్నది. అందుచేత చార్వాకులు కూడ దేహమే ఆత్మ అని అంటారు. చార్వాకాదులు శ్రుతిప్రామాణ్యాన్ని అంగీకరించకపోయినా వాళ్లు శ్రుతివాక్యాదులను కూడా తమ వాదానికి ఉపోద్బలకాలుగా చూపుతారు అని కొందరు వ్యాఖ్యాతలు వ్రాస్తుంటారు. అవి వాళ్లు చూపుతున్నారో ఈ వ్యాఖ్యాతలు చూపుతున్నారో తెలియదు. దేహాత్మవాదులు "స వా ఏష పురుషోఽన్నరసమయః" (తై.ఉ.2.1.1) (ఈ పురుషుడు అన్నరసమయుడు అనగా దేహస్వరూపుడు) అనే శ్రుతివాక్యం ప్రమాణంగా చూపవచ్చును.

(2) శరీరం ఆత్మ కాదు. "నా శరీరం" అని తాను వేరు, శరీరం వేరు అన్నట్లు ప్రయోగం ప్రసిద్ధంగా ఉంది కదా? ఇంద్రియాలు లేకపోతే శరీరం చలించజాలదు. అయితే "నేను అంధుడను"; "నేను చెవిటివాడను" అని అనుభవం ఉంది. అందుచేత ఇంద్రియాలే ఆత్మ. "చక్షురాదయః తే హ వాచమూచుః" (ఆ చక్షురాదీంద్రియాలు ఇలా అన్నాయి) అని శ్రుతి కూడా దీనికి అనుగుణంగా ఉంది అని లౌకాయతికులలో ఏకదేశులు అంటారు. (ఏకదేశులు అనగా ఆ సిద్ధాంతాన్నే కొంచెం మార్పులతో అంగీకరించేవారు).

(3) "నా కన్ను", "నా ముక్కు" ఇత్యాదివిధంగా తాను వేరు, ఇంద్రియాలు వేరు అనే ప్రతీతి ఉన్నది. స్వప్నంలో ఇంద్రియాలు పని చేయకపోయినా మనస్సు పని చేస్తూ ఉంటుంది. "మన ఉవాచ" ఇత్యాదిశ్రుతివాక్యాలు మనస్సు మాటలాడి నట్లు చెపుతున్నాయి. అందుచేత మనస్సే ఆత్మ అని కొందరు.

(4) "నా మనస్సు" అనే ప్రతీతిని పట్టి నేను వేరు, మనస్సు వేరు అని తెలుస్తున్నది. అందుచేత విజ్ఞానమే ఆత్మ. అది క్షణికం. క్షణికాలైన విజ్ఞానాల ప్రవాహమే ఆత్మ అని కొందరు బౌద్ధులంటారు. యోఽయం విజ్ఞానమయః అని శ్రుతికూడ చెప్పుచున్న దని వీరి వాదం.

(5) సుషుప్త్యవస్థలో విజ్ఞానం కూడా లేదు. అంతా శూన్యమే. అందుచేతనే "అసదేవేదమగ్ర ఆసీత్" అని శ్రుతి చెప్పుచున్నది అని శూన్యవాదు లైన బౌద్ధులంటారు.

(6) జీవాత్మకు కర్తృత్వం (ఆ యా కర్మలు చేయడం), భోక్తృత్వం (కర్మఫలాలు అనుభవించడం) రెండూ కూడ ఉన్నాయి. అందుచేతనే "కర్తా", "బోద్ధా" అని శ్రుతి చెపుతున్నది అని నైయాయికాదు లంటారు.

(7) నిరవయవము, సర్వగతము అయిన పరిణామం లేని ఆత్మకు కర్తృత్వం కుదరదు. ఆత్మ కేవలం భోక్త మాత్రమే అని సాంఖ్యులంటారు. "అనశ్నన్నన్యః

అభిచాకశీతి" (మరొకడు అనుభవించకుండా చూస్తూ ఉంటాడు) ఇత్యాది శ్రుతివాక్యాలు వీరికి ప్రమాణం.

(8) జీవాత్మకంటె వేరుగా సర్వజ్ఞుడు సర్వశక్తుడు అయిన ఈశ్వరుడు ఉన్నాడు. "ఆత్మానమన్తరో యమయతి" (ఇతడు లోపల ఉండి ఆత్మను నియమిస్తూ ఉంటాడు) ఇత్యాదిశ్రుతులు ఇందుకు ప్రమాణం అని యోగులు అంటారు.

(9) "జీవః బ్రహ్మైవ, ఆత్మత్వాత్; బ్రహ్మవత్" (జీవుడు ఆత్మ గాన బ్రహ్మయే, ఆత్మ యైన బ్రహ్మ వలెనే) అనే యుక్తులచేత, "తత్త్వమసి" ఇత్యాది శ్రుతివాక్యప్రామాణ్యం చేత జీవాత్మపరమాత్మలకు భేదం లేదు అని అద్వైతు లంటారు. ఈ మతాలన్నీ పంచపాదికావివరణ-ప్రమేయసంగ్రహాదులలో సవిస్తరంగా ప్రతిపాదింపబడి ఉన్నాయి.

ఈ విధంగా "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే ఈ ప్రథమసూత్రంచేత వేదాంత విచారాత్మకమైన ఈ శాస్త్రానికి (1) విషయం బ్రహ్మాత్మైక్యం, (2) సంబంధం ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధం, (3) ప్రయోజనం మోక్షం (4) అధికారి సాధన చతుష్టయసంపత్తి ఉన్నవాడు అని చెప్పిన ట్లయినది.

బ్రహ్మసూత్రాలలో ప్రతిపాదించబడిన విషయాలు ఇవి -. ప్రథమాధ్యాయానికి "సమన్వయాధ్యాయం" అని పేరు. అన్ని వేదాంతాలకు బ్రహ్మప్రతిపాదనమందే తాత్పర్యం అని చెప్పడానికై ఈ అధ్యాయంలో ఉపనిషద్వాక్యాల అర్థనిర్ణయం చేయబడింది. ద్వితీయాధ్యాయానికి అవిరోధాధ్యాయం అని పేరు. దీనిలో సాంఖ్యాదితర్కాలతో అద్వైతసిద్ధాంతానికి విరోధం లేదు అని ప్రతిపాదించబడింది. తృతీయాధ్యాయానికి సాధనాధ్యాయం అని పేరు. బ్రహ్మవిద్యాసాధనాలు చెప్పబడ్డాయి. బ్రహ్మవిద్యాఫలాన్ని ప్రతిపాదించే చతుర్థాధ్యాయానికి ఫలాధ్యాయం అని పేరు. ప్రథమాధ్యాయప్రథమపాదంలో స్పష్టబ్రహ్మలింగా లైన, అనగా ఈ వాక్యంలో ప్రతిపాదించబడేది బ్రహ్మయే అని చెప్పడానికి తగిన లింగాలు (గుర్తులు) స్పష్టంగా ఉన్న, ఉపనిషద్వాక్యాల విచారణ చేయబడినది. ద్వితీయపాదంలో అస్పష్ట బ్రహ్మలింగాలైనవి, ఉపాస్యబ్రహ్మను ప్రతిపాదించేవి అయిన ఉపనిషద్వాక్యాల విచారణ చేయబడింది. తృతీయపాదంలో అస్పష్టబ్రహ్మలింగాలు జ్ఞేయబ్రహ్మను ప్రతిపాదించేవి అయిన ఉపనిషద్వాక్యాలు, చతుర్థపాదంలో 'అవ్యక్త' 'అజా' మొదలైన సందిగ్ధార్థాలైన కొన్ని పదాల చర్చ చేయబడింది. ద్వితీయాధ్యాయప్రథమపాదంలో సాంఖ్య-యోగ-కణాదాదిస్మృతులతో ఉన్న విరోధానికి పరిహారం చూపబడింది. ద్వితీయపాదంలో సాంఖ్యాదిమతాలు దుష్టమైనవి

అని చెప్పబడింది. తృతీయపాదంలో పంచమహాభూతశ్రుతులకు, జీవశ్రుతులకు మధ్య విరోధం పరిహరించబడింది. నాల్గవ పాదంలో లింగశరీరాన్ని గూర్చిన శ్రుతుల మధ్య విరోధం పరిహరించబడింది. తృతీయాధ్యాయప్రథమపాదంలో జీవుని పరలోకగమనాగమనాదుల వర్ణన ద్వారా వైరాగ్యం బోధించబడింది. రెండవ పాదంలో త్వంపదార్థ (జీవాత్మ) తత్పదార్థాల (పరమాత్మల) స్వరూపం నిరూపించబడింది. మూడవ పాదంలో సగుణోపాసనను విధించే వాక్యాలలో కొన్నింటిలో చెప్పిన గుణాలను లేదా ధర్మాలను మరికొన్నింటిలోనికి చేర్చే విధానం విశదీకరింపబడింది. దీనికి గుణోపసంహరణ అని పేరు. చతుర్థపాదంలో నిర్గుణబ్రహ్మవిద్యకు అంతరంగాలు, బహిరంగాలు అయిన ఆశ్రమ-యజ్ఞ-శమాదిసాధనాల చర్చ చేయబడింది. చతుర్థాధ్యాయప్రథమపాదంలో జీవించి ఉండగానే బ్రహ్మసాక్షాత్కారం కలిగినవాని పాపపుణ్యాదిక్లేశాలు ఎట్లు తొలగిపోతాయో చెప్పబడ్డింది. ద్వితీయపాదంలో మరణం, బైటకు పోవడం వీటి పద్ధతి చెప్పబడింది. తృతీయ(ధ్యాయం)లో సగుణబ్రహ్మోపాసన చేసేవానికి ఉత్తరమార్గ ప్రయాణం చెప్పబడింది. చతుర్థపాదంలో నిర్గుణబ్రహ్మసాక్షాత్కారం పొందేవాడు విదేహముక్తి పొందడం, సగుణబ్రహ్మోపాసకుడు బ్రహ్మలోకంలో నివసించడం చెప్పబడ్డాయి.

ఏకసూత్రాత్మకమైన ఈ జిజ్ఞాసాధికరణంయొక్క అధికరణరచన ఈ విధంగా ఉంటుంది. "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" ఇత్యాది శ్రుతివాక్యాలు విషయవాక్యాలు. బ్రహ్మజిజ్ఞాసకు తగిన విషయం, ప్రయోజనం ఉండడం, లేకపోవడం అనే దాన్ని పట్టి ఈ వేదాంతశాస్త్రం ప్రారంభించాలా అవసరం లేదా అని విశయం. "నేను బ్రహ్మను కాను" అని ప్రత్యక్షంచేత బ్రహ్మకు జీవాత్మకు భేదం స్పష్టంగా తెలుస్తున్నది. విరుద్ధమైన కర్తృత్వాకర్తృత్వ-కించిద్‌జ్ఞత్వ-సర్వజ్ఞత్వాది ధర్మాలు గల జీవబ్రహ్మలకు ఐక్యం కుదరదు. సత్యమైన బంధం జ్ఞానమాత్రంచేత తొలగదు. అలా కాక జీవుడే బ్రహ్మ అని అంగీకరించినా కూడ నేను అనే ప్రతీతిలో ప్రతి ఒక్కనికి ఆత్మ తెలుస్తూనే ఉన్నది గాన అంత స్పష్టంగా తెలిసిన దానిని గూర్చి విచారం అనవసరం. ఈ విధంగా 'నేను' అనే ప్రత్యయంలో ఆత్మ తెలిసినా కూడ సంసారబంధం అలాగే ఉంది. ఈ అన్ని కారణాలచేత బ్రహ్మజిజ్ఞాస కాని, దానికొరకు శాస్త్రారంభం గాని అనవసరం అని పూర్వపక్షం. బంధం భ్రాంతిచేత కల్పించబడినదే. జ్ఞానంచేత ఆ భ్రాంతిని తొలగిస్తే బంధం తొలగిపోతుంది. 'నేను' అనే ప్రతీతిలో సామాన్యరూపంలో ఆత్మ సాక్షాత్కారం ఉన్నా దాని యథార్థస్వరూపం తెలిసేవరకు బంధవిముక్తి కలగదు. అందుచేత బ్రహ్మజిజ్ఞాసా-శాస్త్రారంభాలు ఆవశ్యకములే అని ఉత్తరపక్షం (సిద్ధాంతం). పూర్వపక్షంలో-

బంధం సత్యం గాన జ్ఞానభిన్నమైన మరొక ఉపాయంచేతనే తొలగి ముక్తి లభిస్తుంది అని చెప్పడం ఫలం. జ్ఞానం వల్లనే మోక్షం అని సిద్ధాంతంలో ఫలం. ఈ అధికరణం శాస్త్రారంభానికి హేతువైన అనుబంధచతుష్టయాన్ని సూచించడం ద్వారా ఉపోద్ఘాత రూపంలో శాస్త్రప్రారంభములో చేర్చబడింది. అందుచేత ఉపోద్ఘాతసంగతి. అధికార్యాదులను చెప్పే శ్రుతులు తమ అర్థాన్ని బోధిస్తున్నాయి అని ప్రతిపాదించడంచేత సమన్వయాధ్యాయ సంగతి. బ్రహ్మలింగం స్పష్టంగా ఉన్న 'ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' ఇత్యాదివాక్యాల ద్వారా విషయనిర్ధారణ చేయడంచేత పాదసంగతి, అధ్యాయపాదాది సంగతి. ముమ్ముందు కూడా ఈ విధంగా చూచుకోవాలి.

శంకరభగవత్పాదులు అథశబ్దానికి సాధనచతుష్టయ సంపత్త్యనంతరం అని అర్థం చెప్పారు. ఈ అర్థం స్వకపోలకల్పితం కాదు. శ్రుతిసంమతమే. "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" ఇత్యాది శ్రుతివాక్యాలు కర్మ చేసి సంపాదించినవి ఏనాటికైనా నశిస్తాయి, అవి అనిత్యాలు అని బోధిస్తున్నాయి. "యత్ కృతకం తదనిత్యమ్" (కర్మ అనగా పని, చేసి సంపాదించినది అనిత్యమే) అనే న్యాయం కూడ ఈ శ్రుతివాక్యాన్ని సమర్థిస్తున్నది. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" (నిత్యజ్ఞానస్వరూపాత్మకు జననమరణాలు లేవు) "యో వై భూమా తదమృతమ్ అతో ఽన్యదార్తమ్" (దేశ కాలాదులచేత పరిచ్ఛిన్నం కాని ఏ ఆత్మ ఉన్నదో అదే నాశరహితం, అది తప్ప మిగిలినది సమస్తమూ నశ్వరము) ఇత్యాది వాక్యాలు ఆత్మ ఒక్కటే నిత్యమైనది అని బోధిస్తున్నాయి. ఇది నిత్యానిత్యవివేకం. "పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన" (కర్మలచేత సంపాదించబడిన లోకాలను పరీక్షించి బ్రాహ్మణుడు నిర్వేదం (వైరాగ్యం) పొందాలి. కర్మలవల్ల నిత్యమైన వస్తువు లభించదు) ఇత్యాది వాక్యాలు వైరాగ్యాన్ని బోధిస్తున్నాయి. "శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః" అనే వాక్యం శమదమాదుల ఆవశ్యకతను బోధిస్తూన్నది. ఇవన్నీ కలవానికి మోక్షేచ్ఛ స్వయంగానే కలుగుతుంది. ఈ విధంగా శ్రుతియుక్తిసంమతమైన సాధనచతుష్టయాన్నే శంకరభగవత్పాదులు అథశబ్దార్థంగా ప్రతిపాదించారు.

చతుర్థవర్ణకం సమాప్తం.

## 2. జన్మాద్యధికరణమ్ సూ. 2

### భాష్యమ్

బ్రహ్మ జిజ్ఞాసితవ్యమిత్యుక్తమ్ కింలక్షణం పునస్తద్బ్రహ్మేత్యత ఆహ భగవాన్ సూత్రకారః :-

### సూ. జన్మాద్యస్య యతః 1.1.2

జన్మ ఉత్పత్తిః ఆదిః అస్యేతి తద్గుణసంవిజ్ఞానః బహువ్రీహిః. జన్మస్థితిభఙ్గం సమాసార్థః. జన్మనశ్చాదిత్వం శ్రుతినిర్దేశాపేక్షం వస్తువృత్తాపేక్షం చ. శ్రుతినిర్దేశస్తావత్ "**యతో వా ఇమాని భూతాని జాయన్తే**" (తై.ఉ.3.1) ఇత్యస్మిన్ వాక్యే జన్మస్థితిప్రలయానాం క్రమదర్శనాత్. వస్తువృత్తమపి— జన్మనా లబ్ధసత్తాకస్య ధర్మిణః స్థితిప్రలయసంభవాత్. అస్యేతి ప్రత్యక్షాదిసంనిధాపితస్య ధర్మిణః ఇదమా నిర్దేశః. షష్ఠీ జన్మాది ధర్మసంబన్ధార్థా. యతః ఇతి కారణనిర్దేశః. అస్య జగతో నామరూపాభ్యాం వ్యాకృతస్య అనేకకర్తృభోక్తృసంయుక్తస్య ప్రతినియతదేశకాలనిమిత్తక్రియాఫలాశ్రయస్య, మనసాప్యచిన్త్యరచనారూపస్య జన్మస్థితిభఙ్గం యతః సర్వజ్ఞాత్ సర్వశక్తేః కారణాద్భవతి తద్బ్రహ్మేది వాక్యశేషః.

### బాలానందిని

బ్రహ్మేతి:- బ్రహ్మజిజ్ఞాస చెయ్యాలి అని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. ఆ బ్రహ్మ అనగా ఏది అనే ప్రశ్నకు సమాధానంగా భగవంతుడైన (పూజ్యుడైన) సూత్రకారుడు "జన్మాద్యస్య యతః" అనే సూత్రంచేత లక్షణం చెపుతున్నాడు.

వి. నువ్వు చెప్పిన బ్రహ్మ అనేది ఒకటి ఉంటే దాని జిజ్ఞాస కలుగుతుంది. అసలు బ్రహ్మ అంటూ ఉందా? దాని లక్షణం ఏమిటి అనడంలో బ్రహ్మను ఆక్షేపించినట్లు అవుతుంద గాన ఈ అధికరణానికి వెనుకటి అధికరణానికి ఆక్షేపసంగతి. **'యతో వా ఇమాని భూతాని జాయన్తే'** ఇత్యాదివాక్యం విషయం. ఇది బ్రహ్మలక్షణాన్ని చెపుతున్నదా లేదా అని సందేహం. ఇది లక్షణం కాదు అని పూర్వపక్షం; లక్షణమే అని సిద్ధాంతం.

జన్మేతి:- "అస్య=ఈ జగత్తుయొక్క, జన్మాది= జన్మ మొదలైనది, అనగా జన్మ-స్థితి-ప్రళయాలు, యతః= దేనివలన కలుగుచున్నాయో అది బ్రహ్మ" అని సూత్రానికి అర్థం.

జన్మేతి:- "జన్మ= ఉత్పత్తి, ఆదిః = మొదటిది, అస్య=దీనికి అనగా జన్మస్థితిభంగము అనే సముదాయానికి" అని ఇది తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి. 'జన్మాది' అనేదానిచేత చెప్పబడేది ఏది అనగా జన్మస్థితిభంగం, అనగా జన్మస్థితి ప్రళయాలు. శ్రుతిలో ముందుగా నిర్దేశింపబడటంచేత, లోకంలో కూడ ఒక వస్తువు పుట్టి, కొంత కాలం ఉండి తరవాత నశిస్తుంది గాన ఆ కారణంచేత జన్మ ముందు పేర్కొనబడింది. శ్రుతినిర్దేశం ఏదనగా- "యతో వా ఇమాని భూతాని జాయన్తే" (దేనినుండి ఈ భూతాలు పుట్టుచున్నాయో) అనే వాక్యంలో జన్మస్థితిప్రళయాలు ఆ క్రమంలోనే చెప్పబడినవి. వస్తువృత్తం అనగా వాస్తవస్థితి కూడా అలాగే కనబడుతున్నది. పుట్టడం ద్వారా ఉనికికి వచ్చిన ధర్మికి (వస్తువునకు) స్థితి, నాశం అనేవి కలుగుతాయి కదా? ప్రత్యక్షాదుల ద్వారా ఎదుట కనబడుతున్న వస్తువు అస్య అని 'ఇదమ్' శబ్దంచేత నిర్దేశించబడుచున్నది. ఎదుట కనబడుతూన్న ఈ జగత్తుయొక్క అని అర్థం. 'అస్య' అనే షష్ఠీవిభక్తి జగత్తుకు జన్మాదిధర్మాలతో ఉన్న సంబంధాన్ని బోధిస్తున్నది. 'యతః' అని కారణం నిర్దేశించబడుచున్నది. కారణమైన దేనివల్ల అని అర్థం.

అవ. ఈ జగత్తు హిరణ్యగర్భుడు మొదలైన జీవులనుండి జనించలేదు; పరబ్రహ్మనుంచే జనించింది అని స్పష్టీకరించడానికి చెప్పుచున్నారు-అస్యేతి:- పేర్లచేత, రూపాలచేత విడిగా చూపబడుచున్నది, (ఇది దీని పేరు, ఇది దీని రూపం అని వేరు వేరుగా గ్రహించబడుచున్నది అని అర్థం) అనేకులైన కర్తలతోను, భోక్తలతోను (ఆ యా కర్మల ఫలాలను అనుభవించేవాళ్లతోను) కూడినది, ప్రతినియతమైన (ఇది ఇప్పుడు, ఇక్కడ, ఇలా అని నిశ్చితమైన) దేశం, కాలం, నిమిత్తములు గల క్రియాఫలాలకు ఆశ్రయము, మనస్సుచేత ఊహించడానికి కూడా శక్యం కాని రచనా విధానం కలదీ అయిన ఈ జగత్తుయొక్క జన్మ - స్థితి - వినాశాలు సర్వజ్ఞము, సర్వశక్తము అయిన ఏ కారణంనుండి జరుగుచున్నాయో అది బ్రహ్మ అని వాక్యాన్ని పూరించాలి.

వి. బహువ్రీహిసమాసఘటితాలైన పదాల అర్థాలు సమాసార్థమైన అన్యార్థంతో కలిసి తద్ద్వారా క్రియతో అన్వయిస్తే అది తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి. అలా అన్వయించకపోతే అది అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి. ఉదాహరణకి "పీతామ్బరమ్ ఆనయ" (పచ్చని వస్త్రం గలవానిని తీసికొనిరా) అన్నప్పుడు ఆనయనక్రియలో పచ్చని వస్త్రం ధరించినవానితో పాటు ఆ వస్త్రం కూడా అన్వయిస్తుంది. పచ్చని వస్త్రంతో సహితుడైనవానినే తీసికొనివస్తారు కదా? ఇది తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి. "దృష్టసముద్రమానయ" (చూడబడిన సముద్రం కలవానిని తీసికొనిరా) అన్నప్పుడు

ఆ వ్యక్తియే తీసికొని రాబడతాడు గాని సముద్రం తీసికొనిరాబడదు. ఇది అతద్గుణ సంవిజ్ఞానబహువ్రీహి. ఇక్కడ 'జన్మాది' అనే నపుంసకలింగప్రయోగానికి అనుగుణంగా "జన్మస్థితిభఙ్గమ్" అనే విశేష్యం అన్యపదార్థంగా చూపబడింది. "జన్మ ఆదిః యస్య తత్" అని బహువ్రీహిసమాసం. ఇది అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి అయితే కేవలం "స్థితిభఙ్గమ్" అనేది మాత్రమే గ్రహించబడుతుంది. జన్మ కూడా గ్రహించబడాలంటే దీనిని తద్గుణసంవిజ్ఞానబహువ్రీహిగా గ్రహించాలి. అప్పుడు "జన్మస్థితిభఙ్గమ్" అనేది గ్రహించడానికి వీలవుతుంది.

## భాష్యమ్

అన్యేషామపి భావవికారాణాం త్రిష్వేవాన్తర్భావ ఇతి జన్మస్థితినాశానామిహ గ్రహణమ్. యాస్కపరిపఠితానాం తు "జాయతేఽస్తి" ఇత్యాదీనాం గ్రహణే తేషాం జగతః స్థితికాలే సంభావ్యమానత్వాత్ మూలకారణాదుత్పత్తిస్థితినాశా జగతో న గృహీతాః స్యుః ఇత్యాశఙ్క్యేత, తన్మా శఙ్కీతి యోత్పత్తిర్బ్రహ్మణః తత్రైవ స్థితిః ప్రలయశ్చ త ఏవ గృహ్యన్తే. న యథోక్తవిశేషణస్య జగతః యథోక్తవిశేషణమీశ్వరం ముక్త్వాన్యతః ప్రధానాదచేతనాదణుభ్యోఽ భావాత్సంసారిణో వా ఉత్పత్త్యాది సంభావయితుం శక్యమ్. న చ స్వభావతః, విశిష్టదేశకాలనిమిత్తానామిహోపాదానాత్. ఏతదేవానుమానం సంసారివ్యతిరిక్తేశ్వరాస్తిత్వాదిసాధనంమన్యన్త ఈశ్వరకారణినః.

## బాలానందిని

అవ. జన్మస్థితిలయాలే కాకుండా ఇంకా మరి కొన్ని భావవికారాలు (పదార్థాలలో కలిగే మార్పులు) ఉన్నాయి కదా? వాటిని ఎందుకు చెప్పలేదు అనే ప్రశ్నకు సమాధానం చెపుతున్నారు. మిగిలిన భావవికారాలు కూడా, పరిశీలిస్తే, ఈ జన్మస్థితిలయాలలోనే అంతర్గతా లౌతాయి. (అందుచేత వాటిని కూడా చెప్పినట్లే అవుతుంది గాన) జన్మస్థితిలయాలు మాత్రమే గ్రహింపబడ్డాయి. యాస్కుడు చెప్పిన "జాయతే అస్తి" ఇత్యాదులను గ్రహిస్తే అవి జగత్తుయొక్క స్థితికాలంలో కూడా సంభావ్యములే గాన ఈ సూత్రంలో మూలకారణంనుండి జరిగే జగదుత్పత్తిస్థితిలయాలను గ్రహించలేదు అనే ఆశంక కలగవచ్చును. అలాంటి ఆశంక కలగకుండా ఉండడం కోసం బ్రహ్మనుండియే పుట్టుట, ఆ బ్రహ్మయందే ఉండుట, ఆ బ్రహ్మయందే లీనం అగుట అనే వాటినే గ్రహించాలి. పైన చెప్పిన "నామరూపాభ్యాం వ్యాకృతస్య" ఇత్యాది విశేషణాలచేత వర్ణించబడిన జగత్తుకు "సర్వజ్ఞాత్, సర్వశక్తేః" ఇత్యాదివిశేషణాలచేత

వర్ణించబడిన పరమేశ్వరుడు తప్ప, ఇతరమైన అచేతనమైన ప్రధానంనుండి గాని, అచేతనాలైన అణువులనుండి గాని, అభావంనుండి గాని, సంసారినుండి (జీవునినుండి) గాని ఉత్పత్త్యాదికం జరుగుతుం దని ఊహింప శక్యం కాదు. పోనీ స్వభావంవల్లనే జరుగుతుంది, అనగా ఈ ఉత్పత్త్యాదికానికి కారణం అంటూ ఏదీ ఉండవలసిన పని లేదు. ఇది ఇలా జరుగుతూండడమే స్వభావం, అని చెప్పడానికి వీలు లేదు. ఎందువల్ల ననగా ఈ ఉత్పత్త్యాదుల విషయంలో విశిష్టమైన దేశాలు, కాలాలు, నిమిత్తాలు గ్రహించబడుతున్నాయి. అనగా స్వభావంవల్లనే ఈ జగత్సృష్ట్యాదులు జరుగుతున్నాయి అని చెప్పినట్లయితే వీటిలో ఒక పద్ధతి, నియమమూ ఉండకూడదు. ప్రతీదీ ఏదో ఒక అనిశ్చితమైన పద్ధతిలో జరిగిపోతూ ఉండాలి. కాని మనం జాగర్తగా పరిశీలిస్తే ఇవన్నీ ఒక నిశ్చితమైన దేశం, కాలం, నిమిత్తం మొదలైనవాటిని ఆధారంగా చేసికొని ఒక క్రమబద్ధరీతిలో జరుగుతున్నట్లు కనబడుతున్నది. ఇది ఇలా జరగాలంటే నియామకుడైన ఒక ఈశ్వరు డున్నా డని అంగీకరించాలి. స్వభావం చేతనే ఇవన్నీ ఇలా జరుగుతూంటాయి అనడానికి వీలు లేదు అని భావం.

అవ. కార్యమైన ఈ జగత్తును చూచి దీని సృష్ట్యాదికి కారణభూతుడైన పరమేశ్వరుణ్ణి ఊహిస్తున్నాము అని ఈ సూత్రంలో చెప్పినట్లయింది. నైయాయికులు మొదలైన వాళ్లు ఈశ్వరుని గూర్చి అనుమానమే ప్రమాణం అంటారు. "క్షిత్యాదికం సకర్తృకం, కార్యత్వాత్, ఘటవత్" (భూమి మొదలైనవాటికి ఒక కర్త ఉండాలి; అవన్నీ కార్యములు కాబట్టి, ఘటం వలె, అనగా కార్యమైన ఘటానికి కులాలు డనే కర్త ఉన్నట్లు క్షిత్యాదికానికి కర్తయైన పరమేశ్వరు డున్నాడు అని భావం) ఇత్యాద్యనుమాన ప్రమాణం చేతనే పరమేశ్వరుణ్ణి గూర్చి తెలిసికొనవచ్చును గాన శ్రుతివాక్యాదుల అవశ్యకత అంతగా లేదని వాళ్ల అభిప్రాయం. ఆ విషయమే చెప్పుచున్నారు.- ఏతదేవేతి: ఇదే (జన్మాద్యస్య యతః ఇత్యాదికమే) జీవునికంటె భిన్నుడైన ఈశ్వరుని ఉనికిని సాధిస్తుంది అని ఈశ్వరకారణత్వాన్ని అంగీకరించే నైయాయికాదులు అంటారు.

వి. ప్రతీ వస్తువు ఆరు వికారాలకు లోనౌతుందని యాస్కుడు నిరుక్తంలో చెప్పి ఉన్నాడు.- 'షడ్ భావవికారా భవన్తీతి వార్ష్యాయణిః - జాయతే,అస్తి, విపరిణమతే, వర్ధతే, అపక్షీయతే, వినశ్యతీతి" (నిరు 1.1.3) (పుడుతుంది, ఉంటుంది, పరిణామం చెందుతుంది, పెరుగుతుంది, క్షీణిస్తుంది, నశిస్తుంది. ఈ విధంగా ప్రతీ వస్తువులోను (దేహాదులలో) ఈ ఆరు వికారాలు ఉంటాయి.- అని అర్థం). ఈ జన్మాది సూత్రంలో ఆ భావవికారషట్కం నిర్దేశించబడిన దని చెప్పవచ్చును కదా, జన్మస్థితిలయములు మూడింటిని మాత్రమే

ఎందుకు గ్రహించాలి అని ప్రశ్న. పృథివ్యాదిభూతాలనుండి పుట్టిన వృక్షాదులకు కూడా ఈ భావవికారాలు కనబడుతున్నాయి. అందుచేత ఈ భావవికారాలను పట్టి ఊహించే కారణం పృథివ్యాదికం కూడా కావచ్చును. ఇప్పుడు మనం చెప్పవలసినది సర్వజగన్మూలకారణ మైన బ్రహ్మను గూర్చి. ఆ బ్రహ్మను గూర్చి సూచించాలంటే జగత్సృష్టిస్థితిప్రలయాలనే సాధనంగా చెప్పాలి. అందుచేత వాటినే ఈ సూత్రంలో పేర్కొన్నట్లు గ్రహించాలి అని "యాస్కపరిపఠితానాం తు" ఇత్యాది భాష్యవాక్యానికి భావం. ఇంతకు అధికంగా చెప్పిన మూడు భావవికారాలు జన్మ-లయాలలోనే అంతర్గతం అయినప్పుడు శ్రుత్యుక్తజన్మస్థితిలయాలను కాదని కేవలం స్పష్టత్వార్థం చెప్పిన యాస్కోక్తభావవికారాలను గ్రహించడం ఎందుకు అని కూడ భావం.

## భాష్యమ్

నన్విహాపి తదేవోపన్యస్తం జన్మాదిసూత్రే? న. వేదాన్తవాక్యకుసుమ గ్రథనార్థత్వాత్సూత్రాణామ్. వేదాన్తవాక్యాని హి సూత్రైరుదాహృత్య విచార్యన్తే. వాక్యార్థవిచారణాధ్యవసాయనిర్వృత్తా హి బ్రహ్మావగతిః నానుమానాది ప్రమాణాన్తరనిర్వృత్తా. సత్సు తు వేదాన్తవాక్యేషు జగతః జన్మాదికారణవాదిషు తదర్థగ్రహణదార్ఢ్యాయ అనుమానమపి వేదాన్త వాక్యావిరోధి ప్రమాణం భవన్న నివార్యతే; శ్రుత్యైవ చ సహాయత్వేన తర్కస్యాభ్యుపేతత్వాత్. తథా హి- "శ్రోతవ్యో మన్తవ్యః" (బృ.ఉ.2.4.5) ఇతి శ్రుతిః "పణ్డితో మేధావీ గన్ధారానేవోపసంపద్యే తైవమేవేహాచార్యవాన్ పురుషో వేద" (ఛా. ఉ.6.14.2) ఇతి చ పురుష బుద్ధిసాహాయ్యమాత్మనో దర్శయతి. న ధర్మజిజ్ఞాసాయామివ శ్రుత్యాదయ ఏవ ప్రమాణం బ్రహ్మజిజ్ఞాసాయామ్; కిం తు శ్రుత్యాదయః అనుభవాదయశ్చ యథాసంభవమిహ ప్రమాణమ్; అనుభవావసానత్వాత్, భూతవస్తువిషయత్వాచ్చ బ్రహ్మజ్ఞానస్య. కర్తవ్యే హి విషయే నానుభవాపేక్షాస్తీతి శ్రుత్యాదీనామేవ ప్రామాణ్యం స్యాత్, పురుషాధీనాత్మలాభత్వాచ్చ కర్తవ్యస్య. కర్తుమకర్తుమన్యథా వా కర్తుం శక్యం లౌకికం వైదికం చ కర్మ, యథాఽశ్వేన గచ్ఛతి, పద్భ్యామన్యథా వా, న వా గచ్ఛతీతి. తథా "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" "ఉదితే జుహోతి" "అనుదితే జుహోతి" ఇతి విధిప్రతిషేధాశ్చాత్రార్థవన్తః స్యుః, వికల్పోత్సర్గాపవాదాశ్చ, న తు వస్త్వేవం, నైవమ్, అస్తి, నాస్తీతి వా వికల్ప్యతే. వికల్పనాస్తు పురుషబుద్ధ్యపేక్షాః, న వస్తుయాథాత్మ్యజ్ఞానం పురుష

బుద్ధ్యపేక్షమ్; కిం తర్హి? వస్తుతన్త్రమేవ తత్. న హి స్థాణావేకస్మిన్ స్థాణుర్వా పురుషోఽన్యో వేతి తత్త్వజ్ఞానం భవతి. తత్ర పురుషోఽన్యో వేతి మిథ్యాజ్ఞానమ్, స్థాణురేవేతి తత్త్వజ్ఞానమ్; వస్తుతన్త్రత్వాత్, ఏవం భూతవస్తువిషయాణాం ప్రామాణ్యం వస్తుతన్త్రమ్. తత్రైవం సతి బ్రహ్మజ్ఞానమపి వస్తుతన్త్రమేవ; భూతవస్తువిషయత్వాత్.

## బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) ఈ జన్మాదిసూత్రంలో కూడా నైయాయికులు చెప్పిన అనుమానమే చెప్పబడింది కదా? (సమాధానం) కాదు. సూత్రాలు వేదాంతవాక్యాలనే పుష్పాలను గ్రుచ్చడంకోసం ఉద్దిష్ట మైనవి. సూత్రాలు వేదాంతవాక్యాలను ఉదాహరించి వాటి అర్థాన్ని గూర్చి విచారిస్తాయి. బ్రహ్మసాక్షాత్కారం వాక్యార్థవిచారణ చేసి దానిని నిర్ణయించడం చేత కలుగుతుంది గాని అనుమానం మొదలైన ఇతరప్రమాణాలచేత కలిగేది కాదు. జగత్తుయొక్క జన్మాదులకు కారణమైనదానిని గూర్చి చెప్పే వేదాంతవాక్యాలు ఉండగా అవి చెప్పిన అర్థాన్ని ధృడీకరించుకొనడం కొరకు, ఆ వేదాంతవాక్యాలకి విరుద్ధం కాని అనుమానం కూడా ప్రమాణంగా అయినా, అనగా అలాంటి అనుమానాన్ని ప్రమాణంగా చూపినా, దానిని నిరాకరించం. ఎందువల్ల ననగా తర్కాన్ని తనకు సాహాయ్యంగా ఉపయోగించుకొనవచ్చు నని శ్రుతియే అంగీకరించింది. "శ్రోతవ్యః మన్తవ్యః" (ఆత్మ వినదగినది, మననం చేయదగినది) అనే శ్రుతి, "పణ్డితో మేధావీ గన్ధారానేవోపసంపద్యేత ఏవమేవేహాచార్యవాన్ పురుషో వేద" (మేధావియైన పండితుడు గాంధారదేశమే చేరి నట్లు ఆచార్యవంతుడైన పురుషుడే తెలిసికొన కలగుతాడు) అనే శ్రుతీ తనకు (శ్రుతికి) పురుషుని బుద్ధిసాహాయ్యం కూడా ఉండాలని చూపుచున్నది.

వి. "ఆత్మను గూర్చి శ్రుతుల ద్వారా వినాలి" అని చెప్పిన శ్రుతియే "ఆత్మను గూర్చి నీ బుద్ధితో మననం కూడా చెయ్యాలి" అని చెప్పుచున్నది. మననం అనగా శ్రుతిబోధితమైన విషయం యుక్తిసంమతంగా ఉన్నదా లేదా అని పరిశీలించడం. గాంధారదేశానికి సంబంధించినవానిని ఒకనిని దొంగలు కండ్లకు గంతలు కట్టి ఉత్తరంగా చాలా దూరం తీసికొని పోయి అక్కడ వదలివేయగా అతడు తన తెలివిని ఉపయోగించి అందరినీ అడుగుతూ అడుగుతూ తన బుద్ధిబలంచేత గాంధారదేశం చేరుకొన్నాడు. అదే విధంగా మేధావియైన పండితుడు గురువులనుండి విషయం తెలుసుకొని తన బుద్ధిబలం కూడ ఉపయోగించి ఆత్మసాక్షాత్కారం పొందాలి అని రెండవ శ్రుతివాక్యం

చెపుతున్నది. అందుచేత తనను సరిగా అర్థం చేసికొనడానికి అనుమానాదులను కూడా ఉపయోగించుకొనడంలో తప్పు లేదు అని శ్రుతియే చెప్పుచున్నది అని భావం.

నేతి:- ధర్మజిజ్ఞాసకు సంబంధించి నంతవరకు శ్రుత్యాదులు మాత్రమే ప్రమాణం. ధర్మజిజ్ఞాసయందు వలె బ్రహ్మజిజ్ఞాసలో శ్రుత్యాదులు మాత్రమే ప్రమాణం కాదు; మరేమనగా బ్రహ్మజిజ్ఞాసలో శ్రుత్యాదులు అనుభవాదులూ కూడ యథాసంభవంగా (వీలును బట్టి) ప్రమాణం. ఎందువల్ల ననగా బ్రహ్మజ్ఞానం చివరికి బ్రహ్మానుభవంతోనే, బ్రహ్మసాక్షాత్కారంతోనే ముగుస్తుంది; ఇది ఎల్లప్పుడు ఉన్న బ్రహ్మ అనే వస్తువుకు సంబంధించినది.

వి. ధర్మాన్ని గూర్చి తెలుసుకొనడానికి శ్రుతిస్మృత్యాదులు తప్ప ఇతరప్రమాణా లేవీ లేవు. బ్రహ్మసంగతి అలాంటిది కాదు. బ్రహ్మనుగూర్చి శ్రుతిస్మృత్యాదుల ద్వారా తెలుసుకొనవచ్చు. స్వానుభవం ద్వారా కూడా తెలుసుకొనవచ్చు. బ్రహ్మ అనేది క్రొత్తగా పుట్టించబడేది కాదు. ఎల్లప్పుడూ స్థిరంగా ఉన్న నిత్యవస్తువు. బ్రహ్మజ్ఞానానికి పరమ ప్రయోజనం బ్రహ్మసాక్షాత్కారమే. నిత్యమూ ఉన్న వస్తువును గూర్చి శ్రుత్యాదుల ద్వారా తెలిసికొనవచ్చు, ఇతరయుక్తులచేత తెలిసికొనవచ్చు. స్వానుభవం ద్వారా తెలిసికొనవచ్చు. అందుచేత బ్రహ్మవిషయంలో అనుమానాదిప్రసరానికి అభ్యంతరం లేదు అని భావం.

కర్తవ్యే ఇతి:- కొత్తగా చేసి సాధించవలసినదాని విషయంలో అనుభవాపేక్ష ఉండదు. అందుచేత దాని విషయంలో శ్రుత్యాదులు మాత్రమే ప్రమాణం. మరొక కారణం ఏమనగా- కర్తవ్యం (చేయదగిన కర్మ) పుట్టడానికి పురుషునిమీద ఆధారపడి ఉంటుంది (పురుషుడు చేస్తేనే కర్మ సిద్ధిస్తుంది). లౌకికకర్మయైనా, వైదికకర్మయైనా, చేయడానికి లేదా మానడానికి లేదా మరొక విధంగా చేయడానికి శక్యం అవుతుంది. ఉదాహరణకి - ఒకడు గుఱ్ఱం ఎక్కి వెళ్లవచ్చు, నడిచి వెళ్లవచ్చు, అసలు వెళ్లకుండానే ఉండవచ్చు. (ఈ విధంగా ఒకచోటినుండి మరొక చోటికి వెళ్లడం అనే లౌకికకర్మ అది చేసే మనుష్యుని మీద ఆధారపడి ఉంది. అట్లే "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి", "నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" (అతిరాత్రంలో షోడశిగ్రహాన్ని గ్రహించాలి; అతిరాత్రంలో షోడశిగ్రహాన్ని గ్రహించకూడదు) అనీ, "ఉదితే జుహోతి", "అనుదితే జుహోతి" (సూర్యుడు ఉదయించిన తరవాత హోమం చెయ్యాలి, సూర్యుడు ఉదయించకుండా హోమం చెయ్యాలి) అని విధులు, నిషేధాలు కూడా ఇక్కడ (కర్మవిషయంలో) సార్థకం

అవుతాయి. వికల్ప-సామాన్యశాస్త్ర- విశేషశాస్త్రాలు కూడా సార్థకం అవుతాయి.

వి. "అతిరాత్ర మనే సంస్థ గల జ్యోతిష్టోమయాగంలో షోడశి అనే పేరు గల గ్రహాన్ని గ్రహించకూడదు" అని "**అతిరాత్రే షోడశినం గృహ్ణాతి**" అనే వాక్యానికి అర్థం. "గ్రహించాలి" అని రెండవ వాక్యానికి అర్థం. (దీనికి సంబంధించిన విస్తృతవివరణం మీమాంసాన్యాయప్రకాశవ్యాఖ్యానమైన సారవివేచనవ్యాఖ్యలో (పు.174, 175) ఉన్నది. ఈ షోడశిగ్రహగ్రహణం కర్మ గాన చేస్తే చేయవచ్చు లేదా మానివేయవచ్చు అని చెప్పడం కుదురుతుంది. అట్లే వారి వారి శాఖాసంప్రదాయాన్ని బట్టి కొందరు సూర్యోదయానంతరం హోమం చెయ్యాలి; కొందరు సూర్యోదయానికి ముందు చెయ్యాలి అని చెప్పడానికి వీలున్నది. అట్లే కర్మలకు సంబంధించినంతవరకు కొన్ని "యజేత" (యాగం చెయ్యాలి) ఇత్యాదివిధులు 'న సురాం పిబేత్' (సురను త్రాగకూడదు) ఇత్యాదినిషేధాలు "వ్రీహులచేతనైనా యాగం చేయవచ్చు యవలచేతనైనా చేయవచ్చు" అని వికల్పాలు, "న హింస్యాత్ సర్వాభూతాని" (ఏ ప్రాణినీ చంపకూడదు) ఇత్యాదిసామాన్యశాస్త్రాలు, "అగ్నీషోమీయం పశుమాలభేత" (అగ్నీషోమంలో పశువును చంపాలి) ఇత్యాది విశేషశాస్త్రాలు ఉండడానికి అవకాశం ఉంది. అందుకు కారణం కర్మ మనుష్యప్రయత్నసాధ్యం అవడమే.

నత్వితి:- వస్తువు (ఉన్న పదార్థం) విషయంలో "ఇది ఇట్లు" అని గాని, "ఇది ఇట్లు కాదు" అని గాని, "ఇది ఉన్నది" అని గాని, "ఇది లేదు" అని గాని వికల్పాలు ఉండవు. వికల్పా లన్నీ పురుషుని బుద్ధిని (ఆలోచనను) బట్టి ఏర్పడతాయి. వస్తువు యొక్క యథార్థస్వరూపానికి సంబంధించిన జ్ఞానమైతే పురుషబుద్ధిమీద ఆధారపడి ఉన్నది కాదు; అది వస్తుస్వరూపంమీదనే ఆధారపడి ఉంటుంది. (ఆ వస్తువు ఏ విధంగా ఉంటే ఆ విధమైన జ్ఞానమే కలుగుతుంది. అదే యథార్థజ్ఞానం అని అర్థం). ఒక స్థాణువును (పెద్ద ఆూతిబండను లేదా కొమ్మలు లేని చెట్టు మానును) చూచినప్పుడు కలిగిన "ఇది స్థాణువా, పురుషుడా, మరొకటి ఏదైనానా" అనే వికల్ప జ్ఞానం యథార్థజ్ఞానం కాదు గదా? అందులో "పురుషుడా, మరొకటి ఏదేనా" అనేది మిథ్యాజ్ఞానమే (భ్రాంతిజ్ఞానమే); "ఇది స్థాణువే" అనేది మాత్రమే తత్త్వజ్ఞానం; ఎందువల్ల ననగా ఈ జాన౦ వస్తువుమీద ఆధారపడి ఉన్నది. ఈ విధంగా భూతవస్తువును అనగా ఉన్న వస్తువును, గూర్చిన జ్ఞానానికి ఉన్న ప్రామాణ్యం వస్తు స్వభావం మీద ఆధారపడి ఉంటుంది. (ఆ వస్తువు ఎలా ఉంటే అలా దానిని తెలుసుకుంటే అది సరియైన జ్ఞానం అవుతుంది. దాని విషయంలో మనిషి ఇష్టానిష్టాలు

ఏమీ పని చేయవు అని అర్థం). ఇది ఇలా ఉండగా అది భూతవస్తువిషయమైనది, అనగా ఉన్న (క్రొత్తగా పుట్టించబడని) వస్తువుకు సంబంధించినది.

## భాష్యమ్

నను భూతవస్తుత్వే బ్రహ్మణః ప్రమాణాన్తరవిషయత్వమేవేతి వేదాన్తవాక్యవిచారణాఽనర్థికైవ ప్రాప్తా?న. ఇన్ద్రియావిషయత్వేన సమ్బన్ధాగ్రహణాత్. స్వభావతో విషయవిషయాణీన్ద్రియాణి, న బ్రహ్మ విషయాణి. సతి హీన్ద్రియవిషయత్వే బ్రహ్మణః ఇదం బ్రహ్మణా సమ్బద్ధం కార్యమితి గృహ్యేత. కార్యమాత్రమేవ తు గృహ్యమాణం కిం బ్రహ్మణా సంబద్ధం కిమన్యేన కేనచిద్వా సంబద్ధమితి న శక్యతే నిశ్చేతుమ్. తస్మాజ్జన్మాది సూత్రం నానుమానోపన్యాసార్థమ్; కిం తర్హి? వేదాన్తవాక్యప్రదర్శనార్థమ్.

## బాలానందిని

అవ. బ్రహ్మ ధర్మాదులకంటె విలక్షణం అవడంచేత ఘటాదులవలె ప్రత్యక్షాదులకు కూడా గోచరం కావాలి కదా? అప్పుడు సిద్ధమైన అగ్ని మొదలైనవాటి విషయంలో ప్రమాణం అయినట్లు సిద్ధమైన బ్రహ్మవిషయంలో కూడా అనుమానం ప్రమాణం కావచ్చును గాన జన్మాదిసూత్రంలో జగత్కారణానుమానాన్ని గూర్చియే విచారించాలి. సిద్ధమైన వస్తువు విషయంలో శ్రుతి ప్రమాణం కాదు గాన శ్రుతిని విచారించవలసిన పని లేదు కదా అని ఆశంకించుకొని చెప్పుచున్నారు— నన్వితి:- (నువ్వు చెప్పినట్లు) బ్రహ్మ భూతవస్తువు గాన అది ఇతరప్రమాణాల ద్వారానే తెలియబడాలి. అందుచేత వేదాంత వాక్యవిచారం వ్యర్థమే అని తేలింది కదా? (సమాధానం)- కాదు. బ్రహ్మ ఇంద్రియ గోచరం కాదు; అందుచేత జగత్తుకీ బ్రహ్మకీ ఉన్న సంబంధం ఇంద్రియాలచేత గ్రహించబడదు. ఇంద్రియాలు బాహ్యవిషయాలనే గ్రహించకలుగుతాయి గాని బ్రహ్మను గ్రహించజాలవు. ఇది వాటి స్వభావం. ఇంద్రియాలు బ్రహ్మను కూడా గ్రహించకలిగితే అప్పుడు ఈ కార్యం బ్రహ్మకు సంబంధించినది అని తెలుసుకొనడానికి వీలుండేది. జగద్రూపమైన కార్యం మాత్రమే ఇంద్రియాలచేత గ్రహించబడి నప్పుడు ఈ కార్యం బ్రహ్మకు సంబంధించినదా లేక మరొకదానికి దేనికైనా సంబంధించినదా అని నిశ్చయించడం శక్యం కాదు. అందుచేత జన్మాదిసూత్రం అనుమానాన్ని చెప్పడం కోసం బయల్దేరలేదు; మరేమనగా వేదాంతవాక్యాన్ని చూపడం కోసమే ఉద్దిష్టమైనది.

## భాష్యమ్

కి పునస్తద్వేదాన్తవాక్యం యత్సూత్రేణేహ లిలక్షయిషితమ్? "భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార, అధీహి భగవో బ్రహ్మేతి" ఇత్యుపక్రమ్యాహ- "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" (తై.ఉ.3-1) తస్య చ నిర్ణయవాక్యమ్- "ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనన్దేన జాతాని జీవన్తి, ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి" (తై.ఉ.3.6) అన్యాన్యప్యేవం జాతీయకాని వాక్యాని నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావసర్వజ్ఞ స్వరూపకారణవిషయాణ్యుదాహర్తవ్యాని. 2.

## బాలానందిని

కిమితి:- ఈ సూత్రంచేత బ్రహ్మలక్షణంగా చెప్పడానికి ఉద్దేశించబడిన ఆ వేదాంత వాక్యం ఏది? "భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార, అధీహి భగవో బ్రహ్మేతి" (వరుణుని కుమారుడైన భృగువు - "ఓ పూజ్యుడా! నాకు బ్రహ్మను ఉపదేశించుము" అని అడుగుతూ తండ్రి దగ్గరికి వెళ్ళాడు) అని ప్రారంభించి శ్రుతి ఇలా చెప్పింది- "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి" (దేనినుండి ఈ భూతాలన్నీ జనిస్తున్నాయో, జనించిన ఈ భూతాలు దేనిచేత జీవిస్తున్నాయో, దేనిలోనికి వెళ్ళి ప్రవేశిస్తున్నాయో దానిని గూర్చి తెలుసుకొనడానికి నిశ్చయించుము (ప్రయత్నించుము). అదే బ్రహ్మ. ఆ బ్రహ్మను గూర్చి నిర్ణయించిన వాక్యం ఇది - "ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనన్దేన జాతాని జీవన్తి, ఆనన్దం ప్రయన్త్యభిసంవిశన్తీతి" (ఈ భూతాలు ఆనందంనుండే పుడుతున్నాయి. పుట్టిన తరవాత ఆ ఆనందంచేతనే జీవిస్తున్నాయి; ఆనందాన్నే చేరి దానిలో ప్రవేశిస్తున్నాయి). అనగా ఆనందమే బ్రహ్మ అని అర్థం. ఈ విధమైన నిత్యశుద్ధముక్తస్వభావసర్వజ్ఞస్వరూపాన్ని ప్రతిపాదించే ఇతరోపనిషద్గతవాక్యాలను కూడా ఉదాహరించాలి. అనగా "యః సర్వజ్ఞః" (ము.ఉ. 1.1.10), "తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే" (ము.ఉ. 1.1.10) "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ.ఉ.3.9.28) మొదలైన ఇతరోపనిషద్గతవాక్యాలు కూడా ఈ సూత్రానికి విషయవాక్యాలుగా చూపవచ్చును అని అర్థం.

వి. ప్రథమసూత్రంలో నిత్యశుద్ధముక్తస్వభావమైన అద్వితీయబ్రహ్మయొక్క జిజ్ఞాస సూత్రించబడింది. అట్టి బ్రహ్మయొక్క జ్ఞానమే బంధవిముక్తిహేతువు కాని

సగుణబ్రహ్మజ్ఞానం కాదు కదా? అట్టి బ్రహ్మయొక్క లక్షణమే జన్మాదిసూత్రంలో చెప్పబడింది. దేనిని తెలపాలో దానిని ఇతర వస్తువులనుండి వేరుచేసి చూపడానికి ఉపయోగించేది లక్షణం. అది తటస్థలక్షణం అనీ, స్వరూపలక్షణం అనీ రెండు విధాల ఉండవచ్చును. ఉదాహరణకి– "చంద్రుడు ఏది?" అని ప్రశ్నించినప్పుడు ఒక చెట్టు కొమ్మ చూపించి ఆ కొమ్మ చివర తిన్నగా కనబడుతున్నదే చంద్రుడు అని చెప్పినప్పుడు శాఖాగ్రం గుర్తుగా చూపబడినది. దానిని బట్టి చంద్రుణ్ణి గుర్తించవచ్చును. కాని చంద్రుడు ఎల్లప్పుడూ ఆ శాఖాగ్రం వైపునే ఉండడు. కొన్ని నిమిషాలకు పైకి వచ్చేస్తాడు. అయినా కూడా తాత్కాలికమైన ఆ శాఖాగ్రసంబంధాన్ని బట్టి అప్పటికి ఆ చంద్రబింబాన్ని గుర్తించడానికి "శాఖాయాం చన్ద్రః" లేదా "శాఖాగ్రే చన్ద్రః" అనే లక్షణం ఉపయోగించినది. అందుచేత ఇది తటస్థలక్షణం. ఇలా కాక "ప్రకృష్టప్రకాశశ్చన్ద్రః" "అత్యధికమైన ప్రకాశం గలవాడు చంద్రుడు" అని చెప్పిన ట్లయితే అత్యధికమైన ప్రకాశ అనే చంద్రుని స్వరూపం చెప్పబడినది గాన ఇది స్వరూపలక్షణం. చంద్రు డెవడు అని అడిగినవాని దృష్టిని ఇతర దిక్కులనుండి మళ్లించి చంద్రు డున్న దిక్కు వైపు ప్రసరింపచేయడంకొరకు ముందుగా తటస్థలక్షణం చెప్పబడింది. శాఖకు చంద్రునికీ సంబంధం లేకపోయినా ఉన్నట్లు ఆరోపణ చేయడం ద్వారా వాని దృష్టి కొమ్మకేసి ఉన్న ప్రకాశమానపదార్థాల వైపు మరల్చబడింది. తరవాత అక్కడనే ఉన్న ఇతరనక్షత్రాదులనుండి చంద్రుణ్ణి వేరుగా చూపడం కొరకు "ఎక్కువ ప్రకాశ ఉన్నవాడు చంద్రుడు" అని స్వరూపలక్షణం చెప్పబడింది. అప్పుడు చంద్రుడెవడో నిఃసందిగ్ధంగా తెలిసింది. అట్లే ఇక్కడ "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది శ్రుతివాక్యాలలో ఉన్న "బ్రహ్మ" శబ్దాన్ని వినగానే ఈ శబ్దానికి అనేకార్థా లుండడంవల్ల ఏ బ్రహ్మ అని ముముక్షువుకు సందేహం కలుగుతుంది. అప్పుడు ముందుగా "జగత్కారణ మైనది బ్రహ్మ" అని చెప్పగానే జీవాదులు బ్రహ్మ కాదు అని అర్థం అవుతుంది. ఇది (జగజ్జన్మాదికారణత్వం) బ్రహ్మకు తటస్థలక్షణం. అయితే ఈ లక్షణం ప్రధానాదులకు కూడా వర్తిస్తుందా అని భ్రాంతి ఇంకా ఉండవచ్చు. దానిని తొలగించడానికి బ్రహ్మానందవల్లిలోనే ఉన్న "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇత్యాది స్వరూపలక్షణం సూత్రకారునిచేత సూచించబడింది. ఈ విధంగా బ్రహ్మయొక్క తటస్థలక్షణం వాచ్యంగాను, స్వరూపలక్షణం సూచ్యంగాను ఈ సూత్రంలో చెప్పబడ్డాయి.2.

పంచమవర్ణకం సమాప్తం

జన్మాద్యధికరణం సమాప్తం

## 3. శాస్త్రయోనిత్వాధికరణమ్. సూ. 3

### భాష్యమ్

జగత్కారణత్వప్రదర్శనేన సర్వజ్ఞం బ్రహ్మేత్యుపక్షిప్తమ్. తదేవ ద్రఢయన్నాహ:-

### సూ. శాస్త్రయోనిత్వాత్ 1.1.3.

### భాష్యమ్

మహత ఋగ్వేదాదేః శాస్త్రస్యానేకవిద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్సర్వార్థావద్యోతినః సర్వజ్ఞకల్పస్య యోనిః కారణం బ్రహ్మ. న హీదృశస్య శాస్త్రస్యర్గ్వేదాదిలక్షణస్య సర్వజ్ఞగుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోఽస్తి. యద్యద్విస్తరార్థం శాస్త్రం యస్మాత్పురుషవిశేషాత్సంభవతి, యథా వ్యాకరణాది పాణిన్యాదేః జ్ఞేయైకదేశార్థమపి, స తతోఽప్యధికతరవిజ్ఞాన ఇతి ప్రసిద్ధం లోకే; కిము వక్తవ్యమనేకశాఖాభేదభిన్నస్య దేవతిర్యఙ్మనుష్య వర్ణాశ్రమాదిప్రవిభాగహేతోః ఋగ్వేదాద్యాఖ్యస్య సర్వజ్ఞానాకరస్యా ప్రయత్నేనైవ లీలాన్యాయేన పురుషనిఃశ్వాసవద్యస్మాన్మహతో భూతయోనేః సంభవః "అస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతద్యదృగ్వేదః" (బృ.ఉ.2.4.10) ఇత్యాదిశ్రుతేః, తస్య మహతో భూతస్య నిరతిశయం సర్వజ్ఞత్వం సర్వశక్తిమత్త్వం చేతి.

### బాలానందిని

బ్రహ్మ జగత్తుకు కారణమైనది అని చెప్పడం ద్వారా బ్రహ్మ సర్వజ్ఞము అని చెప్పబడినది. అనగా చతుర్దశభువనాత్మక మైన ఈ జగత్తుకు కారణం అని చెప్పబడింది. ఒక కార్యాన్ని సృజించినవాడు ఆ కార్యానికి సంబంధించిన అన్ని విషయాలు తెలిసిన వాడయి ఉండాలి. అందుచేత చతుర్దశభువనాలలో బ్రహ్మకి తెలియని దేదీ లేదని చెప్పినట్లయినది. ఈ విధంగా బ్రహ్మ సర్వజ్ఞము అని పూర్వసూత్రములో సూచించిన విషయమునే దృఢపరచడానికై "శాస్త్రయోనిత్వాత్" అని మూడవ సూత్రం చెప్పబడినది. "శాస్త్రస్య యోనిః శాస్త్రయోనిః, శాస్త్రయోనేః భావః శాస్త్రయోనిత్వమ్" అని విగ్రహవాక్యము. శాస్త్రానికి కారణం అవడంచేత బ్రహ్మ సర్వజ్ఞం అని సూత్రానికి అర్థం.

అధికరణరచన:- పై సూత్రంలో చెప్పిన జగజ్జన్మాదిహేతుత్వంచేత సూచించబడిన సర్వజ్ఞత్వాన్నే ఈ శాస్త్రయోనిత్వం సమర్థిస్తున్నది గాన ఈ రెండు

అధికరణాలకీ ఒకే విషయం ఉండడం అనే అవాంతరసంగతి. లేదా బ్రహ్మ జగజ్జన్మాదిహేతు వని చెప్పడం కుదరదు; వేదం నిత్యం గాన దీని జన్మాదులకు బ్రహ్మ హేతువు కాదు కదా అని ఆక్షేపించుకొని వేదహేతుత్వం చెప్పబడుచున్నది. అందుచేత ఆక్షేపసంగతి. "అస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాఙ్గిరసః" (బృ.ఉ.2.4.10) అనే వాక్యం విషయవాక్యం. వేదానికి కూడా బ్రహ్మ కారణం గాన బ్రహ్మ సర్వజ్ఞం అని ఈ వాక్యం సాధిస్తున్నదా లేదా అని సంశయం. వ్యాకరణాదుల వలె వేదం కూడా బ్రహ్మనిర్మితమై పౌరుషేయ మైతే వేదానికి అప్రామాణ్యం వస్తుంది; అందుచేత ఈ వాక్యం బ్రహ్మ వేదకారణ మనీ, సర్వజ్ఞ మనీ సాధించదు అని పూర్వపక్షం. పూర్వపక్షానికి జగద్ధేతువు చేతనం అని సాధించడానికి వీలుకాకపోవడం ఫలం. అనగా వేదార్థజ్ఞానపూర్వకంగా వేదాన్ని బ్రహ్మ నిట్టూర్పు వలె కల్పాదియందు సృష్టించినది అని చెప్పిన పక్షంలో బ్రహ్మ చేతనం, సర్వజ్ఞం అని చెప్పవచ్చు. అలా సృజించలేదని చెప్పినపుడు బ్రహ్మకు (జగద్ధేతువునకు) చేతనత్వం సాధించడం కుదరదు అని అర్థం. సిద్ధాంతంలో (వేదకారణం బ్రహ్మ అని చెప్పిన పక్షంలో) బ్రహ్మకు చేతనత్వసర్వజ్ఞత్వాల సిద్ధి ప్రయోజనం. స్పష్టలింగమైన ఈ ఉపనిషద్వాక్యానికి వేదకర్తయైన పరమేశ్వరునియందు సమన్వయం చెప్పడంచేత శ్రుతిసూత్రాలకు సంగతి, శాస్త్రసంగతి, సమన్వయాధ్యాయసంగతి, స్పష్టబ్రహ్మలింగత్వ సంగతి కుదిరినవి. "అస్య మహతో భూతస్య" ఇత్యాది శ్రుతివాక్యము, ఈ సూత్రము ఒకే అర్థాన్ని బోధిస్తున్నాయి. అది శ్రుతి (సూత్ర) సంగతి. ఈ సూత్రము ప్రథమపాదము కూడ స్పష్టబ్రహ్మలింగ మైన శ్రుతియొక్క అర్థాన్ని చెపుతున్నాయి. అందుచేత ఈ రెండింటికీ స్పష్టబ్రహ్మలింగప్రతిపాదకత్వసంగతి. ఈ సూత్రము, శాస్త్రమూ కూడా వేదకర్తృరూపమైన ఒకే అర్థాన్ని బోధిస్తున్నాయి. అందుచేత వీటికి ఏకార్థప్రతిపాదకత్వ రూపసంగతి. ఈ సూత్రం సమన్వయాన్ని బోధిస్తున్నది. మొత్తం అధ్యాయం సమన్వయాధ్యాయం. అందుచేత ఆ రెంటికీ సమన్వయసంగతి. ఈ విధంగా అన్ని అధికరణాలలోను శ్రుతి-శాస్త్ర-అధ్యాయ-పాదసంగతులు చూచుకోవాలి.

మహత ఇతి:- శిక్షా-వ్యాకరణ-చ్ఛందో-నిరుక్త-జ్యోతిష-కల్పా లనే ఆరు అంగాలు, పురాణ- న్యాయ- మీమాంసా - ధర్మశాస్త్రాలు, అనే వేదార్థజ్ఞానానికి ఉపయోగించే మొత్తం పది విద్యాస్థానాలచేత పరిపుష్టమై, దీపం వలె అనేక విషయాలను ప్రకాశింపచేసేది, సర్వజ్ఞుని వంటిది అయిన గొప్ప ఋగ్వేదాదిశాస్త్రానికి బ్రహ్మ కారణం. ఋగ్వేదాదిరూపమైన, సర్వజ్ఞునికి ఉండవలసిన గుణాలతో కూడిన

ఇలాంటి శాస్త్రం సర్వజ్ఞుడు తప్ప మరెవ్వరినుండీ జనించడం అసంభావ్యం. తెలియదగిన అనేక విషయాలలో ఒక అంశాన్ని మాత్రమే (శబ్దసాధుత్వాన్ని మాత్రమే) బోధించు వ్యాకరణాదికం పాణిన్యాదులనుండి బయల్వెడలినట్లు విస్తృతమైన అర్థం గల ఏ ఏ శాస్త్రం. ఏ ఒక పురుషునినుండి ఆవిర్భవిస్తుందో అతడు ఆ శాస్త్రంలో చెప్పిన దానికంటే అధికమైన విజ్ఞానం కలవాడు అని లోకంలో ప్రసిద్ధమే కదా? అలాంటప్పుడు అనేకశాఖాభేదాలచేత వేరు వేరుగా ఉన్నదీ, దేవతలు, తిర్యగ్జంతువులు, మనుష్యులు, వర్ణాశ్రమాదులు మొదలైన విభాగానికి కారణమూ అయిన, సకలజ్ఞానానికి నిధి యైన ఋగ్వేదం మొదలైనది "అస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతద్యదృగ్వేదః" (ఈ ఋగ్వేదాదికం ఈ పరమాత్మయొక్క నిట్టూర్పు) అని శ్రుతిలో చెప్పినట్లు, ఏ మహాభూతంనుండి (ఏ పరబ్రహ్మనుండి) అప్రయత్నంగా లీల వలె, పురుషుని నిః శ్వాసం వలె ఆవిర్భవించినదో అలాంటి పరబ్రహ్మయొక్క సర్వజ్ఞత్వమూ (అన్నీ తెలిసి ఉండుట), సర్వశక్తిమత్త్వమూ (ఏమైనా చేయకలిగి ఉండుట) అనేవాటికి మించిన మరొక సర్వజ్ఞత్వ- సర్వ శక్తిమత్త్వాదికము లేదని వేరుగా చెప్పాలా.

వి. వేదం నిత్యమైనది. ప్రలయాదులలో ఆ వేదం అంతర్హిత మైపోయినా కూడ పరమేశ్వరుడు కల్పప్రారంభంలో సృష్ట్యాదియందు దానిని యథాతథంగా చతుర్ముఖాదులకు అందజేస్తూంటాడు. ఈశ్వరుడు కూడా క్రొత్తగా వేదాలను రచించడు. పూర్వం ఉన్నవాటినే మళ్లీ ప్రవర్తింపచేస్తాడు. అందుచేతనే అవి అపౌరుషేయాలు. అనగా పురుషుడు ఎవడో ముందు ఒక అర్థం ఊహించి దానిని ఆవిష్కరించడం కోసం నిర్మించినవి కావు. ఈశ్వరుడు ఉన్న వేదాలనే అందిస్తున్నా అతని జ్ఞానానికి ప్రతిబంధకం ఏదీ లేదు గాన ఆ వేదాల అర్థం కూడా పూర్తిగా గ్రహిస్తూనే వాటిని అందిస్తాడు. వేదాలలో లేని విషయం అటూ ఏదీ లేదు గాన అవి సర్వజ్ఞసదృశాలు. వాటి అర్థాన్ని యథాతథంగా గ్రహించిన ఈశ్వరుడు కూడా సర్వజ్ఞు డని చెప్పవలసి ఉంది. అందుచేత సకలజగత్కారణభూతు డగుటచేతనే కాక వేదప్రవర్తకు డవడంచేత కూడా ఈశ్వరుడు సర్వజ్ఞు డని తెలుస్తూన్నది అని ఈ సూత్రం ప్రతిపాదిస్తూన్నది.

ఇది ఈ సూత్రానికి ప్రథమవర్ణకం. ప్రారంభం నుంచి షష్ఠవర్ణకం సమాప్తం.

అవతారిక: ఇంతవరకు "శాస్త్రస్య యోనిః శాస్త్రయోనిః; శాస్త్రయోనేః భావః శాస్త్రయోనిత్వమ్" అని ఈ సూత్రానికి అర్థం చెప్పి, ఇప్పుడు దీనికే "శాస్త్రం యోనిః యస్య సః శాస్త్రయోనిః; తస్య భావః శాస్త్రయోనిత్వమ్" అనగా శాస్త్రము కారణంగా కలది. శాస్త్రంచేత ప్రతిపాదించబడునది అని మరొక అర్థం చెపుతున్నారు. "జన్మాద్యస్య

యతః" అను సూత్రంచేత లక్షణం చెప్పబడింది. కాని బ్రహ్మ ఉన్న దని చెప్పడానికి ప్రమాణం ఏమిటి అనే ప్రశ్నకు సమాధానంగా ఈ సూత్రం చెప్పబడుతున్నది. ఈ విధంగా బ్రహ్మను గూర్చి నిర్ణయించటమే ఈ రెండు సూత్రాల ప్రయోజనం గాన ఈ రెండింటికీ ఏకఫలకత్వం అనే సంగతి. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ.ఉ.3.9.16) అనే శ్రుతి బ్రహ్మ వేదైకవేద్యం (వేదంచేత మాత్రమే తెలియదగినది) అని చెపుతున్నదా లేదా అని సంశయం. సిద్ధవస్తువును అనుమానాదుల ద్వారా తెలుసుకొనవచ్చును గాన వేదైకవేద్యత్వం శ్రుతి చెప్పడం లేదు అని పూర్వపక్షం. బ్రహ్మ వేదైకవేద్యమే అని సిద్ధాంతం. అనుమానాదులను విచారించాలి అని చెప్పడం పూర్వపక్షానికి ఫలం. శ్రుతివాక్యాలనే విచారించాలి అనేది సిద్ధాంతానికి ఫలం.

## భాష్యమ్

అథవా యథోక్తమృగ్వేదాది శాస్త్రం యోనిః కారణం ప్రమాణమస్య బ్రహ్మణో యథావత్స్వరూపాధిగమే. శాస్త్రాదేవ ప్రమాణాత్ జగతో జన్మాది కారణం బ్రహ్మాధిగమ్యత ఇత్యభిప్రాయః. శాస్త్రముదాహృతం పూర్వసూత్రే- "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది. కిమర్థం తర్హీదం సూత్రమ్? యావతా పూర్వసూత్ర ఏవైవంజాతీయకం శాస్త్రముదాహరతా శాస్త్రయోనిత్వం బ్రహ్మణో దర్శితమ్. ఉచ్యతే- తత్ర పూర్వసూత్రాక్షరేణ స్పష్టం శాస్త్రస్యానుపాదానాత్ జగతో జన్మాది కేవలమనుమానముపన్యస్తమిత్యాశఙ్క్యేత; తామాశఙ్కాం నివర్తయితుమిదం సూత్రం ప్రవవృతే - "శాస్త్రయోనిత్వాత్" ఇతి. 3.

## బాలానందిని

**అథవేతి:-** లేదా - బ్రహ్మయొక్క యథార్థస్వరూపం తెలుసుకొనడానికి పైన చెప్పిన (సర్వజ్ఞకల్పమైన) ఋగ్వేదాదిశాస్త్రమే యోని, అనగా కారణం, అనగా ప్రమాణం. జగజ్జన్మాదిహేతువైన బ్రహ్మ శాస్త్రంవల్లనే తెలియబడుచున్నది గాని మరొక ప్రమాణం చేత తెలియబడదు అని అభిప్రాయం. బ్రహ్మప్రతిపాదకప్రమాణమైన "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాదిశాస్త్రం పూర్వసూత్రంలో చూపబడింది. అయితే ఇలాంటి శాస్త్రాన్ని ఉదాహరించి పూర్వసూత్రమే బ్రహ్మ విషయంలో శాస్త్రమే ప్రమాణం అని ప్రతిపాదించి ఉన్నది కదా; ఇంక ఈ సూత్రం ఎందుకు? దీనికి సమాధానం ఏమనగా- పూర్వసూత్రంలో 'యతో వా' ఇత్యాదిశాస్త్రం ప్రత్యక్షంగా నిర్దేశింపబడలేదు. అందుచేత జన్మాదికం అనుమానానికి ఉపయుక్తంగా చెప్పబడింది, అనగా

జన్మస్థితిలయాలను బట్టి ఈశ్వరుణ్ణి ఊహించాలి అని ఆ సూత్రం చెపుతున్నది అనే ఆశంక కలగవచ్చును. తన్నివృత్తికై "శాస్త్రయోనిత్వాత్" అని ఈ సూత్రం చెప్పబడినది.

వి. బ్రహ్మను గూర్చి శాస్త్రం ద్వారా తెలుసుకోవాలి గాని అనుమానాదులచేత తెలుసుకొనడం శక్యం కాదు. అనుమానాన్ని పట్టి కార్యమైన ఈ జగత్తుకు కారణం ఏదో ఉండి ఉంటుంది అని మాత్రమే తెలుస్తుంది. కాని ఆ కారణం ఏకమా అనేకమా, దాని స్వరూపం ఏమిటి ఇత్యాదివిషయాలు తెలియా లంటే శాస్త్రం తప్ప మరొక ఆధారం ఏదీ లేదని చెప్పడం ఈ సూత్రానికి ప్రయోజనం.

ఇది సూత్రానికి ద్వితీయవర్ణకం.

ప్రారంభం నుంచి సప్తమవర్ణకం సమాప్తం.

శాస్త్రయోనిత్వాధికరణం సమాప్తం.

## 4. సమన్వయాధికరణమ్-సూ.4.

### భాష్యమ్

కథం పునర్బ్రహ్మణః శాస్త్రప్రమాణకత్వముచ్యతే? యావతా "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్" (జై.సూ.1.2.1) ఇతి క్రియాపరత్వం శాస్త్రస్య దర్శితమ్. అతః వేదాన్తానామానర్థక్యమ్; అక్రియార్థత్వాత్. కర్తృదేవతాదిప్రకాశనార్థత్వేన వా క్రియావిధిశేషత్వమ్, ఉపాసనాదిక్రియాన్తర విధానార్థత్వం వా; న హి పరినిష్ఠితవస్తుప్రతిపాదనం సంభవతి, ప్రత్యక్షాది విషయత్వాత్పరినిష్ఠితవస్తునః. తత్ప్రతిపాదనే చ హేయోపాదేయరహితే పురుషార్థాభావాత్. అత ఏవ "సోఽరోదీత్" ఇత్యేవమాదీనామానర్థక్యం మా భూదితి. "విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" (జై.సూ.1.2.7) ఇతి స్తావకత్వేనార్థవత్త్వముక్తమ్.

### బాలానందిని

అవ. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" ఇత్యాది వేదాంతవాక్యాలు, సిద్ధమైన (ఉన్న) బ్రహ్మను ప్రతిపాదిస్తున్నాయా, సాధ్యమైన (విధించదగిన, అంతకు ముందు లేని) కార్యాన్ని దేనినైనా బోధిస్తున్నాయా? సిద్ధబ్రహ్మను బోధించే పక్షంలో అది (అలా బోధించడం) నిష్ఫలం. ఉన్నదానిని ఉన్నది అని చెప్పడం ఎందుకు? సిద్ధమైనదానిని

గూర్చి శ్రుతి చెప్పవలసిన పని లేదు. ప్రత్యక్షాదులచేతనే తెలిసికొనవచ్చును కదా? అందుచేత వేదాంతాలు క్రొత్తగా సాధించవలసిన కార్యాన్ని బోధిస్తాయి అని చెప్పడమే యుక్తం. అప్పుడు అది సఫలం అవుతుంది. ప్రత్యక్షాదుల ద్వారా తెలియడానికి శక్యం కాదు గాన శ్రుతి ఆ విషయాన్ని చెప్పడం యుక్తంగా ఉంటుంది. అందుచేత "శాస్త్రయోనిత్వాత్" అనే సూత్రం ద్వితీయవర్ణకంలో చెప్పినట్లు బ్రహ్మ వేదాంత ప్రతిపాద్యం కాదు అని పూర్వపక్షం. వెనుకటి అధికరణంలో చెప్పిన విషయం ఆక్షేపించబడుతున్నది గాన ఆ అధికరణంతో ఈ అధికరణానికి ఆక్షేపసంగతి. సర్వాత్మత్వం మొదలైన బ్రహ్మలింగాలు స్పష్టంగా ఉన్న "సదేవ సోమ్య" ఇత్యాది వాక్యాలకు బ్రహ్మయందు సమన్వయం చెప్పబడుతున్నది గాన శ్రుతి-శాస్త్ర-అధ్యాయ-పాదాదిసంగతులు చూచుకొనవలెను. ముముక్షువులు వేదాంతాధ్యయనంలో ప్రవర్తించకపోవడం పూర్వపక్షానికి ఫలం; ప్రవర్తించడం సిద్ధాంతానికి ఫలం.

కథమితి:- (పూర్వపక్షం) బ్రహ్మ శాస్త్రం అనే ప్రమాణంచేత ప్రతిపాదించ బడుతుంది అని ఎట్లు చెప్పబడుతున్నది? ఎందువల్ల ననగా పూర్వమీమాంసాశాస్త్రంలో జైమిని "ఏదో ఒక కర్మను బోధించడమే వేదంయొక్క ప్రయోజనం గాన అలాంటి క్రియను దేనినీ బోధించని వేదభాగాలు వ్యర్థమైనవే" అని చెప్పి ఉన్నాడు. అందుచేత వేదాంతాలు ఏ కర్మనూ బోధించడం లేదు గాన అవి వ్యర్థములే. లేదా ఆ యా కర్మలను చేసే కర్తలను గాని, లేదా ఆ యా కర్మలకు సంబంధించిన దేవతలను గాని స్తుతించడం ద్వారా వేదాంతాలు కర్మలకు అంగంగా ఉపయోగిస్తాయని గాని, లేదా ఉపాసనలు మొదలైన కొన్ని క్రియలను విధిస్తాయని గాని చెపితే చెప్పవచ్చును. (అంతే కాని వేదాంతాలు స్వతంత్రంగా ఒక సిద్ధమైన బ్రహ్మ అనే పదార్థాన్ని బోధిస్తాయని చెప్పడం యుక్తం కాదు). పరినిష్ఠితమైన (సిద్ధమైన) వస్తువును ప్రతిపాదించడం అనేది కుదరదు. ఎందువల్లననగా సిద్ధమైన వస్తువును ప్రత్యక్షాదిప్రమాణాలచేతనే గ్రహించవచ్చును; (దానిని వేదాలు బోధించవలసిన పని లేదు). సిద్ధమైన వస్తువు హేయమూ కాదు (విడిచిపెట్టదగినదీ కాదు); ఉపాదేయమూ కాదు (గ్రహించవలసిందీ కాదు). అలాంటిదానిని ప్రతిపాదించడంవల్ల ఏమి పురుషార్థం (పురుషప్రయోజనం ఉంటుంది? (అనగా ఫలానా పని చేయ గూడదు, ఫలానా పని చెయ్యాలి అని బోధిస్తే నిషేధించిన దానిని చేయకపోవడంచేత, విధించినదానిని చేయడంచేత ప్రయోజనం ఉంటుంది గాని, 'చెట్టుమీద చిలక ఉంది', అని చెప్పినట్లు బ్రహ్మ ఉంది అని చెప్పినందువల్ల ఏం ప్రయోజనం ఉంటుంది అని అర్థం).

అత ఏవేతి:- అందువల్లనే 'సోఽరోదీత్' ఇత్యాదివాక్యాలు వ్యర్థం కాకూడదు అనే అభిప్రాయంతో జైమిని- "ఇలాంటి వాక్యాలు విధివాక్యాలతో ఏకవాక్యత్వాన్ని పొంది, అనగా ఆ వాక్యాలతో కలిసి, విధించబడిన కార్యాన్ని స్తుతించడం ద్వారా సార్థకము లౌతాయి" అని చెప్పి ఉన్నాడు.

వి. వేదం ఏదో ఒక కర్మను విధిస్తుంది గాని ఇతర ప్రమాణాలచేత తెలిసే సిద్ధమైన విషయాలను వేటినీ బోధించదు అని "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్" అనే వాక్యానికి అర్థం. "వాయవ్యం శ్వేతమాలభేత" అని ఒక విధివాక్యం ఉంది. "వాయువు అనే దేవతకొరకు ఒక తెల్లని పశువును ఇవ్వవలెను" అని దీని అర్థం. ఇది ఒక కర్మను బోధిస్తూన్నది గాన ప్రమాణమే. కాని దాని తరవాత "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" ఇత్యాదివాక్యం మరొకటి ఉన్నది. "వాయువు చాలా శీఘ్రగామియైన దేవత" అని దీని అర్థం. ఈ వాక్యం ఏ కర్మనూ విధించడం లేదు. వాయువు శీఘ్రగామి అనే ఒక విషయాన్ని మాత్రం చెపుతున్నది. అందుచేత ఏ కార్యాన్నీ విధించని ఈ వాక్యం అప్రమాణమేనా అని ఆశంకించుకొని దానికి సమాధానంగా "విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" అని సమాధానం చెప్పబడింది. ఈ వాక్యం వంటి వాక్యాలలో ఏ క్రియా విధించబడకపోయినా వీటిని ప్రక్కనున్న "వాయవ్యం శ్వేతమాలభేత" ఇత్యాది విధివాక్యాలతో అన్వయించుకొని "వాయువు శీఘ్రగామియైన దేవత గాన ఫలం శీఘ్రంగా ఇస్తాడు, అందుచేత శ్వేతపశువును ఆ వాయువుకు ఇవ్వడం మంచిది" అని అర్థం చెప్పుకోవాలి. దీనివల్ల ఈ వాక్యాలకు కూడా కొంత వరకు ప్రామాణ్యం లభిస్తుంది అని భావం. ఇలాంటి వాక్యాలకు అర్థవాదలు అని పేరు. కొన్ని అర్థవాదవాక్యాలు మరొక ప్రమాణం ద్వారా తెలిసిన విషయాన్నే తెలుపుతాయి. వాటికి అనువాదరూపార్థవాద లని పేరు. ఉదాహరణకి- "అగ్నిర్హి మస్య భేషజమ్" (చలికి అగ్ని మందు) అనే వాక్యం ప్రత్యక్షప్రమాణంచేత తెలిసిన విషయమే చెప్పుచున్నది గాన ఇది అనువాదం. అట్లే "ఆదిత్యో యూపః" అనే వాక్యం ప్రత్యక్షవిరుద్ధమైన "యూపస్తంభం సూర్యుడు" అనే అర్థాన్ని బోధిస్తూన్నది. ఇలాంటి వాక్యాలకు, అనువాదవాక్యాలకు కూడా విధివాక్యైకవాక్యత్వం ద్వారా కూడ ప్రామాణ్యం లేదు. "బర్హిషి రజతం న దేయమ్" (యజ్ఞంలో వెండి ఇవ్వకూడదు) అని ఒక విధివాక్యం ఉన్నది. దాని దగ్గరనే "సోఽ రోదీద్యదరోదీత్తద్రుద్రస్య రుద్రత్వం యదశ్రు అశీయత తద్రజతం హిరణ్యమభవత్తస్మాద్రజతం హిరణ్యమదక్షిణ్యమశ్రుజం హి యో బర్హిషి దదాతి పురాస్య సంవత్సరాద్ గృహే రుదన్తి" అనే వాక్యం ఉన్నది. "దేవతలచేత నిరోధించబడిన అగ్ని ఏడ్చాడు. అతని కన్నీళ్లు నేలమీద పడగా అక్కడ వెండి పుట్టింది. అందుచేత

యజ్ఞంలో వెండి దక్షిణగా ఇవ్వకూడదు. అలా చేస్తే ఏడాది తిరగకుండా వాళ్లింట్లో ఏడుస్తారు'' అని దీని అర్థం. ఈ వాక్యం క్రియను దేనినీ విధించకపోయినా ''యజ్ఞంలో వెండి ఇవ్వకూడదు'' అన్న నిషేధవాక్యానికి ఉపోద్బలకంగా చెప్పినట్లు గ్రహించి దీనికి ప్రామాణ్యం అంగీకరించాలి అని చెప్పబడింది. అందుచేత వేదాంతాలు క్రియను బోధించడం లేదు గాన, సిద్ధమైన బ్రహ్మను గూర్చి మాట్లాడుతున్నాయి గాన, వాటికి ప్రామాణ్యం లేదు. ఏదో విధంగా సమర్థించాలంటే అర్థవాదల వలె అవి విధివాక్యాలతో అన్వయించి తద్వారా క్రియను బోధిస్తున్నా యని చెప్పుకోవాలి అని పూర్వపక్షి అభిప్రాయం.

అవ: "ఇషే త్వా" ఇత్యాదిమంత్రాలలో క్రియ ఏమీ బోధించబడకపోయినా అవి స్వతంత్రంగా అర్థం బోధిస్తున్నాయి కదా? అట్లే వేదాంతాలు స్వతంత్రార్థబోధకాలు కావచ్చును కదా అని పూర్వపక్షియే ఆశంకించుకొని మంత్రాలు కూడా క్రియాసంబంధం చేతనే ప్రమాణములుగా అంగీకరించబడుతున్నాయి అని సమాధానం చెపుతున్నాడు.

## భాష్యమ్

మన్త్రాణాం చ "ఇషే త్వా" ఇత్యాదీనాం క్రియాతత్సాధనాభిధాయిత్వేన కర్మసమవాయిత్వముక్తమ్. అతో న క్వచిదపి వేదవాక్యానాం విధి సంస్పర్శమన్తరేణార్థవత్తా దృష్టా ఉపపన్నా వా. న చ పరినిష్ఠితే వస్తుని విధిః సంభవతి, క్రియావిషయత్వాద్విధేః. తస్మాత్కర్మాపేక్షిత కర్తృ స్వరూప దేవతాది ప్రకాశనేన క్రియావిధిశేషత్వం వేదాన్తానామ్. అథ ప్రకరణాన్తరభయాన్నై తదభ్యుపగమ్యతే, తథాపి స్వవాక్యగతోపాసనాదికర్మపరత్వమ్. తస్మాన్న బ్రహ్మణః శాస్త్రయోనిత్వమితి ప్రాప్తే ఉచ్యతే.

## సూ. తత్తు సమన్వయాత్. 1.1.4.

## బాలానందిని

మన్త్రాణాం చేతి:- ''ఇషేత్వా'' మొదలైన మంత్రాలు కూడా క్రియలను, వాటిని చేయడానికి ఉపకరించే సాధనాలను బోధించడం ద్వారా కర్మలతో సంబంధించి ఉంటాయి, అనగా కర్మలకు సంబంధించిన అర్థాన్నే బోధిస్తాయి అని పూర్వమీమాంసా శాస్త్రంలో చెప్పబడింది. అనగా మంత్రములను పఠిస్తూ వాటి అర్థం కూడా తెలిసికొని దానిచేత సూచింపబడిన కర్మను ఆచరించడంలో వాటిని వినియోగించాలని నిర్ణయింపబడింది గాన మంత్రాలు కూడా క్రియాసంబద్ధములే అని భావం. అతో న

క్వచిదితి. ఈ విధంగా వేదవాక్యాలు ఎక్కడా కూడ విధితో, అనగా కర్మవిధానంతో, సంబంధం లేకుండా సార్థకములై నట్లు కనబడడం లేదు, అది యుక్తం కూడా కాదు. విధి అనేది సిద్ధమైన వస్తువు విషయంలో కుదరదు. ఎందువల్ల ననగా విధి అనేది ఎల్లప్పుడు కొత్తగా చేయవలసిన పనితోనే సంబంధించి ఉంటుంది. అందుచేత వేదాంతా లన్నింటికీ ఆ యా క్రియలచేత అపేక్షింపబడిన (ఆ యా క్రియలు చేయవలసి ఉన్న) కర్తల స్వరూపాన్ని గాని లేదా ఆ యా క్రియలకు సంబంధించిన ఆ యా దేవతల స్వరూపాన్ని గాని బోధించడం ద్వారా మాత్రమే ప్రయోజనం ఉంటుంది అని చెప్పాలి.

అవ. ఏదైనా ఒక కర్మను గూర్చి చెప్పడం ప్రారంభించి అక్కడ సిద్ధవస్తువును నిర్దేశించినపుడు ఆ సిద్ధవస్తువు ఆ కర్మవిశేషానికి అంగంగా చెప్పబడింది అని చెప్పవచ్చును గాని కర్మకాండతో సంబంధం లేని బ్రహ్మకాండలో చెప్పబడిన బ్రహ్మ కర్మకాండోక్తక్రియాన్వయి ఎట్లవుతుంది అని ఆశంకించుకొని మరొక పద్ధతి సూచించుచున్నాడు అథ ప్రకరణాన్తరేతి:- అట్లు కాక ఇది మరొక క్రొత్త ప్రకరణం కదా; కర్మకాండోక్తకర్త్రాదులతో దీనిలో చెప్పినవాటికి సంబంధం కుదరదు అనే భయంచేత ఈ పక్షం అంగీకరించకపోతే ఆ వేదాంతవాక్యాలలోనే చెప్పిన కొన్ని ఉపాసనలు మొదలైన కర్మలకే ప్రాధాన్యం అని చెప్పవచ్చును. అందుచేత వేదాంతాలు బ్రహ్మను ప్రతిపాదిస్తున్నాయి అని చెప్పడం అయుక్తం గాన బ్రహ్మ శాస్త్రయోని అనడం అయుక్తం అని (భాట్టమీమాంసకాదుల) మతాన్ని అనుసరించి ఆక్షేపణ చేయగా దానికి సమాధానంగా "తత్తు సమన్వయాత్" అని చెప్పబడుచున్నది.

## భాష్యమ్

తుశబ్దః పూర్వపక్షవ్యావృత్త్యర్థః. తద్ బ్రహ్మ సర్వజ్ఞం సర్వశక్తి జగదుత్పత్తిస్థితిలయకారణం వేదాన్తశాస్త్రాదేవావగమ్యతే. కథమ్. సమన్వయాత్. సర్వేషు హి వేదాన్తేషు వాక్యాని తాత్పర్యేణైతస్యార్థస్య ప్రతిపాదకత్వేన సమనుగతాని-''సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్'', "ఏకమేవాద్వితీయమ్" (ఛా.ఉ.6.2.1) "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" (ఐ.ఉ.2.1.1.1), "తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమ్" "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" (బృ.ఉ.2.5.19) "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" (ము.ఉ.2.2.11) ఇత్యాదిని. న చ తద్గతానాం పదానాం

బ్రహ్మస్వరూపవిషయే నిశ్చితే సమన్వయేఽ వగమ్యమానేఽ ర్థాన్తరకల్పనా యుక్తా; శ్రుతహాన్యశ్రుతకల్పనాప్రసఙ్గాత్. న చ తేషాం కర్తృస్వరూప ప్రతిపాదనపరతాఽవసీయతే, ''తత్కేన కం పశ్యేత్'' (బృ.ఉ.2.4.13) ఇత్యాదిక్రియాకారకఫలనిరాకరణశ్రుతేః. న చ పరినిష్ఠితవస్తుస్వరూపత్వేఽపి ప్రత్యక్షాదివిషయత్వం బ్రహ్మణః ''తత్త్వమసి'' (ఛా.ఉ.6.8.7) ఇతి బ్రహ్మాత్మభావస్య శాస్త్రమన్తరేణానవగమ్యమానత్వాత్. యత్తు హేయోపాదేయ రహితత్వాదుపదేశానర్థక్యమితి; నైష దోషః. హేయోపాదేయశూన్య బ్రహ్మాత్మతావగమాదేవ సర్వక్లేశప్రహాణాత్ పురుషార్థసిద్ధేః.

బాలానందిని

'తు' శబ్దం పూర్వపక్షాన్ని నిరాకరిస్తున్నది. అనగా పూర్వపక్షం యుక్తం కా దని అర్థం. తత్=సర్వజ్ఞము, సర్వశక్తము, జగదుత్పత్తిస్థితిలయాలకు కారణమూ అయిన ఆ బ్రహ్మ, వేదాన్తశాస్త్రంవల్లనే తెలియబడుచున్నది. ఎట్లు? సమన్వయంవలన. అన్ని వేదాన్తాల (ఉపనిషత్తుల)లోని వాక్యాలు కూడా తాత్పర్యంచేత, అనగా దానినే బోధించాలనే దృఢనిశ్చయంతో, అలాంటి బ్రహ్మ అనే అర్థాన్నే ప్రతిపాదించడానికి చక్కగా అనుగతాలై, పరస్పరం సమన్వయం గలవై ఉన్నాయి. ఆ వాక్యా లేవనగా ''సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్'' (ఓ సౌమ్యుడా! సృష్టికి పూర్వం కేవలం సద్రూపమైన బ్రహ్మ మాత్రమే ఉండేది) '''ఏకమేవాద్వితీయమ్'' (ఆ బ్రహ్మ ఒక్కటే, దానితో పాటు రెండవది ఏదీ లేదు), ''ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్'' (సృష్టి ప్రారంభంలో ఆత్మ ఒక్కటే ఉండేది); "తదేతద్ బ్రహ్మాపూర్వమనపరమనన్తరమబాహ్యమ్" (మాయలచేత బహురూపమైన బ్రహ్మ ప్రత్యక్షమైనది; దీనికి కారణం ఏదీ లేదు; కార్యం ఏదీ లేదు; విజాతీయమైనది ఏదీ లేదు; ద్వితీయవస్తువు ఏదీ లేదు) "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" (ఈ ఆత్మయే బ్రహ్మ సర్వమునూ అనుభవించేది (తెలుసుకొనేది) అనగా చిద్రూపమైనది). "బ్రహ్మై వేదమమృతం పురస్తాత్" (తూర్పు దిక్కున ఉన్న దేనిని అవిద్వాంసులు బ్రహ్మ కాదని అనుకొంటున్నారో అది విద్వాంసులకు నిత్యమైన బ్రహ్మయే) ఇత్యాదులు.

వి. పైన ఉదహరించిన వాక్యాలలో సదేవ ఇత్యాదికం సామవేదంలోనిది. ''ఆత్మా వా'' ఇత్యాదివాక్యం ఋగ్వేదంలోనిది. 'తదేతత్' ఇత్యాదికం యజుర్వేదం లోనిది. 'బ్రహ్మైవేదమ్' ఇత్యాదికం అథర్వవేదంలోనిది.

ఏదైన ఒక ఘట్టంలో ప్రధానంగా చెప్పదలచిన విషయం ఏదో తెలుసుకొనడానికి శాస్త్రకారులు ఆరు లింగాలు (గుర్తులు) చెప్పారు:-

"ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలమ్,
అర్థవాదోపపత్తీ చ లిఙ్గం తాత్పర్యనిర్ణయే."

ఆ ఘట్టం ప్రారంభంలో ఏ విషయం చెప్పబడిందో, చివర కూడా ఏ విషయాన్ని చెప్పి ఉపసంహారం (ముగింపు) చేయబడిందో అది ప్రధానమైనది. దాన్ని చెప్పడానికే ఆ ఘట్టంయొక్క తాత్పర్యం అని నిర్ణయించాలి. ఈ ఉపక్రమోపసంహారాలు రెండూ కలిసి ఒక లింగం. అభ్యాసం అనగా అదే విషయాన్ని పలుమార్లు చెప్పడం. 'అపూర్వతా' అనగా ఆ విషయం క్రొత్తదిగా ఉండడం. దానికి ప్రయోజనం 'ఫలం'. దానిని ప్రశంసిస్తూ కొన్ని మాటలు చెప్పడం 'అర్థవాదం'. అది యుక్తిసంగతంగా ఉండడం "ఉపపత్తి". ఈ ఆరు లింగాలూ లేదా కొన్ని లింగాలు తాత్పర్యనిర్ణయానికి ఉపయోగిస్తాయి.

ఛాందోగ్యోపనిషత్తులోని షష్ఠాధ్యాయంలో ఉద్దాలకుడు తన పుత్రునితో "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అని బ్రహ్మస్వరూపాన్ని గూర్చి చెప్పడం ప్రారంభించాడు. ఇది ఉపక్రమం. ఈ విధంగా అద్వితీయమైన బ్రహ్మను ఉపక్రమించి "ఐతదాత్మ్యమిదం సర్వమ్" (ఇదంతా బ్రహ్మస్వరూపమే) అని అద్వితీయబ్రహ్మతోనే ఉపసంహారం చేశాడు. (1) ఇవి ఉపక్రమోపసంహారాలు, (2) "తత్త్వమసి" (ఆ పరబ్రహ్మ నీవే అని తొమ్మిది పర్యాయాలు చెప్పాడు. ఇది అభ్యాసం (3) రూపాదులు లేని బ్రహ్మను గూర్చి ఇతరప్రమాణా లేవీ తెలుపజాలవు. అందుచేత ఇది ఇక్కడ చెప్పబడిన బ్రహ్మ యొక్క 'అపూర్వత' (4) అత్ర వావ కిల సత్సోమ్య న నిభాలయసే" (ఓ సౌమ్యుడా! ఈ సముదాయంలో కలిసిపోయిన బ్రహ్మను నీవు చూడలేకున్నావు). "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" (ఈ దేహం రాలిపోవడమే ఆలస్యం; ఈ శరీరం రాలిపోయిందా ఇంక విద్వాంసుడు విదేహకైవల్యం పొందుతాడు) అని బ్రహ్మజ్ఞానానికి ముక్తి ఫలంగా చెప్పబడింది. ఇది 'ఫలం' (5) "అనేన జీవేనాత్మనా అనుప్రవిశ్య" (ఈ జీవస్వరూపంతో తాను సృష్టించిన జగత్తులో ప్రవేశించి) అని అద్వితీయ బ్రహ్మతత్త్వజ్ఞానం ప్రశస్తమైనదని సూచించడం కోసం కథ చెప్పబడింది. ఇది అర్థవాద. (6) మృత్ మొదలైన దృష్టాంతాలు చూపి కార్యం కారణం కంటె వేరుగా లేదు అనే విషయం సయుక్తికంగా ప్రతిపాదింపబడింది. ఇది 'ఉపపత్తి'. ఐతరేయకోపనిషత్తులో "ఆత్మా వా ఇదమేకమేవ" అని ఉపక్రమించి మధ్యలో "స ఏతమేవ పురుషం బ్రహ్మ

తతమపశ్యత్" అనీ, "తమేవాత్మానమ్" అనీ అభ్యాసం చేసి "ప్రజ్ఞానం బ్రహ్మ" అని ఉపసంహారం చేయబడింది. వాజసనేయకంలో "అహం బ్రహ్మాస్మి" అని ఉపక్రమించి "అయమాత్మా బ్రహ్మ" అని ఉపసంహారం చేయబడింది. ఆథర్వణంలో కూడ "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ఓ! పూజ్యుడా! దేనిని తెలుసుకుంటే అన్నీ తెలుస్తాయి) అని సర్వాత్మకమైన బ్రహ్మను ఉపక్రమించి "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్' ' అని ఆ బ్రహ్మతోనే ఉపసంహారం చేయబడింది. ఈ విధంగా ఉపక్రమాదిలింగాల సాహాయ్యంచేత ఉపనిషత్తు లన్నింటికీ బ్రహ్మయందే తాత్పర్యం అని స్పష్టం అవుతున్నది.

భాష్యోదాహృతమైన "ఏకమేవాద్వితీయమ్" అనే ఉపనిషద్వాక్యం బ్రహ్మ సజాతీయవిజాతీయస్వగతభేదరహితము అని బోధిస్తున్నది. ఒక చెట్టు ఉన్నది. దానికి మరొక చెట్టు సజాతీయం, ఒకే జాతికి చెందినది. ఈ చెట్టు ఆ చెట్టుకంటే భిన్నమైనది. ఇది సజాతీయభేదం. ఈ చెట్టు ప్రక్కనే ఉన్న కొండకంటే భిన్నమైనది. కొండ దీనికి విజాతీయం. ఈ భేదం విజాతీయభేదం. చెట్టులో కొన్ని కొమ్మ లున్నాయి. ఈ కొమ్మ వేరు ఆ కొమ్మ వేరు. అయితే అన్ని కొమ్మలు కలిస్తే ఒకటే చెట్టు. ఈ విధంగా కొమ్మల భేదాన్ని పట్టి కనబడే భేదం స్వగతభేదం. పై వాక్యంలో ఏకమ్ అనే పదం బ్రహ్మలో సజాతీయభేదం లేదు; అది ఒక్కటే అని బోధిస్తున్నది. ఏవ అనే పదం విజాతీయభేదం లేదనీ, అద్వితీయమ్ అనే పదం స్వగతభేదం లేదనీ బోధిస్తున్నది.

నచేతి:- పైన ఉదాహరించిన శ్రుతివాక్యాలలోని పదాలు బ్రహ్మస్వరూపాన్నే ప్రతిపాదిస్తున్నాయి. అని నిశ్చితంగా తెలుస్తూన్నప్పుడు వాటికి మరొక అర్థం కల్పించడం యుక్తం కాదు కదా? అలా చేస్తే శ్రుతహాని, అశ్రుతకల్పన అనే దోషాలు వచ్చిపడతాయి. (శ్రుతహాని అనగా స్పష్టంగా కనబడుతున్న అర్థాన్ని విడిచిపెట్టడం, అశ్రుతకల్పన అనగా లేని అర్థాన్ని సృష్టించడం).

న చ తేషామితి:- "తత్కేన కం పశ్యేత్" (అంతా బ్రహ్మమే అయినప్పుడు దేనిని దేనితో చూస్తాడు) ఇత్యాది శ్రుతివాక్యాలు బ్రహ్మ విషయంలో ఏ విధమైన క్రియగాని, కరణం మొదలైన కారకాలు గాని, ఫలం గాని ఉండవు అని చెప్పుచున్నాయి. గాన ఉపనిషద్గతాలైన పదాలు కర్తయొక్క స్వరూపాన్ని ప్రతిపాదిస్తాయి అని నిశ్చయించడం కుదరదు. బ్రహ్మ సిద్ధమైన వస్తువుయొక్క స్వరూపం అయినంతమాత్రాన (సిద్ధవస్తు వైనంతమాత్రాన) దానిని ప్రత్యక్షాదిప్రమాణాలచేత గ్రహించడం కూడా శక్యం కాదు.

ఎందువల్ల ననగా తత్త్వమసి అనే శాస్త్రంచేత తప్ప మరొక ఏ సాధనం చేతా బ్రహ్మాత్మ భావం (జీవబ్రహ్మైక్యం) తెలియబడదు కదా? సిద్ధమైన వస్తువును ఉపదేశించిన పక్షాన అది హేయం కాని, ఉపాదేయం కాని, కాదు గాన అట్టిదాని ఉపదేశం వ్యర్థం అని వెనుక చెప్పిన దోషం లేదు. ఎందువల్లననగా హేయత్వంగాని ఉపాదేయత్వంగాని లేని బ్రహ్మయే ఆత్మ (జీవుడు హేయోపాదేయభిన్నబ్రహ్మస్వరూపుడు) అని గ్రహించడంవల్లనే సర్వక్లేశములు నశించి మోక్షరూపమైన పరమపురుషార్థం సిద్ధిస్తుంది. అలాంటప్పుడు అట్టి బ్రహ్మను బోధించడం నిష్ఫలం ఎలా అవుతుంది అని భావం.

## భాష్యం

దేవతాదిప్రతిపాదనస్య తు స్వవాక్యగతోపాసనార్థత్వేఽపి న కశ్చిద్విరోధః. న తు తథా బ్రహ్మణ ఉపాసనావిధిశేషత్వం సంభవతి, ఏకత్వే హేయోపాదేయశూన్యతయా క్రియాకారకాదిద్వైతవిజ్ఞానోపమర్దోపపత్తేః. న హ్యేకత్వవిజ్ఞానేనోన్మథితస్య ద్వైతవిజ్ఞానస్య పునః సంభవోఽస్తి యేనోపాసనా విధిశేషత్వం బ్రహ్మణః ప్రతిపాద్యేత. యద్యప్యన్యత్ర వేదవాక్యానాం విధి సంస్పర్శమన్తరేణ ప్రమాణత్వం న దృష్టం, తథాప్యాత్మవిజ్ఞానస్య ఫలపర్యన్తత్వాత్ న తద్విషయస్య శాస్త్రస్య ప్రామాణ్యం శక్యం ప్రత్యాఖ్యాతుమ్. న చానుమానగమ్యం శాస్త్రప్రామాణ్యం, యేనాన్యత్ర దృష్టం నిదర్శనమపేక్షేత. తస్మాత్సిద్ధం బ్రహ్మణః శాస్త్రప్రమాణకత్వమ్.

## బాలానందిని

అవ. వేదాంతవాక్యాలు అక్కడక్కడ చెప్పిన దేవతల ఉపాసనను ప్రతిపాదించేవి కావచ్చును కదా అని పూర్వపక్షి చెప్పినదానికి సమాధానం చెపుతున్నారు:- దేవతాదీతి. ఉపనిషత్తులలో ఉన్న ప్రాణపంచాగ్నివిద్యాదిఘట్టాలలో చేసిన దేవతల నిర్దేశం ఆ వాక్యాలలో ఉన్న ఉపాసనల కోసం చేయబడింది అంటే అది మాకు కూడా అంగీకార్యమే. ఆ దేవతల వలె బ్రహ్మ కూడా ఉపాసనావిధికి అంగమే అని చెప్పడం మాత్రం కుదరదు. అద్వితీయమైన బ్రహ్మ అని తెలిసిన తరువాత క్రియా - కర్త - కర్మ - కరణాదికారకాలు ఈ మొదలైన ద్వైతజ్ఞానమే మర్దించబడిపోతుంది కదా. అద్వైతబ్రహ్మజ్ఞానంచేత నశింపచేయబడిన ద్వైతజ్ఞానం (నేను కర్తను, ఈ సాధనంతో ఈ కర్మ చెయ్యాలి ఇత్యాది విధమైన భేదజ్ఞానం) మళ్ళీ పుట్టదు కదా? (ఏకత్వజ్ఞానం కలిగిన తరవాత కూడా ద్వైతజ్ఞానం ఉంటుంది అని చెప్పడానికి వీలుంటే బ్రహ్మ

ఉపాసనావిధికి అంగం అని చెప్పడానికి వీలుండేది. అలాంటి ద్వైతజ్ఞానం పునరుత్పన్నం అయ్యే ప్రసక్తి లేదని భావం. (ఉపనిషత్తులు కాక) ఇతరభాగాలలో వేదవాక్యాలకు విధిసంస్పర్శ లేకుండా ప్రమాణత్వం కనబడకపోయినా ఆత్మవిజ్ఞానబోధకమైన వేదాంతశాస్త్రానికి కూడా విధి సంస్పర్శ లేనిదే ప్రామాణ్యం ఉండదు అని చెప్పడానికి వీలులేదు. ఎందువల్ల ననగా ఆత్మవిజ్ఞానం ఫలపర్యంతమైనది. అనగా అద్వితీయాత్మజ్ఞానం కలిగిందా తప్పక మోక్షరూపమైన ఫలం కలుగుతుంది. ఇంక క్రియలకు ప్రసక్తి ఏది?

శాస్త్రప్రామాణ్యం అనుమానగమ్యం కాదు; అలా అయినపక్షంలో మరొక చోట కనబడే నిదర్శనాన్ని అపేక్షించి ఉండేది. (అనగా ఒక శాస్త్రానికి ఉన్న ప్రామాణ్యాన్ని అక్కడ ఉన్న పరిస్థితిని పట్టి తదనుగుణంగా నిర్ణయించాలి గాని మరొక శాస్త్రాన్ని ఉదాహరణంగా చూపి అక్కడ ఆ శాస్త్రం ఆ పద్ధతిలో ప్రమాణంగా గ్రహించబడింది కాబట్టి ఈ శాస్త్రానికి ప్రామాణ్యం చెప్పాలంటే అలాంటి పద్ధతి ఇక్కడ కూడా ఉంటేనే కుదురుతుంది అని అనుమానప్రయోగంచేత సాధించినట్లు చెప్పకూడదు అని భావం. అందుచేత బ్రహ్మ శాస్త్రప్రమాణకము, వేదాంతశాస్త్రంచేత బ్రహ్మ ప్రతిపాదించబడుతుంది అనే విషయం నిఃసందిగ్ధంగా నిశ్చితమైనది.

## భాష్యమ్

అత్రాపరే ప్రత్యవతిష్ఠన్తే - యద్యపి శాస్త్రప్రమాణకం బ్రహ్మ తథాపి ప్రతిపత్తివిధివిషయతయైవ శాస్త్రేణ బ్రహ్మ సమర్ప్యతే. యథా యూపాహవనీయాదీన్యలౌకికాన్యపి విధిశేషతయా శాస్త్రేణ సమర్ప్యన్తే తద్వత్. కుత ఏతత్? ప్రవృత్తినివృత్తిప్రయోజనత్వాచ్ఛాస్త్రస్య. తథాహి 88. శాస్త్రతాత్పర్యవిద ఆహుః :- "దృష్టో హి తస్యార్థః కర్మావబోధనమ్". "చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వచనమ్" ఇతి. "తస్య జ్ఞానముపదేశః" (జై.సూ.1.1.5) "తద్భూతానాం క్రియార్థేన సమామ్నాయః" (జై.సూ.1.1.25) "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్" (జై.సూ.1.2.1) ఇతి చ. అతః పురుషం క్వచిద్విషయవిశేషే ప్రవర్తయత్ కుతశ్చిద్విషయవిశేషాన్నివర్తయచ్చ అర్థవచ్ఛాస్త్రమ్, తచ్ఛేషతయా చాన్యదుపయుక్తమ్. తత్సామాన్యాద్వేదాన్తానామపి తథైవార్థవత్త్వమ్. సతి చ విధిపరత్వే యథా స్వర్గాదికామస్యాగ్నిహోత్రాది సాధనం విధీయతే ఏవమమృతత్వకామస్య బ్రహ్మజ్ఞానం విధీయతే ఇతి యుక్తమ్.

## బాలానందిని

అవ. పదాలు సిద్ధమైన అర్థాన్ని కూడా బోధిస్తాయి అని అంగీకరించిన కొందరు వేదాంతాలు బ్రహ్మను బోధించవు; ఆ యా కర్మలు చేసే పురుషులను ప్రశంసించడం కాని, లేదా ఆ యా ఉపాసనలకు అంగాలుగా ఆ యా దేవతలను బోధించడం కాని అవి చేస్తాయి అని అంటారు. అలాంటివాళ్ళ పూర్వపక్షాన్ని ఖండిస్తూ బ్రహ్మ ఇతర ప్రమాణాలు వేటిచేతా బోధించబడదు గాన వేదాంతాలచేతనే బోధింపబడుతుంది; బ్రహ్మబోధనం సఫలం కూడ అని ప్రతిపాదించబడింది. ఇప్పుడు అన్ని పదాలూ కార్యంతో సంబంధించే అర్థాన్ని మాత్రమే బోధిస్తాయి, అందుచేత వేదాంతాలు బ్రహ్మను బోధించినా దానిని ఏదో విధికి అంగంగానే బోధిస్తాయి కాని స్వతంత్రమైన బ్రహ్మను బోధించజాలవు అనే వాళ్ళ మతాన్ని ఖండించడానికి ఉపక్రమిస్తూ వాళ్ళ మతాన్ని అనువదిస్తున్నారు— అత్రాపరే ప్రత్యవతిష్ఠన్తే ఇతి:- (లేదా జీవునియందు బ్రహ్మత్వాన్ని ఆరోపించి ఆ జీవుణ్ణి ఉపాసన చేయాలి అని చెప్పడంలోనే వేదాంతాల తాత్పర్యం; అందుచేత అవి బ్రహ్మాత్మభావం విషయంలో ప్రమాణం కావు అని కూడా మొదటి పూర్వపక్షాన్ని తీసికొనవచ్చునని కల్పతరువు).

ఈ సందర్భంలో కొందరు ఎదురు తిరిగి ఈ విధంగా ప్రశ్నిస్తున్నారు - బ్రహ్మ శాస్త్రప్రమాణకమే అయినా కూడా అనగా బ్రహ్మ శాస్త్రంచేత బోధించబడుతున్నది అని అంగీకరించినా కూడా, ఆ బ్రహ్మ శాస్త్రంచేత జ్ఞానవిధికి విషయంగా మాత్రమే బోధించబడుతున్నది.

వి. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" ఇత్యాది వేదాంతవాక్యాలు సిద్ధమైన బ్రహ్మను బోధిస్తున్నాయి. అలా బోధించినంతమాత్రాన ప్రయోజనం ఏమీ లేదు. అందుచేత ఆ వాక్యాలు "తద్విజిజ్ఞాసస్వ" (దానిని తెలుసుకో) ఇత్యాదివిధివాక్యాలతో ఏక వాక్యత్వాన్ని పొంది తమ అర్థాన్ని బోధించి తద్ద్వారా సఫలము లవుతాయి. ఈ విధంగా శాస్త్రం బ్రహ్మను ప్రతిపత్తివిధివిషయంగా ప్రతిపాదిస్తున్న దని అర్థం. ప్రతిపత్తివిధి విషయతయా అనగా విధికి విషయమైన (విధించబడిన) ప్రతిపత్తికి (జ్ఞానానికి) విషయంగా అని కొందరు వ్యాఖ్యాతలు. విధివిషయప్రతిపత్తివిషయతయేత్యర్థః (రత్నప్రభ). ప్రతిపత్తి అనగా ఉపాసన అని కొందరు. ప్రతిపత్తివిధి అనగా ఆత్మజ్ఞాన విధి ఆ జ్ఞానవిధిలో (జ్ఞానం చెయ్యాలి అనే విధిలో) విషయం జ్ఞానం. దానిలో విషయం బ్రహ్మ. జ్ఞానవిధిలో విషయమైన జ్ఞానానికి విషయం "ప్రతిపత్తివిధేర్నియోగస్య విషయభూతప్రతిపత్తిం ప్రత్యవచ్ఛేదకత్వేన విషయతయేతి భాష్యార్థః" (కల్పతరువు).

యథేతి:- యూప, ఆహవనీయ మొదలైన శబ్దాలు అలౌకికములే అయినా ఏ విధంగా విధికి (కర్మవిధికి) అంగంగా శాస్త్రంచేత విధించబడుతున్నాయో అట్లే 'బ్రహ్మ' అనేది అప్రసిద్ధమే అయినా కూడ వేదాంతాలచేత జ్ఞానాదివిధులకు అంగంగా విధించబడుతున్నది.

వి. యూప, ఆహవనీయ మొదలైన పదాలు లోకప్రసిద్ధమైనవి కావు. వేదంలో మాత్రమే ఉన్నాయి. "యూపే పశుం బధ్నాతి" (పశువును యూపానికి కట్టాలి), "ఆహవనీయే జుహోతి" (ఆహవనీయంలో హోమం చేయ్యాలి), "ఇన్ద్రం యజేత" (ఇంద్రుణ్ణి గూర్చి యాగం చెయ్యాలి) ఇత్యాదివిధివాక్యా లున్నాయి. వాటిలో యూపం, ఆహవనీయం, ఇంద్రుడు అనగా ఏమిటి అని ప్రశ్న కలుగుతుంది అపుడు "యూపం తక్షత్యష్టాశ్రీకరోతి" (యూపం చెక్కి ఎనిమిది కోణాలు వచ్చేటట్లు చెయ్యాలి), "అగ్నీనాదధీత" (అగ్న్యాధానం చెయ్యాలి) "వజ్రహస్తః పురందరః" (ఇంద్రుడు వజ్రం హస్తంతో ధరించి ఉంటాడు. శత్రుపురాలను నశింపచేసినవాడు) ఇత్యాదివాక్యాలను పై విధివాక్యాలతో అన్వయించి అర్థం చెప్పుకొంటే పై యూపాదిపదాల అర్థం తెలుస్తుంది. అదే విధంగా "తద్విజిజ్ఞాసస్వ" (ఆ బ్రహ్మను తెలుసుకో) అనే విధివాక్యంలో ఉన్న ఆ బ్రహ్మ అనగా ఏది అని ఆకాంక్ష కలిగినప్పుడు "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇత్యాదివాక్యాలు ఆ బ్రహ్మ ఏదో తెలుపుతాయి. ఈ విధంగా బ్రహ్మ ఉపనిషత్తులలోని విధివాక్యాలకు అంగంగానే బోధించబడుతుంది కాని స్వతంత్రంగా కాదు అని అర్థం.

కుత ఏతదితి :- ఇది ఎందువలన? ఎందువలన అనగా శాస్త్రానికి ప్రయోజనం ప్రవృత్తి (ఏదైనా ఒక పని చేయమని ప్రోత్సహించడం)యైనా కావాలి, నివృత్తి (చేయవద్దని నివారించడం)యైనా కావాలి. అందుచేతనే శాస్త్రతాత్పర్యవేత్తలు శ్రీ (శబరాచార్యాదులు) "ఆ వేదానికి కర్మను బోధించడమే అర్థంగా చూడబడినది కదా?" అని అన్నారు. "క్రియను ప్రవర్తింపచేసే వచనమే 'చోదన' అనగా" అని కూడా (శబరాచార్యులు) అన్నారు. "ఆ ధర్మాన్ని బోధించే అపౌరుషేయమైన విధివాక్యమే ఉపదేశం అని, ఆ వేదంలో సిద్ధమైనవాటిని బోధించే పదాలను క్రియార్థపదాలతో అనగా కార్యాన్ని బోధించే లిజాదులతో కలిపి అర్థం చెప్పుకోవాలి" అనీ, "వేదం క్రియను బోధించడానికే ఉద్దిష్టమైనది గాన క్రియాబోధకములు కానివి వ్యర్థములే' ' అనీ కూడ (జైమిని) చెప్పియున్నారు. అందుచేత శాస్త్రం (వేదం) పురుషుణ్ణి ఏదైనా కార్యం చేయడానికి ప్రవర్తింపచేసినప్పుడు గాని, ఏ కార్యం నుండైనా నివర్తింపచేసినప్పుడు గాని అది సార్థకం అవుతుంది. మిగిలిన శాస్త్రభాగం అంతా ప్రవర్తకభాగానికి గాని, నివర్తక భాగానికి గాని అంగంగా ఉండి ఉపయోగిస్తుంది. అదే పద్ధతి ప్రకారం

వేదాంతాలు కూడా ఆ విధంగానే అనగా విధినిషేధాలకు అంగంగా ఉంటూ మాత్రమే సార్థకము లవుతాయి అని చెప్పాలి. ఈ విధంగా భూతార్థబోధకవేదభాగాలు (వేదాంతాలు) విధిపరములు కావాలి అని నిశ్చయించబడింది కాబట్టి, స్వర్గాదులు కావాలని కోరుకొనే వానికి అగ్నిహోత్రాదికర్మ సాధనంగా ఏ విధంగా విధించ బడుతున్నదో, అదే విధంగా మోక్షం కావాలనుకొన్నవానికి బ్రహ్మజ్ఞానం విధించ బడుతున్న దని చెప్పడమే యుక్తం.

## భాష్యమ్

నన్విహ జిజ్ఞాస్యవైలక్షణ్యముక్తమ్- కర్మకాణ్డే భవ్యో ధర్మః జిజ్ఞాస్యః, ఇహ తు భూతం, నిత్యనిర్వృత్తం బ్రహ్మ జిజ్ఞాస్యమితి; తత్ర ధర్మజ్ఞాన ఫలాదనుష్ఠానాపేక్షాద్విలక్షణం బ్రహ్మజ్ఞానఫలం భవితుమర్హతి? నార్హత్యేవం భవితుమ్. కార్యవిధిప్రయుక్తస్యైవ బ్రహ్మణః ప్రతిపాద్యమానత్వాత్. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృ.ఉ.2.4.5), "య ఆత్మాపహతపాప్మా సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (ఛా.ఉ.8.7.1), "ఆత్మేత్యేవోపాసీత" (బృ.ఉ.1.4.7), "ఆత్మానమేవ లోకముపాసీత" (బృ.ఉ.1.4.15), "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము.ఉ.3.2.9) ఇత్యాదివిధానేషు సత్సు కోఽసావాత్మా, కిం తద్ బ్రహ్మ ఇత్యాకాఙ్క్షాయాం తత్స్వరూపసమర్పణేన సర్వే వేదాన్తాః ఉపయుక్తాః- ''నిత్యః, సర్వజ్ఞః, సర్వగతో, నిత్యతృప్తో, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః, విజ్ఞానమానన్దం బ్రహ్మ'' ఇత్యేవమాదయః. తదుపాసనాచ్చ శాస్త్రదృష్టో మోక్షః ఫలం భవిష్యతీతి కర్తవ్యవిధ్యననుప్రవేశే తు వస్తుమాత్రకథనే హానోపాదానాసంభవాత్, ''సప్తద్వీపా వసుమతీ'', ''రాజాసౌ గచ్ఛతి'' ఇత్యాది వాక్యవద్వేదాన్త వాక్యానామానర్థక్యమేవ స్యాత్.

## బాలానందిని

అవ. వేదాంతాలు బ్రహ్మను తెలుసుకోవాలి అని విధిస్తున్నాయి కాని కేవలం బ్రహ్మ స్వరూపాన్ని ప్రతిపాదించడం లేదు అని చెప్పే పూర్వపక్షిని సిద్ధాంతి ప్రశ్నిస్తున్నాడు-

నన్వితి:- కర్మకాండలో జిజ్ఞాస్యమైనదాని (తెలియ నిచ్ఛయింపబడేదాని) స్వభావం వేరు. వేదాంతాలలో జిజ్ఞాస్య మైనదాని స్వభావం వేరు. కర్మకాండలో అంతకుముందు లేని, క్రొత్తగా చేయదగిన ధర్మం జిజ్ఞాస్యం. వేదాంతంలో అయితే

సిద్ధము, ఎల్లప్పుడు ఉన్నదీ అయిన బ్రహ్మ జిజ్ఞాస్యం. అందుచేత అనుష్ఠించడం మీద ఆధారపడిన ధర్మజ్ఞానంవల్ల కలిగే ఫలంకంటె బ్రహ్మజ్ఞానంవల్ల కలిగే ఫలం విలక్షణంగా (వేరు రకంగా) ఉండవలసి ఉంటుంది కదా? (పూర్వపక్షి దీనికి చెప్పే సమాధానం) అలా ఉండడానికి తగదు. ఎందువల్ల ననగా వేదాంతాలలో కార్యంయొక్క విధితో సంబంధించిన బ్రహ్మయే ప్రతిపాదించబడుచున్నది. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (ఓయీ! ఆత్మ చూడదగినది) "య ఆత్మాపహతపాప్మా సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (ఏ ఆత్మ నశింపచేయబడిన పాపాలు గలదో ఆ ఆత్మ వెదుకదగినది, తెలియదగినది). "ఆత్మేత్యేవోపాసీత" (ఆత్మయే అని ఉపాసన చెయ్యాలి, "ఆత్మానమేవ లోకముపాసీత" (జ్ఞానస్వరూపమైన ఆత్మను ఉపాసన చెయ్యాలి). "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి (బ్రహ్మభావం కావా లనుకొనేవాడు బ్రహ్మను తెలుసుకోవాలి) ఇత్యాదివిధివాక్యాలు ఉండగా - ఆ ఆత్మ ఏది? ఆ బ్రహ్మ ఏది? అని ప్రశ్న ఉదయించినప్పుడు ఆ బ్రహ్మ నిత్యము, సర్వజ్ఞము, సర్వగతము, నిత్యతృప్తము, నిత్య-శుద్ధ-బుద్ధ (జ్ఞాన) ముక్త స్వభావం గలది, విజ్ఞానస్వరూపము, ఆనందము" అని చెపుతూ వేదాంతా లన్నీ ఆ బ్రహ్మయొక్క స్వరూపాన్ని చెప్పడానికి ఉపయోగిస్తున్నాయి. ఆ బ్రహ్మను ఉపాసించడంవల్ల శాస్త్రంలో చెప్పిన మోక్షరూపమైన ఫలం సిద్ధిస్తుంది. కర్తవ్యవిధితో సంబంధం లేని పక్షంలో కేవలం ఉన్న వస్తువును మాత్రం చెపితే హానం (త్యజించడం) గాని, ఉపాదానం (గ్రహించడం) గాని ఉండవు గాన "ఏడు ద్వీపా లున్న భూమి", "ఆ రాజు వెడుతున్నాడు" ఇత్యాదివాక్యాల వలె వేదాంతవాక్యాలు వ్యర్థములే కావలసివస్తుంది.

## భాష్యమ్

నను వస్తుమాత్రకథనేఽపి "రజ్జురియం నాయం సర్పః" ఇత్యాది భ్రాన్తిజనితభీతినివర్తనేనార్థవత్త్వం దృష్టం, తథేహాప్యసంసార్యాత్మవస్తుకథనేన సంసారిత్వభ్రాన్తినివర్తనేనార్థవత్త్వం స్యాత్? స్యాదేతదేవం, యది రజ్జుస్వరూపశ్రవణ ఇవ సర్పభ్రాన్తిః సంసారిత్వభ్రాన్తిర్బ్రహ్మస్వరూపశ్రవణమాత్రేణ నివర్తేత; న తు నివర్తతే; శ్రుతబ్రహ్మణోఽపి యథాపూర్వం సుఖదుఃఖాదిసంసారిత్వధర్మదర్శనాత్. "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (బృ. ఉ.2.4.5) ఇతి చ శ్రవణోత్తరకాలయోర్మనననిదిధ్యాసనయోర్విధిదర్శనాత్. తస్మాత్ప్రతిపత్తివిధివిషయతయైవ శాస్త్రప్రమాణకం బ్రహ్మాభ్యుపగన్తవ్యమితి.

## బాలానందిని

నన్వితి:- (సిద్ధాంతి ప్రశ్న)- వస్తుమాత్రాన్ని గూర్చి చెప్పినప్పుడు గూడ, "ఇది సర్పం కాదు, త్రాడే" ఇత్యాదివాక్యాలు భ్రాంతివల్ల కలిగిన భయాన్ని తొలగించి సార్థకము లవుతున్నట్లు కనబడుచున్నది. అదే విధంగా ఇక్కడ (వేదాంతాలలో) కూడా సంసారం లేని ఆత్మవస్తువును గూర్చి చెప్పడంవల్ల "నేను సంసారంలో ఉన్నాను" అనే భ్రాంతిని తొలగించడం ద్వారా ఆ వాక్యాలు సార్థకా లవుతాయి కదా? (పూర్వపక్షి ఇచ్చే సమాధానం) - త్రాడుయొక్క స్వరూపాన్ని గూర్చి వినగానే సర్పభ్రాంతి తొలగినట్లు బ్రహ్మస్వరూపాన్ని విన్నంత మాత్రంచేతనే సంసారిత్వభ్రాంతి తొలగిపోతే నువ్వు చెప్పినది నిజమే అని అంగీకరించవచ్చు. అలా నివర్తించడం లేదు కదా? బ్రహ్మను గూర్చి విన్న వానిలో కూడా పూర్వం వలెనే సుఖదుఃఖాదిసంసారిత్వభ్రాంతి కనబడుతూనే ఉంది. ఇంకొక విషయం ఏమనగా - "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (ఆత్మను గూర్చి వినాలి, మననం చెయ్యాలి, నిదిధ్యాసనం చెయ్యాలి) అనే వాక్యం శ్రవణం తరవాత మనననిదిధ్యాసనలు కూడా చెయ్యా లని చెప్పుచున్నది. (అనగా బ్రహ్మను గూర్చి విన్నంత మాత్రంచేతనే భ్రాంతి తొలగిపోయిన పక్షంలో ఇంక మనననిదిధ్యాసనలను విధించడం ఎందుకు అని భావం). అందుచేత బ్రహ్మ ప్రతిపత్తివిధివిషయంగానే (జ్ఞానరూపమైన కార్యంలో విషయంగానే) వేదాంతాలలో ప్రతిపాదించబడుచున్నది అని అంగీకరించాలి.

## భాష్యమ్

అత్రాభిధీయతే. న. కర్మబ్రహ్మవిద్యాఫలయోర్వైలక్షణ్యాత్. శారీరం, మానసం, వాచికం చ కర్మ శ్రుతిస్మృతిసిద్ధం ధర్మాఖ్యం, యద్విషయా జిజ్ఞాసా "అథాతో ధర్మజిజ్ఞాసా" (జై.సూ.1.1.1) ఇతి సూత్రితా. అధర్మోఽపి హింసాదిః ప్రతిషేధచోదనాలక్షణత్వాజ్జిజ్ఞాస్యః పరిహారాయ. తయోశ్చోదనాలక్షణ యోరర్థానర్థయోర్ధర్మాధర్మయోః ఫలే ప్రత్యక్షే సుఖదుఃఖే శరీరవాఙ్మనోభిరేవో పభుజ్యమానే విషయేన్ద్రియసంయోగజన్యే బ్రహ్మాదిషు స్థావరాన్తేషు ప్రసిద్ధే. మనుష్యత్వాదారభ్య బ్రహ్మాదిషు దేహవత్సు సుఖతారతమ్యమనుశ్రూయతే. తతశ్చ తద్ధేతోర్ధర్మస్య తారతమ్యం గమ్యతే; ధర్మతారతమ్యాదధికారితార తమ్యమ్. ప్రసిద్ధం చార్థిత్వసామర్థ్యాదికృతమధికారితారతమ్యమ్. తథా చ యాగాద్యనుష్ఠాయినామేవ విద్యాసమాధివిశేషాదుత్తరేణ పథా గమనమ్.

కేవలైరిష్టాపూర్తదత్తసాధనైర్ధూమాదిక్రమేణ దక్షిణేన పథా గమనమ్. తత్రాపి సుఖతారతమ్యం, తత్సాధనతారతమ్యం చ శాస్త్రాత్ - "యావత్సంపాత ముషిత్వా" (ఛా.ఉ.5.10.5) ఇత్యస్మాదవగమ్యతే. తథా మనుష్యాదిషు నారకస్థావరాన్తేషు సుఖలవశ్చోదనాలక్షణధర్మసాధ్య ఏవేతి గమ్యతే తారతమ్యేన వర్తమానః. తథోర్ధ్వం గతేష్వధోగతేషు చ దేహవత్సు దుఃఖతారతమ్య దర్శనాత్తద్ధేతోరధర్మస్య ప్రతిషేధచోదనాలక్షణస్య తదనుష్ఠాయినాం చ తారతమ్యం గమ్యతే. ఏవమవిద్యాదిదోషవతాం ధర్మాధర్మ తారతమ్యనిమిత్తం శరీరోపాదానపూర్వకం సుఖదుఃఖతారతమ్యమనిత్యం సంసారరూపం శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధమ్, తథా చ శ్రుతిః "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్తి" ఇతి యథావర్ణితం సంసారరూప మనువదతి. "అశరీరం వావ సన్తం న ప్రియాప్రియే స్పృశతః" (ఛా.ఉ.8-12-1) ఇతి ప్రియాప్రియస్పర్శప్రతిషేధాచ్చోదనాలక్షణ ధర్మకార్యత్వం మోక్షాఖ్యస్యాశరీరత్వస్య ప్రతిషిధ్యత ఇతి గమ్యతే. ధర్మకార్యత్వే హి ప్రియాప్రియస్పర్శన ప్రతిషేధో నోపపద్యతే. అశరీరత్వమేవ ధర్మకార్యమితి చేన్న, తస్య స్వాభావికత్వాత్.

'339. "అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్,

మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి". (క.ఉ.1.2.21)

"అప్రాణో హ్యమనాః శుభ్రః" (ము. ఉ.2.1.2) "అసంగో హ్యయం పురుషః" (బృ.ఉ.4.3.15) ఇత్యాదిశ్రుతిభ్యః. అత ఏవానుష్ఠేయకర్మఫలవిలక్షణం మోక్షాఖ్యమశరీరత్వం నిత్యమితి సిద్ధమ్.

బాలానందిని

అత్రేతి:- (సిద్ధాంతం) ఈ విషయంలో చెప్పబడుచున్నది. కాదు. అనగా మోక్షం కావాలనుకొనే నియోజ్యునికి జ్ఞానం విధించబడుతుంది అని నువ్వుచెప్పినది యుక్తం కాదు. కర్మఫలానికీ, బ్రహ్మవిద్యాఫలానికీ చాలా భేదం ఉన్నది. శరీరంచేత చేసేది, వాక్కుతో చేసేది, మనస్సుచేత చేసేది అని త్రివిధమైన కర్మ శ్రుతిస్మృతులలో ప్రసిద్ధంగా ఉంది. దానికే ధర్మం అని పేరు. దాని విచారాన్ని గూర్చియే "అథాతో ధర్మజిజ్ఞాసా" అని జైమిని సూత్రించాడు.

వి. "అథవేదాధ్యయనం చేసిన తరవాత, అతః వేదాధ్యయనానికి అర్థజ్ఞానమే ఫలం కాబట్టి, ధర్మజిజ్ఞాసా=ధర్మనిర్ణయంకొరకు కర్మప్రతిపాదకవాక్యాల విచారం

చెయ్యాలి" అని ఈ సూత్రానికి అర్థం. ఇక్కడ 'ధర్మ' పదం అధర్మానికి కూడా ఉపలక్షణం. (ఉపలక్షణం అనగా చెప్పవలసినదానిలో కొంత భాగం మాత్రమే చెప్పడం). అనగా అధర్మాన్ని గూర్చి చెప్పే నిషేధవాక్యాదుల విచారం కూడ చెయ్యాలి అని కూడా అర్థం. ధర్మం విధిచోదనాలక్షణం అయితే, అనగా చెయ్యాలి అని ప్రవర్తింపచేసేదయితే, అధర్మం ప్రతిషేధచోదనాలక్షణం; చెయ్యకూడదు- అని నిషేధించే లక్షణం గలది.

**అధర్మ ఇతి:-** హింస మొదలైన అధర్మం ప్రతిషేధచోదనాలక్షణమైనది. దానిని గూర్చి కూడ విచారణ చెయ్యాలి. ఎందుకనగా దానిని పరిహరించాలి. చోదనా లక్షణాలైన ఈ ధర్మాధర్మాలు అర్థానర్థరూప మైనవి; ధర్మం అర్థరూపం (సత్ఫలితాన్ని ఇచ్చేది) అయితే అధర్మం అనర్థరూపం (అసత్ఫలితాన్ని ఇచ్చేది). వీటి ఫలాలైన సుఖదుఃఖాలు శరీరంచేత, వాక్కుచేత, మనస్సుచేత ప్రత్యక్షంగానే అనుభవించ బడతాయి. ఈ సుఖదుఃఖాలు విషయాలకు ఇంద్రియాలతో సంయోగం కలగడంచేత కలుగుతుంటాయి. బ్రహ్మదేవుడు మొదలు స్థావరాలైన వృక్షాదులవరకు ఉన్న జీవులలో ఈ సుఖదుఃఖా లున్నట్లుగా అందరికీ తెలిసిన విషయమే. మనుష్యులు మొదలు బ్రహ్మదేవునివరకూ ఉన్న దేహధారులలో సుఖతారతమ్యం (సుఖం హెచ్చు తగ్గులలో ఉన్నట్లు) శాస్త్రాలలో వినబడుచున్నది. సుఖతారతమ్యాన్ని పట్టి దానికి హేతువైన ధర్మంలో కూడ తారతమ్యం ఉన్నదని తెలుస్తూన్నది. ధర్మతారతమ్యాన్ని పట్టి అధికారితారతమ్యం (ఆ వేరు వేరు రకాలైన ధర్మాన్ని ఆచరించేవారిలో హెచ్చు తగ్గులు అనే భేదం) ఉన్నట్లు తెలుస్తూన్నది. అర్థిత్వం, సామర్థ్యం మొదలైనవాటిచేత ఏర్పడే అధికారితారతమ్యం ప్రసిద్ధమైనదే. (అనగా కొందరికి ఒక ఫలం కోసం ఒక కర్మ చేయాలనే కోరిక ఉంటుంది, మరొకరికి మరొక కర్మ చేయా లని ఉంటుంది. కొన్ని కర్మలు చేయగలిగిన సామర్థ్యం (పుత్రవత్త్వ-విద్వత్త్వాదికం) కొందరికే ఉంటుంది, కొందరికి ఉండదు. దీనినిపట్టి అధికారులలో, ఆ యా కర్మలు చేయగలిగినవారిలో, తారతమ్యం ఉంటుంది అని అర్థం)

**తథా చేతి:-** అందుచేత యాగాదులు చేసినవాళ్లు మాత్రమే విద్యాసమాధి విశేషంవల్ల, అనగా ఆ యా కర్మలను గూర్చిన పరినిష్ఠితమైన, చిత్తస్థైర్యం మొదలైన వాటివల్ల (అర్చిరాదిమార్గంచేత) ఉత్తరమార్గంచేత బ్రహ్మలోకానికి వెడతారు. కేవలం ఇష్టం, పూర్తం, దత్తం మొదలైనవి చేసినవాళ్లు ధూమాదిక్రమంచేత దక్షిణమార్గాన చంద్రలోకాదిలోకాంతరాలకు వెడతారు.

వి. ఈ విషయాలు చతుర్థాధ్యాయంలో చెప్పనున్నారు. పూర్తాదిలక్షణం ఈ క్రింది శ్లోకాలలో చెప్పబడింది:-

"అగ్నిహోత్రం తపః సత్యం వేదానాం చానుపాలనమ్,
ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్టమిత్యభిధీయతే.
వాపీకూపతడాకాది దేవతాయతనాని చ,
అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే.
శరణాగతసంత్రాణం భూతానాం చాప్యహింసనమ్,
బహిర్వేది చ యద్దానం దత్తమిత్యభిధీయతే".

తత్రాపీతి:- ఆ చంద్రలోకాదులలో కూడ సుఖంలోను దాని సాధనాలలోను తారతమ్యం ఉన్నదని "యావత్సంపాతముషిత్వా" (అనుభవించవలసిన కర్మ ఉన్నంతవరకు అక్కడ ఉండి తిరిగి వస్తారు) ఇత్యాదిశాస్త్రం చెపుతున్నది. అట్లే మనుష్యులు మొదలు నారకుల (నరకనివాసుల) వరకు, వృక్షాదిస్థావరాలవరకు ఉన్న జీవులలో తారతమ్యంతో ఉన్న (కొందరిలో అధికంగానూ కొందరిలో తక్కువగాను ఉన్న) సుఖలేశం చోదనాలక్షణమైన ధర్మంచేత కలిగినదే. అట్లే ఊర్ధ్వలోకాలలో ఉన్నవారూ, అధోలోకాలలో ఉన్నవారూ అయిన దేహధారులలో కూడా దుఃఖతారతమ్యం కనబడుతున్నది. దానినిపట్టి ఆ దుఃఖానికి హేతువైన, ప్రతిషేధచోదనాలక్షణమైన అధర్మంలోను, అధర్మం చేసేవాళ్లలోను తారతమ్యం ఉన్నట్లు తెలుస్తూన్నది. ఈ విధంగా అవిద్య మొదలైన దోషాలు (అవిద్య, అస్మిత, అనగా అహంకారం, కామం, క్రోధం, భయం అనే దోషా లున్నవాళ్లు ఆ యా శరీరాలను ధరించడం ద్వారా తరతమభావంలో సుఖదుఃఖాలను అనుభవిస్తూంటారు. సుఖదుఃఖాలలో ఉన్న ఈ తారతమ్యానికి ధర్మాధర్మాల తారతమ్యమే కారణం; ఈ సుఖదుఃఖ తారతమ్యమే అనిత్యమైన (ఏనాటికైనా బ్రహ్మజ్ఞానంచేత తొలగించుకొనదగిన) సంసారం అని శ్రుతిస్మృతులలో ప్రసిద్ధమైనది; యుక్తిసంమతం కూడ. అందుచేతనే "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్తి" (శరీరంతో ఉన్నంతవరకు ప్రియాప్రియాలు నశించవు) అని శ్రుతివాక్యం పైన వర్ణించిన సంసారస్వరూపాన్ని అనువదిస్తూన్నది. అట్లే "అశరీరం వా వ సన్తం న ప్రియాప్రియే స్పృశతః" (శరీరం లేకుండా ఉన్నవానిని ప్రియం కాని అప్రియం కాని స్పృశించదు) అనే శ్రుతి ప్రియాప్రియస్పర్శ ఉండదు అని చెపుతున్నది. దీనినిపట్టి మోక్షం అనే పేరు గల అశరీరత్వం చోదనాలక్షణమైన ధర్మంయొక్క కార్యము అనే విషయాన్ని నిషేధిస్తున్నది

అని తెలుస్తూన్నది. మోక్షం ధర్మకార్యమే అయిన పక్షంలో ప్రియాప్రియస్పర్శనిషేధం కుదరదు.

ఏ. ధర్మాధర్మాలు సుఖదుఃఖహేతువులు. సుఖదుఃఖాలను అనుభవించడానికి తప్పకుండా ఏదో ఒక దేహం ధరించవలసి ఉంటుంది. ఆ విధంగా దేహం ధరించాడా సుఖదుఃఖాలతో (ప్రియాప్రియాలతో) సంబంధం లేకుండా ఉండదు. శరీరసంబంధం లేనివానికి సుఖదుఃఖాలతో సంబంధం ఉండదు అని శ్రుతి చెప్పుచున్నదనగా శరీర సంబంధం లేకుండా ఉండా లంటే ధర్మాధర్మాలు చేయకూడదు అని చెప్పినట్లయినది. శరీరం లేకపోవడం అంటే మోక్షమే. అందుచేత మోక్షం అనేది వేదచోదితాలైన ధర్మాధర్మాల కార్యం (వాటివల్ల కలిగేది) కాదు అని అర్థం.

అశరీరత్వమేవేతి:- శ్రుతిలో చెప్పిన అశరీరత్వం కూడా ధర్మకార్యమే, ధర్మం వల్ల లభించేదే అని చెప్పవచ్చు కదా? (అనగా ధర్మఫలం విచిత్రంగా ఉంటుంది గాన కొన్ని విధాలైన ధర్మంవల్ల సుఖం కలిగినట్లు అంతకంటే ఉత్కృష్టమైన ధర్మంవల్ల అశరీరత్వరూపమైన మోక్షం కలగవచ్చు కదా అని భావం). ఇలా చెప్పకూడదు, ఎందువల్ల ననగా అశరీరత్వం అనేది (జీవునికి) స్వభావసిద్ధ మైనది. ఈ విషయాన్ని-

"అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్,

మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి"

(స్థూల శరీరం లేనిదీ, అస్థిరమైన) అనేకశరీరాలలో ఉన్నదీ, గొప్పది, సర్వవ్యాపి అయిన ఆత్మను తెలుసుకొన్నవాడు ఈ సంసారదుఃఖం అనుభవించడు), "అప్రాణో హ్యమనాః శుభ్రః" (ఈ ఆత్మ ప్రాణం గాని, మనస్సు గాని లేనిది. అనగా లింగశరీరం లేనిది, శుద్ధము) "అసంగో హ్యయం పురుషః" (ఈ పురుషుడు (ఆత్మ) దేనితోనూ సంబంధం లేనిది) ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నాయి. అందుచేత మోక్షం అనే అశరీరత్వం ఆచరించవలసిన కర్మల ఫలంకంటె విలక్షణ మైనది,నిత్య మైనది అనే విషయం నిశ్చితం.

## భాష్యమ్

తత్ర కించిత్పరిణామినిత్యమ్, యస్మిన్విక్రియమాణేఽపి తదేవేదమితి బుద్ధిర్న విహన్యతే. యథా పృథివ్యాది జగన్నిత్యత్వవాదినామ్; యథా చ సాంఖ్యానాం గుణాః. ఇదం తు పారమార్థికం కూటస్థం నిత్యం వ్యోమవత్సర్వవ్యాపి, సర్వవిక్రియారహితం, నిత్యతృప్తం, నిరవయవం, స్వయంజ్యోతిఃస్వభావమ్, యత్ర ధర్మాధర్మౌ సహ కార్యేణ కాలత్రయం

చ నోపావర్తతే. తదేతదశరీరత్వం మోక్షాఖ్యమ్-

**అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్,**

**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ** ... (క.ఉ.2-14)

**ఇత్యాదిశ్రుతిభ్యః**- అతస్తద్బ్రహ్మ యస్యేయం జిజ్ఞాసా ప్రస్తుతా. తద్యది కర్తవ్యశేషత్వేనోపదిశ్యేత, తేన చ కర్తవ్యేన సాధ్యశ్చేన్మోక్షోఽభ్యుపగమ్యేత అనిత్య ఏవ స్యాత్. తత్రైవం సతి యథోక్తకర్మఫలేష్వేవ తారతమ్యావస్థితేష్వనిత్యేషు కశ్చిదతిశయో మోక్ష ఇతి ప్రసజ్యేత. నిత్యశ్చ మోక్షః సర్వైః మోక్షవాదిభిరభ్యుపగమ్యతే. అతో న కర్తవ్యశేషత్వేన బ్రహ్మోపదేశో యుక్తః.

## బాలానందిని

**తత్రేతి**:- నిత్యములని చెప్పేవాటిలో కూడ ఒక **తెగకు** చెందినది పరిణామినిత్యం. ఏది వికారం చెందుతున్నా కూడ అదే ఇది **అనే** బుద్ధి అనువర్తిస్తూంటుందో అది పరిణామినిత్యం. ఉదాహరణకి జగత్తు నిత్యము అని అంగీకరించేవాళ్ళ మతం ప్రకారం పృథ్వి మొదలైనది పరిణామినిత్యం; అలాగే సాంఖ్యుల గుణాలు కూడ పరిణామినిత్యాలు.

వి. భూమి ఒకప్పుడు గడ్డి మొదలైనవాటితో కప్పబడి ఉంటుంది. మరొకప్పుడు అదంతా మట్టిగా మారిపోతూంటుంది. ఈ విధమైన పరిణామాలు కలుగుతున్నా ఆ పృథ్వియే ఇది అనే బుద్ధి అనుస్యూతంగా ఉండడంచేత పృథివి పరిణామినిత్యం అని జగన్నిత్యత్వవాదులు అంటారు. అట్లే సాంఖ్యుల సిద్ధాంతం ప్రకారం ప్రలయకాలంలో సత్త్వరజస్తమోగుణా లనే మూడు గుణాలు సమప్రాధాన్యంతో ఉన్నప్పుడు దానిని ప్రధానం అంటారు. ఆ మూడింటిలో హెచ్చుతగ్గు లనే పరిణామం వచ్చినపుడు జగత్సృష్టి జరుగుతుంది. ఈ విధంగా పరిణామం (మార్పు) జరుగుతున్నా ఆ గుణత్రయం నిత్యమే అని వాళ్లంగీకరిస్తారు. పరిణామినిత్యత్వం అనగా ఇదే.

**అవ.** ఈ బ్రహ్మయితే ఆ విధంగా పరిణామినిత్యం కాదు; ఎట్టి పరిణామములు చెందని నిత్యవస్తువు అని చెపుతున్నారు. **ఇదం త్వితి**:- ఈ పరబ్రహ్మయైతే పారమార్థికమైనది. కూటస్థమైనది ( ఏ మాత్రము కదలిక లేనిది), నిత్యము. ఆకాశం వలె అంతటా వ్యాపించినది. ఎలాంటి వికారాలు లేనిది. ఎల్లప్పుడు తృప్తి పొంది ఉన్నది. అవయవాలు లేనిది. స్వయంప్రకాశస్వభావం గలది. ధర్మాధర్మాలు వాటి కార్యాలతో సహా దీనియందు ప్రసరించవు. మూడు కాలాలూ కూడా దీని విషయంలో ప్రవర్తించవు. మోక్షం అనే పేరు గల అశరీరత్వ మనగా ఇదే. "**అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ** (ఏ బ్రహ్మ ధర్మంకంటే)

భిన్నమైనదో అధర్మంకంటె భిన్నమైనదో కృతంకంటె (కార్యంకంటె) అకృతంకంటె (కారణంకంటె) అన్యమో, భూత-భవిష్యద్వర్తమానాలకంటె అన్యమో) ఇత్యాది శ్రుతులు ఈ విధమైన బ్రహ్మనే బోధిస్తున్నాయి. అందువల్ల దేని జిజ్ఞాస ఇప్పుడు చెప్పబడుచున్నదో ఆ బ్రహ్మ ఇదే. ఆ బ్రహ్మ కార్యానికి అంగంగా ఉపదేశించబడినట్లయితే, చేయదగిన ఆ కార్యంచేత మోక్షం సాధించదగిన దైతే అలాంటి మోక్షం అనిత్యం అయిపోతుంది. అప్పుడు మోక్షం అనేది తరతమభావంతో ఉన్న పైనచెప్పిన అనిత్యాలైన కర్మఫలాలలోనే ఒక అతిశయం అని చెప్పినట్లవుతుంది. మోక్షం నిత్యమైనది అని మోక్షం అంగీకరించిన దార్శనికు లందరూ అంగీకరించి ఉన్నారు. అందువల్ల బ్రహ్మ కార్యానికి శేషంగా ఉపదేశించబడుతుంది అని చెప్పడం యుక్తం కాదు.

## భాష్యమ్

అపి చ "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము.ఉ.3.29), "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ము.ఉ.2.28), "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" (తై.ఉ.2.9), అభయం వై జనక ప్రాప్తోఽసి (బృ.ఉ.4.2.4) "తదాత్మానమేవాఽవేదహం బ్రహ్మాస్మీతి, తస్మాత్తత్సర్వమభవత్" (వాజసనేయి బ్రాహ్మణోప. 1.4.10), "తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః" (ఈ.ఉ.7) ఇత్యేవమాద్యాః శ్రుతయో బ్రహ్మవిద్యానన్తరం మోక్షం దర్శయన్త్యః మధ్యే కార్యాన్తరం వారయన్తి. తథా "తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతి పేదేఽహం మనురభవం సూర్యశ్చ" (బృ.ఉ.1.4.10) ఇతి బ్రహ్మదర్శన సర్వాత్మభావయోర్మధ్యే కర్తవ్యాన్తరవారణాయోదాహార్యమ్. యథా తిష్ఠన్ గాయతీతి తిష్ఠతిగాయత్యోర్మధ్యే తత్కర్తృకం కార్యాన్తరం నాస్తీతి గమ్యతే. "త్వం హి నః పితా, యోఽస్మాకమవిద్యాయాః పరం పారం తారయసి" (ప్ర.ఉ.6.8), "శ్రుతం. హ్యేవ మే భగవద్దృశేభ్యస్తరతి శోకమాత్మవిత్" ఇతి, "సోఽహం భగవః శోచామి తన్మా భగవాన్ శోకస్య పర పారం తారయతు" (ఛా. ఉ. 7.13), "తస్మై మృదితకషాయాయ తమసః పరం పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః" (ఛా.ఉ.7.26.2) ఇతి చైవమాద్యాః శ్రుతయో మోక్షప్రతిబన్ధనివృత్తిమాత్రమేవాత్మజ్ఞానస్య ఫలం దర్శయన్తి. తథా చాచార్యప్రణీతం న్యాయోపబృంహితం సూత్రమ్- "దుఃఖజన్మప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనన్తరాపాయాదపవర్గః" (న్యా.సూ.1.1.2) ఇతి. మిథ్యాజ్ఞానాపాయశ్చ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానాద్భవతి."

బాలానందిని

అపి చేతి:- మరొక విషయ మేమనగా- "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (నేనే బ్రహ్మను అని ఎవడు తెలుసుకుంటాడో అతడు బ్రహ్మయే అవుతాడు), "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (కార్యకారణరూపుడైన, కార్యకారణాధారమైన, ఆ పరబ్రహ్మ చూడబడగానే వాని కర్మలన్నీ నశిస్తాయి), "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్, న బిభేతి కుతశ్చన" (బ్రహ్మస్వరూపమైన ఆనందాన్ని తెలుసుకొన్నవాడు దేనినుండీ భయపడడు), "అభయం వై జనక ప్రాప్తోఽసి" (జనకా! ఆత్మజ్ఞానవంతుడ వవడం వల్ల నువ్వు అభయం పొందావు), "తదాత్మానమేవావేదహం బ్రహ్మాస్మీతి" (జీవుని పేరుతో ఉన్న బ్రహ్మ గురూపదేశంవల్ల తనను నేను బ్రహ్మ అని తెలుసుకొన్నాడు; ఆ విధంగా తెలుసుకొనడంవల్ల పూర్ణమైన బ్రహ్మగా అయ్యాడు), "తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః" (నేనే బ్రహ్మను అని ఏకత్వాన్ని చూచినవానికి ఇంక మోహం గాని, శోకం గాని ఎక్క డుంటుంది) ఇత్యాది శ్రుతులు బ్రహ్మజ్ఞానం కలిగిన వెంటనే మోక్షం లభిస్తుం దని చెపుతూ, బ్రహ్మజ్ఞానానికీ మోక్షానికీ మధ్య మరొక కార్యాన్ని నివారిస్తున్నాయి, అనగా జ్ఞానం తరవాత చేయవలసిన మరొక కార్యం ఏదీ లేదని చెపుతున్నాయి. బ్రహ్మజ్ఞానం కలిగిన వెంటనే సర్వాత్మభావం (నేనే సర్వమూ అనే భావం) కలుగుతుంది; ఈ రెండింటి మధ్య చేయవలసినది మరొక టేదీ లేదు అని చెప్పడానికి ప్రమాణంగా "తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చ" (ఆ బ్రహ్మ ఈ ప్రత్యగాత్మయే అని చూచిన వామదేవఋషి నేను మనువుగాను, సూర్యుడుగాను అయినాను అని గ్రహించాడు) ఇత్యాది శ్రుతివాక్యాలు కూడ ఉదాహరించవచ్చును. 'తిష్ఠన్ గాయతి' (నిలబడి గానం చేస్తున్నాడు) అన్నప్పుడు నిలబడడానికీ, గానం చేయడానికీ మధ్య అతడు మరొక పని ఏదీ చేసి నట్లు ఏ విధంగా తెలియడం లేదో అదే విధంగా బ్రహ్మజ్ఞానానికీ మోక్షానికీ మధ్య మరొక కార్యం ఏదీ లేదని తెలుస్తూన్నది. ఆత్మజ్ఞానానికి ఫలం మోక్షప్రతిబంధాన్ని తొలగించడం మాత్రమే, అనగా మోక్షం రాకుండా అడ్డుగా నిలచిన అజ్ఞానాదికాన్ని తొలగించడమే ఆత్మజ్ఞానానికి ఫలం; అది తొలగిన వెంటనే మోక్షమే, అని "త్వం హిః నః పితా యో ఽస్మాకమవిద్యాయాః పరం పారం తారయసి" (అవిద్యయొక్క అవతలి ఒడ్డుకు చేర్చిన నీవే మా తండ్రివి), "శ్రుతం హ్యేవ భగవద్దృశేభ్యస్తరతి శోకమాత్మవిత్" (ఆత్మజ్ఞానం కలవాడు శోకాన్ని దాటుతాడు అని మీవంటివారినుండి విన్నాను) అందువల్ల "సోఽహం

భగవః శోచామి తన్మా భగవాన్ శోకస్య పరం పారం తారయతు" (ఓ! పూజ్యుడా! నేను శోకంతో ఉన్నాను; అందుచేత నన్ను శోకానికి అవతలి ఒడ్డు చేర్చుము), "తస్మై మృదితకషాయాయ తమసః పరం పారం దర్శయతి సనత్కుమారః" (ఈ విధంగా నారదుడు ప్రార్థించగా పూజ్యుడైన సనత్కుమారుడు తపస్సుచే పాపా లన్నీ దగ్ధాలై పోయిన ఆ నారదునికి అజ్ఞానంయొక్క అవతలి ఒడ్డు అయిన బ్రహ్మను చూపినాడు) ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. న్యాయదర్శనాచార్యుడైన గౌతముడు చెప్పిన, న్యాయసంమతమైన - "దుఃఖజన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనన్తరాపాయాదపవర్గః" అనే సూత్రం కూడా ఈ విషయమే చెప్పుచున్నది. అయితే మిథ్యాజ్ఞానం తొలగడం మాత్రం బ్రహ్మాత్మైకత్వజ్ఞానంవల్ల మాత్రమే కలుగుతుంది.

వి. దుఃఖము, జన్మ, ధర్మాధర్మాల విషయంలో ప్రవృత్తి, దోషం, మిథ్యాజ్ఞానం అనే ఈ అయిదింటిలో ఉత్తరోత్తరం తొలగిపోగా దాని వెనుక నున్నది తొలగిపోయి మోక్షం లభిస్తుంది అని గౌతమసూత్రానికి అర్థం. నేను నల్లగా ఉన్నాను, నేను తెల్లగా ఉన్నాను ఇత్యాదిజ్ఞానం మిథ్యాజ్ఞానం. మిథ్యాజ్ఞానం నశిస్తే రాగ-ద్వేష-మోహాది దోషాలు నశిస్తాయి. ఆ దోషాలు నశిస్తే ధర్మాధర్మరూపప్రవృత్తి నశిస్తుంది. ఆ ప్రవృత్తి లేకపోతే జన్మ ఉండదు. జన్మ లేకపోతే దుఃఖం నశిస్తుంది. దుఃఖవినాశమే మోక్షం అని ఈ సూత్రానికి అర్థం. అయితే దీని వెనుక సూత్రంలో గౌతముడు "తత్త్వజ్ఞానాన్నిః శ్రేయసాధిగమః" (గౌ.సూ.1.1.2) (ఆత్మ ఇతరపదార్థాలకంటె భిన్నమైనది అనే తత్త్వజ్ఞానం కలుగుతే మోక్షం లభిస్తుంది) అని చెప్పి ఉన్నాడు. ఇతరపదార్థభిన్నాత్మతత్త్వజ్ఞానం వల్ల మోక్షం ఎలా వస్తుంది అనేదానికి సమాధానంగా "దుఃఖజన్మ" ఇత్యాది సూత్రం చెప్పాడు. ఈ సూత్రాన్ని ప్రమాణంగా ఉదాహరించడం ద్వారా ఇతరపదార్థభిన్నమైన ఆత్మయొక్క జ్ఞానంవల్ల మోక్షం కలుగుతుంది అనే గౌతమసిద్ధాంతాన్ని అంగీకరించిన ట్లవుతుంది కదా? అప్పుడు ఇతరపదార్థాలు సత్యంగా ఉన్నట్లు,వాటికంటె ఆత్మ భిన్నం అయినట్లు చెప్పిన ట్లవుతుంది కదా అని సందేహం కలుగుతుంది. ఆ సందేహం నివర్తించడానికై "మిథ్యాజ్ఞానాపాయశ్చ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానాద్భవతి" అని చెప్పబడింది. అనగా తత్త్వజ్ఞానంవల్ల ముక్తి కలుగుతుంది అన్నంతవరకే మాకు గౌతమమతం అంగీకార్యం. ఆ తత్త్వజ్ఞానం అంటే ఏమిటి అనగా బ్రహ్మాత్మైకత్వజ్ఞానమే తత్త్వజ్ఞానం

అని మా సిద్ధాంతం. దానివల్ల మిథ్యాజ్ఞానాదులు వరసగా నశిస్తాయి అన్నంతవరకే ఈ సూత్రం ప్రమాణంగా ఉదాహరించబడింది.

## భాష్యమ్

న చేదం బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సంపద్రూపమ్, యథా "అనన్తం వై మనోఽనన్తా విశ్వేదేవా అనన్తమేవ స తేన లోకం జయతి" (బృ.ఉ.3.1.1) ఇతి. న చాధ్యాసరూపమ్- యథా "మనో బ్రహ్మేత్యుపాసీత" (ఛా.ఉ.3.18.1), "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" (ఛా. ఉ.3.19.1) ఇతి చ మనఆదిత్యాదిషు బ్రహ్మదృష్ట్యధ్యాసః. నాపి విశిష్టక్రియాయోగనిమిత్తమ్- "వాయుర్వావ సంవర్గః' "ప్రాణో వావ సంవర్గః" (ఛా.ఉ.4.3.1) ఇతివత్. నాప్యాజ్యావేక్షణాది కర్మవత్ కర్మాఙ్గసంస్కారరూపమ్. సంపదాదిరూపే హి బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానేఽభ్యుపగమ్యమానే "తత్త్వమసి" (ఛా.ఉ.6.8.7), "అహం బ్రహ్మాస్మి" (బృ.ఉ.1.4.10), "అయమాత్మా బ్రహ్మ" (బృ.ఉ.2.5.19) ఇత్యేవమాదీనాం వాక్యానాం బ్రహ్మాత్మైకత్వవస్తుప్రతిపాదనపరః పదసమన్వయః పీడ్యేత. "భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః" (ము.ఉ.2.2.8) ఇతి చైవమాదీన్యవిద్యానివృత్తిఫలశ్రవణాన్యుపరుధ్యేరన్. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము. 3.2.9) ఇతి చైవమాదీని తద్భావాపత్తివచనాని సంపదాదిపక్షే న సామఞ్జస్యేనోపపద్యేరన్. తస్మాన్న సంపదాదిరూపం బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమ్.

అవ.ఉపనిషత్తులలో బోధించబడిన బ్రహ్మాత్మైకత్వజ్ఞానం కేవలం ఉపాసనకోసమే చెప్పబడినది గాని అది యథార్థజ్ఞానం కాజాలదు. అది భ్రాంతిజ్ఞానమే; సంపదాది జ్ఞానం వంటిది మాత్రమే అని ఆశంకించుకొని అది అలాంటిది కాదు; యథార్థ జ్ఞానమే అని ప్రతిపాదించుచున్నారు- న చేదమితి:- "అనన్తం వై మనః అనన్తా విశ్వేదేవాః అనన్తమేవ స తేన లోకం జయతి" (బృ.ఉ.3.1.2) (మనస్సు అనంతం; విశ్వేదేవతలు కూడ అనంతమైనవారు. మనస్సును విశ్వేదేవతలనుగా ఉపాసన చేసినవాడు అనంతమైన లోకాన్ని జయిస్తాడు) అని చెప్పినట్లు ఈ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సంపద్రూపం కాదు.

వి. అల్పమైన ఆలంబనాన్ని కప్పివేసి దానిని ఉత్కృష్టమైన వస్తువుతో అభిన్నంగా భావించి ఉపాసించడం సంపదుపాసన. మనస్సులో అనేకవృత్తులు కలుగుతుంటాయి.

అందుచేత అది అనంతం. విశ్వేదేవతలు అనంతసంఖ్యాకులు. ఈ అనంతత్వాన్ని పురస్కరించుకొని అల్పమైన మనస్సును దానికంటె గొప్పవాళ్ళైన విశ్వేదేవతలనుగా భావించి (మనస్సు విశ్వేదేవతలే అని) ఉపాసన చెప్పబడినది. ఇది సంపత్. ఆ విధంగా చేతనత్వాన్ని పురస్కరించుకొని జీవునియందు బ్రహ్మాభేదాన్ని భావించడం సంపత్ కాదు అని అర్థం. సంపదుపాసనలలో ఆరోపించబడేదానికి ప్రాధాన్యం ఉంటుంది.

న చేతి:- "మనో బ్రహ్మేత్యుపాసీత" (ఛా.ఉ.3.18.1) (మనస్సును బ్రహ్మ అని ఉపాసన చెయ్యాలి) "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" (ఛా.ఉ.3.19.1) (ఆదిత్యుడు బ్రహ్మ అని ఉపదేశము) అని మనస్సు ఆదిత్యుడు మొదలైనవాటియందు అధ్యస్తమైన (ఆరోపించబడిన) బ్రహ్మదృష్టి వలె "అహం బ్రహ్మ" అనే జ్ఞానం అధ్యాస కాదు.

వి. ఆలంబనాన్ని ప్రధానంగా ధ్యానించడం 'అధ్యాస'. దీనికే ప్రతీకోపాసన అని పేరు. మనస్సును బ్రహ్మగాను, ఆదిత్యుణ్ణి బ్రహ్మగాను ఉపాసించడం అధ్యాస. ఆ విధంగా 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాదికం అధ్యాసరూపమైన ఉపాసన కాదు అని అర్థం. అధ్యాసలో అధిష్ఠానానికి (మన ఆదిత్యాదులకు) ప్రాధాన్యం.

నాపీతి:- "జీవుడు బ్రహ్మ" అనే జ్ఞానం "వాయుర్వావ సంవర్గః" (వాయువు సంవర్గం) "ప్రాణో వావ సంవర్గః" (ఛా.ఉ.4.3.1) (ప్రాణం సంవర్గం) అన్నట్లు విశిష్టమైన క్రియతో సంబంధం ఉండడంవల్ల ఏర్పడిన జ్ఞానం కాదు.

వి. ప్రళయకాలంలో వాయువు అగ్న్యాదులను ఉపసంహరించివేస్తుంది. అందుచేత అది సంవర్గం. స్వాపకాలంలో ప్రాణం వాగాదుల్ని ఉపసంహరిస్తుంది; అందుచేత అది కూడ సంవర్గం. ఈ విధంగా సంవర్గం అనే క్రియతో సంబంధం ఉండడంచేత ప్రాణాన్ని వాయువుగా ఉపాసించా లని విధించినట్లు వృద్ధి అనే క్రియతో సంబంధం ఉండడంవల్ల జీవుల్ని బ్రహ్మగా ఉపాసించాలి అని విధించబడుతున్నది అని కూడా చెప్పకూడదు అని అర్థం.

నాప్యాజ్యేతి:-అట్లే ఈ బ్రహ్మాత్మైక్యజ్ఞానం ఆజ్యావేక్షణాదికర్మ వలె కర్మకు అంగమైన సంస్కారం కూడ కాదు.

వి. ఉపాంశుయాగాలకు అంగమైన ఆజ్యానికి (నేతికి) "పత్న్యవేక్షితమాజ్యం భవతి" (యజమానుని భార్య ఆజ్యం చూడాలి) అనే వాక్యంచేత పత్న్యవేక్షణం సంస్కారంగా విధించబడింది. అలా చూస్తే ఆ ఆజ్యానికి ఒక సంస్కారం (విశేషం)

ఏర్పడుతుంది. అదే విధంగా 'భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః" (హృదయగ్రంథి, అనగా అంతఃకరణంలో ఉన్న రాగాదిగ్రంథి, లేదా చిత్‌కు మనస్సుకు ఏర్పడిన తాదాత్మ్యం - అదీ ఇదీ ఒకటే అనే గ్రంథి, విడిపోతుంది. సమస్తసంశయాలు చిన్నాభిన్నా లైపోతాయి) మొదలైన అవిద్య తొలగిపోవడం అనే ఫలాన్ని గూర్చిన శ్రవణాలు అర్థరహితా లైపోతాయి. అట్లే సంపదాదిరూప మైనది బ్రహ్మాత్మైకత్వజ్ఞానం అని చెపితే "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (బ్రహ్మను తెలిసికొన్నవాడు బ్రహ్మగానే అయిపోతాడు) ఇత్యాది వచనాలు సరిగా కుదరవు. అందువల్ల బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సంపదాది రూపమైనది అని చెప్పడానికి వీలు లేదు.

## భాష్యమ్

అతో న పురుషవ్యాపారతన్త్రా బ్రహ్మవిద్యా; కిం తర్హి? ప్రత్యక్షాది ప్రమాణవస్తుజ్ఞానవత్ వస్తుతన్త్రా. ఏవం భూతస్య బ్రహ్మణః తద్‌జ్ఞానస్య చ న కయాచిద్యుక్త్యా శక్యః కార్యానుప్రవేశః కల్పయితుమ్. న చ విదిక్రియాకర్మత్వేన కార్యానుప్రవేశో బ్రహ్మణః; "అన్యదేవ తద్విదితాదథోఽ విదితాదధి" (కే.ఉ.1.3) ఇతి విదిక్రియాకర్మత్వప్రతిషేధాత్. "యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్" (బృ.ఉ.2.4.13) ఇతి చ. తథోపాస్తిక్రియా కర్మత్వప్రతిషేధోఽపి భవతి- "యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే" ఇత్యవిషయత్వం బ్రహ్మణ ఉపన్యస్య "తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే" (కే.ఉ.1.4) ఇతి. అవిషయత్వే బ్రహ్మణః శాస్త్రయోనిత్వానుపపత్తిరితి చేత్, న. అవిద్యాకల్పితభేదనివృత్తి పరత్వాచ్ఛాస్త్రస్య. న హి శాస్త్రమిదంతయా విషయభూతం బ్రహ్మ ప్రతిపి పాదయిషతి; కిం తర్హి? ప్రత్యగాత్మత్వేనావిషయతయా ప్రతిపాదయ దవిద్యాకల్పితం వేద్యవేదితృవేదనాదిభేదమపనయతి. తథా చ శాస్త్రమ్- "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః, అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్" (కే.ఉ.2.3), "న దృష్టేర్ద్రష్టారం పశ్యేః", "న విజ్ఞాతేర్విజ్ఞాతారం విజానీయాః (బృ.ఉ.3.4.2) ఇతిచైవమాది. అతోఽవిద్యాకల్పి తసంసారిత్వనివర్తనేన నిత్యముక్తాత్మస్వరూపసమర్పణాన్న మోక్షస్యానిత్యత్వదోషః.

## బాలానందిని

**అత ఇతి:-** అందువల్ల, అనగా సంపదాదిరూపం కాదు గాన, బ్రహ్మవిద్య పురుషుని వ్యాపారంమీద ఆధారపడినది కాదు; మరేమనగా- ప్రత్యక్షాదిప్రమాణాలకు విషయమైన వస్తువుయొక్క జ్ఞానం వలె వస్తువు మీద ఆధారపడినది. ఇట్టి బ్రహ్మకు (లేదా ఈ విధంగా సిద్ధమైన) బ్రహ్మకు గాని, బ్రహ్మజ్ఞానానికి గాని ఏ యుక్తిచేతనూ కూడ కార్యంలో ప్రవేశం కల్పించడానికి శక్యం కాదు.

వి. దృష్టి ఎదుట ఉన్న వృక్షంమీద పడినప్పుడు ఆ వృక్షస్వరూపాన్ని పట్టి ఇది వృక్షం అనే జ్ఞానం కలుగుతుంది. ఇది వృక్షం అని నువ్వు గ్రహించు అని ఎవ్వరూ చెప్ప నవసరం లేదు. నేను దీనిని వృక్షం అని గ్రహిస్తాను అని చూచేవాడు కూడా సంకల్పించవలసిన పని లేదు. అదే విధంగా బ్రహ్మ ఒక ఉన్న వస్తువు గాన ప్రమాణం ప్రసరించగానే దాని జ్ఞానం సహజంగానే కలుగుతుంది; ఎవరూ ప్రేరేపించవలసిన పని లేదు, తాను కూడా ప్రయత్నించవలసిన పని లేదు అని అర్థం.

**అవ.** పోనీ ఇతరక్రియలతో వేటితోను సంబంధం లేకపోయినా తెలుసుకొనుట అనే క్రియతో సంబంధం బ్రహ్మకున్నట్లు చెప్పవచ్చును కదా అనే ఆశంకకు కూడా అవకాశం లేదు అని చెప్పుచున్నారు- **న చేతి:-** బ్రహ్మకు తెలుసుకొనుట అనే క్రియతో కూడా సంబంధం లేదు. **"అన్యదేవ తద్విదితాత్ అథోఽవిదితాదధి"** (అది తెలియబడిన దానికంటె (వ్యక్తప్రపంచంకంటె) తెలియబడనిదానికంటె (అవ్యక్త కారణరూపంకంటె) భిన్నమైనది అని) **"యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్"** (ఏ ఆత్మచేత దృశ్యమైన ఈ సమస్తమునూ తెలుసుకొంటాడో అలాంటి ఆత్మను దేనిచేత తెలుసుకోగలడు) ఇత్యాదివాక్యాలచేత ఆ బ్రహ్మ తెలుసుకొనడం అనే క్రియతో కర్మ కాజాలదు అని నిషేధించబడినది. అట్లే బ్రహ్మ ఉపాసన చేయుట అనే క్రియలో కూడ కర్మ కాజాలదు అని చెప్పబడుచున్నది. **'యద్వాచాఽ నభ్యుదితం యేన వాగభ్యుద్యతే''** (ఏ బ్రహ్మ వాక్కుచేత తెలపబడదో, ఏ బ్రహ్మచేత వాక్కు ప్రకాశింపచేయబడుచున్నదో) అని బ్రహ్మ దేనికీ విషయం (బోధించబడేది) కాదు అని చెప్పి **''తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే''** (అదే బ్రహ్మ అని నువ్వు తెలుసుకో, దేనిని ఉపాసన చేస్తున్నారో అది బ్రహ్మ కాదు) అని చెప్పబడినది. అందుచేత బ్రహ్మ దేనికీ విషయం కాదు. ఉపాసనకు కూడా విషయం కాదు అని అర్థం. బ్రహ్మ దేనికీ విషయం కాకపోతే అది శాస్త్రయోని అని చెప్పడం కుదరదు కదా?

వి. శాస్త్రయోని అనగా శాస్త్రంచేత బోధించబడేది; అనగా శాస్త్రానికి విషయం, అని కదా అర్థం? దేనికీ విషయం కాకపోతే బ్రహ్మ శాస్త్రానికి మాత్రం విషయం ఎలా అవుతుంది? అలాంటప్పుడు అది శాస్త్రయోని అని ఎలా చెప్పబడింది అని పృచ్ఛకుని అభిప్రాయం.

నేతి:- అది యుక్తం కాదు. శాస్త్రం అవిద్యచేత కల్పించబడిన భేదాన్ని తొలగించడం కోసమే ఉద్దిష్ట మైనది. శాస్త్రం 'బ్రహ్మ అంటే ఇది' అని (కొమ్ము పట్టుకొని ఎద్దును చూపినట్లు) బ్రహ్మను చూపడంకోసం ప్రయత్నించదు. మరేమనగా- బ్రహ్మ ఏ ప్రమాణానికీ విషయం కాని (ఏ ప్రమాణంచేతా ఇది ఫలానా అని తెలియబడని) ప్రత్యగాత్మ (మనోబుద్ధ్యాదులకంటె ఆంతరమైన ఆత్మ) అని ప్రతిపాదిస్తూ వేద్యం (తెలియబడేది) వేదిత (తెలుసుకొనేవాడు) వేదన (తెలియడం) మొదలైన భేదాలను తొలగిస్తుంది. "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః, అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్" (బ్రహ్మ జ్ఞానవిషయం కాదు అని ఎవనికి నిశ్చయమో వానికి తెలుస్తుంది. ఇది జ్ఞానవిషయమే అని ఎవడు అనుకొంటాడో వానికి తెలియదు. బ్రహ్మ తెలిసింది అనుకొన్నవాళ్లకి అది తెలియదు; బ్రహ్మ దేనికీ విషయం కాదు అని తెలిసినవాళ్లకు అది తెలుస్తుంది), "న దృష్టేర్ద్రష్టారం పశ్యేః" (దృష్టిని చూచేదానిని అనగా దృష్టికి సాక్షిగా ఉన్నదానిని చూడజాలవు), 'న విజ్ఞాతేర్విజ్ఞాతారం విజానీయాః" (జ్ఞానానికి సాక్షిగా ఉన్నదానిని నువ్వు తెలుసుకొనజాలవు) ఇత్యాదివాక్యాలు కూడ ఈ విషయాన్నే ప్రతిపాదిస్తున్నాయి. అందువల్ల శాస్త్రం అవిద్యాకల్పితమైన సంసారిత్వాన్ని తొలగించి నిత్యముక్తమైన ఆత్మ స్వరూపాన్ని మనకు అందజేస్తున్నది. అందుచేత మోక్షం అనిత్య మనే దోషం లేదు.

## భాష్యమ్

యస్య తూత్పాద్యో మోక్షస్తస్య మానసం, వాచికం, కాయికం వా కార్యమపేక్షతే ఇతి యుక్తమ్. తథా వికార్యత్వే చ. తయోః పక్షయోర్మోక్షస్య ధ్రువమనిత్యత్వమ్. న హి దధ్యాది వికార్యముత్పాద్యం వా ఘటాది నిత్యం దృష్టం లోకే. న చాప్యత్వేనాపి కార్యాపేక్షా, స్వాత్మరూపత్వే సత్యనాప్యత్వాత్. స్వరూపవ్యతిరిక్తత్వేఽపి బ్రహ్మణో నాప్యత్వమ్; సర్వగతత్వేన నిత్యాప్తస్వరూపత్వాత్ సర్వేణ బ్రహ్మణః ఆకాశస్యేవ. నాపి సంస్కార్యో మోక్షః, యేన వ్యాపారమపేక్షేత; సంస్కారో హి నామ సంస్కార్యస్య గుణాధానేన

వా స్యాద్దోషాపనయనేన వా.న తావద్గుణాధానేన సంభవతి; అనాధేయాతిశయ బ్రహ్మస్వరూపత్వాన్మోక్షస్య. నాపి దోషాపనయనేన; నిత్యశుద్ధబ్రహ్మ స్వరూపత్వాన్మోక్షస్య. స్వాత్మధర్మ ఏవ సంస్తిరోభూతో మోక్షః క్రియయాత్మని సంస్క్రియమాణేఽభివ్యజ్యతే, యథాఽఽదర్శే నిఘర్షణక్రియయా సంస్క్రియమాణే భాస్వరత్వం ధర్మ ఇతి చేత్, న; క్రియాశ్రయత్వానుప పత్తేర్బ్రహ్మణః. యదాశ్రయా హి క్రియా తమవికుర్వతీ నైవాత్మానం లభతే. యద్యాత్మా క్రియయా విక్రియేత అనిత్యత్వమాత్మనః ప్రసజ్యేత. "అవికార్యో ఽయముచ్యతే" ఇతి చైవమాదీని వాక్యాని బాధ్యేరన్. తచ్చానిష్టమ్. తస్మాన్న స్వాశ్రయా క్రియా ఆత్మనః సంభవతి. అన్యాశ్రయాయాస్తు క్రియాయా అవిషయత్వాన్న తయాత్మా సంస్క్రియతే.

బాలానందిని

అవ. క్రియవల్ల కలిగే ఫలం, ఉత్పత్తి, వికారం, ఆప్తి (పొందడం), సంస్కారం అనే నాల్గింటిలో ఏదో ఒకటి కావాలి. వాటిలో ఏదీ కూడ మోక్షం విషయంలో కుదరదు అని చెపుతున్నారు- యస్యేతి. మోక్షం అనేది లేనిది క్రొత్తగా పుట్టించబడుతుంది అనేవాడు, ఆ మోక్షానికి మానసికం గాని, వాచికం గాని, శారీరకం గాని అయిన ఏదో క్రియయొక్క అపేక్ష (అవసరం) ఉంటుం దని చెప్పాలి. మోక్షం వికార్యం (కొన్ని మార్పులు చేయడం వల్ల లభిస్తుంది) అనే పక్షంలో కూడ పైన చెప్పిన ఏదో ఒక క్రియ అవసర మవుతుంది అని చెప్పాలి. ఆ రెండు పక్షాలలోనూ కూడ మోక్షం అనిత్యమే అని నిశ్చితంగా చెప్పవలసి వస్తుంది. వికార్యమైన పెరుగు మొదలైనది (పాలల్లో కొంత మార్పు చేయడం చేత వచ్చిన పెరుగు మొదలైనది) గాని క్రొత్తగా పుట్టించబడిన ఘటాదికం గాని నిత్యమైనట్లు లోకంలో ఎక్కడా చూడబడలేదు కదా? ఆప్యత్వంచేత కూడా కార్యాపేక్ష లేదు; మోక్షం స్వాత్మరూపమే అయినప్పుడు దానికి ఆప్యత్యం ఎట్లుంటుంది?

వి. ఆప్య మనగా పూర్వం పొందబడనిది, ఇప్పుడు క్రొత్తగా పొందదగినది అని అర్థం. అంతకు ముందు పొందని గ్రామాన్ని పొందాలి. అది ఆప్యం. అది పొందాలంటే గమనాదిక్రియ అవసరం అవుతుంది. ఆ విధమైన ఆప్యత్యం కూడా మోక్షానికి లేదు. మోక్షం ముముక్షువుయొక్క స్వాత్మరూపమే అయినప్పుడు, ఆత్మ ఎల్లప్పుడూ తన దగ్గరనే, తానుగానే, ఉన్నప్పుడు క్రొత్తగా దానిని పొందడం అనేది ఏముంటుంది అని భావం.

స్వరూపేతి:- బ్రహ్మ ఆత్మస్వరూపం కంటె భిన్నం అని అన్నా కూడా అది ఆకాశం వలె సర్వవ్యాప్తం గాన ప్రతివాడూ, ఎల్లప్పుడు, దానిని పొందియే ఉన్నాడు కదా? మోక్షం సంస్కార్యం కూడా కాదు, సంస్కార్యం అయితే వ్యాపారాన్ని అపేక్షించి ఉండేది. సంస్కారం అనేది సంస్కార్యానికి (దేనిని సంస్కరిస్తామో దానికి) అంతకు పూర్వం లేని గుణాన్ని చేర్చడంచేత గాని దానిలోని దోషాన్ని తొలగించడంచేత గాని ఏర్పడుతుంది. ఇక్కడ గుణాన్ని కల్పించడం ద్వారా సంస్కారం చేయబడుతుంది అనేది కుదరదు; ఎందువల్ల ననగా మోక్షం అనేది ఎలాంటి అతిశయాన్నీ చేర్చడానికి శక్యం కాని బ్రహ్మయే. దోషాలను తొలగించడం ద్వారా బ్రహ్మను (మోక్షాన్ని) సంస్కరించవచ్చును అనడం కూడా కుదరదు. ఎందువల్ల ననగా మోక్షం నిత్యశుద్ధ బ్రహ్మస్వరూప మైనది. దానిలో దోషప్రసక్తి లేదని అర్థం. అద్దాన్ని గట్టిగా తుడిస్తే దానిలోనే ఉన్న మెరుపు అనే ధర్మం బైటపడినట్లు మోక్షం స్వాత్మధర్మమే అయినా అది మరుగున పడిపోయి, ఏదైన క్రియచేత ఆత్మను సంస్కరించగా అభివ్యక్తం అవుతుంది అని కూడా ఆశంకించరాదు. ఎందువల్ల ననగా ఆత్మ ఎలాటి క్రియకూ కూడా ఆశ్రయం కాజాలదు. క్రియ దేనిని ఆశ్రయించుకొని ఉంటుందో (దేని మీద జరుగుతుందో) దానిలో కొంత వికారం కలిగించకుండా ఉనికిని పొందజాలదు (పుట్టజాలదు). (క్రియ దేనిమీద జరుగుతుందో దానిమీద తప్పకుండా కొంత మార్పును కలిగించి తీరుతుంది అని భావం). అలాంటి క్రియచేత ఆత్మయందు ఏదైనా వికారం కలుగుతే అప్పుడు ఆ ఆత్మ అనిత్యం అయిపోతుంది. "అవికార్యోఽయముచ్యతే" (ఈ ఆత్మమీద ఎట్టి వికారములూ పుట్టింపబడజాలవు) ఇత్యాది వాక్యాలు బాధితము లౌతాయి. అది ఇష్టమైనది (అంగీకారయోగ్యం) కాదు. అందుచేత ఆత్మయందు ఏదైన క్రియ కలుగుతుంది అని చెప్పడం కుదరదు. మరొకదానియందు దేనియందో ఉన్న క్రియకు ఆత్మ విషయం కాదు గాన (ఆ క్రియకీ ఆత్మకీ సంబంధం ఏదీ లేదు గాన) దానిచేత ఆత్మ సంస్కరించబడదు.

## భాష్యమ్

నను దేహాశ్రయయా స్నానాచమనయజ్ఞోపవీతాదికయా క్రియయా దేహీ సంస్క్రియమాణో దృష్టః? న; దేహాదిసంహతస్యైవా విద్యాగృహీతస్యాత్మనః సంస్క్రియమాణత్వాత్. ప్రత్యక్షం హి స్నానాచమనాదేర్దేహసమవాయిత్వమ్. తయా దేహాశ్రయయా తత్సంహత ఏవ కశ్చిదవిద్యయాత్మత్వేన పరిగృహీతః

సంస్క్రియత ఇతి యుక్తమ్. యథా దేహాశ్రయచికిత్సానిమిత్తేన ధాతుసామ్యేన తత్సంహతస్య తదభిమానినః ఆరోగ్యఫలమ్ "అహమరోగః" ఇతి యత్ర బుద్ధిరుత్పద్యతే, ఏవం స్నానాచమనయజ్ఞోపవీతాదినా "అహం శుద్ధః సంస్కృతః" ఇతి బుద్ధిరుత్పద్యతే స సంస్క్రియతే. స చ దేహేన సంహత ఏవ. తేనైవ హ్యహంకర్త్రాహంప్రత్యయవిషయేణ ప్రత్యయినా సర్వాః క్రియాః క్రియన్తే, తత్ఫలం చ స ఏవాశ్నాతి "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యోఽభిచాకశీతి" (ము.ఉ.3.1.1) ఇతి మన్త్రవర్ణాత్. "ఆత్మేన్ద్రియమనో యుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (క.ఉ.1.3.4) ఇతి చ. తథా "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా, కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" (శ్వే.ఉ.6.11) ఇతి, "స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్" (ఈ.ఉ.8) ఇతి చ. ఏతౌ మన్త్రౌ అనాధేయాతిశయతాం నిత్యశుద్ధతాం చ బ్రహ్మణో దర్శయతః. బ్రహ్మభావశ్చ మోక్షః. తస్మాన్న సంస్కార్యోఽపి మోక్షః. అతోఽన్యన్మోక్షం ప్రతి క్రియానుప్రవేశద్వారం న శక్యం కేన చిద్దర్శయితుమ్. తస్మాద్ జ్ఞానమేకం ముక్త్వా క్రియాయా గన్ధమాత్రస్యాప్యనుప్రవేశ ఇహ నోపపద్యతే.

### బాలానందిని

నన్వితి:- (ప్రశ్న): దేహానికి సంబంధించిన స్నాన-ఆచమన-యజ్ఞోపవీతధారణాది క్రియచేత దేహి యైన జీవుడు సంస్కరించబడుచున్నట్లుగా చూస్తున్నాం కదా? (సమాధానం)- కాదు; అక్కడ కూడ దేహాదులతో కలిసి ఉన్న అవిద్యాగృహీతుడైన (అవిద్యతో సంబంధించిన) ఆత్మయే సంస్కరించబడుచున్నది. స్నానాచమనాదికం దేహంతో సంబంధించి ఉండడం ప్రత్యక్షమే కదా? దేహాన్ని ఆశ్రయించి ఉన్న ఆ క్రియచేత ఆ దేహంతోనే సంబంధించినవాడూ, అవిద్యచేత ఆత్మగా గ్రహింపబడినవాడూ అయిన ఒకడు (ఒక జీవుడు) సంస్కరించబడుచున్నాడు అని చెప్పడమే యుక్తం. దేహానికి చేసిన చికిత్సవల్ల ఏర్పడిన ధాతుసామ్యంచేత (స్వాస్థ్యంచేత) ఆ దేహంతో సంబంధించినవాడు ఆ దేహమే నేను అనుకొనేవాడూ అయిన జీవునికే, "నేను రోగం లేనివాడను అయ్యాను" అనుకొనేవానికే ఆరోగ్యరూపమైన ఫలం ఏ విధంగా చెందుతుందో అదే విధంగా స్నానాచమనయజ్ఞోపవీతాదులచేత "నేను ఇప్పుడు పరిశుద్ధుడనుగా అయ్యాను, సంస్కరింపబడ్డాను" అని ఎవడు అనుకుంటాడో అతడే

సంస్కరించబడతాడు. అలా అనుకొనేవాడు దేహంతో కలిసియే ఉన్నాడు. 'అహం' అని అనుకొనేవాడు, అహంకారానికి (నేను అనే భావానికి) గోచరుడు అయిన అతనిచేతనే సమస్తక్రియలూ చేయబడుచున్నాయి, అతడే వాటి ఫలం అనుభవిస్తున్నాడు కదా? ఈ విషయాన్నే "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో ఽభిచాకశీతి" (ఆ రెండింటిలో ఒకటి కర్మ ఫలాన్ని చక్కగా తింటున్నది, రెండవది తినకుండా చూస్తున్నది) "ఆత్మేన్ద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (దేహ-ఇంద్రియ-మనస్సులతో కూడిన వానినే భోక్త అని బుద్ధిమంతులు చెప్పుచున్నారు) ఇత్యాదిమంత్రాలు తెలుపుచున్నాయి. అట్లే-

"ఏకో దేవ సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా,
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"

(సమస్త ప్రాణులలోను ఉన్న ఒకే దేవుడు, పైకి కనబడనివాడు, అంతటా వ్యాపించిన వాడు, సమస్తభూతాలకి అంతరాత్మ, కర్మలకు అధ్యక్షుడు, సకలభూతాలకు నివాసస్థాన మైనవాడు, సాక్షి, చైతన్యస్వరూపుడు, ఒంటరి, నిర్గుణుడు)అని, "స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్" (ప్రకాశించేది, లింగశరీరశూన్యము, దేనిచేతా కొట్టబడనిది, నాశరహితము, పరిశుద్ధము, పాపపీడితం కానిదీ అయిన ఆ ఆత్మ అంతటా వ్యాపించి ఉన్నది) అను ఈ మంత్రాలు బ్రహ్మయందు ఎలాంటి క్రొత్త అతిశయము చేర్చడానికి శక్యం కాదనీ, అది నిత్యశుద్ధ మనీ చూపుచున్నాయి. అలాంటి బ్రహ్మగా అవడమే మోక్షం అనగా. అందుచేత మోక్షం సంస్కార్యం కాదు. (దేహానికి చేసిన స్నానాదిసంస్కారాలచేత సంస్కరింపబడేది దేహాభిమానం గల జీవుడే కాని తత్సాక్షిగా ఉన్న శుద్ధమైన ఆత్మ (బ్రహ్మ) కాదు అని భావం). మోక్షం విషయంలో క్రియ ప్రవేశించడానికి పైన చెప్పిన ఉత్పత్తి-ఆప్తి-వికార - సంస్కృతులు తప్ప మరొక ద్వారం ఏదీ ఎవ్వరూ చూపజాలదు. అందుచేత ఈ బ్రహ్మ విషయంలో ఒక్క జ్ఞానం తప్ప మరి ఏ క్రియకీ ఈషన్మాత్రం కూడ ప్రవేశం లేదు.

## భాష్యమ్

నను జ్ఞానం నామ మానసీ క్రియా? న; వైలక్షణ్యాత్. క్రియా హి నామ సా యత్ర వస్తునిరపేక్షైవ చోద్యతే, పురుషచిత్తవ్యాపారాధీనా చ; యథా- "యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్తాం మనసా ధ్యాయేద్వషట్కరిష్యన్" ఇతి. "సంధ్యాం మనసా ధ్యాయేత్" (ఐ.బ్రా.3.8.1) ఇతి చైవమాదిషు ధ్యానం

చిన్తనం యద్యపి మానసం, తథాపి పురుషేణ కర్తుమకర్తుమన్యథా వా కర్తుం శక్యం, పురుషతన్త్రత్వాత్. జ్ఞానం తు ప్రమాణజన్యమ్; ప్రమాణం చ యథాభూతవస్తువిషయమ్. అతో జ్ఞానం కర్తుమకర్తుమన్యథా వా కర్తుమశక్యం, కేవలం వస్తుతన్త్రమేవ తత్, న చోదనాతన్త్రమ్, నాపి పురుషతన్త్రమ్. తస్మాన్మానసత్వేఽపి జ్ఞానస్య మహద్వైలక్షణ్యమ్. యథా చ 'పురుషో వావ గోతమాగ్నిః "యోషా వావ గోతమాగ్నిః" (ఛాం.ఉ.5.7.8.1) ఇత్యత్ర యోషిత్పురుషయోరగ్నిబుద్ధిర్మానసీ భవతి కేవలచోదనాజన్యత్వాత్ క్రియైవ సా పురుషతన్త్రా చ; యా తు ప్రసిద్ధేఽ గ్నావగ్నిబుద్ధిర్న సా చోదనాతన్త్రా, నాపి పురుషతన్త్రా, కిం తర్హి? ప్రత్యక్షవిషయవస్తుతన్త్రైవేతి జ్ఞానమేవైతన్న క్రియా. ఏవం సర్వప్రమాణవిషయవస్తుషు వేదితవ్యమ్. తత్రైవం సతి యథాభూత బ్రహ్మాత్మవిషయమపి జ్ఞానం న చోదనాతన్త్రమ్. తద్విషయే లిఙాదయః శ్రూయమాణా అపి అనియోజ్యవిషయత్వాత్ కుణ్ఠీభవన్త్యుపలాదిషు ప్రయుక్తక్షురతైక్ష్ణ్యాదివత్, అహేయానుపాదేయవస్తువిషయత్వాత్.

### బాలానందిని

నన్వితి:- (ప్రశ్న)- జ్ఞానం అనేది కూడా మనస్సుచేత చేసే క్రియయే కదా? (సమాధానం)- కాదు; చాలా భేదం ఉంది. వస్తువుయొక్క స్వరూపం అపేక్ష ఏమీ లేకుండా, చేయమని ఏది విధించబడుతుందో, ఏది పురుషుని చిత్తంయొక్క వ్యాపారంమీద ఆధారపడి ఉంటుందో అది క్రియ. ఉదాహరణకి- "యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్తాం మనసా ధ్యాయేత్" (ఏ దేవతకు ఇవ్వడానికి హవిస్సు గ్రహించబడుతుందో ఆ దేవతను మనస్సులో ధ్యానించాలి) అని, "సన్ధ్యాం మనసా ధ్యాయేత్" (సంధ్యను మనస్సులో ధ్యానించాలి) అని ఈ విధమైనవాటిలో ధ్యానం, అనగా చింతనం, మనస్సుతో చేసేదైనా దానిని పురుషుడు చేయవచ్చు, మానవచ్చు, మరొక విధంగా నైనా చేయువచ్చు; ఏది చేయడానికీ అతనికి స్వాతంత్ర్యం ఉంది. అయితే జ్ఞానం ప్రమాణాలవల్లనే పుడుతుంది (గాని పురుషుడు ప్రయత్నిస్తే పుట్టదు). చక్షురాదిప్రమాణం ఒక వస్తువు ఎలా ఉందో దానిని ఉన్న దున్నట్లుగా గ్రహిస్తుంది. అందుచేత జ్ఞానాన్ని చెయ్యాలంటే చేయడానికీ, మానాలంటే మానడానికీ, మరో విధంగా చేయడానికీ కుదరదు. అది కేవలం వస్తువుయొక్క స్వరూపం మీదనే ఆధారపడి ఉంటుంది. ప్రేరేపణ (విధి) మీద ఆధారపడదు, అనగా ఇది ఇలా

తెలుసుకో అని ఆజ్ఞాపిస్తే వస్తుజ్ఞానం ప్రత్యక్షాదులవల్ల కలగదు. పురుషుని ఇష్టానిష్టాల మీద ఆధారపడదు. (చలిగా ఉన్నప్పుడు నాకు వేడిగా కనబడాలి అనుకున్నా అలా జరగదు; గుల్లం గుల్లంగానే కనబడుతుంది గాని నాకిక్కడ ఏనుగు కనబడాలి అంటే ఏనుగు కనబడదు). అందువల్ల (ధ్యానం వలె) జ్ఞానం మానసమే అయినా జ్ఞానానికీ దానికీ చాలా భేదం ఉంది. "పురుషో వా వ గౌతమాగ్నిః" (ఓ! గౌతమా! పురుషుడే అగ్ని) "యోషా వా వ గౌతమాగ్నిః" (ఓ గౌతమా! స్త్రీయే అగ్ని) ఇత్యాదులలో స్త్రీ, పురుషుల విషయంలో అగ్నిబుద్ధి (స్త్రీని, పురుషుణ్ణి అగ్నిగా భావించడం) మానసికమే. అనగా మనస్సుచేత చేయబడుతుంది. అయితే ఇది కేవలం చోదనవల్ల (ఇలా భావించు అని చెప్పడంవల్ల) కలిగినది గాన అది క్రియ మాత్రమే; అందుచేత పురుషుని ఇష్టానిష్టాల మీద ఆధారపడి ఉన్నది. అయితే ప్రసిద్ధమైన అగ్నిమీద దృష్టి పడగానే కలిగే 'ఇది అగ్ని' అనే బుద్ధి చోదనమీద ఆధారపడి లేదు. పురుషుని ఇచ్ఛానిచ్ఛల మీద ఆధారపడినది కాదు; మరేమనగా- ప్రత్యక్షజ్ఞానానికి విషయమైన వస్తువుమీద ఆధారపడినదే. అందుచేత ఇది 'అగ్ని' అనేది జ్ఞానమే కాని క్రియ కాదు. అదే విధంగా చక్షురాదిప్రమాణాలకు విషయాలైన అన్ని వస్తువుల విషయంలోను ఇట్లే గ్రహించాలి. అందుచేత యథార్థంగా ఉన్న బ్రహ్మాత్మత్వానికి సంబంధించిన జ్ఞానం కూడా చోదనమీద ఆధారపడినది కాదు. (వస్తుస్వభావాన్ని పట్టి ఏర్పడినదే). బ్రహ్మాత్మజ్ఞానం విషయంలో లిఙ్, తవ్యప్రత్యయం మొదలైన విధిబోధకాలైన ప్రత్యయాలు కనబడినా, వాటి విషయాన్ని గూర్చి నియోగించడం (ఇలా చెయ్యి అని చెప్పడం) కుదరదు గాన, అవన్నీ బండ్రాయి మొదలైనవాటిమీద ప్రయోగించిన కత్తి పదును వలె మొరపోతాయి; వ్యర్థం అవుతాయి; ఎందువల్ల ననగా అవి హేయం (పరిహరించ దగినది) లేదా ఉపాదేయం (గ్రహించ దగినది) కాని (హేయమూ ఉపాదేయమూ కూడ కాని) వస్తువువిషయంలో ప్రయోగించబడ్డాయి.

## భాష్యమ్

కిమర్థాని తర్హి "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" ఇత్యాదీని విధిచ్ఛాయాని వచనాని? స్వాభావికప్రవృత్తివిషయవిముఖీకరణార్థానీతి బ్రూమః. యో హి బహిర్ముఖః ప్రవర్తతే పురుషః ఇష్టం మే భూయాదనిష్టం మా భూదితి, న చ తత్రాత్యన్తికం పురుషార్థం లభతే, తమాత్యన్తిక పురుషార్థవాఞ్ఛినం స్వాభావికకార్యకరణసంఘాతప్రవృత్తిగోచరాద్వి ముఖీకృత్య ప్రత్యగాత్మస్రోతస్తయా

ప్రవర్తయన్తి "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాదీని. తస్యాత్మాన్వేషణాయ ప్రవృత్తస్య అహేయమనుపాదేయం చ ఆత్మతత్త్వముపదిశ్యతే- "ఇదం సర్వం యదయమాత్మా (బృ.ఉ.2.4.6) "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్ కేన కం విజానీయాత్. విజ్ఞాతారమరే కేన విజానీయాత్ (బృ.ఉ.4.5.15) "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాదిభిః. యదప్యకర్తవ్యప్రధానమాత్మజ్ఞానం హానాయోపాదానాయ వా న భవతీతి తత్తథైవేత్యభ్యుపగమ్యతే. అలఙ్కారో హ్యాయమస్మాకం యద్బ్రహ్మాత్మావగతౌ సత్యాం సర్వకర్తవ్యతాహానిః కృతకృత్యతా చేతి. తథా చ శ్రుతిః-

"ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్" (బృ.ఉ. 4.4.12) ఇతి,
"ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృత్యశ్చ భారత" (భ.గీ. 15.20) ఇతి చ స్మృతిః. తస్మాన్న ప్రతిపత్తివిధివిషయతయా బ్రహ్మణః సమర్పణమ్.

బాలానందిని

కిమర్థానీతి :- అట్లయితే - ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః" మొదలైన విధి వాక్యాలవలె కనబడే వాక్యాలు ఎందుకు? ఇవి స్వాభావికమైన మానవప్రవృత్తికి విషయాలైన శబ్దస్పర్శాదులనుండి మానవులను విముఖులను చేయడం కోసం అని చెపుతాం. బహిర్ముఖుడైన (ప్రాపంచికవిషయాలమీదనే ఆసక్తి గల) ఏ మానవుడు నాకు ఇష్టం కలగాలి, అనిష్టం కలగకూడదు అని అనుకొంటూ లౌకికవ్యవహారాలలో ప్రవర్తిస్తూంటాడో, కాని వాటిలో ఆత్యంతికపురుషార్థాన్ని (శాశ్వతసుఖాన్ని) పొందజాలడో, ఆత్యంతికపురుషార్థం కావాలని మాత్రం మనస్సులో కోరిక ఉన్న వానిని శరీరేంద్రియాదులు సహజంగా ఏ విషయాలను గూర్చి పరుగెత్తుతూంటాయో వాటినుండి విముఖుణ్ణి చేసి ప్రత్యగాత్మ వైపు త్రిప్పడం కోసమే "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాది వాక్యాలు ఉపయోగిస్తాయి. అప్పుడు అతడు ఆత్మాన్వేషణం కోసం ప్రవర్తించగా వానికి - "ఇదం సర్వం యదయమాత్మా" (ఇదంతా ఆత్మయే), "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్, కేన కం విజానీయాత్, విజ్ఞాతారమరే కేన విజానీయాత్" ఎవనికి ఇదంతా ఆత్మగానే గోచరిస్తుందో అతడు ఇంక దేనిచేత దేనిని చూస్తాడు? దేనిచేత దేనిని తెలుసుకొంటాడు? తెలుసుకొనేవానిని దేనిచేత తెలుసుకుంటాడు?) "అయమాత్మా బ్రహ్మ" (ఈ ఆత్మయే బ్రహ్మ) ఇత్యాదివాక్యాలచేత

ఆత్మతత్త్వం ఉపదేశించబడుతుంది.

ఆత్మజ్ఞానం కర్తవ్యప్రధానంగా లేదు, అనగా సిద్ధమైన బ్రహ్మను గూర్చి చెప్పే పక్షంలో చేయవలసిన పని ఏదీ ఉండదు. అలాంటప్పుడు ఈ ఆత్మజ్ఞానం దేనినైనా విడిచిపెట్టడానికి గాని, దేనినైన గ్రహించడానికి గాని ఉపయోగించదు కదా అని నీచేత (పూర్వపక్షిచేత) ఏ ఆక్షేపం చేయబడిందో అది నిజమే అని అంగీకరించబడుతుంది. బ్రహ్మజ్ఞానం కలిగిన తరవాత ఇంక చేయవలసినది ఏదీ ఉండదు; తావన్మాత్రంచేతనే కృతకృత్యత్వం లభిస్తుంది అని అంటే అది మాకొక అలంకారమే కదా? (మేం) చెప్పదలచిన ప్రధానవిషయమే అది కదా? "ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్" (ఈ పరమాత్మయే నేను అని తనను గూర్చి తెలుసుకొన్నవాడు ఇంక ఏమి కావాలని, ఎవని కోసం బాధపడుతున్న శరీరంతో కలిసి బాధపడతాడు? "ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత" (అర్జునా! రహస్యమైన ఈ తత్త్వాన్ని తెలుసుకొని బుద్ధిమంతుడుగాను కృతకృత్యుడు గాను అవుతాడు అను స్మృతీ కూడ ఈ విషయాన్నే చెపుతున్నాయి. అందువల్ల బ్రహ్మను వేదాంతాలు ప్రతిపత్తివిధివిషయంగా బోధించుట లేదు.

## భాష్యమ్

యదపి కేచిదాహుః- "ప్రవృత్తివిధితచ్ఛేషవ్యతిరేకేణ కేవలవస్తువాదీ వేద భాగో నాస్తి" ఇతి తన్న, ఔపనిషదస్య పురుషస్య అనన్యశేషత్వాత్. యోఽసావుపనిషత్స్వేవాధిగతః పురుషోఽసంసారీ బ్రహ్మ ఉత్పాద్యాదిచతుర్విధ ద్రవ్యవిలక్షణః, స్వప్రకరణస్థః, అనన్యశేషః, నాసౌ నాస్తి నాధిగమ్యత ఇతి వా శక్యం వదితుమ్. "స ఏష నేతి నేత్యాత్మా" (బృ.ఉ. 3.9.26) ఇత్యాత్మ శబ్దాత్. ఆత్మనశ్చ ప్రత్యాఖ్యాతుమశక్యత్వాత్. య ఏవ నిరాకర్తా తస్యైవాత్మత్వాత్.

అవ : ఇప్పుడు ప్రాభాకరుల మతాన్ని అనువదించి నిరాకరించుచున్నారు. భాట్టులు ప్రాభాకరులు కూడ బ్రహ్మ అనేదే లేదు అని అంటారు. ఆ విషయంలో ఇద్దరికీ ఏకాభిప్రాయమే. కాని భాట్టులు సిద్ధవస్తువునందు కూడ పదాలకు శక్తి ఉందని అంగీకరిస్తారు. ప్రాభాకరుల మతం ప్రకారం పదాలకు కార్యాన్వితమైన అర్థమునందే శక్తి. 'అత్రాపరే ప్రత్యవతిష్ఠన్తే' ఇత్యాదిభాష్యభాగంలో అనువదించి ఖండించబడిన

మతం వృత్తికారుల దని రత్నప్రభాకారులు వ్రాశారు. ఆ వృత్తికారు లెవరో తెలియదు. అది వేదాంత్యేకదేశీయుల (వేదాంతులలోనే ఒక పక్షానికి చెందినవారి) మతం అని వాచస్పతిమిశ్రు లన్నారు. ఈ మతంలోను ప్రాభాకరమతంలోను కూడ పదాలకి కార్యాన్వితార్థమునందే శక్తి అనేది సమానమే కాని మొదటివాళ్లు బ్రహ్మాస్తిత్వాన్ని అంగీకరిస్తారు, ప్రాభాకరులు అంగీకరించరు.

యదపి కేచిదితి:- "ప్రవర్తనను విధించేది, దానికి అంగము అయిన వాటిని తప్ప కేవలం వస్తువును మాత్రమే బోధించే వేదభాగమే లేదు" అని కొందరు అంటూన్నది యుక్తం కాదు. ఎందువల్ల ననగా ఉపనిషత్తులచే ప్రతిపాదించబడు పురుషుడు మరొకదానికి దేనికీ అంగం కాడు. ఉపనిషత్తుల ద్వారా మాత్రమే తెలియబడుతూన్న సంసారం లేనివాడు, ఉత్పాద్య-ఆప్య-వికార్య-సంస్కార్యాలనే నాలుగువిధాలైన ద్రవ్యాలకంటె విలక్షణుడు, తన ప్రకరణంలో స్వతంత్రంగా బోధించబడినవాడు, అందుచేతనే దేనికీ అంగం కానివాడు అయిన ఏ పురుషుడు అనగా బ్రహ్మ ఉన్నాడో ఆ పురుషుడు లేడు అని కాని, తెలియబడుటలేదని గాని చెప్పడం కుదరదు. "స ఏష నేతి నేత్యాత్మా" (ఇది కాదు ఇది కాదు అని దృశ్యమైన వాటి నన్నింటినీ నిషేధించి ఏది ఉపదేశించబడిందో ఆ ఆత్మ ఇది) అని శ్రుతివాక్యంలో 'ఆత్మ' శబ్దం ఉపయోగించబడింది. అనగా అదే ఆత్మ అని చెప్పబడింది. ఆత్మ (తాను) నిరాకరింప శక్యమైనది కాదు. ఎందువల్ల ననగా ఎవడు నిరాకరిస్తున్నాడో అతడే ఆత్మ.

వి. 'స్వప్రకరణస్థః' అనగా తనను గూర్చి చెప్పిన ప్రకరణంలో ప్రధానంగా చెప్పబడినది అని అర్థం. ఏదైన ఒక విషయాన్ని చెప్పే సందర్భంలో మరొక విషయం కూడ చెప్పినట్లయితే అది ప్రధానంగా చెప్పే విషయానికి అంగం అని చెప్పవచ్చును. కాని ఆ ప్రకరణం అంతా ఆ విషయాన్ని గూర్చియే చెప్పేటప్పుడు అది మరొక దానికి దేనికీ అంగం కాజాలదు. ఆత్మను గూర్చి ప్రధానంగా చెప్పే ఘట్టంలో అది మరి దేనికీ అంగం కాదు అని అర్థం.

## భాష్యమ్

నన్వాత్మాహంప్రత్యయవిషయత్వాదుపనిషత్స్వేవ విజ్ఞాయత ఇత్యనుపపన్నమ్? న.తత్సాక్షిత్వేన ప్రత్యుక్తత్వాత్. న హ్యహంప్రత్యయవిషయ కర్తృవ్యతిరేకేణ తత్సాక్షీ సర్వభూతస్థః, సమ, ఏకః, కూటస్థనిత్యః పురుషో విధికాణ్డే, తర్కసమయే వా కేన చిదధిగతః సర్వస్యాత్మా; అతః స న

కేనచిత్ప్రత్యాఖ్యాతుం శక్యో విధిశేషత్వం వా నేతుమ్. ఆత్మత్వాదేవ చ సర్వేషాం న హేయో నాప్యుపాదేయః, సర్వం హి వినశ్యద్వికారజాతం పురుషాన్తం వినశ్యతి. పురుషో హి వినాశహేత్వభావాన్న వినాశీ. విక్రియాహేత్వభావాచ్చ కూటస్థనిత్యః. అత ఏవ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః. తస్మాత్ "పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" (క. ఉ. 1.3.11)" తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ.ఉ.3.9.26) ఇతి చౌపనిషదత్వ విశేషణం పురుషస్యోపనిషత్సు ప్రాధాన్యేన ప్రకాశ్యమానత్వే ఉపపద్యతే. అతో భూతవస్తుపరో వేదభాగో నాస్తీతి వచనం సాహసమాత్రమ్.

బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) ఆత్మ "నేను" అనే జ్ఞానంలో విషయంగా ఉన్నది కదా? అలాం టప్పుడు అది ఉపనిషత్తులలో మాత్రమే తెలియుచున్నది అని చెప్పడం అయుక్తం కదా? (సమాధానం) అది యుక్తం కాదు. దానికి సాక్షి యైనదే ఆత్మ అని చెప్పి అది అహంధీవిషయం అనే మాట నిరాకరించబడింది.

వి: 'నేను' అనే ప్రత్యయంలో అంతఃకరణాదివిశిష్టమైన ఆత్మ గోచరిస్తున్నది కాని ఈ అంతఃకరణాదులకంటె అత్యంతభిన్నంగా, వాటికి సాక్షిగా ఉన్న ఆత్మ భాసించడం లేదు. ఉపనిషత్తులలో ప్రధానంగా చెప్పబడేది ఆ ఆత్మయే కాని అహంప్రత్యయగోచరమైన ఆత్మ కాదు అని అర్థం.

న హీతి : 'నేను' అనే జ్ఞానంలో విషయమైన (అంతఃకరణాదివిశిష్టుడైన) కర్తకంటె భిన్నంగా ఆ కర్తకు సాక్షిగా ఉన్నవాడు సమస్తభూతాలలో (ప్రాణులలో) ఉన్నవాడు, సమానమైనవాడు, రెండవది లేనివాడు, ఎట్టి మార్పులు చెందని విధంగా నిత్యమైనవాడు అయిన పురుషుడు (బ్రహ్మ) అందరికీ ఆత్మగా, కర్మకాండప్రతిపాదకమైన శాస్త్రంలో గాని, తర్కశాస్త్రంలో గాని ఎవ్వరిచేతా తెలియబడలేదు కదా? (ఇతరప్రమాణాలు వేటిచేతా తెలియబడనివాడు, కేవలం వేదాంతాల ద్వారా మాత్రమే తెలియబడేవాడు అయిన) ఆ పురుషుడు లేడని చెప్పడానికి గాని, మరొకదానికి దేనికైనా అంగంగా చేయబడడానికి గాని శక్యం కాదు గదా? ఆ పురుషుడు (బ్రహ్మ) అందరికీ ఆత్మయైనవాడు, అందుచేత వానిని విడిచిపెట్టడం గాని, క్రొత్తగా సంపాదించడం గాని కుదరదు. వికార (కార్య) సముదాయం అంతా నశించే టప్పుడు ఆ పురుషునివరకు మాత్రమే నశిస్తుంది.

పురుషుడైతే నశించడానికి కారణం ఏదీ లేదు గాన నాశరహితుడు. ఎలాంటి వికారాలకీ కారణం లేకపోవడంవల్ల కూటస్థనిత్యుడు. అందుచేతనే నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడు. "పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" (ఆ పురుషునికంటె పరమైనది మరొకటి ఏదీ లేదు, ఆ పురుషుడే పరాకాష్ఠ, అతడే అత్యుత్తమమైన గతి), "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (ఉపనిషత్తులచేత ప్రతిపాదింపబడే) ఈ పురుషుణ్ణి గూర్చి అడుగుచున్నాను) అని పురుషునికి ఉపయోగించిన 'ఔపనిషద' అనే విశేషణం ఉపనిషత్తులు ఆ పురుషుణ్ణి ప్రధానంగా ప్రతిపాదిస్తేనే యుక్తంగా ఉంటుంది. ('పురుషాన్న పరం' ఇత్యాది వాక్యంలో 'ఔపనిషద' అనే విశేషణం లేకపోయినా ఆ వాక్యంవల్ల ఉపనిషత్తులలో ఆ పురుషుడే ప్రధానంగా చెప్పబడుచున్నాడు అని స్పష్టీకరించుచున్న దని భావం). అందుచేత భూతమైన (సిద్ధమైన) వస్తువును ప్రధానంగా బోధించే వేదభాగం లేదనడం సాహసమే.

## భాష్యమ్

౬౨. యదపి శాస్త్రతాత్పర్యవిదామనుక్రమణమ్ - "దృష్టోహి తస్యార్థః కర్మావబోధనమ్" ఇత్యేవమాది తద్ధర్మజిజ్ఞాసావిషయత్వాద్విధిప్రతిషేధ శాస్త్రాభిప్రాయం ద్రష్టవ్యమ్. అపి చ "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్య మతదర్థానామ్' ఇత్యేతదేకాన్తేనాభ్యుపగచ్ఛతాం భూతోపదేశానర్థక్యప్రసఙ్గః. ప్రవృత్తినివృత్తివ్యతిరేకేణ భూతం చేద్వస్తూపదిశతి భవ్యార్థత్వేన, కూటస్థనిత్యం భూతం నోపదిశతీతి కో హేతుః? న హి భూతముపదిశ్యమానం క్రియా భవతి. అక్రియాత్వేఽపి భూతస్య క్రియాసాధనత్వాత్ క్రియార్థ ఏవ భూతోపదేశ ఇతి చేత్, నైష దోషః. క్రియార్థత్వేఽపి క్రియానిర్వర్తనశక్తిమద్వస్తూ పదిష్టమేవ; క్రియార్థత్వం తు ప్రయోజనం తస్య. న చైతావతా వస్త్వనుపదిష్టం భవతి. యది నామోపదిష్టం కిం తవ తేన స్యాదితి? ఉచ్యతే - అనవగతాత్మ వస్తూపదేశశ్చ తథైవ భవితుమర్హతి. తదవగత్యా మిథ్యాజ్ఞానస్య సంసారహే తోర్నివృత్తిః ప్రయోజనం క్రియతే ఇత్యవిశిష్టమర్థవత్త్వం క్రియాసాధన వస్తూపదేశేన.

## బాలానందిని

యదపీతి:- శాస్త్రతాత్పర్యవేత్తలైన శబరాచార్యాదుల "దృష్టో హి తస్యార్థః కర్మావ బోధనమ్" ఇత్యాదివాక్య మేది ఉన్నదో అది ధర్మజిజ్ఞాసను గూర్చి చెప్పబడినది గాన

విధి - ప్రతిషేధశాస్త్రాల విషయంలో చెప్పబడినది అని గ్రహించాలి. మరొక విషయం ఏ మనగా - "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్" అనే మాటనే గట్టిగా పట్టుకొని కూర్చుంటే భూతవస్తువులను గూర్చి చెప్పడం వ్యర్థం అనవలసివస్తుంది. ప్రవృత్తిని నివృత్తినీ కాక, శాస్త్రం భవ్యంకొరకు (క్రొత్తగా చేయదగిన కార్యంకొరకు) భూతవస్తువును బోధిస్తూన్నది అని చెప్పినట్లయితే (ఆ భూతవస్తువును చెప్పినట్లే) కూటస్థనిత్య మైన (బ్రహ్మరూపమైన) భూతవస్తువును మాత్రం బోధించదు అని చెప్పడానికి హేతు వేమిటి?

వి: "ప్రవృత్తినివృత్తివిధితచ్ఛేషవ్యతిరేకేణ" అని రత్నప్రభాసహితమైన ప్రతిలోని పాఠంకంటె "ప్రవృత్తినివృత్తివ్యతిరేకేణ" అని భామతీపాఠం బాగున్నది. అది తీసికొన బడింది. వేదం భూతవస్తువును బోధించదు అని అంటే "సోమేన యజేత' (సోమంతో యాగం చెయ్యాలి) 'దధ్నా జుహోతి' (పెరుగుతో హోమం చెయ్యాలి) ఇత్యాదివాక్యాలలో ఉన్న 'సోమ' 'దధి' ఇత్యాదిభూతవస్తుప్రతిపాదకపదాలు అర్థరహితా లవుతాయి అనే ఆక్షేపణకు పూర్వపక్షి సమాధానం-భూతవస్తుప్రతిపాదకపదాలు వ్యర్థం కావు, అవి భవ్యమైన అనగా చేయదగిన, యాగాదులకు అంగంగా విధింపబడుతున్నాయి అని. ఏదో విధంగా భూతం ఉపదేశం చేయబడుతుంది అని నువ్వే అంగీకరిస్తున్నావు కదా? భవ్యంకొరకు కాకపోయినా స్వతంత్రంగా మాత్రం భూతబ్రహ్మోపదేశం అంగీకరించడంలో తప్పేముంది అని సిద్ధాంతి అభిప్రాయం. ఇదే ఈ ప్రఘట్టకంలోని భావం.

న హీతి:- ఉపదేశింపబడుచున్న (చెప్పబడుతున్న) భూతవస్తువు భూతవస్తువే కాని క్రియ కాజాలదు కదా? (ప్రశ్న) నిజమే; భూతం క్రియ కాదు; భూతం క్రియ కాకపోయినా అది క్రియకొర్కై ఉపదేశించబడుతున్నది కదా? (సమాధానం) ఇదొక దోషం కాదు. క్రియకోసం ఉపదేశించినా క్రియను జరిపే శక్తి గల వస్తువు ఉపదేశించబడింది కదా? అలా చెప్పబడిన వస్తువుకు ప్రయోజనం మాత్రం క్రియను నిర్వర్తించడం అయితే కావచ్చు. తావన్మాత్రంచేత భూతవస్తువును చెప్పనట్లు కాదు కదా? (ప్రశ్న) సరే! ఉపదేశించబడిందనే అనుకో; దానివల్ల నీకేం వచ్చింది? (సమాధానం) చెపుతున్నాను, విను - ఇతర ప్రమాణాలు వేటిచేతా తెలియబడని ఆత్మవస్తువుయొక్క ఉపదేశం కూడ అట్లే (సప్రయోజనం) అవడానికి తగి యుంది. అలాంటి ఆత్మవస్తువును తెలుసుకొనడంచేత సంసారానికి హేతువైన మిథ్యాజ్ఞానం తొలగిపోవడమే దానికి ప్రయోజనంగా చెప్పబడుతుంది. అందుచేత ప్రయోజనవత్త్వం (ఏదో ఒక ప్రయోజనం ఉండడం అనేది) భూతవస్తువును భవ్యార్థం బోధించినా,

స్వతంత్రంగా బోధించినా సమానమే.

భాష్యమ్

అపి చ "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇతి చైవమాద్యా నివృత్తిరుపదిశ్యతే. న చ సా క్రియా, నాపి క్రియాసాధనమ్. అక్రియార్థానాముపదేశోఽ నర్థకశ్చేత్ "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాదినివృత్త్యుపదేశానర్థక్యం ప్రాప్తమ్, తచ్చానిష్టమ్. న చ స్వభావప్రాప్తహన్త్యర్థానురాగేణ నఞః శక్యమప్రాప్త క్రియార్థత్వం కల్పయితుం హననక్రియానివృత్త్యౌదాసీన్యవ్యతిరేకేణ. నఞశ్చైష స్వభావో యత్స్వసంబన్ధినోఽభావం బోధయతీతి. అభావబుద్ధిశ్చౌదాసీన్య కారణమ్, సా చ దగ్ధేన్ధనాగ్నివత్స్వయమేవోపశామ్యతి. తస్మాత్ప్రసక్త క్రియాప్రవృత్త్యౌదాసీన్యమేవ "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాదిషు ప్రతిషేధార్థం మన్యామహే, అన్యత్ర ప్రజాపతివ్రతాదిభ్యః. తస్మాత్పురుషార్థా నుపయోగ్యుపాఖ్యానాదిభూతార్థవాద విషయమానర్థక్యాభిధానం ద్రష్టవ్యమ్.

బాలానందిని

అపి చేతి:- మరొక విషయ మేమనగా - బ్రాహ్మణో న హన్తవ్యః" (బ్రాహ్మణుడు చంపబడగూడదు) మొదలైన నివృత్తి (చంపకుండా ఉండడం) ఉపదేశించబడుచున్నది. అది క్రియా కాదు, క్రియకు సాధనం కూడ కాదు. క్రియార్థములు కానివాటి ఉపదేశం వ్యర్థం అన్నట్లయితే "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాది నివృత్త్యుపదేశాలు వ్యర్థములు కావలసివస్తుంది. అది ఇష్టం కాదు. చంపడం అనే క్రియనుండి ఔదాసీన్యం తప్ప అనగా చంపకుండా ఉండడం తప్ప ఇక్కడ 'నఞ్'కు స్వభావంచేత ప్రాప్తమైన హన్త్యర్థమునందు అనురాగంతో సంబంధం ఏర్పరచి ప్రాప్తముకాని క్రియ అనే అర్థం కల్పించడం శక్యం కాదు.

వి : చంపడం అనేదానియందు సహజంగా అనురాగం (ఆసక్తి) ఏ కోపాదుల చేతనో ఉంటుంది. నఞ్‌కు ఆ అనురాగంతో సంబంధం కల్పించి 'న హన్యాత్' అనే దానికి "చంపడానికి విరుద్ధమైన సంకల్పం అనే క్రియను చెయ్యాలి" అని అర్థం చెపుతాం, అప్పుడు ఇలాంటి నిషేధవాక్యాలకు కూడ క్రియాసంబంధం ఉన్నదని చెప్పవచ్చును కదా అని ఆశంకించుకొని దానికి సమాధానంగా పై వాక్యం ("న చ..... వ్యతిరేకేణ") చెప్పబడింది. 'నఞ్'కు ముఖ్యార్థం అభావం. ఔదాసీన్యం (పని చేయకుండా ఉండడం) పురుషుని స్వరూపం. ఇక్కడ హననక్రియనుండి నివర్తించడం

అనేదానితో సంబంధించినది ఈ ఔదాసీన్యం అనగా నివృత్తిరూపమైన ఔదాసీన్యం. నివృత్త్యౌదాసీన్యం అనగా చంపడం లేకపోవడం అని అర్థం. ఈ విధంగా 'నఞ్'కు ముఖ్యార్థాన్ని కాదని 'అహననాన్ని చెయ్యాలి' లేదా 'అహననసంకల్పం చెయ్యాలి' అని లాక్షణికార్థం చెప్పడం శక్యం కాదు. 'నఞ్'కు ముఖ్యార్థమైన అభావం అనే అర్థం చెప్పడానికి అవకాశం ఉన్నప్పుడు లక్షణను అంగీకరించి ఏదో క్రియను చెప్పడం అయుక్తం. నిషేధవాక్యం కూడ కార్యాన్ని బోధిస్తే ఇది విధివాక్యం ఇది నిషేధవాక్యం అనే భేదం కూడ లేకుండా పోతుంది అని భావం.

నఞశ్చేతి : తనతో ఏది సంబంధిస్తుందో దాని అభావాన్ని బోధించడం నఞ్ యొక్క స్వభావం. అభావబుద్ధి ఔదాసీన్యానికి కారణం. అది కాల్చబడిన కట్టెలు గల అగ్నివలె స్వయంగానే శాంతిస్తుంది. అందుచేత ప్రజాపతివ్రతాదులలో తప్ప "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాదులలో ప్రసక్తమైన (అవకాశం ఉన్న) క్రియనుండి నివర్తించడం అనే ఔదాసిన్యమే నిషేధానికి అర్థం అని మేం అభిప్రాయపడుతున్నాం. అందుచేత "ఆనర్థక్యమతదర్థానామ్" అని చెప్పినది ఏ పురుషార్థానికీ ఉపయోగించని ఉపాఖ్యానాలు మొదలైన భూతార్థవాదల విషయంలోనే అని గ్రహించాలి.

వి : "బ్రాహ్మణో హన్తవ్యః" అన్నదానికి బ్రాహ్మణుడు చంపదగినవాడు అని అర్థం. అనగా బ్రాహ్మణహననం ఇష్టసాధనం అని అర్థం. ఈ అర్థం ప్రధానమైన ప్రత్యయంచేత బోధించబడుతుంది. ప్రకృత్యర్థప్రత్యయార్థాలలో ప్రత్యయార్థం ప్రధానం కదా. ఇక్కడ ప్రత్యయం తవ్యః. ఈ ప్రత్యయం ఇష్టసాధనత్వాన్ని బోధిస్తున్నది. దానితో 'నఞ్' అన్వయించగానే "బ్రాహ్మణవధ ఇష్టసాధనం కాదు" అని ఇష్టసాధన త్వాభావాన్ని బోధిస్తుంది. ఈ అభావజ్ఞానం కలగగానే పురుషుడు ఉదాసీను డై పోతాడు; ఆ పని చెయ్యడు. ఈ అభావబుద్ధి ఎంత వరకు ఉంటుంది? ఆ పురుషునిలో ఉదాసీనత్వం కలిగే వరకూ ఉంటుంది. తరవాత అభావబుద్ధి నశిస్తుంది. అనగా వాడు బ్రాహ్మణవధనుండి పూర్తిగా విరమించేవరకు ఉంటుంది. ఈ విధంగా "బ్రాహ్మణో న హన్తవ్యః" ఇత్యాది వాక్యాలలో అవకాశం ఉన్న క్రియనుండి ఉదాసీనత్వం మాత్రమే కలుగుతుంది గాని కార్యాంతరప్రేరణ ఏదీ ఉండదు. అయితే ప్రజాపతివ్రతాదులలో మాత్రం నఞ్ప్రయోగం ఉన్నా కార్యసంబంధం చెప్పవలసి ఉంటుంది. "తస్య వటోర్వ్రతమ్" ఆ వటువుయొక్క వ్రతం, అనగా 'బ్రహ్మచారి చేయవలసిన కార్యాలు' అని ఉపక్రమించి "నేక్షేతోద్యన్తమాదిత్యమ్" (ఉదయిస్తూన్న సూర్యుణ్ణి చూడగూడదు) అని చెప్పబడింది. ప్రారంభంలో చేయవలసిన పని అని చెప్పడంచేత ఈ వాక్యానికి కార్యపరంగా అర్థం చెప్పాలి. కేవలం 'ఆదిత్యదర్శనంలో ఇష్టసాధనత్వాభావం ఉంది'

ఇత్యాద్యర్థాలు చెపితే సరిపోదు. అందుచేత దీనికి "ఉదయిస్తూన్న సూర్యుణ్ణి చూడ నని సంకల్పం చెయ్యాలి" అని అర్థం చెప్పాలి. అప్పుడు ఈ వాక్యంలో కూడ క్రియాన్వయం ఏర్పడింది. ఇక్కడ చెప్పిన వ్రతానికి ప్రజాపతివ్రతం అని పేరు. ఇలాంటి ప్రజాపతివ్రతాదులలో తప్ప నిషేధవాక్యాలలో ఎక్కడా కూడ క్రియాన్వయం చెప్పగూడదు అని అర్థం.

## భాష్యమ్

యదప్యుక్తం - కర్తవ్యవిధ్యనుప్రవేశమన్తరేణ వస్తుమాత్రముచ్య మానమనర్థకం స్యాత్ "సప్తద్వీపా వసుమతీ" ఇత్యాదివత్ ఇతి తత్ పరిహృతమ్, రజ్జురియం నాయం సర్ప ఇతి వస్తుమాత్రకథనేఽ పి ప్రయోజనస్య దృష్టత్వాత్. నను శ్రుతబ్రహ్మణోఽపి యథాపూర్వం సంసారిత్వదర్శనాత్ న రజ్జుస్వరూపకథనవదర్థవత్త్వమిత్యుక్తమ్?, అత్రోచ్యతే - నావగతబ్రహ్మభావస్య యథాపూర్వం సంసారిత్వం శక్యం దర్శయితుం, వేదప్రమాణజనితబ్రహ్మాత్మభావవిరోధాత్. న హి శరీరాద్యాత్మాభిమానినో దుఃఖ భయాది మత్త్వం దృష్టమితి తస్యైవ వేదప్రమాణజనితబ్రహ్మాత్మావగమే తదభిమాననివృత్తౌ తదేవ మిథ్యాజ్ఞాననిమిత్తం దుఃఖభయాదిమత్త్వం భవతీతి శక్యం కల్పయితుమ్. న హి ధనినో గృహస్థస్య ధనాభిమానినః ధనాపహార నిమిత్తం దుఃఖం దృష్టమితి తస్యైవ ప్రవ్రజితస్య ధనాభిమానరహితస్య తదేవ ధనాపహారనిమిత్తం దుఃఖం భవతి. న చ కుణ్డలినః కుణ్డలిత్వాభిమాననిమిత్తం సుఖం దృష్టమితి తస్యైవ కుణ్డలవియుక్తస్య కుణ్డలిత్వాభిమానరహితస్య తదేవ కుణ్డలిత్వాభిమాననిమిత్తం సుఖం భవతి. తదుక్తం శ్రుత్యా - "అశరీరం వా వ సన్తం న ప్రియాప్రియే స్పృశతః" (ఛా.ఉ. 8-12.1) ఇతి. శరీరే పతితేఽ శరీరత్వం స్యాత్ న జీవత ఇతి చేన్న; సశరీరత్వస్య మిథ్యాజ్ఞాననిమిత్తత్వాత్. నహ్యాత్మనః శరీరాత్మాభిమానలక్షణం మిథ్యాజ్ఞానం ముక్త్వాఽన్యతః నశరీరత్వం శక్యం కల్పయితుమ్. నిత్యమశరీ రత్వమకర్మనిమిత్తత్వాదిత్యవోచామ. తత్కృతధర్మాధర్మనిమిత్తం సశరీరత్వ మితి చేన్న, శరీరసమ్బన్ధస్యాసిద్ధత్వాత్, ధర్మాధర్మయో రాత్మకృతత్వా సిద్ధేః. శరీరసంబన్ధస్య ధర్మాధర్మయోరాత్మకృతత్వస్య చ ఇతరేతరాశ్రయత్వ

ప్రసఙ్గాదన్థపరమ్పరైషానాదిత్వకల్పనా. క్రియాసమవాయాభావాచ్చాత్మనః కర్తృత్వానుపపత్తేః. సంనిధానమాత్రేణ రాజప్రభృతీనాం దృష్టం కర్తృత్వమితి చేన్న; ధనదానాద్యుపార్జితభృత్యసంబన్ధిత్వాత్తేషాం కర్తృత్వోపపత్తేః. న త్వాత్మనో ధనదానాదివత్ శరీరాదిభిః స్వస్వామిసంబన్ధనిమిత్తం కించిచ్ఛక్యం కల్పయితుమ్. మిథ్యాభిమానస్తు ప్రత్యక్షః సంబన్ధహేతుః. ఏతేన యజమానత్వమాత్మనః వ్యాఖ్యాతమ్.

బాలానందిని

"సప్తద్వీపా వసుమతీ" ఇత్యాదికం వలె కర్తవ్యమైన విధితో సంబంధం లేని కేవలవస్తువు చెప్పబడినా అది వ్యర్థమే అని వెనుక (పూర్వపక్షిచేత) ఏది చెప్పబడినదో ఆ ఆక్షేపణ వెనకనే పరిహరించబడింది. "ఇది త్రాడే, సర్పం కాదు" అని వస్తుమాత్రం చెప్పినా కూడ ప్రయోజనం కనబడుతూన్నది కదా? బ్రహ్మను గూర్చి విన్నవానికి కూడ పూర్వం వలెనే సంసారిత్వం కనబడుతూనే ఉన్నది. అందుచేత రజ్జుస్వరూపం చెప్పినప్పుడు వలె సార్థకత్వం కుదరదు అని మేం చెప్పి ఉన్నాం కదా? ఈ విషయంలో చెపుతున్నాం, విను. బ్రహ్మాత్మభావం తెలిసినవానికి కూడ వెనుకటి వలెనే సంసారిత్వం ఉంటుంది అని చెప్పడం శక్యం కాదు; అలా చెపితే అది వేదరూపమైన ప్రమాణంచేత కలిగిన బ్రహ్మాత్మభావానికి విరుద్ధం అవుతుంది. శరీరాదులయందు 'నేను' అనే అభిమానం ఉన్నవానికి దుఃఖం, భయం మొదలైనవి కనబడుచున్నాయి కదా అని అతనికి వేదప్రమాణంచేత బ్రహ్మాత్మజ్ఞానం కలిగి ఆ శరీరాద్యాత్మాభిమానం తొలగిపోయిన తరవాత కూడ మిథ్యాజ్ఞానంచేత ఏర్పడే ఆ దుఃఖభయాదికమే కలుగుతుందని కల్పించడానికి శక్యం కాదు కదా? నాకు ధనం ఉన్నది, లేదా ఇది నా ధనం అన్న అభిమానం ఉన్న ధనికుడైన ఒక గృహస్థునికి, ఆ ధనాన్ని ఎవరైనా అపహరిస్తే దానివల్ల దుఃఖం కలిగింది కదా అని, అతడే సన్న్యాసి అయి ధనాభిమానం లేనివాడైతే ధనాపహారం వల్ల అదే దుఃఖం కలగదు కదా? కుండలాలు ధరించిన వానికి నేను కుండలాలు అలంకరించు కొన్నాను అనే అభిమానంచేత సుఖం కనబడింది కదా అని అతడే ఆ కుండలాలు తీసి వేసి కుండలాలు నాకున్నాయి అనే అభిమానం లేనివాడయిన తరవాత కుండలిత్వాభిమానంచేత కలిగే అదే సుఖం కలగదు కదా? ఈ విషయమే "అశరీరం వావ సన్తం న ప్రియాప్రియే స్పృశతః" (శరీరరహితుడైనవానికి సుఖదుఃఖాలు అంటవు) అను శ్రుతి చెప్పుచున్నది. శరీరం పడిపోయిన తరవాత కదా అశరీరత్వం? జీవించి ఉన్నవానికి అశరీరత్వం ఎక్క డుంటుంది? ఈ ప్రశ్న యుక్తం కాదు. స శరీరత్వం (శరీరం కలిగి ఉండడం) అనేది

మిథ్యాజ్ఞానంవల్ల కలుగుతుంది కదా? శరీరమే ఆత్మ అను అభిమానస్వరూపంలో ఉన్న మిథ్యాజ్ఞానం తప్పితే ఆత్మకు మరొక విధమైన సశరీరత్వం కల్పించడానికి శక్యం కాదు కదా? (శరీరమే నేను అనే అజ్ఞానంచేతనే సశరీరత్వం ఏర్పడుతున్నది అని అర్థం). అశరీరత్వం అనేది ఎల్లప్పుడూ ఉన్నదే. ఎందువల్ల ననగా అది కర్మచే లభించినది కాదు అని చెప్పి ఉన్నాం. (ప్రశ్న). ఆ శరీరంచేత చేయబడిన ధర్మాధర్మాలచేతనే సశరీరత్వం ఏర్పడుతున్నది. అందుచేత ఆత్మకు శరీరసంబంధం నిత్యమే కదా? (సమాధానం) ఇట్లు అనగూడదు. ఆత్మకు శరీరంతో సంబంధం ఉన్నది అనే విషయమే నిశ్చితం కానప్పుడు ధర్మాధర్మాలు ఆత్మచేత చేయబడుతున్నాయి అనేది కూడా సిద్ధించదు. ఆత్మకు శరీరసంబంధం ఉంది, శరీరంచేత ధర్మాధర్మాలు చేయబడతాయి, ఆ ధర్మాధర్మాలచేత మళ్లీ మళ్లీ శరీరసంబంధం ఏర్పడుతుంది, ఈ విధంగా అనాదిగా వస్తూన్నది అని చెప్పడం గ్రుడ్డి పరంపర అవుతుంది; ఎందువల్ల ననగా ఆ రెండింటికీ (సశరీరత్వ-ధర్మాధర్మకరణాలకి) అన్యోన్యాశ్రయం ఏర్పడుతుంది. (ఈ అన్యోన్యాశ్రయాన్ని సమర్థించడం కోసం ఇదంతా అనాదిగా వస్తూన్నది అని అనాదిత్వకల్పన ప్రమాణరహితం అవడంచేత అంధపరంపరయే అవుతుంది అని అర్థం). ఆత్మకు ఏ విధమైన క్రియతోను సంబంధం లేదు, అందుచేత కర్తృత్వం ఆత్మకు కుదరదు. ఆత్మకు క్రియతో సంబంధం లేకపోయినా దగ్గర ఉండడం మాత్రంచేతనే, రాజాదులకు వలె, కర్తృత్వం చెప్పవచ్చును కదా అనడం కూడా కుదరదు. ఆ రాజు మొదలైన వాళ్లకు ధనదానాదులచేత సంపాదించుకొన్న భృత్యులతో సంబంధం ఉండడంవల్ల కర్తృత్వం కుదురుతుంది. కాని రాజులకు భృత్యులకు మధ్య ధనదానాదులను కారణంగా చేసికొని స్వస్వామిసంబంధం ఏర్పడి నట్లు ఆత్మకు శరీరాదులతో అలాంటి సంబంధం ఏర్పడడానికి తగిన ధనదానాదికం వంటి కారణం ఏదీ కల్పించడం శక్యం కాదు. అయితే దేహాదులతో ఆత్మకు సంబంధానికి హేతువుగా మిథ్యాభిమానం అనేది మాత్రం ప్రత్యక్షంగా కనబడుతున్నది. అనగా ఆత్మకు శరీరంతో అజ్ఞానకల్పితమైన సంబంధమే కాని యథార్థమైన సంబంధం లేదని అర్థం. దీనిచేత ఆత్మయొక్క యజమానత్వం కూడా వివరించబడినట్లే. అనగా దేహాదులందు భ్రాంతికల్పితమైన ఆత్మత్వాభిమానం ఉన్నంతవరకే ఆత్మకు యజమానత్వం కూడ. అది లేనివానికి యాగాద్యాచరణం లేదు, యజమానత్వమూ లేదు అని అర్థం.

## భాష్యమ్

అత్రాహుః- దేహాదివ్యతిరిక్తస్యాత్మన ఆత్మీయే దేహాదావభిమానో గౌణో న మిథ్యేతి (చేత్) న. ప్రసిద్ధవస్తుభేదస్య గుణత్వముఖ్యత్వప్రసిద్ధేః. యస్య

హి ప్రసిద్ధో వస్తుభేదః, యథా కేసరాదిమానాకృతివిశేషోఽన్వయవ్యతిరేకాభ్యాం సింహశబ్దప్రత్యయభాఙ్ముఖ్యోఽన్యః ప్రసిద్ధః, తతశ్చాన్యః పురుషః ప్రాయికైః క్రౌర్యశౌర్యాదిభిః సింహగుణైః సంపన్నః సిద్ధః, తస్య పురుషే సింహశబ్ద ప్రత్యయౌ గౌణౌఽభవతః నాప్రసిద్ధవస్తుభేదస్యతస్యత్వన్యత్రాన్యశబ్ద ప్రత్యయౌ భ్రాన్తినిమిత్తావేవ భవతో న గౌణౌ. యథా మన్దాన్ధకారే స్థాణురయ మిత్యగృహ్యమాణవిశేషే పురుషశబ్దప్రత్యయౌ స్థాణువిషయౌ, యథా వా శుక్తికాయామకస్మాద్రజతమితి నిశ్చితౌ శబ్దప్రత్యయౌ, తద్వద్దేహాది సంఘాతే ఽహమితి నిరుపచారేణ శబ్దప్రత్యయా వాత్మానాత్మావివేకేనోత్పద్య మానౌ కథం గౌణౌ శక్యం వదితుమ్? ఆత్మానాత్మవివేకినామపి పణ్డితానామజావిపాలానామివావివిక్తౌ శబ్దప్రత్యయౌ భవతః. తస్మాద్దేహాది వ్యతిరిక్తాత్మాస్తిత్వవాదినాం దేహాదావహంప్రత్యయో మిథ్యైవ; న గౌణః. తస్మాన్మిథ్యాప్రత్యయనిమిత్తత్వాత్సశరీరత్వస్య సిద్ధం జీవతోఽపి విదుషోఽ శరీరత్వమ్. తథా చ బ్రహ్మవిద్విషయా శ్రుతిః- "తద్యథాహినిర్ల్వయినీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమేవేదం శరీరం శేతే, అథాయమశరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ" (బృ.ఉ.4.4.7) ఇతి, "సచక్షురచక్షురివ సకర్ణోఽ కర్ణ ఇవ సవాగవాగివ సమనా అమనా ఇవ సప్రాణోఽప్రాణ ఇవ" ఇతి చ. స్మృతిరపి చ "స్థితప్రజ్ఞస్య కా భాషా" (భ.గీ.2.54) ఇత్యాద్యా స్థితప్రజ్ఞలక్షణాన్యాచక్షాణా విదుషః సర్వప్రవృత్త్యసంబన్ధం దర్శయతి. తస్మాన్నావగతబ్రహ్మభావస్య యథాపూర్వం సంసారిత్వమ్. యస్య తు యథాపూర్వం సంసారిత్వం నాసావవగతబ్రహ్మభావ ఇత్యనవద్యమ్.

బాలానందిని

అత్రేతి:- ఈ సందర్భంలో (ప్రాభాకరాదులు) ఇలా అంటున్నారు. "దేహాదుల కంటె భిన్నుడైన ఆత్మకు తనకు సంబంధించిన దేహాదుల విషయంలో ఉన్న నేను అనే అభిమానం గౌణమే కాని మిథ్య కాదు" అని. అది యుక్తం కాదు. (ఇక్కడ చేత్ అనేది ప్రమాదలిఖితం అని తోస్తుంది) ప్రసిద్ధమైన వస్తుభేదం కలవానికే గౌణత్వం, ముఖ్యత్వం అనేవి ప్రసిద్ధంగా ఉంటాయి. జూలు మొదలైనవి ఉండి అన్వయవ్యతిరేకాలచేత సింహం అనే శబ్దానికీ (పేరుకు) జ్ఞానానికీ పాత్రమైన ఒకానొక

వ్యక్తి ముఖ్యమైన సింహంగా ప్రసిద్ధమైనది. సాధారణంగా సింహంలో ఉండే క్రూరత్వం, శూరత్వం మొదలైన గుణాలతో కూడిన ఒక పురుషుడు దానికంటె భిన్నమైనవాడు ఉన్నాడు అని ఎవనికి ఆ రెండు వ్యక్తుల భేదం స్పష్టంగా తెలిసి ఉంటుందో అతనికి పురుషుని విషయంలో ప్రయోగించిన సింహశబ్దము, సింహజ్ఞానమూ కూడ గౌణములు అవుతాయి కాని వాటి భేదం తెలియని వానికి అవి గౌణములు కావు. అలాంటివానికి మరొక వ్యక్తి లేదా వస్తువు విషయంలో మరొక వ్యక్తి లేదా వస్తువుకు సంబంధించిన పేరు, జ్ఞానమూ కూడ భ్రాంతిచేత ఏర్పడినవే కాని గౌణములు కావు. చీకటి తక్కువగా ఉన్న ప్రదేశంలో ఇది స్థాణువు (ఎండిపోయిన చెట్టుమ్రాను) అని తెలియనివాడు ఆ స్థాణువు విషయంలో చేసిన అతడు మనిషి అనే శబ్దజ్ఞానాలు ఎట్లో, ముత్యపు చిప్పను అకస్మాత్తుగా చూచి 'ఇది వెండి' అని నిశ్చితంగా ఏర్పడిన శబ్దజ్ఞానాలు ఎట్లో అదే విధంగా దేహాదిసముదాయం విషయంలో, ఇదే అది అని ఆరోపణం లేకుండా, "ఇదే నేను" అని కలిగే శబ్ద-జ్ఞానాలు గౌణాలని చెప్పడం ఎలా కుదురుతుంది? దేహాదుల విషయంలో "ఇవే నేను" అనే శబ్దప్రత్యయాలు (శబ్ద-జ్ఞానాలు) అవివిక్తంగా (దేహాదులు వేరు, నేను, అనగా ఆత్మ, వేరు, అనే భేదజ్ఞానం లేకుండా) మేకలు, గొఱ్ఱెలు కాచే పామరులకు వలె ఆత్మానాత్మవివేకం ఉన్న పండితులకు కూడా కలుగుతున్నాయి. అందువల్ల దేహాదులకంటె భిన్నంగా ఆత్మ ఉన్నది అని అంగీకరించేవారికి కూడా దేహాన్ని చూచుకొని ఇదే నేను అని కలిగే జ్ఞానం మిథ్యా జ్ఞానమే (భ్రాంతియే) కాని గౌణబుద్ధి కాదు. అందుచేత సశరీరత్వం అనేది మిథ్యాజ్ఞానం చేత కలుగుతుంది గాన ఆత్మజ్ఞాని జీవించి ఉన్నా కూడ అతనికి అశరీరత్వం ఉంటుంది అని చెప్పడం నిశ్చితమే. "తద్యథాహినిర్ల్వయినీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమేవేదం శరీరం శేతే, అథాయమశరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ" (పాము కుబుసం ఎలా పుట్టలో మరణించి, త్యజింపబడి పడి ఉంటుందో (దానిమీద) సర్పానికి ఇది నా శరీరం అనే అభిమానం ఉండకపోవడంచేత మరణించి పడి ఉంటుందో) అదే విధంగా జ్ఞాని ఈ శరీరంలో (నాది అనే అభిమానం లేకుండా) పడి ఉంటాడు. అప్పు డతడు శరీర రహితుడై మరణరహితుడై, జీవించి ఉన్నా కూడ బ్రహ్మయే, తేజస్సే) అని, "సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సవాగవాగివ సమనా అమనా ఇవ, సప్రాణోఽప్రాణ ఇవ" (అట్టి స్థితిలో జ్ఞాని నేత్రా లున్నా నేత్రాలు లేనివాడు వలె, చెవులున్నా చెవులు లేనివాడు వలె, వాక్కు ఉన్నా వాక్కు లేనివాడు వలె, మనస్సు ఉన్నా మనస్సు లేనివాడు వలె, ప్రాణాలున్నా ప్రాణాలు లేనివాడు వలె ఉంటాడు) అనీ బ్రహ్మవేత్తను గూర్చి శ్రుతి చెపుతున్నది. స్థితప్రజ్ఞుని

(బ్రహ్మవేత్తయొక్క) లక్షణాలను "స్థితప్రజ్ఞస్య కా భాషా" ఇత్యాది శ్లోకాలలో వర్ణించి చెపుతూన్న భగవద్గీతాస్మృతి కూడ విద్వాంసునకు లౌకికములైన అట్టి వ్యాపారాలతోను సంబంధం లేదని చెపుతున్నది. అందువల్ల బ్రహ్మాత్మభావం తెలిసిన వానికి పూర్వమునందు వలె సంసారిత్వం ఉండదు; ఎవనికైతే యథాపూర్వంగా సంసారిత్వం ఉంటుందో అతడు బ్రహ్మాత్మభావం తెలిసినవాడు కాడు అని ఈ మా మతం నిర్దుష్టమైనది.

## భాష్యమ్

యత్పునరుక్తం-శ్రవణాత్పరాచీనయోర్మనననిదిధ్యాసనయోర్దర్శనాద్విధిశేషత్వం బ్రహ్మణో న స్వరూపపర్యవసాయిత్వమితి, న. శ్రవణవదవగత్యర్థత్వాన్మనననిదిధ్యాసనయోః. యది హ్యవగతం బ్రహ్మాన్యత్ర వినియుజ్యేత భవేత్తదా విధిశేషత్వమ్. న తదస్తి. మనననిదిధ్యాసనయోరపి శ్రవణవదవగత్యర్థత్వాత్. తస్మాన్న ప్రతిపత్తివిధివిషయతయా శాస్త్ర ప్రమాణకత్వం బ్రహ్మణః సంభవతీత్యతః స్వతన్త్రమేవ బ్రహ్మ శాస్త్ర ప్రమాణకం వేదాన్తవాక్యసమన్వయాదితి సిద్ధమ్.

## బాలానందిని

యత్పునరితి:- శ్రవణం తరవాత మనననిదిధ్యాసనలను కూడా విధించడంచేత బ్రహ్మ విధికి అంగమే కాని స్వతంత్రంగా స్వస్వరూపపర్యవసాయి కాదు (దాని స్వరూపాన్ని ప్రతిపాదించడంలో మాత్రమే తాత్పర్యం కలది కాదు) అని వెనుక చెప్పిన ఆక్షేపణ యుక్తం కాదు. శ్రవణం వలె మనననిదిధ్యాసనలకు కూడా బ్రహ్మస్వరూపాన్ని తెలుసుకొనడమే ప్రయోజనం. తెలియబడిన బ్రహ్మను మరొకదానియందు దేనియందైనా వినియోగిస్తే అప్పుడు అది విధిశేషం అయింది అని చెప్పడానికి వీలుంటుంది. అలాంటి దేమీ లేదు. మనననిధిధ్యానల ప్రయోజనం కూడా శ్రవణప్రయోజనం వలె బ్రహ్మస్వరూప జ్ఞానమే. అందుచేత బ్రహ్మ ప్రతిపత్తివిధివిషయకంగా శాస్త్రంచేత బోధించబడుచున్నది అనేది కుదరదు గాన శాస్త్రాలు బ్రహ్మను స్వతంత్రరూపంలోనే ప్రతిపాదిస్తున్నాయి. అలాంటి స్వతంత్రబ్రహ్మయందే వేదాంతాలకు తాత్పర్యం అని నిశ్చితమైనది.

## భాష్యమ్

ఏవం చ సతి **"అథాతో బ్రహ్మజిజ్ఞాసా"** ఇతి తద్విషయః పృథక్ శాస్త్రారమ్భః

ఉపపద్యతే. ప్రతిపత్తివిధిపరత్వే హి "అథాతో ధర్మజిజ్ఞాసా" ఇత్యేవారబ్ధత్వాత్ న పృథక్శాస్త్రమారభ్యేత. ఆరభ్యమాణం చైవమారభ్యేత- "అథాతః పరిశిష్టధర్మజిజ్ఞాసా" ఇతి, "అథాతః క్రత్వర్థపురుషార్థయోర్జిజ్ఞాసా" (జై.సూ.4.1.1) ఇతివత్. బ్రహ్మాత్మైకత్వావగతిస్త్వప్రతిజ్ఞాతేతి తదర్థో యుక్తః శాస్త్రారమ్భః- "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇతి. తస్మాదహం బ్రహ్మాస్మీత్యేతదవసానా ఏవ సర్వే విధయః సర్వాణి చేతరాణి ప్రమాణాని. నహ్యహేయానుపాదేయాత్మావగతౌ నిర్విషయాణ్యప్రమాతృకాణి చ ప్రమాణాని భవితుమర్హన్తీతి.

## బాలానందిని

బ్రహ్మ స్వతంత్రంగా ప్రతిపాదింపబడుతున్నది అంటేనే ఆ బ్రహ్మను గూర్చి "**అథాతో** బ్రహ్మజిజ్ఞాసా" అని పూర్వమీమాంసాశాస్త్రంకంటె భిన్నంగా మరొక ఉత్తరమీమాసాశాస్త్రం ప్రారంభించడం యుక్తంగా ఉంటుంది. బ్రహ్మ ఏ కర్మకో అంగంగా బోధించబడింది అనే పక్షంలో బ్రహ్మజిజ్ఞాస కూడ కర్మ జిజ్ఞాసలోనే అంగం అయిపోతుంది గాన 'అథాతో ధర్మజిజ్ఞాసా" అనే సూత్రంచేతనే బ్రహ్మజిజ్ఞాసాప్రారంభం చేసినట్లే అవుతుంది. అప్పుడు వేరుగా శాస్త్రం ప్రారంభించబడి ఉండేది కాదు. అథవా ప్రారంభించినా - ధర్మజిజ్ఞాసకే అంగమైన క్రత్వర్థపురుషార్థజిజ్ఞాస ప్రారంభించినప్పుడు "అథాతః క్రత్వర్థపురుషార్థయోర్జిజ్ఞాసా" (ఇప్పు డిక క్రత్వర్థపురుషార్థాల జిజ్ఞాస) అని ప్రారంభించినట్లు "అథాతః పరిశిష్టధర్మజిజ్ఞాసా" (ఇటుపైన మిగిలిన ధర్మంయొక్క జిజ్ఞాస) అని ప్రారంభించబడి ఉండేది. బ్రహ్మప్రతిపాదన ఉపనిషత్తులలో స్వతంత్రంగా చేయబడింది అని అంగీకరిస్తేనే "అథాతో ధర్మజిజ్ఞాసా" అనేదానిలో బ్రహ్మజిజ్ఞాస చేరలేదు గాన స్వతంత్రబ్రహ్మజిజ్ఞాసనిమిత్తం "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని శాస్త్రారంభం యుక్తం అవుతుంది. అందువల్ల అన్ని విధులూ, ఇతరమైన ప్రత్యక్షాదిప్రమాణాలన్నీ కూడ "అహం బ్రహ్మాస్మి" అనే ఆత్మజ్ఞానం కలిగే వరకే ప్రవర్తిస్తాయి. (దాని తరవాత ఇవేమీ పని చేయవు). హేయము లేదా ఉపాదేయము కాని అద్వైతాత్మజ్ఞానం కలిగిన తరవాత ప్రమాణాలచే గ్రహించవలసిన విషయాలూ ఉండవు. ప్రమాత (గ్రహించేవాడు) ఉండడు. అప్పుడు ఆ ప్రమాణాలు తమ ప్రమాణత్వాన్నే కోల్పోతాయి.

## భాష్యమ్

అపి చాహుః-

1. "గౌణమిథ్యాత్మనోఽ సత్త్వే పుత్రదేహాదిబాధనాత్,
   సద్బ్రహ్మాత్మాహమిత్యేవం బోధే కార్యం కథం భవేత్.
2. అన్వేష్టవ్యాత్మవిజ్ఞానాత్ప్రాక్ప్రమాతృత్వమాత్మనః,
   అన్విష్టః స్యాత్ప్రమాతైవ పాప్మదోషాదివర్జితః.
3. దేహాత్మప్రత్యయో యద్వత్ప్రమాణత్వేన కల్పితః,
   లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాఽఽత్మనిశ్చయాత్." ఇతి.

ఇతి చతుఃసూత్రీ సమాప్తా

## బాలానందిని

అపి చేతి:- బ్రహ్మవిదులు కూడ ఇలా అంటున్నారు:-

(1) గౌణాత్మ మిథ్యాత్మ లేకపోతే పుత్రాదులు దేహాదులు బాధింపబడతాయి. అప్పుడు-"సద్రూపమైన బ్రహ్మ నేనే" అనే జ్ఞానం కలిగిన తరవాత ఇంక కర్తవ్యం ఏముంటుంది? (2) ఆత్మకు ప్రమాతృత్వం అనేది అన్వేషించదగిన ఆత్మయొక్క జ్ఞానం కలగడానికి ముందు మాత్రమే ఉంటుంది. అన్వేషించబడినవాడు పాపదోషాదిశూన్యుడైన ప్రమాతయే (తెలుసుకొనేవాడే). (3) దేహమే ఆత్మ అనే జ్ఞానం భ్రాంతిమూలకమే అయినా వ్యవహారానికి సంబంధించినంతవరకు అది ప్రమాణంగా ఎట్లు వైదికులచేత ప్రతిపాదించబడినదో అదే విధంగా ఔపనిషదులకు కూడా ఈ లౌకికవ్యవహారం అంతా ఆత్మసాక్షాత్కారం కలిగే వరకు ప్రమాణమే.

వి. పుత్రదారాదుల విషయంలో ఉన్న "వాళ్లే నేను, నేనే వాళ్ళు" అనే అభిమానం గౌణం. తనకు ఏదైన దుఃఖం కలిగినపుడు దుఃఖవంతు డవుతున్నాడు, సుఖం కలిగినప్పుడు సుఖవంతు డవుతున్నాడు. అట్లే పుత్రదారాదులకు సుఖదుఃఖాలు కలిగినప్పుడు కూడ తనకే అవి కలిగినట్లు అనుకొంటున్నాడు. కాని తను వేరు, వాళ్లు వేరు అని స్పష్టంగా వానికి తెలుసు. అందుచేత పుత్రదారాదికం గౌణాత్మ. దేహేంద్రియాదుల విషయంలో కలిగిన ఆత్మాభిమాన మైతే శుక్తిరజతజ్ఞానం వలె మిథ్యాజ్ఞానం; గౌణం కాదు. ఈ విధంగా ద్వివిధమైన ఈ ఆత్మాభిమానంచేత లోకయాత్ర నడుస్తూన్నది. అది లేకపోతే లోకమూ లేదు, బ్రహ్మానుభవం కూడా లేదు.

ఈ ఆత్మాభిమానం లేకపోతే శ్రవణమననాదులకే అవకాశం లేదు కదా? "సద్బ్రహ్మాత్మాహమిత్యేవంబోధి కార్యం కథం భవేత్" అని వాచస్పతిమిశ్రులు గ్రహించిన పాఠం. దానిని పట్టి ఈ విధంగా వ్యాఖ్యానం చేయబడింది. "ఇత్యేవంబోధే" అనే పాఠం ప్రకారం అలాంటి జ్ఞానం కలిగిన తరవాత కర్తవ్యం ఏముంటుంది? అని అర్థం పైన చెప్పబడింది). ఆత్మవిజ్ఞానం కలగడానికి పూర్వం మాత్రమే ఆత్మకు ప్రమాతృత్వం ఉంటుంది. ప్రమాతృత్వంతో పాటు ప్రమా-ప్రమేయ-ప్రమాణ విభాగం కూడా గ్రహించాలి. అనగా చక్షురాదిప్రమాణం, దానివల్ల కలిగే ప్రమ (జ్ఞానం), ప్రమేయం (తెలియబడేది), ప్రమాత (తెలుసుకొనేవాడు) అనే ఈ భేదం అంతా బ్రహ్మ సాక్షాత్కారానికి పూర్వమే కాని తరవాత ఉండదు. వేదాంతాదిసహాయంతో అన్వేషించబడేది కూడ ఎవనినైతే ప్రమాత అనుకొంటున్నామో, ఆ ఆత్మనే. అది వాస్తవంలో పాపదోషాదులు లేనిది. ఎల్లప్పుడు తానుగానే ఉన్నది. ఆ సంగతి తెలియక మెడలోనే ఉన్న బంగారు ఆభరణాన్ని గూర్చి మరచి దానికొరకై వెదకినట్లు వెదకడం జరుగుతున్నది. ప్రపంచం సత్యం అనేవాళ్లు కూడా దేహాదులందు ఆత్మాభిమానం మిథ్య అని అంగీకరించవలసిందే. దానివల్లనే వ్యవహారం అంతా జరుగుతున్న దని వాళ్లు అంగీకరించాలి. అదే విధంగా అద్వైతులకు కూడా వ్యావహారికదశలో ప్రమాణాలన్నీ ప్రమాణాలుగానే ఉపయోగిస్తూ బ్రహ్మజ్ఞానానికి ఉపయోగిస్తాయి. బ్రహ్మాత్మజ్ఞానం కలిగిన తరవాత మాత్రం ఆ ప్రమాణాలకు ప్రమాణత్వం ఉండదు. ఇది వాచస్పతిమిశ్రులు ఈ మూడు శ్లోకాలకీ ఇచ్చిన వివరణం.

నవమవర్ణకం సమాప్తం.

చతుఃసూత్రి సమాప్తం.

## 5. ఈక్షత్యధికరణమ్. సూ. 5-11

### భాష్యమ్

ఏవం తావద్వేదాన్తవాక్యానాం బ్రహ్మాత్మావగతిప్రయోజనానాం బ్రహ్మాత్మని తాత్పర్యేణ సమన్వితానామన్తరేణాపి కార్యానుప్రవేశం బ్రహ్మణి పర్యవసానముక్తమ్. బ్రహ్మ చ సర్వజ్ఞం, సర్వశక్తి, జగదుత్పత్తిస్థితినాశకారణముక్తమ్. సాంఖ్యాదయస్తు పరినిష్ఠితం వస్తు ప్రమాణాన్తరగమ్య మేవేతి మన్యమానాః ప్రధానాదీని కారణాన్తరాణ్యనుమిమానాస్తత్పరతయైవ వేదాన్తవాక్యాని యోజయన్తి. సర్వేష్వేవ వేదాన్తవాక్యేషు సృష్టివిషయే ష్వనుమానేనైవ కార్యేణ కారణం లిలక్షయిషితమ్.

ప్రధానపురుషసంయోగా నిత్యానుమేయా ఇతి సాంఖ్యా మన్యన్తే. కాణాదాస్త్వేతేభ్య ఏవ వాక్యేభ్యః ఈశ్వరం నిమిత్తకారణమనుమిమతే; అణూంశ్చ సమవాయికారణమ్. ఏవమన్యేఽపి తార్కికాః వాక్యాభాసయుక్త్యాభాసావష్టమ్భాః పూర్వపక్షవాదిన ఇహోత్తిష్ఠన్తే. తత్ర పదవాక్యప్రమాణజ్ఞేనాచార్యేణ వేదాన్తవాక్యానాం బ్రహ్మావగతిపరత్వ ప్రదర్శనాయ వాక్యాభాసయుక్త్యాభాసప్రతిపత్తయః పూర్వపక్షీకృత్య నిరాక్రియన్తే.

## బాలానందిని

ఏవమితి:- బ్రహ్మాత్మావగతియే ప్రయోజనంగా గలవీ, అనగా బ్రహ్మయే ఆత్మ అని తెలుసుకొనడమే ప్రయోజనంగా గలవి, తాత్పర్యంచేత బ్రహ్మాత్మయందే సమన్వయం పొందినవి అయిన వేదాంతవాక్యాలకు కార్యంతో దేనితోను సంబంధం లేకుండా బ్రహ్మయందే పర్యవసానం, అనగా వేదాంతవాక్యాలు బ్రహ్మనే ప్రధానంగా ప్రతిపాదిస్తాయి అని (సమన్వయాధికరణంలో) చెప్పబడింది. బ్రహ్మ సర్వజ్ఞము, సర్వశక్తి, జగత్తుయొక్క ఉత్పత్తిస్థితినాశాలకు కారణము అని చెప్పబడింది. అయితే సాంఖ్యులు మొదలైనవారు, ఉన్న వస్తువును ప్రత్యక్షానుమానాదిప్రమాణాలచేతనే తెలుసుకొనవచ్చును అని అభిప్రాయపడుచు, జగత్తుకు ప్రధానం మొదలైన ఇతరకారణాలను అనుమానప్రమాణం చేత ఊహిస్తూ వేదాంతవాక్యాలు ఆ ప్రధానాదులనే చెపుతున్నా యని అంటూ వాటి కా విధంగా అర్థం చెపుతున్నారు. సృష్టిని గూర్చి చెప్పే అన్ని వేదాంతవాక్యాలలోను కూడ అనుమానప్రయోగంచేతనే, కార్యాన్నిబట్టి కారణం ఊహించబడుతుంది. ప్రధానం, పురుషులు, వాటి సంబంధమూ కూడ కేవలం అనుమానంచేతనే తెలియదగినవి అని సాంఖ్యులు అభిప్రాయపడుచున్నారు. వైశేషికు లైతే ఈ వేదాంతవాక్యాల సాహాయ్యం చేతనే ఈశ్వరుణ్ణి నిమిత్తకారణంగా అనుమానప్రయోగంచేత తెలుసుకొంటున్నారు. అణువులను సమవాయికారణంగా ఊహిస్తున్నారు. (దేనితో ఒక వస్తువు తయారు చేయబడుతుందో అది సమవాయికారణం. తయారు చేసేవాడు, సాధనాలు నిమిత్తకారణం. కుండకి మట్టి సమవాయికారణం; కుమ్మరి, అతడు ఉపయోగించే చక్రం, కఱ్ఱ మొదలైన సాధనాలు నిమిత్తకారణం) ఇట్లే ఇంకా మరి కొందరు తార్కికులు కూడ (ఇక్కడ తార్కికు డనగా ఊహమీదనే ఆధారపడేవాడు) వాక్యాభాసలను యుక్త్యాభాసలను ఆధారంగా తీసికొని పూర్వపక్షవాదులుగా ఇక్కడ (జగత్సృష్ట్యాదికారణనిరూపణవిషయంలో) లేస్తున్నారు.

వి : తాము అనుకొన్న భావానికి అనుకూలంగా లేకపోయినా అనుకూలంగా ఉన్నట్లు పైకి కనబడే వాక్యాలు వాక్యాభాసలు. సరియైన యుక్తులు కాకపోయినా యుక్తుల వలె కనబడేవి యుక్త్యాభాసలు.

తత్రేతి :- ఇది ఇలా ఉండగా పదశాస్త్ర (వ్యాకరణ) వాక్యశాస్త్ర (మీమాంసా) ప్రమాణ శాస్త్ర (తర్కశాస్త్ర)ములలో నిష్ణాతుడైన ఆచార్యుడు (బ్రహ్మసూత్ర కర్తయైన బాదరాయణుడు) వేదాంత వాక్యాలు బ్రహ్మ జ్ఞానాన్ని మాత్రమే భోదిస్తున్నాయి అని చూపటం కొరకు వాక్యాభాస యుక్త్యాభాసలవల్ల కలిగిన జ్ఞానాలను (అభిప్రాయాలను) పూర్వపక్షాలనుగా చేసి నిరాకరిస్తున్నాడు.

## భాష్యమ్

తత్ర సాంఖ్యాః ప్రధానం త్రిగుణమచేతనం జగతః కారణమితి మన్యమానాః ఆహుః- యాని వేదాన్తవాక్యాని సర్వజ్ఞస్య సర్వశక్తేర్బ్రహ్మణః జగత్కారణత్వం దర్శయన్తీత్యవోచః తాని ప్రధానకారణపక్షేఽపి యోజయితుం శక్యన్తే. సర్వశక్తిత్వం తావత్ప్రధానస్యాపి స్వవికార విషయముపపద్యతే. ఏవం సర్వజ్ఞత్వమప్యుపపద్యతే. కథమ్? యత్తు జ్ఞానం మన్యసే స సత్త్వధర్మః "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్" (భ.గీ.14.17) ఇతి స్మృతేః తేన చ సత్త్వధర్మేణ జ్ఞానేన కార్యకరణవన్తః పురుషాః సర్వజ్ఞాః యోగినః ప్రసిద్ధాః సత్త్వస్య హి నిరతిశయోత్కర్షే సర్వజ్ఞత్వం ప్రసిద్ధమ్. న కేవలస్యాకరణస్య పురుషస్య ఉపలబ్ధిమాత్రస్య సర్వజ్ఞత్వం కించిద్జ్ఞత్వం వా కల్పయితుం శక్యమ్. త్రిగుణత్వాత్తు ప్రధానస్య సర్వజ్ఞానకారణభూతం సత్త్వం ప్రధానావస్థాయామపి విద్యత ఇతి ప్రధానస్యాచేతనస్యైవ సతః సర్వజ్ఞత్వముపచర్యతే వేదాన్తవాక్యేషు. అవశ్యం చ త్వయాపి సర్వజ్ఞం బ్రహ్మాభ్యుపగచ్ఛతా సర్వజ్ఞానశక్తిమత్త్వేనైవ సర్వజ్ఞత్వముపగన్తవ్యమ్. న హి సర్వవిషయం జ్ఞానం కుర్వదేవ బ్రహ్మ వర్తతే. తథాహి - జ్ఞానస్య నిత్యత్వే జ్ఞానక్రియాం ప్రతి స్వాతన్త్ర్యం బ్రహ్మణో హీయతే. అథానిత్యం తదితి - జ్ఞానక్రియాయా ఉపరమేతాపి బ్రహ్మ. తదా సర్వజ్ఞానశక్తిమత్త్వేనైవ సర్వజ్ఞత్వమాపతతి. అపి చ ప్రాగుత్పత్తేః సర్వకారకశూన్యం బ్రహ్మేష్యతే త్వయా. న చ జ్ఞానసాధనానాం శరీరేన్ద్రియాదీనామభావే జ్ఞానోత్పత్తిః కస్య

చిదుపపన్నా. అపి చ ప్రధానస్యానేకాత్మకస్య పరిణామసంభవాత్ కారణత్వోపపత్తిః మృదాదివత్, నా సంహతస్యైకాత్మకస్య బ్రహ్మణః ఇత్యేవం ప్రాప్తే ఇదం సూత్రమారభ్యతే.

**సూ. ఈక్షతేర్నాశబ్దమ్ 1.1.5**

### బాలానందిని

తత్రేతి :-సత్త్వ - రజస్ - తమోగణాలనే మూడు గుణాలు గలది, అచేతనమూ అయిన ప్రధానం జగత్తుకు కారణమని తలచే సాంఖ్యులు ఈ విధంగా అంటున్నారు. సర్వజ్ఞము, సర్వశక్తిమంతము అయిన బ్రహ్మయే జగత్తుకు కారణమని ఏ వేదాంతవాక్యాలు ప్రతిపాదిస్తున్నాయి అని నువ్వు అంటున్నావో ఆ వేదాంతవాక్యాలను ప్రధానమే కారణం అని చెప్పడానికి సమన్వయించవచ్చును. తన వికారాల విషయంలో, అనగా తన నుండి ఏ మహదాదులు పుడతాయో వాటి విషయంలో, ప్రధానానికి, పరిపూర్ణశక్తి ఉండడానికి అవకాశం ఉంది గాన సర్వశక్తిత్వం ప్రధానానికి కూడ కుదురుతుంది. అదే విధంగా సర్వజ్ఞత్వం కూడ కుదురుతుంది. ఎట్లు? నువ్వు జ్ఞానం అని దేనిని అంటున్నావో అది సత్త్వగుణధర్మం. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్" (సత్త్వగుణం నుండి జ్ఞానం పుడుతుంది) అని స్మృతి చెప్పుచున్నది కదా? యోగులైన కార్యకరణవంతులైన (శరీరేంద్రియాలు గల) పురుషులు సత్త్వగుణధర్మమైన ఆ జ్ఞానంచేత సర్వజ్ఞులైనట్లుగా ప్రసిద్ధులై ఉన్నారు. సత్త్వం అత్యంతము ఉత్కర్షతో (ఆధిక్యంతో) ఉండడమే సర్వజ్ఞత్వం అని ప్రసిద్ధం కదా? కేవలుడు (వేటితోనూ సంబంధం లేనివాడు) దేహేంద్రియాదులు లేనివాడూ, కేవలజ్ఞానరూపుడూ అయిన పురుషుడు (బ్రహ్మ) సర్వజ్ఞుడని గాని కించిద్జ్ఞు డని గాని కల్పించడం శక్యం కాదు. ప్రధాన మైతే త్రిగుణాత్మకమైనది. అందుచేత అది ప్రధానావస్థలో (మూడు గుణాలలో హెచ్చుతగ్గులు లేని స్థితిలో) ఉన్నప్పుడు కూడ, దానితో జ్ఞానానికి కారణమైన సత్త్వం ఉందిగాన వేదాంతాలలో, అచేతనమైన ప్రధానానికి సర్వజ్ఞత్వం ఆరోపించబడుతున్నది. బ్రహ్మ సర్వజ్ఞం అని చెప్పే నువ్వు కూడ అంతనూ తెలిసికొనే జ్ఞానశక్తి ఉంది కావుననే బ్రహ్మ సర్వజ్ఞం అని తప్పని సరిగా అంగీకరించ వలసిందే. ఎందు చేతననగా బ్రహ్మ ఎల్లప్పుడూ అన్నింటినీ గూర్చిన జ్ఞానం చేస్తూనే (అన్నింటిని తెలుసుకొంటూనే) ఉండదు కదా? మేం చెప్పేది యుక్తమే-జ్ఞానం నిత్యమైన పక్షంలో బ్రహ్మకు జ్ఞానం అనే క్రియ విషయంలో స్వాతంత్ర్యం లేకుండా పోతుంది. (ఏదైనా లేని దానిని పుట్టిస్తేనే కదా ఆ పుట్టించినవానికి దాని విషయంలో స్వాతంత్ర్యం ఉందని చెప్పడం కుదురుతుంది?) కాదు, అది అనిత్యం అన్నట్లయితే అప్పుడు బ్రహ్మ జ్ఞానక్రియ

నుండి విరమించ వచ్చును కూడ. అలాంటప్పుడు బ్రహ్మ సర్వజ్ఞం అని చెప్పాలంటే అన్నీ తెలుసుకొనే శక్తి ఉండడాన్ని పట్టి మాత్రమే అలా చెప్పడం కుదురుతుంది. మరొక విషయమేమనగా సృష్టికి పూర్వం బ్రహ్మకు ఏ కారకాలు (కర్మ-కరణాదులు, శరీరాదిసాధనాలూ) లేవని నువ్వు అంగీకరిస్తున్నావు. జ్ఞాన సాధనాలైన శరీరేంద్రియాదులు లేకుండా ఎవనికీ కూడ జ్ఞానం పుట్టడం కుదరదు. (అందుచేత కూడా సర్వజ్ఞత్వశక్తిని పట్టి మాత్రమే బ్రహ్మకు సర్వజ్ఞత్వం అని అంగీకరించాలి అని భావం.) మరొక విషయం ఏమనగా - అనేక వస్తువుల కలయిక అయిన ప్రధానంలో పరిణామం (మార్పు - మట్టికుండ ఆకారంలోనికి మారినట్లు) కుదురుతుంది గాన అది జగత్కారణం అని చెప్పడం యుక్తంగా ఉంటుంది. అంతేకాని దేనితోను కలవని, ఒకే వస్తువుగా ఉన్న బ్రహ్మ జగద్రూపంలో పరిణామం చెందడం కుదరదు. ఈ విధంగా సాంఖ్యుల నుండి ఆక్షేపణ రాగా ఈ సూత్రం చెప్పబడుచున్నది. "ఈక్షతేర్నాశబ్దమ్".

ఈక్షతేరితి :- "న=సాంఖ్యాదులు చెప్పిన ప్రధానం కారణం కాదు. ఎందువల్లననగా అది "అశబ్దం" దానిని బోధించే శ్రుతి వాక్యం లేనిది. అందుకు కారణం "ఈక్షతేః" శ్రుతిలో జగత్కారణం చూచినదని చెప్పబడింది" అని సూత్రార్థం.

వి : బ్రహ్మయందు నువ్వు చెప్పిన శ్రుతిసమన్వయం కుదరదు, శ్రుతులు ప్రధానాన్నే కారణంగా చెపుతున్నాయి అని పూర్వాధికరణంలో చెప్పినదానిని ఆక్షేపించడంచేత ఈ అధికరణానికి దానితో ఆక్షేపసంగతి. స్పష్టబ్రహ్మలింగాలైన 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' ఇత్యాదివాక్యాలు విషయవాక్యాలు. వాటిలో ఈక్షణం గౌణమా ముఖ్యమా అని సందేహం. గౌణం అని పూర్వపక్షం. పూర్వపక్షంలో జీవుణ్ణి ప్రధానంతో ఐక్యం కలవానినిగా ఉపాసన చేయ్యాలి. సిద్ధాంతంలో బ్రహ్మభిన్నునిగా తెలుసుకోవడం ఫలం. అధ్యాయపాదాదిసంగతులు వెనుకటి వలెనే చూచుకోవాలి.

సూ. ఈక్షతేర్నాశబ్దమ్ భాష్యమ్. 1-1-5.

న సాంఖ్యపరికల్పితమచేతనం ప్రధానం జగతః కారణం శక్యం వేదాన్తేష్వాశ్రయితుమ్. అశబ్దం హి తత్. కథమశబ్దత్వమ్? ఈక్షతేః - ఈక్షితృత్వశ్రవణాత్ కారణస్య. కథమ్? ఏవం హి శ్రూయతే - "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్ (ఛా.ఉ.6.2.1) ఇత్యుపక్రమ్య "తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత (ఛా.ఉ. 6.2.1) ఇతి. తత్రేదం శబ్దవాచ్యం నామరూపవ్యాకృతం జాగత్ప్రాగుత్పత్తేః సదాత్మనావధార్య తస్యైవ ప్రకృతస్య సచ్ఛబ్దవాచ్యస్యేక్షణపూర్వకం తేజఃప్రభృతేఃస్రష్టృత్వం

దర్శయతి. తథాన్యత్ర - "ఆత్మా వా ఇదమేక ఏ వాగ్ర ఆసీత్. నాన్యత్ కించన మిషత్. స ఈక్షత లోకాన్ను సృజా ఇతి. స ఇ మాన్ లోకానసృజత" (ఐ.ఉ. 1.1.1) ఇతీక్షా పూర్వికామేవ సృష్టిమాచష్టే. క్వచిచ్చ షోడశకలం పురుషం ప్రస్తుత్యాహ "స ఈక్షాంచక్రే, స ప్రాణమసృజత"(ప్ర.ఉ. 6.3)ఇతి. ఈక్షతేరితి ధాత్వర్థనిర్దేశోఽభిమతః యజతేరితివత్; న ధాతునిర్దేశః తేన "యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః తస్మాదేత ద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే" (ము.ఉ. 1.19) ఇత్యేవమాదీన్యపి సర్వజ్ఞేశ్వరపరాణి వాక్యాన్యుదాహర్త వ్యాని. ననూక్తం సర్వజ్ఞానశక్తిమత్త్వేన సర్వజ్ఞం ప్రధానం భవిష్యతీతి? తన్నోపపద్యతే. న హి ప్రధానావస్థాయాం గుణసామ్యాత్సత్త్వధర్మో జ్ఞానం సంభవతి.

### బాలానందిని

నేతి:- జగత్తుకు కారణం అని సాంఖ్యులు కల్పించిన అచేతనమైన ప్రధానాన్ని వేదాంతాలలో అంగీకరించడానికి శక్యం కాదు; ఎందువల్ల ననగా అది అశబ్దం, అనగా వేదశబ్దంచేత అది ప్రతిపాదించబడుటలేదు. ఎందువల్లననగా - ఈక్షతేః, ఆ కారణం చూచినది, ఆలోచించినది అని చెప్పబడింది. ఎట్లు? శ్రుతిలో "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" (ఓ! సౌమ్యుడా ప్రారంభంలో ఈ జగత్తంతా సద్రూపంగానే, ఒక్కటిగానే రెండవది ఏదీలేనిదిగా ఉండేది) అని ప్రారంభించి "తదైక్షత... అసృజత" (నేను అనేక రూపాలు ధరిస్తాను అని అది ఆలోచించి తేజస్సును సృజించింది) అని వినబడుచున్నది కదా? ఆ శ్రుతిలో వేరు వేరు పేర్లతోను వేరు వేరు రూపాలతోను విభక్తమై ఉన్న, 'ఇది' అని 'ఇదం' శబ్దంచేత నిర్దేశింపబడే ఈ జగత్తు (ఇప్పుడు మనకు కనబడుతున్న జగత్తు) పుట్టడానికి పూర్వం సత్ అయిన పరమాత్మ రూపంలోనే ఉండేది అని నిశ్చయించి, సచ్ఛబ్దంచేత నిర్దేశింపబడు ఆ సత్పదార్థమే ఈక్షణ పూర్వకంగా, ఆలోచనాపూర్వకంగా, తేజస్సు మొదలైన దానిని సృష్టించినది అని చెప్పబడింది. అదే విధంగా మరొక చోట కూడ - "ఆత్మా వా ఇదమ్... అసృజత" (ప్రారంభంలో, సృష్టికి పూర్వం, ఈ జగత్తంతా పరమాత్మగానే ఉండేది. మరొక వస్తువేదీ చలించలేదు. జీవాభిన్నమైన ఆ పరమాత్మ లోకాలను సృష్టిస్తాను అని ఆలోచించింది. అలా ఆలోచించి ఈ లోకాలను సృజించింది) అను శ్రుతి ఆలోచనాపూర్వకమైన సృష్టినే చెప్పుతున్నది. మరొక చోట పదహారు కళలు గల పురుషుణ్ణి గూర్చి చెప్పే సందర్భంలో "స ఈక్షాంచక్రే... అసృజత" (ఆ షోడశకళుడైన పురుషుడు ఆలోచించాడు,

ప్రాణం సృజించాడు) అని చెప్పబడింది. సూత్రంలో "ఈక్షతేః" అనే పదం "యజతేః" అనే పదం వలె ధాత్వర్థాన్ని నిర్దేశిస్తున్నది. ధాతువును కాదు. అందుచేత "యః సర్వజ్ఞః.. జాయతే" (ఏ పరమాత్మ అన్నింటినీ ఎరిగినవాడో, అన్నింటి విశేషాన్ని గుర్తించగలవాడో ఎవని తపస్సు జ్ఞానమయమైనదో, అట్టి పరమాత్మ నుండి ఈ సూత్రాత్మకమైన బ్రహ్మ నామం, రూపం, అన్నం పుట్టుచున్నాయి) అని సర్వజ్ఞుడైన ఈశ్వరుడే కారణము అని ప్రతిపాదించే వాక్యాలను కూడ ఈ సందర్భంలో ఉదాహరించాలి.

వ్యాఖ్య : "ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే" అనే వ్యాకరణనియమానుసారం ఏదైన ధాతువును నిర్దేశించవలసి ఉన్నపుడు తిప్ చేర్చి "భవతిః" "ఏధతిః", "మోదతిః" ఇత్యాది విధంగా చెప్పబడుతుంది. భూధాతువు, ఏధధాతువు, మోదధాతువు అని అర్థం. ఆ నియమం ప్రకారం ఈక్షతేః అనే దానికి ఈక్షధాతువువల్ల, ఈక్షధాతువును ప్రయోగించడంవల్ల అని అర్థం చెప్పవలసి ఉంది. కాని ఈక్షతేః అనే దానిని ధాతుపరంగా కాక ధాత్వర్థ పరంగా గ్రహించి 'చూచుటవలన' అని అర్థం, లక్షణావృత్తిని స్వీకరించి, చెప్పబడింది. "ఇతికర్తవ్యతా విధేర్యజతేః పూర్వవత్త్వమ్" (జై.సూ. 7.4.1) అనే పూర్వమీమాంసా సూత్రంలో 'యజతేః' అనే పదానికి యజధాతువు అని అర్థం గ్రహించకుండా లక్షణయా యజధాత్వర్థమైన 'యాగం' గ్రహించబడింది. ఈ విధంగా 'ఈక్షతేః' అనే దానికి "చూచుటవలన" "ఆలోచించుటవలన" అని అర్థం చెప్పడం చేత ఈక్షధాతువు ప్రయోగించకపోయినా దాని అర్థాన్ని పొందుపరచుకొన్న "యః సర్వజ్ఞః" ఇత్యాది వాక్యాలను కూడ ఉదాహరించడానికి వీలు కలుగుతుంది.

నన్వితి :- (ప్రశ్న) సత్త్వగుణధర్మమైన జ్ఞానాన్ని పట్టి ప్రధానం కూడ సర్వజ్ఞం అని చెప్పవచ్చునని మేం చెప్పాం కదా? అది యుక్తం కాదు. మూడు గుణాలు సమమైన స్థితిలో ఉన్న ప్రధానావస్థలో సత్త్వగుణధర్మమైన జ్ఞానం ఉండదు కదా?

## భాష్యమ్

నన్వూక్తం సర్వజ్ఞానశక్తిమత్త్వేన సర్వజ్ఞం భవిష్యతీతి? తదపి నోపపద్యతే. యది గుణసామ్యే సతి సత్త్వవ్యపాశ్రయాం జ్ఞానశక్తిమవలమ్బ్య సర్వజ్ఞం ప్రధానముచ్యేత కామం రజస్తమోవ్యపాశ్రయామపి జ్ఞానప్రతిబన్ధక శక్తిమాశ్రిత్య కించిద్జ్ఞముచ్యేత. అపి చ నాసాక్షికా సత్త్వవృత్తిర్జానాతినాభి ధీయతే; న చాచేతనస్య ప్రధానస్య సాక్షిత్వమస్తి. తస్మాదనుపపన్నం ప్రధానస్య సర్వజ్ఞత్వమ్. యోగినాం తు చేతనత్వాత్సత్త్వోత్కర్షనిమిత్తం సర్వజ్ఞత్వముపపన్న

మిత్యనుదాహరణమ్. అథ పునః సాక్షినిమిత్తమీక్షి తృత్వం ప్రధానస్య కల్ప్యేత యథాగ్నినిమిత్తమయఃపిణ్డాదేర్దగ్ధృత్వం, తథా సతి యన్నిమిత్తమీక్షితృత్వం ప్రధానస్య తదేవ సర్వజ్ఞం ముఖ్యం బ్రహ్మ జగతః కారణమితి యుక్తమ్.

## బాలానందిని

నన్వితి :- అన్నింటినీ తెలిసికొనే శక్తి ఉండడంచే ప్రధానం సర్వజ్ఞం కావచ్చునని చెప్పాం కదా? అది కుదరదు. గుణాలన్నీ సమస్థితిలోనే ఉన్నప్పుడు సత్త్వానికి సంబంధించిన జ్ఞానశక్తిని ఆధారంగా చేసికొని ప్రధానం సర్వజ్ఞం అని చెప్పే పక్షంలో రజస్తమోగుణాలకు సంబంధించిన జ్ఞానప్రతిబంధకశక్తిని (జ్ఞానాన్ని అడ్డుకునే శక్తిని పట్టి) అది కించిద్జ్ఞం అని కూడా చెప్పవలసి ఉంటుంది. మరొక విషయ మేమనగా 'జ్ఞా' ధాతువుకు సాక్షిలేని సత్త్వవృత్తి అని అర్థం చెప్పడం కుదరదు. అచేతనమైన ప్రధానం సాక్షికాజాలదు. అందువల్ల ప్రధానం సర్వజ్ఞం అనడం కుదరదు. యోగుల విషయం వేరు. వాళ్లు చేతనులు కాబట్టి సత్త్వోత్కర్ష చేత వాళ్లకి సర్వజ్ఞత్వం ఉండవచ్చును గాన వాళ్లని దృష్టాంతంగా చూపి ప్రధానం కూడ సర్వజ్ఞం అని చెప్పడం యుక్తం కాదు.

వి : "ఘటం ఉన్నది" ఇత్యాదివ్యవహారం ఏ జ్ఞానంచేత కలుగుతుందో ఆ జ్ఞానాన్ని 'జ్ఞా' మొదలైన ధాతువులు బోధిస్తాయి. అనగా 'జ్ఞా' 'విద్' మొదలైన ధాతువులకు తెలిసికొనుట అని అర్థం. "ఘటాన్ని తెలుసుకొనుచున్నాడు" అనగా వానికి ఘటాకారమైన మనోవృత్తి కలిగినది, దాని యందు వాని చైతన్యం ప్రతి ఫలించినది అని అర్థం. మనస్సు జడంగాన మనోవృత్తి కూడ జడమే. దానికి చైతన్యంతో సంబంధం ఉన్నప్పుడే అది ప్రకాశిస్తుంది, ఘటాదుల్ని ప్రకాశింపచేస్తుంది. చైతన్య సంబంధంలేని కేవలమనోవృత్తివల్ల ప్రయోజనం లేదు. ఘటజ్ఞానం అనగా ఘటాకారమైన మనోవృత్తి కలిగి దానిని చైతన్యం ప్రకాశింపచేస్తుందని అర్థం. (మనోవృత్తి అనగా మనస్సు ఏ పదార్థాన్ని గ్రహిస్తున్నదో దాని రూపంలో అది పరిణమించడం. ఘటాకారంగా పరిణమించిన మనస్సు ఘటాకారమనోవృత్తి). ఇక్కడ చైతన్యం సాక్షి. ప్రధానంలో సత్వగుణం ఉందిగాన, సత్త్వం జ్ఞానజనకం గాన, దానిని పట్టి ప్రధానం సర్వజ్ఞం అని చెప్పే వాదం సరియైనది కాదు. కేవలం సత్త్వవృత్తి ఉంటే సరిపోదు. దానికి జ్ఞానత్వం రావాలంటే సాక్షిసంబంధం, చైతన్యసంబంధం కూడ ఉండాలి. ప్రధానం అచేతనం. అందుచేత దానికి సాక్షిత్వసర్వజ్ఞత్వాదులు కుదరవు అని అర్థం.

అవ : సృష్టిసమయంలో ప్రధానంలో సర్వజగద్విషయమైన ఒక సాత్త్వికవృత్తి కలుగుతుంది. ఆ సాత్త్వికవృత్తిలో ఈశ్వరుని చైతన్యం ప్రతిఫలిస్తుంది. ఇనుప గుండు

మొదలైనవి అగ్ని సంబంధంచేత కాల్చగలిగినట్లు ఆ ఈశ్వరచైతన్య సంబంధంచేత ప్రధానం సాత్త్వికవృత్తి ద్వారా సర్వజ్ఞం కావచ్చును కదా అని ఆశంకించు కొని నిరాకరిస్తున్నారు - **అథ** పునరితి:- అగ్నిసంబంధాన్ని నిమిత్తంగా చేసికొని అయఃపిండాదులకు దాహకత్వం ఉన్నట్లు సాక్షియైన ఈశ్వరుని సంబంధాన్ని నిమిత్తంగా చేసికొని ప్రధానానికి కూడ ఈక్షితృత్వం (చూడగలగడం) కుదురుతుంది కదా అని కూడ చెప్పడం యుక్తం కాదు. ఏ ఈశ్వరుని సంబంధంచేత ప్రధానానికి ఈక్షితృత్వం కల్పిస్తున్నారో ఆ ఈశ్వరుడే ముఖ్యంగా సర్వజ్ఞమైన బ్రహ్మ, అదే జగత్కారణం అని చెప్పడం యుక్తం కదా? (సాంఖ్యులు నిరీశ్వరవాదులైనా వాళ్లకి అత్యంత సన్నిహితులైన యోగులు ఈశ్వరాస్తిత్వవాదులు గాన వాళ్ల మతం దృష్టిలో ఉంచుకొని ఈ పూర్వపక్షతన్నిరాకరణాలు చేయబడ్డాయి).

## భాష్యమ్

యత్పునరుక్తం - బ్రహ్మణోఽపి న ముఖ్యం సర్వజ్ఞత్వముపపద్యతే, నిత్యజ్ఞానక్రియత్వే జ్ఞానక్రియాం ప్రతి స్వాతన్త్ర్యాసంభవాదితి, అత్రోచ్యతే - ఇదం తావద్భవాన్ ప్రష్టవ్యః, కథం నిత్యజ్ఞానక్రియత్వే సర్వజ్ఞత్వహానిరితి. యస్యహి సర్వవిషయావభాసనక్షమం జ్ఞానం నిత్యమస్తి సోఽసర్వజ్ఞ ఇతి విప్రతిషిద్ధమ్. అనిత్యత్వే హి జ్ఞానస్య కదాచిజ్జానాతి కదాచిన్న జానాతీతి అసర్వజ్ఞత్వమపి స్యాత్, నాసౌ జ్ఞాననిత్యత్వే దోషోఽస్తి. జ్ఞాననిత్యత్వే జ్ఞానవిషయః స్వాతన్త్ర్యవ్యపదేశః నోపపద్యతే ఇతి చేత్, న, ప్రతతౌష్ణ్య ప్రకాశేఽపి సవితరి దహతి, ప్రకాశయతీతి స్వాతన్త్ర్యవ్యపదేశదర్శనాత్. నను సవితుర్దాహ్యప్రకాశ్యసంయోగే సతి దహతి, ప్రకాశయతీతి వ్యపదేశః స్యాత్, న తు బ్రహ్మణః ప్రాగుత్పత్తేః జ్ఞానకర్మసంయోగోఽస్తీతి విషమో దృష్టాన్తః? న. అసత్యపి కర్మణి సవితా ప్రకాశతే ఇతి కర్తృత్వవ్యపదేశ దర్శనాత్, ఏవమసత్యపి జ్ఞానకర్మణి బ్రహ్మణః 'తదైక్షత' ఇతి కర్తృత్వవ్యపదేశోపపత్తేర్న వైషమ్యమ్. కర్మాపేక్షాయాం తు బ్రహ్మణీక్షితృత్వశ్రుతయః సుతరాముపపన్నాః.

## బాలానందిని

**యదితి** :-బ్రహ్మయొక్క జ్ఞానం నిత్యమైన పక్షంలో అజ్ఞానాన్ని చేయడం విషయంలో బ్రహ్మకు స్వాతంత్ర్యం ఉండదు గాన బ్రహ్మకు కూడ ముఖ్యమైన

సర్వజ్ఞత్వం కుదరదు అని వెనుక ఏ ఆక్షేపణ చెప్పబడిందో దానిని గురించి సమాధానం చెప్పబడుచున్నది - నిన్ను ఈ విషయం అడగాలి - జ్ఞానక్రియ నిత్యంగా ఉన్నప్పుడు సర్వజ్ఞత్వానికి హాని ఎలా కలుగుతుంది? సమస్త విషయాలను ప్రకాశింప చేయ సమర్థమైన జ్ఞానం నిత్యంగా ఎవనిలో ఉంటుందో అతడు అసర్వజ్ఞుడు అనడం విరుద్ధమైన మాట. జ్ఞానం అనిత్యం అయితే ఒకప్పుడు తెలుసుకొంటాడు. ఒకప్పుడు తెలుసుకొనడు అని చెప్పవచ్చును గాన అసర్వజ్ఞుడు అనడానికి కూడ అవకాశం ఉంది. జ్ఞానం నిత్యం అయిన పక్షంలో ఈ దోషంలేదు. జ్ఞానం నిత్యమైతే (అది ఎల్లప్పుడూ ఉంటుంది గాన) దాని విషయంలో వానికి స్వాతంత్ర్యం ఉందని చెప్పడం కుదరదు కదా అంటావా అది యుక్తం కాదు. ఎల్లప్పుడు నిరంతరంగా వేడి, ప్రకాశ ఉన్నా కూడ సూర్యుని విషయంలో కాల్చుచున్నాడు. ప్రకాశింపచేస్తున్నాడు అని స్వాతంత్ర్యం ఉన్నట్లు వ్యవహారం ఉందికదా? (ప్రశ్న) - సూర్యునికి కాల్చదగిన దానితోను ప్రకాశింప చేయదగిన దాని తోను సంబంధం ఏర్పడినప్పుడే కాలుస్తున్నాడు, ప్రకాశింపచేస్తున్నాడు అని వ్యవహారం ఉంటుంది. కాని బ్రహ్మకు సృష్టికి పూర్వం జ్ఞానానికి కర్మ అయిన ఏ వస్తువుతోనూ సంబంధంలేదు. అందుచేత దీనికీ నువ్వు చూపిన సూర్యదృష్టాంతానికి పోలికలేదు. (సమాధానం) - అట్లు కాదు. కర్మ లేకపోయినా "సూర్యుడు ప్రకాశిస్తున్నాడు" అని సూర్యునికి కర్తృత్వం చెప్పడం చూస్తున్నాం కదా? అట్లే జ్ఞానానికి కర్మలేకపోయినా కూడ బ్రహ్మ విషయంలో ఆ బ్రహ్మ చూచింది అని కర్తృత్వం చెప్పడం కుదురుతుంది గాన వైషమ్యం (తేడా) లేదు. ఏదో ఒక కర్మ అవసరం అవుతుంది అన్నట్లయితే ఈక్షితృత్వశ్రుతులు (చూచినది అనిచెప్పే శ్రుతులు) బ్రహ్మ విషయంలో చాలా చక్కగా కుదురుతాయి.

## భాష్యమ్

కింపునస్తత్కర్మ యత్ప్రాగుత్పత్తేరీశ్వరజ్ఞానస్య విషయో భవతీతి? తత్త్వాన్యత్వాభ్యామనిర్వచనీయే నామరూపే అవ్యాకృతే వ్యాచికీర్షితే ఇతి బ్రూమః యత్ప్రసాదాద్ధి యోగినామపి అతీతానాగతవిషయం ప్రత్యక్షం జ్ఞానమిచ్ఛన్తి యోగశాస్త్రవిదః కిము వక్తవ్యం తస్య నిత్యసిద్ధస్యేశ్వరస్య సృష్టిస్థితిసంహృతివిషయం నిత్యజ్ఞానం భవతీతి. యదప్యుక్తమ్ - ప్రాగుత్పత్తే ర్బ్రహ్మణః శరీరాదిసంబన్ధమన్తరేణేక్షితృత్వమనుపపన్నమితి న తచ్చోద్యమవ తరతి. సవితృప్రకాశవద్బ్రహ్మణో జ్ఞానస్వరూపనిత్యత్వే జ్ఞానసాధనా పేక్షానుపపత్తేః అపి చావిద్యాదిమతః సంసారిణః శరీరాద్యపేక్షా జ్ఞానోత్పత్తిః

స్యాన్న జ్ఞానప్రతిబన్ధకారణరహితస్యేశ్వరస్య. మన్త్రౌ చేమావీశ్వరస్య శరీరాద్యనపేక్షతామనావరణజ్ఞానతాం చ దర్శయతః :-

"న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే

పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" (శ్వే.ఉ.6.8) ఇతి.

"అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః,

న వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్" (శ్వే.ఉ.3.11) ఇతి చ.

బాలానందిని

**పునరితి** :- జగదుత్పత్తికి పూర్వం ఈశ్వరజ్ఞానానికి విషయం అయ్యే ఆ కర్మ ఏది? బ్రహ్మ స్వరూపములే అని కాని తద్భిన్నములని కాని చెప్పడానికి శక్యం కానివి, విడదీయబడని స్థితిలో ఉన్నవి, విడదీయ నిచ్ఛయించబడినవి అయిన నామరూపాలు అని చెపుతాం. అనగా అవ్యాకృతావస్థలో ఉన్న నామరూపాత్మకమైన జగత్తును ఈశ్వరుడు చూచాడు అని అర్థం. ఏ పరమేశ్వరుని అనుగ్రహంచేత యోగులకు కూడ భూతభవిష్యత్కాలాలకు సంబంధించిన పదార్థాలు విషయంగా గల ప్రత్యక్షం కలుగుతుంది అని యోగశాస్త్రవేత్తలు చెపుతున్నారో అలాంటి నిత్యసిద్ధుడైన ఈశ్వరునికి సృష్టిస్థితిసంహారాలకు సంబంధించిన నిత్యమైన జ్ఞానం కలుగుతుం దని వేరుగా చెప్పాలా? జగదుత్పత్తికి పూర్వం బ్రహ్మకు శరీరాదిసంబంధం లేకుండా ఈక్షితృత్వం (చూడడం) కుదరదు అని ఏది చెప్పబడిందో ఆ ఆశంకకు అవకాశమే లేదు. సూర్యునిలో నిత్యమైన ప్రకాశ ఉన్నట్లు బ్రహ్మయొక్క జ్ఞానస్వరూపం నిత్యం అయినప్పుడు జ్ఞానసాధనాల అపేక్ష యుక్తం కాదు కదా? మరొక విషయం ఏమనగా అవిద్యాదులున్న సంసారికి జ్ఞానం కలగా లంటే శరీరాదుల అపేక్ష ఉంటుంది గాని జ్ఞానానికి ఏ విధమైన అడ్డంకులూ లేని ఈశ్వరునికి శరీరాద్యపేక్ష ఉండదు. ఈశ్వరునికి శరీరాద్యపేక్ష ఉండదనీ, ఈశ్వరుని జ్ఞానానికి ఆవరణం ఉండదనీ ఈ రెండు మంత్రాలు చెపుతున్నాయి. "న తస్య...... బలక్రియా చ" (ఈశ్వరునికి శరీరము ఇంద్రియాదికమూ కూడ లేదు. అతనితో సముడు కాని అధికుడు గాని లేడు. ఈతని శక్తి (మాయ) చాల గొప్పదిగాను, అనేక విధాలైన స్వరూపం ఉన్నది గాను శ్రుతులలో వినబడుచున్నది. జ్ఞాన రూపమైన బలంచేత ఈశ్వరుడు చేసే క్రియ(సృష్టి) కూడ అనాదిమాయాకల్పితమైన దవడంచేత స్వభావసిద్ధమైనది) అని, "అపాణి.... మహాన్తమ్" (ఈశ్వరునికి

హస్తాలు గాని పాదాలు గాని లేవు. కాని మహావేగంగా వెళ్లగలడు, పట్టుకొనగలడు. కండ్లు లేవు, కాని చూడగలడు, చెవులు లేనివాడైనా వింటాడు. తెలియ దగినదానిని తెలుసుకొంటాడు. కాని అతనిని తెలుసుకొన గలిగిన వాడు లేడు. అతనిని సర్వవ్యాప్తియైన ప్రథమపురుషునిగా చెపుతారు) అని కూడ.

## భాష్యమ్

నను నాస్తి తవ జ్ఞానప్రతిబన్ధకారణవానీశ్వరాదన్యః సంసారీ - "నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" (బృ.త.3.7.23) ఇతి శ్రుతేః. తత్ర కిమిదముచ్యతే సంసారిణః శరీరాద్యపేక్షా జ్ఞానోత్పత్తిర్నేశ్వరస్యేతి? అత్రోచ్యతే - సత్యం నేశ్వరాదన్యః సంసారీ తథాపి దేహాదిసంఘాతోపాధి సంబన్ధః ఇష్యత ఏవ; ఘటకరకగిరిగుహాద్యుపాధిసంబన్ధ ఇవ వ్యోమ్నః. తత్కృతశ్చ శబ్దప్రత్యయవ్యవహారో లోకస్య దృష్టః ఘటచ్ఛిద్రం, కరకాదిచ్ఛిద్రి మిత్యాదిరాకాశావ్యతిరేకేఽపి, తత్కృతా చాకాశే ఘటాకాశాదిభేదమిథ్యా బుద్ధిర్దృష్టా. తథేహాపి దేహాదిసంఘాతోపాధిసంబన్ధావివేకకృతేశ్వరసంసారి భేదమిథ్యాబుద్ధిః. దృశ్యతే చాత్మన ఏవ సతో దేహాదిసంఘాతేఽనాత్మన్యాత్మ త్వాభినివేశో మిథ్యాబుద్ధిమాత్రేణ పూర్వపూర్వేణ. సతి చైవం సంసారిత్వే దేహాద్యపేక్ష మీక్షితృత్వముపపన్నం సంసారిణః. యదప్యుక్తమ్ - ప్రధానస్యానేకత్మకత్వాన్మృదాదివత్కారణత్వోపపత్తిర్నాసంహతస్య బ్రహ్మణ ఇతి, తత్ప్రధానస్యాశబ్దత్వేనైన ప్రత్యుక్తమ్. యథా తు తర్కేణాపి బ్రహ్మణ ఏవ కారణత్వం నిర్వోఢుం శక్యతే న ప్రధానాదీనాం తథా ప్రపఞ్చయిష్యతి "న విలక్షణత్వాదస్య" (బ్ర.సూ.2.1.4) ఇత్యేవమాదినా.

## బాలానందిని

నన్వితి :- (ఆశంక) "నాన్యోఽతోస్తి... విజ్ఞాతా" (ఈ బ్రహ్మకంటె వేరుగా మరొక ద్రష్ట (చూచేవాడు) లేడు, మరొక తెలుసుకొనే వాడు లేడు) అని శ్రుతిని పట్టి, నీకు ఈశ్వరునికంటె వేరుగా, జ్ఞానప్రతిబంధకారణా లున్న సంసారి ఎవడూ లేడు కదా? అలాంటప్పుడు "సంసారికి మాత్రమే జ్ఞానం కలగాలంటే శరీరాద్యపేక్ష ఉంటుంది. ఈశ్వరునికి ఉండదు" అని ఎట్లు చెపుతున్నావు? (సమాధానం) ఇక్కడ చెప్పబడుచున్నది. నిజమే, ఈశ్వరునికంటె వేరుగా సంసారియైన జీవుడు లేడు. అయినా కూడా

ఆకాశానికి కుండలు, చిన్నపాత్రలు, పర్వతగుహలు మొదలైన ఉపాధులతో సంబంధం ఉన్నట్లు (బ్రహ్మకు) దేహాదిసముదాయరూపాలైన ఉపాధులతో సంబంధం ఉన్న దని అంగీకరించ బడుతుంది. ఆ ఉపాధి సంబంధాన్ని బట్టి, ఆకాశంలో భేదం ఏదీ లేకపోయినా ఘటంలో ఉన్న రంధ్రం, పాత్రాదులలో ఉన్న రంధ్రం ఇత్యాది విధంగా లోకంలో శబ్దాలు, వాటివల్ల కలిగిన జ్ఞానము అనే వ్యవహారం కనబడుతున్నది. ఉపాధి సంబంధాన్ని పట్టి ఆకాశం విషయంలో 'ఘటాకాశం' మొదలైన మిథ్యాదృష్టి (భ్రాంతిజ్ఞానం) కనబడుతున్నది. అట్లే ఇక్కడ కూడ ఈశ్వరుడు వేరు సంసారి వేరు అనే బుద్ధి దేహాదిసంఘాతమనే ఉపాధులతో సంబంధంచేత ఏర్పడిన అవివేకంచేత (దేహదికం వేరు ఆత్మ వేరు అనే జ్ఞానం లేకపోవడంచేత) కలిగినదే. వెనుకటి వెనుకటి (అనాదిగా వస్తూన్న) మిథ్యాబుద్ధిచేత వాస్తవంలో ఆత్మయే అయి ఉన్నదానికి కూడ అనాత్మయైన దేహాత్మసంఘాతం విషయంలో ఆత్మ అనే అభినివేశం (పట్టుదల) కనబడుతూనే ఉన్నది కదా? ఈ విధంగా సంసారిత్వం ఉన్నది గాన సంసారికి ఈక్షితృత్వం దేహాదిసాహాయ్యం చేతనే కలుగుతుంది అని చెప్పడం యుక్తమే. ప్రధానం అనేకవస్తువుల కలయిక గాన, మట్టి మొదలైనవి వలె, అది కారణం అని చెప్పడం యుక్తం గాని ఏ ఇతర వస్తువుతోను సంబంధం లేని (ఏకఘనమైన) బ్రహ్మ జగత్కారణం అని చెప్పడం కుదరదు అని పైన చెప్పిన ఆక్షేపం ప్రధానం అశబ్దం అని చెప్పడంచేతనే నిరాకృత మయింది. (ప్రధాన కారణత్వం శ్రుతిప్రతిపాదితం కాదు అని చెప్పిన తరవాత ఈ ఆక్షేపణ లేవీ నిలవవు అని అర్థం). తర్కంచేత కూడ బ్రహ్మయే కారణ మని ఏ విధంగా చెప్పడం కుదురుతుందో ప్రధానాదులు కావని ఏ విధంగా నిరూపించ వచ్చునో అది "న విలక్షణత్వాదస్య" ఇత్యాది సూత్రాలచేత మున్ముందు ప్రతిపాదించ బడగలదు.

## భాష్యమ్

అత్రాహ - యదుక్తమ్ - నాచేతనం ప్రధానం జగత్కారణమ్, ఈక్షితృత్వశ్రవణాదితి, తదన్యథాప్యుపపద్యతే, అచేతనేఽపి చేతనవదుపచారాత్. యథా ప్రత్యాసన్నపతనతాం నద్యాః కూలస్యాలక్ష్య కూలం పిపతిషతీత్యచేతనేఽపి కూలే చేతనవదుపచారః దృష్టః తద్వదచేతనేఽపి ప్రధానే ప్రత్యాసన్నసర్గే చేతనవదుపచారో భవిష్యతి 'తదైక్షత' ఇతి. యథా లోకే కశ్చిచ్చేతనః స్నాత్వా, భుక్త్వా చాపరాహ్ణే గ్రామం రథేన గమిష్యామీతీక్షిత్వానన్తరం తథైవ నియమేన ప్రవర్తతే తథా ప్రధానమపి మహదాద్యాకారేణ నియమేన ప్రవర్తతే తస్మాచ్చేతనవదుపచర్యతే. 'తా అప

ఐక్షన్త' (ఛా.ఉ. 6.3.4) ఇతి చాచేతనయోరప్యప్తేజసోశ్చేతనవదుప చారదర్శనాత్. తస్మాత్సత్కర్తృకమీ క్షణమౌపచారికమితి గమ్యతే, ఉపచారప్రాయే పవనాత్ ఇతి. ఏవం ప్రాప్తే ఇదం సూత్రమారభ్యతే.౽

## బాలానందిని

అత్రేతి : ఇక్కడ (పూర్వపక్షి) ఇలా అంటున్నాడు. ఈక్షితృత్వం వినబడుతున్నది గాన అచేతనమైన ప్రధానం జగత్కారణం కాదు అని చెప్పబడింది కదా? దానిని మరొక విధంగా కూడ సమర్థించవచ్చు. అచేతనమైన దానిని కూడ చేతనమైన దానినిగా ఆరోపించడం వల్ల ఈక్షితృత్వం చెప్పబడింది అని చెప్పవచ్చు. నది ఒడ్డు పడిపోవడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, అచేతనమైన ఆ కూలం మీద చేతనత్వాన్ని ఆరోపించి "ఒడ్డు కూలిపోదాం అనుకొంటున్నది" అన్నట్లు సృష్టి దగ్గర పడిన అచేతనమైన ప్రధానం మీద చేతనత్వాన్ని ఆరోపించి "అది ఇలా అనుకున్నది" అని ఔపచారికప్రయోగం చేయవచ్చును. లోకంలో చైతన్యవంతుడైన ఒక మనిషి "స్నానం చేసి భోజనం చేసి అపరాహ్ణం రథం ఎక్కి గ్రామానికి వెడతాను" అని ఆలోచించుకొని ఆ విధంగా నిశ్చిత పద్ధతిలో ఎలా చేస్తాడో అదే విధంగా ప్రధానం కూడ ఒక నిశ్చిత రూపంలో మహాదాదిరూపంలో పరిణామం చెందుతున్నది. అందుచేత ఇది చేతనం వంటి దన్నట్లు ఆరోపణచేత చెప్పబడుచున్నది. (మధ్యలో సిద్ధాంతి వేసే ప్రశ్న) ముఖ్యమైన ఈక్షితృత్వం కాదని ఔపచారికమైన (నిజంగానే లేకపోయినా ఉన్నట్లు ఆరోపించబడిన) ఈక్షితృత్వం ఎందుకు కల్పించబడుతున్నది? (పూర్వపక్షి సమాధానం) - (ఈ ఘట్టంలోనే) 'ఆ అగ్నిఆలోచించింది", "ఆ జలం ఆలోచించింది" అని అచేతనా లైన అగ్నిజాలాలకు కూడ ఈక్షితృత్వం ఉన్నట్లు చెప్పబడింది. (వాటి ఈక్షితృత్వం ఔపచారికమే కదా?) ఉపచార ప్రాయంలో (ఆరోపణలే అధికంగా ఉన్న ఘట్టంలో) ప్రయోగించడం వల్ల సత్ కర్తగా గల (సత్ చేసిన) ఈక్షణం కూడ ఔపచరికమే అని తెలుస్తున్నది. (అందుచేత ఆ సత్ ప్రధానమే అని పూర్వపక్షి భావం). అని ప్రాప్తించగా (అని చెప్పడానికి అవకాశం ఏర్పడగా) ఈ సూత్రం ప్రారంభించబడుతున్నది.

## సూ. గౌణశ్చేన్నాత్మశబ్దాత్. 1.1.6

## భాష్యమ్

యదుక్తం ప్రధానమచేతనం సచ్ఛబ్దవాచ్యం తస్మిన్నౌపచారికః ఈక్షతిః అప్తేజసోరివేతి తదసత్. కస్మాత్? ఆత్మశబ్దాత్ - "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్"

ఇత్యుపక్రమ్య "తదైక్షత తత్తేజోఽసృజత" (ఛా.ఉ. 6.2.1,3) ఇతి చ తేజోఽబన్నానాం సృష్టిముక్త్వా తదేవ ప్రకృతం సదీక్షితృ, తాని చ తేజోఽబన్నాని దేవతాశబ్దేన పరామృశ్యాహ "సేయం దేవతైక్షత, హన్తాహమిమాస్తిస్రో దేవతా అనేవ జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా.ఉ. 6.3.2) ఇతి. అత్ర యది ప్రధానమచేతనం గుణవృత్త్యేక్షితృ కల్ప్యేత తదేవ ప్రకృతత్వాత్ సేయం దేవతేతి పరామృశ్యేత. న తదా దేవతా జీవమాత్మ శబ్దేనాభిదధ్యాత్. జీవో హి నామ చేతనః శరీరాధ్యక్షః ప్రాణానాం ధారయితా, తత్ప్రసిద్ధేః, నిర్వచనాచ్చ. స కథమచేతనస్య ప్రధానస్యాత్మా భవేత్? ఆత్మా హి నామ స్వరూపమ్. నాచేతనస్య ప్రధానస్య చేతనో జీవః స్వరూపం భవితుమర్హతి. అథ తు చేతనం బ్రహ్మ ముఖ్యమీక్షితృ పరిగృహ్యేత తస్య జీవవిషయ ఆత్మశబ్దప్రయోగ ఉపపద్యేత. తథా "స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకతో" (ఛాం.ఉ. 6.14.3) ఇత్యత్ర 'స ఆత్మా' ఇతి ప్రకృతం సదణిమానమాత్మానమాత్మశబ్దేనోపదిశ్య "తత్త్వమసి శ్వేతకేతో" ఇతి చేతనస్య శ్వేతకేతోరాత్మత్వేనోపదిశతి. అప్తేజసోస్తు విషయత్వాదచేతనత్వం, నామరూపవ్యాకరణాదౌ చ ప్రయోజ్యత్వేనైవ నిర్దేశాత్; న చాత్మశబ్దవత్కించిన్ముఖ్యత్వే కారణమస్తీతి యుక్తం కూలవద్గౌణత్వమీక్షితృత్వస్య. తయోరపి చ సదధిష్ఠితత్వాపేక్ష మేవేక్షితృత్వమ్. సతస్త్వాత్మశబ్దాన్న గౌణమీక్షితృత్వమ్.

బాలానందిని

యదితి :- అచేతనమైన ప్రధానమే 'సత్' అనే శబ్దంచేత చెప్పబడుచున్నది; జలతేజస్సుల విషయంలో వలె ప్రధానం విషయంలో కూడ ఈక్షతిప్రయోగం ఔపచారికమే అని (పూర్వపక్షి) చెప్పినది అయుక్తం. ఎందువల్ల? 'ఆత్మ' శబ్దం ప్రయోగించడం వల్ల, "సదేవ సోయ్యేదమగ్ర ఆసీత్" (సౌమ్యుడా ప్రారంభంలో ఇదంతా సత్తుగానే ఉండేది) అని ప్రారంభించి "తదైక్షత, తత్తైజోఽస్సృతజ" (అది చూచింది, అది తేజస్సును సృజించింది) అని తేజోబన్నాల (అగ్ని-జల-పృథ్వుల) సృష్టిని చెప్పి, ఈక్షించిన, ప్రకృతమైన సత్‌ను ఆ తేజోబన్నాలను 'దేవతా' శబ్దంచేత నిర్దేశిస్తూ - "సేయం.... వ్యాకరవాణి" "ఆ దేవత ఇలా అనుకొన్నది - నేను ఈ మూడు దేవతలను

జీవు డనే నా ఆత్మతో ప్రవేశించి నామరూపాలను విభజిస్తాను) అని చెప్పింది. అచేతనమైన ప్రధానమే గుణ వృత్తిచేత (ఉపచారంచేత) ఈక్షితృ (చూచినది) అని కల్పిస్తే అదే ప్రకృతం కాబట్టి 'సేయం దేవతా' (అ ఈ దేవత) అని ఆ ప్రధానమే నిర్దేశింప డేది. అట్లైతే ఆ దేవత (ప్రధానం) జీవుణ్ణి 'ఆత్మ' శబ్దంచేత చెప్పి ఉండేది కాదు. జీవు డనగా చేతనుడు, శరీరానికి అధ్యక్షుడు, ప్రాణాలను ధరించేవాడు కదా? లౌకిక ప్రసిద్ధిని పట్టి వ్యుత్పత్తి చేతను కూడ ప్రాణాలను ధరించేవాడు జీవుడు అని అర్థం. ('జీవ' శబ్దం జీవ ప్రాణధారణే అనే ధాతువు నుండి నిష్పన్నమైనది గాన ఆ నిర్వచనం ప్రకారం కూడ జీవు డనగా ప్రాణధారి అని అర్థమని అర్థం). అలాంటి జీవుడు అచేతనమైన ఈ ప్రధానానికి ఆత్మ ఎలా అవుతాడు? ఆత్మ అనగా స్వరూపం కదా? అచేతనమైన ప్రధానానికి చేతనుడైన జీవుడు స్వరూపం అవడం కుదరుదు. అలా కాకుండా ముఖ్యమైన ఆ ఈక్షణం చేసినది చేతనమైన బ్రహ్మ అని గ్రహిస్తే అది జీవుని విషయంలో ఆత్మ శబ్దాన్ని ప్రయోగించడం తగి ఉంటుంది. అట్లే "స య... **శ్వేతకేతో**" అట్టిదైన ఏ ఈ సూక్ష్మమైన సత్ ఉన్నదో, ఇదంతా తత్స్వరూపమైనదే, అదే సత్యమైనది; అదే ఆత్మ, శ్వేతకేతూ! నీవు ఆ ఆత్మవే) అనే వాక్యంలో "సః **ఆత్మా**" అని ప్రకృతమైన సద్రూపము, సూక్ష్మము. అత్మా అయిన ఆత్మను '**ఆత్మ**' శబ్దంచేత ఉపదేశించి అదే చేతనుడైన శ్వేతకేతుని ఆత్మ అని "తత్త్వమసి శ్వేతకేతో" అనే వాక్యంచేత ఉపదేశిస్తున్నాడు. అప్తేజస్సు లైతే విషయాలు (తెలియదగినవి, దృశ్యాలు) నామరూపవ్యాకరణాదులలో అవి ప్రయోజ్యాలుగా (వినియోగించదగినవిగా) చెప్పబడుతున్నాయి. అందుచేత అవి అచేతనాలు. వాటి విషయంలో కూడ ఈక్షణాన్ని ముఖ్యార్థంలో గ్రహించడానికి ఆత్మశబ్దప్రయోగం వంటి కారణం ఏదీ లేదు గాన అక్కడ ఈక్షితృత్వం, "కూలం పిపతిషతి" ఇత్యాదివాక్యాలలో 'పిపతిషతి' అనేది ఎలా గౌణార్థకమో, అదే విధంగా గౌణార్థకం అని చెప్పడం యుక్తంగా ఉంటుంది. నిజానికి ఆ అప్తేజస్సులకు చెప్పిన ఈక్షితృత్వం కూడ అవి (చేతనమైన) 'సత్‌ను ఆశ్రయించు కొనడం మీదనే **ఆధారపడి** ఉన్నది. అనగా వాటి కారణం సత్ గాన దాని కున్న ఈక్షితృత్వం వీటిలో కూడ ఉన్నట్లు చెప్పబడింది. 'ఆత్మ' శబ్దం ప్రయోగించబడింది .6

భాష్యమ్

అథోచ్యేత - అచేతనేఽపి ప్రధానే భవత్యాత్మశబ్దః, ఆత్మనః సర్వార్థకారిత్వాత్; యథా రాజ్ఞః సర్వార్థకారిణి భృత్యే భవత్యాత్మశబ్దోమమాత్మా భద్రసేన ఇతి. ప్రధానం హి పురుషస్య భోగాపవర్గౌ కుర్వదు పకరోతి, రాజ్ఞ

ఇవ భృత్యః సంధివిగ్రహాదిషు వర్తమానః అథవా ఏక ఏవాత్మ శబ్దః చేతనా చేతనవిషయో భవిష్యతి, భూతాత్మా, ఇన్ద్రియాత్మేతి చ ప్రయోగ దర్శనాత్, యథా ఏక ఏవ జ్యోతిఃశబ్దః క్రతుజ్వలనవిషయః తత్ర కుత ఏతత్, ఆత్మశబ్దాదీక్షతేరగౌణత్వమితి? అత ఉత్తరం పఠతి:-

సూ. తన్నిష్ఠస్య మోక్షపదేశాత్ 1.1.7

న ప్రధానమ చేతనమాత్మశబ్దాలమ్బనం భవితుమర్హతి, 'స ఆత్మా' ఇతి ప్రకృతం సదణిమానమాదాయ "తత్త్వమసి శ్వేతకేతో" ఇతి చేతనస్య శ్వేతకేతో ర్మోక్షయితవ్యస్య తన్నిష్ఠాముపదిశ్య "ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" (ఛాం. ఉ. 6.14.2) ఇతి మోక్షపదేశాత్. యది హ్యచేతనం ప్రధానం సచ్ఛబ్దం తదసీతి గ్రాహయేచ్ఛాస్త్రం పురుషస్యానర్థాయేత్య ప్రమాణం స్యాత్. న తు నిర్దోషం శాస్త్రమప్రమాణం కల్పయితుం యుక్తమ్. యది చాజ్ఞస్య సతో ముముక్షోరచేతనమనాత్మానమాత్మేత్యుపదిశేత్ ప్రమాణభూతం శాస్త్రం స శ్రద్ధధానతయాన్ధగోలాఙ్గూలన్యాయేన తదాత్మదృష్టిం న పరిత్యజేత్, తద్వ్యతిరిక్తంచాత్మానం న ప్రతిపద్యేత, అనర్థం చ ఋచ్ఛేత్.

బాలానందిని

**అథేతి** : రాజుకు అన్ని పనులు చేసి పెట్టే భృతుణ్ణి "ఈ భద్రసేనుడు నా ఆత్మయే" అన్నట్లు ఆత్మకు (జీవునికి) కావలసిన వన్నీ సమకూర్చే ప్రధానం విషయంలో కూడ, అది అచేతనమే అయినా, ఆత్మశబ్దం ఉపయోగించ వచ్చును. భృత్యుడు రాజుకు సంధి - విగ్రహాది కార్యాలు చక్కబెట్టి ఉపకరించి నట్లు ప్రధానం కూడ పురుషునికి భోగమోక్షాలను సమకూర్చి ఉపకరిస్తూన్నది కదా అని (పూర్వ పక్షి) చెప్పినా చెప్పవచ్చు.

అవ : లేదా ప్రధానం విషయంలో ఆత్మశబ్దప్రయోగం గౌణ మని చెప్ప నవసరం లేకుండా ముఖ్యమే అని కూడ అంగీకరించ వచ్చునని పూర్వపక్షి మరొక అభిప్రాయం చూపుతున్నాడు - అథవేతిః- లేదా ఆత్మశబ్దం చేతనవిషయంలోను అచేతన విషయంలోను కూడ (ముఖ్యంగానే) ప్రయోగించవచ్చును. 'భూతాత్మ' (భూతరూరపమైన ఆత్మ) ఇంద్రియాత్మ (ఇంద్రియరూపమైన ఆత్మ) అని విష్ణుపురాణాదులలో (5.18.50) అనే కార్థాలలో ఆత్మశబ్దప్రయోగం ఉంది కదా? అదే విధంగా ఒకే జ్యోతిఃశబ్దానికి 'అథైష జ్యోతిః' ఇత్యాదిశ్రుతిని అనుసరించి జ్యోతిష్టోమయాగం అనీ, లోక ప్రసిద్ధంగా అగ్ని అనీ రెండు ముఖ్యార్థాలు ఉన్నాయి కదా? అందుచేత ఆత్మశబ్దం ప్రయోగించడం వల్ల ఈక్షణం గౌణం

కాదని ఎట్లు అంటారు అని (పూర్వపక్షి) అనవచ్చును. దానికి సమాధానం పఠిస్తున్నాడు - తన్నిష్ఠస్యేతి:-

"తన్నిష్ఠస్య = ఆ సత్‌పదార్థం మీద స్థిరత్వం ఉన్నవానికి, మోక్షోపదేశాత్ = మోక్షం కలుగుతుందని చెప్పడం వల్ల ప్రధానం ఆత్మశబ్దవాచ్యం కాజాలదు" అని సూత్రానికి అర్థం.

నేతి:- అచేతనమైన ప్రధానం ఆత్మశబ్దానికి ఆలంబనం (ఆత్మశబ్దార్థం) అవడానికి తగదు. ఎందువల్ల ననగా - మోక్షం పొందించదగిన చేతునుడైన శ్వేత కేతువునకు "తత్త్వమసి శ్వేతకేతో" అని ఆ సత్ మీద నిష్ఠను ఉపదేశించి"ఆచార్యవాన్.... సంపత్స్యే" (ఆచార్యుడు గల పురుషుడు దాని స్వరూపాన్ని తెలుసుకొన కలుగుతాడు. ప్రారబ్ధకర్మ నశించడమే ఆలస్యం, తరవాత మోక్షం పొంది బ్రహ్మైక్యం పొందుతాడు) అని మోక్షం చెప్పబడింది. అచేనమైన సచ్ఛబ్దవాచ్యమైన ఏ ప్రధాన మున్నదో అదే నువ్వు అని మోక్షేచ్ఛ గలవానికి బోధిస్తే, చేతనుడైనవానికి నువ్వు అచేతనుడవు అని బోధిస్తే, విపరీతంగా బోధించే ఆ శాస్త్రం పురుషునికి అనర్థహేతువే అవుతుంది గాన అప్రమాణం అయిపోతుంది. నిర్దుష్టమైన శాస్త్రం అప్రమాణం అని కల్పించడం యుక్తం కాదు. ప్రమాణమైన శాస్త్రం తెలివి తక్కువవాడైన ముముక్షువును ఉద్దేశించి అనాత్మయైన అచేతన పదార్థం నీ ఆత్మ అని బోధిస్తే అతడు నమ్మి, అంధగో లాంగూలన్యాయం చేత అదే నా ఆత్మ అనే దృష్టిని విడవకపోవచ్చును. దానికంటే భిన్నమైన ఆత్మను తెలుసుకొనజాలకపోతాడు. అలా అయితే పురుషార్థం నుండి ప్రతిహతుడై అనర్థం కూడ పొందవచ్చును.

వి: తన గ్రామానికి దూరంగా ఎక్కడనో దారి తప్పిన ఒక అంధుడు నాకు దారి చూపమని ఎవనినో ప్రార్థించగా అతడు దుర్బుద్ధితో ఒక ఎద్దుతోక వాని చేతికి అందించి "ఈ తోక గట్టిగా పట్టుకో, ఈ ఎద్దు నిన్ను నీ గ్రామం చేరుస్తుంది" అని చెప్పగా అతడు పూర్తి విశ్వాసంతో ఆ తోక గట్టిగా పట్టుకొని నానా బాధలకు గురి అయినాడు. ఇది అంధగోలాంగూలన్యాయం. గ్రుడ్డివాడు ఎద్దుతోక సామెత.

## భాష్యమ్

తస్మాద్యథా స్వర్గాద్యర్థినోఽగ్నిహోత్రాది సాధనం యథాభూతము పదిశతి తథా ముముక్షోరపి "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" ఇతి యథా భూతమేవాత్మానముపదిశతీతితి యుక్తమ్. ఏవం చ సతి తప్తపరశుగ్రహణ మోక్షదృష్టాన్తేన సత్యాభిసంధస్య మోక్షోపదేశ ఉపపద్యతే. అన్యథా హ్యాముఖ్యే

సదాత్మతత్త్వోపదేశే "అహముక్థమస్మీతి విద్యాత్" (ఐ.అర. 2.1.2.6) ఇతివత్సం పన్మాత్రమిదమనిత్యఫలంస్యాత్. తత్ర మోక్షపదేశో నోపపద్యేత. తస్మాన్న సదణిమవ్యాత్మశబ్దస్య గౌణత్వమ్. భృత్యే తు స్వామిభృత్యభేదస్య ప్రత్యక్షత్వాదుపపన్నో గౌణ ఆత్మశబ్దో మమాత్మా భద్రసేన ఇతి. అపి చ క్వచిద్గౌణః శబ్దో దృష్ట ఇతి నైతావతా శబ్దప్రమాణవేద్యేఽర్థే గౌణీ కల్పనా న్యాయ్యా, సర్వత్రానాశ్వాసప్రసఙ్గాత్. యత్తూక్తం చేతనాచేతనయోః సాధారణ ఆత్మశబ్దః క్రతుజ్వలనయోరివ జ్యోతిఃశబ్ద ఇతి; తన్న. అనేకార్థత్వ స్యాన్యాయ్యత్వాత్. తస్మాచ్చేతనవిషయం ఏవ ముఖ్య ఆత్మశబ్దశ్చేతనత్వోపచారాత్ భూతాదిషు ప్రయుజ్యతే భూతాత్మా, ఇన్ద్రియాత్మేతి చ. సాధారణత్వే ప్యాత్మశబ్దస్య న ప్రకరణముపపదం వా కించిన్నిశ్చాయకమన్తరేణాన్యతర వృత్తితా నిర్ధారయితుం శక్యతే. న చాత్రాచేతనస్య నిశ్చాయకం కించిత్కారణమస్తి. ప్రకృతం తు సదీక్షితృ; సంనిహితశ్చ చేతనః శ్వేతకేతుః న హి చేతనస్య శ్వేతకేతోః అచేతన ఆత్మా సంభవతీత్యవోచామ. తస్మాచ్చేతనవిషయ ఇహాత్మశబ్ద ఇతి నిశ్చీయతే. జ్యోతిఃశబ్దో పి లౌకికేన ప్రయోగేణ జ్వలన ఏవ రూఢః, అర్థవాదకల్పితేన తు జ్వలనసాదృశ్యేన క్రతౌ ప్రవృత్త ఇత్యదృష్టాన్తః.

## బాలానందిని

తస్మాదితి :- అందువల్ల శాస్త్రం స్వర్గాదులు కావాలనే కోరిక ఉన్నవాని కొరకై ఏ విధంగా యథార్థమైన అగ్నిహోత్రం మొదలైన సాధనాన్ని ఉపదేశిస్తుందో అట్లే ముముక్షువుకొరకు కూడ "స ఆత్మా తత్త్వమసి" అని యథార్థమైన ఆత్మనేఉపదేశిస్తుంది అని చెప్పడం యుక్తం. అలా చెప్పినప్పుడే కాల్చిన గొడ్డలిని పట్టుకొని విడుదల పొందడం అనే దృష్టాంతంచేత సత్యమైన నిర్ణయం కలవానికి మోక్షం లభిస్తుందని చెప్పడం యుక్తం అవుతుంది. అట్లు కాక సదాత్మతత్త్వోపదేశం అముఖ్యం అయితే "అహముక్థమస్మీతి విద్యాత్" (నేనే ఉక్థం (ప్రాణం) అయిఉన్నాను అని తెలుసుకోవాలి) అని అని చెప్పినట్లు ఇది సంపదుపాసన మాత్రమే అయి దీని ఫలం కూడ అనిత్యం అవుతుంది. అలాంటప్పుడు మోక్షోపదేశం కుదరదు. అందుచేత ఆత్మశబ్దం సూక్ష్మమైన సత్ విషయంలో గౌణంగా ప్రయోగించబడలేదు. స్వామికీ భృత్యునికీ మధ్య నున్న

భేదం ప్రత్యక్షంగా కనబడుతున్నది గాన భృత్యుని విషయంలో "మమాత్మాభద్రసేనః" అని ఆత్మశబ్దప్రయోగం గౌణం అని చెప్పడం యుక్తమే.

వి: ఎవడైనా దొంగతనం చేసినట్లు సందేహం కలిగినప్పుడు ఒక ఇనుపగొడ్డలి ఎఱ్ఱగా కాల్చి వాని చేతిలో పెట్టగా వాని చేయి కాలితే వాడు దొంగతనం చేసినట్లు, కాలకపోతే చేయనట్లు నిర్ణయించి వానికి విడుదల ఇచ్చేవారు. దీనిని ఉదాహరణగా ఇచ్చి సత్యమైన ఆత్మజ్ఞానం కలవాడు మోక్షం పొందుతాడు అని ఉపనిషత్తులు చెప్పబడినది. ఇక్కడ ఉపదేశించిన ఆత్మ సత్యమైన ఆత్మ అయితేనే, తాదృశసత్యాత్మ జ్ఞానం వల్ల మోక్షం కలుగుతుందని చెప్పడం యుక్తంగా ఉంటుంది. అముఖ్యమైన సత్తును ఆత్మగా ఉపదేశిస్తే అది "నేనే ప్రాణము అని తెలుసుకో" అని చేసిన ఉపదేశం ఏ విధంగా సంపదుపాసనము చెపుతున్నదో అట్లే ప్రధానం మీద ఆత్మదృష్టి చేయడం కూడ సంపదుపాసనయే అవుతుంది. దాని ఫలం ఏదో స్వల్పమైన ఫలమే అవుతుంది గాని మోక్షం కాజాలదు.

**అపిచేతి:-** అర్థం శబ్దప్రమాణకమైనది. అనగా శబ్దం వినగానే ఏ అర్థం తెలుస్తుందో అదే దాని అర్థం అని గ్రహించాలి. అలాంటప్పుడు ఒక చోట ఒక శబ్దానికి గౌణార్థం చెప్పాం కదా అని ప్రతి చోటా అలాంటి గౌణార్థం చెప్పడం న్యాయ్యం కాదు. అలా గౌణార్థాలు చెప్పడం ప్రారంభిస్తే ఏ అర్థం విషయంలోనూ విశ్వాసం, నిశ్చయం ఉండదు. జ్యోతిఃశబ్దం యాగము అగ్ని అనే అర్థాలు రెండింటికీ సాధారణం అయినట్లు ఆత్మశబ్దం కూడ చేతనాచేతనాలు రెండింటి విషయంలోను సాధారణమే, అనగా రెండింటినీ చెపుతుంది అని ఏది పైన చెప్పబడిందో అది యుక్తం కాదు. ఎందువల్లననగా ఒక శబ్దానికి ఒకే అర్థం ఉండాలి కాని అనేకార్థాలుండడం న్యాయ్యం కాదు. అందువల్ల ఆత్మశబ్దం చేతన విషయంలోనే ముఖ్యమైనది (ముఖ్యార్థంగా చేతనాన్నే బోధిస్తుంది). భూతాత్మ, ఇంద్రియాత్మ అని భూతాదుల విషయంలో ఉపచారం వల్లనే (ఔపచారికంగానే, గౌణంగానే) ప్రయోగించబడుతున్నది. ఆత్మ శబ్దం సాధారణమే (రెండు అర్థాలు చెప్పగలదు) అనుకొన్నా కూడ ఇక్కడ ఈ అర్థం చెప్పాలి అని నిశ్చయించడానికి వీలైన ఏదైన ప్రకరణం గాని, ఉపపదం (ప్రక్క నున్న పదం) గాని లేకుండా ఈ అర్థమే బోధిస్తుంది అని నిర్ధారణ చేయడం శక్యం కాదు. ఇక్కడ అచేతనాన్ని చెప్పాలి అని నిశ్చయించడానికి తగిన కారణం ఏదీ లేదు. (ఇక్కడ ప్రకృతం ఈక్షితృత్వం ఉన్న సత్ దగ్గర ఉన్నది చేతనుడైన శ్వేతకేతువు. అందుచేత చేతనార్థాన్నే గ్రహించాలని ప్రకరణ ఉపపదాలను పట్టి తెలుస్తూన్నదని అర్థం). చేతనుడైన

శ్వేతకేతువుకు, అచేతనం ఆత్మ అవడానికి వీలులేదని వెనుక చెప్పి ఉన్నాం. అందుచేత ఇక్కడ ఆత్మశబ్దం చేతనాన్ని మాత్రమే నిర్దేశిస్తున్నది అని నిశ్చయించబడుతుంది. జ్యోతిఃశబ్దం కూడ లోకప్రయోగానుసారం రూఢిచేత అగ్నిని మాత్రమే బోధిస్తుంది. అర్థవాదవాక్యంలో కల్పించిన అగ్ని సాదృశ్యం చేత ఈ పదం యాగాన్ని బోధిస్తూన్నది గాన ఇది సరియైన దృష్టాంతం కాదు.

vi. స్తోమా లనగా ఋక్కుల సంఘాలు, అవి జ్యోతిస్సు వస్తువులను ప్రకాశింప చేసి నట్లు అర్థాన్ని ప్రకాశింప చేస్తున్నాయి గాన వాటికి ఆ గుణాన్ని పట్టి జ్యోతిస్సు లనే పేరు "ఏతాని వావ జ్యోతీంషి య ఏతేఽస్య స్తోమాః" అనే అర్థ వాదవాక్యంలో పెట్టబడింది. ఆ విధమైన ఋక్కులున్నది జ్యోతిష్టోమం. అందుచేత ఇక్కడ జ్యోతిః శబ్దానికి ఉన్న యాగం అనే అర్థం గౌణం. ముఖ్యార్థం మాత్రం తేజస్సే.

## భాష్యమ్

అథవా పూర్వసూత్ర ఏవాత్మశబ్దం నిరస్తగౌణత్వసాధారణత్వా శఙ్కతయా వ్యాఖ్యాయ తతః స్వతన్త్ర ఏవ ప్రధాన కారణనిరాకరణ హేతుర్వ్యాఖ్యేయః- "తన్నిష్ఠస్య మోక్షపదేశాత్" ఇతి. తస్యాన్నాచేతనం ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్.

## బాలానందిని

అథవేతి :- 'తన్నిష్ఠస్య మోక్షపదేశాత్' అనే సూత్రంలో ఆత్మశబ్దానికి గౌణార్థం చెప్పకూడదు అనేదానికి హేతువు ప్రతిపాదించినట్లు అర్థం చెప్పబడింది. దీనికి ఆ అర్థం చెప్పకుండా ఆత్మశబ్దానికి గౌణార్థం కాని, అనేకార్థాలు కాని చెప్పకూడదు అనే భావం కూడ "గౌణశ్చేన్నాత్మశబ్దాత్" అనే సూత్రంలోనే పూర్వోత్తరపక్షనిరూపణ పూర్వకంగా చెప్పి ఈ సూత్రం స్వతంత్రంగా మరొక ప్రధాన కారణవాదనిరాకరణ హేతువు చెవుతున్నట్లు వ్యాఖ్యానించవచ్చును. అందువల్ల అచేతనమైన ప్రధానం సచ్ఛబ్దంచేత చెప్పబడదు.

## భాష్యమ్

కుతశ్చ న ప్రధానం సచ్ఛబ్దార్థవాచ్యమ్?

### సూ. హేయత్వావచనాచ్చ 1.1.8

యద్యనాత్మైవ ప్రధానం సచ్ఛబ్దవాచ్యం "స ఆత్మా. తత్త్వమసి" ఇతీహోపదిష్టం స్యాత్స తదుపదేశశ్రవణాదనాత్మజ్ఞతయా తన్నిష్ఠో మా భూదితి

ముఖ్యమాత్మానముపదిదిక్షుస్తస్య హేయత్వం బ్రూయాత్. యథారున్ధతీం దిదర్శయిషుస్తత్సమీపస్థాం స్థూలాం తారామముఖ్యాం ప్రథమమరున్ధతీతి గ్రాహయిత్వా తాం ప్రత్యాఖ్యాయ పశ్చాదరున్ధతీమేవ గ్రాహయతి తద్వత్ నాయమాత్మేతి బ్రూయాత్. న చైవమవోచత్. సన్మాత్రాత్మావగతినిష్ఠైవ హి షష్ఠప్రపాఠకపరిసమాప్తిర్దృశ్యతే. చశబ్దః ప్రతిజ్ఞావిరోధాభ్యుచ్చయ ప్రదర్శనార్థః. సత్యపి హేయత్వవచనే ప్రతిజ్ఞావిరోధః ప్రసజ్యేత. కారణవిజ్ఞానాద్ధి సర్వం విజ్ఞాతమితి ప్రతిజ్ఞాతమ్. "ఉత తమాదేశమప్రాక్షః, యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్" ఇతి, "కథం ను భగవః స ఆదేశో భవతి" ఇతి, "యథా సోమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్, ఏవం సోమ్య స ఆదేశోభవతి" (ఛా.ఉ.6.1.13) ఇతి వాక్యోపక్రమే శ్రవణాత్. న చ సచ్ఛబ్ద వాచ్యే ప్రధానే భోగ్యవర్గకారణే హేయత్వేనాహేయత్వేన వా విజ్ఞాతే భోక్తృవర్గో విజ్ఞాతో భవతి, అప్రధానవికారత్వాద్భోక్తవర్గస్య. తస్మాన్న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్.

### బాలానందిని

కుత ఇతి:- ఇంకా మరెందువలన ప్రధానం సచ్ఛబద్దవాచ్యం కాదు? "హేయత్వాన్ని చెప్పలేదు కావున కూడా ప్రధానం సచ్ఛబ్దవాచ్యం కాదు" అని సూత్రార్థం,

"స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అనే వాక్యంలో అనాత్మయైన ప్రధానమే సచ్ఛబ్దవాచ్యంగా చెప్పబడి ఉన్నట్లయితే, అలా ఉపదేశింపబడినవాడు ఆ ఉపదేశం విని, ఆత్మ కానిదానిని మాత్రమే తెలిసికొన్నవాడై దాని మీదనే నిష్ఠను పొందకుండా ఉండడానికై, అనగా అదే ఆత్మ అని గట్టిగా పట్టుకొని కూర్చోకుండా ఉండడానికై, ముఖ్యమైన ఆత్మను ఉపదేశించ గోరి దానిని విడిచి పెట్టివేయాలి; అనగా నిజంగా ఇది ఆత్మ కాదు, అని చెప్పి ఉండేవాడు. అరుంధతీనక్షత్రం చూపదలచుకొన్నవాడు దాని దగ్గరనే ఉన్న ఒక పెద్ద నక్షత్రాన్ని అదే అరుంధతి అని చూపి, తరవాత అది కాదు నిజమైన అరుంధతి అని చెప్పి నిజమైన అరుంధతిని ఏ విధంగా చూపుతాడో అట్లే ఇది నిజమైన ఆత్మ కాదు అని చెప్పి ఉండేవాడు. అలా చెప్పలేదు. ఛాందోగ్యోపనిషత్తులోని ఆరవ ప్రపాఠకం సత్‌ను ఆత్మ అని బోధించడంతోనే ముగిసినది కదా? సూత్రంలోని చశబ్దం "ప్రతిజ్ఞావిరోధం అనే దోషం కలుగుతుంది"

అనే మరొక హేతువును కూడ చూపడం కోసం ప్రయోగించబడింది. (హేయత్వవచనం లేదు కాని) అది ఉన్నా కూడ ప్రతిజ్ఞావిరోధం ప్రసక్తం అవుతుంది. (ఈ ఘట్టంలో) కారణాన్ని తెలుసుకొనడంవల్ల సర్వమూ తెలియబడుతుంది అని ప్రతిజ్ఞ చేయబడింది (చెప్పబడింది). ''ఉత... విజ్ఞాతమ్'' (దేనిచేత అంతకు పూర్వం ఎన్నడూ వినబడనిది వినబడుతుందో, ఊహించబడనిది ఊహించబడుతుందో, తెలియబడనిది తెలియబడుతుందో అలాంటి ఆదేశాన్ని, అనగా ఉపదేశం ద్వారా మాత్రమే తెలియదగిన సదాత్మత్వాన్ని, గూర్చి (మీ గురువులను) అడిగావా?) అని, ''కథం...భవతి'' (పూజ్యుడా! ఆ ఆదేశం ఎట్లుంటుంది?) అని, ''యథా... భవతి'' (ఓ! సౌమ్యుడా! ఒక మట్టి ముద్దను గూర్చి తెలుసుకుంటే మట్టితో చేసిన ప్రతి వస్తువూ ఏ విధంగా తెలియబడుతుందో, ఎందువల్ల ననగా వాక్కుచేత ప్రారంభించబడిన వికారం (ఘటాదికం) కేవలం పేరు మాత్రమే, మట్టి అనేదే సత్యమైనది (ఘటాదికం అసత్యం); సౌమ్యుడా! ఆ ఆదేశం ఈ విధంగా ఉంటుంది) అని వాక్యప్రారంభంలో చెప్పబడింది. (అనగా కారణమైన సత్‌ను గూర్చి తెలుసుకొన్నవానికి దాని కార్యా లన్నీ తెలుస్తాయి. అలాంటి ఆదేశాన్ని అడిగావా అని తండ్రియైన అరుణి కుమారుడైన శ్వేతకేశువును ప్రశ్నించి నట్లు ఈ ఘట్టం ప్రారంభంలో చెప్పబడింది అని అర్థం). ప్రధానం భోగ్యవర్గానికి, అనుభవించదగిన జడపదార్థాలకు మాత్రమే కారణం. సచ్ఛబ్దంచేత ఆ ప్రధానం వాచ్యం అన్నట్లయితే, అది హేయం అని చెప్పినా, అహేయం అని చెప్పినా కూడ దానిని తెలుసుకుంటే (భోగ్యవర్గం తెలియవచ్చునుగాని) భోక్తృవర్గం, (భోగ్యం అనుభవించే జీవుల సముదాయం) తెలియదు. భోక్తృవర్గం ప్రధానం వల్ల పుట్టలేదు కదా? అందువల్ల ప్రధానం సచ్ఛబ్ద వాచ్యం కాదు.

### భాష్యమ్

కుతశ్చ న ప్రధానం సచ్ఛబ్దవాచ్యమ్

### సూ. స్వాప్యయాత్. 1.1.9.

తదేవ సచ్ఛబ్దవాచ్యం కారణం ప్రకృత్య శ్రూయతే-'' యత్రైతత్ పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి'' (ఛా.ఉ. 6.8.1) ఇతి. ఏషా శ్రుతిః స్వపితీత్యేతత్పురుషస్య లోకప్రసిద్ధం నామ నిర్వక్తి. స్వశబ్దేనేహాత్మోచ్యతే యః ప్రకృతః సచ్ఛబ్దవాచ్యః; తమ్ అపీతో భవతి అపిగతో భవతీత్యర్థః అపపూర్వస్యైతేర్లయార్థత్వం ప్రసిద్ధమ్; ప్రభవాప్యయా విత్యుత్పత్తిప్రలయయోః ప్రయోగదర్శనాత్, మనఃప్రచారోపాధివిశేష

సంబన్ధాదిష్విన్ద్రియార్థాన్ గృహ్ణంస్తద్విశేషాపన్నో జీవః జాగర్తి. తద్వాసనావిష్టః స్వప్నాన్ పశ్యన్ మనఃశబ్దవాచ్యో భవతి. స ఉపాధిద్వయోపరమే సుషుప్తావస్థాయాముపాధికృతవిశేషాభావాత్స్వాత్మని ప్రలీన ఇవేతి. "స్వంహ్యపీతో భవతి" ఇత్యుచ్యతే, యథా హృదయ శబ్దనిర్వచనం శ్రుత్యా దర్శితమ్- "స వా ఏష ఆత్మా హృది తస్యైతదేవ నిరుక్తం హృద్యయ మితి, తస్మాద్ధృదయమ్" (ఛా.ఉ. 8.3.3) ఇతి; యథా వాశనాయోదన్యాశబ్ద ప్రవృత్తిమూలం దర్శయతి శ్రుతిః - "ఆప ఏవ తదశితం నయన్తే; తేజ ఏవ తత్పీతం నయతే" (ఛా.ఉ. 6.8.3.5), ఇతి చ. ఏవం స్వమాత్మానం సచ్ఛబ్దవాచ్యమపీతో భవతి ఇతీమమర్థం స్వపితినామనిర్వచనేన దర్శయతి. న చ చేతన ఆత్మా అచేతనం ప్రధానం స్వరూపత్వేన ప్రతిపద్యేత. యది పునః ప్రధానమేవాత్మీయత్వాత్ స్వశబ్దేనోచ్యేత ఏవమపి చేతనోఽచేతన మప్యేతీతి విరుద్ధమాపద్యేత. శ్రుత్యన్తరం చ "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాన్తరమ్" (బృ.ఉ. 4.3.1) ఇతి సుషుప్తావస్థాయాం చేతనేఽప్యయం దర్శయతి. అతో యస్మిన్నప్యయః సర్వేషాం చేతనానాం తచ్చేతనం సచ్ఛబ్దవాచ్యం జగతః కారణం; న ప్రధానమ్. 9.

బాలానందిని

కుతశ్చేతి:- మరెందువలన కూడ ప్రధానం సచ్ఛబ్దవాచ్యం కాదు? స్వాప్యయాత్ ఇతి:- (సుషుప్త్యవస్థలో జీవుడు) తనలోనే నీలీను డవుతున్నాడు అని చెప్పబడింది కావున'' అని సూత్రార్థం.

తదేవేతి:- సచ్ఛబ్దంచేత చెప్పబడే ఆ కారణాన్నే ప్రస్తావించి ''యత్ర...భవతి'' (ఏ సుషుప్తియందు ఇది (నిద్రించుట) కలుగునో, ఎప్పుడు జీవుడు 'స్వపితి' (నిద్రిస్తున్నాడు) అని అంటామో, సౌమ్యుడా, అప్పుడు జీవుడు సత్‌తో కూడినవాడవుతాడు; తననే చేరుతాడు, అందుచేతనే ఇతనిని 'స్వపితి' అంటారు; ఎందువల్లననగా ''స్వమ్ అపీతః భవతి'' (తననే పొందిన వాడవుతాడు) అని శ్రుతివాక్యం వినబడుచున్నది. ఈ శ్రుతి పురుషుని విషయంలో లోకప్రసిద్ధ మైన 'స్వపితి' అనే పేరును నిర్వచిస్తున్నది. ఇక్కడ 'స్వ' శబ్దానికి 'ఆత్మ' అని అర్థం. ప్రకృతుడైన, సచ్ఛబ్దవాచ్యుడైన ఏ పురుషుడు (బ్రహ్మ) కలడో ఆ పురుషుణ్ణే చేరుతాడు అని అర్థం. 'అపి' పూర్వమునందు గల 'ఇ' అనే ధాతువునకు లయం పొందుట అను అర్థం ప్రసిద్ధం. 'ప్రభవాప్యయౌ' అనే పదానికి ఉత్పత్తి, ప్రలయము అనే అర్థం ప్రసిద్ధమే కదా. (అప్యయశబ్దం 'అపి' పూర్వ 'ఇ' ధాతువు నుండి నిష్పన్నమైనది) జీవుడు

మనఃసంచారానికి ఉపయోగించే ఉపాధి విశేషాలతో సంబంధంవల్ల ఇంద్రియ విషయాలను గ్రహిస్తూ ఆ వృత్తివిశేషాలతో కూడినప్పుడు మేల్కొని ఉంటాడు. వాటి వాసనలతో కూడినవాడై స్వప్నాలు చూస్తూ మనఃశబ్దంచేత చెప్పబడతాడు. ఆ రెండు ఉపాధులూ విరమించగా సుషుప్తావస్థలో ఉపాధులవల్ల ఏర్పడిన విశేషాలు లేకపోవడం చేత తన ఆత్మలో తానే అణగిపోయి నట్లు అవుతాడు గాన "స్వమ్ అపీతఃభవతి" అని చెప్పబడతాడు.

వి. బాహ్యమైన వస్తువుల మీదికి ఇంద్రియాల ద్వారా మనస్సు ప్రవర్తించినపుడు కలిగే బాహ్యవస్తుజ్ఞానానికి 'వృత్తి' అని పేరు ఆ వృత్తులే ఉపాధులు. ఆ వృత్తి విశేషాలతో జీవునకు సంబంధం ఏర్పడినప్పుడు, ఆ విషయాలను గ్రహిస్తున్నప్పుడు, జీవుడు జాగ్రదవస్థలో ఉన్నాడని అంటారు. జాగ్రదవస్థలో ఉన్న జీవునికి విశ్వుడు లేదా వైశ్వానరుడు అని పేరు. ఇంద్రియములు బాహ్య విషయాలతో కలవకపోయినా కూడ. జాగ్రదవస్థలో మనస్సు మీద ఏర్పడిన కొన్ని సంస్కారాలచేత జీవుడు నిద్రలో కొన్ని విషయాలు చూస్తాడు. ఆ సమయంలో మనస్సు మాత్రమే పని చేస్తుంది. అందుచేత స్వప్నద్రష్టయైన జీవునకు మనస్సు అనీ తైజను డనీ పేరు. స్థూలోపాధులైన ఘటాద్యాకార వృత్తులు, స్వప్నంలోని సూక్ష్మోపాధియైన మనస్సు కూడా ఉపరమించినపుడు జీవుడు తనలో తానే లీనుడైనట్లు చెప్పబడతాడు.

యథా ఇతి:- "స వా... హృదయమ్" (అట్టి ఈ ఆత్మ హృదయంలో ఉంటాడు. దానికి "హృద్యయమ్" అని ఇదే నిర్వచనం. అందుచేతనే హృది+అయమ్ అనేది (హృదయమ్' అయింది) అనీ, అట్లే (ఉదకమే తిన్న ఆహారాన్ని ద్రవంగా చేసి జీర్ణింపచేస్తుంది. అందుచేత దానికి 'అశనాయా' అని పేరు, త్రాగబడిన ఆ నీటిని తేజస్సు శోషింపచేస్తుంది గాన దానికి 'ఉదన్యం' అని పేరు అని ఏ విధంగా శ్రుతి 'హృదయ' శబ్దాన్ని 'అశనాయా'. 'ఉదన్యా' శబ్దాలని నిర్వచించిందో అదే విధంగా శ్రుతి 'స్వపితి' శబ్దాన్ని నిర్వచించి స్వమ్=సచ్ఛబ్దవాచ్యమైన తనను, అపీతో భవతి=చేరును అని అర్థాన్ని బోధిస్తున్నది. స్వశబ్దానికి తనకు సంబంధించినది అనే అర్థం కూడ ఉన్నది గాన దానికి తనకు సంబంధించిన ప్రధానం అని అర్థం చెప్పినట్లయితే చేతనం అచేతనంలో లీనమవుతుంది అనే విరుద్ధమైన అర్థం ఏర్పడుతుంది. "ప్రాజ్ఞేనాత్మనా... నాన్తరమ్" (ప్రాజ్ఞుడైన ఆత్మతో కలిసిపోయినవాడై బాహ్యమైన ఏ పదార్థమును కాని లోపల ఉన్న ఏ పదార్థాన్నీ కాని తెలుసుకొనజాలడు) అని మరొక శ్రుతి కూడ సుషుప్తావస్థలో చేతనంలోనే లీనమవడాన్ని చూపుతున్నది. అందుచేత చేతనులైన సమస్త జీవులకు దేనియందు అప్యయమో (లీనమవడమో) అట్టి సచ్ఛబ్దంచేత చెప్పబడే చేతనమే జగత్తుకు కారణం కాని ప్రధానం కాదు.

## భాష్యమ్

కుతశ్చ న ప్రధానం జగతః కారణమ్-

### సూ. గతిసామాన్యాత్ 1.1.10.

యది తార్కికసమయ ఇవ వేదాన్తేష్వపి భిన్నా కారణావగతిషరభవిష్యత్, క్వచిచ్చేతనం బ్రహ్మ జగతః కారణం, క్వచిదచేతనం ప్రధానం, క్వచిదన్యదేవేతి, తతః కదాచిత్ ప్రధాన కారణవాదానురోధేనాపీక్షత్యాది శ్రవణమకల్పయిష్యత్. న త్వేవమస్తి, సమానైవ హి సర్వేషు వేదాన్తేషు చేతన కారణావగతిః "యథాగ్నేర్జ్వలతః సర్వా దిశో విస్ఫులిఙ్గా విప్రతిష్ఠేరన్ ఏవమేవైతస్మాదాత్మనః సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠన్తే. ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః" (క.ఉ.3.3) ఇతి, "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1) - ఇతి, "ఆత్మన ఏవేదం సర్వమ్" (ఛా.ఉ. 7.26.1) ఇతి, 'ఆత్మన ఏష ప్రాణో జాయతే" (ప్ర.ఉ.3.3) ఇతి చాత్మనః కారణత్వం దర్శయన్తి సర్వే వేదాన్తాః. ఆత్మశబ్దశ్చ చేతనవచన ఇత్యవోచామ. మహచ్చ ప్రామాణ్యకారణమేత ద్వద్వేదాన్తవాక్యానాం చేతనకారణత్వే సమానగతిత్వం చక్షురాదీనామివ రూపాదిషు. అతో గతిసామాన్యాత్ సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణమ్.10.

### బాలానందిని

కుత ఇతి:- ఇంకా ఎందువలన ప్రధానం జగత్కారణం కాదు?

గతీతి :- "గతిసామాన్యాత్= వేదాంత వాక్యాలవల్ల కలిగిన గతి, అనగా అవగతి, జ్ఞానం, ఒకే విధంగా ఉంది కావున" అని సూత్రార్థం.

యదీతి:- తర్కం మీదనే ఆధారపడే తార్కికుల సంప్రదాయంలో వలె, వేదాంతాలలో కూడా కొన్నిచోట్ల చేతనమైన బ్రహ్మ జగత్కారణమనీ, కొన్ని చోట్ల అచేతనమైన ప్రదానం కారణమనీ, కొన్ని చోట్ల మరొకటేదో కారణమనీ వేరు వేరు కారణాల జ్ఞానం ఉండి ఉన్నట్లయితే అప్పుడు ప్రధానకారణవాదానికి అనుగుణంగా కూడ ఈక్షత్యాదిశ్రవణం కల్పించబడి ఉండేది కాని అలాంటి విభిన్న కారణావగతి లేదు. చేతనమే జగత్కారణం అనే జ్ఞానం అన్ని వేదాంతాలకు సమంగానే ఉన్నది కదా? "యథా... లోకాః" (మండుతూన్న అగ్ని నుండి నిప్పు నెరసులు అన్ని దిక్కుల వైపు ఏ విధంగా ఎగురుతుంటాయో అట్లే ఈ ఆత్మనుండి సమస్తమైన

చక్షురాదిప్రాణాలు తమ తమ గోళాలలోనికి ప్రయాణమై వెడతాయి. ఆ చక్షురాదుల తరవాత వాటిని అనుగ్రహించే, అనగా వాటిని పని చేయించే, సూర్యాదిదేవతలు బయలుదేరుతారు, ఆ దేవతల తరవాత లోకాలు, అనుగ్రాహ్యావిషయాలు, బయలుదేరుతాయి) అని, "తస్మాద్వా... సంభూతః" (ఆ ఆత్మనుండి ఆకాశం పుట్టినది) అని, "ఆత్మన...సర్వమ్" (ఇదంతా ఆత్మనుండే పుట్టింది) అని, "ఆత్మన...జాయతే" (ఆత్మ నుండే ప్రాణం పుట్టుచున్నది) అనీ ఆత్మయే కారణం అని సమస్త వేదాంతాలు చెపుతున్నాయి. ఆత్మశబ్దం చేతనవాచకం అని చెప్పి ఉన్నాం, చక్షురాదులకు రూపాదుల విషయంలో వలె వేదాంతవాక్యాలు చేతనకారణత్వం విషయంలో సమానమైన గతి కలిగి ఉండడం వేదాంతవాక్యాల ప్రామాణ్యానికి గొప్ప కారణం. అందువల్ల గతి సామాన్యం వల్ల సర్వజ్ఞమైన బ్రహ్మయే జగత్తుకు కారణం.

వి. నేత్రం మొదలైన ఇంద్రియాలు ఎల్లప్పుడూ అన్ని దేశాలలోను, అందరికీ రూపాదివిషయాలనే తెలుపుతాయి. నేత్రం కొందరికి రూపం చూపించి కొందరికి శబ్దం వినిపింపచేయడం వంటిది ఉండదు. దానిని పట్టి చక్షురాదులు రూపాదిజ్ఞానాన్నే కలిగిస్తా యని నిశ్చితంగా చెపుతున్నాం. అట్లే వేదాంతవాక్యాలన్నీ జగత్కారణం బ్రహ్మయే అని చెపుతున్నాయి. బ్రహ్మ అని కొన్ని, మరొకటని కొన్నీ ఈ విధంగా వేరు వేరుగా చెప్పడం లేదు. ఈ విధంగా చేతనమే కారణమని చెప్పడం విషయంలో వేదాంతాలకు పూర్తిగా ఒకే విధమైన గతి (జ్ఞానం కలిగించడం) ఉండడం వీటికి ఆ విషయంలో ఉన్న గొప్ప ప్రామాణ్యానికి నిదర్శనం. 10.

## భాష్యమ్

కుతశ్చ సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణమ్ -

**సూ. శ్రుతత్వాచ్చ 1.1.11.**

స్వశబ్దేనైవ చ సర్వజ్ఞ ఈశ్వరో జగతః కారణమితి శ్రూయతే శ్వేతాశ్వతరాణాం మన్త్రోపనిషది సర్వజ్ఞమీశ్వరం ప్రకృత్య-

"న తస్య కశ్చిత్పతిరస్తి లోకే న చేశితా నైవ చ తస్య లిఙ్గమ్,

స కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః"

(శ్వే. ఉ. 6.9.) ఇతి తస్మాత్సర్వజ్ఞం జగతః కారణం, నా చేతనం ప్రధాన మన్యద్వేతి సిద్ధమ్. 11.

బాలానందిని

మరి ఎందువల్ల కూడ సర్వజ్ఞమైన బ్రహ్మ జగత్తుకు కారణం?

శ్రుతత్వాచ్చేతి:- శ్రుతత్వాచ్చ=స్వశబ్దంచేతనే వినబడడంవల్ల కూడ, బ్రహ్మమే జగత్కారణం" అని సూత్రార్థం.

స్వశబ్దేనేతి:- శ్రుతత్వాచ స్వశబ్దంచేతనే, అనగా తనను బోధించే 'సర్వవిత్' అనే శబ్దం చేతనే సర్వజ్ఞుడైన ఈశ్వరుడే జగత్తుకు కారణం అని శ్వేతాశ్వతరుల మంత్రోపనిషత్తులో, సర్వజ్ఞుడైన ఈశ్వరుణ్ణి ప్రస్తావించి "న తస్య.... అధిపః" (ఈ లోకంలో ఆ ఈశ్వరునికి ప్రభువు ఎవడో లేడు; అతని మీద అధికారం చేసేవాడు ఎవడూ లేడు. అతనికి గుర్తు లేదు. అతనికి కారణం ఏదీ లేదు; అతడే జీవుల అధిపతి. అతనిని పుట్టించినవాడు గాని, అధిపుడు గాని లేడు) అని వినబడుతున్నది. అందుల్ల ఈ జగత్తుకు కారణమైనది సర్వజ్ఞమైన బ్రహ్మయే. అంతే కాని అచేతనమైన ప్రధానం గాని మరొకటి గాని కాదని నిశ్చితమైనది.11

## ఈక్షత్యధికరణం సమాప్తం

## 6. ఆనన్దమయాధికరణమ్ (సూ. 12-19)

### భాష్యమ్

'జన్మాద్యస్య యతః" ఇత్యారభ్య "శ్రుతత్వాచ్చ" ఇత్యేవమన్తైః సూత్రైర్యాన్యుదాహృతాని వేదాన్తవాక్యాని తేషాం సర్వజ్ఞః సర్వశక్తిరీశ్వరో జగతో జన్మస్థితిలయకారణమిత్యేతస్యార్థస్య ప్రతిపాదకత్వం న్యాయపూర్వకం ప్రతిపాదితమ్. గతిసామాన్యోపన్యాసేన చ సర్వే వేదాన్తా శ్చేతనకారణవాదిన ఇతి వ్యాఖ్యాతమ్. అతఃపరం గ్రన్థస్య కిముత్థానమితి? ఉచ్యతే-ద్విరూపం హి బ్రహ్మావగమ్యతే - నామరూప వికారభేదోపాధివిశిష్టం తద్విపరీతం చ సర్వోపాధివివర్జితమ్ "యత్ర హి ద్వైతమివ **భవతి** తదితర ఇతరం పశ్యతి, యత్ర త్వస్య సర్వమాత్మై వాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.4.5.15), "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా, అథ యత్రాన్యత్ప శ్యత్యన్యచ్ఛ ణోత్యన్యద్విజానాతి తదల్పం, యో వై భూమా తదమృతమ్. అథ యదల్పం తన్మర్త్యమ్" (ఛా.ఉ.7.2.4.1) "సర్వాణి రూపాణి విచిత్య ధీరః,నామాని కృత్వాభివదన్యదాస్తే" (తై.ఆ.3.12.7), "నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్, అమృతస్య పరం సేతుం దగ్ధేన్దనమివానలమ్"

(శ్వే.ఉ.6.19) 'నేతి నేతి" (బృ.ఉ.2.3.6), 'అస్థూలమనణు' (బృ.ఉ.3.8.8), "న్యూనమన్యత్ స్థానం, సంపూర్ణమన్యత్". ఇతి చ. ఏవం సహస్రశో విద్యా విద్యావిషయభేదేన బ్రహ్మణో ద్విరూపతాం దర్శయన్తి వాక్యాని. తత్రావిద్యావస్థాయాం బ్రహ్మణః ఉపాస్యోపాసకత్వాదిలక్షణః సర్వో వ్యవహారః. తత్ర కాని చిద్బ్రహ్మణ ఉపాసనాన్యభ్యుదయార్థాని, కాని చిత్క్రమముక్త్యర్థాని, కాని చిత్కర్మ సమృద్ధ్యర్థాని, తేషాం గుణవిశేషోపాధి భేదేన భేదః ఏక ఏవ తు పరమాత్మా ఈశ్వరస్తై స్తైర్గుణవిశేషైర్విశిష్ట ఉపాస్యో యద్యపి భవతి, తథాపి యథా గుణోపాసనమేవ ఫలాని భిద్యన్తే. "తం యథా యథోపాసతే తదేవ భవతి" ఇతి శ్రుతేః. "యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి (ఛా.ఉ.3-14-1) ఇతి చ. స్మతేశ్చ–

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేవరమ్,
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః" (భ.గీ.8.6) ఇతి.

బాలానందిని

జన్మతిః- "జన్మాద్యస్య యతః" మొదలు 'శ్రుతత్వాచ్చ' అనే సూత్రం వరకు ఉన్న సూత్రాలలో ఉదాహరించబడిన వేదాంతవాక్యాలు సర్వజ్ఞుడు, సర్వశక్తుడు అయిన ఈశ్వరుడు జగజ్జన్మస్థితిలయాలకి కారణం అనే విషయాన్ని ప్రతిపాదిస్తున్నాయి అని న్యాయ పూర్వకంగా (యుక్తి యుక్తంగా, లేదా అంతటా ఉపయోగించే న్యాయాలను నిర్ణయించడం ద్వారా) ప్రతిపాదించబడింది. గతిసామాన్యం ఉన్నదని చెప్పడం ద్వారా వేదాంతా లన్నీ చేతనమే కారణమన్ని ప్రతిపాదిస్తున్నాయి అని వ్యాఖ్యానించబడింది. ఇటుపైన రాబోయే గ్రంథానికి అవకాశం ఏమిటి అని ప్రశ్న.

దీనికి సమాధానం చెప్పబడుచున్నది - నామమూ, రూపము అనే ఏ వికారం, అనగా జగత్తు, ఉన్నదో దానిలోని హిరణ్యశ్మశ్రుత్వం మొదలైన భేదాలతోను వాటికి కారణమైన ఉపాధులతోను కూడిన బ్రహ్మ ఒకటి, ఎట్టి ఉపాధులూ లేని బ్రహ్మ ఒకటి అని రెండు విధాలైన బ్రహ్మ (వేదాంతాలలో) తెలుస్తున్నది. "యత్ర.... పశ్యేత్" (ఎక్కడ ద్వైతం ఉన్నట్లు కనబడుతుందో అక్కడ ఒకడు మరొకణ్ణి చూస్తాడు. ఎక్కడ వీనికి సర్వమూ ఆత్మగానే అయిపోతుందో అక్కడ దేనిచేత దేనిని చూస్తాడు), "యత్ర... మర్త్యమ్" (ఎక్కడైతే మరొక దానిని చూడడో, మరొక దాని వినడో, మరొక దానిని తెలుసుకొనడో అది భూమ, అనగా అతి విశాలమైనస్థితి, ఎక్కడైతే మరొకదానిని చూస్తాడో, మరొకదానిని వింటాడో, మరొకదానిని తెలుసుకుంటాడో అది అల్పం, ఏది భూమయో అది నాశరహితం, ఏది అల్పమో అది నశించే స్వభావం గలది),

"సర్వాణి... ఆస్తే" (ధీరుడైన పరమాత్మ సమస్త రూపాలను కల్పించి, పేర్లు పెట్టి బుద్ధ్యాదులలో ప్రవేశించి జీవసంజ్ఞతో వ్యవహరిస్తూంటాడు), "నిష్కలం... అనలమ్" (అంశాలు లేనిది, క్రియలు లేనిది, శాంతము, దోషాలు లేనిది, ధర్మాదులతో సంబంధం లేనిది, మోక్షానికి తీసికొని వెళ్లే ఉత్తమమైన సేతువు, కట్టెలను కాల్చి శాంతించిన అగ్ని వంటిదీ అయిన నిర్గుణమైన ఆత్మను తెలుసుకొనవలెను). "నేతి నేతి" (ఇది కాదు, ఇది కాదు), "అస్థూలమనణు" (ఈ బ్రహ్మ స్థూలం కాదు, సూక్ష్మం కాదు). "న్యూమన్యత్ స్థానం సంపూర్ణమన్యత్" (అన్యూనమ్ = అల్పమైన సగుణరూపం, అన్యత్ = నిర్గుణం కంటే వేరైనది; సంపూర్ణమ్=సంపూర్ణమైన నిర్గుణరూపం, అన్యత్=సగుణం కంటె వేరైనది) అని వేల కొలది శ్రుతివాక్యాలు విద్యా విషయం అవడం అవిద్యావిషయం అవడం అనే భేదంచేత బ్రహ్మ రెండు విధాలైనది అని చూపుతున్నాయి. వాటిలో, అవిద్యావస్థలో బ్రహ్మకు సంబంధించి ఉపాసించదగినది, ఉపాసన చేసేవాడు ఇత్యాది లక్షణాలు గల సమస్తమైన వ్యవహారం ఉంటుంది. వాటిలో కొన్ని సగుణబ్రహ్మోపాసనలు అభ్యుదయం (కామచారం వంటి ఏదో లౌకికాభివృద్ధి) లభించడం కోసం చేసేవి. కొన్ని క్రమముక్తి కోసం చేసేవి (ఆ ఉపసానలు చేస్తే ఆయా దేవతల స్థానాలలో కొంతకాలం సుఖంగా ఉండి తరువాత మోక్షం పొందుతారు). కొన్ని చేస్తున్న కర్మలు చక్కగా అందంగా ఉండటం కొరకు ఉద్దిష్టమైనవి. ఈ విధంగా ఏ దేవతను ఏ గుణాలున్నట్లు ఉపాసిస్తారో ఆ గుణాల భేదాన్ని పట్టీ, హృదయం మొదలైన ఏ ఉపాధులలో ఉపాసన చేస్తారో వాటి భేదాన్ని పట్టీ భేదం ఉంటుంది. ఆయా గుణవిశేషాలతో కూడి ఉన్నట్లు ఒకే పరమాత్మనే ఉపాసించినా ఆ ఉపాసనల ఫలాలు, ఆయా ఉపాసించబడే గుణాలను బట్టి వేరు వేరుగా ఉంటాయి. "తం...భవతి" (ఆ పరమాత్మను ఏఏ విధంగా ఉపాసిస్తాడో అదే అవుతాడు) అని "యథా...భవతి" (పురుషుడు ఈ లోకంలో ఏ విధమైన సంకల్పంతో ఉంటాడో, మరణానంతరం దానికి తగినట్టుగానే అవుతాడు) అని శ్రుతులు చెపుతున్నాయి. "యం... భావిత" (ఓ అర్జునా! చివర ఏయే భావాన్ని (దేవతను) స్మరిస్తూ శరీరాన్ని విడిచి పెడతాడో ఆ భావం చేతనే (ఆలోచనచేతనే) భావితుడై, ఆ దేవతనే పొందుతాడు) అని భగవద్గీతస్మృతి కూడ చెప్పుచున్నది.

## భాష్యమ్

యద్యప్యేక ఆత్మా సర్వభూతేషు స్థావరజఙ్గమేషు గూఢః తథాపి చిత్తోపాధివిశేషతారతమ్యాదాత్మనః కూటస్థనిత్యస్యైకరూపస్యాప్యుత్తరోత్తరమా

విష్కృతస్య తారతమ్యమైశ్వర్యశక్తివిశేషైః శ్రూయతే "తస్య య ఆత్మానమావిస్తరాం వేద" (ఐ.ఆ.2.3.2.1) ఇత్యత్ర. స్మృతావపి.

"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్" (భ.గీ.10.41)

ఇతి యత్ర యత్ర విభూత్యాద్యతిశయః స స ఈశ్వర ఇత్యుపాస్యతయా బోధ్యతే. ఏవమిహాప్యాదిత్యమణ్డలే హిరణ్మయః పురుషః సర్వపాప్మోదయలిఙ్గాత్ పర ఏవేతి వక్ష్యతి. ఏవం "ఆకాశస్తల్లిఙ్గాత్" (బ్ర.సూ.1.1.22) ఇత్యాదిషు ద్రష్టవ్యమ్. ఏవం సద్యోముక్తికారణమప్యాత్మ జ్ఞానముపాధివిశేషద్వారేణోప దిశ్యమానమప్యవివక్షితోపాధిసంబన్ధవిశేషం పరాపరవిషయత్వేన సందిహ్యమానం వాక్యగతిపర్యాలోచనయా నిర్ణేతవ్యం భవతి, యథేహైవ తావత్ "ఆనన్దమయోఽభ్యాసాత్" ఇతి.

ఏవమేకమేవ బ్రహ్మోపేక్షితోపాధిసంబన్ధం, నిరస్తోపాధిసంబన్ధం చోపాస్యత్వేన జ్ఞేయత్వేన చ వేదాన్తేషూపదిశ్యత ఇతి ప్రదర్శయితుం పరోగ్రన్థ ఆరభ్యతే. యచ్చ "గతిసామాన్యాత్" ఇత్యచేతనకారణనిరాకరణముక్తం తదపి వాక్యాన్తరాణి బ్రహ్మవిషయాణి వ్యాచక్షాణేన బ్రహ్మవిపరీత కారణనిషేధేన ప్రపఞ్చ్యతే.

బాలానందిని

యద్యపీతి:- స్థావరజంగమాత్మకాలైన సమస్తభూతాలలోను ఒకే ఆత్మ గూఢంగాఉంది. అయినా కూడ, కూటస్థనిత్య మైన ఆత్మ ఒకే రూపంలో ఉన్నా కూడ, ఆయా ఉపాధి విశేషాలలో ఉన్న తారతమ్యాన్ని పట్టి, ఆ ఆత్మ ఉత్తరోత్తరం ఆవిష్కృతం అవుతుంది; అనగా కొన్ని ఉపాధులలో కొంచెమూ, కొన్నింటిలో అంతకంటే కొంచెం అధికంగాను, మరి కొన్నింటిలో ఇంకా అధికంగాను ఆవిష్కృతం అవుతుంది. ఆవిష్కృతం అవడంలో ఉన్న తారతమ్యాన్ని పట్టి తత్తదుపాధ్యుపహితమైన ఆత్మలో కూడ ఐశ్వర్యవిశేష-శక్తి విశేషాలచేత తారతమ్యం ఉంటుంది అని "తస్య...వేద' (ఎవడు ఆ ఆత్మయొక్క స్వరూపాన్ని ఎక్కువగా ఆవిష్కృతమైన దానినిగా తెలుసుకొని ఉపాసిస్తాడో అతడు దానిని పొందుతాడు) అని శ్రుతిలో వినబడుచున్నది. భగవద్గీతాస్మృతిలో కూడ "యద్యద్... సంభవమ్" (ఏదో విధమైన ప్రభావం గాని,

లక్ష్మి గాని, ఉత్సాహాదిబలం గాని ఉన్న ఏఏ వస్తువు అనగా ప్రాణిజాతం ఉన్నదో అలాంటి ప్రతీదీ నా తేజస్సులోని ఒక అంశంతో పుట్టినది అని తెలుసుకో) అని ఎక్కడెక్కడ విభూత్యాదులు అధికంగా ఉంటాయో దానిని ఈశ్వరుడు అని ఉపాసించాలి అని విధింపబడినది. (ఈ విధంగా నికృష్టమైన ఉపాధి గల ఆత్మ జీవుడు, అతడు ఉపాసకుడు, ఉత్కృష్టమైన ఉపాధి గల ఆత్మ ఈశ్వరుడు, అతడు ఉపాస్యుడు అని తేలినది). ఇట్లే ఇక్కడ కూడ అదిత్యమండలంలో ఉపాసించ దగిన హిరణ్మయపురుషుడు సమస్తపాపాలనుండీ దూరమైనవాడు అనే లింగాన్ని పట్టి పరమాత్మయే; అనగా సూర్యాదులను కూడ పరమాత్మగానే ఉపాసించాలి గాని జీవుణ్ణిగా కాదు, అని మున్ముందు (సూత్రకారుడు) చెప్పనున్నాడు. "అకాశస్తల్లిఙ్గాత్ ' ఇత్యాదులలో కూడ ఈ విధంగానే గ్రహించాలి. (ఆ విషయం ఆకాశాధికరణంలో (8) స్పష్టం కాగలదు). ఇట్లే సద్యోముక్తికి (వెంటనే ముక్తికి) కారణమైన ఆత్మజ్ఞాన కూడ ఆయా ఉపాధి విశేషాల ద్వారా మాత్రమే ఉపదేశింపబడినా కూడ అక్కడ ఉపాధి సంబంధమనే విశేషం వివక్షితం కాదు. అనగా మనస్సుకు పట్టడానికి ఏదో ఉపాధిని గూర్చి చెప్పినా కూడ ఆ ఉపాధికి ప్రాధాన్యం లేదు; శుద్ధాత్మకే ప్రాధాన్యం అని భావం. అలాంటి వాక్యాలలో ఏవి పరాత్మ (నిర్గుణబ్రాహ్మ)ను ప్రతిపాదిస్తున్నాయి. ఏవి అపరాత్మను (సగుణబ్రహ్మను) ప్రతిపాదిస్తున్నాయి అనే విషయాన్ని వాక్యాల గతిని పట్టి (వాక్యాలవల్ల కలిగే అర్థావగతిని పట్టి), ఇప్పుడే చెప్పబోయే "ఆనందమయో ఽభ్యాసాత్" ఇత్యాదులలో వలె, నిర్ణయించవలసి ఉంది. ఈ విధంగా - ఒకే బ్రహ్మను, కొన్ని వేదాంతవాక్యాలు, ఉపాధిసంబంధాన్ని పురస్కరించుకొని, ఉపాస్యంగాను, మరికొన్ని వేదాంతవాక్యాలు, ఉపాధి సంబంధాన్ని దూరంగా విడచి, జ్ఞేయంగాను ప్రదర్శిస్తున్నాయి అని ప్రదర్శించడం కోసం రాబోయే గ్రంథం ప్రారంభించబడుతున్నది. బ్రహ్మను గూర్చి చెప్పే మరికొన్ని వాక్యాలను వ్యాఖ్యానించడం ద్వారా బ్రహ్మకంటె భిన్నమైనది ఏదీ కారణం కాదని చెపుతూ, వెనుక 'గతిసామాన్యాత్' అనే సూత్రంచేత ప్రతిపాదించిన అచేతనం కారణం కాజాలదు అనే విషయం కూడ విస్తృతంగా వివరించబడుతుంది.

## సూ. ఆనన్దమయో ఽభ్యాసాత్ 1.1.12

### భాష్యమ్

తైత్తిరీయకేఽన్నమయం, ప్రాణమయం, మనోమయం, విజ్ఞానమయం చానుక్రమ్యామ్నాయతే "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్ అన్యోఽన్తర

ఆత్మానన్దమయః" (తై.ఉ.2.5) ఇతి. తత్ర సంశయః-కిమిహానన్దమయశబ్దేన పరమేవ బ్రహ్మోచ్యతే యత్ప్రకృతం "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.2.1.) ఇతి, కిం వాన్నమయాదివద్బ్రహ్మణోఽ ర్థాన్తరమితి. కిం తావత్ప్రాప్తమ్? బ్రహ్మణోఽర్థాన్తరమముఖ్య ఆత్మానన్దమయః స్యాత్. కస్మాత్? అన్నమయాద్యముఖ్యాత్మ ప్రవాహపతితత్వాత్. అథాపి స్యాత్సర్వాన్తరత్వాదానన్దమయో ముఖ్య ఏవాత్మేతి, న స్యాత్, ప్రియాద్యవయపయోగాచ్ఛారీరత్వశ్రవణాచ్చ. ముఖ్యశ్చేదాత్మానన్దమయః స్యాన్న ప్రియాదిసంస్పర్శః స్యాత్. ఇహ తు "తస్య ప్రియమేవ శిరః" ఇత్యాది శ్రూయతే, శారీరత్వం చ శ్రూయతే - "తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య" ఇతి. తస్య పూర్వస్య విజ్ఞానమయస్య ఏష ఏవ శారీర ఆత్మా య ఏష ఆనన్దమయ ఇత్యర్థః న చ సశరీరస్య సతః ప్రియాప్రియసంస్పర్శో వారయితుం శక్యః. తస్మాత్సంసార్యేవానన్దమయ ఆత్మా, ఇత్యేవం ప్రాప్తే ఇదముచ్యతే - "ఆనన్దమయోఽభ్యాసాత్."

### బాలానందిని

ఆనన్దేతి :- "ఆనన్దమయః- ఆనందమయము పరమాత్మయే. అభ్యాసాత్ పర మాత్మ అనే అర్థంలోనే ఇది మాటి మాటికి ప్రయోగించబడినది కాబట్టి" అని సూత్రార్థం.

తైత్తిరీయకే ఇతి :- తైతిరీయోపనిషత్తులో అన్నమయ- ప్రాణమయ- మనోమయ-విజ్ఞానమయాలను ఉపక్రమించి (వాటిని గూర్చి చెప్పి) "తస్మాద్... ఆనన్దమయః" (అట్టి ఈ విజ్ఞానమయంకంటె కూడ లోపలిదైన ఆనందమయం అనేది మరొకటి ఉన్నది అని చెప్పబడుచున్నది. ఇక్కడ 'ఆనన్దమయ' శబ్దం చేత "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని ప్రకృతమైన (ప్రారంభంలో నిర్దేశించబడిన) పరబ్రహ్మయే చెప్పబడుచున్నదా లేదా అన్నమయాదికం వలె బ్రహ్మకంటె భిన్నమైన మరొక వస్తువేదైన చెప్పబడుతున్నదా అని సంశయం. అయితే ఏం చెప్పాలి? 'అనన్దమయః' అనగా బ్రహ్మకంటె భిన్నమైన అముఖ్యమైన ఆత్మయే అని చెప్పాలి. ఎందువల్ల? అన్నమయం మొదలైన అముఖ్యాత్మల ప్రవాహంలోనే ఈ ఆనందమయం కూడ పడినది కాబట్టి.

వి. గౌణము ముఖ్యమూ అయిన ఈక్షణాలకు పోలిక లేదు గాన సంశయమే కలగదు. అందుచేత గౌణప్రాయపాఠాన్నిపట్టి (గౌణములైన వాటి మధ్య పఠించడాన్ని పట్టి) నదీక్షణం కూడ గౌణమే అని నిర్ణయించడం కుదరదు అని చెప్పబడింది. అయితే 'మయట్' ప్రత్యయానికి వికారం, ప్రాచుర్యం అనే రెండర్థాలు కూడ ముఖ్య

మైనవే గాన వికార్యప్రాయాల మధ్య పఠించడంవల్ల ఆనందమయుడు జీవుడే అని నిశ్చయించవచ్చును అని పూర్వపక్షి అభిప్రాయం. ఈ విధంగా వెనుకటి అధికరణంతో ఈ అధికరణానికి ప్రత్యుదాహరణ సంగతి. ప్రత్యుదాహరణం అనగా ఇచ్చిన దానికి భిన్నమైన స్వభావంగల ఉదాహరణం. అక్కడ ప్రాయపాఠం నిశ్చాయకం కాదంటే ఇక్కడ ప్రాయపాఠం నిశ్చాయకం అని చెప్పబడుచున్నది.

అథాపీతి :- (ఆశంక) అన్నింటికంటె లోపలి దవడంచేత ఆనందమయం ముఖ్యమైన ఆత్మయే అవవచ్చునేమో? (సమాధానం) అవడానికి వీలు లేదు. ఎందువల్ల ననగా ప్రియాద్యవయవాలతో సంబంధం ఉంది; ఆనందమయుడు జీవుడు అని కూడా వినబడుతున్నది. ఆనందమయం ముఖ్యాత్మయే అయితే దానికి ప్రియాదులతో సంబంధం ఉండడానికి వీలులేదు. ఇక్కడైతే "తస్యప్రియమేవ శిరః" (ఆ ఆనందమయానికి ప్రియమే శిరస్సు) ఇత్యాదికం వినబడుచున్నది. అట్లే "తస్యైష.. పూర్వస్య" అని ఆనందమయుడు జీవుడు అని కూడ వినబడుచున్నది. ఏ ఈ ఆనందమయు డున్నాడో అతడు వెనుకటి విజ్ఞానమయానికి శారీరుడు (అనగా జీవుడు) అని ఆ శ్రుతివాక్యానికి అర్థం. (శారీరు డైతే మాత్రం పరమాత్మ ఎందుకు కాకూడదు అనడానికి వీలులేదు) - సశరీరుడై యుండగా వానికి ప్రియాప్రియాలతో సంబంధం నివారింప శక్యం కాదు. అందుచేత ఆనందమయాత్మ సంసారియైన జీవుడే అని చెప్పవలసి ఉండగా "అనన్దమయోఽభ్యాసాత్" అని చెప్పబడుతున్నది.

## భాష్యమ్

పర ఏవాత్మానన్దమయో భవితుమర్హతి. కుతః? అభ్యాసాత్! పరస్మిన్నేవ హ్యాత్మన్యానన్దశబ్దః బహుకృత్వః అభ్యస్యతే. ఆనన్దమయం ప్రస్తుత్య- "రసో వై రసః" ఇతి తస్యైవ రసత్వముక్త్వాఉచ్యతే- "రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి" ఇతి. "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్, ఏషహ్యేవానన్దయాతి" (తై.ఉ.2.7), "సైషానన్దస్య మీమాంసా భవతి, ఏతమానన్దమయమాత్మానముపసంక్రామతి, ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన (తై.ఉ.2.8.9) ఇతి. "ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్" (తై.ఉ.3.6) ఇతి చ. శ్రుత్యన్తరే చ "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ.ఉ.3.9.28) ఇతి బ్రహ్మణ్యేవానన్దశబ్దో దృష్టః. ఏవమానన్దశబ్దస్య బహుకృత్వో బ్రహ్మణ్యభ్యాసాదానన్దమయ ఆత్మా బ్రహ్మేతి గమ్యతే.

## బాలానందిని

పర ఇతి :-"అన్నమయః" అనేది పరమాత్మయే అనడం యుక్తంగా ఉంటుంది. ఎందువల్ల? అభ్యాసంవల్ల ఆనందశబ్దం పరమాత్మ అనే అర్థంలోనే అనేక పర్యాయాలుఆవృత్తి చేయబడుతున్నది. ఆనందమయాన్ని ప్రస్తావించి "రసోవై సః" అని అదే 'రసం' అని చెప్పి "రసం... భవతి" (రసాన్నే పొంది ఆనందవంతుడవుతాడు కదా?) అని చెప్పబడింది. "కో... ఆనన్దయాతి" (ఆకాశమనే ఈ ఆనందం లేకపోతే ఎవడు కదలగలడు, ఎవడు జీవించగలడు, ఇదే ఆనందింప చేస్తూన్నది) అని, "సైషా... కుతశ్చన" (ఆనందాన్ని గూర్చిన ఈ చర్చ జరుగుతున్నది; ఈ ఆనందమయాత్మను దాటుచున్నాడు అనగా పొందుచున్నాడు. బ్రహ్మయొక్క ఆనంద స్వరూపాన్ని తెలిసికొన్నవాడు దేని నుంచీ భయపడడు) అని, "ఆనన్దం బ్రహ్మేతి వ్యజానాత్" (ఆనందమే బ్రహ్మ అని తెలుసుకొనెను) అని కూడా చెప్పబడింది. "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బ్రహ్మ విజ్ఞానస్వరూపం, ఆనందస్వరూపం) అని మరొక శ్రుతిలో కూడా ఆనందశబ్దం బ్రహ్మ అనే అర్థంలో చూడబడినది. ఈ విధంగా ఆనందశబ్దాన్ని బ్రహ్మ విషయంలో అనేక పర్యాయాలు ఆవృత్తి చేయడంవల్ల ఆనందమయాత్మ బ్రహ్మయే అని తెలుస్తూన్నది.

## భాష్యమ్

యత్త్వోక్తమ్ - అన్నమయాద్యముఖ్యాత్మప్రవాహపతితత్వా దానన్దయమస్యాప్యముఖ్యమాత్మత్వమితి - నాసౌ దోషః, ఆనన్దమయస్య సర్వాన్తరత్వాత్. ముఖ్యమేవ హ్యాత్మానముపదిదిక్షు శాస్త్రం లోకబుద్ధి మనుసరత్ అన్నమయం శరీరమాత్మానమత్యన్తమూఢానామాత్మత్వేన ప్రసిద్ధమనూద్య మూషానిషిక్తద్రుతతామ్రాదిప్రతిమావత్తతోఽన్తరం, తతో ఽన్తరమిత్యేవం పూర్వేణ పూర్వేణ సమానముత్తరముత్తర మనాత్మానమాత్మేతి గ్రాహయత్ ప్రతిపత్తి సౌకర్యాపేక్షయా సర్వాన్తరం ముఖ్యమానన్దమ యమాత్మానము పదిదేశేతి శ్లిష్టతరమ్. యథారున్ధతీనిదర్శనే బహ్వీష్వపి తారాస్వముఖ్యాస్వరున్ధతీషు దర్శితాసు యాఽన్త్యా ప్రదర్శ్యతే సా ముఖ్యైవారున్ధతీ భవతి ఏవమిహాప్యానన్దమయస్య సర్వాన్తరత్వా న్ముఖ్యమాత్మత్వమ్. యత్తుబ్రూషే - ప్రియాదీనాం శిరస్త్వాదికల్పనానుపపన్నా ముఖ్య స్యాత్మన ఇతి, అతీతానన్తరోపాధిజనితా సా న స్వాభావికీత్యదోషః.

శారీరత్వమప్యానన్దమయస్యాన్నమయాది శరీరపరమ్పరయా ప్రదర్శ్య మానత్వాత్; న పునః సాక్షాదేవ శారీరత్వం సంసారివత్. తస్మాదానన్దమయః పర ఏ వాత్మా. 12

## బాలానందిని

యదితి:- అన్నమయాదులైన అముఖ్యాత్మల ప్రవాహంలో పడడంచేత ఆనందమయం కూడ అముఖ్యాత్మయే అని ఏది చెప్పబడిందో ఈ దోషం లేదు. ఎందువల్లననగా ఆనందమయం అన్నింటికంటె లోపల ఉన్నది. ముఖ్యమైన ఆత్మను గూర్చి ఉపదేశించదలచిన శాస్త్రం లోకబుద్ధిని అనుసరించి (ముందుగా) అత్యంతమూఢ బుద్ధులు ఆత్మ అని తలచే ప్రసిద్ధమైన, ఆత్మకాని, అన్నమయమైన శరీరాన్ని ఆత్మనుగా అనువదించి చెప్పి మూసలో పోసి కరిగించి తయారు చేసిన రాగి ప్రతిమను చూపినట్లు, దాని లోపల, దాని లోపల అని అంటూ వెనుక వెనుక చెప్పినదానితో సమానమైన తరువాతి తరువాతి అనాత్మను, సరిగా అర్థం అవడం కోసం, ఆత్మ అని గ్రహింపచేసి, అన్నింటి కంటె లోపల ఉన్న ఆనందమయాన్ని ఆత్మగా ఉపదేశించినది అని చెప్పడం ఎక్కువ యుక్తంగా ఉంటుంది. నిజమైన అరుంధతిని చూపవలసి ఉన్నప్పుడు అముఖ్యారుంధతు లైన అనేక నక్షత్రాలను చూపిన తరవాత చివరికి ఏది చూపబడుతుందో అదే ముఖ్యారుంధతి అయినట్లు ఇక్కడ కూడ అన్నింటికంటె లోపలి దవడంచేత ఆనందమయం ముఖ్యాత్మ.

ముఖ్యాత్మకు ప్రియాదులను శిరఆదులనుగా కల్పించడం యుక్తం కాదు అని ఏ అనుపపత్తి చెప్పావో అది వెనుక చెప్పిన అనమయాద్యుపాధులను పట్టి చెప్పినదే గాని ఆనందమయానికి స్వాభావికం కాదు గాన దోషం లేదు. అనగా ముందుగా చెప్పిన అన్నమయాద్యనాత్మలకు శిరఆదులను చెప్పడంచేత దీనికి కూడ వాటిని చెప్పడం జరిగింది గాని దీనికి వాస్తవంలో అని ఉన్నాయనే ఉద్దేశ్యంతో కాదు అని అర్థం. అదే విధంగా ఆనందమయానికి చెప్పిన శారీత్వం కూడ దీనిని అన్నమయాది శరీరపరంపరలో చేర్చి చెప్పడంవల్ల కల్పించినదే. అంతేనే కాని దీనికి సంసారికి వలె, సాక్షాత్తు శారీరత్వంలేదు. అందుచేత శారీరుడు పరమాత్మయే.12.

## సూ.వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్.1.1.13.

## భాష్యమ్

అత్రాహ — నానన్దమయః పర ఆత్మా భవితుమర్హతి. కస్మాత్?

వికారశబ్దాత్. ప్రకృతివచనాదయమన్యః శబ్దో వికారవచనః సమధిగతః, అనన్దమయ ఇతి మయటో వికారార్థత్వాత్. తస్మాదన్నమయాదిశబ్దవద్వికార విషయ ఏవానన్దమయ ఇతి చేత్, న. ప్రాచుర్యేఽపి మయటః స్మరణాత్. "తత్రకృతవచనే మయట్" (పా.సూ.5.4.21) ఇతి హి ప్రచురతాయామపి మయట్ స్మర్యతే, యథా "అన్నమయో యజ్ఞః" ఇత్యన్నప్రచుర ఉచ్యతే, ఏవమానన్దప్రచురం బ్రహ్మానన్దమయముచ్యతే. ఆనన్దప్రచురత్వం చ బ్రహ్మణో మనుష్యత్వాదారభ్యోత్తరస్మిన్నుత్తరస్మిన్ స్థానే శతగుణ ఆనన్దఇత్యుక్త్వా బ్రహ్మానన్దస్య నిరతిశయత్వావధారణాత్. తస్మాత్ప్రాచుర్యార్థే మయట్.13.

## బాలానందిని

అత్రేతి :- (పూర్వపక్షి) ఈ సందర్భంలో ఇలా అంటున్నాడు - ఆనందమయం పరమాత్మ కాజాలదు. ఎందువల్ల? వికారశబ్దం ఉండడంవల్ల. ప్రకృతిని బోధించే శబ్దం కంటె వేరుగా మరొక, ఈ, వికారవాచకమైన శబ్దం కనబడుతున్నది; ఎందువల్ల ననగా 'అనన్దమయం' అనే పదంలోని 'మయట్'కు వికారమైనది అని అర్థం. అందువల్ల అన్నమయాదిశబ్దాల వలెనే ఆనందమయశబ్దం కూడ వికారం అనే అర్థాన్నే బోధిస్తుంది అన్నట్లయితే - ఇది యుక్తం కాదు.

వి. 'కనకమయమ్' ఇత్యాది పదాలు 'మయట్' అనే ప్రత్యయం చేర్చడంచేత సిద్ధిస్తాయి. 'బంగారు వికారమైనది' అని అర్థం. బంగారం ప్రకృతి, దానితో చేసిన కుండలాదికం వికృతి. ప్రకృతిని బోధించే 'కనక' శబ్దానికి 'మయట్' అనే వికారార్థక ప్రత్యయం చేర్చబడింది. అట్లే ఇక్కడ ప్రకృతిని బోధించే 'ఆనన్ద' శబ్దానికి 'మయట్' చేర్చగా ఏర్పడిన 'ఆనన్దమయ' శబ్దానికి ఆనందవికారమైన అని అర్థం. బ్రహ్మ ఆనందరూపమే గాని ఆనందవికారం (ఆనందంతో తయారు చేసినది) కాదు కదా. అందుచేత ఇక్కడ 'ఆనన్దమయ' శబ్దానికి బ్రహ్మ అనే అర్థం చెప్పడం కుదరదు అని పూర్వపక్షి అభిప్రాయం. (ఇక్కడ వికారార్థంలో మయట్ ఏ విధంగా వస్తుంది అనే విషయంలో విస్తృత చర్చ బ్రహ్మవిద్యాభరణంలో ఉంది. వ్యాకరణజ్ఞానం ఉన్న వాళ్లు అక్కడ చూచుకొనవలెను)

ప్రాచుర్యేతి :- (సమాధానం) మయట్ (వికారార్థంలోనే కాక) ప్రాచుర్యార్థంలో కూడ చేర్చబడుతుందని శాస్త్రంలో చెప్పబడింది. "తత్ప్రకృతవచనే మయట్"

(ప్రాచుర్యంతో కూడిన ప్రకృతమైన వస్తువును చెప్పడానికి మయట్ ప్రత్యయం చేర్చబడుతుంది) అనే సూత్రంచేత ప్రాచుర్యార్థంలో కూడ మయట్ చెప్పబడింది. (ఈ ప్రాచుర్యార్థమయట్‌ను గూర్చి కూడ పరిమలంలోను బ్రహ్మ విద్యాభరణంలోను కొంత విమర్శ చేయబడింది), "అన్నమయః యజ్ఞః" (అన్నం, అనగా అన్నదానం, అధికంగా ఉన్న యజ్ఞం) అన్నప్పుడు 'అన్నప్రచురమైన' అనే అర్థం ఎలా చెప్పబడుచున్నదో అట్లే 'ఆనన్దమయః' అనుదానికి ఆనందం ఎక్కువగాగల అని అర్థం చెప్పుకొనవచ్చును. మనుష్యత్వం మొదలు ఉత్తరోత్తరస్థానాలలో (గంధర్వదేవాదులలో) ఆనందం వందేసి రెట్ల చొప్పున అధికంగా ఉంటుందని చెప్పి బ్రహ్మానందాన్ని మించిన ఆనందం లేదు అని తైత్తిరీయోపనిషత్తులోనే చెప్పబడినది గాన బ్రహ్మ ఆనందప్రచురమని చెప్పవచ్చును. అందుచేత ఇక్కడ 'మయట్' ప్రత్యయం ప్రాచుర్యార్థంలోనే చేర్చబడింది.13.

## సూ. తద్ధేతువ్యపదేశాచ్చ, 1.1.14

## భాష్యమ్

ఇతశ్చ ప్రాచుర్యార్థే మయట్, యస్మాదానన్దహేతుత్వం బ్రహ్మణో వ్యపదిశతి శ్రుతిః- "ఏషహ్యేవానన్దయాతి" ఇతి. ఆనన్దయతీత్యర్థః. యోఽహ్యన్యానానన్దయతి స ప్రచురానన్ద ఇతి ప్రసిద్ధం భవతి. యథా లోకే యోఽన్యేషాం ధనికత్వమాపాదయతి స ప్రచురధన ఇతి గమ్యతే, తద్వత్. తస్మాత్ప్రాచుర్యార్థేఽపి మయటః సంభవాత్ ఆనన్దమయః పర ఏవాత్మా.14.

## బాలానందిని

తద్ధేత్వితి :- "తద్ధేతువ్యపదేశాచ్చ = బ్రహ్మ ఆనందానికి హేతువు అని చెప్పడం వల్ల కూడ మయట్ ప్రాచుర్యం అనే అర్థంలో గ్రహించాలి" సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల ఈ కారణంవల్ల కూడ మయట్ ప్రాచుర్యార్థంలో గ్రహించాలి. ఎందువల్ల అనగా "ఏష హ్యేవానన్దయాతి" (ఆత్మయే ఆనందింపచేయుచున్నది) అను శ్రుతి బ్రహ్మ ఆనందానికి హేతువని చెప్పుచున్నది. ఆనన్దయాతి అన. ఆనందింపచేయుచున్నది అని అర్థం. ఏది ఇతరులను కూడ ఆనందింపచేస్తుందో అది అధికమైన ఆనందం కలది అని ప్రసిద్ధం కదా? లోకంలో ఎవడు ఇతరులకు ధనికత్వాన్ని సంపాదిస్తాడో అతడు అత్యధికమైన ధనం కలవాడు అని ఎట్లు తెలియబడుతుందో అట్లే. అందువల్ల మయట్ ప్రత్యయం ప్రాచుర్యార్థంలో కూడ కుదురుతుంది గాన 'ఆనందమయం' పరమాత్మయే.14.

## సూ.మాన్త్రవర్ణికమేవ చ గీయతే. 1.1.15

ఇతశ్చానన్దమయ :- పర ఏవాత్మా, యస్మాత్ "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యుపక్రమ్య "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.ఉ.2.1) ఇత్యస్మిన్మన్త్రే యత్ప్రకృతం బ్రహ్మ సత్యజ్ఞానానన్తవిశేషణైః నిర్ధారితం, యస్మాదాకాశాది క్రమేణ స్థావరజఙ్గమాని భూతాన్యజాయన్త, యచ్చ భూతాని సృష్ట్వా తాన్యను ప్రవిశ్య గుహాయామవస్థితం సర్వాన్తరం, యస్య విజ్ఞానాయ "అన్యోఽన్తర ఆత్మా అన్యోఽన్తర ఆత్మా" ఇతి ప్రక్రాన్తం తన్మాన్త్రవర్ణికమేవ బ్రహ్మేహ గీయతే "అన్యోఽన్తర ఆత్మానన్దమయః" ఇతి. మన్త్రబ్రాహ్మణయోశ్చైకార్థత్వం యుక్తమ్, అవిరోధాత్. అన్యథా హి ప్రకృతహానాప్రకృత ప్రక్రియే ప్రసజ్యేయాతామ్. నచాన్నమయాదిభ్య ఇవానన్దమయాదన్యోఽన్తర ఆత్మాఽభిధీయతే. ఏతన్నిష్ఠైవ చ "సైషా భార్గవీ వారుణీ విద్యా" (తై.ఉ.3.6). తస్మాదానన్దమయః పర ఏవాత్మా" 15.

### బాలానందిని

మాన్త్రవర్ణికమితి :- "మాన్త్రవర్ణికమేవచ = మంత్రవర్ణంలో (మంత్రంలో) చెప్పబడిన బ్రహ్మయే" "ఆనన్దమయః" అనే వాక్యంలో చెప్పబడుచున్నది. అందువల్ల ప్రకరణాన్ని పట్టి కూడ ఆనందమయం బ్రహ్మయే" అని సూత్రార్థం.

ఇత ఇతి :- ఈ కారణంవల్ల కూడ ఆనందమయం పరమాత్మయే. ఎందువల్ల ననగా "బ్రహ్మవిద్యాప్నోతి పరమ్" (బ్రహ్మను తెలిసికొన్నవాడు ఉత్తమ స్థానాన్ని (ముక్తిని) పొందుతాడు) అని ఉపక్రమించి, "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని సత్యం, జ్ఞానమ్, అనన్తమ్ అనే విశేషణాలను బట్టి బ్రహ్మ అని నిర్ధారణ చేయబడిన, ప్రకృతమైన ఏ బ్రహ్మగలదో, దేనినునుండి ఆకాశాదిక్రమంలో స్థావరజంగమభూతాలు పుట్టాయో, ఏది భూతాలను సృష్టించి వాటిలో ప్రవేశించి గుహలో అన్నింటికంటె లోపలగా ఉన్నదో, దేనిని తెలిసికొనడం కోసం "అన్యోన్తర.. ఆత్మా" (దానిలోపల ఉన్న మరొకటి ఆత్మ, దాని లోపల ఉన్న మరొకటి ఆత్మ) అని ఉపక్రమించబడిందో అట్టి మంత్రవర్ణంలో (మంత్రంలో) చెప్పబడిన బ్రహ్మయే ఇక్కడ - "అన్యోఽన్తర ఆత్మానన్దమయః" అని చెప్పబడుచున్నది. మంత్రబ్రాహ్మణాలకు విరోధం లేదు గాన ఆ రెండింటికీ ఒకే అర్థం చెప్పడం యుక్తం. అట్లు కాకపోతే ప్రకృతహానాప్రకృతప్రక్రియలు (ప్రకృతమైన దానిని విడచివేయడం అప్రకృతాన్ని గ్రహించడం అనేవి) వచ్చి పడతాయి.

అన్నమయాదులకంటె అంతరమైన (లోపలిదైన) మరొక ఆత్మను చెప్పినట్లు ఆనందమయంకంటె అంతరమైన మరొక ఆత్మను చెప్పలేదు కదా? "సైషా వారుణీ భార్గవీ విద్యా" (వరుణుడు భృగుపుకు ఉపదేశించిన విద్య ఇదే) అను వాక్యం ప్రకారం ఈ విద్య ఈ ఆనందమయంతోనే సమాప్తి చెందినది. అందువల్ల ఆనందమయం పరమాత్మయే.

## సూ. నేతరోఽనుపపత్తేః 1.1.16

ఇతశ్చానన్దమయః పర ఏవాత్మా నేతరః. ఇతరః ఈశ్వరాదన్యః సంసారీ జీవ ఇత్యర్థః న జీవ ఆనన్దమయశబ్దేనాభిధీయతే. కస్మాత్? అనుపపత్తేః. ఆనన్దమయం హి ప్రకృత్య శ్రూయతే - "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి. స తపోఽతప్యత, స తపస్తప్త్వా ఇదం సర్వమసృజత, యదిదం కిఞ్చ" (తై.ఉ.2.6) ఇతి. తత్ర ప్రాక్ శరీరాద్యుత్పత్తేః అభిధ్యానం, సృజ్యమానానాం చ వికారాణాం స్రష్టురవ్యతిరేకః, సర్వవికారసృష్టిశ్చ న పరస్మాదాత్మనోఽన్యత్రోపపద్యతే.

### బాలానందిని

నేతి :- "అనుపపత్తేః కుదరదు గాన, ఇతరః= జీవుడు, న = ఆనందమయుడు కాదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ ఆనందమయుడు పరమాత్మయే గాని ఇతరుడు కాడు. ఇతరః అనగా పరమాత్మకంటె ఇతరుడైన సంసారియైన జీవుడు అని అర్థం. ఆనందమయ శబ్దంచేత జీవుడు చెప్పబడడు. ఎందువల్ల? కుదరదు కాబట్టి. ఆనందమయాన్ని నిర్దేశిస్తూ - "సోఽకామయత.. కించ" (అది అనేక రూపాలలో ఆవిర్భవిస్తాను అని అనుకొన్నది. అది తపస్సు చేసింది (ఆలోచించింది). అది తపస్సు చేసి ఏదైతే కనబడుతున్నదో దాని నంతనీ సృజించింది) అని శ్రుతి చెప్పుచున్నది. శరీరాదులు పుట్టక మునుపు ఆలోచించడం, సృజించబడే వికారాలు (కార్యాలు) స్రష్టకంటె భిన్నం కాకపోవడం, సమస్త వికారాల సృష్టి-ఇవన్నీ పరమాత్మ విషయంలోనే కుదురుతాయి కాని ఇతర జీవుల విషయంలో కుదరవు.16.

## సూ. భేదవ్యపదేశాచ్చ. 1.1.17

ఇతశ్చ నానన్దమయః సంసారీ, యస్మాదానన్దమయాధికారే- "రసో

వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి" (తై.2.7) ఇతి జీవానన్దమయౌ భేదేన వ్యపదిశతి. న హి లబ్ధైవ లబ్ధవ్యో భవతి. కథం తర్హి "ఆత్మాన్వేష్టవ్యః" "ఆత్మలాభాన్న పరం విద్యతే" ఇతి శ్రుతిస్మృతీ, యావతా న లబ్ధైవ లబ్ధవ్యో భవతీత్యుక్తమ్? బాఢమ్. తథాప్యాత్మనోఽప్రచ్యుతాత్మభావస్యైవ సతస్తత్త్వానవబోధనిమిత్తో మిథ్యైవ దేహాదిష్వనాత్మస్వాత్మత్వనిశ్చయో లౌకికో దృష్టః, తేన దేహాదిభూతస్యాత్మనోఽప్యాత్మానన్విష్టోఽన్వేష్టవ్యోఽలబ్ధో లబ్ధవ్యః అశ్రుతః శ్రోతవ్యః అమతో మన్తవ్యః అవిజ్ఞాతో విజ్ఞాతవ్యః ఇత్యాదిభేదవ్యపదేశ ఉపపద్యతే. ప్రతిషిధ్యత ఏవ తు పరమార్థతః సర్వజ్ఞాత్పరమేశ్వరాదన్యో ద్రష్టా శ్రోతా వా "నాన్యోఽతోస్తి ద్రష్టా" (బృ.ఉ.3.7.23) ఇత్యాదినా. పరమేశ్వరస్త్వవిద్యాకల్పితాచ్ఛారీరాత్కర్తుర్భోక్తుర్విజ్ఞానాత్మాఖ్యాదన్యః, యథా మాయావినశ్చర్మఖడ్గధరాత్సూత్రేణాకాశమధిరోహతః స ఏవ మాయావీ పరమార్థరూపో భూమిష్ఠోఽన్యః, యథా వా ఘటాకాశాదుపాధిపరిచ్ఛిన్నాదనుపాధిపరిచ్ఛిన్న ఆకాశోఽన్యః, ఈదృశం చ విజ్ఞానాత్మపరమాత్మ భేదమాశ్రిత్య "నేతరోఽనుపపత్తేః" "భేదవ్యపదేశాచ్చ" ఇత్యుక్తమ్.17.

బాలానందిని

భేదేతి :- "భేదవ్యపదేశాత్ చ = జీవానందమయులను వేరు వేరుగా నిర్దేశించడంవల్ల కూడ ఆనందమయుడు జీవుడు కాడు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఆనందమయాన్ని గూర్చిన ఘట్టంలో "రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి" అని (శ్రుతి) జీవ-ఆనందమయులకు భేదం ఉన్నట్లు చెప్పుచున్నది. ఆ కారణంచేత కూడ ఆనందమయుడు జీవుడు కాడు. పొందేవాడే పొందదగినదిగా కాడు కదా?

వి. ఈ జీవాత్మ రసరూపమైన పరమాత్మను పొంది ఆనందం కలవా డవుతాడు అని చెప్పినప్పుడు జీవుడు పొందేవాడనీ ఆనందం పొందబడే దనీ తెలుస్తూన్నది. దీనిని బట్టి పొందే జీవుడు పొందబడే ఆనందమయునికంటె భిన్నుడు కదా అని భావం.

అవ. జీవుడు వేరు ఆనందమయమని చెప్పే పరబ్రహ్మ వేరు అని చెపితే మీ అద్వైతసిద్ధాంతానికి భంగం కలుగుతుంది కదా అని ఆశంకించుకొని సమాధానం

చెపుతున్నాడు- కథమితి:- లబ్ధయే లబ్ధవ్యం కాజాలదు కదా అని అంటున్నావు. అట్లైతే 'ఆత్మ అన్వేషించదగినది', 'ఆత్మ లాభాన్ని మించిన లాభం లేదు' అని చెప్పే శ్రుతి స్మృతులు ఎట్లు కుదురుతాయి? (తనను తానే అన్వేషించుకోవాలి అన్నప్పుడు అన్వేషించేవాడు అన్వేషించబడేది ఒకటే అన్నట్లు కనబడుతున్నది కదా అని పృచ్ఛకుని అభిప్రాయం). సమాధానం - నిజమే - కాని, ఆత్మ, తన వాస్తవమైన ఆత్మత్వాన్ని కోల్పకుండగానే ఉన్నా కూడ, తత్త్వాన్ని (యథార్థస్థితిని) తెలిసికొనకపోవడంచేత అనాత్మలైన దేహాదులయందు అసత్యమైన ఆత్మత్వనిశ్చయంతో ఉండడం లోకంలో కనబడుతున్నది. అనగా ఆత్మదేహాదులే తన స్వరూపం అనే నిశ్చయంతో లోకంలో వ్యవహరిస్తున్నది. అందుచేత దేహాద్యభేదబుద్ధితో ఉన్న జీవాత్మచేత అన్వేషించబడని ఆత్మ అన్వేషింపబడాలనీ, పొందబడనిది పొందబడాలనీ, వినబడనిది వినబడాలనీ, మననం చేయబడనిది మననం చేయబడాలనీ, తెలియబడనిది తెలియబడాలనీ - ఇత్యాదిరీతులలో భేదవ్యపదేశం ఉపపన్నం అవుతుంది. (ఈ భేదవ్యపదేశం అంతా భ్రాంతి చేతనే కుదురుతుంది అని అర్థం). వాస్తవంలో అయితే సర్వజ్ఞుడైన పరమేశ్వరుని కంటె భిన్నుడైన ద్రష్టగాని శ్రోతగాని 'నాన్యోఽతోస్తి ద్రష్టా'' (బృ.ఉ.3.7.13) ఇత్యాది శ్రుతిచేత నిరాకరించబడుచున్నాడు. అవిద్యచేత కల్పించబడిన, కర్త, భోక్త అయిన విజ్ఞానాత్మ అనే పేరుగల జీవునికంటె పరమేశ్వరుడు వేరైనవాడు. కత్తి, డాలు ధరించి ఒక త్రాడు సహాయంతో ఆకాశంలోనికి ఎక్కి వెడుతున్న ఇంద్రజాలికునికంటె, భూమి మీదనే ఉన్న పరమార్థస్వరూపుడైన ఆ మాయావియే ఎట్లు వేరైనవాడో, ఘటం అనే ఉపాధిచేత పరిచ్ఛిన్నమైన ఘటాకాశంకంటె ఉపాధిపరిచ్ఛిన్నం కాని ఆకాశం ఎట్లు భిన్నమైనదో అట్లే ఆ శారీరకునికంటె పరమేశ్వరుడు భిన్నుడు.

వి. పరమేశ్వరుడు జీవునికంటె భిన్నుడు. అయితే ఈ భేదం మాయాకల్పితం; ఉపాధికల్పితం. పూర్వం ఇంద్రజాలికులుచూపించే ఒక విధమైన ఇంద్రజాలం శ్రీ శంకరాచార్యుల కాలంలో చాలా ప్రచారంలో ఉన్నట్లు కనబడుతుంది. దీనిని అనేక ప్రదేశాలలో ఉదాహరించారు. ఒకడు పైకి త్రాడు ఒకటి విసిరి దానిమీదుగా కత్తి డాలు పట్టుకొని ఆకాశంలోకి చాలా ఎత్తుగా వెళ్లి పోయినట్లు అక్కడ ఎవళ్లతోనో యుద్ధం చేయగా వాని శరీరం ఖండఖండాలై క్రింద పడినట్లు అక్కడ గుమిగూడిన వాళ్ళకి కనబడేది. కాని అసలు ఆ మాయావి ఎక్కడికీ వెళ్లడు; నేల మీదనే ఉంటాడు, త్రాడెక్కి పైకి వెళ్లినట్లు కనబడిన మాయావికంటె నేలమీదనే ఉన్న మాయావి ఎట్లు భిన్నుడో ఇక్కడ కూడ అట్లే. ఆకాశం సర్వవ్యాప్తి. ఒక కుండలో ఆకాశం ఉంటుంది. అనగా కుండ తనలో కొంత ఆకాశాన్ని ఇమడ్చుకొన్నది. అలా ఇమడ్చుకొన్న ఆకాశానికి అవచ్ఛిన్నాకాశం లేదా పరిచ్ఛిన్నాకాశం అని పేరు. అలా ఆకాశాన్ని ఇమడ్చుకొన్న

కుండకు ఉపాధి అని పేరు. వాస్తవంలో ఘటంలో ఉన్న ఆకాశానికి బైటనున్న మహాకాశానికీ భేదం లేదు కాని భేదం ఉపాధి కల్పితమైనది. అట్లే జీవునికి పరమాత్మతతో ఉన్న భేదం దేహాద్యుపాధికల్పితం.

ఈదృశమితి :- విజ్ఞానాత్మపరమాత్మల మధ్య నున్న ఈ విధమైన (కాల్పనికమైన) భేదాన్ని పురస్కరించుకొని 'నేతరోఽనుపపత్తేః'' ''భేదవ్యపదేశాచ్చ'' అని చెప్పబడింది.17.

## సూ.కామాచ్చ నానుమానాపేక్షా. 1.1.18

ఆనన్దమయాధికారే చ ''సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ'' ఇతి కామయితృత్వనిర్దేశాత్ నానుమానికమపి సాంఖ్యపరికల్పితమచేతనం ప్రధానమానన్దమయత్వేన కారణత్వేన వాపేక్షితవ్యమ్. ''ఈక్షతేర్నాశబ్దమ్'' (బ్ర.సూ.1.2.5) ఇతి నిరాకృతమపి ప్రధానం పూర్వసూత్రోదాహృతాం కామయితృత్వశ్రుతిమాశ్రిత్య ప్రసంగాత్పునర్నిరాక్రియతే, గతి సామాన్య ప్రపఞ్చనాయ.18.

### బాలానందిని

కామాదితి :- ''కామాచ్చ="సోఽకామయత" అని 'కామ' శబ్దాన్ని ప్రయోగించడం వల్ల కూడ, అనుమానాపేక్షా=కారణంగా ప్రధానం యొక్క అపేక్ష, న= లేదు'' అని సూత్రార్థం.

ఆనన్దేతి :- ఆనందమయాన్ని గూర్చి చెప్పే ఘట్టంలో ''సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ'' అని కోరికను చేసినట్లు (కోరినట్లు) చెప్పడంవల్ల సాంఖ్యులు అనుమాన ప్రమాణంచేత కల్పించిన అచేతనమైన ప్రధానం ఆనందమయం అని కాని, కారణం అని కాని, ఇక్కడ చెప్పగూడదు. 'ఈక్షతేర్నాశబ్దమ్' అనే సూత్రంచేత ప్రధానం నిరాకరింపబడినా కూడ, పూర్వసూత్రంలో ఉదాహరించిన కామయితృత్వశ్రుతిని (కోరినది అని చెప్పే శ్రుతిని) ఆశ్రయించి ప్రసంగవశం చేత ఇక్కడ మళ్లీ నిరాకరించబడుచున్నది. ఈ విధంగా మళ్లీ చెప్పడం ద్వారా వేదాంతాలలో గతి సామాన్యం ఎట్లున్నదో విశదీకరించడం ప్రయోజనం.

వి. ఒక అధికరణంలో ఒక విషయాన్ని నిర్ణయించడానికి కొన్ని నియమాలు పూర్వోత్తరపక్షాదినిరూపణ పూర్వకంగా ప్రతిపాదించబడతాయి అలా చెప్పిన పద్ధతులకు న్యాయం అని పేరు. ఆ అధికరణంలో చర్చించని ఇతర వాక్యాలలో కూడ అలాంటి పద్ధతులు అవలంబించడానికి అవకాశం ఉంటే అక్కడ చేసిన నిర్ణయమే ఇక్కడ

కూడ చెయ్యాలి. ఈ విధంగా ఒక అధికరణంలో చూపిన న్యాయం అనేక స్థలాలలో అర్థనిర్ణయానికి ఉపయోగిస్తుంది. ఈక్షత్యధికరణంలో చెప్పిన న్యాయం చేతనే ఇక్కడ కూడ ప్రధానాన్ని గ్రహించడానికి వీలు లేదు కదా? మళ్లీ ఈ సూత్రం ఎందుకు చెప్పడం అని ప్రశ్న. అనావశ్యకమే అయినా స్పష్టత్వార్థం చెప్పబడింది అని సమాధానంలోని సారం. 18.

## సూ. అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి. 1.1.19.

ఇతశ్చ న ప్రధానే జీవే వానన్దశబ్దః యస్మాదస్మిన్నానన్దమయే ప్రకృత ఆత్మని ప్రతిబుద్ధస్యాస్య జీవస్య తద్యోగం శాస్తిః తదాత్మనా యోగస్తద్యోగః, తద్భావాపత్తిః, ముక్తిరిత్యర్థః, తద్యోగం శాస్తి శాస్త్రమ్ - "యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽ నాత్మ్యేఽ నిరుక్తేఽనిలయనే భయం ప్రతిష్ఠాం విన్దతే, అథ సోఽభయం గతో భవతి, యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథ తస్య భయం భవతి" (తై.ఉ.2.7) ఇతి. ఏతదుక్తం భవతి - యదైతస్మిన్నానన్దమయేఽల్పమప్యన్తరమతాదాత్మ్యరూపం పశ్యతి తదా సంసారభయాన్న నివర్తతే. యదాత్వేవాస్మిన్నానన్దమయే నిరన్తరం తాదాత్మ్యేన ప్రతితిష్ఠతి తదా సంసారభయాన్నివర్తత ఇతి. తచ్చ పరమాత్మపరిగ్రహే ఘటతే న ప్రధానపరిగ్రహే జీవపరిగ్రహేవా. తస్మాదానన్దమయః పరమాత్మేతి స్థితమ్.

### బాలానందిని

అస్మిన్నితిః- "అస్మిన్=ఈ ఆనందమయమునందు, అస్య=జీవునకు, తద్యోగం=తాదాత్మ్యాన్ని, శాస్తి=శ్రుతి చెప్పుచున్నది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి- ఈ కారణం వల్ల కూడ 'ఆనందమయ' శబ్దం ప్రధానాన్ని గాని జీవుణ్ణి గాని బోధించదు, ఎందువల్ల ననగా, అస్మిన్=ఆనందమయమైన ప్రకృతమైన ఆత్మయందు, మేల్కొన్న జీవునికి, తద్యోగమ్=తత్స్వరూపంతో సంబంధాన్ని, అదిగా అవడాన్ని, ముక్తిని, "యదా హ్యేవైష... భవతి" (స్థూల శరీరం లేనిది, సూక్ష్మ శరీరం లేనిది, శబ్దం చేత చెప్ప శక్యం కానిది, మాయాశూన్యము అయిన ఈ బ్రహ్మ యందు ఎప్పుడు భయరహితుడుగా ప్రతిష్ఠను పొందుతాడో అప్పుడు అభయం పొందినవాడవుతాడు. ఎప్పుడైతే మానవుడు ఈ బ్రహ్మ విషయంలో ఏ కొంచెమైన భేదాన్ని చేస్తాడో అప్పుడతనికి భయం కలుగుతుంది) అనే శాస్త్రం శాసిస్తున్నది. ఇక్కడ చెప్పినది ఇది - ఈ ఆనందమయమునందు ఏ కొంచెమైన, తాదాత్మ్యానికి విరుద్ధమైన,

భేదాన్ని ఎప్పుడు చూస్తాడో అప్పుడు సంసారభయం నుంచి నివర్తింపజాలడు. కాని ఎప్పుడైతే ఈ ఆనందమయమునందు నిరంతరము తదాత్మ్యంతో ప్రతిష్ఠను పొందుతాడో (స్థిరబుద్ధితో ఉంటాడో) అప్పుడు సంసారభయంనుంచి దూరం అవుతాడు. ఇది పరమాత్మ అనే అర్థం గ్రహిస్తేనే కుదురుతుంది. ప్రధానాన్ని గ్రహించినా, జీవుణ్ణి గ్రహించినా కుదరదు. అందువల్ల ఆనందమయుడు పరమాత్మయే అని నిశ్చితం.

## భాష్యమ్

ఇదం త్విహ వ్యక్తవ్యమ్ - "స వా ఏష పురుషోఽ న్నరసమయః" "తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాత్, అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః" "తస్మాత్ అన్యోఽన్తర ఆత్మా మనోమయః" "తస్మాత్ అన్యోఽన్తర ఆత్మా విజ్ఞా మయః" (తై.ఉ.2.1,2,3,4) ఇతి చ వికారార్థే మయట్ప్రవాహే సత్యానన్దమయ ఏవాకస్మాదర్ధజరతీన్యాయేన కథమివ మయటః ప్రాచుర్యార్థత్వం బ్రహ్మవిషయత్వం చాశ్రీయత ఇతి. మాన్త్రవర్ణికబ్రహ్మాధికారాదితి చేత్, న. అన్నమయాదీనామపి తర్హి బ్రహ్మత్వప్రసఙ్గః.

## బాలానందిని

అవ. ఇంతవరకు వృత్తికారుల మతం ప్రకారం అధికరణరచన చేసి సూత్రాలకి అర్థం చెప్పబడింది. కాని ఆ అర్థం శ్రుతి వాక్యానుగుణంగా లేకపోవడంచేత దానిని ఖండించి మరొక అర్థం సిద్ధాంతంగా చెపుతున్నారు- ఇదం త్విహ వక్తవ్యమ్ ఇతి. ఇక్కడ ఈ విషయం చెప్పాలి. "స వా ఏష... విజ్ఞానమయః' "అట్టి ఈ పురుషుడు అన్నరసవికారమైనవాడు" "అన్నరసమయమైనదానికంటె లోపల మరి యొక ప్రాణవికారమైన ఆత్మ" "దానికికంటె లోపలిదైన మరొక ఆత్మ మనోమయం" "దానికంటె లోపల మరియొక ఆత్మ విజ్ఞానమయం) అని వికారార్థం బోధించే మయట్ప్రత్యయాలప్రవాహంలో అకస్మాత్తుగా, అర్ధజరతీన్యాయంచేత ఒక్క 'ఆనన్దమయ' అనే పదంలోనే మయట్ ప్రాచుర్యార్థం బోధిస్తుందనీ, ఇది బ్రహ్మను బోధిస్తుందనీ చెప్పడం ఎట్లు కుదురుతుంది? మంత్రవర్ణం నుండి వస్తూన్న బ్రహ్మాధికారంవల్ల, అనగా మంత్రం ప్రారంభంలో బ్రహ్మ చెప్పబడింది, దాని ప్రసంగంలో ఆనందమయశబ్దం ఉపయోగించబడినంది గాన ఆ ఆనన్దమయం బ్రహ్మ అని చెప్పాలి, అని అంటే అది యుక్తం కాదు. అలా చెప్పే పక్షంలో అన్నమయాదులు కూడ బ్రహ్మ అనే చెప్పవలసి వస్తుంది.

Line.15.వి. న్యాయం అనగా సామెత. అర్ధజరతీన్యాయానికి రెండు మూడు విధాల అర్థాలు చెప్పారు. (1) ఒక స్త్రీ వృద్ధ అనడానికీ వీలు లేదు, యువతి అనడానికీ వీలులేదు.

కారణం ఆమె అవయవాలు కొన్ని శిథిలం అయ్యాయి; అయితే జుట్టు మాత్రం నెరవలేదు (2) కోడి గ్రుడ్డులో సగం వండుకోవడానికి మిగిలిన సగం పిల్ల పెట్టడానికే ఉపయోగించ నట్లు అనే అర్థం కొందరు చెప్పారు. (3) కాముకుడు ఒక వృద్ధస్త్రీ యొక్క అర్ధశరీరాన్ని మాత్రమే కోరి రెండవ సగం అక్కర లేదన్నట్లు. మొత్తం మీద దీనిని ఒక వస్తువును గ్రహిస్తే పూర్తిగా గ్రహించాలి లేదా మానివేయాలి అనే భావంతో వాడతారు. అట్లే ఇక్కడ మయట్ ప్రత్యయానికి అన్నిచోట్లా ఒకే అర్థం గ్రహించాలి కాని ఒక చోట ఒక అర్థం మరొక చోట మరొక అర్థం చెప్పకూడదు అని భావం.

## భాష్యమ్

అత్రాహ-యుక్తమన్నమయాదీనామబ్రహ్మత్వమ్, తస్మాత్తస్మాదాన్తరస్యాన్తరస్యాన్యస్యాన్యస్య ఆత్మన ఉచ్యమానత్వాత్. ఆనన్దమయాత్తు న కశ్చిదన్యోఽన్తర ఆత్మోచ్యతే. తేనానన్దమయస్య బ్రహ్మత్వమ్. అన్యథా ప్రకృతహానాప్రకృతప్రక్రియాప్రసఙ్గాత్. ఇతి.

అత్రోచ్యతే - యద్యప్యన్నమయాదిభ్య ఇవానన్దమయాదన్యోఽన్తర ఆత్మేతి న శ్రూయతే తథాపి నానన్దమయస్య బ్రహ్మత్వం, యతః ఆనన్దమయం ప్రకృత్య శ్రూయతే- "తస్య ప్రియమేవ శిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః, ఆనన్ద ఆత్మా, బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" (తై.ఉ.2.5) ఇతి. తత్ర యద్బ్రహ్మ మన్త్రవర్ణే ప్రకృతమ్- "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇతి తదిహ "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యుచ్యతే. తద్విజిజ్ఞాపయిషయైవాన్నమయాదయ ఆనన్దమయపర్యన్తాః పఞ్చ కోశాః కల్ప్యన్తే. తత్ర కుతః ప్రకృతహానా ప్రకృతప్రక్రియాప్రసఙ్గః?

## బాలానందిని

అత్రేతి:- (ఆక్షేపం) ఇక్కడ అంటున్నాడు (ప్రశ్నిస్తున్నాడు) - దాని కంటె లోలోపల ఉన్న మరొక్కొక్కదానిని చెప్పడం వల్ల అన్నమయాదులు బ్రహ్మ కాకపోవడం యుక్తమే. ఆనందమయం తరవాతనైతే అంతరమైన మరొక ఆత్మ ఏదీ చెప్పబడలేదు. అందుచేత ఆనందమయమే బ్రహ్మ. అలా చెప్పకపోతే ప్రకృతహానాప్రకృత ప్రక్రియ పసక్తం అవుతుంది. (సమాధానం) ఈ విషయంలో చెప్పబడుచున్నది అన్నమయాదుల కంటె వలె ఆనందమయం కంటె అంతరమైన మరొక ఆత్మ అని వినబడకపోయినా ఆనందమయం బ్రహ్మ కాదు. ఎందువల్ల ననగా ఆనందమయాన్ని ప్రకృతంగా చేసికొని దానిని (గూర్చి చెపుతూ) ''తస్య... ప్రతిష్ఠా'' (తై.ఉ.2.5) (దానికి ప్రియమే శిరస్సు,

మోదం, దక్షిణ (కుడి) పక్షం, ప్రమోదం రెండవ పక్షం, ఆనందం ఆత్మ, బ్రహ్మ నిలకడకు కారణమైన పుచ్ఛం) అని వినబడుతున్నది. దానిని తెలుపడం కొరకే అన్నమయం మొదలు ఆనందమయం వరకు ఉన్న ఐదు కోశాలు కల్పించబడ్డాయి. గాన ప్రకృతహానాప్రకృత ప్రక్రియాప్రసంగం లేదు.

వి. ఇష్టవస్తువులు కనబడడం వల్ల కలిగిన సుఖం ప్రియం. వాటి స్మరణం వల్ల కలిగిన సుఖం ఆమోదం. మాటిమాటికి కలిగిన ఆమోదమే ప్రమోదం. కారణమైన బింబచైతన్యం ఆనందం. అది ఆత్మ, అనగా శిరఃపుచ్ఛాల మధ్య ఉన్న శరీరం. బ్రహ్మ అనగా శుద్ధబ్రహ్మ.

## భాష్యమ్

నన్వానన్దమయస్యావయవత్వేన "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యుచ్యతే, అన్నమయాదీనామివ 'ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా' ఇత్యాది. తత్ర కథం బ్రహ్మణః స్వప్రధానత్వం శక్యం విజ్ఞాతుమ్? ప్రకృతత్వాదితి బ్రూమః. నన్వానన్దమయావయవత్వేఽపి బ్రహ్మణి విజ్ఞాయమానే న ప్రకృతత్వం హీయతే, ఆనన్దమయస్య బ్రాహ్మత్వాదితి; అత్రోచ్యతే - తథా సతి తదేవ బ్రహ్మానన్దమయః ఆత్మావయవీ, తదేవ చ బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా అవయవ ఇత్యసామఞ్జస్యం స్యాత్. అన్యతరపరిగ్రహే తు యుక్తం "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యత్రైవ బ్రహ్మనిర్దేశ ఆశ్రయితుం, బ్రహ్మశబ్దసంయోగాత్, నానన్దమయవాక్యే, బ్రహ్మశబ్దసంయోగాభావాదితి, అపి చ- "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యుక్త్వేదముచ్యతే - "తదప్యేష శ్లోకో భవతి అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద, సన్తమేనం తతో విదురితి" (తై.ఉ.2.6) ఇతి. అస్మింశ్చ శ్లోకేఽననుకృష్యానన్దమయం బ్రహ్మణ ఏవ భావాభావవేదనయోర్గుణదోషాభిధానాద్గమ్యతే "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యత్ర బ్రహ్మణః స్వప్రాధాన్యమితి. న చానన్దమయస్యాత్మనో భావాభావ శఙ్కా యుక్తా, ప్రియమోదాదివిశేషస్యానన్దమయస్య సర్వలోకప్రసిద్ధత్వాత్.

## బాలానందిని

నన్వితి:- (ఆక్షేపం) అన్నమయాదులకు ఇదే (ఫలానాది) పుచ్ఛం, ప్రతిష్ఠ అని చెప్పినట్లే "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అని (బ్రహ్మ) ఆనందమయానికి అవయవంగా

చెప్పబడుతున్నది. అలాంటప్పుడు బ్రహ్మకు స్వప్రాధాన్యం ఎలా ఉంటుంది? బ్రహ్మ ఆనందమయానికి అవయవమే అయింది గాని ప్రధానం కాలేదు కదా అని భావం. (సమాధానం) - బ్రహ్మ ప్రకృతం కాబట్టి దానికి స్వప్రధానత్వం ఉంటుంది అని చెపుతాం. (ప్రశ్న) - బ్రహ్మ ఆనందమయానికి అవయవం అని చెప్పినా ఆనందమయమే బ్రహ్మ గాన దాని ప్రకృతత్వానికి ఏమీ భంగం లేదు కదా? ఇక్కడ చెప్పబడుచున్నది (సమాధానం) - అట్లయితే (ఆనందమయమే బ్రహ్మ అన్నట్లయితే) ఆ బ్రహ్మయే అవయవియైన ఆనందమయాత్మ, అదే బ్రహ్మ పుచ్ఛరూపప్రతిష్ఠయైన అవయవం అని అసామంజస్యం ఏర్పడుతుంది. (అసామంజస్యం అనగా సరిగా కుదరకపోవడం). ఆ రెండింటిలో ఏదో ఒక దానిని గ్రహించవలసి వచ్చినప్పుడు "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అనే చోటనే బ్రహ్మ నిర్దేశం అని అంగీకరించడం మంచిది. ఎందువల్ల ననగా అక్కడ స్పష్టంగా బ్రహ్మ శబ్దం ఉంది, ఆనందమయవాక్యంలో బ్రహ్మ శబ్దసంయోగం లేదు. మరొక విషయమేమనగా - "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అని చెప్పి తరవాత - "తదప్యేష...విదుః" (ఈ సందర్భంలో) ఈ శ్లోకం ఉన్నది - బ్రహ్మ అసత్ (లేదు) అనుకొన్నవాడు అసత్తే అవుతాడు, బ్రహ్మ ఉంది అని తెలుసుకొన్నట్లయితే అప్పుడు వానిని ఉన్నవానినిగా చెపుతారు) అని చెప్పబడుచున్నది. ఈ శ్లోకంలోనికి ఆసందమయాన్ని తీసికొనిరాకుండా బ్రహ్మ యొక్క (భావ-అభావ జ్ఞానాలు) గుణ దోషములు (బ్రహ్మ ఉన్నదనుకుంటే మంచిది, అట్లు కాకపోతే మంచిది కాదు) అని చెప్పడం చేత "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అనే చోట ఉన్న బ్రహ్మకే స్వపాధాన్యం ఉన్న దని తెలుస్తూన్నది. ఆనందమయాత్మను గూర్చి ఉన్నదా లేదా అనే శంక ఉండదు. ప్రియమోదాదివిశేషాలతో కూడిన ఆనందమయం అందరికీ తెలిసినదే కదా?

## భాష్యమ్

కథం పునః స్వప్రధానం సద్బ్రహ్మ ఆనన్దమయస్య పుచ్ఛత్వేన నిర్దిశ్యతే "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి? నైష దోషః పుచ్ఛవత్ పుచ్ఛం ప్రతిష్ఠా పరాయణమ్, ఏకనీడం లౌకికస్యానన్దజాలస్య బ్రహ్మానన్ద ఇత్యేతదనేన వివక్ష్యతే, నావయవత్వమ్. "ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముప జీవన్తి" (బృ.ఉ.4.3.32) ఇతి శ్రుత్యన్తరాత్. అపి చ ఆనన్దమయస్య బ్రహ్మత్వే ప్రియాద్యవయవత్వేన సవిశేషం బ్రహ్మాభ్యుపగన్తవ్యమ్. నిర్విశేషం తు బ్రహ్మ వాక్యశేషే శ్రూయతే, వాఙ్మనసయోరగోచరత్వాభిధానాత్ - "యతో వాచో నివర్తన్తే

అప్రాప్యమనసా సహ, ఆనన్దం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" (తై.ఉ.2.9) ఇతి. అపి చ ఆనన్దప్రచుర ఇత్యుక్తే దుఃఖాస్తిత్వమపి గమ్యతే, ప్రాచుర్యస్య లోకే ప్రతియోగ్యల్పత్వాపేక్షత్వాత్. తథా చ సతి 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా'' (ఛా.ఉ. 7.24.1) ఇతి భూమ్ని బ్రహ్మణి తద్వ్యతిరిక్తాభావశ్రుతిరుపరుధ్యేత. ప్రతిశరీరం చ ప్రియాది భేదాదానన్దమయస్యాపి భిన్నత్వమ్. బ్రహ్మ తు న ప్రతి శరీరం భిద్యతే "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'' (తై.ఉ.2.1) ఇత్యానన్త్యశ్రుతేః. "ఏకోదేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా" శ్వే.ఉ.1.11) ఇతి చ శ్రుత్యన్తరాత్.

బాలానందిని

కథమితి:- (ప్రశ్న) - బ్రహ్మ స్వప్రధానమై ఉండి, "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా'' అని ఆనందమయానికి పుచ్ఛంగా ఎలా నిర్దేశించబడుచున్నది? (ఒకదానికి తోక అయినప్పుడు ప్రాధాన్యాన్ని కోల్పోతుంది కదా అని భావం). (సమాధానం) - ఈ దోషం లేదు. 'పుచ్ఛమ్' అనడం చేత, బ్రహ్మానందం లౌకికానందాలన్నింటికీ పుచ్ఛము వంటిది; వాటికి స్థానం, ప్రధానగమ్యం, ఒకే ఒక నివాసం అని మాత్రమే చెప్పడానికి ఇచ్ఛయించబడినది కాని దానికి అవయవం అని కాదు, "ఏతస్య... ఉపజీవన్తి'' ఇతర భూతాలన్నీ ఈ ఆనందం యొక్క అంశం మీద మాత్రమే ఆధారపడి జీవిస్తున్నాయి (ఉన్నాయి) అని మరొక శ్రుతి కూడా చెప్పుచున్నది. మరొక విషయమేనగా - ఆనందమయమే బ్రహ్మ అని చెప్పే పక్షంలో దానికి ప్రియాద్యవయవాలు చెప్పడంచేత ఆ బ్రహ్మ సవిశేషబ్రహ్మ అని చెప్పవలసి ఉంటుంది. కాని "యతో వాచో... కుతశ్చన" (ఏ బ్రహ్మను పొందజాలక వాక్కులు మనస్సూ కూడ వెనుకకు మరలిపోతున్నాయో అలాంటి బ్రహ్మయొక్క ఆనందస్వరూపాన్ని గుర్తించినవాడు ఎవరి నుండీ బయపడడు) అని బ్రహ్మ వాక్కుకు, మనస్సుకు గోచరం కాదని చెప్పడం వల్ల వాక్యశేషంలో నిర్విశేషబ్రహ్మయే వినబడుతున్నది. మరొక విషయమేమనగా - లోకంలో ఒకటి ప్రచురంగా ఉన్నది అని అంటే దానికి విరుద్ధమైనది కూడ అక్కడ అల్పంగా ఉందని అర్థం. (రెండవదాని అల్పత్వాన్ని పట్టి ఒకదానికి ప్రచురం అంటాం కదా?) అంట్లే ఆనందప్రచురం అని అంటే దుఃఖం కూడా ఉన్నది అని అర్థం వస్తుంది. అలా అయిన పక్షంలో "యత్ర...భూమా" (భూమ అనగా ఎక్కడ మరొక దానిని చూడడో మరొకదానిని వినడో మరొక దానిని తెలుసుకొనడో అది) అని భూమయైన బ్రహ్మయందు ఆనందాతిరిక్తమైనది ఏదీ లేదు అని చెప్పే శ్రుతివాక్యానికి అడ్డు

తగులుతుంది. ప్రతీ శరీరంలోను ప్రియాదులు వేరువేరుగా ఉంటాయి, అందుచేత ఆనందమయం కూడ వేరుగానే ఉంటుంది. కాని - "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని బ్రహ్మ అనంత మని శ్రుతి చెప్పుచున్నది గాన, "ఏకో...ఆత్మా" (ఒకే దేవుడు (ఆత్మ) సమస్తభూతాలలో దాగి యున్నాడు, అంతటా వ్యాపించి ఉన్నాడు, అన్ని భూతాలకి అంతరాత్మ) అని మరొక శ్రుతి కూడ చెప్పుచున్నది గాన బ్రహ్మ మాత్రం వేరు వేరు శరీరాలలో వేరు వేరుగా ఉండదు.

## భాష్యమ్

న చానన్దమయస్యాభ్యాసః శ్రూయతే, ప్రాతిపదికార్థమేవ హి సర్వత్రాభ్యస్యతే - "రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి, కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్, ఏష హ్యేవానన్దయాతి, సైషానన్దస్య మీమాంసా భవతి", "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చనేతి (తై.ఉ.2.7.8.9) "ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్" (తై.ఉ.6.6.) ఇతి చ. యది చానన్దమయశబ్దస్య బ్రహ్మ విషయత్వం నిశ్చితం భవేత్ తత ఉత్తరేష్వానన్దమాత్రప్రయోగేష్వపి ఆనన్దమయాభ్యాసః కల్ప్యేత; న త్వానన్దమయస్య బ్రహ్మత్వమస్తి ప్రియశిరస్త్వాదిభిః హేతుభిరిత్యవోచామ. తస్మాచ్ఛ్రుత్యన్తరే "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ. 3.9.28) ఇత్యానన్ద ప్రాతిపదికస్య బ్రహ్మణి ప్రయోగదర్శనాత్ "యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" ఇత్యాదిర్బ్రహ్మవిషయః ప్రయోగః న త్వానన్దమయాభ్యాస ఇత్యవగన్తవ్యమ్. యస్త్వయం మయడన్తస్యైవానన్ద శబ్దస్యాభ్యాసః "ఏతమానన్దమయమాత్మాన ముపసంక్రామతి" (తై.ఉ.2.8) ఇతి, న తస్య బ్రహ్మవిషయత్వమస్తి, వికారాత్మనామేవాన్నాదీనామనాత్మనా ముపసంక్రమితవ్యానాం ప్రవాహే పఠితత్వాత్.

## బాలానందిని

న చేతి:- "రసో... వ్యజాతానాత్" ఇత్యాది వాక్యాలలో అంతటా 'ఆనన్ద' అనే ప్రాతిపదికం మాత్రమే ఆవృత్తి చేయబడుతున్నది 'ఆనన్దమయాభ్యాసం ఎక్కడా లేదు, 'ఆనన్దమయ' శబ్దం బ్రహ్మనే బోధిస్తుంది అని నిశ్చితం అయిన పక్షంలో తరవాత వచ్చిన ఆనన్దశబ్దమాత్ర ప్రయోగాలలో కూడ అది 'ఆనన్దమయ' శబ్దాభ్యాసమే అని చెప్పడానికి అవకాశం ఉండేది. ప్రియశిరస్త్వాదిహేతువులచేత - 'ఆనన్దమయం'

బ్రహ్మ కాజాలదని చెప్పి ఉన్నాం. అందుచేత, ఇతరశ్రుతిలో కూడ "విజ్ఞానమానన్దం బ్రహ్మ" అని 'ఆనన్ద' అనే ప్రాతిపదికమాత్రమే బ్రహ్మార్థంలో ప్రయోగించబడి ఉండడం వల్ల "యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" ఇత్యాది ప్రయోగం కూడ బ్రహ్మకు సంబంధించినదే కాని ఇది ఆనన్దమయాభ్యాసం కాదు. "ఏత మానన్దమయమాత్మానముపసంక్రామతి" (ఆనందమయమైన ఈ ఆత్మను దాటుతాడు) అనే వాక్యంలో ఉన్న ఆనన్దమయ శబ్దాభ్యాసం మాత్రం బ్రహ్మకు సంబంధించినది కాదు; అది దాటవలసిన, అనాత్మలైన అన్నమయాదివికారాల ప్రవాహంలోనే పఠించబడింది కదా?

## భాష్యమ్

నన్వానన్దమయస్యోపసంక్రమితవ్యస్యాన్నమయాదివదబ్రహ్మత్వే సతి నైవ విదుషో బ్రహ్మప్రాప్తిఫలం నిర్దిష్టం భవేత్. నైష దోషః ఆనన్దమయోప సంక్రమణనిర్దేశేనైవ పుచ్ఛప్రతిష్ఠాభూత బ్రహ్మ ప్రాప్తేః ఫలస్య నిర్దిష్టత్వాత్. "తదప్యేష శ్లోకో భవతి, యతో వాచో నివర్తన్తే" ఇత్యాదినా చ ప్రపఞ్చ్య మానత్వాత్. యా త్వానన్దమయసన్నిధానే "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ" ఇతి శ్రుతిరుదాహృతా సా "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యనేన సంనిహితతరేణ బ్రహ్మణా సంబధ్యమానా నానన్దమయస్య బ్రహ్మతాం ప్రతిబోధయతి. తదపేక్షత్వాచ్చోత్తరస్య గ్రన్థస్య "రసో వై సః" ఇత్యాదేర్నానన్ద మయవిషయతా.

## బాలానందిని

నిర్విత్తిః- (ప్రశ్న) - దాటివేయదగిన ఆనందమయం కూడ అన్నమయాదికం వలె అబ్రహ్మ అయితే విద్వాంసునికి బ్రహ్మప్రాప్తిరూపమైన ఫలం నిర్దేశింపబడదు కదా? (సమాధానం) - ఈ దోషం లేదు. ఆనందమయాన్ని దాటడాన్ని నిర్దేశించడంచేతనే పుచ్ఛమూ ప్రతిష్ఠా అయిన బ్రహ్మయొక్క ప్రాప్తి అనే ఫలం చెప్పినట్లే. (ఆనందమయాన్ని దాటగానే చెప్పినది పుచ్ఛబ్రహ్మయే కదా?) ఈ విషయమే (పుచ్ఛ బ్రహ్మప్రాప్తియే ఫలం అనే విషయమే) "తదప్యేష శ్లోకో భవతి. యతో వాచో నివర్తన్తే" ఇత్యాదివాక్యాలచేత విస్తృతంగా వివరించబడుచున్నది. ఆనందమయం దగ్గర చెప్పబడిన "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ" అనే శ్రుతి ఇంకా దగ్గరగా ఉన్న "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అను శ్రుతిలోని బ్రహ్మతో సంబంధిస్తుంది గాన ఆ శ్రుతి ఆనందమయం బ్రహ్మ అని

బోధించజాలదు. "రసోవైసః" ఇత్యాదికమైన తరువాత గ్రంథం అంతా దానివే (బ్రహ్మ పుచ్ఛం" అనేదానినే) అపేక్షించి ఉంది. అందుచేత ఆనందమయాన్ని గూర్చి చెప్పదు.

## భాష్యమ్

నను "సోఽకామయత" ఇతి బ్రహ్మణి పుంలిఙ్గనిర్దేశో నోపపద్యతే, నాయం దోషః "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః "ఇత్యత్ర పుంలిఙ్గేనాప్యాత్మశబ్దేన బ్రహ్మణః ప్రకృతత్వాత్. యత్తు భార్గవీ వారుణీ విద్యా "అనన్దో బ్రహ్మేతి వ్యజానాత్" ఇతి తస్యాం మయడశ్రవణాత్ ప్రియశిరస్త్వా ద్యశ్రవణాచ్చ యుక్తమానన్దస్య బ్రహ్మత్వమ్. తస్మాదణుమాత్ర మపి విశేషమనాశ్రిత్య స స్వత ఏవ ప్రియశిరస్త్వాది బ్రహ్మణ ఉపపద్యతే. న చేహ సవిశేషం బ్రహ్మ ప్రతిపిపాదయిషితమ్, వాఙ్మనసగోచరాతిక్రమశ్రుతేః. తస్మాదన్నమయాదిష్వివానన్దమయేఽపి వికారార్థ ఏవ మయట్ విజ్ఞేయః, న ప్రాచుర్యార్థః.

## బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) "సోఽకామయత" అని బ్రహ్మను నిర్దేశించేటపప్పుడు (సః అని) పుంలింగప్రయోగం యుక్తం కాదు కదా? (ఆనన్దమయః అనేది పుంలింగశబ్దంగాన సః అని దానిని నిర్దేశింపవచ్చును అని భావం). అది దోషం కాదు. "తస్మాద్వా ఏతస్మాదాత్మవ ఆకాశః సంభూతః" అనే వాక్యంలో పుంలింగమైన ఆత్మశబ్దం చేత కూడ బ్రహ్మ ప్రకృతమైనది కదా (సః అని ఆత్మకు నిర్దేశం అని అర్థం). "ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్" అని ఏ భార్గవవారుణ విద్య ఉన్నదో దానిలో మయట్ గాని, ప్రియశిరస్త్వాదికం గాని వినబడకపోవడం చేత ఆనందం బ్రహ్మ అని చెప్పడం యుక్తమే. అందువల్ల ఏ కొంచెమో విశేషం లేకపోతే బ్రహ్మలో సహజంగా ప్రియశిరస్త్వాదికం కుదరదు (ప్రియశిరస్త్వాదికం అంగీకరించామా అది సవిశేష బ్రహ్మయే అవుతుంది అని భావం). ఇక్కడ బ్రహ్మ వాఙ్మన సాగోచరమైనది అని చెప్పడం చేత సవిశేషబ్రహ్మను ప్రతిపాదించే అభిప్రాయం లేదు. (నిర్విశేషబ్రహ్మయే ప్రతిపాదించబడుతున్నది). అందువల్ల అన్నమయాదులలో వలె ఆనన్దమయంలో కూడా మయట్‌కు వికారమే అర్థం అని గ్రహించాలి కాని ప్రాచుర్యార్థం గ్రహించకూడదు.

## భాష్యమ్

సూత్రాణి త్వేవం వ్యాఖ్యేయాని. "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇత్యత్ర కిమానన్దమయస్యావయవత్వేన బ్రహ్మ వివక్ష్యత ఉత స్వప్రధానత్వేనేతి. పుచ్ఛ శబ్దాదవయవత్వేనేతి ప్రాప్తే ఉచ్యతే - "ఆనన్దమయోఽ భ్యాసాత్" "ఆనన్దమయ ఆత్మా" ఇత్యత్ర బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి స్వప్రధానమేవ బ్రహ్మోపదిశ్యతే, అభ్యాసాత్, "అసన్నేవ స భవతి" ఇత్యస్మిన్నిగమనశ్లోకే బ్రహ్మణ ఏక కేవలస్యాభ్యస్యమానత్వాత్. "వికార శబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్" వికారశబ్దేనావయవశబ్దోఽభిప్రేతః పుచ్ఛమిత్యవయవశబ్దాన్న స్వప్రధానత్వం బ్రహ్మణ ఇతి యదుక్తం తస్య పరిహారో వక్తవ్యః అత్రోచ్యతే - నాయం దోషః, ప్రాచుర్యాదప్యవయవశబ్దోపపత్తేః. ప్రాచుర్యం ప్రాయాపత్తిః, అవయవప్రాయే వచనమిత్యర్థః. అన్నమయాదీనాం హి శిరఆదిషు పుచ్ఛాన్తేష్వయవేషూక్తేషు ఆనన్దమయస్యాపి శిరఆదీన్యవయవాన్తరాణ్యుక్త్వా అవయవప్రాయాపత్త్యా బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా ఇత్యాహ, నావయవవివక్షయా, యత్కారణమభ్యాసాదితి స్వప్రధానత్వం బ్రహ్మణః సమర్థితమ్. "తద్ధేతువ్యపదేశాచ్చ" - సర్వస్య హి వికారజాతస్య సానన్దమయస్య కారణత్వేన బ్రహ్మ వ్యపదిశ్యతే - "ఇదం సర్వమసృజత, యదిదం కిం చ" (తై. 2.6) ఇతి. న చ కారణం సద్బ్రహ్మ స్వవికారస్యానన్దమయస్య ముఖ్యయా వృత్త్యావయవ ఉపపద్యతే. అపరాణ్యపి సూత్రాణి యథాసంభవం పుచ్ఛవాక్యనిర్దిష్టస్యైవ బ్రహ్మణ ఉపపాదకాని ద్రష్టవ్యాని 19.

## బాలానందిని

అవ. శ్రుతిలో చెప్పినది ఒక విధంగా ఉంటే సూత్రాలవల్ల పైకి కనబడే అర్థం. వెనుక చూపినట్లు మరొక విధంగా ఉంది. సూత్రాల అర్థం శ్రుతికి విరుద్ధంగా ఉండగూడదు. అందుచేత శ్రుత్యర్థానుగుణంగా సూత్రాలకే ఎలా అర్థం చెప్పాలో చూపుతున్నారు- సూత్రాణీతి:- సూత్రాలైతే ఈ విధంగా వ్యాఖ్యానించాలి. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అన్నచోట బ్రహ్మ ఆనందమయానికి అవయవంగా చెప్పబడుతున్నదా లేక స్వప్రధానంగా చెప్పబడుతున్నదా అని సందేహం. పుచ్ఛశబ్దం ఉన్నది కాబట్టి అవయవంగానే

చెప్పబడుతున్నది అని ప్రాప్తించగా చెప్పబడుచున్నది - "ఆనన్దమయోఽ భ్యాసాత్" "ఆనన్దమయ ఆత్మా" అన్నచోట "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అని స్వప్రధానంగానే బ్రహ్మ చెప్పబడుతున్నది. కారణమేమనగా అభ్యాసం వల్ల. "అసన్నేవ సభవతి" అనే ముగింపు శ్లోకంలో కేవలం బ్రహ్మమాత్రమే ఆవృత్తి చేయబడుచున్నది కదా?

"వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్" - ఇక్కడ వికారశబ్దం అన్నదానికి అవయవ శబ్దం అని అర్థం అంగీకరించబడింది. పుచ్ఛమ్ అని అవయవార్థకశబ్దం ప్రయోగించడం చేత బ్రహ్మకు స్వప్రధానత్వం కాదు అని ఏది చెప్పబడిందో దానికి పరిహారం చెప్పాలి. ఈ విషయంలో చెప్పబడుతున్నది. ఈ దోషం లేదు. ప్రాచుర్యం వల్ల అవయవ వాచకశబ్ద ప్రయోగం ఉపపన్నం అవుతుంది. ప్రాచుర్యం అనగా ప్రాయాపత్తి; అనగా అవయువాలను గూర్చి ఎక్కువగా చెప్పే ఘట్టంలో చెప్పడం అని అర్థం. అన్నమయాదులకు శిరస్సు మొదలు పుచ్ఛం వరకూ ఉన్న అవయవయాలు చెప్పి తరవాత ఆనందమయానికి కూడా శిరస్సు మొదలైన ఇతరావయవాలు చెప్పి చాలా అవయవాలు చెప్పే సందర్భం అవడం చేత "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అని చెప్పబడింది కాని బ్రహ్మను పుచ్ఛరూపావయవంగా చెప్పాలనే తాత్పర్యంతో కాదు; అభ్యాసమును పట్టి బ్రహ్మకు స్వప్రధానత్వమే అని సమర్థించబడింది కదా?

"తద్ధేతువ్యపదేశాచ్చ" : "ఇదం సర్వం యదయమాత్మా" (తై.ఉ.2.6) అనే వ్యాకం చేత ఆనందమయంతో సహా సమస్తమైన వికారజాతానికి బ్రహ్మ కారణం అని చెప్పబడుచున్నది. కారణం అయిన బ్రహ్మ తన వికారమైన ఆనందమయానికి, ముఖ్య వృత్తి చేత, (యథార్థంగా) అవయవం అవడం కుదరదు కదా? ఇతర సూత్రాలు కూడా, వీలున్నంతవరకు, పుచ్ఛవాక్యంలో నిర్దేశించబడిన బ్రహ్మకే ఉపపాదకాలుగా (సమర్థకాలుగా) చూచుకోవాలి.

వి. "మాన్త్రవర్ణికమేవ చ గీయతే" : "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అని దేని జ్ఞానం వల్ల ముక్తి చెప్పబడిందో, ఏది "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని మంత్రంలో చెప్పబడిందో ఆ బ్రహ్మమే బ్రహ్మపదం ఉన్న ఈ పుచ్ఛవాక్యంలో నిర్దేశించబడింది గాని ఆనందమయవాక్యంలో నిర్దేశించబడలేదు.

"నేతరోఽనుపపత్తేః" అంతనీ సృజించడం మొదలైనవి కుదరవుగాన ఇతరుడు, అనగా ఆనందమయుడైన జీవుడు ఇక్కడ ప్రతిపాదించబడడం లేదు.

"భేదవ్యపదేశాచ్చ" : ఈ ఆనందమయుడు బ్రహ్మరసాన్ని పొంది ఆనందం కలవాడవుతాడు అని ఆనందమయుడైన జీవుడు వేరు బ్రహ్మ వేరు అని చెప్పడంచేత

ఆనందమయుడు ప్రధాన ప్రతిపాద్యుడు కాడు.

"కామాచ్చ నానుమానాపేక్షా" : కామాత్ అనగా ఆనందంవల్ల అని అర్థం. భృగువల్లిలో ఐదవదైన ఆనందం బ్రహ్మగా చెప్పబడింది గాన దీనిలో ఐదవదైన ఆనందమయం కూడా బ్రహ్మయే అని అనుమానం, ఊహ, చేయకూడదు. అలా చెపితే వికారార్థకమయట్ కుదరదు.

"అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి" : భేదవ్యపదేశాన్ని పట్టి ఇక్కడ సుగుణబ్రహ్మయే తెలియదగినదిగా చెప్పబడుతుంది అనుకొనగూడదు. ఎందువల్ల అనగా పుచ్ఛవాక్యోక్తమైన బ్రహ్మ విషయంలో "అహమేవ పరం బ్రహ్మ" అని మేల్కొన్న ఆనందమయునికి శాస్త్రం బ్రహ్మత్వాన్ని చెపుతున్నది గాన ఇక్కడ ప్రతిపాదించబడేది నిర్గుణబ్రహ్మయే. ఇది వ్యాఖ్యాతలు చెప్పినఅర్థం.

ఆనందమయాధికరణం సమాప్తం

## 7. అన్తరధికరణమ్ సూ. 20-21

## సూ. అన్తస్తద్ధర్మోపదేశాత్ 1.1.20

### భాష్యమ్

ఇదమామ్నాయతే - "అథ య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆ ప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః తస్య యథా కప్యాసం పుణ్డరీకమేవమక్షిణీ, తస్యోదితినామ స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద".... "ఇత్యధిదైవతమ్" **(ఛా.ఉ.1.6.7.8)**, "అథాధ్యాత్మమ్...." "అథ యేషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే (ఛా.ఉ.1.7.1.5) ఇత్యాది. తత్ర సంశయ:- కిం విద్యాకర్మాతిశయవశాత్ ప్రాప్తోత్కర్షః కశ్చిత్సంసారీ సూర్యమణ్డలే చక్షుషి చోపాస్యత్వేన శ్రూయతే కిం వా నిత్యసిద్ధః పరమేశ్వర ఇతి. కిం తావత్ప్రాప్తమ్? సంసారీతి, కుతః? రూపవత్త్వశ్రవణాత్. ఆదిత్యపురుషే తావత్ "హిరణ్యశ్మశ్రుః" ఇత్యాది రూపముదాహృతమ్. అక్షి పురుషేఽపి తదేవాతిదేశేన ప్రాప్యతే "తస్యైతస్య

తదేవ రూపం యదముష్య రూపమ్" ఇతి. న చ పరమేశ్వరస్య రూపవత్త్వం యుక్తమ్ "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" (క.ఉ.1.3.15) ఇతి శ్రుతేః. ఆధారశ్రవణాచ్చ- "యఏషోఽన్తరాదిత్యే, ఏషోఽన్తరక్షిణి" ఇతి. న హ్యనాధారస్య స్వమహిమప్రతిష్ఠస్య సర్వవ్యాపినః పరమేశ్వరస్య ఆధార ఉపదిశ్యేత. "స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః ఇతి, స్వే మహిమ్ని" (ఛా.ఉ.7.24.1) ఇతి, "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" ఇతి చ శ్రుతీ భవతః.

బాలానందిని

అన్తరితి:- "అన్తః= అన్తరాదిత్యే ఇత్యాదివాక్యాలలో లోపల ఉన్నట్లు చెప్పబడినది పరమేశ్వరుడే. తద్ధర్మోపదేశాత్=ఆ పరమేశ్వరుని ధర్మాలే చెప్పబడినవి గాన" అని సూత్రార్థం.

వి. పూర్వాధికరణంలో బ్రహ్మకు ప్రాధాన్యాన్ని సూచించే చాలా లింగాలు ఉండడంచేత అప్రాధాన్యద్యోతకమైన పుచ్ఛశబ్దాన్ని మరొకవిధంగా వ్యాఖ్యానించినట్లు అనేకమైన అనైశ్వర్యధర్మా లుండడంచేత సర్వపాప్మాదితత్వం అనే ఈశ్వరధర్మాన్ని ఏదో విధంగా వ్యాఖ్యానించుకొనాలి అని ఆ అధికరణంతో దీనికి దృష్టాంతసంగతి. అనగా ఆ అధికరణ సిద్ధాంతాన్ని దృష్టాంతంగా చూపి పూర్వపక్షం చేయబడింది.

ఇదమితి "అథ... సువర్ణ" (ఇప్పుడు ఉపాసన ప్రారంభించబడుచున్నది. సూర్యుని లోపల, బంగారు మీసాలు, బంగారు వెంట్రుకలు గలవాడు, గోటి చివరి వరకు బంగారమూ అయిన ఏ ఈ పురుషుడు చూడబడచున్నాడో) "తస్య... వేద" (కోతి పిఱ్ఱల వంటి ఏ పద్మం ఉన్నదో అలా ఉంటాయి అతని కండ్లు, ఇతని పేరు ఉత్; ఎందువల్లననగా ఇతడు అన్ని పాపాల నుండి బైటకు వచ్చినాడు. ఇట్లు ఎవడు తెలుసుకొంటాడో అతడు సర్వపాపాల నుండీ దూరం అవుతాడు).

"ఇత్యధిదైవతమ్" (ఇది అధిదైవతమూర్తికి సంబంధించినది), 'అథాధ్యాత్మమ్' (ఇక అధ్యాత్మం) "అథ... దృశ్యతే" (కంటి లోపల యే పురుషుడు చూడబడుచున్నాడో) ఇత్యాదికం పఠించబడుచున్నది. విద్యాకర్మల అతిశయంచేత ఉత్కర్ష పొందిన ఒకానొక సంసారి (జీవుడు) సూర్యమండలంలోను, నేత్రంలోను ఉపాస్యుడుగా వినబడుచున్నాడా, లేక నిత్యసిద్ధుడైన పరమేశ్వరుడు ఉపాస్యుడుగా చెప్పబడుచున్నాడా అని ఇక్కడ సంశయం. ఏమి వచ్చింది? జీవుడే అని. ఎందువల్ల? రూపం ఉన్నట్లు వినబడడంవల్ల. ఆదిత్యపురుషునికి "హిరణ్యశ్మశ్రు" ఇత్యాదికమైన

రూపం ఉన్నట్లు చెప్పబడింది. కాని పరమేశ్వరునికి రూపం ఉన్నదని చెప్పడం కుదరదు. ఎందువల్ల ననగా "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" ఇత్యాదిశ్రుతి పరమేశ్వరునికి రూపాదికం లేదని చెపుతున్నది. "య ఏషోఽన్తరాదిత్యే, ఏషోఽన్తరక్షిణి" అని ఆ పురుషునికి ఆధారం ఉన్నట్లు కూడా చెప్పబడింది. ఏ ఆధారమూ లేనివాడు, తన మహిమయందే తాను నిలచి ఉన్నవాడు, సర్వవ్యాపీ అయిన పరమేశ్వరునికి ఆధారం చెప్పబడదుకదా? "సః... మహిమ్ని" (ఓ పూజ్యుడా! ఆ పరమాత్మ ఎక్కడ ప్రతిష్ఠితుడై ఉన్నాడు? తనమహిమమీదనే) అని, "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" (ఆకాశంవలె అంతటా ఉన్నాడు నిత్యుడు) అనీ రెండు శ్రుతు లున్నవి.

## భాష్యమ్

ఐశ్వర్యమర్యాదాశ్రుతేశ్చ. "స ఏష యే చాముష్మాత్పరాఞ్చో లోకాస్తేషాం చేష్టే దేవకామానాం చ" (ఛా.ఉ.1.6.8) ఇత్యాదిత్య పురుషస్యైశ్వర్యమర్యాదా "స ఏష యే చైతస్మాదర్వాఞ్చో లోకాస్తేషాం చేష్టే మనుష్యకామానాం చ" ఇత్యక్షిపురుషస్య. న చ పరమేశ్వరస్య మర్యాదావదైశ్వర్యం యుక్తమ్. "ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధారణ ఏషాం లోకానామసంభేదాయ" (బృ.ఉ.4.4.22) ఇత్యవిశేషశ్రుతేః. తస్మాన్నాక్ష్యాదిత్యయోరన్తః పరమేశ్వర ఇతి.

## బాలానందిని

ఐశ్వర్యేతి: ఐశ్వర్యానికి ఒక హద్దు కూడా వినబడుచున్నది. "స ఏష... దేవకామానాం చ" (ఈ ఆదిత్యమండలంలో ఉన్న పురుషుడు దానినుండి పైన ఏ లోకా లున్నాయో వాటి విషయంలోను దేవతల భోగాల విషయంలోను అధికారం కలవాడై ఉన్నాడు) అని ఆదిత్య పురుషుని ఐశ్వర్యానికి (శక్తికి) ఒక హద్దు చెప్పబడింది. "స ఏష... మనుష్యకామానాం చ" (అక్షియందున్న పురుషుడు దీనికి క్రింద ఉన్న లోకాలకు, మనుష్యభోగాలకు అధికారం కలవాడై ఉన్నాడు) అని అక్షిపురుషుని ఐశ్వర్యానికి హద్దు చెప్పబడింది. కాని పరమేశ్వరుని ఐశ్వర్యానికి హద్దు లుండడం యుక్తం కాదు. "ఏష... అసంభేదాయ" (ఇతడే సర్వేశ్వరుడు, ఇతడే భూతాల అధిపతి. ఇతడే భూతపాలుడు, లోకాలు కలిసిపోకుండా అడ్డంగా నిలిచిన సేతువు ఇతడే) అని శ్రుతి పరమేశ్వరుని ఐశ్వర్యానికి ఎట్టి పరిధులూ లేవని చెప్పుచున్నది. అందువల్ల నేత్రంలోను, ఆదిత్యునిలోను ఉన్న పురుషుడు పరమేశ్వరుడు కాదు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః :- "అన్తస్తద్ధర్మోపదేశాత్" ఇతి. "య ఏషో௨న్తరాదిత్యే య ఏషో௨న్తరక్షిణి" ఇతి చ శ్రూయమాణః పురుషః పరమేశ్వర ఏవ, న సంసారీ. కుతః? తద్ధర్మోపదేశాత్. తస్య హి పరమేశ్వరస్య ధర్మా ఇహోపదిష్టాః. తద్యథా - "తస్యోదితి నామ" ఇతి శ్రావయిత్వా అస్యాదిత్యపురుషస్య నామ "స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః" ఇతి సర్వపాపాపగమేన నిర్వక్తి. తదేవ చ కృతనిర్వచనం నామాక్షిపురుషస్యాప్యతి దిశతి- "యన్నామ తన్నామ" ఇతి. సర్వపాప్మాపగమశ్చ పరమాత్మన ఏవ శ్రూయతే "య ఆత్మాపహతపాప్మా" (ఛా.ఉ.8.7.1) ఇత్యాదౌ. తథా చాక్షుషే పురుషే "సైవర్క్ తత్సామ తదుక్థం తద్యజుస్తద్బ్రహ్మ" ఇత్యృక్సామాత్మకతాం నిర్ధారయితి. సా చ పరమేశ్వర స్యోపపద్యతే, సర్వకారణత్వాత్, సర్వాత్మకత్వోపపత్తేః. పృథివ్యగ్న్యాద్యాత్మకే చాధిదైవతం ఋక్సామే వాక్ప్రాణాద్యాత్మకే చాధ్యాత్మమనుక్రమ్యాహ- "తస్యర్క్ చ సామ చ గేష్ణౌ" ఇత్యధిదైవతమ్ తథాధ్యాత్మమపి- "యావముష్యగేష్ణౌ తౌ గేష్ణౌ" ఇతి. తచ్చ సర్వాత్మకత్వే సత్యేవోపపద్యతే. "తద్య ఇమే వీణాయాం గాయన్త్యేతం త్వేవ తే గాయన్తి తస్మాత్తే ధనసనయః" (ఛా.ఉ.1.7.6) ఇతి చ లౌకికేష్వపి గానేష్వస్యైవ గీయమానత్వం దర్శయతి. తచ్చ పరమేశ్వరపరిగ్రహే ఘటతే-

"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా"

తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోం௨శసంభవమ్" (భ.గీ.10.41) ఇతి భగవద్గీతాదర్శనాత్. లోకకామేశితృత్వమపి నిరఙ్కుశం శ్రూయమాణం పరమేశ్వరం గమయతి.

## బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా (ఒక మతం) ప్రాప్తించగా చెపుతున్నాం- "అన్తస్తద్ధర్మోపదేశాత్" - "య ఏషో௨న్తరాదిత్యే, య ఏషో௨న్తరక్షిణి" అని వినబడుచున్న పురుషుడు పరమేశ్వరుడే. సంసారి కాడు. ఎందువల్ల? పరమేశ్వరుని ధర్మాలను చెప్పడంవల్ల. ఇక్కడ ఆ పరమేశ్వరుని ధర్మాలు చెప్పబడ్డాయి కదా? అదెట్లనగా - "తస్యోదితి

నామ" అని ఆదిత్య పురుషుని పేరు 'ఉత్' అని చెప్పి "స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః" అని సర్వపాపాలకీ పైన ఉన్నవాడు అని ఆ పేరుకు నిర్వచనం చెప్పుచున్నది. ఆ విధంగా నిర్వచించిన పేరునే అక్షిపురుషునికి కూడా "యన్నామ తన్నామ" (ఆదిత్య పురుషునికి ఏ పేరో అదే వీని పేరు) అని అతిదేశిస్తూన్నది. (ఒకదాని విషయంలో చెప్పినదానిని మరొకదానికి కూడా ప్రవర్తింప చేయడం అతిదేశం). సర్వపాపాలు లేకపోవడం అనేది "య ఆత్మాపహతపాప్మా" ఇత్యాది వాక్యాలలో పరమేశ్వరునికి మాత్రమే వినబడుచున్నది. అట్లే "సైవ... బ్రహ్మ" (చాక్షుషపురుషుడే ఋక్ అతడే సామ, అతడే ఉక్థం (యజ్ఞంలో పఠించే ఒకానొక శస్త్రం), అతడే యజుర్వేదం, అతడే బ్రహ్మ, అనగా మూడు వేదాలు) అని చాక్షుషపురుషుడు ఋక్సామాదిస్వరూపు డని చెపుతున్నది. ఇలా చెప్పడం పరమేశ్వరుని విషయంలోనే కుదురుతుంది. అతడు సర్వకారణుడు గాన సర్వాత్మకు డని చెప్పవచ్చును కదా? అధిదైవతమున (ఆదిత్యునికి సంబంధించి) పృథివ్యగ్న్యాది స్వరూపాలైన ఋక్సామలను, అధ్యాత్మమున (అక్షిపురుషునికి సంబంధించి) వాక్ప్రాణాద్యాత్మకాలైన ఋక్సామలను అనుక్రమించి (ముచ్చటించి) "తస్యర్క్ చ సామ చ గేష్ణౌ" (దానికి ఋక్సామలు గేష్ణాలు) అని అధిదైవతమున చెప్పింది. అట్లే అధ్యాత్మంలో కూడా "యావముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ" (దానికి ఏవి గేష్ణాలో అవే దీనికి గేష్ణాలు) అని చెప్పింది. ఇలా చెప్పడం సర్వాత్మకమైన పరమేశ్వరుని విషయంలోనే కుదురుతుంది కాని జీవుని విషయంలో కుదరదు.

వి. అధిదైవతంలో, ఋక్కు, పృథివీ-అన్తరిక్ష-ద్యులోక-నక్షత్ర-ఆదిత్యగత శ్లుక్లకాంతిరూపాలలో ఐదు విధా లైన దనీ, సామ, అగ్ని-వాయు-ఆదిత్య-చంద్ర - ఆదిత్యగతాతికృష్ణ రూపాలలో ఐదు విధానాలనీ శ్రుతి చెప్పినది. అధ్యాత్మాన ఋక్కు, వాక్-చక్షుస్-శ్రోత్ర -అక్షిగతశుక్లభాస్వరరూపాలలో నాలుగు విధాలనీ, సామ, ప్రాణ, ఛాయాత్మ-మనస్- అక్షిగతాతినీలరూపాలలో నాలుగు విధా లనీ చెప్పబడింది. గేష్ణం అనగా సామగానం చేయడానికి సాధనమైన పర్వ, ఒక విధమైన గానంలోని మలుపు వంటిది. సామగానంలో ప్రసిద్ధమైనది. సర్వాత్మకాలైన ఋక్సామల రూపంలో ఉన్న గేష్ణాలు ఆదిత్యస్థపురుషుని గేష్ణాలు; ఆదిత్యస్థపురుషగేష్ణాలే అక్షిస్థపురుషగేష్ణాలు కూడా అని శ్రుతి చెప్పి ఉన్నది. సర్వాత్మకాలైన ఋక్సామలు గేష్ణాలుగా కలిగి ఉండడం పరమేశ్వరుని విషయంలో కుదురుతుంది గాని జీవుని విషయంలో కుదరదు.

తద్య ఇతి: "తద్య...ధనసనయః" (లోకంలో వీణమీద ఏ గాయకులు గానం చేస్తున్నారో వాళ్లు ఈ పరమాత్మనే గానం చేస్తున్నారు; అందుచేతనే వాళ్లు ఐశ్వర్యవంతు లవుతున్నారు) అని లౌకికమైన గానాలలో కూడ గానం చేయబడుచున్నవాడు ఆదిత్యాక్షిగతపురుషుడే అని చూపుతున్నది. ఇది ఆ పురుషుడు పరమేశ్వరుడంటేనే

కుదురుతుంది. "యద్యత్... సంభవమ్" (ఏ యే ప్రాణి విభూతి (ఐశ్వర్యం) కలదో, లక్ష్మి గలదో, బలం గలదో అదల్లా నా తేజస్సుయొక్క అంశనుండి పుట్టినదే అని తెలుసుకో) అని భగవద్గీతలో చెప్పబడింది కదా? ఎట్టి ప్రతిబంధమూ లేనిదిగా వినబడుతున్న లోకకామేశితృత్వం కూడా (లోకంలోని అన్ని కామాల విషయంలోను సామర్థ్యం ఉండడం అనేది కూడా) పరమేశ్వరుణ్ణే సూచిస్తున్నది.

వి. గానం చేసేవాళ్లు ధనికులైన రాజాదులను గూర్చి గానం చేస్తారు కాని పరమేశ్వరుణ్ణి గురించి కాదు కదా అని ప్రశ్నించుకొని రాజాదులకు కూడా స్తుతించడానికి తగినంత గొప్పతనం ఉన్నదనగా అది పరమేశ్వరాంశ వాళ్లలో ఎక్కువగా ఉండడంవల్లనే అనీ, అందుచేత వాళ్లు నిజంగా గానం చేసేది పరమేశ్వరుణ్ణి గురించే అవుతుం దనీ భగవద్గీతాశ్లోకోదాహరణ పూర్వకంగా ప్రతిపాదించబడింది.

## భాష్యమ్

యత్తూక్తం - హిరణ్యశ్మశ్రురిత్యాదిరూపశ్రవణం పరమేశ్వరే నోపద్యత ఇతి; అత్ర బ్రూమః- స్యాత్పరమేశ్వరస్యాపీచ్ఛావశాన్మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్-

"మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద,( శాం.
సర్వభూతగుణైర్యుక్తం మైవం మాం జ్ఞాతుమర్హసి" మం భా
३३९-

ఇతి స్మరణాత్: అపి చ యత్ర తు నిరస్తసర్వవిశేషం పారమేశ్వరం రూపము పదిశ్యతే, భవతి తత్ర శాస్త్రమ్ - "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" ఇత్యాది. సర్వకారణాత్వాత్తు వికారధర్మైరపి కైశ్చిద్విశిష్టః పరమేశ్వర ఉపాస్యత్వేన నిర్దిశ్యతే-'' సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః (ఛా.ఉ.3.14.2) ఇత్యాదినా. తథా హిరణ్యశ్మశ్రుత్వాదినిర్దేశో ఽపి భవిష్యతి. యదప్యాధారశ్రవణాన్న పరమేశ్వర ఇతి, అత్రోచ్యతే - స్వమహిమప్రతిష్ఠ స్యాప్యాధారోపదేశ ఉపాసనార్థో భవిష్యతి. సర్వగతత్వాద్ బ్రహ్మణో వ్యోమవత్సర్వాన్తరత్వోపపత్తేః. ఐశ్వర్యమర్యాదాశ్రవణమప్యధ్యాత్మాధిదైవత విభాగాపేక్షముపాసనార్థమేవ. తస్మాత్ పరమేశ్వర ఏ వాక్ష్యాదిత్య యోరన్తరుపదిశ్యతే. 20.

## బాలానందిని

యత్త్వితి:- 'హిరణ్యశ్మశుః' ఇత్యాదిరూపాల శ్రవణం పరమేశ్వరుని విషయంలో ఉపపన్నం కాదు అని ఏది చెప్పబడినదో ఆ విషయంలో చెపుతున్నాం- సాధకులను అనుగ్రహించడం కొరకు పరమేశ్వరునికి కూడా మాయాకల్పితమైన రూపం ఆ పరమేశ్వరుని ఇచ్ఛ ప్రకారం ఉండవచ్చును. "మాయా... అర్హసి" (నారదా! నన్ను నువ్వు చూచున్నావు కదా? ఇది నేను సృజించిన మాయ, అనగా ఇది మాయానిర్మిత మైన మూర్తి. సకల భూతాల గుణాలతో కూడిన నన్ను ఈ విధంగా నీవు గ్రహించగూడదు; అనగా ఇదే నా పరమార్థరూప మనుకొనగూడదు) అని స్మృతి చెప్పుచున్నది. మరొక విషయ మేమనగా సకల విశేషములు నిరసించబడిన (ఎట్టి విశేషాలూ లేని) పరమేశ్వరస్వరూపాన్ని ప్రతిపాదించవలసి ఉన్నప్పుడు "అశబ్దమస్పర్శమరూపమవ్యయమ్" ఇత్యాదిరీతిలో శాస్త్రం ఉంటుంది. అయితే పరమేశ్వరుడు అన్నింటికీ కారణమైనవా డవడంవల్ల కొన్ని వికార (కార్య) ధర్మాలతో కూడినవాడుగా కూడ "సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః" (ఛా.ఉ.3.14.2) ఇత్యాదులచేత నిర్దేశింపబడతాడు. హిరణ్యశిశ్రుత్వాదినిర్దేశం కూడా ఈ విధంగానే ఉంటుంది. ఆధారం చెప్పబడింది గాన పరమేశ్వరుడు కాడని ఏది చెప్పబడిందో ఆ విషయంలో చెప్పబడుచున్నది - స్వమహిమయందే ప్రతిష్ఠితుడైన పరమేశ్వరుడు కూడ ఏదో ఒక ఆధారంమీద ఉన్నాడని చెప్పడం ఉపాసనకోసం కావచ్చును. బ్రహ్మ ఆకాశం వలె అంతటా ఉండడంచేత అందరిలోను అన్నింటిలోను ఉన్నాడని చెప్పడం యుక్తమే కదా? అధ్యాత్మ-అధిదైవత విభాగాన్ని ఆశ్రయించి ఐశ్వర్యానికి పరిధులను చెప్పడం కూడా ఉపాసనకొరకే. అందుచేత అక్షి-ఆదిత్యులలో పరమేశ్వరుడే చెప్పబడుచున్నాడు 20.

## సూ. భేదవ్యపదేశాచ్చాన్యః.1.1.21

## భాష్యమ్

అస్తి చాదిత్యాదిశరీరాభిమానిభ్యో జీవేభ్యః అన్యః ఈశ్వరో ఽన్తర్యామీ- "య ఆదిత్యే తిష్ఠన్ ఆదిత్యాదన్తరో యమాదిత్యో న వేద యస్యాదిత్యః శరీరం య ఆదిత్యమన్తరో యమయతి ఏష ఉ అన్తర్యామ్యమృతః" (బృ.ఉ.3.6.9) ఇతి శ్రుత్యన్తరే భేదవ్యపదేశాత్. తత్ర హి "ఆదిత్యాదన్తరో యమాదిత్యో న వేద" ఇతి వేదితురాదిత్యాద్విజ్ఞానాత్మనః అన్యోఽన్తర్యామీ స్పష్టం నిర్దిశ్యతే.

న ఏవేహాప్యన్తరాదిత్యే పురుషో భవితుమర్హతి, శ్రుతిసామాన్యాత్. తస్మాత్పరమేశ్వర ఏవేహోపదిశ్యత ఇతి సిద్ధమ్. 21.

బాలానందిని

భేదేతి:- ''భేదవ్యపదేశాత్ చ=భేదం చెప్పడంచేత కూడ, అన్యః- ఆదిత్యాద్యభిమాని జీవులకంటె ఈశ్వరుడు వేరు'' అని సూత్రార్థం.

అస్తీతి:- "య... అమృతః" (ఏ పురుషుడు ఆదిత్యునిలో ఉంటూ ఆదిత్యునికంటె లోపలగా ఉంటాడో, ఎవనిని ఆదిత్యుడు ఎరుగడో, ఎవనికి ఆదిత్యుడు శరీరమో, ఎవడు లోపల ఉండి ఆదిత్యుణ్ణి నియమిస్తాడో ఆ ఈ పురుషుడే నీ ఆత్మ, నీ అంతర్యామి; నాశరహితుడు) అను మరొక శ్రుతిలో భేదం చెప్పడంవల్ల అంతర్యామి అయిన ఈశ్వరుడు ఆదిత్యాదిశరీరాభిమానులైన జీవులకంటె అన్యుడు; ఆ శ్రుతిలో "ఆదిత్యాదన్తరో యమాదిత్యో న వేద" అని వేదిత, విజ్ఞానాత్మ అయిన ఆదిత్యునికంటె భిన్నుడైన అంతర్యామి స్పష్టంగా చెప్పబడుచున్నాడు. ఇక్కడ కూడా ఆదిత్యునిలో ఉన్న పురుషుడు ఆ ఈశ్వరుడే కావాలి. రెండు శ్రుతులు సమంగా ఉన్నాయి కదా? అందువల్ల ఇక్కడ పరమేశ్వరుడే చెప్పబడుచున్నా డని నిశ్చితం. 21.

## అన్తరధికరణం సమాప్తం

## ఆకాశాధికరణమ్. సూ. 22

## సూ. ఆకాశస్తల్లిఙ్గాత్. 1.1.22

ఇదమామనన్తి - "అస్య లోకస్య కా గతిరిత్యాకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే, ఆకాశం ప్రత్యస్తం యన్త్యాకాశో హ్యేవైభ్యో జ్యాయానాకాశః పరాయణమ్" (ఛాం.ఉ.1.9.1) ఇతి. తత్ర సంశయః - కిమాకాశశబ్దేన పరం బ్రహ్మాభిధీయతే ఉత భూతాకాశమితి. కుతః సంశయః? ఉభయత్ర ప్రయోగదర్శనాత్, భూతవిశేషే తావత్సుప్రసిద్ధో లోకవేదయోరాకాశశబ్దః. బ్రహ్మణ్యపి క్వచిత్ ప్రయుజ్యమానో దృశ్యతే, యత్ర వాక్యశేషవశాదసాధారణగుణశ్రవణాద్వా నిర్ధారితం బ్రహ్మ భవతి, యథా "యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" (తై.ఉ.2.7) ఇతి; "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ" (ఛా.ఉ.8.14.1) ఇతి చైవమాదౌ. అతః సంశయః. కిం పునరత్ర యుక్తమ్? భూతాకాశమితి. కుతః? తద్ధి ప్రసిద్ధతరేణ ప్రయోగేణ శీఘ్రం బుద్ధిమారోహతి. న చాయమాకాశశబ్దః

ఉభయోః సాధారణః శక్యో విజ్ఞాతుమ్, అనేకార్థత్వప్రసంగాత్. తస్మాద్బ్రహ్మణి గౌణ ఆకాశశబ్దో భవితుమర్హతి. విభుత్వాదిభిర్హి బహుభిర్ధర్మైః సదృశమాకాశేన బ్రహ్మ భవతి; న చ ముఖ్యసంభవే గౌణోఽర్థః గ్రహణమర్హతి, సంభవతి చేహ ముఖ్యస్యైవాకాశస్య గ్రహణమ్. నను భూతాకాశపరిగ్రహే వాక్యశేషో నోపపద్యతే- "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" ఇత్యాదిః. నైష దోషః. భూతాకాశస్యాపి వాయ్వాదిక్రమేణ కారణత్వోపపత్తేః విజ్ఞాయతే హి "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః" (తై.ఉ.2.1) ఇత్యాది. జ్యాయస్త్వపరాయణత్వేఽపి భూతాన్తరాపేక్షయోపద్యేతే భూతాకాశస్యాపి. తస్మాదాకాశ శబ్దేన భూతాకాశస్య గ్రహణమితి

## బాలానందిని

ఆకాశ ఇతి: - తల్లిఙ్గాత్ = బ్రహ్మ యొక్క లింగం (చిహ్నం) ఉండడంవల్ల, ఆకాశః = ఆకాశశబ్దం బ్రహ్మనే బోధిస్తుంది" అని సూత్రార్థం.

ఇదమితి:- "అస్య...పరాయణమ్" (ఈ లోకానికి గతి ఏది? ఆకాశం అని చెప్పాడు. ఈ భూతా లన్నీ ఆకాశంనుంచే పుడుతున్నాయి, ఆకాశంలోనే లీనం అవుతున్నాయి. వీటి అన్నింటికంటె ఆకాశమే గొప్పది కదా? ఆకాశమే పరమగమ్యం కదా) అని శ్రుతివాక్యం చదువుతున్నారు. అక్కడ ఆకాశశబ్దంచేత బ్రహ్మ చెప్పబడుచున్నదా లేక భూతాకాశం చెప్పబడుచున్నదా అని సంశయం. సంశయం ఎందువల్ల? రెండర్థాలలోను ప్రయోగం కనబడడంవల్ల. ఆకాశశబ్దం లోకంలోను, వేదంలోను కూడా ఒకానొక భూతం అనే అర్థంలో సుప్రసిద్ధ మైనది. ఎక్కడైతే వాక్యశేషాన్ని పట్టి గాని, ఏదైన అసాధారణమైన (బ్రహ్మకు మాత్రమే చెందే) గుణం వినబడడంవల్ల గాని బ్రహ్మ అని నిర్ధారణ చేయబడుతుందో అలాంటి కొన్ని చోట్ల, బ్రహ్మ అనే అర్థంలో కూడ "యదేష... స్యాత్" (ఆనందరూపమైన ఈ ఆకాశమే లేకపోతే), "ఆకాశో... బ్రహ్మ" (ఆకాశమే నామ రూపాలు సృజించినది. ఆ నామరూపాలు దేనికంటె భిన్నమైనవో అదే బ్రహ్మ" ఇత్యాది శ్రుతి వాక్యాలలో, ఈ శబ్దం బ్రహ్మ అనే అర్థంలో కూడ ప్రయోగించబడి నట్లు కనబడుచున్నది. (మొదటి వాక్యంలో ఆనన్దః అని విశిష్టమైన గుణం వినబడుతున్నది. రెండవ వాక్యం చివర 'తత్ బ్రహ్మ' అని ఉన్నది. ఈ రెండు కారణాలచేత ఆకాశశబ్దం బ్రహ్మవాచకం అని అర్థం). అందువల్లనే సంశయం. ఇక్కడ ఏది యుక్తం? భూతాకాశం అని చెప్పడం యుక్తం. ఎందువల్ల? చాలా ప్రసిద్ధమైన ప్రయోగంవల్ల అదే శీఘ్రంగా మన బుద్ధిలోనికి వస్తుంది కదా? ఈ ఆకాశశబ్దం భూతాకాశబ్రహ్మలు రెండింటికీ సాధారణమే (అ

రెండింటినీ సమంగానే బోధిస్తుంది) అనడానికి వీలు లేదు. అలా చెపితే ఒకే పదానికి అనేకార్థా లున్నా యని చెప్పిన ట్లవుతుంది. (ఒక పదానికి ఒకే అర్థం ఉండాలి కాని అనేకార్థాలు ఉండ కూడదు అని భావం). అందువల్ల ఆకాశశబ్దం బ్రహ్మ విషయంలో గౌణమే అవుతుంది. ముఖ్యార్థం గ్రహించడానికి వీలున్నప్పుడు గౌణార్థం గ్రహించడం యుక్తం కాదు. ఇక్కడ ముఖ్యమైన భూతాకాశాన్నే గ్రహించడం కుదురుతుంది. (ప్రశ్న) ముఖ్యార్థమైన భూతాకాశాన్ని గ్రహిస్తే "సర్వాణి... సముత్పద్యన్తే" అనే వాక్య శేషం కుదరదు కదా? (సమాధానం) - ఆ దోషం లేదు. వాయ్వాదిక్రమంచేత భూతాకాశం కూడ కారణం అని చెప్పడం కుదురుతుంది. "తస్మాద్వా... అగ్నిః" (ఈ ఆత్మ నుండి ఆకాశం పుట్టింది, ఆకాశం నుండి వాయువు పుట్టింది, వాయువు నుండి అగ్ని పుట్టింది) ఇత్యాదివాక్యం వినబడుచున్నది కదా? ఇతరభూతాలతో పోలిస్తే భూతాకాశం చాలా పెద్దది, అదే పరమగమ్యం అని చెప్పడం కూడా కుదురుతుంది. అందువల్ల ఆకాశ శబ్దం చేత భూతాకాశమే గ్రహించబడుతుంది.

వి. వెనుకటి అధికరణంలో పాపాస్పర్శిత్వం మొదలైన ప్రబలాలైన లింగాలను పట్టి రూపవత్త్వం మొదలైన దుర్బలలింగాలు మరొక విధంగా అన్వయించబడ్డాయి. ఇక్కడ 'ఆకాశ' పదమే వినబడుతున్నది. ఇది లింగంకంటె బలవత్తరమైనది గాన ఆకాశశబ్దానికి ప్రసిద్ధమైన భూతాకాశార్థమే చెప్పడం యుక్తం. (శ్రుతి లింగంకంటె బలవత్తరం అని మీమాంసకసంప్రదాయం) అని దీనికి వెనుకటి అధికరణంతో ప్రత్యుదాహరణ సంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- ఆకాశస్తల్లిఙ్గాత్. ఆకాశశబ్దేన బ్రహ్మణో గ్రహణం యుక్తమ్. కుతః? తల్లిఙ్గాత్. పరస్య హి బ్రహ్మణః ఇహ లిఙ్గమ్- "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" ఇతి. పరస్మాద్ధి బ్రహ్మణో భూతానాముత్పత్తిరితి వేదాన్తేషు మర్యాదా. నను భూతాకాశస్యాపి వాయ్వాదిక్రమేణ కారణత్వం దర్శితమ్? సత్యం దర్శితమ్. తథాపి మూలకారణస్య బ్రహ్మణో పరిగ్రహాదాకాశాదేవేత్యవధారణం, సర్వాణీతి చ భూతవిశేషణం చానుకూలం స్యాత్. తథా "ఆకాశం ప్రత్యస్తం యన్తి" ఇతి బ్రహ్మలిఙ్గమ్, "ఆకాశో హ్యేవైభ్యో జ్యాయానాకాశః పరాయణమ్" ఇతి చ జ్యాయస్త్వపరాయణత్వే. జ్యాయస్త్వంహ్యానాపేక్షికం పరమాత్మన్యే వైకస్మిన్నామ్నాతమ్- "జ్యాయాన్ పృథివ్యా జ్యాయానన్తరిక్షా జ్జ్యాయాన్ దివో జ్యాయానేభ్యో లోకేభ్యః" (ఛా.ఉ.3.14.3) ఇతి. తథా పరాయణత్వమపి పరమకారణత్వాత్పరమాత్మన్యేవోపపన్నతరమ్. శ్రుతిశ్చ భవతి-"విజ్ఞాన

మానన్దం బ్రహ్మ రాతేర్దాతుః పరాయణమ్" (బృ.ఉ.3.9.28) ఇతి. అపి చాన్తవత్త్వదోషేణ శాలావత్యస్య పక్షం నిన్దిత్వానన్తం కించిద్వక్తుకామేన జైవలినాకాశః పరిగృహీతః. తం చాకాశముద్గీథే సంపాద్యోపసంహరతి- "స ఏష పరోపరీయానుద్గీథః స ఏషోఽనన్తః" (ఛా.ఉ.1.9.2) ఇతి. తచ్చానన్త్యం బ్రహ్మలిఙ్గమ్.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా ప్రాప్తించగా చెపుతున్నాం - ఆకాశస్తల్లిఙ్గాత్. ఆకాశశబ్దంచేత బ్రహ్మను గ్రహించడమే యుక్తం. ఎందువల్ల? దాని లింగం ఉండడంవల్ల "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" అనేది పరబ్రహ్మయొక్క లింగం కదా? భూతా లన్నీ పరబ్రహ్మనుండే పుట్టా యని వేదాంతమర్యాద కదా? (ప్రశ్న) భూతాకాశం కూడా వాయ్వాదిక్రమంచేత కారణం అని చెప్పవచ్చును అని చూపబడింది కదా? (సమాధానం) - నిజమే; చూపబడింది. అయినా కూడ మూలకారణ మైన పరబ్రహ్మను గ్రహించని పక్షంలో "ఆకాశం నుండే' ' (ఆకాశాదేవ) అనే అవధారణం (నిశ్చయం) 'సర్వాణి' అని భూత విశేషణమూ అనుకూలంగా ఉండవు. అట్లే "ఆకాశం ప్రత్యస్తం యన్తి" అనేది, "ఆకాశో హ్యేవేభ్యో జ్యాయానాకాశః పరాయణమ్" అని చెప్పిన జ్యాయస్త్వ-పరాయణత్వాలూ కూడ బ్రహ్మకు లింగాలు. "జ్యాయాన్.. లోకేభ్యః" (పృథివికంటె పెద్దవాడు, అంతరిక్షం కంటె పెద్దవాడు, ద్యులోకంకంటె పెద్దవాడు, ఈ అన్ని లోకాలకంటె పెద్దవాడు) అని అనాపేక్షికమైన (ఇంతకంటె పెద్దది లేదు అని చెప్పగలిగిన జ్యాయస్త్వం ఒక్క పరమాత్మయందే చెప్పబడింది. పరమాత్మ పరమకారణం గాన పరాయణత్వం కూడా పరమాత్మయందే ఎక్కువ ఉపపన్నంగా ఉంటుంది. "విజ్ఞాన... పరాయణమ్" (విజ్ఞానరూపము, ఆనందరూపమూ అయిన బ్రహ్మ ధనదాతకు పరాయణము. రాతేః కి బదులు రాతిః అనే పాఠం ఉంది. రాతిః అనగా బంధువు అని అర్థం) అని శ్రుతి. కూడ ఉన్నది. మరొక విషయ మేమనగా శాలావంతుని పక్షంలో అంతవత్త్వం అనే దోషం ఉన్న దని దానిని నిందించి అనంతమైన ఒకానొకదానిని చెప్పవలె ననే ఉద్దేశ్యంతో జైవలి ఆకాశాన్ని గ్రహించాడు. ఆ ఆకాశాన్ని ఉద్గీథంలో సంపాదించి - "స ఏష.. అనన్తః" (ఈ ఉద్గీథం అత్యుత్తమమైనది, పరమైనవాటిలో గొప్పది) అని ఉపసంహరించాడు. ఆ ఆనంత్యం బ్రహ్మ యొక్క లింగం.

వి. దాల్భ్యుడు శాలావత్యుడు అను ఇద్దరు బ్రాహ్మణులు, జైవలి అనే రాజు- వీరు ముగ్గురూ ఉద్గీథవిద్యలో ప్రవీణులు. ఉద్గీథానికి పరాయణం ఏది అని

వీరు విచారణ చేశారు. ఉద్గీథానికి స్వర్గం పరాయణం అని దాల్భ్యుడు చెప్పగా ఆ స్వర్గంలో అప్రతిష్ఠాదోషం ఉంది; తనంతట తాను నిలచే శక్తి దానికి లేదు అని ఆ పక్షాన్ని ఖండించి కర్మ ద్వారా స్వర్గాన్ని నిలపగలిగినది ఈ లోకమే అని శలావత్యు డన్నాడు. అప్పుడు జైవలి శాలావత్యుడు చెప్పిన సామ అన్తం కలది అని అతని పక్షాన్ని నిరాకరించి అనంతమైన ఆకాశాన్నిగూర్చి చెప్పాడు. చెప్పిన ఈ ఆకాశం భూతాకాశమే అయితే అంతవత్త్వదోషం అలాగే ఉండిపోతుంది. భూతాకాశం కూడా నశించేదే కదా? అందుచేత "ఉద్గీథమే ఆకాశం" అని ఉద్గీథం మీద ఆకాశత్వాన్ని ఆరోపించి ఈ సంపదుపాసనను "సేష" ఇత్యాది వాక్యంలో ఉపసంహరించాడు. ఉద్గీథం అనగా సామలోని ఒక భక్తి- ఒక విభాగం. దానిలో ఓంకారం కూడా ఉన్నది. అందుచేత ఓంకారానికి కూడా ఉద్గీథం అని పేరు. శ్రుతికి అర్థం ఇది - సః ఉద్గీథానికి అవయవమైన ఓంకారమే, ఏషః ఈ ఆకాశం. పరః రసతమత్వం మొదలైన గుణాలచేత ఉత్కృష్టమైనది. వరీయాన్ = ఇతరాక్షరాలకంటె గొప్పది.

## భాష్యమ్

యత్పునరుక్తం భూతాకాశం ప్రసిద్ధిబలేన ప్రథమతరం ప్రతీయతే ఇతి, అత్ర బ్రూమః- ప్రథమతరం ప్రతీతమపి సత్ వాక్యశేషగతాన్ బ్రహ్మగుణాన్ దృష్ట్వా న పరిగృహ్యతే. దర్శితశ్చ బ్రహ్మణ్యప్యాకాశశబ్దః- "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా" ఇత్యాదౌ. తథా ఆకాశపర్యాయవాచినామపి బ్రహ్మణి ప్రయోగో దృశ్యతే- "ఋచో అక్షరే పరమే వ్యోమన్, యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః" (ఋ.సం. 1.164.39), "సైషా భార్గవీ వారుణీ విద్యా, పరమే వ్యోమమ్ ప్రతిష్ఠితా" (తై.ఉ.3.6), "ఓం కం బ్రహ్మ ఖం బ్రహ్మ" (ఛా.ఉ.4.10.5), "ఖం పురాణమ్" (బృ.ఉ.5.1.) ఇతి చైవమాదౌ. వాక్యోపక్రమే ऽపి వర్తమానస్యా కాశశబ్దస్య వాక్యశేషవశాద్యుక్తా బ్రహ్మ విషయత్వావధారణా "అగ్నిరధీతే ऽను వాకమ్" ఇతి హి వాక్యోపక్రమగతో ऽప్యగ్నిశబ్దః మాణవకవిషయో దృశ్యతే, తస్మాదాకాశశబ్దం బ్రహ్మేతి సిద్ధమ్. 22.

## బాలానందిని

యదితి:- ప్రసిద్ధిబలంచేత ఆకాశం అనగానే భూతాకాశం స్ఫురిస్తుంది అని మీరన్నదానిని గూర్చి చెపుతున్నాం- ముందుగా స్ఫురించినా కూడ ఆ అర్థం వాక్యశేషంలో ఉన్న బ్రహ్మగుణాలను చూడానే గ్రహించబడదు. "ఆకాశో వై

నామనామరూపయోర్నిర్వహితా'' ఇత్యాదులలో ఆకాశ శబ్దం బ్రహ్మ అనే అర్థంలో ఉపయోగించబడి నట్లు పైన చూపబడింది. అట్లే ''ఋచో అక్షరే.. నిషేదుః'' (కూటస్థమైన, పరమమైన ఆకాశం మీద వేదాలు ఉన్నాయి; అక్షరమైన ఏ వ్యోమమందు విశ్వేదేవతలు ఉన్నారో), ''సైషా... ప్రతిష్ఠితా'', ''ఓం కం బ్రహ్మ ఖం బ్రహ్మ'', ''ఖం పురాణమ్'' ఇత్యాది శ్రుతులలో ఆకాశపదమే కాకుండా ఆకాశపర్యాయాలైన వ్యోమన్, ఖమ్ ఇత్యాదిపదాలు కూడ బ్రహ్మార్థంలో ప్రయోగించబడ్డాయి. వాక్యోపక్రమంలో ఉన్నా కూడ ఆకాశశబ్దానికి వాక్యశేషాన్ని పట్టి బ్రహ్మవాచకత్వాన్ని నిర్ణయించడం యుక్తం. ''అగ్నిరధీతే ऽనువాకమ్''. అనే వాక్యం ప్రారంభంలో ఉన్నా అగ్నిశబ్దం పిల్లవాడు అనే అర్థమే బోధించడం కనబడుతున్నది. (ఇక్కడ 'అగ్ని' శబ్దం అగ్నివంటి తేజస్సు గల వటువు విషయంలో గౌణంగా ప్రయోగించబడింది). అందువల్ల ఆకాశశబ్దం గలది (ఆకాశశబ్దంచేత ప్రతిపాదించబడేది) బ్రహ్మయే అని నిశ్చితమైనది.

**ఆకాశాధికరణం సమాప్తం**

## 9. ప్రాణాధికరణమ్. సూ. 23.

## సూ. అత ఏవ ప్రాణః 1.1.23.

ఉద్గీథే - "ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావమన్వాయత్తా" ఇత్యుపక్రమ్య శ్రూయతే- "కతమా సా దేవతేతి, ప్రాణ ఇతి హోవాచ, సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశన్తి, ప్రాణమభ్యుజ్జిహతే, సైషా దేవతా ప్రస్తావమన్వాయత్తా" (ఛా.ఉ.1.11.4,5) ఇతి. తత్ర సంశయనిర్ణయౌ పూర్వవదేవ ద్రష్టవ్యౌ. "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" (ఛా.ఉ.6.8.2), "ప్రాణస్య ప్రాణమ్" (బృ.ఉ.4.4.18) ఇతి చైవమాదౌ బ్రహ్మవిషయః ప్రాణశబ్దో దృశ్యతే, వాయువికారే తు ప్రసిద్ధో లోకవేదయోః. అత ఇహ ప్రాణశబ్దేన కతరస్యోపాదానం యుక్తమితి భవతి సంశయః. కిం పునరత్ర యుక్తమ్? వాయు వికారస్య ప్రాణవృత్తేః ప్రాణస్యోపాదానం యుక్తమ్. తత్ర హి ప్రసిద్ధతరః ప్రాణశబ్దః ఇత్యవోచామ. నను పూర్వవదిహాపి తల్లిఙ్గాద్బ్రహ్మణ ఏవ గ్రహణం యుక్తమ్; ఇహాపి వాక్యశేషే భూతానాం సంవేశనోద్గమనం పారమేశ్వరం కర్మ ప్రతీయతే. న. ముఖ్యేऽపి ప్రాణే భూతసంవేశనోద్గమనస్య దర్శనాత్. ఏవం హ్యామ్నాయతే- "యదా వై పురుషః స్వపితి ప్రాణం తర్హి వాగప్యేతి, ప్రాణం చక్షుః, ప్రాణం శ్రోత్రం, ప్రాణం మనః, స యదా ప్రబుధ్యతే ప్రాణాదేవాధిపునర్జాయన్తే" (శ.బ్రా.10.3.3.6.) ఇతి. ప్రత్యక్షం చైతత్ స్వాపకాలే ప్రాణవృత్తావపరిలుప్యమానాయామిన్ద్రియవృత్తయః పరిలుప్యన్తే, ప్రబోధకాలే చ ప్రాదుర్భవన్తీతి. ఇన్ద్రియసారత్వాచ్చ భూతానామవిరుద్ధో ముఖ్యే ప్రాణేऽపి

భూతసంవేశోద్గమనవాదీ వాక్యశేషః. అపి చాదిత్యోఽన్నం చోద్గీథ ప్రతిహారయోర్దేవతే ప్రస్తావదేవతాయాః ప్రాణస్యానన్తరం నిర్దిశ్యేతే. న చ తయోర్బ్రహ్మత్వమస్తి; తత్సామాన్యాచ్చ ప్రాణస్యాపి న బ్రహ్మత్వమితి.

## బాలానందిని

**అత ఏవేతి:-** "అత ఏవ=బ్రహ్మలింగం వల్లనే, ప్రాణః 'ప్రాణం' బ్రహ్మ అని గ్రహించాలి" అని సూత్రార్థం.

**ఉద్గీథే ఇతి:-** ఉద్గీథ ప్రకరణంలో "ప్రస్తోతః... అన్వాయత్తా" అని ప్రారంభించి "కతమా... అన్వాయత్తా" (ఆ దేవత ఏది? ప్రాణము అని చెప్పాడు. ఈ భూతా లన్నీ ప్రాణంలోనే లీనం అవుతున్నాయి, ప్రాణంనుండి పైకి వస్తున్నాయి. అట్టి ఈ దేవత ప్రస్తావాన్ని సంబంధించి ఉన్నది) అని వినబడుచున్నది. అక్కడ సంశయ నిర్ణయాలు వెనుకటి అధికరణంలో వలెనే చూచుకొన దగినవి.

వి. చాక్రాయణు డనే ఋషి ప్రస్తోతతో- ఓ! ప్రస్తోతా! ప్రస్తావం అనే సామభక్తికి ఏ దేవత సంబంధించి ఉన్నదో, ఏ దేవతను ధ్యానించాలో, ఆ దేవత ఎవరో తెలియకుండా నా ముందు ప్రస్తావం (సామభక్తిపఠనం) చేస్తే నీ శిరస్సు పడిపోతుంది అన్నాడు. అప్పుడు ప్రస్తోత భయపడి ఆ దేవత ఏది అని ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా "ప్రాణ ఇతి" ఇత్యాదికం చెప్పబడింది. సంశయ నిర్ణయాలు వెనుకటి అధికరణంలో వలెనే. అందుచేత దానితో ఈ అధికరణానికి అతిదేశసంగతి. సంశయనిర్ణయాలను వివరిస్తున్నాడు-

**ప్రాణేతి:-** "ప్రాణం... మనః" (సౌమ్యుడా! మనస్సు (మన ఉపాధికుడైన జీవుడు) ప్రాణమే బంధనంగా కలది (వాడు), అనగా సుషుప్తిలో బ్రహ్మతో ఏకీభావం పొందుతాడు. "ప్రాణస్య ప్రాణమ్" ప్రాణవాయువును కూడా ప్రేరేపించేది ఇత్యాదివాక్యాలలో ప్రాణశబ్దం బ్రహ్మవిషయంగా, బ్రహ్మ అనే అర్థం కలదిగా కనబడుచున్నది. వాయువికారమైన శరీరాంతర్గత ప్రాణం అనే అర్థంలో ఇది లోకంలోను వేదంలోను కూడా ప్రసిద్ధంగా ఉంది. అందువల్ల ఇక్కడ ప్రాణశబ్దంచేత దేనిని గ్రహించడం యుక్తంగా ఉంటుంది అని సంశయం. ఐతే ఇక్కడ ఏది యుక్తం? వాయువికారమై, ఐదు విధాలుగా (ప్రాణాపానవ్యానోదానసమానాల రూపంలో) శరీరంలో ఉండే వాయువును గ్రహించడం యుక్తం. ఆ అర్థంలో ప్రాణశబ్దానికి ఎక్కువ ప్రసిద్ధి ఉన్నది అని చెప్పాం. (ప్రశ్న)- ఇక్కడ కూడ వాక్యశేషంలో భూతాలు లీనమౌతున్నట్లు, బైటకు వస్తున్నట్లు పరమేశ్వరుని యందు జరిగే కర్మ

తెలియబడుచున్నది గాన పూర్వాధికరణంలో వలెనే ఇక్కడ కూడా బ్రహ్మలింగం ఉండడంవల్ల బ్రహ్మనే గ్రహించడం యుక్తం కదా? (సమాధానం)- కాదు. ముఖ్యమైన ప్రాణంలో కూడ భూతాల సంవేశనోద్గమనాలు వినబడుతున్నాయి కదా? "యదా.. జాయన్తే" (పురుషుడు నిద్రపోయినప్పుడు వాక్కు ప్రాణంలో లీనం అవుతుంది. నేత్రం ప్రాణంలో లీనం అవుతుంది, చెవి ప్రాణంలో లీనం అవుతుంది, మనస్సు ప్రాణంలో లీనం అవుతుంది. అతడు మేల్కొన్నప్పుడు ఇవన్నీ ప్రాంణంనుంచే మళ్లీ బైటకు వస్తాయి) అని పఠించబడుచున్నది. ఈ విషయం ప్రత్యక్షంగా చూడవచ్చు.- నిద్రాసమయంలో ప్రాణవృత్తి లోపించకుండానే ఉండగా ఇంద్రియవృత్తులు అణగిపోతున్నాయి. మేల్కొన్న సమయంలో అవి మళ్లీ ఆవిర్భవిస్తున్నాయి.

అవ. ఇంద్రియాల సంవేశనోద్గమనాలు చెప్పబడ్డాయి కాని భూతాల సంవేశనోద్గమనాలు చెప్పబడలేదు కదా అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు—

ఇన్ద్రియేతి:- భూతాలు ఇంద్రియాలే సారంగా గలవి అవడంచేత ముఖ్య ప్రాణంలో భూతాల సంవేశనోద్గమనాలను చెప్పే వాక్యశేషం విరుద్ధం కాదు. అనగా - ఇంద్రియాలు భూతాల సారం గాన ఇంద్రియాలు లయోద్గమనాలు పొందుతాయి అని చెప్పినపుడు భూతాలు పొంది నట్లే అని భావం. మరొక విషయ మేమనగా- ప్రస్తావ దేవతయైన ప్రాణాన్ని చెప్పిన తరవాత ఉద్గీథానికి దేవతయైన ఆదిత్యుడు, ప్రతిహారానికి దేవతయైన అన్నమూ చెప్పబడుతున్నాయి. అవి రెండూ బ్రహ్మ కావు. వాటితో సామ్యంవల్ల (ఇది కూడ వాటి వంటిదే గాన) ప్రాణానికి కూడ బ్రహ్మత్వం లేదు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే సూత్రకార ఆహ:- "అత ఏవ ప్రాణః" ఇతి. "తల్లిఙ్గాత్" ఇతి పూర్వసూత్రే నిర్దిష్టమ్. అత ఏవ తల్లిఙ్గాత్ ప్రాణశబ్దమపి పరం బ్రహ్మ భవితుమర్హతి. ప్రాణస్యాపి హి బ్రహ్మలిఙ్గసంబన్ధః శ్రూయతే- "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశన్తి ప్రాణమ భ్యుజ్జిహతే" (చా.1.11.5) ఇతి ప్రాణనిమిత్తౌ సర్వేషాం భూతానాముత్పత్తిప్రలయావుచ్యమానౌ ప్రాణస్య బ్రహ్మతాం గమయతః. ననూక్తం ముఖ్యప్రాణపరిగ్రహే ఽపి సంవేశనోద్గమనదర్శనమవిరుద్ధం స్వాప ప్రబోధయోర్దర్శనాదితి. అత్రోచ్యతే- స్వాపప్రబోధయోరిన్ద్రియాణామేవ కేవలానాం ప్రాణాశ్రయం సంవేశనోద్గ

మనం దృశ్యతే న సర్వేషాం భూతానామ్; ఇహ తు సేన్ద్రియాణాం, సశరీరాణాం జీవావిష్టానాం భూతానాం "సర్వాణి హ వా ఇమాని భూతాని" ఇతి శ్రుతేః. యదాపి భూతశ్రుతిర్మహాభూతవిషయా పరిగృహ్యతే తదాపి బ్రహ్మలిఙ్గత్వమవిరుద్ధమ్. నను నహ్యపి విషయైన్ద్రియాణాం స్వాపప్రబోధయోః ప్రాణేఽ ప్యయం ప్రాణాచ్చ ప్రభవం శృణుమః- "యదా సుప్తః స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి, తదైనం వాక్సర్వైర్నామభిః సహాప్యేతి" (కౌషీ.3.3.) ఇతి. తత్రాపి తల్లిఙ్గాత్ప్రాణశబ్దం బ్రహ్మైవ. యత్పునరన్నాదిత్యసంనిధానాత్ ప్రాణస్యాబ్రహ్మత్వమితి, తదయుక్తమ్. వాక్యశేషబలేన ప్రాణశబ్దస్య బ్రహ్మవిషయతాయాం ప్రతీయమానాయాం సంనిధానస్యాకించిత్కరత్వాత్. యత్పునః ప్రాణశబ్దస్య పఞ్చవృత్తౌ ప్రసిద్ధతరత్వమ్, తదాకాశశబ్దస్యేవ ప్రతివిధేయమ్. తస్మాత్సిద్ధం ప్రస్తావదేవతాయాః ప్రాణస్య బ్రహ్మత్వమ్.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా ప్రాప్తించగా "అత ఏవ ప్రాణః" అని సూత్రం చెపుతున్నాడు. పూర్వసూత్రంలో "తల్లిఙ్గాత్" అని చెప్పబడింది. అత ఏవ=ఆ బ్రహ్మయొక్క లింగంవల్ల పరబ్రహ్మయే ప్రాణశబ్దవాచ్యం అవుటకు తగినది. ప్రాణానికి కూడా "సర్వాణి... అభ్యుజ్జిహతే" అని బ్రహ్మలింగంతో సంబంధం వినబడుచున్నది కదా? సమస్తభూతాల ఉత్పత్తిప్రళయాలు ప్రాణమువలననే కలుగుచున్నట్లుగా చెప్పబడుచున్నాయి గాన అవి ప్రాణం బ్రహ్మయే అని తెలుపుతున్నాయి. (ప్రశ్న) సంవేశోద్గమనాలు నిద్రా జాగ్రదవస్థలలో కనబడడంవల్ల (శ్రుతిలో) సంవేశనోద్గమానాల దర్శనం (చెప్పడం) ముఖ్యప్రాణాన్ని గ్రహించినా విరుద్ధం కాదని చెప్పబడింది కదా? ఇక్కడ (సమాధానం) చెప్పబడుచున్నది- స్వాపప్రబోధావస్థలలో ప్రాణాలను ఆశ్రయంగా చేసికొని కేవలం ఇంద్రియాల సంవేశనోద్గమనాలు జరుగుతాయి గాని సమస్తభూతాల సంవేశనోద్గమనాలు జరగవు. ఇక్కడైతే "సర్వాణి హ వా ఇమాని భూతాని" అను శ్రుతిచేత ఇంద్రియాలతో, శరీరాలతో సహా జీవునిచే ఆశ్రయించబడిన సకలప్రాణుల సంవేశనోద్గమానాలు చెప్పబడుతున్నాయి. "సర్వాణి భూతాని" అన్నప్పుడు భూతశబ్దానికి అన్ని ప్రాణులు అని అర్థం చెప్పకుండా, పంచమహాభూతాలు అని అర్థం చెప్పినా కూడ అది బ్రహ్మలింగం అని చెప్పడంలో విరోధం ఏదీ లేదు.

(అనగా పంచమహాభూతాల సంవేశనోద్గమనాలు కేవలం బ్రహ్మయందే జరుగుతాయి కాని ముఖ్యప్రాణంలో జరగవు కదా అని అర్థం.) (ఆశంక) "యదా... అప్యేతి" (నిద్రపోయినవాడు ఏ సమయంలో స్వప్నం చూడడో అప్పుడు అతడు ఈ ప్రాణంతోనే ఒక్కటైపోతాడు, అప్పుడు సమస్తమైన పేర్లతో కూడా వాక్కు ఇతనిలో లీనం అయిపోతుంది) అనే (మరొక) శ్రుతియందు స్వాపప్రబోధ సమయాలలో ఇంద్రియాలు విషయాలతో సహా ముఖ్యప్రాణంలో లీనమైపోతా యనీ, దాని నుంచే బైటకు వస్తా యనీ వింటున్నాం కదా? (సమాధానం) ఆ శ్రుతిలో కూడ బ్రహ్మలింగం ఉండడంవల్ల బ్రహ్మయే ప్రాణశబ్దవాచ్యం. (అనగా ముఖ్యప్రాణంలో జీవుడు లీనం అవడం అనేది కుదరదు, అందుచేత నిద్రపోతున్న జీవుడు ఏ ప్రాణంలో లీను డవుతాడో ఆ ప్రాణం బ్రహ్మ అనియే చెప్పాలి కాని ముఖ్య ప్రాణం అని చెప్పకూడదు అని అర్థం). దగ్గరనే అన్నం ఆదిత్యుడు చెప్పబడడంవల్ల ప్రాణం కూడ బ్రహ్మ కాజాలదు అని (పూర్వపక్షి) చెప్పినది యుక్తం కాదు. ఎందువల్లననగా- వాక్యశేషబలాన్ని బట్టి ప్రాణశబ్దానికి బ్రహ్మ అని అర్థం అని నిశ్చితంగా తెలుస్తున్నప్పుడు సంనిధానంవల్ల ప్రయోజనం ఏదీ ఉండదు. (అనగా అన్నాదిత్యసంనిధానాన్ని పట్టి ప్రాణం బ్రహ్మ కాదు అని చెప్పడానికి అది బలమైన ప్రమాణం కాదు అని అర్థం). ప్రాణశబ్దానికి ప్రాణాపానాదిపంచవిధ ప్రాణం అనే అర్థంలో ఎక్కువ ప్రసిద్ధి ఉంది అని (పూర్వ పక్షి) చెప్పినదానికి ఆకాశం విషయంలో వెనుకటి అధికరణంలో ఏ సమాధానం చెప్పబడిందో అదే వర్తిస్తుంది. అందువల్ల ప్రస్తావదేవతయైన ప్రాణం బ్రహ్మయే అని నిశ్చిత మైనది.

## భాష్యమ్

అత్ర కేచిదుదాహరన్తి- "ప్రాణస్య ప్రాణమ్" "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" ఇతి చ.తదయుక్తమ్. శబ్దభేదాత్ప్రకరణాచ్చ సంశయానుపపత్తేః. యథా 'పితుః పితా' ఇతి ప్రయోగే అన్యః పితా షష్ఠీనిర్దిష్టః, అన్యః ప్రథమానిర్దిష్టః పితుః పితేతి గమ్యతే తద్వత్ ప్రాణస్య ప్రాణమ్ ఇతి శబ్దభేదాత్ ప్రసిద్ధాత్ప్రాణాదన్యః ప్రాణస్య ప్రాణమితి నిశ్చీయతే. న హి స ఏవ తస్యేతి భేదనిర్దేశార్హో భవతి. యస్య చ ప్రకరణే యో నిర్దశ్యతే నామాన్తరేణాపి స ఏవ తత్ర ప్రకరణనిర్దిష్ట ఇతి గమ్యతే. యథా జ్యోతిష్టోమాధికారే- "వసన్తే వసన్తే జ్యోతిషా యజేత" ఇత్యత్ర జ్యోతిఃశబ్దో జ్యోతిష్టోమవిషయో భవతి తథా బ్రహ్మణః ప్రకరణే "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" ఇతి శ్రుతః ప్రాణశబ్దో

వాయువికారమాత్రం కథముపగమయేత్? అతః సంశయా విషయత్వాన్నైతదుదాహరణం యుక్తమ్. ప్రస్తావదేవతాయాం తు ప్రాణే సంశయపూర్వపక్షనిర్ణయా ఉపపాదితాః 23.

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ కొందరు (పైన ఉదాహరించిన వాక్యానికి బదులు) "ప్రాణస్య ప్రాణమ్" (ప్రాణానికి ప్రాణం), "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" (సౌమ్యుడా! మనస్సు ఉపాధిగా గల జీవుడు సుషుప్తిలో ప్రాణంతో ఐక్యం పొందుతాడు) అను వాక్యాలను ఉదాహరణవాక్యాలుగా చూపారు. అది యుక్తం కాదు శబ్దభేదం ఉండడంవల్ల ప్రకరణంవల్లా కూడ సంశయానికే తావు లేదు కదా? "పితుః పితా" (తండ్రి తండ్రి) అన్నప్పుడు 'పితుః అని షష్ఠీవిభక్త్యంతపదంచేత నిర్దేశింపబడిన తండ్రి వేరు, ప్రథమావిభక్తిచేత నిర్దేశించబడిన తండ్రియొుక్క తండ్రి వేరు అని స్పష్టంగా ఎలా తెలుస్తున్నదో అట్లే "ప్రాణానికి ప్రాణం" అన్నప్పుడు శబ్దభేదంవల్ల ప్రసిద్ధమైన ప్రాణంకంటె అన్యమైనది ప్రాణానికి ప్రాణం అని నిశ్చయింపబడుతుంది. ఒకే వస్తువును లేదా వ్యక్తిని 'దానియొక్క అది' అని వేరుగా నిర్దేశించడం కుదరదు కదా? (ఈ విధంగా షష్ఠ్యంతనిర్దిష్టప్రాణం వేరు ప్రథమాంతనిర్దిష్టప్రాణం వేరు అని స్పష్టంగా తెలియడంచేత ప్రథమానిర్దిష్టం పరమాత్మ అనీ, షష్ఠీనిర్దిష్టం ముఖ్యప్రాణం అనీ గ్రహించవచ్చును, అందుచేత సంశయానికి తావు లేదని భావం). రెండవ వాక్యంలో ప్రకరణాన్ని పట్టి ప్రాణం బ్రహ్మయే అని తెలుస్తూన్న దని చెపుతున్నారు.- ఒకదానిని దాని ప్రకరణంలో మరొక పేరుతో పేర్కొన్నా కూడ ఆ ప్రకరణంలో అదే నిర్దేశించబడిం దని తెలుస్తుంది. జ్యోతిష్టోమయాగాన్ని గూర్చి చెప్పే ప్రకరణంలో 'వసన్తే...యజేత" (ప్రతి వసంతంలోను జ్యోతిస్సుచేత యాగం చెయ్యాలి) అని చెప్పి నప్పుడు (జ్యోతిష్టోమశబ్దానికి బదులు ఉపయోగించినా కూడ) జ్యోతిఃశబ్దానికి జ్యోతిష్టోమ మనే అర్థం స్పష్టంగా తెలుస్తుంది. అట్లే పరబ్రహ్మ ప్రకరణంలో ఉన్న "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" అనే వాక్యంలోని ప్రాణశబ్దం వాయు వికారమైన (శరీరస్థ) ప్రాణాన్ని ఎలా బోధిస్తుంది? అందుచేత ఈ వాక్యాలలో సంశయానికి అవకాశం లేదు గాన ఈ అధికరణానికి ఈ వాక్యాలు ఉదాహరణగా చూపడం యుక్తం కాదు. ప్రస్తావదేవతయైన ప్రాణం విషయంలో నైతే సంశయ-పూర్వపక్ష-నిర్ణయాలు పైన సమర్థించబడ్డాయి. 23.

ప్రాణాధికరణం సమాప్తం.

## 10.జోతిశ్చరణాధికరణమ్. సూ. 24-27

### సూ. జ్యోతిశ్చరణాభిధానాత్. 1.1.24

ఇదమామనన్తి- "అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషూత్తమేషు లోకేషు ఇదం వా వ తద్యదిదమస్తః పురుషే జ్యోతిః' (ఛా.ఉ.3.17.7) ఇతి. తత్ర సంశయః కిమిహ జ్యోతిఃశబ్దేన ఆదిత్యాది జోతిరభిధీయతే కిం వా పర ఆత్మేతి. అర్థాన్తరవిషయస్యాపి శబ్దస్య లిఙ్గాత్ బ్రహ్మవిషయత్వముక్తమ్. ఇహ తు తల్లిఙ్గమేవ అస్తి నాస్తీతి విచార్యతే. కిం తావత్ప్రాప్తమ్? ఆదిత్యాదికమేవ జ్యోతిఃశబ్దేన పరిగృహ్యేత ఇతి. కుతః? ప్రసిద్ధేః. తమో జ్యోతిరితి హీమౌ శబ్దౌ పరస్పరప్రతిద్వన్ద్వివిషయౌ ప్రసిద్ధౌ. చక్షుర్వృత్తేర్నిరోధకం శార్వరాదికం తమ ఉచ్యతే; తస్యాఏవానుగ్రాహక మాదిత్యాదికం జ్యోతిః, తథా దీప్యతే ఇతీయమపి శ్రుతిః ఆదిత్యాదివిషయా ప్రసిద్ధా. న హి నామరూపాదిహీనం బ్రహ్మ దీప్యత ఇతి ముఖ్యాం శ్రుతిమర్హతి. ద్యుమర్యాదత్వశ్రుతేశ్చ. న హి చరాచరబీజస్య బ్రహ్మణః సర్వాత్మకస్య ద్యౌర్మర్యాదా యుక్తా. కార్యస్య తు జ్యోతిషః పరిచ్ఛిన్నస్య ద్యౌర్మర్యాదా స్యాత్. "పరో దివో జ్యోతిః" ఇతి చ బ్రాహ్మణమ్.

బాలానందిని

జ్యోతిరితి:- "చరణాభిధానాత్ = పాదాలను చెప్పడంవల్ల జ్యోతిః= జ్యోతిఃశబ్దం బ్రహ్మవాచకం" అని సూత్రార్థం.

ఇదమితి: (ఛాంధోగ్యంలో) "అథ... జ్యోతిః" అని పఠిస్తున్నారు. (ఈ ద్యులోకానికి పైన, సమస్త ప్రాణులకు పైన, సమస్తమైన భూరాదిలోకాల పైన, అనుత్తమములైన, అనగా వేటికంటె ఉత్తమమైనవి ఏవీ లేవో అలాంటి, లోకాలలో, ఉత్తమలోకాలలో ఏ జ్యోతిస్సు ప్రకాశిస్తూన్నదో, అదే ఈ ప్రాణుల జఠరంలో ఉన్న తేజస్సు" అని ఈ వాక్యానికి అర్థం. (జఠరంలో ఉన్న తేజస్సును ద్యులోకాదులపైన కూడ ప్రకాశిస్తూన్న తేజస్సునుగా భావించి ఉపాసన చేయవలె నని ఈ వాక్యం బోధిస్తూన్నది). ఇక్కడ జ్యోతిఃశబ్దంచేత ఆదిత్యాదితేజస్సు చెప్పబడుతున్నదా లేక పరమాత్మ చెప్పబడుతున్నదా అని సందేహం. వెనుకటి రెండు అధికరణాలలో అర్థాంతరంలో ప్రసిద్ధాలైన 'ఆకాశ' 'ప్రాణ' శబ్దాలకు, బ్రహ్మలింగం ఉండడంవల్ల

బ్రహ్మ అనియే అర్థం అని చెప్పబడింది. అయితే- ఇక్కడ అలాంటి బ్రహ్మలింగం ఏదైనా ఉన్నదా లేదా అని విచారణ చేయబడుచున్నది. ఏమి ప్రాప్తించింది? (ఏ అర్థం చెప్పాలి అని తేలింది?). జ్యోతిఃశబ్దంచేత ఆదిత్యాదికమైన తేజస్సే గ్రహింపబడుతుంది. ఎందువల్ల? ప్రసిద్ధివల్ల. 'తమః' 'జ్యోతిః' అనే రెండు శబ్దాలు పరస్పరవిరోధులైన రెండు వస్తువులను బోధిస్తాయి కదా? రాత్రులు మొదలైన సమయాలలో వ్యాపించేది చూపును అడ్డు కొనేది తమస్సు అని చెప్పబడుతుంది. ఆ చూపును అనుగ్రహించే సూర్యాధికం తేజస్సు అని చెప్పబడుతుంది. అట్లే 'దీప్యతే' (ప్రకాశించుచున్నది) అనే శ్రుతి (మాట) కూడ ఆదిత్యాదుల విషయంలోనే ప్రసిద్ధంగా ఉంది. (ఆదిత్యః దీప్యతే= సూర్యుడు ప్రకాశిస్తున్నాడు'' ఇత్యాది ప్రయోగాలు ప్రసిద్ధములు కదా?) రూపాదులు లేని బ్రహ్మ 'దీప్యతే' అని ముఖ్యమైన శ్రుతికి తగదు కదా. (అనగా బ్రహ్మకు రూపాదులు లేవు; అలాంటి బ్రహ్మను గూర్చి 'దీప్యతే' అనడం కుదరదు కదా అని అర్థం) (బ్రహ్మను గ్రహించకపోవడానికి) మరొక కారణం ఏమనగా- ద్యులోకం ఒక హద్దుగా (వాక్యంలో) వినబడుతున్నది. చరాచరములకు కారణమైన సర్వాత్మకమైన బ్రహ్మ ద్యులోకంపైన ప్రకాశిస్తున్నది అని చెప్పడం యుక్తం కాదు. (అనగా బ్రహ్మ అంతటా కూడ ప్రకాశించాలి కాని ద్యులోకంపైన ప్రకాశించడం అనేది ఏమిటి అని అర్థం). కార్యమైన అనగా పుట్టించబడిన, (సూర్యచంద్రాది) తేజస్సు కైతే అది పరిచ్ఛిన్నం గాన (ఇంత అనే కొంత, ప్రమాణం ఉన్నది గాన) దానికి మర్యాద (హద్దు) చెప్పవచ్చును. ఈ సందర్భంలో ఉన్న "పరో దివో జ్యోతిః'' (ద్యులోకంకంటె పరమైన జ్యోతిస్సు) అనే బ్రాహ్మణ వాక్యం మర్యాదను స్పష్టంగా తెలుపుతున్నది.

## భాష్యమ్

నను కార్యస్యాపి జ్యోతిషః సర్వత్రగమ్యమానత్వా ద్ద్యుమర్యాదావత్త్వమసమఞ్జసమ్? అస్తు తర్హి అత్రివృత్కృతం తేజః ప్రథమజమ్. న. అత్రివృత్కృతస్య తేజసః ప్రయోజనాభావాదితి. ఇదమేవ ప్రయోజనం యదుపాస్యత్వమితి చేత్; న. ప్రయోజనాన్తరప్రయుక్తస్యై వాదిత్యాదేరుపాస్యత్వదర్శనాత్. "తాసాం త్రివృతం త్రివృతమేకైకం కరవాణి" (ఛా.ఉ.6.3.3) ఇతి చావిశేషశ్రుతేః. న చాత్రివృత్కృతస్యాపి తేజసో ద్యుమర్యాదత్వం ప్రసిద్ధమ్. అస్తు తర్హి త్రివృత్కృతమేవ తత్తేజో జ్యోతిఃశబ్దమ్.

## బాలానందిని

అవ. బ్రహ్మ సర్వగతం గాన దానికి ద్యులోకాన్ని హద్దుగా చెప్పడం యుక్తం కాదు. అందుచేత కార్యమైన ఏదైన ఒక జ్యోతిస్సునే ఇక్కడ గ్రహించాలి అని పూర్వపక్షి అనగా కార్యజ్యోతిస్సుకు మాత్రం అవధి ఎట్లు చెప్పడం కుదురుతుంది అని సిద్ధాంతి ఆక్షేపిస్తున్నాడు- నన్వితి:- కార్యజ్యోతిస్సు కూడ అంతటా, అనగా ద్యులోకంపైన ద్యులోకానికి క్రింద కూడ, కనబడుతున్నది గాన, దానికి కూడ ద్యులోకాన్ని మర్యాదగా చెప్పడం యుక్తం కాదు కదా? దీనికి పూర్వపక్షి సమాధానం చెపుతున్నాడు- తర్హీతి:- అయితే మొట్టమొదట పుట్టిన, త్రివృత్కృతం కాని తేజస్సు అనవచ్చును. (సిద్ధాంతి ఖండిస్తున్నాడు) -నేతి- అది కుదరదు. ఎందువల్ల ననగా త్రివృత్కృతం కాని తేజస్సు వల్ల ప్రయోజనం ఏదీ లేదు. ప్రయోజనం లేకపోవడ మేమి? ఉపాసించబడడమే ప్రయోజనం అని చెప్పడం కుదరదు. ఏదైన ఒక ప్రయోజనం కోసం ఉద్దిష్టమైన (ఏదో ఒక ప్రయోజనం సాధించే) ఆదిత్యాదులే ఉపాస్యాలుగా చెప్పబడతాయి కాని ప్రసిద్ధమైన ఇతర ప్రయోజనా లేవీ లేనివాటిని ఉపాస్యాలుగా చెప్పడం ఎక్కడా లేదు కదా? మరొక విషయం ఏ మనగా "తాసాం... కరవాణి" అను శ్రుతి అన్ని భూతాలు కూడ భేదం ఏమీ లేకుండా త్రివృత్కృతము లైనట్లు చెప్పుచున్నది. అందుచేత త్రివృత్కృతం కాకుండా మిగిలిన తేజస్సు విడిగా ఎక్కడా ఉండడానికి అవకాశం లేదు. న చేతి:- త్రివృత్కృతం కాని తేజస్సుకు కూడా ద్యుమర్యాదత్వం (అది ద్యులోకంపైన ఉంటుం దని) ఎక్కడా ప్రసిద్ధి లేదు. అస్త్వితి:- అయితే - త్రివృత్కృతమైన ఆ తేజస్సే ఇక్కడ జ్యోతిఃశబ్దంచేత గ్రహించబడుతుంది అని చెప్పవచ్చు.

వి. ఈ అధికరణంలో జ్యోతిఃశబ్దానికి ఆదిత్యాదిరూపమైన కార్యతేజస్సు అని అర్థం అని పూర్వపక్షి అభిప్రాయం. సర్వకారణమైన బ్రహ్మయే దీని కర్థం అని సిద్ధాంతి అభిప్రాయం. పూర్వపక్షి తన మతానికి ఉపోద్బలకంగా- "ఇక్కడ ద్యులోకం మర్యాదగా చెప్పబడింది, బ్రహ్మకి అలాంటి మర్యాద (హద్దు) ఉండకూడదు కదా? అందుచేత 'జ్యోతిః' అనగా ఆదిత్యాదిజ్యోతి అని అర్థం" అని ఒక యుక్తి చూపాడు. దానికి సిద్ధాంతి- "కార్యజోతిస్సుకు మాత్రం మర్యాద ఎలా కుదురుతుంది? అది కూడ ద్యులోకంపైనా క్రిందా కూడా ఉన్నది కదా" అని అభ్యంతరం చెప్పాడు. అప్పుడు

పూర్వపక్షి పోనీ ఇక్కడ అత్రివృత్కృతమైన జ్యోతిస్సు అని చెపుతాం, బ్రహ్మ మాత్రం అవడానికి వీలులేదు అని సమాధానం చెప్పాడు. అలా చెప్పడం కూడా కుదరదు అని సిద్ధాంతి రెండు మూడు యుక్తులు చూపగా మళ్లీ పూర్వపక్షి వెనుకకు వెళ్లి కార్యజ్యోతిస్సునే గ్రహిద్దాం అని సమాధానం చెప్పాడు. అది కుదర దని మొదటనే చెప్పాం కదా అని సిద్ధాంతి "ననూక్తమ్" ఇత్యాది వాక్యంలో అతని మతం నిరాకరించ నున్నాడు.

అగ్ని, ఉదకం, పృథివి అనే మూడు భూతాలను సృజించి పరమేశ్వరుడు వాటిలో ఒక్కొక్కదానిలో మిగిలిన రెండింటి పాళ్లను కలిపాడు అని శ్రుతి చెప్పుచున్నది. దీనికే త్రివృత్కరణం అని పేరు. ఉదాహరణకి- తేజస్సును అప్‌ను, పృథివిని, మొదట రెండు అర్ధాలుగా (సమభాగాలుగా) చేసి ఒక్కొక్క అర్ధం వేరుగా ఉంచబడింది. మిగిలిన అర్ధం (ఒక్కొక్కటి) మళ్లీ రెండుగా విభజించబడింది. ఈ విధంగా ప్రతీ భూతానికీ ఒక్కొక్క అర్ధ భాగం, రెండేసి చతుర్థభాగాలు (నాల్గవ వంతులు)ఏర్పడ్డాయి. ఇప్పుడు అగ్నికి సంబంధించిన రెండు చతుర్థభాగాలలో ఒకటి అప్ అర్ధంలోను, రెండవది పృథివి [illegible]ంలోను కలపబడ్డాయి. అట్లే అప్‌కు సంబంధించిన రెండు చతుర్థభాగాలలో ఒకటి తేజస్సుయొక్క అర్ధంలోను రెండవది పృథివియొక్క అర్థంలోను పృథివికి సంబంధించిన రెండు చతర్థభాగాలలో ఒకటి అగ్నియొక్క అర్ధంలోను రెండవది అప్‌యొక్క అర్ధంలోను కలపబడ్డాయి. ఈ విధంగా ప్రతీ భూతంలోను తన అర్ధభాగంతోపాటు మిగిలిన రెండు భూతాల రెండు చతుర్థభాగాలు కూడా ఉంటాయి. ఇవే త్రివృత్కృతభూతాలు. జగత్తులో ఉన్నవి. ఇలా త్రివత్కృతం కాక కొంత జ్యోతిస్సు ఏ స్వర్గంలోనో ఉంటుంది, దానిని గ్రహించాలి అని పూర్వపక్షి అభిప్రాయం. అలా చెప్పడం కుదరదు అని సిద్ధాంతి పైన మూడు యుక్తులు చూపి ఉన్నాడు.

## భాష్యమ్

ననూక్తమర్వాగపి దివోఽవగమ్యతేఽగ్న్యాదికం జ్యోతిరితి. నైష దోషః. సర్వత్రాపి గమ్యమానస్య జ్యోతిషః "పరో దివః" ఇత్యుపాసనార్థః ప్రదేశ విశేషపరిగ్రహో న విరుధ్యతే. న తు నిష్ప్రదేశస్యాపి బ్రహ్మణః ప్రదేశవిశేషకల్పనా భాగినీ. "సర్వతః పృష్ఠేష్వనుత్తేమేషూత్తమేషు లోకేషు"

ఇతి చాధారబహుత్వశ్రుతిః కార్యే జ్యోతిష్యుపపద్యతే తరామ్ "ఇదం వా వ తద్యదిదమస్మిన్నన్తఃపురుషే జ్యోతిః" (ఛా.ఉ.3.13.7) ఇతి చ కౌక్షేయే జ్యోతిషి పరం జ్యోతిరధ్యస్యమానం దృశ్యతే. సారూప్యనిమిత్తాశ్చాధ్యాసా భవన్తి. యథా "తస్య భూరితి శిరః, ఏకం శిర ఏకమేతదక్షరమ్" (బృ.ఉ.5.5.3) ఇతి. కౌక్షేయస్య తు జ్యోతిషః ప్రసిద్ధమబ్రహ్మత్వమ్. "తస్యైషా దృష్టిః, తస్యైషా శ్రుతిః" (ఛా.ఉ.3.13.7) ఇతి చౌష్ణ్యఘోషవిశిష్టత్వస్య శ్రవణాత్: "తదేతద్దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత" ఇతి చ శ్రుతేః "చక్షుష్యః శ్రుతో భవతి య ఏవం వేద" (ఛా.ఉ.3.13.8) ఇతి చాల్పఫల శ్రవణాదబ్రహ్మత్వమ్. మహతే హి ఫలాయ బ్రహ్మోపాసనమిష్యతే. న చాన్యదపి కించిత్స్వవాక్యే ప్రాణాకాశవజ్జ్యోతిషోఽస్తి బ్రహ్మలిఙ్గమ్. న చ పూర్వస్మిన్నపి వాక్యే బ్రహ్మ నిర్దిష్టమస్తి. "గాయత్రీ వా ఇదం సర్వం భూతమ్" ఇతి ఛన్దోనిర్దేశాత్. అథాపి కథం చిత్పూర్వస్మిన్వాక్యే బ్రహ్మ నిర్దిష్టం స్యాదేవమపి న తస్యేహ ప్రత్యభిజ్ఞానమస్తి. తత్ర హి "త్రిపాదస్యామృతం దివి" (3.12.1,6) ఇతి ద్యౌరధికరణత్వేన శ్రూయతే. అత్ర పునః "పరో దివో జ్యోతిః" ఇతి ద్యౌర్మర్యాదాత్వేన. తస్మాత్ప్రాకృతం జ్యోతిరిహ గ్రాహ్యమిత్యేవం ప్రాప్తే బ్రూమః-

బాలానందిని

నన్వితి:- అగ్న్యాదిజ్యోతిస్సు ద్యులోకానికి క్రింద కూడ కనబడుతున్నది అని చెప్పాం కదా? ఇది దోషం కాదు. జ్యోతిస్సు అంతటా కనబడుతున్నా కూడ ఉపాసనకోసం 'పరో దివః' అని ఒకానొక ప్రదేశవిశేషాన్ని నిర్దేశించడంలో విరోధం లేదు. (ద్యులోకానికి పైనున్న జ్యోతిస్సును ఉపాసిస్తేనే ఫలం లభిస్తుం దని భావం). అంతేనే కాని ప్రదేశ శూన్యమైన బ్రహ్మకు ప్రదేశవిశేషం కల్పించడం యుక్తం కాదు. "సర్వతఃపృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకేషు" అని అనేకమైన ఆధారాలు ఉన్నట్లు శ్రవణం (చెప్పడం) కార్యమైన అగ్న్యాదిత్యాదితేజస్సు విషయంలోనే ఎక్కువ ఉపపన్నంగా (యుక్తంగా) ఉంటుంది. "ఇదం వా వ తద్యదిదమస్మిన్నన్తః పురుషే జ్యోతిః": అని ద్యులోకంకంటె పరమైన ఆ జ్యోతిస్సు కౌక్షేయజ్యోతిస్సుమీద (కుక్షిలో ఉన్న అగ్నిమీద, జఠరాగ్నిమీద) అధ్యసించబడుచున్నట్లు - (జఠరాగ్నియే ఆ

తేజస్సు అని) కనబడుచున్నది. అధ్యాసలు సారూప్యాన్ని (పోలికను) పట్టి ఏర్పడతాయి. ఉదాహరణకి - "తస్య...అక్షరమ్" ('భూః')అనేది ప్రజాపతియొక్క శిరస్సు; ఎందువల్ల ననగా శిరస్సు ఒకటే, ఈ అక్షరం కూడ ఒకటే అని అధ్యాస చేయబడినది.

వి. 'భూః' అనేదానియందు బ్రహ్మశిరస్త్వం ఆరోపించబడింది. 'భూః' అనేది బ్రహ్మయొక్క శిరస్సు అని ఈ శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మశిరస్త్వాన్ని అధ్యసించడానికి కారణం ఏమనగా భూః అనేదానిలో ఏకత్వం ఉంది. శిరస్సులో కూడా ఏకత్వం ఉంది. ఈ ఏకత్వసామ్యాన్ని పురస్కరించుకొని అధ్యాస చేసి నట్లే జ్యోతిష్ట్వం అనే సామ్యాన్ని పట్టి జఠరాగ్నిమీద ద్యుపరజ్యోతిష్ట్వం అధ్యసించబడుచున్న దని చెప్పడం యుక్తం అని భావం.

కౌక్షేయస్యేతి:- కౌక్షేయమైన తేజస్సు బ్రహ్మ కా దనే విషయం ప్రసిద్ధమే (అందుచేత దానిమీద బ్రహ్మత్వారోపం యుక్తం కాదు గాన జోతిస్సు బ్రహ్మ కాదు అని భావం). "తస్యైషా దృష్టిః" (శరీరంమీద చేయవేసి చూస్తే వేడి కనబడుతుంది గాన జఠరాగ్నిని గూర్చి తెలుసుకొనే విధానం (దృష్టి) ఇది). అని, "తస్యైషా శ్రుతిః" (రెండు చెవులలో వ్రేళ్లు పెట్టుకొని మూసుకొంటే) లోపలనుంచి ఏదో ఒక ధ్వని (ఘోష) వినబడుతుంది; ఇది జఠరాగ్నిని వినే పద్ధతి) అనీ ఉష్ణత్వంతోను, ఘోషతోను కూడి ఉండడం, అనగా జఠరాగ్నిలో వేడి, ధ్వనీ ఉన్నా యనే విషయం, చెప్పబడింది గాన జాఠరాగ్ని బ్రహ్మ కాదు అనేవిషయం నిశ్చితమే. "తదేతద్... ఉపాసీత" (ఈ జ్యోతిస్సు దృష్టము, శ్రుతము అని ఉపాసించాలి) అని కూడ శ్రుతి చెప్పుచున్నది.

వి. "తస్యైషా దృష్టిః, తస్యైషా శ్రుతిః" అని జఠరాగ్నికి సంబంధించిన దృష్టిశ్రుత లను చెప్పి దీనిపై అధ్యస్తమైన ఆ దివఃపరజ్యోతిస్సును కూడ దృష్టము, శ్రుతము అని ఉపాసించాలి అని ఈ వేదవాక్యం చెపుతున్నది. అందువల్ల కూడ ఆ దివఃపరమైన జ్యోతిస్తు జడమే కాని బ్రహ్మకాదు అని భావం.

చక్షుష్యః ఇతి:- "చక్షుష్యః...వేద"(ఎవడు ఈ విధంగా తెలుసుకుంటాడో, తెలుసుకొని ఉపాసిస్తాడో అతడు రూపవంతుడు, ప్రసిద్ధుడు అవుతాడు అని చాల అల్పమైన ఫలం వినబడడంచేత కూడ ఆ జ్యోతిస్సు (దివఃపరజ్యోతిస్సు) బ్రహ్మ కా దని తెలుస్తూన్నది. ఎందువల్ల ననగా బ్రహ్మోపాసన గొప్ప ఫలాన్ని ఉద్దేశించి చేయబడుతుంది కాని క్షుద్రమైన ఫలంకోసం చేయబడదు అని అంగీకరించబడుచున్నది. (వెనుకటి అధికరణాలలో ఉదాహరించిన)ప్రాణ - ఆకాశవాక్యాలలో ఉన్నట్లు ఇక్కడ స్వవాక్యంలో (జ్యోతిస్సును గూర్చి చెప్పిన వాక్యంలో జోయతిస్సు బ్రహ్మ అని చెప్పడానకి

బ్రహ్మలింగం ఏదీ కనబడడం లేదు. (స్వవాక్యంలో కాకపోయినా)పూర్వవాక్యంలో కూడ బ్రహ్మ చెప్పబడలేదు. పూర్వ వాక్యంలో "గాయత్రీ వా ఇదం సర్వమ్" (ఇదంతా గాయత్రియే) అని గాయత్రి అనే ఛందస్సు చెప్పబడింది కదా? పూర్వవాక్యంలో బ్రహ్మ చెప్పబడింది అని ఏదో విధంగా సమర్థించినా కూడ ఆ బ్రహ్మయే ఈ వాక్యంలో చెప్పబడింది అని చెప్పడం కుదరదు; ఎందువల్ల ననగా - అక్కడ "త్రిపాదస్యామృతం దివి" (దీని మూడు పాదాలు (వంతులు)ద్యులోకంలో ఉన్నాయి) అని ద్యులోకం ఆధారంగా చెప్పబడింది.; ఇక్కడైతే "పరో దివో జ్యోతిః" (ద్యులోకానికి పైన ఉన్న జ్యోతిస్సు) అని ద్యులోకం మర్యాదగా (హద్దుగా)చెప్పబడింది. అందువల్ల ఇక్కడ ప్రాకృతమైన, అనగా కార్యమైన జ్యోతిస్సునే గ్రహించాలి అని (వాదం) ప్రాప్తించగా చెపుతున్నాం.

## భాష్యమ్

జ్యోతిరిహ బ్రహ్మ గ్రాహ్యమ్; కుతః? చరణాభిధానాత్; పాదాభిధానాదిత్యర్థః. పూర్వస్మిన్ హి వాక్యే చతుష్పాద్ బ్రహ్మ నిర్దిష్టమ్-

**"తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః"**

**పాదోస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఛా.ఉ. 3.12.6)**

ఇత్యనేన మన్త్రేణ. తత్ర యచ్చతుష్పదో బ్రహ్మణస్త్రిపాదమృతం ద్యుసంబన్ధి రూపం నిర్దిష్టం తదేవేహ ద్యుసంబన్ధాన్నిర్దిష్టమితి ప్రత్యభిజ్ఞాయతే. తత్పరిత్యజ్య ప్రాకృతం జ్యోతిః కల్పయతః ప్రకృతహానాప్రకృతప్రక్రియే ప్రసజ్యేయాతామ్. న కేవలం పూర్వవాక్యాజ్జ్యోతిర్వాక్య ఏవ బ్రహ్మానువృత్తిః పరస్యామపి శాణ్డిల్య విద్యాయామనువర్తిష్యతే బ్రహ్మ. తస్మాదిహ జ్యోతిరితి బ్రహ్మ ప్రతిపత్తవ్యమ్. యత్తూక్తమ్ - "జ్యోతిః" "దీప్యతే" ఇతి చైతౌ శబ్దౌ కార్యే జ్యోతిషి ప్రసిద్ధావితి, నాయం దోషః. ప్రకరణాద్ బ్రహ్మావగమే సత్యనయోః శబ్దయోరవిశేషకత్వాత్. దీప్యమానకార్యజ్యోతిరుపలక్షితే బ్రహ్మణ్యపి సంభవాత్. "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" (తై.బ్రా.3.12.9,7) ఇతి చ మన్త్రవర్ణాత్.యద్వా నాయం జ్యోతిఃశబ్దశ్చక్షుర్వృత్తేరేవానుగ్రాహకే తేజసి వర్తతే, అన్యత్రాపి ప్రయోగదర్శనాత్ "వాచైవాయం జ్యోతిషాస్తే"(బృ.ఉ.4.3.5) "మనో జ్యోతిర్జుషతామ్" (తై.బ్రా.1.6.3.3.) ఇతి చ తస్మాద్యద్యత్కస్యచిదవభాసకం తత్తజ్జ్యోతిః

శబ్దేనాభిధీయతే. తథా సతి బ్రహ్మణోఽపి చైతన్యరూపస్య సమస్తజగవభాస హేతుత్వాత్ ఉపపన్నో జ్యోతిఃశబ్దః "తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"(కౌ.2.5.15) "తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతమ్' '(బృ.ఉ.4.4.16) ఇత్యాదిశ్రుతిభ్యశ్చ. యదప్యుక్తం ద్యుమర్యాదత్వం సర్వగతస్య బ్రహ్మణః నోపపద్యత ఇతి - అత్రోచ్యతే. సర్వగతస్యాపి బ్రహ్మణ ఉపాసనార్థః ప్రదేశవిశేషపరిగ్రహో న విరుధ్యతే.

## బాలానందిని

జ్యోతిరితి:- ఇక్కడ జ్యోతిస్సు బ్రహ్మ అని గ్రహించదగినది. ఎందువల్ల? చరణములను చెప్పడంవల్ల. పాదాలను చెప్పడంవల్ల అని అర్థం. పూర్వవాక్యంలో "తావానస్య...దివి" (అంతప్రమాణం గల ఈ ప్రపంచం అంతా గాయత్రితో సంబంధించిన ఈ బ్రహ్మయొక్క మహిమయే, అనగా విభూతియే. పూర్ణబ్రహ్మరూపుడైన పురుషు డైతే ఆ ప్రపంచంకంటె పెద్దవాడు. సమస్తభూతాలు కలసి ఈ పురుషుని పాదం అనగా నాల్గవ వంతు. ఈ పురుషుని మూడు పాదాల అమృతరూపం, వినాశరహితమైన రూపం, స్వప్రకాశస్వరూపంలో (దివి) ఉన్నది. లేదా ధ్యానంకొరకు సూర్యమండలంలో ఉన్నది. అనగా కల్పితమైన జగత్తుకంటె బ్రహ్మస్వరూపం అనంతమైనది అను మంత్రంచేత నాలుగు పాదాలున్నట్లు నిర్దేశించబడింది. ఆ మంత్రంలో చతుష్పాద్ బ్రహ్మయొక్క, ద్యులోకానికి సంబంధించిన ఏ త్రిపాదమృతరూపం చెప్పబడిందో అదే ఇక్కడ (జ్యోతిఃశబ్దంచేత) నిర్దేశించబడినది అని ద్యులోకసంబంధాన్ని పట్టి గుర్తించబడుచున్నది. ఆ బ్రహ్మస్వరూపాన్ని విడిచివేసి కార్యజ్యోతిస్సును కల్పించిన ట్లయితే ప్రకృతహాన -అప్రకృతప్రక్రియలు ప్రసక్త మవుతాయి. పూర్వవాక్యంనుంచి బ్రహ్మ ఈ జ్యోతిర్వాక్యంలోనికే కాదు తరవాత వచ్చిన శాండిల్యవిద్య కూడ అనువర్తించ నున్నది. అందుచేత ఇక్కడ జ్యోతిః అనగా బ్రహ్మ అనియే గ్రహించాలి. జ్యోతిః దీప్యతే అనే ఈ రెండు పదాలు కార్యజ్యోతిస్సు విషయంనే ప్రసిద్ధగా ఉన్నాయి అని (పూర్వపక్షి) ఏది చెప్పి ఉన్నాడో అది దోషం కాదు. ప్రకరణాన్ని పట్టి బ్రహ్మ అని అర్థం గ్రహించిన తరవాత ఈ శబ్దాల ప్రసిద్ధార్థం ఏమీ చేయజాలదు, అనగా జ్యోతిఃశబ్దానికి బ్రహ్మ అనే అర్థం కాదు అని అడ్డుకొనజాలదు. ప్రకాశించుచున్న కార్యజ్యోతిస్సుతో ఉపలక్షితమైన బ్రహ్మ విషయంలో కూడ ఈ పదాలు ప్రయోగించడం కుదురుతుంది. అనగా కార్యజ్యోతిస్సు బ్రహ్మనుండే పుట్టింది. ఆ కార్యమైన జ్యోతిస్సు ప్రకాశిస్తున్నది. బ్రహ్మ కార్యమైన తేజస్సు ప్రకాశిస్తున్నది గాన, కార్యానికీ కారణానికీ భేదం లేదు

గాన బ్రహ్మను తేజస్సుగా భావించి తేజస్సు(బ్రహ్మ)ప్రకాశిస్తున్నది అని చెప్పడంలో దోషం లేదు అని భావం. అందువలననే "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" (ఏ తేజస్సుచేత, చైతన్యంచేత, పెంపొందింపబడినవాడై సూర్యుడు ప్రకాశిస్తున్నాడో)అని మంత్రం చెప్పుచున్నది.

అవ. ఇంతవరకు తేజస్సు అనగా కాంతి, అది ప్రకాశిస్తున్నది అనే అర్థాలు అంగీకరించి వాటిని సమర్థించడం జరిగింది. ఇప్పుడు జ్యోతిఃశబ్దానికి తేజస్సు అని మాత్రమే అర్థం కాదు మరొక అర్థం కూడా గ్రహించవచ్చును అని చెప్పుచున్నారు - యద్వా ఇతి:- లేదా ఈ జ్యోతిఃశబ్దానికి నేత్రాలు పని చేసేటట్లు చేసేకాంతి అని మాత్రమే అర్థం కాదు. ఇతరార్థాలలో కూడ ఈ శబ్దం ప్రయోగించడం "వాచైవాయం...జుషతామ్" ఇత్యాదులలో కనబడుతున్నది. ("అయమ్= ఈ లోకం, వాచైవ జ్యోతిషా=వాక్కు అనే జ్యోతిస్సుతో, ఆస్తే= కూర్చొనడం మొదలైన పనులు చేస్తుంది" "జుషతామ్ = నెయ్యి త్రాగేవాళ్లకి మనస్సే ప్రకాశ కలిగించే జ్యోతిస్సు" అని వీటి అర్థం) అందువల్ల ఏది ఏది దేనిని ప్రకాశింపచేస్తుందో దానికి అలాంటి ప్రతీదీ జ్యోతిస్సు అని చెప్పబడుతుంది. అలాంటప్పుడు చైతన్యరూపమైన బ్రహ్మ కూడ సకలజగత్తుయొక్క అవభాసానికి (జ్ఞానానికి) హేతువు గాన దాని విషయంలో **కూడ** జ్యోతిఃశబ్దప్రయోగం యుక్తమే. "**తమేవ... విభాతి**" (ఆత్మ భాసిస్తూంటే దానినే అనుసరించి అంతా భాసిస్తూన్నది; ఇదంతా దాని కాంతిచేతనే భాసిస్తూన్నది), "తద్దేవా.. **అమృతమ్**" (కాలంచేత అవచ్ఛిన్నం కాని ఆ బ్రహ్మ సూర్యాదిజ్యోతిస్సులకు కూడ జ్యోతిస్సు (సాక్షి) అని, అదే ఆయుస్సు, అమృతమూ అనీ దేవతలు ఉపాసిస్తుంటారు). ఇత్యాదిశ్రుతులు కూడ ఈ విషయమే చెపుతున్నాయి. సర్వవ్యాప్త మైన బ్రహ్మకి ద్యులోకాన్ని మర్యాదగా చెప్పడం యుక్తం కాదని (పూర్వపక్షిచేత) ఏది చెప్పబడినదో దాని విషయంలో చెప్పబడుచున్నది -సర్వవ్యాప్తమైనబ్రహ్మకు కూడ ఏదో ఒక ప్రదేశవిశేషంతో సంబంధాన్ని ఉపాసననిమిత్తం చెప్పడంలో దోషమేమీ లేదు.

## భాష్యమ్

నమూక్తం - నిష్ప్రదేశస్య బ్రహ్మణః ప్రదేశవిశేషకల్పనా నోపపద్యత ఇతి - నాయం దోషః. నిష్ప్రదేశస్యాపి బ్రహ్మణః ఉపాధివిశేషసంబన్ధాత్ ప్రదేశవిశేషకల్పనోపపత్తేః. తథాహి - ఆదిత్యే చక్షుషి, హృదయే ఇతి ప్రదేశవిశేషసంబన్ధీని బ్రహ్మణ ఉపాసనాని శ్రూయన్తే. ఏతేన 'విశ్వతఃపృష్ఠేషు'

ఇత్యాధారబహుత్వముపపాదితమ్. యదప్యేతదుక్తమ్ - ఔష్ణ్యఘోషానుమితే కౌక్షేయే కార్యే జ్యోతిష్యధ్యస్యమానత్వాత్పరమపి దివః కార్యం జ్యోతిరేవ ఇతి. తదప్యయుక్తమ్. పరస్యాపి బ్రహ్మణో నామాదిప్రతీకత్వవత్ కౌక్షేయజ్యోతిష్ప్రతీకత్వోపపత్తేః. "దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత" ఇతి తు ప్రతీకద్వారకం దృష్టత్వం శ్రుతత్వం చ భవిష్యతి.

## బాలానందిని

నన్వితి:- ప్రదేశం లేని (ఒక చోట ఉంటుంది అని చెప్పడానికి వీలులేని, ఆధారం లేని) బ్రహ్మకు ప్రదేశవిశేషం కల్పించడం యుక్తం కాదని చెప్పాం కదా? అది దోషం కాదు. వాస్తవంలో బ్రహ్మకు ప్రదేశం ఏదీ లేకపోయినా ఉపాధివిశేషం యొక్క సంబంధాన్ని పట్టి ప్రదేశవిశేషాన్ని కల్పించడం కుదురుతుంది. అదెట్లనగా - "ఆదిత్యునిలోను నేత్రంలోను హృదయంలోను" అని అంటూ ఆ యా ప్రదేశవిశేషాలకు సంబంధించిన బ్రహ్మోపాసనలు శ్రుతులలో వినబడుచున్నవి. (బ్రహ్మ ఆదిత్యాదులలో ఉన్నట్లు భావించి ఉపాసనలు చేయ్యాలని చెప్పబడుచున్నది. ఇక్కడ బ్రహ్మకు ఆదిత్యాదులు ఉపాధులు. వాటిని పట్టి బ్రహ్మకు ప్రదేశం ఉన్నట్లు కల్పించబడుతున్నది). దీనిచేత "విశ్వతఃపృష్ఠేషు"ఇత్యాదివాక్యాలలో ఆధారబహుత్వం కూడ సమర్థించినట్లయినది. (బ్రహ్మకు అనేకమైన ఆధారాలు ఉన్నట్లు చెప్పడం ఎట్లు అనే ప్రశ్నకు కూడ ఇదే సమాధానం అని అర్థం). ఉష్ణత్వమూ ఘోషా వీటిచేత ఊహించబడిన, కార్యమైన జఠరాగ్నియందు ఈ దివఃపరమైన జ్యోతిని అధ్యసించడంచేత ఇది కూడ కార్యాగ్నియే కావాలి (కాని బ్రహ్మ కాకూడదు) అని (పూర్వపక్షి)చెప్పినది కూడ యుక్తం కాదు. బ్రహ్మ ఒక్కటే అయినా దానికి నామం మొదలైన అనేకప్రతీక లున్నట్లు కౌక్షేయకాగ్ని (జఠరాగ్ని)కూడ ఒక ప్రతీకం అని అంగీకరించడానికి అభ్యంతరం ఏమీ లేదు కదా? (ఒకదానికి గుర్తుగా గ్రహించబడే మరొక వస్తువు ప్రతీక. ఉదా: సాలగ్రామం శ్రీమహావిష్ణువునకు ప్రతీక. అందుచేతనే సాలగ్రామం శ్రీమహావిష్ణువుగా పూజించబడుతుంది) "దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత" అని చెప్పిన దృష్టత్వ శ్రుతత్వాలు ప్రతీకద్వారా (ప్రతీకమైన జాఠరాగ్ని ద్వారా) బ్రహ్మకు చెప్పవచ్చును.

## భాష్యమ్

యదప్యల్పఫలశ్రవణాన్న బ్రహ్మేతి - తదప్యనుపపన్నమ్. న హి ఇయతే ఫలాయ బ్రహ్మాశ్రయణీయమ్, ఇయతే నేతి నియమహేతురస్తి. యత్ర హి నిరస్తసర్వవిశేషసంబన్ధం పరం బ్రహ్మాత్మత్వేనోపదిశ్యతే, తత్రైకరూపమేవ

ఫలం మోక్ష ఇత్యవగమ్యతే. యత్ర తు గుణవిశేషసంబన్ధం, ప్రతీకవిశేషసంబన్ధం వా బ్రహ్మోపదిశ్యతే తత్ర సంసారగోచరాణ్యేవోచ్చావచాని పలాని దృశ్యన్తే- "అన్నాదో వసుదానో విన్దతే వసు య ఏవం వేద" (బృ.ఉ.4.4.24) ఇత్యాద్యాసు శ్రుతిషు. యద్యపి న స్వవాక్యే కించిజ్జ్యోతిషో బ్రహ్మలిఙ్గమస్తి తథాపి పూర్వస్మిన్ వాక్యే దృశ్యమానం గ్రహీతవ్యం భవతి. తదుక్తం సూత్రకారేణ "జ్యోతిశ్చరణాభిధానాత్" ఇతి. కథం పునర్వాక్యాన్తరగతేన బ్రహ్మసంనిధానేన జ్యోతిఃశ్రుతిః స్వవిషయాత్ ప్రచ్యావ్య శక్యా వ్యావర్తయితుమ్.? నైష దోషః "యదతః పరో దివో జ్యోతిః" ఇతి ప్రథమతరపఠితేన యచ్ఛబ్దేన సర్వనామ్నా ద్యుసంబన్ధాత్ప్రత్యభిజ్ఞాయమానే పూర్వవాక్యనిర్దిష్టేఽర్థే బ్రహ్మణి స్వసామర్థ్యేన పరామృష్టే సత్యర్థాజ్జ్యోతిఃశబ్దస్యాపి బ్రహ్మవిషయత్వోపపత్తేః. తస్మాదిహ జ్యోతిరితి బ్రహ్మ ప్రతిపత్తవ్యమ్ 24.

బాలానందిని

యదితి:- ఈ ఉపాసనకు అల్పమైన ఫలమే చెప్పబడినంది గాన జ్యోతిస్సు బ్రహ్మ కాదు అని చెప్పడం కూడ యుక్తం కాదు. బ్రహ్మను ఇంత పలంకోసమే ఆశ్రయించాలి, ఇంత పలంకోసం ఆశ్రయించగూడదు అనే నియమానికి హేతువు ఏదీ లేదు కదా. ఎట్టి విశేషాలతోను సంబంధం లేని (అద్వితీయమూ నిర్గుణమూ అయిన) పరబ్రహ్మ ఆత్మగా ఎక్కడ ఉపదేశించబడుతుందో అక్కడ ఒకే రూపమైన పలం, మోక్షం, అని తెలుస్తున్నది కాని ఎక్కడ గుణవిశేషాలతో గాని ప్రతీకవివేషాలతో గాని సంబంధం ఉన్న బ్రహ్మ ఉపదేశంచబడుతుందో అక్కడ "అన్నాదో... వేద" (ఈ విధంగా ఎవడు తెలుసుకుంటాడో, ఉపాసిస్తాడో అతడు అన్నం తినేవాడు లేదా అందరికి అన్నం ఇచ్చేవాడు ధనం ఇచ్చేవాడు అయి దనం పొందువాడు) ఇత్యాది వాక్యాలలో సంసారానికే సంంధించిన అనేకవిధాలైన ఫలాలు కనబడుతున్నాయి (చెప్పబడుతున్నాయి). జ్యోతిస్సు బ్రహ్మ అని చెప్పడానికి తగిన బ్రహ్మలింగం ఏదీ స్వవాక్యంలో కనబడకపోయినా పూర్వవాక్యంలో కనబడే బ్రహ్మలింగాన్ని గ్రహించవలసి ఉంటుంది. ఈ విషయమే సూత్రంకారుడు "జ్యోతిశ్చరణాభిధానాత్" అని చెప్పాడు. మరొక వాక్యంలో ఉన్న బ్రహ్మయొక్క సంనిధానంచేత (మరొక వాక్యంలో 'బ్రహ్మ' ఉండడంచేత) (ఈవాక్యంలో ఉన్న) జ్యోతిస్ శబ్దాన్ని దాని అసలు అర్థంనుంచి దూరం

చేసి మరొక అర్థం వైపు త్రిప్పడం ఎలా కుదురుతుంది? ఈ దోషం లేదు. "యదతః పరో దివో జ్యోతిః" అని మొట్టమొదట పఠించబడిన (ఉపయోగించిన)సర్వనామమైన యచ్ఛబ్దంచేత ద్యుసంబంధాన్ని బట్టి గుర్తింపబడిన, పూర్వవాక్యంలో నిర్దేశించబడిన బ్రహ్మ తన సామర్థ్యంచేత పరామర్శించబడగా దానిని పట్టి జ్యోతిఃశబ్దం కూడ బ్రహ్మవిషయకమే అని చెప్పడం కుదరుతుంది

వి "అథ యదతః పరః దివో జ్యోతిః" అనే ఈ మంత్రానికి వెనుక నున్న "తావానస్య" ఇత్యాదిమంత్రంలో ద్యులోకంతో సంబంధం ఉన్న బ్రహ్మని గూర్చి ముచ్చటించడం జరిగింది. ఈ మంత్రంలో 'యత్' అనే సర్వనామశబ్దం 'తావానస్య' ఇత్యాదిమంత్రంలో చెప్పబడిన ద్యునంబద్ధమైన బ్రహ్మనే నిర్దేశిన్తుంది. నర్వనామశబ్దాలు ముందుచెప్పడినవాటినే నిర్దేశిస్తాయి కదా? ఈ విధంగా యచ్ఛబ్దం తన సామర్థ్యంచేత పూర్వవాక్యంలో చెప్పబడిన బ్రహ్మనే నిర్దేశిస్తున్నది అని ద్యులోకసంబంధాన్ని పట్టి కూడ నిశ్చయింపబడుతుంది. ఆ 'యత్' అనే పదం ఇక్కడ జ్యోతిఃశబ్దానికి విశేషణం. అందుచేత 'యత్' అనేది దేనిని (ఏ బ్రహ్మను) నిర్దేశిస్తూన్నదో అదే జ్యోతిః శబ్దానికి అర్థం అని నిర్ధారణ చేయబడుతుంది.

**సూ. ఛన్దోభిధానాన్నేతి చేన్న తథా చేతోర్పణనిగదాత్తథా హి దర్శనమ్ 1.1.25.**

అథ యదుక్తమ్ - పూర్వస్మిన్ వాక్యే న బ్రహ్మాభిహితమస్తి ; "గాయత్రీ వా ఇదం సర్వం భూతం యదిదం కిం చ" (ఛా. ఉ. 3.1.12.1) ఇతి గాయత్ర్యాఖ్యస్య ఛన్దసః అభిహితత్వాత్ ఇతి తత్పరిహర్తవ్యమ్. కథం పునశ్ఛన్దోభిదానాన్న బ్రహ్మాభిహితమితి శక్యతే వక్తుమ్, యావతా "తావానస్య మహిమా" ఇత్యేతస్యామృచి చతుష్పాద్బ్రహ్మ దర్శితమ్. నైతదస్తి. "గాయత్రీ వా ఇదం సర్వమ్" ఇతి గాయత్రీముపక్రమ్య తామేవ భూతపృథివీశరీర హృదయవాక్ప్రాణభేదైర్వ్యాఖ్యాయ "సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ తదేతదృచాభ్యనూక్తం, తావానస్య మహిమా" ఇతి తస్యామేవ వ్యాఖ్యాతరూపాయాం గాయత్ర్యాముదాహృతో మన్త్రః కథమకస్మాద్బ్రహ్మ చతుష్పాదభిదధ్యాత్? యోఽపి తత్ర "యద్వై తద్ బ్రహ్మ" (ఛా.ఉ. 3.12.5,6) ఇతి బ్రహ్మశబ్దః సోఽపి ఛన్దసః ప్రకృతత్వాత్ ఛన్దోవిషయ ఏవ "య ఏతామేవం బ్రహ్మోపనిషదం వేద" (ఛా.ఉ. 3. 11.3.) ఇత్యత్ర హి వేదోపనిషదమితి వ్యాచక్షతే. తస్మాచ్ఛన్దోభిధానాత్ న బ్రహ్మణః ప్రకృతత్వమితి చేత్-

## బాలానందిని

ఛన్ద ఇతి :- "ఛన్దోభిధానాత్= గాయత్రీఛందస్సును గూర్చి చెప్పడంవల్ల, న=బ్రహ్మచెప్పబడలేదు. ఇతి చేత్ = అని అన్నట్లయితే, న=అది సరి కాదు. తథా=ఛందస్సుకు సంబంధించిన బ్రహ్మయందు, చేతోర్పణనిగదాత్=మనస్సును నిలుపుట చెప్పబడడంవల్ల, తథా=అట్లు, దర్శనం హి= ఛందోరూపంలో బ్రహ్మను చెప్పడం ఉంది కదా" అని సూత్రార్థం.

**అథేతి:-** పూర్వవాక్యంలో "గాయత్రీ.. కించ" అని గాయత్రి అనే ఛందస్సు చెప్పబడి ఉండడంచేత బ్రహ్మ చెప్పబడలేదు అని (పూర్వపక్షి) చెప్పినదానిని పరిహరించవలసి ఉంది. (సిద్ధాంతి వేసే ప్రశ్న) - "తావానస్య మహిమా" అనే ఋక్కులో చతుష్పాద్బ్రహ్మ చెప్పబడిన దని చూపి ఉన్నాం కదా? ఛందస్సును గూర్చి చెప్పబడింది గాని బ్రహ్మను గూర్చి కాదు అని ఎట్లు అంటావు. (పూర్వపక్షి సమాధానం) అది కాదు. "గాయత్రీ వా ఇదం సర్వమ్" అని గాయత్రిని గూర్చి చెప్పడం ప్రారంభించి దానికి భూత-పృథివీ-శరీర-హృదయ-వాక్-ప్రాణా లనే ఆరు భేదా లున్నట్లు చెప్పి "సైషా .... మహిమా" (అట్టి ఈ గాయత్రి నాలుగు పాదాలు గలది. ఆరు విధా లైనది. ఈ విషయమే "తావానస్య మహిమా" ఇత్యాదిఋక్కుచేత వివరించబడింది) అని వెనుక వివరించిన రూపం గల గాయత్రి విషయంలో ఉదాహరించబడిన మంత్రం అకస్మాత్తుగా చతుష్పాద్బ్రహ్మను ఎలా చెపుతుంది? అక్కడ "యద్వై తద్ బ్రహ్మ" అని ఉన్న బ్రహ్మశబ్దానికి కూడ ఛందస్సు ప్రకృతం అవడంచేత ఛందస్సు అనే అర్థమే చెప్పుకోవాలి. ఎందువల్ల ననగా "య ఏతామేవం బ్రహ్మోపనిషదం వేద" ఇత్యాదివాక్యాలలో 'బ్రహ్మోపనిషత్' పదానికి వేదోపనిషత్తు అని అర్థం చెప్పారు. అక్కడ 'బ్రహ్మ'కు వేదం అని అర్థం చెప్పినట్లే ఇక్కడ ఛందస్సు అని అర్థం చెప్పవచ్చును అని అర్థం. అందువల్ల ఇక్కడ ప్రకృతమైనది ఛందస్సే కాని బ్రహ్మ కాదు.

## భాష్యమ్

నైష దోషః - "తథాచేతోర్పణనిగదాత్" తథా గాయత్ర్యాఖ్యచ్ఛన్దోద్వారేణ తదనుగతే బ్రహ్మణి చేతసోఽర్పణం చిత్తసమాధానమనేన బ్రాహ్మణవాక్యేన నిగద్యతే "గాయత్రీ వా ఇదం సర్వమ్" ఇతి. న హ్యక్షరసంనివేశమాత్రాయాః గాయత్ర్యాః సర్వాత్మకత్వం సంభవతి. తస్మాద్యద్ గాయత్ర్యాఖ్యవికారేఽనుగతం జగత్కారణం బ్రహ్మ తదిహ సర్వమిత్యుచ్యతే, "యథా సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛా.ఉ.3.14.1) ఇతి. కార్యం చ

కారణాదవ్యతిరిక్తమితి వక్ష్యామః- "తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః" (బ్ర.సూ. 2.1.14) ఇత్యత్ర. తథాన్యత్రాపి వికారద్వారేణ బ్రహ్మణః ఉపాసనం దృశ్యతే "ఏతం హ్యేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసన్తే ~~ఏతమేవాధ్వర్యవ~~ ఏతం మహావ్రతే ఛన్దోగాః" (ఐ. బ్రా. 3.2.3.12) ఇతి. తస్మాదస్తి ఛన్దోభిధానే పి పూర్వస్మిన్ వాక్యే చతుష్పాద్బ్రహ్మ నిర్దిష్టమ్. తదేవ జ్యోతిర్వాక్యేపి పరామృశ్యతే ఉపాసనాన్తరవిధానాయ.

## బాలానందిని

నైష ఇతి : - ఈ దోషం లేదు. ''తథా చేతోర్పణనిగదాత్'' తథా=గాయత్రి అనే ఆ ఛందస్సు ద్వారా (దానిని ద్వారంగా చేసికొని) ఆ గాయత్రితో అనుగతమైన అనగా సంబంధించిన బ్రహ్మయందు చేతోర్పణాన్ని అనగా చిత్తసమాధానాన్ని (చిత్తం నిలుపడాన్ని) ''గాయత్రీ వా ఇదం సర్వమ్'' అనే ఈ బ్రాహ్మణవాక్యం చెపుతున్నది.

వి. బ్రహ్మ సర్వకారణం గాన తన కార్యా లన్నింటితోను సంబంధించి ఉంటుంది. గాయత్రి కూడ బ్రహ్మకార్యమే. ఆ గాయత్రి ద్వారా దానితో సంబంధించిన సర్వకారణమైన బ్రహ్మను ఉపాసించవలె నని ఈ వాక్యానికి భావం.

న హీతి:- గాయత్రీఛందస్సు అనగా అక్షరాల కూర్పు మాత్రమే. అలాంటి గాయత్రి సర్వాత్మకం అని చెప్పడం కుదరదు కదా? అందుచేత ఇక్కడ జగత్కారణమైన ఏ బ్రహ్మ గాయత్రి అనే పేరు గల వికారంతో (కార్యంతో) సంబంధించి ఉన్నదో అదే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే వాక్యంచేత 'సర్వం' అని చెప్పబడుచున్నది.కార్యం కారణంకంటె వేరు కాదు అనే విషయం "తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః" అనే సూత్రం దగ్గర ప్రతిపాదించ నున్నాం. ఇట్లే కార్యం ద్వారా బ్రహ్మను ఉపాసించడం- "ఏతం హ్యేవ.. చన్దోగాః" (ఋగ్వేదులు గొప్పదైన శస్త్రంలో అనుగతంగా ఉన్న ఈ పరమాత్మనే (బ్రహ్మనే) ఉపాసిస్తున్నారు. యజుర్వేదులు అగ్నిలో అనుగతమై ఉన్న ఈ బ్రహ్మనే ఉపాసిస్తున్నారు; సామవేదులు మహావ్రతమనే క్రతువులో అనుగతమై ఉన్న ఈ బ్రహ్మనే ఉపాసిస్తున్నారు) ఇత్యాదివాక్యాలలో కనుబడుతున్నది. అందువల్ల పూర్వవాక్యం ఛందస్సును చెప్పుచున్నా కూడ దానిలో చతుష్పాద్బ్రహ్మ నిర్దేశింపపడి ఉంది. ఆ బ్రహ్మయే, మరొక ఉపాసన విధించడంకొరకు జ్యోతిర్వాక్యంలో కూడ పరామర్శింప బడుచున్నది. (పరామర్శించడం అనగా మళ్లీ పేర్కొనడం).

## భాష్యమ్

అపర అహ - సాక్షాదేవ గాయత్రీశబ్దేన బ్రహ్మ ప్రతిపాద్యతే, సంఖ్యాసామాన్యాత్; యథా గాయత్రీ చతుష్పదా షడక్షరైః పాదైః తథా బ్రహ్మ చతుష్పాత్. తథాన్యత్రాపి ఛన్దోభిధాయీ శబ్దః అర్థాన్తరే సంఖ్యాసారూప్యాత్ ప్రయుజ్యమానో దృశ్యతే. తద్యథా- "తే వా ఏతే పఞ్చాన్యే పఞ్చాన్యే దశ సన్త స్తత్కృతమ్" ఇత్యాపక్రమ్యాహ- "సైషా విరాడన్నాదీ" (ఛా.ఉ.4.3.8) ఇతి. అస్మిన్ పక్షే బ్రహ్మైవాభిహితమితి న చ్ఛన్దోభిధానమ్. సర్వథాప్యస్తి పూర్వస్మిన్ వాక్యే ప్రకృతం బ్రహ్మ.

## బాలానందిని

**అవ.** 'గాయత్రీ' శబ్దానికి ముఖ్యార్థం గాయత్రీ ఛందస్సే అయినా పూర్వవాక్యంలో బ్రహ్మశబ్దం ఉండడంచేత గాయత్ర్యనుగతమైన బ్రహ్మ అని అర్థం లక్షణావృత్తిచేత చెప్పుకోవాలని వెనుక ప్రతిపాదించబడింది. అనగా గాయత్రి, బ్రహ్మ అనే రెండర్థాలు కూడ గ్రహించినట్లయింది. అయితే కొందరు వ్యాఖ్యాతలు 'గాయత్రీ' శబ్దానికి గాయత్రి అనే ముఖ్యార్థం పూర్తిగా విడిచివేసి దీనిని గౌణప్రయోగంగా గ్రహించి ఈ శబ్దానికి బ్రహ్మ అని మాత్రమే అర్థం చెప్పవచ్చునని అన్నారు. సింహంలో ఉన్న శౌర్యధైర్యాదుల వంటి శౌర్యధైర్యాదు లున్నవానిని చూసి "సింహో ఽయమ్" (ఇది సింహం) అన్నట్లయితే అది గౌణ ప్రయోగం. అక్కడ సింహశబ్దం దాని ముఖ్యార్థమైన సింహాన్ని చెప్పకుండా ఆ మనిషిని బోధిస్తుంది. అలాగే ఇక్కడ కూడ అని వాళ్ల అభిప్రాయం. దానిని చెపుతున్నారు - **అపర ఆహ ఇతి:-** మరొకడు ఇలా అంటున్నాడు - గాయత్రికి ఆరేసి అక్షరాల చొప్పున నాలుగు పాదాలున్నట్లు బ్రహ్మకు కూడ నాలుగు పాదాలున్నాయి. ఈ విధమైన సంఖ్యాసామ్యంచేత (నాలుగు పాదాలు అనే సంఖ్యలో పోలిక ఉండడంచేత) గాయత్రీశబ్దం (తన ముఖ్యార్థమైన ఛందస్సును బోధించకుండా) ప్రత్యక్షంగా బ్రహ్మనే బోధిస్తుంది.(అందుచేత గాయత్ర్యనుగతబ్రహ్మను ఉపాసించాలని కాక బ్రహ్మనే ఉపాసించాలని చెప్పబడుచున్నది). మరొక చోట కూడ సంఖ్యాసామ్యాన్ని పురస్కరించుకొని ఛందస్సును బోధించే శబ్దాన్ని మరొక అర్థంలో ప్రయోగించడం కనబడుచున్నది. అదెట్లనగా "తే వా.... కృతమ్" అని ఉపక్రమించి "సైషా విరాడన్నాదీ" అని చెప్పబడింది. ఈ పక్షంలో (అసలు గాయత్రితో సంబంధం ఏమీ లేకుండా) బ్రహ్మయే చెప్పబడింది గాన ఛందోభిధానమే లేదు. అన్ని విధాలా కూడ (అనగా వెనుక చెప్పినట్లు అర్థం చెప్పినా, గౌణార్థం చెప్పినా) పూర్వవాక్యంలో బ్రహ్మ చెప్పబడడం విషయంలో అభిప్రాయభేదం లేదు.

వి. ఛాందోగ్యోపనిషత్తులోని సంవర్గవిద్యలో అధిదైవానికి సంబంధించి అగ్ని-సూర్య-చంద్ర-జలాలు వాయువులో లీనం అవుతాయనీ, అధ్యాత్మానికి సంబంధించి వాక్-చక్షుః - శ్రోత్ర-మనస్సులు ప్రాణంలో లీనం అవుతాయనీ చెప్పబడింది. "తే వా ఏతే పఞ్చ అన్యే" ఈ అధిదైవికాలు ఐదూ, "పఞ్చ అన్యే" ఆధ్యాత్మికాలు ఐదు కలపగా పది అవుతాయి. వీటికి 'కృతం' అని పేరు అని పై శ్రుతివాక్యానికి అర్థం. పూర్వం ప్రచారంలో ఉన్న ద్యూతంలో కృత-త్రేత-ద్వాపర-కలులు అనే నాలుగు పందాలు ఉండేవట. గిలకరించి వేసిన శలాకలు (పాచికలు) తిరగా బోర్లా పడడాన్ని బట్టి నాలుగు పాయంట్లు వస్తే 'కృతం', మూడు వస్తే 'త్రేత', రెండు వస్తే 'ద్వాపరం', ఒకటి వస్తే 'కలి' అని పేర్లు. నాలుగులో మూడు ఇముడుతుంది., మూడులో రెండు ఇముడుతుంది, రెండులో ఒకటి ఇముడుతుంది. ఈ విధంగా కృతంలో 3, 2, 1 సంఖ్యలు ఇముడుతాయి గాన 'కృతం' అనగా పదిగా గ్రహించాలట. కృతంలో పది సంఖ్య ఉంది; వాయ్వాదుల్లో పది సంఖ్య ఉంది. అందుచేత వాయ్వాదులకు 'కృతం' అని పేరు పెట్టి ఈ కృతమే 'విరాట్' అనే ఛందస్సు అని "సైషా విరాడన్నాదీ" అనే వాక్యంలో చెప్పబడింది. విరాట్ ఛందస్సులో పది అక్షరాలు ఉంటాయి. పది అనే సంఖ్యను పట్టి పోలిక ఉండడంచేత వాయ్వాదులు 'విరాట్' అని చెప్పబడుతున్నాయి. ఈ విధంగా దశసంఖ్య ద్వారా వాయ్వాదులను 'కృతం'గాను, 'విరాట్' గాను ధ్యానించాలి. విరాట్‌గా ధ్యానించడంవల్ల ధ్యానించేవానికి సర్వమూ అన్నం అవుతుంది. కృతంగా ధ్యానించే వాడు అన్నం తినగలిగినవా డవుతాడు. 'కృతం' అనే పందెం పడినవాడు మిగిలిన మూడు పందాలవాళ్లనీ జయించేస్తాడు; మ్రింగి వేస్తాడు. అందుచేత కృతత్వధ్యానంవల్ల అన్నం మ్రింగేవా డవుతాడు. 'సా=కృత సంజ్ఞ గల, ఏషా=ఈ వాయ్వాదిదశాత్మకమైనది, విరాట్=విరాట్టు, అన్నాదీ=అన్నం తినేది అని "సైషా విరాడన్నాదీ" అనే శ్రుతివాక్యానికి అర్థం. ఈ ఘట్టంలో ఛందస్సు అనే అర్థం గల 'విరాట్' శబ్దం దశసంఖ్యాసామ్యాన్ని పట్టి వాయ్వాదిదశకం అనే అర్థంలో ప్రయోగించబడి నట్లు 'గాయత్రీ' శబ్దం బ్రహ్మ అనే అర్థంలో ప్రయోగించబడింది అని **'తథా హి దర్శనమ్'** అనేదాని భావం. ఈ పక్షంలో **"చేతోర్పణనిగదాత్"** అనే పదానికి "చేతోర్పణ" ఏ గాయత్రీ శబ్దం నాలుగు పాదాలు కలిగి ఉండడం అనే గుణంయొక్క సామ్యంవల్ల బ్రహ్మ యందు సమర్పించబడుతుందో, అనగా బ్రహ్మను బోధించేదిగా చెప్పబడుతుందో, అట్టి గాయత్రీశబ్దంచేత, నిగదాత్= బ్రహ్మయే చెప్ప డంవల్ల" అని అర్థం చెప్పు కోవాలి."అపర ఆహ" అని అంటూ ఈ పక్షాన్ని ప్రస్తావించడంవల్ల ఇది తమకు అభిమతం కాదని భగవత్పాదులు సూచిస్తున్నారు. దీని విషయమైన విస్తృతచర్చ బ్రహ్మ విద్యాభరణంలో చూచుకొనవచ్చును.

## సూ. భూతాదివ్యపదేశోపపత్తేశ్చైవమ్ 1.1.26

ఇతశ్చైవమభ్యుపగన్తవ్యమస్తి పూర్వస్మిన్ వాక్యే ప్రకృతం బ్రహ్మేతి, యతో భూతాదీన్ పాదాన్వ్యపదిశతి. భూతపృథివీశరీరహృదయాని హి నిర్దిశ్యాహ "సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ" ఇతి. న హి బ్రహ్మానాశ్రయణే కేవలస్య ఛన్దసో భూతాదయః పాదా ఉపపద్యన్తే. అపి చ బ్రహ్మానాశ్రయణే నేయమృక్ సంబధ్యేత - "తావానస్య మహిమా" ఇతి. అనయా హి ఋచా స్వరసేన బ్రహ్మైవాభిధీయతే, "పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఛా. ఉ. 3.12.5) ఇతి సర్వాత్మత్వోపపత్తేః. పురుషసూక్తేఽపీయమేవ ఋక్ బ్రహ్మపరతయైవ సమామ్నాయతే. స్మృతిశ్చ బ్రహ్మణ ఏవంరూపతాం దర్శయతి - "విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" (భ.గీ. 10.42) ఇతి. "యద్వై తద్బ్రహ్మ" (ఛా.ఉ. 3.12.7) ఇతి చ నిర్దేశః ఏవం సతి ముఖ్యార్థ ఉపపద్యతే. "తే వా ఏతే పఞ్చ బ్రహ్మపురుషాః" ఛా.ఉ. 3.13-6) ఇతి చ హృదయసుషిషు బ్రహ్మపురుషశ్రుతిః బ్రహ్మసంబంన్ధితాయాం సంభవతి. తస్మాదస్తి పూర్వస్మిన్వాక్యే బ్రహ్మ ప్రకృతమ్. తదేవ బ్రహ్మ జ్యోతిర్వాక్యే ద్యుసంబన్ధాత్ప్రత్యభిజ్ఞాయమానం పరామృశ్యతే ఇతి స్థితమ్ 26.

### బాలానందిని

భూతేతి:- ''భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చ'' భూతాదులను పాదంగా చెప్పడం కుదురుతుంది గాన, ఏవమ్ = ఇట్లు అనగా పూర్వవాక్యంలో బ్రహ్మ ప్రకృతం అని చెప్పాలి'' అని సూత్రార్థం.

ఇతశ్చేతి: (గాయత్రికి) భూతాదులు పాదాలు అని (శ్రుతి) చెప్పుచున్నది: అందువల్ల కూడ పూర్వవాక్యంలో బ్రహ్మ ప్రకృతం అని అంగీకరించవలసి ఉంది. భూత - పృథివీ - శరీర - హృదయాలను నిర్దేశించి - "సైషా గాయత్రీ" (అట్టి ఈ గాయత్రి నాలుగు పాదాలు గలది, ఆరు విధాలైనది) అని చెప్పుచున్నది కదా. బ్రహ్మను ఆశ్రయించకపోతే, అనగా బ్రహ్మ అని అర్థం చెప్పకపోతే, కేవలమైన ఛందస్సుకు భూతాదులు పాదాలు అని చెప్పడం కుదరదు కదా? మరొక విషయమే మనగా - బ్రహ్మను ఆశ్రయించకపోతే "తావానస్య మహిమా" అనే ఋక్కు దీనికి సంబంధించదు (కుదరదు). "పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అని అంటూ ఈ ఋక్కు స్వారస్యంచేత బ్రహ్మనే భోదిస్తున్నది. సర్వాత్మత్వం బ్రహ్మకే కుదురుతుంది

కదా? పురుషసూక్తంలో కూడ ఈ ఋక్కు బ్రహ్మపరంగానే చెప్పబడింది. "విష్టభ్యా... జగత్" (నేను ఈ జగత్తు నంతా ఒక అంశంచేత నిలబెట్టి ఉన్నాను). అని స్మృతి కూడ బ్రహ్మ ఇలాంటిది అని చూపుతున్నది. పూర్వవాక్యంలో బ్రహ్మనిర్దేశం ఉన్న దని అంగీకరించి నప్పుడు "యద్వై తద్ బ్రహ్మ" అనే వాక్యంలోని 'బ్రహ్మ' శబ్దానికి (పూర్వపక్షి చెప్పి నట్లు ఛందస్సు అని అర్థం కాక) బ్రహ్మ అని ముఖ్యార్థాన్ని చెప్పడం కుదురుతుంది. ఇక్కడ చెప్పిన ఉపాసనకు బ్రహ్మసంబంధం ఉందని అంగీకరిస్తేనే, "తే వా ఏతే బ్రహ్మపురుషాః" అనే వాక్యంచేత హృదయరంధ్రాల దగ్గర బ్రహ్మ పురుషు లున్నా రని చెప్పడం కుదురుతుంది. అందువల్ల పూర్వవాక్యంలో బ్రహ్మ ప్రకృతమై ఉంది. ద్యులోకసంబంధాన్ని పట్టి జ్యోతిర్వాక్యంలో కూడ ఆ బ్రహ్మమే చెప్పబడిం దని గుర్తించబడి పరామర్శించబడుచున్న దని నిశ్చితమైనది.

వి. హృదయానికి నాలుగు వైపులా నాలుగు, పైన ఒకటి మొత్తం ఐదు రంధ్రా లుంటాయి. హృదయం బ్రహ్మకు నివాసస్థాన మైన నగరం. దాని ప్రాగాది ద్వారాలు ఐదింటి దగ్గర ప్రాణాపానవ్యానోదానసమానాలు ఐదుగురు ద్వారపాలకులుగా ఉన్నట్లు, వారు బ్రహ్మపురుషు లన్నట్లు ఉపాసన చెయ్యాలని "తే వా ఏతే పఞ్చ బ్రహ్మపురుషాః" ఇత్యాదివాక్యాలలో చెప్పబడినది. హృదయంలో ఉన్నది బ్రహ్మ అవుతేనే ఆ ద్వారపాలకులు బ్రహ్మపురుషు లని చెప్పడం కుదురుతుంది. దానిని పట్టి కూడ కేవలం గాయత్రియే కాక గాయత్ర్యనుగతబ్రహ్మ ప్రకృతమైనట్లు తెలుస్తున్న దని భావం. 26.

**సూ. ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్ 1.1.27**

యదప్యేతదుక్తం పూర్వత్ర "త్రిపాదస్యామృతం దివి" ఇతి సప్తమ్యా ద్యౌరాధారత్వేనోపదిష్టా, ఇహ పునః "అథ యదతః పరో దివః" ఇతి పఞ్చమ్యా మర్యాదాత్వేన; తస్మాదుపదేశభేదాన్న తస్యేహ ప్రత్యభిజ్ఞానమస్తీతి; తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే. నాయం దోషః. ఉభయస్మిన్నప్యవిరోధాత్; ఉభయస్మిన్నపి సప్తమ్యన్తే పఞ్చమ్యన్తే చోపదేశే న ప్రత్యభిజ్ఞానం విరుధ్యతే. యథా లోకే వృక్షాగ్రసంబన్ధోఽపి శ్యేన ఉభయథోపదిశ్యతే వృక్షాగ్రే శ్యేనః, వృక్షాగ్రాత్పరతః శ్యేనః - ఇతి చ. ఏవం దివ్యేవ సద్ బ్రహ్మ దివః పరమిత్యుపదిశ్యతే.

అపర ఆహ - యథా లోకే వృక్షాగ్రేణాసంబన్ధోఽపి శ్యేనః ఉభయ యథోపదిశ్యమానో దృశ్యతే, వృక్షాగ్రే శ్యేనో, వృక్షాగ్రాత్పరతః శ్యేన ఇతి చ, ఏవం చ

దివః పరమపి సద్ బ్రహ్మ దివీత్యుపదిశ్యతే తస్మాదస్తి పూర్వనిర్దిష్టస్య బ్రహ్మణ ఇహ ప్రత్యభిజ్ఞానమ్. అతః పరమేవ బ్రహ్మ జ్యోతిఃశబ్దమితి సిద్ధమ్.27

## బాలానందిని

ఉపదేశేతి:- "ఉపదేశభేదాత్ = ఒక చోట సప్తమిని మరొక చోట పంచమిని ఉపయోగించి ఉపదేశం చేయడంలో భేదం ఉండడంవల్ల, న ఇతి చేత్ = అక్కడ చెప్పినదే ఇది అని చెప్పకూడదు అన్నట్లయితే, న = అట్లనగూడదు. ఉభయస్మిన్నపి = రెండు విధాలా చెప్పినా కూడ, అవిరోధాత్ = విరోధం లేదు గాన" అని సూత్రార్థం.

యదపీతి: "త్రిపాదస్యామృతం దివి" అనే వెనుకటి వాక్యంలో సప్తమీవిభక్తి చేత ద్యులోకం ఆధారంగా చెప్పబడింది; ఇక్కడైతే "అథ యదతః పరో దివః" అని పంచమీవిభక్తిచేత ద్యులోకం మర్యాదగా (హద్దుగా) చెప్పబడింది; ఈ విధంగా ఉపదేశంలో (చెప్పడంలో) భేదం ఉండడంచేత వెనుక చెప్పినదానికి ఇక్కడ ప్రత్యభిజ్ఞానం ("అదే ఇది" అనే జ్ఞానం ప్రత్యభిజ్ఞానం) కుదరదు అని (పూర్వ పక్షి) ఏది చెప్పినాడో ఆ విషయంలో చెపుతున్నాం - ఇది దోషం కాదు. రెండింటిలో ఏ విధంగా చెప్పినా విరోధం లేదు - ఉభయస్మిన్నపి = సప్తమ్యంతమైన ఉపదేశం చేసినా పంచమ్యంతోపదేశం చేసినా ప్రత్యభిజ్ఞానం చేయడంలో విరోధం (దోషం) లేదు. లోకంలో చెట్టు చివర కూర్చున్న డేగను గూర్చి "ఆ డేగ చెట్టు చివర ఉంది" అనీ, "ఆ డేగ చెట్టు కొన అవతల ఉంది" అనీ రెండు విధాల చెప్పడం కనబడుతుంది; అట్లే ద్యులోకంలోనే ఉన్నా బ్రహ్మను గూర్చి ద్యులోకానికి అవతల అని చెప్పబడుతున్నది.

మరొకడు ఇలా వ్యాఖ్యానించాడు - లోకంలో డేగకు వృక్షంతో సంబంధం లేకపోయినా "వృక్షాగ్రంమీద డేగ ఉంది" "వృక్షాగ్రంపైన డేగ ఉంది" అని రెండువిధాల చెప్పడం ఎలా కనబడుతున్నదో అట్లే బ్రహ్మ ద్యులోకంకంటె దూరంగా ఉన్నా ద్యులోకంలో ఉంది అని చెప్పబడుతున్నది. అందువల్ల పూర్వం నిర్దేశించబడిన బ్రహ్మకే ఈ వాక్యంలో ప్రత్యభిజ్ఞానం ఉంది. అందుచేత జ్యోతిఃశబ్దవాచ్యం పరబ్రహ్మమే అని నిశ్చితం.

"అపర ఆహ"అని చెప్పడంచేత మొదటి వ్యాఖ్యానమే భాష్యకారసంమత మని తెలుస్తున్న దని బ్రహ్మవిద్యాభరణంలో సయుక్తికంగా వివరించబడింది.

## జ్యోతిశ్చరణాధికరణం సమాప్తం

## ప్రతర్దనాధికరణమ్. సూ. 28-31

### సూ. ప్రాణస్తథానుగమాత్. 1.1.28.

అస్తి కౌషీతకిబ్రాహ్మణోపనిషది ఇన్ద్రప్రతర్దనాఖ్యాయికా - "ప్రతర్దనో హ వై దైవోదాసిరిన్ద్రస్య ప్రియం ధామోపజగామ యుద్ధేన చ పౌరుషేణ చ" ఇత్యారభ్యామ్నాతా. తస్యాం శ్రూయతే - "స హోవాచ ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృతమిత్యుపాస్స్వ" ఇతి. తథా ఉత్తరత్రాపి -"అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" (కౌ.3.1,2,3) ఇతి. తథా "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాది. అన్తే చ "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దోఽజరోఽమృతః"(కౌ3.8) ఇత్యాది. తత్ర సంశయః - కిమిహ ప్రాణశబ్దేన వాయుమాత్రమభిధీయతే, ఉత దేవతాత్మా, ఉత జీవః అథవా పరం బ్రహ్మేతి. నను "అత ఏవ ప్రాణః" ఇత్యత్ర వర్ణితం ప్రాణశబ్దస్య బ్రహ్మపరకత్వమ్. ఇహాపి చ బ్రహ్మలిఙ్గ మస్తి-"ఆనన్దోఽజరోఽమృతః" ఇత్యాది. కథమిహపునః సంశయః సంభవతి? అనేకలిఙ్గదర్శనాదితి బ్రూమః. న కేవలమిహ బ్రహ్మలిఙ్గమేవోపలభ్యతే. సన్తి హీతరలిఙ్గాన్యపి. "మామేవ విజానీహి" (కౌ.3.1.) ఇతీన్ద్రస్య వచనం దేవతాత్మలిఙ్గమ్ "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" ఇతి ప్రాణలిఙ్గమ్; 'న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్' ఇత్యాది జీవలిఙ్గమ్; అత ఉపపన్నః సంశయః. తత్ర ప్రసిద్ధేర్వాయుః ప్రాణ ఇతి ప్రాప్త ఉచ్యతే-

### బాలానందిని

ప్రాణ ఇతి:- "ప్రాణః=ప్రాణం బ్రహ్మయే, తథా=బ్రహ్మపరంగా, అనుగమాత్ = పదాల అన్వయం ఉండంవల్ల" అని సూత్రార్థం.

అస్తీతి:- కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తులో "ప్రతర్దనః... పౌరుషేణ చ" (దివోదాసుని పుత్రుడైన ప్రతర్దనుడు యుద్ధంలో సహాయంచేయడంచేత పౌరుషంచేత, ఇంద్రునికి ప్రియమైన స్థానానికి వెళ్లాడు) అని ఉపక్రమించి చెప్పబడిన ఇంద్రప్రతర్దనాఖ్యాయిక ఉన్నది. ఆ ఆఖ్యాయికలో "స... ఉపాస్స్వ" (ఆ అంద్రుడు ఇలా అన్నాడు, నేను ప్రజ్ఞాత్మ యైన ప్రాణాన్ని; అలాంటి నన్ను అయుర్దాయం అనీ అమృతం (మరణరాహిత్యం) అనీ ఉపాసించు) అని వినబడుచున్నది. అట్లే తరవాత కూడ -

"**అథ... ఉత్థాపయతి**" (ప్రజ్ఞాత్మయైన ప్రాణమే ఈ శరీరాన్ని పట్టుకొని లేవదీస్తుంది) అని, అట్లే - "**న వాచం.. విద్యాత్**"వాక్కును తెలుసుకొనడంకోసం ఇచ్ఛయించగూడదు; మాట్లాడేవాణ్ణి తెలుసుకోవాలి) ఇత్యాదికమూ చివర '' స ఏష... అమృతః'' (ప్రజ్ఞాత్మయైన ఈ ప్రాణం ఆనందరూపం, జరారహితం మరణరహితం) ఇత్యాదికమూ వినబడుతున్నది. ఇక్కడ ప్రాణశబ్దంచేత ప్రాణవాయువు మాత్రమే చెప్పబడుతున్నదా, లేక దేవతాత్మయా లేక జీవుడా లేక పరబ్రహ్మ చెప్పబడుతున్నదా అని సంశయం. (ప్రశ్న) "**అత ఏవ ప్రాణః**" అనే సూత్రంచేత ప్రాణశబ్దం బ్రహ్మవాచకం అని వెనుక వర్ణింపబడింది కదా? ఇక్కడ కూడ ''అనన్దోఽజరోఽమృతః'' ఇత్యాదికమైన బ్రహ్మలింగం ఉంది. ఇంక సంశయం ఎందుకు కలుగుతుంది? (సమాధానం) అనేకమైనవాటి లింగాలు కనబడడంవల్ల అని అంటాం. ఇక్కడ బ్రహ్మలింగం ఒక్కటే కనబడడంలేదు. ఇతరలింగాలు కూడ కనబడుతున్నాయి. "**మామేవ విజానీహి**" (నన్నే తెలుసుకో) అని ఇంద్రుని వచనం దేవతాత్మలింగం. (ఇంద్రుడు దేవత గాన దేవతాత్మ నైన నన్ను తెలిసికో అని చెప్పిన ట్లయిన దని భావం). "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" (వాగాదులు దేహధారణం చేయజాలవు. ప్రాణమే ఈ శరీరాన్ని పట్టుకొన్ని లేవదీస్తుంది) అనే వాక్యం ప్రాణానికి (ప్రాణవాయువు అనే అర్థం చెప్పడానికి) లింగం. "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాదికం జీవుని లింగం. అందువల్ల సంశయం ఉపన్నమే. వీటిలో ప్రసిద్ధిని పట్టి వాయువే ప్రాణం అని ప్రాప్తించగా (చెప్పవలసి ఉండగా) చెప్పబడుచున్నది.

వి. వెనుకటి అధికరణంలో పూర్వవాక్యప్రకృత మైన బ్రహ్మను బోధించే యచ్ఛబ్దంయొక్క బలంచేత జ్యోతిఃశ్రుతి బ్రహ్మను బోధిస్తుంది అని నిర్ణయించబడింది. ఇక్కడ పరస్పరవిరుద్ధాలైన అనేకలింగా లుండడంచేత బ్రహ్మయే ప్రతిపాదించబడుతున్న దని నిశ్చయించడం కుదరదు అని పై అధికరణంతో దీనికి ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షంలో అనేకమైన ప్రాణాదుల ఉపాసన ఫలం, సిద్ధాంతంలో జీవుణ్ణి బ్రహ్మగా భావించడం ఫలం.

## భాష్యమ్

ప్రాణశబ్దం బ్రహ్మ విజ్ఞేయమ్. కుతః? తథానుగమాత్. తథాహి పౌర్వాపర్యేణ పర్యాలోచ్యమానే వాక్యే పదానాం సమన్వయో బ్రహ్మప్రతిపాదనపరః ఉపలభ్యతే. ఉపక్రమే తావత్ "వరం వృణీష్వ" ఇతీన్ద్రేణోక్తః ప్రతర్దనః పరమం పురుషార్థం వరముపచిక్షేప "త్వమేవ మే

వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" ఇతి. తస్మై హిత తమత్వేనోపదిశ్యమానః ప్రాణః కథం పరమాత్మా న స్యాత్? న హ్యన్యత్ర పరమాత్మజ్ఞానాద్ధితతమప్రాప్తిరస్తి - "తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ" (శ్వేతా.3.8.) ఇత్యాది శ్రుతిభ్యః. తథా - "స యో మాం వేద న హ వై తస్య కేన చన కర్మణా లోకో మీయతే, న స్తేయేన న భ్రూణహత్యయా" (కౌ.3.1) ఇత్యాది చ బ్రహ్మపరిగ్రహే ఘటతే. బ్రహ్మవిజ్ఞానేన హి సర్వకర్మక్షయః ప్రసిద్ధః "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ము.ఉ.2.28) ఇత్యాద్యాసు శ్రుతిషు. ప్రజ్ఞాత్మత్వం చ బ్రహ్మపక్ష ఏవోపపద్యతే; న హ్యచేతనస్య వాయోః ప్రజ్ఞాత్మత్వం సంభవతి. తథోపసంహారేఽపి"ఆనన్దోఽజరోఽమృతః" ఇత్యానన్దత్వాదీని న బ్రహ్మణోఽన్యత్ర సంభవన్తి. "స న సాధునా కర్మణా భూయాన్ భవతి నో ఏవాసాధునా కర్మణా కనీయానేష హ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష ఉ ఏవాసాధు కర్మ కారయతి తం యమేభ్యో లేకేభ్యోఽధో నినీషతే" ఇతి. "ఏష లోకాధిపతిరేష లోకేశః" (కౌ.3.8) ఇతి చ. సర్వమేతత్పరస్మిన్ బ్రహ్మణ్యాశ్రీయమాణేఽనుగన్తుం శక్యతే న ముఖ్యే ప్రాణే. తస్మాత్ప్రాణో బ్రహ్మ. 28.

## బాలానందిని

ప్రాణేతి:- బ్రహ్మయే ప్రాణశబ్దం కలదిగా (ప్రాణశబ్దంచేత చెప్పబడేదిగా) తెలియదగినది. ఎందువలన? అలా అన్వయం ఉండడంవలన. అది యుక్తమే కదా? వాక్యంలో ఉన్న పదాల అర్థాల పౌర్వాపర్యం (ముందువెనుకలు) పరశీలించగా వాటి సమన్వయం బ్రహ్మను ప్రతిపాదించేదిగానే కనబడుతున్నది. ప్రారంభంలో నీ కిష్టమైన వరం కోరుకో అని ఇంద్రుడు పలకగా ప్రతర్దనుడు -"త్వమేవ... మన్యసే" (మనుష్యునికి ఏది అత్యంతహితమైన దని నువ్వు అనుకొంటావో దానినే నాకోసం నువ్వే కోరుము) అని అంటూ అత్యుత్తమమైన పురుషార్థాన్ని వరంగా చెప్పాడు. అలాంటివానికి హితతమంగా చెప్పబడే ప్రాణం పరమాత్మ కాకుండా ఎలా ఉంటుంది? పరమాత్మజ్ఞానంకంటె భిన్నమైన హితతమప్రాప్తి ఏదీ లేదు కదా? "తమేవ... అయనాయ" (ఆ పరమాత్మను తెలుసుకొని మాత్రమే మృత్యువును తరిస్తాడు; మృత్యువును దాటడానికి మరొక మార్గం లేదు) ఇత్యాది శ్రుతులు ఈ విషయమే చెపుతున్నాయి

కదా? అట్లే "స యో...హత్యయా"(ఎవ్వడైతే నన్ను తెలుసుకుంటాడో వాని లోకం (మోక్షం) ఏ కర్మచేతనూ కూడ హింసించబడదు. దొంగతనంచేత గాని, భ్రూణహత్యచేత గాని హింసించబడదు) ఇత్యాదివాక్యం కూడ బ్రహ్మను గ్రహిస్తేనే కుదురుతుంది. బ్రహ్మజ్ఞానంచేత సర్వకర్మలు నశిస్తాయని "క్షీయన్తే...పరావరే" (అత్యుత్తముడైన ఆ పరమాత్మ చూడబడిన తరవాత వాని కర్మ లన్నీ నశిస్తాయి) ఇత్యాది శ్రుతులలో ప్రసిద్ధం కదా? బ్రహ్మ అనే పక్షంలోనే ప్రజ్ఞాత్మత్వం (జ్ఞానస్వరూపత్వం) కుదురుతుంది. అచేతనమైన వాయువు ప్రజ్ఞాత్మ కాజాలదు కదా? అట్లే ఉపసంహారవాక్యాలలో 'ఆనన్దః **అజరః అమృతః**' అని చెప్పిన ఆనందత్వాదులు బ్రహ్మ తప్ప మరొకదానికి దేనికీ సంభవించవు "స..నీనీషతే" (ఆత్మసాక్షాత్కారం పొందినవాడు సాధుకార్యంచేత గొప్పవాడు కాడు, అసాధుకర్మచేత చెడ్డవాడు కాడు. ఎవనిని ఈ లోకాలనుండి పైకి తీసికొని వెళ్లవలె నని అనుకుంటాడో వానిచేత (పరమాత్మ) మంచి కర్మ చేయిస్తాడు ఎవనిని క్రిందిలోకాలకు తీసుకొనివెళ్లా లనుకుంటాడో వానిచేత చెడ్డ కర్మ చేయిస్తాడు), "ఏ ష...లోకేశః" (ఇతడే లోకాలకు అధిపతి, ఇతడే లోకాలను నియమించగలవాడు) ఇత్యాది శ్రుతివాక్యాలు బ్రహ్మభిన్నమైనవాటి విషయంలో కుదరవు. ఇదంతా పరబ్రహ్మని ఆశ్రయిచినప్పుడు (పరబ్రహ్మ అని అర్థం చెప్పినప్పుడే) అన్వయించడానికి కుదరుతుంది గాని ముఖ్యప్రాణాన్ని గ్రహిస్తే కుదరదు. అందువల్ల ప్రాణం బ్రహ్మయే. 28.

**సూ. న వక్తురాత్మోపదేశాదితి చేదధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్. 1.1.29.**

యదుక్తం ప్రాణో బ్రహ్మేతి, తదాక్షిప్యతే - న పరం బ్రహ్మ ప్రాణశబ్దమ్. కస్మాత్? వక్తురాత్మోపదేశాత్. వక్తా హీన్ద్రో నామ కశ్చిద్విగ్రహవాన్ దేవతావిశేషః స్వమాత్మానం ప్రతర్దనాయాచచక్షే "మామేవ విజానీహి" ఇత్యుపక్రమ్య "ప్రాణోऽస్మి ప్రజ్ఞాత్మా" ఇత్యహఙ్కారవాదేన. స ఏష వక్తురాత్మత్వేనోపదిశ్యమానః ప్రాణః కథం బ్రహ్మ స్యాత్? న హి బ్రహ్మణో వక్తృత్వం సంభవతి - "అవాగమనాః" (బృ.ఉ.3.8.8) ఇత్యాదిశ్రుతిభ్యః. తథా విగ్రహసంబన్ధిభిరేవ బ్రహ్మణ్యసంభవద్భిర్ధర్మైరాత్మానం తుష్టావ -"త్రిశీర్షాణం త్వాష్ట్రమహనమరున్ముఖాన్యతీన్ శాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్" ఇత్యేవమాదిభిః. ప్రాణత్వం చేన్ద్రస్య బలవత్త్వాదుపపద్యతే; "ప్రాణో వై బలమ్" ఇతి హి విజ్ఞాయతే. బలస్య చేన్ద్రో దేవతా ప్రసిద్ధా. యా చ కాచిద్బలకృతిరిన్ద్రకర్మైవ తత్ ఇతి హి వదన్తి.

ప్రజ్ఞాత్మత్వమప్య ప్రతిహతజ్ఞానత్వాద్దేవతాత్మనః సంభవతి; అప్రతిహతజ్ఞానా దేవతా ఇతి హి వదన్తి. నిశ్చితే చైవం దేవతాత్మోపదేశే హితతమత్వాదివచనాని యథాసంభవం తద్విషయాణ్యేవ యోజయితవ్యాని. తస్మాద్వక్తురిన్ద్రస్యాత్మోపదేశాన్న ప్రాణో బ్రహ్మేత్యాక్షిప్య ప్రతిసమాధీయతే.

### బాలానందిని

నేతి:- వక్తుః = వక్తయైన ఇంద్రునియొక్క ఆత్మోపదేశాత్= తనను గూర్చి చెప్పడంవల్ల న=ప్రాణం బ్రహ్మ కాదు. ఇతి చేత్=అన్నట్లయితే (అది కాదు). అస్మిన్=ఈ అధ్యాయంలో. అధ్యాత్మసంబన్ధభూమా హి = ప్రత్యగాత్మసంబంధముయొక్క బాహుల్యం ఉంది కదా'' అని సూత్రార్థం.

యదుక్తమితి:- ప్రాణం బ్రహ్మ అని ఏది చెప్పబడిందో అది ఆక్షేపించబడుచున్నది - పరబ్రహ్మ ప్రాణశబ్దవాచ్యం కాదు. ఎందువలన? వక్తకు ఆత్మనుగా ఉపదేశించడంవల్ల. శరీరం గల ఒకానొక ఇంద్రు డనే దేవత మాటలాడుతూ "మామేవ విజానీహి"(నన్నే తెలుసుకో) అని ఉపక్రమించి "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా"(నేను ప్రజ్ఞాత్మ యైన ప్రాణాన్ని) అని అహంకారపూర్వకంగా తనను గూర్చి ప్రతర్దనునికి చెప్పాడు. వక్త యైన ఆ ఇంద్రునికి ఆత్మగా చెప్పబడుతున్న అదే ప్రాణం బ్రహ్మ ఎట్లు అవుతుంది? "అవాగమనాః" (వాక్కు లేనిది మనస్సు లేనిది) అని శ్రుతులలో వర్ణింపబడిన బ్రహ్మకు వక్తృత్వం కుదరదు కదా? అట్లే -శరీరంతో సంబంధించినవి, బ్రహ్మ విషయంలో కుదరనివి అయిన "త్రి శీర్షాణం... ప్రాయచ్ఛమ్" (త్వష్ట కుమారుడైన త్రిశీర్షుణ్ణి సంహరించాను. వేదాంతం ముఖాలలో లేని, అనగా ఆత్మవిద్యాభిముఖులు కాని, కొందరు యతులను అడవి కుక్కలకు ఆహారంగా ఇచ్చాను) మొదలైన కొన్ని ధర్మాలచేత (పనులచేత) ఇంద్రుడు తనను స్తుతించుకొన్నాడు. ఇంద్రుడు బలవంతుడు గాన అతనిని ప్రాణం అనడం కూడ ఉపపన్నమే. "ప్రాణో వైబలమ్" (ప్రాణమే బలం) అని తెలియబడుచున్నది కదా? ఇంద్రుడు బలానికి అధిష్ఠానదేవత అనేది ప్రసిద్ధం. బలం ప్రకృతిగా గలది (బలంచేత సాధించవలసినది) ఏదైనా అది ఇంద్రుని పనియే అని అంటారు. దేవతాత్మ అడ్డు లేని జ్ఞానం కలది గాన అది ప్రజ్ఞాత్మ (జ్ఞానస్వరూపం) అని చెప్పడం కూడ సంభవస్తుంది. దేవతల జ్ఞానానికి ఏ విధమైన అడ్డంకులూ ఉండవని అంటారు కదా? ఈ విధంగా ఇక్కడ చేసినది దేవతాత్మోపదేశమే అని నిశ్చితం అయిన తరవాత ఇక్కడ ఉన్న హితతమత్వాదివచనాలు కూడ యథాసంభవంగా (ఏదోవిధంగా) దేవతాత్మకు సంబంధించినవిగానే అన్వయించాలి.

అందువల్ల వక్తయైన ఇంద్రుడు తనను గూర్చి చెప్పడంవల్ల ప్రాణం బ్రహ్మ కాదు అని ఆక్షేపించి సమాధానం చెప్పబడుచున్నది-

## భాష్యమ్

"అధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్" ఇతి. అధ్యాత్మసంబన్ధః ప్రత్యగాత్మసంబన్ధః. తస్య భూమా బాహుల్యమ్ అస్మిన్నధ్యాయే ఉపలభ్యతే. "యావద్ధ్యస్మిన్ శరీరే ప్రాణో వసతి తావదాయుః" ఇతి ప్రాణస్యైవ ప్రజ్ఞాత్మనః ప్రత్యగ్భూతస్యాయుష్ప్రదానోపసంహారయోః స్వాతన్త్ర్యం దర్శయతి, న దేవతావిశేషస్య పరాచీనస్య. తథాస్తిత్వేచప్రాణానా నిఃశ్రేయసమిత్యధ్యాత్మ మేవేన్ద్రియాశ్రయం ప్రాణం దర్శయతి. తథా. "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" (కౌ.3.3.)ఇతి "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇతి చోపక్రమ్య "తద్యథారథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేష్వర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దో2జరో2మృతః" ఇతి విషయేన్ద్రియవ్యవహారనాభి భూతం ప్రత్యగాత్మానమేవోపసంహరతి. "స మ ఆత్మేతి విద్యాత్" ఇతి చోపసంహారః ప్రత్యగాత్మపరిగ్రహే సాధుః న పరాచీనపరిగ్రహే. "అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః" (బృ.ఉ.2.5.19) ఇతి చ శ్రుత్యన్తరమ్. తస్మాదధ్యాత్మ సంబన్ధబాహుల్యాత్ బ్రహ్మోపదేశ ఏవాయం, న దేవతాత్మోపదేశః

## బాలానందిని

**అధ్యాత్మేతి:-** "అధ్యాత్మసంబన్ధభూమ్యాహ్యస్మిన్"- ఈ అధ్యాయంలో ప్రత్యగాత్మ (జీవ) సంబంధంయొక్క బాహుల్యం కనబడుతున్నది. అనగా జీవాత్మ సంబంధం ఎక్కువగా ఉంది. "యావత్..ఆయుః" (ఈ శరీరంలో ప్రాణం ఎంతవరకు ఉంటుందో అంతవరకే ఆయుర్దాయం) అని ప్రజ్ఞాత్మా ప్రత్యక్భూ (అంతఃకరణాదులకంటె లోపల ఉండేది) అయిన ప్రాణానికే ఆయుస్సు ఇవ్వడంలోను, ఉపసంహరించడంలోను స్వాతంత్ర్యం ఉన్నట్లు చూపుచున్నది గాని పరాచీనమైన (బైటనున్న) దేవతాత్మ కున్నట్లు చూపడం లేదు. అట్లే - ప్రాణాలు ఉంటేనే నిఃశ్రేయసం అనగా ఇంద్రియాలు నిలవడం అనే మంచి జరుగుతుంది అని ("అథాతో నిఃశ్రేయసాదానమ్"ఇత్యాది శ్రుతి) చూపుచున్నది. అదే విధంగా - "ప్రాణ... ఉత్థాపయతి" (ప్రజ్ఞాత్మయైన ప్రాణమే ఈ

శరీరాన్ని నిలిపి లేవదీస్తున్నది) అని, ''న...విద్యాత్'' (వాక్కును తెలుసుకొని నిశ్చయించగూడదు, వక్తనే తెలుసుకొనాలి) అనీ ఉపక్రమించి, ''తద్యథా...అర్పితాః'' (రథచక్రం అకులమీద చక్రం అంచు ఏ విధంగా కూర్చబడిందో ఆకులు నాభియందు (చక్రం మధ్య ఎత్తుగా కొంచెం గుండ్రంగా ఉన్న దిమ్మమీద) అమర్చబడ్డాయో అట్లే ఈ భూతమాత్రలు ప్రజ్ఞామాత్రలయందు నిలపబడ్డాయి, ప్రజ్ఞామాత్రలు ప్రాణంమీద నిలపబడ్డాయి) స...అజరోఽమృతః" (అట్టి ఈ ప్రాణమే ప్రజ్ఞాత్మ, ఆనందం, జరారహితం నాశరహితం) అని విషయేంద్రియాలచేత తిరస్కరించబడని ప్రత్యగాత్మనే ఉపసంహరిస్తూన్నది.

వి. భూతమాత్రాః=పంచమహాభూతాలు, భోగ్యాలైన ఐదు శబ్దాదులు; మొత్తం పది. ప్రజ్ఞామాత్రాసు= ఐదు శబ్దాదులను గూర్చిన జ్ఞానాలు, పంచేంద్రియాలు; మొత్తం పది. పై పది తరవాత చెప్పిన పది ప్రజ్ఞామాత్రలమీద, అరాలమీద నేమి అమచ్చబడినట్లు అమర్చబడ్డాయి. ప్రజ్ఞామాత్రలు అరలు నాభియందు అమర్చబడి నట్లు ప్రాణంమీద (జీవునిమీద)అమర్చబడ్డాయి (ఆరోపించబడ్డాయి). ఆ ప్రాణమే నా స్వరూపం, అది ఆనందం, అజరం, అమృతం ఈ విధంగా ఇక్కడ ప్రత్యగాత్మయే చెప్పబడింది అని అర్థం.

స ఇతి:- "స మ ఆత్మేతి విద్యాత్" (అదే నా ఆత్మ అని తెలుసుకోవాలి) అని ఉపసంహారం ప్రత్యగాత్మను గ్రహిస్తేనే కుదురుతుంది కాని పరాచీనమైన దేవతాత్మను గాని ప్రాణవాయువునుగాని గ్రహిస్తే కుదరదు. "అయమ్...సర్వానుభూః" (ప్రత్యగాత్మయే సర్వాత్మయై సర్వాన్నీ అనుభవించే 'బ్రహ్మ') అని శ్రుత్యంతరంలో కూడ చెప్పబడింది. అందుచేత ఆ అధ్యాత్మసంబంధం అధికంగా ఈ ఘట్టంలో కనబడడంచేత ఇది బ్రహ్మోపదేశమే కాని దేవతాత్మోపదేశం కాదు.

వి. ఈ ఘట్టంలో ప్రారంభంనుంచి చివరివరకు అధ్యాత్మసంబంధం అనగా ప్రత్యగాత్మ(జీవ) పంబంధం ఎక్కువగా కనబడుతున్నది. ప్రత్యగాత్మను గూర్చియే ప్రతిపాదించడం జరిగింది. అదే నా ఆత్మ అని తెలుసుకో అని చెప్పడంచేత "అయమాత్మా బ్రహ్మ" అని బృహదారణ్యకోపనిషద్వాక్యంలో చెప్పి నట్లు ప్రత్యగాత్మయే పరమాత్మ అని చెప్పినట్లయింది. ఈ విధంగా ఇక్కడ ఇంద్రుడు బ్రహ్మను గూర్చియే చెపుతున్నాడు గాని ఒకానొక దేవతావిశేష మైన తనను గూర్చి చెప్పడంలేదు అందుచేత ప్రాణ శబ్దానికి పరమాత్మ అనియే అర్థం 29.

## భాష్యమ్

**కథం తర్హి వక్తురాత్మోపదేశః?**

### సూ. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్ 1.1.30

ఇన్ద్రో నామ దేవతాత్మా స్వమాత్మానం పరమాత్మత్వేనాహమేవ పరం బ్రహ్మేత్యార్షేణ దర్శనేన యథాశాస్త్రం పశ్యన్నుపదిశతి స్మ 'మామేవ విజానీహి' ఇతి. యథా "తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చ" ఇతి తద్వత్. 'తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్' (బృ.ఉ.1.4.10) ఇతి శ్రుతేః. యత్పునరుక్తం "మామేవ విజానీహి" ఇత్యుక్త్వా విగ్రహధర్మైరిన్ద్రః స్వమాత్మానం తుష్టావ త్వాష్ట్రవధాదిభిరితి తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే- న తావత్ త్వాష్ట్రవధాదీనాం విజ్ఞేయేన్ద్రస్తుత్యర్థత్వేనోపన్యాసః- యస్మాదేవంకర్మాహం, తస్మాన్మాం విజానీహి ఇతి; కథం తర్హి? విజ్ఞానస్తుత్యర్థత్వేన; యత్కారణం త్వాష్ట్రవధాదీని సాహసాన్యుపన్యస్య పరేణ విజ్ఞానస్తుతిమనుసందధాతి - "తస్య మే తత్ర లోమ చ న మీయతే స యో మాం వేద న హ వై తస్య కేన చ కర్మణా లోకో మీయతే" ఇత్యాదినా. ఏతదుక్తం భవతి - యస్మాదీదృశాన్యపి క్రూరాణి కర్మాణి కృతవతో మమ బ్రహ్మభూతస్య లోమాపి న హింస్యతే స యోఽన్యోఽపి మాం వేద, న తస్య కేన చిదపి కర్మణా లోకో హింస్యత ఇతి. విజ్ఞేయం తు బ్రహ్మైవ "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" ఇతి వక్ష్యమాణమ్. తస్మాద్బ్రహ్మవాక్యమేతత్. 30

## బాలానందిని

కథమితి:- అయితే వక్తయైన ఇంద్రుడు తనను గూర్చి చెప్పాడు కదా; అదెట్లు కుదరుతుంది? (సమాధానం) శాస్త్రదృష్ట్యేతి:- "వామదేవవత్=వామదేవుడు అన్నట్లు, శాస్త్రదృష్ట్యా తు =జీవాత్మ పరమాత్మలకు అభేదాన్ని బోధించే శాస్త్రంయొక్క దృష్టిచేత, ఉపదేశః=అలా చెప్పడం జరిగింది" అని సూత్రార్థం.

ఇన్ద్ర ఇతి:- దేవతాత్మయైన ఇంద్రు డనేవాడు నేనే పరబ్రహ్మను అనే ఆర్షదృష్టితో యథాశాస్త్రంగా తనను పరమాత్మనుగా చూస్తూ "మామేవ విజానీహి" నన్నే తెలుసుకో అని ఉపదేశించాడు. ఇది ఎట్లున్న దనగా "తద్ధైతత్...సూర్యశ్చ" దీనినంతనూ చూస్తూన్న వామదేవఋషి (తల్లిగర్భంలో ఉండగానే) నేనే మనువుగాను సూర్యుడు

గాను అయ్యాను అని అనుకొన్నాడు) అన్న విధంలో ఉంది. "తద్య...అభవత్" (దేవతలలో ఎవడెవడు ఆ బ్రహ్మను గూర్చి తెలుసుకొన్నాడో అతడు ఆ బ్రహ్మగానే అయ్యాడు అని శ్రుతి కూడ చెపుతున్నది.

వి. అందుచేత "నన్నే తెలుసుకో" అనగా బ్రహ్మను తెలుసుకో అని అర్థం. జన్మాంతరంలో చేసిన శ్రవణాదులచేత ఈ జన్మలో స్వభావసిద్ధంగా కలిగిన దర్శనం ఆర్షదర్శనం.

యత్సునరితి:- "మామేవ విజానీహి" అని చెప్పిన తరవాత అతడు శరీరంతో చేసే పనులైన త్వాష్ట్రవధాదులను పేర్కొని తనను స్తుతించినాడు కదా అని ఏ ఆక్షేపణ చెప్పబడిందో దానిని పరిహరించవలసి ఉంది. ఈ విషయంలో చెప్పబడుచున్నది. త్వాష్ట్రవధాదులు, నే నిలాంటి పనులు చేశాను కాబట్టి నన్ను గూర్చి తెలుసుకో అని తెలియ దగిన ఇంద్రుణ్ణి స్తుతించడం నిమిత్తం, చెప్పబడలేదు. మరెందుకు? విజ్ఞానాన్ని (బ్రహ్మజ్ఞానాన్ని) స్తుతించడంకోసం. ఇందుకు కారణమేమనగా- త్వాష్ట్రవధ మొదలైన సాహసకృత్యాలను గూర్చి చెప్పి "తస్య..మీయతే" (అలాంటి పనులు చేసిన నా వెంట్రుక కూడ ఊడలేదు; నన్ను ఎవడైతే తెలుసుకుంటాడో వానికి కూడ ఏ కర్మచేతనూ కూడ లోకం హీనం కాదు) అనే తరువాతి గ్రంథంచేత విజ్ఞానస్తుతిని నడిపిస్తున్నాడు. ఇది చెప్పిన ట్లయింది- ఇలాంటి క్రూరకర్మలు చేసినా కూడ బ్రహ్మ నైన నా రోమం కూడ ఊడలేదు గాన నన్ను తెలుసుకొన్న ఇతరునికి కూడ ఏ కర్మ చేసినా వాని పుణ్యలోకం (మోక్షం) హింసించబడదు. తెలియదగినది "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా" అని చెప్ప నున్న బ్రహ్మయే (కాని ఇంద్రుడు కాడు). అందువల్ల ఇది బ్రహ్మవాక్యం. 30

సూ. జీవముఖ్యప్రాణలిఙ్గాన్నేతి చేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్ 1.1.31

యద్యప్యధ్యాత్మభూమదర్శనాన్న పరాచీనస్య దేవతాత్మనః ఉపదేశః, తథాపిన బ్రహ్మవాక్యం భవితుమర్హతి. కుతః? జీవలిఙ్గాత్, ముఖ్యప్రాణలిఙ్గాచ్చ. జీవస్య తావదస్మిన్ వాక్యే విస్పష్టం లిఙ్గముపలభ్యతే- "న వాచం విజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాది. అత్ర హి వాగాదిభిః కరణైర్వ్యాపృతస్య కార్య కరణాధ్యక్షస్య జీవస్య విజ్ఞేయత్వమభిధీయతే. తథా ముఖ్య ప్రాణలిఙ్గమపి - "అథ ఖలు ప్రాణఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" ఇతి శరీరధారణం చ ముఖ్యప్రాణస్య ధర్మః. ప్రాణసంవాదే వాగాదీన్ ప్రకృత్య "తాన్వరిష్ఠః ప్రాణ ఉవాచ మామోహ మాపద్యథాహమేవైతత్పఞ్చధాత్మానం ప్రవిభజ్యైతద్బాణమవష్టభ్య విధారయామి" ఇతి శ్రవణాత్ .యే తు "ఇమం శరీరం పరిగృహ్య" ఇతి పఠన్తి

తేషామ్ ఇమం జీవమిన్ద్రియగ్రామం వా పరిగృహ్య శరీరముత్థాపయతీతి వ్యాఖ్యేయమ్. ప్రజ్ఞాత్మత్వమపి జీవే తావచ్చేతనత్వాదుపపన్నమ్. ముఖ్యేఽపి ప్రాణే ప్రజ్ఞాసాధనప్రాణాన్తరాశ్రయత్వాదుపపన్నమేవ. ఏవం జీవముఖ్యప్రాణపరిగ్రహే చ ప్రాణ ప్రజ్ఞాత్మనోః సహవృత్తిత్వేనాభేదనిర్దేశః, స్వరూపేణ చ భేదనిర్దేశః, ఇత్యుభయథాపి నిర్దేశ ఉపపద్యతే- "యో వై ప్రాణః సా ప్రజ్ఞా యా వై ప్రజ్ఞా స ప్రాణః, సహ హ్యేతావస్మిన్ వసతః సహోత్క్రామతః" ఇతి. బ్రహ్మపరిగ్రహే తు కిం కస్మాద్భిద్యేత? తస్మాదిహ జీవముఖ్యప్రాణయోరన్యతర ఉభౌ వా ప్రతీయేయాతాం; న బ్రహ్మేతి చేత్-

## బాలానందిని

జీవేతి:- ''జీవముఖ్యప్రాణలిఙ్గాత్ = జీవలింగ-ముఖ్యప్రాణలింగా లుండడం వల్ల, న= ఇది బ్రహ్మవాక్యంకాదు, ఇతి చేత్=అన్నట్లయితే, న=అట్లుకాదు, ఉపాసాత్రైవిధ్యాత్ = అలా చెప్పినట్లయితే మూడు ఉపాసనలు చెప్పవలసి వస్తుంది. ఆశ్రితత్వాత్ = వెనక బ్రహలింగాన్ని పట్టి ప్రాణం బ్రహ్మగా గ్రహించబడింది. ఇహ = ఇక్కడ కూడా, తద్యోగాత్ = ఆ బ్రహ్మలింగం ఉంది కదా?'' అని సూత్రార్థం.

యద్యపీతి : అధ్యాత్మసంబంధబాహుల్యం కనబడడంవల్ల పరాచీనమైన దేవతయొక్క ఉపదేశం కాకపోయినా, ఇది బ్రహ్మవాక్యం కాజాలదు. ఎందువల్ల? జీవలింగం, ముఖ్యప్రాణలింగం ఉండడంవల్ల. ఈ వాక్యంలో "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాదికమైన జీవుని లింగం స్పష్టంగా కనబడుతున్నది. వాగింద్రియం మొదలైన సాధనాలతో పని చేసే, కార్యకరణాధ్యక్షుడైన (దేహేంద్రియాలకు అధ్యక్షుడైన) జీవుడు తెలియదగినవాడు అని ఈ వాక్యంలో చెప్పబడుచున్నది కదా? అట్లే ముఖ్య ప్రాణలింగం కూడా "అథఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" అనే వాక్యంలో ఉంది. శరీరాన్ని నిలబెట్టడం అనేది ముఖ్యప్రాణం యొక్క ధర్మం కదా? ప్రాణ సంవాదంలో వాగాదిప్రాణాలను ప్రస్తావించి "తాన్.. విధారయామి" అని వినబడుచున్నది (చెప్పబడినది)

వి. వాగాదిప్రాణాలు నేను గొప్పదానంటే నేను గొప్పదానను అని పోటీ పడుతూ తగువు తీర్చమని ప్రజాపతి దగ్గరికి వెళ్ళాయట. "మీలో ఏది లేచిపోతే శరీరం పాపిష్ఠతరమై పడిపోతుందో అది గొప్పది'' అని అతడు చెప్పాడట. అప్పుడు వాగాదులు లేచిపోయినా కూడ శరీరంలో మూకత్వాదులు వచ్చినా శరీరం స్వస్థంగానే ఉంది. అప్పుడు ముఖ్యప్రాణం లేచిపోదాం అనుకుంటూంటేనే వాగాదీతరప్రాణాలన్నీ వ్యాకులత చెందాయి. అపుడు ఆ వరిష్ఠప్రాణం వాగాదులతో ఇలా అంది. మీరు

పొరబాటు ఆలోచన చేయకండి. నేను నా స్వరూపాన్ని ఐదు రూపాలలో, ప్రాణాపానాది రూపాలలో, విభజించి ఈ శరీరాన్ని నిలద్రొక్కి ధరిస్తున్నాను అని చెప్పిందట.

యేత్వితి :- "ఇమం శరీరం పరిగృహ్య" అని ఎవరు పఠిస్తున్నారో వాళ్ళకి, ఇమమ్ = ఈ జీవుణ్ణి లేదా ఇంద్రియసముదాయాన్ని గ్రహించి, శరీరాన్ని లేవదీస్తున్నది అని అర్థం చెప్పుకోవాలి.

వి. "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా" అని పైన ఉదహరించిన వాక్యంలో ఐదమ్ కు బదులు ఇమమ్ అని మరొక పాఠం ఉంది. ఇమమ్ పుంలింగశబ్దం గాన శరీరమ్ అనే నపుంసకలింగశబ్దానికి విశేషణం అవడానికి వీలులేదు. అందుచేత ఇమమ్ అనే దానికి ఈ జీవుణ్ణి లేదా ఇంద్రియసముదాయాన్ని అని అర్థం చెప్పుకొని దీనిని పరిగృహ్య తో అన్వయించి శరీరం అనే దానిని ఉత్థాపయతి తో అన్వయించాలి.

ప్రజ్ఞాత్మత్వమితి : జీవుడు చేతనుడుగాన వానిని ప్రజ్ఞాత్మ అనడం కుదురుతుంది. ముఖ్యప్రాణం జ్ఞానానికి సాధనమైన ఇతరప్రాణాలకు ఆశ్రయం కాబట్టి దానిని కూడా ప్రజ్ఞాత్మ అనవచ్చును. జీవుణ్ణీ, ముఖ్యప్రాణాన్ని రెండింటినీ గ్రహించినట్లయితే "యో వై.. ఉత్క్రామతః" (ఏది ప్రాణమో అదే ప్రజ్ఞ, ఏది ప్రజ్ఞయో అదే ప్రాణం. ఈ రెండూ ఈ శరీరంలో కలిసి నివసిస్తాయి. కలిసి లేచిపోతాయి కదా) అని ఆ రెండూ కలిసి ఉండడంచేత అభేదనిర్దేశము (రెండూ ఒకటే అని చెప్పడమూ) వస్తుతః అవి వేరు వేరు కాబట్టి వేరుగా నిర్దేశించడమూ కుదురుతుంది. బ్రహ్మను గ్రహిస్తే ఏది దేనినుండి భిన్నం అవుతుంది? (అనగా భేదప్రసక్తియే లేదు కదా అని అర్థం). అందుచేత ఇక్కడ జీవముఖ్యప్రాణాలలో ఏదో ఒకటి గాని, రెండూ గాని బుద్ధిగోచరా లవుతున్నాయి (కనబడుతున్నాయి). బ్రహ్మమాత్రం కాదు అన్నట్లయితే (ఇది పూర్వపక్షం)-

## భాష్యమ్

నైతదేవమ్. ఉపాసాత్రైవిధ్యాత్. ఏవం సతి త్రివిధముపాసనం ప్రసజ్యేత, జీవోపాసనం, ముఖ్యప్రాణోపాసనమ్, బ్రహ్మోపాసనం చేతి. న చైతదేకస్మిన్ వాక్యేఽభ్యుపగన్తుం యుక్తమ్, ఉపక్రమోపసంహారాభ్యాం హి వాక్యైకత్వమవగమ్యతే. "మామేవ విజానీహి" ఇత్యుపక్రమ్య, "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృతమిత్యుపాస్స్వ" ఇత్యుక్త్వా అన్తే "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దోఽజరోఽమృతః" ఇత్యేకరూపావుపక్రమోపసంహారౌ దృశ్యేతే. తత్రార్థైకత్వం యుక్తమాశ్రయితుమ్. న చ బ్రహ్మలిఙ్గమన్యపరత్వేన పరిణేతుం శక్యమ్, దశానాం భూతమాత్రాణాం, ప్రజ్ఞామాత్రాణాం చ

బ్రహ్మణోఽన్యత్ర అర్పణానుపపత్తేః. ఆశ్రితత్వాచ్చ అన్యత్రాపి బ్రహ్మలిఙ్గవశాత్ప్రాణశబ్దస్య బ్రహ్మణి ప్రవృత్తేః. ఇహాపి చ హిత తమోపన్యాసాదిబ్రహ్మలిఙ్గయోగాత్ బ్రహ్మోపదేశ ఏ వాయమితి గమ్యతే.

## బాలానందిని

నైతదితి :- ఇది ఇట్లు కాదు. ఉపాసాత్రైవిధ్యాత్ - ఇలా చెప్పినట్లయితే జీవోపాసనం, ముఖ్యప్రాణోపాసనం, బ్రహ్మోపాసనం అని మూడు ఉపాసనలు ప్రసక్తమవుతాయి (వచ్చిపడతాయి). ఒక్క వాక్యంలో దీనిని (ఉపాసనాత్రైవిధ్యాన్ని) అంగీకరించడం యుక్తం కాదు. ఉపక్రమోపసంహారాలను పట్టి ఇక్కడ వాక్యైక వాక్యత్వం (ఒకచోట ఉన్న వాక్యాలన్నీ కలిసి మొత్తం మీద ప్రధానంగా ఒకే అర్థాన్ని ప్రతిపాదించడం వాక్యైకవాక్యత్వం) కనబడుతున్నది. "మామేవ విజానీహి" అని ఉపక్రమించి, " ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృతమిత్యుపాస్స్వ" అని చెప్పి, చివర "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానన్దోఽజరోఽమృతః" అని ఉపక్రమోపసంహారాలు ఒకే విధంగా (ఒకే విషయాన్ని ప్రతిపాదించేవిగా) ఉన్నాయి. అలాంటప్పుడు అన్ని వాక్యాలకీ ఒకే అర్థం (ప్రధానంగా ప్రతిపాదించబడే ఒకే అర్థం) ఆశ్రయించడం యుక్తం. బ్రహ్మలింగాన్ని మరొక విధంగా (మరొకదానికి అన్వయించేటట్లు) చెప్పడం కుదరదు. పది భూతమాత్రల్ని పది ప్రజ్ఞామాత్రల్నీ బ్రహ్మయందు తప్ప ఇతరమైన మరిదేనియందూ అర్పించడం (ఉంచడం) కుదరదు కదా? బ్రహ్మలింగాన్ని పట్టి ప్రాణశబ్దం బ్రహ్మను చెపుతుంది అని వెనుక (ప్రాణాధికరణంలో) అంగీకరించబడింది. అదే విధంగా ఇక్కడ కూడా హితతమోపన్యాసం మొదలైన బ్రహ్మలింగాలు ఉండడంవల్ల ఇది బ్రహ్మోపదేశమే అని తెలుస్తున్నది.

## భాష్యమ్

యత్తు ముఖ్యప్రాణలిఙ్గం దర్శితమ్-"ఇదం శరీరం పరిగృహ్యోత్థా పయతి"ఇతి, తదసత్, ప్రాణవ్యాపారస్యాపి పరమాత్మాయత్తత్వాత్ పరమాత్మన్యుపచరితుం శక్యత్వాత్.

"న ప్రాణేవ నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ" (కఠ.ఉ.2.5.5)

ఇతి శ్రుతేః. యదపి "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాది జీవలిఙ్గం దర్శితం, తదపి న బ్రహ్మపక్షం నివారయతి. న హి జీవో నామాత్యన్తభిన్నో బ్రహ్మణః 'తత్త్వమసి' "అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిశ్రుతిభ్యః. బుద్ధ్యాద్యుపాధికృతం తు విశేషమాశ్రిత్య బ్రహ్మైవ సన్ జీవః కర్తా భోక్తా చేత్యుచ్యతే. తస్య

ఉపాధికృతవిశేషపరిత్యాగేన స్వరూపం బ్రహ్మ దర్శయితుం "న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" ఇత్యాదినా ప్రత్యగాత్మాభిముఖీకరణార్థ ఉపదేశో న విరుధ్యతే.

"యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే"

తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే" (కఠ. ఉ.1.4)

ఇత్యాది చ శ్రుత్యన్తరం వచనాదిక్రియావ్యాపృతస్యైవాత్మనః బ్రహ్మత్వం దర్శయతి. యత్పునరేతదుక్తమ్ "సహ హ్యేవాస్మిన్ శరీరే వసతః సహోత్క్రామతః" ఇతి ప్రాణ ప్రజ్ఞాత్మనోర్భేదదర్శనం బ్రహ్మవాదే నోపపద్యతే ఇతి, నైష దోషః. జ్ఞానక్రియాశక్తి ద్వయాశ్రయయోః బుద్ధిప్రాణయోః ప్రత్యగాత్మోపాధిభూతయోః భేదనిర్దేశోపపత్తేః. ఉపాధిద్వయోపహితస్య తు ప్రత్యగాత్మనః స్వరూపేణాభేద ఏవేత్యతః "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా" ఇత్యేకీకరణమవిరుద్ధమ్.

బాలానందిని

యత్త్వితి :- "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" అని ముఖ్య ప్రాణలింగం ఏది చూపబడిందో అది సరియైనది కాదు. ప్రాణం చేసే వ్యాపారం కూడా పరమాత్మ మీదనే ఆధారపడి ఉంటుంది గాన దానిని పరమాత్మయందు ఆరోపించడం కుదురుతుంది. "న... ఉపాశ్రితౌ" ( ఏ మానవుడూ కూడా ప్రాణంచేత గాని అపానంచేత గాని జీవించడు. ఈ రెండూ ఏ పరమాత్మమీద ఆధారపడి పని చేస్తున్నాయో ఆ పరమాత్మచేతనే (మానవులు) జీవిస్తున్నారు) అను శ్రుతి ఈ విషయమే చెప్పుతున్నది. "న... విద్యాత్" ఇత్యాదికమైన ఏది జీవలింగంగా చూపబడిందో అది బ్రహ్మపక్షాన్ని నివారించ జాలదు (కాదన జాలదు). "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిశ్రుతులను బట్టి బ్రహ్మకంటె పూర్తిగా భిన్నుడైన జీవుడనేవాడు లేడు కదా? అయితే బుద్ధి మొదలైన ఉపాధులచేత ఏర్పడిన విశేషాన్ని ఆశ్రయించి బ్రహ్మయే జీవుడై కర్త అనీ భోక్త అనీ చెప్పబడుచున్నది. జీవునికి ఉపాధిచేత కల్పితమైన విశేషాన్ని విడిచిపెట్టి స్వరూపమైన బ్రహ్మను (బ్రహ్మస్వరూపత్వాన్ని) చూపడం కోసం ప్రత్యగాత్మవైపు అభిముఖునిగా చేయడం కోసం "న... విద్యాత్" ఇత్యాద్యుపదేశం చేయడంలో విరోధం ఏదీ లేదు. "యద్వాచా.. ఉపాసతే" (ఏది వాక్కుచేత ప్రకాశింపచేయబడదో, దేనిచేత వాక్కు ప్రకాశింపచేయబడుతుందో అదే బ్రహ్మ అని తెలుసుకో. (సామాన్యులు) దేనినైతే ఉపాసిస్తారో అది బ్రహ్మ కాదు) అను మరొక శ్రుతి వచనాదిక్రియలు చేస్తూన్న లేదా చేయిస్తున్న ఆత్మయే బ్రహ్మ అని చూపుతున్నది. (అందుచేత "న వాచం" ఇత్యాది

వాక్యంలోని వక్తారమ్ ను వాక్కును ప్రేరేపించే పరమాత్మ అని అర్థం చెప్పవచ్చు నని అభిప్రాయం). "సహ... ఉత్క్రామతః" అని ప్రాణప్రజ్ఞాత్మలను వేరుగా చెప్పడం బ్రహ్మవాదంలో కుదరదు అని ఏది చెప్పబడిందో అది దోషం కాదు. ప్రత్యగాత్మకు ఉపాధులుగా ఉన్నవి, జ్ఞాన- క్రియాశక్తులకు ఆశ్రయములూ అయిన బుద్ధిప్రాణాలను భిన్నములుగా చెప్పడం యుక్తమే కదా? అయితే పై రెండు ఉపాధులచేత ఉపహితమైన ప్రత్యగాత్మమాత్రం స్వరూపంచేత ఒక్కటే గాన "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా" అని ఒకటిగా చెప్పడం విరుద్ధం కాదు.

వి. ఉపాధి అనగా భేదం కలిగించేది. ఉపహితం అనగా దేనియందు భేదం కల్పించబడిందో అది. ఆకాశం సర్వవ్యాప్తం. ఒక చోట రెండు ఘటా లున్నాయి. ఒక్కొక్క ఘటంలో ఆకాశం (అవకాశం) ఉంది. వాస్తంలో ఆకాశం ఒకటే అయినా ఈ ఘటంలో ఉన్న ఆకాశం వేరు ఆ ఘటంలో ఉన్నది వేరు అంటున్నాం. ఇక్కడ ఆకాశానికి ఘటం ఉపాధి అయింది. ఈ ఉపాధిచేత పరిమితం చేయబడిన ఆకాశం ఉపహితం. అట్లే ఇక్కడ జ్ఞానశక్తిగల బుద్ధి, క్రియాశక్తిగల ప్రాణం ఈ రెండూ ఆత్మకు ఉపాధులు. రెండు ఉపాధు లున్నాయి కాబట్టి ద్వివచనం ప్రయోగించి, ఆ రెండూ వేరు వేరు అన్నట్లు చెప్పబడింది. కాని ఆ ఉపాధులు తప్పిస్తే ఆత్మ ఒకటే గాన ఇదే అది, అదే ఇది అని చెప్పబడింది.

## భాష్యమ్

అథవా- "నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహతద్యోగాత్" ఇత్యస్యాయమన్యోఽర్థః. న బ్రహ్మవాక్యేఽపి జీవముఖ్యప్రాణలిఙ్గం విరుధ్యతే కథమ్? ఉపాసాత్రైవిధ్యాత్. త్రివిధమిహ బ్రహ్మోపాసనం వివక్షితం - ప్రాణధర్మేణ, ప్రజ్ఞాధర్మేణ, స్వధర్మేణ చ. తత్ర "ఆయురమృతముపాస్స్వ. ఆయుః ప్రాణః" ఇతి, "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" ఇతి, "తస్మాదేతదేవోక్థముపాసీత". ఇతి చ ప్రాణధర్మః. "అథ యథాస్యై ప్రజ్ఞాయై సర్వాణి భూతాన్యేకీభవన్తి తద్వ్యాఖ్యాస్యామః" ఇత్యుపక్రమ్య "వాగేవాస్యా ఏకమఙ్గమదూదుహత్తస్యై నామ పరస్తాత్ప్రతివిహితా భూతమాత్రాః ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామాన్యాప్నోతి" ఇత్యాది ప్రజ్ఞాధర్మః. "తా వా ఏతా దశైవ భూతమాత్రా అధిప్రజ్ఞం, దశ ప్రజ్ఞామాత్రా అధిభూతం, యద్ధి భూతమాత్రా న స్యుర్న ప్రజ్ఞామాత్రాః స్యుః, యద్ధి ప్రజ్ఞామాత్రా న స్యుర్న భూతమాత్రాః స్యుః న

హ్యన్యతరతో రూపం కించన సిద్ధ్యేత్, నో ఏతన్నానా", "తద్యథా రథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేऽర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా" ఇత్యాదిర్బ్రహ్మధర్మః. తస్మాద్బ్రహ్మణ ఏవైతదుపాధిద్వయధర్మేణ స్వధర్మేణ చ ఏకముపాసనం త్రివిధం వివక్షితమ్. అన్యత్రాపి 'మనోమయః ప్రాణశరీరః' (ఛా.ఉ.3.14.2) ఇత్యాదావుపాధిధర్మేణ బ్రహ్మణ ఉపాసనమాశ్రితమ్; ఇహాపి తద్యుజ్యతే. వాక్యస్యోపక్రమోపసంహారాభ్యామేకార్థత్వావగమాత్, ప్రాణప్రజ్ఞాబ్రహ్మలిఙ్గావగమాచ్చ. తస్మాద్బ్రహ్మవాక్యమే తదితి సిద్ధమ్. 31.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీ గోవిన్దభగవత్పాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవత్పాదకృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే ప్రథమాధ్యాయస్య ప్రథమః పాదః

బాలానందిని

అవ. శ్రీబగవత్పాదులు ఇప్పుడు వృత్తికారమతానుసారం ఈ సూత్రానికి వ్యాఖ్య వ్రాస్తున్నారు. అథవేతి:- లేదా "నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్" అనుదానికి అర్థం ఇది. బ్రహ్మవాక్యంలో కూడా జీవలింగ ముఖ్యప్రాణలింగాలు ఉండడంలో విరోధం లేదు. ఎట్లు? మూడు రకాలైన ఉపాసనలవల్ల. ఇక్కడ ప్రాణధర్మాన్ని ప్రజ్ఞాధర్మాన్ని, స్వధర్మాన్ని అనగా బ్రహ్మయొక్క ధర్మాన్ని పురస్కరించుకొని మూడు విధాలైన బ్రహ్మోపాసన వివక్షితమైనది (చెప్పనుద్దేశించబడినది). (మూడు ధర్మాలను పట్టి మూడు విధాలుగా ఉపాసించినా ఉపాసించబడేది బ్రహ్మయే కాబట్టి ఏకవాక్యతకు భంగం లేదని భావం). "ఆయురమృతముపాస్స్వ, ఆయుః ప్రాణః" అని, "ఇదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" అని, "తస్మాదేతదేవోక్థముపాసీత" (అందువల్ల దీనినే ఉక్థం అని ఉపాసించాలి) అని ఇవి ప్రాణధర్మాలు.

వి. దేహంలో చేష్టారూపమైన జీవనం ఉండడానికి హేతువు గాన ప్రాణం ఆయుస్సు. దేహం పడిపోయినా మోక్షం కలిగే వరకూ ఉండడంచేత అది అమృతం. దేహాన్ని లేవదీస్తుందిగాన ఉక్థం. ఇవన్నీ ప్రాణధర్మాలు.

అథేతి :- "అథ... వ్యాఖ్యాస్యామః" అని ఉపక్రమించి చెప్పిన 'వాగేవ...ఆప్నోతి' ఇత్యాదికం ప్రజ్ఞాధర్మం అనగా జీవధర్మం.

వి. అథ అనగా- వెనుక బుద్ధి, ప్రాణాలు కూడా కలిసి ఉండి, కూడా లేచిపోతాయి అని చెప్పబడింది; దాని తరువాత అని అర్థం. ప్రజ్ఞా అనగా ఇక్కడ జీవుడు అని అర్థం. "జీవునికి సంబంధించిన దృశ్యాలైన సమస్తభూతాలు ఏ విధంగా ఏకం అవుతాయో, అనగా అధిష్ఠానమైన చిద్రూపంగా అవుతాయో, వివరిస్తాము" అని మొదటి వాక్యానికి అర్థం. చైతన్యాభాససహితమైన బుద్ధియే జీవుడు. నామం, రూపం అనేవే జగత్తు. జీవునికి నామం విషయం అయినపుడు, అనగా జీవుడు నామాన్ని గ్రహించినపుడు, దానికి జీవుడు విషయి అవుతాడు. అట్లే రూపం విషయం అయితే జీవుడు విషయి అవుతాడు. నామాన్ని పట్టి ఏర్పడిన విషయిత్వం, రూపాన్ని పట్టి ఏర్పడిన విషయిత్వమూ రెండూ ఉన్నప్పుడే జీవుడు పూర్ణుడవుతాడు. అనగా నామరూపాత్మకమైన జగత్తుతో సంబంధించినప్పుడే జీవుడు జీవుడౌతాడు. "కర్మేంద్రియాలలో ఒకటైన వాగింద్రియం ఈ జీవునికి (ప్రజ్ఞాయాః) ఒక అంగాన్ని, అర్ధభాగాన్ని, అదూదుహత్= పూరించింది. నామరూపాత్మకమైన జగత్తులోని నామం వాక్కుచేత జీవునికి సమర్పించబడింది అని అర్థం.| ప్రతివిహితాః= చక్షురాదీంద్రియాలచేత తెలియజేయబడిన, భూతమాత్రాః= రూపాదివిషయాలైన భూతమాత్రలు, తస్యై=తస్యాః= ఆ చిదాభాసవిశిష్టబుద్ధిరూపజీవునియొక్క, పరస్తాత్= తరువాతి అంగాన్ని, అర్ధాన్ని (అదూదుహన్) నామ=పూరించినవట. ఇంద్రియాలు రూపాదివిషయాలను సమర్పించడం ద్వారా జీవుని రెండవ అర్ధాన్ని పూరించాయి. ఈ విధంగా నామరూపాత్మకజగత్సంబంధం ఏర్పడి జీవుడు పూర్ణుడైనాడు.|చిదాత్మ, ప్రజ్ఞయా= బుద్ధి ద్వారా, వాగింద్రియాన్ని అధిష్ఠించి, అనగా వాగింద్రియప్రేరకమై, ఆ వాక్కు అనే సాధనంచేత అన్ని నామాలను పొందుతుంది. దీని తరువాతి వాక్యం ఇక్కడ ఉదాహరించలేదు. దానిలో చక్షుస్సు ద్వారా సమస్తరూపాలను చూస్తుంది అని చెప్పబడింది. ఈ విధంగా బుద్ధితో సహితమైన చిదాత్మకు బుద్ధి ద్వారా ద్రష్టృత్వాదికం ఏర్పడింది. ద్రష్టృత్వాద్యధ్యాసకు బుద్ధి కారణం అని అర్థం. ఈ విధంగా బుద్ధిసంబద్ధమైన చిదాత్మయే జీవుడు. ఆ జీవుని జీవత్వం నామరూపాత్మకజగత్తుతో సంబంధం ఏర్పడినప్పుడే పూర్ణం అవుతుంది అని చెప్పే ఈ రెండు వాక్యాలలోను, ఈ ఘట్టంలోని ఇతర వాక్యాలలోను జీవుని ధర్మాలు చెప్పబడ్డాయి అని అర్థం.

తా ఇతి:- "తా... ప్రజ్ఞాత్మా" ఇత్యాదికం బ్రహ్మధర్మం.

వి. "ఆ ఈ పది భూతమాత్రలు ప్రజ్ఞామాత్రలను గూర్చి ప్రవర్తిస్తాయి. అనగా ప్రజ్ఞామాత్రలకు గ్రాహ్యా లవుతాయి. ప్రజ్ఞామాత్రలు పది భూతమాత్రల వైపు ప్రవర్తిస్తాయి; అనగా వాటిని గ్రహిస్తాయి. భూతమాత్రలు లేకపోతే ప్రజ్ఞామాత్రల ఉనికి

లేదు ప్రజ్ఞామాత్రలు లేకపోతే భూతమాత్రల ఉనికి లేదు,. ఆ రెండింటిలో ఏ ఒక్కటియో మాత్రమే ఉంటే ఏ రూపమూ సిద్ధించదు. అందుచేత ఇవి వేరు కాదు. ("తద్యథా... ప్రజ్ఞాత్మా" అనే వాక్యానికి అర్థం వెనుక ఇవ్వబడింది).

వి. పృథివ్యాది పంచకం, శబ్దాది పంచకం - ఇవి భూత-మాత్రలు. దశేంద్రియాలు ప్రజ్ఞామాత్రలు. భూతమాత్రలు గ్రాహ్యాలు ప్రజ్ఞామాత్రలు గ్రాహకాలు. గ్రాహ్యాలైన భూతమాత్రలకు గ్రాహకాలు లేకపోతే స్థితియే లేదు. గ్రాహ్యాలు లేకపోతే గ్రాహకాలైన ప్రజ్ఞామాత్రలకు స్థితి లేదు. ఈ విధంగా ఈ రెండు దశకాలు పరస్పరసాపేక్షాలు. అందుచేత వాస్తవంలో ఇవి ఒకదానికంటె ఒకటి భిన్నంగా లేవు. ఉన్నది ఒక్క ఆత్మతత్త్వమే. భూతమాత్రలు, ప్రజ్ఞామాత్రలు కూడ కల్పితాలే అని భావం.

తస్మాదితి:- అందువల్ల ఇక్కడ ఒక్క బ్రహ్మనే రెండు ఉపాధులైన ప్రాణ-జీవుల ధర్మాలను తన (బ్రహ్మయొక్క) ధర్మాలను పురస్కరించుకొని మూడు విధాలుగా ఉపాసన చెయ్యాలని చెప్పడం ఉద్దిష్టమైనది. "మనోమయః ప్రాణశరీరః" ఇత్యాదివాక్యాలలో, ఇతరస్థలాలలో కూడ ఒకే బ్రహ్మను ఉపాధిగా ఉన్న మనస్సుయొక్క ధర్మంచేత, ప్రాణంయొక్క ధర్మంచేత ఉపాసించడం అంగీకరించబడింది. ఇక్కడ కూడ ఉపక్రమోపసంహారాలను పట్టి వాక్యం ఒకే బ్రహ్మరూపార్థాన్ని బోధిస్తున్నది. ప్రాణ-ప్రజ్ఞా (జీవ) - బ్రహ్మ లింగాలు మూడు ఉన్నాయి. అందుచేత ఆ విధంగా అంగీకరించవచ్చును. అందువల్ల ఇది బ్రహ్మ ప్రతిపాదక వాక్యమే అనే విషయం నిశ్చితమైనది.

వి. ఇక్కడ రెండు విధాల వ్యాఖ్యానం చూపబడింది. మొదటి వ్యాఖ్య ప్రకారం ఈ ప్రకరణలో ప్రతిపాదించబడేది నిర్విశేషబ్రహ్మ. రెండవ వ్యాఖ్యానం ప్రకారం కూడ ప్రకరణప్రతిపాద్యమైనది బ్రహ్మయే అయినా సగుణమైన బ్రహ్మ ఉపాస్యంగా ప్రతిపాదించబడుతున్నది, అని రెండు వ్యాఖ్యానాల ఫలితంలో భేదం. అయితే మొదటి వ్యాఖ్యానమే భగవత్పాదసంమతం, రెండవది సరియైన వ్యాఖ్యానం కాదు అని రత్నప్రభా - బ్రహ్మ విద్యాభరణాలలో ప్రతిపాదించబడింది. 31.

ప్రతర్దనాధికరణం సమాప్తం

"బాలానందిని" అను శ్రీమచ్ఛారీరకమీమాంసాంధ్రవ్యాఖ్యానంలో

ప్రథమాధ్యాయంలో ప్రథమపాదం సమాప్తం.

## అథ ప్రథమాధ్యాయే ద్వితీయః పాదః

(అత్ర అస్పష్టబ్రహ్మలిఙ్గానాం వాక్యానాముపాస్యబ్రహ్మవిషయాణాం విచారః)

## 1. సర్వత్రప్రసిద్ధాధికరణమ్. సూ. 1-8

### భాష్యమ్

ప్రథమే పాదే "జన్మాద్యస్య యతః" ఇత్యాకాశాదేః సమస్తస్య జగతో జన్మాదికారణం బ్రహ్మేత్యుక్తమ్. తస్య సమస్తజగత్కారణస్య బ్రహ్మణో వ్యాపిత్వం, నిత్యత్వం, సర్వజ్ఞత్వం, సర్వశక్తిత్వం సర్వాత్మకత్వమిత్యేవం జాతీయకా ధర్మా ఉక్తా ఏవ భవన్తి. అర్థాన్తరప్రసిద్ధానాం చ కేషాం చిచ్ఛబ్దానాం బ్రహ్మవిషయత్వహేతుప్రతిపాదనేన కాని చిద్వాక్యాని స్పష్టబ్రహ్మలిఙ్గాని సందిహ్యమానాని బ్రహ్మపరతయా నిర్ణీతాని. పునరప్యన్యాని వాక్యాన్య స్పష్టబ్రహ్మలిఙ్గాని సందిహ్యన్తే- కిం పరం బ్రహ్మ ప్రతిపాదయన్త్యాహో స్విదర్థాన్తరం కించిదితి. తన్నిర్ణయాయ ద్వితీయతృతీయపాదావారభ్యేతే.

### సూ. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ 1.2.1

#### బాలానందిని

ప్రథమ ఇతి:- ప్రథమపాదంలో "జన్మాద్యస్య యతః" అనే సూత్రంచేత ఆకాశాదికమైన సమస్తజగత్తుయొక్క జన్మాదులకు బ్రహ్మ కారణం అని చెప్పబడింది. జగత్కారణమైన ఆ బ్రహ్మకు అంతటా వ్యాపించి ఉండడం, నిత్యత్వం, సర్వజ్ఞత్వం, సర్వమూ చేయగలిగిన శక్తి కలిగి ఉండడం, సర్వాత్మకత్వం (అన్నింటి స్వరూపమయి ఉండడం) వంటి ధర్మాలు కూడ చెప్పినట్లే అవుతుంది. మరొక అర్థంలో ప్రసిద్ధ మైన కొన్ని శబ్దాలు బ్రహ్మ విషయకములే (బ్రహ్మనే బోధిస్తాయి) అని చెప్పడానికి హేతువులను చూపి స్పష్టబ్రహ్మలింగాలైన, సందేహాస్పదాలైన, (బ్రహ్మను చెపుతాయా మరొకదానినీ దేనినైనా చెపుతాయా అని సందేహింపబడుతున్న) కొన్ని వాక్యాలు బ్రహ్మనే బోధిస్తాయని నిర్ణయించబడ్డాయి. మళ్లీ (ఇప్పుడు) బ్రహ్మలింగాలు స్పష్టంగా లేని మరికొన్ని వాక్యాలు పరబ్రహ్మనే ప్రతిపాదిస్తున్నాయా లేక మరొక అర్థాన్ని దేనినైనా బోధిస్తున్నాయా అని సందేహించబడుతున్నాయి. వాటిని గూర్చి నిర్ణయించడం కోసం ఈ ద్వితీయ-తృతీయపాదాలు ప్రారంభించబడుతున్నాయి. (ఈ రెండింటిలో కూడ ద్వితీయపాదంలోని వాక్యాలు చాలావరకు ఉపాస్యమైన సగుణబ్రహ్మను బోధిస్తాయి, తృతీయపాదంలోని వాక్యాలు జ్ఞేయమైన నిర్గుణబ్రహ్మను బోధిస్తాయి).

సర్వత్రేతి:- "సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ = అన్ని వేదాంతాలలోను జగత్కారణంగా ప్రసిద్ధమైన ప్రహ్మను ఉద్దేశించడం వల్ల ఇక్కడ బ్రహ్మయే బోధించబడుతుంది. అని సూత్రార్థం.

## భాష్యమ్

ఇదమామ్నాయతే - "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత, అథ ఖలు క్రతుమయః పురుషో యథాక్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి. స క్రతుం కుర్వీత, మనోమయః ప్రాణ శరీరో భారూపః (ఛా. ఉ. 3.14 1,2) ఇత్యాది. తత్ర సంశయః - కిమిహ మనోయత్వాదిబిర్ధర్మైః శారీర ఆత్మా ఉపాస్యత్వేపదిశ్యతే, అహోస్విత్పరం బ్రహ్మేతి. కిం తావత్ప్రాప్తమ్? శారీర ఇతి. కుతః? తస్య హి కార్యకరణాధిపతేః ప్రసిద్ధో మనఆదిభిః సంబన్ధః; న పరస్య బ్రహ్మణః - "అప్రాణో హ్యమనాః శుభ్రః" (ము. ఉ. 2-1.2) ఇత్యాది శ్రుతిభ్యః. నను "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇతి స్వశబ్దేనైవ బ్రహ్మోపాత్తమ్; కథమిహ శారీర ఆత్మోపాస్యత్వేనాశఙ్క్యతే? నైష దోషః. నేదం వాక్యం బ్రహ్మోపాసనావిధిపరమ్. కిం తర్హి? శమవిధిపరమ్ యత్కారణం "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత" ఇత్యాహ. ఏతదుక్తం భవతి - యస్మాత్సర్వమిదం వికారజాతం బ్రహ్మైవ, తజ్జత్వాత్తల్లత్వాత్త దనత్వాచ్చ, న చ సర్వస్యైకాత్మత్వే రాగాదయః సంభవన్తి, తస్మాచ్ఛాన్త ఉపాసీతేతి. న చ శమవిధిపరత్వే సత్యనేన వాక్యేన బ్రహ్మోపాసనం నియన్తుం శక్యతే. ఉపాసనం తు "సక్రతుం కుర్వీత" ఇత్యనేన విధీయతే. క్రతుః సంకల్పో ధ్యానమిత్యర్థః. తస్య చ విషయత్వేన శ్రూయతే "మనోమయః ప్రాణశరీరః" ఇతి జీవలిఙ్గమ్. అతో బ్రూమో జీవవిషయమేతదుపాసనమితి. "సర్వకర్మా సర్వకామః" ఇత్యాద్యపి శ్రూయమాణం పర్యాయేణ జీవవిషయముపపద్యతే. "ఏ ష మ ఆత్మాన్తర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా యవాద్వా" ఇతి చ హృదయాయతనత్వమణీయస్త్వం చారాగ్రమాత్రస్య జీవస్యావకల్పతే, నాపరిచ్ఛిన్నస్య బ్రహ్మణః.

## బాలానందిని

ఇదమితి:- "సర్వం ... భారూపః" (ఇదంతా కూడ బ్రహ్మవివర్తమే గాన) బ్రహ్మరూప మైనది. దానినుండే (బ్రహ్మ నుండే) పుట్టింది. దానియందే లీన

మవుతున్నది, దాని యందే చేష్టిస్తున్నది. అందువల్ల శాంతుడై ఉపాసించాలి. పురుషుడు సంకల్పమయుడు కదా? పురుషుడు ఈ లోకంలో ఎలాంటి సంకల్పం కలవా డవుతాడో ఇక్కడినుండి పరలోకానికి వెళ్లిన తరువాత కూడ అలాంటి సంకల్పం కలవాడే అవుతాడు. అతడు సంకల్పం చెయ్యాలి. (బ్రహ్మ) మనోమయం, ప్రాణం శరీరంగా గలది. భారూపం, (సత్యసంకల్పం), అని మనస్సులో ధ్యానించాలి) అని పఠించబడుచున్నది. అక్కడ సంశయం - ఈ వాక్యంలో మనోమయత్వాదిధర్మాలతో కూడిన జీవాత్మను ఉపాసన చెయ్యాలని ఉపదేశించబడుతున్నదా లేక బ్రహ్మ ఉపాస్య మని చెప్పబడుతున్నదా? ఏమి ప్రాప్తించింది? జీవుడు అని. ఎందువల్ల? శరీరేంద్రియాల అధిపతియైన ఆ జీవునికి మనస్సు మొదలైనవాటితో సంబంధం ప్రసిద్ధం. అంతేనే కాని "అప్రాణో హ్యమనాః శుభ్రః" (ప్రాణాలు లేనిది, మనస్సులేనిది, నిర్మలము) ఇత్యాదిశ్రుతులను పట్టి పరబ్రహ్మకు వాటితో సంబంధం లేదు. (ప్రశ్న) "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని సాక్షాత్తు బ్రహ్మశబ్దాన్ని ప్రయోగించి బ్రహ్మను గూర్చి చెపుతున్నప్పుడు ఇక్కడ జీవాత్మ ఉపాస్యం అనే ఆశంకకు తా వెక్కడ ఉంది? (సమాధానం) ఇది దోషం కాదు. ఈ వాక్యం బ్రహ్మోపాసనను విధించడానికి ఉద్దిష్ట మైనది కాదు, మరేమనగా శమాన్ని విధించడం కోసం ఉద్దిష్టమైనది. ఎందువల్ల ననగా - "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత" అని చెపుతున్నది. ఇది చెప్పినట్లయింది - "ఈ వికార సముదాయం (దృశ్య జగత్తు) అంతా బ్రహ్మనుండే పుడుతున్నది, దాని యందే లీనం అవుతున్నది, దాని యందే మెదలుతున్నది గాన ఇదంతా బ్రహ్మయే. అంతా ఒకే ఆత్మ అయినప్పుడు రాగాదులకు అవకాశం లేదు. అందువల్ల శాంతుడై ఉపాసన చెయ్యాలి". ఈ వాక్యం శాంతిని విధించడానికి ఉద్దిష్ట మైనపుడు ఇది బ్రహ్మోపాసనను విధిస్తూన్నది అని నియమించడం శక్యం కాదు కదా? ఇక్కడ ఉపాసన విధించే వాక్యం "స క్రతుం కుర్వీత" అనేది. క్రతుః అనగా సంకల్పం, ధ్యానం అని అర్థం. ఆ ధ్యానానికి విషయంగా "మనోమయః ప్రాణశరీరః" అనే జీవలింగం వినబడుచున్నది. (అనగా మనోమయం ఇత్యాది విధంగా ధ్యానించాలి. ఆ ధ్యానించబడేది జీవాత్మ అని పూర్వపక్షి అభిప్రాయం). అందుచేతనే ఈ ఉపాసన జీవవిషయక మైనది అని చెపుతున్నాం. ఇక్కడ వినబడుచున్న "సర్వకర్మా సర్వకామః" (అనేక కర్మలు కలవాడు అనేక కామాలు కలవాడు) ఇత్యాదివాక్యాలు కూడ పర్యాయంచేత జీవవిషయంగా కుదురుతున్నాయి. జీవుడు జీవుడుగా ఉన్నప్పుడు సర్వకర్మత్వాదికం కుదరకపోయినా వానికి జన్మపరంపరాసంబంధం ఉండడంచేత కుదురుతుంది అని భావం. "ఏష మ ఆత్మా..... యవాద్వా" (హృదయంలో ఉన్న ఈ

ఆత్మ ధాన్యపు గింజకంటె లేదా యవ గింజ కంటె చిన్నది) అని హృదయంలో ఉన్నట్లు, అణువుగా ఉన్నట్లు చెప్పడం ఆరాగ్రమాత్రుడైన జీవునికి కుదురుతుంది గాని అపరిచ్ఛిన్న మైన బ్రహ్మకు కుదరదు. ('ఆర' అనగా కొరడా చివర అమర్చిన ఇనుపముల్లు).

## భాష్యమ్

నను "జ్యాయాన్ పృథివ్యాః" ఇత్యాద్యపి న పరిచ్ఛిన్నేఽవకల్పతే ఇతి; అత్ర బ్రూమః - న తావదణీయస్త్వం జ్యాయస్త్వం చోభయమేకస్మిన్ సమాశ్రయితుం శక్యమ్; విరోధాత్. అన్యతరాశ్రయణే చ ప్రథమ శ్రుతత్వాదణీయస్త్వం యుక్తమాశ్రయితుమ్. జ్యాయస్త్వం తు బ్రహ్మ భావాపేక్షయా భవిష్యతీతి. నిశ్చితే చ జీవవిషయత్వే యదన్తే బ్రహ్మసంకీర్తనం "ఏతద్బ్రహ్మ" ఇతి తదపి క్రృతపరామర్శార్థత్వాజ్జీవవిషయమేవ. తస్మాన్మనో మయత్వాదిభిర్ధర్మైర్జీవ ఉపాస్య ఇత్యేవం ప్రాప్తే బ్రూమః-

పరమేవ బ్రహ్మ మనోమయత్వాదిభిర్ధర్మైరుపాస్యమ్. కుతః? సర్వత్ర పసిద్ధోపదేశాత్. యత్సర్వేషు వేదాన్తేషు ప్రసిద్ధం బ్రహ్మశబ్దస్యాలమ్బనం జగత్కారణమ్, ఇహ చ "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇతి వాక్యోపక్రమే శ్రుతం తదేవ మనోమయత్వాదిధర్మైర్విశిష్టముపదిశ్యతే ఇతి యుక్తమ్. ఏవం చ పకృతహానాప్రకృతప్రక్రియే న భవిష్యతః. నను వాక్యోపక్రమే శమవిధివివక్షయా బ్రహ్మ నిర్దిష్టం, న స్వవివక్షయేత్యుక్తమ్. అత్రోచ్యతే - యద్యపి శమవిధి వివక్షయా బ్రహ్మ నిర్దిష్టం తథాపి మనోమయత్వాదిషూపదిశ్యమానేషు తదేవ బ్రహ్మ సంనిహితం భవతి. జీవస్తు న సంనిహితో న చ స్వశబ్దేనోపాత్త ఇతి వైషమ్యమ్.

## బాలానందిని

(సిద్ధాంతి ప్రశ్న) - (బ్రహ్మ విషయంలో అణుత్వాదికం కుదర నట్లు, నువ్వు చెప్పే) పరిచ్ఛిన్నుడైన జీవుని విషయంలో కూడ "జ్యాయాన్ పృథివ్యాః" (పృథివి కంటెపెద్దది) ఇత్యాదివచనం కుదరదు కదా? (పూర్వపక్షి సమాధానం) - ఈ విషయంలో ఇలా చెపుతున్నాం - అణీయస్త్వం జ్యాయస్త్వం అనేవి పరస్పరవిరుద్ధాలు గాన రెండూ ఒకే దానియం దున్నట్లు చెప్పడం కుదరదు. అందుచేత ఏదో ఒకదానిని అంగీకరించవలసి ఉన్నప్పుడు ముందు వినబడడంచేత (చెప్పబడడంచేత) అణీయస్త్వాన్ని స్వీకరించడం యుక్తం. అయితే జ్యాయస్త్వం అనేది ఎలాగ అంటే

జీవుడు వాస్తవంలో బ్రహ్మయే గాన ఆ దృష్టితో చెప్పబడింది. అంటే కుదురుతుంది. ఈ విధంగా ఈ వాక్యం జీవ విషయకమే (జీవుణ్ణి గూర్చి మాత్రమే చెపుతున్నది) అని నిశ్చయం అయిన తరువాత చివర "ఏతద్బ్రహ్మ" అని ఏ బ్రహ్మసంకీర్తనం (బ్రహ్మ అని చెప్పడం) ఉందో అది కూడ ప్రకృత మైనదానినే నిర్దేశిస్తున్నది కాబట్టి జీవ విషయకమే అవుతుంది. (అనగా ప్రకృతం జీవుడు కాబట్టి 'బ్రహ్మ' అనగా ఇక్కడ జీవుడని అర్థం). అందువల్ల మనోమయత్వాదిధర్మాలచేత ఉపాసించదగినవాడు జీవుడే అని ప్రాప్తించగా చెపుతున్నాము.

వి. వెనుకటి అధికరణంలో (ప్రతర్దనాధికరణంలో) బ్రహ్మలింగం ఉండడంచేత ప్రాణజీవాద్యర్థబాధ చెప్పబడింది. ఇక్కడ ప్రారంభంలో బ్రహ్మలింగం ఏదీ లేదు; ప్రకరణం మాత్రమే ఉంది. అది శాంతిని విధిస్తూండడంచేత అన్యథాసిద్ధమైనది (దాని ప్రయోజనం వేరు గాన బ్రహ్మప్రతిపాదకం కాజాలదు). అందుచేత బ్రహ్మలింగం ఏదైనా ఉన్నా దానికంటె జీవలింగమే బలీయం. ఈ విధంగా పూర్వాధికరణంతో దీనికి ప్రత్యుదాహరణసంగతి.

పరమేవేతి:- మనోమయత్వాదిధర్మాలచేత ఉపాసించదగినది పరబ్రహ్మమే. ఎందువల్ల? సర్వత్రప్రసిద్ధోపదేశాత్. జగత్కారణమైన ఏది బ్రహ్మశబ్దవాచ్యంగా సకల వేదాంతాలలోను ప్రసిద్ధమో, ఇక్కడ కూడ ఏది వాక్యప్రారంభంలో "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని వినబడిందో ఆ బ్రహ్మయే మనోమయత్వాదిధర్మాలతో కూడినదిగా ఉపదేశించబడుచున్నది అని యుక్తం. ఇలా చెపితేనే ప్రకృతహానాప్రకృతప్రక్రియలు కలగవు. (ప్రశ్న) - వాక్యోపక్రమంలో బ్రహ్మ నిర్దేశింపబడినది శమాన్ని విధించా లనే అభిప్రాయంతోనే కాని తనను (బ్రహ్మను) ప్రతిపాదించాలనే ఉద్దేశంతో కాదు అని చెప్పాం కదా? (సమాధానం) - ఇక్కడ చెప్పబడుచున్నది - బ్రహ్మ శమ వివక్షచేత నిర్దేశింపబడినా కూడ మనోమయత్వాదులు ఉపదేశించేటప్పుడు ఆ బ్రహ్మయే సంనిహితం అవుతుంది. (మనోమయం ఏది అనగానే పక్కనే ఉన్న బ్రహ్మ అన్వయిస్తుంది అని అర్థం). జీవుడైతే సంనిహితుడు కాడు, స్వశబ్దంచేత (జీవశబ్దంచేత) అక్కడ చెప్పబడనూ లేదు గాన వైషమ్యం ఉంది. బ్రహ్మను గ్రహించాలా జీవుణ్ణి గ్రహించాలా అన్నప్పుడు బ్రహ్మకే అవకాశం ఉంది గాని జీవునికి లేదని భావం.

## సూ. వివక్షితగుణోపపత్తేశ్చ.1.2.2

వక్తుమిష్టా వివక్షితాః.యద్యప్యపౌరుషేయే వేదే వక్తురభావాన్నేచ్ఛార్థః సంభవతి తథాప్యుపాదానేన ఫలేనోపచర్యతే. లోకే హి యచ్ఛ బ్దాభిహితముపాదేయం భవతి తద్వివక్షితమిత్యుచ్యతే, యదనుపాదేయం తదవివక్షితమితి. తద్వద్వేదేఽ ప్యుపాదేయత్వేనాభిహితం వివక్షితం భవతి ఇతరదవివక్షితమ్. ఉపాదానానుపాదానే తు వేదవాక్యతాత్పర్యా తాత్పర్యాభ్యామ వగమ్యేతే. తదిహయేవివక్షితాగుణాఉపాసనాయాము పాదేయత్వేనోపదిష్టాః సత్యసంకల్పప్రభృతయః తే పరస్మిన్ బ్రహ్మణ్యుపపద్యన్తే; సత్యసంకల్పత్వం హి సృష్టిస్థితిసంహారేష్వ ప్రతిబద్ధశక్తిత్వాత్పరమాత్మన ఏవావకల్పతే. పరమాత్మగుణత్వేన చ "య ఆత్మాపహతపాప్మా" (ఛా.ఉ. 8.7.1) ఇత్యత్ర "సత్యకామః సత్యసంకల్పః" ఇతి శ్రుతమ్. ఆకాశాత్మేతి చ ఆకాశవదాత్మాస్యేత్యర్థః. సర్వగతత్వాదిభిర్ధర్మైః సంభవత్యాకాశేన సామ్యం బ్రహ్మణః. "జ్యాయాన్ పృథివ్యాః" ఇత్యాదినా చైతదేవ దర్శయతి. యదాప్యాకాశ ఆత్మా యస్యేతి వ్యాఖ్యాయతే తదాపి సంభవతి సర్వజగత్కారణస్య సర్వాత్మనో బ్రహ్మణః ఆకాశాత్మత్వమ్, అత ఏవ "సర్వకర్మా" ఇత్యాది. ఏవ మిహోపాస్యతయా వివక్షితా గుణా బ్రహ్మణ్యుపపద్యన్తే.

### బాలానందిని

వివక్షితేతి:- "వివక్షితగుణోపపత్తేశ్చ = చెప్పదలచిన గుణా లన్నీ బ్రహ్మ విషయంలో ఉపపన్నాలౌతాయి (కుదురుతాయి) కాబట్టి కూడా, ఇక్కడ బ్రహ్మనే గ్రహించాలి". అని సూత్రార్థం.

వక్తుమితి:- వక్తుమ్ = చెప్పుటకు, ఇష్టాః = ఇచ్ఛయింపబడినవి = వివక్షితాలు. అపౌరుషేయమైన వేదంలో వక్త అనేవాడు ఎవడూ లేడు గాన చెప్పడానికి (వక్తచేత) ఇచ్ఛయించబడిన అనే అర్థం కుదరదు. (అందుచేత 'వివక్షిత' అనడం యుక్తం కాదు). అయినా కూడ స్వీకరించడం (చెప్పినదానిని అంగీకరించడం) అనే ఫలాన్ని పట్టి ఇచ్ఛ (వేదానికి) ఆరోపించబడుతుంది. లోకంలో శబ్దంచేత చెప్పబడిన ఏ విషయం ఉపాదేయం (అంగీకార్యం) అవుతుందో దానిని వివక్షితం అంటారు. అట్లే వేదంలో

కూడ ఏది ఉపాదేయ మని బోధించబడుతుందో అది 'వివక్షితం' అవుతుంది; అలా కానిది 'అవివక్షితం'. ఉపాదానానుపాదానాలు (ఏ విషయాన్ని గ్రహించాలి, దేనిని గ్రహించవలసిన పని లేదు అనే విషయాలు) వేదవాక్యాల తాత్పర్యాతాత్పర్యాలచేత తెలుస్తాయి.

వి. వేదవాక్యాలవల్ల అనేకమైన అర్థాలు తెలుస్తున్నా వాటిలో కొన్ని అర్థాలు మాత్రమే ప్రధానమైనవి, వాటిని బోధించడంలోనే ఆ వాక్యాలకి తాత్పర్యం, మిగిలిన అర్థాలు అంతగా ప్రధానమైనవి కావు; అవి ప్రధానమైన అర్థాలకు ఉపోద్బలకంగా చెప్పబడ్డాయి. అందుచేత ఆ అర్థాల విషయంలో ఆ వాక్యాలకు తాత్పర్యం లేదు. ఇత్యాది విషయాలు అక్కడ ఉన్న ప్రకరణాదులను పట్టి, పూర్వోత్తరమీమాంసా శాస్త్రన్యాయాలను బట్టి నిర్ణయించుకోవాలి.

తదితి:- అందువల్ల, ఇక్కడ ఏ గుణాలు వివక్షితాలో, సత్యసంకల్పం మొదలైన ఏ గుణాలు ఉపాసనలో ఉపాదేయాలుగా ఉపదేశించబడ్డాయో, అవి పరబ్రహ్మ విషయంలోనే ఉపపన్నా లవుతున్నాయి. సత్యసంకల్పత్వం (సకల్పించిన దల్లా సత్యం అవడం) సృష్టిస్థితిసంహారాల విషయంలో ఏ విధమైన అడ్డూ లేని పరమాత్మ విషయంలో మాత్రమే కుదురుతుంది. "య ఆత్మాపహతపాప్మా" (సర్వదోషశూన్యుడైన ఏ పరమాత్మ ఉన్నాడో) అనే (పరమాత్మప్రతిపాదక) వాక్యం దగ్గరనే "సత్యకామః సత్యసంకల్పః" అని సత్యకామత్వసత్యసంకల్పాదులు పరమాత్మగుణాలుగా చెప్పబడ్డాయి. "ఆకాశాత్మా" అని కూడ చెప్పబడింది. ఆకాశం వంటి స్వరూపం గలది అని అర్థం. అంతటా వ్యాపించి ఉండటం మొదలైన ధర్మాలచేత బ్రహ్మకు ఆకాశంతో పోలిక సంభవమే. "జ్యాయాన్ పృథివ్యాః" ఇత్యాదివాక్యంచేత కూడ ఈ విషయాన్నే చెపుతున్నది. ("ఆకాశవత్ ఆత్మా అస్య" అను విగ్రహవాక్యానికి బదులు) "ఆకాశః ఆత్మా యస్య" (ఆకాశం ఆత్మ దేనికో అది) అని వ్యాఖ్యానించినా కూడ సర్వ జగత్కారణమూ సర్వాత్మకమూ అయిన బ్రహ్మ ఆకాశాత్మకం (ఆకాశస్వరూపమైనది) అని చెప్పడం కూడ సంభవిస్తుంది (కుదురుతుంది). అందువల్లనే 'సర్వకర్మా' ఇత్యాదికం కూడ (బ్రహ్మ విషయంలో) కుదురుతుంది. ఈ విధంగా ఇక్కడ ఉపాస్యాలుగా వివక్షితాలైన గుణాలు బ్రహ్మవిషయంలో అనుగుణంగా ఉంటాయి.

## భాష్యమ్

యత్తూక్తం -"మనోమయః ప్రాణశరీరః" ఇతి జీవలిఙ్గమ్, న తద్బ్రహ్మణ్యుపపద్యత ఇతి, తదపి బ్రహ్మణ్యుపపద్యత ఇతి బ్రూమః.

సర్వాత్మత్వాద్ధి బ్రహ్మణో జీవసంబన్ధీని మనోమయత్వాదీని భవన్తి. తథా చ బ్రహ్మవిషయే శ్రుతిస్మృతీ భవతః-

"త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉత వా కుమారీ,
త్వం జీర్ణో దణ్డేన వఞ్చసి త్వం జాతో భవసి విశ్వతోముఖః." (శ్వే.ఉ.4.3)

ఇతి.

"సర్వతఃపాణిపాదం తత్సర్వతోక్షిశిరోముఖమ్,
సర్వతఃశ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి" (భ.గీ.13.33) ఇతి చ.

"అప్రాణోహ్యమనాః శుభ్రః" ఇతి శ్రుతిః శుద్ధబ్రహ్మవిషయా. ఇయం తు"మనోమయః ప్రాణశరీరః" ఇతి సగుణబ్రహ్మవిషయేతి విశేషః. అతో వివక్షితగుణోపపత్తేః పరమేవ బ్రహ్మేహ ఉపాస్యత్వేన ఉపదిష్టమితి గమ్యతే.

బాలానందిని

యత్త్వితి:- "మనోమయః ప్రాణశరీరః" అనేది జీవలింగం; అది బ్రహ్మ విషయంలో కుదరదు అని కదా అన్నారు? అది కూడ బ్రహ్మ విషయంలో కుదురుతుం దని అంటాం. బ్రహ్మ సర్వాత్మకం గాన ఆ బ్రహ్మయందు జీవునికి సంబంధించిన మనోమయత్వాదులు ఉంటాయి. బ్రహ్మ విషయంలో ఈ విధంగా చెపుతున్న శ్రుతి-స్మృతు లున్నాయి. "త్వం... విశ్వతోముఖః" (నువ్వు స్త్రీవి, నువ్వు పురుషుడవు, నువ్వు బాలుడవు, నువ్వు బాలికవు, ముదుసలివై నువ్వు కఱ్ఱపట్టుకొని నడుస్తున్నావు. అప్పుడే పుట్టిన బిడ్డవు నువ్వే, నువ్వు అన్ని వైపులా ముఖాలు కలవాడవు) అని శ్రుతి, "సర్వతః... తిష్ఠతి" (ఆ బ్రహ్మ లోకంలో అన్నివైపులా హస్తాలు పాదాలూ కలది, అన్ని వైపులా నేత్రాలు, శిరస్సులు, ముఖాలు కలది. అన్ని వైపులా చెవులు గలది, అంతనీ ఆవరించి ఉన్నది) అని స్మృతీ చెపుతున్నాయి. "అప్రాణో హ్యమనాః శుభ్రః" అనే శ్రుతి శుద్ధ (నిర్గుణ) బ్రహ్మ విషయకం (అలాంటి బ్రహ్మను చెప్పేది); "మనోమయః ప్రాణశరీరః" ఇత్యాదికం సగుణబ్రహ్మవిషయకం అని ఈ రెండింటికీ భేదం. అందువల్ల వివక్షితాలైన గుణాలు కుదరడం వల్ల ఇక్కడ పరబ్రహ్మయే ఉపాస్యంగా చెప్పబడుచున్నది అని తెలుస్తూన్నది. 2

## సూ. అనుపపత్తేస్తు న శారీరః 1.2.3

పూర్వేణ సూత్రేణ బ్రహ్మణి వివక్షితానాం గుణానాముపపత్తిరుక్తా అనేన తు శారీరే తేషామనుపపత్తిరుచ్యతే. తు శబ్దో$_{\text{ఽ}}$వధారణార్థః. బ్రహ్మైవోక్తేన

న్యాయేన మనోమయత్వాదిగుణం, న తు శారీరో జీవో మనోమయత్వాది గుణః; యత్కారణం "సత్యసంకల్పః, ఆకాశాత్మా, అవాకీ, అనాదరః జ్యాయాన్ పృథివ్యాః" ఇతి చైవంజాతీయకా గుణా న శారీరే సామఞ్జస్యేనోపపద్యన్తే. శారీర ఇతి శరీరే భవ ఇత్యర్థః. నన్వీశ్వరోఽపి శరీరే భవతి? సత్యమ్; శరీరే భవతి, న తు శరీర ఏవ భవతి, "జ్యాయాన్ పృథివ్యాః జ్యాయానన్తరిక్షాత్" "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" ఇతి చ వ్యాపిత్వశ్రవణాత్. జీవస్తు శరీర ఏవ భవతి. తస్య భోగాధిష్ఠానాచ్ఛరీరాదన్యత్ర వృత్త్యభావాత్. 3.

బాలానందిని

అనుపపత్తేరితి:- "అనుపపత్తేః=సత్యసంకల్పత్వాదులు జీవునియందు ఉపపన్నములు కావు గాన, శారీరః=జీవుడు, న తు=కానే కాడు" అని సూత్రార్థం.

పూర్వేణేతి:- వివక్షితాలైన గుణాలు బ్రహ్మయందు ఉపపన్నములు అని వెనుకటి సూత్రంచేత చెప్పబడింది. ఈ సూత్రంచేత నైతే అవి జీవునిలో కుదర వని చెప్పబడుచ్నుది. తు శబ్దానికి అవధారణ (అది అంతే అని చెప్పడం అవధారణ) అర్థం. పైన చెప్పిన న్యాయంచేత మనోమయత్వాదిగుణా లున్నది బ్రహ్మయే; అంతే కాని శారీరుడు, అనగా జీవుడు, మనోమయత్వాదిగుణాలు కలవాడు కాడు. ఎందువల్ల ననగా "సత్యసంకల్పః...పృథివ్యాః" (అవాకీ=ఇంద్రియాలు లేనిది; అనాదరః= దేనియందు ఆదరం, కామం లేనిది, అనగా నిత్యతృప్తం) ఈ రకమైన గుణాలు జీవునిలో సరిగా నప్పవు. శారీరః అనగా శరీరంలోఉన్నవాడు అని అర్థం. ఈశ్వరుడు కూడా శరీరంలో ఉంటాడు కదా? నిజమే; శరీరంలో ఉంటాడు కాని శరీరంలో మాత్రమే ఉండడు "జ్యాయాన్...నిత్యః" అని ఈశ్వరుడు సర్వవ్యాపి అని వినబడుచున్నది కదా? జీవుడైతే శరీరంలో మాత్రమే ఉంటాడు. భోగాధిష్ఠానమైన (సుఖదుఃఖభోగాలకు స్థానమైన) శరీరం కంటె భిన్నమైన స్థానాలలో జీవుడు ప్రవర్తించడం ఉండదు. 3

## సూ. కర్మకర్తృవ్యపదేశాచ్చ 1.2.4.

ఇతశ్చ న శారీరో మనోమయత్వాదిగుణః, యస్మాత్ కర్మకర్తృవ్యపదేశో భవతి - "ఏతమితః ప్రేత్యాభిసంభవితాస్మి"(ఛా.ఉ. 3.14.4.) ఇతి. ఏతమితి ప్రకృతం మనోమయత్వాదిగుణముపాస్య మానమాత్మానం కర్మత్వేన ప్రాప్యత్వేన వ్యపదిశతి. అభిసంభవితాస్మీతి శారీరముపాసకం కర్తృత్వేన

ప్రాపకత్వేన: అభిసంభవితాస్మీతి ప్రాప్తాస్మీత్యర్థః. న చ సత్యాం గతౌ ఏకస్య కర్మకర్తృవ్యపదేశో యుక్తః. తథోపాస్యోపాపకభావోఽపి భేదాధిష్ఠాన ఏవ. తస్మాదపి న శారీరో మనోమయత్వాదివిశిష్టః 4.

బాలానందిని

కర్మేతి: "కర్మకర్తృవ్యపదేశాత్ చ=కర్మగాను కర్తగాను చెప్పడంవల్ల కూడ జీవుడు కాడు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ మనోమయత్వాదిగుణములు కలవాడు జీవుడు కాడు. ఎందువల్ల ననగా - "ఏతమితః ప్రేత్యాభిసంభవితాస్మి" (ఇక్కడినుండి వెళ్లి (మరణించి)దీనిని పొందగలను) అని ఒకదానిని కర్మగాను మరొకదానిని కర్తగాను చెప్పుచున్నది. ఏతమ్ అని మనోమయత్వాదిగుణాలు గల ఉపాసించబడుచున్న ఆత్మను పొందబడేదగుటచేత కర్మనుగా నిర్దేశిస్తున్నది. "సంభవితాస్మి" అని ఉపాసకుడైన జీవుణ్ణి ఆత్మను పొందబోయే కర్తనుగా (పొందడం అనే క్రియలో కర్తనుగా) చెప్పుచున్నది. "అభిసంభవితాస్మి" అనగా పొందగలను అని అర్థం. గతి లేకపోతే తప్ప గతి ఉన్నప్పుడు ఒకదానికే కర్మత్వమూ కర్తృత్వము చెప్పడం యుక్తం కాదు. ఉపాస్యుడు ఉపాసకుడు అనేది కూడా భేదంమీదనే ఆధారపడి ఉంటుంది. అనగా ఉపాస్యుడు కర్మ ఉపాసకుడు కర్త. అందుచేత ఒకదానిని ఉపాస్యునిగాను మరొకదానిని ఉపాసకునిగాను చెప్పిందనగా ఆ ఇద్దరిలో భేదం ఉన్న దని అర్థం కదా? (ఇది "కర్తృకర్మవ్యపదేశాచ్చ" అనే దానికి రెండవ అర్థం). ఆ కారణంవల్ల కూడ మనోమయత్వాదివిశిష్టుడు శారీరుడు కాడు.4.

## సూ. శబ్దవిశేషాత్ 1.2.5.

ఇతశ్చ శారీరాదన్యో మనోమయత్వాదిగుణః, యస్మాచ్ఛబ్దవిశేషో భవతి సమాన ప్రకరణే శ్రుత్యన్తరే - "యథా వ్రీహిర్వా యవో వా శ్యామాకో వా శ్యామాకతణ్డులో వైవమయమన్తరాత్మన్ పురుషో హిరణ్మయః" (శ.బ్రా.10.6.3.2.) ఇతి. శారీరస్యాత్మనో యః శబ్దోఽభిధాయకః సప్తమ్యన్తోఽన్తరాత్మన్నితి, తస్మాద్విశిష్టోఽన్యః ప్రథమాన్తః పురుష శబ్దో మనోమయత్వాదివిశిష్టస్యాత్మనోఽభిధాయకః. తస్మాత్తయోర్భేదోఽధిగమ్యతే.5.

బాలానందిని

శబ్దేతి:- శబ్దవిశేషాత్= "శబ్దాల భేదంవల్ల, అనగా విభక్తుల భేదంవల్ల వాటి అర్థాలు కూడ భిన్నమైనవి" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ మనోమయత్వాదిగుణుడు జీవునికంటె భిన్నుడు. ఎందువల్లననగా ఈ శ్రుతిలో చెప్పిన అర్థంతో సమానమైన అర్థం ప్రతిపాదించే ప్రకరణం గల "యథా...హిరణ్మయః" అనే మరొక శ్రుతిలో శబ్దవిశేషం అనగా శబ్దభేదం ఉన్నది. (వడ్లగింజ, యవగింజ, శ్యామాకం, బియ్యపుగింజ ఎట్లో అట్లే ఆత్మలోపల ఈ హిరణ్మయుడైన పురుషు డున్నాడు అని ఈ వాక్యానికి అర్థం). ఇక్కడ జీవాత్మను బోధించే "అంతరాత్మన్" అనే ఏ సప్తమ్యంతశబ్దం ఉన్నదో దానికంటె విశిష్టమైన అనగా భిన్నమైన పురుషః అనే ప్రథమాంతశబ్దం మనోమయత్వాదులతో కూడిన ఆత్మను బోధిస్తున్నది. దీనినిపట్టి అంతరాత్మ వేరు దానిలో ఉన్న పురుషుడు వేరు అని తెలుస్తున్నది. 5.

## సూ. స్మృతేశ్చ 1.2.6.

స్మృతిశ్చ శారీరపరమాత్మనోః భేదం దర్శయతి—

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి,

భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా"(భ. గీ. 18.61)

ఇత్యాద్యా. అత్రాహ - కః పునరయం శారీరో నామ పరమాత్మనోఽన్యః యః ప్రతిషిధ్యతే "అనుపపత్తేస్తు న శారీరః" ఇత్యాదినా? శ్రుతిస్తు నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽ స్తి శ్రోతా" (బృ.ఉ.3.7.23) ఇత్యేవంజాతీయకా పరమాత్మనోఽ న్యమాత్మానం వారయతి. తథా స్మృతిరపి-

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేసు భారత"(భ.గీ.13.2.)

ఇత్యేవంజాతీయకేతి. అత్రోచ్యతే-సత్యమేవైతత్. యథా ఘటకరకాద్యుపాధి వశాదపరిచ్ఛిన్నమపి నభః పరిచ్ఛిన్నవదవభాసతే తద్వత్. తదపేక్షయా చ కర్మత్వకర్తృత్వాదిభేదవ్యవహారో న విరుధ్యతే ప్రాక్ "తత్త్వమసి" ఇత్యాత్మైకత్వో పదేశగ్రహణాత్. గృహీతే త్వాత్మైకత్వే బన్ధమోక్షాదిసర్వ వ్యవహారపరిసమాప్తిరేవ స్యాత్.6.

### బాలానందిని

స్మృతేశ్చేతి:- "స్మృతివల్ల కూడ మనోమయత్వాదిగుణుడు జీవుడు కాడు" అని సూత్రార్థం.

స్మృతిశ్చేతి:- "ఈశ్వరః...మాయయా" ఇత్యాదికమైన స్మృతి కూడ జీవ-పరమాత్మలకు భేదాన్ని చూపుతున్నది (అర్జునా యంత్రముపై ఎక్కించి నట్లు అన్ని

భూతాలను మాయచేత త్రిప్పుచూ పరమాత్మ సమస్తప్రాణుల హృదయప్రదేశంలో ఉంటాడు అని దీని అర్థం)

ఇక్కడ అంటున్నాడు? "అనుపపత్తేస్తు న శరీరః" ఇత్యాదిసూత్రాలచేత నిషేధింపబడుతున్న (ఇక్కడ చెప్పినది అతడు కాదు అని అంటున్న) ఈ జీవు డనేవాడు, పరమాత్మకంటె భిన్నుడు ఎవడు? మరి "నాన్యోఽతోఽస్తి...శ్రోతా" (ఈ పరమాత్మకంటె భిన్నుడైన చూచేవాడు లేడు, ఈ పరమాత్మకంటె భిన్నుడైన వినేవాడు లేడు) ఇత్యాది విధమైన శ్రుతి యైతే పరమాత్మకంటె భిన్నంగా మరొక ఆత్మ ఏదీ లేదు అని నిషేధిస్తున్నది. అట్లే "క్షేత్రజ్ఞం... భారత" (అర్జునా అన్ని దేహాలలోను ఉన్న జీవుణ్ణిగా కూడ నన్ను తెలుసుకో) ఇత్యాదివిధమైన స్మృతి కూడ అట్లే చెప్పుచున్నది. ఇక్కడ (సమాధానం) చెప్పబడుచున్నది. నువ్వు చెప్పినది నిజమే. పరమాత్మయే దేహము, ఇంద్రియాలు మనస్సు బుద్ధి అనే ఉపాధులచేత పరిచ్ఛేదింపబడుచు (పరిమితరూపం కలదిగా చేయబడుచు) అజ్ఞానులచేత జీవుడు అని ఉపచరించబడుచున్నాడు. (లేనిదానిని ఉన్నట్లు ఆరోపించడం ఉపచరించడం). పరిచ్ఛిన్నం కాని ఆకాశం కూడ పెద్ద కుండ చెంబు మొదలైన ఉపాధులను పట్టి పరిచ్ఛిన్నం అయినట్లు (ఘటాకాశం కరకాకాశం ఇత్యాది విధంగా)ఎట్లు భాసిస్తుందో ఇది కూడ అట్లే. "తత్త్వమసి" అని ఆత్మైకత్వోపదేశం (జీవాత్మ పరమాత్మ ఒకటే అనే ఉపదేశం) పొందడానికి ముందు ఉపాధులచేత ఏర్పడిన ఆ పరిచ్ఛేదాన్ని పట్టి ఒకటి కర్మ రెండవది కర్త ఇత్యాదివ్యవహారం జరుగుతూండడంలో విరోధం ఏదీ లేదు. ఆత్మైకత్వం గ్రహించబడిందా ఇంక బంధం మోక్షం మొదలైన అన్ని వ్యవహారాలూ కూడ సమాప్తం అయిపోతాయి. 6.

## సూ అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ.1.2.7.

అర్భకమల్పమోకో నీడమ్ "ఏష మ ఆత్మాన్తర్హృదయే" ఇతి పరిచ్ఛిన్నాయతనత్వాత్ స్వశబ్దేన చ "అణీయాన్వ్రీహేర్వా యవాద్వా" ఇత్యణీయస్త్వవ్యపదేశాత్ శారీర ఏవారాగ్రమాత్రో జీవ ఇహోపదిశ్యతే; న సర్వగతః పరమాత్మేతి; తదిహ పరిహర్తవ్యమ్.

అత్రోచ్యతే - నాయం దోషః. న తావత్పరిచ్ఛిన్నదేశస్య సర్వగతత్వవ్యపదేశః కథమప్యుపపద్యతే, సర్వగతస్య తు సర్వదేశేషు విద్యమానత్వాత్పరిచ్ఛిన్న దేశవ్యపదేశోఽపి కయాచిదపేక్షయా సంభవతి, యథా సమస్తవసుధాధిపతిరపి హి

సన్ అయోధ్యాధిపతిరితి వ్యపదిశ్యతే. కయా పునరపేక్షయా సర్వగతః సన్నీశ్వరోఽర్భకౌకా అణీయాంశ్చ వ్యపదిశ్యత ఇతి. నిచాయ్యత్వాదేవమితి బ్రూమః. ఏవమణీయస్త్వాది గుణగణోపోపేతఈశ్వరః తత్ర హృదయపుణ్డరీకే నిచాయ్యో ద్రష్టవ్య ఉపదిశ్యతే; యథా సాలగ్రామే హరిః. తత్రాస్య బుద్ధివిజ్ఞానం గ్రాహకమ్. సర్వగతోఽపీశ్వరస్తత్రోపాస్యమానః ప్రసీదతి. వ్యోమవచ్చైతద్ద్రష్టవ్యమ్. యథా సర్వగతమపి సద్వ్యోమ సూచీపాశాద్యపేక్షయార్భకౌకోఽణీయశ్చేతి వ్యపదిశ్యతే ఏవం బ్రహ్మాపి. తదేవం నిచాయ్యత్వాపేక్షం బ్రహ్మణోఽర్భకౌకస్త్వమణీయస్త్వం చ న పారమార్థికమ్. తత్ర యదా శఙ్క్యతే - హృదయాయతనత్వాద్బ్రహ్మణో హృదయానాం చ ప్రతిశరీరం భిన్నత్వాద్భిన్నాయతనానాం చ శుకాదీనామనేకత్వసావయవత్వా నిత్యత్వాదిదోషదర్శనాత్ బ్రహ్మణోఽపి తద్వత్ప్రసఙ్గ ఇతి, తదపి పరిహృతం భవతి 7.

బాలానందిని

అర్భకేతి:- ''అర్భకౌకస్త్వాత్=చిన్న నివాసస్థానం కలిగిఉండడంవల్ల, తద్వ్యపదేశాచ్చ=అణుప్రమాణము అని చెప్పడంవల్లా, న ఇతి చేత్=జీవుడే కాని బ్రహ్మకాదు అనట్లయితే, న=అది యుక్తం కాదు. ఏవమ్=ఈ విధంగా (చిన్నస్థానంలో ఉన్నట్లుగా) నిచాయ్యత్వాత్= అన్వేషింపదగినది కాబట్టి, వ్యోమవత్ చ= ఆకాశానికివలె ఆత్మకు అల్పస్థానత్వాదికం కుదురుతుంది కూడ'' అని సూత్రార్థం.

అర్భకమితి:- అర్భకమ్=అల్పమైన, ఓకః=స్థానం "ఏష మ ఆత్మాన్తర్హృదయే" (ఈ నా ఆత్మ హృదయంలోపల ఉన్నది) అని పరిమితమైన నివాసం కలిగి ఉండడంవల్ల, "అణీయాన్వ్రీహేర్వా యవాద్వా" అని స్వశబ్దంచేత (అణీయాన్ అనే శబ్దంచేత) అణీయస్త్వాన్ని చెప్పడంచేత ఇక్కడ ఉపదేశింపబడేవాడు ఆరాగ్రప్రమాణం గల జీవుడే కాని సర్వగతుడైన పరమాత్మ కాదు అని (పూర్వపక్షిచేత) ఏది చెప్పబడిందో దానిని పరిహంచవలసి ఉంది. ఇక్కడ (సమాధానం) చెప్పడబడుచున్నది. ఈ దోషం లేదు. పరిమితదేశంలో ఉన్నదానిని సర్వగతం అని చెప్పడానికి ఏ విధంగానూ కూడ కుదరదు. అయితే సర్వగత మైనది అన్ని ప్రదేశాలలోను కూడ ఉంటుంది కాబట్టి పరిచ్ఛిన్నదేశంలో ఉన్నట్లుగా ఏదో ఒక నిమిత్తాన్ని పట్టి చెప్పడం సంభవమే. సమస్తభూమండలానికి అధిపతి యైనా (శ్రీరాముణ్ణి)అయోధ్యాధిపతి అనడం ఎట్లో అట్లే. అయితే సర్వగతుడే అయినా ఈశ్వరుడు ఏ నిమిత్తంచేత 'అర్భకౌకాః' అనీ 'అణీయాన్' అనీ చెప్పబడుతున్నాడు? ఈ విధంగా అన్వేషించదగినవా డవడంవల్ల, ధ్యానిపదగినవా డవడంవల్ల అని అంటాం. ఈ విధంగా అణీయస్త్వాదిగుణాలతో కూడిన

ఈశ్వరుడు ఆ హృదయపుండరీకంలో నిచాయ్యుడు అనగా చూడదగినవాడు అని ఉపదేశించబడుచున్నది. సాలగ్రామంమీద శ్రీమహావిష్ణువును చూచి నట్లే ఇది కూడ. ఆ హృదయపుండరీకంలో బుద్ధివృత్తి పరమమేశ్వరుణ్ణి గ్రహిస్తుంది. (పరమేశ్వరుడు హృదయపుండరీకంలో ఉన్నాడని ధ్యానం చేయగా చేయగా తత్సాక్షాత్కారం కలుగుతుంది). ఈశ్వరుడు అంతటా ఉన్నాకూడ అక్కడ ఉన్నట్లు ఉపాసింపబడినవాడై ప్రసన్ను డవుతాడు. ఆకాశం సర్వగతమే అయినా సూది రంధ్రం మొదలైనవాటిని పట్టి చాల చిన్న చోటులో ఉన్నట్లు అణుప్రమాణమై నట్లు ఎట్లు చెప్పబడుతుందో బ్రహ్మకూడ అట్లే. ఈ విధంగా బ్రహ్మకు చెప్పబడిన అర్భకౌకకస్త్వాణీయస్త్వాలు నిచాయ్యత్వాన్ని పట్టి ఏర్పడినవే కాని పారమార్థికమైనవి కావు

అవ. ఈ ఆకాశదృష్టాంతంచేత మరొక ఆశంక కూడ తొలగిపోతుందని చెపుతున్నారు. తత్రేతి:- బ్రహ్మకు హృదయం నివాసస్థానం అంటున్నారు కదా? హృదయా లనే ఈ స్థానాలు ప్రతిశరీరంలోను వేరు వేరుగా ఉంటాయి. వేరు వేరు గూళ్లలో నివసించే చిలకలు మొదలైనవాటిలో అనేకత్వం, అవయవాలు కలిగి ఉండడం, అనిత్యత్వం మొదలైన దోషాలు కనబడుతున్నాయి. బ్రహ్మకు కూడ అలాంటి దోషాలు కలిగే ప్రసక్తి ఉంది కదా అనే ఆశంక కూడ దీనిచేత (ఆకాశదృష్టాంతంచేత) పరిహృతం అవుతుంది. అనగా ఇదంతా కాల్పనికమే కాని పారమార్థికం కాదు గాన ఆ దోషాలేవీ లేవని భావం. 7.

## సూ సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్ 8.

వ్యోమవత్సర్వగతస్య బ్రహ్మణః సర్వప్రాణిహృదయసంబన్ధాచ్ఛిద్రూపతయా చ శారీరాదవిశిష్టత్వాత్ సుఖదుఃఖాదిసంభోగోఽప్యవిశిష్టః ప్రసజ్యేత. ఏకత్వాచ్చ. న హి పరస్మాదాత్మనోఽన్యః కశ్చిదాత్మా సంసారీ విద్యతే, "నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" (బృ.ఉ.3.7.23) ఇత్యాదిశ్రుతిభ్యః. తస్మాత్పరస్యైవ సంసారసంభోగప్రాప్తిరితి చేత్ - న; వైశేష్యాత్. న తావత్సర్వప్రాణిహృదయసంబన్ధాచ్ఛారీరవద్బ్రహ్మణః సంభోగప్రసంగః, వైశేష్యాత్. విశేషో హి భవతి శారీరపరమేశ్వరయోః. ఏకః కర్తా భోక్తా ధర్మాధర్మసాధనః సుఖదుఃఖాదిమాంశ్చ, ఏకస్తద్విపరీతోఽపహతపాప్మత్వాదిగుణః. ఏతస్మాదనయోర్విశేషాదేకస్య భోగో నేతరస్య. యది సంనిధానమాత్రేణ వస్తుశక్తిమానాశ్రిత్య కార్యసంబన్ధోఽభ్యుపగమ్యేత ఆకాశాదీనామపి దాహప్రసంగః. సర్వగతానేకాత్మవాదినామపి సమావేతౌ చోద్యపరిహారౌ. యదపి

ఏకత్వాద్బ్రహ్మణః ఆత్మాన్తరాభావాత్ శారీరస్య భోగేన బ్రహ్మణః భోగప్రసంగ ఇతి, అత్ర వదామః- ఇదం తావద్దేవానాంప్రియః ప్రష్టవ్యః కథమయం త్వయాత్మాన్తరాభావోఽధ్యవసిత ఇతి. "తత్త్వమసి" ' 'అహం బ్రహ్మాస్మి" "నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" ఇత్యాదిశాస్త్రేభ్య ఇతి చేత్ యథాశాస్త్రం తర్హి శాస్త్రీయోఽర్థః ప్రతిపత్తవ్యో న తత్రార్ధజరతీయం లభ్యమ్. శాస్త్రం చ "తత్త్వమసి" ఇత్యపహతపాప్మత్వాదివిశేషణం బ్రహ్మ శారీరస్యాత్మత్వేనో పదిశత్ శారీరస్యైవ తావదుపభోక్తృత్వం వారయతి. కుతస్తదుపభోగేన బ్రహ్మణ ఉపభోగప్రసఙ్గః?

### బాలానందిని

సంభోగేతి:- ''సంభోగప్రాప్తిః ఇతిచేత్=బ్రహ్మకు సుఖదుఃఖాదిభోగం వచ్చిపడుతుంది అని అంటే, న=అది యుక్తం కాదు, వైశేష్యాత్= జీవబ్రహ్మలలో విశేషం ఉంది కదా'' అని సూత్రార్థం.

వ్యోమవదితి:- ఆకాశం వలె సర్వగత మైన బ్రహ్మ అన్ని ప్రాణుల హృదయాలతో సంబంధం ఉండడంవల్ల, చిద్రూపం అవడంచేత, జీవునికీ దానికీ భేదం లేకపోవడంవల్లా (జీవునితో) ఏమీ తేడా లేకుండా దానికికూడ సుఖదుఃఖాల భోగం ప్రసక్తం అవుతుంది. (బ్రహ్మకూడ జీవులతోపాటు సుఖదుఃఖాలు అనుభవిస్తుందని చెప్పవలసి ఉంటుంది అని అర్థం). మరొకకారణం ఏమనగా బ్రహ్మ ఒక్కటే. "నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" ఇత్యాదిశ్రుతుల ప్రకారం పరమాత్మకంటె వేరుగా సంసారియైన మరొక ఆత్మ ఏదీ లేదు కదా. అందువల్ల సంసారభోగం పరమాత్మ కే కలగవలసి ఉంటుంది అని అన్నట్లయితే అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా విశేషం ఉంది. సర్వప్రాణుల హృదయాలతో సంబంధం ఉండడంవల్ల బ్రహ్మకు, జీవునకు వలె సుశదుఃఖభోగప్రసక్తి లేదు, వైశేష్యాత్ జీవపరమేశ్వరులలో విశేషం ఉంది కదా. ఒకడు కర్త భోక్త ధర్మాధర్మాలు సాధనంగా గలవాడు; సుఖదుఃఖాదులు కలవాడు కూడ; మరొకడు (పరమేశ్వరుడు)మొదటివానికి విపరీతమైనవాడు; పాపరాహిత్యాదిగుణాలు కలవాడు. ఈ విశేషం ఉండడంవల్ల ఒకనికే బోగం ఉంటుంది కాని రెండవవానికి ఉండదు. వస్తువులో ఎలాంటి శక్తి ఉన్నదో చూచుకొనకుండా దగ్గర ఉన్నంత మాత్రం చేతనే కార్యంతో సంబంధం కలుగుతుంది అని అంగీకరిస్తే (కాలే ప్రతీ వస్తువు దగ్గరా ఉండే) ఆకాశాదులకు కూడా దాహం (కాలిపోవడం) కలుగుతుందని చెప్పవలసి వస్తుంది. ఈ చోద్యపరిహారాలు (ఆక్షేపసమాధానాలు) సర్వగతానేకాత్మవాదులకు కూడా సమానములే.

వి. నైయాయికాదుల మతం ప్రకారం జీవులు అనంతసంఖ్యాకులు, విభువులు, అనగా సర్వత్రా వ్యాపించి ఉంటారు. అనగా ఒక శరీరంలో, దానికి సంబంధించిన జీవునితోపాటు అనంతసంఖ్యాకులైన సకలజీవులు సంనిహితులై ఉంటారు. అందుచేత ఆ దేహంలో ఉన్న జీవునికి సుఖదుఃఖాలు కలిగినప్పుడల్లా ఇతర జీవులందరికీ కలగాలి కదా అనే ప్రశ్న వాళ్ళనీ అడగవచ్చు. ఒక జీవునికి నిర్దిష్టమైన ఒక దేహంలోనే కర్మాదివశంచేత సుఖదుఃఖాలు కలుగుతాయి. మిగిలిన దేహాలతో వారికి సంబంధం ఉన్నా కూడ ఆ సుఖదుఃఖాలు అంటవు అని వాళ్ళేదో సమాధానం చెప్పుకోవాలి. అలాంటి నైయాయకాదులు ఈ ప్రశ్న వేదాంతినే అడగడం యుక్తం కాదు. మా సమాధానం మాకుంది అని భావం.

యదపీతి :- బ్రహ్మ ఒక్కటే గాని, మరొక ఆత్మ ఏదీ లేదు గాన జీవునికి భోగం కలుగుతే బ్రహ్మకు కూడా భోగం కలగాలని ఏదైతో (పూర్వపక్షిచేత) ఆక్షేపణ చేయబడిందో దాని విషయంలో చెపుతాం. మరొక ఆత్మ లేదు అని నీకు ఎలా తెలిసింది అని ముందుగా ఆ తెలివి తక్కువ పెద్దమనిషిని అడగాలి. "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" ఇత్యాదిశాస్త్రాలవల్ల తెలిసింది అని అంటే అయితే శాస్త్రీయమైన విషయాన్ని యథాశాస్త్రంగానే గ్రహించాలి కాని అర్ధ జరతీయన్యాయం అవలంబించకూడదు. పాపరాహిత్యాదివిశేషణాలు గల బ్రహ్మయే జీవుని ఆత్మ అని బోధిస్తున్న తత్త్వమసి ఇత్యాది శాస్త్రం అసలు జీవునికే కర్తృత్వభోక్తృత్వాలు లేవని చెపుతున్నది. అలాంటప్పుడు జీవుని భోగంవల్ల బ్రహ్మకు భోగం ప్రాప్తించే ప్రసక్తి ఎక్కడుంది?

## భాష్యమ్

అథ అగృహీతం శారీరస్య బ్రహ్మణైకత్వం తదా మిథ్యాజ్ఞాననిమిత్తః శారీరస్యోపభోగః న తేన పరమార్థరూపస్య బ్రహ్మణః సంస్పర్శః. న హి బాలై స్తలమలినతాదిభిర్వ్యోమ్ని వికల్ప్యమానే తలమలినతాదివిశిష్టమేవ పరమార్థతో వ్యోమ భవతి. తదాహ-న వైశేష్యాదితి. నైకత్వేపి శారీరస్యోపభోగేన బ్రహ్మణ ఉపభోగప్రసఙ్గః; వైశేష్యాత్; విశేషో హి భవతి సమ్యగ్జ్ఞాన మిథ్యాజ్ఞానయోః, మిథ్యాజ్ఞానకల్పిత ఉపభోగః. సమ్యగ్జ్ఞానదృష్టమేకత్వమ్. న చ మిథ్యాజ్ఞానదృష్టేన ఉపభోగేన సమ్యగ్జ్ఞానదృష్టం వస్తు సంస్పృశ్యతే. తస్మాన్నోపభోగగన్ధోఽపి శక్య ఈశ్వరస్య కల్పయితుమ్.

బాలానందిని

అథేతి :- అట్లుకాక జీవునకు బ్రహ్మతో ఏకత్వం తెలియబడలేదు అని అంటే అయితే జీవుని భోగం మిథ్యాజ్ఞానంచేత ఏర్పడినదే. దానిచేత పరమార్థరూపుడైన పరమాత్మకు సంస్పర్శ ఉండదు. ఆకాశంలో అడుగుభాగం, మలినత్వం (లేదా తలంవలె మలినత్వం) మొదలైనవి అజ్ఞానులచే వికల్పించబడినా, ఆరోపించబడినా, వాస్తవంలో కూడ ఆకాశం తలమలినతాదివిశిష్టం కాదు కదా? ఈ విషయమే వైశేష్యాత్ అని చెపుతున్నాడు. (ఇది ఈ పదానికి మరొక అర్థం). జీవునితో ఏకత్వం ఉన్నా కూడా బ్రహ్మకు ఉపభోగం కలిగే ప్రసంగం లేదు. వైశేష్యంవల్ల. మిథ్యాజ్ఞానసమ్యగ్జ్ఞానాలలో విశేషం ఉంది గదా? ఉపభోగం మిథ్యాజ్ఞానంచేత కల్పించబడినది. ఏకత్వం సమ్యగ్జ్ఞానంచేత చూడబడినది. మిథ్యాజ్ఞానంచేత (భ్రాంతి చేత) కల్పించబడిన ఉపభోగంచేత సమ్యగ్జ్ఞానం (యథార్థజ్ఞానం) చేత చూడబడిన వస్తువు స్పృశింపబడదు కదా? అందుచేత ఈశ్వరునికి లేశమాత్రం కూడా ఉపభోగం కల్పింప శక్యం కాదు.

సర్వత్ర ప్రసిద్ధాదికరణం సమాప్తం

## 2. అత్త్రధికరణం. సూ.9-10

## సూ. అత్తా చరాచరగ్రహణాత్ 1.2.9

కఠవల్లీషు పఠ్యతే—

**"యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనః,**
**మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్రసః" (క.ఉ.1.2.24) ఇతి.**

అత్ర కశ్చిదోదనోపసేచనసూచితః అత్తా ప్రతీయతే. తత్ర కిమగ్నిరత్తా స్యాత్, ఉత జీవః అథవా పరమాత్మేతి సంశయః, విశేషానవధారణాత్. త్రయాణాంచాగ్ని జీవపరమాత్మనామస్మిన్ గ్రన్థే ప్రశ్నోపన్యాసోపలబ్ధేః. కిం తావత్ప్రాప్తమ్? అగ్నిరత్తేతి. కుతః? "అగ్నిరన్నాదః" (బృ.ఉ.1.4.6) ఇతి శ్రుతిప్రసిద్ధిభ్యామ్. జీవో వాత్తా స్యాత్. "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" ఇతి దర్శనాత్. న పరమాత్మా, "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" (ముణ్డ 3.1.1) ఇతి దర్శనాదిత్యేవం ప్రాప్తే బ్రూమః-

బాలానందిని

అత్తేతి :- "చరాచరగ్రహణాత్ = స్థావర జంగమాలను చెప్పడంవల్ల, అత్తా=తినేవాడు పరమాత్మయే" అని సూత్రార్థం.

కఠేతి : కఠోపనిషత్తులో "యస్య...సః" (ఎవనికి బ్రాహ్మణక్షత్రియులు ఇద్దరూ అనగా బ్రాహ్మణక్షత్రియాదిజగత్తు అన్నమో, మృత్యుదేవత ఉపసేచనమో (అన్నం

మీద వేసే నెయ్యి మొదలైనది ఉపసేచనం) అట్టి అత్త (తినేవాడు) ఏ పరబ్రహ్మ యందు నిలబడ్డాడో (అట్టి అత్తకు పరబ్రహ్మ అధిష్ఠానం అని అర్థం) అట్టి పరబ్రహ్మను గూర్చి ఇది ఇట్లు అని ఎవడు ఎరుగును?) అని పఠింపబడుచున్నది. ఇక్కడ అన్నంచేతా, ఉపసేచనంచేతా సూచింపబడిన అత్త (తినేవాడు) ఒకడు ఉన్నట్లు తెలుస్తూన్నది. అయితే ఈ అత్త అగ్నియా, జీవుడా, పరమాత్మయా అని సంశయం. దీనినే గ్రహించాలి అనే విశేషం ఏదీ నిశ్చితం కాకపోవడంవల్ల ఈ గ్రంథంలో అగ్ని-జీవ-పరమాత్మలు ముగ్గురిని గూర్చి ప్రశ్నసమాధానాలు కనబడడంవల్ల ఈ సంశయం కలుగుతున్నది. అయితే ఏమి ప్రాప్తించింది (తేలింది)? అత్త అగ్ని అని తేలింది. ఎందువల్ల? 'అగ్నిరన్నాదః' (అన్నం తినే అగ్ని)అని శ్రుతి లోకప్రసిద్ధీ కూడా ఉండడంవల్ల. లేదా "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" (ఆ ఇద్దరిలో ఒకరు మధురమైన కర్మఫలం తింటున్నాడు) అని కనబడుతున్నది గాన జీవుడు కావచ్చు. కాని "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" (రెండవవాడు తినకుండా చూస్తున్నాడు) అని చెప్పడంవల్ల పరమాత్మమాత్రం కాదు అని ప్రాప్తించగా చెపుతున్నాం. (బ్రహ్మకు భోక్తృత్వం లేదని వెనుక చెప్పబడింది. అయితే అత్తృత్వం కూడ జీవునికే, బ్రహ్మకు లేదు అని దృష్టాంతసంగతిచే పూర్వపక్షం)

## భాష్యమ్

అత్తాత్ర పరమాత్మా భవితుమర్హతి. కుతః? చరాచరగ్రహణాత్. చరాచరం హి స్థావరజఙ్గమం మృత్యూపసేచనమిహాద్యత్వేన ప్రతీయతే. తాదృశస్య చాద్యస్య న పరమాత్మనోఽన్యః కార్త్స్న్యేనాత్తా సంభవతి. పరమాత్మా తు వికారజాతం సర్వమత్తీత్యుపపద్యతే. నన్విహ చరాచరగ్రహణం నోపలాభ్యతే, తత్కథం సిద్ధవచ్చరాచర గ్రహణం హేతుత్వేనోపాదీయతే?నైష దోషః. మృత్యూపసేచనత్వేన సర్వస్య ప్రాణినికాయస్య ప్రతీయమానత్వాత్. బ్రహ్మక్షత్రయోశ్చ ప్రాధాన్యాత్ప్రదర్శనార్థత్వోపపత్తేఃయత్తు. పరమాత్మనోఽపి నాత్తృత్వం సంభవతి, ''అనశ్నన్నన్యో భిచాకశీతి'' ఇతి దర్శనాత్ ఇతి, అత్రోచ్యతే— కర్మఫలోపభోగస్య ప్రతిషేధకమేతద్దర్శనమ్, తస్య సంనిహితత్వాత్. న వికారసంహారస్య ప్రతిషేధకమ్, సర్వవేదాన్తేషు సృష్టిస్థితిసంహారకారణత్వేన బ్రహ్మణః ప్రసిద్ధత్వాత్. తస్మాత్ పరమాత్మైవేహాత్తా భవితుమర్హతి.

### బాలానందిని

అత్తేతి:- ఇక్కడ అత్త పరమాత్మయే అవడం తగినది. ఎందువల్ల? చరాచరాలను గ్రహించడంవల్ల. ఇక్కడ మృత్యువు ఉపసేచనంగా గల చరాచరజగత్తు తినదగినదిగా కనబడుతున్నది. అలాంటి తినదగిన పదార్థాన్ని పూర్తిగా తినగలిగినవాడు పరమాత్మ తప్ప మరెవడూ సంభవించడు. పరమాత్మయైతే సకలకార్యసముదాయాన్నీ తినేస్తాడనేది యుక్తంగా ఉంటుంది. (ప్రశ్న) ఇక్కడ చరాచరాలను చెప్పినట్లు కనబడదే; అలాంటప్పుడు చరాచరగ్రహణాత్ అని "చరాచరగ్రహణం" హేతువుగా ఎలా చూపబడుతున్నది? (సమాధానం) ఈ దోషం లేదు. మృత్యువును ఉపసేచనంగా చెప్పడంచేత సమస్త ప్రాణి సముదాయాన్ని చెప్పినట్లు తెలుస్తున్నది. ప్రాధాన్యాన్ని పట్టి బ్రాహ్మణ క్షత్రియులను ఉదాహరణంగా (మచ్చుగా) చూపినట్లు చెప్పడం కుదురుతుంది. "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" అని చెప్పడంవల్ల పరమాత్మకు కూడా అత్తృత్వం (తినేవాడవడం) కుదరదు అన్నదానికి సమాధానం చెప్పబడుచున్నది- ఆ సందర్భంలో కర్మఫలాన్ని గూర్చిన చర్చ ఉండడంచేత ఈ వాక్యం కర్మఫలోపభోగం పరమేశ్వరునికి లేదు అని మాత్రమే చెపుతున్నది గాని కార్యాన్ని సంహరించడాన్ని కూడా నిషేధించడంలేదు. ఎందువల్లననగా సకల వేదాంతాలలోను బ్రహ్మ సృష్టిస్థితిసంహారాలకు కారణంగా ప్రసిద్ధమైనది. అందువల్ల ఇక్కడ పరమాత్మయే అత్త అవడానికి తగి ఉంది?

## సూ. ప్రకరణాచ్చ 1.2.10.

ఇతశ్చ పరమాత్మైవేహాత్తా భవితుమర్హతి, యత్కారణం ప్రకరణమిదం పరమాత్మనః "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" (క.ఉ.1.2.18) ఇత్యాది. ప్రకృత గ్రహణం చ న్యాయ్యమ్. "క ఇత్థా వేద యత్ర సః" ఇతి చ దుర్విజ్ఞానత్వం పరమాత్మలిఙ్గమ్.

### బాలానందిని

ప్రకరణేతి :- "ప్రకరణాచ్చ = ప్రకరణాన్ని పట్టి కూడా పరమాత్మనే గ్రహించాలి" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" (ఆత్మజ్ఞానంగలవాడు పుట్టడు, మరణించడు) ఇత్యాదివాక్యాలలో ఇది పరమాత్మను గూర్చి చెప్పే ప్రకరణంగాన ఇక్కడ అత్తగా చెప్పబడినవాడు పరమాత్మయే అని గ్రహించడం యుక్తం ప్రకృతమైన విషయాన్నే గ్రహించడం న్యాయ్యం. "క ఇత్థా వేద యత్ర సః" అని దీని స్వరూపం తెలుసుకొనడానికి శక్యం కాదు అని చెప్పడం కూడా పరమాత్మలింగం.

అత్త్రధికరణం సమాప్తం

## 3. గుహాప్రవిష్టాధికరణమ్ సూ.11-12.

### సూ. గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్ 1.2.11.

కఠవల్లీష్వేవ పఠ్యతే -

"ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే,
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః" (క.ఉ.1.3.1)
ఇతి. తత్రసంశయః కిమిహ బుద్ధిజీవౌ నిర్దిష్టౌ ఉత జీవపరమాత్మానావితి. యది బుద్ధిజీవౌతతో బుద్ధిప్రధానాత్కార్యకరణసంఘాతాద్విలక్షణః జీవః ప్రతిపాదితో భవతి, తదపీహ ప్రతిపాదయితవ్యమ్- "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే,

ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం వరాణామేష వరస్తృతీయః. (క.ఉ.1.1.20)

ఇతి పృష్టత్వాత్. అథ జీవపరమాత్మానౌ, తతో జీవాద్విలక్షణః పరమాత్మా ప్రతిపాదితో భవతి. తదపీహ ప్రతిపాదయితవ్యమ్.

"అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్, P.69 & 353

అన్యత్ర భూతాచ్చభవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద" (క.ఉ.1.2.14)

ఇతి పృష్టత్వాత్.

అత్రాహాక్షేప్తా-ఉభావప్యేతౌ పక్షౌ న సంభవతః. కస్మాత్? ఋతపానం కర్మఫలోపభోగః "సుకృతస్యలోకే". ఇతి లిఙ్గాత్. తచ్చ చేతనస్య క్షేత్రజ్ఞస్య సంభవతి, నాచేతనాయాః బుద్ధేః. పిబన్తౌ ఇతి చ ద్వివచనేన ద్వయోః పానం దర్శయతి శ్రుతిః. అతో బుద్ధిక్షేత్రజ్ఞపక్షస్తావన్న సంభవతి. అత ఏవ క్షేత్రజ్ఞ పరమాత్మపక్షోఽపి న సంభవతి, చేతనే పరమాత్మని ఋతపానాసంభవాత్ "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" ఇతి మన్త్రవర్ణాత్ ఇతి.

### బాలానందిని

గుహామితి:- "గుహామ్-గుహను, ప్రవిష్టౌ-ప్రవేశించినవి, అత్మానౌ= జీవాత్మ పరమాత్మలు. తద్దర్శనాత్ = సమానస్వభావంగలవాటినే సంఖ్యచేత నిర్దేశించడం చూడబడుతుంది కదా" అని సూత్రార్థం.

కఠేతి :- కఠోపనిషత్తులోనే "ఋతం... త్రిణాచికేతాః" అని పఠించబడుతున్నది. (సుకృతస్య లోకే = కర్మవల్ల పుట్టిన దేహంలో, పరమే=గొప్పదైన, పరార్ధ్యే = పరమేశ్వరస్థానమైన హృదయమునందు, గుహాం ప్రవిష్టౌ = ఆకాశమును లేదా బుద్ధిని ప్రవేశించిన, ఋతం పిబన్తౌ =కర్మఫలం అను భవిస్తున్న, ఛాయాతపౌ = నీడ ఎండవలె పరస్పరవిరుద్ధములైనవాటిని, బ్రహ్మవిదః=బ్రహ్మతేత్తలు, పఞ్చాగ్నయః=కర్మలు ఆచరించినవారు, త్రిణాచికేతాః = మూడు పర్యాయాలు నచికేతాగ్ని చయనం చేసినవాళ్ళు, వదన్తి = చెప్పచున్నారు, అని దీని అర్థం) ఇక్కడ బుద్ధిజీవులు నిర్దేశింపబడ్డారా, లేదా జీవ -పరమాత్మలు నిర్దేశించబడ్డారా అని సంశయం. బుద్ధిజీవులు నిర్దేశింపబడినట్లయితే అప్పుడు బుద్ధిప్రధానమైన (దేనిలో బుద్ధి ప్రధానమైనదో అట్టి) దేహేంద్రియసముదాయం కంటె విలక్షణుడైన జీవుణ్ణి ప్రతిపాదించినట్లవుతుంది. "యేయం... తృతీయః" (మనిషి మరణించిన తరువాత కూడ అతడు ఉంటాడని కొందరు ఉండడని కొందరు అంటూ ఏ యీ సంశయం ఉన్నదో ఈ విషయంలో నీచేత బోధింపబడినవాడనై నేను తెలునుకోవాలనుకొంటున్నాను. ఇది వరాలలో మూడవ వరం) అని ప్రశ్నించడంచేత ఆ జీవుని విషయం కూడా ప్రతిపాదించవలసినదే. అట్లు కాక ఇక్కడ ప్రతిపాదించబడిన వాళ్ళు జీవపరమాత్మలైతే అప్పుడు జీవునికంటె విలక్షణుడైన పరమాత్మ ప్రతిపాదించబడినట్లయివుతుంది. "అన్యత్ర...తద్వద" (ధర్మాధర్మాలకంటె భిన్నంగా చేయబడిన దానికంటె చేయబడనిదానికంటె భిన్నంగా భూతభవిష్యత్తులకంటె భిన్నంగా అనగా వీటి కన్నింటికీ అతీతమైన, దేనిని నీవు చూస్తున్నావో అది చెప్పుము) అని ప్రశ్నింపబడినది గాన ఆ విషయం కూడా ఇక్కడ చెప్పవలసి ఉంది.

ఇక్కడ ఒక ఆక్షేప్త (ఆక్షేపణ చేసేవాడు) ఇలా అంటున్నాడు. ఇక్కడ ఈ రెండు పక్షాలూ కూడా కుదరవు. ఎందువల్ల? "సుకృతస్య లోకే" (కర్మవల్ల ఏర్పడిన లోకంలో, అనగా దేహంలో) అనే లింగంవల్ల (అని చెప్పడంచేత) ఋతపానం అనగా కర్మఫలభోగం. అది చేతనుడైన క్షేత్రజ్ఞునికి (జీవునికి)కుదరుతుంది గాని అచేతనమైన బుద్ధికి కుదరదు. పిబన్తౌ అని ద్వివచనం ప్రయోగించడంచేత శ్రుతి ఉభయులు కర్మఫలభోగం చేస్తున్నట్లు చెప్పచున్నది. అందువల్ల బుద్ధిక్షేత్రజ్ఞులు అనే పక్షమైతే కుదరదు. ఇదే కారణంచేత క్షేత్రజ్ఞపరమాత్మలనే పక్షం కూడా కుదరదు. పరమాత్మ చేతనుడే అయినా "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" అని మంత్రం ఉండడంవల్ల (మంత్రంలో చెప్పినట్లు)పరమాత్మకు కర్మఫలభోగం కుదరదు కదా?

భాష్యమ్

అత్రోచ్యతే - నైష దోషః. ఛత్రిణో గచ్ఛన్తీత్యేకేనాపి ఛత్రిణా బహూనాం ఛత్రిత్వోపచారదర్శనాత్; ఏవమేకేనాపి పిబతా ద్వౌ పిబన్తావుచ్యేయాతామ్. యద్వా జీవస్తావత్పిబతి, ఈశ్వరస్తు పాయయతి, పాయయన్నపి పిబతీత్యుచ్యతే. పాచయితర్యపి పక్తృత్వప్రసిద్ధిదర్శనాత్. బుద్ధిక్షేత్రజ్ఞ పరిగ్రహోఽపి సంభవతి, కరణే కర్తృత్వోపచారాత్, ఏధాంసి పచన్తీతి ప్రయోగదర్శనాత్. న చాధ్యాత్మాధికారేఽన్యౌ కౌచిద్ద్వావృతం పిబన్తౌ సంభవతః. తస్మాద్బుద్ధిజీవౌ స్యాతాం జీవపరమాత్మానౌ వేతి సంశయః. కిం తావత్ప్రాప్తమ్? బుద్ధిక్షేత్రజ్ఞావితి. కుతః? గుహాం ప్రవిష్టావితి విశేషణాత్. యది శరీరం గుహా యది వా హృదయం ఉభయథాపి బుద్ధిక్షేత్రజ్ఞౌ గుహాం ప్రవిష్టావుపపద్యేతే. న చ సతి సంభవే సర్వగతస్య బ్రహ్మణో విశిష్టదేశత్వం యుక్తం కల్పయితుమ్. 'సుకృతస్య లోకే' ఇతి చ కర్మగోచరానతిక్రమం దర్శయతి. పరమాత్మా తు న సుకృతస్య వా దుష్కృతస్య వా గోచరే వర్తతే. "న కర్మణా వర్ధతే నో కనీయాన్" ఇతి శ్రుతేః "ఛాయాతపౌ" ఇతి చ చేతనాచేతనయోర్నిర్దేశ ఉపపద్యతే. ఛాయాతపవత్పరస్పరవిలక్షణత్వాత్. తస్మాద్బుద్ధిజీవావిహోచ్యాయాతామితి ప్రాప్తే బ్రూమః-

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ చెప్పబడుచున్నది. ఇది దోషం కాదు. చాలామంది వెడుతున్నప్పుడు వాళ్లలో ఒకనికే గొడుగు ఉన్నా "గొడుగుల వాళ్లు వెడుతున్నారు" అని చాలా మందిని ఛత్రులనుగా పేర్కొనడం (చాలామందికి ఛత్రిత్వం ఆరోపించడం) కనబడుచున్నది. అట్లే అనుభవిస్తున్నది ఒకరే అయినా ఇద్దరూ అనుభవిస్తున్నట్లు చెప్పబడవచ్చును. లేదా - జీవుడు అనుభవిస్తున్నాడు, ఈశ్వరుడు అనుభవింపచేస్తున్నాడు. ఆ విధంగా అనుభవింపచేస్తున్నవాడు కూడ అనుభవిస్తున్నాడు అని చెప్పబడుతున్నాడు. వండింపచేసేవానిని కూడ వంట చేస్తూన్నాడు అనడం ప్రసిద్ధిలో ఉంది కదా? కరణానికి (సాధనానికి) కర్తృత్వం ఆరోపించడం వల్ల (అచేతనమైన బుద్ధి అనుభవించకపోయినా అనుభవించడానికి సాధనంగా ఉందిగాన దానిని కూడ కర్తగా భావించడంవల్ల) బుద్ధి క్షేత్రజ్ఞులను కూడ గ్రహించవచ్చు. "కట్టెలు వండుతున్నాయి" ఇత్యాది ప్రయోగా

లున్నాయి కదా? (వండడానికి కట్టెలు సాధనం మాత్రమే అయినా అవి బాగా మండడంచేత వంట చాలా అనాయాసంగా జరుతుగుచున్న దని సూచించడానికి కట్టెలు వండుతున్నాయి అన్నట్లు, బుద్ధి అనుభవిస్తూన్నది అని చెప్పడంలో తప్పులేదని భావం). ఆధ్యాత్మికాధికారంలో (శరీరాన్ని గూర్చి మాటలాడే ప్రకరణంలో) కర్మఫలం అనుభవించేవాళ్లు ఇద్దరు మరెవరూ సంభవిచరు కదా? అందువల్ల బుద్ధి-, జీవులా జీవ పరమాత్మలా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? (ఏమంటే బాగుంటుంది?) బుద్ధిక్షేత్రజ్ఞులని. ఎందువల్ల? "గుహాం ప్రవిష్టౌ" అని విశేషణం ఉండడం వల్ల. శరీరం గుహ అనుకొన్నా, హృదయం గుహ అనుకొన్నా రెండు విధాలా కూడ గుహను ప్రవేశించినవాళ్లు బుద్ధి జీవులు అని చెప్పడం కుదురుతుంది. మరొక విధంగా చెప్పడానికి అవకాశం ఉన్నప్పుడు సర్వగతమైన బ్రహ్మ ఏదో ఒక ప్రదేశంలో ఉంటుంది అని చెప్పడం యుక్తం కాదు. "సుకృతస్య లోకే" అని అక్కడ ఉన్నవాళ్లు కర్మకు లోబడినవాళ్లే అని చూపుతున్నది. పరమాత్మ యైతే సుకృతానికి గాని దుష్కృతానికి గాని గోచరంలో ఉండడు కదా? (సుకృతదుష్కృతాతీతుడు కదా?). "న కర్మణా వర్ధతే నో కనీయాన్" (పరమాత్మ కర్మచేత వృద్ధి పొందడు, క్షీణించడు) అని శ్రుతి చెప్పుచున్నది. చేతనాచేతనాలు నీడ-ఎండల వలె పరస్పరం విలక్షణమైనవి గాన వాటిని "ఛాయాతపౌ" అని నిర్దేశించడం యుక్తంగా ఉంటుంది. అందుచేత ఈ శ్రుతివాక్యంలో బుద్ధి-క్షేత్రజ్ఞులే చెప్పబడుతున్నారు అని ప్రాప్తించగా చెప్పుచున్నాం

వి. వెనుకటి అధికరణంలో - మృత్యుశబ్దసంనిధానంవల్ల బ్రహ్మక్షత్రాదికమైన చరాచరజగత్తు అని అర్థం చెప్పి, సంహర్త ఈశ్వరుడు డని చెప్పబడింది. ఇక్కడ కూడ 'పిబన్తౌ' అనే శబ్దం ఉండడంచేత ఈ వాక్యం బుద్ధి-జీవపరం అని ఈ రెండు అధికరణాలకీ దృష్టాన్తసంగతి.

## భాష్యమ్

విజ్ఞానాత్మపరమాత్మానావిహోచ్యాయాతామ్. కస్మాత్? ఆత్మానౌ హి తావుభావపి చేతనౌ సమానస్వభావౌ. సంఖ్యాశ్రవణే చ సమానస్వభావేష్వేవ లోకే ప్రతీతిర్దృశ్యతే. అస్య గోర్ద్వితీయోఽన్వేష్టవ్య ఇత్యుక్తే గౌరేవ ద్వితీయోఽన్విష్యతే నాశ్వః పురుషో వా. తదిహ ఋతపానేన లిఙ్గేన నిశ్చితే విజ్ఞానాత్మని ద్వితీయాన్వేషణాయాం సమానస్వభావశ్చేతనః పరమాత్మైవ ప్రతీయతే. నన్వుక్తం గుహాహితత్వదర్శనాన్న పరమాత్మా ప్రత్యేతవ్య ఇతి- గుహాహితత్వదర్శనాదేవ పరమాత్మా ప్రత్యేతవ్య ఇతి వదామః. గుహాహితత్వం

తు శ్రుతిస్మృతిష్వసకృత్పరమాత్మన ఏవ దృశ్యతే - "గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్" (క.ఉ.1.2.-12) "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" (తై.ఉ.2-1), "ఆత్మానమన్విచ్ఛ గుహాం ప్రవిష్టమ్" ఇత్యాద్యాసు. సర్వగతస్యాపి బ్రహ్మణ ఉపలబ్ధ్యర్థః దేశవిశేషోపదేశః న విరుధ్యతే ఇత్యేతదప్యుక్తమేవ. సుకృతలోకవర్తిత్వం తు ఛత్రిత్వవదేకస్మిన్నపి వర్తమానముభయోరప్య విరుద్ధమ్. ఛాయాతపావిత్యప్యవిరుద్ధమ్, ఛాయాతపవత్పరస్పర విలక్షణత్వాత్ సంసారిత్వాసంసారిత్వయోః. అవిద్యాకృతత్వాత్సంసారిత్వస్య పారమార్థికత్వాచ్చాసంసారిత్వస్య. తస్మాద్విజ్ఞానాత్మపరమాత్మానౌ గుహాం ప్రవిష్టౌ గృహ్యేతే.

బాలానందిని

విజ్ఞానేతి:- ఇక్కడ విజ్ఞానాత్మ (జీవ) పరమాత్మలే చెప్పబడుచున్నారు. ఎందువల్ల? ఆ రెండు ఆత్మలూ కూడ చేతనములవడం వల్ల సమాన స్వభావం గలవి. లోకంలో ఏదైనా సంఖ్యను చెప్పి నప్పుడు సమానస్వభావం గలవాళ్ల ప్రతీతియే కనబడుతుంది. (స్వమాన స్వభావం గలవాళ్లనే కలిపి లెక్కపెట్టడం కనబడుతుంది అని అర్థం). ఈ ఎద్దుకు రెండవదాన్ని వెదకాలి అన్నప్పుడు రెండవదానిని ఎద్దునే వెదుకుతారు కాని గుఱ్ఱాన్ని గాని, మనిషిని గాని వెదకరు. అట్లే ఇక్కడ ఋతపానం అనే పానంచేత జీవాత్మ అనే అర్థం (ఋతపానం చేసేవాడు జీవుడు అని) నిశ్చయించబడిన తరవాత రెండవదానిని వెదకవలసి నప్పుడు సమానస్వభావం గల చేతనుడైన పరమాత్మయే తెలియబడుతుంది. ఇక్కడ గుహాహితత్వం కనబడడంచేత పరమాత్మను గ్రహించకూడదు అని చెప్పాం కదా? గుహాహితత్వం కనబడడంవల్లనే పరమాత్మను గ్రహించాలి అంటాం. పరమాత్మయే గుహాహితుడు (గుహలో ఉన్నాడు) అనే విషయం "గుహాహితం ... పురాణమ్", "యో వేద నిహితం గుహాయామ్", "ఆత్మానమన్విచ్ఛ గుహాం ప్రవిష్టమ్" (గుహలో ఉన్న పరమాత్మను అన్వేషించుము) ఇత్యాదిశ్రుతిస్మృతులయందు మాటి మాటికి చెప్పబడింది. బ్రహ్మ సర్వగతమే అయినా, దానిని సాక్షాత్కరించుకొనడం కోసం ఏదో ఒక ప్రదేశాన్ని చెప్పడం (ఆ బ్రహ్మ హృదయాదులలో ఉందని చెప్పడం) విరుద్ధం కాదు అనే విషయం కూడ వెనుక చెప్పబడింది. సుకృతలోకంలో (శరీరంలో) ఉన్నది ఒక ఆత్మయే అయినా, రెండు ఆత్మలూ ఉన్నాయని ఛత్రిన్యాయంచేత చెప్పడం విరుద్ధం కాదు. సంసారిత్వం (సంసారబద్ధుడై ఉండడం) అసంసారిత్వం అనేవి నీడ-ఎండల వలె పరస్పరం విలక్షణ

మైనవి గాన (ఆ విజ్ఞానాత్మ-పరమాత్మలను) 'ఛాయాతపౌ' అని నిర్దేశించడం కూడ విరుద్ధం కాదు. ఎందువల్ల ననగా సంసారిత్వం అవిద్యవల్ల ఏర్పడింది, అసంసారిత్వం యథార్థమైనది. అందువల్ల విజ్ఞానాత్మ- పరమాత్మలే గుహాప్రవిష్టులుగా గ్రహింపబడతారు.

## భాష్యమ్

కుతశ్చ విజ్ఞానాత్మపరమాత్మానౌ గృహ్యేతే?

### సూ. విశేషణాచ్చ 1.2.12

విశేషణం చ విజ్ఞానాత్మపరమాత్మనో రేవ సంభవతి - "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు" (క. ఉ. 1.3.3.) ఇత్యాదినా పరేణ గ్రన్థేన రథిరథాదిరూపకకల్పనయా విజ్ఞానాత్మానం రథినం సంసారమోక్షయోర్గన్తారం కల్పయతి. "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" (క.ఉ. 1.3.9) ఇతి చ పరమాత్మానం గన్తవ్యం కల్పయతి. తథా -

"తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్.
అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" (క.ఉ. 1.2.2-12)

ఇతి పూర్వస్మిన్నపి గ్రన్థే మన్తృమన్తవ్యత్వేనైతావేవ విశేషితౌ. ప్రకరణం చేదం పరమాత్మనః. "బ్రహ్మవిదో వదన్తి" ఇతి చ వక్తృ విశేషోపాదానం పరమాత్మపరిగ్రహే ఘటతే. తస్మాదిహ జీవపరమాత్మానా వుచ్యేయాతామ్.

## బాలానందిని

కుత ఇతి:- మరి ఏ కారణంచేత కూడ విజ్ఞానాత్మపరమాత్మలు గ్రహింపబడతారు?

విశేషణాచ్చ ఇతి :- "ఈ ఘట్టంలో చెప్పిన విశేషాలను పట్టి కూడ జీవాత్మ పరమాత్మలనే గ్రహించాలి" అని సూత్రార్థం.

విశేషణమితి:- విశేషణం కూడ విజ్ఞానాత్మపరమాత్మల విషయంలోనే కుదురుతుంది. "ఆత్మానం ... రథమేవ తు" (ఆత్మ రథి (రథం ఎక్కి ప్రయాణం చేసేవాడు) అని తెలుసుకో, శరీరం రథ మని తెలుసుకో) మొదలైన తరువాత వచ్చే గ్రంథంచేత రథిరథాదిరూపకల్పన చేసి (ఆత్మయే రథి, శరీరమే రథం అని ఆత్మ

శరీరాల మీద రథిత్వ - రథత్వారోపణం చేసి) విజ్ఞానాత్మ రథి అని, సంసారమోక్షాల మధ్య ప్రయాణం చేస్తూంటా డనీ కల్పిస్తున్నది. "సః ... పదమ్" (అతడు పరమాత్మ యొక్క అత్యుత్తమ స్థాన మైన మార్గం యొక్క అంతాన్ని చేరుతాడు అని) పరమాత్మ పొందవలసిన స్థానం అని కల్పిస్తున్నది. అట్లే "తం దుర్దర్శం... జహాతి" (బుద్ధిమంతుడైన సాధకుడు ప్రత్యగాత్మయందు చిత్తం నిలపడంద్వారా, తెలుసుకొనడానికి శక్యం కానివాడు, మాయచేత కప్పబడినవాడు, మాయలో ప్రవేశించిన వాడు, గుహలో ఉన్నవాడు, గుహ ద్వారా రహస్య స్థానంలో ఉన్నవాడు అనాది స్వరూపుడు అయిన ఆ దేవుణ్ణి (పరమాత్మను) తెలుసుకొని హర్షశోకాలను విడిచి పెడతాడు) అని పూర్వగ్రంథంలో కూడ ఈ జీవాత్మపరమాత్మలనే మంత్మమంతవ్యులనుగా (జీవాత్మ మంతగాను, ధ్యానం చేసేవాడు గాను, పరమాత్మ మతవ్యుడు గాను, ధ్యానం చేయదగిన వాడు గాను) విశేషింపబడినారు (విశేషం ఉన్నట్లు చెప్పబడ్డారు). ఇది పరమాత్మకు సంబంధించిన ప్రకరణం కూడ. "బ్రహ్మ విదో వదన్తి" (బ్రహ్మవేత్తలు చెపుతున్నారు) అని వక్తలలో కూడ (బ్రహ్మను తెలిసిన వాళ్లు అని) విశేషాన్ని చెప్పడం పరమాత్మను గ్రహిస్తేనే కుదురు తుంది. (అనగా "విశేషణాచ్చ" అనే దానికి విజ్ఞానాత్మపరమాత్మలలోని విశేషం చెప్పడం అని మాత్రమే కాకుండా వదన్తి అని చెప్పిన వక్తలలోని విశేషం చెప్పడంవల్ల కూడ అని అర్థ మని భావం). అందువల్ల ఇక్కడ జీవపరమాత్మలే చెప్పబడవలసి ఉన్నారు.

## భాష్యమ్

ఏష ఏవ న్యాయః "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" (ము. ఉ. 3.1.1.) ఇత్యేదమాదిష్వపి. తత్రాపి హ్యధ్యాత్మాధికారాన్న ప్రాకృతౌ సుపర్ణావుచ్యేతే "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" ఇత్యదనలిఙ్గాద్విజ్ఞానాత్మా భవతి. "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" ఇత్యనశనచేతనత్వాభ్యాం పరమాత్మా. అనన్తరే చ మన్త్రే తావేవ ద్రష్టృద్రష్టవ్యభావేన విశినష్టి-

"సమానే వృక్షే పురుషో నిమగ్నో నీశయా శోచతి ముహ్యమానః,
జుష్టం తదాపశ్యత్యన్యమీశమస్య మహిమానమితి వీతశోకః"

(ము. 3-1.2) ఇతి.

## బాలానందిని

ఏష ఇతి:- ఇదే న్యాయం "ద్వా... సఖాయా" (కలసి ఉండేవి, స్నేహితులు అయిన రెండు పక్షులు) ఇత్యాదివాక్యాలలో కూడ ప్రవర్తిస్తుంది. అక్కడ కూడ

ఆత్మాధికారంవల్ల (ఆత్మను గూర్చి చెప్పే ప్రకరణం అవడంవల్ల) అక్కడ చెప్పబడినవి మామూలు పక్షులు కావు. (అందుచేత విజ్ఞానాత్మ, పరమాత్మ అని అర్థం). "తయోః... అత్తి" (వాటిలో ఒకటి మధురమైన పిప్పలం (కర్మఫలం) తింటుంది) అనే లింగంవల్ల అది విజ్ఞానాత్మ. "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" (రెండవది తినకుండా చూస్తూ ఉంటుంది.) అని తినకపోవడంచేత, చేతనం అయి ఉండడంచేత అది పరమాత్మ. తరవాతి మంత్రంలో "సమానే... వీతశోకః" (సమానమైన వృక్షంమీద (శరీరంలో) మునిగి ఈశ్వరత్వం లేకపోవడంచేత మోహపడుతున్న పురుషుడు (జీవుడు) దుఃఖిస్తున్నాడు. ధ్యానాదుల చేత సేవించబడిన ఈశ్వరుణ్ణి ఎప్పుడు అతని యథార్థస్వరూపంలో చూస్తాడో అప్పుడు దుఃఖాలు పోయి మహిమను పొందుతాడు) అని ఆ జీవపరమాత్మలనే ద్రష్టృ ద్రష్టవ్యభావంతో (జీవుణ్ణి ద్రష్టగాను, చూచేవానిని గాను, పరమాత్మను చూడదగిన దానినిగాను) విశేషించి చెపుతున్నది. అనగా "విశేషణాచ్చ" అనేది ఇక్కడ కూడ వర్తిస్తుంది అని అర్థం.

## భాష్యమ్

అపర ఆహ:- "ద్వా సుపర్ణా" ఇతి నేయమృగస్యాధికరణస్య సిద్ధాన్తం భజతే; పైఙ్గిరహస్యబ్రాహ్మణేనాన్యథా వ్యాఖ్యాతత్వాత్. "తయోరన్యః స్వాద్వత్తీతి సత్త్వమ్, అనశ్నన్నన్యోఽ భిచాకశీతీతి, అనశ్నన్నన్యోఽ భిపశ్యతి జ్ఞః, తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ" ఇతి. సత్త్వశబ్దో జీవః క్షేత్రజ్ఞశబ్దః పరమాత్మేతి యదుచ్యతే తన్న. సత్త్వక్షేత్రజ్ఞశబ్దయోః అన్తఃకరణశారీరపరతయా ప్రసిద్ధత్వాత్. తత్రైవ చ వ్యాఖ్యాతమ్ - "తదేతత్సత్త్వం యేన స్వప్నం పశ్యతి. అథ యోఽయం శారీర ఉపద్రష్టా స క్షేత్రజ్ఞస్తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ" ఇతి. నాప్యస్యాధికరణస్య పూర్వపక్షం భజతే. న హ్యత్ర శారీరః క్షేత్రజ్ఞః కర్తృత్వభోక్తృత్వాదినా సంసారధర్మేణోపేతో వివక్ష్యతే; కథం తర్హి? సర్వసంసారధర్మాతీతో బ్రహ్మస్వభావశ్చైతన్యమాత్రస్వరూపః. "అనశ్నన్నన్యోఽ భిచాకశీతి, అనశ్నన్నన్యోఽ భిపశ్యతి జ్ఞః" ఇతి వచనాత్. "తత్త్వమసి", "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" (భగీ 13.2) ఇత్యాదిశ్రుతిస్మృతిభ్యశ్చ. తావతా చ విద్యోపసంహారదర్శనమేవమేవావకల్ప్యతే - "తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ, న హ వా ఏవంవిది కించన రజ ఆధ్వంసతే" ఇత్యాది.

## బాలానందిని

అవ. "ద్వా సుపర్ణా" ఇత్యాదివాక్యం కూడ జీవేశ్వరపర మని కృత్వాచింతచేత చెప్పబడింది. కాని సరిగా పరిశీలిస్తే అది జీవేశ్వరపరం కా దని, ఈ అధికరణం న్యాయం అక్కడ పట్ట దనీ చెపుతున్నారు. ('కృత్వాచింత' అనగా "సరే! అది అలాగే అవుతుందను కుందాం" అనే ధోరణిలో చెప్పిన ఆలోచన అని అర్థం).

అపర ఇతి:- మరొకడు ఇలా అంటున్నాడు. "ద్వా సుపర్ణా" అనే ఈ ఋక్కు ఈ అధికరణంయొక్క సిద్ధాంతపక్షానికి చెందదు. ఎందువల్ల ననగా ఈ ఋక్కును పైంగికబ్రాహ్మణం మరొక విధంగా వ్యాఖ్యానించింది. - "తయోః... క్షేత్రజ్ఞౌ" ("తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" అని చెప్పబడినది సత్త్వం; "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" అని మరొకడు తినకుండా చూస్తున్నాడు అని చెప్పబడినవాడు జ్ఞుడు, అనగా ఆత్మ. ఈ విధంగా ఇక్కడ సత్త్వక్షేత్రజ్ఞులు చెప్పబడ్డారు) అని ఆ బ్రాహ్మణం వ్యాఖ్యానించింది. ఇక్కడ సత్త్వశబ్దానికి జీవుడనీ క్షేత్రజ్ఞశబ్దానికి పరమాత్మ అనీ అర్థమని చెప్పడం యుక్తం కాదు. 'సత్త్వం' "క్షేత్రజ్ఞ" శబ్దాలకు అతఃకరణము 'జీవుడు' అని యే అర్థాలు లోకంలో ప్రసిద్ధంగా ఉన్నాయి. ఆ బ్రాహ్మణంలోనే "తదేతత్... క్షేత్రజ్ఞౌ" (దేని సహాయంతో స్వప్నం చూస్తాడో అది సత్త్వం, ఈ శరీరంలో చూచేవాడు ఎవ డున్నాడో అతడు క్షేత్రజ్ఞుడు. ఆ ఈ ఇద్దరూ సత్త్వక్షేత్రజ్ఞులు) అని చెప్పబడింది. ఈ ఋక్కు ఈ అధికరణానికి పూర్వపక్షం కూడ కాదు. ఇక్కడ కర్తృత్వం భోక్తృత్వం మొదలైన ధర్మాలు గల క్షేత్రజ్ఞుడైన జీవుడు వివక్షితుడు (చెప్ప నుద్దేశింపబడిన వాడు) కాదు. మరే మనగా - "అనశ్నన్నన్యోఽభిచాకశీతి, అనశ్నన్నన్యోఽభిపశ్యతి జ్ఞః" అని చెప్పడంవల్ల సర్వధర్మాతీతుడు, బ్రహ్మస్వభావుడు, చైతన్య మాత్రస్వరూపుడు అయిన క్షేత్రజ్ఞుడే వివక్షితుడు. "తత్త్వమసి" "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" ఇత్యాదిశ్రుతిస్మృతులవల్ల కూడ అలాంటి శుద్ధచైతన్యరూపమే తెలుస్తూన్నది. "తావేతౌ... ఆ ధ్వంసతే" (ఆ ఈ ఇద్దరూ సత్త్వక్షేత్రజ్ఞులు. ఈ విధంగా తెలుసుకొన్నవాని మీద అవిద్య తన కార్యాన్ని సమకూర్చదు. అనగా ఈ విషయం తెలుసుకొన్నవాడు అవిద్యామోహితుడు కాడు) అని ఈ విద్యను ఉపసంహరించడంచేత ఇది ఇట్లే అని అనగా ఇక్కడ జీవుడు శుద్ధచిన్మాత్రస్వరూపుడుగా ప్రతిపాదింపబడుతున్నా డని బాగా కుదురుతుంది.

వి. ఒక వాక్యాన్ని ఎలా వ్యాఖ్యానించాలో చెప్పిన విధానాన్ని (న్యాయాన్ని) ఆ వాక్యం వంటి ఇతరవాక్యాలలో కూడ ప్రవర్తింపచేసి వాటిని వ్యాఖ్యానించాలి. ఈ అధికరణంలో "గుహాం ప్రవిష్టౌ" ఇత్యాదివాక్యాన్ని గ్రహించి దానికి ఎలా అర్థం. చెప్పాలి అనే చర్చ చేయబడింది. పూర్వపక్షి బుద్ధి-జీవు లని అర్థం చెపితే కాదు జీవపరమాత్మలు

అని అర్థనిర్ణయం చేయబడింది. "ద్వా సుపర్ణా" ఇత్యాది ముండకోపనిషద్గతవాక్యం విషయంలో కూడ ఈ న్యాయాన్ని ప్రవర్తింపచేసి ఈ వాక్యంలో చెప్పబడినవాళ్లు జీవపరమాత్మలే అని నిర్ణయించవచ్చా అనేది ప్రశ్న. పూర్వవాక్యంలో ఛాయాతపాలనగా జీవపరమాత్మ లన్నట్లే ఇక్కడ కూడ రెండు పక్షులు జీవాత్మపరమాత్మలు అని చెప్పవచ్చు అని కొందరి అభిప్రాయం చెప్పి "అపర ఆహ" ఇత్యాదిగ్రంథంలో అట్లు చెప్పడం కుదరదు అని విశదీకరించబడింది. "గుహాం ప్రవిష్టౌ" ఇత్యాదివాక్యంలో పూర్వపక్షం ప్రకారం ఛాయాతపాలు అనగా బుద్ధి-జీవులు. కాని ఈ వాక్యంలో బుద్ధి-జీవులు అని పూర్వపక్షం ప్రకారం అర్థం చెప్పడం కుదరదు. దానిలో ఒకటి బుద్ధి రెండవది కేవలం జీవుడు కాక బ్రహ్మాభిన్నశుద్ధచైతన్యరూపుడైన జీవుడు అన్నట్లు బ్రాహ్మణవాక్యంవల్ల తెలుస్తూన్నది గాన దానికీ దీనికీ భేదం ఉంది. పోనీ సిద్ధాంతం ప్రకారం ఆ వాక్యంలో చెప్పినట్లు చెప్పుదామన్నా అలా జీవపరమాత్మలు అని చెప్పడం కూడ కుదరదు. దీనిలో ఒకటి సత్త్వం అనగా బుద్ధి అని బ్రాహ్మణం చెపుతున్నది ఈ విధంగా దీనిలో చెప్పబడినవి బుద్ధి - పరబ్రహ్మలు. బుద్ధి - జీవులు గాని, జీవ-పరమాత్మలు గాని కావు. అందుచేత, ఆ న్యాయం ఇక్కడ పట్టదు. ఇక్కడ క్షేత్రజ్ఞుణ్ణిగా కాక బ్రహ్మగా ప్రతిపాదించడం ఉద్దిష్టం.

## భాష్యమ్

కథం పునరస్మిన్ పక్షే "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తీతి సత్త్వమ్" ఇత్యచేతనే సత్త్వే భోక్తృత్వవచనమితి? ఉచ్యతే. నేయం శ్రుతిరచేతనస్య సత్త్వస్య భోక్తృత్వం వక్ష్యామీతి ప్రవృత్తా. కిం తర్హి? చేతనస్య క్షేత్రజ్ఞస్య అభోక్తృత్వం బ్రహ్మస్వభావతాం చ వక్ష్యామీతి. తదర్థం సుఖాదివిక్రియావతి సత్త్వే భోక్తృత్వమధ్యారోపయతి. ఇదం హి కర్తృత్వం భోక్తృత్వం చ సత్త్వక్షేత్రజ్ఞయోరితరేతరభావావివేకకృతం కల్ప్యతే. పరమార్థతస్తు నాన్యతరస్యాపి సంభవతి; అచేతనత్వాత్సత్త్వస్య, అవిక్రియత్వాచ్చ క్షేత్రజ్ఞస్య. అవిద్యాప్రత్యుపస్థాపితస్వభావత్వాచ్చ సత్త్వస్య సుతరాం న సంభవతి. తథా చ శ్రుతిః- **"యత్ర వా అన్యదివ స్యా తత్రాన్యోఽన్యత్పశ్యేత్"** ఇత్యాదినా స్వప్నదృష్టహస్త్యాదివ్యవహారవదవిద్యావిషయ ఏవ కర్తృత్వాదివ్యవహారం దర్శయతి. "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.4.5.15) **ఇత్యాదినా చ వివేకినః కర్తృత్వాదివ్యవహారాభావం** దర్శయతి. 12.

బాలానందిని

కథమితి:- అయితే- ఈ పక్షంలో (బుద్ధి, జీవుని యథార్థస్వరూ మైన బ్రహ్మ ప్రతిపాదించబడుతున్నాయి అనే పక్షంలో) "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తీతి సత్త్వమ్" అని అచేతనమైన బుద్ధి భోక్త అని చెప్పడం ఎలా కుదురుతుంది? (సమాధానం) చెప్పబడుచున్నది - అచేతన మైన బుద్ధికి భోక్తృత్వం చెపుతా నని ఈ శ్రుతి బయల్దేరలేదు. మరేమి? చేతను డైన క్షేత్రజ్ఞునికి భోక్తృత్వం లేదని చెపుతా నని బయలుదేరింది. అందుకోసం సుఖాదివికారా లున్న బుద్ధికి భోక్తృత్వాన్ని ఆరోపిస్తున్నది. సత్త్వక్షేత్రజ్ఞుల కున్న ఈ కర్తృత్వం వాటి పరస్పరస్వభావాన్ని సరిగా తెలుసుకొనకపోవడం వల్ల ఏర్పడినది అని కల్పించబడుతుంది. నిజానికి రెండిటికీ కూడా భోక్తృత్వం కుదరదు; ఎందువల్ల ననగా- సత్త్వం అచేతనం, క్షేత్రజ్ఞుడు క్రియాశూన్యుడు. సత్త్వం అవిద్యచేత కల్పితమైన స్వభావం కల దగుటచేత కర్తృత్వభోక్తృత్వాదికం అసలే సంభవించదు. (అనగా భోక్తృత్వం అనేది ఏదైనా జీవునికి ఉంటే అది సత్త్వసంబంధాన్ని పట్టి మాత్రమే. ఆ సత్త్వమే అవిద్యాకల్పిత మైనప్పుడు దాని సంబంధం గాని, దానివల్ల భోక్తృత్వాదికం గాని ఆత్మకు ఎలా ఉంటుంది అని భావం). అందుచేతనే "యత్ర వా అన్యదివ స్యాత్తత్రాన్యోఽ న్యత్పశ్యేత్" (ఎక్కడ మరొకటి ఏదో ఉన్నట్లు ఉంటుందో అక్కడ ఒకడు మరొకదానిని చూస్తాడు) ఇత్యాది శ్రుతివాక్యం స్వప్నంలో చూడబడిన ఏనుగ మొదలైనదాని వ్యవహారం వలె కర్తృత్వాది వ్యవహారం కూడ అవిద్యావిషయకమే (అవిద్యా స్థితిలో ఏర్పడేదే) అని చెపుతూన్నది. అట్లే "యత్ర త్వస్య... పశ్యేత్" ఇత్యాదికంచేత వివేకవంతునకు కర్తృత్వాది వ్యవహారం ఉండ దని కూడ శ్రుతి చెపుతున్నది.

గుహాప్రవిష్టాధికరణం సమాప్తం.

## 4. అన్తరాధికరణమ్

### సూ. అన్తర ఉపపత్తేః 1.2.13

"య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచైతదమృతమభయ మేతద్బ్రహ్మేతి, తద్యద్యప్యస్మిన్సర్పిర్వోదకం వా సిఞ్చతి వర్త్మనీ ఏవ గచ్ఛతి" (ఛా.ఉ.. 4.15.1) ఇతి శ్రూయతే. తత్ర సంశయః- కిమయం ప్రతిబిమ్బాత్మాక్ష్యధికరణో నిర్దిశ్యతేఽథవా విజ్ఞానాత్మా ఉత దేవతాత్మా ఇన్ద్రియస్యాధిష్ఠాతా అథవా ఈశ్వర ఇతి. కిం తావత్ప్రాప్తమ్? ఛాయాత్మా పురుషప్రతిరూప ఇతి కుతః? తస్య దృశ్యమానత్వప్రసిద్ధేః. "య ఏషోఽక్షిణి

పురుషో దృశ్యతే" ఇతి చ ప్రసిద్ధవదుపవేశాత్. విజ్ఞానాత్మనో వాయం నిర్దేశ ఇతి యుక్తమ్. స హి చక్షుషా రూపం పశ్యంశ్చక్షుషి సన్నిహితో భవతి. ఆత్మశబ్దశ్చాస్మిన్ననుకూలో భవతి. ఆదిత్యపురుషో వా చక్షుషోఽనుగ్రాహకః ప్రతీయతే "రశ్మిభిరేషోఽస్మిన్ ప్రతిష్ఠితః" (బృ.ఉ. 5.5.2) ఇతి శ్రుతేః. అమృతత్వాదీనాం చ దేవతాత్మన్యపి కథం చిత్సంభవాత్ నేశ్వరః, స్థాన విశేషనిర్దేశాత్ ఇతి ప్రాప్తే బ్రూమః—

బాలానందిని

అన్తర ఇతి:- "ఉపపత్తేః = ఇక్కడ చెప్పిన గుణాలన్నీ పరమేశ్వరునియందే ఉపపన్నము లవుతాయి గాన, అన్తరః = అక్ష్యంతరంలో ఉన్నట్లు చెప్పబడినవాడు పరమేశ్వరుడే" అని సూత్రార్థం.

య ఇతి:- "యః... గచ్ఛతి" (నేత్రములో ఏ పురుషుడు కనబడుచున్నాడో అతడే ఆత్మ అని చెప్పాడు. అదే నాశరహితము, భయశూన్యము అయిన ఈ బ్రహ్మ. అందుచేతనే కంటిలో నెయ్యి కాని నీళ్లు కాని పోసి నప్పుడు అది ప్రక్కలకే జారిపోతుంది). అని వినబడుచున్నది. ఇక్కడ నేత్రం ఆధారం కలదిగా (నేత్రంలో ఉన్నట్లు) చెప్పబడుచున్నది. ప్రతిబింబస్వరూపమా, జీవుడా లేక ఇంద్రియానికి అధిష్ఠాతయైన దేవతాత్మయా లేక ఈశ్వరుడా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? పురుషుని ప్రతిబింబమైన ఛాయాత్మ అని. ఎందువల్ల? అదే కనబడుతుంది అని ప్రసిద్ధి ఉంది కదా? "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" అని లోకప్రసిద్ధ మైన విషయాన్నే చెప్పడం వల్ల. లేదా ఇది జీవుని నిర్దేశం అని చెప్పడం యుక్తం. ఎందువల్ల ననగా జీవుడు నేత్రంతో రూపం చూస్తూ నేత్రం దగ్గర ఉంటాడు. ఈ పక్షంలో ఆత్మశబ్దం అనుకూలంగా ఉంటుంది. లేదా నేత్రానికి అనుగ్రాహకు డైన (నేత్రం ఉపయోగించే టట్లు చేసే) ఆదిత్యపురుషుడు కావచ్చును. "రశ్మిభిరేషోఽ స్మిన్ ప్రతిష్ఠితః" (ఈ ఆదిత్యుడు కిరణాల ద్వారా నేత్రము నందు ఉంటాడు) అని శ్రుతి చెపుచున్నది. దేవతాత్మ యందు కూడ అమృతత్వం (నాశరహితత్వం) మొదలైనవి ఏదో విధంగా కుదురుతాయి. స్థానవిశేషాన్ని (నేత్రాన్ని) నిర్దేశించడంచేత ఈశ్వరుడు మాత్రం కాజాలడు అని ప్రాప్తించగా చెపుతున్నాము-

వి. పూర్వాధికరణంలో - ప్రారంభంలో ద్వివచనం ఉండడంచేత, చేతనత్వాన్ని పురస్కరించుకొని జీవ పరమాత్మలను గ్రహించి తరవాత చెప్పబడిన గుహాప్రవేశాలకు ఏదో విధంగా సమన్వయం చెప్పబడింది. అట్లే ఇక్కడ కూడ ప్రారంభంలో 'దృశ్యతే'

(చూడబడుచున్నది) అని ప్రత్యక్షంగా కనబడుతున్నట్లు చెప్పడం చేత నేత్రంలో కనబడే ప్రతిబింబాత్మ అని అర్థం చెప్పి తరవాత ఉన్న అమృతత్వాదులను ఏదో విధంగా అన్వయించుకోవాలి అని ఆ అధికరణంతో దీనికి దృష్టాంతసంగతి. పూర్వపక్షంలో ప్రతిబింబోపాసనం ఫలం, సిద్ధాంతంలో బ్రహ్మోపాసనం ఫలం.

## భాష్యమ్

పరమేశ్వర ఏవాక్షిణ్యభ్యన్తరః పురుషః ఇహోపదిష్టః ఇతి. కస్మాత్? ఉపపత్తేః. ఉపపద్యతే హి పరమేశ్వరే గుణజాతమిహోపదిశ్యమానమ్. ఆత్మత్వం తావన్ముఖ్యయా వృత్త్యా పరమేశ్వర ఉపపద్యతే "స ఆత్మా తత్త్వమసి" ఇతి శ్రుతేః. అమృతత్వాభయత్వే చ తస్మిన్నసకృచ్ఛ్రుతౌ శ్రూయేతే. తథా పరమేశ్వరానురూపమేవాక్షిస్థానమ్. తథా హి పరమేశ్వరః సర్వదోషై రలిప్తః, అపహతపాప్మత్వాదిశ్రవణాత్. తథాక్షిస్థానం సర్వలేపరహితము పదిష్టమ్. "తద్యద్యప్యస్మిన్ సర్పిర్వోదకం వా సిఞ్చతి వర్త్మనీ ఏవ స గచ్ఛతి" ఇతి శ్రుతేః. సంయద్వామత్వాదిగుణోపదేశశ్చ తస్మిన్నవకల్పతే. "ఏతం సంయద్వామ ఇత్యాచక్షతే, ఏతం హి సర్వాణి వామాన్యభిసంయన్తి, ఏష ఉ ఏవ వామనీరేష హి సర్వాణి వామాని నయతి", "ఏష ఉ ఏవ భామనీ రేష హి సర్వేషు లోకేషు భాతి" (ఛా. ఉ. 4.15, 2, 3, 4) ఇతి చ. అత ఉపపత్తే రన్తరః పరమేశ్వరః. 13.

## బాలానందిని

పరమేశ్వర ఇతి:- నేత్రంలోపల ఉన్నట్లుగా ఇక్కడ చెప్పబడిన పురుషుడు పరమేశ్వరుడే. ఇక్కడ చెప్పబడుచున్న గుణసముదాయం పరమేశ్వరునియందు ఉపపన్నం అవుతుంది. ఆత్మత్వం అనేది ముఖ్యమైన వృత్తిచేత (ముఖ్యార్థంగా) పరమేశ్వరునియందే ఉపపన్నం. "స ఆత్మా తత్త్వమసి" అని శ్రుతి చెప్పుచున్నది గదా? అమృతత్వం, అభయత్వం అనేవి కూడ శ్రుతిలో అనేకపర్యాయాలు పరమేశ్వరుని విషయంలోనే వినబడుతున్నాయి. మరియు నేత్రం అనే స్థానం పరమేశ్వరునికి అనురూప మైనది. ''పరమేశ్వరుడు పాపరహితుడు'' ఇత్యాదులు వినబడుటవల్ల ఏ విధంగా పరమేశ్వరుడు ఎట్టి దోషాలచేత లిప్తుడు కాడో (పూయబడడో) అట్లే నేత్రరూపమైన స్థానం కూడ - "తద్యద్యపి... గచ్ఛతి" అని శ్రుతిని పట్టి సమస్తలేపశూన్య మని, చెప్పబడింది. సంయద్వామత్వాదిగుణాలు చెప్పడం కూడ పరమేశ్వరునియందే

ఉపపన్న మవుతుంది. "ఏతం... భాతి" (ఈ అక్షిపురుషుణ్ణి సంయద్వాముడు అని చెపుతున్నారు. ఎందువల్ల ననగా సమస్తవామాలు (కర్మఫలాలు) ఈతనిని ఉద్దేశించి పుట్టుచున్నాయి. అనగా ఇతడు సర్వఫలాల ఉత్పత్తికి హేతువు. ఇతడే 'భామనీ', ఎందువల్ల ననగా ఇతడే సమస్తలోకాలలోను భాసిస్తాడు) అని ఈ పురుషునకు సంయద్వామత్వ - వామనీత్వ - భామనీత్వాలు చెప్పబడ్డాయి; ఆ పురుషుడు పరమేశ్వరు డైతేనే అవన్నీ చెప్పడం కుదురుతుంది అని అర్థం.

## సూ. స్థానాదివ్యపదేశాచ్చ 1.2.14.

కథం పునరాకాశవత్సర్వగతస్య బ్రహ్మణః అక్ష్యల్పస్థానముపపద్యత ఇతి. అత్రోచ్యతే - భవేదేషానవక్లప్తిః, యద్యేతదేవైకం స్థానమస్య నిర్దిష్టం భవేత్. సన్తి హ్యన్యాన్యపి పృథివ్యాదీని స్థానాన్యస్య నిర్దిష్టాని - "యః పృథివ్యాం తిష్ఠన్" (బృ.ఉ. 3.7.3) ఇత్యాదినా. తేషు హి చక్షురపి నిర్దిష్టమ్- "యశ్చక్షుషి తిష్ఠన్" (బృఉ.3.7.3) ఇతి. "స్థానాదివ్యపదేశాత్" ఇత్యాది గ్రహణేనైతద్దర్శయతి - న కేవలం స్థానమేకమేవానుచితం బ్రహ్మణో నిర్దిశ్యమానం దృశ్యతే; కిం తర్హి? నామరూపమిత్యేవంజాతీయమప్యనామ రూపస్య బ్రహ్మణోఽనుచితం నిర్దిశ్యమానం దృశ్యతే - "తస్యోదితి నామ" "హిరణ్యశ్మశ్రుః" (ఛా.ఉ. 1.6.7.16) ఇత్యాది. నిర్గుణమపి సద్బ్రహ్మ నామరూపగతైర్గుణైః సగుణముపాసనార్థం తత్ర తత్రోపదిశ్యతే ఇత్యేదప్యుక్తమేవ. సర్వగతస్యాపి బ్రహ్మణః ఉపలబ్ధ్యర్థం స్థానవిశేషో న విరుధ్యతే, శాలగ్రామ ఇవ విష్ణోరిత్యేతదప్యుక్తమేవ 14.

### బాలానందిని

స్థానాదీతి:- "స్థానాదివ్యపదేశాచ్చ=బ్రహ్మకు స్థానంమొదలైనవాటిని శ్రుతులలో ఇతరస్థలాలలో కూడ చెప్పడంవల్ల ఇక్కడ అక్షిస్థానం చెప్పినా దోషం లేదు"అని సూత్రార్థం.

కథమితి:- ఆకాశం వలె అంతటా వ్యాపించి ఉన్న బ్రహ్మకు నేత్రం అనే అల్పమైన స్థానం ఎలా కుదురుతుంది? ఈ విషయంలో చెప్పబడుచున్నది. బ్రహ్మకు ఈ ఒక్క స్థానమే చెప్పబడి ఉన్నట్లయితే కుదరకపోవడం అనేది కలగవచ్చును. దీనికి "యః పృథివ్యాం తిష్ఠన్" ఇత్యాదిశ్రుతులచేత ఇతరమైన పృథివ్యాదిస్థానాలు కూడ నిర్దేశించబడి ఉన్నాయి కదా? అలాంటి స్థానాలలో ఒకటి చక్షుస్సుకూడ "యశ్చక్షుషి తిష్ఠన్' ఇత్యాదికంచేత చెప్పబడింది "స్థానాదివ్యపదేశాత్" అని 'ఆది' శబ్దం

ప్రయోగించడంచేత - బ్రహ్మకు అనుచితమైన ఒక్క స్థానం మాత్రమే కాదు మరేమనగా "తస్యోదితి నామ" హిరణ్యశ్మశ్రుః" ఇత్యాది శ్రుతులలో నామరూపాలు లేని బ్రహ్మకు అనుచితమైన నామం రూపం వంటివి నిర్దేశింపబడుచున్నట్లు కనబడుతూన్నది. బ్రహ్మ నిర్గుణమే అయినా అక్కడక్కడ ఉపాసనం కోసం నామరూపాలకు సంబంధించిన గుణాలచేత సగుణంగా కూడ ఉపదేశించబడుచున్నది అని కూడ (వెనుక) చెప్పబడింది. సర్వగతమైన బ్రహ్మకు కూడ విష్ణువుకు సాలగ్రామాన్ని స్థానంగా చెప్పినట్లు ఉపలబ్ధికోసం (బ్రహ్మను ఉపాసించి సాక్షాత్కరించుకోవడంకోసం) స్థానవిశేషం చెప్పడంలో విరోధం ఏమీ లేదనే విషయం కూడ చెప్పబడింది. 14

## సూ. సుఖవిశిష్టాభిధానాదేవ చ 1.2.15

అపి చ నైవాత్ర వివదితవ్యమ్ - కిం బ్రహ్మాస్మిన్వాక్యేఽభిధీయతే న వేతి. సుఖవిశిష్టాభిధానాదేవ బ్రహ్మత్వం సిద్ధమ్. సుఖవిశిష్టం హి బ్రహ్మ యద్వాక్యోపక్రమే ప్రక్రాన్తం "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" ఇతి తదేవాభిహితమ్; ప్రకృతపరిగ్రహస్య న్యాయ్యత్వాత్. "ఆచార్యస్తు తే గతిం వక్తా" (ఛా.ఉ.4.14.1) ఇతి చ గతిమాత్రాభిధానప్రతిజ్ఞానాత్. కథం పునర్వాక్యోపక్రమే సుఖవిశిష్టం బ్రహ్మ విజ్ఞాయత ఇతి. ఉచ్యతే -"ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" ఇత్యేతదగ్నీనాం వచనం శ్రుత్వా ఉపకోసల ఉవాచ - "విజానామ్యహం యత్ప్రాణో బ్రహ్మ కం చ తు ఖం చ న విజానామి" ఇతి. తత్రేదం ప్రతివచనమ్ - "యద్వావ కం తదేవ ఖం యదేవ ఖం తదేవ కమ్"(ఛా.ఉ.4.10.5) ఇతి. తత్ర ఖం శబ్దో భూతాకాశే నిరూఢో లోకే. యది తస్య విశేషణత్వేన కం శబ్దః సుఖవాచీ నోపాదీయేత తథా సతి లోకే భూతాకాశే బ్రహ్మశబ్దో నామాదిష్వివ ప్రతీకాభిప్రాయేణ ప్రయుక్త ఇతి ప్రతీతిః స్యాత్. తథా కం శబ్దస్య విషయేన్ద్రియసంపర్కజనితే సామయే సుఖే ప్రసిద్ధత్వాత్ యది తస్య ఖం శబ్దో విశేషణత్వేన నోపాదీయతే లౌకికం సుఖం బ్రహ్మేతి ప్రతీతిః స్యాత్. ఇతరేతరవిశేషితౌ తు కం ఖం శబ్దౌ సుఖాత్మకం బ్రహ్మ గమయతః. తత్ర ద్వితీయే బ్రహ్మశబ్దేఽనుపాదీయమానే "కం ఖం బ్రహ్మ" ఇత్యేవోచ్యమానే కం శబ్దస్య విశేషణత్వేనైవ ఉపయుక్తత్వాత్సుఖస్య గుణస్యాధ్యేయత్వం స్యాత్; తన్మా భూత్ ఇత్యుభయోః

కం ఖం శబ్దయోః బ్రహ్మశిరస్త్వమ్- "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" ఇతి. ఇష్టం హి సుఖస్యాపి గుణస్య గుణివద్ధ్యేయత్వమ్. తదేవం వాక్యోపక్రమే సుఖవిశిష్టబ్రహ్మోపదిష్టమ్. ప్రత్యేకం చ గార్హపత్యాదయః అగ్నయః స్వం స్వం మహిమానముపదిశ్య "ఏషా సోమ్య తేఽస్మద్విద్యాత్మవిద్యా చ" ఇత్యుప సంహరన్తః పూర్వత్ర బ్రహ్మ నిర్దిష్టమితి జ్ఞాపయన్తి. "ఆచార్యస్తు తే గతిం వక్తా" ఇతి చ గతిమాత్రాభిధానప్రతిజ్ఞానమర్థాన్తరవివక్షాం వారయతి. "యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్త ఏవమేవంవిది పాపం కర్మ న శ్లిష్యతే" (ఛా.ఉ.4.14.3.) ఇతి చాక్షిస్థానం పురుషం విజానతః పాపేనానుపఘాతం బ్రువన్నక్షిస్థానస్య పురుషస్య బ్రహ్మత్వం దర్శయతి. తస్మాత్ప్రకృతస్యైవ బ్రహ్మణోఽక్షిస్థానతాం సంయద్వామత్వాదిగుణతాం చోక్త్వార్చిరాదికాం తద్విదో గతిం వక్ష్యామీత్యుపక్రమతే- "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచ" (ఛా.ఉ.4.15.1) ఇతి. 15.

## బాలానందిని

సుఖేతి:- "సుఖవిశిష్టాభిధానాదేవ చ= సుఖంతో కూడిన ఏ బ్రహ్మ ప్రకృతమో దానినే "యః ఏషః" అని సర్వనామశబ్దాలచేత నిర్దేశించడంవల్ల కూడ అంతరుడు పరమాత్మయే" అని సూత్రార్థం.

అపి చేతి:- మరియు - ఈ వాక్యంలో బ్రహ్మ చెప్పబడుతున్నదా లేదా అని వివాదం చేయ కూడదు. సుఖంతో కూడినదానిని చెప్పడంచేతనే దీనికి బ్రహ్మత్వం (ఇక్కడ చెప్పబడినది బ్రహ్మ అని) సిద్ధమైనది. వాక్యప్రారంభంలో "ప్రాణః...బ్రహ్మ" (ప్రాణం బ్రహ్మ సుఖం బ్రహ్మ ఖం బ్రహ్మ) అని సుఖంతో కూడిన ఏ బ్రహ్మ ప్రారంబించబడిందో అదే ఇక్కడ చెప్పబడింది. ప్రకృతమైనదానిని గ్రహించడమే న్యాయ్యం కదా "ఆచార్యస్తు... వక్తా (అయితే గతిని గూర్చి మాత్రం నీకు ఆచార్యుడు చెపుతాడు) అని గతిని గూర్చి మాత్రమే (తరవాత) చెప్పబడింది.

వి. ఉపకోసలు డనే ఒక బ్రహ్మచారి పన్నెండు సంవత్సరాలపాటు ఆచార్యుడైన జాబాలుని అగ్నులను సేవించాడు అతని కేమీ ఉపదేశించకుండానే జాబాలుడు దేశాంతరం వెళ్లిపోవడంచేత గార్హపత్యాద్యగ్నులు ఆ ఉపకోసలుని మీద జాలిపడి వానికి "ప్రాణో బ్రహ్మ" అని ఆత్మవిద్యను ఉపదేశించి నీకు ఆత్మవిద్యాఫలం లభించడానికి తగిన అర్చిరాదిమార్గం నీ ఆచార్యుడు ఉపదేశిస్తాడు అని చెప్పారు.

తరవాత ఆచార్యుడు వచ్చి "య ఏషోఽక్షిణి" ఇత్యాదికం బోధించి అర్చిరాదిమార్గాన్ని గూర్చి చెప్పాడు. దీనిని పట్టి అగ్ని ఉపదేశించిన ఆత్మవిద్యకు సంబంధించిన వాక్యానికి గతివాచకవాక్యంతో ఏకవాక్యత (పరస్పరసంబంధం) ఉన్నట్లు తెలుస్తున్నది. అందుచేత ప్రారంభవాక్యోక్తమైన ఆత్మయే ఈ వాక్యంలో గ్రహించబడుతుంది అని చెప్పాలి.

కథమితి:- వాక్యోపక్రమంలో సుఖవిశిష్టమైన బ్రహ్మ ఎట్లు తెలియబడుచున్నది? (సమాధానం) చెప్పబడుచున్నది "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అని అగ్నుల మాటలు విని ఉపకోసలుడు - "విజానామ్యహం ......విజానామి" (ప్రాణం బ్రహ్మ అనే విషయం నే నెరుగుదును. అయితే కం ఖం అనేవాటిని నే నెరుగను) అని అన్నాడు. దానికి - "యద్వావ....కమ్" (ఏది కమ్ అని చెప్పబడిందో అదే ఖం; ఏది ఖం అని చెప్పబడిందో అదే కమ్) అని సమాధానం. వాటిలో ఖం శబ్దం భూతాకాశం అనే అర్థంలో లోకంలో రూఢంగా ఉంది. దానికి విశేషణంగా సుఖవాచక మైన కం శబ్దం చెప్పకపోతే అప్పుడు బ్రహ్మశబ్దం కేవలభూతాకాశం అనేదాని విషయంలో, నామాదుల విషయంలో వలె, ప్రతీకంగా ప్రయోగించబడింది అనే అభిప్రాయం కలుగుతుంది. అదే విధంగా 'కం' శబ్దానికి ఇంద్రియాలకు విషయాలతో కలిగిన సంబంధంచేత పుట్టిన దుఃఖమిశ్రమైన సుఖం అనే అర్థం ప్రసిద్ధం గాన దానికి 'ఖం' శబ్దాన్ని విశేషణంగా ప్రయోగించకపోతే లౌకికమైన సుఖమే బ్రహ్మ అని ప్రతీతి (జ్ఞానం) కలిగేది. ఈ 'కం' 'ఖం' శబ్దాలను ఒకదానికి మరొకదానిని విశేషణాలుగా ఉపయోగించడంవల్ల సుఖాత్మకమైన (సర్వవ్యాప్తమైన)బ్రహ్మ అనే అర్థాన్ని బోధిస్తాయి. అందులో కూడ రెండవ బ్రహ్మశబ్దాన్ని ఉపయోగించకుండా ('కం' బ్రహ్మ కం బ్రహ్మ అనకుండా) 'కం ఖం బ్రహ్మ' అని మాత్రమే అన్నట్లయితే 'కం' శబ్దం కేవలం ('ఖం'కు) విశేషణంలగా మాత్రమే ప్రయోగించబడింది గాన దాని అర్థమైన సుఖం కూడ ధ్యానంచేయదగినది అని తెలియకపోయేది. అలా కాకుండా ఉండడం కోసం "కం బ్రహ్మ కం బ్రహ్మ" అని కం ఖం శబ్దాలురెండింటి శిరస్సుమీదా బ్రహ్మశబ్దం చేర్చబడింది. ఎందువల్ల ననగా (ఇది సుగుణబ్రహ్మోపాసన గాన) గుణియైన బ్రహ్మ ఏ విధంగా ధ్యేయమో గుణమైన సుఖం కూడ అదే విధంగా ధ్యేయం. ఈ విధంగా వాక్యోపక్రమంలో సుఖవిశిష్టమైన బ్రహ్మ ఉపదేశించబడింది. గార్హపత్యాద్యగ్నులు ఒక్కొక్కటీ కూడ తన తన మహిమను గూర్చి చెప్పి "ఏషా.. ఆత్మవిద్యా" (సౌమ్యుడా నీకుచెప్పిన మా విద్య ఆత్మవిద్యా కూడ ఇదే) అని ఉపసంహరించడం ద్వారా వెనుక బ్రహ్మను గూర్చి చెప్పబడింది అని సూచిస్తున్నాయి "ఆచార్యస్తు తే గతిం వక్తా" (నీకు నీ ఆచార్యుడు గమనాన్ని గూర్చి చెపుతాడు) అని చెప్పడం ద్వారా నీవు ఆచార్యునినుండి తెలుసుకొనవలసినది కేవలం

గతిని గూర్చి మాత్రమే; ఇతరవిషయా లేవీ చెప్పదగినవి లేవు అని వాటిని నివారించిన ట్లయింది.

వి. పృథివి, అగ్ని, అన్నం, ఆదిత్యుడు ఈ నాలుగూ నా దేహాలు, నా విభూతి అని గార్హపత్యాగ్ని బోధించింది. అప్, దిక్కులు, నక్షత్రాలు, చంద్రుడు నాదేహాలు, నా విభూతి అని అన్వాహార్యపచనాగ్ని బోధించింది. ప్రాణం, ఆకాశం, ద్యులోకం, విద్యుత్తు ఈ నాలుగు నా శరీరాలు, నా విభూతి అని ఆహవనీయం బోధించింది. ఇది ఆ అగ్నులు చెప్పన, వాటికి సంబంధించిన విద్య. అగ్ను లన్నీ కలిసి 'ప్రాణో బ్రహ్మ' అని చెప్పిన విద్య ఆత్మవిద్య. ఇది సగుణోపాసనం. అందుచేతనే మార్గభేదాలు చెప్పబడ్డాయి. నిర్గుణబ్రహ్మోపాసకునకు మార్గగమనం ఉండదు. ఈ శరీరం పతితం అవగానే ఇక్కడనే విదేహముక్తి.

యథా ఇతి:- "యథా...శ్లిష్యతే" (తామరాకుమీద నీళ్లు అంటుకొననట్లు ఈ విధంగా తెలుసుకొన్నవానికి పాపం అంటదు) అని నేత్రం స్థానంగా గల పురుషుణ్ణి గూర్చి తెలుసుకొన్నవానికి పాపంచేత ఉపఘాతం ఉండ దని చెప్పడం ద్వారా ఈ అక్షిస్థానుడైన పురుషుడు బ్రహ్మయే అని చూపుచున్నది. అందుచేత 'య ఏషో౽క్షిణి.. ఉవాచ" అనే శ్రుతివాక్యం ప్రారంభంలో ప్రకృతమైన బ్రహ్మయే అక్షిస్థానంలో ఉన్న దనీ దానికే సంయద్వామత్వం మొదలైన గుణా లున్నాయనీ చెప్పి అట్టి బ్రహ్మను తెలుసుకొన్నవానికి అర్చిరాదిమార్గాన్ని చెపుతాను అని ఉపక్రమించింది. 15.

## సూ. శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ 1.2.16

ఇహాక్షిస్థానః పురుషః పరమేశ్వరః; యస్మాచ్ఛ్రుతోపనిషత్కస్య శ్రుతరహస్యవిజ్ఞానస్య బ్రహ్మవిదో యా గతిర్దేవయానాఖ్యా ప్రసిద్ధా శ్రుతౌ "అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాత్మానమన్విష్యాదిత్యమభి యజన్త ఏతద్వై ప్రాణానామాయతనమేతదమృతమభయమేతత్పరాయణ మేతస్మాన్న పునరావర్తన్తే" (ప్ర.ఉ. 1.10) ఇతి. స్మృతావపి.

"అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్

తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః" (భ.గీ. 24) ఇతి; సైవేహాక్షిపురుషవిదో౽భిధీయమానా దృశ్యతే - "అథ యదు చైవాస్మిఞ్ఛవ్యం కుర్వన్తి యది చ నార్చిషమేవాభిసంభవన్తి" ఇత్యుపక్రమ్య - "ఆదిత్యాచ్చన్ద్రమసం

చన్ద్రమసో విద్యుతం తత్పురుషో ఽమానవః స ఏనాన్ బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తన్తే' '(ఛా.ఉ.4.15.5.) ఇతి. తదిహ బ్రహ్మవిద్విషయయా ప్రసిద్ధయా గత్యాక్షిస్థానస్య బ్రహ్మత్వం నిశ్చీయతే. 16.

బాలానందిని

శ్రుతేతి:- "శ్రుతోపనిషత్కగత్యభిధానాత్ చ= వినబడిన ఉపనిషత్తు కలవానికి కలిగే గతిని చెప్పడంవల్ల కూడ అక్షిపురుషుడు బ్రహ్మయే". అని సూత్రార్థం

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూక అక్షిస్థాను డైన పురుషుడు పరమేశ్వరుడే; ఎందువల్ల ననగా, శ్రుతోపనిషత్కస్య= రహస్యవిజ్ఞానాన్ని విన్న బ్రహ్మవేత్తకు, దేవయానం అనే ఏ గతి - "అథోత్తరేణ...ఆవర్తన్తే" (తపస్సుచేత, బ్రహ్మచర్యంచేత శ్రద్ధతో విద్యచేత ఆత్మను అన్వేషించి శరీరపాతానంతరం ఆదిత్యుని ద్వారా సగుణబ్రహ్మస్థానానికి వెడతారు. ఈ బ్రహ్మ వ్యష్టిసమష్టిరూపాలైన ప్రాణాలకు స్థానము. వాస్తవంలో ఇది నిత్యము; భయరహితమూ అయిన నిర్గుణరూపమే. ఇది ఉత్తమమైన గమ్యస్థానం. దీనినుండి వెనుకకు తిరిగి రారు) అను శ్రుతియందు ప్రసిద్ధ మైనదో "అగ్నిః...జనాః' (ఈ ఉపాసకుడు మరణించినప్పుడు పుత్రాదులు సంస్కారం చేసినా చేయకపోయినా వాళ్లు అర్చిర్దేవత వైపే వెడతారు) అని ఉపక్రమించి "ఆదిత్యాత్.... నావర్తన్తే" (ఆదిత్యునినుండి చంద్రుణ్ణి చంద్రునినుండి విద్యుత్తును చేరుతారు. అక్కడినుండి ఒక దివ్యపురుషుడు వీళ్లను సగుణబ్రహ్మదగ్గరికి తీసికొనివెడతాడు. ఇది దేవమార్గం, బ్రహ్మమార్గం. ఈ మార్గం ద్వారా వెళ్లినవాళ్లు ఈ మానవలోకానికి జననమరణరూపసంసారంలోనికి తిరిగి రారు) అని చెప్పబడింది. అందువల్ల ఇక్కడ చెప్పిన బ్రహ్మవేత్తకు సంబంధించిన ప్రసిద్ధమైన గతిచేత అక్షిస్థానుడైన పురుషుడు బ్రహ్మయే అని నిశ్చయించబడుతున్నది.16.

## సూ. అనవస్థితేరసంభవాచ్చ నేతరః.1.2.17

యత్పునరుక్తం ఛాయాత్మా, విజ్ఞానాత్మా, దేవతాత్మా వా స్యాదక్షిస్థాన ఇతి, అత్రోచ్యతే-న చ్ఛాయాత్మాదిరితర ఇహ గ్రహణమర్హతి. కస్మాత్? అనవస్థితేః. న తావచ్ఛాయాత్మనశ్చక్షుషి నిత్యమవస్థానం సంభవతి. యదైవ హి కశ్చిత్పురుషశ్చక్షురాసీదతి తదా చక్షుషి పురుషచ్ఛాయా దృశ్యతే, అపగతే తస్మిన్న దృశ్యతే. "య ఏషోఽక్షిణి పురుషః"ఇతి శ్రుతిః సంనిధానాత్స్వచక్షుషి దృశ్యమానం పురుషముపాస్యత్వేనోపదిశతి. న చోపాసనాకాలే ఛాయాకరం

కంచిత్పురుషం చక్షుఃసమీపే సంనిధాప్యోపాస్తే ఇతి యుక్తం కల్పయితుమ్. "అస్యైవ శరీరస్య నాశమన్వేష నశ్యతి" (ఛా. ఉ. 8..9.1) ఇతి శ్రుతిః ఛాయాత్మనోఽ ప్యనవస్థితత్వం దర్శయతి. అసంభవాచ్చ తస్మిన్నమృతత్వా దీనాం గుణానాం న ఛాయాత్మని ప్రతీతిః.

## బాలానందిని

అనవస్థితేరితి:- ''అనవస్థితేః=స్థిరంగా ఉండకపోవడంవల్ల, అసంభ వాచ్చ= అమృత్వాదులు సంభావ్యములు కాకపోవడంవల్ల, ఇతరః = ఛాయాపురుషుడు మొదలైన ఇతరుడు, న= అక్షిస్థపురుషుడు కాదు. అని సూత్రార్థం.

యదితి:- అక్షిస్థానుడు ఛాయాత్మ(ప్రతిబింబాత్మ)గాని, జీవుడు గాని దేవతాత్మ గాని కావచ్చును అని ఏది చెప్పబడినదో దాని విషయంలో చెప్పబడుచున్నది - ఛాయాత్మ మొదలైన ఇతరుడు ఇక్కడ గ్రహించడానికి తగడు. ఎందువల్ల? స్థిరంగా ఉండకపోవడం వల్ల. ఛాయాత్మయైతే నేత్రంలో నిత్యమూ ఉండడం సంభవించదు. ఎవడైనా ఒక పురుషుడు నేత్రందగ్గరికి వచ్చినప్పుడు కదా నేత్రంలో వాని నీడ (ప్రతిబింబం) కనబడుతుంది? అతడు దూరంగా వెళ్లగానే అది కనబడదు. మరొక విషయ మేమనగా - ''య ఏషోఽక్షిణి పురుషః'' అను శ్రుతి ఉపాసకుడు తనకు దగ్గరగా నేత్రమునందు చూడబడుచున్న పురుషుణ్ణి ఉపాసించాలి అని ఉపదేశిస్తున్నది (తనకంటిలో ఉన్న ఛాయాపురుషుడు తనకు కనబడడు కదా అని భావం). ఉపాసనాకాలంలో తనకంటిలో ప్రతిబింబం కలిగించే పురుషుణ్ణి ఒకనిని ఎదుట ఉంచుకొని ఉపాసన చెయ్యాలి అని కల్పించడం కూడ యుక్తం కాదు. ''అస్యైవ...నశ్యతి'' (ఈ శరీరం తొలగిపోగానే ఛాయాత్మకూడ నశిస్తుంది) అని శ్రుతి కూడ ఛాయాత్మ అనవస్థితం అని చెపుతున్నది. ఆ ఛాయాత్మలో అమృతత్వం మొదలైన గుణాలు అసంభవములు గాన వాటి జ్ఞానం ఆ ఛాయాత్మవిషయంలో కలగదు.

## భాష్యమ్

తథా విజ్ఞానాత్మనోఽపి సాధారణే కృత్స్నశరీరేన్ద్రియసంబన్ధే సతి చక్షుష్యేవావస్థితత్వం వక్తుం న శక్యమ్. బ్రహ్మణస్తు వ్యాపినోఽ పి దృష్ట ఉపలబ్ధ్యర్థో హృదయాదిదేశవిశేషసంబన్ధః. సమానశ్చ విజ్ఞానాత్మన్యప్య మృత త్వాదీనాం గుణానామసంబన్ధః. యద్యపి విజ్ఞానాత్మా పరమాత్మనోఽ నన్య ఏవ, తథాప్యవిద్యాకామకర్మకృతం తస్మిన్మర్త్యత్వ మధ్యారోపితం భయం చేత్యమృతత్వాభయత్వే నోపపద్యేతే. సంయద్వామత్వాదయశ్చైతస్మిన్న

నైశ్వర్యాదనుపపన్నా ఏవ. దేవతాత్మనస్తు "రశ్మిభిరేషోఽస్మిన్ ప్రతిష్ఠితః" ఇతి శ్రుతేర్యద్యపి చక్షుష్యవస్థానం స్యాత్తథాప్యాత్మత్వం తావన్న సంభవతి, పరాగ్రూపత్వాత్. అమృతత్వాదయోఽపి న సంభవన్తి, ఉత్పత్తిప్రలయ శ్రవణాత్. అమరత్వమపి దేవానాం చిరకాలావస్థానాపేక్షమ్. ఐశ్వర్యమపి పరమేశ్వరాయత్తం న స్వాభావికమ్.

"భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః,

భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః". (తై.ఉ.2.8.)

ఇతి మన్త్రవర్ణాత్. తస్మాత్పరమేశ్వర ఏవాయమక్షిస్థానః ప్రత్యేతవ్యః. అస్మింశ్చ పక్షే దృశ్యతే ఇతి ప్రసిద్ధవదుపాదానం శాస్త్రాద్యపేక్షం విద్వద్విషయం ప్రరోచనార్థమితి వ్యాఖ్యేయమ్. 17

బాలానందిని

**తథేతి:-** అట్లే - విజ్ఞానాత్మ సమస్తశరీరేంద్రియాలతోను సమంగానే సంబంధించి ఉన్నప్పుడు నేత్రంలోనే ఉన్నాడు అని చెప్పడం శక్యం కాదు. సర్వవ్యాపియైనా కూడ బ్రహ్మకు మాత్రం (ఉపాసనద్వారా)తెలుసుకోవడంకొరకు హృదయాదిప్రదేశవిశేషాలతో సంబంధం ఉంది అని చెప్పడం కనబడుతుంది. (ఆ విధంగా జీవుని విషయంలో చెప్పకూడదు). విజ్ఞానాత్మయందు కూడ (ఛాయాత్మవిషయంలో చెప్పి నట్లు) అమృతత్వాదిగుణాలతో సంబంధం లేకపోవడం సమానమే. విజ్ఞానాత్మ వాస్తవంలో పరమాత్మకంటె అభిన్నుడే అయినా కూడ వానిమీద అవిద్య, కామం, కర్మ వీటిచేత ఏర్పడిన మర్త్యత్వం (మరణశీలత్వం) భయమూ కూడ ఆరోపించబడింది గాన వానికి అమృతత్వ-అభయత్వాలు (భయరాహిత్యాలు) ఉపపన్నాలు కావు. విజ్ఞానాత్మ ఐశ్వర్య రహితుడు గాన వానిలో సంయద్వామత్వాదులు కూడ కుదరవు. 'రశ్మిభిరేషో ఽస్మిన్ ప్రతిష్ఠితః" అను శ్రుతిని అనుసరించి దేవతాత్మ (నేత్రాదిష్ఠానదేవతయైన ఆదిత్యుడు) చక్షుస్సులో (రశ్ముల ద్వారా) ఉన్నా డని చెప్పవచ్చును గాని, అతడు పరాగ్రూపుడు (బైట నున్నవాడు) గాన ఆత్మ అని చెప్పడం కుదరదు. ఆ దేవతాత్మకు కూడ ఉత్పత్తి-వినాశము లున్నట్లు శ్రుతిలో వినబడుచున్నది గాన అమృతత్వాదులు కూడ కుదరవు. దేవతలకు చెప్పిన అమృతత్వం చిరకాలం ఉండడాన్ని పట్టి చెప్పబడినది. (అంతే కాని ఏ నాటికీ నాశం లేనివారు అని అర్థం కాదు). ఐశ్వర్యంకూడ పరమేశ్వరుని

మీద ఆధారపడినదే గాని స్వాభావికంకాదు (వాళ్ల ఐశ్వర్యం పరమేశ్వరు డిస్తే ఉంది లేకపోతే లేదు అని అర్థం). ఈ విషయాన్నే "భీషా... పఞ్చమః" ఈ పరమేశ్వరునికి భయపడి వాయువు వీచుతున్నది; భయపడి సూర్యు డుదయిస్తున్నాడు, భయపడి అగ్ని, ఇంద్రుడు తమ తమ పనులు చేస్తున్నారు. ఐదవదైన మృత్యుదేవత కూడ (పరమేశ్వరునికి భయపడి చంపదగినవాళ్ల దగ్గరికి) పరుగెత్తి వెడుతున్నాడు) అనే మంత్రం చెపుతున్నది. అందువల్ల అక్షిస్థానంలో ఉన్నవాడు పరమేశ్వరుడే అని గ్రహించదగినవాడు. ఈ పక్షంలో దృశ్యతే అని ప్రత్యక్షంగా చూడబడు తున్నట్లు, ప్రసిద్ధంగా ఉన్నట్లు చెప్పడం శాస్త్రాదులను పట్టి విద్వాంసులను దృష్టిలో ఉంచుకొని చేయబడిం దనీ, ప్రరోచనకోసం (ఆసక్తి పుట్టించడం కోసం) చేయబడిందనీ వ్యాఖ్యానించాలి.

వి. "య ఏషో౽క్షిణి పురుషః దృశ్యతే" అని చెప్పడంలో (కంటిలో ఏ పురుషుడు కనబడుతున్నాడో) అని ప్రత్యక్షంగా పురుషుడు కనబడుతున్నట్లు ఈ విషయం సర్వవిదితం అన్నట్లు కనబడుతుంది. పరమేశ్వరుడు ఆ విధంగా కనబడడంలేదు కదా? అలాంటప్పుడు 'దృశ్యతే' అని ఎలా చెప్పబడింది అని ఆశంకించుకొని పైసమాధానం చెప్పబడింది. శాస్త్రంలో ఉండే ప్రసిద్ధిని పట్టీ, పండితులులలో ఉండే ప్రసిద్దిని పట్టీ పరమేశ్వరుడు కంటిలో కనడుతున్నా డన్నట్లు భావించి, ఉపాసకులకు అభిరుచి కలిగించడం కోసం 'దృశ్యతే' అని చెప్పబడింది అని సమాధానం 17

అంతరాధికరణం సమాప్తం.

## 5 అంతర్యామ్యధికరణమ్. సూ. 18-20

## సూ. అన్తర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్ 1.2.18

"య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి చ భూతాని యో౽న్తరో యమయతి" ఇత్యుపక్రమ్య శ్రూయతే - "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరో యమయతి ఏష త ఆత్మా అన్తర్యామ్యమృతః" (బృ.ఉ. 3.7.1.2.) ఇత్యాది. అత్రాధిదైవతమధిలోకమధియజ్ఞమధిభూతమధ్యాత్మం చ కశ్చిదన్తరవస్థితో యమయితా అన్తర్యామీతి శ్రూయతే. సకిమధిదైవాద్యభిమానీ దేవతాత్మా కశ్చిత్, కిం వా ప్రాప్తాణిమాద్యైశ్వర్యః కశ్చిద్యోగీ, కిం వా పరమత్మా కిం వార్థాన్తరం కించిత్ ఇత్యపూర్వసంజ్ఞాదర్శనాత్సంశయః. కిం తావన్నః

ప్రతిభాతి? సంజ్ఞాయా అప్రసిద్ధత్వాత్సంజ్ఞినాప్యప్రసిద్ధేనార్థాన్తరేణ కేనచిద్ భవితవ్యమితి. అథవా నానిరూపితరూపమర్థాన్తరం శక్యమభ్యుపగన్తుమ్. అన్తర్యామిశబ్దశ్చాన్తర్యమనయోగేన ప్రవృత్తో నాత్యన్తమప్రసిద్ధః. తస్మాత్ పృథివ్యాద్యభిమానీ కశ్చిద్దేవోఽ న్తర్యామీ స్యాత్. తథా చ శ్రూయతే -"పృథివ్యేవ యస్యాయతనమగ్నిర్లోకో మనో జ్యోతిః" (బృ.ఉ.3.9.10) ఇత్యాది. స చ కార్యకరణవత్త్వాత్ పృథివ్యాదీనన్తస్తిష్ఠన్యమయతీతి యుక్తం దేవతాత్మనో యమయితృత్వమ్. యోగినో వా కస్య చిత్సిద్ధస్య సర్వానుప్రవేశేన యమయితృత్వం స్యాత్; న తు పరమాత్మా ప్రతీయతే, అకార్యకరణత్వాత్ ఇతి.

బాలానందిని

అన్తర్యామీతి:- "తద్ధర్మవ్యపదేశాత్=పరమాత్మయొక్కధర్మాలను చెప్పడంవల్ల, అధిదైవాదిషు=అధిదైవాదులయందు, అన్తర్యామీ=అంతర్యామి యైనవాడు పరమేశ్వరుడే" అని సూత్రార్థం.

య ఇతి:- "య... యమయతి" (ఎవడు ఈ లోకాన్ని, పరలోకాన్ని, సమస్తభూతాలను, లోపల ఉండి నియమిస్తున్నాడో) అని ఉపక్రమించి -"యః...అమృతః' '(ఎవడు పృథివిలో ఉంటూ పృథివికి లోపల ఉన్నాడో, ఎవనిని గూర్చి పృథివి ఎరుగదో ఎవనికి పృథివి శరీరమో ఎవడు పృథివి లోపలనుండి నియమిస్తున్నాడో అతడు అమృతుడైన నాశరహితుడైన అంతర్యామి) ఇత్యాదికం వినబడుచున్నది. ఈ ఘట్టంలో ఒకడు అధిదైవతముగా (అధిదైవతమునందు) అధిలోకమునందు, అధివేదమునందు అధియజ్ఞమునందు అధిభూతమునందు అధ్యాత్మమునందు లోపలనుండి అంతర్యామిగా ఉన్నాడు అని వినబడుతున్నది.

వి. "యఃపృథివ్యామ్" ఇత్యాదివాక్యంలో పృథివ్యాదిదేవతలను నియమించేవాడు, అధిదేవతనియామకుడు, "యః సర్వేషు లోకేషు" ఇత్యాదివాక్యంలో అధిలోకనియామకుడు "యః సర్వేషు వేదేషు" ఇత్యాదివాక్యంలో అధివేద నియామకుడు, "యః సర్వేషు యజ్ఞేషు" ఇత్యాదివాక్యంలో అధియజ్ఞనియామకుడు, "యః సర్వేషు భూతేషు" ఇత్యాదివాక్యంలో అధిభూతనియామకుడు "యః ప్రాణే తిష్ఠన్' మొదలు "య ఆత్మని" అనే వాక్యంవరకు అధ్యాత్మనియామకుడు చెప్పబడ్డాడు.

స ఇతి:- ఆ అంతర్యామి అధిదైవాద్యభిమానం గల ఎవడైన దేవతాత్మయా లేదా అణిమాద్యైశ్వర్యాలు పొందిన ఒకానొక యోగియా లేదా పరమాత్మయా లేదా మరొక వస్తువేదైనా అయి ఉంటుందా అని 'అంతర్యామి'అనే క్రొత్త పేరు వినబడడంవల్ల సందేహం కలుగుతుంది. ఇక్కడ మాకు ఏమి తోస్తుంది? పేరు అప్రసిద్ధంగా ఉండడంచేత ఈ పేరు కలది కూడ ఏదో ఒక అప్రసిద్ధవస్తువై ఉండాలి అని తోస్తుంది. లేదా- ఇది ఫలానా అని చెప్పడానికి శక్యం కాని ఏదో ఒక వస్తువును అంగీకరించడం శక్యం కాదు. అంతర్యామిశబ్దానికి కూడ లోపలనియమించడం అనే యౌగికార్థం చెప్పడానికి వీలున్నది గాన ఇది అంత అప్రసిద్ధార్థశబ్దం కూడ కాదు. అందువల్ల పృథివ్యాద్యభిమాని యైన ఎవరో ఒక దేవత అంతర్యామి అయి ఉండవచ్చు "పృథివ్యేవ...జ్యోతి" (ఎవనికి పృథివియే శరీరమో, అగ్నియే నేత్రమో, మనస్సు జ్యోతిస్సో) అని శ్రుతికూడ వినబడుతున్నది. అతనికి దేహేంద్రియాదులు ఉండడంచేత పృథివ్యాదులలోపల ఉండి వాటిని నియమిస్తున్నాడు అని ఆ దేవతాత్మకు యమయితృత్వం యుక్తమే. లేదా సిద్ధుడైన ఎవడైన ఒక యోగి అన్నింటిలోన ప్రవేశించి అన్నింటినీ నియమిస్తున్నాడు అని చెప్పినా కూడ చెప్పవచ్చు. అంతే కాని పరమాత్మ అని మాత్రం చెప్పకూడదు. పరమాత్మకు దేహేంద్రియాదులు లేవు కదా?

వి. వెనుక "స్థానాదివ్యపదేశాచ్చ" అనే సూత్రంలో "యః పృథివ్యాం తిష్ఠన్" మొదలైన అంతర్యామిబ్రాహ్మణంలో ఉన్న "యశ్చక్షుషి తిష్ఠన్" ఇత్యాదివాక్యాన్ని, ఆ అంతర్యామి బ్రహ్మ అన్నట్లు సిద్ధవత్కృత్య (నిశ్చితమైనట్లు భావించి) ఉదాహరించం జరిగింది. అది బ్రహ్మవాచకమే కాజాలదు అని ఆక్షేపిస్తూ ఈ పూర్వపక్షం చేయబడుచున్నది. అందుచేత పూర్వాధికరణంతో దీనికి ఆక్షేపసంగతి. పూర్వపక్షంలో వాక్యానికి ఏది ప్రధానప్రతిపాద్యమో దాన్ని ఉపాసించడం ఫలం, సిద్ధాంతంలో బ్రహ్మోపాసనం ఫలం.

## భాష్యం

ఏవం ప్రాప్తే ఇదముచ్యతే - యోఽన్తర్యామ్యధిదైవాదిషు శ్రూయతే స పరమాత్మైవ స్యాన్నాన్య ఇతి. కుతః? తద్ధర్మవ్యపదేశాత్. తస్య హి పరమాత్మనో ధర్మా ఇహ నిర్దిశ్యమానా దృశ్యన్తే. పృథివ్యాది తావదధి దైవతాదిభేదభిన్నం సమస్తం వికారజాతమన్తస్తిష్ఠన్యమయతీతి పరమాత్మనో యమయితృత్వం ధర్మ ఉపపద్యతే. సర్వవికారకారణత్వే సతి సర్వశక్త్యుపపత్తేః. "ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః" ఇతి చాత్మత్వామృతత్వే

ముఖ్యే పరమాత్మని ఉపపద్యేతే. "యం పృథివీ న వేద" ఇతి చ పృథివీ దేవతాయా అవిజ్ఞేయమన్తర్యామిణం బ్రువన్ దేవతాత్మనోఽన్యమన్తర్యామిణం దర్శయతి. పృథివీదేవతా హ్యహమస్మి పృథివీత్యాత్మానం విజానీయాత్. తథా "అదృష్టోఽశ్రుతః" ఇత్యాదివ్యపదేశో రూపాదివిహీనత్వాత్పరమాత్మన ఉపపద్యత ఇతి. యత్తు అకార్యకరణస్య పరమాత్మనో యమయితృత్వం నోపపద్యత ఇతి -నైష దోషః. యాన్నియచ్ఛతి తత్కార్యకరణైరేవ తస్య కార్యకరణవత్త్వోపపత్తేః. తస్యాప్యన్యో నియన్తేతి అనవస్థాదోషశ్చ న సంభవతి; భేదాభావాత్. భేదే హి సత్యనవస్థాదోషోపపత్తిః. తస్మాత్పరమాత్మైవాన్తర్యామీ. 18

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా ఇది (సమాధానం) చెప్పబడుచున్నది. అధిదైవాదులు అంతర్యామిగా వినబడుతున్నది పరమాత్మయే. మరొకరు కాదు, ఎందువల్ల? ఆ పరమాత్మయొక్క ధర్మాలు చెప్పడంవల్ల. ఇక్కడ ఆ పరమాత్మయొక్క ధర్మాలు నిర్దేశింపబడుతున్నట్లు కనబడుతున్నాయి. పరమాత్మ అధిదైవం మొదలైన భేదాలచేత భిన్నమైన సమస్తమైన పృథివ్యాదివికార (కార్య) సముదాయాన్ని లోపలఉండి నియమిస్తున్నాడు గాన ఆతనియందు యమయితృత్వం అనే ధర్మం ఉపపన్నంగా ఉంటుంది. అన్ని కార్యాలకి కారణం అయినవానిలో అన్ని శక్తులూ ఉపపన్నాలే కదా? "ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః" అని చెప్పిన ఆత్మత్వం, అమృతత్వం అనేవి ముఖ్యంగా పరమాత్మయందే ఉపపన్నా లౌతాయి. (మరొక అర్థం ఏద్దైనా చెపితే దానియందు ఇవి ఔపచారికాలు అని చెప్పవలసి వస్తుంది). "యం పృథివీ న వేద" అని ఈ అంతర్యామి పృథిదేవతకు తెలియ శక్యంకానివాడు అని చెప్పడంవల్ల ఈ అంతర్యామి దేవతాత్మకంటె భిన్నమైనవాడు అని తెలియజేస్తున్నది. పృథివీదేవత (పృథివ్యధిష్ఠానదేవత) నేను పృథివిని" అని తనను గూర్చి తెలుసుకొంటుంది కదా? అట్లే "అదృష్టః అశ్రుతః" (చూడబడని, వినబడని) ఇత్యాదినిర్దేశం రూపాదిహీనుడవడంచేత పరమాత్మవిషయంలో ఉపపన్నంగా ఉంటుంది. దేహేంద్రియాదులు లేని పరమాత్మకు నియామకత్వం కుదరదు అనిఏది చెప్పబడిందో అది దోషం కాదు. వేటిని నియమిస్తున్నాడో వాటి శరీరేంద్రియాలచేతనే పరమాత్మ శరీరేంద్రియవంతుడవుతాడు. (నియమించబడేవాళ్ల శరీరేంద్రియాలే పరమాత్మ శరీరేంద్రియాలు. జీవుడు తన శరీరాన్ని నియమిస్తున్నాడనగా అతనికి మరొక శరీరేద్రియాదికం లేదు కదా అని భావం) పృథివ్యాదులకు ఒకనియంత ఉన్నా డంటే ఆ నియంతకు మరొక నియంత

ఉండాలి కదా? ఈ విధంగా అనవస్థాదోషం కలుగుతుంది అనడానికి వీలులేదు. నిజానికి పృథివ్యాద్యంతర్గతజీవునికి అంతర్యామికి భేదమే లేదు కదా? భేదం ఉంటేనే కదా అనవస్థాదోషం ఉండేది? అందువల్ల అంతర్యామి పరమాత్మయే. 18.

## సూ. న చ స్మార్తమతద్ధర్మాభిలాపాత్ 1.2.19

స్యాదేతత్ - అదృష్టత్వాదయో ధర్మాః సాంఖ్యస్మృతికల్పితస్య ప్రధానస్యాప్యుపపద్యన్తే; రూపాదిహీనతయా తస్య తైరభ్యుపగమాత్- "అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః" (మను.1.5.) ఇతి హి స్మరన్తి. తస్యాపి నియన్తృత్వం సర్వవికారకారణత్వాదుపపద్యతే. తస్మాత్ప్రధానమన్తర్యామి శబ్దం స్యాత్. 'ఈక్షతేర్నాశబ్దమ్" (1.1.5) ఇత్యత్ర నిరాకృతమపి సత్ ప్రధానమిహాదృష్టత్వాదివ్యపదేశసంభవేన పునరాశఙ్క్యతే.

అత ఉత్తరముచ్యతే - న చ స్మార్తం ప్రధానమన్తర్యామిశబ్దం భవితుమర్హతి. కస్మాత్? అతద్ధర్మాభిలాపాత్. యద్యప్యదృష్టత్వాదివ్యపదేశః ప్రధానస్య సంభవతి తథాపి న ద్రష్టృత్వాదివ్యపదేశః సంభవతి, ప్రధానస్యాచేతనత్వేన తైరభ్యుపగమాత్. "అదృష్టో ద్రష్టాऽశ్రుతః శ్రోతాऽమతో మన్తాऽవిజ్ఞాతో విజ్ఞాతా" (బృ3.7.23) ఇతి వాక్యశేష ఇహ భవతి. ఆత్మత్వమపి న ప్రధానస్యోపపద్యతే. 19

### బాలానందిని

నేతి:- ''స్మార్తం చ= సాంఖ్యస్మృతిప్రతిపాదితమైన ప్రధానంకూడ, న= అంతర్యామిశబ్దవాచ్యం కాదు. అతద్ధర్మాభిలాపాత్ = దానికి లేని ధర్మాలను చెప్పడం వల్ల''' అని సూత్రార్థం.

స్యాదేతత్ ఇతి :- ఇది ఇలా ఉండుగాక. సాంఖ్యులు ప్రధానం రూపాదిహీనం అని అంగీకరించారు. అందువల్ల అదృష్టత్వం (చూడబడకపోవడం) మొదలైన ధర్మాలు సాంఖ్యస్మృతిలో కల్పించబడిన ప్రధానానికి కూడ ఉపపన్నం అవుతాయి. ''అప్రతర్క్యం...సర్వతః'' (ప్రధానం ఊహింప వక్యం కానిది తెలియ శక్యం కానిది అంతటా నిద్రపోవుచున్నట్లుంటుంది) అని స్మృతిలో చెప్పిఉన్నారు. సమస్త వికారాలకి (కార్యాలకి) కారణం అవడంచేత అది కూడ అంతర్యామి అవడం కుదురుతుంది. అందువల్ల ప్రధానం అంతర్యామిశబ్దవాచ్యం కావచ్చును. ప్రధానం "ఈక్షతేర్నాశబ్దమ్"

అనే అధికరణంలో నిరాకరించబడినా కూడ ఇక్కడ చెప్పిన అదృష్టత్వాదులు దానికి కూడ సంభవించడం చేత మళ్లీ ఆశంకించబడుతున్నది.

అందువల్ల సమాధాం చెప్పబడుతున్నది - స్మృతికల్పితమైన ప్రధానం అతర్యామి శబ్దవాచ్యం అవడానికి తగదు. ఎందువల్ల? దానివి కాని ధర్మాలను చెప్పడంవల్ల. అదృష్టత్వం మొదలైన నిర్దేశం ప్రధానానికి సంభవించినా ద్రష్టృత్వాదివ్యపదేశం (చూడగలిగి ఉండడం వంటివాటి నిర్దేశం) దాని విషయంలో కుదరదు. ప్రధానం అచేతన మని వాళ్లు అంగీకరించి ఉన్నారు. ఇక్కడ "అదృష్టో....విజ్ఞాతా" (చూడబడనిది చూస్తుంది, వినబడదు వింటుంది, ఊహింపబడదు ఊహిస్తుంది, తెలియబడదు తెలుసుకొంటుంది) అని వాక్యశేషంలో (చివరివాక్యంలో)ఉంది. ప్రధానానికి ఆత్మత్వం కూడ కుదరదు.19.

## భాష్యమ్

యది ప్రధానమాత్మత్వద్రష్టృత్వాద్యసంభవాన్నాన్తర్యామభ్యుప గమ్యతే, శారీరస్తర్హ్యన్తర్యామీ భవతు. శారీరో హి చేతనత్వాద్ద్రష్టా శ్రోతా మన్తా విజ్ఞాతా చ భవతి; ఆత్మా చ ప్రత్యక్త్వాత్. అమృతశ్చ, ధర్మాధర్మఫలోపభోగోపపత్తేః. అదృష్టత్వాదయశ్చ ధర్మాః శారీరే ప్రసిద్ధాః, దర్శనాదిక్రియాయాః కర్తరి ప్రవృత్తివిరోధాత్. న దృష్టేర్ద్రష్టారం పశ్యేః" (బృ.ఉ.3.4.2) ఇత్యాదిశ్రుతిభ్యశ్చ. తస్య చ కార్యకరణసంఘాత మన్తర్యమయితుం శీలం, భోక్తృత్వాత్. తస్మాచ్ఛారీరోఽన్తర్యామీతి. అత ఉత్తరం పఠతి.

### సూ. శారీరశ్చోభయేఽపి హి భేదేనైనమధీయతే. 1.2.20.

## బాలానందిని

యదీతి:- ఆత్మత్వం, ద్రష్టృత్వం మొదలైనవి కుదరకపోవడంవల్ల ప్రధానం అంతర్యామిగా అంగీకరించబడకపోయిన ట్లయితే అప్పుడు జీవుడే అంతర్యామి అవుగాక. జీవుడు చేతను డవడంవల్ల ద్రష్ట, శ్రోత, మంత, విజ్ఞాత కూడ అవుతాడు. ప్రత్యాగాత్మ గాన ఆత్మ కూడ అవుతాడు. ధర్మాధర్మఫలాల భోగం ఉపపన్నం అవడంవల్ల, అనగా అనంతకర్మల భోగాలను అనేక జన్మల ద్వారా అనుభవించవలసి ఉండడంవల్ల, అమృతుడు (నాశం లేనివాడు) కూడ అవుతాడు. అదృష్టత్వం మొదలైన ధర్మాలు జీవునియందు కూడ ప్రసిద్ధములే. దర్శనాదిక్రియలు కర్తయందు ప్రవర్తించడం విరుద్ధం కదా? (అనగా దర్శనాదిక్రియలు ఆత్మయందు కుదరవు

ఆత్మ తనను తానే చూడదు అని భావం). అందువలననే "న దృష్టేర్ద్రష్టారం పశ్యేః" (దృష్టికి మరొక ద్రష్టను (చూచేవానిని) చూడజాలవు) అని శ్రుతులు చెప్పుచున్నవి. జీవుడు భోక్త గాన లోపల ఉండి కార్యకరణసంఘాతాన్ని నియమించే స్వభావం కలవాడు కూడ. అందువల్ల జీవుడే అంతర్యామి. ఇందుకు సమాధానంగా సూత్రం పఠిస్తున్నాడు. "శారీరః.... అధీయతే"

శారీర ఇతి:- "శారీరశ్చ= జీవుడు కూడ, న= అంతర్యామి కాడు. ఉభయేఽపి = కాణ్వశాఖకు చెందినవాళ్లు మాధ్యందినశాఖకు చెందినవాళ్లు కూడ, ఏనమ్= ఈ జీవుణ్ణి, భేదేన = అంతర్యామికంటె వేరుగా, అధీయతే=పఠిస్తున్నారు" అని సూత్రార్థం.

## భాష్యమ్

నేతి పూర్వసూత్రాదనువర్తతే. శారీరశ్చ నాన్తర్యామీష్యతే. కస్మాత్? యద్యపి ద్రష్టృత్వాదయో ధర్మాస్తస్య సంభవన్తి తథాపి ఘటాకాశవదుపాధిపరిచ్ఛిన్నత్వాన్న కార్త్స్న్యేన పృథివ్యాదిష్వన్తరవస్థాతుం నియన్తుం చ శక్నోతి. అపి చోభయేపి శాఖినః కాణ్వా మాధ్యన్దినాశ్చ అన్తర్యామిణో భేదేనైనం శారీరం పృథివ్యాదివదధిష్ఠానత్వేన నియమ్యత్వేన చ అధీయతే "యో విజ్ఞానే తిష్ఠన్" ఇతి కాణ్వాః. "య ఆత్మని తిష్ఠన్" ఇతి మాధ్యన్దినాః. "య ఆత్మని తిష్ఠన్" ఇత్యస్మింస్తావత్పాఠే భవత్యాత్మశబ్దః శారీరస్య వాచకః. యో విజ్ఞానే తిష్ఠన్ ఇత్యపి పాఠే విజ్ఞానశబ్దేన శారీర ఉచ్యతే, విజ్ఞానమయో హి శారీరః తస్మాచ్ఛారీరాదన్య ఈశ్వరోఽన్తర్యామీతి సిద్ధమ్.

## బాలానందిని

నేతీతి:- పూర్వసూత్రంనుండి న అనే పదం దీనిలోనికి అనువర్తిస్తుంది. శారీరుడు (జీవుడు) కూడ అంతర్యామిగా అంగీకరించబడడు. ఎందువల్ల? ద్రష్టృత్వం మొదలైన ధర్మాలు ఆతనిలో కుదిరినా అతడు ఘటాకాశం వలె (ఘటాకాశం ఘటంచేత పరిమితం చేయబడినట్లు) ఉపాధిచేత (ఉపాధి యైన అంతఃకరణశరీరాదికంచేత) పరిచ్ఛిన్ను డవడంచేత పూర్తిగా పృథివ్యాదుల లోపల ఉండడానికి, వాటిని నియమించడానికి, సమర్థుడు కాడు. అంతే కాకుండా కాణ్వులు మాధ్యందినులు ఈ రెండు శాఖలకు చెందినవాళ్లు కూడ ఈ శారీరుణ్ణి అంతర్యామికంటె వేరుగాను, పృథివ్యాదుల వలె (అంతర్యామికి) అధిష్ఠానం గాను, నియమించబడేవానిని గాను పఠిస్తున్నారు. 'యో విజ్ఞానే తిష్ఠన్' అని కాణ్వులు "య ఆత్మని తిష్ఠన్" అని

మాధ్యందినులు పఠిస్తున్నారు. "య ఆత్మని తిష్ఠన్" అనే పాఠంలో ఆత్మశబ్దం జీవుణ్ణి బోధిస్తుంది. "యో విజ్ఞానే తిష్ఠన్" అనే పాఠంలో కూడ విజ్ఞానశబ్దంచేత జీవుడే బోధింపబడుతున్నాడు. జీవుడు విజ్ఞానమయుడు కదా? ( ఈ విధంగా అంతర్యామి జీవాత్మలో ఉంటూ జీవాత్మను నియమిస్తుంది అని చెప్పడంచేత నియమించే అంతర్యామి వేరు నియమించబడే జీవుడు వేరు అని స్పష్టంగా తెలుస్తూన్నదని అర్థం). అందువల్ల శారీరునికంటె వేరైన ఈశ్వరుడే అంతర్యామి అని నిశ్చితమైనది.

## భాష్యమ్

కథం పునరేకస్మిన్ దేహే ద్వౌ ద్రష్టారావుపపద్యేతే, యశ్చాయ మీశ్వరోఽన్తర్యామీ యశ్చాయమితరః శారీరః? కా పునరిహానుపపత్తిః? "నాన్యోఽతోఽస్తిద్రష్టా" ఇత్యాదిశ్రుతివచనం విరుధ్యేత. అత్ర హి ప్రకృతాదన్తర్యామిణోఽన్యం ద్రష్టారం, శ్రోతారం, మన్తారం, విజ్ఞాతారం చాత్మానం ప్రతిషేధతి. నియన్త్రన్తరప్రతిషేధార్థమేతద్వచనమితి చేత్; న. నియన్త్రన్తరాప్రసఙ్గాత్. అవిశేషశ్రణాచ్చ.

అత్రోచ్యతే - అవిద్యాప్రత్యుపస్థాపితకార్యకరణోపాధినిమిత్తోఽయం శారీరాన్తర్యామిణోర్భేదవ్యపదేశః న పారమార్థికః. ఏకో హి ప్రత్యగాత్మా భవతి, న ద్వౌ ప్రత్యగాత్మానౌ సంభవతః. ఏకస్యైవ తు భేదవ్యవహారః ఉపాధికృతః, యథా ఘటాకాశో మహాకాశ ఇతి. తతశ్చ జ్ఞాతృజ్ఞేయాది శ్రుతయః, ప్రత్యక్షాదీని చ ప్రమాణాని, సంసారానుభవః, విధిప్రతిషేదశాస్త్రం చేతి సర్వమేతదుపపద్యతే. తథా చ శ్రుతిః - "యత్ర హి ద్వైతమిత భవతి తదితర ఇతరం పశ్యతి" ఇత్యవిద్యావిషయే సర్వం వ్యవహారం దర్శయతి. "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" ఇతి విద్యావిషయే సర్వం వ్యవహారం వారయతి. 20.

కథమితి:- అంతర్యామియైన ఈశ్వరు డనేవాడు ఎవ డున్నాడో అతడు అతని కంటె భిన్నుడైన ఏ శారీరు డున్నాడో అతడు - ఈ విధంగా ఒకే దేహంలో ఇద్దరు ద్రష్టలు ఉండడం ఎలా కుదురుతుంది? ఇక్కడ అనుపత్తి ఏముంది? "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (వీనికంటె వేరుగా మరొక ద్రష్ట ఎవరూ లేడు) ఇత్యాదిశ్రుతివాక్యం బాధితం అవుతుంది. ఈ వాక్యం ప్రకృతుడైన అంతర్యామికంటె భిన్నుడైన ద్రష్ట, శ్రోత, మంత, విజ్ఞాత అయిన ఆత్మను నిషేదిస్తున్నది కదా? ఈ వాక్యం మరొక నియంత ఎవడూ లేదని

మాత్రమే చెపుతున్నది అనడం యుక్తం కాదు ఎందువల్ల ననగా మరొక నియంత ఉండే ప్రసంగమే లేదు. నియంతయు-, నియంత కానివాడా అనే విశేషం ఏమీ లేకుండా మరొక ద్రష్ట అనేవాడు ఎవడూ లేడు అని చెప్పబడింది కూడ.

దీనికి సమాధానం చెప్పబడుతున్నది - శారీరుణ్ణీ అంతర్యామినీ ఈ విధంగా వేరు వేరుగా చెప్పడం అవిద్యచేత ఏర్పడిన శరీరేంద్రియాదిరూపమైన ఉపాధులను నిమిత్తంగా చేసికొని ఏర్పడినదే గాని పారమార్థికం కాదు. ప్రత్యగాత్మ (శరీరంలో ఉండే ఆత్మ) అనేది ఒకటే ఉంటుంది కాని రెండు ప్రత్యగాత్మ లుండవు కదా? ఉపాధిని పట్టి, ఘటాకాశం, మహాకాశం అన్నట్లు, ఒకే ఆత్మకు భేదవ్యవహారం ఉంటుంది. (ఉపాధికృతమైన) ఈ భేదాన్ని పట్టి తెలుసుకొనే వాడు, తెలియబడేవాడు ఇత్యాదిభేదాలను చెప్పే శ్రుతులు, ప్రత్యక్షాదిప్రమాణాలు, సంసారానుభవం, విధిప్రతిషేధశాస్త్రం ఇదంతా ఉపపన్నం అవుతుంది. అందుచేతనే "యత్ర హి... పశ్యతి" (ఎక్కడ భేదభావం ఉన్నట్లు కనబడుతుందో అక్కడ ఒకడు మరొకణ్ణి చూడడం అనేది ఉంటుంది) అను శ్రుతి (జ్ఞాతృ - జ్ఞేయాది) వ్యవహారం అంతా అవిద్యావిషయంలోనే (అవిద్య ఉన్నప్పుడే) అని చూపుతున్నది. "యత్ర...పశ్యేత్" (వీనికి సర్వమూ ఆత్మయే అయినప్పుడు దేనిని దేనితో చూస్తాడు?) అను శ్రుతి విద్యా విషయంలో ఏ వ్యవహారమూ ఉండదని చూపుతున్నది. 20.

అంతర్యామ్యధికరణం సమాప్తం

## 3. అదృశ్యత్వాధికరణమ్. సూ. 21-23.

## సూ. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః 1.2.21

"అథ పరా యయా తదక్షరమధిగమ్యతే, యత్తద్రేశ్యగ్రాహ్యామ గోత్రమవర్ణమచక్షుఃశ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" (ము. ఉ. 1-1-5, 6) ఇతి శ్రూయతే. తత్ర సంశయః - కిమయమద్రేశ్వత్వాదిగుణకో భూతయోనిః ప్రధానం స్యాత్ ఉత శారీరః అహోస్విత్ పరమేశ్వర ఇతి. తత్ర ప్రధానమచేతనం భూతయోనిరితి యుక్తమ్. అచేతనానామేవ తస్య దృష్టాన్తత్వేనోపాదానాత్

"యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యామోషధయః సంభవన్తి,
యథా సతః పురుషాత్ కేశలోమాని తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్.
(ము.ఉ. 1.1.7) ఇతి.

## బాలానందిని

**అదృశ్యేతి**- "అదృశత్వాదిగుణకః = అదృశ్యత్వం మొదలైన గుణాలు కలవాడు పరమేశ్వరుడే; ధర్మోక్తేః = పరమేశ్వరుని ధర్మాలను చెప్పడం వల్ల" అని సూత్రార్థం.

**అథేతి**:- "అథ... ధీరాః" (కర్మవిద్యారూప మైన అపరవిద్య తరవాత దేనిచేత (ఏ పరవిద్యచేత) ఏది అక్షరమో, ఏది జ్ఞానేంద్రియాలచేత అదృశ్యమో, కర్మేంద్రియాలచేత గ్రహింప శక్యం కాదో, వంశం లేనిదో, వర్ణం లేనిదో, నేత్రాలు చెవులూ లేనిదో, హస్తపాదాలు లేనిదో, నిత్యమో, సర్వసమర్థమో, సర్వవ్యాప్తమో, చాల సూక్ష్మమో,నాశరహితమో, భూతకారణమునుగా దేనిని పండితులు చూస్తారో అట్టిది తెలియబడే పరవిద్య చెప్పబడుతున్నది) అని వినబడుచున్నది. అక్కడ - ఈ అదృశ్యత్వాదిగుణాలు గల భూతకారణం ప్రధానమా లేక జీవుడా లేక పరమాత్మయా అని సంశయం. వీటిలో అచేతనమైన ప్రధానం అని చెప్పడం యుక్తం; ఎందువల్ల ననగా "యథోర్ణనాభిః... విశ్వమ్" అని ఇక్కడ అచేతన మైనదే దృష్టాంతంగా చూపబడింది. "సాలెపురుగు (పట్టుపురుగు) ఏ విధంగా దారం సృజిస్తుందో మరల దానిని తనలోనికి తీసికొంటుందో, పృథివిమీద ఓషధులు ఎట్లు పుడతాయో, జీవించి ఉన్న పురుషునినుంచి కేశాలు, రోమాలు ఎలా పుడతాయో అట్లే ఈ అక్షరంనుండి జగత్తు పుట్టుచున్నది" అని దీని అర్థం.

## భాష్యమ్

ననూర్ణనాభిః పురుషశ్చ చేతనావిహ దృష్టాన్తత్వేనోపాత్తౌ. నేతి బ్రూమః. న హి కేవలస్య చేతనస్య తత్ర సూత్రయోనిత్వం కేశలోమయోనిత్వం చాస్తి. చేతనాధిష్ఠితం హ్యచేతనమూర్ణనాభిశరీరం సూత్రస్య యోనిః, పురుష శరీరం చ కేశలోమ్నామితి ప్రసిద్ధమ్. అపి చ పూర్వత్రాదృష్టత్వాద్యభిలాప సంభవే ఽపి ద్రష్టృత్వాద్యభిలాపాసంభవాన్న ప్రధానమభ్యుపగతమ్. ఇహ తు అదృశ్యత్వాదయో ధర్మాః ప్రధానే సంభవన్తి. న చాత్ర విరుధ్యమానో ధర్మః కశ్చిదప్యభిలప్యతే. నను "యః సర్వజ్ఞః సర్వవిత్" (ము.ఉ.1.1.9) ఇత్యయం వాక్యశేషోఽచేతనే ప్రధానే న సంభవతి; కథం ప్రధానం భూతయోనిః ప్రతిజ్ఞాయత ఇతి. అత్రోచ్యతే - "యయా తదక్షరమధిగమ్యతే", "యత్తదద్రేశ్యమ్" ఇత్యక్షరశబ్దేనాదృశ్యత్వాదిగుణకం భూతయోనిం శ్రావయిత్వా పునరన్తే శ్రావయిష్యతి - "అక్షరాత్పరతః పరః" (ము. ఉ. 2.1.2)

ఇతి. తత్ర యః పరోఽక్షరాచ్చ్యుతః స సర్వజ్ఞః సర్వవిత్సంభవిష్యతి. ప్రధానమేవ త్వక్షరశబ్దనిర్దిష్టం భూతయోనిః. యదా తు యోనిశబ్దః నిమిత్తవాచీ తదా శారీరోఽపి భూతయోనిః స్యాత్, ధర్మాధర్మాభ్యాం భూతజాతస్యోపార్జనాత్ ఇతి.

### బాలానందిని

సన్వితి:- (ప్రశ్న) ఇక్కడ సాలెపురుగు, మనిషి ఇద్దరూ చేతనులే ఉదాహరణగా చూపబడినారు కదా? (సమాధానం) కాదంటాం. కేవలం చేతన మైన సాలెపురుగు దారానికి మనిషి కేశలోమాలకీ కారణం కాదు కదా? చేతనుడైన జీవునిచేత అధిష్ఠితమైన (జీవునితో కూడిన) అచేతనమైన సాలెపురుగు శరీరం సూత్రానికి, మనిషి శరీరం కేశలోమాలకీ కారణం అని ప్రసిద్ధం కదా? మరొక విషయ మేమనగా - వెనుకటి అధికరణంలో అదృష్టత్వం మొదలైనవి ప్రధానం విషయంలో చెప్పడం కుదిరినా ద్రష్టృత్వం మొదలైనవి కుదరవు కాబట్టి ప్రధానం అంగీకరించబడలేదు. ఇక్కడ చెప్పిన అదృశ్యత్వాధిధర్మాలైతే ప్రధానంలో కుదురుతాయి. విరుద్ధమైన ధర్మం ఏదీ ఇక్కడ చెప్పబడలేదు. (ప్రశ్న) - "యః సర్వజ్ఞః సర్వవిత్" అనే వాక్యశేషం అచేతన మైన ప్రధానం విషయంలో కుదరదు. అలాంటప్పుడు ప్రధానం భూతయోని అని ఎట్లు చెప్పబడుతుంది? (సమాధానం) ఇక్కడ చెప్పబడుతున్నది। "యయా తక్షరమధిగమ్యతే", "యత్తదద్రేశ్యమ్" అని అక్షరశబ్దంచేత అదృశ్యత్వాదిగుణాలు గల భూతకారణాన్ని గూర్చి చెప్పి మళ్లీ చివర - "అక్షరాత్ పరతః పరః" (పరమైన అక్షరంకంటె పరం) అని చెప్పనున్నది. అక్కడ అక్షరంకంటె పరుడుగా ఎవడు వినబడుచున్నాడో అతడు సర్వజ్ఞుడు సర్వవేత్త కాగలడు (కావచ్చును). అక్షరశబ్దంచేత నిర్దేశింపబడిన భూతయోని మాత్రం ప్రధానమే. యోనిశబ్దానికి (ఉపాదానకారణం అని అర్థం కాక) నిమిత్తకారణం అని అర్థం చెప్పినట్లయితే శారీరుడు కూడ భూతయోని కావచ్చును. జీవుడు ధర్మాధర్మాలచేత భూతసముదాయాన్ని సంపాదిస్తాడు కదా?

వి. ప్రధానానికి విరుద్ధాలైన ద్రష్టృత్వాదిధర్మాలు కనబడడంవల్ల ప్రధానం అంతర్యామి కాదని పూర్వాధికరణంలో చెప్పబడింది. అయితే ఇక్కడ అలాంటి విరుద్ధ ధర్మా లేవీ వినబడకపోవడంవల్ల అదృశ్యత్వాదిగుణాలు గల భూతయోని ప్రధానం అని చెప్పవచ్చును అని ఈ అధికరణానికి పూర్వాధికరణంతో ప్రత్యుదాహరణసంగతి.

### భాష్యమ్

ఏవం ప్రాప్తేఽభిధీయతే-యోఽయమదృశ్యత్వాదిగుణకో భూతయోనిః స పరమేశ్వర ఏవ స్యాన్నాన్య ఇతి. కథమేతదవగమ్యతే? ధర్మోక్తేః.

పరమేశ్వరస్య హి ధర్మ ఇహోచ్యమానో దృశ్యతే -"యః సర్వజ్ఞః సర్వవిత్" ఇతి. న హి ప్రధానస్యాచేతనస్య శారీరస్య చోపాధిపరిచ్ఛిన్నదృష్టేః సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం వా సంభవతి. నన్వక్షరశబ్దనిర్దిష్టాద్భూతయోనేః పరస్యైవ తత్సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం చ, న భూతయోనివిషయమిత్యుక్తమ్. అత్రోచ్యతే-నైవం సంభవతి. యత్కారణమ్ - "అక్షరాత్సంభవతీహ విశ్వమ్" ఇతి ప్రకృతం భూతయోనిమిహ జాయమానప్రకృతిత్వేన నిర్దిశ్యానన్తరమపి జాయమానప్రకృతిత్వేనైవ సర్వజ్ఞం నిర్దిశతి-

"యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః

తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే" ఇతి.

తస్మాన్నిర్దేశసామ్యేన ప్రత్యభిజ్ఞాయమానత్వాత్ ప్రకృతస్యైవాక్షరస్య భూతయోనేః సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం చ ధర్మ ఉచ్యతే ఇతి గమ్యతే.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా (సిద్ధాంతం) చెప్పబడుచున్నది. అదృశ్యత్వాదిగుణాలు గల ఈ భూతకారణం ఏది గలదో అది పరమేశ్వరుడే కాని మరేదీ కాదు. ఇది ఎట్లు తెలుస్తూన్నది? ధర్మాలను చెప్పడంవల్ల. ఇక్కడ "యః సర్వజ్ఞః సర్వవిత్" (సాధారణరూపంలో అన్నీ తెలిసినవాడు సర్వజ్ఞుడు; విశేషరూపంలో అన్నీ తెలిసిన వాడు సర్వవిద్) అని పరమేశ్వరుని ధర్మం ఇక్కడ చెప్పబడుచు కనబడుచున్నది. అచేతనమైన ప్రధానానికి గాని, ఉపాధిచేత సంకుచిత మైన జ్ఞానం గల శారీరకునికి గాని సర్వజ్ఞత్వం గాని సర్వవిత్త్వం గాని సంభవించదు గదా? (ప్రశ్న) అక్షరశబ్దంచేత నిర్దిష్టమైన భూతయోనికంటె పరమైనవానికే ఆ సర్వజ్ఞత్వమూ, సర్వవిత్త్వమూ చెప్పబడ్డాయి గాని భూతయోనికి చెప్పబడలేదు అని చెప్పాం కదా? ఇక్కడ చెప్పబడుచున్నది. ఇది కుదరదు. ఎందువల్ల ననగా - ఇక్కడ ప్రకృతమైన భూతయోనినే పుట్టేవాటి కన్నింటికీ ప్రకృతినిగా (ఉపాదానకారణంగా) "అక్షరాత్సంభవతీహ విశ్వమ్" అని చెప్పి తరవాత కూడ "యః... జాయతే" (ఎవడు సర్వజ్ఞుడో, సర్వవిదుడో, ఎవని తపస్సు జ్ఞానమయమైనదో, వానినుండియే ఈ కార్యమూ, సూక్ష్మాత్మకమైన బ్రహ్మ, నామం, రూపం, అన్నమూ పుట్టుచున్నది) అని సర్వజ్ఞుణ్ణి పుట్టుచున్నదానికి ప్రకృతినిగానే చెప్పుచున్నది. అందుచేత నిర్దేశించడంలో ఉన్న సామ్యంచేత ప్రత్యభిజ్ఞాయమానమగుటవలన (అదే ఇది అని

గుర్తించబడడంవల్ల) ప్రకృత మైన భూతయోని యైన అక్షరానికే సర్వజ్ఞత్వం సర్వవిత్త్వం అనే ధర్మాలు చెప్పబడుచున్నవి అని తెలుస్తూన్నది.

## భాష్యమ్

"అక్షరాత్ పరతః పరః" ఇత్యత్రాపి న ప్రకృతాద్భూతయోనేః అక్షరాత్పరః కశ్చిదభిధీయతే. కథమేతదవగమ్యతే? "యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మ విద్యామ్" (ము.ఉ. 1.2.13) ఇతి ప్రకృత్య తస్యైవాక్షరస్య భూతయోనేరదృశ్యత్వాదిగుణకస్య వక్తవ్యత్వేన ప్రతిజ్ఞాతత్వాత్. కథం తర్హి "అక్షరాత్పరతః పరః" ఇతి వ్యపదిశ్యత ఇతి. ఉత్తరసూత్రే తద్వక్ష్యామః. అపి చాత్ర ద్వే విద్యే వేదితవ్యే ఉక్తే - "పరా చైవా పరా చ" ఇతి. తత్రాపరామృగ్వేదాదిలక్షణాం విద్యాముక్త్వా బ్రవీతి - "అథ పరా యయా తదక్షరమధిగమ్యతే" ఇత్యాది. తత్ర పరస్యా విద్యాయాః విషయత్వేన అక్షరం శ్రుతమ్. యది పునః పరమేశ్వరాదన్యద దృశ్యత్వాదిగుణకమక్షరం పరికల్ప్యేత నేయం పరా విద్యా స్యాత్ - పరాపరవిభాగో హ్యయం విద్యయోరభ్యుదయనిఃశ్రేయసఫలతయా పరికల్ప్యతే. న చ ప్రధానవిద్యా నిఃశ్రేయసఫలా కేనచిదభ్యుపగమ్యతే. తిస్రశ్చ విద్యాః ప్రతిజ్ఞాయేరన్, త్వత్పక్షేఽక్షరాద్భూతయోనేః పరస్య పరమాత్మనః ప్రతిపాద్యమానత్వాత్. ద్వే ఏవ తు ద విద్యే వేదితవ్యే ఇహ నిర్దిష్టే. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ము.ఉ. 1.1.3) ఇతి చైకవిజ్ఞానేన సర్వవిజ్ఞానాపేక్షణం సర్వాత్మకే బ్రహ్మణి వివక్ష్యమాణేఽవకల్ప్యతే, నాచేతనమాత్రైకాయతనే ప్రధానే, భోగ్యవ్యతిరేక్తే వా భోక్తరి.

## బాలానందిని

అక్షరాదితి:- "అక్షరాత్పరతః పరః" అనే చోట గూడ భూతయోని యైన ప్రకృత మైన అక్షరంకంటె పరమైనవాడెవడూ చెప్పబడడం లేదు. ఇది ఎలా తెలుస్తూన్నది? "యేన... విద్యామ్" (దేనిచేత వినాశరహితుడైన సత్యమైన పురుషుణ్ణి తెలుసుకొన్నాడో అలాంటి బ్రహ్మవిద్యను యథార్థరూపంలో చెప్పాడు) అని ప్రారంభించి భూతయోని, అదృశ్యత్వాదిగుణాలు గలది అయిన అక్షరమే చెప్పదగినదిగా ప్రతిజ్ఞ చేయబడింది (నిర్దేశించబడింది) గాన ఇట్లు తెలుస్తూన్నది. అయితే "అక్షరాత్పరతః పరః" అని

ఎట్లు నిర్దేశించబడింది? ఆ విషయం రాబోయే సూత్రంలో చెపుతాం. మరొక విషయ మేమనగా -ఇక్కడ 'పరా', 'అపరా' అనే రెండు విద్యలు తెలియదగినవిగా చెప్పబడ్డాయి. వాటిలో అపరవిద్యమైన ఋగ్వేదాదిస్వరూపమైన విద్యను చెప్పి - "అథ పరా యయా తదక్షరమధిగమ్యతే" ఇత్యాదికం చెప్పబడుతూన్నది. అక్కడ అక్షరం పరవిద్యకు విషయంగా వినబడింది. పరమేశ్వరునికంటె భిన్నమైన మరొకటి ఏదైనా అదృశ్యత్వాదిగుణాలు గల అక్షరం అని కల్పిస్తే అప్పు డిది పరవిద్య కాజాలదు. ఇది పరవిద్య, ఇది అపరవిద్య అనే విభాగం అభ్యుదయ - నిఃశ్రేయసఫలభేదాన్ని పట్టి కదా కల్పించబడింది. (అభ్యుదయం అనగా ఐహికం లేదా పారలౌకికమైన అభివృద్ధి, నిఃశ్రేయసం అనగా మోక్షం. అభ్యుదయాన్ని ఇచ్చేది అపరవిద్య. మోక్షం ఇచ్చేది పరవిద్య). ప్రధానానికి సంబంధించిన విద్యకు ఫలం మోక్షం అని ఎవరూ అంగీకరించరు కదా? నీ పక్షంలో భూతయోని యైన అక్షరంకంటె పరుడైన పరమాత్మ ప్రతిపాదంచబడుతున్నాడు గాన (అపరవిద్య, ప్రధానవిద్య - పరవిద్య అని) మూడు విద్య లున్నా యని చెప్పబడి ఉండేది. కాని ఇక్కడ రెండు విద్యలు మాత్రమే నిర్దేశించబడ్డాయి. "కస్మిన్ను... భవతి" (ఓ పూజ్యుడా, దేనిని తెలుసుకుంటే ఇదంతా తెలిసిపోతుంది) అని ఒక దానిని తెలుసుకొనడంవల్ల సర్వజ్ఞానాన్ని కోరడం అనేది సర్వాత్మక మైన బ్రహ్మ వివక్షిత మైనప్పుడే (చెప్పడానికి ఉద్దేశింపబడినప్పుడే) కుదురుతుంది గాని కేవలం అచేతనాలకు మాత్రమే నిలయమైన అనగా ఉపాదానకారణమైన ప్రధానం వివక్షిత మైనా, భోగ్యవస్తువులకంటె భిన్నుడైన భోక్త (శారీరకుడు) వివక్షితు డైనా కుదరదు.

## భాష్యమ్

అపి చ - "స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠామథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ' ' (ము. ఉ. 1.1.1) ఇతి, బ్రహ్మవిద్యాం ప్రాధాన్యేనోపక్రమ్య పరాపరవిభాగేన పరాం విద్యామక్షరాధిగమనీం దర్శయంస్తస్యా బ్రహ్మవిద్యాత్వం దర్శయతి. సా చ బ్రహ్మవిద్యాసమాఖ్యా తదధిగమ్యస్యాక్షరస్యాబ్రహ్మత్వే బాధితా స్యాత్. అపరర్గ్వేదాది లక్షణా కర్మవిద్యా బ్రహ్మవిద్యోపక్రమ ఉపన్యస్యతే బ్రహ్మవిద్యాప్రశంసాయై -

"ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం తేషు కర్మ,

ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపియన్తి" (ము.ఉ.1.2.7) ఇత్యేవమాదినిన్దావచనాత్. నిన్దిత్వా చాపరాం విద్యాం తతో విరక్తస్య పర విద్యాధికారం దర్శయతి -

"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" (ము.ఉ. 1.2.22) ఇతి. యత్తూక్తమ్ - అచేతనానాం పృథివ్యాదీనాం దృష్టాన్తత్వేనోపాదానాత్ దార్ష్టాన్తికేనాపి అచేతనేవ భూతయోనినా భవితవ్యమ్ ఇతి, తదయుక్తమ్. న హి దృష్టాన్త దార్ష్టాన్తికయోరత్యన్తసామ్యేన భవితవ్యమితి నియమోఽ స్తి. అపి చ స్థూలాః పృథివ్యాదయో దృష్టాన్తత్వేనోపాత్తా ఇతి న స్థూల ఏవ దార్ష్టాన్తికో భూతయోనిరిత్యభ్యుపగమ్యతే. తస్మాదదృశ్యత్వాది గుణకో భూతయోనిః పరమేశ్వర ఏవ. 21.

## బాలానందిని

అపి చేతి:- మరొక విషయ మేమనగా - "స... ప్రాహ" (అతడు సర్వవిద్యలకు ప్రతిష్ఠయైన, సమాప్తిస్థానమైన) బ్రహ్మవిద్యను జ్యేష్ఠపుత్రుడైన అథర్వణునికి బోధించాడు) అని ప్రధానంగా బ్రహ్మవిద్యను గూర్చి ఉపక్రమించి పరవిద్య అపరవిద్య అని విభజించి, పరవిద్య అక్షరాన్ని బోధిస్తుంది అని చూపుతూ అదే బ్రహ్మవిద్య అని చూపుతున్నది. ఆ విద్యచేత తెలియదగిన అక్షరం బ్రహ్మ కాని పక్షంలో బ్రహ్మవిద్య అనే పేరు బాధితం అవుతుంది. (కుదరకుండ పోతుంది). "ప్లవా... అపియన్తి" (వేటియందు జ్ఞానరహితమవడంచేత తక్కువ తరగతికే చెందిన కర్మ చెప్పబడిందో అట్టి, యజ్ఞనిర్వహణోపయుక్తా లైన ఈ పద్దెనిమిదీ (పదహారుగురు ఋత్విక్కులు, యజమానుడు, పత్ని అను పద్దెనమండుగురు), దృఢం కానివి, అనిత్య మైనవి. మూఢులైన ఎవరు శ్రేయస్కరమైన ఈ జ్ఞానమార్గాన్ని నిందిస్తారో వాళ్ళు మాటిమాటికి జరామరణాలు పొందుతూంటారు) ఇత్యాదివిధంగా నిందించడంవల్ల (నిందిస్తూ) ఋగ్వేదాదిలక్షణమైన అపరవిద్య, బ్రహ్మవిద్యను ప్రశంసించడం కోసం బ్రహ్మవిద్యాప్రారంభంలో చెప్పబడింది. ఈ విధంగా అపరవిద్యను నిందించి దానినుండి వైరాగ్యం చెందినవానికి "పరీక్ష్య... బ్రహ్మనిష్ఠమ్" (బ్రాహ్మణుడు కర్మలచేత సంపాదించబడిన లోకాలను పరీక్షించి చూచి వైరాగ్యం పొందాలి. చేయబడే కర్మచేత నిత్యమైన మోక్షం లేదు. ఆ బ్రహ్మను తెలుసుకొనడం కొరకు సమిధలు చేతిలో పట్టుకొని (గురువుకు ఉపాయనంగా ఇవ్వడం కోసం) శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురువు వద్దకు వెళ్లాలి) అని పరవిద్యయందు అధికారాన్నిచూపుతున్నది. అచేతనాలైన పృథివ్యాదులను దృష్టాంతంగా చూపడంచేత దార్ష్టాంతికమైన (దేనిని విశదీకరించడానికి మరొకటి దృష్టాంతంగా చూడబడుతుందో అది దార్ష్టాంతికం) భూతయోని కూడ అచేతనమే కావాలి అని ఏది చెప్పబడిందో అది

యుక్తం కాదు. దృష్టాంతానికి దార్ష్టాంతికానికీ మధ్య పూర్తిగా సామ్యం (పోలిక) ఉండాలని నియమం లేదు కదా? మరియు - స్థూలాలైన (ఇంద్రియగ్రాహ్యాలైన) పృథివ్యాదులు (దృష్టాంతంగా చూపబడ్డాయి కదా అని దార్ష్టాంతికమైన భూతయోని కూడ స్థూలంగానే ఉంటుం దని అంగీకరించబడదు కదా? అందువల్ల అదృశ్యత్వాదిగుణాలున్న భూతయోని పరమేశ్వరుడే. 21.

## సూ. విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ. 1.2.22.

ఇతశ్చ పరమేశ్వర ఏవ భూతయోనిర్నేతరౌ శారీరః ప్రధానం వా. కస్మాత్? విశేషణభేదవ్యపదేశాభ్యామ్. విశినష్టి హి ప్రకృతం భూతయోనిం శారీరాద్విలక్షణత్వేన - "దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యన్తరో హ్యజః, అప్రాణో హ్యమనాః శుభ్రః'' (ము.ఉ.2.1.2) ఇతి. న హ్యేతద్దివ్యత్వాదివిశేషణమవిద్యాప్రత్యుపస్థాపితనామరూప పరిచ్ఛేరాభిమానినస్తద్ధర్మాన్ స్వాత్మని కల్పయతః శారీరస్యోపపద్యతే. తస్మాత్సాక్షాదౌపనిషదః పురుష ఇహోచ్యతే. తథా ప్రధానాదపి ప్రకృతం భూతయోనిం భేదేన వ్యపదిశతి - "అక్షరాత్ పరతః పరః" ఇతి. అక్షరమవ్యాకృతం నామరూపబీజశక్తిరూపం భూతసూక్ష్మమీశ్వరాశ్రయం, తస్యైవోపాధిభూతం, సర్వస్మాద్వికారాత్పరో యో వికారస్తస్మాత్పరతః పరం ఇతి భేదేన వ్యపదేశాత్ పరమాత్మానమిహ వివక్షితం దర్శయతి. నాత్ర ప్రధానం నామ కిం చిత్స్వతన్త్రం తత్త్వమభ్యుపగమ్య తస్మాద్భేదవ్యపదేశ ఉచ్యతే. కిం తర్హి? యది ప్రధానమపి కల్ప్యమానం శ్రుత్యవిరోధేన అవ్యాకృతాదిశబ్దవాచ్యం భూతసూక్ష్మం పరికల్ప్యేత పరికల్ప్యతామ్. తస్మాద్భేదవ్యవదేశాత్పరమేశ్వరో భూతయోనిరిత్యేతదిహ ప్రతిపాద్యతే. 22

### బాలానందిని

విశేషణేతి:- "విశేషణభేదవ్యపదేశాభ్యామ్ = విశేషణంచేతను అనగా విశేషం చెప్పడంచేతను, భేదం చెప్పడంచేతను, ఇతరౌ = జీవప్రధానులు, న = భూతయోని కాదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ భూతయోని పరమేశ్వరుడే; శారీరుడు గాని ప్రధానంగాని కాదు. ఎందువలన? విశేషణభేదవ్యపదేశాలవల్ల. ప్రకృత మైన భూతయోనిని శారీరునికంటె విలక్షణంగా (వేరు స్వభావం కలవానినిగా) "దివ్యో...

శుభ్రః" (అతడు స్వయంప్రకాశుడు, పూర్ణుడు, శరీరంలో ఉండేవాడు, బాహ్యమైన స్థూలశరీరంతోను అభ్యంతరమైన సూక్ష్మశరీరంతోను వాటికి అధిష్ఠానంగా ఉన్నవాడు. జన్మ లేనివాడు, ప్రాణరహితుడు, మనస్సు లేనివాడు, పరిశుద్ధుడు) అని చెప్పుచున్నది. అవిద్యచేత ఏర్పడిన నామరూపపరిచ్ఛేదం (విభాగం) మీద అభిమానం కలవాడు, వాటి ధర్మాలను తనమీద కల్పించుకుంటూన్నవాడూ అయిన శారీరునికి ఈ దివ్యత్వాదివిశేషణాలు కుదరవు కదా? అందువల్ల ఇక్కడ సాక్షాత్తు ఔపనిషదు డైన పురుషుడే చెప్పబడుతున్నాడు. అట్లే ప్రకృతమైన భూతయోనిని 'అక్షరాత్పరతః పరః' అని ప్రధానంకంటె వేరుగా నిర్దేశిస్తూన్నది. అక్షరం అనగా నామరూపాలకి బీజమైనది. ఈశ్వరశక్తిరూపమైనది. భూతముల సూక్ష్మాలతో అనగా సంస్కారాలతో కూడినది, ఈశ్వరుడు ఆశ్రయంగా గలది, ఆ ఈశ్వరునికే ఉపాధియైన అవ్యాకృతం (సృష్టికి పూర్వం జగత్తుయొక్క, ఈశ్వరునియందు నిలీనమై ఉన్న పూర్వావస్థ). అది సమస్తవికారం (కార్యప్రపంచం) కంటె పర మైనది. అవికారమైన స్థితి. ఈ విధంగా వికారపరమైన ఆ అక్షరంకంటె పరమైనవాడు పరమేశ్వరుడు అని భేదంచేత (దానికంటె భిన్నుణ్ణిగా) నిర్దేశించుటచేత ఇక్కడ వివక్షిత మైనది పరమాత్మయే అని చూపుతున్నది. అయితే ఇక్కడ ప్రధానం అనే ఒక స్వతంత్రమైన తత్త్వాన్ని అంగీకరించి దానికంటె భేదం చెప్పబడింది అని చెప్పడం లేదు. మ రేమనగా - అవ్యాకృతం మొదలైన శబ్దాలచేత చెప్పబడే భూతసూక్ష్మావస్థను ఒకదానిని శ్రుతికి విరోధం లేకుండా కల్పించి దానికి ప్రధానం అని పేరు పెట్టినా ఆ విధంగా కల్పిస్తే కల్పించవచ్చు (అనగా సాంఖ్యులు చెప్పిన ప్రధానానికి ఈ అక్షరం అని చెప్పబడే అవ్యక్తానికీ స్వభావంలో ఏమీ పోలికలేదు. ఇది పూర్తిగా పరమేశ్వరాధీన మైనది. అస్వతంత్రం. సృష్టికి పూర్వావస్థ అనే సాదృశ్యాన్ని మాత్రం పురస్కరించుకొని ప్రధానం అని పేరు పెట్టుకొన్నా మా కభ్యంతరం లేదు). తస్మాదితి:- అలాంటి అక్షరంకంటె భేదం చెప్పడంవల్ల ఇక్కడ పరమేశ్వరుడే భూతయోనిగా ప్రతిపాదించబడుచున్నాడు. 22

## భాష్యమ్

కుతశ్చ పరమేశ్వరో భూతయోనిః?

### సూ. రూపోపన్యాసాచ్చ 1.2.23.

ముం. 2-1-3

అపి చ "అక్షరాత్పరతః పరః" ఇత్యస్యానన్తరం "ఏతస్మాజ్జాయతే ప్రాణః" ఇతి ప్రాణప్రభృతీనాం పృథివీపర్యన్తానాం తత్త్వానాం సర్గముక్త్వా తస్యైవ భూతయోనేః సర్వవికారాత్మకం రూపముపన్యస్యమానం పశ్యామః—

"అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః,
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్తరాత్మా" (ము.ఉ.2.1.4.) ఇతి. తచ్చ పరమేశ్వరస్యైవోచితమ్; సర్వవికారకారణత్వాత్. న శారీరస్య తనుమహిమ్నః. నాపి ప్రధానస్యాయం రూపోపన్యాసః సంభవతి; సర్వభూతాన్తరాత్మత్వాసంభవాత్. తస్మాత్పరమేశ్వర ఏవ భూతయోనిర్నే తరావితి గమ్యతే. కథం పునర్భూతయోనేరయం రూపోసన్యాస ఇతి గమ్యతే? ప్రకరణాత్. ఏషః ఇతి చ ప్రకృతానుకర్షణాత్. భూతయోనిం హి ప్రకృత్య "ఏతస్మాజ్జాయతే ప్రాణః" "ఏష సర్వభూతాన్తరాత్మా" ఇతి వచనం భూతయోని విషయమేవ భవతి. యథోపాధ్యాయం ప్రకృత్యైతస్మాదధీష్వైష వేదవేదాఙ్గపారగ ఇతి వచనముపాధ్యావిషయం భవతి తద్వత్. కథం పునరదృశ్యత్వాదిగుణకస్య భూతయోనేర్విగ్రహవద్రూపం సంభవతి? సర్వాత్మత్వవివక్షయేదముచ్యతే న తు విగ్రహవత్త్వవివక్షయేత్యదోషః; "అహమన్నమహమన్నాదః (తై.ఉ.3.10.6) ఇతి వత్.

బాలానందిని

కుత ఇతి:- మరి ఏ కారణంవల్ల కూడ భూతయోని పరమేశ్వరుడు?
రూపేతి:- "రూపోపన్యాసాచ్చ= ఆ భూతయోనియొక్క రూపాన్ని చెప్పడంవల్ల కూడ భూతయోని పరమేశ్వరుడు" అని సూత్రార్థం.

అపి చేతి:- మరియు - "అక్షరాత్పరతః పరః" అనేదాని తరవాత "ఏతస్మాజ్జాయతే ప్రాణః" (దీనినుండి ప్రాణం పుట్టుచున్నది) అని ప్రాణం మొదలు పృథివివరకు ఉన్న తత్త్వాల సృష్టిని చెప్పి సర్వకార్యాత్మకమైన ఆ భూతయోనియొక్క రూపమే "అగ్నిర్మూర్ధా... అన్తరాత్మా" (అగ్ని దీని శిరస్సు చంద్రసూర్యులు నేత్రాలు, దిక్కులు చెవులు, వాక్కునుండి వేదాలు వివరించబడ్డాయి. వాయువు ప్రాణం; జగత్తు హృదయం. పృథివి పాదాలు, ఈ విధంగా అతడు సర్వభూతాంతరాత్మ) అని చెప్పడం చూస్తున్నాం. అది సర్వవికారాలకు కారణం అవడంచేత పరమేశ్వరునికే తగి ఉన్నది; అంతేనే కాని అత్యల్పమైన మహిమ గల శారీరునకు తగదు. ప్రధానం సర్వభూతాంతర్మాత్మ కాజాలదు గాన ఇది ప్రధానానికి సంబంధించిన రూపోపన్యాసం కూడ కాదు. అందువల్ల భూతయోని పరమేశ్వరుడే కాని ఇతరులు (జీవ-ప్రధానాలు)కావు అని తెలుస్తూన్నది. ఇది భూతయోని యొక్క రూపోపన్యాసం అని ఎలా తెలుస్తూన్నది?

ప్రకరణాన్ని పట్టి తెలుస్తూన్నది. "ఏషః" అని ప్రకృత మైనది అనుకర్షింపబడుతుంది. అందుచేత భూతయోనిని గూర్చి చెప్పడం ప్రారంభించి, "ఏతస్మాజ్జాయతే ప్రాణః" "ఏష సర్వభూతాన్తరాత్మా" అని చెప్పినది భూతయోనిని గూర్చినదే అవుతుంది. ఒక ఉపాధ్యాయుణ్ణి చూసి చెపుతూ వీని దగ్గర చదువుకో; ఇతడు వేదవేదాంగపారంగతుడు అని చెప్పినది ఏ విధంగా ఆ ఉపాధ్యాయుణ్ణి గూర్చి చెప్పినదే అవుతుందో అట్లే. అదృశ్యత్వాదిగుణాలు గల భూతయోనికి విగ్రహం (శరీరం) ఉన్న రూపం ఎట్లు ఉంటుంది? ఈ భూతయోని సర్వాత్మకుడు అని చెప్పా లనే అభిప్రాయంతో ఇలా చెప్పబడుతున్నది గాని దీనికి శరీరం ఉంది అని చెప్పాలనే ఉద్దేశ్యంతో కాదు. "అహమన్నమహమన్నాదః" (నేనే అన్నం నేనే అన్నం తినేవాడను) ఇత్యాదివచనం ఎట్లో ఇది అట్లే.

## భాష్యమ్

అన్యేపునర్మన్యన్తే - నాయంభూతయోనే రూపోపన్యాసః జాయ మానత్వేనోపక్రమాత్ -

"ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః కర్మేన్ద్రియాణి చ"
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ"

ఇతి హి పూర్వత్ర ప్రాణాదిపృథివ్యన్తం తత్త్వజాతం జాయమానత్వేన నిరదిక్షత్. ఉత్తరత్రాపి చ "తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః" ఇత్యేవమాది, "అతశ్చ సర్వా ఓషధయో రసాశ్చ" ఇత్యేవమన్తం జాయమానత్వేనైవ నిర్దేక్ష్యతి. ఇహైవ కథమకస్మాదన్తరాలే భూతయోనే రూపముపన్యసేత్? సర్వాత్మత్వమపి సృష్టిం పరిసమాప్యోపదేక్ష్య తి "పురుష ఏవేదం విశ్వం కర్మ" (ము.ఉ.2.1.10) ఇత్యాదినా. శ్రుతిస్మృత్యోశ్చ త్రైలోక్యశరీరస్య ప్రజాపతేః జన్మాది నిర్దిశ్యమానముపలభామహే -

"హిరణ్యగర్భః షమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్"
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ (ఋ.సం.10.12.11)

ఇతి. సమవర్తత్యేత్యజాయతేత్యర్థః. తథా -

"స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే" P. 1150.
ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" ఇతి చ.
వికారపురుషస్యాపి సర్వభూతాన్తరాత్మత్వం సంభవతి, ప్రాణాత్మనా సర్వభూతానామధ్యాత్మమవస్థానాత్. అస్మిన్ పక్షే "పురుష ఏవేదం విశ్వం కర్మ" ఇత్యాది సర్వరూపోపన్యాసః పరమేశ్వరప్రతిపత్తిహేతురితి వ్యాఖ్యేయమ్.

బాలానందిని

అన్యే ఇతి:- కొందరైతే ఇలా అనుకొంటున్నారు. ఇది భూతయోనియొక్క రూపం చెప్పడం కాదు; ఎందువల్ల ననగా ఇక్కడ(హిరణ్యగర్భుడు) పుట్టుచున్నట్లు చెప్పబడుచున్నది. "ఏతత్మాత్... ధారిణీ" (ఈ భూతయోనినుండి ప్రాణం, మనస్సు, సర్వేంద్రియాలు ఆకాశం, వాయువు, అగ్ని, ఉదకం, ప్రపంచకాన్ని ధరించే పృథివి పుట్టుచున్నాయి) అని వెనుక ప్రాణం మొదలు పృథివి వరకు ఉన్న తత్త్వాలన్నీపుట్టి నట్లు చెప్పింది. తరవాత కూడ "తస్మాత్... సూర్యః" (దానినుంచి అగ్ని, ఏ ద్యులోకానికి సూర్యడు సమిధలో అట్టి ద్యులోకం) అని మొదలు, "అతశ్చ...రసాశ్చ" (దీనినుండి సమస్తమైన ఔషధాలు రసాలు) అనేదాని వరకు పుట్టుచున్నట్లే చెప్పనున్నది. అకస్మాత్తుగా ఇక్కడనే మధ్యలో భూతయోనియొక్క రూపం ఎలా చెపుతుంది? సృష్టినిగూర్చి చెప్పడం పూర్తి చేసిన తరవాత "పురుష...కర్మ" (ఈ సమస్తకర్మ పురుషుడే) అనేది మొదలుకొని సర్వాత్మత్వాన్ని కూడ చెప్పనున్నది. మూడు లోకాలు శరీరంగా గల ప్రజాపతియొక్క జన్మాదికం శ్రుతులలోను స్మృతులలోను నిర్దేశించబడుచున్నట్లు చూస్తున్నాం- "హిరణ్యాగర్భః... విధేమ" (అన్నింటికంటె ముందు హిరణ్యాగర్భుడు పుట్టాడు. అత డొక్కడే ఈ భూతసముదాయాని కంతకీ పతి అయ్యాడు, అతడే ఈ పృథివిని ద్యులోకాన్ని ధరించాడు. ఆ ఒక్క దేవునికి హవిస్సు సమర్పిస్తాము) అని శ్రుతి చెపుచున్నది. సమవర్తత అనగా పుట్టెను అని అర్థం. అట్లే 'స వై... సమవర్తత' (అతడే మొట్టమొదటి శరీరధారి అనీ పురుషు డనీ చెప్పబడుతున్నాడు. సమస్తభూతాల మొట్టమొదటి కర్త అయిన ఆ బ్రహ్మ (హిరణ్యగర్భుడు) అన్నింటికంటె ముందు పుట్టాడు) అని (స్మృతి చెప్పుచున్నది). వికారపురుషుడు కూడ (కార్యమైన హిరణ్యగర్భుడు కూడ) ప్రాణరూపంలో సకలప్రాణుల శరీరాలలో ఉండడంవల్ల సర్వభూతాత్మరాత్మ అని చెప్పడం కుదురుతుంది. ఈ పక్షంలో "పురుష ఏవేదం విశ్వకర్మ' (ఈ సమస్త మైన శ్రౌతస్మార్తాదికకర్మ పురుషుడే) ఇత్యాదివాక్యంచేత చెప్పబడిన సర్వరూపోపన్యాసం భూతయోని పరమేవ్వరుడే అని గ్రహించడానికి హేతువు అని వాఖ్యానించాలి.

వి. "ఏతస్మాజ్జాయతే ప్రాణః" ఇత్యాదికం భూతయోనియొక్క రూపాన్ని చెపుతున్నది అని ముందు వాఖ్యానించి "అన్యే పునర్మన్యన్తే" ఇత్యాదిభాష్యంలో ఇవి సృష్టిని భోదించే వాక్యాలే కాని భూతయోని రూపాన్ని భోధించేవి కావు అని కొందరి మతం అన్నట్లు చెప్పి ఆ పక్షంలో "పురుష ఏవేదం విశ్వం కర్మ" ఇత్యాదివాక్యాలు భూతయోనిరూపప్రతిపాదకా లని గ్రహించా లని చెప్పబడింది. రెండవ మతమే యుక్తం అన్నట్లు భామతీకారుడు సూచించి ఉన్నాడు. మొదటిది వృత్తికారమత మనీ రెండవది భాష్యకారమత మనీ రత్నప్రభాకారుడు వ్రాశాడు. కాని మొదటిమతమే భాష్యకారసంమతః మని బ్రహ్మవిద్యాభరణకారుల అభిప్రాయం.23

అదృశ్యత్వాధికరణం సమాప్తం

## 7. వైశ్వానరాధికరణమ్. సూ. 24-32

### సూ. వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్ 1.2.24.

"కో న ఆత్మా కిం బ్రహ్మ" ఇతి, "ఆత్మానమేవేమం వైశ్వానరం సంప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహి" (ఛా.ఉ.5.11.1,6) ఇతి చోపక్రమ్య ద్యుసూర్యవాయ్వాకాశకారిపృథివీనాం సుతేజస్త్వాదిగుణయోగ మేకైకోపాసననిన్దయా చ వైశ్యానరం ప్రత్యేషాం మూర్ధాదిభావముపది శ్యామ్నాయతే "యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి తస్య హి వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహులో బస్తిరేవ రయిః పృథివ్యేవ పాదౌ ఉర ఏవ వేదిర్లోమాని బర్హి ర్హృదయం గార్హపత్యోమనోఽన్వాహార్యపచన ఆస్యమాహవనీయః' '(ఛా.ఉ.5.182) ఇత్యాది. తత్ర సంశయః- కిం వైశ్వానరశబ్దేన జాఠరోఽ గ్నిరుపదిశ్యతే ఉతఽభూతాగ్నిః, అథ తదభిమానినీ దేవతా, అథవా శారీరః, ఆహోస్విత్పరమేశ్వర ఇతి. కిం పునరత్ర సంశయకారణమ్? వైశ్వానర ఇతి జాఠరభూతాగ్నిదేవతానాం సాధారణశబ్దప్రయోగాత్, ఆత్మేతి చ శారీరపరమేశ్వరయోః. తత్ర కస్యోపాదానం న్యాయ్యం కస్య వా హానమితి భవతి సంశయః.

## బాలానందిని

అవ. ప్రాచీనశాల - సత్యయజ్ఞ - ఇంద్రద్యుమ్న - జనక - బుడిలులు అనే ఐదుగురు కలిసి, మన ఆత్మ ఏది బ్రహ్మ ఏది? అని మీమాంస చేశారు. వాళ్లు ఇద్దుగురు కలిసి ఉద్దాలకుని దగ్గరికి వెళ్లారు. ఆతనికి సరిగా తెలియకపోవడంచేత ఆ ఐదుగురూ కలిసి కేకయదేశరాజైన అశ్వపతి దగ్గరికి వెళ్లి - ఏ ఆత్మను గూర్చి నీకు తెలుసునో ఆ ఆత్మను గూర్చి చెప్పుము అని ఆతనిని ఆడిగారు. అయితే అతడు సువ్వు దేనిని ఆత్మగా ఉపాసిస్తున్నావు అని వాళ్లను ఒక్కొక్కరినీ అడిగాడు. అప్పుడు ప్రాచీనశాలుడు మొదలైనవాళ్లు వరసగా తాము ద్యులోక - వైశ్వానర -ఆదిత్య - వాయు - ఆకాశ - అప్ - పృథివులను ఉపాసిస్తున్నట్లు చెప్పారు. అప్పు డా రాజు ద్యులోక- సూర్యాదులు అరింటికీ వరసగా సుతేజస్త్వ - విశ్వరూపత్వ - పృథగ్వర్త్మాత్మత్వ - బహులత్వ - రయిత్వ - ప్రతిష్ఠాత్వా లనే గుణా లున్నట్లు చెప్పి మీరు నన్ను అడగకుండగా పరమాత్మ యైన వైశ్వానరుని అంగా లైన ద్యుసూర్యాదులనే వైశ్వానరుడుగా భావించి ఉపాసించిన ట్లయితే అప్పుడు వరుసగా మీకు శిరస్సు పడి పోవడం, అంధత్వం, ప్రాణాలు పోవడం, దేహం శిథిలం అయిపోవడం, మూత్రభస్త్రిక పగిలిపోవడం, పాదాలు ఎండిపోవడం జరిగి ఉండేవి అని అంగాలను ప్రత్యేకంగా ఉపాసించడాన్ని నిందించి సుతేజస్త్వం అనే గుణం గల ద్యులోకం ఆత్మయైన ఈ వైశ్వారుని శిరస్సు, విశ్వరూపత్వం అనే గుణం గల సూర్యుడు నేత్రం ఇత్యాదిరీతిలో ద్యుసూర్యాదులు మూర్ధాదు లని చెప్పి సమస్తవైశ్వానరధ్యానవిధానాన్ని బోధించాడు. ఆ వైశ్వానరుడు ఎవరు అనే విషయంఈ అధికరణంలో చర్చించబడుతున్నది.

కో న ఇతి:- "కో న ఆత్మా కిం బ్రహ్మ" (మన ఆత్మ ఎవరు, బ్రహ్మ ఏది) అనీ "ఆత్మానమ్....బ్రూహి" ( నువ్వు అధ్యయనం చేసిన ఆత్మయైన ఈ వైశ్వానరుణ్ణి గూర్చి మాకు చెప్పు) అనీ ఉపక్రమించి ద్యు-సూర్య-వాయు-ఆకాశ-వారి-పృథివులలో సుతేజస్త్వాదిగుణా లున్నాయి, వాటిని వేరు వేరుగ ఉపాసించకూడదు అని నిందించి ఇవన్నీ వైశ్వానరునికి మూర్ధాదులు అని "యస్త్వేతమేవం... ఆహవనీయః" అని చెప్పబడుచున్నది. అభిముఖంగా ఉండి ప్రపంచా న్నంతనీ తెలుసుకొనే ఆత్మయైన ఈ ప్రాదేశమాత్రుడైన, అనగా ప్రాదేశం (జానెడు)ప్రమాణం గల, వైశ్వానరుణ్ణి ఎవడు ఉపాసిస్తాడో అతడు భూరాదిలోకా లన్నింటిలోను అన్ని భూతాలలోను (శరీరాలలోను) అన్ని ఆత్మలలోను (జీవులలోను) అన్నం తింటాడు; అట్టి ఆత్మయైన వైశ్వానరునికి మంచి తేజస్సు గల ద్యులోకమే శిరస్సు, వివిధరూపాలు గల సూర్యడు నేత్రం, నానావిధగమనాలు గల వాయువు ప్రాణం, బహులం (ఆకాశం) దేహమధ్యభాగం,

రయి (ఉదకం)బస్తి (మూత్రభస్త్రిక), పృథివి పాదాలు, వక్షఃస్థలం వేది, లోమాలు బర్హిస్సు, హృదయం గార్హపత్యాగ్ని, మనస్సు అన్వాహార్యపచనం, ముఖం ఆహవనీయాగ్ని అని దీని అర్థం. వైశ్వానరశబ్దంచేత జఠరాగ్ని చెప్పబడుతుందా, భూతాగ్ని (పంచభూతాలలో ఒకటైన అగ్ని) చెప్పబడుతుందా, అగ్న్యభిమానిదేవత చెప్పబడుతుందా జీవుడు చెప్పబడతాడా లేక పరమేశ్వరుడు చెప్పబడతాడా అని సంశయం. ఇక్కడ సంశయానికి కారణం ఏమిటి? జఠరాగ్ని - భూతాగ్ని - అగ్నిదేవతలకు వర్తించే వైశ్వానరశబ్దాన్ని, జీవ - పరమాత్మలకు,సాధారణవాచకమైన ఆత్మశబ్దాన్నీ ప్రయోగించడం కారణం. ఈ అర్థాలలో దేనిని గ్రహించాలి, దేనిని విడిచిపెట్టాలి అని సంశయం కలుగుతుంది.

## భాష్యమ్

కిం తావత్ప్రాప్తమ్? జాఠరోఽగ్నిరితి.కుతః? తత్ర హి విశేషేణ క్వచిత్ ప్రయోగో దృశ్యతే - "అయమగ్నిర్వైశ్వానరః యోఽ యమన్తఃపురుషే యేనేదమన్నం పచ్యతే యదిదమద్యతే" (బృ.ఉ.5.9.) ఇత్యాదౌ. అగ్నిమాత్రం వా స్యాత్; సామాన్యేనాపి ప్రయోగదర్శనాత్- "విశ్వస్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతుమహ్నామకృణ్వన్" (ఋ.సం.10.88.12)ఇత్యాదౌ. అగ్నిశరీరా వా దేవతా స్యాత్, తస్యామపి ప్రయోగదర్శనాత్ - "వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః" (ఋ.సం.1.98.1) ఇత్యేవమాద్యాయాః శ్రుతేః దేవతాయామైశ్వర్యాద్యుపేతాయాం సంభవాత్. అథాత్మశబ్దసామానాధికరణ్యాదుపక్రమే చ "కో న ఆత్మా కిం బ్రహ్మ" ఇతి కేవలాత్మశబ్దప్రయోగాదాత్మశబ్దేన చ వైశ్వానరశబ్దః పరిణేయ ఇత్యుచ్యతే తథాపి శారీర ఆత్మా స్యాత్; తస్య భోక్తృత్వేన వైశ్వానరసంనికర్షాత్. ప్రాదేశమాత్రమితి చ విశేషణస్య తస్మిన్నుపాధిపరిచ్ఛిన్నే సంభవాత్. తస్మాన్నేశ్వరో వైశ్వానర ఇతి.

## బాలానందిని

కిమితి:- ఏమి ప్రాప్తించింది? జఠరాగ్ని అని ప్రాప్తించింది. ఎందువల్ల?"అయమ్...అద్యతే" (తినబడినదానిని జీర్ణంపచేసే ఏ వైశ్వానరాగ్ని పురుషుని లోపల ఉన్నదో) ఇత్యాదిశ్రుతివాక్యాలలో కొన్ని చోట్ల ప్రత్యేకించి ఆ జాఠరాగ్ని

విషయంలో వైశ్వానరశబ్దప్రయోగం కనబడుతున్నది. లేదా సాధారణమైన అగ్ని కావచ్చును- "విశ్వస్మా...అకృణ్వన్" (దేవతలు సమస్తలోకానికి పగటికి చిహ్నంగా వైశ్వారరాగ్నిని (సూర్యరూపంలో)చేశారు) ఇత్యాదులలో సాధారణాగ్ని అనే అర్థంలో కూడ దీని ప్రయోగం కనబడుతుంది. అగ్ని శరీరంగా గల (అగ్న్యధిష్ఠానమైన) దేవత అనే అర్థంలో కూడ దీని ప్రయోగం ఉడడంవల్ల అగ్న్యదిష్ఠానదేవత కూడ కావచ్చును. "వైశ్వానరస్య... అభిశ్రీః" (సుఖప్రదుడైనవాడు, లోకాల రాజు అయిన వైశ్వానరునికి లక్ష్మి అభిముఖంగా ఉంటుంది. అందుచేత మనం ఆ వైశ్వానరుని మంచి మనస్సులో ఉందుము గాక) మొదలైన శ్రుతిని పట్టి ఐశ్వర్యాదు లున్న దేవత అనే అర్థంలో కూడ ఈ పదంయొక్క ప్రయోగం సంభవిస్తుంది. లేదా - ఆత్మశబ్దంతో సామానాధికరణ్యంవల్ల (ఆత్మశబ్దాన్ని దీనికి విశేషణంగా ఉపయోగించడంవల్ల) ప్రారంభంలో కూడ "కో న ఆత్మా కిం బ్రహ్మ" అని కేవల మైన ఆత్మశబ్దాన్ని ప్రయోగించడంవల్ల, ఈ ఆత్మశబ్దాన్ని పట్టి వైశ్వానరశబ్దానికి అర్థం మార్చాలి అన్నట్లయితే అప్పుడు కూడ శారీరాత్మ భోక్త అవడంచేత వైశ్వానరునికి (జఠరాగ్నికి) సంనిహితంగా ఉంటుంది గాన శారీరాత్మ అని అర్థం చెప్పవచ్చు. ఉపాధిచేత(శరీరంచేత లేదా అంతఃకరణంచేత) పరిచ్ఛిన్నుడైన ఆ జీవాత్మ విషయంలో "ప్రాదేశమాత్రమ్" అనే విశేషణం కూడ కుదురుతుంది. అందువల్ల వైశ్వానరుడు ఈశ్వరుడు కాదు.

వి. ఉపక్రమంలో ఉన్న అదృశ్యత్వాదిసాధారణధర్మాలు వాక్యశేషంలో ఉన్న సర్వజ్ఞత్వాదిలింగాన్ని పట్టిబ్రహ్మకు చెందుతాయి అని పూర్వాధికరణంలో నిర్ణయించబడింది. అట్లే ఉపక్రమంలోఉన్న సాధారణమైన వైశ్వానరశబ్దానికి వాక్యశేషంలో ఉన్న హోమాధారత్వం అనే లింగంచేత జాఠరాగ్ని అని అర్థం చెప్పాలి అని ఆ అధికరణంతో దీనికి దృష్టాంతసంగతి. లేదా పై అధికరణంలో చెప్పిన రూపోపన్యాసం అనే ప్రసంగంచేత త్రైలోక్యం దేహంగా గల వైశ్వానరుడు స్మరించబడ్డాడు గాన ఆ వైశ్వానరుణ్ణి గూర్చి విచారించబడుతున్నది. ఈ విధంగా దీనికి ప్రసంగసంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే తత ఇదముచ్యతే - వైశ్వానరః పరమాత్మా భవితుమర్హతీతి, కుతః? సాధారణశబ్దవిశేషాత్. సాధారణశబ్దయోర్విశేషః సాధారణశబ్దవిశేషః.యద్యప్యేతావుభావపి ఆత్మవైశ్వానరశబ్దౌ సాధారణశబ్దౌ, వైశ్వానరశబ్దస్తు త్రయస్య సాధారణః, ఆత్మశబ్దశ్చ ద్వయస్య, తథాపి విశేషో

దృశ్యతే, యేన పరమేశ్వరపరత్వం తయోరభ్యుపగమ్యతే - "తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః" ఇత్యాది. అత్ర హి పరమేశ్వర ఏవ ద్యుమూర్ధత్వాదివిశిష్టోఽవస్థాన్తరగతః ప్రత్యగాత్మత్వేనోపన్యస్త ఆధ్యానాయేతి గమ్యతే. కారణత్వాత్. కారణస్య హి సర్వాభిః కార్యగతాభి రవస్థాభిరవస్థావత్త్వాత్ ద్యులోకాద్యవయవత్యముపపద్యతే. "స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి" ఇతి చ సర్వలోకాద్యాశ్రయం ఫలం శ్రూయమాణం పరమకారణపరిగ్రహే సంభవతి. "ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" (ఛా.ఉ.5.24.3) ఇతి చ తద్విదః సర్వపాప్మ ప్రదాహశ్రవణమ్. "కో న ఆత్మా కిం బ్రహ్మ" ఇతి చాత్మ బ్రహ్మశబ్దాభ్యాము పక్రమ ఇత్యేవమేతాని లిఙ్గాని పరమేశ్వరమేవావగమయన్తి, తస్మాత్పరమేశ్వర ఏవ వైశ్వానరః. 24.

## బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా (పూర్వపక్షం) ప్రాప్తించగా -వైశ్వానరుడు పరమేశ్వరుడే అవడానికి తగినవా డని చెప్పబడుచున్నది. ఎందువల్ల? సాధారణశబ్దవిశేషంవల్ల. రెండు సాధారణశబ్దాల విశేషం- సాధారణశబ్దవిశేషం. (సాధారణం అనగా రెండు అర్థాలను సమంగా బోధించేది). ఇక్కడ ఉన్న ఆత్మ -వైశ్వానరశబ్దాలు సాధారణశబ్దాలే అయినా - వాటిలో వైశ్వానరశబ్దం మూడు అర్థాలకి సాధారణం. ఆత్మశబ్దం రెండింటికి సాధారణం. వాటిలో "తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః" మొదలైన,దేనిచేత ఆ రెండుపదాలు పరమేశ్వరుణ్ణి బోధిస్తాయి అని అంగీకరించ బడుతుందో, అట్టి విశేషం కనబడుతున్నది. ఇక్కడ ద్యుమూర్ధత్వాదులతో కూడిన పరమేశ్వరుడే కారణం కాబట్టి ఒకానొక అవస్థను పొంది ప్రత్యగాత్మగా ధ్యానంకొరకు చెప్పబడుతున్నాడు అని తెలుస్తూన్నది. (పరమేశ్వరుడు సర్వజగత్కారణం గాన జగత్తులో ఉన్న ఏ ఒక్క పదార్థంగా నైనా వర్ణింపబడవచ్చును. అందుచేత ధ్యానంకోసం ప్రత్యగాత్మగా చెప్పబడుచున్నాడు అని అర్థం). కారణానికి తన కార్యాలకు సంబంధించిన అన్ని అవస్థలు కల్పించవచ్చును. అందుచేత (కారణ మైన పరమేశ్వరునికి) ద్యులోకాదులు మూర్ధాదులు అని చెప్పడంలో దోషం లేదు. "స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి" అని వినబడుతూన్న సర్వలోకాదులకు సంబంధించిన ఫలం పరమకారణ మైన పరమేశ్వరుణ్ణి గ్రహిస్తేనే కుదురుతుంది. అట్లే "ఏవం...ప్రదూయన్తే" అని ఆ వైశ్వానరుణ్ణి తెలుసుకొన్నవాని సర్వపాపాలు దహించబడతాయి అని చెప్పడం కూడ పరమాత్మను గ్రహిస్తేనే కుదురుతుంది. "కో న ఆత్మా కిం బ్రహ్మ" అని ఆత్మబ్రహ్మశబ్దాలతో ఉపక్రమం

చేయబడింది. ఈ లింగా లన్నీ పరమేశ్వరుణ్ణి తెలుపుతున్నాయి. అందువల్ల వైశ్వానరుడు పరమేశ్వరుడే.

### సూ. స్మర్యమాణమనుమానం స్యాదితి 1.2.,25.

ఇతశ్చ పరమేశ్వర ఏవ వైశ్వానరః, యస్మాత్పరమేశ్వరస్యైవ అగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఇతీదృశం త్రైలోక్యాత్మకం. రూపం స్మర్యతే -

"యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌ క్షితిః,
సూర్యశ్చక్షుర్దిశః శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః"

ఇతి. ఏతత్స్మర్యమాణం రూపం మూలభూతాం శ్రుతిమనుమాపయదస్య వైశ్వానరశబ్దస్య పరమేశ్వరపరత్వేఽనుమానం, లిఙ్గం గమకం స్యాదిత్యర్థః. ఇతిశబ్దో హేత్వర్థః.యస్మాదిదం గమకం తస్మాదపి వైశ్వానరః పరమాత్మైవేత్యర్థః. యద్యపి స్తుతిరియం "తస్మై లోకాత్మనే నమః" ఇతి; స్తుతిత్వమపి నాసతి మూలభూతే వేదవాక్యే సమ్యగీదృశేన రూపేణ సంభవతి.
"ద్యాం మూర్ధానం యస్య విప్రా వదన్తి ఖం వై నాభిం చన్ద్రసూర్యౌ చ నేత్రే,
దిశఃశ్రోత్రే విద్ధి పాదౌ క్షితిం చ సోఽచిన్త్యాత్మా సర్వభూతప్రణేతా".
ఇత్యేవంజాతీయకా చ స్మృతిరత్రోదాహర్తవ్యా.25.

### బాలానందిని

స్మర్యమాణమితి:- "స్మర్యమాణమ్=స్మృతిలోచెప్పబడిన రూపం; అనుమానం=పరమేశ్వరుని లింగం (గుర్తు)అవుతుంది. ఇతి=ఈకారణంవల్ల కూడ వైశ్వానరుడు పరమేశ్వరుడు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ పరమేశ్వరుడే వైశ్వానరుడు, ఎందువల్ల ననగా -అగ్ని ముఖం, ద్యులోకం శిరస్సు, ఈ విధమైన పరమేశ్వరుని త్రిలోకాత్మక మైన రూపమే "యస్యాగ్నిః..నమః" (ఎవనికి అగ్ని ముఖమో ద్యులోకం శిరస్సో, ఆకాశం నాభియో, భూమి పాదాలో, సూర్యుడు నేత్రమో, దిక్కులు చెవులో, అట్టి లోకస్వరూపుడైన పరమేశ్వరునకు నమస్కారము) అని స్మరింపబడుచున్నది. (స్మృతిలో చెప్పబడుచున్నది). స్మరించబడుచున్న ఈ రూపం ఈ స్మృతికి మూల మైన శ్రుతిని అనుమితంచేస్తూ ఈ వైశ్వానరశబ్దం పరమేశ్వరుణ్ణే బోధిస్తుంది అనడానికి అనుమానంగా, అనగా లింగంగా, అనగా ఊహింపచేసేదిగా, అవుతుంది అని అర్థం. ఇతిశబ్దానికి హేతువువల్ల అని అర్థం. ఎందువలన ఇది గమకమో అందువలన కూడ వైశ్వానరుడు పరమాత్మయే అని అర్థం "తస్మై లోకాత్మనే నమః" అనడంచేత ఇది స్తోత్రమే అయినా మూల మైన వేదవాక్యం లేకుండా ఇదే రూపంలో స్తుతించడం సంభవించదు. "ద్యాం..ప్రణేతా" ఇత్యాదివిధమైన

స్మృతి కూడ ఉదాహరించవచ్చును. "బ్రాహ్మణులు ద్యులోకం ఎవని శిరస్సు అని అంటారో, ఆకాశం నాభి అనీ, చంద్రసూర్యులు నేత్రా లనీ, దిక్కులు చెవులనీ, భూమి పాదా లనీ అంటారో, ఊహించడానికి శక్యం కాని స్వరూపం గల అతడే సకలభూతాల కారణం అని తెలుసుకో" అని దీని అర్థం.

వి. శ్రుతి పరమప్రమాణం. దాని తరవాత ప్రమాణం స్మృతి. (మను-యాజ్ఞవల్క్యాదిస్మృతులు రామాయణ-భారత పురాణాదులు కూడ స్మృతులే). అయితే స్మృతి చెప్పినదానికి ఆధారంగా ఏదో ఒక వేదవాక్యం ఉంటేనే ఆ స్మృతి ప్రమాణం. వేదవిరుద్ధంగా ఉంటే అది ప్రమాణం కాదు. కొన్ని చోట్ల స్మృతిలో చెప్పిన విషయానికి సమర్థకమైన శ్రుతి లభించకపోవచ్చును. దానికి విరుద్ధ మైన శ్రతివాక్యం ఏదీ లేకపోతే అది ప్రమాణమే. ఈ స్మృతివాక్యానికి ఆధారం ఏదో ఒక శ్రుతివాక్యం ఉండి ఉంటుం దనీ, కాని అది మన కిపుడు లభ్యం అవడం లేదనీ అనుకోవాలి. ఈ విధంగా స్మృతివాక్యం శ్రుతివాక్యానికి అనుమాపకం; ఊహింపచేసేది. ఇది మీమాంసకులు చెప్పే,వేదాంతులుకూడ అంగీకరించిన పద్ధతి. 25

**సూ.శబ్దాదిభ్యోఽన్తఃప్రతిష్ఠానాచ్చ నేతి చేన్న తథాదృష్ట్యుపదేశాదసంభవా త్పురుషమపి చైన మధీయతే 1.2.26**

అత్రాహ - న పరమేశ్వరో వైశ్వానరో భవితుమర్హతి. కుతః? శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాచ్చ. శబ్దస్తావత్ - వైశ్వానరశబ్దో న పరమేశ్వరే సంభవతి, అర్థాన్తరే రూఢత్వాత్. తథాగ్నిశబ్దః "స ఏషోఽగ్నిర్వైశ్వానరః", ఇతి. ఆదిశబ్దాత్ "హృదయం గార్హపత్యః" (ఛా.ఉ.5.18.2) ఇత్యాద్యగ్నిత్రేతాప్రకల్పనమ్"తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయమ్" (ఛా.ఉ.5.10.1) ఇత్యాదినా చ ప్రాణాహుత్యధికరణతాసంకీర్తనమ్. ఏతేభ్యో హేతుభ్యో జాఠరో వైశ్వానరః ప్రత్యేతవ్యః. తథాన్తఃప్రతిష్ఠానమపి శ్రూయతే- "పురుషేఽన్తఃప్రతిష్ఠితం వేద" ఇతి. తచ్చ జాఠరే సంభవతి. యదప్యుక్తం- "మూర్ధైవ సుతేజాః" ఇత్యాదేర్విశేషాత్కారణాత్ పరమాత్మా వైశ్వానర ఇతి; అత్ర బ్రూమః - కుతో హ్యేష నిర్ణయః, యదుభయథాపి విశేషప్రతిభానే సతి పరమేశ్వరవిషయ ఏవ విశేష ఆశ్రయణీయో న జాఠరవిషయ ఇతి. అథవా భూతాగ్నేరన్తర్బహిశ్చావతిష్ఠమానస్యైష నిర్దేశో భవిష్యతి. తస్యాపి హి ద్యులోకాదిసంబన్ధో మన్త్రవర్ణాదవగమ్యతే- "యో భానునా పృథివీం ద్యాముతేమామాతతాన రోదసీ అన్తరిక్షమ్" (సం.10.88.3) ఇత్యాదౌ. అథవా తచ్ఛరీరాయా దేవతాయా ఐశ్వర్యయోగాద్ద్యులోకాద్యవయవత్వం సంభవిష్యతి. తస్మాన్న పరమేశ్వరో వైశ్వానర ఇతి.

బాలానందిని

శబ్దేతి:- శబ్దాదిభ్యః= వైశ్వానర-అగ్నిశబ్దాదులవల్ల, అన్తః ప్రతిష్ఠానాత్ చ=లోపల ఉండడంవల్ల, న=పరమేశ్వరుడు కాడు, ఇతి చేత్=అన్నట్లయితే, న=అది యుక్తం కాదు, తథాదృష్ట్యుపదేశాత్= ఆ విధంగా జఠరాగ్నియందు పరమేశ్వరదృష్టిని ఉపదేశించడం వల్ల, అసంభవాత్=సుతేజస్త్వాదులు జఠరాగ్నిలో కుదరకపోవడంవల్ల. ఏనమ్=దీనిని, పురుషమపి=పురుషుణ్ణిగా కూడ, అధీయతే= కొందరు పఠిస్తున్నారు" అని సూత్రార్థం.

అత్రాహేతి:- ఇక్కడ పూర్వపక్షి అంటున్నాడు - వైశ్వానరుడు పరమేశ్వరుడవడానికి వీలు లేదు. ఎందువల్ల? శబ్దాదులవల్ల అంతఃప్రతిష్ఠానంవల్ల. వైశ్వానరశబ్దం జాఠరాగ్ని అనే అర్థంలో రూఢం కాబట్టి అది పరమేశ్వరుని విషయంలో సంభవించదు. అట్లే "స ఏషోఽగ్నిర్వైశ్వానరః" (అట్టి ఇది వైశ్వానరాగ్ని) అని అగ్నిశబ్దం కూడ సంభవించదు, "శబ్దాదిభ్యః" అని ఆదిశబ్దం ప్రయోగించడంవల్ల "హృదయం గార్హపత్యః' ఇత్యాదివాక్యాలలో చేయబడిన అగ్నిత్రేతాకల్పనం కూడ పరమేశ్వరుని విషయంలో కుదరదు అని అర్థం గ్రహించాలి. అట్లే 'తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్ తద్ధోమీయమ్' (ప్రాణాహుతుల రూపంలో ఏ అన్నం ముందుగా వస్తుందో అది హోమోపయుక్తమైనది) ఇత్యాదివాక్యాలచేత ప్రాణాహుతులకు అధికరణంగా చెప్పడం కూడ పరమేశ్వరుని విషయంలో కుదరదు. ఈ హేతువులవల్ల వైశ్వానరం అనగా జాఠరాగ్ని అని గ్రహించాలి. అట్లే లోపల ప్రతిష్ఠితమై ఉండడం కూడ "పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద" అని వినబడుచున్నది. అది జాఠరాగ్ని విషయంలోనే కుదురుతుంది. "మూర్ధైవ సుతేజా" ఇత్యాదివిశేషాన్ని పట్టి వైశ్వానరుడు పరమాత్మయే అని ఏది చెప్పబడిందో ఈ విషయంలో చెపుతాం- విశేషం రెండు విధాలా చెప్పడానికి కనబడుతున్నప్పుడు పరమేశ్వరునికి సంబంధించిన విశేషమే గ్రహించబడుతుంది గాని జాఠరాగ్నికి సంబంధించిన విశేషం గ్రహించబడదు అని నిర్ణయం ఎట్లు చేయబడుతుంది? లేదా భూతాగ్ని లోపలా బైటా కూడ ఉండడంవల్ల దానికే 'మూర్ధైవ సుతేజాః' ఇత్యాదినిర్దేశం కాగలదు. ఎందువల్ల ననగా దానికి కూడ ద్యులోకాదులతో సంబంధం ఉన్నట్లు "యో...అన్తరిక్షమ్" (ఏ భూతాగ్ని భానురూపంతో ఈ పృథివిని, ద్యులోకాన్ని వ్యాపించి ఉన్నదో) ఇత్యాదిశ్రుతులలో తెలుస్తున్నది. లేదా అగ్ని శరీరంగా గల దేవతకు ఐశ్వర్యం (సామర్థ్యం) ఉండడంవల్ల ద్యులోకాద్యవయత్వం (ద్యులోకాదులు అవయవాలుగా కలిగి ఉండడం) కాగలదు. అందువల్ల వైశ్వానరుడు పరమేశ్వరుడు కాడు.

## భాష్యమ్

అత్రోచ్యతే- "న తథాదృష్ట్యుపదేశాత్" ఇతి. న శబ్దాదిభ్యః కారణేభ్యః పరమేశ్వరస్య ప్రత్యాఖ్యానం యుక్తమ్. కుతః? తథా జాఠరాపరిత్యాగేన దృష్ట్యుపదేశాత్. పరమేశ్వరదృష్టిర్హి జాఠరే వైశ్వానర ఇహోపదిశ్యతే- "మనో బ్రహ్మేత్యుపాసీత" (ఛా.ఉ.3.18.1) ఇత్యాదివత్. అథవా జాఠరవైశ్వానరోపాధిః పరమేశ్వర ఇహ ద్రష్టవ్యత్వేనోపదిశ్యతే- "మనోమయః ప్రాణశరీరో భారూపః" (ఛా.ఉ.3.14.2) ఇత్యాదివత్. యది చేహ పరమేశ్వరో న వివక్ష్యేత కేవల ఏవ జాఠరోఽగ్నిర్వివక్ష్యేత తతో "మూర్ధైవ సుతేజాః" ఇత్యాదేర్విషయస్యాసంభవ ఏవ స్యాత్. యథా తు దేవతాభూతాగ్నివ్యపాశ్రయేణాప్యయం విశేష ఉపపాదయితుం న శక్యతే తథా ఉత్తరసూత్రే వక్ష్యామః.

## బాలానందిని

అత్రేతి:- ఇక్కడ (సమాధానం) చెప్పబడుచున్నది - 'న తథా దృష్ట్యుపదేశాత్' - శబ్దాదులను కారణాలుగా చూపి పరమేశ్వరుణ్ణి ప్రత్యాఖ్యానం చేయడం యుక్తం కాదు. ఎందువల్ల? తథా=జాఠరాగ్నిని విడవకుండా, దృష్టిని ఉపదేశించడంవల్ల "మనో బ్రహ్మేత్యుపాసీత" (మనస్సును బ్రహ్మనుగా ఉపాసించాలి) ఇత్యాదులలో వలె ఇక్కడ జాఠరుడైన వైశ్వానరునియందు పరమేశ్వరదృష్టి (అనగా జఠరాగ్నిని పరమేశ్వరునిగా భావించాలి అని) ఉపదేశించబడుతున్నది. లేదా- "మనోమయః ...భారూపః" (మనోమయుడు, ప్రాణం శరీరంగా కలవాడు, కాంతి స్వరూపుడు) ఇత్యాదులందు వలె ఇక్కడ జాఠరవైశ్యానరుడు ఉపాధిగా గల పరమేశ్వరుడు చూడదగినవాడుగా ఉపదేశింపబడుచున్నాడు. (మొదటి పక్షంలో జాఠరాగ్నికి ఉపాసనలో ప్రాధాన్యం, రెండవ పక్షంలో పరమేశ్వరునికి ప్రాధాన్యం). ఇక్కడ పరమేశ్వరుణ్ణి వివక్షచేయకుండా కేవలం జాఠరాగ్నినే వివక్ష చేసిన ట్లయితే "మూర్ధైవ సుతేజాః" ఇత్యాదివిశేషం పూర్తిగా కుదరకుండా పోతుంది. దేవతను గాని, భూతాగ్నిని గాని గ్రహించినా కూడ ఈ విశేషం ఎలా కుదరదో ఆ విషయం రాబోవు సూత్రంలో చెప్పగలం.

## భాష్యమ్

యది చ కేవల ఏవ జాఠరో వివక్ష్యేత, పురుషేఽన్తఃప్రతిష్ఠితత్వం కేవలం తస్య స్యాన్న తు పురుషత్వమ్. పురుషమపి చైనమధీయతే వాజసనేయినః- "స ఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషః స యో

హైతమేవమగ్నిం వైశ్వానరం పురుషవిధం పురుషేஉన్తఃప్రతిష్ఠితం వేద" (శత.బ్రా.10.6.1.11) ఇతి. పరమేశ్వరస్య తు సర్వాత్మత్వాత్ పురుషత్వం, పురుషేన్తఃప్రతిష్ఠితత్వం చోభయముపపద్యతే. యే తు "పురుషవిధమపి చైనమధీయతే" ఇతి సూత్రావయవం పఠన్తి తేషామేషోஉర్థః- కేవల జాఠరపరిగ్రహే పురుషేஉన్తఃప్రతిష్ఠితత్వం కేవలం స్యాన్న పురుషవిధత్వమ్. పురుషవిధమపి చైనమధీయతే వాజసనేయినః- "పురుషవిధం పురుషేஉన్తః ప్రతిష్ఠితం వేద" ఇతి. పురుషవిధత్వం చ ప్రకరణాత్ యదధిదైవతం ద్యుమూర్ధత్వాది పృథివీప్రతిష్ఠితత్వాన్తం, యచ్చాధ్యాత్మం ప్రసిద్ధం మూర్ధత్వాది చుబుకప్రతిష్ఠితత్వాన్తం తత్పరిగృహ్యతే. 26.

బాలానందిని

యదీతి:- కేవలం జాఠరాగ్ని మాత్రమే వివక్షిత మైతే (చెప్పడానికి ఇచ్ఛయింపబడితే) దానికి పురుషునిలోపల ఉండడం మాత్రమే కుదురుతుంది కాని పురుషత్వం కుదరదు. 'స ఏషోஉగ్నిః... వేద" (ఈ వైశ్వారాగ్ని పురుషుడు; పురుషవిధుడైన, పురుషుని లోపల ఉన్న ఈ వైశ్వానరాగ్నిని గూర్చి ఎవడు తెలుసుకుంటాడో) అని వాజనేయులు ఈ వైశ్వానరుణ్ణి పురుషునిగా కూడ పఠిస్తున్నారు. పరమేశ్వరుడైతే సర్వాత్మకుడు గాన అతనికి పురుషత్వం, పురుషేஉన్తఃప్రతిష్ఠితత్వం రెండూ కూడ కుదురుతాయి. "పురుషవిధం చైనమధీయతే" అని సూత్రంలోని భాగాన్ని పఠించినవారి పక్షంలో దానికి అర్థం ఇది- కేవలం జాఠరాగ్నిని మాత్రం గ్రహిస్తే పురుషేஉన్తః ప్రతిష్ఠితత్వం మాత్రమే కుదురుతుంది గాని పురుషవిధత్వం కుదరదు. వాజసనేయులు వైశ్వానరుణ్ణి- "పురుషవిధం పురుషేஉన్తః ప్రతిష్ఠితం వేద" అని పురుషవిధుణ్ణిగా కూడ పఠిస్తున్నారు. ప్రకరణాన్ని పట్టి పురుషవిధత్వం అనగా- అధిదైవతమునందు ద్యుమూర్ధత్వం మొదలు పృథివీప్రతిష్ఠితత్వం వరకు, అధ్యాత్మమునందు (శరీరంలో) ప్రసిద్ధమైన మూర్ధత్వం మొదలు చుబుకప్రతిష్ఠితత్వం వరకు ఉన్నది గ్రహించబడుతుంది.

వి. ఇక్కడ పురుషవిధత్వం అనగా శరీరంలో వ్యాపించి ఉండడం అని మాత్రం అర్థం కాదు. ప్రకరణాన్ని పట్టి ద్యులోకం మొదలు పృథివివరకు విరాడ్రూపంలో వ్యాపించి ఉండడం అధిదైవతానికి సంబంధించినది. అధ్యాత్మం(శరీరం)లో ఉపాసకుని శిరస్సు మొదలు చిబుకం (గడ్డం) వరకు పరమేశ్వరుడు వ్యాపించి

ఉండడం అని గ్రహించాలి. అది పరమేశ్వరునికే గాని జాఠరాగ్నికి కుదరదు అని భావం.

## సూ. అత ఏవ న దేవతా భూతం చ.1.2.27

యత్పునరుక్తం - భూతాగ్నేరపిమన్త్రవర్ణే ద్యులోకాదిసంబన్ధదర్శనాన్మూర్ధైవ సుతేజా ఇత్యాద్యవయవకల్పనం తస్యైవ భవిష్యతీతి, తచ్ఛరీరాయా దేవతాయా వా ఐశ్వర్యయోగాదితి, తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే- అత ఏ వోక్తేభ్యోహేతుభ్యః న దేవతా వైశ్వానరః. తథా భూతాగ్నిరపి న వైశ్వానరః. న హి భూతాగ్నేరౌష్ణ్యప్రకాశమాత్రాత్మకస్య ద్యుమూర్ధత్వాదికల్పనోపపద్యతే, వికారస్య వికారాన్తరాత్మత్వాసంభవాత్. తథా దేవతాయాః సత్యప్యైశ్వర్యయోగే న ద్యుమూర్ధత్వాదికల్పనా సంభవతి. అకారణత్వాత్పరమేశ్వరాధీనత్వాచ్చైశ్వరస్య. ఆత్మశబ్దాసంభవశ్చ సర్వేషు పక్షేషు స్థిత ఏవ. 27.

అత ఇతి:- "అత ఏవ=పైన చెప్పిన హేతువులవల్లనే, భూతం చ=భూతాగ్ని కూడ, న=వైశ్వానరుడు కాదు" అని సూత్రార్థం.

యత్పునరుక్తమితి:- మంత్రవర్ణంలో భూతాగ్నికి కూడ ద్యులోకాదులతో సంబంధం ఉన్నట్లు కనబడటంవల్ల "మూర్ధైవ సుతేజాః" ఇత్యాదికమైన అవయవకల్పనం ఆ భూతాగ్నికే కుదురుతుం దనీ లేదా ఆ భూతాగ్ని శరీరంగా గల దేవతకు ఐశ్వర్యం ఉండడంవల్ల ఆ దేవత కైనా ద్యుమూర్ధత్వాదికం కుదురుతుందనీ ఏది (పూర్వపక్షిచేత) చెప్పబడిందో దానిని పరిహరించవలసి ఉంది. ఈ విషయంలో చెప్పబడుచున్నది. అత ఏవ=చెప్పబడిన హేతువుల వలననే, దేవత వైశ్వానరుడు కాదు. అట్లే భూతాగ్ని కూడ వైశ్వానరుడు కాదు. ఉష్ణత్వం, ప్రకాశ ఇవి మాత్రమే స్వరూపంగా గల భూతాగ్నికి ద్యుమూర్ధత్వాదికల్పన కుదరదు కదా? ఒక వికారం (కార్యం) మరొక వికారంయొక్క స్వరూపం గలది కాజాలదు కదా? అట్లే దేవతకు ఐశ్వర్యంతో సంబంధం ఉన్నా కూడ ద్యుమూర్ధత్వాదికల్పన కుదరదు. ఎందువల్ల ననగా అది ద్యులోకాదులకు కారణం కాదు; దాని ఐశ్వర్యం కూడ పరమాత్మ మీదనే ఆధారపడి ఉంటుంది. ఆత్మశబ్దం కుదరకపోవడం అనేది అన్ని పక్షాలలోను (జాఠర-భూతాగ్ని-అగ్న్యభిమానిదేవత లనే మూడు అర్థాలలోనూ) కూడ ఉండనే ఉంది. 27.

సూ. సాక్షాదప్యవిరోధం జైమినిః. 1.2.28.

పూర్వం జాఠరాగ్నిప్రతీకో జాఠరాగ్న్యుపాధికో వా పరమేశ్వర ఉపాస్య ఇత్యుక్తమన్తఃప్రతిష్ఠత్వానురోధేన. ఇదానీం తు వినైవ ప్రతీకోపాధికల్పనాభ్యాం సాక్షాదపి పరమేశ్వరోపాసనపరిగ్రహే న కశ్చిద్విరోధ ఇతి జైమినిరాచార్యో మన్యతే. నను జాఠరాగ్న్యపరిగ్రహేఽన్తఃప్రతిష్ఠితత్వవచనం శబ్దాదీని చ కారణాని విరుధ్యేరన్నితి. అత్రోచ్యతే- అన్తఃప్రతిష్ఠితత్వవచనం తావన్న విరుధ్యతే. న హీహ "పురుషవిధం పురుషేఽన్తఃప్రతిష్ఠితం వేద" ఇతి జాఠరాగ్న్యభిప్రాయేణేదముచ్యతే. తస్యాప్రకృతత్వాదసంశబ్దితత్వాచ్చ. కథం తర్హి? యత్ప్రకృతం మూర్ధాదిచుబుకాన్తేషు పురుషావయవేషు పురుషవిధత్వం కల్పితం తదభిప్రాయేణేదముచ్యతే- "పురుషవిధం పురుషేఽన్తఃప్రతిష్ఠితం వేద" ఇతి. యథా వృక్షే శాఖాం ప్రతిష్ఠితాం పశ్యతి తద్వత్. అథవా యః ప్రకృతః పరమాత్మాఽధ్యాత్మమధిదైవతం చ పురుషవిధత్వోపాధిస్తస్య యత్కేవలం సాక్షిరూపం తదభిప్రాయేణేదముచ్యతే- "పురుషేఽన్తఃప్రతిష్ఠితం వేద" ఇతి. నిశ్చితే చ పూర్వాపరాలోచనవశేన పరమాత్మపరిగ్రహే తద్విషయ ఏవ వైశ్వానరశబ్దః కేన చిద్యోగేన వర్తిష్యతే- విశ్వశ్చాయం నర ఇతి, విశ్వేషాం వా యం నర ఇతి, విశ్వే వా నరా అస్యేతి విశ్వానరః పరమాత్మా, సర్వాత్మత్వాత్. విశ్వానర ఏవ వైశ్వానరః. తద్ధితోఽనన్యార్థః రాక్షసవాయసాదివత్. అగ్నిశబ్దోఽప్యగ్రణీత్వాదియోగాశ్రయణేన పరమాత్మవిషయ ఏవ భవిష్యతి. గార్హపత్యాదికల్పనం ప్రాణాహుత్యధికరణత్వం చ పరమాత్మనోఽపి సర్వాత్మత్వాదుపపద్యతే. 28.

బాలానందిని

సాక్షాదితి:- 'సాక్షాత్ అపి=ప్రత్యక్షంగా పరమేశ్వరుణ్ణి ఉపాసించినా కూడ, అవిరోధమ్=విరోధం లేకపోవడాన్ని, జైమినిః=జైమిని అనే ఆచార్యు డంగీకరిస్తున్నాడు' అని సూత్రార్థం.

శరీరం లోపలం ఉండడం మొదలైనవాటిని పట్టి, జఠరాగ్ని ప్రతీకగా గల. లేదా జఠరాగ్ని ఉపాధిగా గల పరమేశ్వరుడు ఉపాసించదగినవాడు అని వెనుక చెప్పబడింది. అయితే ఇప్పుడు జైమిని అనే ఆచార్యుడు ప్రతీకకల్పన గాని,

ఉపాధికల్పన కానీ చేయకుండగా సాక్షాత్తుగానే పరమేశ్వరుణ్ణి గ్రహించినా కూడ. విరోధం ఏదీ లేదు అని భావిస్తున్నారు. (ప్రశ్న)- జాఠరాగ్నిని గ్రహించని పక్షంలో అంతఃప్రతిష్ఠితత్వవచనం, శబ్దం మొదలైన (వెనుక చెప్పిన) కారణాలు విరుద్ధం అవుతాయి కదా? ఇక్కడ (సమాధానం) చెప్పబడుతున్నది - అంతఃప్రతిష్ఠితత్వవచనాని కైతే విరోధం ఏదీ లేదు. ఇక్కడ "పురుషవిధం పురుషేఽ న్తఃప్రతిష్ఠితం వేద" అని జాఠరాగ్నిని ఉద్దేశించి చెప్పబడలేదు. ఎందువల్ల ననగా అది ప్రకృతం కాదు, దాన్ని బోధించే శబ్దం ఏదీ కూడ ఇక్కడ లేదు. అయితే ఎట్లు? తల మొదలు గడ్డం వరకూ ఉన్న పురుషావయవాలలో కల్పితమైన ప్రకృతమైన ఏ పురుషవిధత్వం ఉన్నదో దానిని దృష్టిలో ఉంచుకొని "పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద" అని చెప్పబడింది. శాఖ వృక్షం మీద ప్రతిష్ఠితం అయినట్లు ఎట్లు చూస్తాడో అట్లే.

వి. ఇక్కడ 'అంతస్థం' అనగా ఉదరంలో ఉన్నది అని కాదు అర్థం. నఖాలు మొదలు శిఖ వరకు ఉన్న పురుషశరీరంలో మూర్ధ మొదలు చుబుకం వరకు ఉన్న అవయవాలు చెట్టుమీద కొమ్మ ఉన్నట్లు ఉన్నాయి. వాటిలో ఉన్న వైశ్వానరపురుషుణ్ణి, శాఖమీద కూర్చున్న పక్షిని వృక్షంలోపల ఉంది అని చెప్పి నట్లు పురుషాంతఃప్రతిష్ఠితుడు అని చెప్పవచ్చును కదా అని భావం.

అవ. పురుషవిధత్వం పైన చెప్పినట్లే. అంతఃస్థః అనేదానికి మాత్రం మధ్యస్థుడు, సాక్షి అని మరొక విధంగా అర్థం చెప్పవచ్చు నని చూపుతున్నారు- అథవేతి:- లేదా అధ్యాత్మ-అధిదైవతాలలో పురుషవిధత్వం ఉపాధిగా గల ప్రకృతుడైన ఏ పరమాత్మ ఉన్నాడో వాని సాక్షిరూపం మాత్రాన్ని దృష్టిలో పెట్టుకొని "పురుషేఽన్తఃప్రతిష్ఠితం వేద" అని చెప్పబడింది. అనగా-పురుషవిధత్వం ఉపాధిగా గల పరమాత్మయొక్క అనగా జీవునియొక్క, శుద్ధచైతన్యరూపం పురుషునిలో సాక్షిగా ఉన్నది అని "పురుషేఽన్తఃప్రతిష్ఠితం" అనేదాని అర్థం. పూర్వాపరాలోచన చేసి పరమాత్మనే గ్రహించాలి అని నిర్ణయించిన తరవాత ఏదో ఒక యోగంచేత (వ్యుత్పత్తి ప్రకారం) వైశ్వానరశబ్దం ఆ పరమాత్మ విషయంలోనే వర్తించగలదు. "విశ్వశ్చ అయం నరః" సకలజీవులు-సకలజీవస్వరూపుడు. విశ్వేషాం నరః=సకలకార్యాలను సృజించినవాడు లేదా "విశ్వే నరాః అస్య" సమస్తనరులు తన ఆత్మగా గాని, తన అధీనులుగా గాని కలవాడు అని 'విశ్వానర' శబ్దానికి పరమాత్మార్థం చెప్పవచ్చు. పరమాత్మ సర్వాత్ముడు గాన ఈ విధంగా ఏ అర్థ మైనా యుక్తమే."విశ్వానర ఏవ వైశ్వానరః". విశ్వానరుడే వైశ్వానరుడు.

వి. విశ్వానరశబ్దానికి 'అణ్' అనే తద్ధితప్రత్యయం చేర్చగా వైశ్వానరః అనే రూపం నిష్పన్నం అవుతుంది. ఈ తద్ధితప్రత్యయానికి ప్రత్యేకమైన అర్థం ఏదీ లేదు. అందుచేత

విశ్వానరః అంటే ఏ అర్థమో వైశ్వానరః అన్నా అదే అర్థం. 'రక్షస్' శబ్దానికి రాక్షసుడు అని అర్థం, 'వయస్' శబ్దానికి పక్షి అని అర్థం. వాటికి తద్ధితప్రత్యయం ఒకటి చేర్చగా 'రాక్షస' 'వాయస' శబ్దాలు తయారవుతాయి. అర్థం మాత్రం అదే. ఇలాంటి తద్ధితప్రత్యయాలకి స్వార్థతద్ధితప్రత్యయా లని పేరు.

అగ్నీతి:- అగ్నిశబ్దం కూడ 'అగ్రం (కర్మఫలం) పొందిస్తాడు' (అగ్రం నయతీత్యగ్నిః) అనే వ్యుత్పత్తిని ఆశ్రయించడంచేత పరమాత్మనే బోధిస్తుంది. గార్హపత్యాదుల కల్పన, ప్రాణాహుతులకు ఆధారం అవడం కూడ సర్వాత్ము డవడంచేత పరమాత్మకు కూడ కుదురుతుంది. 28.

## భాష్యమ్

కథం పునః పరమేశ్వరపరిగ్రహే ప్రాదేశమాత్రశ్రుతిరుపపద్యత ఇతి; తాం వ్యాఖ్యాతుమారభతే-

**సూ. అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః 1.2.29.**

అతిమాత్రస్యాపి పరమేశ్వరస్య ప్రాదేశమాత్రత్వమభివ్యక్తినిమిత్తం స్యాత్. అభివ్యజ్యతే కిల ప్రాదేశమాత్రపరిమాణః పరమేశ్వర ఉపాసకానాం కృతే. ప్రదేశేషు వా హృదయాదిషూపలబ్ధిస్థానేషు విశేషేణాభివ్యజ్యతే. అతః పరమేశ్వరేఽపి ప్రాదేశమాత్రశ్రుతిరభివ్యక్తేరుపపద్యతే ఇత్యాశ్మరథ్య ఆచార్యో మన్యతే. 29.

## బాలానందిని

కథమితి:- పరమేశ్వరుణ్ణి గ్రహిస్తే ప్రాదేశమాత్రశ్రుతి ఎలా కుదురుతుంది అని దానిని గూర్చి వివరించడానికి ప్రారంభిస్తున్నాడు-

అభివ్యక్తేరితి:- "అభివ్యక్తేః ఇతి= పరమేశ్వరుడు ప్రాదేశమాత్రుడు (జానెడు ప్రమాణం కలవాడు) అని అభివ్యక్తిని పట్టి అనగా పరమేశ్వరుడు ఆ విధంగా సాక్షాత్కరిస్తాడు గాన, అని అశ్మరథుడనే ఆచార్యు డన్నాడు" అని సూత్రార్థం.

అతీతి:- మహాప్రమాణం కలవాడైనా పరమేశ్వరుడు ప్రాదేశప్రమాణుడు అని చెప్పడం అభివ్యక్తిని పట్టి కావచ్చును. పరమేశ్వరుడు ఉపాసకులకు ప్రాదేశమాత్ర ప్రమాణంలో సాక్షాత్కరిస్తాడట. (ప్రాదేశమాత్ర అనేదానికి మరొక అర్థం చెపుతున్నారు) లేదా పరమేశ్వరుని తెలుసుకొనే స్థానాలైన హృదయాదిప్రదేశాలలో విశేషించి అభివ్యక్తు

డౌతాడు. అందువల్ల అభివ్యక్తిని బట్టి పరమేశ్వరునియందు కూడ ప్రాదేశమాత్రశ్రుతి కుదురుతుంది అని ఆశ్మరథ్యాచార్యుడు భావిస్తున్నాడు. 29.

## సూ. అనుస్మృతేర్బాదరిః 1.2.30

ప్రాదేశమాత్రహృదయప్రతిష్ఠేన వాయం మనసానుస్మర్యతే. తేన ప్రాదేశమాత్ర ఇత్యుచ్యతే. యథా ప్రస్థమితా యవాః ప్రస్థాః ఇత్యుచ్యన్తే తద్వత్. యద్యపి చ యవేషు స్వగతమేవ పరిమాణం ప్రస్థసంబన్ధాద్వ్యజ్యతే, న చేహ పరమేశ్వరగతం కించిత్పరిమాణమస్తి యద్ధృదయసంబన్ధాద్వ్యజ్యేత, తథాపి ప్రయుక్తాయాః ప్రాదేశమాత్రశ్రుతేః సంభవతి యథా కథంచి దనుస్మరణమాలమ్బనమిత్యుచ్యతే. ప్రాదేశమాత్రత్వేన వా యమప్రాదేశమాత్రోఽప్యనుస్మరణీయః, ప్రాదేశమాత్రశ్రుత్యర్థవత్తాయై. ఏవమనుస్మృతినిమిత్తా పరమేశ్వరే ప్రాదేశమాత్రశ్రుతిరితి బాదరిరాచార్యో మన్యతే.30.

### బాలానందిని

**అన్వితి:-** "అనుస్మృతేః = ప్రాదేశమాత్రమైన హృదయంలో ఉన్న మనస్సుచేత స్మరించడంవల్ల అని, బాదరిః= బాదరి అంటున్నాడు" అని సూత్రార్థం.

**ప్రాదేశేతి:-** ఈ పరమాత్మ ప్రాదేశప్రమాణం గల హృదయంలో ఉన్న మనస్సుచేత స్మరించబడతాడు; అందుచేత ప్రాదేశమాత్రు డని చెప్పబడుతున్నాడు. ప్రస్థం (కుంచం వంటిది) చేత కొలచిన యవలను 'కుంచం యవలు' అని ఎట్లు అంటారో అట్లే. అయితే యవలలోనే ఉన్న పరిమాణం ప్రస్థం అనే కొలపాత్రతో సంబంధంచేత అభివ్యక్తమౌతుంది; ఆ విధంగా ఇక్కడ హృదయసంబంధంచేత వ్యంజింప చేయబడడానికి పరమేశ్వరునిలో పరిమాణం ఏదీ లేదు, అయినా ప్రయోగించబడిన ప్రాదేశమాత్రశ్రుతికి, ఏదో విధంగా, (ప్రాదేశమాత్రహృదయగతమైన మనస్సుచేత) స్మరించడం ఆధారం అవుతుంది అని, అనగా ప్రాదేశమాత్రశ్రుతిని ఏదో విధంగా సమర్థిస్తుందని, ఈ విధంగా చెప్పబడుతున్నది. లేదా పరమేశ్వరుడు ప్రాదేశమాత్రుడు కాకపోయినా ప్రాదేశమాత్రత్వాన్ని చెపుతూన్న ఈ శ్రుతివాక్యాన్ని సార్థకం చెయ్యడానికి ప్రాదేశప్రమాణం గలవానినిగా స్మరించాలి. (ఇది సూత్రానికి రెండవ అర్థం). ఈ విధంగా పరమేశ్వరుని విషయంలో ప్రాదేశమాత్రశ్రుతి అనుస్మృతిని పట్టి ఏర్పడినది అని బాదరి అనే ఆచార్యుడు భావిస్తున్నాడు. 30.

సూ. సంపత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి. 1.2.31

సంపత్తినిమిత్తా వా స్యాత్ప్రాదేశమాత్రశ్రుతిః. కుతః? తథాహి సమానప్రకరణం వాజసనేయిబ్రాహ్మణం ద్యుప్రభృతీన్ పృథివీపర్యన్తాంస్త్రై లోక్యాత్మనో వైశ్వానరస్యావయవానధ్యాత్మమూర్ధప్రభృతిషు చుబుకపర్యన్తేషు దేహావయవేషు సంపాదయత్ప్రాదేశమాత్రసంపత్తిం పరమేశ్వరస్య దర్శయతి- "ప్రాదేశమాత్రమిహ వై దేవాః సువిదితా అభిసంపన్నాస్తథా ను వ ఏతాన్వక్ష్యామి యథా ప్రాదేశమాత్రమేవాభిసంపాదయిష్యామీతి, స హోవాచ మూర్ధానముపదిశన్నువాచ ఏష వా అతిష్ఠా వైశ్వానర ఇతి; చక్షుషీ ఉపదిశన్నువాచైష వై సుతేజా వైశ్వానర ఇతి; నాసికే ఉపదిశన్నువాచైష వై పృథగ్వర్త్మాత్మా వైశ్వానర ఇతి; ముఖ్యమాకాశముపదిశన్నువాచైష వై బహులో వైశ్వానర ఇతి, ముఖ్యా అప ఉపదిశన్నువాచైష వై రయిర్వైశ్వానర ఇతి; చుబుకముపదిశన్నువాచైష వై ప్రతిష్ఠా వైశ్వానర ఇతి". చుబుకమిత్యధరం ముఖఫలకముచ్యతే. యద్యపి వాజసనేయకే ద్యౌరతిష్ఠాత్వగుణా సమామ్నాయతే ఆదిత్యశ్చ సుతేజస్త్వగుణః, ఛాన్దోగ్యే పునర్ద్యౌః సుతేజస్త్వగుణా సమామ్నాయతే ఆదిత్యశ్చ విశ్వరూపగుణః, తథాపి నైతావతా విశేషేణ కించిద్ధీయతే, ప్రాదేశమాత్రశ్రుతేరవిశేషాత్; సర్వశాఖాప్రత్యయత్వాచ్చ. సంపత్తినిమిత్తాం ప్రాదేశమాత్రశ్రుతిం యుక్తతరాం జైమినిరాచార్యో మన్యతే.

బాలానందిని

సంపత్తేరితీతి:- "సంపత్తేః ఇతి= సంపత్తివలన అనగా ఆరోపంవలన, ప్రాదేశమాత్రత్వం అని, జైమినిః=జైమిని చెపుతున్నాడు. తథా=ఆ విధంగా, దర్శయతి హి=వాజసనేయిబ్రాహ్మణం చూపుతున్నది కదా" అని సూత్రార్థం.

సంపత్తీతి:- లేదా ప్రాదేశమాత్రశ్రుతి సంపత్తిచే (ఆరోపంచేత) ఏర్పడినది కావచ్చును. ఎందువల్ల? సమానప్రకరణమైన (వైశ్వానరవిద్యకు సంబంధించిన) వాజసనేయిబ్రాహ్మణం- 'ప్రాదేశమాత్రమ్..... వైశ్వానర ఇతి' అని త్రైలోక్యాత్మయైన వైశ్వానరుని, ద్యులోకం మొదలు పృథివివరకు ఉన్న అవయవాలను, అధ్యాత్మమునందు (శరీరమునందు) శిరస్సు మొదలు చుబుకంవరకు ఉన్న దేహావయవాలలో సంపాదిస్తూ (ఆరోపిస్తూ) పరమేశ్వరునికి ప్రాదేశమాత్రసంపత్తిని

(ప్రాదేశమాత్రత్వారోపణను లేదా ప్రాదేశమాత్రత్వప్రాప్తిని) చూపుతున్నది గదా? ((అపరిచ్ఛిన్ను డైనా) ప్రాదేశమాత్రడుగా కల్పించబడిన పరమేశ్వరుణ్ణి బాగుగాఎరిగిన దేవతలు పూర్వం ఆ పరమేశ్వరుణ్ణే ప్రత్యగాత్మగా పొందారు. అదే విధంగా మీకు ఈ ద్యులోకం మొదలైన అవయవాలను చెప్పి వైశ్వానరునికి ప్రాదేశమాత్రత్వాన్ని సంపాదిస్తాను. (రాజు ప్రాచీనశాలాదులతో ఇలా చెప్పి తన శిరస్సును చేతితో చూపుతూ ఇంకా ఇలా అన్నాడు) ఈ నా తల అతిష్ఠ, అనగా భూరాదిలోకాలను అతిక్రమించి ఉన్న ద్యులోకం. ఇది వైశ్వానరుడు. అనగా వైశ్వానరుని తల. (అధిదైవశిరస్సును అధ్యాత్మశిరస్సుతో అభిన్నంగా భావించి ధ్యానం చెయ్యాలి అని అర్థం. మిగిలినవాటి విషయంలో కూడా అధిదైవ-అధ్యాత్మావయువాలను అభిన్నాలుగా భావించాలి). కళ్లు చూపుతూ ఇదే సూర్యుడు, వైశ్వానరుని నేత్రం అని అన్నాడు. ముక్కురంధ్రాలు చూపుతూ అనగా నాసికారంధ్రాలలో ఉన్న ప్రాణాన్ని చూపుతూ ఇదే వాయువు, వైశ్వానరుడు (వైశ్వానరాంగం) అని అన్నాడు. ముఖంలో ఉన్న ఆకాశాన్ని చూపుతూ ఇది ఆకాశం, వైశ్వానరుడు (వైశ్వానరాంగం) అని అన్నాడు. ముఖంలో ఉన్న జలం చూపుతూ ఇదే రయి అనగా బస్తిలోని ఉదకం, వైశ్వానరుడు (వైశ్వానరాంగం)అని అన్నాడు. భూలోకం చూపుతూ ఇదే పాదరూప మైన పృథివి, వైశ్వానరుడు (వైశ్వానరాంగం) అని అన్నాడు'' అని ఈ బ్రాహ్మణవాక్యానికి అర్థం. చుబుకం అనగా ముఖం క్రింది భాగం, గడ్డం. వాజసనేయకంలో ద్యులోకానికి అతిష్ఠాత్వగుణం అనీ, ఆదిత్యునికి సుతేజస్త్వగుణం అనీ చెప్పబడింది; ఛాందోగ్యంలో ద్యులోకానికి సుతేజస్త్వగుణం అనీ ఆదిత్యునికి విశ్వరూపత్వగుణం అనీ చెప్పబడింది. ఈ విధంగా కొంచెం భేదం ఉన్నా ప్రాదేశమాత్రశ్రుతి రెండింటిలోనూ సమానంగా ఉండడంచేత ఈ భిన్నవిశేషంవల్ల లోపం ఏమీ లేదు. సర్వశాఖాప్రత్యయత్వం అనేది కూడ ఉంది.

వి. అనగా వేరు వేరు ఉపనిషత్తులందు చెప్పబడిన విద్య ఒకే విద్య అని నిర్ణయించిన తరవాత చిన్న చిన్న విషయాలలో ఏవైన భేదాలుంటే వాటిని ఆ విద్యలలో సమన్వయించాలి అని ముందు చెప్పనున్నారు. దీనికి సర్వశాఖాప్రత్యయం అని పేరు. ఛాందోగ్యంలోను వాజపనేయంలోను చెప్పిన వైశ్వానరవిద్య ఒక్కటే. అందుచేత ఒకదానిలో లేని అంశాలను మరొకదానిలో అన్వయించుకోవాలి.

సంపత్తీతి:- ఈ విధంగా ప్రాదేశమాత్రశ్రుతి సంపత్తినిమిత్త మైనది అని చెప్పిన ట్లయితే యుక్తతరంగా ఉంటుంది అని జైమిని అనే ఆచార్యుడు భావిస్తున్నాడు.31.

## సూ. ఆమనన్తి చైనమస్మిన్. 1.2.32.

ఆమనన్తి చైనం పరమేశ్వరమస్మిన్ మూర్ధచుబుకాన్తరాలే జాబాలాః- "య ఏషోఽనన్తోఽవ్యక్త ఆత్మా సోఽవిముక్తే ప్రతిష్ఠిత ఇతి. సోఽవిముక్తః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి. వరణాయాం నాస్యాం చ మధ్యే ప్రతిష్ఠిత ఇతి. కా వై వరణా కా చ నాసీతి". తత్ర చేమామేవ నాసికాం వరణానాసీతి నిరుచ్య "సర్వాణీన్ద్రియ కృతాని పాపాని వారయతీతి సా వరణా", "సర్వాణీన్ద్రియకృతాని పాపానినాశయతీతి సా నాసీ" ఇతి, పునరామనన్తి -"కతమచ్చాస్య స్థానం భవతీతి, భ్రువోర్ఘ్రాణస్య చ యః సంధిః స ఏష ద్యులోకస్య పరస్య చ సంధిర్భవతీతి" (జాబా.1.) తస్మాదుపపన్నా పరమేశ్వరే ప్రాదేశమాత్రశ్రుతిః. అభివిమానశ్రుతిః ప్రత్యగాత్మత్వాభిప్రాయా ప్రత్యగాత్మతయా సర్వైః ప్రాణిభిరభివిమీయత ఇత్యభిప్రాయః. అభిగతో వాయం ప్రత్యగాత్మత్వాత్ విమానశ్చ మానవియోగాదిత్యభివిమానః. అభివిమిమీతే వా సర్వం జగత్కారణత్వాదిత్యభివిమానః. తస్మాత్పరమేశ్వరో వైశ్వానర ఇతి సిద్ధమ్.32.

ఇతిశ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యశ్రీ గోవిన్దభగవ త్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవత్పాదకృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే

ప్రథమాధ్యాయస్య ద్వితీయః పాదః

ఆమనన్తీతి:- "ఏనమ్=ఈ పరమేశ్వరుణ్ణి, అస్మిన్=శిరస్సుకూ చుబుకానికీ మధ్య నున్నట్లు, ఆమనన్తి చ = జాబాలులు పఠిస్తున్నారు కూడ" అని సూత్రార్థం.

ఆమనన్తీతి:- ఈ పరమేశ్వరుణ్ణి, జాబాలులు, శిరశ్చుబుకాల మధ్య ఉన్నట్లు "య ఏషః... నాసీతి" అని పఠిస్తున్నారు కూడ. "అనంతము అవ్యక్తమూ అయిన ఏ ఈ ఆత్మ ఉన్నదో అది అవిముక్తంలో ప్రతిష్ఠితమై ఉంది. ఆ అవిముక్తం దేనియందు ప్రతిష్ఠితమై ఉంది? వరణా - నాసీల మధ్య ప్రతిష్ఠితమై ఉంది; వరణ ఏది నాసి ఏది" అని ఈ వాక్యానికి అర్థం అక్కడ ఈ నాసికనే "యా...నాసీతి" అనే వాక్యంలో

నిర్వచించి మళ్లీ "కతమచ్చ... భవతీతి" అని పఠిస్తున్నారు. "ఇంద్రియాలచేత చేయబడిన సకలపాపాలను నివారించేది వరణ, ఇంద్రియాలచేత చేసిన సకలపాపాలను నశింపచేసేది నాసి", "దీనికి స్థానం ఏది? కనుబొమ్మలకు ముక్కుకు ఏది సంధియో అదే ద్యులోకానికీ బ్రహ్మలోకానికీ సంధి అవుతుంది" అని పై రెండు వాక్యాల అర్థం. అందువల్ల పరమేశ్వరుని విషయంలో ప్రాదేశమాత్రశ్రుతి తగినదే. ప్రత్యగాత్మత్వదృష్ట్యా "అభివిమానః" అని చెప్పబడింది. అందరు ప్రాణులచేత ప్రత్యగాత్మగా భావించబడుతుంది గాన 'అభివిమానం'. లేదా ఇది అంతటా వ్యాపించినది, ఇంత అని ప్రమాణం లేనిది గాన అభివిమానం. లేదా జగత్తు కంతకీ కారణం గాన సకలజగత్తును నిర్మిస్తుంది గాన అభివిమానం. (ఈ విధంగా అభివిమానశబ్దం కూడ పరమేశ్వరునికి వర్తిస్తుంది అని అర్థం). అందువల్ల వైశ్వానరుడు పరమేశ్వరుడే అని సిద్ధించినది. 32.

వైశ్వానరాధికరణం సమాప్తం.

'బాలానందిని' అను శారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో

ప్రథమాధ్యాయంలోని ద్వితీయపాదం సమాప్తం.

## ప్రథమాధ్యాయే తృతీయః పాదః

అత్ర అస్పష్టబ్రహ్మలిఙ్గనాం ప్రాయో జ్ఞే,యబ్రహ్మవిషయాణాం విచారః. ఏవం పాదత్రయేణాపి వాక్యవిచారః.

### 1. ద్యుభ్వాద్యధికరణమ్. సూ.1.-7.

### సూ. ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్ 1.3.1

ఇదం శ్రూయతే-

"యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః,
తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముఞ్చథామృతస్యైష సేతుః"

(ము.ఉ.2.2.5) ఇతి. అత్ర యదేతద్ద్యుప్రభృతీనామోతత్వవచనాదాయతనం కించిదవగమ్యతే, తత్కిం పరం బ్రహ్మ స్యాదాహోస్విదర్థాన్తరమితి సన్దిహ్యతే. తత్రార్థాన్తరం కిమప్యాయతనం స్యాదితి ప్రాప్తమ్. కస్మాత్? "అమృతస్యైష సేతుః" ఇతి శ్రవణాత్. పారవాన్హి లోకే సేతుః ప్రఖ్యాతః. న చ పరస్య బ్రహ్మణః పారవత్త్వం శక్యముపగన్తుమ్- "అనన్తమపారమ్" (బృ.ఉ.2.4.12)

ఇతి శ్రవణాత్. అర్థాన్తరే చాయతనే పరిగృహ్యమాణే స్మృతిప్రసిద్ధం ప్రధానం పరిగృహీతవ్యమ్, తస్య హి కారణత్వాదాయతనత్వోపపత్తేః. శ్రుతిప్రసిద్ధో వా వాయుః స్యాత్; "వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సన్దృబ్ధాని భవన్తి" (బృ.ఉ.3.7.2) ఇతి వాయోరపి విధారకత్వశ్రవణాత్. శారీరో వా స్యాత్; తస్యాపి భోక్తృత్వాత్. భోగ్యం ప్రపఞ్చం ప్రత్యాయతనత్వోపపత్తేరితి.

## బాలానందిని

ద్యుభ్వాదీతి:- "స్వశబ్దాత్=ఆత్మశబ్దం ఉండడంవల్ల, ద్యుభ్వాద్యాయతనమ్= ద్యులోకభూలోకాదులకు స్థాన మైనది బ్రహ్మయే" అని సూత్రార్థం.

ఇదమితి:- "యస్మిన్... సేతుః" (దేనియందు ద్యులోకం, పృథివి, అంతరిక్షం, సమస్తప్రాణాలతో సహా మనస్సు అల్లుకొని ఉన్నదో (నిలచి ఉన్నదో) దానిని ఒక్కదానినే ఆత్మనుగా తెలుసుకొనండి; ఇతరమైన మాట లన్నీ కట్టిపెట్టండి. ఇది అమృతానికి సేతువు) అని వినబడుచున్నది. ఇక్కడ ద్యులోకం మొదలైనవి అల్లుకొని ఉన్నట్లు చెప్పడంచేత వాటికి స్థాన మైనది ఏదో ఒక టున్నదని తెలుస్తూన్నది; అది పరబ్రహ్మయా లేక మరొక పదార్థ మేదేనేనా అని సందేహించబడుచున్నది. ఈ ఆయతనం మరొక వస్తువేదో అయి ఉంటుంది అని ప్రాప్తించింది (తోస్తున్నది). ఎందువల్ల? "అమృతస్యైష సేతుః" అని వినబడడంవల్ల. అవతల మరొక ఒడ్డు ఉన్నదే సేతువు అని లోకంలో ప్రసిద్ధం కదా? బ్రహ్మ "అనన్త మైనది, అపారము" (అనన్తమపారమ్) అని వింటున్నాం. అందుచేత బ్రహ్మకు పారం ఉన్న దని అంగీకరించడం శక్యం కాదు. మరొక వస్తువును దేనినైనా ఆయతనం అని గ్రహించే పక్షంలో స్మృతి ప్రసిద్ధమైన ప్రధానాన్ని గ్రహించాలి. ఎందువల్ల ననగా అది కారణం గాన దానిని ఆయతనం అని చెప్పడం కుదురుతుంది. లేదా శ్రుతులలో ప్రసిద్ధుడైన వాయువైనా కావచ్చును. "వాయుర్వా...భవన్తి" (ఓ! (గౌతమా!ఆ సమష్టిలింగాత్మకమైన సూత్రం వాయువే. గౌతమా! సూత్రమైన ఈ వాయువుచేతనే ఈ లోకమూ, పరలోకమూ, సమస్త భూతాలూ (మణులు సూత్రంలో గ్రుచ్చబడి ఉన్నట్లు గ్రుచ్చబడి ఉన్నాయి) అనేశ్రుతిచేత వాయువు కూడ విధారణం (అన్నింటినీ నిలిపేది) అని వినబడుచున్నది. లేదా జీవుడైనా కావచ్చును. అతడు

కూడ భోక్త అవడంచేత భోగ్యమైన ఈ ప్రపంచాన్ని గూర్చి ఆయతనత్వం కుదురుతుంది.

vi. ద్వితీయపాదంలో విచారించిన వాక్యాలు చాల వరకు సవిశేష (సగుణ) బ్రహ్మపర మైనవి. వాటిలోని పదాలు అధికంగా రూఢపదాలు. ఈ పాదంలో చర్చించే వాక్యాలు చాల వరకు నిర్విశేష (నిర్గుణ) బ్రహ్మపదాలు. వీటిలోని పదాలు అధికంగా యౌగికాలు. ఉపక్రమంలో ఉన్న సాధారణపదానికి వాక్యశేషంలో ఉన్న ద్యుమూర్ధత్వాదులను పట్టి బ్రహ్మ పరత్వం పూర్వాధికరణంలో చెప్పబడింది. అట్లే ఉపక్రమంలో ఉన్న సాధారణమైన ఆయతనత్వాన్ని వాక్యశేషంలో ఉన్న 'సేతు' పదశ్రవణంచేత ప్రధానాదులకు వర్తింప చెయ్యాలి అని పూర్వాధికరణంతో ఈ అధికరణానికి దృష్టాంతసంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్త ఇదమాహ- ద్యుభ్వాద్యాయతనమితి. ద్యౌశ్చ భూశ్చ ద్యుభువౌ. ద్యుభువావాదీ యస్య తదిదం ద్యుభ్వాది. యదేతదస్మిన్ వాక్యే ద్యౌః పృథివ్యన్తరిక్షం మనః ప్రాణా ఇత్యేవమాత్మకం జగదోతత్వేన నిర్దిష్టం తస్యాయతనం బ్రహ్మ భవితుమర్హతి. కుతః? స్వశబ్దాత్, ఆత్మశబ్దాదిత్యర్థః. ఆత్మశబ్దో హీహ భవతి - "తమేవైకం జానథ ఆత్మనమ్" ఇతి. ఆత్మశబ్దశ్చ పరమాత్మపరిగ్రహే సమ్యగవకల్పతే నార్థాన్తరపరిగ్రహే. క్వచిచ్చ స్వశబ్దేనైవ బ్రహ్మణ ఆయతనత్వం శ్రూయతే- "సన్మూలాః సోమ్యేమాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః" (ఛా.ఉ.6.8.4) ఇతి. స్వశబ్దేనైవచేహ పురస్తాదుపరిష్టాచ్చ బ్రహ్మ సంకీర్త్యతే- "పురుష ఏవేదం విశ్వం కర్మ.తపో బ్రహ్మ పరామృతమ్" ఇతి "బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ" (ము.ఉ.2.2.11) ఇతి చ. తత్ర త్వాయతనాయతనవద్భావశ్రవణాత్, "సర్వం బ్రహ్మ" ఇతి చ సామానాధికరణ్యాత్, యథానేకాత్మకో వృక్షః, శాఖా స్కన్ధో మూలం చేత్యేవం నానారసో విచిత్ర ఆత్మేత్యాశఙ్కా సంభవతి. తాం నివర్తయితుం సావధారణమాహ - "తమేవైకం జానథ ఆత్మానమ్" ఇతి.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు (పూర్వపక్షం) ప్రాప్తించగా "ద్యుభ్వాద్యాయతనమ్" అని చెపుతున్నాడు. ద్యౌశ్చ భూశ్చ ద్యుభువౌ = ద్యులోక భూలోకాలు. ద్యుభువౌ ఆదీ యస్య తత్ ఇదం ద్యుభ్వాది= ద్యులోకభూలోకాలు ఆదియందు దేనికో అది (జగత్తు) ద్యుభ్వాది. ఈ వాక్యంలో ద్యులోకం, పృథివి, అంతరిక్షం, మనస్సు ప్రాణాలు- వీటి

స్వరూప మైన ఏ జగత్తు అల్లికొన్నట్లు నిర్దేశించబడిందో ఆ జగత్తుకు ఆయతనం (ఆధారం) పరబ్రహ్మయే అవడానికి తగి ఉన్నది. ఎందువల్ల? స్వశబ్దంవల్ల, అనగా ఆత్మశబ్దంవల్ల అని అర్థం. ఇక్కడ "తమేవైకం జానథ ఆత్మానమ్" అని ఆత్మశబ్దం ఉన్నది. ఆత్మశబ్దం పరమాత్మను గ్రహిస్తేనే సరిగా కుదురుతుంది గాని మరొక అర్థం ఏది గ్రహించినా కుదరదు. కొన్నిచోట్ల -"సన్మూలాః....సత్ప్రతిష్ఠాః" (ఓ! సౌమ్యుడా, ఈ సమస్తప్రజలు సత్ (బ్రహ్మ) మూలంగా గలవి, సత్ నివాసస్థానంగా గలవి, సత్ ప్రతిష్ఠగా గలవి) అని బ్రహ్మ స్వశబ్దంచేతనే అనగా సాక్షాత్తు బ్రహ్మను బోధించే సచ్ఛబ్దం చేతనే, ఆయతనంగా చెప్పబడింది. (మరొక శ్రుతిలో కూడ బ్రహ్మయే ఆయతనంగా చెప్పబడింది గాన ఇక్కడా అట్లే గ్రహించాలి అని భావం). (ఈ ఉపనిషత్తులోనే ఈ వాక్యానికి) ముందూ తరవాతా కూడ- "పురుషం... అమృతమ్" (సమస్తమైన ఈ ప్రపంచం కర్మ, జ్ఞానం, వీటి ఫల రూపమైన ఈ ప్రపంచం అంతా పురుషుడే. అదే పరమూ అమృతమూ అయిన బ్రహ్మ) అని "బ్రహ్మైవేదమ్... ఉత్తరేణ" (అన్ని దిక్కులందు బ్రహ్మయే) అని ముందూ తరవాతా కూడ స్వశబ్దంచేతనే బ్రహ్మ చెప్పబడుచున్నది. అయితే అక్కడ బ్రహ్మ ఆయతనంవంటిది అని వినబడడంవల్ల 'సర్వం బ్రహ్మ' (అంతా బ్రహ్మయే) అని సామానాధికరణ్యంవల్ల, వృక్షం కొమ్మ, మ్రాను, మొదలు ఇత్యాదిరూపంలో ఏ విధంగా నానారూప మైనదో, అదే విధంగా ఈ ఆత్మ కూడ నానారసాలు కలది, అందుచేత విచిత్ర మైనది అనే భ్రాంతి కలగ వచ్చును. అలాంటి భ్రాంతి తొలగించడం కోసం "తమేవైకం జానథ ఆత్మానమ్" (అది ఏకైకాత్మ అని తెలుసుకొనండి) అని నిర్ధారణపూర్వకంగా శ్రుతి చెప్పుచున్నది. అనగా ఇక్కడ ఉదాహరించిన వాక్యం సవిశేషబ్రహ్మపరం కాదు నిర్విశేషబ్రహ్మపరమే అని శ్రుతియే స్పష్టీకరిస్తున్న దని అర్థం.

## భాష్యమ్

ఏతదుక్తం భవతి- న కార్యప్రపఞ్చవిశిష్టో విచిత్ర ఆత్మా విజ్ఞేయః. కిం తర్హి? అవిద్యాకృతం కార్యప్రపఞ్చం విద్యయా ప్రవిలాపయన్తస్తమే వైకమాయతనభూతమాత్మానం జానథైకరసమితి. యథా యస్మిన్నాస్తే దేవదత్తస్తదానయేత్యుక్త ఆసనమేవానయతి న దేవదత్తమ్, తద్వదాయతన భూతస్యైకరసస్యాత్మనో విజ్ఞేయత్వముపదిశ్యతే. వికారానృతాభిసంధస్య చాపవాదః శ్రూయతే- "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (క.ఉ.2.4.4) ఇతి. సర్వం బ్రహ్మేతి తు సమానాధికరణ్యం ప్రపఞ్చవిలాపనార్థం

నానేకరసతాప్రతిపాదనార్థమ్- "స యథా సైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవ, ఏవం వా అరే అయమాత్మానన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" (బృ.ఉ.4.5.13) ఇత్యేకరసతాశ్రవణాత్. తస్మాద్ద్యుభ్వాద్యాయతనం పరం బ్రహ్మ. యత్తూక్తం సేతుశ్రుతేః, సేతోశ్చ పారవత్త్వోపపత్తేః బ్రహ్మణో ఽర్థాన్తరేణ ద్యుభ్వాద్యాయతనేన భవితవ్యమ్-ఇతి; అత్రోచ్యతే- విధారణత్వమాత్రమత్ర సేతుశ్రుత్యా వివక్ష్యతే న పారవత్త్వాది. న హి మృద్దారుమయో లోకే సేతుర్దృష్ట ఇతి అత్రాపి మృద్దారుమయ ఏవ సేతురభ్యుపగమ్యతే. సేతుశబ్దార్థోఽపి విధారణత్వమాత్రమేవ న పారవత్త్వాది. షిఞః బన్ధనకర్మణః సేతుశబ్దవ్యుత్పత్తేః.

## బాలానందిని

ఏతదితి:- ఇది చెప్పబడినట్లవుతుంది- (ఇక్కడ) కార్యప్రపంచంతో కూడిన విచిత్రమైన ఆత్మ విజ్ఞేయం కాదు. మ రేమనగా- అవిద్యచేత ఏర్పడిన కార్యప్రపంచాన్ని విద్యచేత ప్రవిలాపనం చేస్తూ (హరించిపోయే టట్లు చేస్తూ) ఆయతనమైన, ఏకరసమైన ఆ ఒక్క (నిర్గుణ మైన అద్వితీయమైన) ఆత్మను తెలుసుకొనండి (అని అర్థం). దేవదత్తుడు దేనిమీద కూర్చున్నాడో దానిని తీసికొనిరా అన్నప్పుడు ఆసనమునే తీసికొనివస్తాడు కాని దేవదత్తుణ్ణి ఎలా తీసికొనిరాడో అట్లే ఆయతన మైన, ఏకరసమైన (నిర్విశేషమైన) ఆత్మ తెలియదగినది అని ఉపదేశింపబడుచున్నది. వికారమైన (కార్యమైన) అసత్యవస్తువునందు అభిమానం గలవాని నిందకూడ "మృత్యోః...పశ్యతి" (ఇక్కడ (ఆత్మయందు) నానాత్వం ఉన్నట్లు ఎవడు చూస్తాడో అతడు మృత్యువునుండి మృత్యువును పొందుతాడు) అని వినబడుచున్నది. "సర్వం బ్రహ్మ" "ఇదంతా బ్రహ్మయే' అని సామానాధికరణ్యం (సర్వం అనే దానిని బ్రహ్మకు విశేషణంగా చేసి తుల్యవిభక్తివచనాదులలో ప్రయోగించడం) ప్రపంచప్రవిలాపనం చెయ్యాలి అని చెప్పడంకోసమే కాని అనేకరసత్వాన్ని ప్రతిపాదించడంకోసం కాదు.

వి. "సర్వమూ బ్రహ్మయే" అని చెప్పడంలో ఉద్దేశ్యం సర్వమూ ఉంది అది బ్రహ్మ అని చెప్పడం కాదు. సర్వాన్నీ బ్రహ్మగానే తెలుసుకొని బ్రహ్మకంటె వేరుగా ఉన్నట్లు కనబడే ఆ సర్వాన్నీ బ్రహ్మలో విలీనం చెయ్యా లని చెప్పడం దాని ఉద్దేశ్యం. ("యః చోరః సః స్థాణుః" అన్నట్లు, ఇంతవరకూ చోరు డని అనుకొంటూన్నది చెట్టుమోడు అన్నప్పుడు చోరుడు చెట్టులో విలీనమైపోయినట్లే ఇక్కడ కూడ. దీనినే 'బాధాయాం సామానాధికరణ్యం' అంటారు).

స ఇతి:- "స యథా... ప్రజ్ఞానఘన ఏవ" (మైత్రేయీ! పెద్ద ఉప్పురాయి లోపలా వెలపలా అనే భేదం లేకుండా మొత్తం అంతా ఏ విధంగా ఉప్పగా మాత్రమే ఉంటుందో అదే విధంగా ఈ ఆత్మలోపల బైటా అనే భేదం లేకుండా పూర్తిగా అంతా కూడ ప్రజ్ఞానఘనమే, జ్ఞానపు ముద్దయే అని, ఆత్మ ఏకరస మైనది అని వినబడుచున్నది. సేతుశ్రుతివల్ల, సేతువుకు అవతలి ఒడ్డు ఉండాలి గాన ద్యుభ్వాద్యాయతనం బ్రహ్మకంటె భిన్న మైన మరేదైనా అయి ఉండాలి అని ఏది చెప్పబడిందో ఆ విషయంలో చెప్పబడుతున్నది. ఇక్కడ సేతుశ్రుతిచేత (ఆనకట్ట నీటిని ఏ విధంగా ఆపుతుందో ఆ విధంగా) బ్రహ్మ నిలబెట్టేదిగా ఉంటుంది అన్న అర్థం మాత్రమే వివక్షితం కాని అవతలి ఒడ్డు ఉంటుంది ఇత్యాద్యర్థాలు కూడ వివక్షితాలు కావు. లోకంలో సేతువు (అడ్డకట్ట) మట్టితోను కఱ్ఱలతోను నిర్మించబడుతుంది కదా అని ఈ సేతువు కూడ మృద్దారుమయమే అని అగీకరించబడదు కదా? 'సేతు' శబ్దం బంధనం (అడ్డుపెట్టడం) అనే అర్థం గల 'షిఞ్' ధాతువునుండి ఏర్పడినది గాన దీనికి ధరించడం (అడ్డుకొనడం, నిలపడం) అని మాత్రమే అర్థం కాని అవతల మరొక ఒడ్డు కలిగి ఉండడం మొదలైనవి దీని అర్థాలు కావు.

## భాష్యమ్

అపర ఆహ:- "తమేవైకం జానథ ఆత్మానమ్" ఇతి యదే తత్సంకీర్తితమాత్మజ్ఞానం, యచ్చైతత్ "అన్యా వాచో విముఞ్చథ" ఇతి వాగ్విమోచనమ్, తదత్రామృతత్వసాధనత్వాత్ "అమృతస్యైష సేతుః" ఇతి సేతుశ్రుత్యా సంకీర్త్యతే, న తు ద్యుభ్వాద్యాయతనమ్. తత్ర యదుక్తమ్- "సేతుశ్రుతేరర్థాన్తరేణ ద్యుభ్వాద్యాయతనేన భావ్యమ్" ఇతి ఏతదయుక్తమ్.

## బాలానందిని

మరొకడు అంటున్నాడు - "తమేకైకం జానథ ఆత్మానమ్" అని ఏ ఆత్మజ్ఞానం చెప్పబడిందో, "అన్యా వాచో విముఞ్చథ" అని ఏ వాగ్విమోచనం (వాక్కులను విడచుట) చెప్పబడిందో అదే ఇక్కడ, అమృతత్వానికి సాధనం అవడంచేత (అమృతస్యైష సేతుః) అని సేతుశ్రుతిచేత (సేతువుగా) చెప్పబడుతున్నది గాని ద్యుభ్వాద్యాయతనం సేతువుగా చెప్పబడడం లేదు. అందువల్ల-సేతుశ్రుతివల్ల ద్యుభ్వాద్యాయతనం బ్రహ్మకంటె భిన్నమైన మరొకటి ఏదైనా కావాలి అని చెప్పడం యుక్తం కాదు.

## సూ. ముక్తోపసృప్యవ్యపదేశాత్. 1.3.2

ఇతశ్చ పరమేవ బ్రహ్మ ద్యుభ్వాద్యాయతనమ్, యస్మాన్ముక్తోప సృప్యతాస్య వ్యపదిశ్యమానా దృశ్యతే. ముక్తైరుపసృప్యం ముక్తోపసృప్యమ్. దేహాదిష్వనాత్మస్వహమస్మీత్యాత్మబుద్ధిరవిద్యా. తతస్తత్పూజనాదౌ రాగ స్తత్పరిభవాదౌ చ ద్వేషః, తదుచ్ఛేదదర్శనాద్భయం మోహశ్చేత్యేవమనన్తభేదోఽ నర్థవ్రాతః సన్తతః సర్వేషాం నః ప్రత్యక్షః. తద్విపర్యయేణావిద్యారాగ ద్వేషాదిదోషముక్తైరుపసృప్యం గమ్యమేతదితి ద్యుభ్వాద్యాయతనం ప్రకృత్య వ్యపదేశో భవతి. కథమ్?

"భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః,

క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ము.ఉ.2.2.8)

ఇత్యుక్త్వా బ్రవీతి-

"తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్" (ము.ఉ.3.2.8) ఇతి. బ్రహ్మణశ్చ ముక్తోపసృత్యత్వం ప్రసిద్ధం శాస్త్రే -

"యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః

అథ మర్త్యోఽమృతో భవతి అత్ర బ్రహ్మ సమశ్నుతే" (బృ. ఉ.4.4.7)

ఇత్యేవమాదౌ. ప్రధానాదీనాం తు న క్వచిన్ముక్తోపసృపత్వమస్తి ప్రసిద్ధమ్. అపి చ 'తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముఞ్చథామృతస్యైష సేతుః" ఇతి వాగ్విమోకపూర్వకం విజ్ఞేయత్వమిహ ద్యుభ్వాద్యాయతనస్యోచ్యతే. తచ్చ శ్రుత్యన్తరే బ్రహ్మణో దృష్టమ్-

"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః

నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్వాచో విగ్లాపనం హి తత్" (బృ.ఉ.4.4.21) ఇతి. తస్మాదపి ద్యుభ్వాద్యాయతనం పరం బ్రహ్మ. 2.

### బాలానందిని

ముక్తేతి: "ముక్తోపసృప్యవ్యపదేశాత్= ముక్తులచేత పొందదగినదిగా చెప్పడంచేత, ద్యుభ్వాద్యాతనం బ్రహ్మయే" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ ద్యుభ్వాద్యాయతనం పరబ్రహ్మయే. ఎందువల్లననగా ఇది ముక్తులచేత పొందబడదగినదిగా చెప్పబడుచున్నది. ముక్తులచేత పొందదగినది ముక్తోపసృప్యం. ఆత్మ కాని దేహాదులయందు 'ఇదే నేను' అని ఆత్మబుద్ధి అవిద్య. దానివల్ల ఆ దేహాదులను (ఇతరులు) పూజించి నప్పుడు రాగము, వాటిని అనాదరం చేసినప్పుడు ద్వేషమూ, దానికి వినాశం కనబడి నప్పుడు భయము, మోహము ఈ విధంగా అనంతభేదాలు గల, అవిచ్ఛిన్నంగా కొనసాగు తూన్న అనర్థసముదాయం మన కందరికీ ప్రత్యక్షంగా (అనుభవంలో) ఉంది. దీనికి విరుద్ధంగా అవిద్య, రాగం, ద్వేషం మొదలైన దోషాలు లేనివారిచేత ఇది ఉపసృప్యం, అనగా గమ్యం, అని ద్యుభ్వాద్యాయతనాన్ని ప్రస్తావించి వ్యపదేశం (చెప్పడం) ఉన్నది. ఎట్లు? "భిద్యతే...పరావరే" (కారణరూపంచేత పరమూ, కార్యరూపంచేత అపరమూ (తక్కువదీ) అయిన ఆ పరమాత్మ చూడబడగానే హృదయగ్రంథి (అవిద్యాకృతవాసనల సముదాయం) బ్రద్ద లైపోతుంది. సమస్తసంశయాలు తెగిపోతాయి. వీని కర్మలన్నీ నశిస్తాయి) అని చెప్పి "తథా...దివ్యమ్" (గంగాదినదులు తమ నామరూపాలను విడచి సముద్రరూపంలో ఉన్నట్లు విద్వాంసుడు కూడ నామరూపాలు విడచి పరంకంటె, అనగా కారణమైన అవ్యక్తంకంటె, పరమైన, దివ్యుడైన పురుషుణ్ణి, పరమాత్మను పొందుతాడు) అని చెపుతున్నది. బ్రహ్మ ముక్తులచేత పొందదగినది అనే విషయం "యదా... సమశ్నుతే" (వీని హృదయంలో ఉన్న కామా లన్నీ ఎప్పుడు తొలగిపోతాయో అప్పుడు ఆ మర్త్యుడు అమృతు డవుతాడు; ఇక్కడే బ్రహ్మను పొందుతాడు) ఇత్యాది శాస్త్రంలో ప్రసిద్ధం. కాని ప్రధానాదులు ముక్తోపసృప్యము లని ఎక్కడా ప్రసిద్ధంగా లేదు. మరొక విషయ మేమనగా- "తమేవైకం...సేతుః" అని వాక్కులన్నీ విడిచిపెట్టి ద్యుభ్వాద్యాయతనం తెలియదగినది అని ఇక్కడ చెప్పబడుచున్నది. ఇది బ్రహ్మ విషయంలో మరొక శ్రుతిలో కూడ" తమేవ..తత్" (బుద్ధిమంతుడైన బ్రాహ్మణుడు ఆ పరమాత్మనే తెలుసుకొని ప్రజ్ఞను (వాక్యార్థజ్ఞానాన్ని) చెయ్యాలి. ఎక్కువ శబ్దాలను గూర్చి ధ్యానం చేయగూడదు. అది వాక్కును (వాగింద్రియాన్ని) వాడిపోయే టట్లు చేస్తుంది) అని కనబడుతున్నది. ఆ కారణంవల్ల కూడ ద్యుభ్వాద్యాయతనం పరబ్రహ్మయే.2.

## సూ. నానుమానమతచ్ఛబ్దాత్. 1.3.3.

యథా బ్రహ్మణః ప్రతిపాదకో వైశేషికో హేతురుక్తః నైవమర్థాన్తరస్య వైశేషికో హేతుః ప్రతిపాదకోఽస్తీత్యాహ- నానుమానికం సాంఖ్యస్మృతికల్పితం ప్రధానమిహ ద్యుభ్వాద్యాయతనత్వేన ప్రతిపత్తవ్యమ్. కస్మాత్? అతచ్ఛబ్దాత్.

తస్య అచేనస్య ప్రతిపాదకః శబ్దః తచ్ఛబ్దః. న తచ్ఛబ్దోఽతచ్ఛబ్దః. న హ్యత్రాచేతనస్య ప్రధానస్య ప్రతిపాదకః కశ్చిచ్ఛబ్దోఽస్తి, యేనాచేతనం ప్రధానం కారణత్వేన ఆయతనత్వేన వావగమ్యేత. తద్విపరీతస్య చేతనస్య ప్రతిపాదకోఽత్రాస్తి "యః సర్వజ్ఞః సర్వవిత్" (ము.1.1.9) ఇత్యాదిః. అత ఏవ న వాయురపీహ ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రీయతే. 3.

## బాలానందిని

నేతి:- "అతచ్ఛబ్దాత్= ప్రధానాన్ని చెప్పే శబ్దం ఏదీ లేకపోవడంవల్ల ప్రధానం కంటె భిన్నమైన ఆత్మను చెప్పే శబ్దం ఉండడంవల్ల, అనుమానమ్=ప్రధానం, న= ద్యుభ్వాద్యాయతనం కాదు" అని సూత్రానికి అర్థం.

యథేతి:- బ్రహ్మను ప్రతిపాదించే విశిష్టమైన హేతువు ఉన్నట్లు మరొక అర్థాన్ని బోధించే విశిష్టహేతువు ఏదీ లేదు అని చెపుతున్నాడు- అనుమానమ్=సాంఖ్యుల స్మృతు లలో కల్పించబడిన ప్రధానం, ఇక్కడ ద్యుభ్వాద్యాయతనంగా గ్రహింపతగదు; ఎందు వల్ల? అతచ్ఛబ్దంవల్ల. అచేతనమైన ప్రధానాన్ని ప్రతిపాదించిన శబ్దం తచ్ఛబ్దం. తచ్ఛబ్దం కానిది అతచ్ఛబ్దం. ఇక్కడ, అచేతనమైన ప్రధానాన్ని కారణం గాను, ఆయతనం గాను గ్రహించడానికి వీలును కల్పించే అచేతనప్రధానప్రతిపాదక మైన శబ్దం ఏదీ లేదు కదా? ప్రధానానికి విపరీతమైన చేతనాన్ని ప్రతిపాదించే "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇత్యాదిశబ్దం ఇక్కడ ఉంది. అందుచేతనే (అచేతనమైన) వాయువు కూడ ఇక్కడ ద్యుభ్వాద్యాయతనంగా గ్రహించబడదు. 3.

## సూ. ప్రాణభృచ్చ. 1.3.4.

యద్యపి ప్రాణభృతః విజ్ఞానాత్మనః ఆత్మత్వం చేతనత్వం చ సంభవతి తథాప్యుపాధిపరిచ్ఛిన్నజ్ఞానస్య సర్వజ్ఞత్వాద్యసంభవే సత్యస్మాదేవాతచ్ఛబ్దాత్ ప్రాణభృదపి న ద్యుభ్వాద్యాయతనత్వేన ఆశ్రయితవ్యః. న చోపాధి పరిచ్ఛిన్నస్యావిభోః ప్రాణభృతో ద్యుభ్వాద్యాయతనత్వమపి సమ్యక్సం భవతి. పృథగ్యోగకరణముత్తరార్థమ్.

## బాలానందిని

ప్రాణేతి:- వెనుకటి సూత్రంనుంచి "న, అతచ్ఛబ్దాత్" అను పదాలు అనువృత్తి తెచ్చుకోవాలి. ప్రాణభృచ్చ=జీవుడు కూడ, న=ద్యుభ్వాద్యాయతనం కాదు, అతచ్ఛబ్దం వల్ల అని సూత్రార్థం.

యద్యపీతి:- ప్రాణభృత్తుకు అనగా విజ్ఞానాత్మకు (ప్రాణాలను ధరించే జీవునకు), ఆత్మత్వ-చేతనత్వాలు ఉన్నా కూడ, ఉపాధిచేత పరిచ్ఛిన్నమైన (అత్యల్పంగా కుదించబడిన) జ్ఞానం గల ఆ విజ్ఞానాత్మకు కూడ సర్వజ్ఞత్వాదులు కుదరవు. అందుచేత "అతచ్ఛబ్దాత్" అనే ఈ హేతువువల్లనే జీవుడు కూడ ద్యుభ్వాద్యాయతనంగా గ్రహింపదగినవాడు కాదు. ఉపాధిచేత పరిచ్ఛిన్నుడు, అనీశ్వరుడు అయిన, లేదా సర్వవ్యాపి కాని జీవునకు ద్యుభ్వాద్యాయతనత్వం కుదరదు. వేరుగా సూత్రం చెప్పడం ముందు సూత్రం కొరకు.

వి. "అతచ్ఛబ్దాత్" అనే హేతువు ప్రధాన - జీవులకు రెండింటికీ సమానమే గాన "నానుమానప్రాణభృతావతచ్ఛబ్దాత్" అని ఒకే సూత్రం చెప్పవచ్చును కదా అని ఆశంకించుకొని "ప్రాణభృచ్చ" అనేది రాబోయే సూత్రాలలో కూడ అన్వయించడంకోసం వేరే సూత్రంగా రచించబడింది అని సమాధానం చెప్పబడింది.

## భాష్యమ్

కుతశ్చ న ప్రాణభృద్ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రయితవ్యః-

### సూ. భేదవ్యపదేశాత్. 1.3.5.

బేదవ్యపదేశశ్చేహ భవతి- 'తమేవైకం జానథ ఆత్మానమ్" ఇతి జ్ఞేయజ్ఞాతృభావేన. తత్ర ప్రాణభృత్తావత్ ముముక్షుత్వాద్ జ్ఞాతా; పరిశేషాదాత్మశబ్దవాచ్యం బ్రహ్మ జ్ఞేయం ద్యుభ్వాద్యాయతనమితి గమ్యతే, న ప్రాణభృత్.5.

## బాలానందిని

కుత ఇతి:- మరి ఏ కారణం చేత కూడ ప్రాణభృత్తును (జీవుణ్ణి) ద్యుభ్వాద్యాయతనంగా గ్రహింపకూడదు?

భేదేతి:- "భేదవ్యపదేశాత్= జీవునకు పరమాత్మకూ భేదం చెప్పబడింది. ఆ కారణంచేత కూడ జీవుణ్ణి ద్యుభ్వాద్యాయతనంగా గ్రహించగూడదు" అని సూత్రార్థం.

భేదేతి:- "తమేవైకం జానథ ఆత్మానమ్" అని ఇక్కడ జ్ఞేయజ్ఞాతృభావాన్ని పురస్కరించుకొని భేదవ్యపదేశం కూడ ఉన్నది. జీవు డైతే ముముక్షువు; అందుచేత జ్ఞాత (తెలుసుకొనేవాడు). పరిశేషన్యాయంచేత ఆత్మశబ్దంచేత చెప్పబడే బ్రహ్మ జ్ఞేయం (తెలియదగినది). అదే ద్యుభ్వార్యాయతనంగా తెలియబడుతున్నది గాని జీవుడు కాదు.

ఎ. ఇద్దరిలో ఒకనిని చూపి ఇతడు చాల తెలివైనవాడు అని అంటె రెండవవాడు అంతగా తెలివైనవాడు కాడు అని చెప్పకపోయినా తెలుస్తుంది. ఇది పరిశేషన్యాయం.

## భాష్యమ్

కుతశ్చ న ప్రాణభృద్ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రయితవ్యః?-

### సూ. ప్రకరణాత్. 1.3.6.

ప్రకరణం చేదం పరమాత్మనః "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ము.ఉ.1.1.3) ఇత్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానాపేక్షణాత్. పరమాత్మని హి సర్వాత్మకే విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం స్యాన్న కేవలే ప్రాణభృతి. 1.3.6

## బాలానందిని

కుతశ్చేతి:- ఇంకా ఏ కారణంవల్ల కూడ ప్రాణభృత్తును ద్యుభ్వాద్యాయతనంగా గ్రహించకూడదు?

ప్రకరణాదితి:- "ప్రకరణాత్ చ= ఇది పరమాత్మప్రకరణం అవడంవల్ల కూడ జీవుణ్ణి ద్యుభ్వాద్యాయతనంగా గ్రహించగూడదు" అని సూత్రార్థం.

ప్రకరణమితి:- "ఇది పరమాత్మను గూర్చి చెపుతూన్న ప్రకరణం. ఎందుచేత ననగా- "కస్మిన్ను...భవతి" (పూజ్యుడా! దేనిని తెలుసుకుంటే ఇది అంతా తెలుస్తుంది?) అని ఒకదానిని తెలుసుకొనడంచేత అన్నీ తెలియాలి అని కోరబడింది. సర్వాత్ముడైన పరమాత్మను తెలుసుకుంటే ఇదంతా తెలుస్తుంది గాని కేవలం జీవుణ్ణి తెలుసుకుంటే తెలియదు కదా?6.

## భాష్యమ్

కుతశ్చ న ప్రాణభృద్ద్యుభ్వాద్యాయతనత్వేనాశ్రయితవ్యః?

### సూ. స్థిత్యదనాభ్యాం చ 1.3.7.

ద్యుభ్వాద్యాయతనం ప్రకృత్య "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" (ము.3.1.1.) ఇత్యత్ర స్థిత్యదనే నిర్దిశ్యేతే, "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" ఇతి కర్మఫలాశనమ్, "అనశ్నన్నన్యోభిచాకశీతి" ఇత్యౌదాసీన్యేనావస్థానం చ.

తాభ్యాం చ స్థిత్యదనాభ్యామీశ్వరక్షేత్రజ్ఞౌ తత్ర గృహ్యేతే. యది చేశ్వరో ద్యుభ్వాద్యాయతనత్వేన వివక్షితస్తతస్తస్య ప్రకృతస్యేశ్వరస్య క్షేత్రజ్ఞాత్పృథగ్వచనమవకల్పతే, అన్యథా హ్యప్రకృతవచనమాకస్మిక మసంబద్ధం స్యాత్. నను తవాపి క్షేత్రజ్ఞస్యేశ్వరాత్ పృథగ్వచనమాకస్మికమేవ ప్రసజ్యేత. న.తస్యావివక్షితత్వాత్. క్షేత్రజ్ఞో హి కర్తృత్వేన భోక్తృత్వేన చ ప్రతిశరీరం బుద్ధ్యాద్యుపాధిసంభద్ధో లోకత ఏవ ప్రసిద్ధో నాసౌ శ్రుత్యా తాత్పర్యేణ వివక్ష్యతే. ఈశ్వరస్తు లోకతో ప్రసిద్ధత్వాత్ శ్రుత్యా తాత్పర్యేణ వివక్ష్యత ఇతి న తస్యాకస్మికం వచనం యుక్తమ్.

బాలానందిని

కుతశ్చేతి:- మరి ఏ కారణంచేత కూడ జీవుణ్ణి ద్యుభ్వాద్యాయతనంగా గ్రహించకూడదు?

"స్థితీతి:- స్థిత్యదనాభ్యాం చ=పరమేశ్వరుడు ఉదాసీనుగా ఉన్నట్లు జీవుడు కర్మఫలం అనుభవిస్తున్నట్లు చెప్పడంవల్ల కూడ జీవుణ్ణి గ్రహించకూడదు" అని సూత్రార్థం.

ద్యుభ్వాద్యాయతనమితి:- ద్యుభ్వాద్యాయతనాన్ని గూర్చి చెప్పడం ప్రారంభించి "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" అనే వాక్యంలో స్థితి, అదనము నిర్దేశించబడు తున్నాయి. "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" అని కర్మఫలభోగం, "అనశ్నన్నన్యోఽ భిచాకశీతి" అని ఉదాసీనుడుగా ఉండడమూ చెప్పబడుతున్నాయి. అక్కడ చెప్పిన ఆ స్థిత్యదనాలను బట్టి ఈశ్వర-క్షేత్రజ్ఞులు గ్రహింపబడుతున్నారు. ద్యుభ్వాద్యాయతనం ఈశ్వరు డని వివక్షితు డైతేనే అప్పుడు ప్రకృతుడైన ఆ ఈశ్వరుణ్ణి క్షేత్రజ్ఞునికంటె వేరుగా చెప్పడం కుదురుతుంది. అలా కాకపోతే (ద్యుభ్వాద్యాయతనం ఈశ్వరుడు అని చెప్పకపోతే) ఈ వాక్యంలో హటాత్తుగా అప్రకృతుడైన ఈశ్వరుణ్ణి చెప్పిన ట్లవుతుంది. అది అసంబద్ధంగా ఉంటుంది.

వి. ప్రారంభంలో చెప్పిన ద్యుభ్వాద్యాయతనం పరమేశ్వరుడే కాబట్టి ఆ పర మేశ్వరుణ్ణే గూర్చి "ద్వాసుపర్ణా" ఇత్యాది వాక్యంలో చెప్పడం యుక్తంగా ఉంటుంది. అలా కాకుండా "యస్మిన్ ద్యౌశ్చ" ఇత్యాదివాక్యంలో చెప్పబడింది జీవుడే అయితే ఇక్కడ అకస్మాత్తుగా పరమేశ్వరుణ్ణి (చెప్పడం) అప్రస్తుతప్రసంగం అవుతుంది అని భావం.

అయితే-"యస్మిన్ ద్యౌః" ఇత్యాది వాక్యంలో జీవుణ్ణి చెప్పకుండా ఇక్కడ జీవుణ్ణి గూర్చి హటాత్తుగా చెప్పడ మాత్రం అప్రస్తుతప్రసంగం కాదా అని ఆశంకిస్తున్నాడు- నన్వితి:- నీకు కూడ (ప్రకృతుడైన పరమేశ్వరుణ్ణి గూర్చి ఈ వాక్యం

చెపుతున్నది అని చెప్పే నీ మతం అంగీకరిస్తే కూడ) ఈశ్వరునికంటె భిన్నుణ్ణిగా ఇక్కడ జీవుణ్ణి చెప్పడం ఆకస్మికమే అవుతుంది కదా? కాదు. ఎందువల్ల ననగా జీవుడు వివక్షితుడు (చెప్ప నిచ్ఛయింపబడిన వాడు)కాదు. బుద్ధి మొదలైన ఉపాధుల సంబంధంతో ప్రతీ శరీరంలోను ఉన్న క్షేత్రజ్ఞుడు కర్తగాను, భోక్తగాను అందరికీ తెలిసినవాడే. ఆ క్షేత్రజ్ఞుణ్ణి గూర్చి చెప్పడంలో శ్రుతికి తాత్పర్యం లేదు. ఈశ్వరుడైతే లోకప్రసిద్ధుడు కాదు, లోకంవల్ల తెలియడు. అందుచేత అతనిని గూర్చి చెప్పా లని శ్రుతికి తాత్పర్యం ఉంటుంది. అలాంటి ఈశ్వరుణ్ణి గూర్చి హటాత్తుగా చెప్పడం యుక్తం కాదు. (ప్రకృతు డైన ఈశ్వరుణ్ణి గూర్చి చెప్పే సందర్భంలో ఆ ఈశ్వరుడు శుద్ధ చైతన్య రూపుడు, సాక్షిమాత్రుడు అని చెప్పడంకోసం, ప్రసంగవశంచేత జీవుణ్ణి గూర్చి చెప్పడం అయుక్తం కాదు అని భావం)

## భాష్యమ్

"గుహాం ప్రవిష్టావాత్మానౌ హి" ఇత్యత్రాప్యేతద్దర్శితమ్-"ద్వా సుపర్ణా" ఇత్యస్యామృచీశ్వరక్షేత్రజ్ఞావుచ్యేతే ఇతి. యదాపి పైఙ్గ్యుపనిషత్కృతేన వ్యాఖ్యానేనాస్యామృచి సత్త్వక్షేత్రజ్ఞావుచ్యేతే తదాపి న విరోధః కశ్చిత్. కథమ్? ప్రాణభృద్ధీహ ఘటాదిచ్ఛిద్రవత్సత్త్వాద్యుపాధ్యభిమానిత్వేవ ప్రతిశరీరం గృహ్యమాణో ద్యుభ్వాద్యాయతనం న భవతీతి నిషిధ్యతే. యస్తు సర్వ శరీరేషూపాధిభిర్వినోపలక్ష్యతే పరమాత్మైవ స భవతి, యథా ఘటాదిచ్ఛిద్రాణి ఘటాదిభిరుపాధిభిర్వినోపలక్ష్యమాణాని మహాకాశ ఏవ భవన్తి, తద్వత్ప్రాణభృతః పరస్మాదన్యత్వానుపపత్తేః ప్రతిషేధో నోపపద్యతే. తస్మాత్సత్త్వాద్యుపాధ్యభిమానిన ఏవ ద్యుభ్వాద్యాయతనత్వప్రతిషేధః. తస్మాత్పరమేవ బ్రహ్మ ద్యుభ్వాద్యాయతనమ్. తదేతత్ "అదృశ్యత్వాది గుణకో ధర్మోక్తేః" ఇత్యనేనైవ సిద్ధమ్; తస్యైవ హి భూతయోనివాక్యస్య మధ్య ఇదం పఠితమ్ "యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమ్" ఇతి. ప్రపఞ్చార్థం తు పునరుపన్యస్తమ్. 7

## బాలానందిని

గుహామితి: ''ద్వాసుపర్ణా'' అనే ఋక్కులో ఈశ్వరక్షేతజ్ఞులు చెప్పబడు తున్నారు అని "గుహాం ప్రతిష్టావాత్మానౌ హి" అనే అధికరణంలో కూడ చూపబడింది. పైంగ్యుపనిషత్తు చేసిన వ్యాఖ్యానం ప్రకారం ఈ ఋక్కులో చెప్పబడినవాళ్లు బుద్ధి-

క్షేత్రజ్ఞులే అయినా (ఈ సూత్రార్థానికి) విరోధం ఏదీ లేదు. ఎట్లు? (ఆకాశానికి ఉపాధులైన) ఘటాదుల ఛిద్రాల వలె (ఘటాదులలోని అవకాశాల వలె) బుద్ధి మొదలైన ఉపాధులయందు అభిమానం (నేను అనే భావన) కలవాడై ప్రతీ శరీరంలోనూ గ్రహించబడుచున్న జీవు డైతే ఇక్కడ ద్యుభ్వాద్యాయతనం కాజాలడు అని నిషేధించబడుతున్నాడు. ఉపాధులు లేకుండా (ఉపాధ్యభిమానం లేకుండా) సమస్తశరీరాలలోను ఏ ఆత్మ పొందబడుచున్నదో అది పరమాత్మయే. ఘటాదిచ్ఛిద్రాలు ఘటాదులైన ఉపాధులు లేకుండా (ఉపాధులనుండి వేరుచేసి) చూడబడి నప్పుడు ఏ విధంగా మహాకాశమే అవుతాయో అట్లే జీవుడు పరమాత్మకంటె వేరు అనడం కుదరదు గాన అలాంటి జీవునకు ద్యుభ్వాద్యాయనత్వం లేదని నిషేధించడం కుదరదు. అందువల్ల సత్త్వాద్యుపాధుల అభిమానం ఉన్నవానికే ద్యుభ్వాద్యాయనత్వం నిషేధించబడుతుంది. అందువల్ల ద్యుభ్వాద్యాయతనం పరబ్రహ్మయే.

వి. "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి" అనే అదనవాక్యంచేత జీవునికి ఉపాధియైన బుద్ధిని అనువదించి "అనశ్నన్నన్యోఽభిచాకశీతి" అనే స్థితివాక్యంచేత జీవుడు ఉపాధిరహిత మైన రూపంతో బ్రహ్మస్వభావుడుగా, ఉదాసీనుడుగా, భోక్తృత్వం లేనివాడుగా చెప్పబడ్డాడు. అందుకొరకే అచేతనమైన బుద్ధిసత్త్వానికి అపారమార్థికమైన భోక్తృతం చెప్పబడింది. ఈ మంత్రం ఇలాంటి జీవుణ్ణి చెప్పడం ద్వారా ద్యుభ్వాద్యాయతన మైన బ్రహ్మనే చెప్పినట్లవుతుంది. ఉపాధ్యవచ్ఛిన్నజీవున కైతే ద్యుభ్వాద్యాయతనత్వం నిషేధింపబడింది.

అవ. వాస్తవంలో ఈ అధికరణాన్ని వేరుగా చెప్పవలసిన పని లేదు; అదృశ్యత్వాద్యధి కరణంచేతనే ఈ అధికరణంలో చెప్పిన విషయమంతా గతార్థమైనది. అయినా స్పష్టంగా విషయాన్ని ప్రతిపాదించడం కోసం ఈ అధికరణం చెప్పడం జరిగింది. అని చెపుతున్నారు- **తదేతదితి:-** ఈ విషయం 'అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః' అనేదానిచేతనే సిద్ధించింది. ఎందువల్ల ననగా "యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమ్" అనే వాక్యం ఆ భూతయోనివాక్యం మధ్యలోనే అనగా ఆ వాక్యం చెప్పిన ప్రకరణంలోనే పఠింపబడింది. (ప్రకరణాన్ని పట్టి ఈ వాక్యానికి కూడ పరబ్రహ్మవాచకత్వం సిద్ధిస్తుంది గాన ఈ అధికరణం చెప్పి ఈ వాక్యం చర్చించవలసిన పని లేదు. కేవలం సవిస్తరంగా వివరించడంకోసం మళ్లీ చెప్పబడింది. 7

ద్యుభ్వాద్యధికరణం సమాప్తం

## 2. భూమాధికరణమ్. సూ.8-9

## సూ. భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్. 1.3.8

ఇదం సమామనన్తి - "భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" ఇతి "భూమానం భగవో విజిజ్ఞాసే" ఇతి. "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా, అథ యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పమ్. (ఛా.ఉ.7.23.24) ఇత్యాది. తత్ర సంశయః- కిం ప్రాణో భూమా స్యాదాహోస్విత్పరమాత్మా ఇతి. కుతః సంశయః? భూమేతి తావద్బహుత్వమభిధీయతే- "బహోర్లోపో భూ చ బహోః" (పా.సూ.6.4.158) ఇతి భూమశబ్దస్య భావప్రత్యయాన్తతాస్మరణాత్. కిమాత్మకం పునస్తద్బహుత్వమితి విశేషాకాఙ్క్షాయాం "ప్రాణో వా ఆశాయా భూయాన్" (ఛా.ఉ.7.1.5.1) ఇతి సంనిధానాత్ ప్రాణో భూమేతి ప్రతిభాతి. తథా- "శ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్యస్తరతి శోకమాత్మవిత్" ఇతి, "సోఽహం భగవః శోచామి తం మా భగవాన్ శోకస్య పరం పారం తారయతు" (ఛా.ఉ.7.1.1.3) ఇతి ప్రకరణోత్థానాత్పరమాత్మా భూమేత్యపి ప్రతిభాతి. తత్ర కస్యోపాదానం న్యాయ్యం కస్య వా హానమితి భవతి సంశయః.

### బాలానందిని

భూమేతి:- "భూమా=భూమ పరమాత్మయే. సంప్రసాదాదధ్యుపదేశాత్= ప్రాణం తరవాత ఉపదేశించడం వల్ల" అని సూత్రార్థం.

ఇదమితి:- "భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" (భూమయే తెలుసుకొనదగినది) "భూమానం...విజిజ్ఞాసే" (ఓ పూజ్యుడాః భూమనే తెలుసుకొనదలచుచున్నాను) అని, "యత్ర...అల్పమ్" (ఎక్కడ మరొకదానిని చూడడో, మరొకదానిని వినడో, మరొకదానిని తెలుసుకొనడో అది భూమ, ఎక్కడ మరొకదానిని చూస్తాడో, మరొకదానిని వింటాడో, మరొకదానిని తెలుసుకొంటాడో అది అల్పం) అనీ (ఛాందోగ్యోపనిషత్తులో) పఠిస్తున్నారు. అక్కడ ఈ భూమ ప్రాణమా లేక పరమాత్మయా అని సందేహం. సందేహం ఎందువల్ల? 'భూమా' అని బహుత్వం చెప్పబడుతుంది. ఎందువల్ల ననగా "బహోర్లోపో భూ చ బహోః" అని పాణినిసూత్రంచేత (ఈ పదం) భావప్రత్యయాంతం అని చెప్పబడింది.

వి. "పృథ్వాదిభ్య ఇమనిజ్వా" అనే సూత్రంచేత 'పృథు మొదలైన శబ్దాలకు భావార్థంలో (ధర్మం అనే అర్థంలో) ఇమనిచ్ ప్రత్యయం చేర్చగా 'ప్రథిమా' 'లఘిమా' ఇత్యాదిరూపాలు తయారవుతాయి. బహుశబ్దానికి కూడ భావార్థంలో ఈ ప్రత్యయం చేర్చగా పైన ఉదాహరించిన సూత్రంచేత 'ఇమన్'లోని 'ఇ' లోపిస్తుంది; 'బహు' స్థానంలో 'భూ,.వస్తుంది. ఈ విధంగా 'భూమన్' అను నకరాంతశబ్దం నిష్పన్నం అవుతుంది. 'బహుత్వం' అధికత్వం అని అర్థం.

కిమితి: ఆ బహుత్వం ఏ విధమైనది, దేనికి సంబంధించినది అని విశేషాన్ని గూర్చిన ఆకాంక్ష (ప్రశ్న) కలిగినప్పుడు "ప్రాణో...భూయాన్" (ఆశకంటె ప్రాణం అధికమైనది) అనే వాక్యం దగ్గర ఉండడంవల్ల ప్రాణం భూమ అని తోస్తుంది. అట్లే "శ్రుతం... ఆత్మవిత్" (పూజ్యుడా! మీవంటివారినుండి ఆత్మను తెలుసుకొన్నవాడు శోకాన్ని దాటతాడు అని నేను విని ఉన్నాను) అని, "సోఽహం... తారయతు" (పూజ్యుడా! అట్టి నేను శోకిస్తున్నాను. అట్టి నన్ను నీవు శోకంయొక్క పారాన్ని దాటించెదవు గాక) అని ప్రకరణం ప్రారంభం అవడంవల్ల పరమాత్మ కూడ భూమ కావచ్చును అని తోస్తుంది. అందులో దేనిని గ్రహించాలి దేనిని త్యజించాలి అని సంశయం కలుగుతుంది.

## భాష్యమ్

కిం తావత్ప్రాప్తమ్? ప్రాణో భూమేతి. కస్మాత్? భూయః ప్రశ్న ప్రతివచనపరంపరాదర్శనాత్. యథా హి "అస్తి భగవో నామ్నో భూయః' ఇతి, "వాగ్వావ నామ్నో భూయసీ" ఇతి, తథా "అస్తి భగవో వాచో భూయః" ఇతి చ నామాదిభ్యో హ్యాప్రాణాద్భూయఃప్రశ్నప్రతివచనప్రవాహః ప్రవృత్తః నైవం ప్రాణాత్పరం భూయః ప్రశ్నప్రతివచనం దృశ్యతే-అస్తి భగవః ప్రాణాద్భూయః ఇతి, అదో వా వ ప్రాణాద్భూయ ఇతి. ప్రాణమేవ తు నామాదిభ్యః ఆశాన్తేభ్యః భూయాంసం "ప్రాణో వా ఆశాయా భూయాన్" ఇత్యాదినా సప్రపఞ్చముక్త్వా ప్రాణదర్శినశ్చాతివాదిత్వమ్: "అతివాద్యసీతి, అతివాద్యస్మీతి బ్రూయాన్నాపహ్నువీత" ఇత్యభ్యనుజ్ఞాయ, "ఏష తు వా అతివదతి యః సత్యే నాతివదతి" ఇతి ప్రాణవ్రతమతివాదిత్వమనుకృష్యాపరిత్యజ్యైవ ప్రాణం సత్యాదిపరమ్పరయా భూమానమవతారయన్ ప్రాణమేవ భూమానం మన్యత ఇతి గమ్యతే. కథం పునః ప్రాణే భూమని వ్యాఖ్యాయమానే "యత్ర నాన్యత్పశ్యతి" ఇత్యేతద్భూమ్నో లక్షణపరం వచనం వ్యాఖ్యాయేతేతి. ఉచ్యతే- సుషుప్త్యవస్థాయాం

ప్రాణగ్రస్తేషు కరణేషు దర్శనాదివ్యవహారనివృత్తి దర్శనాత్ సంభవతి ప్రాణస్యాపి "యత్ర నాన్యత్పశ్యతి" ఇత్యేతల్లక్షణమ్. తథా చ శ్రుతిః- "న శృణోతి న పశ్యతి" ఇత్యాదినా సర్వకరణవ్యాపార ప్రత్యస్తమయరూపాం సుషుప్త్యవస్థాముక్త్వా "ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి" (ప్ర.ఉ.4.2.3.) ఇతి తస్యామేవావస్థాయాం పఞ్చవృత్తేః ప్రాణస్య జాగరణం బ్రువతీ ప్రాణప్రధానాం సుషుప్త్యవస్థాం దర్శయతి.

బాలానందిని

కిమితి:- ఏమి ప్రాప్తించింది? భూమ ప్రాణం అని ప్రాప్తించింది. ఎందువల్ల? అనేకపర్యాయాలు లేదా అధికమైనదానిని గూర్చి ప్రశ్న-ప్రతివచనాల పరంపర కనబడటంవల్ల. ఎట్లనగా- "అస్తి... భూయః" (పూజ్యుడా! నామకంటె అధికమైనది ఉందా?) అని "వాగ్... భూయసీ" (వాక్కు నామకంటె గొప్పది) అని, అట్లే "అస్తి...భూయః" (పూజ్యుడా! వాక్కుకంటె అధికమైనది ఉందా) అని. "మనో...భూయః (మనస్సు వాక్కుకంటె పెద్దది) అని- ఈ విధంగా నామాదులనుండి ప్రాణం వరకు పెద్దదానిని గూర్చిన ప్రశ్న ప్రతివచనాల ప్రవాహం నడిచింది. ఈ విధంగా ప్రాణం తరవాత "పూజ్యుడా! ప్రాణంకంటె గొప్పది ఉందా? అని "ఫలానాది ప్రాణంకంటె గొప్పది" అని భూయఃప్రశ్నప్రతివచనాలు కనబడడంలేదు. "ప్రాణో...భూయాన్" (ప్రాణం ఆశకంటె గొప్పది) అని నామం మొదలు ఆశవరకు ఉన్న వాటి అన్నింటికంటె ప్రాణమే గొప్పది అని చెప్పి "అతివాదీ...అపహ్నువీత" (నువ్వు అతివాదివా అని ఎవరైనా ప్రశ్నిస్తే అతివాదినే అని సమాధానం చెప్పాలి, కాదని దాచకూడదు) అని ప్రాణాన్ని గూర్చి తెలిసినవాడు అతివాది (ఉపాసించదగిన నామం మొదలు ఆశ వరకు ఉన్నవాటి అన్నింటికంటె ప్రాణం గొప్పది అని చెప్పేవాడు అతివాది) అవుతాడు అని అనుజ్ఞ ఇచ్చి, "ఏష...వదతి" (ఎవడు సత్యంచేత అతివాదం చేస్తాడో అతడు అతివాదం చేసేవాడు) అని ప్రాణవ్రతమైన, అనగా ప్రాణోపాసన చేసేవాడు అవలంబించవలసిన వ్రతమైన అతివాదిత్వాన్ని ముందుకు లాగి, ప్రాణాన్ని విడవకుండగానే సత్యాదిపరంపరచేత భూమను ప్రవేశపెడుతూ ప్రాణమే భూమ అని తలచుచున్నాడు అని తోచుచున్నది.

వి. ఉపాసించదగిన నామం మొదలు ఆశ వరకు ఒకదానికంటె ఒకటి గొప్పది అని చెప్పుకొంటూ వెళ్లి ఆశకంటె ప్రాణం గొప్ప దని చెప్పి ప్రాణంయొక్క గొప్ప తనాన్ని తెలుసుకొన్నవాడు లేదా చెప్పేవాడు **అతివాది** అని చెప్పుకోవాలి.

అతివాదిని కాను అని అనకూడదు అని బోధించాడు, ఇలాంటి అతివాది ఆచరించవలసిన సత్యవచన-ధ్యాన-మనన-శ్రద్ధాదులను విధించి వెంటనే భూమను గూర్చి చెప్పాడు. దీనిని పట్టి ప్రాణమే భూమ అని చెప్పి నట్లు తెలుస్తూన్నది.

కథమితి:- (ప్రశ్న) ప్రాణం భూమ అని చెపితే "యత్ర నాన్యత్పశ్యతి" మొదలైన భూమకు లక్షణం చెప్పే వాక్యానికి అర్థం ఎలా చెప్పాలి? (సమాధానం) చెప్పబడుతున్నది-సుషుప్త్యవస్థలో ఇంద్రియా లన్నీ ప్రాణంచేత ఆక్రమించబడి ఉన్నప్పుడు చూడడం మొదలైన వ్యవహారాలన్నీ తొలగిపోవడం కనబడుతున్నది. అందుచేత "నాన్యత్పశ్యతి" ఇత్యాదివర్ణనం ప్రాణం విషయంలో కూడ కుదురుతుంది. ఇట్లే (మరొక) శ్రుతి "న శృణోతి న పశ్యతి" (వినడు చూడడు) ఇత్యాదిరీతిలో సర్వేంద్రియాల వ్యాపారం అణగి పోవడం అనే స్వరూపం గల సుషుప్త్యవస్థను గూర్చి చెప్పి ఆ అవస్థలోనే "ప్రాణాగ్నయ...జాగ్రతి" (ఈ శరీరంలో ప్రాణాగ్నులు మాత్రమే మెలకువతో ఉంటాయి) అని ఐదు విధాలైన వ్యాపారం గల ప్రాణం జాగరూకంగా ఉంటుందని చెపుతూ సుషుప్తావస్థలో ప్రాణమే ప్రధానంగా ఉంటుం దని చూపుతూన్నది.

## భాష్యమ్

యచ్చైతద్భూమ్నః సుఖత్వం శ్రుతమ్- "యో వై భూమా తత్సుఖమ్" (ఛా.ఉ.7.23) ఇతి తదప్యవిరుద్ధమ్. "యత్రైష దేవః స్వప్నాన్న పశ్యత్యథ తదైతస్మిన్ శరీరే ఏతత్ సుఖం భవతి" (ప్ర.ఉ.4.6) ఇతి సుషుప్త్యవస్థాయామేవ సుఖశ్రవణాత్. యచ్చ "యో వై భూమా తదమృతమ్" (ఛా.ఉ.7.24.1) ఇతి, తదపి ప్రాణస్యావిరుద్ధమ్, "ప్రాణో వా అమృతమ్" (కౌ.3.2) ఇతి శ్రుతేః. కథం పునః ప్రాణం భూమానం మన్యమానస్య "తరతి శోకమాత్మవిత్" ఇత్యాత్మ వివిదిషయా ప్రకరణస్యోత్థానముపపద్యతే? ప్రాణ ఏవేహాత్మా వివక్షిత ఇతి బ్రూమః. తథాహి - "ప్రాణో మాతా ప్రాణో భ్రాతా ప్రాణః స్వసా ప్రాణ ఆచార్యః ప్రాణో బ్రాహ్మణః" (ఛా.ఉ. 7.15.1) ఇతి ప్రాణమేవ సర్వాత్మానం కరోతి. "యథా వా అరా నాభౌ సమర్పితా ఏవమస్మిన్ ప్రాణే సర్వం సమర్పితమ్" ఇతి చ సర్వాత్మత్వారనాభినిదర్శనాభ్యాం చ సంభవతి వైపుల్యాత్మికా భూమరూపతా ప్రాణస్య. తస్మాత్ప్రాణో భూమేత్యేవం ప్రాప్తమ్.

## బాలానందిని

యచ్చేతి:- "యో వై భూమా తత్సుఖమ్" అనే వాక్యంలో భూమ సుఖరూప మైన దని చెప్పడం కూడ విరుద్ధం కాదు. "యత్రైష... భవతి" (ఈ జీవుడు ఎప్పుడు స్వప్నాలు చూడడో అప్పుడే ఈ శరీరంలో సుఖం కలుగుతుంది) అని సుషుప్తావస్థలోనే సుఖం ఉంటుం దని వినబడుచున్నది. "ప్రాణో వా అమృతమ్" (ప్రాణమే అమృతం) అని శ్రుతిలో చెప్పడంచేత, ప్రాణం విషయంలో "యో వై భూమా తదమృతమ్" అనే మాట కూడ విరుద్ధం కాదు. (ప్రశ్న) ప్రాణమే భూమ అని అంగీకరించేవానికి "తరతి శోకమాత్మవిత్" (ఆత్మను తెలుసుకున్నవాడు శోకం దాటుతాడు) అని ప్రకరణ ప్రారంభంలో ఆత్మవివిదిషను (ఆత్మను తెలుసుకోవాలనే ఇచ్ఛను) చెప్పడం ఎలా కుదురుతుంది? (సమాధానం) ఇక్కడ ప్రాణమే ఆత్మగా వివక్షిత మని చెపుతాం. "ప్రాణో... బ్రాహ్మణః" (ప్రాణమే తండ్రి, ప్రాణం తల్లి, ప్రాణం సోదరుడు, ప్రాణం సోదరి, ప్రాణం ఆచార్యుడు, ప్రాణం బ్రాహ్మణుడు) అని ప్రాణమే సర్వాత్మకం అని చెపుతూన్నది. "యథా... సమర్పితమ్" అని కూడ చెప్పబడింది. ఈ విధంగా సర్వాత్మత్వ - అరనాభినిదర్శనాలను పట్టి ప్రాణానికి వైపుల్యరూపమైన (అతివిశాలత్వరూపమైన) భూమత్వం కుదురుతుంది. అందువల్ల ప్రాణమే భూమ అని ప్రాప్తించింది.

వి. వెనుకటి అధికరణంలో ఆత్మ శబ్దం ఉండడంవల్ల ద్యుభ్వాద్యాయతనం బ్రహ్మ అని నిర్ధారణ చేయబడింది. అది యుక్తం కాదు. "తరతి శోకమాత్మవిత్" అని బ్రహ్మ కానిదానిని కూడ ఆత్మగా చెప్పడం కనబడుతున్నది అని పూర్వాధికరణంతో దీనికి ఆక్షేపసంగతి. పూర్వపక్షంలో ప్రాణోపాసన ఫలం, ఉత్తరపక్షంలో బ్రహ్మజ్ఞానం ఫలం.

## భాష్యమ్

తత ఇదముచ్యతే - పరమాత్మైవేహ భూమా భవితుమర్హతి న ప్రాణః. కస్మాత్? సంప్రసాదాదధ్యుపదేశాత్. సంప్రసాద ఇతి సుషుప్తం స్థానముచ్యతే, సమ్యక్ప్రసీదత్యస్మిన్నితి నిర్వచనాత్. బృహదారణ్యకే చ స్వప్నజాగరి తస్థానాభ్యాం సహ పాఠాత్. తస్యాం చ సంప్రసాదావస్థాయాం ప్రాణో జాగర్తీతి సంప్రసాదోऽభిప్రేయతే. ప్రాణాదూర్ధ్వం భూమ్నః ఉపదిశ్యమానత్వాదిత్యర్థః. ప్రాణ ఏవ చేద్భూమా స్యాత్స ఏవ తస్మాదూర్ధ్వముపదిశ్యేతేత్యశ్లిష్టమేవ స్యాత్. నహి నామైవ నామ్నో భూయ ఇతి, నామ్న ఊర్ధ్వముపదిష్టమ్; కిం తర్హి? నామ్నోऽన్యదర్థాన్తరముపదిష్టం వాగాఖ్యమ్ - "వాగ్వావ నామ్నో భూయసీ"

ఇతి. తథా వాగాదిభ్యో ప్యాప్రాణాదర్థాన్తరమేవ తత్ర తత్రోర్ధ్వముపదిష్టమ్, తద్వత్ప్రాణాదూర్ధ్వముపదిశ్యమానో భూమా ప్రాణాదర్థాన్తరభూతో భవితుమర్హతి.

బాలానందిని

తత ఇతి:-అందువల్ల ఇది చెప్పబడుచున్నది - ఇక్కడ భూమ, పరమాత్మయే కావాలి కాని ప్రాణం కాదు. ఎందువల్ల? సంప్రసాదాదధ్యుపదేశంవల్ల. సంప్రసాదం అనగా సుషుప్తస్థానం. దీనియందు (జీవుడు) బాగా ప్రసన్నుడు, సుఖవంతుడు, అవుతాడు అని దీని నిర్వచనం. ఇది బృహదారణ్యకోపనిషత్తులో స్వప్నజాగరిత స్థానాలతో పాటు పఠింపబడింది. (అందుచేత ఇది మూడవదైన సుషుప్తస్థానం అని స్పష్టం అవుతున్నది). ప్రాణం ఆ సంప్రసాదావస్థలో మేల్కొని ఉంటుంది గాన ఇక్కడ సంప్రసాదం అనగా ప్రాణం అని అర్థం. ఈ విధంగా "సంప్రసాదాదధ్యుపదేశాత్" అనగా - భూమ ప్రాణంతరవాత ఉపదేశించబడుతున్నది గాన అని అర్థం. ప్రాణమే భూమ యైతే దాని తరవాత అదే ఉపదేశించబడుతుం దనడం సరిగా ఉండదు. "నామ తరవాత నామమే" అని నామకు తరవాత నామనే ఉపదేశించలేదు కదా? మరేమి ఉపదేశించబడింది? "వాగ్వావ నామ్నో భూయసీ" అని నామకంటె అన్యమైన వాక్కు అనే మరొకటి ఉపదేశించబడింది. అట్లే వాగాదులకంటె కూడ భిన్నంగా ప్రాణాదులవరకు, మరొక వస్తువే, ఆ యా వస్తువులకు తరవాత ఉపదేశించబడింది. అట్లే ప్రాణం తరవాత ఉపదేశించబడుతున్న ఈ భూమ ప్రాణంకంటె భిన్నమే అయి ఉండాలి.

భాష్యమ్

నన్విహ నాస్తి ప్రశ్నః- అస్తిఽభగవః ప్రాణాద్ భూయః ఇతి; నాపి ప్రతివచనమస్తి ప్రాణాద్వావ భూయోఽస్తి- ఇతి; కథం ప్రాణాదధి భూమోపదిశ్యత ఇత్యుచ్యతే? ప్రాణవిషయమేవ చాతివాదిత్వముత్తరత్రానుకృష్యమాణం పశ్యామః- "ఏష తు వా అతివదతి యః సత్యేనాతివదతి" ఇతి. తస్మాన్నాస్తి ప్రాణాదధ్యుపదేశ ఇతి. అత్రోచ్యతే- న తావత్ప్రాణవిషయస్యైవాతివాదస్య, ఏతదనుకర్షణమితి శక్యం వక్తుమ్. విశేషవాదాత్, "యః సత్యేనాతివదతి" ఇతి.

## బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) పూజ్యుడా! ప్రాణంకంటె గొప్పది ఉందా అని ప్రశ్న గాని, ప్రాణంకంటె గొప్పది ఇది ఉంది అని ప్రతివచనం కాని లేదు కదా? భూమ ప్రాణం కంటె అధికమైనదిగా ఉపదేశించబడుతున్న దని ఎట్లంటారు? "ఏష... అతివదతి" అని ప్రాణానికి సంబంధించిన అతివాదిత్వాన్నే ముందుకు లాగడం కనబడుతున్నది. అందువల్ల ప్రాణాదధ్యుపదేశం లేదు. (సమాధానం)- ఇక్కడ చెపుతున్నాం- ఇది ప్రాణానికి సంబంధించిన అతివాద్విత్వంయొక్క అనుకర్షణం అని చెప్పడం శక్యం కాదు. ఎందువల్ల ననగా- "యః సత్యేనాతివదతి" అని (సత్యం అనే) విశేషం చెప్పబడుతున్నది.

## భాష్యమ్

నను విశేషవాదోఽప్యయం ప్రాణవిషయ ఏవ భవిష్యతి. కథమ్? యథైషోఽగ్నిహోత్రీ యః సత్యం వదతీత్యుక్తే న సత్యవదనేనాగ్నిహోత్రిత్వమ్, కేన తర్హి? అగ్నిహోత్రేణైవ; సత్యవదనం త్వగ్నిహోత్రిణో విశేష ఉచ్యతే, తథా "**ఏష తు వా అతివదతి యః సత్యేనాతివదతి**" ఇత్యుక్తే న సత్యవదనే నాతివాదిత్వమ్; కేన తర్హి? ప్రకృతేన ప్రాణవిజ్ఞానేనైవ. సత్యవదనం తు ప్రాణవిదో విశేషో వివక్ష్యత ఇతి. నేతి బ్రూమః. శ్రుత్యర్థపరిత్యాగప్రసంగాత్. శ్రుత్యా హ్యత్ర సత్యవదనేనాతివాదిత్వం ప్రతీయతే- "యః సత్యేనాతివదతి" ఇతి. నాత్ర ప్రాణవిజ్ఞానస్య సంకీర్తనమస్తి. ప్రకరణాత్తు ప్రాణవిజ్ఞానం సంబధ్యేత. తత్ర ప్రకరణానురోధేన శ్రుతిః పరిత్యక్తా స్యాత్. ప్రకృతవ్యావృత్త్యర్థశ్చ 'తు' శబ్దో న సంగచ్ఛేత "**ఏష తు వా అతివదతి**" ఇతి. 'సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమ్' (ఛా.ఉ.7.16) ఇతి చ ప్రయత్నాన్తరకరణమర్థాన్తరవివక్షాం సూచయతి. తస్మాద్యథైకవేదప్రశంసాయాం ప్రకృతాయామేష తు మహాబ్రాహ్మణో యశ్చతురో వేదానధీత ఇత్యేకవేదేభ్యః అర్థాన్తరభూతశ్చతుర్వేదః ప్రశస్యతే తాదృగేతద్ద్రష్టవ్యమ్.

## బాలానందిని

(ప్రశ్న) ఈ విశేషవాదం కూడ ప్రాణానికి సంబంధించినదే అవుతుంది. ఎట్లు? ఇతడు అగ్నిహోత్రి; ఎవడు(ఇతడు) సత్యం పలుకుతాడు అన్నప్పుడు అతని

అగ్నిహోత్రిత్వం (అగ్నిహోత్రం చేసేవాడై ఉండడం) సత్యం పలకడంచేత కాదు; మరే మనగా అగ్నిహోత్రంచేతనే. ఐతే సత్యవదనం అనేది ఆ అగ్నిహోత్రిలో ఉన్న ఒక విశేషంగా చెప్పబడింది. అట్లే "ఏష తు...అతివదతి" అన్నప్పుడు వాని అతివాదిత్వం సత్యవచనం చేతకాదు; మరి దేనిచేత? ప్రకృత మైన ప్రాణవిజ్ఞానంచేతనే. అయితే సత్యవదనం ఆ ప్రాణవేత్తలో ఉన్న ఒక విశేషంగా వివక్షిత మైనది. (సమాధానం) ఇది సరి కాదు అంటాం. అలా చెపితే శ్రుత్యర్థాన్ని విడవవలసి వస్తుంది. ఇక్కడ "యః సత్యేనాతిదతి సోఽతివదతి" అనే శ్రుతిని పట్టి అతివాదిత్వం సత్యవదనంచేత ఏర్పడినదే అని తెలుస్తూన్నది. ఇక్కడ ప్రాణవిజ్ఞానాన్ని గూర్చిన సంకీర్తనం (నిర్దేశం) లేదు. కాని ప్రకరణాన్ని పట్టి ప్రాణవిజ్ఞానం సంబధిస్తే సంబంధించవచ్చును. అప్పుడు ప్రకరణాన్ని అంగీకరించి శ్రుతిని విడచినట్లవుతుంది.

వి. శ్రుతి స్పష్టంగా అతివాదిత్వం సత్యంచేత అని చెపుతూన్నది. ప్రకరణానుసారం ప్రాణాన్ని గ్రహించే పక్షంలో ప్రకరణానికి ప్రాధాన్యం ఇచ్చి శ్రుతిని త్రోసిపుచ్చి నట్లు అవుతుంది. ప్రకరణంకంటె శ్రుతి బలీయ మైన దని శాస్త్రసిద్ధాంతం గాన శ్రుతిచేత ప్రకరణాన్ని బాధించాలి కాని ప్రకరణంచేత శ్రుతిని బాధించగూడదు.

ప్రకృతేతి:- "ఏష తు వా అతివదతి" అనే వాక్యంలో ఉన్న ప్రకృతవ్యావృత్త్యర్థమైన 'తు' శబ్దం కుదరకుండా పోతుంది.

వి. ఏదైన ఒక విషయాన్ని చెప్పకొంటూ వస్తూ 'తు' (కాని) అని ప్రయోగించిన ట్లయితే ఆ తరవాత చెప్పినది వెనకటిదానికంటె వేరైనది అని అర్థం. ఇదే ప్రకృతవ్యావృత్తి, ప్రకృతాన్ని వెనుకకు మరల్చడం; అక్కడితో ఆపుచేయడం. "సర్వే బాలాః అత్ర క్రీడన్తి, రామస్తు గృహం గతః" అన్నప్పుడు 'తు' అని ప్రయోగించడం వల్ల క్రీడించడం అనేది రామునికి సంబంధించదు అని తెలుస్తుంది.

సత్యమితి:- "సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమ్" (అయితే సత్యమే తెలియనిచ్ఛయింప దగినది) అని మరొక ప్రయత్నం చేయడం (తుశబ్దం ఉపయోగిస్తూ క్రొత్తవిషయంగా చెప్పడం) అర్థాంతరంయొక్క (వెనుక చెప్పిన దానికంటె భిన్నమైన మరొక విషయంయొక్క వివక్షను సూచిస్తూన్నది. అందువల్ల- ఒక్కవేదం చదువుకొన్న వాళ్ళ ప్రశంస ప్రకృత మైనప్పుడు (ఏకవేదాధ్యయనం చేసినవాళ్లను గూర్చి చెప్పి) అయితే ఇతడు నాలుగు వేదాలు చదివిన మహాబ్రాహ్మణుడు అన్నప్పుడు ఏ విధంగా ఏకవేదులకంటె భిన్నుడైన చతుర్వేదుడైన మరొక వ్యక్తి ప్రశంసించబడుతున్నాడో అట్లే ఇక్కడ కూడ.

## భాష్యమ్

న చ ప్రశ్నప్రతివచనరూపయైవ అర్థాన్తరవివక్షయా భవితవ్యమితి నియమో௨స్తి; ప్రకృతసంబన్ధాసంభవకారితత్వాదర్థాన్తరవివక్షాయాః. తత్ర ప్రాణాన్తమనుశాసనం శ్రుత్వా తూష్ణీంభూతం నారదం స్వయమేవ సనత్కుమారో వ్యుత్పాదయతి యత్ప్రాణవిజ్ఞానేన వికారానృతవిషయేణాతివాదిత్వమనతివాదిత్వమేవ తత్; "ఏష తు వా అతివదతి యః సత్యేనాతివదతి" ఇతి. తత్ర సత్యమితి పరం బ్రహ్మోచ్యతే, పరమార్థరూపత్వాత్. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.ఉ.2.1) ఇతి చ శ్రుత్యన్తరాత్. తథా వ్యుత్పాదితాయ నారదాయ "సో௨హం భగవః సత్యేనాతివదాని" ఇత్యేవం ప్రవృత్తాయ విజ్ఞానాదిసాధన పరమ్పరయా భూమానముపదిశతి. తత్ర యత్ప్రాణాదధి సత్యం వక్తవ్యం ప్రతిజ్ఞాతం తదేవేహ భూమేత్యుచ్యతే ఇతి గమ్యతే. తస్మాదస్తి ప్రాణాదధి భూమ్నః ఉపదేశ ఇత్యతః ప్రాణాదన్యః పరమాత్మా భూమా భవితుమర్హతి. ఏవం దేహాత్మవివిదిషయా ప్రకరణస్యోత్థానముపపన్నం భవిష్యతి.

## బాలానందిని

న చేతి:- మరొక అర్థం (విషయం) చెప్పాలనే ఇచ్ఛ ప్రశ్న ప్రతివచనరూపంలోనే ఉండా లని నియమం కూడ లేదు. ప్రకృత మైన విషయం చెప్పుకుంటే అక్కడ కుదరదు అనే పరిస్థితిని పట్టి అర్థాంతరవివక్ష ఏర్పడుతుంది. ప్రాణం వరకు చెప్పిన ఉపదేశం విని నారదుడు మౌనంగా ఉండడం చూచి సనత్కుమారుడు తానే అతనికి వికారానృతవిషయ మైన (కార్యము అసత్యమూ అయిన విషయం గల) ప్రాణ విజ్ఞానంచేత ఏ అతివాదిత్వం కలుగుతుందో అది అనతివాదిత్వమే. "ఏష తు...అతివదతి" (ఎవడైతే సత్యంచేత అతివాదం చేస్తాడో అతడే అతివాది) అని బోధిస్తున్నాడు. ఇక్కడ 'సత్యం' అంటే బ్రహ్మ. అదే పరమార్థరూపమైనది కదా? "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని మరొక శ్రుతికూడ చెప్తున్నది. ఈ విధంగా బోధింపబడి నారదుడు "సో௨హం...అతివదాని" (పూజ్యుడా! నేను సత్యంచేత అతివాదం చేస్తాను) అని ప్రవర్తించినప్పుడు అతనికి విజ్ఞానాదు లైన సాధనాల పరంపర చెపుతూ భూమను ఉపదేశిస్తున్నాడు. ప్రాణానికి పైన సత్యాన్ని గూర్చి చెప్పదగినదిగా ఏది పేర్కొనబడిందో అదే ఇక్కడ భూమ అని చెప్పబడుచున్న దని తెలుస్తూన్నది. అందువల్ల ఇక్కడ ప్రాణంకంటె అధికమైన భూమయొక్క ఉపదేశం ఉంది గాన ప్రాణంకంటె అన్యమైన

భూమ పరమాత్మయే అవడానికి తగి ఉంది. ఈ విధంగా చెప్పినప్పుడే ఆత్మవివిదిషతో జరిగిన ప్రకరణప్రారంభం యుక్తంగా ఉంటుంది.

## భాష్యమ్

ప్రాణ ఏవేహాత్మా వివక్షిత ఇత్యేతదపి నోపపద్యతే. న హి ప్రాణస్య ముఖ్యయా వృత్త్యాత్మత్వమస్తి. న చాన్యత్ర పరమాత్మజ్ఞానాచ్ఛోకనివృత్తిరస్తి- "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" ఇతి శ్రుత్యన్తరాత్". "తం మా భగవాన్ శోకస్య పరం పారం తారయతు" ఇతి చోపక్రమ్యోపసంహరతి- "తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి సనత్కుమారః" (ఛా.ఉ.7.2.6.2) ఇతి. తమ ఇతి శోకాదికారణమవిద్యోచ్యతే. ప్రాణాన్తే చానుశాసనే న ప్రాణస్యాన్యాయత్తతోచ్యేత "ఆత్మనః ప్రాణః" (ఛా.ఉ.7.26.1) ఇతి చ బ్రాహ్మణమ్. ప్రకరణాన్తే చ పరమాత్మవివక్షా భవిష్యతి, భూమా తు ప్రాణ ఏవేతి చేత్, న. "స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని" (ఛాం.ఉ.7.24.1) ఇత్యాదినా భూమ్న ఏవాప్రకరణసమాప్తేరనుకర్షణాత్. వైపుల్యాత్మికా చ భూమరూపతా సర్వకారణత్వాత్ పరమాత్మనః సుతరాముపపద్యతే. 8.

## బాలానందిని

ప్రాణ ఇతి:- ఇక్కడ ప్రాణమే ఆత్మగా వివక్షితం అని చెప్పడం కూడ కుదరదు. ప్రాణానికి ముఖ్యవృత్తిచేత ఆత్మత్వం లేదు కదా? (ప్రాణశబ్దం లక్షణచేత ఆత్మ అనే అర్థాన్ని బోధిస్తే బోధించవచ్చు నేమో కాని అభిధచేత బోధించదు కదా అని అర్థం). "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" అని మరొక శ్రుతిలో కూడ చెప్పినట్లు పరమాత్మజ్ఞానం వల్ల తప్ప మరి దేనివల్లా శోకనివృత్తి లేదు కదా? "తం...తారయతు" అని ఉపక్రమించి "తస్మై...సనత్కుమారః" (సనత్కు మారుడు నశించిన పాపాలు గల ఆ నారదునికి తమస్సుయొక్క అవతలి ఒడ్డును (అంతమును) చూపించాడు) అని ముగిస్తున్నాడు. తమస్ అనగా శోకాదులకు కారణమైన అవిద్య. ఉపదేశం ప్రాణంతోనే ముగిసిన పక్షంలో ఆ ప్రాణం మరొకదానియందు (బ్రహ్మయందు) ఆధారపడి ఉన్నది అని చెప్పబడి ఉండేది. "ఆత్మనః ప్రాణః' (ఆత్మనుండి ప్రాణం పుట్టినది) అని బ్రాహ్మణం కూడా ఉన్నది. (ప్రశ్న)- ప్రకరణం చివర పరమాత్మవివక్ష ఉంటుంది; భూమమాత్రం ప్రాణమే అన్నట్లయితే (సమాధానం) అది యుక్తం కాదు. "సః... మహిమ్ని" (పూజ్యుడా! ఆత్మ దేనియందు ప్రతిష్ఠితమైనది? తన మహిమమీదనే) ఇత్యాదికంచేత భూమనే

ప్రకరణం చివరివరకు లాగించారు. అతివిశాలంగా ఉండడమే భూమ. ఇలాంటి భూమ, పరమాత్మ సర్వకారణం అవడం చేత, ఆ పరమాత్మకు మాత్రమే, అన్నివిధాలా కుదురుతుంది.

## సూ. ధర్మోపపత్తేశ్చ. 1.3.9.

అపి చ యే భూమ్ని శ్రూయన్తే ధర్మాస్తే పరమాత్మన్యుపపద్యన్తే. "యత్ర నాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి స భూమా" ఇతి దర్శనాదివ్యవహారాభావం భూమన్యవగమయతి. పరమాత్మని చాయం దర్శనాదివ్యవహారాభావోఽవగతః- "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" ఇత్యాదిశ్రుత్యన్తరాత్. యోఽప్యసౌ సుషుప్తావస్థాయాం దర్శనాదివ్యవహారాభావ ఉక్తః సోఽప్యాత్మన ఏవాసంగత్వవివక్షయోక్తో, న ప్రాణస్వభావవివక్షయా, పరమాత్మప్రకరణాత్. యదపి తస్యామవస్థాయాం సుఖముక్తం, తదప్యాత్మన ఏవ సుఖరూపత్వవివక్షయోక్తమ్. యత ఆహ- "ఏషోఽస్య పరమ ఆనన్దః ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" (బృ.ఉ.4.3.32) ఇతి. ఇహాపి "యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ సుఖమ్" ఇతి సామయసుఖనిరాకరణేన బ్రహ్మైవ సుఖం భూమానం దర్శయతి. "యో వైభూమా తదమృతమ్" ఇత్యమృతత్వమపీహ శ్రూయామాణం పరమకారణం గమయతి, వికారాణామమృతత్వస్యాపేక్షికత్వాత్. "అతోఽన్యదార్తమ్" ఇతి చ శ్రుత్యన్తరాత్. తథా చ సత్యత్వం స్వమహిమ ప్రతిష్ఠితత్వం సర్వాత్మత్వమితి చైతే ధర్మాః శ్రూయమాణాః పరమాత్మన్యేవోపపద్యన్తే నాన్యత్ర. తస్మాద్భూమా పరమాత్మేతి సిద్ధమ్.9.

### బాలానందిని

ధర్మేతి:- 'ధర్మోపపత్తేః చ=భూమకు చెప్పిన ధర్మాలు పరమాత్మయందు సరిగా కుదురుతాయి; అందువల్ల కూడ, భూమ పరమాత్మయే" అని సూత్రార్థం.

అపి చేతి: మరొక విషయ మేమనగా భూమయందు చెప్పిన ధర్మాలన్నీ పరమాత్మయందు కుదురుతాయి. "యత్ర...స భూమా" అని భూమలో ధర్శనాది వ్యవహారా లేవీ ఉండ వని చెపుతున్నది. "యత్ర...పశ్యేత్" ఇత్యాది శ్రుతులలో

పరమాత్మయందు ఇలాంటి వ్యవహారా లేవీ ఉండ వని చెప్పబడింది. సుషుప్తావస్థలో దర్శనాదివ్యవహారం ఏదీ ఉండదని చెప్పినది కూడ ఆత్మ అసంగం అని చెప్పాలనే ఉద్దేశ్యంతో చెప్పినదే కాని ప్రాణస్వభావాన్ని చెప్పాలనే అభిప్రాయంతో కాదు. ఇది పరమాత్మప్రకరణం కదా? ఆ అవస్థలో సుఖం ఉంటుం దని చెప్పినది కూడ ఆత్మ సుఖరూప మైన దని చెప్పాలనే ఉద్దేశ్యంతో చెప్పినదే. ఎందువలన అనగా "ఏషోఽ స్య... ఉపజీవన్తి" (ఈ పరమానందం పరమాత్మదే. ఈ పరమాత్మయొక్క ఆనందంలోనే ఒక చిన్న అంశాన్ని మాత్రమే తీసికొని ఇతర భూతాలన్నీ జీవిస్తున్నాయి) అని (బృహదారణ్యకంలో) చెప్పబడింది. ఇక్కడ కూడ భూమయే సుఖం అల్పంలో సుఖం లేదు; భూమయే సుఖం అని దుఃఖమిశ్రితమైన సుఖాన్ని నిరాకరించడంచేత భూమ సుఖాత్మకమైన బ్రహ్మ అని చూపుచున్నది. "యో వై భూమా తదమృతమ్" అని ఇక్కడ వినబడుచున్న అమృతత్వం కూడ పరమకారణ మైన బ్రహ్మనే తెలుపుచున్నది. కార్యాల అమృతత్వం ఆపేక్షికం కదా. (కార్య మైనది ఏదీ నాశరహితంగా నిత్యంగా ఉండదు. ఇతరమైనవాటికంటె చాల ఎక్కువ కాలం ఉండడంవల్ల కొన్ని కార్యాలను కూడ అమృతాలు (నాశరహితాలు) అంటారు అని భావం). బ్రహ్మకంటె భిన్నమైనది సర్వమూ వినాశియే అని "అతోఽన్యదార్తమ్" అను మరొక శ్రుతి చెపుతున్నది. అట్లే- సత్యత్వం, తన మహిమయందే తాను నిలచి ఉండడం, సర్వగతత్వం, సర్వాత్మత్వం అనే ఇక్కడ వినబడుతూన్న ధర్మాలు పరమాత్మయందే కుదురుతాయి కాని ఇతర వస్తువు దేనియందు కుదరవు. అందువల్ల భూమ పరమాత్మయే అని నిశ్చిత మైనది?

భూమాధికరణం సమాప్తం

## 3. అక్షరాధికరణమ్ సూ.10-12

### సూ. అక్షరమమ్బరాన్తధృతేః 1.3.10.

"కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి; సహోవాచైతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్త్యస్థూలమనణు" (బృ.ఉ.3.8.7.8) ఇత్యాది శ్రూయతే. తత్ర సంశయః- కిమక్షరశబ్దేన వర్ణ ఉచ్యతే కిం వా పరమేశ్వర ఇతి. తత్రాక్షరసమామ్నాయ ఇత్యాదావక్షరశబ్దస్య వర్ణే ప్రసిద్ధత్వాత్ ప్రసిద్ధ్యతిక్రమస్య చాయుక్తత్వాత్ "ఓంకార ఏవేదం సర్వమ్" (ఛా.ఉ.2.23.3) ఇత్యాదౌ చ శ్రుత్యన్తరే వర్ణస్యాప్యుపాస్యత్వేన సర్వాత్మకత్వావధారణాత్ వర్ణ ఏవాక్షరశబ్ద ఇతి.

### బాలానందిని

అక్షరమితి "అమ్బరాన్తధృతేః= ఆకాశం వరకు ఉన్న కార్యప్రపంచాన్ని ధరించడంవల్ల, అక్షరమ్= అక్షరం, పరబ్రహ్మయే" అని సూత్రార్థం.

కస్మిన్నితి:- "కస్మిన్ను...అనణు" (ఆకాశం దేనిమీద పడుగుపేకలుగా అల్లుకొని ఉంది? యాజ్ఞవల్క్యు డిలా అన్నాడు- ఓగార్గీ! ఇదే ఆ అక్షరం. దీనిని బ్రాహ్మణులు స్థూలం కాని, అణువుకాని కాదని అంటారు) ఇత్యాదివాక్యం వినబడుతున్నది. అక్షరశబ్దం చేత ఏదైన వర్ణం చెప్పబడుతున్నదా పరమేశ్వరుడా అని సంశయం. 'అక్షరసమామ్నాయం' మొదలైన మాటలలో అక్షరశబ్దానికి వర్ణం అనే అర్థం ప్రసిద్ధంగా ఉంది. ప్రసిద్ధమైన అర్థాన్ని కాదనడం యుక్తం కాదు. "ఓంకార ఏవేదం సర్వమ్" (ఇదంతా ఓంకారమే) ఇత్యాదులైన ఇతరశ్రుతులలో వర్ణం కూడ ఉపాస్యంగా సర్వాత్మక మని తెలుస్తున్నది. ఈ అన్ని కారణాలచేత అక్షరశబ్దంచేత చెప్పబడేది వర్ణమే.

వి. పూర్వాధికరణంలో సత్యశబ్దం బ్రహ్మ అనే అర్థంలో రూఢం గాన భూమ బ్రహ్మ అని చెప్పబడింది. అక్షరశబ్దం వర్ణం అనే అర్థంలో రూఢం గాన ఇక్కడ వర్ణం అనే అర్థమే చెప్పాలి అని పూర్వాధికరణంతో దృష్టాంతసంగతి. పూర్వపక్షంలో ఓంకారోపాసన ఫలం. సిద్ధాంతంలో నిర్గుణబ్రహ్మజ్ఞానం ఫలం.

### భాష్యమ్

ఏవం ప్రాప్త ఇదముచ్యతే - పర ఏవాత్మాక్షరశబ్దవాచ్యః. కస్మాత్? అమ్బరాన్తధృతేః - పృథివ్యాదేరాకాశాన్తస్య వికారజాతస్య ధారణాత్. తత్ర హి పృథివ్యాదేః సమస్తవికారజాతస్య కాలత్రయవిభక్తస్య "ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చ" ఇత్యాకాశే ప్రతిష్ఠితత్వముక్త్వా "కస్మిను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" ఇత్యనేన ప్రశ్నేనేదమక్షరమవతారితమ్. తథాచోపసంహృతం - "ఏతస్మిన్ను ఖల్వక్షరే గర్గ్యాకాశ ఓతః ప్రోతశ్చ" ఇతి. న చేయమమ్బరాన్తధృతిర్బ్రహ్మణోఽన్యత్ర సంభవతి. యదపి- "ఓంకార ఏవేదం సర్వమ్" ఇతి తదపి బ్రహ్మప్రతిపత్తిసాధనత్వాత్స్తుత్యర్థం ద్రష్టవ్యమ్. తస్మాన్న క్షరత్యశ్నుతే చేతి నిత్యత్వవ్యాపిత్వాభ్యామక్షరం పరమేవ బ్రహ్మ.

### బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా సమాధానం చెప్పబడుచున్నది. అక్షరశబ్దంచేత చెప్పబడేది పరమాత్మయే. ఎందువల్ల? అమ్బరాంతధృతివల్ల - పృథివి మొదలు ఆకాశం వరకు ఉన్న కార్యజాతాన్ని అంతనీ ధరించడంవల్ల. అక్కడ కాలత్రయంచేత విభజించబడిన (మూడు కాలాలకు సంబంధించిన) పృథివి మొదలైన సమస్తవికార జాతమూ కూడ ఆకాశంలో ప్రతిష్ఠించబడింది అని "ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చ" అనే వాక్యంచేత చెప్పి "కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" అనే ప్రశ్నచేత ఈ అక్షరం ప్రస్తావించబడింది. అట్లే "ఏతస్మిన్ను... ప్రోతశ్చ" అని ఉపసంహారం చేయబడింది. ఈ అంబరాంతధృతి బ్రహ్మకంటె భిన్నమైనదానికి దేనికీ సంభవిచదు. "ఓంకార ఏ వేదం సర్వమ్" అని ఉదాహరించబడిన వాక్యం ఓంకారం బ్రహ్మసాక్షాత్కారానికి సాధనం గాన ఓంకారాన్ని స్తుతించడం కోసం ఉద్దిష్ట మైనది. అందుచేత "న క్షరతీమ్‌తి అక్షరమ్" (నశించనిది గాన అక్షరం), "అశ్నుతే ఇత్యక్షరమ్" (అంతనూ పొందుతుంది గాన అక్షరం) అనే నిర్వచనంచేత నిత్యత్వం, వ్యాపిత్వం అనే అర్థాలు లభించడంచేత అక్షరం పరబ్రహ్మయే.

### భాష్యమ్

స్యాదేతత్ - కార్యస్య చేత్కారణాధీనత్వమమ్బరాన్తధృతి రభ్యుపగమ్యతే, ప్రధానకారణవాదినోఽపీయముపపద్యతే; కథ మమ్బరాన్త ధృతేర్బ్రహ్మత్వ ప్రతిపత్తిరితి, అత ఉత్తరం పఠతి—

**సా చ ప్రశాసనాత్. 1-3-11. సూ.**

సా చామ్బరాన్తధృతిః పరమేశ్వరస్యైవ కర్మ. కస్మాత్? ప్రశాసనాత్. ప్రశాసనం హీహ శ్రూయతే - "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః" (బృ.ఉ. 3.8.9) ఇత్యాది. ప్రశాసనం చ పారమేశ్వరం కర్మ; నాచేతనస్య ప్రశాసనం భవతి. న హ్యచేతనానాం ఘటాకారణానాం మృదాదీనాం ఘటాదివిషయం ప్రశాసనమస్తి. 11

### బాలానందిని

స్యాదితి:- ఇది ఇలా ఉండనీ. కార్యం కారణంమీద ఆధారబడి ఉండడమే అంబరాంతధృతి అని అంగీకరించే పక్షంలో, ఇది ప్రధానకారణవాదికి కూడ కుదురుతుంది. అందుచేత అంబరాంతధృతివల్ల బ్రహ్మమే ఎందుకు తెలుస్తుంది? ఇందుకు సమాధానం పఠిస్తున్నాడు -

సేతి:- సా చ = అంబరాంతధృతి, ప్రశాసనాత్ = శాసించడం వల్ల బ్రహ్మ యందే యుక్త మైనది'' అని సూత్రార్థం.

సేతి:- ఆ అమ్బరాంతధృతి పరమేశ్వరునికి మాత్రమే చెందిన పని. ఎందువల్ల? ప్రశాసనంవల్ల. ఇక్కడ "ఏతస్య ... తిష్ఠతః" (ఓ గార్గీ ఈ అక్షరంయొక్క ఆజ్ఞయందే సూర్యచంద్రులు నిలబడి ఉన్నారు) ఇత్యాదివాక్యాలలో శాసించడం వినబడుతున్నది. ప్రశాసనం అనేది పరమేశ్వరునికి మాత్రమే సంబంధించిన కర్మ. అచేతనమైన ప్రధానం శాసించడం అనేది కుదరదు. ఘటాదులకు కారణ మైన అచేతనాలైన మట్టి మొదలైన వాటికి ఘటాదుల్ని శాసించే శక్తి లేదు కదా?

## సూ. అన్యభావవ్యావృత్తేశ్చ 1.3.12

అన్యభావవ్యావృతేశ్చ కారణాత్ బ్రహ్మైవాక్షరశబ్దవాచ్యమ్. తస్యైవామ్బరాన్తధృతిః కర్మ నాన్యస్య కస్యచిత్. కిమిదమన్యభావవ్యావృత్తేరితి. అన్యస్య భావః అన్యభావః. తస్య వ్యావృత్తిరన్య భావవ్యావృత్తిరితి. ఏతదుక్తం భవతి - యదన్యద్ బ్రహ్మణోఽ క్షరశబ్దవాచ్యమిహాశఙ్క్యతే తద్భావాదిదమమ్బరాన్తవిధారణమక్షరం వ్యావర్తయతి శ్రుతిః - "తద్వా ఏతదక్షరం గార్గి అదృష్టం ద్రష్టృ, అశ్రుతం శ్రోతృ, అమతం మన్తృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ" (బృ.ఉ.3.8.11) ఇ.తి. తత్ర అదృష్టత్వాదివ్యపదేశః ప్రధానస్యాపి సంభవతి. ద్రష్టృత్వాదివ్యపదేశస్తు న సంభవత్యచేతనత్వాత్. తథా "నాన్యదతోఽస్తి ద్రష్టృ నాన్యదతోఽస్తి శ్రోతృ, నాన్యదతోఽస్తి మన్తృ నాన్యదతోఽస్తి విజ్ఞాతృ" ఇత్యాత్మభేదప్రతిషేధాత్ న శారీరస్యాప్యుపాధిమతోఽక్షరశబ్దవాచ్యత్వమ్, "అచక్షుష్కమశ్రోత్రమవాగమనః" (బృ.ఉ.3.8.8) ఇతి చోపాధిమత్తాప్రతిషేదాత్. న హి నిరుపాధికః శారీరో నామ భవతి. తస్మాత్పరమేవ బ్రహ్మాక్షరమితి నిశ్చయః.

### బాలానందిని

అన్యేతి: "అన్యభావవ్యావృత్తేః చ = బ్రహ్మకంటె అన్యమైనదిగా అవడాన్ని నివర్తింపచేయడంవల్ల కూడ అక్షరం బ్రహ్మయే'' అని సూత్రార్థం.

అన్యేతి:- అన్యభావవ్యాకృత్తి అనే కారణంవల్ల కూడ అక్షరశబ్దంచేత చెప్పదగినది బ్రహ్మయే. ఏమిటి ఈ "అన్యభావవ్యావృత్తేః" అంటే? అన్యస్య భావః = అన్యభావః మరొకటి ఉండుట. అన్యభావాత్ వ్యావృత్తిః అన్యభావవ్యావృత్తిః = అన్యభావం నుంచి మరల్చడం. దీని అర్థం ఇది- బ్రహ్మకంటె భిన్న మైన ఏది అక్షరశబ్దవాచ్య మని ఇక్కడ ఆశంకించబడుతున్నదో అదిగా అవడంనుండి అంబరాంతవిధారణమైన అక్షరాన్ని "తద్వా... విజ్ఞాతృ" (గార్గీ!) అట్టి ఈ అక్షరం చూడబడనిది చూచేది; వినబడనిది

వినేది; ఆలోచించబడనిది ఆలోచించేది, తెలియబడనిది తెలుసుకొనేది) అను శ్రుతి నివర్తింప చేస్తున్నది. వీటిలో చూడబడకపోవడం మొదలైనవాటి వ్యపదేశం (చెప్పడం) ప్రధానం విషయంలో కూడ కుదురుతుంది, కాని ద్రష్టృత్వాదివ్యపదేశం ('చూచేది' ఇత్యాది నిర్దేశం), ప్రధానం అచేతనం గాన, దాని విషయంలో కుదరదు.

అవ. ఈ అక్షరం జీవుడు కాదు అని చెప్పడానికి కూడ సూత్రం అన్వయిస్తున్నారు. **తథేతి:-** అట్లే "నాన్యదతో... విజ్ఞా.తృ" (దీనికంటె భిన్నమైన చూచేది లేదు, దీనికంటె భిన్నమైన వినేది లేదు, దీని కంటె భిన్నమైన ఆలోచించేది లేదు, దీని కంటె భిన్నమైన తెలుసుకొనేది లేదు) అని ఆత్మభేదాన్ని నిషేధించడంవల్ల ఉపాధిమంతుడైన జీవుడు కూడ అక్షరశబ్ద వాచ్యుడు కాజాలడు. అక్షరానికి ఉపాధులేవీ లేవని కూడ "అచక్షుష్యమశ్రోత్రమవాగమనః" (నేత్రాలు లేనిది, చెవులు లేనిది, వాక్కు లేనిది, మనస్సు లేనిది) అను శ్రుతి చెపుతున్నది. ఉపాధి లేకపోతే శారీరు డనే వాడు ఉండడు కదా. అందువల్ల అక్షరం పరబ్రహ్మయే అని నిశ్చయం. రెండవ పక్షంలో "అన్యభావవ్యావృత్తేః" అనగా భేదాన్ని నిషేధించడంవల్ల అని సూత్రానికి అర్థం.

అక్షరాధికరణం సమాప్తం

## 4. ఈక్షతికర్మవ్యపదేశాధికరణమ్. సూ. 13.

## సూ. ఈక్షతికర్మవ్యపదేశాత్సః 1.2.13.

"ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మయదోఙ్కారః తస్మాద్విద్వానేతేనై **వాయతనేనైకతరమన్వేతి"** ఇది ప్రకృత్య శ్రూయతే - "యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనై **వాక్షరేణ** పరం పురుషమభిధ్యాయీత" (ప్ర.ఉ. 5.2.5) ఇతి. కిమస్మిన్ వాక్యే పరం బ్రహ్మాభిధ్యాతవ్యముపదిశ్యత ఆహోస్విదపరమితి. ఏతేనైవాయతనేన పరమపరం చైకతరమన్వేతీతి ప్రకృతత్వాత్ సంశయః. తత్ర అపరమిదం బ్రహ్మేతి ప్రాప్తమ్. కస్మాత్? "స తేజసి సూర్యే సంపన్నః, స సామభిరున్నీయతే బ్రహ్మలోకమ్" ఇతి చ తద్విదో దేశపరిచ్ఛిన్నస్య ఫలస్యోచ్యమానత్వాత్. న హి పరబ్రహ్మవిద్దేశ పరిచ్ఛిన్నం ఫలమశ్నువీతేతి యుక్తమ్, సర్వగతత్వాత్పరస్య బ్రహ్మణః. నన్వపర బ్రహ్మపరిగ్రహే పరం పురుషమితి విశేషణం నోపపద్యేత. నైష దోషః. పిణ్డాపేక్షయా ప్రాణస్య పరత్వోపపత్తేః ఇతి.

బాలానందిని

ఈక్షతీతి:- "ఈక్షతికర్మవ్యపదేశాత్ = ఓంకారంలో ధ్యానం చేయవలసిన పురుషుణ్ణి, (వాక్య శేషంలో) కర్మనుగా చెప్పడం వల్ల, సః = పరమాత్మయే చెప్పబడు చున్నది" అని సూత్రార్థం.

ఏతదితి:- "ఏతద్వై.. అన్వేతి" (సత్యకామా! ఓంకార మనేదే పరబ్రహ్మ అపరబ్రహ్మ కూడ. అందువలన విద్వాంసుడు, ఓంకారమే బ్రహ్మ అని తెలిసికొన్నవాడు, దీనినే ఆధారంగా తీసికొని ఏదో ఒక బ్రహ్మను పొందుతున్నాడు) అని ప్రారంభించి (మధ్యలో ఏకమాత్రద్విమాత్రోంకారాల ధ్యానం చెప్పి) "యః... అభిధ్యాయీత" (ఎవడైతే మూడు మాత్రలు గల ఓంకారంచేత పరమపురుషుణ్ణి ధ్యానం చేస్తాడో) అని వినబడుచున్నది. ఈ వాక్యంలో పరబ్రహ్మ ధ్యానించవలసిందిగా చెప్పబడుతున్నదా లేదా అపరబ్రహ్మయా అని సంశయం. ఈ ఓంకారాన్నే ప్రతీకగా, ఆధారంగా, తీసుకొని పరాపరబ్రహ్మలలో ఒకదానిని పొందువాడు అని చెప్పడం ఈ సంశయానికి కారణం. అపరబ్రహ్మయే ధ్యానించదగినది అని ప్రాప్తిస్తూన్నది. ఎందువల్ల? "స తేజసి సూర్యే సంపన్నః "(అతడు సూర్యతేజస్సులో కలసినవాడై) అని, "స... బ్రహ్మలోకమ్" (అతడు సామలచేత బ్రహ్మలోకానికి తీసుకొని వెళ్లబడతాడు) అని ఓంకారాన్ని తెలుసుకొన్న వానికి దేశంచేత పరిచ్ఛిన్న మైన ఫలం చెప్పబడుతున్నది గాన. పరబ్రహ్మ తెలుసుకొన్న వాడు ఒక దేశానికి సీమితమైన ఫలం పొందుతా డని చెప్పడం యుక్తం కాదు కదా? పరబ్రహ్మ సర్వగతం కదా? (ప్రశ్న) - అపరబ్రహ్మను గ్రహిస్తే పరం పురుషమ్ అని విశేషణం కుదరదు కదా? ఈ దోషం లేదు. పిండం (స్థూలవిరాట్) దృష్ట్యా సూత్రరూపమైన బ్రహ్మ పరమే కదా?

వి. ఓంకారంలో 'అ', 'ఉ' 'మ' అను మూడు మాత్ర లున్నాయి. ఒక్కొక్క మాత్రకు ఒక్కొక్క ఋషి, విభూతి మొదలైనవి ఉన్నాయి. త్రిమాత్రలు గల ఓంకారం అనగా మూడు మాత్రలకు సంబంధించిన ఋష్యాదులు తెలియబడిన ఓంకారం అని అర్థం. ఇక్కడ 'త్రిమాత్రేణ' ఇత్యాది పదాలలోని తృతీయావిభక్తికి ద్వితీయావిభక్త్యర్థం చెప్పుకోవాలి. "త్రిమాత్రకమైన ఓంకారాన్ని పరమపురుషుడుగా ఎవడు ధ్యానిస్తాడో' అని "యః పునరేతమ్.. అభిధ్యాయీత" అనేదాని అర్థం. ఓంకారానికి సామలు విభూతి. ఓంకారాన్ని బ్రహ్మగా ధ్యానంచేసిన వానిని ఆ సామలు సూర్యుని ద్వారా బ్రహ్మలోకం తీసొకొని వెడతాయి. అక్కడ వానికి పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. అని "స తేజసి... బ్రహ్మలోకం" అనే వాక్యాల భావం.

వెనుకటి అధికరణంలో వర్ణం అనే అర్థంలో రూఢి ఉన్న అక్షరశబ్దానికి లింగాన్ని పట్టి బ్రహ్మ అని అర్థం చెప్పబడింది. అదే విధంగా ఇక్కడ కూడ బ్రహ్మలోక ప్రాప్తి అనే లింగాన్ని పట్టి పరశబ్దానికి హిరణ్యగర్భుడు అని అర్థం చెప్పాలి అని పూర్వ పక్షం. ఈ విధంగా దీనికి పూర్వాధికరణతో దృష్టాంతసంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే௨ భిధీయతే - పరమేవ బ్రహ్మేహాభిధ్యాతవ్యము పదిశ్యతే. కస్మాత్? ఈక్షతికర్మవ్యపదేశాత్. ఈక్షతిర్దర్శనమ్. దర్శనవ్యాప్యమీక్షతి కర్మ. ఈక్షతికర్మత్వేనాస్యాభిధ్యాతవ్యస్య పురుషస్య వాక్యశేషే వ్యపదేశో బవతి - "స ఏతస్మాజ్జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుష మీక్షతే" ఇతి. తత్ర అభిధ్యాయతేరతథాభూతమపి వస్తు కర్మ భవతి. మనోరథకల్పిత స్యాప్యభిధ్యాయతికర్మత్వాత్. ఈక్షతేస్తు తథాభూతమేవ వస్తు లోకే కర్మ దృష్టమిత్యతః పరమాత్మైవాయం సమ్యగ్దర్శనవిషయీభూత ఈక్షతికర్మత్వేన వ్యపదిష్ట ఇతి గమ్యతే. స ఏవ చేహ పరపురుషశబ్దాభ్యామభిధ్యాతవ్యః ప్రత్యభిజ్ఞాయతే.

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు (పూర్వపక్షం) ప్రాప్తించగా (సమాధానం) చెప్పబడుతున్నది. ఇక్కడ పరబ్రహ్మయే ధ్యానింప వలసినదిగా చెప్పబడుతున్నది. ఎందువల్ల? ఈక్షతి కర్మవ్యపదేశంవల్ల. ఈక్షతిః అనగా చూడడం. చూడడం ద్వారా పొందదగినది (చూడబడ దగినది) 'ఈక్షతికర్మ'. ధ్యానింపదగిన పురుషుడు చూడడంలో కర్మగా వాక్యశేషంతో - "స.... ఈక్షతే" (ఆ ఉపాసకుడు పరమైన ఈ జీవఘనంకంటె, అనగా హిరణ్యగర్భుని కంటె పరుడైన పురుషుణ్ణి (పరబ్రహ్మను) చూస్తాడు. స్వస్వరూపంగా చూస్తాడు) అని వ్యపదేశం (చెప్పడం) ఉంది. ఏ విధంగా ధ్యానం చేయాలనుకుంటే ఆ విధంగా లేనిది కూడ ధ్యానించడంలో కర్మ కావచ్చును. మనోంథం చేత (కోరిక ప్రకారం) కల్పించబడిన వస్తువు ధ్యానంలో కర్మ అవుతుంది కదా? చూడడానికైతే ఒక వస్తువు ఎలా ఉందో ఆ విధంగానే కర్మ అవుతుం దని లోకంలో కనబడుతుంది. (అనగా ఒక వస్తువు ఏ విధంగా ఉందో ఆ విధంగానే కనబడుతుంది కాని ఉన్నది ఒకటి కనబడేది మరొకటి అని ఉండదు). సమ్యగ్దర్శనానికి (సమ్యగ్ జ్ఞానానికి) విషయమైన పరమాత్మయే ఇక్కడ చూడడంలో కర్మగా చెప్పబడ్డాడు అని కనబడుతున్నది. వాక్యశేషంలో ఏ పరబ్రహ్మ ఈక్షతికర్మగా చెప్పబడిందో అదే అనగా "స ఏతస్మాజ్జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుషమీక్షతే" అని వాక్యశేషంలో చెప్పబడిన పరపురుషుడు, "యః..... పరం పురుష మభిధ్యాయీత" అనే వాక్యంలో చెప్పబడిన "పరపురుషుడు" ఒకరే అని గుర్తించబడు తున్నది. చూడడంలో కర్మయైన పరపురుషుడు పరబ్రహ్మగాన, ఆ పరపురుషుడే "యః పునరేతమ్" ఇత్యాదివాక్యంలో చెప్పబడ్డాడు గాన ధ్యానించవలసిన పురుషుడు కూడ పరబ్రహ్మయే అని అర్థం.

## భాష్యమ్

నన్వభిధ్యానే పరః పురుష ఉక్తః, ఈక్షణే తు పరాత్పరః, కథమితర ఇతరత్ర ప్రత్యభిజ్ఞాయత ఇతి. అత్రోచ్యతే - పరపురుషశబ్దౌ తావదుభయత్ర సాధారణౌ. న చాత్ర జీవఘనశబ్దేన ప్రకృతోఽభిధ్యాతవ్యః పరః పురుషః పరామృశ్యతే; యేన తస్మాత్పరాత్పరోఽయమీక్షితవ్యః పురుషోఽన్యః స్యాత్. కస్తర్హి జీవఘన ఇతి? ఉచ్యతే- ఘనో మూర్తిః. జీవలక్షణో ఘనః జీవఘనః. సైన్ధవఖిల్యవద్యః పరమాత్మనో జీవరూపః ఖిల్యభావః ఉపాధికృతః పరశ్చ విషయేన్ద్రియాదిభ్యః సోఽత్ర జీవఘన ఇతి.

## బాలానందిని

(ప్రశ్న) అభిధ్యానంలో పరుడైన పురుషుడు చెప్పబడ్డాడు. చూడడంలో అయితే పరునికంటె పరుడైన పురుషుడు చెప్పబడ్డాడు. అందుచేత ఈ పురుషుడే ఆ పురుషుడు అని ఎట్లు గుర్తింపబడుతున్నాడు?

వి. "యః పునరేతం" ఇత్యాదివాక్యంలో పరుడైన పురుషుణ్ణి ధ్యానించాలి అని చెప్పబడింది. "స ఏతస్మాత్ జీవఘనాత్" ఇత్యాదివాక్యంలో పరమైన జీవఘనం కంటె పరుడైన పురుషుణ్ణి చూస్తాడు అని చెప్పబడింది. దీనిని పట్టి రెండవ వాక్యంలో జీవఘనంకంటె పర మనీ, పరమైన దానికంటె పురుషుడు పరు డనీ తెలుస్తున్నది. అందుచేత పరపురుషుడు అనగా జీవఘనం; పరునికంటె పరుడైన పురుషుడనగా పరబ్రహ్మ అనీ తెలుస్తూన్నది కదా? ఈ విధంగా మొదటి వాక్యంలో ధ్యేయుడుగా చెప్పబడినవాడు పరపురుషుడు, అనగా జీవఘనం, రెండవ వాక్యంలో చెప్పబడిన వాడు ఆ పరపురుషునికంటె పరుడైన పురుషుడు, పరమాత్మ. అందుచేత ఆ వాక్యాలలో చెప్పబడిన పురుషులు వేరువేరై యుండగా ఆ పురుషుడే ఈ పురుషుడని ప్రత్యభిజ్ఞానం కలుగుతున్నది అని ఇట్లు చెపుతున్నావు అని ప్రశ్న.

అత్రోచ్యతేఇతి : ఇక్కడ చెప్పబడుచున్నది. పర-పురుషశబ్దాలు రెండు వాక్యాలలోను సాధారణంగా ఉన్నాయి (అనగా రెండింట్లోను ఒకే విధంగా ఉన్నాయి). రెండవ వాక్యంలో ఉన్న 'జీవఘన' శబ్దంచేత,ధ్యానింపదగిన వాడుగా మొదటి వాక్యంలో చెప్పిన పరపురుషుడు నిర్దేశించ బడడంలేదు. అలా నిర్దేశించబడితే జీవఘనం పరపురుషుడనీ, చూడవలసిన పురుషుడు ఆ పరపురుషునికంటె భిన్ను డనీ చెప్పడానికి అవకాశం ఉండేది. అయితే ఎవ రా జీవఘనం (లేదా జీవఘనుడు)?

చెపుతున్నాం. ఘనః అనగా మూర్తి. జీవుడు లక్షణంగా గల, జీవరూపమైన ఘనం జీవఘనం. ఉపాధిసంబంధంచేత పరమాత్మ, లవణపిండం వలె, జీవు డనే ముద్దగా ఏర్పడ్డాడు. అది విషయేంద్రియాదుల కంటె పరమైనది. పై స్థాయికి చెందినది. అదే ఇక్కడ పరమైన జీవఘనం అనగా.

## భాష్యమ్

అపర ఆహ : "స సామభిరున్నీయతే బ్రహ్మలోకమ్" ఇత్యతీతానన్తర వాక్యనిర్దిష్టో యో బ్రహ్మలోకః పరశ్చ లోకాన్తరేభ్యః సోఽత్ర జీవఘన ఇత్యుచ్యతే. జీవానాం హి సర్వేషాం కరణపరివృతానాం సర్వకరణాత్మని హిరణ్యగర్భే బ్రహ్మలోకనివాసిని సంఘాతోపపత్తేః భవతి బ్రహ్మలోకో జీవఘనః. తస్మాత్ పరో యః పరమాత్మా ఈక్షణకర్మభూతః స ఏవాభిధ్యానేఽపి కర్మభూత ఇతి గమ్యతే. పరం పురుషమితి చ విశేషణం పరమాత్మపరిగ్రహ ఏవావకల్పతే. పరో హి పురుషః పరమాత్మైవ భవతి యస్మాత్పరం కించిదన్యన్నాస్తి - "పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" ఇతి చ శ్రుత్యన్తరాత్. "పరం చాపరం చ బ్రహ్మ యదోఙ్కారః" ఇతి చ విభజ్యానన్తర మోఙ్కారేణ పరం పురుషమభిధ్యాతవ్యం బ్రువన్పరమేవ బ్రహ్మ పరం పురుషం గమయతి. "యథా పాదోదరస్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముచ్యతే" ఇతి పాప్మవినిర్మోకఫలవచనం పరమాత్మానమిహాభి ధ్యాతవ్యం సూచయతి. అథ యదుక్తమ్ - పరమాత్మాభిధ్యాయినో న దేశపరిచ్ఛిన్నం ఫలం యుజ్యత ఇతి, అత్రోచ్యతే - త్రిమాత్రేణోఙ్కారేణాల మ్బనేన పరమాత్మానమభిధ్యాయతః ఫలం బ్రహ్మలోకప్రాప్తిః క్రమేణ చ సమ్యగ్దర్శనోత్పత్తిః ఇతి క్రమముక్త్యభిప్రాయమేతద్భవిష్యతీత్యదోషః 13.

## బాలానందిని

అవ. జీవఘనశబ్దానికి విషయేంద్రియాదులకంటె పరుడైన జీవుడు, అనగా (ఇక్కడ) హిరణ్యగర్భుడు అని అర్థం చెప్పబడింది. ఇప్పుడు జీవఘనశబ్దానికి బ్రహ్మలోకం అని లక్షణికార్థం అని చెపుతున్నారు - అపర ఇతి:- ఈ వాక్యానికి దగ్గరగా వెనకనే ఉన్న "స సామభిరున్నీయతే బ్రహ్మలోకమ్" అనే వాక్యంలో ఏ బ్రహ్మలోకం నిర్దేశించబడిందో, ఏది ఇతరలోకా లన్నింటికంటె పరమో ఆ బ్రహ్మలోకమే

ఇక్కడ జీవఘనశబ్దంచేత చెప్పబడుతుంది. కరణములతో (దేహాలతో) కూడిన సమస్తజీవులకూ సకల కరణాత్మకుడైన, బ్రహ్మలోకనివాసి యైన హిరణ్యగర్భునియందు సముదాయత్వం కుదురుతుంది గాన జీవఘనం అనగా బ్రహ్మలోకం. (వ్యష్టిశరీరాభిమాని జీవుడు, సమష్టి శరీరాభిమాని హిరణ్యగర్భుడు. జీవఘనః అనగా సమస్తజీవుల సముదాయం (ముద్ద), అదే హిరణర్భుడనే బ్రహ్మ. ఆ బ్రహ్మ నివసించే లోకం కూడ లక్షణచేత జీవఘనం అని అర్థం) ఆ బ్రహ్మలోకంకంటె పరుడు, ఈక్షణంలో (చూడడంలో) కర్మ అయిన ఏ పరమాత్మ ఉన్నాడో అతడే అభిధ్యానంలో కూడ కర్మ అని తెలుస్తున్నది. పరం పురుషమ్ అనే విశేషణం కూడ పరమాత్మను గ్రహిస్తేనే సరిగా కుదురుతుంది. "పురుషాన్న... గతిః" (పురుషునికంటె పరమైనది మరొకటి లేదు. ఆ పురుషుడే అత్యుత్తమమైన హద్దు, పరమైన గతి) అని మరొక శ్రుతిని అనుసరించి దేనికంటె పరమైనది ఏదీ లేదో అట్టి పరపురుషుడు పరమాత్మయే కావాలి. "పరం చాపరం చ బ్రహ్మ యదోఙ్కారః" అని విభజించి తరవాత ఓంకారంచేత పురుషుణ్ణి ధ్యానం చెయ్యాలి అని చెప్పుచు (చెప్పడం వల్ల) పరపురుషుడు పరబ్రహ్మయే అని స్పష్టీకరిస్తున్నాడు. "యథా... వినిర్ముచ్యతే" సర్పం ఏ విధంగా కుబుసంచేత విడవబడుతుందో అదేవిధంగా అతడు (ధ్యానం చేసినవాడు) పాపాల చేత విడవబడతాడు) అని పాపములను విడవడం అనే ఫలాన్ని చెప్పడం ఇక్కడ ధ్యానించవలసింది పరమాత్మయే అని సూచిస్తున్నది. పరమాత్మను గ్రహించిన పక్షంలో పరమాత్మను ధ్యానించేవానికి దేశంచేత పరిచ్ఛిన్నమైన (పరిమిత దేశానికి సంబంధించిన) ఫలం చెప్పడం కుదురదు. అని (పూర్వపక్షి) చెప్పినదానిని గూర్చి సమాధానం చెపుతున్నాం. మూడు మాత్రలు గల ఓంకారాన్ని ఆలంబనంగా చేసికొని పరమాత్మను ధ్యానం చేసేవానికి బ్రహ్మలోక (హిరణ్యగర్భలోక) ప్రాప్తి, తరవాత క్రమంగా యథార్థతత్త్వజ్ఞానం కలగడంచేత ముక్తి, ఈ విధంగా క్రమముక్తిని చెప్పడమే అభిప్రాయం గాన దోషం లేదు. 13.

ఈక్షతికర్మవ్యపదేశాధికరణం సమాప్తం

### 5. దహరాధికరణమ్. సూ. 14-21

### సూ. దహర ఉత్తరేభ్యః. 1.3.14

"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ దహరోఽస్మిన్నన్తరాకాశః తస్మిన్యదన్తస్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్" (ఛా.ఉ.81.1) ఇత్యాది వాక్యం సమామ్నాయతే. తత్ర యోఽయం దహరే పుణ్డరీకే దహర ఆకాశః శ్రుతః స కిం భూతాకాశోఽథవా విజ్ఞానాత్మాథవా

పరమాత్మేతి సంశయ్యతే. కుతః సంశయః? ఆకాశబ్రహ్మపురశబ్దాభ్యామ్. ఆకాశశబ్దో హ్యయం భూతాకాశే పరస్మింశ్చ ప్రయుజ్యమానో దృశ్యతే. తత్ర కిం భూతాకాశ ఏవ దహరః స్యాత్కిం వా పర ఇతి సంశయః. తథా బ్రహ్మపురమితి కిం జీవోఽత్ర బ్రహ్మనామా తస్యేదం పురం శరీరం బ్రహ్మపురమ్ అథవా పరస్యైవ బ్రహ్మణః పురం బ్రహ్మపురమితి. తత్ర జీవస్య పరస్య వాన్యతరస్య పురస్వామినో దహరాకాశత్వే సంశయః. తత్రాకాశశబ్దస్య భూతాకాశే రూఢత్వాద్భూతాకాశ ఏవ దహరశబ్ద ఇతి ప్రాప్తమ్. తస్య చ దహరాయతనాపేక్షయా దహరత్వమ్ "యావాన్వా అయమాకాశస్తావానేషోఽన్తర్హృదయ ఆకాశః" ఇతి చ బాహ్యాభ్యన్తరభావకృతభేదస్యోపమానోపమేయభావః. ద్యావాపృథివ్యాది చ తస్మిన్నన్తఃసమాహితమ్, అవకాశాత్మనాకాశస్యైకత్వాత్.

బాలానందిని

దహర ఇతి : "ఉత్తరేభ్యః = తరువాత చెప్పబడబోయే హేతువుల వల్ల, దహరః = దహరాకాశం బ్రహ్మయే" అని సూత్రార్థం.

అథేతి:- "అథ... విజిజ్ఞాసి తవ్యమ్" (భూమవిద్య తరవాత బ్రహ్మపురమైన ఈ శరీరంలో అల్పమైన ఏ పద్మం (హృత్పద్మం) ఉన్నదో, దాని లోపల ఏ చిన్న ఆకాశం ఉన్నదో, దాని లోపల ఏది ఉన్నదో అది అన్వేషించదగినది, తెలుసుకొనదగినది). ఇత్యాది వాక్యం పఠించబడుతన్నది. దహరమైన హృదయపద్మంలో ఏ దహరమైన ఆకాశం వినబడుచున్నదో అది భూతాకాశమా లేక విజ్ఞానాత్మయా లేక పరమాత్మయా అని సంశయం. సంశయం ఎందువల్ల? ఇక్కడ 'ఆకాశ' 'బ్రహ్మపుర' శబ్దాలు ఉండడంవల్ల. ఈ ఆకాశశబ్దం భూతాకాశం అనే అర్థంలోను, పరమాత్మ అనే అర్థంలోను ప్రయోగించ బడుచున్నట్లుగా కనబడుతున్నది. అందుచేత భూతాకాశమే దహరమా లేక పరమాత్మయా అని సంశయం కలుగుచున్నది. (ఇది ఆకాశశబ్దాన్ని పట్టి కలిగిన సంశయం). అట్లే బ్రహ్మపురం అన్నప్పుడు బ్రహ్మ అనే పేరు గల జీవుడు, అతని ఈ శరీరం అని అర్థమా, లేదా పరమాత్మయే బ్రహ్మ, ఆ బ్రహ్మయొక్క పురం అని అర్థమా అని సంశయం కలుగుతున్నది. జీవుడు గాని, పరమాత్మగాని వీరిద్దరిలో ఏ ఒక్క పురస్వామియొక్క దహరాకాశము అనే విషయంలో సంశయం. ఇలా ఉండగా ఆకాశశబ్దం భూతాకాశం అనే అర్థంలో రూఢం గాన

దహరశబ్దప్రతిపాద్యం భూతాకాశమే అని ప్రాప్తించినది. దాని స్థానం దహరం (చిన్నది) అవడంచేత అది కూడ దహరం అయింది. మహాకాశం బాహ్యమైనది (బైట ఉంది), దహరాకాశం లోపల ఉంది. ఈ భేదాన్ని పురస్కరించుకొని ఈ రెండు ఆకాశాల మధ్య "యావాన్వా... ఆకాశః" (బైట నున్న ఈ మహాకాశం ఎంతో హృదయంలో ఉన్న ఈ ఆకాశం కూడ అంతే) అని ఉపమానోపమేయభావం చెప్పబడింది. (ఒకటి రెండవ దానితో పోల్చబడింది). రెండూ అవకాశాలే గాన, అవకాశత్వేన, ఆకాశం ఒక్కటే గాన ద్యులోకపృథివ్యాదికం దానిలో ఉంచబడింది (ఇమిడి ఉంది).

## భాష్యమ్

అథవా జీవో దహర ఇతి ప్రాప్తమ్ - బ్రహ్మపురశబ్దాత్. జీవస్య హీదం పురం సత్ శరీరం బ్రహ్మపురమిత్యుచ్యతే, తస్య స్వకర్మణోపార్జితత్వాత్. భక్త్యా చ తస్య బ్రహ్మశబ్దవాచ్యత్వమ్. న హి పరస్య బ్రహ్మణః శరీరేణ స్వస్వామిభావః సంబన్ధోఽస్తి? తత్ర పురస్వామినః పురైకదేశేఽవస్థానం దృష్టం, యథా రాజ్ఞః. మనఉపాధికశ్చ జీవః. మనశ్చ ప్రాయేణ హృదయే ప్రతిష్ఠితమిత్యతో జీవస్యైవేదం హృదయేఽన్తరవస్థానం స్యాత్. దహరత్వమపి తస్యైవ ఆరాగ్రోపమితత్వాదవకల్పతే. ఆకాశోపమితత్వాది చ బ్రహ్మాభేదవివక్షయా భవిష్యతి. న చాత్ర దహరస్యాకాశస్యాన్వేష్యత్వం విజిజ్ఞాసితవ్యత్వం చ శ్రూయతే, 'తస్మిన్ యదన్తః' ఇతి పరవిశేషణత్వేనోపాదానాదితి.

## బాలానందిని

అథవేతి :- లేదా బ్రహ్మపురశబ్దం ఉండడంచేత జీవుడు కావచ్చును అని ప్రాప్తించింది. ఈ శరీరం జీవునిచేత, తన కర్మచేత సంపాదించబడింది; అందుచేత ఇది జీవుని శరీరం అవడంచేత బ్రహ్మపురం అని చెప్పబడుతున్నది. గౌణప్రయోగంచేత జీవుడే బ్రహ్మ అని చెప్పబడుతున్నాడు. అంతే కాని బ్రహ్మకు శరీరంతో స్వస్వామిభావసంబంధం (సొత్తు దాని స్వామి అనే సంబంధం) లేదు కదా? పురస్వామి పురంలోని ఒక ప్రాంతంలో నివసించడం, పురస్వామియైన రాజు పురంలోని ఒక భవనంలో నివసించి నట్లు, ప్రసిద్ధంగా ఉంది. జీవునికి ఉపాధి మనస్సు. మనస్సు సాధారణంగా హృదయంలో ఉంటుంది. అందుచేత జీవుడు హృదయంలో ఉన్నాడు అని చెప్పడం యుక్తమే అవుతుంది. జీవుడు ఆరాగ్రంతో పోల్చబడుతాడు కాబట్టి అతనికి దహరత్వం కూడ ఉపపన్నమే. జీవునకు బ్రహ్మతో ఉన్న అభేదాన్ని వివక్షించడంచేత (దృష్టిలో పెట్టుకొనడంచేత) ఆకాశంతో పోల్చడం మొదలైనవి కూడ కుదురుతాయి. ఇక్కడ దహరాకాశం అన్వేషించదగినది,

తెలియ నభిలషించదగినది అని వినబడడంలేదు. ఎందువల్ల ననగా ఆ దహరాకాశం "దాని లోపల ఏది ఉన్నదో" అని లోపల ఉన్నదానికి విశేషణంగా (గుర్తుగా) చెప్పబడింది.

వి. పూర్వాధికరణంలో 'పరపురుష' శబ్దం పరమాత్మయందే రూఢంగాన బ్రహ్మయే ధ్యేయం అని చెప్పబడింది. అట్లే ఇక్కడ కూడ ఆకాశశబ్దం భూతాకాశం అనే అర్థంలోనే రూఢం గాన అదే ఉపాస్యం అని అర్థం చెప్పాలి అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం చూపబడింది.

## భాష్యమ్

అత ఉత్తరమ్ బ్రూమః- పరమేశ్వర ఏవాత్ర దహరో భవితుమర్హతి,న భూతాకాశో జీవో వా. కస్మాత్? ఉత్తరేభ్యో వాక్యశేషగతేభ్యో హేతుభ్యః. తథాహి- అన్వేష్టవ్యతయా విహితస్య దహరాకాశస్య 'తం చేద్బ్రూయుః' ఇత్యుపక్రమ్య "కిం తత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజిజ్ఞాసితవ్యమ్" ఇత్యేవమాక్షేపపూర్వకం ప్రతిసమాధానవచనం భవతి- "స బ్రూయాద్యావాన్వాయమాకాశస్తావానేషోఽన్తర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అన్తరేవ సమాహితే" (ఛా.ఉ.8.1.3) ఇత్యాది. తత్ర పుణ్డరీకదహరత్వేన ప్రాప్తదహరత్వస్యాకాశస్య ప్రసిద్ధాకాశౌపమ్యేన దహరత్వం నివర్తయన్ భూతాకాశత్వం దహరస్యాకాశస్య నివర్తయతీతి గమ్యతే. యద్యప్యాకాశశబ్దో భూతాకాశే రూఢస్తథాపి తేనైవ తస్యోపమా నోపపద్యత ఇతి భూతాకాశశఙ్కా నివర్తితా భవతి.

## బాలానందిని

అత ఇతి:- అందువల్ల సమాధానం చెపుతున్నాం. ఇక్కడ దహరాకాశం పరమేశ్వరుడే కావాలి కాని, భూతాకాశం గాని, జీవుడు గాని అవడానికి వీలులేదు. ఎందువల్ల? ఉత్తరేభ్యః=వాక్యశేషంలో ఉన్న హేతువులవల్ల. అదెట్లనగా- అన్వేషించదగినదిగా చెప్పబడిన దహరాకాశాన్ని గూర్చి చెపుతూ "తం చేద్బ్రూయుః" (అతనిని అడిగితే) అని ఉపక్రమించి "కిం..విజిజ్ఞాసితవ్యమ్" (వెదకదగినదీ, తెలుసుకొనదగినదీ అక్కడ ఏముంది?) అని ఆక్షేపపూర్వకంగా (ప్రశ్నపూర్వకంగా) 'స బ్రూయాత్... సమాహితే" (అతడు ఇట్లు చెప్పాలి; ఈ బాహ్యమైన ఆకాశం ఎంత ఉందో హృదయం లోపల ఉన్న ఆకాశం కూడ అంత ఉంది. ద్యావాపృథివులు రెండూ దీనిలోపలనే ఇమిడి ఉన్నాయి) ఇత్యాదివాక్యాలలో సమాధానం చెప్పబడింది. పుండరీకం దహరం (చిన్నది) గాన ఆకాశం కూడ దహరం కావలసిఉండగా దాని దహరత్వాన్ని ఆకాశంతో పోల్చడం ద్వారా నివర్తింపచేసి, దహరాకాశం భూతాకాశం కాదు అని కూడా చెపుతున్నా డని తెలుస్తూన్నది. ఆకాశశబ్దం భూతాకాశం అనే అర్థంలో

పృథమైనా దానిని దానితోనే పోల్చడం కుదరదు గాన భూతాకాశం అనే శంక నివర్తింపచేయబడింది అవుతుంది.

వి. దహరాకాశాన్ని మహాకాశంతో పోల్చాడు. దీనివల్ల రెండు విషయాలు స్పష్టీకరించబడ్డాయి. ఒకటి-దహరాకాశం అల్పప్రమాణం కలది కాదు. రెండు-దహరాకాశం భూతాకాశం కాదు. అది భూతాకాశమే అయితే దానిని భూతాకాశంతో పోల్చడం కుదరదు కదా. రెండు వేరు వేరు వస్తువులను ఒకదానితో ఒకటి పోలుస్తారు గాని ఒక వస్తువును దానితోనే పోల్చరు అని భావం.

## భాష్యమ్

నన్వేకస్యాప్యాకాశస్యబాహ్యాభ్యన్తరత్వకల్పితేన భేదేనోపమానోపమేయభావః సంభవతీత్యుక్తమ్. నైవం సంభవతి. అగతికా హీయం గతిః యత్కాల్పనికభేదాశ్రయణమ్. అపి చ కల్పయిత్వాపి భేదముమానోపమేయ భావం వర్ణయతః పరిచ్ఛిన్నత్వాదాభ్యన్తరాకాశస్య న బాహ్యాకాశ పరిమాణత్వముపపద్యతే. నను పరమేశ్వరస్యాపి "జ్యాయానాకాశాత్" (శత.బ్రా.10.6.3.2) ఇతి శ్రుత్యన్తరాత్ నైవాకాశపరిమాణత్వముపపద్యేత.నైష దోషః. పుణ్డరీకవేష్టనప్రాప్తదహరత్వనివృత్తిపరత్వాద్వాక్యస్య న తావత్త్వ ప్రతిపాదనపరత్వమ్. ఉభయప్రతిపాదనే హి వాక్యం భిద్యేత. న చ కల్పితే పుణ్డరీకవేష్టితే ఆకాశైకదేశే ద్యావాపృథివ్యాదీనామన్తఃసమాధానముపపద్యతే. "ఏష ఆత్మాపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః" ఇతి చాత్మత్వాదపహతపాప్మత్వాదయశ్చ గుణా న భూతాకాశే సంభవన్తి.

## బాలానందిని

నన్వితి:- (ఆశంక) ఆకాశం ఒకటే అయినా బాహ్యత్వం, అంతరత్వం అనే కల్పితమైన భేదంచేత ఉపమానోపమేయభావం కుదురుతుంది అని చెప్పబడింది కదా? (సమాధానం) ఇది కుదరదు. కల్పితమైన భేదాన్ని ఆశ్రయించడం అనేది అగతికగతి కదా (మరొక ఉపాయం ఏదీ లేకపోతే అంగీకరించేది అగతికగతి). మరొక విషయ మేమనగా- భేదాన్ని కల్పించి ఉపమానోపమేయ భావాన్ని సమర్థించినా కూడ అభ్యంతరాకాశం పరిచ్ఛిన్నం గాన దానికి మహాకాశాని కున్న పరిమాణం ఉండడం కుదరదు. (ప్రశ్న) "జ్యాయానాకాశాత్" (ఆకాశంకంటె పెద్దవాడు) అని మరొకశ్రుతిలో

చెప్పడంచేత పరమేశ్వరునికి కూడ ఆకాశపరిమాణం వంటి పరిమాణం మాత్రమే ఉండడం కుదరదు కదా? (సమాధానం)- ఈ దోషం లేదు. పుండరీకంలో చుట్టబడి ఉండడంచేత ప్రాప్తించిన దహరత్వాన్ని (అల్పత్వాన్ని) నిషేధించడంలోనే ఆ వాక్యానికి తాత్పర్యంగాన ఆకాశంతో సమానమైన ప్రమాణం కలది అని చెప్పడంలో దానికి తాత్పర్యం లేదు. రెండింటినీ ప్రతిపాదిస్తే వాక్యం భిన్నం అయిపోతుంది.

వి. శాస్త్రంలో ఒక వాక్యం ప్రధానంగా ఒకే విషయాన్ని చెప్పాలి. ఒక వాక్యానికి రెండు అర్థాలు చెప్పకూడదు. అలా చెపితే ఆ వాక్యాన్ని రెండు వాక్యాలుగా పరిగణించిన ట్లవుతుంది. దీనికి వాక్యభేదదోషం అని పేరు. ఇది కావ్యాలలో కుదురుతుందేమో కాని శాస్త్రాలలో కుదరదు. 'జ్యాయానాకాశాత్' అని దహరాకాశం (బ్రహ్మ) మహాకాశంకంటె కూడ పెద్దది అని చెప్పడంలో ప్రధానమైన అభిప్రాయం ఏ మనగా ఈ దహరాకాశం (బ్రహ్మ) హృదయపద్మంలో ఉంది గాన చిన్నది అనే భ్రాంతిని తొలగించడమే. అంతే కాని ఆకాశంకంటె పెద్దది అని చెప్పడంలో కూడ తాత్పర్యం ఉంది అన్నట్లయితే రెండు అర్థాలకు ప్రాధాన్యం ఇవ్వడంవల్ల వాక్యభేదదోషం వస్తుంది అని భావం.

న చేతి:- హృదయపుండరీకంచేత చుట్టబడి కల్పించబడిన భేదం గల ఆకాశంయొక్క ఒక చిన్నప్రదేశంలో ద్యావాపృథివ్యాదులు లోపల ఇమడడం కుదరదు కూడ. "ఏష... సత్యసంకల్పః" (ఈ ఆత్మ తొలగిన సర్వపాపములు గలది, ముసలితనం లేనిది, మృత్యువు లేనిది, శోకం లేనిది, ఆకలి లేనిది, దాహం లేనిది, సత్య మైన కోరిక గలది, సత్యమైన సంకల్పం గలది) అని చెప్పిన ఆత్మత్వం, అపహతపాప్మత్వం మొదలైన గుణాలు కూడ భూతాకాశంలో సంభవించవు.

## భాష్యమ్

యద్యప్యాత్మశబ్దో జీవే సంభవతి తథాపీతరేభ్యః కారణేభ్యః జీవశఙ్కాపి నివర్తితా భవతి. న హ్యుపాధిపరిచ్ఛిన్నస్యారాగ్రోపమితస్య జీవస్య సర్వగతత్వాది వివక్ష్యేతేతి చేత్, యదాత్మతయా జీవస్య సర్వగతత్వాది వివక్ష్యేత తస్యైవ బ్రహ్మణః సాక్షాత్సర్వగతత్వాది వివక్ష్యతామితి యుక్తమ్. యదప్యుక్తం బ్రహ్మపురమితి జీవేన పురస్యోపలక్షితత్వాద్రాజ్ఞ ఇవ జీవస్యైవేదం పురస్వామినః పురైకదేశవర్తిత్వమస్తు ఇతి. అత్ర బ్రూమః- పరస్యైవేదం బ్రహ్మణః పురం సచ్ఛరీరం బ్రహ్మపురమిత్యుచ్యతే, బ్రహ్మశబ్దస్య

తస్మిన్ ముఖ్యత్వాత్. తస్యాప్యస్తి పురేణానేన సంబన్ధః, ఉపలబ్ధ్యధిష్ఠానత్వాత్. "స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే" (ప్ర.ఉ.5.5.) "స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః" (బృ.ఉ.2.5.18) ఇత్యాది శ్రుతిభ్యః. అథవా జీవపుర ఏవాస్మిన్ బ్రహ్మ సంనిహితముపలక్ష్యతే, యథా శాలగ్రామే విష్ణుః సంనిహితః ఇతి తద్వత్. "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" (ఛా.ఉ.8.16) ఇతి చ కర్మణామన్తవత్ఫలత్వముక్త్వా "అథ య ఇహాత్మానమనువిద్య వ్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాంస్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" ఇతి ప్రకృతదహరాకాశవిజ్ఞానస్యానన్తఫలవత్త్వం వదన్ పరమాత్మత్వమస్య సూచయతి. యదప్యేతదుక్తం- న దహరస్యాకాశస్యాన్వేష్టవ్యత్వం విజిజ్ఞాసితవ్యత్వం చ శ్రుతమ్, పరవిశేషణత్వేనోపాదానాత్- ఇతి, అత్ర బ్రూమః- యద్యాకాశో నాన్వేష్టవ్యత్వేనోక్తః స్యాత్ "యావాన్వా అయమాకాశస్తావానేషోఽన్తర్హృదయ ఆకాశః" ఇత్యాద్యాకాశస్వరూపప్రదర్శనం నోపయుజ్యేత.

### బాలానందిని

యద్యపీతి:- ఆత్మశబ్దం జీవుని విషయంలో సంభవించినా ఇతరకారణాలచేత జీవు డనే శంక కూడ నివర్తింపబడుతుంది. ఉపాధులచేత పరిచ్ఛిన్నుడు, ఆరాగ్రమాత్రప్రమాణం కలవాడు అయిన జీవునియొక్క పుండరీకంచేత చుట్టబడడంవల్ల ఏర్పడిన దహరత్వాన్ని నివర్తింపచేయడం శక్యం కాదు కదా? జీవునకు బ్రహ్మతో ఉన్న అభేదాన్ని చెప్పాలనే ఉద్దేశ్యంతో సర్వగతత్వాదికం వివక్షితం కావచ్చు కదా అని అంటే- ఏ బ్రహ్మతో అభిన్ను డవడంచేత జీవునికి సర్వగతత్వాదికం చెప్పాలని అంటున్నావో, ఆ బ్రహ్మకే ఈ సర్వగతత్వం మొదలైనది చెప్పడం యుక్తం. "బ్రహ్మపురం" అనే పదం చేత జీవునితో పురానికి సంబంధం చెప్పడంవల్ల, రాజువలె, పురస్వామియైన జీవుడు పురంలోని ఒక ప్రదేశంలో ఉన్నా డని చెప్పవచ్చు నని చెప్పినదానిని గూర్చి చెపుతున్నాం. బ్రహ్మశబ్దానికి ముఖ్యమైన అర్థం బ్రహ్మ. అందుచేత ఈ శరీరం పరబ్రహ్మయొక్క శరీరం అవడంచేతనే బ్రహ్మపురం అని చెప్పబడుతున్నది. శరీరం బ్రహ్మసాక్షాత్కారానికి తగిన స్థానం అవడంచేత బ్రహ్మకు కూడ ఈ శరీరంతో సంబంధం ఉంది. "స ఏతస్మాత్...ఈక్షతే", "స వా...పురిశయః" (ఆ ఈ పురుషుడు, పరమాత్మ

సకలదేహాలలోను ఉండే పురిశయుడు) ఇత్యాదిశ్రుతు లీ విషయమే తెలుపుచున్నాయి. లేదా జీవపురమే అయిన ఈ శరీరంలో బ్రహ్మ ఉన్నట్లు గా చూడబడుచున్నది (చెప్పబడు చున్నది). శాలగ్రామంలో విష్ణువు ఏ విధంగా సంనిహితుడై ఉంటాడో అట్లే. "తద్యథేహ...క్షీయతే" అని కర్మల ఫలం అంతం కలది (అనిత్యం) అని చెప్పి "అథ... భవతి" (వైరాగ్యం లభించిన తరవాత ఎవరు జీవనదశలో ఆత్మను (దహరాన్ని) ఈ సత్యకామాదిగుణాలను తెలిసికొని పరలోకానికి వెడతారో వాళ్లకు అన్ని లోకాలలోను స్వేచ్ఛాసంచారం లభిస్తుంది) అని ప్రకృతమైన దహరాకాశంయొక్క విజ్ఞానానికి అనంత మైన ఫలం ఉన్న దని చెపుతూ ఈ దహరం ఆత్మయే అని సూచిస్తున్నాడు. దహరాకాశం మరొకదానికి (దానిలో ఉన్నదానికి) విశేషణంగా (గుర్తుగా) చెప్పబడింది; అందుచేత దహరాకాశానికి అన్వేష్టవ్యత్వం గాని, విజిజ్ఞాసితవ్యత్వం కాని లేదు అని చెప్పినదాని విషయంలో చెపుతున్నాం- ఆకాశం అన్వేష్టవ్యంగా చెప్పబడకపోతే "యావాన్వా...ఆకాశః' ' అని ఆకాశస్వరూపాన్ని చూపడానికి ఏమీ ప్రయోజనం లేకుండా పోతుంది.

## భాష్యమ్

నన్వేతదప్యన్తర్వర్తివస్తుసద్భావప్రదర్శనాయైవ ప్రదర్శ్యతే- "తం చేద్బ్రూయుః యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ దహరోఽస్మిన్నన్తరాకాశః కిం తదత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్విజిజ్ఞాసితవ్యమ్" ఇత్యాక్షిప్య పరిహారావసరే ఆకాశౌపమ్యోపక్రమేణ ద్యావాపృథివ్యాదీనామన్తః సమాహితత్వదర్శనాత్. నైతదేవమ్. ఏవం హి సతి యదన్తః సమాహితం ద్యావాపృథివ్యాది తదన్వేష్టవ్యం విజిజ్ఞాసితవ్యం చోక్తం స్యాత్. తత్ర వాక్యశేషో నోపపద్యేత. "అస్మిన్ కామాః సమాహితాః, ఏష ఆత్మాపహతపాప్మా" ఇతి హి ప్రకృతం ద్యావాపృథివ్యాదిసమాధానాధారమాకాశమాకృష్య- "అథ య ఇహాత్మానమనువిద్య వ్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాన్" ఇతి సముచ్చయార్థేన చశబ్దేనాత్మానం కామాధారమాశ్రితాంశ్చ కామాన్ విజ్ఞేయాన్ వాక్యశేషో దర్శయతి. తస్మాద్వాక్యోపక్రమేఽపి దహర ఏవాకాశో హృదయపుణ్డరీకాధిష్ఠానః సహాన్తఃస్థైః సమాహితైః పృథివ్యాదిభిః సత్యైశ్చ కామైర్విజ్ఞేయ ఉక్త ఇతి గమ్యతే. స చోక్తేభ్యః హేతుభ్యః పరమేశ్వర ఇతి.14.

## బాలానందిని

నన్వితి :-(ప్రశ్న) ఇది కూడ (ఆకాశస్వరూపం కూడ) లోపల వస్తువు ఉన్నదని చెప్పడానికే చూపబడుతున్నది కదా? ఎందువల్ల ననగా- "తం చేద్...విజిజ్ఞాసితవ్యమ్"

ఆక్షేపించి ఆ ఆక్షేపాన్ని పరిహరించేటప్పుడు ఆకాశంతో ఔపమ్యం చెప్పడం మొదలైన క్రమాన్ని అనుసరించి ద్యావాపృథి వ్యాదులు దాని లోపల ఇమిడి ఉన్నాయి అని చెప్పబడింది. (అనగా ఆకాశ స్వరూపాన్ని చెప్పడం ఆకాశాన్ని ధ్యానించాలని చెప్పడం కోసం కాదు. ఆకాశంలో ఉన్న వస్తువులను గూర్చి చెప్పడంకోసం. అందుచేత ఆ దహరాకాశంలో ఉన్నట్లు చెప్పబడిన వస్తువులే ధ్యేయాలు కాని ఆకాశం కాదు అని పూర్వపక్షి అభిప్రాయం). (సమాధానం)- ఇది ఇట్లు కాదు. ఇలా చెప్పిన పక్షంలో- దహరాకాశంలో సమాహితమైన ద్యావాపృథివ్యాదికం అన్వేష్టవ్య మని చెప్పిన ట్లవుతుంది. అలా చెపితే వాక్యశేషం కుదరదు. "అస్మిన్... అపహతపాప్మా" అని ప్రకృతమూ, ద్యానాపృథివ్యాదుల సమాధానానికి (ఉండడానికి) ఆధారమూ అయిన ఆకాశాన్ని ఆకర్షించి (ముందుకు తీసికొని వెళ్లి) ''అథ...కామాన్'' అని సముచ్చయార్థకమైన చ శబ్దంచేత కామాధారమైన ఆత్మ, ఆత్మను ఆశ్రయించి ఉన్న కామాలూ కూడ జ్ఞేయములు అని వాక్యశేషం చూపుతున్నది. (ఇది అదీ కూడ అని చెప్పడం 'సముచ్చయం'). అందువల్ల వాక్యోపక్రమంలో కూడ హృదయపుండరీకం ఆధారంగా గల దహరాకాశమే తన లోపల ఇమిడి ఉన్న ద్యావాపృథివ్యాదులతోను, సత్యమైన కామాలతోను సహా తెలియదగినది అని చెప్పినట్లు తెలుస్తూన్నది. అది, చెప్పిన హేతువులవల్ల పరమేశ్వరుడే.14.

## సూ. గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లిఙ్గం చ. 1.3.15

దహరః పరమేశ్వరః ఉత్తరేభ్యః హేతుభ్య ఇత్యుక్తమ్. త ఏవోత్తరే హేతవ ఇదానీం ప్రపఞ్చ్యన్తే. ఇతశ్చ పరమేశ్వర ఏవ దహరః, యస్మాద్దహర వాక్యశేషే పరమేశ్వరస్యైవ ప్రతిపాదకౌ శబ్దౌ భవతః- "ఇమాః సర్వాః ప్రజా అహరహర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం న విన్దన్తి" (ఛా.ఉ.8.3.2) ఇతి. తత్ర ప్రకృతం దహరం బ్రహ్మలోకశబ్దేనాభిధాయ తద్విషయా గతిః ప్రజాశబ్దవాచ్యానాం జీవానామభిధీయమానా దహరస్య బ్రహ్మతాం గమయతి. తథా హ్యహరహర్జీవానాం సుప్తావస్థాయాం బ్రహ్మవిషయం గమనం దృష్టం శ్రుత్యన్తరే- ''సతా సోమ్య తదా సంపన్నో భవతి'' (ఛా.ఉ.6.8.1) ఇత్యేవమాదౌ. లోకేఽపి కిల గాఢం సుషుప్తమాచక్షతే-బ్రహ్మీభూతో బ్రహ్మతాం గత ఇతి.

తథా బ్రహ్మలోకశబ్దోఽపి ప్రకృతే దహరే ప్రయుజ్యమానో జీవ-భూతాకాశశఙ్కాం నివర్తయన్ బ్రహ్మతామస్య గమయతి. నను కమలాసనలోకమపి బ్రహ్మశబ్దో గమయేత్? గమయేద్యది బ్రహ్మణో లోక ఇతి షష్ఠీసమాసవృత్త్యా వ్యుత్పాద్యేత. సామానాధికరణవృత్త్యా తు వ్యుత్పాద్యమానో బ్రహ్మైవ లోకః బ్రహ్మలోక ఇతి పరమేవ బ్రహ్మ గమయిష్యతి. ఏతదేవ చాహరహర్బ్రహ్మ లోకగమనం దృష్టం బ్రహ్మలోకశబ్దస్య సామానాధికరణ్యవృత్తిపరిగ్రహే లిఙ్గమ్. న హ్యాహరహరిమాః ప్రజాః కార్యబ్రహ్మలోకం సత్యలోకాఖ్యం గచ్ఛన్తీతి శక్యం కల్పయితుమ్.15.

బాలానందిని

గతీతి:- "గతిశబ్దాభ్యామ్=గతిని బోధించే వాక్యశేషంలో ఉన్న రెండు శబ్దాలను పట్టి దహరం బ్రహ్మయే. తథా=ఆ విధంగా, దృష్టమ్= శ్రుతిలోను లోకంలోను చూడబడింది. లిఙ్గం చ హి=లింగం కూడ ఉన్నది కదా?" అని సూత్రార్థం.

దహర ఇతి:- తరవాత చెప్పబోయే హేతువులవల్ల దహరం పరమేశ్వరుడు అని చెప్పబడింది. ఇప్పుడు ఆ తరవాత చెప్పిన హేతువులేవో వివరించబడుతున్నవి. ఈ కారణంవల్ల కూడ పరమేశ్వరుడే దహరాకాశం; ఎందువల్ల ననగా-దహరవాక్య శేషంలో పరమేశ్వరుణ్ణే ప్రతిపాదించే రెండు గతివాచకశబ్దాలు- "ఇమాః... విన్దన్తి" (ఈ జీవు లందరూ ప్రతి రోజూ ఈ బ్రహ్మలోకానికి వెడుతున్నా ఆ విషయం తెలుసుకొనడం లేదు) అని ఉన్నాయి. అక్కడ ప్రకృత మైన దహరాన్ని బ్రహ్మశబ్దంచేత నిర్దేశిస్తూ, ప్రజాశబ్దంచేత చెప్పబడే జీవు లందరూ ఆ బ్రహ్మలోకానికి వెడుతున్నారు అని చెప్పడం దహరం బ్రహ్మయే అని తెలుపుతున్నది. అట్లే జీవులు ప్రతిరోజు సుషుప్తావస్థలో బ్రహ్మను చేరుతారు అని "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (సౌమ్యుడా! ఆ సుషుప్తిలో జీవుడు సత్‌తో కలుస్తాడు) అనే మరొక శ్రుతివాక్యంలో కూడ చెప్పబడింది. లోకంలో కూడ గాఢంగా నిద్రపోతున్నవానిని "బ్రహ్మ అయ్యాడు, బ్రహ్మత్వాన్ని పొందాడు" అంటారు. అట్లే ప్రకృతమైన దహరాకాశం విషయంలో ప్రయోగించబడు తూన్న బ్రహ్మలోకశబ్దం కూడ దహరమనగా జీవుడు లేదా భూతాకాశం అనే ఆశంకను తొలగించి అది బ్రహ్మయే అని స్పష్టం చేస్తూన్నది. బ్రహ్మలోక శబ్దం బ్రహ్మదేవుని లోకాన్ని కూడ బోధిస్తుంది కదా? "బ్రహ్మణః లోకః" బ్రహ్మయొక్క లోకం) అని షష్ఠీసమాసం గ్రహిస్తే నువ్వు చెప్పినట్లు ఆ అర్థం కూడ బోధించవచ్చు. కాని "బ్రహ్మైవ లోకః"

(బ్రహ్మయే లోకం) అని కర్మధారయసమాసం గ్రహిస్తే పరబ్రహ్మను మాత్రమే బోధిస్తుంది. ప్రతిరోజు బ్రహ్మలోకానికి జీవులు వెళ్లడమే బ్రహ్మలోకశబ్దాన్ని కర్మధారయసమాసంగా గ్రహించడానికి గుర్తు. ఈ జీవులందరూ ప్రతిరోజూ, సత్యలోకం అనే పేరు గల బ్రహ్మలోకానికి వెడుతుంటా రని కల్పించడం శక్యం కాదు కదా? 15.

## సూ. ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్ధేః.1.3.16.

ధృతేశ్చ హేతోః పరమేశ్వర ఏవాయం దహరః.కథమ్? "దహరోఽస్మిన్నన్తరాకాశః" ఇతి హి ప్రకృత్యాకాశౌపమ్యపూర్వకం తస్మిన్ సర్వసమాధానముక్త్వా తస్మిన్నేవ చాత్మశబ్దం ప్రయుజ్య అపహతపాప్మత్వాదిగుణయోగం చోపదిశ్య తమేవానతివృత్తప్రకరణం నిర్దిశతి - "అథ య ఆత్మా స సేతుర్విధృతిరేషాం లోకానామసంభేదాయ" (ఛా.ఉ.8.4.1) ఇతి. తత్ర విధృతిరిత్యాత్మశబ్దసామానాధికరణ్యాద్విధారయితోచ్యతే. కిచః కర్తరి స్మరణాత్. యథోదకసంతానస్య విధారయితా సేతుః క్షేత్రసంపదామసంభేదాయ, ఏవమయమాత్మా ఏషామధ్యాత్మాది భేదభిన్నానాం లోకానాం వర్ణాశ్రమాదీనాం చ విధారయితా సేతురసంభేదాయ అసంకరాయేతి. ఏవమిహ ప్రకృతే దహరే విధారణలక్షణం మహిమానం దర్శయతి. అయం చ మహిమా పరమేశ్వర ఏవ శ్రుత్యన్తరాదుపలభ్యతే- "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః" ఇత్యాదేః. తథాన్యత్రాపి నిశ్చితే పరమేశ్వరవాక్యే శ్రూయతే. "ఏష సర్వేశ్వర ఏష భూతపతిరేష భూతపాల ఏష సేతుర్విధారణ ఏషాం లోకానామసంభేదాయ" (బృ.ఉ.4.4.22) ఇతి. ఏవం ధృతేశ్చ హేతోః పరమేశ్వర ఏవాయం దహరః. 16.

### బాలానందిని

ధృతేరితి:- "ధృతేశ్చ=ధరించడం అనే హేతువువల్ల కూడ ఈ దహరం పరమాత్మయే. అస్య మహిమ్నః= ఈ మహిమ, అస్మిన్ = (ఇతరశ్రుతియందు ఆత్మ విషయంలో కూడ) ఉపలబ్ధేః= కనబడుటవల్ల" అని సూత్రార్థం.

ధృతేశ్చేతి:- ధృతి అనే హేతువువల్ల కూడ ఈ దహరం పరమాత్మయే. ఎట్లు? "దహరోఽస్మిన్నన్తరాకాశః" అని ప్రారంభించి ఆకాశంతో పోలుస్తూ దానియందు (దహరమునందు) అన్నీ నిలచి ఉన్నా యని చెప్పి, దాని విషయంలోనే 'ఆత్మ' శబ్దాన్ని ప్రయోగించి,

అపహతపాప్మత్వాదిగుణా లున్నట్లు కూడ చెప్పి, ఆ ప్రకరణం ముగియకుండా, ఆ దహరాన్నే "అథ...అసమ్భేదాయ" అని నిర్దేశిస్తున్నాడు. అక్కడ 'విధృతిః' అనే పదం ఆత్మశబ్దంతో సమానాధికరణంగా (దానికి విశేషణంగా) ప్రయోగింపబడుటచేత 'ధరించేది' అనే అర్థం బోధిస్తుంది. కర్త్రర్థంలో 'క్తిచ్' ప్రత్యయం వ్యాకరణశాస్త్రంలో విధించబడింది. (అందుచేత ఇది 'స్త్రియాం క్తిన్" (సూ.3.3.94) అనే సూత్రంచేత భావార్థంలో విధించిన 'క్తిన్' ప్రత్యయం చేర్చడంవల్ల ఏర్పడినది కాదు అని అర్థం). లోకంలో సేతువు పొలాలలో ఉండే సొత్తు కలిసి పోకుండా ఉండే టట్లు ఉదకప్రవాహాన్ని ఏ విధంగా నిలుపుతుందో అట్లే ఈ ఆత్మ అధ్యాత్మం, అధిదైవం ఆధిభౌతికం మొదలైన భేదాలచేత భిన్నంగా ఉన్న లోకాలను, వర్ణాశ్రమాదులను కలిసిపోకుండా ఉండే టట్లు నిలిపే సేతువు. ఈ విధంగా ప్రకృత మైన దహరంలో ధరించడం (నిలపడం) అనే మహిమను చూపుతున్నది. ఈ మహిమ పరమేశ్వరునికి సంబంధించినదే అని "ఏతస్య... తిష్ఠతః" ఇత్యాదిశ్రుత్యంతరంవల్ల తెలుస్తూన్నది. అట్లే నిశ్చితమైన మరొక పరమేశ్వరవాక్యంలో కూడ "ఏష సర్వేశ్వర... అసంభేదాయ" అని వినబడుతున్నది. ఇట్లు ధృతి అనే హేతువువల్ల గూడ ఈ దహరం పరమేశ్వరుడే. 16.

## సూ. ప్రసిద్ధేశ్చ 1.3.17

ఇతశ్చ పరమేశ్వర ఏవ "దహరోఽస్మిన్నన్తరాకాశః" ఇత్యుచ్యతే; యత్కారణమాకాశశబ్దః పరమేశ్వరే ప్రసిద్ధః "ఆకాశో వై నామ నామరూప యోర్నిర్వహితా" (ఛా.ఉ.8.1.4) "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" (ఛా.ఉ.1.9.1)ఇత్యాది ప్రయోగదర్శనాత్. జీవే తు న క్వచిదాకాశ శబ్ద ప్రయుజ్యమానో దృశ్యతే. భూతాకాశస్తు సత్యామప్యాకాశ శబ్ద ప్రసిద్ధావుపమానోపమేయభావాద్యసంభవాత్ న గ్రహీతవ్య ఇత్యుక్తమ్. 17.

### బాలానందిని

ప్రసిద్ధేరితి:- "ప్రసిద్ధేః చ= ఆకాశశబ్దం బ్రహ్మ విషయంలో ప్రసిద్ధ మైనది; అందువల్ల కూడ దహరం పరమేశ్వరుడే" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ పరమేశ్వరుడే "దహరోఽస్మిన్నన్తరాకాశః" అని చెప్పబడుతున్నాడు. ఎందువల్ల ననగా ఆకాశశబ్దం పరమేశ్వరు డనే అర్థంలో ప్రసిద్ధం. "ఆకాశో...నిర్వహితా", "సర్వాణి... సముత్పద్యన్తే" ఇత్యాదిప్రయోగాలు కనబడు తున్నాయి. ఆకాశశబ్దం జీవుని విషయంలో ప్రయోగించబడి నట్లు ఎక్కడా కనబడడం

లేదు. భూతాకాశం విషయంలో ఆకాశశబ్దానికి ప్రసిద్ధి ఉన్నా కూడ ఉపమానోపమేయభావాదులు కుదరవు గాన దానిని గ్రహించకూడదు అని చెప్పబడింది. 17.

సూ. ఇతర పరామర్శాత్స ఇతి చేన్నాసంభవాత్. 1.3.18.

యది వాక్యశేషబలేన దహర ఇతి పరమేశ్వరః పరిగృహ్యేత అస్తీతరస్యాపి జీవస్య వాక్యశేషే పరామర్శః- "అథ య ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవాచ" (ఛా.ఉ.8.3.4) ఇతి. అత్ర హి సంప్రసాదశబ్దః శ్రుత్యన్తరే సుషుప్తావస్థాయాం దృష్టత్వాత్తదవస్థావన్తం జీవం శక్నోత్యుపస్థాపయితుం నార్థాన్తరమ్. తథా శరీరవ్యపాశ్రయస్యైవ జీవస్య శరీరాత్సముత్థానం సంభవతి. యథా ఆకాశవ్యపాశ్రయాణాం వాయ్వాదీనామాకాశాత్సముత్థానం తద్వత్. యథా చాదృష్టోఽపి పరమేశ్వరవిషయ ఆకాశశబ్దః పరమేశ్వరధర్మసమభివ్యాహారాత్ "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా" ఇత్యేవమాదౌ పరమేశ్వరవిషయోఽభ్యుపగతః ఏవం జీవవిషయోఽపి భవిష్యతి. తస్మాదితరపరామర్శాత్ "దహరోఽస్మిన్నన్త రాకాశ" ఇత్యత్ర స ఏవ జీవః ఉచ్యత ఇతి చేత్- నైతదేవమ్. కస్మాత్? అసంభవాత్. న హి జీవో బుద్ధ్యాద్యుపాధిపరిచ్ఛేదాభిమానీ సన్నాకాశే నోపమీయేత. న చోపాధిధర్మానభిమన్యమానస్య అపహత పాప్మత్వాదయో ధర్మాః సంభవన్తి. ప్రపఞ్చితం చైతత్ప్రథమసూత్రే. అతిరేకాశఙ్కాపరిహారాయ తు పునరుపన్యస్తమ్. పఠిష్యతి చోపరిష్టాత్- "అన్యార్థశ్చ పరామర్శః" (బ్ర.సూ.1.3.20) ఇతి. 18.

బాలానందిని

ఇతరేతి:- "ఇతర పరామర్శాత్= వాక్యశేషంలో జీవుని పరామర్శ ఉండడంవల్ల, స ఇతి చేత్ జీవుడు దహరం అన్నట్లయితే, న=కాదు, అసంభవాత్=అసంభవం వల్ల" అని సూత్రార్థం.

యదీతి:- వాక్యశేషబలంచేత దహరం పరమేశ్వరు డని గ్రహింపబడిన ట్లయితే, వాక్యశేషంలో జీవుని పరామర్శ కూడ "అథ...ఉవాచ" (ఏ జీవుడు ఈ శరీరం

నుండి లేచి, అనగా ఈ శరీరాదులకంటె నేను వేరు అని తెలుసుకొని, పరబ్రహ్మరూప మైన జ్యోతిస్సును సాక్షాత్కరించుకొని బ్రహ్మరూపాన్ని పొందుతాడో అదే ఆత్మ అని చెప్పాడు) అనే వాక్యంలో ఉంది. సంప్రసాదశబ్దం మరొకశ్రుతిలో సుషుప్తావస్థ అనే అర్థంలో కనబడుచున్నది గాన ఇక్కడ ఆ శబ్దానికి సుషుప్తావస్థలో ఉన్న జీవుడు అనే అర్థం చెప్పాలి కాని మరొక అర్థం చెప్పడం కుదరదు. శరీరాన్ని ఆశ్రయించుకొని ఉన్న వాయ్వాదులు ఆకాశంనుండి ఎలా లేస్తాయో అట్లే ఇది కూడ. లోకంలో ఆకాశ శబ్దానికి పరమేశ్వరు డనే అర్థం లేకపోయినా పరమేశ్వరుని ధర్మాలు ఉండడంవల్ల "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా" ఇత్యాదివాక్యాలలో ఆ శబ్దానికి పరమేశ్వరుడు డనే అర్థం అంగీకరించి నట్లే జీవు డనే అర్థం కలది కూడ కావచ్చును. అందువల్ల జీవుని పరామర్శ కూడ ఉంది గాన "దహరోఽస్మిన్నన్తరాకాశః" అనే చోట జీవుడే చెప్పబడుచున్నాడు అన్నట్లయితే- ఇది అట్లు కాజాలదు. ఎందువల్ల? అసంభవంవల్ల. బుద్ధ్యాద్యుపాధుల పరిచ్ఛేదాన్ని (పరిమితత్వాన్ని) అభిమానించే జీవుడు ఆకాశంతో పోల్చబడడు కదా? ఉపాధిధర్మాలను తన ధర్మాలనుగా భావించే జీవునికి అపహతపాప్మత్వాదిధర్మాలు సంభవింపవు కదా? ఈ విషయం ఈ అధికరణం మొదటి సూత్రంలోనే వివరించబడింది. అయితే- అధికమైన ఆశంకను ("ఉత్తరాచ్చ" ఇత్యాది సూత్రంలో) నిరాకరించడంకోసం మళ్లీ ఇక్కడ చెప్పబడింది. తరవాత కూడ "అన్యార్థశ్చ పరామర్శః" (మరొక విషయం చెప్పడంకోసం జీవపరామర్శ చేయబడింది) అని చెప్పనున్నాడు.18.

## సూ. ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు. 1.3.19.

ఇతరపరామర్శాద్యా జీవాశఙ్కా జాతా సాఽసమ్భవాన్నిరాకృతా. అథేదానీం మృతస్యైవామృతసేకాత్పునః సముత్థానం జీవశఙ్కాయాః క్రియతే-ఉత్తరస్మాత్ప్రాజాపత్యాద్వాక్యాత్. తత్ర హి- "స ఆత్మాఽపహతపాప్మా" ఇత్యపహతపాప్మత్వాదిగుణకమాత్మానమన్వేష్టవ్యం విజిజ్ఞాసితవ్యం చ ప్రతిజ్ఞాయ "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మా" (ఛా.ఉ.8.7.4) ఇతి బ్రువన్ అక్షిస్థం ద్రష్టారం జీవమాత్మానం నిర్దిశతి. ''ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి'' (ఛా.ఉ.8.9.3) ఇతి చ తమేవ పునః పునః పరామృశ్య "య ఏష స్వప్నే మహీయమానశ్చరత్యేష ఆత్మా" (ఛా.ఉ.8.10.1)

ఇతి, "తద్యత్రైతత్సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానాత్యేష ఆత్మా" ఇతి చ జీవమేవావస్థాన్తరగతం వ్యాచష్టే. తస్యైవ చాపహతపాప్మత్వాది దర్శయతి "ఏతదమృతమభయమేతద్బ్రహ్మ' ఇతి. "నా హ ఖల్వయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి నో ఏవేమాని భూతాని" (ఛా.ఉ.8.11.1,2) ఇతి చ సుషుప్తావస్థాయాం దోషముపలభ్య "ఏతం త్వేవ తే భూయోऽనువ్యాఖ్యాస్యామి నో ఏవాన్యత్రైతస్మాత్" ఇతి చోపక్రమ్య శరీరసంబన్ధనిన్దాపూర్వకమ్ "ఏష సంప్రసాదోऽస్మాచ్ఛరీరాదుత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః" ఇతి జీవమేవ శరీరాత్సముత్థితముత్తమపురుషం దర్శయతి. తస్మాదస్తి సంభవో జీవే పారమేశ్వరాణాం ధర్మాణామ్. అతః "దహరోऽస్మిన్నన్తరాకాశః" ఇతి జీవ ఏవోక్త ఇతి చేత్కశ్చిద్బ్రూయాత్-

బాలానందిని

ఉత్తరాదితి:- "ఉత్తరాత్ చేత్=తరవాత వచ్చే ప్రజాపత్యవాక్యంవల్ల జీవుడు అన్నట్లయితే, ఆవిర్భూతస్వరూపస్తు=కాదు; ఎందువల్ల ననగా అక్కడ స్వస్వరూపం ఆవిర్భవించినవాడు చెప్పబడ్డాడు" అని సూత్రార్థం.

ఇతరేతి:- ఇతరపరామర్శంవల్ల ఏ జీవు డనే ఆశంక కలిగినదో అది అసంభవం అనే హేతువుచేత నిరాకరించబడింది. ఇప్పుడు మరణించినవానిని అమృతం చల్లి మళ్లీ జీవింపచేసినట్లు ఆ జీవాశంకయే, తరవాత కనబడుతున్న ప్రజాపతివాక్యాన్ని పట్టి మళ్లీ లేపబడుతున్నది. అక్కడ (ఇంద్రునికి ఉపదేశిస్తూన్న ప్రజాపతి) "య ఆత్మాపహతపాప్మా" అని పాపాలు లేకపోవడం మొదలైన గుణాలు గల ఆత్మ తెలుసుకొనదగినది అని ముందుగా చెప్పి "య ఏషోऽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మా" అని చెప్పి నేత్రంలో ఉన్న ద్రష్టయైన జీవుడే ఆత్మ అని నిర్దేశించాడు. "ఏతం...అనువ్యాఖ్యాస్యామి" (దీనిని గూర్చియే నీకు మళ్లీ చెపుతాను) అని ఆ జీవుణ్ణే మాటి మాటికి పరామర్శిస్తూ "య...ఏష ఆత్మా" (స్వప్నంలో వాసనారూపాలైన విషయాలచేత పూజించబడుతూ తిరిగేవాడే ఆత్మ) అని, "తద్యత్ర...ఆత్మా" (ఏ సమయంలో నిద్రించినవాడై, పూర్తిగా లీనమైన ఇంద్రియసముదాయం గలవాడై, పూర్తిగా ప్రసన్నుడై స్వప్నం చూడకుండా ఉంటాడో అతడే ఆత్మ) అనీ వేరు వేరు అవస్థలలో ఉన్న జీవుడే ఆత్మ అని వివరించాడు. "ఏతదమృతమభయమేతద్బ్రహ్మ"

(ఇదే వినాశరహితం, భయశూన్యం అయిన బ్రహ్మ) అని ఆ జీవునికే అపహతపాప్మత్వాది గుణా లున్నా యని చెప్పాడు. "నాహ... భూతాని" (ఇప్పుడు అతడే "ఇదిగో ఇది నేను" అని తనను గూర్చి గాని, ఈ భూతాలను గూర్చి గాని తెలుసుకొనడు) అని సుషుప్తావస్థలో దోషం చూచి (వచ్చిన ఇంద్రునికి మళ్లీ ఉపదేశిస్తూ) "ఏతం...ఏతస్మాత్" (ఈ ఆత్మను గూర్చియే నీకు మళ్లీ చెపుతాను; దీనికంటె భిన్నమైనదానిని గూర్చికాదు) అని ఉపక్రమించి, శరీరసంబంధనిందాపూర్వకంగా "ఏష...పురుషః" అని జీవుడే శరీరంనుంచి లేచిన ఉత్తమపురుషు డని చూపుతున్నాడు. అందువల్ల జీవునిలో పరమేశ్వరునికి సంబంధించిన ధర్మాలు ఉండడం సంభవిస్తుంది. అందుచేత "దహరోఽస్మిన్నన్తరాకాశః" అని జీవుడే చెప్పబడ్డాడు అని ఎవరైనా అంటే-

వి. ఛాందోగ్యోపనిషత్తులోని ప్రజాపతివిద్యలో (ఎనిమిదవ అధ్యాయం) ఇంద్రవిరోచనులు ప్రజాపతికి శుశ్రూష చేసి ఆత్మను గూర్చి బోధించ మని వేడగా ప్రజాపతి ముందుగా వాళ్లకు జాగ్రదవస్థలో నేత్రాలలో ఉన్నది ఆత్మ అని బోధించాడు. తరవాత నీళ్లు నింపిన పాత్రలో చూడ మని చెప్పి అక్కడ కనబడేదే ఆత్మ అని బోధించాడు. విరోచనుడు అక్కడ తన శరీరమే చూచుకొని అదే ఆత్మ అని నిర్ణయించుకొని ఇంటికి పోయి తన వాళ్లందరికీ ఆవిధంగానే బోధించాడు. ఇంద్రుడు మాత్రం సంతృప్తి చెందక మళ్లీ మళ్లీ అడగగా ప్రజాపతి స్వప్నావస్థా- సుషుప్త్యవస్థలలో ఉన్నది ఆత్మ అని చెప్పి చివరికి శరీర సంబంధం తొలగినదే ఆత్మ అని బోధించాడు. ఇది ఉపనిషత్తులో గాని, బ్రహ్మ మృతవర్షిణి అనే బ్రహ్మసూత్రవ్యాఖ్యానం (పే.89.91) మొదలైన వాటిలో గాని చూచుకొనవచ్చును.

## భాష్యమ్

తం ప్రతి బ్రూయాత్- "ఆవిర్భూతస్వరూపస్తు" ఇతి. తుశబ్దః పూర్వపక్షవ్యావృత్త్యర్థః. నోత్తరస్మాదపి వాక్యాదిహ జీవస్యాశఙ్కా సంభవతీత్యర్థః. కస్మాత్? యతస్తత్రావిర్భూతస్వరూపో జీవో వివక్ష్యతే. ఆవిర్భూతం స్వరూపమస్యేత్యావిర్భూతస్వరూపః. భూతపూర్వగత్యా జీవవచనమ్. ఏతదుక్తం భవతి- "య ఏషోఽక్షిణి" ఇత్యక్షిలక్షితం ద్రష్టారం నిర్దిశ్యోదశరావబ్రాహ్మణేనైనం శరీరాత్మతాయా వ్యుత్థాప్య "ఏతం త్వేవ తే" ఇతి పునః పునస్తమేవ వ్యాఖ్యేయత్వేనాకృష్య స్వప్నసుషుప్తోపన్యాసక్రమేణ "పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభిసంపద్యతే" ఇతి యదస్య

పారమార్థికం స్వరూపం పరం బ్రహ్మ తద్రూపతయైవైనం జీవం వ్యాచష్టే, న జైవేన రూపేణ. యత్పరం జ్యోతిరుపసంపత్తవ్యం శ్రుతం తత్పరం బ్రహ్మ తచ్చాపహతపాప్మత్వాదిధర్మకం, తదేవ చ జీవస్య పారమార్థికం స్వరూపం "తత్త్వమసి" ఇత్యాదిశాస్త్రేభ్యః, నేతరదుపాధికల్పితమ్. యావదేవ హి స్థాణావివ పురుషబద్ధిం ద్వైతలక్షణామవిద్యాం నివర్తయన్ కూటస్థ నిత్యదృక్స్వ రూపమాత్మానమహం బ్రహ్మాస్మీతి న ప్రతిపద్యతే తావజ్జీవస్య జీవత్వమ్. యదా తు దేహేన్ద్రియమనోబుద్ధిసంఘాతాద్వ్యుత్థాప్య శ్రుత్యా ప్రతిబోధ్యతే- "నాసి త్వం దేహేన్ద్రియమనోబుద్ధిసంఘాతః, నాసి సంసారీ, కింతర్హి? తద్యత్సత్యం స ఆత్మా చైతన్యమాత్రస్స్వమసీతి తదా కూటస్థ నిత్యదృక్స్వరూపమాత్మానం ప్రతిబుధ్యాస్మాచ్ఛరీరాద్యభిమానాత్స ముత్తిష్ఠన్ స ఏవ కూటస్థనిత్యదృక్స్వ రూప ఆత్మా భవతి. "స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి'' (ముం.ఉ.3.2.9) ఇత్యాదిశ్రుతిభ్యః. తదేవ చాస్య పారమార్థికం స్వరూపం యేన శరీరాత్సముత్థాయ స్వేన రూపేణాభినిష్పద్యతే.

బాలానందిని

తమితి:- వానితో "ఆవిర్భూతస్వరూపస్తు" అని చెప్పాలి. 'తు' శబ్దం పూర్వపక్షాన్ని నిరాకరించడం అనే అర్థాన్ని సూచిస్తుంది. రాబోవు వాక్యాన్ని పట్టి కూడ ఇక్కడ జీవు డనే శంక కుదరదు అని అర్థం. ఎందువల్ల? ఎందువల్ల ననగా- అక్కడ కూడ ఆవిర్భూత స్వరూపు డైన జీవుడు చెప్పడానికి ఉద్దేశింపబడ్డాడు. "ఆవిర్భూతం స్వరూపం యస్యసః ఆవిర్భూత స్వరూపః" - మూడు అవస్థలనుండి శోధితుడై వాటి కంటె భిన్ను డని చెప్పబడిన పరిశుద్ధమైన స్వరూపం గల అని అర్థం. భూతపూర్వగతిచేత జీవుణ్ణిగా చెప్పడం జరిగింది. (అనగా- ఆ స్వరూపం బ్రహ్మయే గాన 'ఆవిర్భూతస్వరూపం' అని నపుంసకలింగంలో ప్రయోగించవలసినా అంతకు పూర్వం జీవుడే గాన జీవశబ్దం పుంలింగం అవడంచేత ఆవిర్భూత స్వరూపః అని పుంలింగంలో ఉపయోగించబడింది). ఇది చెప్పినట్లయింది- "ఏషో౽ క్షిణి" అని అక్షిచేత గుర్తించబడిన ద్రష్టను (చూచే జీవుణ్ణి) నిర్దేశించి తరవాత ఉదశరావబ్రాహ్మణంచేత (నీళ్లు నింపిన పాత్రలో చూచి ఏమి చూస్తున్నారో చెప్పండి అని ప్రజాపతి ఇంద్రవిరోచనులను అడిగిన కథ ఉన్న బ్రాహ్మణ భాగంచేత) ఆ ద్రష్టను శరీరాత్మత్వంనుండి పైకి తీసి, అనగా శరీరమే ఆత్మ అనే భావాన్ని తొలగించి, "దీనిని గూర్చియే నీకు చెపుతాను" అని మాటి మాటికి ఆ ఆత్మను గూర్చియే

చెపుతున్నట్లు ముందుకు లాగికొని వెడుతూ, తరవాత స్వప్నావస్థాసుషుప్తావస్థలను క్రమంగా చెప్పి, "పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అనే వాక్యంచేత జీవుణ్ణి వాని పారమార్థికరూప మైన బ్రహ్మరూపంలోనే విశదీకరిస్తున్నాడు గాని జీవునికి సంబంధించిన రూపంతో కాదు. (జీవునిచేత) పొందదగినదిగా ఇక్కడ వినబడిన పరజ్యోతియే పరబ్రహ్మ. అది అపహతపాప్మతాదిధర్మాలు గలది. "తత్త్వమసి" ఇత్యాదిశాస్త్రాల ననుసరించి అదే జీవుని పారమార్థికమైన స్వరూపం కాని ఉపాధికల్పిత మైనది వాని యథార్థ స్వరూపం కాదు. జీవుడు ఎంతవరకు, మ్రోడుమీదపురుష బుద్ధిని వలె, ద్వైతస్వరూపమైన (భేదబుద్ధిస్వరూపమైన) అవిద్యను తొలగించు కొని కూటస్థనిత్యము, దృక్స్వరూపము (చైతన్యరూపము) అయిన పరమాత్మను "నేనే బ్రహ్మను" అని పొందడో అంతవరకే వాని జీవత్వం. ఎప్పు డైతే శ్రుతిచేత ఆ జీవుడు దేహేంద్రియమనోబుద్ధుల సముదాయం నుంచి పైకి లేవదీసి (వాటికంటె నువ్వు భిన్నుడ వని చూపి) "నువ్వు దేహేంద్రియమనో బుద్ధిసంఘాత స్వరూపుడవు కావు; సంసారివి కావు; మరేమనగా, సత్యమైనది ఏది ఉన్నదో, చైతన్యమాత్ర స్వరూపమైన ఏ ఆత్మ ఉన్నదో అదే నీవు" అని బోధించబడతాడో, అప్పుడు తాను కూటస్థనిత్యచైతన్య స్వరూపమైన ఆత్మ అని తెలుసుకొని, ఈ శరీరాధ్యభిమానంనుండి పైకి లేచి ఆ కూటస్థనిత్యదృక్స్వరూపమైన ఆత్మగా అవుతాడు. "స...భవతి" (పరమమైన బ్రహ్మను తెలుసుకొన్నవాడు బ్రహ్మయే అవుతాడు) ఇత్యాదిశ్రుతు లీ విషయమే చెపుతున్నాయి. అదే ఈతని (జీవుని) పారమార్థిక మైన స్వరూపం; అందుచేతనే శరీరం నుండి లేచి తన రూపంతో ఏర్పడుతున్నాడు (స్వస్వరూపం పొందుతున్నాడు).

## భాష్యమ్

కథం పునః స్వం రూపం స్వేనైవ చ నిష్పద్యత ఇతి సంభవతి కూటస్థ నిత్యస్య? సువర్ణాదీనాం తు ద్రవ్యాన్తరసంపర్కాదభి భూతస్వరూపాణామనభివ్యక్తా సాధారణవిశేషాణాం క్షారప్రక్షేపాదిభిః శోధ్యమానానాం స్వరూపేణాభినిష్పత్తిః స్యాత్. తథా నక్షత్రాదీనామహన్యభి భూతప్రకాశానామభిభావకవియోగే రాత్రౌ స్వరూపేణాభినిష్పత్తిః స్యాత్. న తు తథా ఆత్మజ్యోతిషో నిత్యస్య కేన చిదభిభవః సంభవతి, అసంసర్గిత్వాద్వ్యోమ్న ఇవ. దృష్టవిరోధాచ్చ. దృష్టిశ్రుతిమతి విజ్ఞాతయో హి జీవస్య స్వరూపమ్. తచ్చ శరీరాదసముత్థితస్యాపి జీవస్య సదా నిష్పన్నమేవ దృశ్యతే. సర్వో హి జీవః పశ్యన్ శృణ్వన్ మన్వానో విజానన్వ్యవహరతి; అన్యథా వ్యవహారానుపపత్తేః. తచ్చేచ్ఛరీరాత్సముత్థితస్య

నిష్పద్యేత ప్రాక్ సముత్థానాద్దృష్టో వ్యవహారః విరుధ్యేత. అతః కిమాత్మకమిదం శరీరాత్సముత్థానమ్? కిమాత్మికా వా స్వరూపేణాభినిష్పత్తిరితి.

బాలానందిని

కథమితి:- (ప్రశ్న) కూటస్థనిత్యమైన ఆత్మయొక్క తన రూపం తనచేతనే నిష్పన్నం అవుతుం దని చెప్పడం ఎలా కుదురుతుంది? బంగారం మొదలైనవి ఇతరద్రవ్యాలతో కలిసి నప్పుడు వాటి స్వరూపం కప్పబడిపోయి వాటి అసాధారణమైన విశేషాలు (ఇతరమైనవాటిలో లేనివి వాటిలోనే ఉన్నవీ అయిన విశేషాలు) పైకి కనబడకుండా ఉన్నప్పుడు క్షారం (రసాయనపదార్థాల)లో వాటిని పడవేసి శోధించి నప్పుడు వాటికి స్వరూపం ఏర్పడడం (వాటి అసలు రూపాన్ని అవి పొందడం) కలగవచ్చును. అట్లే పగలు కప్పివేయబడిన ప్రకాశ గల నక్షత్రాదులు అలా వాటి కాంతిని కప్పివేసిన సూర్యప్రకాశం లేనప్పుడు రాత్రియందు, స్వరూపంతో అభినిష్పన్నాలు కావచ్చును. కాని నిత్యమైన ఆత్మచైతన్య మనే తేజస్సు, ఆకాశం వలె దేనితోను సంబంధం కలది కాకపోవడంచేత, దేనిచేతా తిరస్కరించబడడం అనేది ఉండదు. అలా తిరస్కరించబడితే ప్రత్యక్షంగా కనబడేదానికి విరోధం కూడా కలుగుతుంది. చూడడం, విన్నడం, తెలుసుకొనడం- ఇవే కదా జీవుని స్వరూపం? అది (స్వరూపం) జీవుడు శరీరం నుంచి లేచిపోనప్పుడు కూడ ఎల్లప్పుడూ నిష్పన్నమై (ఏర్పడి) కనబడుతున్నది. ప్రతి జీవుడు చూస్తూ, వింటూ, ఆలోచిస్తూ వ్యవహరిస్తుంటాడు కదా? అలా కాకపోతే వ్యవహారమే కుదరదు. శరీరంనుండి లేచిపోయిన తరవాతనే ఈ వ్యవహారం జరుగుతుంది అని అంటే శరీరంనుంచి లేచిపోవడానికి ముందు చూడబడిన వ్యవహారం అంతా విరుద్ధం అయిపోతుంది. అందుచేత మీరు చెప్పే ఈ 'శరీరాత్సముత్థానం' అంటే ఏమిటి? 'స్వరూపేణ అభినిష్పత్తిః' అంటే ఏమిటి?

భాష్యమ్

అత్రోచ్యతే- ప్రాగ్వివేకజ్ఞానోత్పత్తేః శరీరేన్ద్రియమనోబుద్ధి విషయ వేదనోపాధిభిరవివిక్తమివ జీవస్య దృష్ట్యాది జ్యోతిఃస్వరూపం భవతి. యథా శుద్ధస్య స్ఫటికస్య స్వాచ్ఛ్యం శౌక్ల్యం చ స్వరూపం ప్రాగ్వివేక గ్రహణాద్రక్తనీలాద్యుపాధిభిరవివిక్తమివ భవతి. ప్రమాణజనితవివేక గ్రహణాత్తు పరాచీనః స్ఫటికః స్వాచ్ఛ్యేన శౌక్ల్యేన చ స్వేన రూపేణాభినిష్పద్యత ఇత్యుచ్యతే, ప్రాగపి తథైవ సన్; తథా దేహాద్యుపాధివివిక్తస్యైవ సతో జీవస్య

శ్రుతికృతం వివేకవిజ్ఞానం శరీరాత్సముత్థానం, వివేకవిజ్ఞానఫలం స్వరూపేణాభి నిష్పత్తిః, కేవలాత్మస్వరూపావగతిః. తథా వివేకావివేకమాత్రేణైవాత్మనోఽశరీరత్వం సశరీరత్వం చ మన్త్రవర్ణాత్- "అశరీరం శరీరేషు" (కౌ.1.2.22) ఇతి, "శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే" (భ.గీ.13.31) ఇతి చ సశరీరత్వాశరీరత్వవి శేషాభావస్మరణాత్. తస్మాద్వివేకవిజ్ఞానాభావాదనావిర్భూతరూపః సన్వివేక విజ్ఞానాదావిర్భూతస్వరూపః ఇత్యుచ్యతే. న త్వన్యాదృశా వావిర్భావతిరోభావౌ స్వరూపస్య సంభవతః, స్వరూపత్వాదేవ.

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ చెప్పబడుచున్నది- వివేకజ్ఞానం పుట్టడానికి ముందు, దృష్టిమొదలైన జీవుని తేజఃస్వరూపం శరీర-ఇంద్రియ-మనస్-బుద్ధి-విషయ-హర్ష-శోకాద్యుపాధులతో కలిసిపోయి నట్లు ఉంటుంది. శుద్ధమైన స్ఫటికంయొక్క స్వరూపమైన స్వచ్ఛత్వము, శుక్లత్వము కూడ స్ఫటికం వేరు రక్తనీలాద్యుపాధులు వేరు అని వివేకాన్ని (భేదాన్ని) గ్రహించడానికి పూర్వం ఎట్లు అవివిక్తం వలె (కలిసిపోయినట్లు) అవుతుందో, ప్రమాణంచేత కలిగిన వివేకజ్ఞానంవల్ల మరొక ప్రక్కకు త్రిప్పబడిన స్ఫటికం పూర్వం కూడ అలాగే ఉన్నా ఇప్పుడు స్వచ్ఛత్యం శుక్లత్వం అనే తన స్వరూపంతో కూడింది అని చెప్పబడుతుందో అదే విధంగా జీవుడు దేహాద్యుపాధులతో వేరుగా లేకపోయినా కూడ (అనగా దేహాదిసంబంధం ఉన్నా కూడ) వానికి శ్రుతివల్ల కలిగిన వివేకవిజ్ఞానమే శరీరాత్సముత్థానం. "అశరీరం శరీరేషు" (శరీరాలలో ఉంటూ శరీరం లేనిది) అని మంత్రంలో చెప్పినట్లు. "శరీరస్థోపి...లిప్యతే' '(అర్జునా! శరీరంలో ఉన్నా కూడ అతడు చేయడం లేదు (కర్త కాదు), పుణ్యాపాపాలచేత లిప్తుడు కాడు) అని సశరీరత్వ-అశరీరత్వాలలో విశేషం లేదు అని స్మృతిలో చెప్పడం వల్లా. ఆత్మకు అశరీరత్వ-సశరీరత్వాలు వివేకావివేకాలమీద మాత్రమే ఆధారపడి ఉన్నాయి. (శరీరంలో ఉన్నా లేకపోయినా వివేకం కలవాడు అశరీరుడు, వివేకం లేనివాడు సశరీరుడు). అందుచేత వివేకజ్ఞానం లేకపోవడంచేత అనావిర్భూతస్వరూపుడు (స్పష్టంగా కనబడని స్వస్వరూపం కలవాడుగా) ఉన్న జీవుడే వివేకవిజ్ఞానం కలగగానే ఆవిర్భూతస్వరూపు డని చెప్పబడుతున్నాడు. అంతేనే కాని స్వరూపానికి మరొక విధమైన ఆవిర్భావ-అనావిర్భావాలు సంభవించవు. ఎందువల్ల ననగా అది స్వరూపమే కదా? అనగా అది స్వరూపమే గాన క్రొత్తగా రావడం కాని, ఉన్నది పోవడం కాని ఉండదు అని అర్థం.

## భాష్యమ్

ఏవం మిథ్యాజ్ఞానకృత ఏవ జీవపరమేశ్వరయోర్భేదో న వస్తుకృతః. వ్యోమవదసంగత్వావిశేషాత్. కుతశ్చైతదేవం ప్రతిపత్తవ్యమ్? యతో "య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే" ఇత్యుపదిశ్య "ఏతదమృతమభయమేతద్ బ్రహ్మ" ఇత్యుపదిశతి. యోఽక్షిణి ప్రసిద్ధో ద్రష్టా ద్రష్టృత్వేన విభావ్యతే సోఽమృతాభయలక్షణాత్ బ్రహ్మణః అన్యశ్చేత్తతోఽమృతాభయ బ్రహ్మసామానాధికరణ్యం న స్యాత్. నాపి ప్రతిచ్ఛాయాత్మాయమక్షిలక్షితో నిర్దిశ్యతే; ప్రజాపతేర్మృషావాదిత్వప్రసఙ్గాత్. తథా ద్వితీయే పి పర్యాయే "య ఏష స్వప్నే మహీయమానశ్చరతి" ఇతి న ప్రథమపర్యాయ నిర్దిష్టాదక్షిపురుషాద్ద్రష్టురన్యో నిర్దిష్టః, "ఏతం త్వేవ తే భూయోనువ్యాఖ్యాస్యామి" ఇత్యుపక్రమాత్. కించాహమద్య స్వప్నే హస్తినమద్రాక్షం, నేదానీం తం పశ్యామీతి దృష్టమేవ ప్రతిబుద్ధః ప్రత్యాచష్టే. ద్రష్టారం తు తమేవ ప్రత్యభిజానాతి- "య ఏవాహం స్వప్నమద్రాక్షం స ఏవాహం జాగరితం పశ్యామి" ఇతి. తథా తృతీయేఽపి పర్యాయే "నహిఖల్వయమేవం సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి నో ఏవేమాని భూతాని" ఇతి సుషుప్తావస్థాయాం విశేషవిజ్ఞానాభావమేవ దర్శయతి న విజ్ఞాతారం ప్రతిషేధతి. యత్తు తత్ర "వినాశమేవాపీతో భవతి" ఇతి, తదపి విశేషవిజ్ఞానవినాశాభిప్రాయమేవ న విజ్ఞాతృవినాశాభిప్రాయమ్; "న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్" (బృ.ఉ.4.3.30) ఇతి శ్రుత్యన్తరాత్. తథా చతుర్థేపి పర్యాయే "ఏతం త్వేవ తే భూయోనువ్యాఖ్యాస్యామి, నో ఏవాన్యత్రైతత్" ఇత్యుపక్రమ్య "మఘవన్ మర్త్యం వా ఇదం శరీరమ్" ఇత్యాదినా ప్రపఞ్చేన శరీరాద్యుపాధిసంబంధప్రత్యాఖ్యానేన సంప్రసాదశబ్దితం జీవం "స్వేన రూపేణాభినిష్పద్యతే" ఇతి బ్రహ్మస్వరూపాపన్నం దర్శయన్నపరస్మాద్బ్రహ్మణోఽమృతాభయస్వరూపాదన్యం జీవం దర్శయతి.

## బాలానందిని

ఏవమితి:- ఇదే విధంగా, జీవపరమేశ్వరుల భేదం మిథ్యాజ్ఞానంవల్ల కలిగినదే కాని వాస్తవం కాదు; ఎందువల్ల ననగా జీవపరమేశ్వరు లిద్దరూ కూడ దేనితోను

సంగం లేనివా రనే విషయంలో భేదం లేదు. ఇది ఇలా ఎందుకు గ్రహించాలి? "య...దృశ్యతే" అని ఉపదేశించి "ఏతదమృత... బ్రహ్మ" (ఇది నిత్యము, భయరహితము, ఇదే బ్రహ్మ) అని ఉపదేశిస్తున్నాడు కదా? ఎందువల్ల ననగా నేత్రంలో ఉన్న ప్రసిద్ధుడైన ఏ ద్రష్ట ద్రష్టగా తెలుసుకొనబడుతున్నాడో ఆ ద్రష్ట అమృతాభయస్వరూపమైన బ్రహ్మకంటె భిన్నుడైతే అప్పుడు అమృతాభయబ్రహ్మతో సామానాధికరణ్యం. (ఇద్దరినీ విశేషణవిశేష్యభావపూర్వకంగా ఒకే విభక్తిలో నిర్దేశించడం) కుదరదు. ("అక్షిణి పురుషో దృశ్యతే" అనే దానికి కంట్లో ఉంటూ ద్రష్ట యైన పురుషు డని అర్థం కాదు), కంట్లో ప్రతిబింబించే పురుషుడు అని అర్థం, అని చెపితే ప్రజాపతి అసత్యం పలికినవా డవుతాడు.

వి. ఏ ఆత్మను తెలుసుకోవడంవల్ల కృతకృత్యు లవుతారో, సర్వకామప్రాప్తి కలుగుతుందో అలాంటి ఆత్మను ఉపదేశింప మని వచ్చిన ఇంద్రవిరోచనులకు ప్రజాపతి కంట్లోని ప్రతిబింబం ఆత్మ అని చెపితే అసత్య మైన విషయం ఉపదేశించిన దోషం ప్రజాపతికి ప్రసక్త మవుతుంది

తథేతి:- అట్లే- "య ఏషః... చరతి" అని రెండవ పర్యాయంలో నిర్దేశించబడినవాడు కూడ మొదటి పర్యాయంలో బోధించిన ద్రష్ట యైన అక్షిపురుషునికంటె భిన్నుడు కాదు. "ఏతం త్వేవ... అనువ్యాఖ్యాస్యామి" అని ఉపక్రమం చేయబడింది కదా? అనగా జాగ్రదవస్థలో కంటితో ప్రపంచాన్ని చూచే అక్షిపురుషుణ్ణి గూర్చియే స్వప్నావస్థలో నిర్దేశించడం జరిగింది గాని ఆ పురుషుడు వేరు ఈ పురుషుడు వేరు కాదు అని అర్థం. దీనికే ఉపపత్తి చూపుతున్నారు- కిం చేతి:- మరొక విషయమే మనగా - నేను ఇంతక్రితం స్వప్నంలో ఏనుగును చూచాను, ఇప్పుడది కనబడడం లేదు అని నిద్రపోయి మేల్కొన్నవాడు చూడబడిన వస్తువునే నిషేధిస్తున్నాడు కాని ద్రష్ట (చూచేవాడు) మాత్రం ఒక్కడే అని ప్రత్యభిజ్ఞ చేస్తూ (గుర్తిస్తూ) "స్వప్నం చూచిన నేనే ఇప్పుడు జాగరితాన్ని చూస్తున్నాను" అంటున్నాడు. అట్లే మూడవ పర్యాయంలో కూడ "నహి... భూతాని" అని సుషుప్తావస్థలో విశేషజ్ఞానం లేకపోవడాన్ని చూపుతున్నాడు గాని విజ్ఞాత లేడని చెప్పడం లేదు. అక్కడ ఉన్న "వినాశమేవాపీతో భవతి" అనేదానికి విశేషవిజ్ఞానం నశించింది అని చెప్పడం మాత్రమే అభిప్రాయం గాని విజ్ఞాత నశించాడు అని చెప్పడం ఉద్దేశ్యం కాదు 'న హి... అవినాశిత్వాత్" (విజ్ఞాతయొక్క విజ్ఞానానికి వినాశం లేదు, విజ్ఞాత నాశరహితుడు కదా) అని మరొక శ్రుతి చెప్పుచున్నది. అట్లే

చతుర్థపర్యాయంలో కూడ- "ఏతం...ఏతస్మాత్" అని ఉపక్రమించి, "మఘవన్ మర్త్యం వా ఇదం శరీరమ్" (ఇంద్రా! ఈ శరీరం నశించేది) ఇత్యాదిప్రపంచంచేత (విస్తృత వివరణంచేత) శరీరాద్యుపాధులతో సంబంధాన్ని నిరాకరించి "స్వేన రూపేణాభినిష్పద్యతే" అని, "సంప్రసాద" శబ్దంచేత చెప్పబడే జీవుడు బ్రహ్మరూపం పొందా డని చూపుతూ అమృతాభయస్వరూప మైన పరబ్రహ్మకంటె అన్యుణ్ణిగా జీవుణ్ణి చూపుటలేదు.

## భాష్యమ్

కేచిత్తు పరమాత్మవివక్షాయాం "ఏతం త్వేవ తే" ఇతి జీవాకర్షణమన్యాయ్యం మన్యమానాః ఏతమేవ వాక్యోపక్రమసూచిత మపహతపాప్మత్వాదిగుణకమాత్మానం తే భూయోనువ్యాఖ్యాస్యామీతి కల్పయన్తి. తేషామేతమితి సంనిహితావలమ్బినీ సర్వనామశ్రుతిర్విప్రకృష్యేత. భూయఃశ్రుతిశ్చోపరుధ్యేత, పర్యాయాన్తరాభిహితస్య పర్యాయాన్తరే ఽ నభిధీయమానత్వాత్. "ఏతం త్వేవ తే" ఇతి ప్రతిజ్ఞాయ ప్రాక్చతుర్థాత్పర్యా యాదన్యమన్యం వ్యాచక్షాణస్య ప్రజాపతేః ప్రతారకత్వం ప్రసజ్యేత. తస్మాద్యదవిద్యాప్రత్యుపస్థాపితమపారమార్థికం జైవం రూపం కర్తృత్వభోక్తృత్వరాగద్వేషాదిదోషకలుషితమనేకానర్థయోగి తద్విలయనేన తద్విపరీతమపహితపాప్మత్వాది గుణకం పారమేశ్వరం స్వరూపం విద్యయా ప్రతిపద్యతే; సర్పాదివిలయనేనేవ రజ్జ్వాదీన్.

## బాలానందిని

కేచిత్తు ఇతి:- ఇక్కడ పరమాత్మను చెప్పడమే అభిప్రాయమైతే "ఏతం త్వేవ తే" అని అంటూ జీవణ్ణి ముందు ముందుకు లాగికొంటూ వెళ్లడం యుక్తం కాదని భావించి కొందరు "తే భూయోఽనువ్యాఖ్యాస్యామి" (నీకు మళ్లీ వివరించి చెపుతాను) అని అంటూ వివరించి చెప్పదలచిన ఆత్మ వాక్యోపక్రమంలో సూచించబడిన. అపహతపాప్మత్వాదిగుణాలు గల పరమాత్మయే (జీవాత్మ కాదు) అని కల్పిస్తున్నారు. వాళ్లకు దగ్గిర ఉన్నదానిని నిర్దేశించే "ఏతమ్" అనే సర్వనామశబ్దంతో కూడిన శ్రుతి (లేదా సర్వనామశబ్దశ్రవణం), దూరం అయిపోతుంది (ఏతచ్ఛబ్దం దగ్గరగా ఉన్న జీవుణ్ణి కాక ఎక్కడో ఉన్న పరమాత్మను నిర్దేశిస్తున్న దని చెప్పినట్లవుతుంది. అప్పుడు

సర్వనామశ్రవణం అర్థరహిత మవుతుంది అని భావం.) ''భూయః'' (మళ్లీ) అనే మాట కూడ బాధిత మవుతుంది. (మీవ్యాఖ్యానం ప్రకారం) ఒక పర్యాయంలో చెప్పబడినది మరొక పర్యాయంలో చెప్పబడడంలేదు కదా? "నీకు దీనిని గూర్చియే చెపుతాను" అని చెప్పి నాల్గవ పర్యాయం వరకూ కూడ మరొక దానిని మరొక దానినీ గూర్చి చెప్పిన ట్లయితే ప్రజాపతి మోసం చేసేవా డనవలసివస్తుంది. అందుచేత భ్రాంతికల్పితాలైన సర్పం మొదలైనవాటిని విలీనం చేసి (వాటిని నిషేధించడం ద్వారా కనబడకుండా చేసి) త్రాడు మొదలైనవాటిని తెలిపినట్లు, అవిద్యచేత సమకూర్చ బడినది, పారమార్థికం కానిది, కర్తృత్వము, భోక్తృత్వము రాగము ద్వేషము మొదలైన అనేకదోషాలతో కలుషితమూ, అనేకములైన అనర్థాలతో కూడినది అయిన ఏ జీవునికి సంబంధించిన రూపం ఉన్నదో దానిని విలీనం చేయడంచేత (శోధించడంచేత) దానికి విపరీతము, అపహతపాప్మత్వాదిగుణాలు కలది అయిన పరమేశ్వరస్వరూపం విద్యచేత పొందబడుతుంది.

## భాష్యమ్

అపరే తు వాదినః పారమార్థికమేవ జైవం రూపమితి మన్యన్తే, అస్మదీయాశ్చ కేచిత్. తేషాం సర్వేషామాత్మైకత్వసమ్యగ్దర్శనప్రతిపక్ష భూతానాం ప్రతిషేధాయేదం శారీరకమారబ్ధమ్, ఏక ఏవ పరమేశ్వరః కూటస్థనిత్యో విజ్ఞానధాతురవిద్యయా, మాయయా మాయావివదనేకధా విభావ్యతే, నాన్యో విజ్ఞానధాతురస్తీతి. యత్త్విదం పరమేశ్వరవాక్యే జీవమాశఙ్క్య ప్రతిషేధతి సూత్రకారః "నా సంభవాత్" (బ్ర.సూ. 1.3.18) ఇత్యాదినా తత్రాయమభిప్రాయః- నిత్యశుద్ధముక్తస్వభావే కూటస్థనిత్యే ఏకస్మిన్నసంగే పరమాత్మని తద్విపరీతం జైవం రూపం వ్యోమ్నీవ తలమలాది పరికల్పితమ్. తదాత్మైకత్వప్రతిపాదనపరైర్వాక్యైర్న్యాయోపేతైర్ద్వైతవాద ప్రతిషేధైశ్చాపనేష్యామీతి పరమాత్మనో జీవాదన్యత్వం ద్రఢయతి. జీవస్య తు న పరస్మాదన్యత్వం ప్రతిపిపాదయిషతి. కిం త్వనువదత్యేవ అవిద్యాకల్పితం లోకప్రసిద్ధం జీవభేదమ్. ఏవం హి స్వాభావికకర్తృత్వ భోక్తృత్వానువాదేన ప్రవృత్తాః కర్మవిధయో న విరుధ్యన్త ఇతి మన్యతే. ప్రతిపాద్యం తు శాస్త్రార్థమాత్మైకత్వమేవ దర్శయతి "శాస్త్రదృష్ట్యా తూపదేశో

వామదేవవత్" (బ్ర.సూ.1.1.30) ఇత్యాదినా. వర్ణితశ్చాస్మాభిర్విద్వదవిద్వద్భేదేన కర్మవిధివిరోధపరిహారః. 19.

బాలానందిని

అన్యే త్వితి:- మరికొందరు వాదులైతే, కొందరు మనవాళ్లు కూడ, జీవుని సంబంధమైన రూపం సత్యమైనదే అని భావిస్తున్నారు. ఆత్మ ఒకటే అనే యథార్థ దర్శనానికి విరుద్ధంగా ఉన్న వీళ్ళందరినీ నిషేధించడంకొరకే కూటస్థనిత్యుడు, విజ్ఞానధాతువు అయిన పరమేశ్వరు డొక్కడే, మాయచేత మాయావి వలె, అవిద్యచేత అనేక విధాలుగా చూడబడుతున్నాడు కాని వాస్తవంలో మరొక విజ్ఞానధాతువు లేదు అని ప్రతిపాదించే ఈ శారీరకమీమాంసాశాస్త్రం ప్రారంభించబడింది. అయితే పరమేశ్వరునికి సంబంధించిన వాక్యంలో జీవుణ్ణి ఆశంకించి సూత్రకారుడు 'నాసంభవాత్' ఇత్యాదివాక్యంచేత నిషేధించడంలో అభిప్రాయం ఇది- నిత్యశుద్ధ బద్ధముక్తస్వభావుడు, కూటస్థనిత్యుడు, అద్వితీయుడు, సంగరహితుడు అయిన పరమాత్మమీద అందుకు విపరీతమైన జీవత్వం, ఆకాశంమీద తలమలాదికం వలె, కల్పించబడింది. ఆత్మైకత్వాన్ని ప్రతిపాదించే న్యాయసంగతాలైన వాక్యాలచేతా, ద్వైతవాదాన్ని నిషేధించే వాక్యాలచేతా దానిని (కల్పితజీవత్వాన్ని) తొలగిస్తాను అనే ఉద్దేశ్యంతో పరమాత్మ జీవునికంటె అన్యుడు అనే విషయాన్ని దృఢీకరిస్తున్నాడు. అంతే కాని జీవుడు పరమాత్మకంటె అన్యుడు అనే విషయాన్ని మాత్రం ప్రతిపాదించడానికి ఇచ్ఛయించడంలేదు; కేవలం లోకంలో ప్రసిద్ధమైన, అవిద్యాకల్పిత మైన జీవభేదాన్ని అనువదిస్తున్నాడు. ఈ విధంగా స్వాభావికమైన కర్తృత్వభోక్తృత్వాలను అనువదించి ప్రవర్తిస్తూన్న కర్మవిధులు విరుద్ధాలు కావు అని భావిస్తున్నాడు. అయితే ప్రతిపాదించవలసిన శాస్త్రార్థం మాత్రం ఆత్మైకత్వమే అని "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" ఇత్యాదికంచేత చూపుతున్నాడు. విద్వదవిద్వద్భేదంచేత (విద్వాంసులకు జ్ఞానం, అవిద్వాంసులకొరకు కర్మ అనే భేదం చేత) కర్మవిధులతో ఈ శాస్త్రానికి విరోధపరిహారం మేం (అధ్యాసభాస్యంలో) వర్ణించి ఉన్నాం. 19.

సూ. అన్యార్థశ్చ పరామర్శః. 1.3.20.

P. 333.

అథ యో దహరవాక్యశేషే జీవపరామర్శో దర్శితః- "అథ య ఏష సంప్రసాదః" (ఛా.ఉ.8.3.4) ఇత్యాదిః స దహరే పరమేశ్వరే వ్యాఖ్యాయమానే న జీవోపాసనోపదేశో న ప్రకృతవిశేషోపదేశ ఇత్యనర్థకత్వం ప్రాప్నోతీతి. అత

అహ- అన్యార్థోఽయం జీవపరామర్శః న జీవస్వరూపపర్యవసాయీ, కిం తర్హి? పరమేశ్వరస్వరూపపర్యవసాయీ. కథమ్? సంప్రసాదశబ్దోదితో జీవో జాగరితవ్యవహారే దేహేన్ద్రియపఞ్జరాధ్యక్షో భూత్వా తద్వాసనానిర్మితాంశ్చ స్వప్నాన్నాడీచరోఽనుభూయ శ్రాన్తః శరణం ప్రేప్సుః ఉభయరూపాదపి శరీరాభిమానాత్సముత్థాయ సుషుప్తావస్థాయాం పరం జ్యోతిః ఆకాశశబ్దితం పరం బ్రహ్మోపసంపద్య విశేషవిజ్ఞానత్త్వం పరిత్యజ్య స్వేన రూపేణాయమభినిష్పద్యతే. స ఏష ఆత్మాపహతపాప్మత్వాదిగుణ ఉపాస్య ఇత్యేవమర్థోఽయం జీవపరామర్శః పరమేశ్వరవాదినోఽప్యుపపద్యతే.

### బాలానందిని

అథేతి:- దహరవాక్య శేషంలో- "అథ య ఏష సంప్రసాదః" అని ఏ జీవపరామర్శ చూపబడిందో, అది, దహరం పరమేశ్వరుడు అని వ్యాఖ్యానించిన పక్షంలో ఇక్కడ జీవోపాసనోపదేశమూ లేదు, ప్రకృతమైన దహరంలో ఏదైనా విశేషంయొక్క ఉపదేశమూ లేదు గాన వ్యర్థం అవుతుంది కదా? ఈ ఆశంకకు సమాధానంగా చెపుతున్నాడు. ఈ జీవపరామర్శ మరొక ప్రయోజనం కొరకు చేయబడింది. ఇది జీవస్వరూపం చెప్పడంలో పర్యవసానం చెందేది (ముఖ్యోద్దేశ్యం కలది) కాదు. మరేమిటి? ఇది పరమేశ్వర స్వరూపపర్యవసాయి. ఎట్లు? సంప్రసాదశబ్దంచేత చెప్పబడిన జీవుడు జాగరిత వ్యవహారంలో దేహేంద్రియాదుల పంజరానికి అధ్యక్షుడుగా ఉండి, జాగరితావస్థ యొక్క వాసనలచేత నిర్మించబడిన స్వప్నాలను నాడులలో సంచరిస్తూ అనుభవించి, అలసి పోయి, శరణం పొంద గోరి, ఉభయరూపమైన శరీరభిమానం నుండి (స్థూల సూక్ష్మ శరీరాభిమానం నుండి) పైకి లేచి (దూరంగా ఉంటూ) సుషుప్తావస్థలో ఆకాశశబ్ద ప్రతిపాద్యము, పరజ్యోతీరూపము అయిన పరబ్రహ్మను పొంది, విశేషవిజ్ఞానవత్త్వాన్ని (విశేషజ్ఞానం కలిగి ఉండడాన్ని) విడచి తన రూపంతో అభినిష్పన్ను డవుతున్నాడు (స్వస్వరూపం పొందుతున్నాడు). అట్టి, అపహతపాప్మత్వాదిగుణాలు గల ఈ ఆత్మను ఉపాసించాలి అని చెప్పడం వరకే ఈ జీవపరామర్శ అని పరమేశ్వరుడే దహరం అని అంగీకరించినవానికి కూడ కుదురుతుంది. 20.

### సూ. అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్. 1.3.21.

యదప్యుక్తమ్- "దహరోఽస్మిన్నన్తరాకాశః" ఇత్యాకాశస్యాల్పత్వం శ్రూయమాణం పరమేశ్వరే నోపపద్యతే; జీవస్య త్వారాగ్రోపమితస్యాల్పత్వమవ

కల్పత ఇతి-తస్య పరిహారో వక్తవ్యః. ఉక్తో హ్యాప్య పరిహారః పరమేశ్వరస్యాపేక్షికమల్పత్వమవకల్పత ఇతి- "అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ" (బ్ర.సూ.1.2.7) ఇత్యత్ర; స ఏవేహ పరిహారోఽనుసంధాతవ్య ఇతి సూచయతి. శ్రుత్యైవ చేదమల్పత్వం ప్రత్యుక్తం ప్రసిద్ధేనాకేశేనోపమిమానయా- "యావాన్వా అయమాకాశస్తావానైషోఽన్తర్హృదయ ఆకాశః" ఇతి.21.

## బాలానందిని

అల్పేతి:- ''అల్పశ్రుతేః ఇతి చేత్= దహరాకాశం చిన్నది అని చెప్పబడింది కదా అన్నట్లయితే, తత్= అది, (దానికి సమాధానం) ఉక్తమ్= వెనుకనే చెప్పబడింది' ' అని సూత్రార్థం.

యదపీతి:- "దహరోఽస్మిన్నన్తరాకాశః" అని ఆకాశం విషయంలో వినబడుతున్న అల్పత్వం పరమేశ్వరునిలో కుదరదు, ఆరాగ్రంతో పోల్చబడిన జీవుని విషయంలో అయితే కుదురుతుంది అని చెప్పిన దానికి పరిహారం చెప్పాలి. పరమేశ్వరునికి కూడ ఆపేక్షికమైన అల్పత్వం కుదురుతుంది అని దీనికి పరిహారం "అర్భకౌకస్త్వాత్.. వ్యోమవచ్చ" అనే చోట చెప్పబడింది కదా? ఆ పరిహారమే ఇక్కడ కూడ సమ్వయించు కోవాలి అని సూచిస్తున్నాడు. (నిజానికి) "యావాన్వా... ఆకాశః" అని (హృదయాకాశాన్ని) ప్రసిద్ధమైన ఆకాశంతో పోల్చిన శ్రుతియే ఈ అల్పత్వాన్ని నిరాకరించింది. 21.

దహరాధికరణం సమాప్తం

## 6. అనుకృత్యధికరణమ్. సూ. 22-23.

## సూ. అనుకృతేస్తస్య చ. 1.3.22

"న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః, తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" (ము.6.2.210) ఇతి సమామనన్తి. తత్ర యం భాన్తమనుభాతి సర్వం యస్య చ భాసా సర్వమిదం విభాతి స కిం తేజోధాతుః కశ్చిదుత ప్రాజ్ఞ ఆత్మేతి విచికిత్సాయాం తేజోధాతురితి తావత్ప్రాప్తమ్. కుతః? తేజోధాతూనామేవ సూర్యాదీనాం భాననిషేధాత్. తేజస్స్వభావకం హి చన్ద్రతారకాది తేజఃస్వభావక ఏవ సూర్యే భాసమానేఽహని న భాసత ఇతి ప్రసిద్ధమ్. తథా సహ సూర్యేణ

సర్వమిదం చన్ద్రతారకాది యస్మిన్న భాసతే సోఽపి తేజఃస్వభావ ఏవ కశ్చిది త్యవగమ్యతే. అనుభానమపి తేజఃస్వభావక ఏవ ఉపపద్యతే. సమానస్వభావకేష్వనుకారదర్శనాత్, గచ్ఛన్తమనుగచ్ఛతీతివత్. తస్మాత్తేజోధాతుః కశ్చిత్ ఇతి.

బాలానందిని

**అనుకృతేరితి:-** "అనుకృతేః = అనుకరణంవలన, "న తత్ర సూర్యో భాతి" ఇత్యాదివాక్యంచేత పరమాత్మయే చెప్పబడుచున్నాడు. తస్య చ= "తస్య భాసా సర్వమిదం విభాతి" అనే వాక్యం పరమేశ్వరుణ్ణిగా సూచిస్తూన్నది" అని సూత్రార్థం.

**నేతి:-** "న తత్ర... విభాతి" ("అక్కడ సూర్యుడు ప్రకాశించడు; చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశించవు. ఈ మెరుపులు ప్రకాశించవు. ఈ అగ్ని మాట చెప్పే దేమిటి? ప్రకాశిస్తూన్న దానినే అనుసరించి సర్వమూ ప్రకాశిస్తూన్నది. దాని కాంతిచేతనే ఇదంతా ప్రకాశిస్తున్నది") అని పఠిస్తున్నారు. అక్కడ ప్రకాశిస్తూన్న దేనిని అనుసరించి ఇదంతా ప్రకాశిస్తున్నదో, దేని కాంతిచేత ఇదంతా ప్రకాశిస్తున్నదో అది ఏదైనా తేజోధాతువా, లేదా బ్రహ్మయా (పరమాత్మయా) అనే సందేహం కలగగా. తేజోధాతువు అని ప్రాప్తించింది. ఎందువల్ల? తేజోధాతువు లైన సూర్యాదులు ప్రకాశించడం లేదు అని చెప్పడంవల్ల. పగలు తేజఃస్వభావు డైన సూర్యుడు ప్రకాశిస్తూన్నప్పుడు తేజఃస్వభావాలైన చంద్రతారకాదులు భాసించవు అని ప్రసిద్ధం కదా? అట్లే సూర్యునితో సహా ఈ చంద్రతారకాదికం దేనియందు భాసించదో అది కూడ తేజఃస్వభావం గల ఒకానొకటి అని తెలుస్తూన్నది. అనుభానం అనేది కూడ తేజఃస్వభావక మైనదానియందే కుదురుతుంది. నడుస్తున్నవానిని అనుసరించి నడుస్తున్నాడు అన్నట్లు అనుకరణం అనేది సమానస్వభావం కలవాటిలోనే కనబడుతున్నది కదా? అందుచేత ఒకానొక తేజోధాతువే.

వి. పూర్వాధికరణంలో "పరం జ్యోతిరుపసంపద్య" అనే వాక్యార్థం విచారించబడింది దాని ప్రసంగంచేత పరజ్యోతిష్ట్వాన్ని సాధించే "న తత్ర" ఇత్యాది వాక్యం విచారించబడుచున్నది. ఈ విధంగా ప్రసంగ సంగతి. లేదా పూర్వం ఆత్మశబ్దం వినబడడంచేత ఆకాశశబ్దానికి రూఢార్థం విడిచి పరమేశ్వరు డనే అర్థం చెప్పబడింది. అట్లే ఇక్కడ తత్ర అని సతిసప్తమిచేత (అది ఉండగా అని అర్థం) తత్రశబ్దంచేత

చెప్పబడే ఒకానొక తేజస్సు ఇతర తేజస్సులను తిరస్కరిస్తుంది అనే అర్థం వస్తుంది. దానికి (సతిసప్తమికి) వర్తమానార్థం విడిచివేసి భవిష్యదర్థం చెప్పి (''ఏ తేజస్సు భవిష్యత్తులో వస్తే సూర్యాదులు ప్రకాశించరో'' అని భవిష్యదర్థం చెప్పుకొని) అలాంటి ఏ తేజస్సు మున్ముందు రాగలదో దానిని ఉపాసించాలి అని అర్థం చెప్పుకోవాలి. ఈ విధంగా ఈ అధికరణానికి పూర్వాధికరణంతో దృష్టాంతసంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- ప్రాజ్ఞ ఏవాయమాత్మా భవితుమర్హతి. కస్మాత్? అనుకృతేః. అనుకరణమనుకృతిః. యదేతత్ "తమేవభాన్తమనుభాతి సర్వమ్" ఇత్యనుభానం తత్ ప్రాజ్ఞపరిగ్రహేఽవకల్పతే, "భారూపః సత్యసంకల్పః" (ఛా.ఉ.3.14.2) ఇతి హి ప్రాజ్ఞమాత్మానమామనన్తి, న తు తేజోధాతుం కం చిత్సూర్యాదయోఽనుభాన్తీతి ప్రసిద్ధమ్. సమత్వాచ్చ తేజోధాతూనాం సూర్యాదీనాం న తేజోధాతుమన్యం ప్రత్యపేక్షాస్తి యం భాన్తమనుభాయుః. న హి ప్రదీపః ప్రదీపాన్తరమనుభాతి. యదప్యుక్తమ్- సమానస్వభావకేష్వనుకారో దృశ్యతే ఇతి - నాయమేకాన్తో నియమోఽస్తి; భిన్నస్వభావకేష్వప్యనుకారో దృశ్యతే, యథా సుతప్తోఽయఃపిణ్డః అగ్న్యనుకృతిః అగ్నిం దహన్తమనుదహతి; భౌమం వా రజో వాయుం వహన్తమనువహతీతి. అనుకృతేరిత్యనుభానమ సూసుచత్. తస్య చేతి చతుర్థం పాదమస్య శ్లోకస్య సూచయతి. "తస్య భాసా సర్వమిదం విభాతి" ఇతి తద్ధేతుకం భానం సూర్యాదేరుచ్యమానం ప్రాజ్ఞమాత్మానం గమయతి. "తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతమ్" (బృ ఉ.4.4.16) ఇతి హి ప్రాజ్ఞమాత్మానమామనన్తి. తేజోన్తరేణ సూర్యాదితేజో విభాతీత్యప్రసిద్ధం విరుద్ధం చ. తేజోన్తరేణ తేజోన్తరస్య ప్రతిఘాతాత్.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాము- ఇది ప్రాజ్ఞాత్మయే అవడానికి తగి ఉంది. ఎందువల్ల? అనుకృతివల్ల, అనుకృతి అనగా అనుకరణం. "తమేవ భాన్తమనుభాతి సర్వమ్" అని చెప్పిన అనుభానం (అనుసరించి ప్రకాశించడం) ప్రాజ్ఞుణ్ణి గ్రహిస్తేనే కుదురుతుంది. ప్రాజ్ఞాత్మను గూర్చి "భారూపః సత్యసంకల్పః" (కాంతిస్వరూపుడు, సత్యసంకల్పుడు) అని చెప్పుచున్నారు. అంతేనే కాని సూర్యాదులు

ఏదో ఒక తేజోధాతువును అనుసరించి ప్రకాశిస్తున్నాయి అని ప్రసిద్ధం కాదు. తేజోధాతువు లైన సూర్యాదులు సమమైనవి అవడంవల్ల ప్రకాశిస్తూన్న దానిని అనుసరించి ప్రకాశించడానికి మరొక తేజోధాతువుయొక్క అపేక్ష వాటి కేమీ ఉండదు. ఒక దీపం మరొక దీపాన్ని అనుసరించి (దానిమీద ఆధారపడి) ప్రకాశించదు కదా? అనుకరించడం సమానస్వభావం కలవాటి మధ్యనే ఉంటుం దని చెప్పడం కూడ యుక్తం కాదు. ఇలాంటి నిశ్చితమైన నియమం ఏదీ లేదు. అనుకరణం వేరు వేరు స్వభావం కలవాటిలో కూడ కనబడుతున్నది కదా? ఎట్లనగా- బాగా కాల్చబడిన ఇనుపగుండు అగ్నిని అనుకరిస్తూ కాలుస్తూన్న ఆ అగ్నిని అనుసరించి కాలుస్తుంది. నేలమీద పరాగం ఎగురుతూన్న ఆకాశాన్ని అనుసరించి ఎగురుతుంది. "అనుకృతేః" అనే పదంచేత అనుసరించి ప్రకాశించడాన్ని సూచించాడు. "తస్య చ" అనేది ఈ శ్లోకం చతుర్థపాదాన్ని సూచిస్తూన్నది. "తస్య భాసా సర్వమిదం విభాతి" అని సూర్యాదులు దానిమూలానే భాసిస్తున్నాయి అని చెప్పడం ప్రాజ్ఞాత్మను (జ్ఞానరూప)మైన ఆత్మను సూచిస్తూన్నది. ప్రాజ్ఞాత్మను గూర్చి "తద్దేవా... అమృతమ్" (దేవతలు జ్యోతిస్సులకు కూడ జ్యోతిస్సు, ఆయుఃస్వరూపము, అమృతమూ అయిన ఆ బ్రహ్మను ఉపాసిస్తున్నారు) అని చెప్పుచున్నారు కదా. ఒక తేజస్సు మరొక తేజస్సుచేత ప్రకాశిస్తూన్నది అని చెప్పడం అప్రసిద్ధం, విరుద్ధం కూడ. ఒక తేజస్సుచేత మరొక తేజస్సు అణచివేయబడుతుంది కదా?

## భాష్యమ్

అథవా న సూర్యాదీనామేవ శ్లోకపరిపఠితానామిదం తద్ధేతుకం విభానముచ్యతే. కిం తర్హి? "సర్వమిదమ్" ఇత్యవిశేషశ్రుతేః సర్వస్యైవాస్య నామరూపక్రియాఫలజాతస్య యాభివ్యక్తిః సా బ్రహ్మజ్యోతిఃసత్తానిమిత్తా. యథా సూర్యాదిజ్యోతిఃసత్తానిమిత్తా సర్వస్య రూపజాతస్యాభివ్యక్తిస్తద్వత్. "న తత్ర సూర్యో భాతి" ఇతి చ తత్రశబ్దమాహరన్ ప్రకృతగ్రహణం దర్శయతి. ప్రకృతం చ బ్రహ్మ "యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతమ్" (ము.ఉ.2.2.5) ఇత్యాదినా. అనన్తరం చ-

"హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్.

తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదుః" (ము.ఉ.2.2.9)

ఇతి.

కథం తజ్జ్యోతిషాం జ్యోతిః ఇత్యత ఇదముత్థితమ్ - "న తత్ర సూర్యో భాతి" ఇతి. యదప్యుక్తం — సూర్యాదీనాం తేజసాం భానప్రతిషేధస్తేజోధాతావేవాన్యస్మిన్నవకల్పతే, సూర్య ఇవేతరేషామితి, తత్ర తు స ఏవ తేజోధాతురన్యో న సంభవతీత్యుపపాదితమ్. బ్రహ్మణ్యపి చైషాం భానప్రతిషేధోఽవకల్పతే, యతో యదుపలభ్యతే తత్సర్వం బ్రహ్మణైవ జ్యోతిషోపలభ్యతే; బ్రహ్మ తు నాన్యేన జ్యోతిషోపలభ్యతే, స్వయంజ్యోతిఃస్వరూపత్వాత్, యేన సూర్యాదయస్తస్మిన్ భాయుః. బ్రహ్మ హ్యన్యద్వ్యనక్తి న తు బ్రహ్మాన్యేన వ్యజ్యతే - "ఆత్మనైవాయం జ్యోతిషాస్తే" (బృ.ఉ.4.3.6) "అగృహ్యో న హి గృహ్యతే" (బృ.ఉ.4.2.4) ఇత్యాది శ్రుతిభ్యః.22.

బాలానందిని

అథవా ఇతి :- లేదా- దానివల్ల ప్రకాశించడం కేవలం శ్లోకంలో చెప్పబడిన సూర్యాదులకే కాదు, మరేమనగా- "సర్వమిదమ్" ఇదంతా అని, ఫలానా అని కాకుండా చెప్పడంచేత నామం, రూపం, పని, పనికి సాధనం, ఫలం ఏతద్రూపమైన సమస్తజగత్తుయొక్క ఏ అభివ్యక్తి (ప్రకాశించడం, కనబడడం) కలదో అది బ్రహ్మరూపమైన జ్యోతిస్సుయొక్క ఉనికిని పట్టి కలిగేదే. లోకంలో ఉన్న సకల రూపాల అభివ్యక్తి సూర్యాది జ్యోతిస్సుల ఉనికిని పట్టి ఎట్లు కలుగుతున్నదో అట్లే ఇది కూడ. అందుచేత సర్వశబ్దానికి సూర్యాదులు అనే సంకుచితార్థం చెప్పకుండా 'సకలపదార్థజాతమూ' అని అర్థం చెప్పి దాని భానం దేనివల్ల కలుగుతున్నదో అది అని ఈ వాక్యానికి అర్థం చెప్పాలి; అది బ్రహ్మయే అని భావం. బ్రహ్మనే గ్రహించాలి అనడానికి మరొక హేతువును చూపుతున్నారు. నేతి: 'న తత్ర సూర్యో భాతి" అనే వాక్యంలో తత్ర అని సర్వనామశబ్దం ప్రయోగించి ప్రకృతమైనదానిని గ్రహించాలి అని చూపుతున్నాడు. ఇక్కడ "యస్మిన్... ఓతమ్" ఇత్యాది వాక్యంలో బ్రహ్మ ప్రకృతమైనది. ఈ వాక్యం తరవాత "హిరణ్మయే... విదుః" అని మరొక వాక్యం ఉంది. (జ్యోతిర్మయమైన ఆనందమయకోశంలో నిర్మలము, అవయవశూన్యమూ అయిన బ్రహ్మ ఉన్నది. అది పరిశుద్ధమైనది. జ్యోతిస్సులకు జ్యోతిస్సు. ఆత్మవేత్తలు దానినే తెలుసుకొనుచున్నారు అని దీని అర్థం). ఆ జ్యోతిషాం జ్యోతిస్సు ఏది అన్నప్పుడు "న తత్ర సూర్యో భాతి" అనే మాట బయలుదేరింది (అందుచేత ఇది బ్రహ్మప్రకరణం గాన ఈ వాక్యంలో చెప్పినది ప్రాజ్ఞాత్మయే అని భావం).

వి. సూర్యాదితేజస్సులు ప్రకాశించవు అని చెప్పడం, సూర్యు డున్నప్పుడు ఇతరతేజస్సులు ప్రకాశించనట్లు, మరొక తేజోధాతు వేదో ఉన్నప్పుడే కుదురుతుంది అని (పూర్వపక్షి) చెప్పిన దానికి సమాధానంగా అలాంటి తేజోధాతువు ఏదీ ప్రసిద్ధంగా లేదు అని చెప్పబడింది.

అవ. మరొక తేజోధాతు వేదో ఉందని కల్పించి దానివిషయంలో ఇవి ప్రకాశించవు అని చెప్పవలసిన పని లేదు. బ్రహ్మ విషయంలో కూడ ఇది కుదురుతుంది అని చెపుతున్నారు - బ్రహ్మణ్యపీతి :- సూర్యాదుల ప్రకాశానికి నిషేధం బ్రహ్మనిషయంలో కూడ కుదురుతుంది. లోకంలో ఏది తెలియబడినా బ్రహ్మ అనే జ్యోతిస్సుచేతనే తెలియబడుతుంది. బ్రహ్మమాత్రం స్వయంజ్యోతిఃస్వరూపం అవడంచేత మరొకదానిచేత దేనిచేతా (దేని సహాయంచేత) తెలియబడదు. అలాంటప్పుడు సూర్యాదులు బ్రహ్మ విషయంలో ప్రకాశించే (బ్రహ్మను చూపించే) ప్రసక్తే లేదు. బ్రహ్మ ఇతరమైనదానిని తెలిసేటట్లు చేస్తుందికాని బ్రహ్మ మరొక దానిచేత దేనిచేత (దేని సహాయంచేత) తెలియబడదు. "ఆత్మ నైవాయం జ్యోతిషాస్తే" (ఇతరజ్యోతిస్సులు ఏవీ లేనప్పుడు పురుషుడు ఆత్మ అనే జ్యోతిస్సుతో ఉంటాడు) "అగృహ్యో న హి గృహ్యతే" (ఆత్మ దేనిచేతా తెలియబడదు) అని శ్రుతులు చెపుతున్నాయి. 22.

## సూ. అపి చ స్మర్యతే. 1.3.23.

అపి చ ఈదృగ్రూపత్వం ప్రాజ్ఞస్యైవాత్మనః స్మర్యతే భగవద్గీతాసు-

"న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః.

యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ" (భ.గీ.15.16 ) ఇతి. "యదాదిత్యగతం తేజో జగద్భాసయతేऽఖిలమ్. యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్" (భ.గీ.15.12) ఇతి చ.

### బాలానందిని

అపి చేతి: "అపిచ= మరియు, స్మర్యతే=స్మరింపబడుచున్నది, స్మృతిలో చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

అపి చేతి:- ఈ విధమైన రూపం ప్రాజ్ఞునికే ఉన్నట్లు భగవద్గీతలో "న...మమ" (దానిని సూర్యుడు గాని, చంద్రుడు గాని, అగ్ని గాని ప్రకాశింపచేయజాలవు. ఏ స్థానాన్ని పొంది తిరిగి వెనుకకు రారో అది నా పరమమైన స్థానం. (నా స్వరూపం) అని,

"యదాదిత్య... మామకమ్" (జగత్తు నంతా ప్రకాశింపచేసే సూర్యుని కాంతి చంద్రునిలోని కాంతి, అగ్నిలోని కాంతి ఇదంతా నా తేజస్సే అని తెలుసుకో) అనీ చెప్పబడింది.

## అనుకృత్యధికరణం సమాప్తం

## 7. ప్రమితాధికరణమ్. సూ.24-25

## సూ. శబ్దాదేవ ప్రమితః 1.3.24

"అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి" ఇతి శ్రూయతే. తథా "అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః.

ఈశానో భూతభవ్యస్య స ఏ వాద్య స ఉ శ్వ ఏతద్వై తత్" (క.ఉ.2.4.13) ఇతి చ. తత్ర యోఽఙ్గుష్ఠమాత్రః పురుషః శ్రూయతే స కిం విజ్ఞానాత్మా కిం వా పరమాత్మేతి సంశయః. తత్ర పరిమాణోపదేశాత్తావద్విజ్ఞానేత్మేతి ప్రాప్తమ్. న హ్యనన్తాయామవిస్తారస్య పరమాత్మనోఽఙ్గుష్ఠపరిమాణముపపద్యతే. విజ్ఞానాత్మనస్తూపాధిమత్త్వాత్సంభవతి కయా చిత్కల్పనయాఙ్గుష్ఠ మాత్రత్వమ్. స్మృతేశ్చ-

"అథ సత్యవతః కాయాత్పాశ బద్ధం వశం గతమ్.

అఙ్గుష్ఠమాత్రం పురుషం నిశ్చకర్ష యమో బలాత్" (మహా. భార.3.29.17) ఇతి. న హి పరమేశ్వరో బలాద్యమేన నిష్క్రష్టుం శక్యః. తేన తత్ర సంసార్యఙ్గుష్ఠమాత్రో నిశ్చితః, స ఏవేహాపీతి.

### బాలానందిని

శబ్దాదితి:- "ప్రమితః= పరిమిత ప్రమాణం గల పురుషుడు, పరమాత్మయే, శబ్దాదేవ= ఆ ఘట్టంలోనే ఉన్న శబ్దంవల్ల" అని సూత్రార్థం.

అఙ్గుష్ఠేతి:- "అఙ్గుష్ఠ... తిష్ఠతి" (శరీరమధ్యంలో అంగుష్ఠమాత్రుడైన (బొటన వ్రేలు ప్రమాణం గల) పురుషుడు ఉన్నాడు అని వినబడుచున్నది. అట్లే "అఙ్గుష్ఠ... తత్" (అంగుష్ఠమాత్రుడైన పురుషుడు ధూమంలేని జ్యోతిస్సు వంటివాడు. భూతానికి, భవిష్యత్తుకూ కూడ ఈశ్వరుడు ఇప్పుడు ఉన్నవాడు అతడే, రేపు కూడ అతడే. ఇదే ఆ బ్రహ్మ) అని కూడ వినబడుచున్నది. ఇక్కడ వినబడుచున్న ఈ అంగుష్ఠమాత్ర

పురుషుడు విజ్ఞానాత్మయా (జీవుడా) పరమాత్మయా అని సంశయం. అంగుష్ఠపరిమాణం చెప్పడంవల్ల విజ్ఞానాత్మయే అని ప్రాప్తిస్తూన్నది. అనంతమైన పొడవు వెడల్పూగల పరమాత్మకు వ్రేలు పరిమాణం ఉపపన్నం కాదు కదా? విజ్ఞానాత్మయైతే ఉపాధి కలవాడవడంచేత వానికి ఏదో ఒక కల్పనచేత అంగుష్ఠమాత్రత్వం కుదురుతుంది. "అథ... బలాత్" (పిమ్మట యముడు సత్యవంతుని శరీరంనుండి పాశాలతో కట్టబడిన అంగుష్ఠమాత్రుడైన పురుషుణ్ణి బలంగా లాగాడు) అని స్మృతి కూడ చెప్పుచున్నది. యముడు బలంగా పరమేశ్వరుణ్ణి లాగడం కుదరదు కదా? అందుచేత అక్కడ అంగుష్ఠమాత్రుడు జీవుడు అని నిశ్చయించబడింది. ఇక్కడ కూడ ఆ జీవుడే.

వి. పూర్వాధికరణంలో అనుభానం మొదలైన లింగంచేత 'తత్ర' అన్నచోట విషయసప్తమి గ్రహించి (బ్రహ్మ విషయంలో అని అర్థం చెప్పి) 'భాతి' కి 'భాసయతి' (ప్రకాశింపచేస్తున్నాడు) అని ణిజంతార్థం చెప్పి నట్లు ఇక్కడ కూడ ప్రారంభంలో ఉన్న పరిమాణవాచకశబ్దంచేత జీవు డనే అర్థం గ్రహించి 'అస్మి' అనే పదం అధ్యాహారం తెచ్చుకొని "ఈశానః అస్మి" అని ధ్యానం చెయ్యాలి అని అర్థం చెప్పవచ్చును అని దృష్టాంతసంగతి. పూర్వపక్షంలో జీవుణ్ణి బ్రహ్మదృష్టితో ఉపాసించాలి; సిద్ధాంతంలో ప్రత్యగాత్మపరమాత్మైక్యజ్ఞానం ఫలం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- పరమాత్మైవాయమఙ్గుష్ఠమాత్రపరిమితః పురుషో భవితుమర్హతి. కస్మాత్? శబ్దాత్- "ఈశానో భూతభవ్యస్య" ఇతి. న హ్యన్యః పరమేశ్వరాద్భూతభవ్యస్య నిరఙ్కుశమీశితా. "ఏతద్వైతత్" ఇతి చ ప్రకృతం పృష్టమిహానుసందధాతి- ఏతద్వై తద్యత్పృష్టం బ్రహ్మేత్యర్థః. పృష్టం చేహ బ్రహ్మ-

**అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్.** P 69 & 225

**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద" (క.ఉ.1.2.14)** ఇతి. శబ్దాదేవేత్యభిధానశ్రుతేరేవ ఈశాన ఇతి పరమేశ్వరోఽయం గమ్యత ఇత్యర్థః24.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం- అంగుషమాత్రపరిమితుడైన ఈ పురుషుడు పరమాత్మయే కావాలి. ఎందువల్ల? "ఈశానో భూతభవ్యస్య" (భూత భవిష్యత్తులకు ప్రభువు) అనే వాక్యంవల్ల. భూతభవ్యాలను ఎలాంటి అడ్డంకులూ

లేకుండా పాలింపదగినవాడు (వాటిమీద పూర్తి అధికారం గలవాడు) ఈశ్వరుడు తప్ప మరెవ్వడూ లేడు కదా? ప్రశ్నించబడిన ప్రకృతమైనదానిని "ఏతద్వై తత్" అని ఇక్కడ అనుసంధానం చేస్తున్నాడు. అడగబడిన ఆ బ్రహ్మ ఇదే అని అర్థం. ఇక్కడ- "అన్యత్ర... తద్వద" (ధర్మానికి అతీత మైనది. అధర్మానికి అతీతమైనది, ఈ చేయబడినదానికి (కార్యానికి) చేయబడనిదానికి (కారణానికి) అతీత మైనది. భూతానికి భవిష్యత్తుకీ అతీతమైనది అయిన దేనిని చూస్తున్నావో అది చెప్పుము) అని బ్రహ్మను గూర్చి ప్రశ్న అడగబడింది. శబ్దాదేవ=ఈశానః అని పేరు వినబడడంవల్లనే ఇతడు పరమేశ్వరుడు అని తెలుస్తూన్నది అని అర్థం. 24.

## భాష్యమ్

కథం పునః సర్వగతస్య పరమాత్మనః పరిమాణోపదేశః ఇత్యత్ర బ్రూమః-

**సూ. హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్. 1.3.25.**

సర్వగతస్యాపి పరమాత్మనః హృదయేఽవస్థానమపేక్ష్య అఙ్గుష్ఠమాత్రత్వమిదముచ్యతే; ఆకాశస్యేవ వంశపర్వాపేక్షమరత్నిమాత్రత్వమ్. న హ్యఞ్జసాఽతిమాత్రస్యైవ పరమాత్మనోఽఙ్గుష్ఠమాత్రత్వముపపద్యతే. న చాన్యః పరమాత్మన ఇహ గ్రహణమర్హతీశానశబ్దాదిభ్య ఇత్యుక్తమ్.

నను ప్రతిప్రాణిభేదం హృదయానామనవస్థితత్వాత్తదపేక్షమప్యఙ్గుష్ఠమాత్రత్వం నోపపద్యముత ఇత్యత ఉత్తరచ్యతే- మనుష్యాధికారత్వాదితి. శాస్త్రం హ్యవిశేషప్రవృత్తమపి మనుష్యానేవాధికరోతి, శక్తత్వాదర్థిత్వాదపర్యుదస్తత్వాదుపనయనాదిశాస్త్రాచ్చేతి. వర్ణితమేతదధికారలక్షణే (జై.సూ.6.1). మనుష్యాణాం చ నియతపరిమాణః కాయః. ఔచిత్యేననియతపరిమాణమేవ బైషామఙ్గుష్ఠమాత్రం హృదయమ్. అతో మనుష్యాధి కరత్వాచ్ఛాస్త్రస్య మనుష్యహృదయావస్థానాపేక్షమఙ్గుష్ఠమాత్రత్వముపపన్నం పరమాత్మనః.

## బాలానందిని

హృదీతి:- "హృది= హృదయమునందు, అపేక్షయా=పరమేశ్వరుడు ఉండడాన్నిపట్టి, మనుష్యాధికారత్వాత్ మనుషులను గూర్చి చెప్పినదవడంవల్లా, అంగుష్ఠమాత్రత్వం చెప్పబడింది" అని సూత్రార్థం.

సర్వేతి:- పరమాత్మ సర్వగతమే అయినా కూడ (ఆ పరమాత్మ) హృదయంలో ఉండడాన్ని పట్టి ఈ అంగుష్ఠమాత్రత్వం, వెదురుకణుపును పట్టి (దానిలో ఉన్న) ఆకాశం జానెడు అన్నట్లు, చెప్పబడుచున్నది. అత్యధికప్రమాణం గల పరమాత్మకు

అంగుష్ఠమాత్రత్వం సరియైన రీతిలో కుదరదు కదా? ఇక్కడ ఈశానశబ్దాదు లుండడం వల్ల పరమాత్మను తప్ప మరెవరినీ గ్రహించడం కుదర దని పైన చెప్పబడింది. (ప్రశ్న) ప్రాణిభేదాన్ని బట్టి వాటి హృదయాల ప్రమాణం నిశ్చితంగా ఉండదు గాన, హృదయాన్ని బట్టి అంగుష్ఠమాత్రత్వం చెప్పబడింది అనడం ఎలా కుదురుతుంది? దీనికి "మనుష్యాధికారత్వాత్" అని సమాధానం చెప్పబడుచున్నది. శాస్త్రం విశేషం లేకుండా సర్వసాధారణరీతిలో ప్రవర్తించినా కూడ ఇది మనుష్యులకే వర్తిస్తుంది; ఎందువల్ల ననగా ఆయా కర్మలు చేసే శక్తి మనుష్యులకే ఉంటుంది, ఫలం కావాలనే కోరిక వాళ్లకే ఉంటుంది, వాళ్లు చేయగూడ దని నిషేధం లేదు, ఉపనయనాదులు చేసుకోవా లని శాస్త్రం ఉంది అని అధికారాన్ని గూర్చి చెప్పే ఘట్టంలో పూర్వమీమాంసాశాస్త్రంలో వర్ణించబడింది. మనుష్యుల శరీరం ఒక నియత మైన పరిమాణంలో ఉంటుంది. ఔచిత్యానుసారం వాళ్ల హృదయం కూడ వాళ్ల అంగుష్ఠం ప్రమాణంలో నియతంగా ఉంటుంది. అందువల్ల శాస్త్రం మనుష్యాధికారం గాన మనుష్యుల హృదయంలో ఉండడాన్ని బట్టి పరమాత్మ అంగుష్ఠమాత్రుడు అని చెప్పడం ఉపపన్నమే.

## భాష్యమ్

యదప్యుక్తమ్-పరిమాణోపదేశాత్స్మృతేశ్చ సంసార్యేవాయమఙ్గుష్ఠ మాత్రః ప్రత్యేతవ్య ఇతి, తత్రప్రత్యుచ్యతే- "స ఆత్మా తత్త్వమసి" ఇత్యాది వత్సంసారిణ ఏవ సతోఽఙ్గుష్ఠమాత్రస్య బ్రహ్మత్వమిదముపదిశ్యత ఇతి. ద్విరూపా హి వేదాన్తవాక్యానాం ప్రవృత్తిః; క్వచిత్పరమాత్మస్వరూప నిరూపణపరా, క్వచిద్విజ్ఞానాత్మనః పరమాత్మైకత్వోపదేశపరా. తదత్ర విజ్ఞానాత్మనః పరమాత్మనైకత్వముపదిశ్యతే నాఙ్గుష్ఠమాత్రత్వం కస్య చిత్. ఏతమేవార్థం పరేణ స్ఫుటీకరిష్యతి

"అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం హృదయే సంనివిష్టః, తం స్వాచ్ఛరీరాత్ప్రబృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ తం విద్యాచ్ఛుక్ర మమృతమ్" (క.ఉ.2.6.17) ఇతి. 25

## బాలానందిని

యదపీతి:- పరిమాణం చెప్పడంవల్లా, స్మృతివల్లా కూడ ఈ అంగుష్ఠమాత్ర పురుషుడు సంసారి అనే గ్రహించాలి అని చెప్పిన దానికి సమాధానం చెప్పబడుతున్నది- "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" ఇత్యాదులందు వలె సంసారియే అయిన అంగుష్ఠమాత్ర

పురుషునికి ఈ బ్రహ్మత్వం ఉపదేశించబడుతున్నది. వేదాంతాలు రెండు విధాల విషయాన్ని ప్రతిపాదిస్తూంటాయి. కొన్నిచోట్ల పరమాత్మ స్వరూపాన్ని ప్రతిపాదిస్తాయి; కొన్నిచోట్ల విజ్ఞానాత్మకు పరమాత్మతో ఐక్యాన్ని బోధిస్తాయి. అందుచేత ఇక్కడ విజ్ఞానాత్మకు పరమాత్మతో ఏకత్వం బోధించబడుతున్నది; అంతే కాని ఎవరికీ అంగుష్ఠమాత్రత్వం ఉపదేశించబడడంలేదు. ఈ విషయాన్ని "అఙ్గుష్ఠమాత్రః... అమృతమ్" అనే రాబోయే వాక్యంలో స్పష్టం చేయబోతున్నాడు. "అంగుష్ఠమాత్రుడైన పురుషుడు ఎల్లప్పుడు జనుల హృదయంలో అంతరాత్మగా చేరి ఉన్నాడు ఆ పురుషుణ్ణి ధైర్యంతో (బుద్ధిబలంతో) ముంజగడ్డినుండి దానిలో కలిసిపోయిన ఇషీక అనే గడ్డిని వలె, వేరు చెయ్యాలి. ఆ విధంగా వేరుచేయబడిన దానిని పరిశుద్ధము నిత్యమూ అయిన బ్రహ్మనుగా తెలుసుకోవాలి" (ముంజగడ్డి లోపల ఉన్న సన్నని ఈనెవంటిదానిని అని కొందరు అర్థం చెప్పారు) 25.

ప్రమితాధికరణం సమాప్తం

## 8-దేవతాధికరణమ్. సూ.26-33

## సూ. తదుపర్యపి బాదరాయణః సంభవాత్. 1.3.26

అఙ్గుష్ఠమాత్రశ్రుతిర్హృదయాపేక్షయా, మనుష్యాధికారత్వాచ్ఛాస్త్రస్యేత్యుక్తమ్. తత్ప్రసంగేనేదముచ్యతే. బాఢం మనుష్యానధికరోతి శాస్త్రమ్; న తు మనుష్యానేవేతీహ బ్రహ్మజ్ఞానే నియమోఽస్తి. తేషాముపరిష్టాద్యే దేవాదయః తానప్యధికరోతి శాస్త్రమితి బాదరాయణ ఆచార్యో మన్యతే. కస్మాత్? సంభవాత్. సంభవతి హి తేషామప్యర్థిత్వాద్యధికారకారణమ్? తత్రార్థిత్వం తావన్మోక్షవిషయం దేవాదీనామపి సంభవతి, వికారవిషయవిభూత్యనిత్యత్వాలోచనాదినిమిత్తమ్. తథా సామర్థ్యమపి తేషాం సంభవతి. మన్త్రేతిహాసపురాణలోకేభ్యః విగ్రహవత్త్వాద్యవగమాత్. న చ తేషాం కశ్చిత్ప్రతిషేధోఽస్తి. న చోపనయనాదిశాస్త్రేణైషామధికారో నివర్త్యేత, ఉపనయనస్య వేదాధ్యయనార్థత్వాత్; తేషాం చ స్వయంప్రతిభాతవేదత్వాత్.

బాలానందిని

తదితి: "బాదరాయణః= బాదరాయణుడు, తదుపర్యపి=మనుష్యులకంటె పైవాళ్లైన దేవతాదులకు కూడ బ్రహ్మవిద్యాధికారాన్ని అంగీకరిస్తున్నాడు.

సంభవాత్=బ్రహ్మవిద్యాధికారికి ఉండవలసిన లక్షణాలు వాళ్లలో కూడా ఉండడానికి అవకాశం ఉండడంవల్ల'' అవి సూత్రార్థం.

వి. మనుష్యులకు అధికారం ఉంది అనగానే దేవతాదులకు ఉందా లేదా అని వెంటనే శంక కలుగుతుంది. ఈ విధంగా ప్రసంగవశంచేత ఈ అధికరణంలోను రాబోవు అధికరణంలోను చర్చ చేయబడుతున్నది. అందుచేత వీటికి ప్రసంగసంగతి. (ప్రసంగం అనగా జ్ఞాపకం వచ్చిన దానిని ఉపేక్షింపకూడకపోవడం "స్మృతస్య ఉపేక్షానర్హత్వం ప్రసఙ్గః"). దేవతలకు అధికారం లేదు అని పూర్వపక్షానికి ఫలం దేవత్వాన్ని పొందడం ద్వారా క్రమముక్తికి సాధనమైన దహరోపాసనాదులలో మనుష్యుడు ప్రవర్తించకపోవడం. దేవత్వప్రాప్తికి ప్రయత్నించడం సిద్ధాంతానికి ఫలం.

అఙ్గుష్ఠేతి:- శాస్త్రం మనుష్యులనే ఉద్దేశించి చెప్పబడింది కాబట్టి, మనుష్య హృదయప్రమాణాన్ని అనుసరించి అంగుష్ఠమాత్రశ్రుతి వచ్చింది అని చెప్పబడింది. ఆ ప్రసంగంచేత ఇది చెప్పబడుచున్నది. నిజమే; శాస్త్రం మనుష్యులను ఉద్దేశించి చెప్పబడింది. అయితే - బ్రహ్మ జ్ఞానానికి సంబంధించినంతవరకు మనుష్యులను మాత్రమే ఉద్దేశించి చెప్పబడింది అనే నియమం లేదు. ఆ మనుష్యులకు పైన ఉన్న దేవతాదుల విషయంలో కూడ ఈ శాస్త్రం ప్రవర్తిస్తుంది అని బాదరాయణాచార్యుడు తలుస్తున్నాడు. ఎందువల్ల? కుదురుతుంది కాబట్టి. వాళ్లకి కూడ అర్థిత్వం మొదలైన అధికారకారణం (అధికారాన్ని కల్పించే హేతువు) సంభవిస్తుంది కదా? కార్యాలైన విషయాలు (భోగ్యవస్తువులు), ఐశ్వర్యం అనిత్యమైనవి అని ఆలోచన కలగడంవల్ల దేవతలకు కూడ మోక్షాన్ని గూర్చిన అర్థిత్వం (కోరిక) సంభవమే. మంత్ర-అర్థవాద-ఇతిహాస-పురాణ -లోకాదులవల్ల దేవతలకు కూడా దేహాదు లున్నా యని తెలుస్తూన్నది. అందుచేత వాళ్లకి సామర్థ్యం కూడ సంభవిస్తుంది. బ్రహ్మవిద్య సంపాదించకూడదు అనే నిషేధం ఏదీ వాళ్ళకి లేదు. ఉపనయనం చేసికోవాలి అనే శాస్త్రంచేత కూడ వీళ్ళ కున్న అధికారం తొలగించబడదు. ఉపనయనం వేదాధ్యయనంకోసం కదా? దేవతలు స్వయంప్రతిభాతవేదులు (స్వయంగా వేదాలు స్ఫురించినవాళ్లు).

## భాష్యమ్

అపి చైషాం విద్యాగ్రహణార్థం బ్రహ్మచర్యాది దర్శయతి- "ఏకశతం హ వై వర్షాణి మఘవాన్ ప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస" (ఛాం.ఉ.8.11.3), "భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార అధీహి భగవో బ్రహ్మ"

(తై.ఉ.3.1) ఇత్యాది. యదపి కర్మస్వనధికారకారణముక్తమ్- "న దేవానాం దేవతాన్తరాభావాత్" "న ఋషీణామార్షేయాన్తరాభావాత్" (జై.సూ.6.1.6,7) ఇతి, న తద్విద్యాస్వస్తి; న హీన్ద్రాదీనాం విద్యాస్వధిక్రియమాణానామిన్ద్రాద్యుద్దేశేన కించిత్కృత్యమస్తి, న చ భృగ్వాదీనాం భృగ్వాదిసగోత్రతయా. తస్మాద్దేవాదీనామపి విద్యాస్వధికారః కేన వార్యతే? దేవతాధికారేఽప్యఙ్గుష్ఠమాత్రశ్రుతిః స్వాఙ్గుష్ఠాపేక్షయా న విరుధ్యతే. 26.

బాలానందిని

అపిచేతి:- మరొక విషయ మేమనగా "ఏకశతం... ఉవాస" (దేవేంద్రుడు నూటొక్క సంవత్సరాలు ప్రజాపతివద్ద బ్రహ్మచర్యవతం అవలంబించి ఉన్నాడు), "భృగు... బ్రహ్మ" (వరుణుని కుమారుడైన భృగువు పూజ్యుడా నాకు బ్రహ్మను ఉపదేశించుము అని అంటూ తండ్రియైన వరుణుని దగ్గరికి వెళ్లాడు) ఇత్యాది వాక్యాలు దేవతలు కూడ విద్యాగ్రహణం కోసం బ్రహ్మచర్యాదులు అవలంబించినట్లు చూపుతున్నాయి. "దేవతలు యజ్ఞాలు చేసి సంతోషపెట్టవలసిన ఇతర దేవతలు ఎవరూ లేరు గాన వాళ్లకు కర్మాధికారణం లేదు" "ఋషులకు ఇతరఋషులు ఎవరూ లేరు గాన వాళ్లకి కర్మాధికారం లేదు" అని పూర్వమీమాంసాశాస్త్రంలో చెప్పిన, దేవాదులకు అధికారం లేదనడానికి తగిన కారణాలు విద్యల విషయంలో లేవు. విద్యలలో అధికృతులైన ఇంద్రాదులు, ఇంద్రాదులను గూర్చి చేయవలసిన పని ఏదీ లేదు కదా, అట్లే భృగ్వాదులైన ఋషులకు భృగ్వాదిఋషులతో సగోత్రులవడంవల్ల చేయవలసినది ఏదీలేదు. అందువల్ల దేవాదులకు ఉన్న విద్యాధికారాన్ని ఎవరు కాదనగలరు? దేవాదులకు అధికారం ఉన్నాకూడ అంగుష్ఠమాత్రశ్రుతి వాళ్ల అంగుష్ఠాన్ని పట్టి విరుద్ధం కాదు. 26.

### సూ. విరోధః కర్మణీతి చెన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్. 1.3.27

స్యాదేతత్- యది విగ్రహవత్త్వాద్యభ్యుపగమేన దేవాదీనాం విద్యాస్వధికారో వర్ణ్యేత విగ్రహవత్త్వాదృత్విగాదివదిన్ద్రాదీనామపి స్వరూపసంనిధానేన కర్మాఙ్గభావోఽభ్యుపగమ్యేత. తదా చ విరోధః కర్మణి స్యాత్, న హీన్ద్రాదీనాం స్వరూపసన్నిధానేన యాగేఽఙ్గభావో దృశ్యతే, న చ సంభవతి. బహుషు యాగేషు యుగపదిన్ద్రస్య స్వరూపసంనిధానానుపపత్తేరితి చేత్, నాయమస్తి విరోధః; కస్మాత్? అనేకప్రతిపత్తేః. ఏకస్యాపి దేవతాత్మనో యుగపదనేక

స్వరూపప్రతిపత్తిః సంభవతి. కథమేతదవగమ్యతే? దర్శనాత్. తథాహి- "కతి దేవతాః" ఇత్యుపక్రమ్య త్రయశ్చ త్రీ చ శతా త్రయశ్చ త్రీ చ సహస్రాః" ఇతి నిరుచ్య "కతమే తే" ఇతి పృచ్ఛాయాం "మహిమాన ఏవైషామేతే త్రయస్త్రింశత్త్వేవ దేవాః" (బృ.ఉ.3.9.1.2) ఇతి నిర్బ్రువతీ శ్రుతిః ఏకస్యైవ దేవతాత్మనో యుగపదనేకరూపతాం దర్శయతి. తథా త్రయస్త్రింశతోఽపి షడాద్యన్తర్భావక్రమేణ "కతమ ఏకో దేవః" ఇతి "ప్రాణ" ఇతి, ప్రాణైకరూపతాం దేవానాం దర్శయన్తీ తస్యైవైకస్య ప్రాణస్య యుగపదనేకరూపతాం దర్శయతి. తథా స్మృతిరపి-.

> "ఆత్మనో వై శరీరాణి బహూని భరతర్షభ,
> యోగీ కుర్యాద్బలం ప్రాప్య తైశ్చ సర్వైర్మహీం చరేత్.
> ప్రాప్నుయాద్విషయాన్ కైశ్చిత్కైశ్చిదుగ్రం తపశ్చరేత్,
> సంక్షిపేచ్చ పునస్తాని సూర్యోరశ్మిగణానివ"

ఇత్యేవంజాతీయకా ప్రాప్తాణిమాద్యైశ్వర్యాణాం యోగినామపి యుగపదనేక శరీరయోగం దర్శయతి. కిము వక్తవ్యమాజానసిద్ధానాం దేవానామ్? అనేకరూపప్రతిపత్తిసంభవాచ్చైకైకా దేవతా బహుభీ రూపైరాత్మానం ప్రవిభజ్య బహుషు యాగేషు యుగపదఙ్గభావం గచ్ఛతి; పరైశ్చ న దృశ్యతేఽన్తర్ధాన క్రియాయోగాదిత్యుపపద్యతే.

బాలానందిని

విరోధ ఇతి:- "కర్మణి=కర్మయందు, విరోధః ఇతి చేత్= విరోధం కలుగుతుంది కదా అన్నట్లయితే, న=అట్టు కాదు; అనేకప్రతిపత్తేః=అనేకరూపాల గ్రహణంయొక్క, దర్శనాత్= కనబడడం వల్ల" అని సూత్రార్థం.

అవ. పూర్వమీమాంసకులలో ప్రాచీనుల అభిప్రాయం ప్రకారం వేదంలో చెప్పిన ఇంద్ర-వరుణ-మరుదాదిదేవతలకు దేహాలు లేవు. ఆ యా దేవతలను వర్ణించే మంత్రాలే దేవతలు. అలా చెప్పడానికి వాళ్లు కొన్ని యుక్తులు చెప్పి ఉన్నారు. వాటిలో కొన్నింటిని పేర్కొని నిరాకర్తిస్తున్నారు-

స్యాదేతదితి:- ఈ విషయం (దేవతలకు అధికారం ఉందా లేదా అనే విషయం) అలా ఉంచండి. దేవాదులకు శరీరాదులు ఉంటా యని అంగీకరించి

వాళ్లకు కూడ విద్యలయందు అధికారం ఉందని చెపితే, దేహాదు లుండడంచేత, ఇంద్రాదులు కూడ, ఋత్విక్కుల వలె, స్వరూపంతో సంనిధానంచేత (వచ్చి ఉండడంచేత) కర్మలో అంగం అవుతారని చెప్పవలసి వస్తుంది. (అనగా ఇంద్రాదులకు ఆహుతులు సమర్పించినప్పుడు వాళ్లు స్వయంగానే వచ్చి, ఋత్విక్కులు మొదలైన వాళ్లు ఉన్నట్లుగా ఆహుతులు స్వీకరించడం ద్వారా యజ్ఞాదికర్మలకు అంగం కావలసి వస్తుంది అని భావం). అప్పుడు కర్మయందు విరోధం ఏర్పడుతుంది. ఇంద్రాదులు స్వయంగా వచ్చి యాగాలకు అంగంగా ఉండడం కనబడడం లేదు కదా? అలా రావడం కుదరదు కూడ. అనేకయాగాలు జరుగుచున్నప్పుడు ఇంద్రుడు ఒకే సమయంలో స్వయంగా ప్రదేశా లన్నింటికీ వెళ్లజాలడు కదా అని అన్నట్లయితే- ఈ విరోధం లేదు. ఎందువల్ల అనేకప్రతిపత్తివల్ల. ఒకే దేవత కూడ ఒకే సమయంలో అనేకరూపాలు గ్రహించడం కుదురుతుంది. ఇది ఎలా తెలుస్తున్నది? (శ్రుతిలో) కనబడడం వల్ల. అదెట్లనగా- 'కతి దేవాః" (దేవతలు ఎంతమంది) అని ఉపక్రమించి "త్రయశ్చ... సహస్రా" అని చెప్పి 'కతమే తే" (వాళ్లు ఎవరు?) అని అడగగా "మహిమాన... దేవాః" ఇవన్నీ మహిమలే (మహిమ చేత గ్రహించిన విభిన్న రూపాలే, అసలు దేవతలు ముప్పైముగ్గురే) అని విశదీకరిస్తూన్న శ్రుతి ఒక్కొక్క దేవతకు ఒకే సమయంలో అనేకరూపాలు ఉంటా యని సూచిస్తూన్నది. అట్లే ముప్పైముగ్గురు దేవతలు ఆరు మొదలైన సంఖ్యలుగల దేవతలలో అంతర్గతులౌతారు అని ఒక క్రమంలో చెప్పి "కతమ ఏకో దేవః" (ఆ ఒక్క దేవత ఎవరు?) అని, "ప్రాణః" అనీ, దేవతలందరూ ఒక్క ప్రాణం రూపాలే అని చెపుతూ ఆ ఒక్క ప్రాణమే ఒకే సమయంలో అనేక రూపాలలో ఉన్నది అని చెపుతున్నది.

వి. వైశ్వదేవశస్త్రంలో ప్రతిపాదించబడే దేవతలు ఎంతమంది అని శాకల్యుడు యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నించాడు. మూడు వేల మూడు వందల ఆరుగురు అని అతడు సమాధానం చెప్పాడు. తరవాత శాకల్యుడు మళ్ళీ మళ్లీ ప్రశ్నించగా ముప్పై ముగ్గురు దేవతలు, ఆరుగురు, ముగ్గురు, ఇద్దరు, ఒకరు అని యాజ్ఞవల్క్యుడు సమాధానం చెప్పాడు. ఈ సంఖ్య గల ఆ దేవతలు ఎవరు అనీ శాకల్యుడు ప్రశ్నించగా వెనుక చెప్పిన మూడు వేల మూడు వందల ఆరుగురు కూడ ముప్పై ముగ్గురు దేవతల మహిమలే; మహిమవల్ల ఏర్పడిన వ్యూహాలే, రూపాలే అని సమాధానం చెప్పాడు. ఆ ముప్పై ముగ్గురు ఎవరు అని ప్రశ్నించగా ఎనమండుగురు వసువులు, పదకొండుగురు రుద్రులు, పన్నెండుగురు ఆదిత్యులు, అశని (పిడుగు), పశువులు, (ఇంద్రుడు, ప్రజాపతీ అని కొందరు) మొత్తం ముప్పై మూడు అని సమాధానం చెప్పాడు. అగ్ని-పృథివీ-వాయు-అంతరిక్ష-ఆదిత్య-చంద్ర-నక్షత్రాలు ఎనమండుగురు వసువులు.

పదకొండు ఇంద్రియాలు పదకొండు గురు రుద్రులు. పన్నెండు మాసాలు పన్నెండు ఆదిత్యులు. ఈ ముప్పైమూడు దేవతలు కూడా అగ్ని-పృథివీ-వాయు-అంతరిక్ష-ఆదిత్య-ద్యులోకాలలో అంతర్గతం అవుతాయనీ, ఈ ఆరు మూడు లోకాలలో అంతర్గతా లౌతాయనీ, ఆ మూడు రెండు అన్నప్రాణాలలో అంతర్గతాలౌతాయనీ, ఆ రెండూ వాయువులో అంతర్గతం అవుతా యనీ చెప్పాడు. వాయువే ప్రాణం. ఈ విధంగా ముప్పైముగ్గురు దేవతలే మూడువేల మూడువందల ఆరుగురుగా అయ్యా రని చెప్పడంచేత దేవతలకు ఇచ్ఛానుసారం అనేక రూపాలు ధరించే సామర్థ్యం ఉందని తెలుస్తూన్న దని భావం.

తథేతి:- అట్లే "ఆత్మనో... రశ్మిగణానివ" ఇత్యాదిజాతికి చెందిన (ఈ రకమైన) స్మృతి కూడ అణిమాద్యైశ్వర్యాలు సంపాదించిన యోగులు కూడ ఒకే సమయంలో అనేకమైన శరీరాలను ధరించడాన్ని చెపుతూన్నది. "ఓ భరతవంశ శ్రేష్ఠుడా! యోగి బలం సంపాదించుకొని తనకు అనేకమైన శరీరాలను ఏర్పరచుకొనవచ్చును. వాటి అన్నింటితోను భూమండలంమీద సంచరించవచ్చును. కొన్ని దేహాలతో విషయభోగాలను అనుభవించవచ్చును. కొన్నింటితో ఉగ్రమైన తపస్సు చేయవచ్చును. తరవాత వాటి నన్నింటినీ, సూర్యుడు తన కిరణాలను ఉపసంహరించుకొన్నట్లు ఉపసంహరించుకొనవచ్చును" అని ఈ శ్లోకాల అర్థం. కిమ్వితి:- యోగులే ఇట్లు చేయగలిగినప్పుడు ఆజానసిద్ధులైన (పుట్టుకనుండీ సిద్ధులైన) దేవతల మాట చెప్పాలా? ఈ విధంగా ఒకొక్క దేవత అనేక రూపాలచేత తనను విభజించుకొని ఒకే పర్యాయం అనేకయాగాలలో అంగత్వం పొందుతుంది; అంతర్ధానశక్తి ఉండడంవల్ల ఇతరులెవ్వరూ ఆ దేవతను చూడజాలరు అని చెప్పడం యుక్తమే.

## భాష్యమ్

అనేకప్రతిపత్తేర్దర్శనాదిత్యస్యాపరా వ్యాఖ్యా- విగ్రహవతామపి కర్మాఙ్గభావచోదనాసు అనేకా ప్రతిపత్తిః దృశ్యతే. క్వచిదేకోఽపి విగ్రహవాననేకత్ర యుగపదఙ్గభావం న గచ్ఛతి. యథా బహుభిర్భోజయద్భిర్నైకో బ్రాహ్మణో యుగపద్భోజ్యతే. క్వచిచ్చైకోపి విగ్రహవాననేకత్ర యుగపదఙ్గభావం గచ్ఛతి, యథా బహుభిర్నమస్కుర్వాణైరేకో బ్రాహ్మణో యుగపన్నమస్క్రియతే- తద్వదిహోద్దేశ పరిత్యాగాత్మ కత్వాద్యాగస్య విగ్రహవతీమప్యేకాం దేవతాముద్దిశ్య బహవః స్వం స్వం ద్రవ్యం పరిత్యక్ష్యన్తీతి విగ్రహవత్త్వేఽపి దేవానాం న కించిత్కర్మణి విరుధ్యతే. 27.

### బాలానందిని

అనేకేతి: "అనేకప్రతిపత్తేర్దర్శనాత్" అనేదానికి మరొక వ్యాఖ్య- విగ్రహవంతులను కర్మాంగాలుగా విధించినప్పుడు కూడ అనేక విధాలైన ఉపయోగం కనబడుతున్నది. కొన్ని విషయాలలో విగ్రహం గలవాడైనా ఒక్కడు అనేక స్థలాలలో ఒకే పర్యాయం అంగత్వం పొందజాలడు. ఉదాహరణకి చాలామంది భోజనం పెట్టేవాళ్లు ఒక్క బ్రాహ్మణుణ్ణి ఒకే సమయంలో తినిపించజాలరు. కొన్ని విషయాలలో శరీరం గలవాడు ఒక్కడే అయినా ఒకే పర్యాయం అనేకమైన పనులలో అంగత్వాన్ని పొందుతాడు. ఉదాహరణకి- ఒక బ్రాహ్మణునికి నమస్కరించే చాలామంది ఒకే సమయంలో నమస్కరించవచ్చు. అట్లే ఇక్కడ, యాగం అనేది దేవతను ఉద్దేశించి ఏదో ద్రవ్యాన్ని సమర్పించడం అనే స్వరూపం గలది గాన (యాగం దేవతకు ద్రవ్యం సమర్పించడమే గాన) ఒక దేవతకు విగ్రహం ఉన్నా కూడ ఆ దేవత నుద్దేశించి చాలామంది, ఒకే సమయంలో తమ తమ ద్రవ్యాలను విడవవచ్చును. (సమర్పించవచ్చును). అందుచేత దేవతలకు శరీరం ఉన్నాకూడ కర్మలలో విరోధం ఏదీ రాదు. 27.

### సూ. శబ్ద ఇతి చేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్. 1.3.28

మా నామ విగ్రహవత్త్వే దేవాదీనామభ్యుపగమ్యమానే కర్మణి కశ్చిద్విరోధః ప్రసఞ్జి, శబ్దే తు విరోధః ప్రసజ్యేత. కథమ్? ఔత్పత్తికం హి శబ్దస్యార్థేన సంబన్ధమాశ్రిత్య "అనపేక్షత్వాత్" ఇతి వేదస్య ప్రామాణ్యం స్థాపితమ్. ఇదానీం తు విగ్రహవతీ దేవతాభ్యుపగమ్యమానా యద్యప్యైశ్వర్య యోగాద్యుగపదనేక కర్మసంబన్ధీని హవీంషి భుఞ్జీత తథాపి విగ్రహయోగా దస్మదాదివజ్జననమరణవతీ సేతి నిత్యస్య శబ్దస్య నిత్యేనార్థేన నిత్యే సంబన్ధే ప్రతీయమానే యద్వైదికే శబ్దే ప్రామాణ్యం స్థితం తస్య విరోధః స్యాదితి చేత్; నాయమప్యస్తి విరోధః. కస్మాత్? అతః ప్రభవాత్. అత ఏవ హి వైదికాచ్ఛబ్దాత్ దేవాదికం జగత్ప్రభవతి.

### బాలానందిని

శబ్ద ఇతి:- "శబ్దే = వైదికశబ్దం విషయంలో విరోధం వస్తుంది, ఇతి చేత్= అన్నట్లయితే, న=కాదు. ప్రత్యక్షానుమానాభ్యామ్=శ్రుతిస్మృతుల ననుసరించి, అతః=ఈవేదంవల్లనే, ప్రభవాత్=జగత్తు పుట్టడంవలన" అని సూత్రార్థం.

మా నామేతి:- దేవతలకు దేహం ఉన్న దని అంగీకరించినా కర్మల విషయంలో విరోధం ఏదీ ప్రసక్తం కాకపోతే కాకపోవచ్చును. శబ్దం విషయంలో నైతే

విరోధం ప్రసక్తం అవుతుంది. ఎట్లు? (పూర్వమీమాంసాశాస్త్రంలో) శబ్దానికి అర్థంతో ఔత్పత్తికమైన (నిత్యమైన) సంబంధాన్ని అంగీకరించి ఇతరప్రమాణాల అపేక్ష లేదు గాన (అనపేక్షత్వాత్) వేదానికి ప్రామాణ్యం స్థాపించబడింది. అయితే - ఇప్పుడు దేహం కలదిగా అంగీకరించబడుచున్న దేవత ఐశ్వర్యం (సామర్థ్యం) ఉండడంవల్ల ఒకే సమయంలో అనేక కర్మలకు సంబంధించిన హవిస్సులను తింటే తినవచ్చు. అయినా కూడ దానికి శరీరం ఉడడంవల్ల మనకు వలె దానికి కూడ జననమరణాలు ఉంటాయి గాన నిత్యమైన శబ్దానికి నిత్యమైన అర్థంతో నిత్యమైన సంబంధం అని తెలియబడు తున్నది గాన వైదికశబ్దానికి ఏ ప్రామాణ్యం నిర్ణయించబడిందో దానికి విరోధం వస్తుంది అని అంటే ఈ విరోధం లేదు. ఎందువలన? అతః ప్రభవాత్ - ఈ వైదికశబ్దంనుండియే దేవాదికమైన జగత్తు పుట్టుచున్నది.

వి. పూర్వమీమాంసకుల సిద్ధాంతం ప్రకారం (వేదాంతుల ప్రకారం కూడ) వేదం అనాది యైనది. నిత్యమైనది. ఏదో ఒక కాలంలో ఎవరో రచించినది కాదు. అందుచేత దీని ప్రామాణ్యం ఇతర మైన ప్రత్యక్షాదిప్రమాణాలమీద ఆధారపడినది కాదు. ఈ విషయాన్ని సమర్థిస్తూ కొన్ని యుక్తులు చెప్పబడ్డాయి. వారి సిద్ధాంతం ప్రకారం శబ్దం అర్థమూ కూడ నిత్యమైనవి. అందుచేత శబ్దార్థాల సంబంధం కూడ నిత్యమే. అందుచేత వేదం నిత్యం. ఇప్పుడు దేవతలకు శరీరం ఉన్న దని అంగీకరించే పక్షంలో ఆ దేవతలకు కూడ ఇతరమానవాదులకు వలె పుట్టుక, చావు ఉంటా యని చెప్పాలి. ఆ యా దేవతలను గూర్చి వేదమే చెపుతున్నది. దేవతలకు కూడ జననమరణా లున్నాయనే పక్షంలో ఒక పిల్లవాడు పుట్టినప్పుడు వానికి ఏదో పేరు క్రొత్తగా పెట్టి నట్లు ఆ దేవత పుట్టినప్పుడు ఆ దేవతకు ఆ పేరుపెట్టడం జరిగిందని చెప్పాలి. అయితే ఆ పేరు అంతకు పూర్వం లేదన్నమాట. అప్పుడు ఈ శబ్దమూ క్రొత్తగా పుట్టినదే అర్థమూ క్రొత్తగా పుట్టినదే గాన నిత్యమైన శబ్దానికి నిత్యమైన అర్థంతో నిత్యమైన సంబంధం అని అంగీకరించి వేదానికి చెప్పిన నిత్యత్వ - అన్యప్రమాణ నిరపేక్ష ప్రమాణ్యాలు కుదరవు కదా అని ఆశంకకు అభిప్రాయం. దానికి సమాధానం "అతః ప్రభవాత్" అనేది. దీని భావం భాష్యంలోనే స్పష్టం చేయబడుతుంది.

## భాష్యమ్

నను "జన్మాద్యస్య యతః" (బ్ర.సూ.1.1.2.) ఇత్యత్ర బ్రహ్మప్రభవత్వం జగతోఽవధారితమ్, కథమిహ శబ్దప్రభవత్వముచ్యతే? అపి చ యది నామ వైదికాచ్ఛబ్దాదస్య ప్రభవోఽభ్యుపగతః కథమేతావతా విరోధః శబ్దే పరిహృతః?

యావతా వసవో,రుద్రా,ఆదిత్యా, విశ్వేదేవాః, మరుత ఇత్యేతేఽర్థాః అనిత్యా ఏవోత్పత్తిమత్త్వాత్. తదనిత్యత్వే చ తద్వాచినాం వైదికానాం వస్వాదిశబ్దానామనిత్యత్వం కేన నివార్యతే? ప్రసిద్ధం హి లోకే దేవదత్తస్య పుత్ర ఉత్పన్నే యజ్ఞదత్త ఇతి తస్య నామ క్రియతే ఇతి. తస్మాద్విరోధ ఏవ శబ్ద ఇతి చేత్;న. గవాదిశబ్దార్థనిత్యత్వదర్శనాత్. న హి గవాదివ్యక్తీనాముత్పత్తిమత్త్వే తదాకృతీనామప్యుత్పత్తిమత్త్వం స్యాత్. ద్రవ్యగుణకర్మణాం హి వ్యక్తయ ఏవోత్పద్యన్తే నాకృతయః. ఆకృతిభిశ్చ శబ్దానాం సంబన్ధో న వ్యక్తిభిః. వ్యక్తీనామానన్త్యాత్సమ్బన్ధగ్రహణానుపపత్తేః. వ్యక్తిషూత్పద్యమానాస్వపి ఆకృతీనాం నిత్యత్వాన్న గవాదిశబ్దేషు కశ్చిద్విరోధః దృశ్యతే. తథా దేవాదివ్యక్తిప్రభవాభ్యుపగమేఽప్యాకృతినిత్యత్వాన్న కశ్చిద్వస్వాదిశబ్దేషు విరోధ ఇతి ద్రష్టవ్యమ్.

### బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) ''జన్మాద్యస్య యతః' అనే సూత్రంలో జగత్తుకు బ్రహ్మ కారణం అని నిర్ధారణ చేయబడింది కదా? ఇప్పు డిక్కడ జగత్తు శబ్దంనుడి పుట్టిన దని ఎట్లు చెప్పబడుచున్నది? ఈ జగత్తు వైదికశబ్దంనుండి పుట్టిన దని అంగీకరించినా కూడ ఇంతమాత్రంచేత శబ్దం విషయంలో విరోధం ఎలా పరిహరింపబడింది? ఎందచేత ననగా - వస్తువులు, రుద్రులు, ఆదిత్యులు విశ్వేదేవతలు, మరుత్తులు అనే ఈ అర్థాలన్నీ పుట్టుక గలవి కాబట్టి అనిత్యాలే. ఆ అర్థాలు అనిత్యా లైనప్పుడు ఆ అర్థాలను బోధించే శబ్దాల అనిత్యత్వాన్ని ఎవరు నివారించగలరు? దేవదత్తునికి పుత్రుడు పుట్టినప్పుడు వానికి యజ్ఞదత్తు డని పేరుపెట్టబడుతుంది అనే మాట లోకంలో ప్రసిద్ధమే కదా? అందువల్ల శబ్దం విషయంలో విరోధమే అన్నట్లయితే (సమాధానం) - ఇది లేదు. ''గో'' మొదలైన శబ్దాలు వాటి అర్థాలు నిత్యములై ఉండడం చూస్తున్నాం కదా? గోవులు మొదలైన వ్యక్తులకు పుట్టుక ఉన్నాకూడ వాటి ఆకృతులకు (జాతులకు) ఉత్పత్తి లేదు కదా? ద్రవ్యగుణకర్మల వ్యక్తులే పుడతాయి గాని జాతులు పుట్టవు కదా. శబ్దాలకు సంబంధం జాతులతోనే కాని వ్యక్తులతో కాదు. వ్యక్తులు అనంతములు గాన శబ్దాలకు వాటితో సంబంధం గ్రహించడం కుదరదు. వ్యక్తులు పుట్టుచున్నా కూడ ఆకృతులు నిత్యములు గాన గవాది (గోమొదలైన) శబ్దాల విషయంలో విరోధం ఏదీ కనబడడం లేదు. అట్లే దేవాదివ్యక్తులకు పుట్టుకను అంగీకరించినా కూడ ఆకృతి నిత్యమే గాన వాస్వాదిశబ్దాలలో విరోధం ఏదీ లేదని గ్రహించాలి.

వి.గౌః= గోవు; ఘటః= కుండ; మనుష్యః=మనుష్యుడు - ఈ విధంగా గౌః మొదలైనపదాలు గోవు మొదలైన అర్థాలను బోధిస్తున్నాయి, అనగా వాటికి ఆ అర్థాలను బోధించే శక్తి ఉంది. ఏ పదానికి ఏ అర్థం బోధించే శక్తి ఉందో తెలుసు కొనడానికి వ్యాకరణం మొదలైనవి సహాయపడతాయి -

"శక్తిగ్రహం వ్యాకరణోపమానకోశాప్తవాక్యాద్వ్యవహారతశ్చ,
వాక్యస్య శేషాద్వివృతేర్వదన్తి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః".

''వ్యాకరణం, ఉపమానం, నిఘంటువు, ఆప్తుల మాట, వ్యవహారం, వాక్యశేషం, వివరణం, ప్రక్కనున్న పదంయొక్క అర్థం ప్రసిద్ధమై ఉండడం- వీటివల్ల శక్తిగ్రహణం కలుగుతుం దని పెద్దలు అంటారు'' వీటిలో ప్రధాన మైనది వ్యవహారం. ఒక బాలుడు చూస్తుండగా ఒక వృద్ధుడు మధ్యమవృద్ధునితో "గామానయ" అన్నాడు. అతడు గోవును తీసికొనివచ్చాడు "గాం నయ" అన్నాడు గోవును తీసికొనిపోయాడు. "గాం బధాన" అన్నాడు గోవును కట్టివేశాడు. ఇదంతా చూస్తున్న బాలునికి 'గో' అంటే ఎద్దు (లేదా ఆవు) అని అర్థం అవుతుంది. ఈ విధంగా వ్యవహారంవల్ల అధికంగా శబ్దాల అర్థాలు తెలుస్తాయి. ఆ పదానికి ఆ అర్థంలో శక్తి అని తెలుస్తేనే అర్థం తెలుస్తుంది. ఒక వస్తువును 'వ్యక్తి' అంటారు. అది చేతనం కావచ్చు. అచేతనం కావచ్చు ఒక గోవు ఒక కుండ ఒక మనిషి- ఇవి వ్యక్తులు. గోత్వం ఘటత్వం, మనుష్యత్వం మొదలైనవి జాతులు. గోత్వజాతి అన్నిగోవులలోను ఉంటుంది. ఇట్లే మిగిలినవి కూడ. జాతికి సామాన్యం అని కూడ పేరు. "నిత్యమ్ ఏకమనేకానుగతం సామాన్యమ్" అని దాని లక్షణం. సామాన్యం అనేది నిత్యం. ఒక్కటే. అనేకమైన వ్యక్తులతో సంబంధించి ఉంటుంది. గోత్వం నిత్యం. ఒక గోవ్యక్తి మరణించినా ఈ గోత్వం మిగిలిన అన్ని గోవులలోను ఉంది. ఇట్లే అన్నింటి విషయంలోను. అయితే శబ్దానికి వ్యక్తియందు శక్తియా లేక జాతియందా అని ప్రశ్న. పైన చూపిన వ్యవహారాన్ని పట్టి చూస్తే ఆ పిల్లవాడు ఆ గోవునే గోశబ్దార్థంగా గ్రహించాడు కాబట్టి వ్యక్తియందే శక్తి అని చెప్పాలి. కాని అలా చెపితే ప్రతీ గోవు విషయంలోను అతడు క్రొత్తగా శక్తిని గ్రహించవలసి ఉంటుంది. గడచిపోయినవి రాబోయేవి దూరంగా ఉన్నవి అయిన ప్రతీవ్యక్తినీ చూడడం అనేది అసంభావ్యం. మరునాడే ఆ పిల్లవాడు మరొక గోవును చూడగానే 'గోవు' అని గుర్తిస్తున్నాడు. గౌశబ్దానికి వ్యక్తియందే శక్తి అయితే నిన్నటి గోవునే అతడు గోవుగా గుర్తించాలి కాని దీనిని గోవుగా గుర్తించకూడదు. అందుచేత శబ్దానికి జాతియందే శక్తి అని మీమాంసకు లంటారు. గౌః అనగా గోత్వం అని అర్థం. అయితే గోత్వజాతికి తీసికొనిరావడం, తీసికొనివెళ్లడం, బంధించడం మొదలైన

క్రియలలో అన్వయం కుదరదు అందుచేత "గామ్" అనగా గోత్వమును అనియే అర్థమైనా దీనికి క్రియలతో అన్వయం కుదరదు గాన గోవ్యక్తిని అని అర్థం చెప్పుకోవాలి. ఈ విధంగా వ్యక్తిరూపార్థం ఆక్షేపలభ్యం, అనగా ఆక్షేపంచేత లభించేది. (ఆక్షేపం అనగా ఒకటి కుదరకపోతే కుదిరే మరొకదానిని ఊహించి గ్రహించడం.) అయితే నైయాయికులు పైన చెప్పిన అన్ని వ్యక్తుల విషయంలోను వేరు వేరుగా శక్తిగ్రహణం అనేది శక్యం కాదు అనే దానిని అధిగమించడానికి శబ్దానికి జాతివిశిష్ట. (జాతితోకూడిన) వ్యక్తియందు శక్తి అని అంగీకరించారు. ఇక్కడ ఆకృతి అనగా జాతి.

అయితే ఇక్కడ కేవలవ్యక్తిశక్తి నిషేధించబడింది గాని జాతివిశిష్టవ్యక్తియందు శక్తి నిషేధించబడలేదు. అందుచేత శంకరభగవత్పాదుల అభిప్రాయం ప్రకారం జాతి విశిష్టవ్యక్తియందు శబ్దానికి శక్తి అని రత్నప్రభాకారుడు, బ్రహ్మవిద్యాభరణకారుడు సూచించారు.

## భాష్యమ్

ఆకృతివిశేషస్తు దేవాదీనాం మన్త్రార్థవాదాదిభ్యః విగ్రహవత్త్వాద్య వగమాదవగన్తవ్యః. స్థానవిశేషసంబన్ధనిమిత్తాశ్చేన్ద్రాదిశబ్దాః సేనా పత్యాదిశబ్దవత్. తతశ్చ యో యస్తత్ స్థానమధిరోహతి స స ఇన్ద్రాది శబ్దైరభిధీయత ఇతి న దోషో భవతి. న చేదం శబ్దప్రభవత్వం బ్రహ్మవదుపాదానకారణాభిప్రాయేణోచ్యతే. కథం తర్హి? స్థితే వాచకాత్మనా నిత్యే శబ్దే నిత్యార్థసమ్బన్ధిని శబ్దవ్యవహారయోగ్యార్థవ్యక్తినిష్పత్తిః 'అతః ప్రభవః' ఇత్యుచ్యతే. కథం పునరవగమ్యతే శబ్దాత్ప్రభవతి జగదితి? ప్రత్యక్షానుమానాభ్యామ్. ప్రత్యక్షం శ్రుతిః; ప్రామాణ్యం ప్రత్యనపేక్షత్వాత్. అనుమానం స్మృతిః; ప్రామాణ్యం ప్రతి సాపేక్షత్వాత్. తే హి శబ్దపూర్వాం సృష్టిం దర్శయతః. "ఏతే ఇతి వై ప్రజాపతిర్దేవానసృజతాసృగ్రమితి మనుష్యానిన్దవ ఇతి పితౄంస్తిరఃపవిత్రమితి గ్రహానాశవ ఇతి స్తోత్రం విశ్వానీతి శస్త్రమభిసౌభగేత్యన్యాః ప్రజాః". ఇతి శ్రుతిః. తథాన్యత్రాపి - "స మనసా వాచం మిథునం సమభవత్" (బృ.ఉ.1.2.4)ఇత్యాదినా తత్ర తత్ర శబ్దపూర్వికా సృష్టిః శ్రావ్యతే.

## బాలానందిని

ఆకృతీతి:- దేవతలు మొదలైనవాళ్లకు దేహాదులు మొదలైనవి ఉన్నా యని మంత్రాలవల్ల అర్థవాదలవల్ల తెలుస్తున్నది గాన దానినిబట్టి వాళ్ల జాతికి సంబంధించిన విశేషం (వ్యక్తిత్వం) గ్రహించాలి. 'ఇంద్రుడు' మొదలైన శబ్దాలు సేనాపతి మొదలైన శబ్దాల వలె ఆ యా స్థానాలతో (పదవులతో) సంబంధాన్ని పట్టి ఏర్పడినవి. అందువల్ల ఆ స్థానాన్ని ఎవ రెవరు అధిష్ఠిస్తారో వాళ్లు ఇంద్రాదిశబ్దాలచేత పిలవబడతారు గాన దోషం లేదు. ఇక్కడ జగత్తు శబ్దంనుండి పుట్టిన దనగా ఉపాదానకారణమైన బ్రహ్మనుండి పుట్టి నట్లు పుట్టిందని అర్థం కాదు. శబ్దం జగత్తుకు ఉపాదాన కారణం అని అర్థం కాదు. మరెట్లు? నిత్య మైన అర్థసంబంధం గల నిత్యమైన శబ్దం ఉటూండగా, ఆ శబ్దంచేత వ్యవహరించడానికి తగిన అర్థమైన వ్యక్తి పుట్టడం అతః ప్రభవః (శబ్దంవల్ల పుట్టడం) అని చెప్పబడుచున్నది. జగత్తు శబ్దంవల్ల పుట్టుచున్న దని ఎలా తెలుస్తూన్నది? ప్రత్యక్ష అనుమానాలచేత. ప్రత్యక్షం అనగా శ్రుతి. ప్రమాణ్యం విషయంలో ఇతరాపేక్ష లేనిది గాన దీని కా పేరు. అనుమానం అనగా స్మృతి; ప్రామాణ్యం విషయంలో దీనికి శ్రుతియొక్క ఆపేక్ష ఉంటుంది గాన దీని కా పేరు. ఈ శ్రుతిస్మృతులు సృష్టి శబ్దపూర్వక మైనది అని చూపుతున్నాయి "ఏతే...ప్రజాః" అని శ్రుతి. ప్రజాపతి ఏతే అని, అనగా మనస్సులో దేవతలను గూర్చి వీళ్లు అని అనుకుంటూ దేవతలను సృజించాడు. "అసృగ్రమ్" రక్తప్రధాన మైన దేహంలో ఆనందిచేవాళ్లు" అంటూ మనుష్యుల్ని సృజించాడు. "ఇందవః" చంద్రలోకంలో నివసించేవాళ్లు. అనుకొంటూ పితృదేవతలను సృజించాడు. "తిరః పవిత్రమ్" పవిత్రమైన సోమాన్ని తమలో ఉంచుకొని కప్పినవి అని అంటూ గ్రహాలను (యజ్ఞీయ పాత్రవిశేషాలను) సృజించాడు. "ఆశవః" ఋక్కులను పొందేవి, అని అంటూ స్తోత్రాలను సృజించాడు "విశ్వాని" స్తోత్రాల తరవాత ప్రయోగం పొందేవి (ప్రయోగించబడేవి), అంటూ శస్త్రాలను సృజించాడు "అభిసౌభగ" అంతటా సౌభాగ్యం కలవి. అంటూ ఇతరప్రజలను (ఇక్కడ ప్రజ లనగా సృష్టింపబడినవి, పుట్టినవి అని అర్థం) సృజించాడు అని ఈ శ్రుతివాక్యానికి అర్థం. అట్లే మరొక చోట కూడ "స...సమభవత్" (అతడు మనస్సుతో వాక్కును మిథునంగా కలిపాడు (అనగా మనస్సుతో వేదవాక్కును స్మరించాడు అని అర్థం) ఇత్యాదివాక్యాలచేత అక్క డక్కడ సృష్టి శబ్దాపూర్వక మైనది అని వినిపింపబడుతున్నది.

## భాష్యమ్

స్మృతిరపి-

"అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా,

ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః." (మ.భా.శాం. ప.233.24) ఇతి.

ఉత్సర్గోఽప్యయం వాచః సంప్రదాయప్రవర్తనాత్మకో ద్రష్టవ్యః. అనాదినిధనాయాః అన్యాదృశస్యోత్సర్గస్య అసంభవాత్. తథా

"నామరూపే చ భూతానాం కర్మణాం చ ప్రవర్తనామ్,

వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః", (విష్ణు. 1.5.64) ఇతి.

"సర్వేషాం స తు నామాని కర్మాణి చ పృథక్ పృథక్

వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే", (మను.1.21) ఇతి చ.

అపి చ చికీర్షితమనుతిష్ఠంస్తస్య వాచకం శబ్దం పూర్వం స్మృత్వా పశ్చాత్తమర్థమనుతిష్ఠతీతి సర్వేసాం నః ప్రత్యక్షమేతత్. తథా ప్రజాపతేరపి స్రష్టుః సృష్టేః పూర్వం వైదికాః శబ్దా మనసి పాదుర్బభూవుః. పశ్చాత్తదనుగతానర్థాన్ససర్జేతి గమ్యతే. తథా చ శ్రుతిః - "స భూరితి వ్యాహరత్స భూమిమసృజత" (తై.బ్రా 2.2.42)ఇత్యేవమాదికా భూరాదిశబ్దేభ్య ఏవ మనసి ప్రాదుర్భూతేభ్యః భూరాదిలోకాన్ సృష్టాన్ దర్శయతి.

## బాలానందిని

స్మృతిరపీతి :- 'అనాది...ప్రవృత్తయః' (ఆది కాని నాశనము కాని లేనిదీ, నిత్యమూ, దివ్యమూ అయిన వేదస్వరూపమైన వాక్కు ముందుగా బ్రహ్మచేత ఆవిర్భవింప చేయబడినది. దీనివల్లనే ఈ జగద్వ్యవహారం అంతా నడుస్తూన్నది) అని స్మృతి కూడ చెప్పుచున్నది. ఈ వాక్కును విడవడం అనగా సంప్రదాయాన్ని (గురుశిష్యపరంపరను) ప్రవర్తింపచేయడమే అని గ్రహించాలి. అనాదినిధన యైన వాక్కుకు మరొక విధమైన విడవడం (సృజించడం) కుదరదు కదా? అట్లే "నామ...మహేశ్వరః" (ఆ మహేశ్వరుడు ప్రాణుల నామరూపాలను కర్మల ప్రవృత్తిని సృష్ట్యాదిలో వేదశబ్దాల ద్వారానే చేశాడు) అని, "సర్వేషాం... నిర్మమే" (ఆ పరమేశ్వరుడు సృష్టి ప్రారంభంలో అందరి పేర్లను వేరు వేరు కర్మలను వేరు వేరు కట్టుబాట్లను

వేదశబ్దాల సాహాయ్యంతోనే చేశాడు) అని కూడ స్మృతులు చెపుతున్నాయి. మరొక విషయమేమనగా - చేయదలచిన పని చేసేవాడు దాన్ని చెప్పే శబ్దాన్ని ముందుగా స్మరించి తరవాత ఆ పని చేస్తాడు అనేది మనందరికీ ప్రత్యక్షమే. అట్లే సృష్టికి పూర్వం సృష్టయైన ప్రజాపతికి కూడ వైదికశబ్దాలు మనస్సులో ఆవిర్భవించాయి; తరవాత అతడు వాటికి సంబంధించిన అర్థాలను (విషయాలను) సృష్టించాడు అని తెలుస్తూన్నది. అందుచేతనే "స...అసృజత" (అతడు భూః అన్నాడు; అలా అని భూమిని సృజించాడు) ఇత్యాదిశ్రుతులు మనస్సులో ఆవిర్భవించిన భూరాదిశబ్దాలవల్లనే భూరాదిలోకాలు సృజింపబడ్డా యని చూపుతున్నాయి.

## భాష్యమ్

కిమాత్మకం పునః శబ్దమభిప్రేత్యేదం శబ్దప్రభవత్వముచ్యతే? స్ఫోటమిత్యాహ. వర్ణపక్షే హి తేషాముత్పన్నప్రధ్వంసిత్వాన్నిత్యేభ్యః శబ్దేభ్యో దేవాదివ్యక్తీనాం ప్రభవ ఇత్యనుపపన్నం స్యాత్. ఉత్పన్న ప్రధ్వంసినశ్చ వర్ణాః ప్రత్యుచ్చారణమన్యథా చాన్యథా చ ప్రతీయమానత్వాత్. తథాహి - అదృశ్యమానోఽపి పురుషవిశేషోఽధ్యయనధ్వనిశ్రవణాదేవ విశేషతో నిర్ధార్యతే - దేవదత్తోఽయమధీతే - ఇతి. న చాయం వర్ణవిషయోఽన్యథాత్వప్రత్యయో మిథ్యాజ్ఞానం; బాధకప్రత్యయాభావాత్. న చ వర్ణేభ్యోఽర్థావగతిర్యుక్తా; న హ్యేకైకో వర్ణోఽర్థం ప్రత్యాయయేత్, వ్యభిచారాత్. న చ వర్ణసముదాయ ప్రత్యయోఽస్తి; క్రమవత్త్వాద్వర్ణానామ్. పూర్వపూర్వవర్ణానుభవజనిత సంస్కారసహితోఽన్త్యో వర్ణః అర్థం ప్రత్యాయయిష్యతీతి యద్యుచ్యేత; తన్న. సంబన్ధగ్రహణాపేక్షో హి శబ్దః స్వయం ప్రతీయమానః అర్థం ప్రత్యాయయేద్ధూమాదివత్ న చ పూర్వపూర్వవర్ణానుభవజనితసంస్కారసహితస్యాన్త్యవర్ణస్య ప్రతీతిరస్తి; అప్రత్యక్షత్వాత్సంస్కారాణామ్. కార్యప్రత్యాయితైః సంస్కారైః సహితోఽన్త్యో వర్ణః అర్థం ప్రతాయయిష్యతీతి చేత్; న సంస్కారకార్యస్య స్మరణస్య క్రమవర్తిత్వాత్. తస్మాత్ స్ఫోట ఏవ శబ్దః. స చైకైకవర్ణప్రత్యయాహిత సంస్కారబీజేఽన్త్యవర్ణప్రత్యయజనితపరిపాకే ప్రత్యయిన్యేకప్రత్యయ విషయతయా ఝటితి ప్రత్యవభాసతే. న చాయమేకప్రత్యయో వర్ణవిషయా స్మృతిః; వర్ణానామనేకత్వాదేకప్రత్యయవిషయత్వానుపపత్తేః. తస్య చ

ప్రత్యుచ్చారణం ప్రత్యభిజ్ఞాయమానత్వాన్నిత్యత్వమ్. భేదప్రత్యయస్య వర్ణవిషయత్వాత్. తస్మాన్నిత్యాచ్ఛబ్దాత్ స్ఫోటరూపాదభిధాయకాత్ క్రియాకారకలక్షణం జగదభిధేయభూతం ప్రభవతీతి.

బాలానందిని

కిమాత్మకమితి :- ఏ రకమైన శబ్దాన్ని అంగీకరించి ఈ శబ్దప్రభవత్వం చెప్పబడుతున్నది? (జగత్తుకు కారణం అని మీరంటూన్న శబ్దంయొక్క స్వరూపం ఏమిటి?) స్ఫోటరూప మైన శబ్దమును అని (వైయాకరణుడు) అంటున్నాడు. వర్ణాలే శబ్దం అనే పక్షంలో వర్ణాలు పుట్టి వెంటనే నశిస్తూంటాయి గాన నిత్యమైన శబ్దాలవల్ల దేవాదులు పుట్టారు అని చెప్పడం యుక్తం కాదు. ప్రతి ఉచ్చారణలోను (ప్రతి ఒక్కరి ఉచ్చారణలోను) వేరు వేరుగా కనబడుతున్నాయి గాన వర్ణాలు పుట్టి నశిస్తూంటాయి అని అంగీకరించాలి. అది యుక్తమే కదా? మనిషి కనబడకపోయినా ఈ చదువుతున్నది దేవత్తుడు ఇత్యాది రీతిలో అధ్యయనధ్వని వినడంచేతనే ఆ విశిష్టవ్యక్తిని గూర్చి నిర్ధారణ చేయడం జరుగుతున్నది. వర్ణవిషయక మైన ఈ అన్యథాత్వజ్ఞానం (దేవదత్తుడు ఉచ్చరించిన వర్ణాలు వేరు, యజ్ఞదత్తుడు ఉచ్చరించినవి వేరు అనే జ్ఞానం) భ్రాంతి కాదు. బాధకమైన జ్ఞానం (మనం మొదట అనుకున్నది యథార్థం కాదు అనే జ్ఞానం బాధకజ్ఞానం) ఏదీ లేదు కదా? మరొక విషయ మేమనగా- వర్ణాలవల్ల అర్థజ్ఞానం కలగడం యుక్తం కాదు.

అవ. పదంలోని ఒక్కొక్క వర్ణం అర్థాన్ని బోధిస్తుందా అన్నీ కలిసి బోధిస్తాయా అని ప్రశ్నించి మొదటి పక్షం కుదరదని చెపుతున్నాడు - నహీతి :- ఒక్కొక్కవర్ణం బోధిస్తుంది అని అంటే వ్యభిచారదోషం కలుగుతుంది. (అనగా ఒక్కొక వర్ణంవల్ల అర్థప్రతీతి కనబడడంలేదు. అలా కనబడితే మిగిలిన వర్ణాలు వ్యర్థ మైపోతాయి అని అర్థం). (వర్ణసముదాయం అర్థాన్ని బోధిస్తుంది అని చెప్పడం కూడ కుదరదు. ఎందువల్ల ననగా- వర్ణాలన్నీ ఒక క్రమంలో ఉండడంవల్ల వర్ణసమదాయజ్ఞానం కలగదు. (అనగా వర్ణా లన్నీ ఒక వరసలో ఉంటాయి. రెండవ వర్ణం ఉచ్చరించే సమయానికి మొదటి వర్ణం నశిస్తుంది. ఇట్లే తరువాతి వర్ణాల విషయంలో కూడ. చివరి వర్ణం ఉచ్చరించే సరికి మొదటి వర్ణాలు ఏవీ ఉండవు. అలాంటప్పుడు వర్ణసముదాయజ్ఞానం ఎలా కలుగుతుంది అని భావం)

(ప్రశ్న) పూర్వపూర్వవర్ణాలు ఉత్తరోత్తరవర్ణాలను ఉచ్చరించే టప్పటికి నశించిపోయినా ముందుగా ఉచ్చరించిన ఆ పూర్వపూర్వవర్ణాల జ్ఞానంవల్ల కలిగిన సంస్కారంతో కూడిన చివరి వర్ణం అర్థజ్ఞానాన్ని కలిగిస్తుంది అని అంటే-

వి. ఒక వస్తువును చూడగానే లేదా వినగానే దాని జ్ఞానం కలుగుతుంది. తరవాత కొంత కాలం పాటు ఆ జ్ఞానం ఏర్పడిన సంస్కారం మనస్సులో ఉండిపోతుంది. దీనికి వాసన అని మరొక పేరు. ఆ వాసనవల్ల ఆ చూచిన దాని లేదా విన్నదాని స్మృతి కలుగుతుంది. ప్రకృతంలో — చివరి వర్ణం దగ్గరికి వచ్చేసరికి మొదట వర్ణా లన్నీ నశించినా వాటి సంస్కారం మనస్సులో ఉండిపోతుంది; ఆ సంస్కారాలతో కూడిన అంతిమవర్ణజ్ఞానం అర్థబోధకలిగిస్తుంది అని భావం.

(సమాధానం) అది యుక్తం కాదు. ఒక శబ్దం ఒక అర్థాన్ని బోధించా లంటే ఆ శబ్దానికీ అర్థానికీ సంబంధం ఉన్నట్లు ముందు తెలియాలి. ఆ విధంగా అర్థంతో సంబంధం ఉందని తెలిసిన శబ్దం తెలిస్తేనే అది ధూమాదికం వలె అర్థాన్ని గ్రహింపచేస్తుంది (అనగా — ధూమానికి అగ్నితో నియతమైన సంబంధం ఉందని తెలిసినవానికి ఎక్కడ నైనా ధూమజ్ఞానం కలగగానే అగ్నిజ్ఞానం కలుగుతుంది. ధూమజ్ఞానం లేకపోతే అగ్నిజ్ఞానం కలగదు. అట్లే శబ్దంయొక్క జ్ఞానం కలిగితేనే అర్థ జ్ఞానం కలుగుతుంది అని భావం). న చేతి :- పదంలోని లేదా వాక్యంలోని పూర్వపూర్వవర్ణా లన్నీ పుట్టి నశించి, చివరి వర్ణంయొక్క అనుభవం (జ్ఞానం) కలిగే టప్పటికి ఆ చివరి వర్ణం జ్ఞానం మాత్రమే కలుగుతున్నది. పూర్వపూర్వవర్ణాల సంస్కారాలతో కూడిన చివరి వర్ణంయొక్క జ్ఞానం కలగడం లేదు. ఎందువల్ల ననగా చివరి వర్ణం ప్రత్యక్షమే అయినా సంస్కారాలు అప్రత్యక్షాలు కదా? అందుచేత పూర్వపూర్వవర్ణసంస్కారసహకృత మైన అంత్యవర్ణం ప్రత్యక్షం అవుతుంది. దానిచేత అర్థజ్ఞానం కలుగుతుంది అని చెప్పడం కుదరదు. (ప్రశ్న) కార్యేతి:- స్మృతి అనే కార్యంచేత ఊహించబడిన సంస్కారాలతో కూడిన అంత్యవర్ణం అర్థాన్ని గ్రహింపచేస్తుంది అని అంటే (అనగా సంస్కారాలు ప్రత్యక్షం కాకపోయినా సంస్కారాలవల్ల పూర్వపూర్వవర్ణాల స్మరణం కలుగుతున్నది గాన ఆ స్మరణాన్నిపట్టి సంస్కారా లున్నట్లు అనుమానంచేత తెలుసుకొనవచ్చును; అలాంటి అనుమితాలైన సంస్కారాలతో కూడిన అంత్యవర్ణంయొక్క జ్ఞానం అర్థబోధ కలిగిస్తుంది అని అంటే) (సమధానం) అది కుదరదు. సంస్కారకార్యమైన స్మరణం కూడ క్రమవర్తియే కదా? (అనగా సంస్కారంవల్ల స్మృతులు కూడ అంత్యాక్షరజ్ఞానం తరవాతనే కలుగుతాయి. ఆ స్మృతులలోకూడ ముందు మొదటి అక్షరం స్మృతి తరవాత రెండవఅక్షరం స్మృతీ ఇత్యాదివిధంగా ఉంటుంది. అందుచేత అన్నివర్ణాలు ఒక్కమాటు బుద్ధ్యారూఢా లవడం అనేది కుదరదు. అప్పుడు శబ్దజ్ఞానం లేకుండా అర్థజ్ఞానం ఎలా కలుగుతుంది అని భావం) తస్మాదితి:- అందువల్ల శబ్ద మనగా స్ఫోటయే. అది ఒక్కొక్క వర్ణంయొక్కజ్ఞానంచేత

ఉంచబడిన సంస్కారములు బీజంగా గలది, అంత్యవర్ణజ్ఞానంచేత కలిగిన పరిపాకం గలదీ అయిన చిత్తంలో ఇది ఒక్కటి అనే జ్ఞానానికి విషయంగా ఛట్టున భాసిస్తుంది. ఇది ఒక పదము, ఒక వాక్యము అని ఒకటి అనే జ్ఞానం వర్ణాలను గూర్చిన స్మృతి కాదు. వర్ణా లనేకములు గాన ఒకటి అనే జ్ఞానం వాటి విషయంలో కుదరదు. ఇది ఒక్కటి అనిపించే ఆ పదం లేదా వాక్యం వేరు వేరు పురుషులు ఉచ్చరించినా ఒకటిగానే గుర్తింపబడుతున్నది. అనగా ఒక పదాన్ని లేక వాక్యాన్ని నలుగురు వేరు వేరుగా ఉచ్చరించినా ఈ పదమే లేదా ఈ వాక్యమే నలుగురూ ఉచ్చరించారు అనే ప్రతీతి కలుగుతున్నది గాని నలుగురూ నాలుగు పదాలు లేదా వాక్యాలు ఉచ్చరించారు అనే ప్రతీతి కలగడం లేదు. అందుచేత స్ఫోట నిత్యం. భేదజ్ఞానం, అనగా ఇది దేవదత్తు డుచ్చరించిన వాక్యం, ఇది యజ్ఞదత్తు డుచ్చరించినది ఇత్యాదిభేదబుద్ధి వర్ణవిషయక మైనది; వర్ణాలకు సంబంధించినది. అందుచేత స్ఫోటరూపమైన అర్థబోదకమైన నిత్యశబ్దంనుండి క్రియా - కారక - ఫలలక్షణమైన, అర్థమైన (శబ్దార్థమైన) జగత్తు పుట్టుచున్నది. (జగత్తు అనగా ఏవేవో పనులు, ఆ పనులకు కావలసిన కర్తృ - కర్మ - కరణాధికరణాదికారకాలు, ఫలం— ఇవే అని అర్థం). (వైయాకరణుల స్ఫోటను గూర్చిన సంక్షిప్తవివరణ అస్మదీయసలోచధ్వన్యాలోకవ్యాఖ్య, బాలానందిని, 212,213 పేజీలలో ఇవ్వబడినది)

## భాష్యమ్

వర్ణా ఏవ తు శబ్దః ఇతి భగవానుపవర్షః. నమూత్పన్నప్రధ్వంసిత్వం వర్ణానాముక్తమ్? తన్న. త ఏవేతి ప్రత్యభిజ్ఞానాత్. సాదృశ్యాత్ప్రత్యభిజ్ఞానం కేశాదిష్వివేతి చేత్; న. ప్రత్యభిజ్ఞానస్య ప్రమాణాన్తరేణ బాధానుపపత్తేః. ప్రత్యభిజ్ఞానమాకృతినిమిత్తమితి చేత్; న. వ్యక్తిప్రత్యభిజ్ఞానాత్. యది హి ప్రత్యుచ్చారణం గవాదివ్యక్తివదన్యా అన్యా వర్ణవ్యక్తయః ప్రతీయేరన్ తతః ఆకృతినిమిత్తం ప్రత్యభిజ్ఞానం స్యాత్. న త్వేతదస్తి. వర్ణవ్యక్తయ ఏవ హి ప్రత్యుచ్చారణం ప్రత్యభిజ్ఞాయన్తే ద్విర్గోశబ్ద ఉచ్చారిత ఇతి హి ప్రతిపత్తిః న తు ద్వౌ గోశబ్దావితి.

## బాలానందిని

వర్ణా ఇతి :- వర్ణాలే శబ్దం అని పూజ్యుడైన ఉపవర్షుడు అభిప్రాయపడు తున్నాడు. వర్ణాలు పుట్టి నశిస్తాంటాయి అని చెప్పాం కదా? అది యుక్తం కాదు.

అవే వర్ణాలు అని ప్రత్యభిజ్ఞానం ఉంది కదా? ఈ ప్రత్యభిజ్ఞానం కేశాదుల విషయంలో వలె, (కత్తిరించిన తరవాత మళ్లీ కొన్నిరోజులలో పెరిగిన జుట్టునుచూచి ఆ (వెనుకటి) జుట్టే అన్నట్లు ) సాదృశ్యంవల్ల కలిగినది అన్నట్లయితే - అది కాదు. ప్రత్యభిజ్ఞానం ఇతరప్రమాణంచేత దేనిచేత బాధించబడడం అనేది ఉపపన్నం కాదు కదా? (లేదు కదా?). ఈ ప్రత్యభిజ్ఞానం జాతిని పట్టి (కత్వ - గత్వాది జాతిని పట్టి) ఏర్పడినది అన్నట్లయితే అది యుక్తం కాదు. ఇక్కడ ఉన్న ప్రత్యభిజ్ఞానం వ్యక్తి ప్రత్యభిజ్ఞానమే (ఆ క కారమే ఈ క కారం ఇత్యాదివిధాంగా) కదా? ఒకమాటు ఒక గోవ్యక్తీ మరొక మాటు మరొక గోవ్యక్తీ కనబడినట్లు, ప్రతీ ఉచ్చారణలోను వేరు వేరు వర్ణవ్యక్తులు కనబడితే అప్పుడు ఈ ప్రత్యభిజ్ఞానం జాతిని పట్టి వచ్చినది అని చెప్పడానికి వీలుండేది. అలాంటిది ఇక్కడ లేదు. ప్రతీ ఉచ్చారణలోను వర్ణవ్యక్తులే గుర్తింపబడుతున్నాయి. 'గో' శబ్దం రెండుమాట్లు ఉచ్చరించబడింది అని జ్ఞానం కలుగుతున్నది గాని రెండు గోశబ్దాలు ఉచ్చరించబడ్డాయి అనే జ్ఞానం కలగడం లేదు కదా?

## భాష్యమ్

నను వర్ణా అప్యుచ్చారణభేదేన భిన్నాః ప్రతీయన్తే, దేవదత్తయజ్ఞదత్తయోరధ్యయనధ్వనిశ్రవణాదేవ భేదప్రతీతేరిత్యుక్తమ్. అత్రాభిధీయతే. సతి వర్ణవిషయే నిశ్చితే ప్రత్యభిజ్ఞానే సంయోగవిభాగాభివ్యఙ్గ్యత్వాద్వర్ణానామభివ్యఞ్జకవైచిత్ర్యనిమిత్తోఽయం వర్ణవిషయో విచిత్రః ప్రత్యయః న స్వరూపనిమిత్తః. తాసు చ పరోపాధికో భేదప్రత్యయ ఇత్యభ్యుపగన్తవ్యమ్. తద్వరం వర్ణవ్యక్తిష్వేవ పరోపాధికో భేదప్రత్యయః, స్వరూపనిమిత్తం చ ప్రత్యభిజ్ఞానమితి కల్పనాలాఘవమ్. ఏష ఏవ చ వర్ణవిషయస్య భేదప్రత్యయస్య బాధకః ప్రత్యయః యత్ ప్రత్యభిజ్ఞానమ్. కథం త్ర్యేకస్మిన్ కాలే బహూనాముచ్చారయతామేకఏవ సన్ గకారః యుగపదనేకరూపః స్యాత్ - ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ సానునాసికశ్చ నిరనునాసికశ్చ ఇతి.

## బాలానందిని

(ప్రశ్న) నన్వితి :- అధ్యయనం చేసేటప్పుడు వెడలిన ధ్వనిని పట్టి ఇది దేవదత్తుని అధ్యయనం, ఇది యజ్ఞదత్తుని అధ్యయనం అని భేదం తెలుస్తూన్నది గాన వర్ణాలు కూడ ఉచ్చారణభేదంచేత వేరువేరుగ తెలుస్తున్నాయి అని చెప్పాం కదా? ఈ విషయంలో (సమాధానం) చెప్పబడుతున్నది వర్ణాలకు సంబంధించిన

ప్రత్యభిజ్ఞానం నిశ్చితంగా ఉన్న తరవాత ఇక వర్ణాలను గూర్చిన ఈ విచిత్రమైన జ్ఞానం (ఇది వీని అధ్యయనం అది వాని అధ్యయనం ఇత్యాదిభేజ్ఞానం) వర్ణాలు ఆ యా ఉచ్చారణస్థానాలమీద కలిగిన వాయ్వాఘాతంచేత అభివ్యక్తం చేయబడతాయి గాన అభివ్యంజకాలైన వాయుసంయోగాదుల వైచిత్ర్యంవల్ల (భేదంవల్ల)ఏర్పడినది.

వి. ప్రత్యభిజ్ఞను పట్టి, అనగా అదే ఇది అనే జ్ఞానాన్ని పట్టి, వర్ణాలలో భేదం లేనట్లు నిశ్చితం అవుతున్నది. అయినా కూడ అధ్యనాదులలో భేదం కనబడుతున్న దంటే అందుకు కారణం అభివ్యంజకభేదం. వర్ణాలను ఉచ్చరించేటప్పుడు ముఖంలో ఉన్న కంఠం, తాలువు మొదలైన స్థానాలమీద వాయుసంయోగం కలుగుతుంది. ఆ వాయుసంయోగంచేత వర్ణాలు అభివ్యక్తం అయేటట్లు చేయబడతాయి కాని క్రొత్తగా పుట్టించబడవు. వర్ణాలు నిత్య మైనవి; ఎప్పుడూ ఉంటాయి. చీకట్లో ఉన్న వస్తువును దీపం అభివ్యక్తం చేస్తుంది కాని దానిని పుట్టించదు. అట్లే ఇక్కడ కూడ. అందుచేత వర్ణాలను అభివ్యక్తం చేసే వాయుతాల్వాదిస్థానాల సంయోగంలో ఉన్న వైచిత్ర్యాన్ని పట్టి వర్ణాలు వేరువేరుగా ఉన్నట్లు కనబడుతున్నాయి. దీపం కాంతిలో ఉన్న వైచిత్ర్యాన్ని పట్టి ఒకే వస్తువు ఎఱ్ఱగాను, తెల్లగాను, నీలవర్ణంగాను కనబడి నట్లు అని భావం.

అపి చేతి:- మరొక విషయమేమనగా వర్ణవ్యక్తులలో (గోవ్యక్తులలో వలె) భేదం ఉంది అని అంగీకరించేవాడు కూడ వర్ణాలను గూర్చిన ప్రత్యభిజ్ఞను సమర్థించడానికి వర్ణజాతులను కల్పించవలసి ఉంటుంది. (అనగా - ఈ గకారమూ ఆ గకారమూ వేరైనా కూడ ఒకటే అని ప్రత్యభిజ్ఞకు కారణం ఆ రెండింటిలోను గత్వం అనే జాతి ఉండడం అని చెప్పవలసి ఉంటుంది). ఆ జాతుల విషయంలో భేదజ్ఞానానికి (ఉదాత్తం, అనుదాత్తం ఇత్యాదిభేదజ్ఞానానికి) మరొకటి ఏదో (ఉచ్చారణాదికం) కారణం అని చెప్పవలసి ఉంటుంది. (ఈ విధంగా జాతిని అంగీకరించి తద్ద్వారా ప్రత్యభిజ్ఞను సమర్థించి భేదబుద్ధికి కారణం మరేదో అని చెప్పడంకంటె) వర్ణవ్యక్తుల విషయంలో ఉన్న భేదజ్ఞానానికి మరొకటి ఏదో కారణం అనీ, ప్రత్యభిజ్ఞకు వాటి స్వరూపమే కారణం అనీ అంగీకరించడంలో లాఘవం ఉంది. వర్ణాలనుగూర్చిన భేదజ్ఞానానికి ప్రత్యభిజ్ఞానమే బాధకం. (ప్రత్యభిజ్ఞ ఉంది గాన భేదం లేదని అంగీకరించి తీరాలి అని అర్థం).

వి. "కథం తర్హ్యేకస్మిన్" అనే వాక్యంలో 'కథం తర్హి'కి బదులు 'కథం హి' అని భామతీ -బ్రహ్మవిద్యాభరణసమ్మత మైన పాఠం.

ఇలా చెప్పకపోతే (అనగా ప్రత్యభిజ్ఞాబలంచేత గకారాదివర్ణాలలో భేదం లేదనీ భేదం కనబడితే అది సంయోగవిభాగాద్యుపాధులచేత ఏర్పడిందనీ

అంగీకరించకపోతే)- ఒకే సమయంలో అనేకులు ఉచ్చరించిన ఒకే గకారం ('గ' అనేది) ఒకే మాటు ఉదాత్తం అనుదాత్తం స్వరితం, సానునాసికం, నిరనునాసికం అని అనేకవిధాలుగా ఎలా ఉంటుంది? అందుచేత భేదజ్ఞానం ఔపాధికం అని అంగీకరించాలి అని అర్థం. (భామతీ బ్రహ్మవిద్యాభరణాదులలో ఈ వాక్యాన్ని మరొకవిధంగా వాఖ్యానించారు ఆ విషయం ఆ గ్రంథాలలో చూచుకొనవలెను)

## భాష్యమ్

అథవా - ధ్వనికృతోఽయం ప్రత్యయభేదః న వర్ణకృత ఇత్యదోషః. కః పునరయం ధ్వనిర్నామ? యో దూరాదాకర్ణయతః వర్ణవివేకమప్రతిపద్యమానస్య కర్ణపథమవతరతి ప్రత్యాసీదతశ్చ పటుమృదుత్వాదిభేదం వర్ణేష్వాసఞ్జయతి. తన్నిబన్ధనాశ్చోదాత్తాదయో విశేషా న వర్ణస్వరూపనిబన్ధనాః. వర్ణానాం ప్రత్యుచ్చారణం ప్రత్యభిజ్ఞాయమానత్వాత్. ఏవం చ సతి సాలమ్బనా ఉదాత్తాదిప్రత్యయా భవిష్యన్తి; ఇతరథా హి వర్ణానాం ప్రత్యభిజ్ఞాయ మానానాం నిర్భేదత్వాత్సంయోగవిభాగకృతా ఉదాత్తదివిశేషాః కల్ప్యేరన్. సంయోగ విభాగానాం చాప్రత్యక్షత్వాన్న తదాశ్రయా విశేషా వర్ణేష్వధ్యవసితుం శక్యన్త ఇత్యతో నిరాలమ్బనా ఏవైత ఉదాత్తాదిప్రత్యయాః స్యుః. అపి చ నైవైతదభినివేష్టవ్యమ్ - ఉదాత్తాదిభేదేన వర్ణానాం ప్రత్యభిజ్ఞాయమానానాం భేదో భవేదితి. న హ్యన్యస్య భేదేనాన్యస్యాభిద్యమానస్య భేదో భవితుమర్హతి. న హి వ్యక్తిభేదేన జాతిం భిన్నాం మన్యన్తే.

## బాలానందిని

**అవ.** భేదబుద్ధి సంయోగవిభాగాలవల్ల ఏర్పడినది అని వెనుక చెప్పబడినది. ఇప్పుడు భేదప్రత్యయానికి మరొక కారణం చెపుతున్నారు- అథవేతి:- ఈ ప్రత్యయభేదం (భేదజ్ఞానం) ధ్వనివల్ల ఏర్పడినదే కాని వర్ణాలవల్ల (వర్ణాలభేదంవల్ల) ఏర్పడినది కాదు గాన దోషం లేదు. ఏమిటి ఈ ధ్వని అనగా? దూరంనుండి వినేవానికి ఏది వినబడుతుందో అది ధ్వని. అప్పు డాతనికి వర్ణాల వివేకం మాత్రం తెలియదు (పలుకు తున్నవి ఈ వర్ణాలు అని తెలియదు) అతడే దగ్గరగా వచ్చినకొలదీ వర్ణాలు పటువుగా ఉన్నాయి. మృదువుగా ఉన్నాయి (పటువుగా లేదా మృదువుగా ఉచ్చరించబడుతున్నాయి) అనే భేదాన్ని వర్ణాలమీద సమకూరుస్తుంది. ఉదాత్తాదిభేదాలు ఆ ధ్వనిని పట్టి ఏర్పడినవే కాని వర్ణస్వరూపాన్ని పట్టి

ఏర్పడినవి కాదు. ఎందువల్ల ననగా ప్రతి ఉచ్చారణలోను (వేరు వేరు ఉచ్చారణలలో) వర్ణాలు అవే అని గుర్తింపబడుతున్నాయి. ఇలా చెప్పిన ట్లయితే (భేదబుద్ధి ధ్వనివల్ల ఏర్పడింది అని చెపితే) ఉదాత్తాదిప్రత్యయాలకు (ఉదాత్తదిజ్ఞానాలకు) ఆలంబనం ఉంటుంది. ఇలా చెప్పకపోతే - అవే ఇవి అని గుర్తింపబడు తూన్న వర్ణాలలో భేదం లేకపోవడంచేత ఉదాత్తాదివిశేషాలు సంయోగవిభాగాలవల్ల ఏర్పడ్డాయి అని చెప్పవలసి వస్తుంది. అలా చెప్పినపక్షంలో సంయోగవిభాగాలు అప్రత్యక్షాలు గాన అప్రత్యక్ష మైన వాటిని ఆశ్రయించిన (ఉదాత్తాది) విశేషాలను వర్ణాలమీద మోపడం శక్యం కాదు గాన ఈ ఉదాత్తాదిప్రత్యయాలకు ఆలంబనం (ఆధారం) ఏదీ లేకుండా పోతుంది. మరొక విషయ మేమనగా అవే ఇవి అని గుర్తింపబడున్న వర్ణాలకు ఉదాత్తాదిభేదంచేత భేదం ఏర్పడుతుంది అనే విషయంలో పట్టుదలగా మాట్లాడకూడదు. భిన్నం కాని వస్తువు మరొకదానిలో ఉన్న భేదాన్ని పట్టి భిన్నం కాజాలదు కదా? వ్యక్తులు వేరు వేరుగా ఉన్నా వాటిని పట్టి జాతి కూడ వేరుగా ఉంటుం దని ఎవరూ అంగీకరించరు కదా?

## భాష్యమ్

వర్ణేభ్యశ్చార్థప్రతీతేః సంభవాత్ స్ఫోటకల్పనా ఽనర్థికా. న కల్పయామ్యహం స్ఫోటమ్; ప్రత్యక్షమేవ త్వేనమవగచ్ఛామి. ఏకైకవర్ణ గ్రహణాహితసంస్కారాయాం బుద్ధౌ ఝటితి ప్రత్యవభాసాదితి చేత్ - న. తస్యా అపి బుద్ధేర్వర్ణవిషయత్వాత్. ఏకైకవర్ణగ్రహణోత్తరకాలా హీయమేకా బుద్ధిర్గౌరితి సమస్తవర్ణవిషయా నార్థాన్తరవిషయా. కథమేతదవగమ్యతే? యతోఽస్యామపి బుద్ధౌ గకారాదయో వర్ణా అనువర్తన్తే న తు దకారాదయః యది హ్యస్యా బుద్ధేర్గకారాదిభ్యోఽ ర్థాన్తరం స్ఫోటో విషయః. స్యాత్తతో దకారాదయ ఇవ గకారాదయోఽప్యస్యా బుద్ధేర్వ్యావర్తేరన్; న తు తథాస్తి. తస్మాదియమేకబుద్ధిర్వర్ణవిషయైవ స్మృతిః. నన్వనేకత్వాద్వర్ణానాం నైకబుద్ధి విషయతోపపద్యత ఇత్యుక్తమ్? తత్ప్రతిబ్రూమః - సంభవత్యనేకస్యాప్యేక బుద్ధివిషయత్వమ్ - పఙ్క్తిః, వనం, దశత్, శతం, సహస్రమిత్యాదిదర్శనాత్. యా తు గౌరిత్యేకోఽయం శబ్దః ఇతి బుద్ధిః సా బహుష్వేవ వర్ణేషు ఏకార్థావచ్ఛే దనిబన్ధనౌపచారికీ వనసేనాబుద్ధివదేవ.

## బాలానందిని

వర్ణేభ్య ఇతి :- వర్ణాలవల్లనే అర్థప్రతీతి కలగడానికి వీలున్నప్పుడు స్ఫోటను కల్పించడం వ్యర్థం. (ప్రశ్న) నేను స్ఫోటను కల్పించడంలేదు; దానిని ప్రత్యక్షంగానే చూస్తున్నాను. ఒక్కొక్క వర్ణాన్ని గ్రహించడంవల్ల ఉంచబడినసంస్కారం గల బుద్ధిలో హటాత్తుగా స్ఫోట ప్రకాశిస్తూన్నది కదా? అని అంటే (సమాధానం) - అది యుక్తం కాదు. ఈ బుద్ధి కూడ వర్ణవిషయకమే; అనగా ఈ బుద్ధిలో విషయమైనవి కూడ వర్ణాలే కాని స్ఫోట కాదు. ఒక్కొక్క వర్ణాన్ని గ్రహించిన తరవాత కలిగిన "గౌ" అనే ఈ బుద్ధి సమస్తవర్ణవిషయకమే కాని మరొక వస్తువు విషయంగా కలది కాదు (ఆ బుద్ధిలో కూడ "గ్+ఔ+ః" అనే సమస్తవర్ణాలు మాత్రమే విషయం కాని స్ఫోట అనే మరొక వస్తు వేదో విషయం కాదు). ఇది ఎలా తెలుస్తూన్నది? ఎందువల్ల ననగా ఈ బుద్ధిలో కూడ గకారాదివర్ణాలే అనువర్తిస్తున్నాయి కాని దకారాదులు అనువర్తించడం లేదు. ఈ బుద్ధిలో గకారాదులకంటె భిన్నమైన స్ఫోట విషయం అయే పక్షంలో దీనిలో దకారాదులు ఏ విధంగా నివర్తిస్తున్నాయో, అనగా భాసించడంలేదో, అలాగే గకారాదులు కూడ నివర్తించేవి (భాసించకుండా ఉండేవి). కాని అలా లేదు; (అనగా గకారాదులు భాసిస్తున్నాయి). అందువల్ల ఒకటి అనే ఈ బుద్ధి వర్ణవిషయకమైన (వర్ణాలను గూర్చిన) స్మృతియే. (ప్రశ్న) వర్ణాలు చాలా ఉన్నాయి గాన ఇవి ఒకటి అనే బుద్ధిలో విషయం అనడానికి వీలులేదు అని చెప్పాం కదా? (సమాధానం)- దానిని గూర్చి చెపుతున్నాం. అనేకవస్తువులు కూడ ఒకటి అనే బుద్ధిలో విషయం అవడం కురుదుతుంది. (అనేక వస్తువుల కలయికచేత ఏర్పడిన) పంక్తి, వనం, సేన, దశత్ (పది వస్తువుల సముదాయం) శతం, సహస్రం ఇత్యాదులు కనబడుతున్నాయి కదా? 'గౌ' అనే ఇది ఒక శబ్దం అనే ఏ బుద్ధి ఉన్నదో అది అనేకవర్ణాల విషయంలోనే, అవన్నీ కలిసి ఒక అర్థాన్ని భోదించడంచేత ఉపచారంచేత, ఆరోపణచేత, ఏర్పడినది. ఇది 'వన' బుద్ధి 'సేనా' బుద్ధి వంటిదే. (వంద చెట్లు కలిస్తే వనం అంటున్నాం, వెయ్యమంది సైనికులుకలిస్తే సేన అంటున్నాం. అక్కడ వృక్ష - సైనికసమూహాన్ని ఒక్కటిగా భావించడానికికారణం అవి ఒక్కచోట చేరి ఉండడం. ఇక్కడ ఈ వర్ణాలన్నీ ఒక్క అర్థాన్ని బోధించడం).

## భాష్యమ్

అత్రాహ - యది వర్ణా ఏవ సామస్త్యేనైకబుద్ధివిషయతామాపద్య మానాః పదం స్యుస్తతో జారా రాజా, కపిః పికః ఇత్యాదిషు పదవిశేషప్రతి పత్తిర్న స్యాత్, త ఏవ హి వర్ణాః ఇతరత్ర చేతరత్ర చ ప్రత్యవభాసన్త ఇతి.

అత్ర వదామః- సత్యపి సమస్తవర్ణప్రత్యవమర్శే యథా క్రమానురోధిన్య ఏవ పిపీలికాః పఙ్క్తిబుద్ధిమారోహన్తి, ఏవం క్రమానురోధిన ఏవ వర్ణాః పదబుద్ధి మారోక్ష్యన్తి. తత్ర వర్ణానామవిశేషేఽపి క్రమవిశేషకృతా పదవిశేషప్రతిపత్తిర్న విరుధ్యతే. వృద్ధవ్యవహారే చేమే వర్ణాః క్రమాద్యనుగృహీతా గృహీతార్థ విశేషసంబన్ధాః సన్తః స్వవ్యవహారే ఽప్యేకైకవర్ణగ్రహణానన్తరం సమస్త ప్రత్యవమర్శిన్యాం బుద్ధౌ తాదృశా ఏవ ప్రత్యవభాసమానాః తం తమర్థమవ్యభిచారేణ ప్రత్యాయయిష్యన్తీతి వర్ణవాదినో లఘీయసీ కల్పనా. స్ఫోటవాదినస్తు దృష్టహానిరదృష్టకల్పనా చ. వర్ణాశ్చేమే క్రమేణ గృహ్యమాణాః స్ఫోటం వ్యఞ్జయన్తి స స్ఫోటోఽర్థం వ్యనక్తీతి గరీయసీ కల్పనా స్యాత్. అథాపి నామ ప్రత్యుచ్చారణమన్యేఽన్యే వర్ణాః స్యుః తథాపి ప్రత్యభిజ్ఞాలమ్బనభావేన వర్ణసామాన్యానామవశ్యాభ్యుపగన్తవ్యత్వాద్యా వర్ణేష్వర్థప్రతిపాదనప్రక్రియా రచితా సా సామాన్యేషు సంచారయితవ్యా. తతశ్చ నిత్యేభ్యః శబ్దేభ్యః దేవాదివ్యక్తీనాం ప్రభవ ఇత్యవిరుద్ధమ్. 28

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ (స్ఫోటవాది) అంటున్నాడు - అన్నీ కలిసి బుద్ధికి విషయం అవుతున్న వర్ణాలే పదం అనేపక్షంలో 'జారా', రాజా, కపిః, పికః, ఇత్యాదులలో ఆ వర్ణాలే వెనకా ముందూ ఉండి బుద్ధిలో భాసిస్తున్నాయి గాన పదవిశేషప్రతిపత్తి (జారా అనే పదం వేరు రాజా అనే పదం వేరు అనే జ్ఞానం) కలగదు. (సమాధానం) ఇక్కడ చెపుతున్నాం - మొత్తం వర్ణాల జ్ఞానం కలిగినా కూడ చీమల పంక్తి అన్నప్పుడు ఒక క్రమంలో ఉన్న చీమలు మాత్రమే పంక్తి అనే బుద్ధిని అధిరోహించి నట్లు ఒక క్రమంలో ఉన్న వర్ణాలే పదం అనే బుద్ధిని ఆరోహిస్తాయి. ఆ విధంగా వర్ణాలలో విశేషం లేకపోయినా క్రమవిశేషాన్ని పట్టి ఏర్పడిన పదవిశేషజ్ఞానం విరుద్ధం కాదు. వృద్ధవ్యవహారంలో క్రమాదులచేత అనుగృహీతాలై (సహాయం పొంది) గ్రహింపబడిన అర్థవిశేషంతో ఉన్న సంబంధం గల స్వవ్యవహారంలో కూడ (వృద్ధుని వ్యవహారం ద్వారా పదపదార్థజ్ఞానం సంపాదించిన బాలుడు తాను వ్యవహరిస్తున్నప్పుడుకూడ) ఒక్కొక్క వర్ణాన్ని గ్రహించిన తరవాత సమస్తవర్ణాలను గ్రహించిన బుద్ధిలో ఆ అర్థాన్నే తప్పక తెలుపుతాయి అని వర్ణవాది చేసే కల్పన తేలికయైనది. స్ఫోటవాది చేసే కల్పనలో అయితే కనబడుతున్న దానిని విడిచిపెట్టడం, లేనిదానిని కల్పించడం జరుగుతుంది. క్రమంగా గ్రహించ

బడుతున్న ఈ వర్ణాలు స్ఫోటను వ్యంజిపచేస్తాయి, ఆ స్ఫోట అర్థాన్నివ్యంజింపచేస్తుంది అని స్ఫోటవాది కల్పన గురుతరం అయిపోతుంది.

**అవ.** ఇంతవరకు వర్ణాలలో భేదం లేదు; భేదబుద్ధి వర్ణావిర్భావస్థానాలలో వాయువుయొక్క సంయోగవిభాగాదులవల్ల లేదా ధ్వనివల్ల కలుగుతుంది అనే పక్షాన్ని ఆశ్రయించి స్ఫోటవాదాన్ని నిరాకరించారు. ప్రతీ ఉచ్చారణలోను వేరు వేరు వర్ణాలు పుడతాయి అని అంగీకరించినా కూడ స్ఫోటవాదం అంగీకరించవలసిన పని లేదు అని చెపుతున్నారు- **అథాపీతి:** ప్రతీ ఉచ్చారణలోను వేరు వేరు వర్ణాలు పుడతాయి అని అంగీకరించినా కూడ అదే వర్ణం అనే ప్రత్యభిజ్ఞయొక్క బలంచేత (పైనచూపినట్లు) గత్వాదిజాతులను తప్పక అంగీకరించవలసి ఉంటుంది. అందుచేత వర్ణాలు అర్థాన్ని ప్రతిపాదిస్తాయి అని పైన చెప్పిన ప్రక్రియను అంతటినీ జాతుల విషయంలో ప్రవర్తింపచేయవచ్చును. అనగా స్థిరమైన (నిత్యమైన) గత్వాదిజాతులే ఒక క్రమవివేషంలో ఉండి అర్థాన్ని బోధిస్తాయి. వాటి శక్తిగ్రహణం కూడ ఆ విధంగానే జరిగి ఉంటుంది అని అర్థం. అందువల్ల (వర్ణములు నిత్యా లన్నా, వర్ణజాతులు నిత్యా లన్నా) నిత్యాలైన శబ్దాలనుండి దేవాదివ్యక్తులు పుట్టారు అని చెప్పడంలో విరోధం లేదు. 28.

## సూ. అత ఏవ చ నిత్యత్వమ్ 1.3.29.

స్వతన్త్రస్య కర్తురస్మరణాదిభిః స్థితే వేదస్య నిత్యత్వే దేవాదివ్యక్తి ప్రభవాభ్యుపగమేన తస్య విరోధమాశఙ్క్య అతః ప్రభవాత్ ఇతి పరిహృత్యే దానీం తదేవ వేదనిత్యత్వం ద్రఢయతి - **అత ఏవ చ నిత్యత్వమ్ ఇతి.** అత ఏవ నియతాకృతేర్దేవాదేర్జగతో వేదశబ్దప్రభవత్వాత్ వేదశబ్దనిత్యత్వమపి ప్రత్యేతవ్యమ్. తథా చ మన్త్రవర్ణః "యజ్ఞేన వాచః పదవీయమాయన్ తామన్వవిన్దన్నృషిషు ప్రవిష్టామ్' (ఋ.సం.10.71.3) ఇతి స్థితామేవ వాచమనువిన్నాం దర్శయతి. వేదవ్యాసశ్చైవం స్మరతి

"యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః,
లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా" ఇతి. 29.

మ.భా.శా. అధ్యా.2. Page. 49

### బాలానందిని

అతఏవేతి:- "అతఏవ= దేవాదిజగత్తుకు కారణం అవడంవల్లనే, నిత్యత్వమ్= వేదానికి నిత్యత్వం లభిస్తుంది" అని సూత్రార్థం.

స్వతన్త్రస్యేతి :- స్వతంత్రుడైన కర్త ఎవరూ స్మరించబడకపోవడం మొదలైన (పూర్వమీమాంసాప్రదర్శితాలైన) హేతువులచేత వేదం నిత్యం అని నిశ్చితమై ఉంది. అయితే దేవతలు మొదలైన (వేదంలో చెప్పబడిన)వ్యక్తులకు పుట్టుక ఉంది గాన వేదనిత్యత్వం కుదరదు అని ఆశంకించుకుని "అతః ప్రభవాత్" అని ఆ ఆశంకను పరిహరించి ఇప్పుడు నిశ్చిత మైన జాతి గల దేవాదిజగత్తు వేదశబ్దంనుండి పుట్టడంవల్ల వేదశబ్దంమొక్క నిత్యత్వం కూడ అంగీకరించదగినది. "యజ్ఞేన...ప్రవిష్టామ్" అనే మంత్రవర్ణం, ఉన్న వేదవాక్కే పొందబడింది అని చెపుతున్నది. "(యాజ్ఞికులు) యజ్ఞంచేత (పూర్వసుకృతంచేత) వేదాన్ని పొందే అర్హతను పొందారు ఋషులలో ఉన్న ఆ వేదవాక్కును పొందారు" అని ఈ మంత్రానికి అర్థం. వేదవ్యాసుడు కూడ "యుగాన్తే...స్వయంభువా" (పూర్వం అనగా అవాంతరకల్పం ప్రారంభంలో) మహర్షులు యుగాంతంలో (అవాంతరప్రళయంలో) అంతర్ధానం చెందిన ఇతిహాసాలతో కూడిన వేదాలను బ్రహ్మదేవునిచేత అనుమతింపబడినవారై తపస్సుచేత పొందారు) అని ఈ విధంగానే స్మరిస్తున్నాడు (చెపుతున్నాడు) 29.

**సూ. సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్ స్మృతేశ్చ 1.3.30.**

అథాపి స్యాత్ - యది పశ్వాదివ్యక్తివద్దేవాదివ్యక్తయోఽపి సన్తత్యేవోత్పద్యేరన్నిరుధ్యేరంశ్చ తతోఽభిధానాభిధేయాభిధాతృవ్యవహారవిచ్ఛేదాత్సమ్బన్ధనిత్యత్వేన విరోధః శబ్దే పరిహ్రియేత. యదా తు ఖలు సకలం త్రైలోక్యం పరిత్యక్తనామరూపం నిర్లేపం ప్రలీయతే ప్రభవతి చాభినవమితి శ్రుతిస్మృతివాదా వదన్తి తదా కథమవిరోధ ఇతి. తత్రేదమభిధీయతే - **సమాననామపరూత్వాదితి.** తదాపి సంసారస్యానాదిత్వం తావదభ్యుపగన్తవ్యమ్. ప్రతిపాదయిష్యతి చాచార్యః సంసారస్యానాదిత్వమ్ -"ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ" (బ్ర.సూ. 2,1.36) ఇతి. అనాదౌ చ సంసారే యథా స్వాపప్రబోధయోః ప్రలయప్రభవశ్రవణేఽపి పూర్వప్రబోధవదుత్తరప్రబోధేఽపి వ్యవహారాన్న కశ్చిద్విరోధః, ఏవం కల్పాన్తరప్రభవప్రలయయోరపీతి ద్రష్టవ్యమ్. స్వాపప్రబోధయోశ్చ ప్రలయప్రభవౌ శ్రూయేతే - "యదా సుప్తః స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ప్రాణ ఏవైకధా భవతి, తదైనం వాక్సర్వైర్నామభిః సహాప్యేతి, చక్షుః సర్వై రూపైః సమప్యేతి, శ్రోత్రం సర్వైః శబ్దైః సహాప్యేతి మనః సర్వైర్ధ్యానైః సహాప్యేతి; స యదా ప్రతిబుధ్యతే యథాగ్నేర్జ్వలతః సర్వా దిశో విస్ఫులిఙ్గా విప్రతిష్ఠేరన్ ఏవమేవైతస్మాదాత్మనః సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠన్తే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః" (కౌ.3.3.) ఇతి.

## బాలానందిని

సమానేతి:- "అవృత్తావపి= సృష్టిప్రలయాల ఆవృత్తి ఉన్నా కూడ సమాన నామరూపత్వాత్=సమానమైన నామాలు రూపాలు ఉండడంవల్ల, అవిరోధః=విరోధం లేదు. దర్శనాత్=శ్రుతిలో కనబడడంవల్ల. స్మృతే శ్చ= స్మృతివల్ల కూడ" అని సూత్రార్థం.

**అథాపీతి** :- (ఆశంక) ఈ విధంగా ఆశంక ఉండవచ్చును - పశ్వాదివ్యక్తుల వలె దేవాదివ్యక్తులు కూడ అవిచ్ఛిన్నంగా పుట్టుచూ మరణిస్తూ ఉంటే (వ్యక్తులు మారినా జాతి నిత్యంగా ఉందిగాన) శబ్దం, అర్థం అభిధాత అనగా, అధ్యయనం చేసేవాడు చెప్పేవాడు అనే వ్యవహారం అవిచ్ఛినంగా ఉండడంవల్ల శబ్దార్థాల సంబంధం నిత్యంగా ఉండడంవల్ల, శబ్దం విషయంలో విరోధం పరిహరించబడవచ్చును కాని మొత్తం మూడు లోకాలు నామరూపాలు విచడి సంస్కారం కూడా లేకుండా (నిర్లేపం) లయం పొందుతాయనీ క్రొత్త లోకాలు పుడతాయనీ స్మృతులు చెప్పుతున్నప్పుడు అలాంటి మహాప్రలయానంతరం విరోధం లేకుండా ఎలా ఉంటుంది? ఇక్కడ (సమాధానం) "సమానరూపత్వాత్" అని చెప్పబడుచున్నది - అప్పుడు కూడ అనగా మహాసృష్టి మహాప్రలయా లున్నప్పుడుకూడ సంసారం అనాది అనే విషయం మాత్రం అంగీకరించాలి. సంసారానాదిత్వాన్ని బాదరాయణాచార్యుడే "ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ" అని ప్రతిపాదించనున్నాడు. సంసారం అనాది అయిన తరవాత స్వాపప్రబోధాలలో (సుషుప్తిలోను మేల్కొనడంలోను) ప్రలయం పుట్టడం జరుగుతాయి అని చెప్పినా కూడ వెనుకటి ప్రబోధంలో వలె తరవాతి ప్రబోధంలో కూడ వ్యవహారం జరుగుతూనే ఉండడంలో ఎలా విరోదం లేదో కల్పాంతసృష్టి - మహాప్రలయాలలో కూడ ఇదే విధంగా అని చూచుకొనాలి. స్వాపప్రబోధాలలో ప్రలయప్రభవా లుంటా యని "యదాసుప్తః...లోకాః" అని శ్రుతిలో వినబడు తున్నది. "నిద్రపోయినవాడు ఎప్పుడైతే ఏ స్వప్నమూ చూడడో అప్పుడు ఆ జీవుడు ప్రాణంతో (పరమాత్మతో) ఐక్యం పొందుతాడు. అప్పుడు వాక్కు సమస్తనామాలతోను ఆ ప్రాణాన్ని పొందుతుంది. సమస్తరూపాలతో సహా నేత్రం ప్రాణాన్ని పొందుతుంది. సమస్తశబ్దాలతో సహా శ్రోత్రం ప్రాణాన్ని పొందుతుంది. సమస్తధ్యానాలతోను మనస్సు ప్రాణాన్ని పొందుతుంది. అతడు మేల్కొన్నప్పుడు మండుతున్న అగ్నినుండి నెరసులు అన్ని దిక్కులవైపూ ఎగిరి పడి నట్లు ఈ ఆత్మనుండియే ప్రాణాలు (వాగాదులు) వాటి వాటి స్థానాలకు వచ్చి చేరుకుంటాయి. ప్రాణాల తరవాత వాటి దేవతలు (అగ్న్యాదులు) వాటి తరవాత లోకాలు అనగా శబ్దాదివిషయాలు బైటకు వస్తాయి" అని దీని అర్థం.

## భాష్యమ్

స్యాదేతత్ - స్వాపే పురుషాన్తరవ్యవహారావిచ్ఛేదాత్ స్వయం చ సుప్తప్రబుద్ధస్య పూర్వప్రబోధవ్యవహారానుసంధానసంభవాత్ అవిరుద్ధమ్. మహాప్రలయే తు సర్వవ్యవహారోచ్ఛేదాజ్జన్మాన్తరవ్యవహారవచ్చ కల్పాన్తరవ్యవహారస్యానుసంధాతుమశక్యత్వాద్వైషమ్యమితి. నైష దోషః. సత్యపి సర్వవ్యవహారోచ్ఛేదిని మహాప్రలయే పరమేశ్వరానుగ్రహాదీశ్వరాణాం హిరణ్యగర్భాదీనాం కల్పాన్తరవ్యవహారానుసంధానోపపత్తేః. యద్యపి ప్రాకృతాః ప్రాణినో న జన్మాన్తరవ్యవహారమనుసందధానా దృశ్యన్తే ఇతి తథాపి న ప్రాకృతవదీశ్వరాణాం భవితవ్యమ్. యథా హి ప్రాణిత్వావిశేషే౽పి మనుష్యాదిస్తమ్బపర్యన్తేషు జ్ఞానైశ్వర్యాదిప్రతిబన్ధః పరేణ పరేణ భూయాన్ భవన్ దృశ్యతే తథా మనుష్యాదిష్వేవ హిరణ్యగర్భపర్యన్తేషు జ్ఞానైశ్వర్యాద్యభివ్యక్తిరపి పరేణ పరేణ భూయసీ భవతీత్యేతచ్ఛ్రుతిస్మృతివాదేష్వసకృదనుశ్రూయమాణం న శక్యం నాస్తీతి వదితుమ్. తతశ్చాతీతకల్పానుష్ఠితప్రకృష్టజ్ఞానకర్మణామీశ్వరాణాం హిరణ్యగర్భాదీనాం వర్తమానకల్పాదౌ ప్రాదుర్భవతాం పరమేశ్వరానుగృహీతానాం సుప్తప్రతిబుద్ధవత్ కల్పాన్తరవ్యవహారానుసంధానోపపత్తిః - తథా చ శ్రుతిః

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తం హ దేవమాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే" ( శ్వే. ఉ. 6.18) ఇతి.

స్మరన్తి చ శౌనకాదయః "మధుచ్ఛన్దఃప్రభృతిభిః దాశతయ్యో దృష్టాః" ఇతి. ప్రతివేదం చ ఏవమేవ కాణ్డర్ష్యాదయః స్మర్యన్తే. శ్రుతిరప్యృషిజ్ఞానపూర్వకమేవ మన్త్రేణానుష్ఠానం దర్శయతి - "యో హ వా అవిదితార్షేయచ్ఛన్దోదైవతబ్రాహ్మణేన మన్త్రేణ యాజయతి వాధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి గర్తం వా ప్రతిపద్యతే" ఇత్యనుక్రమ్య "తస్మాదేతాని మన్త్రే మన్త్రే విద్యాత్" (సర్వాను. పరి. ఆర్షేయ బ్రా.1) ఇతి.

## బాలానందిని

స్యాదేతదితి:- (ప్రశ్న) సరే ఇది అలా ఉండనివ్వండి. ఒకడు సుషుప్తిలో ఉన్నా ఇతర పురుషుల వ్యవహారం నడుస్తునే ఉండడంవల్లా, నిద్రించి మేల్కొన్నవాడు

తను పూర్వం మెలకువగా ఉన్నపుడు జరిగిన వ్యవహారాలను అనుసంధానం చేసికొనడం (గుర్తుంచుకొనడం) కుదరడం వల్లా, అక్కడ విరోధం లేదు. కాని మహాప్రలయంలో సమస్త వ్యవహారాలూ ఉచ్ఛిన్న మైపోవడంవల్ల జన్మాంతరవ్యవహారాన్ని ఈ జన్మలో స్మరించడం ఎట్లు సాధ్యం కాదో అట్లే కల్పాంతరంలో జరిగిన వ్యవహారాన్ని కూడ అనుసంధానం చేయించడం శక్యం కాదు గాన స్వాపానికీ దీనికీ తేడా ఉంది. (సమాధానం) - ఈ దోషం లేదు. సమస్తవ్యవహారాలను విచ్ఛిన్నం చేసిన మహాప్రళయం జరిగినా కూడ ఈశ్వరులైన హిరణ్యగర్భాదులు పరమేశ్వరానుగ్రహంవల్ల కల్పాంతరానికి సంబంధించిన వ్యవహారాలను అనుసంధానం చేసికోవడం కుదురుతుంది. ప్రాకృతులైన ప్రాణులు జన్మాంతరంలో జరిగిన వ్యవహారాన్ని అనుసంధానం చేసుకొంటున్నట్లు కనబడకపోయినా ఈశ్వరులుకూడ ప్రాకృతుల వలె కావలసిన పని లేదు. మనుష్యులు మొదలు స్తంబం (ఒక చిన్న పురుగు) వరకు ఉన్నవాళ్లల్లో ప్రాణిత్వం అనేది సమంగానే ఉన్నా వాటి తరువాతి తరువాతివాటికి జ్ఞానైశ్వర్యాల ప్రతిబంధం (జ్ఞానైశ్వర్యాలు అడ్డుకొనబడి తగ్గడం) అధికంగా ఉన్నట్లు ఎలా కనబడుతున్నదో అట్లే మనుష్యులు మొదలు హిరణ్యగర్భునివరకు ఉన్నవారిలోకూడ జ్ఞానైశ్వర్యాదుల అభివ్యక్తి తరువాతి తరువాతివారికి అధికంగా ఉన్నట్లుకనబడుచున్నది అనే విషయం శ్రుతిస్మృత్యాదులలో అనేకపర్యాయాలు చెప్పబడింది. దానిని లేదు అనడం శక్యం కాదు. అందువల్ల గడచిన కల్పంలో ప్రకృష్టమైన జ్ఞానకర్మలు అనుష్ఠించిన, వర్తమానకల్పప్రారంభంలో పుట్టిన, పరమేశ్వరానుగ్రహసంపన్ను లైన హిరణ్యగర్భాదు లైన ఈశ్వరులు నిద్రించి లేచినవాళ వలె కల్పాంతరానికి సంబందించిన వ్యవహారాన్ని అనుసంధానం చేసికొనడం కుదురుతుంది. "యో...ప్రపద్యే" (కల్పప్రారంభంలో ఎవడు బ్రహ్మను సృజించాడో వానికి వేదాలను పంపాడో అట్టి ఆత్మాకారమైన బుద్ధియందు ప్రకాశించు దేవుణ్ణి మోక్షేచ్ఛ గల నేను శరణుపొందుచున్నాను) అను శ్రుతి ఈ విషయమే చెప్పుతున్నది. "మధుచ్ఛందుడు మొదలైన ఋషులు ఋగ్వేదఋక్కులను కనుగొన్నారు" అని శౌనకాదులు చెపుతున్నారు. ప్రతీ వేదానికీకూడ ఈ విధంగానే కాండర్షులు ఉన్నట్లు స్మృతులలో చెప్పబడినది. "యో హ...ప్రతిపద్యతే" (ఋషిసంబంధము చంధస్సు దేవత బ్రాహ్మణం తెలుసుకొనకుండా మంత్రాలచేత యజ్ఞం చేయించేవాడు అధ్యాపనం చేసేవాడు బండరాతిమీద నైనా పడతాడు లేదా గోతిలో పడతాడు) అని ఉపక్రమించి "తస్మాత్...విద్యాత్" (అందువల్ల ప్రతీ మంత్రం విషయంలోను ఋషి ఛందస్సు మొదలైన వాటిని తెలుసుకొవాలి) అని శ్రుతి ఋషిని గూర్చి ముందుగా తెలుసుకొని మంత్రంచేత కర్మానుష్ఠానం చెయ్యాలి అని చెపుతున్నది.

## భాష్యమ్

ప్రాణినాం చ సుఖప్రాప్తయే ధర్మో విధీయతే, దుఃఖపరిహారాయచాధర్మః ప్రతిషిధ్యతే. దృష్టానుశ్రవికసుఖదుఃఖవిషయౌ చ రాగద్వేషౌ భవతః న విలక్షణవిషయావిత్యతో ధర్మాధర్మఫలభూతోత్తరా సృష్టిర్నిష్పద్యమానా పూర్వసృష్టిసదృశ్యేవ నిష్పద్యతే. స్మృతిశ్చ భవతి-

తేషాం యే యాని కర్మాణి ప్రాక్సృష్టేః ప్రతిపేదిరే
తాన్యేవ తే ప్రపద్యన్తే సృజ్యమానాః పునః పునః.
హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే,
తద్భావితాః ప్రపద్యన్తే తస్మాత్తత్తస్య రోచతే. (విష్ణుపు.1.15.62)ఇతి.

ప్రలీయమానమపి చేదం జగచ్ఛక్త్యవశేషమేవ ప్రలీయతే శక్తిమూలమేవ చ ప్రభవతి. ఇతరథాకస్మికత్వప్రసఙ్గాత్. న చానేకాకారాః శక్తయః శక్యాః కల్పయితుమ్. తతశ్చ విచ్ఛిద్యవిచ్ఛిద్యాప్యుద్భవతాం భూరాదిలోకప్రవాహాణాం, దేవతిర్యఙ్మనుష్యలక్షణానాం చ ప్రాణినికాయ ప్రవాహాణాం వర్ణాశ్రమధర్మఫలవ్యవస్థానాం చానాదౌ సంసారే నియతత్వమిన్ద్రియ విషయనియతత్వవత్ప్రత్యేతవ్యమ్. న హీన్ద్రియవిషయసంబన్ధా దేర్వ్యవహారస్య ప్రతిసర్గమన్యథాత్వం షష్ఠేన్ద్రియవిషయకల్పం శక్యముత్ప్రేక్షితుమ్. అతశ్చ సర్వకల్పానాం తుల్యవ్యవహారత్వాత్, కల్పాన్తరవ్యవహారానుసంధాన క్షమత్వాచ్చేశ్వరాణాం సమాననామరూపా ఏవ ప్రతిసర్గం విశేషాః ప్రాదుర్భవన్తి. సమాననామరూపత్వాచ్చావృత్తావపి మహాసర్గమహాప్రలయక్షణాయాం జగతోఽభ్యుపగమ్యమానాయాం న కశ్చిచ్ఛబ్దప్రామాణ్యాదివిరోధః.

## బాలానందిని

ప్రాణినామితి:- ప్రాణులకు సుఖం లభించడంకొరకు ధర్మం విధించబడుతున్నది. దుఃఖాన్ని పరిహరించడంకొరకు అధర్మం నిషేధించబడుతున్నది. రాగద్వేషాలు (మానవునికి) కనబడేవి వినబడేవి అయిన సుఖదుఃఖాలను గూర్చి మాత్రమే కలుగుతాయి గాని వాటికంటె విలక్షణమైనవాటి విషయంలో కలగవు. (అనగా ఇప్పుడు ప్రత్యక్షంగా కనబడుతున్న లేదా శాస్త్రాలలో వినబడుతున్న ధనధాన్యాదిసుఖాన్ని గూర్చి

స్వర్గాదిసౌఖ్యాన్నిగూర్చి రాగం, ప్రత్యక్షంగా కనబడుతున్న లేదా వినబడుతున్న దుఃఖాన్ని గూర్చి ద్వేషం కలుగుతాయి కాని అందుకు భిన్నంగా దుఃఖాన్నిగూర్చి రాగం సుఖాన్ని గూర్చి ద్వేషం లేదా ఏవో అజ్ఞాతవిషయాలను గూర్చి రాగద్వేషాలు కలగవు అని అర్థం) అందువల్ల ధర్మాధర్మాల ఫలమైన, తరవాత వచ్చిన సృష్టి పూర్వసృష్టితో సమానమైనదిగానే ఏర్పడుతుంది. "తేషాం...రోచతే" ఇత్యాదిస్మృతి కూడ ఈ విషయమే చెపుతున్నది. ఆ ప్రాణులలో ఏ ప్రాణులు పూర్వసృష్టిలో ఏ కర్మలుచేశారో మళ్లీ మళ్లీ సృజింపబడిన ఆ ప్రాణులు ఆ కర్మలనే పొందుతాయి (ఆ పనులే చేస్తాయి). ఆ యా వివిధకర్మలచేత భావితాలైన ప్రాణులు (ఆకర్మల సంస్కారాలతో నిండిని ప్రాణులు) తదనుసారంగా హింసతో కూడినవి హింస లేనివి మృదువులు క్రూరములు అయిన పనులను ధర్మాదర్మాలను సత్యానృతాలను పొందుతూంటాయి. అందువల్ల (తద్భావభావితులవడంవల్ల) వాళ్లకి అవి ఇష్టం అవుతాయి" అని ఈ శ్లోకాల అర్థం.

ఈ జగత్తు లీనమైపోయినా కూడ శక్తిమాత్రం శేషించే టట్లుగానే లీనం అవుతుంది. ఆ శక్తినే మూలంగా చేసికొని మళ్లీ పుడుతుంది. అలా కాకపోతే ఈ సృష్టి ఏ కారణమూ లేకుండా (ఆకస్మికంగా) వచ్చింది అని చెప్పవలసి వస్తుంది. అనేకరూపాలు గల శక్తులను కల్పించడం శక్యం కాదు. అనగా పూర్వకల్పంలో ఏ విధమైన సృష్టి ఉండేదో దానికి సంబంధించిన శక్తులుమాత్రమే మహాప్రలయకాలంలో శేషించి ఉంటాయి కాని మరొక రకమైన శక్తు లేవో ఉంటా యని కల్పించడం యుక్తం కాదు అని అర్థం. అందుచేత అనాది యైన ఈ సంసారంలో - భూరాదిలోకాల ప్రవాహాలు, దేవతిర్యఙ్మనుష్యస్వరూపాలైన ప్రాణిసముదాయాల ప్రవాహాలు, వర్ణధర్మ - ఆశ్రమధర్మ - ఫలవ్యవస్థలూ విచ్ఛిన్నా లవుతూ విచ్ఛిన్నాలవుతూ పుడుతున్నా కూడ ఇంద్రియవిషయసంబంధనియతత్వం వలె ఒక నియత మైన పద్ధతిలోనే ఉంటాయని గ్రహించాలి. ఇద్రియవిషయసంబంధాల రూపమైన వ్యవహారం ప్రతిసృష్టికీ వేరు వేరుగా ఉంటుం దని షష్ఠేంద్రియివిషయంవంటిది ఉంటుం దని ఊహించడానికి శక్యం కాదు కదా?

వి. ఇంద్రియాలకీ విషయాలకీ ఉన్న సంబంధం నియత మైనది. కన్నే రూపాన్ని చూస్తుంది; చెవులే శబ్దం వింటాయి. చెవి చూడదు, కన్ను వినదు. ఈ విధంగా ఆ యా ఇంద్రియాలకే ఆ యా విషయాలతో సంబంధం ఏ విధంగా నిశ్చితమో అదే విధంగా ప్రతిసృష్టిలోనూ భూరాదిలోకాదుల స్వరూపాలు నిశ్చితాలుగానే ఉంటాయి. అంతే కాని ఐదు ఇంద్రియాలే కాక ఆరవ ఇంద్రియం ఒకటి ఉందనీ దానికి ప్రత్యేకంగా విషయ మైనది ఒకటేదో ఉంటుందనీ కల్పించడం ఏ విధంగా అసంభావ్యమో

ప్రతిసృష్టికీ భూరాదిలోకాల స్వరూపస్వభావాలు వేరు వేరుగా ఉంటాయనో అసలు ఇవి కాక మరొక విధమైన వేవో వస్తాయనో ఊహించడం శక్యం కాదు అని అర్థం.

అతశ్చేతి:- ఈ విధంగా అన్ని కల్పాలలోను వ్యవహారం సమంగానే ఉంటుంది. ఇతరకల్పాలలో జరిగిన వ్యవహారాలను తెలుసుకొనే శక్తి (హిరణ్యగర్భాదులైన) ఈశ్వరుల కుంటుంది. అదుచేత ప్రతిసృష్టిలోను విశేషాలు సమాననామరూపాలు కలవిగానే ఉంటాయి (సమాననామరూపాలతోనే పుడతాయి). నామరూపాలు సమానంగానే ఉండంచేత జగత్తుకు మహాసర్గం, మహాప్రళయం అనే ఆవృత్తి (మళ్లీ మళ్లీ వస్తూండడం) అంగీకరించినా కూడ శబ్దప్రామాణ్యానికి ఏమీ విరోధం లేదు.

## భాష్యమ్

సమాననామరూపతాం చ శ్రుతిస్మృతీ దర్శయతః—

"సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్,
దివం చ పృథివీం చాన్తరిక్షమథో స్వః". (ఋ.సం.10.190.3) ఇతి.

యథా పూర్వస్మిన్ కల్పే సూర్యాచన్ద్రమఃప్రభృతి జగత్ క్లప్తం తథాస్మిన్నపి కల్పే పరమేశ్వరః అకల్పయదిత్యర్థః. తథా - "అగ్నిర్వాకామయత అన్నాదో దేవానాం స్యామితి. స ఏవమగ్నయే కృత్తికాభ్యః పురోడాశమష్టాకపాలం నిరవపత్" (తై.బ్రా.3.1.4.1) ఇతి నక్షత్రేష్టివిధౌ యో ఽగ్నిర్నిరవపద్యస్మై వాగ్నయే నిరవపత్తయోః సమాననామరూపతాం దర్శయతీత్యేవంజాతీయకా శ్రుతిరిహోదాహర్తవ్యా. స్మృతిరపి-

శ్లో "ఋషీణాం నామధేయాని యాశ్చ వేదేషు దృష్టయః,
-25 శర్వర్యన్తే ప్రసూతానాం తాన్యేవైభ్యో దదాత్యజః.
26.
శ్లో39. యథర్తుష్వృతులిఙ్గాని నానారూపాణి పర్యయే,
40 దృశ్యన్తే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు". (విష్ణుపు 1.5.66)
10.

"యథాభిమానినోఽతీతాస్తుల్యాస్తే సాంప్రతైరిహ,
దేవాఽదేవైరతీతైర్హి రూపైర్నామభి రేవ చ".

ఇత్యేవంజాతీయకా ద్రష్టవ్యా. 30

## బాలానందిని

సమానేతి:- అన్ని సృష్టులలోను నామరూపాలు సమంగానే ఉంటాయని శ్రుతిస్మృతులు చూపుతున్నాయి. "సూర్యా... స్వః" (బ్రహ్మదేవుడు సూర్యచంద్రులను, ద్యులోక - పృథివీ - అంతరిక్ష - స్వర్గలోకాలను పూర్వం వలెనే కల్పించాడు) అని శ్రుతి. సూర్యచంద్రాదిక మైన జగత్తు పూర్వకల్పంలో ఏ విధంగా కల్పించబడిందో అట్లే ఈ కల్పంలో కూడ పరమేశ్వరుడు కల్పించాడు అని అర్థం. అట్లే "అగ్ని... నిరవపత్" (అగ్ని, అనగా తాను అగ్ని కావాలనే కోరిక గల ఒక యజమానుడు, దేవతల అన్నాన్ని తినేవాడనుగా కావాలని కోరాడు. అతడు కృత్తికానక్షత్రాభిమానిదేవత యైన అగ్నికొరకు ఎనిమిది కపాలాలలో సంస్కరించబడిన పురోడాశం ఉంచాడు) అను శ్రుతి నక్షత్రేష్టివిధిలో ఏ అగ్ని (అగ్నిగా కావాలని కోరిక గల యజమానుడు) నిర్వాపం చేశాడో, ఏ అగ్ని కొరకై నిర్వాపం చేశాడో వాళ్లిద్దరూ సమాననామరూపాలు కలవారన్నట్లు చెపుతున్నది, ఈ విధమైన శ్రుతి ఇక్కడ ఉదాహరించదగినది.

వి. దేవతలకు హవిస్సును తీసికొని వెళ్ళే అగ్నిదేవుడు ఒకడున్నాడు. అలాంటి అగ్ని దేవుడుగా తాను కావాలని కోరుకుంటూ ఒక యజమానుడు అగ్నికి అష్టాదశకపాలాలలో సంస్కరించిన పురోడాశం సమర్పిస్తూ యజ్ఞం చేశాడు. అలా చేయడం వల్ల అప్పుడున్న అగ్నియొక్క కాలం పూర్తి అయి పోయిన తరవాత ఈ యజమానుడు అగ్ని అయ్యాడు అని దీని భావం. ఈ యజమానుడు అగ్ని కాబోతున్నాడు గాన 'అగ్ని' పదంచేత నిర్దేశింపబడ్డాడు. దానిని పట్టి అగ్న్యాదులు తత్తత్స్థానాధిపతులనీ, ఆ యా మన్వంతరాలలో పుట్టి కొన్నాళ్లుంటా రనీ తెలుస్తూన్న దని భావం.

"ఋషీణాం.... నామభిరేవ చ" ఇత్యాదిస్మృతి వంటి స్మృతులను కూడ ఉదాహరించాలి. "ప్రాచీన ఋషులకు ఏ పేర్లు ఉండేవో, వాళ్లు ఏ వేదాలను చూచారో, వాటినే బ్రహ్మదేవుడు ప్రలయాంతంలో సృజింపబడిన వీళ్లకు ఇస్తాడు. ఋతువులు మారుతున్నప్పుడు అనేక రూపాలు గల సమానమైన ఆ ఋతుచిహ్నాలే ఏ విధంగా కనబడతూంటాయో అట్లే యుగాల ప్రారంభాలలో పదార్థాలు కనబడుతూంటాయి. పూర్వం ఉండే ఇంద్రాగ్న్యాద్యభిమానిదేవతలు ఇప్పుడున్న దేవతలతోను వాళ్లకు ముందు గడచిన దేవతలతోను నామరూపాలచేత సమంగా ఉంటారు" అని ఈ శ్లోకాల అర్థం. 30

## సూ. మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః 1.3.31

ఇహ దేవాదీనామపి బ్రహ్మవిద్యామస్త్యధికార ఇతి యత్ ప్రతిజ్ఞాతం తత్పర్యావర్త్యతే. దేవానామనధికారం జైమినిరాచార్యో మన్యతే. కస్మాత్? మధ్వాదిష్వసంభవాత్. బ్రహ్మవిద్యాయామధికారాభ్యుపగమే హి విద్యాత్వావిశేషా న్మధ్వాదివిద్యాస్వప్యధికారోఽ భ్యుపగమ్యేత. న చైవం సంభవతి. కథమ్? "అసౌ వా ఆదిత్యో దేవమధు" (ఛాం. ఉ. 3.1.1) ఇత్యత్ర మనుష్యాః ఆదిత్యం మధ్వధ్యాసేనోపాసీరన్. దేవాదిషు హ్యుపాసకేష్వభుపగమ్య మానేషు ఆదిత్యః కమన్యమాదిత్యముపాసీత. పునశ్చాదిత్యవ్యపాశ్రయాణి పఞ్చ రోహితాదీన్యుపక్రమ్య వసవో రుద్రా ఆదిత్యా మరుతః సాధ్యాశ్చ పఞ్చ దేవగణాః క్రమేణ తత్తదమృతముపజీవన్తీతి ఉపదిశ్య "స య ఏతదేవమమృతం వేద వసూనామేవైకో భూత్వాగ్నినైవ ముఖేనైతదమృతం దృష్ట్వా తృప్యతి" ఇత్యాదినా వస్వాద్యుపజీవ్యాన్యమృతాని విజానతాం వస్వాది మహిమప్రాప్తిం దర్శయతి. వస్వాదయస్తు కానన్యాన్వస్వాదీనమృతోపజీవినో విజానీయుః, కం వాఽన్యం వస్వాదిమహిమానం ప్రేప్సేయుః? తథా "అగ్నిః పాదో వాయుః పాద ఆదిత్యః పాదో దిశః పాదః" (ఛా ఉ. 3.18.2) "వాయుర్వావ సంవర్గః" (ఛా. ఉ. 4.3.1) "ఆదిత్యో బ్రహ్మేత్యా దేశః" (ఛా ఉ. 3.11.1) ఇత్యాదిషు దేవతాత్మోపాసనేషు న తేషామేవ దేవతాత్మనామధికారః సంభవతి. తథా "ఇమావేవ గోతమ భరద్వాజావయమేవ గోతమోఽయం భరద్వాజః" (బృ.ఉ. 2.2.4) ఇత్యాదిష్వప్యృషిసంబన్ధేషూపాసనేషు న తేషామేవర్షీణామధికారః సంభవతి. 31.

### బాలానందిని

మధ్వాదిష్వితి :- "మధ్వాదిషు = మధువిద్యాదులందు, అసంభవాత్ = కుదరదు గాన, జైమినిః = జైమిని, అనధికారమ్ = దేవాదులకు అధికారం లేదని చెపుతున్నాడు" అని సూత్రార్థం.

ఇహేతి :- దేవాదులకు కూడ బ్రహ్మ విద్యయందు అధికారం ఉన్నది అని చెప్పినదానిని ఇక్కడ తిరగతోడడం జరుగుతున్నది. దేవాదులకు అధికారం లేదని

జైమిన్యాచార్యుడు భావిస్తున్నాడు. ఎందువల్ల? మధువిద్యాదులందు కుదరకపోవడం వల్ల. బ్రహ్మవిద్యయందు అధికారం దేవాదులకు ఉంది అని అంగీకరిస్తే, అవి కూడ బ్రహ్మవిద్యాంతర్గతాలే కాబట్టి, మధ్వాదివిద్యలయందు కూడ అధికారం ఉన్నదని చెప్పవలసి ఉంటుంది. అది కుదరదు? ఎట్లు? "అసౌ వా ఆదిత్యో దేవమధు" (ఈ ఆదిత్యుడు దేవతలకు మధువు - తేనె) అన్నచోట మనుష్యులు ఆదిత్యుణ్ణి దేవతల మధువునుగా ఉపాసించవచ్చును. కాని దేవాదులు కూడ ఉపాసకులు కావచ్చును అని అంటే ఆదిత్యు డనే దేవత మరొక ఆదిత్యుణ్ణి ఎవనిని ఉపాసిస్తాడు? ఇంకా ఆదిత్యునికి సంబంధించిన రోహితం మొదలైన ఐదు అమృతాలను గూర్చి చెప్పడం ప్రారంభించి, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, సాధ్యులు అనే ఐదు దేవగణాలు క్రమంగా ఆ అమృతంమీద ఆధారపడి జీవిస్తున్నాయి అని ఉపదేశించి "స య.... తృప్యతి" (ఎవ డైతే ఈ అమృతాన్ని గూర్చి ఈ విధంగా తెలుసుకుంటాడో అతడు వసువులలో ఒకడుగా అయి ముఖమైన అగ్నితో ఈ అమృతాన్ని చూచి తృప్తి చెందుతాడు) ఇత్యాదివాక్యంచేత వస్వాదులచేత ఉపజీవ్యాలైన (దేని మీద ఆధారపడి జీవిస్తారో అది ఉపజీవ్యం) అమృతాలను గూర్చి తెలుసుకొనే వాళ్లకు వస్వాదిమహిమ లభిస్తుందని చెప్పుచున్నాడు. అలాంటప్పుడు వస్వాదులు అమృతోపజీవులైన ఏ ఇతర వస్వాదులను గూర్చి తెలుసుకుంటారు? తమకంటె భిన్నమైన ఏ వస్వాదిరూపాన్ని పొంద గోరుతారు? అట్లే "అగ్నిః ..... పాదః" (ఆకాశ బ్రహ్మకు అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు నాలుగు పాదాలు), "వాయుర్వావ సంవర్గః" (వాయువే సంవర్గం), "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" (ఆదిత్యుడే బ్రహ్మయని ఉపదేశం) ఈ మొదలైన దేవతాత్మల ఉపాసనలయందు ఆ దేవతాత్మలకే అధికారం కుదరదు. అట్లే "ఇమావేవ... భరద్వాజః" ఇత్యాదులైన ఋషులకు సంబంధించిన ఉపాసనల యందు ఆ ఋషులకే అధికారం కుదరదు. (శిరస్సు అనే చమసం పాత్రలో ఉన్న ఏడు ఇంద్రియాల మీద సప్తర్షిదృష్టి ఉంచి ఉపాసన చెయ్యాలి. కుడి చెవి గౌతముడు, ఎడమ చెవి భరద్వాజుడు, కుడి కన్ను విశ్వామిత్రుడు, ఎడమ కన్ను జమదగ్ని, కుడి ముక్కు వసిష్ఠుడు, ఎడమ ముక్కు కశ్యపుడు, వాక్కు అత్రి. ఈ ఉపాసనలో సప్తర్షులను గూర్చియే ధ్యానం చెయ్యాలి గాన సప్తర్షులు ఈ ఉపాసన చేయజాలరు అని అర్థం). 31.

## భాష్యమ్

కుతశ్చ దేవానామనధికారః-

సూ. జ్యోతిషి భావాచ్చ 1.3.32

యదిదం జ్యోతిర్మణ్డలం ద్యుస్థానమహోరాత్రాభ్యాం బమ్భ్రమజ్జగదవభాసయతి తస్మిన్నాదిత్యాదయో దేవతావచనాః శబ్దాః ప్రయుజ్యన్తే, లోకప్రసిద్ధేర్వాక్యశేషప్రసిద్ధేశ్చ. న చ జోతిర్మణ్డలస్య హృదయాదినా విగ్రహేణ, చేతనతయార్థిత్వాదినా వా యోగోఽవగన్తుం శక్యతే, మృదాదివదచేతనత్వావగమాత్. ఏతేనాగ్న్యాదయో వ్యాఖ్యాతాః. స్యాదేతత్ - మన్త్రార్థవాదేతిహాసపురాణలోకేభ్యో దేవాదీనాం విగ్రహవత్త్వాద్యవగమాదయమదోష ఇతి; నేత్యుచ్యతే. న హి తావల్లోకో నామ కించిత్ స్వతన్త్రం ప్రమాణమస్తి; ప్రత్యక్షాధిభ్య ఏవ హ్యవిచారితవిశేషేభ్యః ప్రమాణేభ్యః ప్రసిధ్యన్నర్థో లోకాత్ప్రసిధ్యతీత్యుచ్యతే. న చాత్ర ప్రత్యక్షాదీనామన్యతమం ప్రమాణమస్తి. ఇతిహాసపురాణమపి పౌరుషేయత్వాత్ప్రమాణాన్తరమూలమాకాఙ్క్షతి. అర్థవాదా అపి విధినైకవాక్యత్వాత్ సుత్యర్థాః సన్తో న పార్థగర్థ్యేన దేవాదీనాం విగ్రహాదిసద్భావే కారణభావం ప్రతిపద్యన్తే. మన్త్రా అపి శ్రుత్యాదివినియుక్తాః ప్రయోగసమవాయినః అభిధానార్థాః స కస్య చిదర్థస్య ప్రమాణమిత్యాచక్షతే. తస్మాదభావో దేవదీనామధికారస్య. 32.

## బాలానందిని

కుతశ్చేతి :- ఇంకా ఏ కారణంవల్ల కూడ దేవాదులకు అధికారం లేదు?

జ్యోతిషీతి :- జ్యోతిషి = సూర్యమండలం మొదలైన అర్థంలో, భావాత్ = ఆదిత్యాదిశబ్దాలు ప్రవర్తించడంవల్ల దేవలతలకు విగ్రహాదులు లేవు, అధికారం లేదు" అని సూత్రార్థం.

యదితి :- అహోరాత్రాలు తిరుగుతూ జగత్తును ప్రకాశింప చేస్తూన్న ఏ ఈ జ్యోతిర్మండలం ఉన్నదో దానియందే (ఆ జ్యోతిర్మండలం అనే అర్థంలోనే) దేవతా వాచకాలైన శబ్దాలు ప్రయోగించబడుతున్నాయి. ఈ విషయం లోకప్రసిద్ధిని పట్టీ,, వాక్యశేషాల ప్రసిద్ధినీ పట్టీ తెలుస్తూన్నది. జోతిర్మండలం మట్టి మొదలైనవి వలె అచేతనమని తెలుస్తూన్నది గాన దానికి హృదయం మొదలైన శరీరంతో గాని,

చేతనత్వంతో గాని, అర్థిత్వం (కోరిక) మొదలైనవాటితో కాని సంబంధం ఉన్నట్లు తెలియడానికి శక్యం కాదు. దీనిచేత అగ్న్యాదుల విషయం కూడ చెప్పినట్లే, అనగా అవి కూడ అచేతనాలే, విగ్రహాదులు లేనివే. (పూర్వపక్షితో సిద్ధాంతి అంటూన్నది) సరే ఆ విషయం అలా ఉండనీ. మంత్రాలు, అర్థవాదలు, ఇతిహాసాలు, పురాణాలు, లోకం - వీటిని బట్టి దేవాదులకు విగ్రహం ఉందని తెలుస్తూన్నది గాన దోషం లేదు. (సమాధానం) - కాదు అంటాం. లోకం అంటూ స్వతంత్రమైన ప్రమాణం ఏదీ లేదు కదా? ప్రత్యక్షాదిప్రమాణాల ద్వారా తెలిసిన విషయమే, దానిలో ఉన్న విశేషాన్ని సరిగా పరిశీలించకుండా ప్రసిద్ధిలోనికి వస్తే, అది లోకంవల్ల ప్రసిద్ధమైనది అంటాం. ఈ విషయంలో (దేవతలకు విగ్రహాదు లున్నాయి అనే విషయంలో) ప్రత్యక్షాది ప్రమాణాలలో ఒక్కటి కూడ లేదు. ఇతిహాసపురాణాలు పౌరుషేయాలు గాన వాటి ప్రామాణ్యం సిద్ధించాలంటే మరొక ప్రమాణంయొక్క అపేక్ష ఉంటుంది. అర్థవాదాలు విధివాక్యంతో ఏకవాక్యత్వాన్ని పొంది (విధి వాక్యంచేత విధించబడిన దానిని) స్తుతించడంకొరకే ఉద్దిష్టమై ఉన్నాయి గాన అవి వేరుగా అర్థం బోధించి దేవతలకు దేహాదులున్నాయి అని చెప్పడానికి కారణం కాజాలవు. మంత్రాలు కూడ, 'శ్రుతి' మొదలైనవి వీటిని ఫలానా కర్మలో వినియోగించాలి అని చెప్పగా ఆ విధంగా వినియోగించబడుతూ ప్రయోగంతో (కర్మానుష్ఠానంతో) సంబంధించిన విషయాన్ని చెప్పడం కోసమే ఉద్దిష్టమైనవి గాని స్వతంత్రంగా ఏ అర్థమూ చెప్పజాలవు అని (మీమాంసకులు) అంటున్నారు. అందువల్ల దేవాదులకు అధికారం లేదు.

వి. వేదంలో నాలుగు విధాలైన వాక్యాలు ఉన్నాయి. కొన్ని విధివాక్యాలు, ఈ కర్మ చెయ్యాలి, ఆ కర్మ చెయ్యాలి అని చెప్పేవి. అవి ప్రమాణాలు. ఇలా చేయ కూడదు అని చెప్పేవి నిషేధవాక్యాలు. అవీ ప్రమాణమే. విధివాక్యాలచేత విధించ బడిన కర్మలను స్తుతిస్తూ, లేదా కొన్నింటిని నిందిస్తూ ఉన్న వాక్యాలు అర్థవాదలు. వీటి ఏకైక ప్రయోజనం స్తుతించడమో నిందించడమో తప్ప మరేమీ లేదు. స్తుతిస్తూ నిందిస్తూ అవి చెప్పిన విషయాలు ప్రమాణాలు కావు. ఇది మంచిది ఇది చెడ్డది అని చెప్పడం మాత్రమే వాటి పని. ఇంక మంత్రాలు- ఈ కర్మ చేసేటప్పుడు ఈ మంత్రం చదవాలి అని చెప్పబడి ఉంటుంది. దీనినే వినియోగించడం అంటారు. ఆ మంత్రాలు చదువుతున్నప్పుడు చేస్తూన్న ఆ కర్మను గూర్చి ఏదైనా వాటిలో ఉంటే ఉండవచ్చు. కర్మకు సంబంధించిన ఆ విషయాన్ని మంత్రపఠనపూర్వకంగా స్మరిస్తూ కర్మ చెయ్యాలి.

మంత్రాలలో చెప్పిన విషయాలు ఇంకా ఏవైనా ఉంటే వాటిని ప్రమాణంగా తీసికొన వలసిన పని లేదు. కర్మానుష్ఠానంలో వినియోగించబడడమే మంత్రాల పరమ ప్రయోజనం. ఇతిహాసపురాణాలు పురుషవిరచితాలు గాన వాటికి స్వతంత్రంగా ప్రామాణ్యం లేదు. ఇది పూర్వమిమాంసకుల మతం. జైమిని మతంగా చెప్పబడిన ఈ పూర్వపక్షం వాళ్ల ఈ సిద్ధాంతం మీద ఆధారపడింది.

**సూ. భావంతు బాదరాయణోఽ స్తి హి. 1.3.33.**

తుశబ్దః పూర్వపక్షం వ్యావర్తయతి. బాదరాయణస్త్వాచార్యో భావమధికారస్య దేవాదీనామపి మన్యతే. యద్యపి మధ్వాదివిద్యాసు దేవతాదివ్యామిశ్రాస్వసంభవోఽధికారస్య, తథాప్యస్తి హి శుద్ధాయాం బ్రహ్మ విద్యాయాం సంభవః, అర్థిత్వసామర్థ్యాప్రతిషేధాద్యపేక్షత్వాదధి కారస్య. న చ క్వచిదసంభవ ఇత్యేవతా యత్ర సంభవస్తత్రాప్యధికారోఽ పోద్యేత. మనుష్యాణామపి న సర్వేషాం బ్రాహ్మణాదీనాం సర్వేషు రాజసూయాదిష్వధికారః సంభవతి. తత్ర యో న్యాయః సోఽత్రాపి భవిష్యతి. బ్రహ్మవిద్యాం చ ప్రకృత్య భవతి దర్శనం శ్రౌతం దేవాద్యధికారస్య సూచకమ్ - "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తత్తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణామ్" (బృ.ఉ. 1.4.10) ఇతి. "తే హోచుర్ధ న్త తమాత్మానమన్విచ్ఛామో యమాత్మానమన్విష్య సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్" ఇతి, "ఇన్ద్రో హ వై దేవానామభిప్రవవ్రాజ విరోచనోఽసురాణామ్" (ఛాం.ఉ. 8.7.2) ఇత్యాది చ. స్మార్తమపి గన్ధర్వయాజ్ఞవల్క్య సంవాదాది.

## బాలానందిని

భావమితి :- "తు = కాని, బాదరాయణః = బాదరాయణుడు, భావమ్ = అధికారం ఉండడాన్ని అంగీకరిస్తున్నాడు. అస్తి హి = శుద్ధ బ్రహ్మ విద్యలో అధికారం ఉంది కదా" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దం పూర్వపక్షాన్ని నిరాకరించుచున్నది. బాదరాయణాచార్యు డైతే దేవాదులకు కూడ అధికారం ఉందని తలుస్తున్నాడు. దేవతాదులతో కలిసిన మధ్వాదివిద్యలలో అధికారం కుదరకపోయినా శుద్ధబ్రహ్మవిద్యలో సంభవం ఉంది కదా? అధికారానికి కావలసినవి అర్థిత్వం (కోరిక), సామర్థ్యం, నిషేధం లేకపోవడం

- ఇలాంటివే కదా. ఒకదానిలో కుదరదు కదా అని, సంభవం అయిన చోట కూడ అధికారం నిరాకరించబడకూడదు కదా. మనుష్యులలో కూడ బ్రాహ్మణాదులకు అందరికీ రాజసూయం మొదలైన అన్ని యజ్ఞాలలోను అధికారం లేదు. అక్కడ ఏ న్యాయమో అదే ఇక్కడ కూడా వర్తిస్తుంది. బ్రహ్మవిద్యను ప్రస్తావించి, శ్రుతిలో, దేవాదులకు, అధికారాన్ని సూచిస్తూ "తద్యో..... మనుష్యాణామ్" (దేవతలలో ఎవడెవడు ఆత్మస్వరూపాన్ని తెలుసుకున్నాడో అతడు ఆ బ్రహ్మగానే అయ్యాడు. అట్లే ఋషులలోను, మనుష్యులలోను కూడ) అనీ, "తేహ..... కామాన్" (ఆ దేవతలు ఒకరితో ఒకరు ఇలా అన్నారు - ఏ ఆత్మను అన్వేషించి సమస్తలోకాలను సమస్త కామాలను పొందుతారో అట్టి ఆత్మను అన్వేషించుదాం) అని, "ఇన్ద్రో... అసురాణామ్" (దేవతలలో ఇంద్రుడు, అసురులలో విరోచనుడు బ్రహ్మవిద్య కొరకై ప్రజాపతి దగ్గరికి వెళ్లారు) అనీ ఈ విధమైన వాక్యాలు కనబడుతున్నాయి. స్మృతులకు సంబంధించిన గంధర్వ - యాజ్ఞవల్క్యసంవాదాదికం కూడ కనబడుతున్నది. (అమృతమైన బ్రహ్మ ఏది అని గంధర్వుడు ప్రశ్నించగా యాజ్ఞవల్క్యుడు వానికి ఉపదేశించాడు అని భారతంలో మోక్షధర్మప్రకరణంలో ఉంది).

## భాష్యమ్

యదప్యుక్తమ్ - "జోతిషి భావాచ్చ" ఇతి - అత్ర బ్రూమః - జ్యోతిరాది విషయా అపి ఆదిత్యాదయో దేవతావచనాః శబ్దాః చేతనావన్త మైశ్వర్యాద్యుపేతం తం తం దేవాత్మానం సమర్పయన్తి, మన్త్రార్థవాదాదిషు తథా వ్యవహారాత్. అస్తి హ్యైశ్వర్యయోగాద్దేవతానాం జ్యోతిరాద్యాత్మభిశ్చావస్థాతుం, యథేష్టం చ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యమ్. తథాహి శ్రూయతే సుబ్రహ్మణ్యార్థవాదే "మేధాతిథేర్మేష" ఇతి. "మేధాతిథిం హ కాణ్వాయనమిన్ద్రో మేషో భూత్వా జహార" (షడ్వింశబ్రా. 1.1.) ఇతి. స్మర్యతే చ "ఆదిత్యః పురుషో భూత్వా కున్తీముపజగామ హ" ఇతి. మృదాదిష్వపి చేతనా అధిష్ఠాతారోఽభ్యుపగమ్యన్తే - "మృదబ్రవీత్" "ఆపోఽబ్రువన్" ఇత్యాదిదర్శనాత్. జ్యోతిరాదేస్తు భూతధాతోః ఆదిత్యాదిషు అచేతనత్వమభ్యుపగమ్యతే, చేతనాస్త్వధిష్ఠాతారో దేవతాత్మానో మన్త్రార్థవాదాదిషు వ్యవహారాదిత్యుక్తమ్.

## బాలానందిని

యదపీతి :- "జోతిషి భావాచ్చ" అని చెప్పినదానికి సమాధానం చెపుతున్నాం. దేవతావాచకాలైన ఆదిత్యాదిశబ్దాలు జ్యోతిరాదులను బోధిస్తున్నా కూడ చేతన గల, ఐశ్వర్యవంతులైన ఆయా దేవతాత్మను బోధిస్తాయి. మంత్రార్థ వాదాదులలో ఆ విధంగానే వ్యవహారం ఉంది. దేవతలు ఐశ్వర్యవంతు లవడంచేత జ్యోతిరాది స్వరూపాలతో ఉండడానికీ, తమ ఇష్టం ప్రకారం ఆ యా శరీరాలను ధరించడానికి కూడ వాళ్లకి సామర్థ్యం ఉంది. సుబ్రహ్మణ్యార్థవాదలో (ఉద్గాతల గణంలో ఉన్న ఒక ఋత్విక్కు సుబ్రహ్మణ్యుడు. అతనికి సంబంధించిన అర్థవాదలు) "మేధాతిథేర్మేష" అని వినబడుచున్నది. (మేధాతిథి కోసం మేష మైన ఇంద్రా! రా అని అర్థం). "మేధాతిథిం... జహార" (ఇంద్రుడు గొఱ్ఱె రూపం ధరించి కాణ్వాయణుడైన మేధాతిథిని అపహరించాడు) అని (బ్రాహ్మణంలో) చెప్పబడింది. "ఆదిత్యః... ఉపజగామ హ" (ఆదిత్యుడు పురుషరూపం ధరించి కుంతిని సమీపించాడు) అని స్మృతిలో (భారతంలో) చెప్పబడింది. "మృదబ్రవీత్" (మృత్తు పలికింది) "ఆపోఽబ్రువన్" (జలం పలికింది) ఇత్యాదివాక్యాలు కనబడడంవల్ల మృదాదులలో కూడ చేతనులు అధిష్ఠాతలుగా ఉన్నట్లు అంగీకరించబడుతుంది. ఆదిత్యాదులకు సంబంధించిన జ్యోతిరాదికమైన భూతధాతువు మాత్రం అచేతనమే. వాటిని అదిష్ఠించి ఉన్న దేవతలు చేతనులు. ఆ విధంగానే మంత్రార్థవాదాలలో వ్యవహారం కనబడుతున్నది అని చెప్పి ఉన్నాం.

## భాష్యమ్

యద ప్యుక్తమ్ - మన్త్రార్థవాదయోరన్యార్థత్వాన్న దేవతావిగ్రహాది ప్రకాశనసామర్థ్యమితి - అత్ర బ్రూమః - ప్రత్యయాప్రత్యయౌ హి సద్భావా సద్భావయోః కారణం, నాన్యార్థత్వమనన్యార్థత్వం వా. తథా హ్యన్యార్థమపి ప్రస్థితః పథి పతితం తృణపర్ణాద్యస్తీత్యేవ ప్రతిపద్యతే. అత్రాహ - విషమ ఉపన్యాసః తత్ర హి తృణపర్ణాదివిషయం ప్రత్యక్షం ప్రవృత్తమస్తి యేన తదస్తిత్వం ప్రతిపద్యతే. అత్ర పునర్విధ్యుద్దేశైకవాక్యభావేన స్తుత్యర్థవాదే న పార్థగర్థ్యేన వృత్తాన్తవిషయా ప్రవృత్తిః శక్యాధ్యవసాతుమ్. న హి మహావాక్యేఽర్థ ప్రత్యాయకేఽవాన్తరవాక్యస్య పృథక్ ప్రత్యాయకత్వ మస్తి. యథా "న సురాం పిబేత్" ఇతి నఞ్వతి వాక్యే పదత్రయసంబన్ధాత్ సురాపానప్రతిషేధ ఏవైకోఽర్థోఽవగమ్యతే న పునః 'సూరాం పిబేత్' ఇతి పదద్వయ సంబన్ధాత్ సురాపాన విధిరపీతి. అత్రోచ్యతే - విషమ ఉపన్యాసః. యుక్తం యత్సురాపానప్రతిషేధే

## బాలానందిని

యదపీతి :- "జోతిషి భావాచ్చ" అని చెప్పినదానికి సమాధానం చెపుతున్నాం. దేవతావాచకాలైన ఆదిత్యాదిశబ్దాలు జ్యోతిరాదులను బోధిస్తున్నా కూడ చేతన గల, ఐశ్వర్యవంతుడైన ఆయా దేవతాత్మను బోధిస్తాయి. మంత్రార్థ వాదాదులలో ఆ విధంగానే వ్యవహారం ఉంది. దేవతలు ఐశ్వర్యవంతు లవడంచేత జ్యోతిరాది స్వరూపాలతో ఉండడానికీ, తమ ఇష్టం ప్రకారం ఆ యా శరీరాలను ధరించడానికీ కూడ వాళ్లకి సామర్థ్యం ఉంది. సుబ్రహ్మణ్యార్థవాదలో (ఉద్గాతల గణంలో ఉన్న ఒక ఋత్విక్కు సుబ్రహ్మణ్యుడు. అతనికి సంబంధించిన అర్థవాదలు) "మేధాతిథేర్మేష" అని వినబడుచున్నది. (మేధాతిథి కోసం మేష మైన ఇంద్రా! రా అని అర్థం). "మేధాతిథిం... జహార" (ఇంద్రుడు గొఱ్ఱె రూపం ధరించి కాణ్వాయణుడైన మేధాతిథిని అపహరించాడు) అని (బ్రాహ్మణంలో) చెప్పబడింది. "ఆదిత్యః... ఉపజగామ హ" (ఆదిత్యుడు పురుషరూపం ధరించి కుంతిని సమీపించాడు) అని స్మృతిలో (భారతంలో) చెప్పబడింది. "మృదబ్రవీత్" (మృత్తు పలికింది) "ఆపోऽబ్రువన్" (జలం పలికింది) ఇత్యాదివాక్యాలు కనబడడంవల్ల మృదాదులలో కూడ చేతనులు అధిష్ఠాతలుగా ఉన్నట్లు అంగీకరించబడుతుంది. ఆదిత్యాదులకు సంబంధించిన జ్యోతిరాదికమైన భూతధాతువు మాత్రం అచేతనమే. వాటిని అదిష్ఠించి ఉన్న దేవతలు చేతనులు. ఆ విధంగానే మంత్రార్థవాదాలలో వ్యవహారం కనబడుతున్నది అని చెప్పి ఉన్నాం.

## భాష్యమ్

యద ప్యుక్తమ్ - మన్త్రార్థవాదయోరన్యార్థత్వాన్న దేవతావిగ్రహాది ప్రకాశనసామర్థ్యమితి - అత్ర బ్రూమః - ప్రత్యయాప్రత్యయౌ హి సద్భావా సద్భావయోః కారణం, నాన్యార్థత్వమనన్యార్థత్వం వా. తథా హ్యన్యార్థమపి ప్రస్థితః పథి పతితం తృణపర్ణాద్యస్తీత్యేవ ప్రతిపద్యతే. అత్రాహ - విషమ ఉపన్యాసః తత్ర హి తృణపర్ణాదివిషయం ప్రత్యక్షం ప్రవృత్తమస్తి యేన తదస్తిత్వం ప్రతిపద్యతే. అత్ర పునర్విధ్యుద్దేశైకవాక్యభావేన స్తుత్యర్థవాదే న పార్థగర్థ్యేన వృత్తాన్తవిషయా ప్రవృత్తిః శక్యాధ్యవసాతుమ్. న హి మహావాక్యేऽర్థ ప్రత్యాయకేऽవాన్తరవాక్యస్య పృథక్ ప్రత్యాయకత్వ మస్తి. యథా "న సురాం పిబేత్" ఇతి నఞ్వతి వాక్యే పదత్రయసంబన్ధాత్ సురాపానప్రతిషేధ ఏవైకోऽర్థోऽవగమ్యతే న పునః 'సూరాం పిబేత్" ఇతి పదద్వయ సంబన్ధాత్ సురాపాన విధిరపీతి. అత్రోచ్యతే - విషమ ఉపన్యాసః. యుక్తం యత్సురాపానప్రతిషేధే

పదాన్వయస్యైకత్వాత్ అవాన్తరవాక్యార్థస్యాగ్రహణమ్. విధ్యుద్దేశార్థవాదయోస్తు అర్థవాదస్థాని పదాని పృథగన్వయం వృత్తాన్తవిషయం ప్రతిపద్యానన్తరం కైమర్థ్యవశేన కామం విధేః స్తావకత్వం ప్రతిపద్యన్తే. యథా హి - "వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః" ఇత్యత్ర విధ్యుద్దేశవర్తినాం వాయవ్యాదిపదానాం విధినా సంబన్ధః, నైవం "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా వాయుమేవ స్వేన భాగధేయేనోపధావతి స ఏవైనం భూతిం గమయతి" ఇత్యేషామర్థవాదగతానాం పదానామ్. న హి భవతి వాయుర్వా ఆలభేతేతి, క్షేపిష్ఠా దేవతా వా ఆలభేతేత్యాది. వాయుస్వభావసంకీర్తనేన తు అవాన్తరమన్వయం ప్రతిపద్యైవం విశిష్ట దైవత్యమిదం కర్మేతి విధిం స్తువన్తి. తద్యత్ర సోఽవాన్తర వాక్యార్థః ప్రమాణాన్తరగోచరో భవతి తత్ర తదనువాదేనార్థవాదః ప్రవర్తతే. యత్ర ప్రమాణాన్తరవిరుద్ధస్తత్ర గుణవాదేన. యత్ర తు తదుభయం నాస్తి తత్ర కిం ప్రమాణాన్తరాభావాద్గుణవాదః స్యాదాహోస్విత్ప్రమాణాన్తరావిరోధాద్విద్యమానార్థవాద ఇతి ప్రతీతిశరణైః విద్యమానార్థ వాద ఆశ్రయణీయః. ఏతేన మన్త్రో వ్యాఖ్యాతః.

## బాల్మ లానందిని

యదితి : - మంత్రార్థవాదలు మరొక ప్రయోజనంకొరకు ఉద్దేశింపబడినవి అవడంచేత దేవతా విగ్రహాదులను ప్రతిపాదించే సామర్థ్యం వాటికి లేదని (పూర్వపక్షి) చెప్పిన దానిని గూర్చి (సమాధానం) చెపుతున్నాం. వాటివల్ల ఆ అర్థం వస్తుందా (తెలియబడుతుందా) లేదా అనేవి సామర్థ్యం ఉంది లేదు అనడానికి కారణం గాని ఆ చెప్పబడింది మరొక ప్రయోజనంకొరకా లేక కాదా అనేది కారణం కాదు. మరొక పనిమీద గ్రామంతరానికి ప్రయాణమైనా కూడ పురుషుడు మార్గంలో పడి ఉన్న గడ్డి, ఆకులు మొదలైన దానిని ఉంది అనే గ్రహిస్తాడు కదా? ఇక్కడ (పూర్వపక్షి) అంటున్నాడు - ఈ ఉపన్యాసం విషమం, అనగా ప్రస్తుతవిషయానికీ నువ్వు చెప్పినదానికీ పోలిక లేదు. అక్కడ తృణపర్ణాదులను గూర్చిన ప్రత్యక్షం ప్రవర్తించింది, దానిచేత అవి ఉన్నాయని గ్రహిస్తున్నాడు. ఇక్కడైతే విధ్యుద్దేశంతో (విధివాక్యంతో) ఏకవాక్యత్వాన్ని పొంది (దానితో అన్వయిస్తూ) స్తుతిని బోధించే అర్థవాదం, ప్రత్యేకమైన అర్థం బోధిస్తూ వృత్తాంతాన్ని గూర్చి ప్రవర్తిస్తుంది (ఏదో వృత్తాంతం బోధిస్తుంది) అని నిశ్చయించడం శక్యం కాదు. మహావాక్యం ఒక అర్థాన్ని బోధిస్తున్నప్పుడు

అవాంతరవాక్యం వేరుగా మరొక అర్థాన్ని బోధించడం ఉండదు కదా? ఉదాహరణకి "న సురాం పిబేత్" అనే నఞ్‌తో కూడిన వాక్యంలో మూడు పదాల సంబంధంవల్ల సురాపానం నిషేధించడం అనే ఒక అర్థమే తెలియబడుతుంది కాని 'సురాం పిబేత్' అని రెండు పదాలకు సంబంధం చేసి సురాపాన విధి కూడ దీనివల్ల తెలుస్తూన్నది అని చెప్పడం కుదరదు కదా? (సమాధానం) - ఇక్కడ చెప్పబడుతున్నది - ఈ ఉపన్యాసం విషమం. సురాపాన ప్రతిషేధ వాక్యంలో మూడు పదాలకీ ఒకే అన్వయం ఉంది గాన అవాంతర వాక్యార్థాన్ని గ్రహించకపోవడం యుక్తమే. విధ్యుద్దేశ (విధివాక్య) అర్థవాదాల విషయంలో అయితే అర్థవాదవాక్యాలలో ఉన్న పదాలన్నీ వేరుగా (విధి వాక్యంకంటె వేరుగా) ఏదో ఒ క వృత్తాంతానికి సంబంధించిన అన్వయాన్ని (ముందుగా) పొంది, ఈ కథ చెప్పడం ఎందుకు అనే ప్రశ్న కలగగానే విధికి స్తావకత్వాన్ని (విధించబడిన కర్మను స్తుతించేవిగా అవడాన్ని) పొందుతే పొందవచ్చు. "వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః" (ఐశ్వర్యం కోరేవాడు వాయుదేవతాకమైన తెల్లని పశువును ఆలభనం చెయ్యాలి, బలి ఇవ్వాలి) అనే చోట ఈ విధివాక్యంలో ఉన్న 'వాయవ్యమ్' మొదలైన పదాలకు ఏ విధంగా విధితో (ఆలభేత అనేదానితో) సంబంధమో ఆ విధంగా "వాయు... గమయతి" (వాయువు అతిశీఘ్రంగామియైన దేవత, (ఇలా శ్వేతపశ్వాలంభనం చేసినవాడు) తన భాగ్యంచేత వాయువునే పొందుతాడు; ఆ వాయువే అతనికి భూతిని ఇస్తాడు) అనే అర్థవాదంలో ఉన్న పదాలకు (ఆలభేత అనే దానితో అన్వయం) లేదు కదా? "వాయుర్వా ఆలభేత" అని కాని, "క్షేపిష్ఠా దేవతా ఆలభేత" అని కాని ఈ విధంగా అన్వయం ఉండదు కదా? ఈ అర్థవాదవాక్యాలు వాయుస్వభావాన్ని చెప్పడంచేత అవాంతరమైన అన్వయం పొంది ఈ కర్మ ఇలాంటి విశిష్టమైన దేవత గలది అని విధిని స్తుతిస్తాయి. ఈ విధంగా ఏర్పడిన అవాంతరవాక్యార్థం ఇతర ప్రమాణాలచేత కూడా తెలియబడినట్లయితే, అక్కడ ఆ అర్థవాదం ప్రమాణాంతరగోచరార్థానువాదకం (మరొక విధంగా తెలిసిన అర్థాన్నే మళ్లీ చెప్పేది) అవుతుంది. "అగ్నిర్హి మస్య భేషజమ్" (అగ్ని చలికి మందు) ఇత్యాదులు ఈ తరగతికి చెందుతాయి). ఎక్కడైతే అది ప్రమాణాంతరవిరుద్ధమో అక్కడ అది గుణవాదం అని చెప్పబడుతుంది (ఉదాహరణకి "ఆదిత్యో యూపః" - "యూపం ఆదిత్యుడు" ఇత్యాదికం. ఇక్కడ తేజస్సు అనే గుణాన్ని పట్టి ఈ రెండింటికీ అభేదం చెప్పబడింది గాన గౌణప్రయోగం; ఇది గుణార్థవాద). ఎక్కడైతే ఈ రెండూ లేవో (అనగా ప్రమాణాంతరగోచరత్వం గాని ప్రమాణాంతర విరుద్ధత్వం గాని లేవో) అక్కడ ప్రమాణాంతరం లేకపోవడంచేత గుణవాదమూ లేక ప్రమాణాంతరవిరోధం లేదు గాన

విద్యమానార్థావాదమా (ఉన్న విషయాన్ని చెప్పే అర్థవాదమా) అన్నప్పుడు ప్రతీతిశరణులైనవారు (ఆ వాక్యంవల్ల ఏ అర్థం తెలుస్తుందో దానినే గ్రహించాలి అని నమ్మేవాళ్లు) దీనిని విద్యమానవాద మనే అంగీకరించాలి గాని గుణవాదం అని అంగీకరించగూడదు. దీనిచేత మంత్రం కూడ వ్యాఖ్యానింపబడింది. అనగా మంత్రం కర్మవిధానస్మారకం అయితే కావచ్చును గాని అది బోధించిన అర్థం మాత్రం ప్రమాణాంతరవిరుద్ధం కానప్పుడు యథార్థమే అని అంగీకరించాలి అని అర్థం.

## భాష్యమ్

అపి చ విధిభిరేవేన్ద్రాదిదైవత్యాని హవీంషి చోదయద్భిః అపేక్షితమిన్ద్రాదీనాం స్వరూపమ్, న హి రూపరహితా ఇన్ద్రాదయశ్చేతస్యారోపయితుం శక్యన్తే. న చ చేతస్యనారూఢాయై తస్యై దేవతాయై హవిః ప్రదాతుం శక్యతే. శ్రావయతి చ - "యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్తాం మనసా ధ్యాయేద్వషట్కరిష్యన్" (ఐ.బ్రా. 3.8.1) ఇతి. న చ శబ్దమాత్రమర్థస్వరూపం సంభవతి, శబ్దార్థయోర్భేదాత్. తత్ర యాదృశం మన్త్రార్థవాదయోరిన్ద్రాదీనాం స్వరూపమవగతం న తత్తాదృశం శబ్దప్రమాణకేన ప్రత్యాఖ్యాతుం యుక్తమ్. ఇతిహాసపురాణమపి వ్యాఖ్యాతేన మార్గేణ సంభవన్మన్త్రార్థవాదమూలత్వాత్ ప్రభవతి దేవతావిగ్రహాది సాధయితుమ్. ప్రత్యక్షాదిమూలమపి సంభవతి. భవతి హ్యస్మాకమప్రత్యక్షమపి చిరంతనానాం ప్రత్యక్షమ్. తథా చ వ్యాసాదయో దేవతాదిభిః ప్రత్యక్షం వ్యవహరన్తీతి స్మర్యతే. యస్తు బ్రూయాదిదానీన్తనానామివ పూర్వేషామపి నాస్తి దేవాదిభిర్వ్యవహర్తుం సామర్థ్యమితి, స జగద్వైచిత్ర్యం ప్రతిషేధేత్. ఇదానీమివ చ నాన్యదాపి సార్వభౌమః క్షత్రియోఽస్తీతి బ్రూయాత్. తతశ్చ రాజసూయాదిచోదనోపరున్ధ్యాత్. ఇదానీమివ చ కాలాన్తరేఽపి అవ్యవస్థితప్రాయాన్ వర్ణాశ్రమధర్మాన్ ప్రతిజానీత. తతశ్చ వ్యవస్థావిధాయి శాస్త్రమనర్థకం స్యాత్. తస్మాద్ధర్మోత్కర్షవశాచ్చిరన్తనా దేవాదిభిః ప్రత్యక్షం వ్యవజహ్రురితి శ్లిష్యతే.

## బాలానందిని

అపిచేతి:- అంతేకాక - ఇంద్రాదులు దేవతలుగా గల (ఇంద్రాది దేవతలకు ఇవ్వవలసిన) హవిస్సులను విధిస్తూన్న విధులచేతనే ఇంద్రాదుల స్వరూపం అపేక్షించ

బడింది. (విధివాక్యాలను పట్టి ఇంద్రాదులకు విగ్రహాదులు ఉండవలసిన అవసరం ఉందని తెలుస్తున్నది). రూపం లేని ఇంద్రాదులను మనస్సులో ఉంచుకొనడం (ధ్యానించడం) శక్యం కాదు కదా? మనస్సును అధిష్ఠించని ఆయా దేవతలకు హవిస్సు ఇవ్వడం కుదరదు. "యస్యై... వషట్కరిష్యన్" (వషట్కారం చేయ నున్న ఋత్విక్కు, 'వషట్' అని అంటూ హోమం చేయబోయేవాడు, ఏ దేవతకు హవిస్సు గ్రహించబడిందో ఆ దేవతను మనస్సుచేత ధ్యానించాలి) అని శ్రుతి చెప్పుచున్నది కూడ. కేవలశబ్దం అర్థస్వరూపం కాజాలదు. శబ్దార్థాలు వేరు వేరైనవి కదా? మంత్రార్థవాదాలలో ఇంద్రాదుల స్వరూపం ఏ విధమైనది తెలియ బడుతున్నదో దానిని శబ్దం ప్రమాణం అని అంగీకరించే వారెవరూ ప్రత్యాఖ్యానం చేయడం యుక్తం కాదు. ఇంత వరకు వివరించిన పద్ధతిలో ఇతిహాసపురాణాలకు కూడ మంత్రాలు, అర్థవాదాలు మూలం అవడానికి అవకాశం ఉంది గాన అవి కూడ దేవతలకు విగ్రహాదులను సాధించడానికి సమర్థాలవుతాయి. ప్రత్యక్షాదులు కూడ ఇతిహాసపురాణాలకు మూలం కావచ్చును. మనకు ప్రత్యక్షం కానిది కూడ ప్రాచీనులకు ప్రత్యక్షంగా కావచ్చును. వ్యాసాదులు దేవాదులతో ప్రత్యక్షంగా వ్యవహరించేవారని స్మరించబడుచున్నది (స్మృతీతిహాసాదులలో చెప్పబడుతున్నది). ఇప్పటివాళ్లకి వలె ప్రాచీనులకు కూడ దేవాదులతో వ్యవహరించే సామర్థ్యం లేదనే వాడు జగత్తు యొక్క విచిత్రత్వాన్ని నిషేధించినవా డవుతాడు. అతడు ఈ కాలంలో వలె ఇతరకాలాలలో కూడ సార్వభౌముడైన క్షత్రియుడు లేడని అనవచ్చు. అలా అంటే రాజసూయాదియాగవిధి నిరర్థకం అవుతుంది. (రాజసూయం సార్వభౌముడైన క్షత్రియుడు చేయవలసిన యజ్ఞం). ఈ కాలంలో వలెనే కాలాంతరంలో కూడ వర్ణాశ్రమధర్మాలన్నీ చాలవరకు అవ్యవస్థితంగా ఉన్నాయని చెప్పవచ్చు. అలా అంటే వర్ణాశ్రమధర్మవ్యవస్థను విధించిన శాస్త్రం అర్థరహితం అవుతుంది. అందువల్ల ప్రాచీనులు అత్యధికమైన ధర్మంయొక్క బలం వల్ల దేవతాదులతో ప్రత్యక్షంగా వ్యవహరించారని చెప్పడం యుక్తంగా ఉంటుంది.

## భాష్యమ్

అపి చ స్మరన్తి - "స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః" (యో.సూ.2.4.4) ఇత్యాది. యోగోఽ ప్యణిమాద్యైశ్వర్యప్రాప్తిఫలః స్మర్యమాణో న శక్యతే సాహసమాత్రేణ ప్రత్యాఖ్యాతుమ్. శ్రుతి శ్చ యోగమాహాత్మ్యం ప్రఖ్యాపయతి -

"పృథ్వ్య ప్తేజోఽనిలఖే సముత్థితే పఞ్చాత్మకే యోగగుణే ప్రవృత్తే
న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్"

(శ్వే.2.12) ఇతి. ఋషీణామపి మన్త్రబ్రాహ్మణదర్శినాం సామర్థ్యం నాస్మ

దీయేన సామర్థ్యేనోపమాతుం యుక్తమ్. తస్మాత్సమూలమితిహాసపురాణమ్. లోకప్రసిద్ధిరపి న సతి సంభవే నిరాలమ్బనాఽధ్యవసాతుం యుక్తా. తస్మాదుపపన్నో మన్త్రాదిభ్యః దేవాదీనాం విగ్రహవత్త్వాద్యధిగమః; తతశ్చార్థిత్వాదిసంభవాత్ ఉపపన్నో దేవాదీనామపి బ్రహ్మవిద్యాయామధికారః. క్రమముక్తిదర్శనాన్యేవమేవోపపద్యన్తే. 33.

## బాలానందిని

అపి చేతి:- మరొక విషయమేమనగా - "స్వాధ్యాయాదిష్ట దేవతాసంప్రయోగః" (స్వాధ్యాయంవల్ల అనగా మంత్రజపంవల్ల ఇష్టదేవతతో సంబంధం అనగా దర్శన భాషణాదికం కలుగుతుంది) అని ఈ విధమైన విషయాలు యోగసూత్రాదులలో చెపుతున్నారు. యోగాభ్యాసంవల్ల అణిమాద్యష్టసిద్ధులు లభిస్తాయని యోగశాస్త్రంలో చెప్పినదానిని సాహసమాత్రంచేత నిరాకరించడం శక్యం కాదు. "పృథ్వ్యప్తేజో... శరీరమ్" అను శ్రుతి కూడ యోగంయొక్క మహాత్మ్యాన్ని చాటుతున్నది. "అరికాళ్లనుండి మోకాళ్లవరకు, మోకాళ్లనుండి నాభి వరకు, నాభినుండి కంఠం వరకు, కంఠంనుండి కేశాల మొదళ్ల వరకు, అక్కడినుండి బ్రహ్మరంధ్రం వరకు పృథివీ-అప్-తేజస్ - వాయు - ఆకాశము లనే ఈ పంచకం సముత్థితమైన దగుచుండగా, అనగా ధారణచేత జయింప బడినదగు చుండుగా, అణిమాదులైన యోగగుణాలు ప్రవర్తించగా యోగంచేత ఏర్పడిన తేజోమయశరీరాన్ని పొందినవానికి రోగం గాని, వార్ధక్యం గాని, మృత్యువు కాని ఉండదు" అని ఈ శ్రుతివాక్యాని కర్థం. మంత్రబ్రాహ్మణ ద్రష్టలైన ఋషుల సామర్థ్యం కూడ మన సామర్థ్యంతో పోల్చడం యుక్తం కాదు. అందువల్ల ఇతిహాసపురాణాలకి మూలం ఉంది. వీలున్నప్పుడు లోకప్రసిద్ధిని కూడ నిరాధారమైన దని అనడం యుక్తం కాదు. అందువల్ల మంత్రాదులవల్ల దేవతలకు విగ్రహం ఉందని తెలుసుకొనడం యుక్తమే. అప్పుడు అర్థిత్వాదులు కూడ కుదురుతాయి కాబట్టి దేవాదులకు కూడ బ్రహ్మ విద్యయందు అధికారం ఉపపన్నమే. ఇలా చెపితేనే క్రమముక్తిని గూర్చి చెప్పే శ్రుత్యాదులు కుదురుతాయి.

వి. కొన్ని ఉపాసనలు చేసేవాళ్లు ఆ యా దేవలోకాలకు వెళ్లి, అక్కడ కొంత కాలం ఉండి తరవాత ముక్తి పొందుతారు అని శాస్త్రంలో చెప్పబడింది. ఇదే క్రమముక్తి. దేవతలకు విగ్రహమే లేక పోతే వాళ్ల లోకాలకు వెళ్లడం, అక్కడ నున్న దేవతలతో

కలసి కొంత కాలం ఉండడం మొదలైనవేవీ కుదరవు. ఈ క్రమముక్తి శాస్త్రాలలో కనబడడంవల్ల కూడ దేవతలకు విగ్రహాదులున్నా యని అంగీకరించాలి.

దేవతాధికరణం సమాప్తం

## 9. అపశూద్రాధికరణం. సూ. 34-38

### సూ. శుగస్య తదనాదరశ్రవణాత్తదాద్రవణాత్ సూచ్యతే హి. 1.3.34

యథా మనుష్యాధికారనియమమపోద్య దేవాదీనామపి విద్యాస్వధికార ఉక్తః తథైవ ద్విజాత్యధికారనియమాపవాదేన శూద్రస్యాప్యధికారః స్యాదిత్యేతామాశఙ్కాం నిరవర్తయితుమిదమధికరణమారభ్యతే. తత్ర శూద్రస్యాప్యధికారః స్యాదితి ప్రాప్తమ్, అర్థిత్వసామర్థ్యయోః సంభవాత్, తస్మాచ్ఛూద్రో యజ్ఞేఽనవక్లృప్తః (తై. సం. 7.1.1.6) ఇతివత్ శూద్రో విద్యాయామనవక్లృప్త ఇతి చ నిషేధాశ్రవణాత్. యచ్చ కర్మస్వనధికారకారణం శూద్రస్యానగ్నిత్వం న తద్విద్యాస్వధికారస్యాపవాదకం లిఙ్గమ్. న హ్యావహనీయాదిరహితేన విద్యా వేదితుం న శక్యతే. భవతి లిఙ్గం శూద్రస్యాధికారోపోద్బలకమ్. సంవర్గవిద్యాయాం హి జానశ్రుతిం పౌత్రాయణం శుశ్రూషుం శూద్రశబ్దేన పరామృశతి - "అహ హారే త్వా శూద్ర తవైవ సహ గోభిరస్తు" (ఛా. ఉ. 4.2.3) ఇతి. విదురప్రభృతయశ్చ శూద్రయోనిప్రభవా అపి విశిష్టవిజ్ఞానసంపన్నాః స్మర్యన్తే. తస్మాదధిక్రియతే శూద్రో విద్యాస్వితి.

బాలానందిని

శుగితి :- ''అస్య = జానశ్రుతికి, అనాదరశ్రవణాత్ = తనను గూర్చిన అనాదరాన్ని వినడవల్ల, శుక్ = దుఃఖం కలిగినది, తదాద్రవణాత్ = ఆ శోకంతో ఆచార్యుని వద్దకు పరుగెత్తడంవల్ల, సూచ్యతే హి = ఈ విషయం సూచించ బడుతున్నది కదా'' అని సూత్రార్థం.

యథేతి :- మనుష్యులకే విద్యాధికారం అనే నియమాన్ని కాదని దేవతలకు కూడ విద్యలయందు అధికారం ఉన్న దని ఎట్లు చెప్పబడిందో అట్లే ద్విజాతులకు (పై మూడు వర్ణాలవాళ్లకే) విద్యాధికారం అనే నియమాన్ని నిరాకరించడం ద్వారా శూద్రునికి కూడ అధికారం ఉండవచ్చును అనే ఈ ఆశంకను తొలగించడం కోసం ఈ అధికరణం ప్రారంభించ బడుతున్నది. అర్థిత్వం, సామర్థ్యం శూద్రునిలో కూడ

ఉండవచ్చును గాన శూద్రునికి కూడ అధికారం ఉండవచ్చును అని ప్రాప్తించింది. "తస్మాచ్ఛూద్రో యజ్ఞేఽనవక్లప్తః" (అగ్నులు లేనివా డవడంవల్ల శూద్రుడు యజ్ఞంలో అసమర్థుడు) అని యజ్ఞం విషయంలో నిషేధం ఉన్నట్లు శూద్రునికి విద్య విషయంలో సామర్థ్యం లేదు అని నిషేధం ఏదీ కనబడడం లేదు. శూద్రునికి కర్మలలో అధికారం లేకపోవడానికి కారణమైన అనగ్నిత్వం (అగ్ని లేకపోవడం). అతనికి విద్యలలో కూడ అధికారం లేదని చెప్పడానికి లింగం కాజాలదు, అహవనీయాగ్ని లేనివాడు విద్య తెలుసుకొన జాలడు అనేది లేదు కదా? శూద్రునికి అధికారం ఉందని సమర్థించే లింగం కూడా ఉంది. సంవర్గవిద్యలో విద్య కోసం శుశ్రూషతో వచ్చిన పుత్రాయణుని కుమారుడైన జానశ్రుతిని "అహ... అస్తు" (ఓ! శూద్రా! హారంతో కూడిన రథం ఈ గోవులు నీకే ఉండుగాక) అని శూద్రశబ్దంతో పరామర్శిస్తున్నాడు. విదురుడు మొదలైన వాళ్లు శూద్రజన్మలో పుట్టినా కూడ విశిష్టజ్ఞానసంపన్నులుగా భారతాదులలో చెప్ప బడుతున్నారు. అందువల్ల శూద్రునకు విద్యలలో అధికారం ఉంది.

వి. జానశ్రుతి ఆరువందల గోవులు ఒక రథం రైక్వుడనే గురువుకు సమర్పించి నాకు బ్రహ్మవిద్య ఉపదేశించ మని ప్రార్థించాడు. ఆ రైక్వుడు విధురుడు (భార్య లేనివాడు). కన్య ఎవరైనా కావాలనే కోరికతో ఉన్నాడు. అతడు ఆతనిని చూచి "అల్పమైన, నాకు గర్హస్థ్యానికి ఉపయోగించని, ఇవన్నీ నాకెందుకు? నువ్వే ఉంచుకో" అన్నాడు. వెనుకటి అధికరణంలో మంత్రార్థవాదలకు భూతాలైన విగ్రహాదులను బోధించడంలో సమన్వయం చెప్పబడింది. ఈ అధికరణంలో కూడ శ్రుతిలో ఉన్న శూద్రశబ్దం క్షత్రియుని విషయంలో ప్రవర్తింపచేయబడుచున్నది. ఈ విధంగా ప్రాసంగికాలైన ఈ రెండు అధికరణాలకీ సమన్వయాధ్యాయంతో, భూతార్థ ప్రతిపాదనంలో వేదాంతాలకు ప్రామాణ్యం అనే విషయాన్ని దృఢీకరించడం ద్వారా సంగతి. ఈ రెండు అధికరణాలకీ ప్రాసంగికసంగతి అని వెనుక చెప్పబడింది. పూర్వ పక్షంలో శూద్రునికి విద్యాధికారం ఫలం. సిద్ధాంతంలో అధికారం లేకపోవడం ఫలం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - న శూద్రస్యాధికారః, వేదాధ్యయనాభావాత్. - అధీతవేదో హి విదితవేదార్థో వేదార్థేష్వధిక్రియతే. న చ శూద్రస్య వేదాధ్యయనమస్తి, ఉపనయనపూర్వకత్వాద్వేదాధ్యయనస్య. ఉపనయనస్య చ వర్ణత్రయవిషయత్వాత్. యత్త్వర్థిత్వం న తదసతి సామర్థ్యేఽధికారకారణం భవతి. సామర్థ్యమపి న లౌకికం కేవలమధికారకారణం భవతి. శాస్త్రీయేఽర్థే

శాస్త్రీయస్య సామర్థ్యస్యాపేక్షితత్వాత్. శాస్త్రీయస్య చ సామర్థ్యస్య అధ్యయన నిరాకరణేన నిరాకృతత్వాత్. యచ్చేదం "శూద్రో యజ్ఞేఽనవక్లప్తః" తన్న్యాయ పూర్వకత్వాద్విద్యాయామప్యనవక్లప్తత్వం ద్యోతయతి, న్యాయస్య సాధారణత్వాత్. యత్పునః సంవర్గవిద్యాయాం శూద్రశబ్దశ్రవణం లిఙ్గం మన్యసే న తల్లిఙ్గమ్, న్యాయాభావాత్. న్యాయోక్తే హి లిఙ్గదర్శనం ద్యోతకం భవతి, న చాత్ర న్యాయోఽస్తి. కామం చాయం శూద్రశబ్దః సంవర్గవిద్యాయామే వైకస్యాం శూద్రమధికుర్యాత్, తద్విషయత్వాత్, న సర్వాసు విద్యాసు. అర్థవాదస్థత్వాత్తు న క్వచిదప్యయం శూద్రమధికర్తుముత్సహతే. శక్యతే చాయం శూద్రశబ్దోఽధికృతవిషయే యోజయితుమ్. కథ మిత్యుచ్యతే - "కస్వర ఏనమేతత్సన్తం సయుగ్మానమివ రైక్వమాత్థ" (ఛాం. ఉ. 4.1.3) ఇత్యస్మాద్ధంసవాక్యాత్ ఆత్మనోఽనాదరం శ్రుతవతో జానశ్రుతేః పౌత్రాయణస్య శుగుత్పేదే. తామృషీ రైక్వః శూద్రశబ్దేనానేన సూచయాంబభూవ, ఆత్మనః పరోక్షజ్ఞానతాజ్ఞపనాయేతి గమ్యతే, జాతిశూద్రస్యానధికారాత్. కథం పునః శూద్రశబ్దేన శుగుత్పన్నా సూచ్యతే ఇతి? ఉచ్యతే - తదాద్రవణాత్, శుచమభిదుద్రావ, శుచా వాభిదుద్రువే, శుచా వా రైక్వమభిరుద్రావేతి శూద్రః. అవయవార్థసంభవాద్రూఢ్యర్థస్య చాసంభవాత్. దృశ్యతే చాయమర్థోఽస్యామాఖ్యాయికాయామ్. 34.

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం - వేదాధ్యయనం లేదు గాన శూద్రునికి బ్రహ్మవిద్యాధికారం లేదు. వేదాధ్యయనం చేసినవాడు వేదార్థం గ్రహించి, వేదంలో చెప్పిన విషయాలు అనుష్ఠించడానికి అధికారం కలవాడవుతాడు. వేదాధ్యయనం ఉపనయనపూర్వకం గాన శూద్రునికి వేదాధ్యయనం లేదు. ఉపనయనం మూడు వర్ణాల వాళ్లకే సంబంధించినది కదా? సామర్థ్యం లేనప్పుడు అర్థిత్వం ఉన్నా అది అధికారానికి కారణం కాజాలదు. కేవలం లౌకికమైన సామర్థ్యం ఉన్నా అది అధికారకారణం కాదు. శాస్త్రానికి సంబంధించిన విషయంలో శాస్త్రోక్తమైన సామర్థ్యమే అపేక్షించబడుతుంది. అధ్యయనం నిరాకరించడంచేత శాస్త్రీయసామర్థ్యం నిరాకరించ బడింది. "శూద్రో యజ్ఞే ఽ నవక్లప్తః" అనేది న్యాయపూర్వక మైనది గాన,

న్యాయం యజ్ఞానికీ విద్యకూ గూడ సమంగా వర్తిస్తుంది గాన, విద్య విషయంలో కూడ వానికి అసామర్థ్యాన్ని సూచిస్తూన్నది.

వి. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను శ్రుతివాక్యం వేదాధ్యయనం చెయ్యాలి అని విధిస్తున్నది. వేదాధ్యయనానికి ఫలం వేదార్థజ్ఞానం. దానికి ఫలం వేదోక్త కర్మానుష్ఠానం. దీనిని పట్టి వేదోక్తకర్మలను చెయ్యాలంటే అంతకు ముందు వేదాధ్య యనం చేసి దాని అర్థం తెలుసుకోవాలని తెలుస్తున్నది. ఇది "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అనే వాక్యం ద్వారా లభించిన న్యాయం. బ్రహ్మవిద్య కూడ వేదార్థ రూపమైనదే. శ్రవణమననాదుల ఫలంగా ఆత్మ జ్ఞానం లభిస్తుంది. ఇది లభించాలంటే వేదాధ్యయన వేదార్థజ్ఞానాలుండా లనే పైన చెప్పిన న్యాయం ఇక్కడ కూడా ప్రవర్తిస్తుంది. అందుచేత వేదాధ్యాయనసామర్థ్యం లేనివానికి విద్యాసామర్థ్యం కూడ లేనట్లే.

యత్పునరితి:- సంవర్గవిద్యలో ఏ శూద్రశబ్దం వినబడడం లింగమని నువ్వు అనుకుంటున్నావో అది లింగం కాదు. (సామర్థ్యమనే) న్యాయం లేదు కదా? న్యాయం సరిగా అన్వయించిన విషయంలోనే లింగం కనబడితే అది సూచకం అని అంగీకరించ వచ్చును. ఇక్కడ ఆ న్యాయం లేదు.

అవ. "వర్షాసు రథకార ఆదధీత" (వర్షర్తువులో రథకారుడు (వడ్రంగి) అగ్న్యాధానం చెయ్యాలి) "ఏతయా నిషాదస్థపతిం యాజయేత్" (నిషాదస్థపతిచేత ఈ యజ్ఞం చేయించాలి) అనే విధిని అనుసరించి వేదాధ్యయనం లేకపోయినా రథకారునికి, నిషాదునికీ ఆ కర్మ మాత్రం చెయ్యడానికి అధికారం ఉందని నిర్ణయించ బడింది. అదే విధంగా శూద్రునికి బ్రహ్మవిద్యాధికారం ఉన్నదని చెప్పవచ్చు అని ఆశంకించుకొని, శూద్రునికి అధికారం అంగీకరిస్తే ఏ ఘట్టంలో ఈ వాక్యం ఉందో ఆ సంవర్గవిద్యలో మాత్రమే అంగీకరించ వచ్చునని ముందుగా చెప్పి, అదికూడ అంగీకరించడం కుదరదు అని అంటున్నారు -

కామమ్ ఇతి :- ఈ శూద్రశబ్దం ఒక్క సంవర్గవిద్యలోనే శూద్రునికి అధికారం కల్పిస్తే కల్పించ వచ్చును. ఇది ఆ విద్యకు సంబంధించినదిగా వినబడుతున్నది కదా. అంతేనే కాని అన్ని విద్యలలోను అధికారం కల్పించజాలదు. నిజానికి ఈ శూద్రశబ్దం అర్థవాదవాక్యంలో ఉంది గాని (పైన ఉదాహరించిన రెండు వాక్యాలలో వలె) విధివాక్యంలో లేదు. అందుచేత సంవర్గవిద్యలో కూడ అధికారం అంగీకరించడం కుదరదు. ఈ శూద్రశబ్దాన్ని అధికారం ఉన్నవాని విషయంలో సమన్వయించడం కుదురుతుంది కూడ. ఎట్లనగా - చెప్పబడుతున్నది - కమ్వర... ఆత్థ" అనే హంస పలికిన మాటవల్ల తన అనాదరాన్ని విన్న, పుత్రాయణపుత్రుడైన, జానశ్రుతికి దుఃఖం కలిగింది. ఋషియైన రైక్వుడు, తనకు పరోక్షవిషయాలను కూడ తెలుసుకొనే శక్తి

ఉంది అని చెప్పుకొనడం కోసం ఈ శూద్రశబ్దాన్ని ప్రయోగించడం ద్వారా సూచించాడు అని తెలుస్తున్నది. జన్మతః శూద్రుడైన వానికి అధికారం లేదు కదా? దుఃఖం పుట్టినట్లు 'శూద్ర' శబ్దం ఎలా సూచిస్తుంది? చెపుతున్నాం - శుక్ (శోకాన్ని) పొందడం వల్ల లేదా శుక్‌చేత పొందబడడంవల్ల, శుక్‌చేత రైక్వుని దగ్గరికి పరుగెత్తడంవల్ల శూద్రుడు అని చెప్పబడ్డాడు. రూఢ్యర్థం కుదరదు గాన ఈ యౌగికార్థం గ్రహించాలి. ఈ అర్థం ఈ ఆఖ్యాయికలో కనబడుతూన్నది కూడ.

వి. జానశ్రుతి అనే రాజు గ్రీష్మ ఋతువులో చల్లదనం కోసం మేడ పై భాగం మీద పండుకొని ఉన్నాడు. అతడు చేసిన అన్నదానాదులచేత, ఇతరగుణాల చేత సంతోషించిన ఋషులు హంసరూపం ధరించి ఒక పంక్తిగా అతని మీద ఎగురుతూ వెడుతున్నారు. ఆ హంసలలో వెనుక ఉన్న హంస ముందు ఉన్న హంసతో "ఓ! భద్రాక్షా! చూడడం లేదా? ఈ జానశ్రుతి తేజస్సు స్వర్గం దాకా వ్యాపించి ఉంది. అటుకేసి వెళ్లకు; అది నిన్ను కాల్చివేస్తుంది అని అంది. అప్పుడు ముందు వెడుతూన్న హంస - "విద్యాహీనుడై ఉన్న ఈ సామాన్య పురుషుని విషయంలో బండితో ఉన్న బ్రహ్మజ్ఞానియైన రైక్వుని విషయంలో మాటలాడు తున్నట్లు మాట్లాడుతున్నావేమిటి? అని బ్రహ్మిష్ఠుడైన ఆ రైక్వుని తేజస్సు సహింప శక్యం కానిది కాని అనాత్మజ్ఞుడైన ఈతని తేజస్సు అలాంటిది కాదు అని సూచిస్తూ అంది. ఆ మాట విన్న జానశ్రుతి దుఃఖితుడై బండి గుర్తు సహాయంతో రైక్వుని దగ్గరకు వెళ్లాడు. ఈ శ్రుతివాక్యానికి అర్థం - "కమ్-ఉ-అరే' అని పదచ్ఛేదం. "ఓరీ! ఆత్మ జ్ఞానం లేకుండా ఉన్న ఈతనిని గూర్చి కూడ బండితో కూడిన రైక్వుణ్ణి గూర్చి మాట్లాడు తున్నట్లు మాట్లాడుతున్నావేమిటి?" రైక్వుణ్ణి గుర్తించి జానశ్రుతి ఆతనివద్ద ఆత్మవిద్య పొందాలనే అభిప్రాయంతో "సయుగ్వానమ్" అని ఆ హంస అంది.

## సూ. క్షత్రియత్వగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లిఙ్గాత్. 1.3.35

ఇతశ్చ న జాతిశూద్రో జానశ్రుతిః, యత్కారణం ప్రకరణనిరూపణేన క్షత్రియత్వమస్యోత్తరత్ర చైత్రరథేనాభిప్రతారిణా క్షత్రియేణ సమభివ్యాహారాద్గమ్యతే. ఉత్తరత్ర హి సంవర్గవిద్యావాక్యశేషే చైత్రరథిరభిప్రతారీ క్షత్రియః సంకీర్త్యతే - "అథ హ శౌనకం చ కాపేయమభిప్రతారిణం చ కాక్షసేనిం సూదేన పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే" (ఛాం. ఉ. 4.3.5) ఇతి. చైత్రరథిత్వం చాభిప్రతారిణః కాపేయయోగాదవగన్తవ్యమ్. కాపేయయోగో హి

చిత్రరథస్యావగతః - "ఏతేన వై చిత్రరథం కాపేయా అయాజయన్" (తాండ్య బ్రా. 20.12.5) ఇతి. సమానాన్వయానాం చ ప్రాయేణ సమానాన్వయా యాజకా భవన్తి. "తస్మాచ్చైత్రరథిర్నామైకః క్షత్రపతిరజాయత" ఇతి క్షత్రపతిత్వావగమాత్ క్షత్రియత్వమస్యావగన్తవ్యమ్. తేన క్షత్రియేణాభి ప్రతారిణా సహ సమానాయాం విద్యాయాం సంకీర్తనం జానశ్రుతేరపి క్షత్రియత్వం సూచయతి. సమానానామేవ హి ప్రాయః సమభివ్యాహారా భవన్తి. క్షత్తృప్రేషణాద్యైశ్వర్యయోగాచ్చ జానశ్రుతేః క్షత్రియత్వావగతిః. అతో న జాతిశూద్రస్యాధికారః.35.

బాలానందిని

క్షత్రియేతి :- "ఉత్తరత్ర = తరవాత ఉన్న, చైత్రరథేన లిఙ్గాత్ = చైత్రరథుడనే లింగంవల్ల, క్షత్రియత్వావగతేశ్చ = జానశ్రుతి క్షత్రియు డని తెలియడంవల్ల కూడ జన్మ శూద్రునకు బ్రహ్మవిద్యాధికారం లేదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ప్రకరణాన్ని పరీక్షించగా మున్ముందు చిత్రరథుని కుమారుడు, క్షత్రియుడు అయిన అభిప్రతారితో కలిపి చెప్పడం అనే లింగంవల్ల జానశ్రుతి క్షత్రియుడు అని తెలుస్తున్నది. అందుచేత కూడ జానశ్రుతి జన్మశూద్రుడు కాడు. మున్ముందు సంవర్గవిద్యావాక్యశేషంలో "అథ.... బిభిక్షే" అనే వాక్యం చిత్రరథుని వంశానికి చెందిన అభిప్రతారి క్షత్రియుడు అని చెప్పుచున్నది. "కపి వంశానికి చెందిన శౌనకుడనే పురోహితునికీ కక్షసేని కుమారుడైన అభిప్రతారికీ వంటవాడు వడ్డిస్తూండగా బ్రహ్మచారి ఒకడు వచ్చి భిక్ష అడిగాడు" అని ఈ వాక్యానికి అర్థం. అభిప్రతారి చిత్ర రథ వంశానికి చెందినట్లు కాపేయుని సంబంధాన్ని పట్టి తెలుసుకోవాలి. "ఏతేన... అయాజయన్" (కాపేయులు చిత్రరథునిచేత ఈ యాగం చేయించారు) అని చిత్రరథునికి కాపేయులకీ సంబంధం తెలుస్తున్నది. సాధారణంగా ఒక వంశానికి చెందిన రాజులకు ఒక వంశానికి చెందినవారే యాజకులుగా (పురోహితులుగా) ఉంటారు. (అందుచేత కాపేయుడైన పురోహితునితో సంబంధాన్ని పట్టి అభిప్రతారి చిత్రరథుని వంశానికి చెందినవాడని తెలుస్తున్నది అని అర్థం). "తస్మాచ్చైత్రరథి... అజాయత" (ఆ చిత్రరథునినుండి చైత్రరథి అనే ఒక క్షత్రపతి పుట్టాడు) అనే వాక్యం చేత అతడు క్షత్రపతి అని తెలియడంచేత ఇతడు క్షత్రియుడని తెలుసుకోవాలి. క్షత్రియుడైన ఆ అభిప్రతారితో కలిపి ఒకే విద్యలో జానశ్రుతిని కూడ చెప్పడం అతడు క్షత్రియుడని సూచిస్తున్నది. సాధారణంగా సమానమైన వాళ్లనే కలిపి చెప్పడం

జరుగుతుంది. రైక్వుణ్ణి అన్వేషించడం కోసం క్షత్తను (సూతుణ్ణి) పంపడం మొదలైన ఐశ్వర్యం (ప్రభుత్వం) ఉండడంవల్ల కూడ జానశ్రుతి క్షత్రియుడని తెలుస్తున్నది. అందువల్ల జాతిశూద్రునికి అధికారం లేదు. 35.

## సూ. సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ. 1.3.36

ఇతశ్చ న శూద్రస్యాధికారః, యద్విద్యాప్రదేశేషు ఉపనయనాదయః సంస్కారాః పరామృశ్యన్తే - "తం హోపనిన్యే" (శ.బ్రా.11.5.3.13), "అధీహి భగవ ఇత్యుపససార" (ఛాం.ఉ. 7.1.1) "బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేషమాణాః ఏష హ వై తత్సర్వం వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగవన్తం పిప్పలాదముపసన్నాః" (ప్ర.ఉ.1.1.) ఇతి చ. "తాన్హానుపనీయైవ" (ఛా. ఉ. 5.11.7) ఇత్యపి ప్రదర్శితైవోపనయనప్రాప్తిర్భవతి. శూద్రస్య చ సంస్కారాభావోఽభిలప్యతే - "శూద్రశ్చతుర్థవర్ణః ఏకజాతిః" (మను. స్మృ. 10.4) ఇత్యేకజాతిత్వస్మరణాత్, "న శూద్రే పాతకం కించిన్న చ సంస్కారమర్హతి" (మను. స్మృ. 10.12.6) ఇత్యాదిభిశ్చ. 36.

### బాలానందిని

సంస్కారేతి :- "సంస్కారపరామర్శాత్ = బ్రహ్మవిద్య పొందగోరేవారికి ఉపనయనాదిసంస్కారాలు సూచించడంవల్ల, తదభావాభిలాపాచ్చ = శూద్రునికి అలాంటి సంస్కారాలు లేవని చెప్పడంవల్ల కూడ శూద్రునికి బ్రహ్మవిద్యాధికారం లేదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ శూద్రునికి అధికారం లేదు. ఎందువల్ల ననగా - "తం హోపనిన్యే" (అతనికి ఉపనయనం చేశాడు), "అధీహి... ఉపససార" (పూజ్యుడా! ఉపదేశించుము అని సమీపించాడు). "బ్రహ్మపరాః... ఉపసన్నాః" (బ్రహ్మపరులు, బ్రహ్మనిష్ఠులు అయిన వాళ్లు బ్రహ్మను అన్వేషిస్తూ ఇతడు అదంతా మనకు బోధిస్తాడు అని సమిధలు చేతిలో ధరించి పూజ్యుడైన పిప్పలాదుణ్ణి యథావిధిగా సమీపించారు) మొదలైన విద్యకు సంబంధించిన స్థానాలలో ఉన్న వాక్యాలు (ఈ విద్య కావాలనుకొనేవారికి) ఉపనయనాదిసంస్కారాలు ఆవశ్యకాలన్నట్లు చెపుతున్నాయి. "తాన్ హ అనుపనీయైవ" (వాళ్లకు ఉపనయనం చేయకుండానే) అనే వాక్యం ఉపనయన ప్రాప్తిని (ఉపనయనం చేయవలసి ఉండడాన్ని) సూచిస్తున్నది.

ఎ. "తే హ సమిత్పాణయః పూర్వాహ్ణే ప్రతిచక్రమిరే" ఇత్యాది చాందోగ్యపనిషద్వాక్యం ప్రాచీనశాలాదులు వైశ్వానరవిద్యను ఉపదేశించ మని క్షత్రియుడైన అశ్వపతి దగ్గరకు వెళ్లినట్లు అతడు వాళ్లకంటె తాను క్రింది జాతికి చెందినవాడవడంచేత వాళ్లకు ఉపనయనం చేయకుండానే ఆ విద్య బోధించినట్లు చెపుతున్నది. దీనిని పట్టి మామూలు పరిస్థితులలో అయితే ఉపనయనం చేసిన తరవాతనే విద్యోపదేశం చేయాలని సూచిత మవుతున్నది.

శూద్రస్యేతి:- శూద్రునికి సంస్కారం లేదని కూడ చెప్పబడుచున్నది. "శూద్రః... ఏకజాతిః" (చతుర్థవర్ణుడైన శూద్రుడు ఏకజాతి - ఒకే జన్మ కలవాడు, ఉపనయనం వల్ల వచ్చే ద్వితీయజన్మ లేనివాడు అని అర్థం) అని ఏకజాతిత్వం స్మృతులలో చెప్పబడింది. "న... అర్హతి" (శూద్రునికి అభక్ష్యభోజనాదులవల్ల పాపం ఏమీ లేదు. ఆతనికి ఉపనయనసంస్కారం కూడ లేదు) ఇత్యాదివాక్యాలు ఈ విషయమే చెపుతున్నాయి. 36.

## సూ. తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః 1.3.37

ఇతశ్చ న శూద్రస్యాధికారః, యత్సత్యవచనేన శూద్రత్వాభావే నిర్ధారితే జాబాలం గౌతమః ఉపనేతుమనుశాసితుం చ ప్రవవృతే - 'నైతద బ్రాహ్మణో వివక్తుమర్హతి, సమిధం సోమ్యాహరోప త్వా నేష్యే న సత్యాదగాః" (ఛాం.ఉ. 4.4.5) ఇతి శ్రుతిలిఙ్గాత్. 37.

### బాలానందిని

తదభావేతి :- "తదభావనిర్ధారణే = శూద్రత్వం లేదు అని నిర్ధారణ చేసిన తరవాతనే, ప్రవృత్తేః = (గౌతముడు సత్యకామునికి ఉపదేశించడానికి) ప్రవర్తించడంవల్ల కూడ శూద్రునికి అధికారం లేదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ శూద్రునికి అధికారం లేదు. ఎందు వల్లననగా సత్యం పలకడంచేత శూద్రత్వం లేదు అని నిర్ధారణ చేసిన తరవాత - "నైతత్... అగాః" (బ్రాహ్మణుడు కానివాడు ఈ విషయం ఇంత విస్పష్టంగా చెప్పజాలడు, సౌమ్యుడా! సమిధ తీసికొనిరా, నీకు ఉపనయనం చేస్తాను. నువ్వు సత్యం నుండి చలించలేదు) అని అంటూ గౌతముడు జాబాలునికి ఉపనయనం చేయడానికీ, ఉపదేశించడానికీ ప్రవర్తించాడు. ఈ శ్రుతి అనే లింగంవల్ల కూడ శూద్రునకు అధికారం లేదు.

వి. సత్యకాముని తండ్రి చనిపోయాడు. అతడు తల్లి దగ్గరికి వెళ్లి నా గోత్రం ఏమిటి అని ప్రశ్నించాడు. ఎల్లప్పుడూ భర్తృసేవావ్యగ్రురాలనై ఉండడంచేత నాకు కూడ నీ తండ్రి గోత్రం ఏమో తెలియదు. నా పేరు జాబాల, నీ పేరు సత్యకాముడు. నాకింత మాత్రమే తెలుసు అని చెప్పింది. తరవాత జాబాలుడు గౌతముని దగ్గరికి వెళ్లినప్పుడు నీ గోత్రం ఏమి? అని అతడు అడుగగా నా గోత్రం ఏమో నాకూ తెలియదు, నా తల్లికీ తెలియదు. నువ్వు ఉపనయనం కోసం ఆచార్యునివద్దకు వెళ్లి నేను సత్యకాముడను, జాబాలుడను అని చెప్పు అని నా తల్లి చెప్పగా వచ్చాను అని చెప్పాడు. అతడు సత్యమే పలికినందుకు గౌతముడు అతనిని శిష్యుణ్ణిగా స్వీకరించాడు అనే కథ ఛాందోగ్యోపనిషత్తులో ఉంది. 37.

## సూ. శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ. 1.3.38

ఇతశ్చ న శూద్రస్యాధికారః యదస్య స్మృతేః శ్రవణాధ్యాయనార్థ ప్రతిషేధో భవతి. వేదశ్రవణప్రతిషేధః, వేదాధ్యాయనప్రతిషేధః, తతర్థ జ్ఞానానుష్ఠానయోశ్చ ప్రతిషేధః శూద్రస్య స్మర్యతే. శ్రవణ ప్రతిషేధస్తావత్- "అథాస్య వేదముపశృణ్వతస్త్రపుజతుభ్యాం శ్రోత్రప్రతిపురణమ్" (గౌ.ధ.సూ. 2.3.4) ఇతి. "పద్యు హ వా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్రః తస్మాచ్ఛూద్రసమీపే నాధ్యేతవ్యమ్ (ధ.సూ. 1.8.11) ఇతి చ. అత ఏవాధ్యయనప్రతిషేధః. యస్య హి సమీపేఽపి నాధ్యేతవ్యం భవతి స కథ మశ్రుతమధీయీత? భవతి చ "ఉదాహరణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరచ్ఛేదః" (గౌ.ధ.సూ. 2.3.5.6) ఇతి. అత ఏవార్థాత్ అర్థజ్ఞానానుష్ఠానయోః ప్రతిషేధో భవతి. "న శూద్రాయ మతిం దద్యాత్" (మను.స్మృ. 4.80) ఇతి, "ద్విజాతీనామధ్యయనమిజ్యాధానమ్" (గౌ.ధ.సూ. 2.1.1) ఇతి చ. యేషాం పునః పూర్వకృతసంస్కారవశాద్విదుర ధర్మవ్యాధ ప్రభృతీనాం జ్ఞానోత్పత్తి స్తేషాం న శక్యతే ఫలప్రాప్తిః ప్రతిషేద్ధుమ్, జ్ఞానస్యైకాన్తికఫలత్వాత్. "శ్రావయేచ్చతురో వర్ణాన్" (మభార) ఇతి చేతి హాసపురాణాధిగమే చాతుర్వర్ణ్యస్యాధికారస్మరణాత్. వేదపూర్వకస్తు నాస్త్యధికారః శూద్రాణామితి స్థితమ్. 38.

### బాలానందిని

శ్రవణేతి :- "స్మృతివల్ల శూద్రునికి వేదశ్రవణం,వేదాధ్యయనం, వేదార్థజ్ఞానం నిషేధింపబడినందువల్ల కూడ శూద్రునకు అధికారం లేదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఈ కారణంవల్ల కూడ శూద్రునికి అధికారం లేదు. ఎందువల్ల ననగా స్మృతివల్ల శ్రవణ - అధ్యయన - అర్థప్రతిషేధం ఉన్నది. శూద్రుడు వేదం వినగూడ దనే నిషేధం, వేదాధ్యయనం చేయగూడదనే నిషేధం, వేదార్థం తెలుసుకొన గూడదు, కర్మానుష్ఠానం చేయగూడదు అనే నిషేధం స్మృతులలో చెప్పబడింది. వినగూడదు అనే ప్రతిషేధం ఎట్లనగా "అథాస్య... పూరణమ్" అని, "పద్యు... అధ్యేయతవ్యమ్" అని కూడ. దీనిని పట్టి అధ్యయనం నిషేధింపబడి నట్లే. ఎవని దగ్గర కూడా వేదాధ్యయనం చేయగూడదో అతడు విననిదానిని ఎలా అధ్యయనం చేస్తాడు? "ఉదాహరణే... శరీర భేదః" అని కూడ ఉంది. (భామతీసహిత ప్రతిలోను రత్న ప్రభాసహిత ప్రతిలోను - వేదోచ్చారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేద - ఇతి అని భాష్యవాక్యంగా ఉంది. బ్రహ్మ విద్యాభరణసహితపుస్తకంలో పైన ఇచ్చినట్లు పాఠం ఉండి ఆ సూత్రం గౌతమధర్మసూత్రంలోని దని సూచింపబడింది). అందుచేతనే అర్థజ్ఞానకర్మానుష్ఠానాలు కూడ నిషేధించబడి నట్లు అర్థాత్సిద్ధిస్తుంది. "న... దద్యాత్" అని "ద్విజాతీనా... దానమ్" (అధ్యయనం, యాగం, దానం - ఇవి ద్విజులకే) అని కూడ చెప్పబడింది. విదురుడు, ధర్మవ్యాధుడు మొదలైన ఎవళ్లకైతే పూర్వ జన్మసంస్కారంవల్ల జ్ఞానం కలిగిందో వాళ్లకి దానివల్ల కలిగే ఫలాన్ని ఎవరూ ఆపజాలరు. ఎందువల్ల ననగా జ్ఞానంవల్ల కలగవలసిన ఫలం తప్పక కలిగి తీరుతుంది. "శ్రావయేచ్చతురో వర్ణాన్" (ఇతిహాసపురాణాలను నాలుగు వర్ణాలవాళ్లకీ వినిపింపచేయ్యాలి) అని ఇతిహాస పురాణాలను పొందడంలో (చదవడంలో) నాలుగు వర్ణాలవాళ్లకీ అధికారం ఉంది అని స్మృతి చెపుతున్నది. (అందుచేత విదురాదులకు జ్ఞానోదయం ఇతిహాసపురాణాదిపఠనం ద్వారా కూడ వచ్చి ఉండవచ్చునని అభిప్రాయం). శూద్రులకు వేదపూర్వకంగా మాత్రం బ్రహ్మవిద్యయందు అధికారం లేదు అనేది నిశ్చితం. 38.

అపశూద్రాదికరణం సమాప్తమ్.

## 10. కమ్పనాధికరణమ్ సూ. 39

## సూ. కమ్పనాత్ 1.3.39

అవసితః ప్రాసఙ్గికోఽ ధికారవిచారః. ప్రకృతామేవేదానీం వాక్యార్థ విచారణాం ప్రవర్తయిష్యామః.

"యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్.
మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి"

(క.ఉ. 2.6.2) ఇతి. ఏతద్వాక్యం "ఏజృ కమ్పనే" ఇతి ధాత్వర్థానుగమాల్లక్షితమ్. అస్మిన్వాక్యే సర్వమిదం జగత్ప్రాణాశ్రయం స్పన్దతే, మహచ్చ కించిద్భయ కారణం వజ్రశబ్దితముద్యతం, తద్విజ్ఞానాచ్చామృతత్వ ప్రాప్తిరితి శ్రూయతే. తత్ర కోఽసౌ ప్రాణః, కిం చ తద్భయానకం వజ్రమిత్య ప్రతిపత్తేః విచారే క్రియమాణే ప్రాప్తం తావత్ప్రసిద్ధేః పఞ్చవృత్తిర్వాయుః ప్రాణ ఇతి. ప్రసిద్ధేరేవ చాశనిర్వజ్రం స్యాత్. వాయోశ్చేదం మాహాత్మ్యం సంకీర్త్యతే. కథమ్? సర్వమిదం జగత్పఞ్చవృత్తౌ వాయౌ ప్రాణశబ్దితే ప్రతిష్ఠాయైజతి. వాయునిమిత్త మేవ చ మహద్భయానకం వజ్రముద్యమ్యతే. వాయౌ హి పర్జన్యభావేన వివర్తమానే విద్యుత్స్తనయిత్నువృష్ట్యశనయో వివర్తన్తే ఇత్యాచక్షతే. వాయువిజ్ఞానాదేవ చేదమమృతత్వమ్. తథా హి శ్రుత్యన్తరమ్ - "వాయురేవ వ్యష్టిర్వాయుః సమష్టిరప పునర్మృత్యుం జయతి య ఏవం వేద" ఇతి. తస్మాద్వాయురయ మిహ ప్రతిపత్తవ్య ఇతి.

### బాలానందిని

కమ్పనాదితి :- "కమ్పనాత్ = సమస్తము కంపింపచేయబడుచున్నది అని చెప్పడంచేత ప్రాణం బ్రహ్మయే" అని సూత్రార్థం.

**అవసిత ఇతి** :- ప్రాసంగికమైన అధికారాన్ని గూర్చిన విచారం పూర్తి అయింది. ఇప్పుడు ప్రకృతమైన ఉపనిషద్వాక్యార్థ విచారణను నడిపిస్తాం. "యదిదం... భవన్తి" అనే వాక్యం "ఏజృ కమ్పనే" అనే ధాతువుయొక్క అర్థాన్ని అనుసరించి ఇక్కడ గ్రహింపబడింది. (అనగా సూత్రంలో 'కమ్పనాత్' అని ఉన్నా కంపనశబ్దఘటిత వాక్యం లేకపోవడంచేత ఏజృధాతుఘటితమైన ఈ వాక్యం తీసికొనబడింది అని అర్థం). "ప్రాణం నుండి పుట్టిన ఈ జగత్తంతా ఆ ప్రాణం (బ్రహ్మ) అలా ఉండగా, కదలుతున్నది అనగా ఆ బ్రహ్మయందే కదలుతున్నది. ఈ బ్రహ్మ పైకి ఎత్తబడిన వజ్రం వలె చాలా భయంకరమైనది. దీనిని తెలుసుకొన్నవారు మరణ రహితు లవుతారు" అని వాక్యానికి అర్థం. ఈ జగత్తంతా ప్రాణాన్నే ఆశ్రయించుకొని ఉండి స్పందిస్తున్నది. వజ్రం అనే ఒక భయకారణమైనది ఎత్తబడి ఉన్నది. దానిని తెలుసుకొనడంవల్ల అమృతత్వం లభిస్తుంది" అని ఈ వాక్యంలో వినబడుతున్నది. ఈ ప్రాణం అంటే ఏమిటో, భయంకరమైన ఆ వజ్రం ఏదో, స్పష్టంగా తెలియక పోవడంచేత విచారణ చేయగా ప్రసిద్ధిని బట్టి శరీరంలో ఐదు విధాలుగా ఉండే వాయువే ప్రాణం అని తోస్తున్నది.

ప్రసిద్ధినే పట్టి వజ్రం అంటే కూడ పిడుగు అని తెలుస్తున్నది. ఇదంతా వాయువు యొక్క మాహాత్మ్యమే చెప్పబడుతున్నది. ఎట్లు? ఈ ప్రపంచం అంతా పంచవృత్తియైన, ప్రాణం అనే పేరు గల వాయువునందే ప్రతిష్ఠితమై స్పందిస్తూన్నది. వాయువువల్లనే భయంకరమైన గొప్ప వజ్రం ఎత్తబడు చున్నది. వాయువే పర్జన్యుడుగా మారితే మెరుపులు, మేఘాలు, వర్షం, పిడుగులూ ఏర్పడతాయని అంటారు. అలాంటి వాయువును తెలుసుకొనడంవల్లనే ఈ అమృతత్వం లభిస్తుంది. ఈ "వాయు... వేద" (విశేష రూపాలన్నీ వాయువే, సామాన్య రూపాలన్నీ వాయువే, ఈ విషయం తెలుసు కొన్నవాడు అప మృత్యుభయాన్ని జయిస్తాడు) అను మరొక శ్రుతి కూడ ప్రాణవిజ్ఞానం వల్ల అమృతత్వం లభిస్తుందని చెపుతున్నది. అందువల్ల ఇక్కడ వాయువునే గ్రహించాలి.

వి. ప్రాసంగికాలైన దేవతాధికారణ - అపశూద్రాధికరణాలకు పూర్వం ఉన్న ప్రమితాధికరణంతో ఈ అధికారణానికి సంగతి చూచుకోవాలి. ప్రాసంగికాధికరణాలతో చూడనవసరం లేదు. ప్రమితాధికరణంలో అంగుష్ఠవాక్యంలో జీవుణ్ణి అనువదించడం బ్రహ్మతో జీవుని ఐక్యాన్ని తెలుసుకొనడంకొరకు అని చెప్పబడింది. ఆ విధంగా ఇక్కడ ప్రాణంగా కల్పించబడినదానికి ఐక్యం కుదరదు గాన ప్రాణానువాదం ప్రాణజీవుల ఐక్యాన్ని చెప్పడం కోసం చేయబడిందని చెప్పడం కుదరదు. అందుచేత ఈ వాక్యం ప్రాణోపాసననే బోధిస్తూన్నది అని ఆ అధికరణంతో దీనికి ప్రత్యుదాహరణ సంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః - బ్రహ్మైవేదం ప్రతిపత్తవ్యమ్ కుతః? పూర్వోత్తరాలోచనాత్. పూర్వోత్తరయోర్హి గ్రంథభాగయోః బ్రహ్మైవ నిర్దిశ్యమానముపలభామహే. ఇహైన కథమకస్మాదన్తరాలే వాయుం నిర్దిశ్యమానం ప్రతిపద్యేమహి? పూర్వత్ర తావత్ -

> "తదేవ శుక్రం తద్ బ్రహ్మ తదేవామృత ముచ్యతే,
> తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన" (క.ఉ.2.6.1)

ఇతి బ్రహ్మ నిర్దిష్టమ్. తదేవేహాపి సంనిధానాత్ జగత్సర్వం ప్రాణ ఏజతీతి చ లోకాశ్రయత్వప్రత్యభిజ్ఞానాన్నిర్దిష్టమితి గమ్యతే. ప్రాణశబ్దోఽ ప్యయం పరమాత్మన్యేవ ప్రయుక్తః "ప్రాణస్య ప్రాణమ్" (బృ.ఉ.4.4.18)

ఇతి దర్శనాత్. ఏజయితృత్వమపీదం పరమాత్మన ఏవోపపద్యతే న వాయుమాత్రస్య. తథా చోక్తమ్

భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః,

భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః" (క.ఉ.2.3.3)

ఇతి బ్రహ్మైవ నిర్దేక్ష్యతే న వాయుః. సవాయుకస్య జగతః భయహేతుత్వాభిధానాత్. తదేవేహాపి సంనిధానాన్మహద్భయం వజ్రముద్యతమితి చ భయహేతుత్వప్రత్యభిజ్ఞానాన్నిర్దిష్టమితి గమ్యతే.

## బాలానందిని

**ఏవమితి :-** ఇట్లు ప్రాపించగా చెప్పుచున్నాం - ఇది బ్రహ్మయే అని గ్రహించాలి. ఎందువల్ల? ముందు వెనుకలను పరీక్షించడంవల్ల. పూర్వోత్తరగ్రంథభాగాలలో బ్రహ్మయే నిర్దేశింపబడుతున్నట్లు చూస్తున్నాం. అలాంటప్పుడు హటాత్తుగా వాటి మధ్య ఇక్కడనే వాయువు నిర్దేశించబడుతున్న దని ఎట్లు గ్రహిస్తాం? వెనక "తదేవ... కశ్చన" (అదే శుక్రము అనగా స్వప్రకాశము. అదే బ్రహ్మ. అదే అమృతమని చెప్పబడుచున్నది. దాని మీదనే (దానినే) లోకాలన్నీ ఆశ్రయించి ఉన్నాయి. దానిని ఏదీ కూడ దాటి ఉండజాలదు) అని బ్రహ్మ నిర్దేశించబడింది. ఇక్కడ కూడ "జగత్తంతా ప్రాణంలోనే స్పందిస్తూన్నది" అనే వాక్యంలో లోకానికి ఆశ్రయంగా ఉండడం అనే ప్రత్యభిజ్ఞానంవల్ల, సంనిధానాన్ని పట్టి, ఆ బ్రహ్మయే నిర్దేశించ బడినదని తెలుస్తూన్నది. "ప్రాణస్య ప్రాణమ్" (ప్రాణానికి ప్రాణం) అని (శ్రుత్యంతరంలో) కనబడడంవల్ల ఈ ప్రాణశబ్దం కూడ పరమాత్మ అనే అర్థంలోనే ప్రయోగింపబడింది. ఈ ఏజయితృత్వం (కంపింప చేయడం) కూడ పరమాత్మకే కుదురుతుంది గాని కేవలం వాయువుకు కుదరదు. "న... ఉపాశ్రితౌ" (అతనినుండి భయంచేతనే అగ్ని కాలుస్తూన్నది, భయంవల్లనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఇంద్రుడు, వాయువు కూడ భయంవల్లనే తమ పనులు చేస్తున్నారు. ఐదవ దైన మృత్యుదేవత కూడ భయంవల్లనే పరుగెత్తుచున్నది) అని మున్ముందు కూడ బ్రహ్మయే చెప్పబడబోతున్నది గాని వాయువు కాదు. వాయువుతో సహా సమస్తజగత్తుకు ఇది భయకారణ మని చెప్పబడింది కదా? ఇక్కడ "మహద్భయం వజ్రముద్యతమ్" అని చెప్పబడినది కూడ, భయహేతుత్వంయొక్క ప్రత్యభిజ్ఞానంవల్ల, సంనిధానంవల్ల ఆ బ్రహ్మయే అని తెలుస్తూన్నది.

## భాష్యమ్

వజ్రశబ్దో ఽప్యయం భయహేతుత్వసామాన్యాత్ ప్రయుక్తః, యథా హి వజ్రముద్యతం మమైవ శిరసి నిపతేద్యద్యహమస్య శాసనం న కుర్యామిత్యనేన భయేన జనో నియమేన రాజాదిశాసనే ప్రవర్తత ఏవమిదమగ్నివాయుసూర్యాదికం జగదస్మాదేవ బ్రహ్మణో బిభ్యన్నియమేన స్వవ్యాపారే ప్రవర్తత ఇతి భయానకం వజ్రోపమితం బ్రహ్మ. తథా చ శ్రుత్యన్తరమ్-

భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః,
భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః. (తై.ఉ. 8.1)

ఇతి. అమృతత్వఫలశ్రవణాదపి బ్రహ్మైవేదమితి గమ్యతే. బ్రహ్మజ్ఞానాద్ధ్యమృతత్వప్రాప్తిః "తమేవ విదిత్వామృతత్వ మేతి నాన్యః పన్థా విద్యతే ఽయనాయ". (శ్వే.ఉ. 6.1.15) ఇతి మన్త్రవర్ణాత్. యత్తు వాయువిజ్ఞానాత్క్వచిదమృతత్వ మభిహితం తదాపేక్షికమ్. తత్రైవ ప్రకరణాన్తరకరణేన పరమాత్మానమభిధాయ "తతో ఽన్యదార్తమ్" (బృ.ఉ.3.4) ఇతి వాయ్వాదేరార్తత్వాభిధానాత్. ప్రకరణాద ప్యత్ర పరమాత్మనిశ్చయః-

"అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్,
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద" (క.ఉ.1.2.14)

ఇతి పరమాత్మనః పృష్టత్వాత్. 39

## బాలానందిని

వజ్రేతి :- ఇక్కడ ఈ వజ్రశబ్దం కూడ భయహేతుత్వం అనే సామ్యాన్ని పట్టి (బ్రహ్మవిషయంలో) ప్రయోగించబడింది. నేను వీని శాసనం ప్రకారం చేయకపోతే ఎత్తబడిన ఈ వజ్రం నా శిరస్సుమీదనే పడుతుంది అనే భయంచేత జనుడు ఏ విధంగా రాజాదుల శాసనం ప్రకారం ప్రవర్తిస్తాడో అట్లే ఈ అగ్ని - వాయు- సూర్యాదికమైన జగత్తు కూడ ఈ బ్రహ్మకే భయపడుతూ నియమం ప్రకారం తన పనిలో ప్రవర్తిస్తున్నది అని భయంకరమైన బ్రహ్మ వజ్రంతో పోల్చబడింది. బ్రహ్మను గూర్చిన "భీషా... పఞ్చమః" (దీనికి భయపడి వాయువు వీచుతున్నది. దీనికి భయపడి

సూర్యు డుదయిస్తున్నాడు అగ్ని, ఇంద్రుడు, ఐదవ దైన మృత్యువు కూడ దీనికి భయపడి తమ తమ పనులమీద పరుగెత్తుచున్నారు) అను శ్రుతి కూడ ఈ అర్థమే చెపుతూన్నది. అమృతత్వం ఫలంగా వినబడుచుండడం వల్ల కూడ ఇది బ్రహ్మ అని తెలుస్తున్నది. "తమేవ... అయనాయ" అనే మంత్రం ప్రకారం అమృతత్వప్రాప్తి బ్రహ్మజ్ఞానంవల్లనే కలుగుతుంది కదా? వాయువిజ్ఞానంవల్ల అమృతత్వం లభిస్తుందని కొన్ని చోట్ల చెప్పినది ఆపేక్షికమైన అమృతత్వమే కాని శాశ్వతమైన అమృతత్వం కాదు. ఎందువల్ల ననగా అక్కడనే పరమాత్మను గూర్చి చెప్పి "అతోఽన్యదార్తమ్" (అది తప్ప మిగిలిన ప్రతీదీ అనిత్యమే) అని వాయ్వాదికం ఆర్తమని (నశ్వరమని) చెప్పబడింది. మరొక విషయ మేమనగా "అన్యత్ర... తద్వద" అని ప్రదమాత్మను గూర్చి ప్రశ్న చేయబడింది. అందుచేత ప్రకరణాన్ని పట్టి కూడ ఇక్కడ చెప్పబడినది పరమాత్మయే అని నిశ్చయం. 39

కంపనాధికరణం సమాప్తం

## 11. జ్యోతిరధికరణమ్. సూ. 40

## సూ. జ్యోతిర్దర్శనాత్ 1.3.40

"ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛాం. ఉ. 8.12.3) ఇతి శ్రూయతే. తత్ర సంశయ్యతే - కిం జ్యోతిఃశబ్దం చక్షుర్విషయం తమోపహం తేజః కిం వా పరం బ్రహ్మేతి. కిం తావత్ప్రాప్తమ్? ప్రసిద్ధమేవ తేజో జ్యోతిఃశబ్దమితి. కుతః? తత్ర జ్యోతిః శబ్దస్య రూఢత్వాత్. "జ్యోతిశ్చరణాభిధానాత్" (బ్ర.సూ. 1.1.24) ఇత్య త్ర హి ప్రకరణాత్ జ్యోతిఃశబ్దః స్వార్థం పరిత్యజ్య బ్రహ్మణి వర్తతే. న చేహ తద్వత్కించిత్ స్వార్థపరిత్యాగే కారణం దృశ్యతే, తథా చ నాడీఖణ్డే - "అథ యత్రైతదస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభిరూర్ధ్వం క్రామతే" (ఛాం. ఉ. 8.6.5) ఇతి ముముక్షోరాదిత్యప్రాప్తిరభిహితా. తస్మాత్ప్రసిద్ధమేవ తేజో జ్యోతిః శబ్దమితి.

బాలానందిని

జ్యోతిరితి :- "దర్శనాత్ = ఈ ప్రకరణంలో కనబడడంవల్ల, జ్యోతిః = జ్యోతిః శబ్దవాచ్యం బ్రహ్మయే" అని సూత్రార్థం.

ఏష ఇతి:- "ఏష... నిష్పద్యతే" అని ఒక శ్రుతి వాక్యం ఉంది. ఇక్కడ జ్యోతిః శబ్దంచేత చెప్పబడినది చక్షురింద్రియానికి కనబడేది, చీకటిని తొలగించేది అయిన తేజస్సా లేక బ్రహ్మయా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? ప్రసిద్ధమైన తేజస్సే జ్యోతిః శబ్దవాచ్యం అని. ఎందువల్ల? ఆ అర్థంలో జ్యోతిఃశబ్దం రూఢం కనక. "జ్యోతిశ్చరణాభిధానాత్" అనే చోట ప్రకరణాన్ని పట్టి జ్యోతిఃశబ్దం స్వార్థాన్ని విడిచి పెట్టి బ్రహ్మ అనే అర్థాన్ని భోదిస్తున్నది. అయితే ఇక్కడ ఆ విధంగా స్వార్థాన్ని విడిచి పెట్టవలసిన కారణం ఏదీ కనబడడంలేదు. ఇట్లే నాడీఖండంలో "అథ... అక్రమతే" (సంజ్ఞ తప్పిన తరువాత ఎప్పుడైతే మరణం కలిగే విధంగా ఈ శరీరంనుండి పైకి లేచిపోతాడో అప్పుడు ఈ సూర్యరశ్మల సహాయంతో ఊర్ధ్వలోకాన్ని అక్రమిస్తాడు) అని ముముక్షువు ఆదిత్యుణ్ణి పొందుతాడు అని చెప్పబడింది. అందువల్ల ప్రసిద్ధమైన తేజస్సే జ్యోతిఃశబ్దవాచ్యం.

వి. సర్వ జగత్తుయొక్క చేష్టకు హేతువని చెప్పడంచేత ప్రకరణాన్ని సమర్థించే దానిని పట్టి ప్రాణశబ్దానికి అర్థం బ్రహ్మ అని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. అలాంటి ప్రకరణానుగ్రాహకం ఏదీ లేదు గాన ఇక్కడ జ్యోతిఃశబ్దానికి జ్యోతిస్సు అనే అర్థం. బ్రహ్మ అని కాదు అని ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షంలో ఫలం సూర్యోపాసన. సిద్ధాంతంలో బ్రహ్మజ్ఞానంవల్ల ముక్తి ఫలం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- పరమేవ బ్రహ్మ జ్యోతిఃశబ్దవాచ్యమ్. కస్మాత్? దర్శనాత్. తస్య హీహ ప్రకరణే వక్తవ్యత్వేనానువృత్తిర్దృశ్యతే - "య **ఆత్మాపహతపాప్మా**" (ఛా. ఉ. 8.7.1) ఇత్య పహతపాప్మత్వాదిగుణకస్యాత్మన ప్రకరణాదావన్వేష్టవ్యత్వేన విజిజ్ఞాసితవ్యత్వేన చ ప్రతిజ్ఞానాత్, "ఏతం త్వేవ **తే భూయో౽నువ్యాఖ్యాస్యామి**" (ఛా.ఉ. 89.3) ఇతి చానుసంధానాత్. " అ శరీరం వా వ సన్తం న ప్రియాప్రియే స్పృశతః" (ఛా.ఉ.8.12.1) ఇతి చాశరీరతాయై జ్యోతిఃసంపత్తేరస్యాభిధానాత్. బ్రహ్మభావాచ్చాన్యత్రా శరీరతానుపపత్తేః. "పరం జ్యోతిః", "స ఉత్తమః పురుషః" (ఛా. ఉ. 8.12.2) ఇతి చ విశేషణాత్. యత్తూక్తమ్ - ముముక్షోరాదిత్యప్రాప్తిరభిహితా ఇతి; నాసావాత్యన్తికో మోక్షః, గత్యుత్క్రాన్తి సంబన్ధాత్. నాత్యన్తికే మోక్షే గత్యుత్క్రాన్తీ స్త ఇతి వక్ష్యామః. 40.

బాలానందిని

ఏవమితి :- ఇలా ప్రాప్తించగా చెపుతున్నాం. జ్యోతిఃశబ్దవాచ్యమైనది పరబ్రహ్మయే. ఎందువల్ల? అలా కనబడడంవల్ల. ఈ ప్రకరణంలో ఆ పరబ్రహ్మయే బోధింపదగిన దన్నట్లు అనువృత్తి (వెనుకనుంచి వరసగా రావడం) కనబడుతున్నది. "య ఆత్మాపహతపాప్మా" అని అపహతపాప్మత్వాదిగుణాలు గల ఆత్మ ప్రకరణం ప్రారంభంలో అన్వేష్టవ్యుడు గాను తెలియ నిచ్ఛయింప దగినవాడు గాను చెప్పబడ్డాడు. "ఏతం... అనువ్యాఖ్యాస్యామి" (మళ్లీ ఈ ఆత్మను గూర్చియే నీకు చెపుతాను) అని ఆ ఆత్మయే అనుసంధానం (మళ్లీ నిర్దేశించడం) చేయబడింది. "అశరీరం... స్పృశతః" అని అశరీరత్వంకొరకు వీనికి (జీవునకు) జ్యోతిఃసంపత్తి చెప్పబడింది. బ్రహ్మభావం పొందుతే తప్ప అశరీరత్వం కుదరదు. "పరం జ్యోతిః" అని, "స ఉత్తమః పురుషః" అనీ విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. అనగా పరజ్యోతిగా చెప్పబడినదానినే "ఉత్తమః పురుషః" అని చెప్పడం జరిగింది. ముముక్షువుకు ఆదిత్యప్రాప్తి చెప్పబడింది అని (పూర్వపక్షిచేత) చెప్పబడింది కదా- అది ఆత్యంతికమోక్షం కాదు. ఎందువల్ల ననగా గత్యుత్క్రాంతులతో (వెళ్లడంతోను బైటకు రావడంతోను) సంబంధం ఉంది. ఆత్యంతిక మైన మోక్షంలో గత్యుత్క్రాంతు లుండవని ముందు చెప్పగలం. 40.

జ్యోతిరధికరణం సమాప్తం

## 12. అర్థాన్తరవ్యపదేశాధికరణమ్. సూ. 41

## సూ. ఆకాశోఽర్థాన్తరత్వాదివ్యపదేశాత్ 1.3.41

"ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా, తే యదన్తరా తద్ బ్రహ్మ తదమృతం స ఆత్మా" (ఛా.ఉ.8.14.1) ఇతి శ్రూయతే. తత్కిమాకాశ శబ్దం పరం బ్రహ్మ కిం వా ప్రసిద్ధమేవ భూతాకాశమితి విచారే భూతాకాశ పరిగ్రహో యుక్తః, ఆకాశశబ్దస్య తస్మిన్ రూఢత్వాత్. నామరూపనిర్వహణస్య చ అవకాశదానద్వారేణ తస్మిన్యోజయితుం శక్యత్వాత్. స్రష్టృత్వాదేశ్చ స్పష్టస్య బ్రహ్మలిఙ్గస్య అశ్రవణాదితి.

బాలానందిని

ఆకాశ ఇతి :- "అర్థాన్తరత్వాదివ్యపదేశాత్ = నామరూపాలకంటె భిన్నమైనది ఇత్యాది విశేషాలను చెప్పడంవల్ల, ఆకాశః = ఆకాశం బ్రహ్మయే" అని సూత్రార్థం.

**ఆకాశ ఇతి:-** "**ఆకాశో... ఆత్మా**" అని వినబడుచున్నది. ఇక్కడ ఆకాశశబ్ద వాచ్యం పరబ్రహ్మయా లేక ప్రసిద్ధమైన భూతాకాశమా అని విచారించగా ఆకాశ శబ్దం భూతాకాశం అనే అర్థంలోనే రూఢం అవడంచేత భూతాకాశాన్ని గ్రహించడమే యుక్తం అని కనబడుతున్నది. నామరూపాలను నిర్వహించడం అనేది అవకాశం ఇవ్వడం ద్వారా భూతాకాశంలో కూడ అన్వయించడానికి కుదురుతుంది. స్రష్టృత్వం మొదలైన స్పష్టమైన బ్రహ్మలింగం ఏదీ కూడ ఇక్కడ కనబడడంలేదు.

వి. ఉపక్రమబలంవల్ల జ్యోతిః అనే శబ్దం వినబడుతున్నా దానికి పరమాత్మ అని అర్థం వెనుకటి అధికరణంలో చెప్పబడింది. అట్లే ఆకాశశబ్దం ఉపక్రమంలో ఉండడంవల్ల దాని బలంచేత ఇక్కడ భూతాకాశాన్నే గ్రహించాలి అని దృష్టాంత సంగతి. ఇక్కడ చెప్పిన గుణాలతో ఆకాశాన్ని ఉపాసించాలి అని పూర్వపక్షానికి ఫలం. నిర్గుణబ్రహ్మజ్ఞానం ఉత్తరపక్షానికి ఫలం.

## భాష్యమ్

ఏవం ప్రాప్త ఇదముచ్యతే - పరమేవ బ్రహ్మేహాకాశశబ్దం భవితుమర్హతి. కస్మాత్? అర్థాన్తరత్వాదివ్యపదేశాత్. "తే యదన్తరా తద్ బ్రహ్మ" ఇతి హి నామరూపాభ్యామర్థాన్తరభూతమాకాశం వ్యపదిశతి. న చ బ్రహ్మణోఽన్యన్నామరూపాభ్యామర్థాన్తరం సంభవతి; సర్వస్య వికారజాతస్య నామరూపాభ్యామేవ వ్యాకృతత్వాత్. నామరూపయోరపి నిర్వహణం నిరఙ్కుశం న బ్రహ్మణోఽన్యత్ర సంభవతి. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా. ఉ. 6.3.2) ఇత్యాదిబ్రహ్మకర్తృకత్వశ్రవణాత్. నను జీవస్యాపి ప్రత్యక్షం నామరూపవిషయం నిర్వోఢృత్వమస్తి? బాఢమస్తి, అభేదస్త్విహ వివక్షితః. నామరూపనిర్వహణాభిధానాదేవ చ స్రష్టృత్వాది బ్రహ్మలిఙ్గమభిహితం భవతి. "తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా" (ఛా. ఉ. 8.14) ఇతిచ బ్రహ్మవాదస్య లిఙ్గాని. "ఆకాశస్తల్లిఙ్గాత్" (1.1.22) ఇత్యస్యైవాయం ప్రపఞ్చః. 41.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాపించగా చెప్పబడుచున్నది - ఇక్కడ ఆకాశశబ్దవాచ్యం పరబ్రహ్మయే అని చెప్పడం తగి ఉంటుంది. ఎందువల్ల? అర్థాంతరత్వాదివ్యపదేశం

వల్ల. "తే యదన్తరా తద్బ్రహ్మ" (ఆ నామరూపాలు దేని మధ్య ఉన్నాయో అట్టి బ్రహ్మ) అని ఆకాశం నామరూపాలకంటె భిన్నమైన దన్నట్లు చెపుతూన్నది. నామరూపాలకంటె భిన్నమైన పదార్థం బ్రహ్మ తప్ప మరొకటి ఏదీ కాజాలదు, ఎందువల్లననగా సమస్త వికార (కార్య) సముదాయమూ కూడ నామరూపాలతో వ్యాకృతమై (విడదీయబడి) ఉంది. నామరూపాలను వ్యాకరించే నిరంకుశమైన (ఎలాంటి అడ్డూలేని) శక్తి బ్రహ్మకు తప్ప మరి ఎవరికీ సంభవించదు. "అనేన... వ్యాకరవాణి" (నా ఆత్మయైన ఈ జీవుని రూపంతో ఈ జగత్తులో ప్రవేశించి నామరూపవ్యాకరణం చేస్తాను) అని నామరూప విభాగానికి కర్త బ్రహ్మ అని తెలుస్తూన్నది. (ప్రశ్న) నామరూపాలను నిర్వహించడం అనేది జీవునకు కూడ ఉన్నట్లు ప్రత్యక్షంగా (పై శ్రుతి వాక్యంలో) తెలుస్తున్నది కదా? నిజమే, తెలుస్తున్నది. కాని (ఈ వాక్యంలో) నా ఆత్మయైన జీవుని రూపంతో అని చెప్పడం ద్వారా జీవబ్రహ్మల అభేదం చెప్పాలని ఉద్దిష్టమైనది కాని జీవుడు నామరూపవిభాగం చేస్తున్నాడు అని చెప్పడంలో తాత్పర్యం కాదు. నామరూప నిర్వహణం చెప్పడంచేతనే స్రష్టృత్వం మొదలైన బ్రహ్మలింగం చెప్పబడినట్లవుతుంది. "తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా" అనేవి కూడ బ్రహ్మవాదానికి లింగాలు. "ఆకాశస్తల్లిఙ్గాత్" అనే దానికే ఇది ప్రపంచం. అనగా - ఆకాశాధికరణన్యాయాన్ని ప్రవర్తింప చేయడం ద్వారా ఈ వాక్యం బ్రహ్మప్రతిపాదక మని నిర్ణయించవచ్చును గాన ఈ అధికరణం అనావశ్యకమే అని భావం. 41.

అర్థాన్తరత్వవ్యపదేశాధికరణం సమాప్తం

## 13. సుషుప్త్యుత్క్రాన్త్యధికరణమ్. సూ. 42-43

## సూ. సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన. 1.3.42

వ్యపదేశాదిత్యనువర్తతే. బృహదారణ్యకే షష్ఠే ప్రపాఠకే - "కతమ ఆత్మేతి, సోఽ యం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః" (బృ.ఉ. 4.3.7) ఇత్యుపక్రమ్య భూయానాత్మవిషయః ప్రపఞ్చః కృతః. తత్కిం సంసారిస్వరూపమాత్రాన్వాఖ్యానపరం వాక్యముతాసంసారిస్వరూప ప్రతిపాదనపరమితి సంశయః. కిం తావత్ప్రాప్తమ్? సంసారిస్వరూప మాత్రవిషయమేవేతి. కుతః? ఉపక్రమోపసంహారాభ్యామ్. ఉపప్రకమే "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" ఇతి శారీరలిఙ్గాత్. ఉపసంహారే చ

"స వా.. ప్రాణేషు" (బృ.ఉ. 4.4.22) ఇతి తదపరిత్యాగాత్. మధ్యేఽపి బుద్ధాన్తాద్యవస్థోపన్యాసేన తస్యైవ ప్రపఞ్చనాత్ ఇతి.

## బాలానందిని

సుషుప్తీతి :- "సుషుప్త్యుత్క్రాన్త్యోః - సుషుప్తియందు బైటకు వెడలుటయందు, భేదేన = జీవునికంటె వేరుగా పరమేశ్వరుణ్ణి చెప్పడంచేత, "యోఽయం విజ్ఞానమయః" ఇత్యాదివాక్యంలో చెప్పబడినవాడు పరమాత్మయే'' అని సూత్రార్థం.

వ్యపదేశాదితి :- పూర్వసూత్రంనుంచి 'వ్యపదేశాత్' అనే పదం అనువర్తిస్తుంది. బృహదారణ్యకోపనిషత్తులోని ఆరవ ప్రపాఠకంలో "కతమః... పురుషః" (ఆత్మ ఎవరు? విజ్ఞానమయుడు, అనగా బుద్ధిమయుడు, ప్రాణాలలోను హృదయంలోను వాటికంటె వేరుగా ఉన్నవాడు, జ్యోతిఃస్వరూపుడు అయిన ఏ పురుషుడున్నాడో అతడే ఆత్మ) అని ఉపక్రమించి ఆత్మను గూర్చిన విస్తృతమైన విచారం చేయబడింది. ఆ వాక్యం కేవలం సంసారియొక్క స్వరూపాన్ని చెప్పడం కోసమే ఉద్దిష్టమైనదా లేక అసంసారి స్వరూపం ప్రతిపాదించడానికి ఉద్దిష్టమైనదా అని సంశయం. ఏమి ప్రాప్తించింది? సంసారి స్వరూపమాత్రప్రతిపాదనపర మని తేలింది. ఎందువల్ల? ఉపక్రమోప సంహారాల వల్ల. "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" అని ఉపక్రమంలో జీవుని లింగం ఉంది. ఉపసంహారంలో కూడ "స వా ఏష... ప్రాణేషు" (ప్రాణాలలో ఏ ఈ విజ్ఞానమయ మైన ఆత్మ ఉన్నదో అదే గొప్ప జన్మరహితమైన ఆత్మ) అని .దానిని విడవలేదు. మధ్యలో కూడ బుద్ధాంతం (జాగ్రదవస్థ) మొదలైన అవస్థలను చెప్పడంచేత ఆ జీవుణ్ణి గూర్చియే సవిస్తరంగా చెప్పడం జరిగింది.

వి. నామరూపాలకంటె భిన్నంగా చెప్పడంచేత ఆకాశం బ్రహ్మ అని వెనుకటి అధికరణంలో చెప్పబడింది. కాని అదియుక్తం కాదు "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" ఇత్యాదివాక్యాలలో జీవపరమాత్మలకు అభేదమే ఉన్నా భేదం ఉన్నట్లు ఔపచారిక ప్రయోగం కనబడుతున్నది కదా అని పూర్వాధికరణసిద్ధాంతాన్ని ఆక్షేపించి పూర్వపక్షం చేయడంచేత ఆక్షేపసంగతి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- పరమేశ్వరోపదేశపరమేవేదం వాక్యం న శారీర మాత్రాన్వాఖ్యానపరమ్. కస్మాత్? సుషుప్తావుత్క్రాన్తౌ చ శారీరాద్భేదేన పరమేశ్వరస్య వ్యపదేశాత్. సుషుప్తౌ తావత్ - "అయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా

సంపరిష్వక్తః న బాహ్యం వేద నాన్తరమ్" (బృ.ఉ. 4.3.21) ఇతి శారీరాద్భేదేన పరమేశ్వరం వ్యపదిశతి. తత్ర పురుషః శారీరః స్యాత్తస్య వేదితృత్వాత్. బాహ్యాభ్యన్తరవేదనప్రసక్తే సతి తత్ప్రతిషేధసంభవాత్. ప్రాజ్ఞః పరమేశ్వరః, సర్వజ్ఞత్వలక్షణయా ప్రజ్ఞయా నిత్యమవియోగాత్. తథోత్క్రాన్తావపి "అయం శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతి" (బృ.ఉ. 4.3.35) ఇతి జీవాద్భేదేన పరమేశ్వరం వ్యపదిశతి. తస్మాత్సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన వ్యపదేశాత్ పరమేశ్వర ఏవాత్ర వివక్షిత ఇతి గమ్యతే.

### బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం - ఈ వాక్యం పరమేశ్వరుణ్ణి గూర్చి చెప్పేదే కాని కేవలం జీవస్వరూపనిరూపణపరం కాదు. ఎందువల్ల? సుషుప్తిలోను ఉత్క్రాంతిలోను (దేహం విడచి వెళ్లిపోయేటప్పుడు) పరమేశ్వరుణ్ణి శారీరునికంటె వేరుగా చెప్పడంవల్ల. "అయం ... నాన్తరమ్" (ఈ పురుషుడు ప్రాజ్ఞాత్మతో కలిసిపోయి బాహ్యమైనదానిని గాని, లోపల ఉన్నదానిని గాని దేనినీ తెలుసుకొనడు) అని శారీరునికంటె భేదంతో పరమేశ్వరుణ్ణి చెపుతున్నది. అక్కడ పురుషుడు అనగా శారీరుడు. ఎందువల్ల ననగా అతడే తెలుసుకొనేవాడు గాన. అతడు బాహ్యాభ్యంతరవిషయాలను తెలుసుకొనవలసి ఉండగా తెలుసుకొనడం లేదు అని చెప్పబడుచున్నది. (తెలుసుకొనే అవకాశం ఉన్నవానిని గూర్చి మాత్రమే అతడు తెలుసుకొనడం లేదు చెప్పడం యుక్తం కదా?). సర్వజ్ఞత్వ రూపమైన ప్రజ్ఞనుండి ఎన్నడూ దూరం కాకపోవడంచేత ప్రాజ్ఞుడనగా పరమేశ్వరుడు, అట్లే ఉత్క్రాంతి సమయంలో కూడ - "అయం... యాతి" (ఈ శారీరాత్మ, జీవుడు, ప్రాజ్ఞాత్మచేత, పరమాత్మచేత, అధిష్ఠితుడై దేహాన్ని విడచి వెళ్లుచున్నాడు) అని జీవునికంటె వేరుగా పరమేశ్వరుణ్ణి నిర్దేశిస్తున్నది. అక్కడ శరీరానికి స్వామి అవడంచేత శారీరుడు జీవుడే. ప్రాజ్ఞుడైతే ఆపరమేశ్వరుడే. ఈ విధంగా సుషుప్తి- ఉత్క్రాంతులలో భేదంతో నిర్దేశించడంవల్ల ఇక్కడ వివక్షితుడు పరమేశ్వరుడే అని తెలుస్తున్నది.

### భాష్యమ్

యదుక్తమ్ - ఆద్యన్తమధ్యేషు శారీరలిఙ్గాత్తత్పరత్వమస్య వాక్యస్యేతి, అత్ర బ్రూమః- ఉపక్రమే తావత్ "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" ఇతి న సంసారిస్వరూపం వివక్షితమ్, కిం తర్హి? అనూద్య సంసారి స్వరూపం పరేణ బ్రహ్మణాఽ స్యైకతాం వివక్షతి. యతః "ధ్యాయతీవ

తేలాయతీవ" ఇత్యేవమాద్యుత్తరగ్రన్థప్రవృత్తిః సంసారిధర్మనిరాకారణపరా లక్ష్యతే. తథోప సంహారేఽపి యథోపక్రమమేవోపసంహరతి - "స వా... ప్రాణేషు" ఇతి. యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు సంసారీ లక్ష్యతే స వా ఏష మహానజ ఆత్మా పరమేశ్వర ఏవాస్మాభిః ప్రతిపాదిత ఇత్యర్థః.

## బాలానందిని

యదితి :- ఆది- అంత- మధ్యాలలో శారీరుని లింగం ఉండడంవల్ల ఈ వాక్యం శారీరపరమే అని చెప్పినదానికి సమాధానం చెపుతున్నాం. "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" అని ఉపక్రమంలో సంసారిస్వరూపం వివక్షితం కాదు, మరేమనగా - సంసారి స్వరూపాన్ని అనువదించి వీనికి పరబ్రహ్మతో ఐక్యాన్ని చెప్పదలచుచున్నది. ఎందువల్ల ననగా- "ధ్యాయతీవ లేలాయతీవ" (బుద్ధి ధ్యానిస్తుంటే ఆత్మ ధ్యానిస్తూన్నట్లు కనబడుతుంది, బుద్ధి చలిస్తూంటే ఆత్మ చలిస్తున్నట్లుంటుంది) అని ఉత్తరగ్రంథం (రాబోవు గ్రంథం) యొక్క ప్రవృత్తి సంసారిధర్మాలను నిరాకరించడం కోసమే ఉద్దిష్టమైనట్లు కనబడుతుంది. అట్లే ఉపసంహారంలో కూడ - "స వా... ప్రాణేషు" అని ఉపక్రమించినట్లే ఉపసంహరిస్తున్నది. ప్రాణాలలో ఏ విజ్ఞానమయుడు సంసారిగా కనబడుతున్నాడో అతడే ఈ గొప్ప జన్మ రహితమైన ఆత్మ. ఆ పరమేశ్వరుడే మాచేత ప్రతిపాదింపబడినాడు అని (ఈ ఘట్టానికి) అర్థం.

## భాష్యమ్

యస్తు మధ్యే బుద్ధాన్తాద్యవస్థోపన్యాసాత్సంసారిస్వరూపవివక్షాం మన్యతే స ప్రాచీమపి దిశం ప్రస్థాపితః ప్రతీచీమపి దిశం ప్రతిష్ఠేత, యతో న బుద్ధాన్తాద్యవస్థోపన్యాసేనావస్థావత్త్వం సంసారిత్వం వా వివక్షితమ్. కిం తర్హి? అవస్థారహితత్వమసంసారిత్వం చ వివక్షతి. కథమేతదవగమ్యతే? యత "అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి" ఇతి పదే పదే పృచ్ఛతి, యచ్చ "అనన్వాగతస్తేన భవత్యసఙ్గోఽహ్యయం పురుషః" (బృ.ఉ. 4.3.14,15) ఇతి పదే పదే ప్రతివక్తి. "అనన్వాగతం పుణ్యేన అనన్వాగతం పాపేన, తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి" (బృ.ఉ. 4.3.22) ఇతి చ. తస్మాదసంసారిస్వరూపప్రతిపాదనపరమేవైతద్వాక్యమిత్యవగన్తవ్యమ్. 42

బాలానందిని

యస్త్వితి : మధ్యలో బుద్ధాంతాద్యవస్థలను గూర్చి చెప్పడంచేత ఇక్కడ సంసారిస్వరూపవివక్ష ఉన్నది అని ఎవడు అనుకుంటాడో అతడు తూర్పు వైపు వెళ్ళు అని చెప్పి పంపగా పడమటి వైపుకు ప్రయాణం అవుతాడు! ఎందువల్ల ననగా బుద్ధాంతాద్య వస్థలను గూర్చి చెప్పడం ద్వారా అవస్థావత్త్వం (జీవునికి అవస్థలు ఉన్నాయని) గాని, సంసారిత్వం గాని వివక్షితం కాదు, మరే మనగా - అవస్థారహితత్వాన్ని, అసంసారిత్వాన్ని చెప్పదలచుకొన్నాడు. ఇది ఎలా తెలుస్తున్నది? ఎందువల్ల ననగా "**అత** .. బ్రూహి" (ఇటుపైన మోక్షం విషయమే చెప్పు) అని అడుగడుగునా అడుగుతాడు, అట్లే "అనన్వాగతః... పురుషః" (ఆ అవస్థాధర్మంచేత స్పృశింపబడడు, ఈ పురుషుడు అసంగుడు) అని అడుగడుగునా సమాధానం చెపుతాడు. "అనన్వాగతం.. భవతి" (సుషుప్త్యవస్థలో పుణ్యంచేత స్పృశింపబడక పాపంచేత స్పృశింపబడక హృదయం యొక్క సమస్తశోకాలను దాటినవా డవుతాడు) అని కూడ చెప్పాడు. అందువల్ల ఈ వాక్యం అసంసారిస్వరూపాన్ని ప్రతిపాదించడానికే ఉద్దిష్టమైన దని గ్రహించాలి. 42

## సూ. పత్యాదిశబ్దేభ్యః. 1.3.43

ఇతశ్చానంసారిస్వరూపప్రతిపాదనపరమేవైతద్వాక్యమిత్యవగన్తవ్యమ్; యదస్మిన్వాక్యే పత్యాదయః శబ్దాః అసంసారిస్వరూపప్రతిపాదనపరాః సంసారిస్వభావప్రతిషేధనాశ్చ భవన్తి "సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః" ఇత్యేవంజాతీయకా అసంసారిస్వభావప్రతిపాదనపరాః, "స న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కనీయాన్" ఇత్యేవంజాతీయకాః సంసారిస్వభావప్రతిషేధనాః. తస్మాదసంసారీ పరమేశ్వర ఇహోక్త ఇత్యవగమ్యతే. 43

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీ గోవిన్ద
భగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ
శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే ప్రథమాధ్యాయస్య తృతీయః పాదః.

బాలానందిని

పత్యాదీతి :- "పత్యాదిశబ్దేభ్యః = పతిమొదలైన శబ్దాలవల్ల కూడ అసంసారి స్వరూపమే వివక్షితము" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ ఈ వాక్యం అసంసారిస్వరూపాన్ని ప్రతిపాదించడం కోసమే ఉద్దిష్టమైన దని తెలుస్తూన్నది. ఎందువల్ల ననగా - ఈ వాక్యంలో ఉన్న 'పతి' మొదలైన శబ్దాలు అసంసారిస్వరూపపరాలుగా ఉన్నాయి, సంసారిస్వరూపనిషేధకాలుగా కూడ ఉన్నాయి. "సర్వస్య... అధిపతిః" (అందరి విషయంలో స్వతంత్రుడు, అందరి విషయంలో అధికారం గలవాడు, అందరికీ అధిపతి) ఇత్యాతిపదాలు అసంసారి స్వభావాన్ని ప్రతిపాదిస్తున్నాయి. "స న... కనీయాన్" (అతడు మంచి కర్మచేత గొప్పవాడు కాడు, అసాధుకర్మచేత తక్కువవాడు కాడు) ఈ మొదలైన పదాలు సంసారిస్వభావాన్ని నిషేధిస్తున్నాయి. అందువల్ల ఇక్కడ అసంసారియైన పరమేశ్వరుడే చెప్పబడ్డాడని తెలుస్తున్నది. 43.

సుషుప్త్యుత్క్రాంత్యధికరణం సమాప్తం

బాలానందిని అను శ్రీ మచ్ఛాంకరశారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో
ప్రథమాధ్యాయంలో తృతీయపాదం సమాప్తం

## ప్రథమాధ్యాయే చతుర్థః పాదః

(అత్ర ప్రధానవిషయత్వేన సందిహ్యమానానామవ్యక్తాజాదిపదానాం చిన్తనమ్)

### 1. ఆనుమానికాధికరణమ్. సూ.1-7

### సూ. ఆనుమానికమప్యేకేషామితి చేన్న శరీరరూపక విన్యస్తగృహీతేర్దర్శయతి చ.1.4.1

బ్రహ్మజిజ్ఞాసాం ప్రతిజ్ఞాయ బ్రహ్మణోలక్షణముక్తమ్ - "జన్మాద్యస్య యతః" (బ్ర.సూ. 1.1.2) ఇతి. తల్లక్షణం ప్రధానస్యాపి సమాన మిత్యాశఙ్క్య తదశబ్దత్వేన నిరాకృతమ్ - "ఈక్షతేర్నాశబ్దమ్" (బ్ర.సూ. 1.1.5) ఇతి. గతిసామాన్యం చ వేదాన్తవాక్యానాం బ్రహ్మకారణవాదం ప్రతి విద్యతే న ప్రధానకారణవాదం ప్రతీతి ప్రపఞ్చితం గతేన గ్రన్థేన. ఇదం త్విదానీమవశిష్ట మాశఙ్క్యతే - యదుక్తం ప్రధానస్యాశబ్దత్వం తదసిద్ధమ్, కాసు చిచ్ఛాఖాసు ప్రధానసమర్పణాభాసానాం శబ్దానాం శ్రూయమాణత్వాత్. అతః ప్రధానస్య కారణత్వం వేదసిద్ధమేవ మహద్భిః పరమర్షిభిః కపిలప్రభృతిభిః పరిగృహీతమితి ప్రసజ్యతే. తద్యావత్తేషాం శబ్దానామన్యపరత్వం న ప్రతిపాద్యతే తావతసర్వజ్ఞం

బ్రహ్మ జగతః కారణమితి ప్రతిపాదితమప్యాకులీభవేత్. అతస్తేషామన్య పరత్వం దర్శయితుం పరః సందర్భః ప్రవర్తతే.

ఆనుమానికమప్యనుమాననిరూపతమపి ప్రధానమేకేషాం శాఖినాం శబ్దవదుపలభ్యతే. కాఠకే హి పఠ్యతే - "మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః" (క.ఉ.1.3.11) ఇతి. తత్ర య ఏవ యన్నామానో యత్క్రమాశ్చ మహదవ్యక్తపురుషాః స్మృతిసిద్ధాస్త ఏవ ఇహ ప్రత్యభిజ్ఞాయన్తే. తత్ర అవ్యక్తమితి స్మృతిప్రసిద్ధేః శబ్దాదిహీనత్వాచ్చ న వ్యక్తమవ్యక్తమితి వ్యుత్పత్తి సంభవాత్ స్మృతిప్రసిద్ధం ప్రధానమభిధీయతే. అతః తస్య శబ్దవత్త్వాద శబ్దత్వమనుపపన్నమ్. తదేవ చ జగతః కారణం శ్రుతిస్మృతిప్రసిద్ధిభ్య ఇతి చేత్-

బాలానందిని

ఆనుమానికమితి :- "ఏకేషామ్ = కొన్ని శాఖలవాళ్లకి, ఆనుమానికమపి = ప్రధానం కూడ శబ్దవత్తే, ఇతి చేత్ = అన్నట్లయితే, న = కాదు. శరీరరూపకవిన్యస్త గృహీతేః = "మహతః పరమవ్యక్తమ్" ఇత్యాదివాక్యంలో రూపకంలో చేర్చబడిన శరీరం యొక్క గ్రహణంవల్ల; దర్శయతి చ = వెనుకటి గ్రంథం ఈ విషయాన్ని చూపుతున్నది కూడ" అని సూత్రార్థం.

బ్రహ్మేతి :- బ్రహ్మజిజ్ఞాసను "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే సూత్రంచేత ప్రతిజ్ఞ చేసి (చెప్పి), "జన్మాద్యస్య యతః" అని బ్రహ్మయొక్క లక్షణం చెప్పబడింది. ఆ లక్షణం ప్రధానానికి కూడ సమానమే అని ఆశంకించి అది "ఈక్షతేర్నాశబ్దమ్" అనే సూత్రంచేత అశబ్దం అని నిరాకరించ బడింది. వేదాంతాలకు బ్రహ్మకారణవాదం విషయంలో గతిసామాన్యం ఉంది గాని ప్రధానకారణవాదం విషయంలో లేదు అని ఇంతవరకు గడచిన గ్రంథంచేత నిరూపించబడింది. ఇప్పుడింకా మిగిలిన ఒక ఆశంక చేయబడుచున్నది - ప్రధానం అశబ్దం అని చెప్పినది అసిద్ధం; ఎందువల్ల ననగా కొన్ని శాఖలలో ప్రధానాన్ని ప్రతిపాదించేవిగా పైకి కనబడే శబ్దాలు వినబడుతున్నాయి. అందుచేత వేదసిద్ధమే అయిన ప్రధానానికి ఉన్న కారణత్వాన్ని గొప్పవారైన కపిలాది పరమర్షులు గ్రహించారని చెప్పవలసి వస్తుంది. అందువల్ల ఆ శబ్దాలు అన్యపరములే (కాని ప్రధానాధిపరములు కావు) అని ప్రతిపాదించనంత వరకు సర్వజ్ఞమైన బ్రహ్మ జగత్తుకు కారణం అని ప్రతిపాదించబడినది కూడ వ్యాకుల మవుతుంది. అందుచేత

ఆ శబ్దాలు అన్యపరా లని చూపడం కోసం ఈ తరువాతి గ్రంథం ప్రారంభించ బడుచున్నది. అనుమానిక మపి = అనుమాన ప్రమాణంచేత నిరూపితమైన ప్రధానం కూడ, కొన్ని శాఖలవాళ్ల ప్రకారం శబ్దం కలదిగా (శ్రుతిప్రతిపాదితంగా) కనబడుతున్నది. కాఠకంలో "మహతః.. పరః" (మహత్తుకంటె అవ్యక్తం పరమైనది, అవ్యక్తంకంటె పురుషుడు పరుడు) అని పఠింప బడుచున్నది. మహదవ్యక్తపురుషులు ఏ పేర్లతో, ఏ క్రమంలో సాంఖ్యస్మృతులలో ప్రసిద్ధంగా ఉన్నాయో అవే ఆ శ్రుతివాక్యంలో గుర్తింపబడుతున్నాయి. వాటిలో 'అవ్యక్తం' అని స్మృతి ప్రసిద్ధి ప్రకారం శబ్దాదులు లేనిదవడంచేత, "న వ్యక్తమ్ అవ్యక్తమ్" (వ్యక్తం కానిది) అని వ్యుత్పత్తి కుదురుతుంది గాన స్మృతి ప్రసిద్ధమైన ప్రధానమే చెప్పబడుతున్నది. అందువల్ల అది శబ్దవత్తుగాన అది అశబ్దం అనడం అసిద్ధం. శ్రుతి - స్మృతి - న్యాయ ప్రసిద్ధులననుసరించి ఆ ప్రధానమే జగత్కారణం అని అన్నట్లయితే -

వి. ఈ పాదంలోని మొదటి మూడు అధికరణాలకీ ఈక్షత్యధికరణంతో ఆక్షేపసంగతి. ఈక్షత్యధికరణంలో ప్రధానం అశబ్దం అని చెప్పడం అసంగతం అని ఆక్షేపించబడుతున్నది. ఈ పాదంలో కొన్ని పదాలు తీసికొని అవి బ్రహ్మ ప్రతిపాదకాలా లేక ప్రధానప్రతిపాదకాలా అని విచారణ చేయబడుచున్నది. ఈ అధికరణంలో 'అవ్యక్త' పదం విషయం. దానికి అర్థం ప్రధానమా లేక శరీరమా అని సంశయం. ప్రధానం అని పూర్వపక్షం, శరీరం అని సిద్ధాంతం.

బ్రహ్మవిద్యాభరణకారులు చెప్పినట్లు మొత్తం ఈ అధ్యాయానికి మొదటి మూడు అధ్యాయాలతోను ఆక్షేపసంగతి. ప్రధానం అశబ్దం అని చెప్పినదానిని ఆక్షేపించి మొదటి మూడు అధికరణాలలోను సమాధానం చెప్పబడింది. వేదాంతాలు విరుద్ధార్థాలను ప్రతిపాదిస్తున్నాయి, అందుచేత గతిసామాన్యం లేదు అని ఆక్షేపించి నాల్గవ అధికరణంలో సమాధానం చెప్పబడింది. తరువాతి రెండు అధికరణాలలో బ్రహ్మ లక్షణానికి జీవునియందు అతివ్యాప్తిని ఆశంకించి సమాధానం చెప్పబడింది. చివరిదైన ప్రకృత్యధికరణంలో జగత్తుకు నిమిత్తకారణం బ్రహ్మయే అయినా ఉపాదానం మాత్రం ప్రధానమే అని ప్రధానం అశబ్దం అనేదానిని మళ్లీ ఆక్షేపించగా సమాధానం చెప్పబడింది. ఈ విధంగా ఈ పాదానికి పూర్వగ్రంథంతో (త్రిపాదితో) ఆక్షేపసంగతి గాన ఈ పాదంలోని అధికరణ నికీ అధికరణానికీ మధ్య సంగతి చూడవలసిన పని లేదు.

## భాష్యమ్

నైతదేవమ్ - న హ్యేతత్కారకం వాక్యం స్మృతిప్రసిద్ధయోర్మహదవ్యక్తయోః అస్తిత్వపరమ్. న హ్యత్ర యాదృశం స్మృతిప్రసిద్ధం స్వతన్త్రం కారణం త్రిగుణం ప్రధానం తాదృశం ప్రత్యభిజ్ఞాయతే. శబ్దమాత్రం హ్యత్ర అవ్యక్తమితి ప్రత్యభిజ్ఞాయతే. స చ శబ్దో న వ్యక్తమవ్యక్తమితి యౌగికత్వాదన్యస్మిన్నపి సూక్ష్మే సుదుర్లక్షే చ ప్రయుజ్యతే. న చాయం కస్మింశ్చిద్రూఢః. యా తు ప్రధానవాదినాం రూఢిః సా తేషామేవ పారిభాషికీ సతీ న వేదార్థనిరూపణే కారణభావం ప్రతిపద్యతే. న చ క్రమమాత్రసామాన్యాత్సమానార్థప్రతిపత్తిర్భవత్యసతి తద్రూపప్రత్యభిజ్ఞానే. న హ్యశ్వస్థానే గాం పశ్యన్నశ్వోఽయ మిత్యమూఢోఽ ధ్యవస్యతి. ప్రకరణ నిరూపణాయాం చాత్ర న పరిపరికల్పితం ప్రధానం ప్రతీయతే, శరీరరూపకవిన్యస్తగృహీతేః. శరీరం హ్యత్ర రథరూపకవిన్యస్తమవ్యక్తశబ్దేన పరిగృహ్యతే. కుతః? ప్రకరణాత్, పరిశేషాచ్చ. తథా హ్యనన్తరాతీతో గ్రన్థః ఆత్మశరీరాదీనాం రథిరథాదిరూపకక్లృప్తిం దర్శయతి.

## బాలానందిని

నేతి :- ఇది ఇట్లు కాదు. ఈ కారకవాక్యం సాంఖ్యస్మృతిలో ప్రసిద్ధమైన మహదవ్యక్తాలు ఉన్నాయని చెప్పడానికి ఉద్దిష్టమైనది కాదు. మూడు గుణాలు గల ఏ విధమైన ప్రధానం స్వతంత్రమైన కారణంగా సాంఖ్యస్మృతులలో ప్రసిద్ధమో అలాంటి దాని ప్రత్యభిజ్ఞ ఇక్కడ ఏమీ లేదు. కేవలం అవ్యక్తం అనే శబ్దం మాత్రమే ప్రత్యభిజ్ఞా గోచరం అవుతున్నది (గుర్తించ బడుతున్నది). "న వ్యక్తమ్ అవ్యక్తమ్" (ఏది వ్యక్తం కాదో అది అవ్యక్తం) అని విగ్రహవాక్యం గల ఆ శబ్దం యౌగికశబ్దమే గాన సూక్ష్మమూ చూడ శక్యం కానిది అయిన మరొక వస్తువు విషయంలో కూడ ప్రయోగించబడవచ్చును. ఈ శబ్దం దేనియందూ రూఢం కాదు. ప్రధానవాదులైన సాంఖ్యుల ఏ రూఢి ఉన్నదో అది వాళ్లకే పారిభాషికమై వేదార్థాన్ని చెప్పడానికి కారణం (ఆధారం) కాజాలదు.

వి. శబ్దాలను శాస్త్రకారులు మూడు విధాలుగా విభజించారు. రూఢం, యౌగికం, యోగరూఢం. కొన్ని శబ్దాలకు ఆ అర్థం ఎలా వచ్చిందో చెప్పడం కష్టం. తరుః (చెట్టు) వనమ్ (వనము) ఇత్యాదిపదాలు రూఢపదాలు. ఏదో శ్రమపడి వీటికి కూడా వ్యుత్పత్తి చెప్పితే చెప్పవచ్చునేమో కాని అది ప్రసిద్ధంగా ఉండదు. ఇలాంటి పదాలు రూఢిచేత

(స్థిరమైన అలవాటుచేత) ఈ అర్థాలను బోధిస్తాయి. కొన్ని శబ్దాలకు ఆ అర్థం ఏ విధంగా వచ్చిందో చెప్పవచ్చు. దాశరథిః (దశరథుని కుమారుడు), వాసుదేవః (వసుదేవుని కుమారుడు) ఇత్యాదిపదాలు యౌగికాలు. వీటిలోని అవయవాలకి అర్థం ఉంటుంది. 'పఙ్కజమ్' (పద్మం) 'సరోజమ్' (పద్మం) మొదలైనవి యోగరూఢపదాలు. పంకంనుంచి పుట్టినది, సరస్సులో పుట్టినది అని వీటికి యౌగికార్థాలు ఉన్నా కూడ వీటిని నాచు, నత్తగుల్ల మొదలైన అర్థాలలో కాక పద్మం అనే అర్థంలోనే సాధారణంగా ప్రయోగిస్తారు. అప్పుడప్పుడు మరొక అర్థంలో ప్రయోగించడం లేకపోలేదు. ఈ విభాగం సాధారణంగా చేసినది. అపవాదలు ఉండవచ్చు. పరిభాష అనగా ఒక్కొక్క శాస్త్రంలో కొన్ని పదాలకు వాళ్లు పెట్టుకొన్న కొన్ని ప్రత్యేకమైన సంకేతాలు. 'అవ్యక్త' శబ్దానికి సాంఖ్యులు ప్రధానం అని అర్థం నిర్ణయించుకున్నారు. అది వాళ్ల శాస్త్రం వరకే సీమితం. ఆ అర్థాన్ని వేదార్థ నిర్ణయం చేసేటప్పుడు గ్రహించవలసిన పని లేదు అని భావం.

న చేతి:- ఇది అదే అని గుర్తించనంత వరకు క్రమం సమానంగా ఉన్నంత మాత్రంచేత అదే అర్థం గ్రహించడం జరగదు. గోవు ఉండే చోట అశ్వం ఉండడం చూచి ఇది గోవే అని మూఢుడు కానివా డెవడూ నిర్ణయించడు కదా? ఇక్కడ ప్రకరణాన్ని పరిశీలించి నప్పుడు పరులచేత కల్పించబడిన ప్రధానం తెలియడం లేదు. ఎందువల్ల ననగా శరీరరూపకవిన్యస్తగృహీతివల్ల. ఇక్కడ రథరూపకంలో ఉంచబడిన శరీరం అవ్యక్తశబ్దంచేత గ్రహించబడుతుంది. ఎందువల్ల? ప్రకరణం వల్లా, పరిశేష న్యాయం వల్లా. దీని వెనుకనే ఉన్న గ్రంథం ఆత్మశరీరాదులకు రథిత్వ - రథత్వాదులను కల్పించినట్లు చూపుతున్నది.

## భాష్యమ్

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు, P 232.
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ.
ఇన్ద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్,
ఆత్మేన్ద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (క.ఉ.1.3.3,4)

ఇతి. తైశ్చేన్ద్రియాధిభిరసంయతైః సంసారమధిగచ్ఛతి. సంయతైస్త్వధ్వనః పారం తద్విష్ణోః పరమం పదమాప్నోతీతి దర్శయిత్వా, కిం తదధ్వనః పారం విష్ణోః పరమం పదమిత్యస్యామాకాఙ్క్షాయాం, తేభ్య ఏవ ప్రకృతేభ్యః ఇన్ద్రియాదిభ్యః పరత్వేన పరమాత్మానమధ్వనః పారం విష్ణోః పరమం పదం దర్శయతి -

"ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః,
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్ పురుషః పరః,
పురుషాన్నపరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" (క.ఉ.1.3.10,11)

ఇతి. తత్ర య ఏవేన్ద్రియాదయః పూర్వస్యాం రథరూపకకల్పనాయామశ్వాది భావేన ప్రకృతాస్త ఏవేహ పరిగృహ్యన్తే ప్రకృతహానాప్రకృతప్రక్రియా పరిహారాయ. తత్రేన్ద్రియ మనోబుద్ధయస్తావత్పూర్వత్రేహ చ సమానశబ్దా ఏవ. అర్థాస్తు యే శబ్దాదయో విషయాః ఇన్ద్రియగోచరత్వేన నిర్దిష్టాః తేషాం చేన్ద్రియేభ్యః పరత్వమ్. "ఇన్ద్రియాణాం గ్రహత్వమ్, విషయాణామతిగ్రహత్వమ్" (బృ.ఉ. 3.2) ఇతి శ్రుతిప్రసిద్ధేః. విషయేభ్యశ్చ మనసః పరత్వం, మనో మూలత్వాద్విషయేన్ద్రియవ్యవహారస్య. మనసస్తు పరా బుద్ధిః. బుద్ధిం హ్యారుహ్య భోగ్యజాతం భోక్తారముపసర్పతి. బుద్ధేరాత్మా మహాన్ పరః యః స "ఆత్మానం రథినం విద్ధి" ఇతి రథిత్వేనోపక్షిప్తః. కుతః? ఆత్మశబ్దాత్. భోక్తుశ్చ భోగోపకరణాత్పరత్వోపపత్తేః మహత్త్వం చాస్య స్వామిత్వాదుపపన్నమ్.

బాలానందిని

ఆత్మానమితి :- "ఆత్మానం... మనీషిణః" అని రథిరథాదిరూపకక్లప్తి చూపబడింది. "ఆత్మ రథికు డని తెలుసుకో. శరీరం రథం, బుద్ధి సారథి, మనస్సు కళ్లెం అని తెలుసుకో. ఇంద్రియాలు గుఱ్ఱాలనీ, విషయాలను ఆ గుఱ్ఱాలకు గోచరమైన వనీ (వాటిచే పొంద దగినవనీ) చెపుతున్నారు. శరీర - ఇంద్రియ మనస్సులతో కూడిన ఆత్మయే భోక్త అని బుద్ధిమంతులు చెప్పుచున్నారు" అని వీటి అర్థం. ఆ ఇంద్రియాదులను తన వశంలో ఉంచుకొనకపోతే సంసారానికి వెడతాడు. వాటిని నిగ్రహించుకొన్నవాడు మార్గంయొక్క అంతాన్ని, విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని పొందుతాడు అని చూపించి మార్గానికి అవతల ఉన్న విష్ణువు యొక్క ఆ పరమపదం ఏది అనే ఆకాంక్ష కలిగినప్పుడు ప్రకృతమైన ఆ ఇంద్రియాలకంటె పరమైనది అని పరమాత్మనే, అదే మార్గం చివర ఉన్న విష్ణువు యొక్క పరమపదంగా "ఇన్ద్రియేభ్యః... గతిః" అని చూపుతున్నాడు. "ఇంద్రియాల కంటె విషయాలు పరమైనవి (గొప్పవి), విషయాలకంటె మనస్సు పరమైనది, మనస్సు కంటె బుద్ధి పరమైనది. బుద్ధికంటె గొప్పదైన ఆ ఆత్మ పరమైనది. మహత్తుకంటె అవ్యక్తం పరమైనది. అవ్యక్తంకంటె పురుషుడు పరుడు.

పురుషునికంటె పరమైనది ఏదీ లేదు. అదే పరకాష్ఠ. అదే పరగతి'' అని వాటి అర్థం. వెనుక చేసిన రథరూపకకల్పనలో ఏ ఇంద్రియాదులు అశ్వాదిరూపంలో వర్ణించబడి ప్రకృతాలుగా ఉన్నాయో అవే ఇక్కడ గ్రహింప బడుతున్నాయి. అలా గ్రహించకపోతే ప్రకృతహానాప్రకృతప్రక్రియ అనే దోషం వస్తుంది. వాటిలో (పైన చెప్పిన ఆరింటిలో) ఇంద్రియమనోబుద్ధులు ఇక్కడా అక్కడా కూడ ఆ శబ్దాల చేతనే పేర్కొనబడ్డాయి. ఇంద్రియాలనే గుఱ్ఱాలకు గోచరాలని మొదట చెప్పిన విషయాలే శబ్దాద్యర్థాలు. (విషయాలను ఇక్కడ అర్థాలు అని చెప్పడం జరిగింది). అవి ఇంద్రియాలకంటె పరములు. "ఇన్ద్రియాణాం... అతిగ్రహత్వమ్" (ఇంద్రియాలు గ్రహాలు అనగా గ్రహించేవి. విషయాలు గ్రహాలకంటె గొప్పవి, విషయాలు లేకపోతే ఇంద్రియాలకు పనే లేదు కదా) అని శ్రుతిలో ప్రసిద్ధి ఉన్నది. విషయేంద్రియాల వ్యవహారం అంతా మనస్సుమీద ఆధారపడి ఉంటుంది. అందుచేత మనస్సు విషయాలకంటె పరం. భోగ్యవస్తువుల సముదాయం బుద్ధిని అధిరోహించి భోక్తను చేరుతుంది గాన బుద్ధి మనస్సుకంటె పరమైనది. "ఆత్మానం రథినం విద్ధి" అని రథిగా ఏ ఆత్మ చెప్పబడిందో గొప్పదైన ఆ ఆత్మ బుద్ధికంటె పరమైనది. ఎందువల్ల? ఆత్మశబ్దం ఉండడంవల్ల. భోక్త భోగసాధనాల కంటె పరుడు అనడం యుక్తమే కదా? ఇతడు స్వామి కాబట్టి మహాన్ అని చెప్పడం కూడా ఉపపన్నమే.

## భాష్యమ్

అథవా -

> "మనో మహాన్ మతిర్బ్రహ్మా పూర్బుద్ధిః ఖ్యాతిరీశ్వరః,
> ప్రజ్ఞా సంవిచ్చితిశ్చైవ స్మృతిశ్చ పరిపఠ్యతే" ఇతి స్మృతేః,
> "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (శ్వే ఉ.6.18)

ఇతి చ శ్రుతేర్యా ప్రథమజస్య హిరణ్యగర్భస్య బుద్ధిః సా సర్వాసాం బుద్ధీనాం పరమా ప్రతిష్ఠా, సేహ మహానాత్మేత్యుచ్యతే. సా చ పూర్వత్ర బుద్ధిగ్రహణేనైవ గృహీతా సతీ హిరుగిహోపదిశ్యతే. తస్యా అప్యస్మదీయాభ్యో బుద్ధిభ్యః పరత్వోపపత్తేః. ఏతస్మింస్తు పక్షే పరమాత్మవిషయేణైవ పరేణ పురుష గ్రహణేన రథిన ఆత్మనో గ్రహణం ద్రష్టవ్యమ్. పరమార్థతః పరమాత్మ విజ్ఞానాత్మనోర్భేదాభావాత్. తదేవం శరీరమేవైకం పరిశిష్యతే తేషు. ఇతరాణీన్ద్రియాదీని ప్రకృతాన్యేవ పరమపదదిదర్శయిషయా సమనుక్రామన్ పరిశిష్యమాణేనేహ అన్త్యేనావ్యక్తశబ్దేన

పరిశిష్యమాణం ప్రకృతం శరీరం దర్శయతీతి గమ్యతే. శరీరేన్ద్రియ మనో బుద్ధివిషయవేదనాసంయుక్తస్య హ్యవిద్యావతో భోక్తుః శరీరాదీనాం రథాదిరూకకల్పనయా సంసారమోక్షగతి నిరూపణేన ప్రత్యగాత్మబ్రహ్మావగతిరిహ వివక్షితా. తథా చ -

"ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే,

దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" (క.ఉ.1.3.12)

ఇతి వైష్ణవస్య పరమపదస్య దురవగమత్వముక్త్వా తదవగమార్థం దర్శయతి

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని,

జ్ఞానమాత్మని నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని" (క.ఉ. 2.3.13)

ఇతి. ఏతదుక్తం భవతి - వాచం మనసి సంయచ్ఛేత్, వాగాదిబాహ్యేన్ద్రి యవ్యాపారముత్సృజ్య మనోమాత్రేణావతిష్ఠేత. మనోఽపి విషయవికల్పాభి ముఖం వికల్పదోషదర్శనేన జ్ఞానశబ్దోదితాయాం బుద్ధావధ్యవ సాయస్వభావాయాం ధారయేత్. తామపి బుద్ధిం మహత్యాత్మని భోక్తరి, అగ్ర్యాయాం వా బుద్ధౌ సూక్ష్మతాపాదనేన నియచ్ఛేత్, మహాన్తం త్వాత్మానం శాన్త ఆత్మని ప్రకరణవతి పరస్మిన్ పురుషే పరస్యాం కాష్ఠాయాం ప్రతిష్ఠాప యేదితి. తదేవం పూర్వాపరపర్యాలోచనాయాం నాస్త్యత్ర పరపరికల్పితస్య ప్రధానస్యావకాశః

## బాలానందిని

అవ. "బుద్ధేరాత్మా మహాన్ పరః" అన్నచోట ఆత్మశబ్దానికి జీవాత్మ అని అర్థం చెప్పబడింది. ఇప్పుడు దీనికి (మహాన్ ఆత్మా అనేదానికి) హిరణ్యగర్భుని బుద్ధి (హిరణ్య గర్భుడనే సమష్టిబుద్ధి) అని అర్థం కూడ చెప్పవచ్చునని చెపుతున్నారు - అథవా ఇతి :- "మనో... పరిపఠ్యతే" అని స్మృతి వల్ల. "యో...తస్మై" అనే శ్రుతి వల్ల ప్రథమజుడైన, (మొట్టమొదట సృజించబడిన హిరణ్యగర్భుని బుద్ధి సమస్తబుద్ధులకు పరమప్రతిష్ఠ. ఆ బుద్ధియే ఇక్కడ 'మహాన్' అని చెప్పబడుచున్నది. ఆ బుద్ధి పూర్వం చెప్పిన బుద్ధి శబ్దంచేతనే గ్రహింపబడినా కూడ ఇక్కడ వేరుగా చెప్పబడుచున్నది. అది కూడ మన బుద్ధులకంటె పరమైనది అని చెప్పడం యుక్తమే కదా?

వి. మనః =మననశక్తి. మహాన్ = సర్వవ్యాప్తము. మతిః = రాబోయే దానిని గూర్చిన నిశ్చయం, బ్రహ్మ = ఆత్మ, పూః = భోగ్యవర్గానికి ఆశ్రయం. బుద్ధిః =

తాత్కాలికమైన నిశ్చయం, ఖ్యాతిః = కీర్తిశక్తి, ఈశ్వరః = నియమించే శక్తి, ప్రజ్ఞా = మూడు కాలాలకు సంబంధించిన నిశ్చయం. సంవిత్ = అభివ్యంజింపచేసే చిత్. చితిః = అధ్యసించబడిన చిత్. స్మృతిః = గడచిన అన్ని విషయాలను గ్రహించేది అని సమష్టిబుద్ధి చెప్పబడుతున్నది అని పై స్మృతి వాక్యాని కర్థం.

అవ. ఇక్కడ 'మహాన్ ఆత్మా' అనే దానికి సమష్టిబుద్ధి అని అర్థం చెప్పిన పక్షంలో "ఆత్మానం రథినం విద్ధి" అని చెప్పిన ఆత్మకు ఇక్కడ నిర్దేశం లేకుండా పోతుంది.అ ందుకు సమాధానం చెపుతున్నారు - ఏతస్మిన్నితి :- ఈ పక్షంలో తరవాత వచ్చే పరమాత్మకు సంబంధించిన పురుషనిర్దేశంచేత (అనగా పరమాత్మను నిర్దేశించే పురుష శబ్దం చేతనే) రథి అయిన ఆత్మ కూడ గ్రహించినట్లు చూచుకోవాలి. వాస్తవంలో పరమాత్మ - విజ్ఞానాత్మలకు భేదం లేదు కదా.

వి. అథవా అని చెప్పిన ఈ పక్షం క్లిష్టకల్పనగా ఉంది. అందుచేత "మహాన్ ఆత్మా" అనేది భోక్తయైన జీవుణ్ణి నిర్దేశిస్తూన్న దన్న మొదటి వ్యాఖ్యానమే యుక్తంగా ఉన్నదని బ్రహ్మవిద్యాభరణకారుల అభిప్రాయం.

తదేవమితి :- ఈ విధంగా వాటిలో ఇంక శరీరం ఒక్కటే మిగిలింది. పరమపదాన్ని చూపాలనే ఇచ్ఛచేత ప్రకృతములే అయిన "ఆత్మానం రథినం విద్ధి" ఇత్యాదివాక్యంలో ప్రకృతాలైన) ఇంద్రియాదులైన అన్నింటినీ ప్రారంభించి చెప్పి ఇక్కడ మిగిలిన చివరిదైన అవ్యక్తశబ్దంచేత, ప్రారంభంలో చెప్పబడిన మిగిలిన శరీరాన్ని నిర్దేశిస్తున్నాడు అని తెలుస్తున్నది. శరీరాదులయందు రథాదిరూపకల్పన చేసి (రథత్వాద్యారోపం చేసి), శరీర - ఇంద్రియమనో - బుద్ధి విషయ - వేదన (భోగము)లతో కూడిన, అవిద్యావంతుడైన భోక్తయైన జీవుడు సంసారగతి మోక్షగతీ పొందుతుంటాడు అని నిరూపించడం ద్వారా ప్రత్యగాత్మబ్రహ్మజ్ఞానం (ప్రత్యగాత్మయే బ్రహ్మ అనే జ్ఞానం) ఇక్కడ వివక్షితమైనది. అట్లే - "ఏష... సూక్ష్మ దర్శిభిః" (అన్ని భూతాలలోను గూఢంగా ఉన్న ఆత్మ పైకి కనబడదు. సూక్ష్మదృష్టి కలవారిచేత ఏకాగ్రమైన సూక్ష్మబుద్ధిచేత చూడబడుతుంది) అని వైష్ణవమైన ఆ పరమపదం తెలియశక్యం కానిది అని చెప్పి, దానిని తెలుసుకొనడానికై - "యచ్ఛేత్.. ఆత్మని" అని యోగమార్గాన్ని చూపుతున్నాడు. ఇది చెప్పినట్లయింది - వాక్కును మనస్సులో నిగ్రహించాలి, అనగా బాహ్యమైన వాగాదివ్యవహారం విడిచి మనోమాత్రంతో ఉండాలి; విషయాలను గూర్చి ఆలోచనకు అభిముఖంగా ఉండే మనస్సును కూడ ఆ విషయవికల్పాలలో ఉన్న దోషాలను చూడడం ద్వారా జ్ఞానశబ్దంచేత చెప్పబడిన, నిశ్చయస్వరూపమైన బుద్ధిలో నిలపాలి. ఆ బుద్ధిని కూడ సూక్ష్మంగా చేసి గొప్పదైన ఆత్మయందు అనగా భోక్తయందు, లేదా

మొట్టమొదటి బుద్ధియందు (అనగా సమష్టిబుద్ధియందు) నిలపాలి. ఆ మహాత్మనైతే ఈ ప్రకరణంలో చెప్పిన, పరమ పురుషుడైన పరకాష్ఠయైన శాన్తమైన ఆత్మయందు నిలపాలి. ఈ విధంగా పూర్వాపరపర్యాలోచన చేయగా ఇక్కడ పరులు కల్పించిన ప్రధానానికి అవకాశం లేదు.

## సూ. సూక్ష్మం తు తదర్హ త్వాత్ 1.4.2

ఉక్తమేతత్ప్రకరణపరిశేషాభ్యాం శరీరమవ్యక్తశబ్దం న ప్రధానమితి. ఇదమిదానీమాశఙ్క్యతే - కథమవ్యక్తశబ్దార్హత్వం శరీరస్య? యావతా స్థూలత్వాత్స్పష్టతరమిదం శరీరం వ్యక్తశబ్దార్హమ్. అస్పష్టవచనస్త్వవ్యక్తశబ్దః ఇతి; అత ఉత్తరముచ్యతే - సూక్ష్మం త్విహ కారణాత్మనా శరీరం వివక్ష్యతే, సూక్ష్మస్యావ్యక్తశబ్దార్హత్వాత్. యద్యపి స్థూలమిదం శరీరం న స్వయమవ్యక్త శబ్దమర్హతి తథాపి తస్య త్వారమ్భకం భూతసూక్ష్మమవ్యక్త శబ్దమర్హతి. ప్రకృతిశబ్దశ్చ వికారే దృష్టః, యథా - "గోభిః శ్రీణీత మత్సరమ్" (ఋ. స. 9.46.4) ఇతి. శ్రుతిశ్చ "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్" (బృ.ఉ.1.4.7) ఇతి ఇదమేవ చ వ్యాకృతనామరూపవిభిన్నం జగత్ప్రాగవస్థాయాం పరిత్యక్తవ్యాకృతనామరూపం బీజశక్త్యవస్థమవ్యక్తశబ్దయోగ్యం దర్శయతి.

### బాలానందిని

సూక్ష్మమితి :- "తదర్హత్వాత్ = అవ్యక్తశబ్దానికి తగి ఉండడంచేత, సూక్ష్మం తు = సూక్ష్మశరీరమే ఇక్కడ గ్రహించబడుతుంది" అని సూత్రార్థం.

**ఉక్తమితి** :- ప్రకరణాన్ని, పరిశేషాన్ని పట్టి అవ్యక్తశబ్దవాచ్యం శరీరమే కాని ప్రధానం కాదని చెప్పబడింది. ఇప్పుడీ ఆశంక చేయబడుచున్నది - శరీరం అవ్యక్త శబ్దానికి ఎట్లు తగి ఉంటుంది? ఎందువల్ల ననగా స్థూలం అవడంచేత మిక్కిలి స్పష్టంగా కనబడే ఈ శరీరం వ్యక్తశబ్దానికి తగినది. అవ్యక్తశబ్దం అస్పష్టం అనే అర్థాన్ని బోధిస్తుంది. అందువల్ల సమాధానం చెప్పబడుతున్నది. ఇక్కడ కారణరూపంలో సూక్ష్మంగా ఉన్న శరీరమే వివక్షితం, సూక్ష్మశరీరం అవ్యక్తశబ్దానికి తగినది కదా? ఈ స్థూలశరీరం స్వయంగా అవ్యక్తశబ్దానికి తగినది కాకపోయినా దీనికి మూలకారణమైన భూతసూక్ష్మం అవ్యక్తశబ్దానికి తగి ఉంది. "గోభిః శ్రీణీత మత్సరమ్" ఆవులతో, అనగా ఆవుపాలతో, సోమాన్ని కలపండి) అనే వాక్యంలో వలె ప్రకృతిశబ్దం (కారణాన్ని చెప్పే శబ్దం) వికారాన్ని (కార్యాన్ని) బోధించడానికి ప్రయోగింప బడడం కనబడుతుంది.

వి. గోవులు పాలకు ఉపాదాన కారణం. అందుచేత పాలతో కలపాలి. అనడానికి బదులు గోవులతో కలపాలి అని చెప్పబడింది. అట్లే ఇక్కడ ప్రకృతి వాచకమైన అవ్యక్తశబ్దం శరీరం అనే అర్థంలో ఉపయోగించబడింది అని అర్థం.

శ్రుతిశ్చేతి:-"తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్" (ఇది అంతా అప్పుడు అవ్యకృతంగా ఉంది) అను శ్రుతి వ్యాకృతాలైన నామరూపాలలో విభిన్నమైన ఈ జగత్తు ప్రాగవస్థలో (సృష్టికి పూర్వం) వ్యాకృతాలైన నామరూపా లేవీ లేకుండా బీజశక్త్యవస్థలో ఉండి అవ్యక్తశబ్దానికి యోగ్యంగా ఉండేది అని చూపుతున్నది.

## సూ. తదధీనత్వాదర్థవత్ 1.4.3

అత్రాహ - యది జగదిదమనభివ్యక్తనామరూపం బీజాత్మకం ప్రాగవస్థమవ్యక్తశబ్దార్హమభ్యుపగమ్యేత తదాత్మనా చ శరీరస్యాప్య వ్యక్తశబ్దార్హత్వం ప్రతిజ్ఞాయేత స ఏవ తర్హి ప్రధానకారణవాద ఏవం సత్యాపద్యేత. అస్యైవ జగతః ప్రాగవస్థాయాః ప్రధానత్వేనాభ్యుపగమాత్ - ఇతి. అత్రోచ్యతే - యది వయం స్వతన్త్రాం కాం చిత్ప్రాగవస్థాం జగతః కారణత్వేనాభ్యుపగచ్ఛేమ ప్రసఞ్జయేమ తదా ప్రధానకారణవాదమ్. పరమేశ్వరాధీనాత్వియమస్మాభిః ప్రాగవస్థా జగతోఽభ్యుపగమ్యతే న స్వతన్త్రా. సా చావశ్యాభ్యుపగన్తవ్యా. అర్థవతీ హి సా. న హి తయా వినా పరమేశ్వరస్య సష్టృత్వం సిధ్యతి, శక్తిరహితస్య ప్రవృత్త్యనుపపత్తేః. ముక్తానాం చ పునరనుత్పత్తిః. కుతః? విద్యయా తస్యా బీజశక్తేః దాహాత్. అవిద్యాత్మికా హి బీజశక్తిరవ్యక్తశబ్దనిర్దేశ్యా పరమేశ్వరాశ్రయా మాయామయీ మహాసుప్తిః, యస్యాం స్వరూప ప్రతిబోధరహితాః శేరతే సంసారిణో జీవాః.

### బాలానందిని

తదితి :- "తదధీనత్వాత్ = పరమేశ్వరాధీనం అవడంచేత, అర్థవత్ = అవ్యక్తావస్థ ప్రయోజనం కలది" అని సూత్రార్థం.

అత్రేతి : ఇక్కడ ఇలా అంటున్నాడు - నామరూపాలు అభివ్యక్తం కానిది, బీజరూపమూ, ప్రాగవస్థ గలదీ (ఉత్పత్తికి పూర్వం ఉన్న అవస్థ రూపంలో ఉన్నదీ అయిన) ఈ జగత్తు అవ్యక్తశబ్దానికి అర్హమైన దని అంగీకరిస్తే, అట్టి జగత్స్వరూపంలో ఉండడంచేత శరీరం కూడ అవ్యక్తశబ్దార్హం అయితే అప్పుడు ఆ ప్రధానకారణవాదమే వచ్చి పడుతుంది. ఈ జగత్తుయొక్క ప్రాగవస్థనే కదా ప్రధానంగా అంగీకరిస్తూన్నది?

ఈ విషయంలో చెప్పబడుతున్నది. మేం జగత్తుకు కారణమైన ఒకానొక స్వతంత్రమైన ప్రాగవస్థను కారణంగా అంగీకరించే పక్షంలో ప్రధానకారణవాదానికి ప్రసక్తి కలిగేటట్లు చేసి ఉండేవాళ్లం. జగత్తుయొక్క ఈ ప్రాగవస్థ పరమేశ్వరుని చెప్పుచేతలలోఉంటుందని మాచేత అంగీకరించబడుతున్నది గాన స్వతంత్రమైన ప్రాగవస్థ అంగీకరింపబడడం లేదు. దానిని తప్పక అంగీకరించవలసి ఉంటుంది. దానికి ఒక ప్రయోజనం ఉంది కదా. అది లేకుండా పరమేశ్వరునికి స్రష్టృత్వమే కుదరదు. శక్తిహీనుడైన పరమేశ్వరుడు ప్రవర్తింపజాలడు కదా? (దానిని అంగీకరిస్తేనే) ముక్తులకు మళ్లీ జన్మ లేకపోవడం కుదురుతుంది? ఎందువల్ల? దాని బీజశక్తి విద్యచేత (జ్ఞానంచేత) కాల్చి వేయబడుతుంది. ఇది అవిద్యారూపమైన ఒక బీజశక్తి, అవ్యక్తశబ్దంచేత చెప్పబడుతుంది. ఇది పరమేశ్వరుణ్ణి ఆశ్రయించు కొని ఉన్న మాయామయమైన (అనగా మాయావిలో ఉన్న మాయ వంటి) మహానిద్ర. సంసారులైన జీవులందరూ స్వరూపజ్ఞానశూన్యులై ఈ మహాసుప్తిలో నిద్రపోతూ ఉంటారు.

## భాష్యమ్

తదేతదవ్యక్తం క్వచిదాకాశశబ్దనిర్దిష్టమ్ - "ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" (బృ.ఉ. 3.8.11) ఇతి. క్వచిదక్షరశబ్దోదితమ్ - "అక్షరాత్పరతః పరః" (ము.ఉ.2.1) ఇతి శ్రుతేః. క్వచిన్మాయేతి సూచితమ్ - "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" (శ్వే.ఉ. 4.10) ఇతి మన్త్రవర్ణాత్. అవ్యక్తా హి సా మాయా తత్త్వాన్యత్వనిరూపణ స్యాశక్యత్వాత్. తదితం "మహతః పరమవ్యక్తమ్" ఇత్యుక్తమ్, అవ్యక్తప్రభ వత్వాన్మహతః. యదా హైరణ్యగర్భబుద్ధిర్మహాన్. యదా తు జీవో మహాన్ తదాప్యవ్యక్తాధీ నత్వాజ్జీవభావస్య మహతః పరమవ్యక్తమ్ ఇత్యుక్తమ్. అవిద్యా హ్యవ్యక్తమ్. అవిద్యావత్త్వేనైవ జీవస్య సర్వః సంవ్యవహారః సంతతో వర్తతే. తచ్చావ్యక్తగతం మహతః పరత్వమభేదోపచారాత్తద్వికారే శరీరే పరికల్ప్యతే. సత్యపి శరీరవదిన్ద్రి యాదీనాం తద్వికారత్వావిశేషే శరీరస్యైవాభేదోపచారాత్ అవ్యక్తశబ్దేన గ్రహణమ్, ఇన్ద్రియాదీనాం స్వశబ్దైరేవ గృహీతత్వాత్, పరిశిష్టత్వాచ్చ శరీరస్య.

## బాలానందిని

తదేతదితి :- ఈ అవ్యక్తం కొన్ని చోట్ల "ఏతస్మిన్ను... ప్రోతశ్చ" ఇత్యాది శ్రుతులలో ఆకాశశబ్దంచేత నిర్దేశించబడింది. కొన్ని చోట్ల "అక్షరాత్పరతః పరః" ఇత్యాది శ్రుతులలో అక్షరశబ్దంచేత చెప్పబడింది. కొన్ని చోట్ల మాయ అని సూచించబడింది.

"మాయాం... మహేశ్వరమ్" అని మంత్రవర్ణం చెపుతున్నది. ఆ మాయ అవ్యక్తమైనది. ఎందువల్ల ననగా తత్త్వాన్యత్వాలతో దీనిని నిరూపించడం శక్యం కాదు.

వి. తత్త్వాన్యత్వనిరూపణస్య అశక్యత్వాత్ అనగా ఆ మాయ తత్త్వమా. అనగా అబాధితమా (సత్తా) లేక అన్యమా అనగా అసత్తా అని నిరూపించడం శక్యంకాదు, అనిర్వచనీయం అని బ్రహ్మవిద్యాభరణవ్యాఖ్య అర్థం చెప్పింది. అయితే భామతీకారుని మతం ప్రకారం మాయ బ్రహ్మరూపమా లేక అన్యమా అని నిరూపించడం శక్యం కాదు, ఆ విధంగా అనిర్వచనీయం అని అర్థం. ఈ అర్థమే బాగున్నట్లు తోస్తుంది.

తదిదమితి :- ఆ ఇదే "మహతః పరమవ్యక్తమ్" అని చెప్పబడింది. హిరణ్యగర్భుని బుద్ధి మహత్ అని గ్రహించిన పక్షంలో ఆ మహత్తు అవ్యక్తంనుండి పుట్టిందిగాన దానికంటె అవ్యక్తం పరమే. మహాన్ అనగా జీవుడు అనే పక్షంలో కూడ జీవత్వం అవ్యక్తాధీనం గాన "మహతః పరమవ్యక్తమ్" అని చెప్పబడింది. అవ్యక్తం అనగా అవిద్యయే కదా? అవిద్యాసంబంధంచేతనే (అవిద్య కలిగి ఉండడంచేతనే) జీవుని వ్యవహారం అంతా అవిచ్ఛిన్నం గా నడుస్తూంటుంది. మహత్తుకంటె పరత్వం అవ్యక్తంలోనే ఉన్నా (అవ్యక్తానికి దాని కార్యమైన శరీరానికీ) అభేదం ఆరోపించడంవల్ల దాని వికారమైన శరీరంలో కల్పించబడుతున్నది. (అవ్యక్తకార్యమైన శరీరమే అవ్యక్తం అని ఉపచారప్రయోగంచేత చెప్పబడుతున్నది). శరీరం వలె ఇంద్రియాదులు కూడ అవ్యక్తంయొక్క కార్యాలే అయినా శరీరం మీదనే అభేదాన్ని ఆరోపించి అది అవ్యక్తం అని చెప్పబడుతున్నది. ఎందువల్ల ననగా ఇంద్రియాదులు స్వశబ్దాల చేతనే ("ఇన్ద్రియాణి.... మనః" ఇత్యాది శబ్దాలచేతనే) చెప్పబడ్డాయి, ఇంక మిగిలినది శరీరం ఒక్కటే.

## భాష్యమ్

అన్యే తు వర్ణయన్తి - ద్వివిధం హి శరీరం స్థూలం సూక్ష్మం చ. స్థూలం యదిదముపలభ్యతే. సూక్ష్మం యదుత్తరత్ర వక్ష్యతే - "తదన్తర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్" (బ్ర.సూ. 3.1.1) ఇతి. తచ్చోభయమపి శరీరమవిశేషాత్పూర్వత్ర రథత్వేన సంకీర్తితమ్, ఇహ తు సూక్ష్మమవ్యక్తశబ్దేన పరిగృహ్యతే, సూక్ష్మస్యావ్యక్తశబ్దార్హత్వాత్. తదధీనత్వాచ్చ బన్ధమోక్షవ్యవహారస్య జీవాత్తస్యపరత్వమ్, యథార్థాధీనత్వాదిన్ద్రియ వ్యాపారస్యేన్ద్రియేభ్యః పరత్వమర్థానామితి.

## బాలానందిని

అన్యే ఇతి :- కొందరు (వృత్తికారుడు అని రత్నప్రభ) ఇలా అంటూన్నారు - స్థూలం సూక్ష్మం అని శరీరం రెండు విధాలు, కంటికి కనబడుతూన్నది స్థూలం. "తదన్తర... నిరూపణాభ్యామ్" అనే సూత్రంలో చెప్పబడబోయేది సూక్ష్మం. అవిశేషంవల్ల, అనగా రెండూ శరీరాలే గాన, ఆ రెండు రకాల శరీరమూ కూడ వెనక రథంగా చెప్పబడింది. ఇక్కడైతే, అవ్యక్తశబ్దంచేత సూక్ష్మశరీరం గ్రహించబడుచున్నది. అవ్యక్తం అని చెప్పడానికి తగినది సూక్ష్మశరీరమే కదా? (ఇది "సూక్ష్మం తదర్హత్వాత్" అనేదానికి వాళ్లు చేసే వ్యాఖ్య). బంధం, మోక్షం అనే వ్యవహారం ఆ సూక్ష్మశరీరం మీదనే ఆధారపడి ఉంది గాన జీవుని కంటె అది పరం. (ఇది "తదధీనత్వాదర్థవత్" అనేదానికి వాళ్ల వ్యాఖ్య). ఇంద్రియాల వ్యాపారం విషయాలమీద ఆధారపడి ఉంటుంది గాన ఇంద్రియాలకంటె అర్థాలు పరమని చెప్పనట్లే ఇది కూడ.

## భాష్యమ్

తైస్త్వేతద్వక్తవ్యమ్ - అవిశేషేణ శరీరద్వయస్య పూర్వత్ర రథత్వేన సంకీర్తితత్వాత్సమానయోః ప్రకృతత్వపరిశిష్టత్వయోః కథం సూక్ష్మమేవ శరీరమిహ గృహ్యతే న స్థూలమపీతి. ఆమ్నాతస్యార్థం ప్రతిపత్తుం ప్రభవామో నామ్నాతం పర్యనుయోక్తుమ్, ఆమ్నాతం చ అవ్యక్తపదం సూక్ష్మ మేవ ప్రతిపాదయతుం శక్నోతి, నేతరత్, వ్యక్తత్వాత్తస్యేతి చేత్, న. ఏకవాక్యతాధీనత్వాదర్థప్రతిపత్తేః. న హీమే పూర్వోత్తరే ఆమ్నాతే ఏకవాక్యతా మనాపద్య కం చిదర్థం ప్రతిప్రాదయతః, ప్రకృతహానాప్రకృతప్రక్రియా ప్రసంగాత్. న చాకాఙ్క్షామన్తరేణైకవాక్యతాప్రతిపత్తిరస్తి. తత్రావిశిష్టాయాం శరీరద్వయస్య గ్రాహ్యత్వాకాఙ్క్షాయాం యథాకాఙ్క్షంసమ్బన్ధేఽనభ్యు పగమ్యమాన ఏకవాక్యతైవ బాధితా భవతి; కుత ఆమ్నాతస్యార్థస్య ప్రతిపత్తిః. న చైవం మన్తవ్యమ్ - దుఃశోధత్వాత్సూక్ష్మస్యైవ శరీరాస్యేహ గ్రహణం, స్థూలస్య తు దృష్టబీభత్సతయా సుశోధత్వాదగ్రహణమ్ ఇతి; యతో నైవేహ శోధనం కస్య చిద్వివక్ష్యతే. న హ్యత్ర శోధనవిధాయి కించిదాఖ్యాతమస్తి. అనన్తరనిర్దిష్టత్వాత్తు కిం తద్విష్ణోః పరమం పదమితీదమిహ వివక్ష్యతే. తథాహి - ఇదమస్మాత్పరమిదమస్మాత్పరమిత్యుక్త్వా "పురుషాన్న పరం కించిత్" ఇత్యాహ. సర్వథాపి త్వానుమాని కనిరాకరణోప పత్తేస్తథా నామాస్తు, న నః కించిచ్ఛిద్యతే.3.

## బాలానందిని

**తైరితి** : - ఇలా వర్ణించేవాళ్లు ఈ విషయం చెప్పవలసి ఉంటుంది. పూర్వం ఏ విశేషమూ లేకుండా రెండు శరీరాలు రథంగా చెప్పబడినప్పుడు, ప్రకృతత్వమూ, పరిశిష్టత్వమూ అనేవి రెండింటికీ సమానమే అయినప్పుడు, ఇక్కడ సూక్ష్మశరీరం మాత్రమే ఎలా గ్రహించబడుతుంది? స్థూలశరీరం ఎందుకు గ్రహింపబడదు? (పూర్వపక్షి ప్రశ్న) - శ్రుతివాక్యంలో చెప్పినదాని అర్థం తెలుసుకొనడం కోసం సమర్థులం అవుతాం (ప్రయత్నిస్తాం) కాని చెప్పినదానిని ఇలా ఎందుకు చెప్పారు అని ప్రశ్నించ జాలం. ఇక్కడ ఉపయోగించిన అవ్యక్తపదం సూక్ష్మశరీరాన్ని మాత్రమే బోధించ కలుగుతుంది గాని వ్యక్తమైన స్థూలశరీరాన్ని బోధించ జాలదు. అన్నట్లయితే - (సమాధానం) అది యుక్తం కాదు. అర్థజ్ఞానం ఏకవాక్యత మీద ఆధారపడి ఉంటుంది. ముందు చెప్పబడినది తరవాత చెప్పబడినది - ఈ రెండూ ఏకవాక్యత్వం పొందకుండా ఏ అర్థాన్నీ ప్రతిపాదించ జాలవు.

వి. "ఆత్మానంర థినమ్" ఇత్యాది వాక్యమూ "ఇన్ద్రియేభ్యః పరాః" ఇత్యాది వాక్యము ఈ రెండు కలిసి ఏదో ఒక విషయం ప్రతిపాదించ వలసి ఉంది. అవి ఒక విషయం ప్రతిపాదించాలంటే వాటి మధ్య ఏకవాక్యత ఉండాలి. ఏకవాక్యత అనగా - ఏదైన ఒక విషయాన్ని ప్రతిపాదించడం కోసం ప్రయోగించిన పదాలు పరస్పరా కాంక్షతో ఆ అర్థాన్ని చెప్పే విధంగా శ్రోతయొక్క బుద్ధిలో ప్రవేశించడం. ఆకాంక్ష అనగా ప్రశ్న. 'గచ్ఛతి' అనగానే 'కః గచ్ఛతి' అని ఆకాంక్ష కలుగుతుంది. రామః గచ్ఛతి అని తెలిసిన తరవాత కుత్ర గచ్ఛతి అని ఆకాంక్ష కలుగుతుంది. "రామః గ్రామం గచ్ఛతి" అని తెలిసన తరవాత "కేన గచ్ఛతి" అని ఆకాంక్ష కలుగుతుంది. "రామః యానేన గ్రామం గచ్ఛతి" అని తెలియగానే ఆకాంక్ష తీరి వాక్యం ఒక పూర్ణమైన అర్థం బోధిస్తుంది. అదే విధంగా ఇక్కడ మొదట చెప్పిన ఆరింటిలోను ఏది ఏదిగా రూపించబడింది అని ఆకాంక్ష కలగగానే ఆరింటికి ఆరూ చూపించాలి. ఇంద్రియాదుల విషయంలో ఆకాంక్ష పూర్తి అయిన తరవాత ప్రథమవాక్యగతశరీరాన్ని రెండవవాక్యంలోని ఏ పదం నిర్దేశిస్తూప్నది అని ఆకాంక్ష కలిగినప్పుడు అవ్యక్తపదం శరీరాన్ని నిర్దేశిస్తూన్నది అని చెప్పాలి. శరీరం రెండు విధాలు అని చెప్పబడింది గాన రెండు విధాలైన శరీరాలను గ్రహించాలి కాని సూక్ష్మశరీరాన్ని మాత్రమే గ్రహిస్తాం అని చెప్పడం కుదరదు. అప్పుడు స్థూల శరీరం మిగిలి పోతుంది కదా? అందుచేత ఆకాంక్షానుసారం గ్రహించిన శరీరం అనగా ఉభయవిధశరీరమూ అని అర్థం చెప్పాలి అని సిద్ధాంతి అభిప్రాయం.

ప్రకృతేతి:- ఏకవాక్యత పొందకుండా అర్థప్రతిపాదనం చేస్తే ప్రకృతహానా ప్రకృతప్రక్రియ ప్రసక్తం అవుతుంది. రూఢిచేత శరీరపదం బోధించే ప్రకృతమైన స్థూల శరీరాన్ని విడిచిపెట్టడం అప్రకృతమైన సూక్ష్మశరీరాన్ని గ్రహించడం జరుగుతుంది అని అర్థం. ఆకాంక్ష ఉంటేనే గాని ఏకవాక్యతాజ్ఞానం ఉండదు. శరీరద్వయాన్నీ కూడ గ్రహించాలి అనే ఆకాంక్ష రెండింటి విషయంలోను సమంగానే ఉన్నప్పుడు ఆకాంక్షానుసారం సంబంధం అంగీకరించకపోతే ఏకవాక్యతకే బాధ కలుగుతుంది. అలాంటప్పుడు చెప్పినదాని అర్థం గ్రహించడం అనేదానికి అవకాశం ఎక్కడ?

అవ. స్థూల శరీరం ఉల్లిపాయలు మొదలైన వాటి వలె దుర్గంధాదిదోష భూయిష్ఠమై ఉంటుంది. అందుచేత దానిని శోధించడం, అనగా ఇది ఆత్మకాదు అని నిరూపించడం సులభం. సూక్ష్మశరీరం అలా కాదు. ఆత్మకు చాలా సంనిహితంగా ఉండడం చేత దానిని శోధించడం కష్టం. అందుచేత ఇక్కడ సూక్ష్మ శరీరాన్నే గ్రహించాలి అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు- న చైవమితి:- శోధించడానికి కష్టమైన దవడంచేత ఇక్కడ సూక్ష్మశరీరాన్నే గ్రహించాలి; స్పష్టంగా జుగుప్సాకరంగా కనబడుతూండడంచేత స్థూలశరీరశోధనం సులభం గాన దానిని గ్రహించవలసిన పని లేదు అని కూడా అనడానికి వీలు లేదు. ఇక్కడ దేనియొక్క శోధనమూ కూడ వివక్షితం కాదు. ఇక్కడ శోధనాన్ని గూర్చి ఏవీ చెప్పబడలేదు కదా? దగ్గరనే విష్ణుపదం నిర్దేశించబడడంచేత పరమమైన ఆ విష్ణుపదం ఏది అని మాత్రమే ఇక్కడ చెప్ప దలచిన విషయం. అందువల్లనే ఇది దీనికంటె పరం, ఇది దీనికంటె పరం అని చెప్పుకొంటూ వచ్చి "పురుషాన్న పరం కిం చిత్" అని చెప్పాడు. సరే! ఏ విధంగా చెప్పినా కూడా ప్రధానాన్ని నిరాకరించడం కుదురుతుంది గాన వాళ్లు చెప్పి నట్లే అయితే అవనియ్యండి; మా కేమీ నష్టం లేదు. 2.

## సూ. జ్ఞేయత్వావచనాచ్చ. 1.4.4.

జ్ఞేయత్వేన చ సాంఖ్యైః ప్రధానం స్మర్యతే, గుణపురుషాన్తర జ్ఞానాత్కైవల్యమితి వదద్భిః; న హి గుణస్వరూపమజ్ఞాత్వా గుణేభ్యః పురుషస్యాన్తరం శక్యం జ్ఞాతుమితి. క్వచిచ్చ విభూతివిశేషప్రాప్తయే ప్రధానం జ్ఞేయమితి స్మరన్తి. న చేదమిహావ్యక్తం జ్ఞేయత్వేనోచ్యతే, పదమాత్రం త్వవ్యక్తశబ్దః. నేహావ్యక్తం జ్ఞాతవ్యముపాసితవ్యం చేతి వాక్యమస్తి. న చానుపదిష్టం పదార్థజ్ఞానం పురుషార్థమితి శక్యం ప్రతిపత్తుమ్. తస్మాదపి

నావ్యక్తశబ్దేన ప్రధానమభిధీయతే. అస్మాకం తు రూపకక్లృప్తశరీరాద్యనుసరణేన విష్ణోరేవ పరమం పదం దర్శయితుమయముపన్యాస ఇత్యనవద్యమ్. 4.

## బాలానందిని

జ్ఞేయేతి:- "జ్ఞేయత్వావచనాత్ చ= అవ్యక్తం తెలియ దగినది అని చెప్పకపోవడం వల్ల కూడా అవ్యక్తం కాదు" అని సూత్రార్థం.

జ్ఞేయత్వేనేతి:- గుణాలకి పురుషులకూ మధ్య ఉన్న భేదాన్ని తెలుసుకొనడం వల్ల ముక్తి కలుగుతుంది అని చెప్పే సాంఖ్యులు ప్రధానాన్ని గూర్చి తెలుసుకోవాలి అని కూడా అంటారు. గుణాలయొక్క అనగా త్రిగుణాత్మకమైన ప్రధానంయొక్క స్వరూపాన్ని తెలుసుకొనకుండా, గుణాలకంటె పురుషునకు ఉన్న భేదాన్ని తెలుసుకొనడానికి శక్యం కాదు కదా? (అణిమాది) విభూతులు పొందడానికి ప్రధానాన్ని ఉపాసించాలి అని కూడ వాళ్లు కొన్ని చోట్ల చెపుతున్నారు. ఇక్కడ అవ్యక్తం జ్ఞేయ మని చెప్పబడలేదు కదా? ఇక్కడ ఉన్నదల్లా 'అవ్యక్త' శబ్దం మాత్రమే. ఈ అవ్యక్తాన్ని తెలుసుకోవా లని గాని, ఉపాసించా లని గాని వాక్యం ఏదీ లేదు. ఆ కారణంవల్ల కూడ అవ్యక్తశబ్దం ప్రధానాన్ని బోధించదు. మాకైతే రథరూపకంలో కూర్చబడిన శరీరాదులను అనుసరించి విష్ణువుయొక్క పరమపదాన్ని చూపడంకోసం అవ్యక్తం చెప్పబడింది అని అంగీకరించడంచేత ఏ దోషమూ లేదు. 4.

## సూ. వదతీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్. 1.4.5

అత్రాహ సాంఖ్యః- "జ్ఞేయత్వావచనాత్" ఇత్యసిద్ధమ్; కథమ్? శ్రూయతే హ్యుత్తరత్రావ్యక్తశబ్దోదితస్య ప్రధానస్య జ్ఞేయత్వవచనమ్-

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసం నిత్యమగన్ధవచ్చ యత్.
అనాద్యనన్తం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే"
(క.ఉ.23.15) ఇతి. అత్ర హి యాదృశం శబ్దాదిహీనం ప్రధానం మహతః పరం స్మృతౌ నిరూపితం తాదృశమేవ నిచాయ్యత్వేన నిర్దిష్టమ్. తస్మాత్ప్రధానమేవేదమ్. తదేవ చావ్యక్తశబ్దనిర్దిష్టమితి. అత్ర బ్రూమః- నేహ ప్రధానం నిచాయ్యత్వేన నిర్దిష్టమ్; ప్రాజ్ఞో హీహ పరమాత్మా నిచాయ్యత్వేన నిర్దిష్ట ఇతి గమ్యతే. కుతః? ప్రకరణాత్. ప్రాజ్ఞస్య హి ప్రకరణం వితతం వర్తతే- "పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" ఇత్యాదినిర్దేశాత్. "ఏష

సర్వేషు గూఢోత్మా న ప్రకాశతే" ఇతి చ దుర్జ్ఞానత్వవచనేన తస్యైవ జ్ఞేయత్వాకాఙ్క్షణాత్ . "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ" ఇతి చ తద్జ్ఞానాయైవ వాగాదిసంయమస్య విహితత్వాత్, మృత్యుముఖప్రమోక్షణఫలత్వాచ్చ. న హి ప్రధానమాత్రం నిచాయ్య మృత్యుముఖాత్ప్రముచ్యతే ఇతి సాంఖ్యైరిష్యతే. చేతనాత్మవిజ్ఞానాద్ధి మృత్యుముఖాత్ప్రముచ్యత ఇతి తేషామభ్యుపగమః. సర్వేషు వేదాన్తేషు ప్రాజ్ఞస్యైవాత్మనోఽశబ్దాదిధర్మత్వమభిలప్యతే. తస్మాన్న ప్రధానస్యాత్ర జ్ఞేయత్వమవ్యక్తశబ్దనిర్దిష్టత్వం వా.5.

బాలానందిని

వదతీతి:- "వదతీతి చేత్=ప్రధానం జ్ఞేయం అని చెప్పుచున్నాడు అన్నట్లయితే, న=కాదు, ప్రకరణాత్=ప్రకరణంవల్ల, ప్రాజ్ఞో హి పరమాత్మయే చెప్పబడుచున్నది కదా?' ' అని సూత్రార్థం.

**అత్రేతి**:- ఇక్కడ సాంఖ్యుడు ఇలా అంటున్నాడు "జ్ఞేయత్వావచనాత్" అనేది **అసిద్ధం**. ఎట్లు? ప్రధానశబ్దంచేత చెప్పబడిన ప్రధానం జ్ఞేయం అని తరువాతి వాక్యంలో **"అశబ్దమ్... ప్రముచ్యతే"** అని వినబడుచున్నది కదా? (ఏది శబ్ద రహితమో, స్పర్శ లేనిదో, రూపం లేనిదో మార్పు లేనిదో, రసం లేనిదో, నిత్యమో, గంధం లేనిదో ఆద్యంతాలు లేనిదో, మహత్తుకకంటె పరమో, స్థిరమో దానిని అన్వేషించి మృత్యుముఖంనుండి ముక్తు డవుతాడు అని దీని అర్థం). ఇక్కడ శబ్దాదిహీనము, మహత్తుకంటె పరమూ అయిన ఏ విధమైన ప్రధానం స్మృతిలో చెప్పబడిందో అలాంటిదే అన్వేషించదగినదిగా నిర్దేశించబడింది. అందుచేత ఇది ప్రధానమే; అదే అవ్యక్తశబ్దంచేత నిర్దేశించబడినది. ఈ విషయంలో చెపుతున్నాం - ఇక్కడ అన్వేషింపదగినదిగా నిర్దేశింపబడినది ప్రధానం కాదు. ఇక్కడ ప్రాజ్ఞుడు, అనగా పరమాత్మ, అన్వేషింపదగినవాడుగా నిర్దేశింపబడి నట్లు తోస్తున్నది. ఎందువల్ల? ప్రకరణంవల్ల. **"పురుషాత్**... గతిః" ఇత్యాదినిర్దేశంవల్ల ఇక్కడ ప్రాజ్ఞుని ప్రకరణమే విస్తృత మైనట్లు కనబడుతున్నది. "ఏష... ప్రకాశతే" అని తెలియడానికి చాలా కష్టమైనవాడు అని చెప్పడంచేత ఆ ప్రాజ్ఞుడే తెలియదగినవాడు అని కోరబడుతున్నాడు. ఆ ప్రాజ్ఞుని జ్ఞానంకోసమే "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః" అని వాగాదుల సంయమనం విధించబడింది. దీనికి ఫలం మృత్యుముఖంనుండి విడుదల పొందడం అని కూడ చెప్పబడింది. కేవలం ప్రధానాన్ని అన్వేషిస్తే మృత్యుముఖంనుంచి

విముక్తుడౌతాడు అని సాంఖ్యులు కూడ అంగీకరించరు కదా? చేతనాత్మను తెలుసుకొనడంవల్ల మృత్యుముఖప్రమోక్షణం అని కదా వాళ్లు అంగీకరించినది? అశబ్దాదిధర్మాలు ప్రాజ్ఞాత్మకే ఉన్నట్లు అన్ని ఉపనిషత్తులలోను చెప్పబడుతున్నది. అందువల్ల ఇక్కడ ప్రధానం జ్ఞేయం అని గాని అవ్యక్తం అని గాని నిర్దేశించబడలేదు.5.

సూ. త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ. **1.4.6.**

ఇతశ్చ న ప్రధానస్యావ్యక్తశబ్దవాచ్యత్వం జ్ఞేయత్వం వా, యస్మాత్త్రయాణామేవ పదార్థానామగ్నిజీవపరమాత్మనామస్మిన్ గ్రన్థే కఠవల్లీషు వరప్రదానసామర్థ్యాద్వక్తవ్యతయోపన్యాసో దృశ్యతే. తద్విషయ ఏవ చ ప్రశ్నః నాతోఽన్యస్య ప్రశ్న ఉపన్యాసో వాస్తి. తత్ర తావత్-

"స త్వమగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో ప్రబ్రూహి త్వం శ్రద్దధానాయ మహ్యమ్" (క.ఉ.1.1.13) ఇత్యగ్నివిషయః ప్రశ్నః.

"యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నా యమస్తీతి చైకే, ఏ తద్విద్యామనుశిష్టస్త్వయాహం వరాణామేష వరస్తృతీయః" (క.ఉ.1.1.20) ఇతి జీవవిషయః ప్రశ్నః—

"అన్యత్ర ధర్మాదన్యాత్రాధర్మాదన్యత్రాస్మాత్ కృతాకృతాత్,
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద" (క.ఉ.1.2.14) ఇతి పరమాత్మవిషయః. ప్రతివచనమపి -

"లోకాదిమగ్నిం తమువాచ తస్మై యా ఇష్టకా యావతీర్వా యథా వా" (క.ఉ.1.1.15) ఇత్యగ్నివిషయమ్.

" హన్త త ఇమం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్.
యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ

యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః,
స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్" (క.ఉ.2.5.6,7)

ఇతి వ్యవహితం జీవవిషయమ్. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" (క.ఉ.1.2.18) ఇతి బహుప్రపఞ్చం పరమాత్మ విషయమ్. నైవం ప్రధాన విషయః ప్రశ్నోఽస్తి; అపృష్టత్వాదనుపన్యసనీయత్వం తస్యేతి.

## బాలానందిని

త్రయాణామితి:- "త్రయాణామేవ=మూడింటియొక్కయే, ప్రశ్నః= ప్రశ్న, ఉపన్యాసశ్చ=సమాధానంగా చెప్పడమూ ఉన్నది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంచేత కూడ ప్రధానం అవ్యక్తశబ్దవాచ్యం కాని జ్ఞేయం కాని కాదు. ఎందువల్ల ననగా - కఠవల్లిలో, ఈ గ్రంథసందర్భంలో, వరప్రదాన సామర్థ్యాన్ని పట్టి అగ్ని-జీవ-పరమాత్మ లనే మూడు పదార్థాలను గూర్చి మాత్రమే చెప్పవలసి ఉన్నట్లు ఉపన్యాసం కనబడుతున్నది. వాటిని గూర్చి ప్రశ్న కనబడుతున్నది. అందువల్ల వీటికంటె భిన్నమైనదాని ప్రశ్న కాని ఉపన్యాసం కాని లేదు.

వి. వాజశ్రవసు డనే ఒక ముని యాగం చేసి దక్షిణగా ఋత్విక్కులు మొదలైనవాళ్లకి చావడానికి సిద్ధంగా ఉన్న ఆవుల్ని ఇస్తాడు. అది చూచిన బాలుడైన అతని పుత్రుడు నచికేతుడు ఇలాంటి గోవుల్ని దక్షిణగా ఇవ్వడం చాలా అయుక్తం అని అనుకొని తండ్రి దగ్గరికి వెళ్లి "తండ్రీ!నన్నెవరి కిస్తావు?" అని అడిగాడు. అతడు రెట్టించి రెట్టించి అడిగినందుకు చికాకుపడి వాజశ్రవసుడు నిన్ను యముని కిస్తా నన్నాడు. అన్న మాట తప్పకూడదు, నన్ను యమలోకానికి పంపు అని ఆ పిల్లవాడు పట్టు పట్టాడు. చేయకలిగిన దేమీ లేక అతడు ఆ పిల్లవానిని యమలోకానికి పంపాడు. అతడు అక్కడికి వెళ్లేసరికి యముడు అక్కడ లేడు. మూడు రోజుల తరవాత వచ్చాడు. అంతవరకూ ఆ పిల్లవాడు ఆహారం కూడ లేకుండా యమునికోసం నిరీక్షించాడు. అతిథి తన ఇంట్లో ఆహారం లేకుండా మూడు రోజు లున్నందుకు చాలా నొచ్చుకొని యముడు అతనిని బాగా గౌరవించి మూడు వరాలు కోరుకోమన్నాడు. ఆ వరాలను గూర్చినదే ఈ చర్చ.

తత్రేతి:- వాటిలో - "స త్వం ... మహ్యమ్" (ఓ! మృత్యూ! స్వర్గాన్ని ఇచ్చే అగ్నిని గూర్చి నువ్వు బాగుగా తెలుసుకొని ఉన్నావు. ఆ అగ్నిని గూర్చి శ్రద్ధావంతుడ నైన నాకు చెప్పు అనేది అగ్నిని గూర్చిన ప్రశ్న. "యేయం... తృతీయః" (మనుష్యుడు మరణించిన తరవాత ఇంకా అతడు ఉంటా డని కొంద రంటారు. ఉండ డని కొంద రంటారు. ఈ విషయంలో నీవు బోధించగా నేను తెలుసుకొంటాను. మూడు వరాలలో ఇది మూడవ వరం) అని జీవుణ్ణి గూర్చిన ప్రశ్న "అన్యత్ర... తద్వద" అని పరమాత్మను గూర్చిన ప్రశ్న. ప్రతివచనం కూడ "లోకాది... యథా వా" (లోకానికి ఆదియైన ఆ అగ్నిని గూర్చి, ఏ విధమైన ఇటకలో, ఎన్నో, ఎలాంటివో వానికి బోధించాడు)

అనేది అగ్నికి సంబంధించినది. "హన్త... యథాశ్రుతమ్" (అహా! గౌతమా! నీకు రహస్యమూ, సనాతనమూ అయిన బ్రహ్మను గూర్చి చెపుతాను. మరణం పొందిన తరవాత ఆత్మ ఎలా ఉంటుందో చెపుతాను. కొందరు ప్రాణులు శరీరధారణంకోసం ఏదో ఒక జన్మ పొందుతారు. కొందరు వాళ్ల కర్మలను అనుసరించి, వాళ్లు చేసిన ఉపాసనలను అనుసరించి స్థావరరూపాన్ని పొందుతారు) అని దూరంగా ఉన్న సమాధానం జీవునికి సంబంధించినది. "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" ఇత్యాదికమైన అతివిస్తృతమైనది పరమాత్మను గూర్చినది. ఈ విధంగా ప్రధానాన్ని గూర్చిన ప్రశ్న లేదు; అడగబడనప్పుడు దానిని గూర్చి చెప్పవలసిన పని కూడ లేదు.

## భాష్యమ్

అత్రాహ:- యోయమాత్మవిషయః ప్రశ్నః "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే ఽస్తి" ఇతి, కిం స ఏవాయమ్- "అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్" ఇతి పునరాకృష్యతే, కిం వా తతో ఽన్యో ఽపూర్వః ప్రశ్న ఉత్థాప్యత ఇతి. కిం చాతః? స ఏవాయం ప్రశ్నః పునరాకృష్యతే ఇతి యద్యుచ్యేత, తదా ద్వయోరాత్మ విషయయోః ప్రశ్నయోరేకతాపత్తేః అగ్ని విషయః ఆత్మవిషయశ్చ ద్వావేవ ప్రశ్నావిత్యతో న వక్తవ్యం త్రయాణాం ప్రశ్నోపన్యాసావితి. అథాన్యో ఽయమ పూర్వః ప్రశ్న ఉత్థాప్యతే ఇత్యుచ్యేత తతో యథైవ వరదానవ్యతిరేకేణ ప్రశ్నకల్పనాయామదోషః ఏవం ప్రశ్నవ్యతిరేకేణాపి ప్రధానోపన్యాస కల్పనాయామదోషః స్యాదితి.

అత్రోచ్యతే- నైవం వయమిహ వరప్రదానవ్యతిరేకేణ ప్రశ్నం కంచిత్కల్పయామః, వాక్యోపక్రమసామర్థ్యాత్. వరదానోపక్రమా హి మృత్యునచికేతఃసంవాదరూపా వాక్యప్రవృత్తిరాసమాప్తేః కఠవల్లీనాం లక్ష్యతే. మృత్యుః కిల నచికేతసే పిత్రా ప్రేషితాయ త్రీన్ వరాన్ ప్రదదౌ. నచికేతాః కిల తేషాం ప్రథమేన వరేణ పితుః సౌమనస్యం వవ్రే; ద్వితీయేనాగ్నివిద్యామ్, తృతీయేనాత్మవిద్యామ్ "యేయం ప్రేతే" ఇతి; "వరాణామేష వరస్తృతీయః" ఇతి లిఙ్గాత్. తత్ర "యద్యన్యత్ర ధర్మాత్" ఇత్యన్యో ఽయమపూర్వః ప్రశ్న ఉత్థాప్యేత తతో వరప్రదానవ్యతిరేకేణాపి ప్రశ్నకల్పనాద్వాక్యం బాధ్యేత.

## బాలానందిని

అత్రేతి:- ఇక్కడ (పూర్వపక్షి) ఇలా అంటున్నాడు- "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీతి" అని ఆత్మను గూర్చిన ప్రశ్నయే "అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్" అని ఇంకా ముందుకు లాగబడుతున్నదా, లేక దానికంటె వేరుగా మరొక ప్రశ్న లేవదీయ బడుతున్నదా? ఏమైతే మాత్రం ఏమిటి? ఆ ప్రశ్నయే ముందుకు లాగబడుచున్నది అని చెప్పే పక్షంలో ఆత్మకు సంబంధించిన రెండు ప్రశ్నలూ ఒకటే అయిపోతాయి కాబట్టి, అప్పుడు అగ్ని విషయకమైన ప్రశ్న ఒకటి ఆత్మ విషయక ప్రశ్న ఒకటి అని రెండు ప్రశ్నలే గాన మూడింటిని గూర్చి ప్రశ్నలు వాటి సమాధానం అని (సూత్రంలో) ఉండకూడదు. అలా కాక ఇది మరొక క్రొత్త ప్రశ్న లేవదీయబడుతున్నది అన్నట్లయితే అప్పుడు వరం ఇచ్చినదానికంటె వ్యతిరేకంగా ప్రశ్నను లేవదీయడంలో ఏ విధంగా దోషం లేదో అదే విధంగా ప్రశ్నకు వ్యతిరేకంగా (ప్రశ్న లేకపోయినా) ప్రధానాన్ని గూర్చి చెప్పినా దోషం లేదని చెప్పవచ్చును.

ఇక్కడ (సమాధానం) చెప్పబడుచున్నది. మేం ఈ విధంగా వరప్రదానానికి వ్యతిరేకంగా ప్రశ్నను కల్పించడం లేదు. ఎందువల్ల ననగా వాక్యోపక్రమసామర్థ్యాన్ని పట్టి (అలా కల్పించడానికి వీలు లేదు). మృత్యుదేవతకు నచికేతస్సుకు మధ్య జరిగిన సంవాదం రూపంలో ఉన్న వాక్యాల ప్రవృత్తి వరప్రదానంతో ప్రారంభం అయి కఠవల్లి చివరి వరకూ నడుస్తుంది. మృత్యువు తండ్రిచేత పంపబడిన నచికేతునకు మూడు వరాలిచ్చాడట. నచికేతుడు వాటిలో మొదటి వరంచేత తండ్రికి తన విషయంలో కోపం లేకపోవడాన్ని, రెండవ వరంచేత అగ్ని విద్యను, మూడవ వరంచేత ఆత్మవిద్యను కోరాడట. "యేయం ప్రేతే", "వరాణామేష వరస్తృతీయః" అనే వాక్యాలు ఇందుకు లింగంగా ఉన్నాయి. (ఈ వాక్యాలను బట్టి ఇలా తెలుస్తూన్నది). అలాంటప్పుడు "అన్యత్ర ధర్మాత్" అని క్రొత్త ప్రశ్న లేవదీసిన ట్లయితే అప్పుడు వరప్రదానానికి వ్యతిరేకంగా ప్రశ్న కల్పించడంవల్ల వాక్యం బాధించబడుతుంది. అనగా వాక్యానికి చెప్పవలసిన విధంగా అర్థం చెప్పినట్లు కాదు అని అర్థం.

## భాష్యమ్

నను ప్రష్టవ్యభేదాదపూర్వోఽయం ప్రశ్నో భవితుమర్హతి. పూర్వో హి ప్రశ్నో జీవవిషయః "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే" "అస్తి నాస్తి" ఇతి

విచికిత్సాభిధానాత్. జీవశ్చ ధర్మాదిగోచరత్వాత్ నాన్యత్ర ధర్మాదితి ప్రశ్న మర్హతి. ప్రాజ్ఞస్తు ధర్మాద్యతీతత్వాత్ అన్యత్ర ధర్మాదితి ప్రశ్నమర్హతీతి. ప్రశ్నచ్ఛాయా చ న సమానా లక్ష్యతే, పూర్వస్యాస్తిత్వనాస్తిత్వవిషయత్వా దుత్తరస్య ధర్మాద్యతీతవస్తువిషయత్వాత్. తస్మాత్ప్రత్యభిజ్ఞానా భావాత్ప్రశ్నభేదః, న పూర్వస్యైవోత్తరత్రానుకర్షణమితి చేత్-న; జీవప్రాజ్ఞయోరేకత్వాభ్యుపగమాత్. భవే త్ప్రష్టవ్యభేదాత్ప్రశ్నభేదో యద్యన్యో జీవః ప్రాజ్ఞాత్స్యాత్. న త్వన్యత్వమస్తి, "తత్త్వమసి" ఇతి శ్రుత్యన్తరేభ్యః. ఇహ చాన్యత్ర ధర్మాదిత్యస్య ప్రశ్నస్య ప్రతివచనం "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" ఇతి జన్మమరణప్రతిషేధేన ప్రతిపాద్యమానం శారీరపరమేశ్వరయోరభేదం దర్శయతి. సతి హి ప్రసంగే ప్రతిషేధో భాగీ భవతి. ప్రసఙ్గశ్చ జన్మమరణయోః శరీరసంస్పర్శాచ్ఛారీరస్య భవతి, న పరమేశ్వరస్య.

### బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) అడగబడేదాని భేదాన్ని పట్టి ప్రశ్న కూడ క్రొత్తది అవాలి. "మనిషి మరణించి నప్పుడు ఉంటాడా ఉండడా అని ఏ విచికిత్స ఉన్నదో"- అని అంటూ విచికిత్సను (సంశయాన్ని) చెప్పడంవల్ల వెనుకటి ప్రశ్న జీవుని గూర్చినది. జీవుడు ధర్మాదిగోచరుడే గాన "అన్యత్ర ధర్మాత్" అనే ప్రశ్నకు తగినవాడు కాదు. ప్రాజ్ఞుడైతే ధర్మాద్యతీతుడు గాన "అన్యత్ర ధర్మాత్" ఇత్యాదిప్రశ్నకు అర్హుడు. ప్రశ్నయొక్క ఛాయ కూడ సమానంగా లేదు; వెనుకటి ప్రశ్న అస్తిత్వానికి, నాస్తిత్వానికీ సంబంధించినది; తరువాతది ధర్మాదులకు అతీతమైన వస్తువును గూర్చినది. అందువల్ల ప్రత్యభిజ్ఞానం లేకపోవడంవల్ల, అనగా ఈ ప్రశ్నకూ ఆ ప్రశ్నకూ పోలిక లేకపోవడంవల్ల, వేరు వేరు ప్రశ్నలే కాని వెనుకటి ప్రశ్ననే ముందుకు లాగడం అనేది లేదు అన్న ట్లయితే (సమాధానం)- అది కాదు. ఎందువల్ల ననగా జీవునకు ప్రాజ్ఞునకు అభేదం అంగీకరింపబడింది. జీవుడు ప్రాజ్ఞునికంటె భిన్ను డైతే అడగబడేదాని భేదాన్ని పట్టి ప్రశ్నకు భేదం ఉండేది. "తత్త్వమసి" ఇత్యాదులైన ఇతరశ్రుతలను బట్టి జీవప్రాజ్ఞులకు భేదం లేదు. ఇక్కడ కూడ "అన్యత్ర ధర్మాత్" అనేదానికి ఇచ్చిన "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" అనే ప్రతివచనం జన్మమరణప్రతిషేధం చేస్తూ చెప్పబడడంచేత శారీరపరమేశ్వరులకు అభేదాన్ని చూపుతున్నది. ప్రసంగం ఉన్నప్పుడే నిషేధం యుక్తంగా ఉంటుంది. జన్మ-మరణాల ప్రసంగం శారీరసంబంధం ఉండడంవల శారీరునికి ఉంటుంది కానీ పరమేశ్వరునికి ఉండదు.

## భాష్యమ్

తథా- "స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి.
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి" (క.ఉ.2.4.4) ఇతి స్వప్నజాగరి తదృశో జీవస్యైవ మహత్త్వవిభుత్వవిశేషణస్య మననేన శోకవిచ్ఛేదం దర్శయన్ న ప్రాజ్ఞాదన్యో జీవ ఇతి దర్శయతి. ప్రాజ్ఞవిజ్ఞానాద్ధి శోకవిచ్ఛేద ఇతి వేదాన్తసిద్ధాన్తః. తథాగ్రే-

"యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ,
మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (క.ఉ.2.4.10)

ఇతి జీవప్రాజ్ఞభేదదృష్టిమపవదతి. తథా జీవవిషయస్యాస్తిత్వనాస్తిత్వ ప్రశ్నస్యానన్తరమ్ "అన్యం వరం నచికేతో వృణీష్వ" ఇత్యారభ్య మృత్యునా తైస్తైః కామైః ప్రలోభ్యమానోఽపి నచికేతా యదా న చచాల, తదైనం మృత్యురభ్యుదయనిఃశ్రేయస విభాగ ప్రదర్శనేన, విద్యావిద్యా విభాగ ప్రదర్శనేన చ "విద్యాభీప్సినం నచికేతసం మన్యే న త్వా కామా బహవోఽలోలుపన్త" (క.ఉ.1.2.4) ఇతి ప్రశస్య ప్రశ్నమపి తదీయం ప్రశంసన్యదువాచ-

"తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్.
అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి"
(క.ఉ.1.2.12) ఇతి, తేనాపి జీవప్రాజ్ఞయోరభేద ఏవేహ వివక్షిత ఇతి గమ్యతే. యత్ప్రశ్ననిమిత్తాం చ ప్రశంసాం మహతీం మృత్యోః ప్రత్యపద్యత నచికేతాః యది తం విహాయ ప్రశంసానన్తరమన్యమేవ ప్రశ్నముపక్షిపేదస్థాన ఏవ సా సర్వా ప్రశంసా ప్రసారితా స్యాత్; తస్మాత్ "యేయం ప్రేతే" ఇత్యస్యైవ ప్రశ్న స్యైతదనుకర్షణమ్ "అన్యత్ర ధర్మాత్" ఇతి. యత్తు ప్రశ్నచ్ఛాయావైలక్షణ్య ముక్తం తదదూషణమ్, తదీయస్యైవ ప్రశ్నస్య పునః పృచ్ఛ్యమానత్వాత్. పూర్వత్ర హి దేహాదివ్యతిరిక్తస్యాత్మనోఽస్తిత్వం పృష్టమ్, ఉత్తరత్ర తు తస్యైవాసంసారిత్వం పృచ్ఛ్యతే ఇతి.

## బాలానందిని

తథేతి:- అట్లే- "స్వప్నాన్తం...న శోచతి" (ధీరుడైన ప్రమాత, తెలుసుకొనేవాడు, (సాక్షియైన) ఏ ఆత్మచేత స్వప్నావస్థను, జాగ్రదవస్థను చూస్తాడో అతడు గొప్పది, సర్వవ్యాప్తమూ అయిన ఆత్మను తెలుసుకొని దుఃఖించడు- తెలుసుకొన్న తరవాత ఏ దుఃఖమూ పొందడు) అని స్వప్న జాగ్రదవస్థలను చూచే జీవునికే మహత్త్వం, విభుత్వం అనే విశేషణాలు ఉపయోగించి మననంచేత శోకం నశిస్తుం దని చూపుతూ జీవుడు ప్రాజ్ఞునికంటె భిన్నుడు కాడు అని చూపుతున్నాడు. ప్రాజ్ఞుని విజ్ఞానంవల్లనే శోకం నశిస్తుంది అని వేదాంతసిద్ధాంతం. అట్లే తరవాత కూడ- "యదేవేహ... పశ్యతి" (ఈ దేహంలో ఏ చైతన్యం ఉన్నదో అదే అక్కడ (సూర్యాదులలో) కూడ ఉంది. అక్కడ ఏది ఉందో అదే ఇక్కడ ఉంది. దీనియందు అనగా అఖండైకరసమైన బ్రహ్మయందు ఎవ డైతే భేదం ఉన్నట్లు చూస్తాడో మృత్యువునుండి మృత్యువును పొందుతాడు-సంసారచక్రంలో పరిభ్రమిస్తూ ఉంటాడు) అని జీవప్రాజ్ఞుల విషయంలో భేదదృష్టిని నిరాకరిస్తున్నాడు. అట్లే జీవునికి సంబంధించిన అస్తిత్వనాస్తిత్వప్రశ్న తరవాత "అన్యం వరం నచికేతో వృణీష్వ" (ఈ వరం కాక మరొక వరం ఏదైనా, ఓ! నచికేతుడా! కోరుకో) అని ప్రారంభించి మృత్యువు ఆ యా కామాలను చూపి ప్రలోభ పెట్టినా కూడ నచికేతు డెప్పుడు చలించలేదో అప్పుడు మృత్యువు అభ్యుదయం (ఐహికపారలౌకికసుఖాదికం) నిఃశ్రేయసం (మోక్షం) అనే భేదాన్ని చూపి, విద్య అవిద్య అనే విభాగాన్ని కూడ చూపి "విద్యాభీప్సినం..అలోలుపన్త" (నచికేతుడు (నీవు) విద్యనే కోరుకొంటున్నావు, నిన్ను అనేకమైన కామా లేవీ ఆకర్షించలేదు) అని అంటూ నచికేతుని ప్రశంసించి అతడు అడిగిన ప్రశ్నను కూడ ప్రశంసిస్తూ "తం... జహాతి" అని చెప్పినదానిచేత కూడ ఇక్కడ చెప్పదలచినది జీవప్రాజ్ఞాభేదమే అని తెలుస్తూన్నది. ఏ ప్రశ్న అడిగినందుకు నచికేతుడు గొప్ప ప్రశంసను పొందాడో ఆ ప్రశ్నను విడిచి, ప్రశంస తరవాత మరొక ప్రశ్నను ప్రవేశపెడితే ఆ ప్రశంస అంతా అస్థానంలోనే (అనవసరంగా) చేసిన ట్లవుతుంది. అందువల్ల "అన్యత్ర ధర్మాత్" అనేది "యేయం ప్రేతే" అనే ప్రశ్నయొక్క అనుకర్షణమే (ముందుకు లాగడమే). ప్రశ్నచ్ఛాయలో వైలక్షణ్యం (తేడా) ఉంది అని చెప్పినది దోషం కాదు. ఎందువల్ల ననగా మొదటి ప్రశ్నకే సంబంధించిన ఒక విశేషం మళ్లీ ప్రశ్నింపబడుతూన్నది. వెనక దేహాదివ్యతిరిక్తమైన ఆత్మ ఉన్నదా లేదా అని ప్రశ్నించబడింది, తరవాత ఆ ఆత్మకే సంబంధించిన అసంసారిత్వం ప్రశ్నించబడుతున్నది.

## భాష్యమ్

యావద్ధ్యవిద్యా న నివర్తతే తావద్ధర్మాదిగోచరత్వం జీవస్య జీవత్వం చ న నివర్తతే. తన్నివృత్తౌ తు ప్రాజ్ఞ ఏవ "తత్త్వమసి" ఇతి శ్రుత్యా ప్రత్యాయ్యతే. న చా విద్యావత్త్వే తదపగమే చ వస్తునః కశ్చిద్విశేఽషోస్తి. యథా కశ్చిత్సం తమసే పతితాం కాం చిద్రజ్జుమహిం మన్యమానః, తతో భీతః వేపమానః పలాయతే, తం చాపరో బ్రూయాత్ మా భైషీర్నాయమహీ రజ్జురేవేతి, స చ తదుపశ్రుత్యాహికృతం భయముత్సృచేత్ వేపథుం పలాయనం చ, న త్వహిబుద్ధికాలే తదపగమకాలే చ వస్తునః కశ్చిద్విశేషః స్యాత్ తథైవేదమపి ద్రష్టవ్యమ్. తతశ్చ "న జాయతే మ్రియతే వా" ఇత్యేవమాద్యపి భవత్యస్తిత్వప్రశ్నస్య ప్రతివచనమ్. సూత్రం త్వవిద్యాకల్పితజీవ ప్రాజ్ఞభేదాపేక్షయా యోజయితవ్యమ్. ఏకత్వేఽపి హ్యాత్మవిషయస్య ప్రశ్నస్య ప్రాయణావస్థాయాం దేహవ్యతిరిక్తాస్తిత్వమా త్రవిచికిత్సనాత్, కర్తృత్వాదిసంసారస్వభావానపోహనాచ్చ పూర్వస్య పర్యాయస్యజీవ విషయత్వముత్ప్రేక్ష్యతే. ఉత్తరస్య తు ధర్మాద్యత్యయసంకీర్తనాత్ ప్రాజ్ఞ విషయత్వమితి. తతశ్చ యుక్తాగ్ని జీవపరమాత్మకల్పనా. ప్రధానకల్పనాయాం తు న వరప్రదానమ్, న ప్రశ్నో న ప్రతివచనమితి వైషమ్యమ్.6.

## బాలానందిని

యావదితి:- అవిద్య నివర్తించనంతవరకు జీవుని జీవత్వం, ధర్మాదిగోచరత్వమూ కూడ నివర్తించదు. అవిద్య నివర్తించగానే "తత్త్వమసి" అనే శ్రుతిచేత జీవుడు నీవే ప్రాజ్ఞుడవు అని బోధింపబడుతున్నాడు. అవిద్య ఉన్నా, అది తొలగినా కూడ వస్తువులో విశేషం ఏదీ లేదు. ఉదాహరణకి- ఒకడు చీకట్లో పడి ఉన్న త్రాడును చూచి పాము అనుకొని, భయపడి, వణకుతూ పారిపోతాడు. అప్పుడు మరొకడు అది చూచి ఇది సర్పం కాదు, త్రాడే, భయపడకు అని చెపుతాడు. అప్పుడు అతడు ఆ మాట విని భయం వణకూ విడచి పారిపోకుండా ఉంటాడు. సర్పం అనుకొన్న సమయంలో కాని, ఆ సర్పభ్రాంతి పోయినప్పుడు కాని అక్కడున్న వస్తువుకు (త్రాడుకు) విశేషం ఏదీ లేదు కదా? ఇది కూడ అట్లే అని గ్రహించాలి. అందుచేత "న జాయతే మ్రియతే" ఇత్యాదికం కూడ అస్తిత్వప్రశ్నకు ప్రతివచనం అవుతుంది. సూత్రమైతే

అవిద్యాకల్పిత మైన జీవప్రాజ్ఞ భేదాన్ని పట్టి సమన్వయించుకోవాలి. అనగా వాస్తంలో ఇక్కడ మూడు ప్రశ్నలు లేకపోయినా కాల్పనికమైన జీవప్రాజ్ఞభేదాన్ని దృష్టిలో ఉంచుకొని సూత్రకారుడు మూడు ప్రశ్న లున్నట్లు చెప్పాడు అని సమాధానం చెప్పుకోవాలి అని అర్థం. ఆత్మను గూర్చిన ప్రశ్న ఒక్కటే అయినా- మరణసమయంలో దేహంకంటె భిన్నంగా ఆత్మ ఉన్నదా లేదా అని మాత్రమే సందేహం చూపడంవల్ల కర్తృత్వం మొదలైన సంసారస్వభావాన్ని తొలగించకపోవడంవల్ల, అనగా కర్తృత్వాదికం లేదని చెప్పకపోవడంవల్ల, మొదటి పర్యాయం జీవుణ్ణి గూర్చిన దని ఊహించబడు తున్నది. రెండవ పర్యాయమైతే, ధర్మాద్యతీత్వాన్ని చెప్పడం వల్ల, ప్రాజ్ఞుణ్ణి గూర్చిన దని ఊహించబడుతున్నది. అందుచేత అగ్ని-జీవ-పరమాత్మ కల్పన యుక్తమే. ప్రధానాన్ని కల్పించడానికి మాత్రం వరప్రదానమూ లేదు, ప్రశ్నా లేదు, ప్రతివచనమూ లేదు అని వైషమ్యం (తేడా).6.

## సూ. మహద్వచ్చ.1.4.7

యథా మహచ్ఛబ్దః సాంఖ్యైః సత్తామాత్రేఽపి ప్రథమజే ప్రయుక్తో న తమేవ వైదికేఽపి ప్రయోగేఽభిధత్తే. "బుద్ధేరాత్మా మహాన్పరః" (క.ఉ.1.3.10) "మహాన్తం విభుమాత్మానమ్" (క.ఉ.1.2.22), "వేదాహమేతం పురుషం మహాన్తమ్" (శ్వే.ఉ.3.8) ఇత్యేవమాదౌ ఆత్మశబ్దప్రయోగాదిభ్యో హేతుభ్యః, తథావ్యక్తశబ్దోఽపి న వైదికే ప్రయోగే ప్రధానమభిధాతుమర్హతి. అతశ్చ నాస్త్యానుమానికస్య శబ్దవత్త్వమ్.7.

### బాలానందిని

మహద్వదితి:- "మహద్వచ్చ= 'మహత్' అనే పదం ఏ విధంగా ఉపనిషత్తు లలో సాంఖ్యులు అంగీకరించిన మహత్తును బోధించదో అట్లే అవ్యక్తపదం ప్రధానాన్ని బోధించదు" అని సూత్రార్థం.

యథేతి:- సత్త్వప్రధానమైన ప్రధానంనుండి మొట్టమొదట పుట్టిన సత్తామాత్రం, అనగా నిర్వకల్పకబుద్ధి, అనే అర్థంలో మహచ్ఛబ్దాన్ని సాంఖ్యులు అంగీకరించినా ఆ పదం "బుద్ధేరాత్మా మహాన్ పరః" "మహాన్తం విభుమాత్మానమ్", "వేదాహమేతం పురుషం మహాన్తమ్" ఇత్యాదివైదికప్రయోగాలలో, ఆత్మశబ్దాన్ని ప్రయోగించడం మొదలైన కారణాలచేత (అనగా ఆ మహత్ ఆత్మ అని చెప్పడంచేత) ఏ విధంగా ఆ అర్థంలో గ్రహించబడదో) అట్లే అవ్యక్తశబ్దం కూడ వైదిక ప్రయోగంలో

ప్రధానాన్ని చెప్పజాలదు. అందువల్ల కూడ అనుమానికానికి (ప్రధానానికి) శబ్దవత్త్వం లేదు.7.

### అనుమానికాధికరణం సమాప్తం

## 2. చమసాధికరణమ్. సూ.8 - 10

## సూ. చమసవదవిశేషాత్. 1.4.8

పునరపి ప్రధానవాదీ అశబ్దత్వం ప్రధానస్యాసిద్ధమిత్యాహ; కస్మాత్? మన్త్రవర్ణాత్.

**"అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః,**

**అజో హ్యేకో జుషమాణోఽ నుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః".** (శ్వే.ఉ.4.5) ఇతి. అత్ర హి మన్త్రే లోహితశుక్లకృష్ణశబ్దైః రజః సత్త్వతమాంస్యభిధీయన్తే. లోహితం రజో రఞ్జనాత్మకత్వాత్; శుక్లం సత్త్వం ప్రకాశాత్మకత్వాత్. కృష్ణం తమః ఆవరణాత్మకత్వాత్. తేషాం సామ్యావస్థా అవయవధర్మైర్వ్యపదిశ్యతే లోహితశుక్లకృష్ణేతి. న జాయత ఇత్యజా స్యాత్; "మూలప్రకృతిరవికృతిః" ఇత్యభ్యుపగమాత్. నన్వజాశబ్దశ్ఛాగాయాం రూఢః? బాఢమ్. సా తు రూఢిరిహాశ్రయితుం న శక్యా, విద్యాప్రకరణాత్. సా చ బహ్వీః ప్రజాః త్రైగుణ్యాన్వితాః జనయతి. తాం ప్రకృతిమజ ఏకః పురుషో జుషమాణః ప్రీయమాణః సేవమానో వానుశేతే. తామేవావిద్యయాత్మత్వే నోపగమ్య సుఖీ దుఃఖీ, మూఢోఽ హమిత్యవివేకితయా సంసరతి. అన్యః పునరజః పురుషః ఉత్పన్నవివేకజ్ఞానో విరక్తో జహాత్యేనాం ప్రకృతాం భుక్తభోగాం కృతభోగాపవర్గాం పరిత్యజతి, ముచ్యత ఇత్యర్థః. తస్మాచ్ఛ్రుతిమూలైవ ప్రధానాదికల్పనా కాపిలానామితి.

### బాలానందిని

చమసేతి:- "చమసవత్=చమసశబ్దంవలె, అవిశేషాత్= ఈ అర్థమే చెప్పాలనే విశేషం లేకపోవడంచేత, అజాశబ్దం ప్రధానవాచకం కాదు" అని సూత్రార్థం.

పునరితి- ప్రధానకారణవాది మళ్లీ ప్రధానం అశబ్దం అని చెప్పడం అసిద్ధం అని అంటున్నాడు. ఎందువల్ల? "అజామ్... అన్యః" అనే మంత్రవర్ణంవల్ల. రక్త-శుక్ల-

కృష్ణవర్ణాలు గలది, తనతో సమానమైన రూపాలు గల చాలా ప్రజలను (సంతానాన్ని) సృష్టిస్తూన్నది అయిన అజను ఒక అజం అనుభవిస్తూ దానిని అనుసరించి శయనించి ఉంది; అనుభవించబడిన భోగం గల దీనిని మరొక అజం విడిచి పెట్టుచున్నది" అని దీని అర్థం. ఈ మంత్రంలో లోహితశుక్లకృష్ణశబ్దాలచేత రజఃసత్త్వతమోగుణాలు చెప్పబడుతున్నాయి. రంజింపచేసే స్వభావం కల దవడంచేత రజస్సు ఎరుపు. ప్రకాశస్వరూపం గాన సత్త్వం తెలుపు. ఆవరించేది గాన తమోగుణం నలుపు. ఈ మూడు గుణాల సామ్యావస్థ అవయవధర్మాలచేత లోహిత-శుక్ల-కృష్ణా అని చెప్పబడుతున్నది. "న జాయతే ఇతి అజా" అనే వ్యుత్పత్తిచేత పుట్టనిది కాబట్టి ప్రధానం అజ. "మూలప్రకృతి దేనినుండీ పుట్టదు" అని అంగీకరించబడింది కదా? 'అజా' శబ్దానికి మేక అనే అర్థంలో రూఢి ఉంది కదా? నిజమే ఉంది. కాని ఆ రూఢి, ఇది విద్యాప్రకరణం అవడంచేత ఇక్కడ ఆశ్రయించడానికి కుదరదు. అది మూడు గుణాలతో కూడిన అనేకప్రజలను (సంతానాన్ని) పుట్టిస్తుంది (కంటుంది). ఆ ప్రకృతిని ఒక అజుడు అనగా పురుషుడు సంతోషిస్తూ లేదా సేవిస్తూ, అనుశేతే= అవిద్యచేత అదే తన ఆత్మ అని అనుకొని పొంది, అవివేకవంతు డవడంచేత సుఖవంతుడను, దుఃఖవంతుడను, మూఢుడను అని అనుకొంటూ (ఇవి మూడు గుణాల ధర్మాలు) సంసారంలో పడి ఉంటాడు. మరొక అజు డైతే, అనగా పురుషుడైతే వివేకజ్ఞానం కలిగి, విరక్తుడై, భుక్తభోగామ్=భోగమోక్షాలను తనకు కల్పించిన ఈ ప్రకృతిని, జహాతి=విడిచిపెడతాడు. అనగా ముక్తుడవుతాడు అని అర్థం. అందువల్ల కపిలుని మతం అనుసరించేవాళ్లు చేసే ప్రధానాదికల్పన శ్రుతిమూలకమే.

వి. ఇక్కడ అజాపదం విషయం. దీనికి రూఢ్యర్థం కుదరదు గాన ఇక్కడ అర్థం ప్రధానమా మాయయా అని సంశయం. పూర్వాధికరణంలో అవ్యక్తశబ్దమాత్రం చేత ప్రధానాన్ని గుర్తించడానికి వీలులేకపోయినా కూడ ఇక్కడ త్రిగుణాలు మొదలైన లింగంవల్ల దీని అర్థం ప్రధానమే అని ప్రత్యుదాహరణ సంగతి. బ్రహ్మణి సమన్వయం కుదరక పోవడం పూర్వపక్షంలో ఫలం. అది కుదరడం సిద్ధాంతంలో ఫలం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- నానేన మన్త్రేణ శ్రుతిమత్త్వం సాంఖ్యవాదస్య శక్యమాశ్రయితుమ్. న హ్యయం మన్త్రః స్వతన్త్రేణ కంచిదపి వాదం సమర్థయితుముత్సహతే. సర్వత్రాపి యయా కయా చిద్విధయా అజాది సంపాదనోపపత్తేః, సాంఖ్యవాదఏవేహాభిప్రేతఇతి విశేషావధారణకారణాభావాత్. చమసవత్; యథా హి- "అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః" (బృ.ఉ.2.2.3)

ఇత్యస్మిన్ మన్త్రే స్వాతన్త్ర్యే ణాయం నామాసౌ చమసోఽభిప్రేత ఇతి న శక్యతే నిరూపయితుమ్, సర్వత్రాపి యథా కథంచిదర్వాగ్బిలత్వాదికల్పనోపపత్తేః. ఏవమిహాప్యవిశేషోఽజామేకామిత్యస్య మన్త్రస్య. నాస్మిన్ మన్త్రే ప్రధానమేవా జాభిప్రేతేతి శక్యతే నియన్తుమ్.8.

బాలానందిని

ఏవమితి :- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం- సాంఖ్యవాదానికి శ్రుతి ప్రామాణ్యం ఉందని ఈ మంత్రంచేత చెప్పడానికి శక్యం కాదు. ఈ మంత్రం స్వతంత్రంగా (ప్రకరణాద్యపేక్ష లేకుండా) ఏ వాదాన్నీ సమర్థించజాలదు. ఏదో విధంగా అజాత్వాదులను ప్రతీవుస్తువకు కల్పించవచ్చును గాన ఇక్కడ సాంఖ్యవాదమే ఇష్ట మైన దని నిర్ణయించడానికి విశేషకారణం ఏదీ లేదు. చమస వలె. "అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః" (క్రింద రంధ్రమూ పైన మట్టూ ఉన్న చంమసం) అనే వాక్యంలో చమసం అంటే ఇక్కడ చెప్పదలచినది ఇది అని స్వతంత్రంగా నిర్ణయించడం కుదరదు; అర్వాగ్బిలత్వాదికల్పన ఏదో విధంగా ప్రతివస్తువులోను చేయవచ్చును కదా? ఇట్లే ఇక్కడ కూడ 'అజామేకామ్' అనే మంత్రంలో విశేషం (అజాశబ్దానికి ఈ అర్థమే చెప్పాలి అని నిర్ణయించగల విశేషం) లేదు. అందుచేత ఈ మంత్రంలో అజా అనే పదంచేత ప్రధానమే ఉద్దిష్ట మైనది అని నియమించడం శక్యం కాదు.8.

భాష్యమ్

తత్ర తు— "ఇదం తచ్ఛిర ఏష హ్యర్వాఙ్బిలశ్చమసః ఊర్ధ్వబుధ్నః ఇతి వాక్యశేషాత్ చమసవిశేషప్రతిపత్తిర్భవతి, ఇహ పునః కేయమజా ప్రతిపత్తవ్యా ఇతి- అత్ర బ్రూమః-

## సూ. జ్యోతిరుపక్రమా తు తథా హ్యధీయత ఏకే 1.4.9

పరమేశ్వరాదుత్పన్నా జ్యోతిఃప్రముఖా తేజోబన్నలక్షణా చతుర్విధస్య భూతగ్రామస్య ప్రకృతిభూతేయమజా ప్రతిపత్తవ్యా. తు శబ్దోఽవధారణార్థః. భూతత్రయలక్షణైవేయమజా విజ్ఞేయా న గుణత్రయలక్షణా. కస్మాత్? తథా హ్యేకే శాఖినః తేజోబన్నానాం పరమేశ్వరాదుత్పత్తిమామ్నాయ తేషామేవ రోహితాదిరూపతామామనన్తి- "యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం, యత్కృష్ణం తదన్నస్య"

(ఛా.ఉ.6.4.1)ఇతి. తాన్యేవేహ తేజోబన్నాని ప్రత్యభిజ్ఞాయన్తే రోహితాది శబ్దసామాన్యాత్. రోహితాదీనాం చ శబ్దానాం రూపవిశేషేషు ముఖ్యత్వాత్, భాక్తత్వాచ్చ గుణవిషయత్వస్య. అసందిగ్ధేన చ సందిగ్ధస్య నిగమనం న్యాయ్యం మన్యన్తే. తథా ఇహాపి "బ్రహ్మవాదినో వదన్తి, కిం కారణం బ్రహ్మ" (శ్వే.ఉ.1.1) ఇత్యుపక్రమ్య "తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్'' (శ్వే.ఉ.1.3) ఇతి పారమేశ్వర్యాః శక్తేః సమస్తజగద్విధాయిన్యాః వాక్యోపక్రమేఽవగమాత్. వాక్యశేషేఽపి "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" ఇతి. "యో యోనిం యోనిమధితిష్ఠత్యేకః" (శ్వే 4.10.11) ఇతి చ తస్యా ఏవావగమాన్న స్వతన్త్రా కా చిత్ప్రకృతిః ప్రధానం నామాజామన్త్రేణామ్నాయత ఇతి శక్యతే వక్తుమ్. ప్రకరణాత్తు సైవ దైవీ శక్తిరవ్యాకృతనామరూపా నామరూపయోః ప్రాగవస్థాఽనేనాపి మన్త్రేణామ్నాయతే ఇత్యుచ్యతే. తస్యాశ్చ స్వవికారవిషయేణ త్రైరూప్యేణ త్రైరూప్యముక్తమ్.9.

## బాలానందిని

జ్యోతిరితి:- ''జ్యోతిరుపక్రమా తు=తేజస్సుతో ప్రారంభమైన అనగా తేజోబన్నరూపమైన ప్రకృతి అజగా గ్రహించ దగినది. ఏకే=ఒక శాఖవారు, తథా=అట్లు, అధీయతే హి=చదువుచున్నారు కదా అని సూత్రార్థం.

పరమేశ్వరాదితి:- ఈ అజ పరమేశ్వరునినుండి పుట్టినది, జ్యోతిస్సు ప్రారంభంలో గలది, తేజస్సు, ఉదకం, అన్నం (భూమి) లక్షణంగా గలది అయిన నాలుగు విధాలైన, అనగా జరాయుజ- అండజ-స్వేదజ- ఉద్భిజ్జము లైన, ప్రాణిసముదాయానికి ప్రకృతిగా తెలియదగినది. తు శబ్దం నిశ్చయార్థకం. అనగా ఈ అజ భూతత్రయరూప మైనదే గాని గుణత్రయరూప మైనది కాదు. ఎందువల్ల? కొన్ని శాఖలకు చెందినవారు తేజోబన్నాలకు పరమేశ్వరునినుండి ఉత్పత్తిని చెప్పి వాటికే "యదగ్నే... తదన్నస్య' (ఎఱ్ఱగా ఉన్నది అగ్నియొక్క రూపం, తెల్లగా ఉన్నది జలంయొక్క రూపం, నల్లగా ఉన్నది భూమియొక్క రూపం) అని ఎరుపు మొదలైన రూపా లున్నట్లు చెపుతున్నారు. ఇక్కడ రోహితాదిశబ్దాల పోలికను బట్టి ఆ తేజోబన్నాలే గ్రహించబడుతున్నాయి. రోహితాదిశబ్దాలకు ఎరుపు మొదలైన అర్థాలు ముఖ్యార్థాలు, రజఃసత్త్వాదిగుణా లనే అర్థాలు గౌణాలు. ఏ పదాల అర్థం విషయంలో సందేహం

లేదో వాటి సహాయంచేత సందేహంగా ఉన్న పదాల అర్థాలు నిర్ణయించడం యుక్తం అని అంటారు. ఇక్కడ కూడ "బ్రహ్మవాదినో... బ్రహ్మ" (బ్రహ్మవాదులు అంటున్నారు- బ్రహ్మకు సృష్టి ప్రారంభంలో ఏది సహాయంగా ఉండేది) అని ఉపక్రమించబడింది. "తే... ని గూఢమ్" (వాళ్లు ధ్యానయోగంచేత పరమాత్మలో ప్రవేశించి తన సత్త్వాదిగుణాలతో కూడినదీ నిగూఢంగా ఉన్నదీ అయిన పరమేశ్వరుని స్వీయ శక్తిని చూచారు) అని సమస్తజగత్తును సృష్టించిన పరమేశ్వరశక్తి వాక్యప్రారంభంలో తెలుస్తూన్నది. వాక్యశేషంలో కూడ "మాయాం... మహేశ్వరమ్" అని, "యో యోనిం...ఏకః" (ఏ ఆత్మ సర్వప్రాణికారణ మైన ప్రతీ అవిద్యాంశాన్నీ అధిష్ఠించి ఉంటాడో) అనీ ఆ ప్రకృతియే తెలియడంవల్ల అజామంత్రంచేత స్వతంత్రమైన ప్రకృతీ మూలకారణమూ అయిన ప్రధానం అనేది ఏదో ప్రతిపాదింపబడుచున్న దని చెప్పడానికి శక్యం కాదు. ప్రకరణాన్నిపట్టి అయితే అవ్యాకృతనామరూపాలుగల, నామరూపాల ప్రాగవస్థారూపమైన (పైన చెప్పిన) ఆ పరమేశ్వరశక్తియే ఈ మంత్రంచేత నిర్దేశించబడుతున్న దని చెప్పబడుతున్నది (చెపుతున్నాం). దాని వికారాల (కార్యాల)కు సంబంధించిన త్రైరూప్యంచేత (మూడు రూపాలచేత) దానికి కూడ మూడు రూపా లున్నట్లు చెప్పబడింది. 9.

## భాష్యమ్

కథం పునస్తేజోబన్నానాం త్రైరూప్యేణ త్రిరూపాజా ప్రతిపత్తుం శక్యతే, యావతా న తావత్తేజోబన్నేష్వజాకృతిరస్తి, న చ తేజోబన్నానాం జాతిశ్రవణాదజాతినిమిత్తోఽప్యజాశబ్దః సంభవతీతి. అత ఉత్తరం పఠతి-

### సూ. కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః. 1.4.10.

నాయమజాకృతినిమిత్తోఽజాశబ్దః, నాపి యౌగికః. కిం తర్హి? కల్పనోపదేశోఽయమ్; అజారూపకక్లప్తిః తేజోబన్నలక్షణాయాశ్చరాచరయోనేః ఉపదిశ్యతే. యథా హి లోకే యదృచ్ఛయా కాచిదజా రోహిత శుక్లకృష్ణవర్ణా స్యాద్బహుబర్కరా సరూపబర్కరా చ, తాం చ కశ్చిదజో జుషమాణోఽనుశయీత, కశ్చిదేనాం భుక్తభోగాం జహ్యాత్, ఏవమియమపి తేజోబన్నలక్షణా భూతప్రకృతి స్త్రివర్ణా బహు సరూపం చరాచరలక్షణం వికారజాతం జనయతి; అవిదుషా చ క్షేత్రజ్ఞేనోపభుజ్యతే, విదుషా చ పరిత్యజ్యత ఇతి. న చేదమాశఙ్కితవ్యమ్- ఏకః క్షేత్రజ్ఞోఽనుశేతేఽన్యో జహాతీత్యతః క్షేత్రజ్ఞభేదః పారమార్థికః పరేషామిష్టః

ప్రాప్నోతి- ఇతి. న హీయం క్షేత్రజ్ఞభేదప్రతిపిపాదయిషా, కిం తు బన్ధమోక్ష వ్యవస్థాప్రతిపిపాదయిషైవైషా. ప్రసిద్ధం తు భేదమనూద్య బన్ధమోక్షవ్యవస్థా ప్రతిపాద్యతే. భేదస్తూపాధినిమిత్తో మిథ్యాజ్ఞానకల్పితో న పారమార్థికః- "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా" ఇత్యాదిశ్రుతిభ్యః. మధ్వాదివత్. యథా ఆదిత్యస్య అమధునో మధుత్వమ్ (ఛా.ఉ.3.1), వాచశ్చాధేనోర్ధేనుత్వమ్ (బృ.ఉ.5.8) ద్యులోకాదీనాం చానగ్నీనామగ్నిత్వమ్ (బృ.ఉ.8.2.9) ఇత్యేవంజాతీయకం కల్ప్యతే ఏవమిదమనజాయా అజాత్వం కల్ప్యత ఇత్యర్థః. తస్మాదవిరోధస్తేజోబన్నేష్వజాశబ్దప్రయోగస్య.10.

బాలానందిని

కల్పనేతి:- "కల్పనోపదేశాచ్చ= అజాత్వకల్పనను ఉపదేశించడంవల్ల, మధ్వాదివత్= సూర్యాదులందు మధుత్వాదికల్పనలలో వలె, అవిరోధః=విరోధం లేదు" అని సూత్రార్థం.

నాయమితి:- ఈ అజాశబ్దం మేక ఆకారం వంటి ఆకారం ఉండడంవల్ల ప్రయోగించబడలేదు- "న జాయతే ఇతి అజా" అని యౌగికం కూడ కాదు. మరేమనగా- ఇది కల్పనయొక్క ఉపదేశం. తేజోఽన్నలక్షణమైన చరాచరకారణమైన (దైవశక్తికి) అజాత్వం యొక్క ఆరోపం చెప్పబడుచున్నది. లోకంలో ఒక ఆడమేక దైవవశంచేత రోహిత-శుక్ల-కృష్ణవర్ణాలు కలదై చాలా పిల్లలు కలది గాను, తనతో సమానమైన రూపం గల పిల్లలు కలదిగాను ఉండవచ్చును. దానిని ఒక అజం సేవిస్తూ దానితో ఉండవచ్చును. మరొక మేక దానిని అనుభవించి విడిచివేయవచ్చును. అదే విధంగా తేజోబన్నలక్షణమైన ఈ భూతప్రకృతి కూడ మూడు వర్ణాలు కలదై అత్యధికసంఖ్యాక మైన, తనతో సమానమైన, చరాచరరూపమైన కార్యసముదాయాన్ని పుట్టిస్తుంది. విద్వాంసుడు కాని జీవుడు దానిని అనుసరించి ఉంటాడు. విద్వాంసుడు (జ్ఞాని) విడిచివేస్తాడు. ఒక జీవుడు అనుసరించి ఉంటాడు, మరొకడు విడిచివేస్తాడు అని చెపితే పరులకు ఇష్టమైన జీవుల భేదం పారమార్థికం అనేదాన్ని అంగీకరించిన ట్లవుతుంది కదా అని ఆశంకించవలసిన పని లేదు. ఇది క్షేత్రజ్ఞుల భేదాన్ని ప్రతిపాదించా లనే ఉద్దేశం కాదు; మరేమనగా బంధమోక్షాల వ్యవస్థను ప్రతిపాదించా లనే అభిలాషయే. లోకప్రసిద్ధమైన భేదాన్ని అనువదించి బంధమోక్షవ్యవస్థ ప్రతిపాదించబడుతుంది. "ఏకో దేవః... అన్తరాత్మా" ఇత్యాదిశ్రుతుల ననుసరించి భేదం

ఉపాధులవల్ల ఏర్పడినది; భ్రాంతిచేత కల్పించబడినది. పారమార్థికం కాదు. (ఈ కల్పన) మధ్వాదికల్పన వంటిది. మధువు కాని ఆదిత్యునికి ఏ విధంగా మధుత్వం కల్పించబడిందో, ధేనువు కాని వాక్కుకు ధేనుత్వం ఏ విధంగా కల్పించబడిందో, అగ్నులు కాని ద్యులోకాదులకు ఏ విధంగా అగ్నిత్వం కల్పించబడిందో అట్లే అజ కానిదానికి అజాత్వం కల్పించబడుతున్నది. అందువల్ల తేజోబన్నాల విషయంలో అజాశబ్దప్రయోగం చేయడంలో విరోధం లేదు.10.

చమసాధికరణం సమాప్తం

## 3. సంఖ్యోపసంగ్రహాధికరణమ్. సూ. 11-13.

### సూ. న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావదతిరేకాచ్చ. 1.4.11.

ఏవం పరిహృతేఽప్యజామన్త్రే పునరన్యస్మాన్మన్త్రాత్సాంఖ్యః ప్రత్యవతిష్ఠతే.

"యస్మిన్ పఞ్చ పఞ్చజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః,

తమేవ మన్య ఆత్మానం విద్వాన్బ్రహ్మామృతోఽమృతమ్" (బృ.ఉ.4.4.17)

ఇత్యస్మిన్ మన్త్రే పఞ్చజనా ఇతి పఞ్చ సంఖ్యావిశిష్టా పరా పఞ్చ సంఖ్యా శ్రూయతే, పఞ్చశబ్దద్వయదర్శనాత్. త ఏతే పఞ్చ పఞ్చకాః పఞ్చవింశతిః సంపద్యన్తే. తయా పఞ్చవింశతిసంఖ్యయా యావన్తః సంఙ్ఖ్యేయా ఆకాఙ్క్ష్యన్తే తావన్త్యేవ చ తత్త్వాని సాంఖ్యైః సంఖ్యాయన్తే-

"మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త,

షోడశకశ్చ వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః" (సాం.కా.4.) ఇతి.

తయా శ్రుతిప్రసిద్ధయా పఞ్చవింశతిసంఖ్యయా తేషాం స్మృతిప్రసిద్ధానాం పఞ్చవింశతితత్త్వానాముపసంగ్రహాత్ప్రాప్తం పునః శ్రుతిమత్త్వమేవ ప్రధానాదీనామ్.

బాలానందిని

నేతి:- ''సంఖ్యోపసంగ్రహదపి= సంఖ్యను గ్రహించడంవల్ల కూడ న=ప్రధానాదులకు శ్రుతిసంమతత్వం లేదు. నానాభావాత్= పంచవింశతితత్త్వాలు వేరు వేరు అవడం వల్ల, అతిరేకాచ్చ= (సంఖ్య) అధికం అవుతుంది కాబట్టి కూడ'' అని సూత్రార్థం.

ఏవమితి:- ఈ విధంగా అజామంత్రం పరిహరింపబడినా కూడ మరొక మంత్రాన్ని పట్టి సాంఖ్యుడు ఎదుతిరుగుతున్నాడు. "యస్మిన్... అమృతమ్" అనే మంత్రంలో "పఞ్చ పఞ్చజనాః" అని రెండు పంచశబ్దాలు కనబడడంచేత పంచసంఖ్యకు సంబంధించిన మరొక పంచసంఖ్య వినబడుచున్నది. ఈ ఐదు ఐదులు ఇరవైయైదు అవుతాయి. ఆ ఇరవైయైదు సంఖ్యచేత ఎన్ని సంఖ్యేయాలు (లెక్కింపదగినవి) అపేక్షించబడతాయో అన్ని తత్త్వాలే సాంఖ్యులు "మూలప్రకృతిః... పురుషః" అని అంగీకరించి ఉన్నారు. వాళ్ల స్మృతిలో ప్రసిద్ధమైన ఇరవయైదు తత్త్వాలనే శ్రుతిలో ప్రసిద్ధమైన ఈ ఇరవైయైదు అనే సంఖ్య గ్రహించడంచేత ప్రధానాదులు శ్రుతిసంమతాలే.

వి. పఞ్చజనశబ్దం విషయం. దీనికి రూఢ్యర్థం చెప్పాలా, దీనిని యౌగికంగా గ్రహించి సాంఖ్యతత్త్వా లని అర్థం చెప్పాలా అని సంశయం. వెనుకటి అధికరణంలో అజాశబ్దానికి రూఢిని విడిచినట్లు ఇక్కడ కూడ రూఢిని విడిచి సాంఖ్యతత్త్వా లనే అర్థాన్ని గ్రహించా లని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం.

"యస్మిన్ పఞ్చ" ఇత్యాదిమంత్రం తరవాత వాక్యశేషంలో ప్రాణ-చక్షుః-శ్రోత్ర-అన్న-మనస్సులు చెప్పబడ్డాయి. అవి అయిదు పంచజనాలు. వాటికి కారణమైన అవ్యాకృతం ఆకాశం. "దేనియందు ఐదు పంచజనాలు, ఆకాశమూ నిలచి ఉన్నాయో దానినే ఆత్మనుగా తలచుచున్నాను. ఈ విధంగా అమృతమైన బ్రహ్మను తెలుసుకొన్న నేను అమృతుడనైనాను" అని దీని అర్థం.

"మూలప్రకృతిః' ఇత్యాదికారికలో సాంఖ్యసంమతాలైన ఇరవైయైదు తత్త్వాలు చెప్పబడ్డాయి. మూలప్రకృతి (ప్రధానం) అవికృతి. అది అన్నింటికీ ప్రకృతి, అనగా కారణమే గాని, వికృతి (దేనికీ కార్యం) కాదు. మహత్తు మొదలైన ఏడు, అనగా మహత్తు, అహంకారం, పంచభూతతన్మాత్రలు, ప్రకృతి వికృతులు. ఈ ఏడింటివల్ల మరికొన్ని తత్త్వాలు పుట్టాయి గాన ప్రకృతులు, ఇవన్నీ కారణం నుండి పుట్టాయి గాన వికృతులు. మహత్తు ప్రధానంనుండి పుట్టింది. అందుచేత ఇది ప్రధానానికి వికృతి. మహత్తు నుండి అహంకారం పుట్టింది. అందుచేత దానికి ప్రకృతి. తామసాహంకారంనుండి పంచతన్మాత్రలు పుట్టాయి. అందుచేత అది వాటికి ప్రకృతి. సాత్త్వికాహంకారం నుండి పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు మనస్సు అనే పదకొండు ఇంద్రియాలు పుట్టాయి. వాటికి కూడ అహంకారం ప్రకృతి. పంచతన్మాత్రల నుండి పంచస్థూలమహాభూతాలు పుట్టాయి. అందువల్ల వాటికి ఇవి ప్రకృతులు.

ఏకాదశేంద్రియాలనుండి, పంచస్థూలమహాభూతాలనుండి ఇతరమైన తత్త్వాలు ఏవీ పుట్టలేదు. అందుచేత అవి కేవలం వికృతులే కాని ప్రకృతులు కావు. పృథివ్యాదుల నుండి వృక్షాదులు పుట్టినా అవి పృథివ్యాదితత్త్వాలలోనే అంతర్గతం అవుతాయి గాని భిన్నతత్త్వాలు కావు గాన వాటికి (పృథివ్యాదులకు) ప్రకృతిత్వం లేదు.

## భాష్యమ్

తతో బ్రూమః - న సఙ్ఖ్యోపసంగ్రహాదపి ప్రధానాదీనాం శ్రుతిమత్త్వం ప్రత్యాశా కర్తవ్యా. కస్మాత్? నానాభావాత్. నానా హ్యేతాని పఞ్చవింశతిస్తత్త్వాని, నైషాం పఞ్చశః పఞ్చశః సాధారణధర్మోఽస్తి, యేనపఞ్చవింశతేరన్తరాలే పరాః పఞ్చ పఞ్చ సంఖ్యాః నివిశేరన్. న హ్యేకనిబన్ధనమన్తరేణ నానాభూతేషు ద్విత్వాదికాః సంఖ్యా నివిశన్తే. అథోచ్యేత- పఞ్చవింశతిసంఖ్యైవేయమవయవద్వారేణ లక్ష్యతే యథా "పఞ్చ సప్త చ వర్షాణి న వవర్ష శతక్రతుః" ఇతి ద్వాదశవార్షికీమనావృష్టిం కథయన్తి తద్వత్- ఇతి. తదపి నోపపద్యతే అయమేవాస్మిన్ పక్షే దోషః యల్లక్షణాశ్రయణీయా స్యాత్.

## బాలానందిని

**తత ఇతి:-** అందువలన చెపుతున్నాం. సంఖ్యానిర్దేశం ఉండడం మూలాన కూడ ప్రధానాదులకు శ్రుతిసంమతత్వం ఉందని ఆశపడడానికి వీలులేదు. ఎందువల్ల? నానాభావంవల్ల. ఈ పంచవింశతితత్త్వాలు వేటి కవే వేరు వేరైనవి కదా? వీటిని ఐదేసి చొప్పున విడదీయడానికి సాధారణమైన ధర్మం ఏదీ లేదు కదా? అలాంటి దేదైనా ఉంటే ఇరవై యైదింటిలో ఐదింటి చొప్పున ఐదు సముదాయాలను అంతర్గతం చేసే అవకాశం ఉండేది. ఒక సముదాయంగా చెప్పడానికి తగిన కారణం ఏదీ లేకుండా, విడివిడిగా ఉన్న అనేక వస్తువులలో ద్విత్వాదిసంఖ్యలు ఇమడవు కదా?

వి. యాభైమంది విద్యార్థు లున్నప్పుడు ఆంధ్రదేశం నుంచి పదిమందీ, కర్ణాటక నుండి పదిమంది, తమిళదేశం నుండి పదిమంది, కేరళ నుండి పదిమంది, మహారాష్ట్ర నుండి పదిమంది-మొత్తం ఐదు పదులు యాభైమంది అని చెప్పవచ్చు. ఇక్కడ ఉన్న విద్యార్థులను వాళ్ల దేశాన్ని పట్టి ఐదు సంఘాలుగా ఏర్పాటు చేయడం జరిగింది. అలా విడదీయడానికి కారణం వాళ్లు ఆంధ్రదేశాదులకు చెంది ఉండడం అనే సామాన్య ధర్మం. ఆ విధంగా ఇరవైయైదు తత్త్వాలను ఐదు సముదాయాలుగా

విడదీయడానికి తగిన సామాన్యధర్మం ఏదీ లేదు. అందుచేత ఐదు ఐదులు అని లెక్కపెట్టడానికి తగిన ఆధారం ఏదీ లేదు అని అర్థం.

అథోచ్యేతేతి:- "పఞ్చ సప్త చ వర్షాణీ న వవర్ష శతక్రతుః" (ఇంద్రుడు ఐదు సంవత్సరాలు, ఏడు సంవత్సరాలు (మొత్తం పన్నెండు సంవత్సరాలు) వర్షించలేదు) అని పన్నెండు సంవత్సరాలపాటు వచ్చిన అనావృష్టిని చెప్పినట్లు అవయవా లైన (అంతర్భాగాలైన) పంచసంఖ్యల ద్వారా పంచవింశతిసంఖ్యయే లక్షణచేత చెప్పబడుచున్నది అని చెప్పడం కూడ యుక్తం కాదు. ఈ పక్షంలో దోషం ఏమి టనగా లక్షణను ఆశ్రయించవలసి ఉండడం (ముఖ్యార్థం విడిచి లక్షణను ఆశ్రయించడం అగతికగతి అని అర్థం).

## భాష్యమ్

పరశ్చాత్ర పఞ్చశబ్దః జనశబ్దేన సమస్తః పఞ్చజనా ఇతి; భాషికేణ స్వరేణైకపదత్వనిశ్చయాత్. ప్రయోగాన్తరే చ "పఞ్చానాం త్వా పఞ్చజనానామ్". (తై.సం.1.62.2) ఇత్యైకపద్యైకస్వర్యైకవిభక్తికత్వావగమాత్. సమస్తత్వాచ్చ న వీప్సా పఞ్చ పఞ్చేతి. న చ పఞ్చకద్వయగ్రహణం పఞ్చ పఞ్చేతి. న చ పఞ్చ సంఖ్యాయా ఏకస్యాః పఞ్చసంఖ్యయా పరయా విశేషణం పఞ్చ పఞ్చకా ఇతి, ఉపసర్జనస్య విశేషణేనాసంయోగాత్. నన్వాపన్నపఞ్చసంఖ్యాకా జనా ఏవ పునః పఞ్చసంఖ్యయా విశేష్యమాణాః పఞ్చవింశతిః ప్రత్యేష్యన్తే. యథా పఞ్చ పఞ్చ పూల్యః ఇతి పఞ్చ వింశతిః పూలాః ప్రతీయన్తే తద్వత్. నేతి బ్రూమః. యుక్తం యత్పఞ్చపూలీశబ్దస్య సమాహారాభిప్రాయత్వాత్ కతీతి సత్యాం భేదాకాఙ్క్షాయాం పఞ్చ పఞ్చపూల్య ఇతి విశేషణమ్. ఇహ తు పఞ్చజనా ఇత్యాదిత ఏవ భేదోపాదానాత్ కతీత్యసత్యాం భేదాకాఙ్క్షాయాం న పఞ్చ పఞ్చజనా ఇతి విశేషణం భవేత్. భవదపీదం విశేషణం పఞ్చ సంఖ్యాయా ఏవ భవేత్, తత్ర చోక్తో దోషః. తస్మాత్ పఞ్చ పఞ్చజనా ఇతి న పఞ్చవింశతితత్త్వాభిప్రాయమ్.

## బాలానందిని

పరశ్చేతి:- భాషిక మైన స్వరంచేత ఒక్క పదం అని నిశ్చయించడంవల్ల ఇక్కడ రెండవ పఞ్చశబ్దం జనశబ్దంతో సమాసంగా ఏర్పడగా 'పఞ్చజనాః' అయింది.

మరొక ప్రయోగంలో (శ్రుత్యంతరంలో) కూడ "పఞ్చానాం త్వా పఞ్చజనానామ్' అనే చోట ఒక పద మనీ, ఏకపదత్వాన్ని పట్టి ఒకే విధమైన స్వరం, ఒకే విభక్తి అనీ కనబడుతున్నది. సమాసం పొందడంవల్ల ఇక్కడ పఞ్చ పఞ్చ అని వీప్స (ద్విరుక్తి) కాదు. వీప్స అయినా కూడ ఐదేసి అని అర్థం లభించి ఉండేది. అట్లే "పఞ్చ పఞ్చ" అని రెండు పంచకాల గ్రహణం కూడ కుదరదు (అప్పుడు పది అని మాత్రమే అర్థం వస్తుంది). ఒకే పఞ్చ సంఖ్యకు తరవాత వచ్చిన పంచ సంఖ్యతో (పఞ్చజనాః అనే దానిలోని పఞ్చశబ్దంతో) సంబంధం కుదరదు. అప్రధానమైన దానికి విశేషణం చేర్చడం కుదరదు కదా?

వి. ఇక్కడ 'భాషికేణ స్వరేణ' కు బదులు రత్నప్రభావ్యాఖ్యానం ప్రకారం పారిభాషికేణ స్వరేణ అను పాఠం ఉంది. భామతి ప్రకారం, బ్రహ్మవిద్యాభరణం ప్రకారం "భాషికేణ స్వరేణ" అని పాఠం. పరిభాష అనగా ఒక శాస్త్రంలో ఏర్పరచుకొన్న ఆ శాస్త్రానికి మాత్రమే వర్తించే నియమం. శతపథ బ్రాహ్మణానికి సంబంధించిన స్వరాలను విధించే ఒక భాషికం అనే గ్రంథం ఉన్న దట. దాని ప్రకారం ఇక్కడ చెప్పిన స్వరాన్ని పట్టి 'పఞ్చజనాః' అనేది సమాసం; పఞ్చ, జనాః అని వ్యస్తపదాలు కావు అని భాష్యాభిప్రాయం. ఈ విషయం కల్పతరువులోను బ్రహ్మవిద్యాభరణంలోను కూడ విస్తృతంగా చర్చించబడింది. కల్పతరువులోని విషయాన్నే రత్నప్రభ యథాతథంగా తీసికొన్నది. 'పారిభాషికేణ' అనే పాఠంకంటె 'భాషికేణ' అనే పాఠమే యుక్త మని తోస్తుంది. ఆ స్వరాన్ని గూర్చిన చర్చ ఇక్కడ అంత అవసరం కాదు. ఆ గ్రంథాల నుండి కావలసినవారు గ్రహించవచ్చు. చెప్పదలచిన ప్రధాన విషయమేమనగా ఇక్కడ చెప్పబడిన స్వరాన్ని పట్టి 'పఞ్చజనాః' అనేది సమస్తపదమే కాని వ్యస్తపదాలు కావు. అందుచేత పఞ్చ పఞ్చ అని వీప్స కాని పఞ్చ శబ్దాలకు పరస్పరాన్వయం గాని కుదరదు. అప్పుడు కూడ పూర్వపక్షికి కావలసిన అర్థం రాదు. సమాసంలో అప్రధానంగా ఉన్నదానితో విశేషణం అన్వయించదు. "సవిశేషణానాం వృత్తిర్న, వృత్తస్య వా విశేషణయోగో న" అని వైయాకరణుల నియమం. "ధనికస్య దేవత్తస్య గృహమ్" అని వ్యస్తంగా ప్రయోగించాలి కాని దేవదత్తగృహశబ్దాలకు "దేవదత్తగృహమ్" అని సమాసం చేసి సమాసంలో అప్రధానంగా ఉన్న దేవదత్తశబ్దానికి అన్వయించడం కోసం "ధనికస్య దేవదత్తగృహమ్" అనగూడదు. అట్లే ఇక్కడ కూడ 'పఞ్చజనాః' అనే సమాసంలో పూర్వపదంగా ఉండి అప్రధానమైన 'పఞ్చ' శబ్దంతో 'పఞ్చ' అనే విశేషణం అన్వయించగూడదు. దీనికి బ్రహ్మవిద్యాభరణంలో మరొక విధంగా వివరణం చూపబడింది. లోకంలో "ఘటో నిత్యః" ఇత్యాదిప్రయోగాలు సాధువులు కావు. ఘటం

నిత్యం కాదు కదా? "ఘటః" అనే దానికి ఘటత్వం కలది అని అర్థం. అందుచేత నిత్యః అనే విశేషణం ఘటపదార్థమైన ఘటంతో అన్వయించదు, ఘటంలో విశేషణమైన 'ఘటత్వం'తో అన్వయిస్తుంది. ఘటం అనిత్యమైనా ఘటత్వం అనే జాతి నిత్యం కదా. అందుచేత 'ఘటః నిత్యః' అనడంలో దోషం లేదు అని సమర్థించడానికి వీలు లేదు. ఎందువల్ల ననగా 'నిత్యః' అనే విశేషణం విశేష్యమైన 'ఘటః' తోనే అన్వయిస్తుంది కాని ఘటంలో ఉపసర్జనమైన, అనగా అప్రధానమైన, అనగా ఘటంలో విశేషణంగా భాసిస్తున్న, ఘటత్వంతో అన్వయించదు. అందుచేత పై ప్రయోగం దుష్టమే. అట్లే ఇక్కడ కూడ 'పఞ్చజనాః'' అనే సమాసంలో విశేషణంగా, ఉపసర్జనంగా, ఉన్న పఞ్చతో మొదటి పఞ్చ శబ్దం విశేషణంగా అన్వయించదు.

నన్వితి:- (ప్రశ్న)- పంచసంఖ్యను పొందిన జనులే మళ్లీ పంచసంఖ్యచేత విశేషించబడతాయి. అప్పుడు ఇరవైయైదు అని గ్రహించవచ్చునుకదా? ఎట్లనగా "పఞ్చపూల్యః'' (ఐదు కట్టలు- పఞ్చానాం పూలానాం సమాహారః పఞ్చపూలీ= ఐదు కట్టల సముదాయం అని అర్థం) అనే దానికి 'పఞ్చ' అనే విశేషణం చేర్చి 'పఞ్చపఞ్చ పూల్యః' అన్నప్పుడు ఇరవైయైదు కట్టలు అనే అర్థం వచ్చి నట్లు ఇక్కడ కూడ చెప్పవచ్చు కదా? (సమాధానం) -కాదంటాం. 'పఞ్చపూలీ' శబ్దం సమాహారవాచకం గాన అలాంటి పంచపూలులు ఎన్ని ఉన్నాయి అనే ఆకాంక్షలో 'పఞ్చ' అని విశేషణం చేర్పవచ్చును. ఇక్కడైతే 'పఞ్చ జనాః' అనేచోట ఐదు జనులు అని వేరు వేరుగా ఐదు జను లున్నవి అని అర్థం తెలిసిన తరవాత మళ్లీ ఎన్ని అనే ఆకాంక్షకు అవకాశం లేదు గాన 'పఞ్చ పఞ్చజనాః'' అని విశేషణప్రయోగం ఉండదు.

వి. 'పఞ్చపూలీ' అనేది సమాహారద్విగువు. ఐదు కట్టల సముదాయం అని అర్థం. మళ్లీ ఈ సముదాయాలు ఎన్ని అన్నప్పుడు 'ఐదు' అని చెప్పగా ఐదు సముదాయాలు అని అర్థం. సముదాయంలో ఐదు కట్ట లున్నాయి గాన మొత్తం ఇరవై ఐదు కట్టలు అని ఫలితార్థం వస్తుంది. కాని "పఞ్చజనాః" అన్నప్పుడు జనులు వ్యస్తంగా చెప్పబడ్డారు గాని సమాహారరూపంలో చెప్పబడలేదు. అందుచేత దృష్టాంతానికి దార్ష్టాంతికానికి భేదం ఉంది అని అర్థం.

భవదపీదమితి:- దీన్ని ఏదో విధంగా విశేషణంగా చేస్తా మని చెప్పినా పంచసంఖ్యకే విశేషణంగా చెయ్యవలసి ఉంటుంది. అలా చెప్పడంలో దోషం ఏమనగా - ఉపసర్జనమైనది మరొక ఉపసర్జనంతో సంబంధించదు, ప్రధానంతోనే సంబంధిస్తుంది అనే నియమానికి విరోధం పైన చూపబడింది. అందువల్ల "పఞ్చ

పఞ్చజనాః" అనేది ఇరవైఐదు తత్త్వాలను చెప్పాలనే అభిప్రాయంతో చెప్పినది కాదు.

వి. "ఉపసర్జనస్య నోపసర్జనాన్తరేణాన్వయః, కిం తు ప్రధానేనైవ" (ఉపసర్జనం (అప్రధానమైనది) మరొక ఉపసర్జనంతో అన్వయించదు; మరే మనగా ప్రధానంతోనే అన్వయిస్తుంది) అనే న్యాయానికి ప్రసిద్ధోదాహరణం మరొకటి చూపవచ్చు. "అస్మిన్ గ్రామే బలాఢ్యాః, రూపవన్తః, సద్గుణాః, సచ్చరిత్రాః దశ పురుషా వసన్తి" అనే వాక్యంలో "పురుషాః" అనేది ప్రధానం. మిగిలిన 'బలాఢ్యాః' ఇత్యాది విశేషణాలు ఐదూ ఆ 'పురుషాః' తోనే అన్వయిస్తాయి కాని వాటిలో అవి, ఒకదానితో ఒకటి, అన్వయించవు.

## భాష్యమ్

అతిరేకాచ్చ న పఞ్చవింశతితత్త్వాభిప్రాయమ్. అతిరేకో హి భవత్యాత్మాకాశాభ్యాం పఞ్చవింశతిసంఖ్యాయాః. ఆత్మా తావదిహ ప్రతిష్ఠాం ప్రత్యాధారత్వేన నిర్దిష్టః. యస్మిన్నితి సప్తమీసూచితస్య "తమేవ మన్య ఆత్మానమ్" ఇత్యాత్మత్వేనానుకర్షణాత్. ఆత్మా చ చేతనః పురుషః, స చ పఞ్చవింశతావన్తర్గత ఏవేతి న తస్యైవాధారత్వమాధేయత్వం చ యుజ్యతే. అర్థాన్తరపరిగ్రహే చ తత్త్వసంఖ్యాతిరేకః సిద్ధాన్తవిరుద్ధః ప్రసజ్యేత. తథా "ఆకాశశ్చ ప్రతిష్ఠితః" ఇత్యాకాశస్యాపి పఞ్చవింశతావన్తర్గతస్య న పృథగుపాదానం న్యాయ్యమ్. అర్థాన్తరపరిగ్రహే చోక్తం దూషణమ్. కథం చ సంఖ్యామాత్రశ్రవణే సత్యశ్రుతానాం పఞ్చవింశతితత్త్వానాముపసంగ్రహః ప్రతీయేత, జనశబ్దస్య తత్త్వేష్వరూఢత్వాత్. అర్థాన్తరోపసంగ్రహేఽపి సంఖ్యోపపత్తేః. కథం తర్హి పఞ్చ పఞ్చజనా ఇతి? ఉచ్యతే- "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" (పా.సూ.2.1.50) ఇతి విశేషస్మరణాత్ సంజ్ఞాయామేవ పఞ్చశబ్దస్య జనశబ్దేన సమాసః, తతశ్చ రూఢత్వాభిప్రాయేణైవ కేచిత్పఞ్చజనా నామ వివక్ష్యన్తే; న సాంఖ్యతత్త్వాభిప్రాయేణ. తే కతీత్యాకాఙ్క్షాయాం పునః పఞ్చేతి ప్రయుజ్యతే. పఞ్చజనా నామ యే కేచిత్తే చ పఞ్చైవేత్యర్థః. సప్తర్షయః సప్తేతి యథా.11.

## బాలానందిని

అతిరేకాచ్చేతి:- అతిరేకంవల్ల కూడ "పఞ్చ పఞ్చజనాః" అనేది పంచవింశతిదత్త్వా లనే అభిప్రాయం గలది కాదు. అలాచెప్పిన ట్లయితే

ఆత్మాకాశాలచేత ఇరవైఐదు అనే సంఖ్యకంటె ఎక్కువ అవుతుంది. ఇక్కడ ఆత్మ ప్రతిష్ఠకు ఆధారంగా నిర్దేశింపబడినది. (యస్మిన్ పఞ్చ పఞ్చజనాః ఇత్యాదివాక్యంలోని) యస్మిన్ అనే సప్తమిచేత సూచించబడే ఆత్మయే "తమేవ మన్య ఆత్మానమ్" అని ఆత్మగా అనుకరించబడుతున్నది (లాగబడుతున్నది). ఆత్మ అనగా చేతనుడైన పురుషుడు. ఆ పురుషుడు ఇరవైయైదులో అంతర్గతం అయిపోయాడు గాన ఆ పురుషుడే ఆధారం అవడం ఆధేయం అవడం కుదరదు. (ఈ ఆత్మ చతుర్వింశతితత్త్వాలలో అంతర్గతుడైన పురుషుడు కాదు) మరొక వస్తువు అని అంగీకరిస్తే తత్త్వాల సంఖ్య అధికం అవుతుంది. ఇది మీ సిద్ధాంతానికి విరుద్ధం. అట్లే "ఆకాశశ్చ ప్రతిష్ఠితః" అని ఇరవైనాల్గింటిలో అంతర్గతమైన ఆకాశాన్ని కూడ మళ్లీ వేరుగా గ్రహించడం యుక్తం కాదు. ఇది మరొకటి అని అంటే వెనుక చెప్పిన దోషమే. జనశబ్దం తత్త్వా లనే అర్థంలో రూఢం కానప్పుడు సంఖ్యామాత్రం వినబడడంచేత అక్కడ వినబడని పంచవింశతితత్త్వాలను గ్రహించడం ఎట్లు కుదురుతుంది? మరొక అర్థం ఏదైనా గ్రహించినా కూడ ఈ సంఖ్య కుదరవచ్చును కదా? అయితే ఈ "పఞ్చ పఞ్చజనాః" అనేది ఎట్లు? చెపుతున్నాం- "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" (దిగ్వాచకము సంఖ్యావాచకము సమర్థమైన పదంతో సమసిస్తాయి. ఆ మొత్తం సమాసం దేనికో ఒకదానికి సంజ్ఞ కావాలి) అనే విశేషశాస్త్రంచేత పఞ్చశబ్దానికి జనశబ్దంతో సంజ్ఞార్థంలోనే సమాసం ఏర్పడుతుంది. అందువల్ల రూఢిని అనుసరించి కొన్ని పంచజనులు అనేవి చెప్పడానికి ఉద్దేశింపబడ్డాయి కాని సాంఖ్యతత్త్వాలను చెప్పాలనే అభిప్రాయంతో కాదు. అవి ఎన్ని అనే ఆకాంక్ష కలిగినప్పుడు మళ్లీ పఞ్చశబ్దం ప్రయోగించబడింది. వేటినైతే పంచజనులు అంటున్నామో అవి ఐదే అని అర్థం. సప్తర్షులు ఏడుగురు అన్నట్లు.

## భాష్యమ్

కే పునస్తే పఞ్చజనా నామేతి? తదుచ్యతే-

### సూ. ప్రాణాదయో వాక్యశేషాత్. 1.4.12.

"యస్మిన్ పఞ్చ పఞ్చజనా" ఇత్యత ఉత్తరస్మిన్ మన్త్రే బ్రహ్మ స్వరూపనిరూపణాయ ప్రాణాదయః పఞ్చ నిర్దిష్టాః- "ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రమన్నస్యాన్నం మనసో యే మనో విదుః" ఇతి. తేఽత్ర వాక్యశేషగతాః సంనిధానాత్పఞ్చజనా వివక్ష్యన్తే. కథం పునః ప్రాణాదిషు

జనశబ్దప్రయోగః? తత్త్వేషు వా కథం జనశబ్దప్రయోగః? సమానే తు ప్రసిద్ధ్యతిక్రమే వాక్యశేషవశాత్ప్రాణాదయ ఏవ గ్రహీతవ్యా భవన్తి. జనసంబన్ధాచ్చ ప్రాణాదయః జనశబ్దభాజో భవన్తి. జనవచనశ్చ పురుషశబ్దః ప్రాణేషు ప్రయుక్తః "యే వా ఏతే పఞ్చ బ్రహ్మపురుషాః" (ఛా.ఉ.3.13.6) ఇతి. "ప్రాణో హ పితా ప్రాణో హ మాతా" (ఛా.ఉ.7.15.1) ఇతి చ బ్రాహ్మణమ్. సమాసబలాచ్చ సముదాయస్య రూఢత్వమవిరుద్ధమ్. కథం పునరసతి ప్రథమ ప్రయోగే రూఢిః శక్యాశ్రయితుమ్? శక్యోద్భిదాదివదిత్యాహ. ప్రసిద్ధార్థ సంనిధానే హ్యప్రసిద్ధార్థః శబ్దః ప్రయుజ్యమానః సమభివ్యాహారాత్తద్విషయో నియమ్యతే-యథా- "ఉద్భిదా యజేత" "యూపం ఛినత్తి" "వేదిం కరోతి" ఇతి. తథాయమపి పఞ్చజనశబ్దః సమాసాన్వాఖ్యానాత్ అవగతసంజ్ఞాభావః సంజ్ఞ్యాకాఙ్క్షీ వాక్యశేషసమభివ్యా హృతేషు ప్రాణాదిషు వర్తిష్యతే. కైశ్చిత్తు దేవాః పితరో గన్ధర్వా అసురా రక్షాంసి చ పఞ్చ పఞ్చజనా వ్యాఖ్యాతాః. అన్యైశ్చచత్వారో వర్ణాః నిషాదపఞ్చమాః పరిగృహీతాః. క్వచిచ్చ "యత్పాఞ్చజన్యయా విశా" (ఋ.సం.8.5.3.7) ఇతి ప్రజాపరః ప్రయోగః పఞ్చజనశబ్దస్య దృశ్యతే. తత్పరిగ్రహేఽపీహ న కశ్చిద్విరోధః. ఆచార్యస్తు న పఞ్చవింశతేస్తత్త్వానామిహ ప్రతీతిరస్తీత్యేవంపరతయా "ప్రాణాదయో వాక్యశేషాత్" ఇతి జగాద. 12.

బాలానందిని

కే ఇతి:- అ పంచజను లనగా ఏవి? అది చెప్పబడుతున్నది-

ప్రాణాదయ ఇతి:- "వాక్యశేషాత్= వాక్యశేషాన్ని పట్టి, ప్రాణాదయః ప్రాణాదులు, పంచజనులు" అని సూత్రార్థం.

యస్మిన్నితి:- "యస్మిన్ పఞ్చ పఞ్చజనాః" అనే దాని తరువాతి మంత్రంలో బ్రహ్మస్వరూపం నిరూపించడం కొరకు "ప్రాణస్య... విదుః" (ప్రాణానికి ప్రాణం, చక్షుస్సుకు చక్షుస్సు, శ్రోత్రానికి శ్రోత్రం, అన్నానికి అన్నం, మనస్సుకు మనస్సు అయినదానిని ఎవరు తెలుసుకొంటారో) అని ప్రాణం మొదలైనవి అయిదు నిర్దేశింపబడ్డాయి. వాక్యశేషంలో ఉన్న అవే దగ్గర ఉండడాన్ని బట్టి ఇక్కడ పంచజనాలుగా వివక్షితము లయ్యాయి. ప్రాణాదుల విషయంలో జనశబ్ద ప్రయోగం

ఎలా కుదురుతుంది? తత్వాల విషయంలో మాత్రం జనశబ్దప్రయోగం ఎలా కుదురుతుంది? ప్రసిద్ధిని విడిచివేయడం అనేది రెండు పక్షాలలోను సమాన మైనప్పుడు వాక్యశేషాన్ని పట్టి ప్రాణాదులనే గ్రహించవలసి ఉంటుంది. ప్రాణాదులకు జనులతో సంబంధం ఉండడంవల్ల వాటి విషయంలో జనశబ్దం కుదురుతుంది. "తే వా ఏతే పఞ్చ బ్రహ్మపురుషాః" అని, జనవాచక మైన పురుషశబ్దం ప్రాణాల విషయంలో ప్రయోగించబడింది. "ప్రాణో హ పితా ప్రాణో హ మాతా" అని బ్రాహ్మణం కూడ ఉన్నది. (అందుచేత ప్రాణాదుల విషయంలో (లాక్షణికంగా) జనశబ్ద ప్రయోగం ప్రసిద్ధమే అని అర్థం). పఞ్చజనాః అనేది ఒక సమాసం అవడంచేత మొత్తం ఆ పదం ప్రాణాద్యర్థంలో రూఢం అని చెప్పడంలో కూడ విరోధం ఏమీ లేదు. అనగా లక్షణచేతనే కాక రూఢిచేత కూడ ఈ ప్రాణాదులను బోధించవచ్చు అని అర్థం. ఆ అర్థంలో మొట్టమొదటి సారిగా ప్రయోగం లేకుండా రూఢిని ఆశ్రయించడం ఎలా శక్యం అవుతుంది? ఉద్భిదాదిపదాల విషయంలో వలెనే శక్యమౌతుంది అని సమాధానం చెపుతున్నాడు. ప్రసిద్ధమైన అర్థం గల శబ్దం దగ్గర ఉన్నప్పుడు అక్కడ ప్రయోగించిన అప్రసిద్ధార్థ మైన శబ్దానికి అర్థం ప్రక్కనున్నదానికి సంబంధించినది అని నిర్ణయించబడుతుంది. "ఉద్భిదా యజేత" (ఉద్భిత్తుచేత యాగం చేయవలెను) "యూపం ఛినత్తి" (యూపాన్ని ఛేదిస్తున్నాడు, ఛేదించాలి) "వేదిం కరోతి" (వేదిని చేస్తున్నాడు, చెయ్యాలి) ఇత్యాది వాక్యాలలో ఎట్లో అట్లే పంచజనశబ్దం కూడ, సమాసవిధానంవల్ల ఇది దేనికో సంజ్ఞ అని తెలియబడినదై, ఈ పేరుగల వస్తువు (సంజ్ఞి) ఏది అని ఆకాంక్ష కలిగినప్పుడు వాక్యశేషంలో చెప్పబడిన ప్రాణాదుల విషయంలో ప్రవర్తిస్తుంది (ప్రాణాదు లనే అర్థం బోధిస్తుంది)

వి. "ఉద్భిదా యజేత పశుకామః" అనే వాక్యం ఉద్భిత్తుతో యాగం చెయ్యాలి అని చెపుతున్నది. అయితే 'ఉద్భిత్' అనే పదానికి ఇక్కడ అర్థం ఏమిటి అని ప్రశ్న. 'ఉద్భినత్తీతి ఉద్భిత్' అను వ్యుత్పత్తిచేత త్రవ్వేది, అనగా గునపం, అని లోకప్రసిద్ధమైన అర్థం కుదరదు. యజేత పశుకామః అనగా యాగంచేత పశువులను సంపాదించాలి అని అర్థం. ఇక్కడ 'యాగేన' అనే పదం దగ్గర ఉండడంచేత 'ఉద్భిద్' అనేది ఈ యాగానికి పేరు అని నిర్ణయించబడింది. ఈ యాగం పశువులను పైకి లాగికొనివస్తుంది గాన దీని కా పేరు. అట్లే 'యూప' శబ్దానికి లోకంలో అర్థం తెలియదు. అయినా కూడ 'ఛినత్తి' (చెక్కుచున్నాడు) అనడంచేత చెక్కబడేది కఱ్ఱ కాబట్టి ఇదొక దారుమయస్తంభం అని తెలుస్తుంది. 'వేదీ' శబ్దానికి కూడ లోకంలో అర్థం తెలియకపోయినా 'కరోతి' (ఏర్పరచుచున్నాడు) అనే పదం దగ్గర ఉండడంచేత ఇదొక

అగ్ని ఉంచే పవిత్రస్థానం అని అర్థం అవుతుంది. ఈ విధంగా అప్రసిద్ధార్థాలైన పదాలకు ప్రసిద్ధార్థపదాలు దగ్గర ఉండడంచేత అర్థం నిర్ణయించవచ్చును. ఇక్కడ పైన చెప్పి నట్లు ఇది సమాసం గాన పంచజనశబ్దం దేనికో సంజ్ఞ అని మాత్రం తెలిసింది. దేనికి అని ఆకాంక్ష కలిగి నప్పుడు వాక్యాంతంలో ఉన్న ప్రాణాదులకు ఇది సంజ్ఞ అని గ్రహించాలి.

కైశ్చిదితి:- దేవతలు, పితృదేవతలు, గంధర్వులు, అసురులు, రాక్షసులు- ఈ ఐదుగురూ పంచజనులు అని కొందరు వ్యాఖ్యానించారు. నిషాదునితోసహా నాలుగు వర్ణాలవాళ్లు పంచజనులు అని మరికొందరు గ్రహించారు. కొన్నిచోట్ల "యత్పాఞ్చజన్యయా విశా" అని పఞ్చజనశబ్దం ప్రజావర్యాయంగా ఉపయోగింపబడింది. ఆ అర్థం తీసికొన్నా విరోధం ఏదీ లేదు. బాదరాయణాచార్యు డైతే ఇక్కడ పంచవింశతితత్త్వాల ప్రతీతి కలగదు అని చెప్పడం కోసం "ప్రాణాదయో వాక్యశేషాత్" అని (పంచజన అనగా ప్రాణాదులు అని) చెప్పాడు.12.

## భాష్యమ్

భవేయుస్తావత్ప్రాణాదయః పఞ్చజనాః మాధ్యందినానాం యేఽన్నం ప్రాణాదిష్వామనన్తి. కాణ్వానాం తు కథం ప్రాణాదయః పఞ్చజనా భవేయుర్యే ఽన్నం ప్రాణాదిషు నామనన్తీతి- అత ఉత్తరం పఠతి-

**సూ. జ్యోతిషైకేషామసత్యన్నే. 1.4.13.**

అసత్యపి కాణ్వానామన్నే జ్యోతిషా తేషాం పఞ్చసంఖ్యా పూర్యతే. తేఽపి హి "పఞ్చ పఞ్చజనాః" ఇత్యతః పూర్వస్మిన్ మన్త్రే బ్రహ్మస్వరూప నిరూపణాయైవ జ్యోతిరధీయతే- "తద్దేవా జ్యోతిషాం జ్యోతి." ఇతి. కథం పునరుభయేషామపి తుల్యవదిదం జ్యోతిః పఠ్యమానం సమానమన్త్రగతయా పఞ్చసంఖ్యయా కేషాంచిద్గృహ్యతే కేషాం చిన్నేతి. అపేక్షాభేదాదిత్యాహ. మాధ్యన్దినానాం హి సమానమన్త్రపఠితప్రాణాదిపఞ్చజనలాభాత్ నాస్మిన్మన్త్రాన్తరపఠితే జ్యోతిష్యపేక్షా భవతి. తదలాభాత్తు కాణ్వానాం భవత్యపేక్షా. అపేక్షాభేదాచ్చ సమానేఽపి మన్త్రే జ్యోతిషో గ్రహణాగ్రహణే యథా సమానేఽపి అతిరాత్రే వచనభేదాత్ షోడశినో గ్రహణాగ్రహణే తద్వత్. తదేవం న తావచ్ఛ్రుతిప్రసిద్ధిః కాచిత్ప్రధానవిషయాస్తి. స్మృతిన్యాయప్రసిద్ధీ తు పరిహరిష్యేతే. 13.

బాలానందిని

భవేయురితి:- మాధ్యందినశాఖకు సంబంధించినవారి పాఠంలో వాళ్లు ప్రాణాదులలో అన్నం కూడా పఠిస్తున్నారు గాన ప్రాణాదులు పంచజను లైతే కావచ్చును. ప్రాణాదులలో అన్నం చేర్చని క్వాణ్వశాఖీయుల పాఠంలో ప్రాణాదులు పంచజనులు ఎలా అవుతాయి? అందుకు సమాధానంగా పఠిస్తున్నాడు -

జ్యోతిషామితి:- "ఏకేషామ్=కాణ్వులకు, అన్నే=అన్నం, అసతి=లేదుగాన, జ్యోతిషా=జ్యోతిస్సుచేత, పంచత్వం కుదురుతుంది." అని సూత్రార్థం.

అసత్యపీతి:- కాణ్వులకు అన్నం లేకపోయినా జ్యోతిస్సుచేత పంచసంఖ్య పూరింపబడుతుంది. వాళ్లు కూడా బ్రహ్మస్వరూపం నిరూపించడంకొరకే, "యస్మిన్ పఞ్చ పఞ్చజనాః" అనే మంత్రానికి పూర్వం ఉన్న మంత్రంలో "తద్దేవా జ్యోతిషాం జ్యోతిః" అని పఠిస్తున్నారు. (ప్రశ్న)- ఈ జ్యోతిస్సు రెండు శాఖలవాళ్లకీ కూడ సమానంగానే పఠింపబడినా కూడ దీనిని సమానమంత్రంలో ఉన్న పంచసంఖ్యచేత కొందరు గ్రహిస్తారు కొందరు గ్రహించరు అని చెప్పడం ఎలా? అపేక్షాభేదాన్ని పట్టి అని అంటున్నాడు. సమానమంత్రంలో పఠింపబడిన ప్రాణాదిపంచజనం లభించడంచేత మాధ్యందినులకు మరొక మంత్రంలో పఠించిన జ్యోతిస్సుయొక్క అపేక్ష లేదు. కాణ్వులకు అది లేకపోవడంచేత జ్యోతిస్సుయొక్క అపేక్ష ఉంది. అందుచేత అపేక్షాభేదాన్ని పట్టి సమానమంత్రంలో (పఞ్చ పఞ్చజనాః ఇత్యాది మంత్రంలో) కొందరు జ్యోతిస్సును గ్రహించడం కొందరు గ్రహించకపోవడం జరుగుతుంది. అతిరాత్రం అనేది సమానమే అయినా "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి, నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" అని రెండు వాక్యాలుండడంవల్ల కొందరు షోడశిగ్రహణం చేయడం కొందరు చేయకపోవడం ఎట్లో ఇది కూడ అట్లే. అందువల్ల ప్రధానాన్ని గూర్చి శ్రుతి ప్రసిద్ధి ఏదీ లేదు. స్మృతిప్రసిద్ధి- న్యాయప్రసిద్ధులు కూడ లేవని మున్ముందు చెప్పబడగలదు (చెప్పగలం). 13.

సంఖ్యోపసంగ్రహాధికరణం సమాప్తం

## 4. కారణత్వాధికరణమ్. సూ.14-15.

### సూ. కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః 1.4.14.

ప్రతిపాదితం బ్రహ్మణో లక్షణమ్. ప్రతిపాదితం చ బ్రహ్మ విషయం గతిసామాన్యం వేదాన్తవాక్యానామ్. ప్రతిపాదితం చ ప్రధానస్యాశబ్దత్వమ్.

తత్రేదమపరమాశఙ్క్యతే- న జన్మాదికారణత్వం బ్రహ్మణో, బ్రహ్మవిషయం వా గతిసామాన్యం వేదాన్తవాక్యానాం ప్రతిపత్తుం శక్యమ్. కస్మాత్? విగానదర్శనాత్. ప్రతివేదాన్తం హ్యన్యాన్యా సృష్టిరుపలభ్యతే, క్రమాదివైచిత్ర్యాత్. తథాహి- క్వచిత్ "ఆత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1) ఇత్యాకాశాదికా సృష్టిరామ్నాయతే. క్వచిత్తేజఆదికా- "తత్తేజో సృజత" (ఛా.ఉ.6.2.3) ఇతి. క్వచిత్ప్రాణాదికా- "స ప్రాణమసృజత ప్రాణాచ్ఛ్రద్ధామ్" (ప్ర.ఉ.6.4)ఇతి. క్వచిదక్రమేణైవ లోకానాముత్పత్తిరామ్నాయతే "స ఇమాన్ లోకానసృజత అమ్భో మరీచీర్మరమాపః' (ఐ.ఉ.4.1.2) ఇతి. క్వచిదసత్పూర్వికా సృష్టిః పఠ్యతే- "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత" (తై.ఉ.2.7) ఇతి. "అసదేవేదమగ్ర ఆసీత్తత్సదాసీత్తత్సమభవత్" (ఛా.ఉ.3.19.1) ఇతి చ. క్వచిదసద్వాదనిరాకరణేన సత్పూర్వికా ప్రక్రియా ప్రతిజ్ఞాయతే- "తద్ధైక ఆహురసదేవేదమగ్రసీత్" ఇత్యుపక్రమ్య "కుతః ఖలు సౌమ్యైవం స్యాదితిహోవాచ, కథమసతః సజ్జాయేతేతి, సదేవ సోమ్యేదమగ్రసీత్" (ఛా.ఉ.6.2.1.2) ఇతి. క్వచిత్స్వయంకర్తృకైవ వ్యాక్రియా జగతో నిగద్యతే"తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియత" (బృ.ఉ.1.4.7) ఇతి. ఏవమనేకధా విప్రతిపత్తేః వస్తుని చ వికల్పానుపపత్తేర్న వేదాన్త వాక్యానాం జగత్కారణావధారణపరతా న్యాయ్యా. స్మృతిన్యాయపరిగ్రహాభ్యాం తు కారణాన్తరపరిగ్రహో న్యాయ్యః ఇతి.

## బాలానందిని

కారణత్వేనేతి:- "ఆకాశాషు= ఆకాశాదులయందు, కారణత్వేన= కారణంగా, యథావ్యపదిష్టోక్తేః= ఒక వేదాంతంలో సర్వేశ్వరుడు ఏ విధంగా చెప్పబడ్డాడో ఇతర వేదాంతాలలో కూడ ఆ విధంగానే చెప్పబడడంవల్ల వేదాంతాలలో స్రష్ట విషయంలో విగానం (పరస్పరవిరోధం) లేదు" అని సూత్రార్థం.

ప్రతిపాదితమితి:- వేదాంతవాక్యాలకు బ్రహ్మవిషయంలో గతిసామాన్యం ప్రతిపాదింపబడింది. ప్రధానానికి అశబ్దత్వం కూడ ప్రతిపాదింపబడింది. ఇప్పుడు మరొక ఆశంక చేయబడుచున్నది. బ్రహ్మ జన్మాదికారణం అని గాని, వేదాంత వాక్యాలకు బ్రహ్మ విషయంలో గతిసామాన్యం ఉందని గాని తెలియడానికి శక్యం కాదు.

ఎందువల్ల? విగానం (వేరు వేరుగా చెప్పడం) కనబడడంవల్ల. ప్రతీ వేదాంతంలోను క్రమాదులు వేరు వేరుగా ఉండడంచేత వేరు వేరైన సృష్టి కనబడుతున్నది. అదెట్లనగా - "ఆత్మన ఆకాశః సంభూతః" అని కొన్నిచోట్ల ఆకాశంతో మొదలైన సృష్టి చెప్పబడుతున్నది. కొన్ని చోట్ల "తత్తేజోऽసృజత" అని తేజస్సుతో ప్రారంభం అయిన సృష్టి వినబడుతున్నది. కొన్నిచోట్ల "స ప్రాణమసృజత, ప్రాణాచ్ఛ్రద్ధామ్" అని ప్రాణాదికమైన సృష్టి వినబడుతున్నది. కొన్ని చోట్ల "స ఇమాన్ లోకానసృజత అమో మరీచీర్మరమాపః' ' (ఆ ఆత్మ ఈ లోకాలను సృజించింది; స్వర్గమూ అంతరిక్షలోకం, మర్త్యలోకం, పాతాలలోకమూ సృష్టించింది) అని ఏ క్రమమూ లేకుండా లోకాల సృష్టి చెప్పబడింది. కొన్నిచోట్ల "అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత" (ప్రారంభంలో ఇదంతా అసత్‌గానే ఉండేది. దానినుండి సత్ పుట్టింది) అని "అసదేవ... అభవత్" (ప్రారంభంలో ఇది అసత్ గానే ఉంది, అది శుద్ధసద్రూపబ్రహ్మగా అయింది. అది జగత్తుగా అయింది) అని అసత్పూర్వకమైన, పూర్వం ఏమీ లేని, సృష్టి పఠింపబడింది. కొన్నిచోట్ల "తద్ధైక... ఆసీత్" (కొందరు ప్రారంభంలో ఇదంతా అసత్ గానే, శూన్యంగానే, ఉండేది అని అంటారు) అని ఉపక్రమించి, "కుతస్తు...ఆసీత్" (సౌమ్యుడా! ఇది అలా ఎలా ఉంటుంది అన్నాడు. అసత్తునుంచి సత్తు ఎలా పుడుతుంది? సౌమ్యుడా! ప్రారంభంలో కూడ ఇది సత్తుగానే ఉండేది" అని అసద్వాదాన్ని నిరాకరించి సత్పూర్వకమైన జగత్సృష్టి చెప్పబడుతున్నది. కొన్ని చోట్ల "తద్ధేదం... వ్యాక్రియత" (ఈ జగత్తు అంతా పూర్వం అవ్యాకృతంగా ఉండేది, అది నామరూపాలచేత వ్యాకృతం (వేరు వేరుగా ఉన్నదిగా) అయింది) అని జగత్తు తనంతట తానే వ్యాకృత మైన దని, నామరూపాలతో వివిక్త మైన దని చెప్పబడుచున్నది. ఈ విధంగా అనేక రకాలైన విప్రతిపత్తి కనబడుతున్నది. (కర్మ విషయంలో వికల్పం అంగీకరించడానికి అవకాశం ఉన్నా) వస్తువు విషయంలో వికల్పం కుదరదు గాన వేదాంత వాక్యాలు జగత్కారణాన్ని నిర్ధారణ చేస్తాయి అని చెప్పడం న్యాయ్యం కాదు. అందుచేత సాంఖ్యాదిస్మృతిప్రసిద్ధిచేత న్యాయ (యుక్తి) ప్రసిద్ధిచేత మరొక కారణాన్ని దేనినైనా అంగీకరించడం మంచిది.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః:- సత్యపి ప్రతివేదాన్తం సృజ్యమానేషు ఆకాశాదిషు క్రమాదిద్వారకే విగానే న స్రష్టరి కించి ద్విగానమస్తి. కుతః? యథావ్యపదిష్టోక్తేః. యథాభూతో హ్యేకస్మిన్ వేదాన్తే సర్వజ్ఞః సర్వేశ్వరః

సర్వాత్మా ఏకః అద్వితీయః కారణత్వేన వ్యపదిష్టః తథాభూత ఏవ వేదాన్తాన్తరేష్వపి వ్యపదిశ్యతే. తద్యథా- "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" (తై.ఉ.2.1) ఇతి. అత్ర తావద్ జ్ఞానశబ్దేన పరేణ చ తద్విషయేణ కామయితృత్వవచనేన చేతనం బ్రహ్మ న్యరూపయత్, అపరప్రయోజ్యత్వే నేశ్వరం కారణమబ్రవీత్. తద్విషయేణైవ పరేణాత్మశబ్దేన శరీరాదికోశపరమ్పరయా చాన్తరనుప్రవేశనేన సర్వేషామన్తః ప్రత్యగాత్మానం నిరధారయత్. "బహు స్యాం ప్రజాయేయ" ఇతి చ ఆత్మవిషయేణ బహుభవనానుశాసనేన సృజ్యమానానాం వికారాణాం స్రష్టురభేదమభాషత. తథా "ఇదం సర్వమసృజత యదిదం కించ" (తై. ఉ.2.6) ఇతి సమస్త జగత్సృష్టినిర్దేశేన ప్రాక్సృష్టేరద్వితీయం స్రష్టారమాచష్టే. తదత్ర యల్లక్షణం బ్రహ్మ కారణత్వేన విజ్ఞాతం తల్లక్షణమేవాన్యత్రాపి విజ్ఞాయతే- "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్, తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి, తత్తేజోఽసృజత" (ఛా.ఉ.6.2.1.3) ఇతి. తథా "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించన మిషత్. స ఐక్షత లోకాన్ను సృజా ఇతి" (ఐ. ఉ.4.1.1, 2) ఇతి చ. ఏవంజాతీయకస్య కారణస్వరూపనిరూపణపరస్య వాక్యజాతస్య ప్రతివేదాన్తమవిగీతార్థత్వాత్.

### బాలానందిని

వి. ఇక్కడ జగత్కారణశ్రుతులు విషయం. అవి బ్రహ్మ విషయంలో ప్రమాణమా కాదా అని సంశయం. వెనుకటి అధికరణంలో పంచసంఖ్య విషయంలో అన్నానికీ, జ్యోతిస్సుకీ వికల్పం అని అంగీకరించినా జగత్కారణవిషయంలో సత్తా అసత్తా ఇత్యాది వికల్పాలు కుదరవు అనే ప్రత్యుదాహరణ సంగతిచేత పూర్వపక్షం. వేదాంతాలకు సమన్వయం సాధించడంవల్ల శ్రుత్యధ్యాయసంగతి. అసదాదిపదాలకు సత్కారణంలో సమన్వయం చెప్పడంచేత పాదసంగతి. పూర్వపక్షంలో సమన్వయం కుదరకపోవడం ఫలం, సిద్ధాంతంలో సమన్వయసిద్ధి ఫలం.

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం. సృజించబడే ఆకాశాదుల క్రమాదులలో భేదాన్ని పట్టి వేదాంతాలలో, ఆకాశాదుల విషయంలో విగానం ఉన్నా కూడ స్రష్ట విషయంలో విగానం ఏదీ లేదు. ఎందువల్ల? యథావ్యపదిష్టోక్తివల్ల, ఒక

వేదాంతంలో సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వాత్మ అయిన ఎలాంటి అద్వితీయుడు కారణంగా చెప్పబడ్డాడో ఇతర వేదాంతాలలో కూడా అలాంటివాడే చెప్పబడుచున్నాడు. అదెట్లనగా- "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అని చెప్పబడింది. ఇక్కడ జ్ఞానశబ్దంచేత, దీనికే సంబంధించిన తరవాత చెప్పిన కామయితృత్వవచనంచేత (అతడు ఇలా కోరుకున్నాడు అని చెప్పడంచేత) చేతనమైన బ్రహ్మను నిరూపించాడు. ఆ ఈశ్వరుడు ఇతరులచేత ప్రేరేపింపబడని (స్వతంత్రుడైన) కారణం అని చెప్పాడు. ఆ ఈశ్వరుణ్ణే గూర్చి తరవాత ఆత్మశబ్దంచేత నిర్దేశిస్తూ శరీరాదిపరంపరచేత లోపల ప్రవేశించి నట్లు చెప్పి (ఈశ్వరుడు) అందరిలోనూ ఉండే ప్రత్యగాత్మ అని నిర్ధారణ చేశాడు. "బహు స్యాం ప్రజాయేయ" అని ఆ ఆత్మయే అనేకరూపాలలో అవుతాను అను కొన్నట్లు చెప్పి సృష్టింపబడుచున్న వికారాలకు స్రష్టకు భేదం లేదని చెప్పాడు. అట్లే- "ఇదం సర్వమసృజత యదిదం కించ" అని సమస్త జగత్తుయొక్క సృష్టిని నిర్దేశించడంచేత సృష్టికి పూర్వం స్రష్ట అద్వితీయుడుగా ఉన్నాడు అని చెపుతున్నది. ఈ విధంగా ఇక్కడ ఏ లక్షణాలు గల బ్రహ్మ కారణంగా తెలియబడినదో ఆ లక్షణాలే గల బ్రహ్మ- 'సదేవ... అసృజత", "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్... సృజై" ఇత్యాదివాక్యాలలో ఇతరమైన వేదాంతాలలో కూడ తెలియబడుతూన్నది. కారణస్వరూపాన్ని ప్రతిపాదించే ఈ విధమైన వాక్యసముదాయం ప్రతీ వేదాంతం లోను కూడ అవిగీత మైన అర్థం కలదిగా కనబడుతున్నది.

## భాష్యమ్

కార్యవిషయం తు విగానం దృశ్యతే- క్వచిదాకాశాదికా సృష్టిః, క్వచిత్తేజఆదికేత్యేవంజాతీయకమ్. న చ కార్యవిషయేణ విగానేన కారణమపి బ్రహ్మ సర్వవేదాన్తేష్వవిగీతమధిగమ్యమానమవివక్షితం భవితుమర్హతీతి వక్తుం శక్యమ్; అతిప్రసంగాత్. సమాధాస్యతి చాచార్యః కార్యవిషయమపి విగానం "న వియదశ్రుతేః" (బ్ర.సూ.2.3.1) ఇత్యారభ్య. భవేదపి కార్యస్య విగీతత్వమప్రతిపాద్యత్వాత్; న హ్యయం సృష్ట్యాదిప్రపఞ్చః ప్రతిపిపాదయిషితః. న హి తత్ప్రతిబద్ధః కశ్చిత్ పురుషార్థః దృశ్యతే శ్రూయతే వా, న చ కల్పయితుం శక్యతే; ఉపక్రమోపసంహారాభ్యాం తత్ర తత్ర బ్రహ్మవిషయైర్వాక్యైః సాకమేకవాక్యతాయా గమ్యమానత్వాత్. దర్శయతి చ సృష్ట్యాదిప్రపఞ్చస్య బ్రహ్మప్రతిపత్త్యర్థతామ్- అన్నేన సోమ్య శుఙ్గేనాపో మూలమన్విచ్ఛ, అద్భిః

సోమ్య శుఙ్గేన తేజో మూలమన్విచ్ఛ, తేజసా సోమ్య శుఙ్గేన సన్మూలమన్విచ్ఛ" (ఛా.ఉ.3.8.4) ఇతి. మృదాదిదృష్టాన్తైశ్చ కార్యస్య కారణేనాభేదం వదితుం సృష్ట్యాదిప్రపఞ్చః శ్రావ్యత ఇతి గమ్యతే. తథా చ సంప్రదాయవిదో వదన్తి-

"మృల్లోహవిస్ఫులిఙ్గాద్యైః సృష్టిర్యా చోదితాన్యథా,

ఉపాయః సోఽవతారాయ నాస్తి భేదః కథంచన" (మాం.కా.3.25) ఇతి.

బ్రహ్మ ప్రతిపత్తిప్రతిబద్ధం తు ఫలం శ్రూయతే- "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై.ఉ.2.1) "తరతి శోకమాత్మవిత్" (ఛాం.ఉ.7.13), "తదేవ విదిత్వాతిమృత్యుమేతి" (శ్వే.ఉ.3.8) ఇతి చ. ప్రత్యక్షావగమం చేదం ఫలం- "తత్త్వమసి" ఇత్యసంసార్యాత్మత్వప్రతిపత్తౌ సత్యాం సంసార్యాత్మత్వవ్యావృత్తేః. 14.

బాలానందిని

కార్యేతి:- కొన్నిచోట్ల ఆకాశాదికమైన సృష్టి, కొన్నిచోట్ల తేజఆదికమైన సృష్టి ఇత్యాదివిధంగా కార్యం విషయంలో నైతే విగానం కనబడుతున్నది. కార్యం విషయంలో విగానం ఉన్నంత మాత్రంచేత, సర్వవేదాంతాలలోను అవిగీతంగా తెలియబడుతున్న కారణమైన బ్రహ్మ కూడ అవివక్షితం కావచ్చును అని చెప్పడం శక్యం కాదు కదా. అలా చెపితే అతిప్రసంగం కలుగుతుంది. (ఒక దానిని పట్టి మరొకదాని విషయం నిర్ణయిస్తే ఏదైనా నిర్ణయించవచ్చు ననే స్థితి ఏర్పడుతుంది). కార్యవిషయంలో ఉన్న విగానానికి కూడ అచార్యుడు "న వియదశ్రుతేః" అనే సూత్రంతో ప్రారంభించి సమాధానం చెప్పనున్నాడు. కార్యం ప్రతిపాద్యం కాదు; అందుచేత దాని విషయంలో విగీతత్వం ఉంటే ఉండవచ్చును కూడ. ఈ సృష్టి మొదలైనదానికి సంబంధించిన విస్తృతవివరణం ప్రతిపాదించా లని ఉద్దేశింపబడింది కాదు. దానివల్ల కలిగే ఏ పురుషార్థం ఎక్కడా కనబడడం లేదు, వినబడడం లేదు కూడ. క్రొత్తగా ఏదైనా కల్పించడానికి కూడ శక్యం కాదు. ఉపక్రమోపసంహారాలచేత ఈ సృష్ట్యాదిప్రపంచవాక్యాలకి బ్రహ్మకు సంబంధించిన వాక్యాలతో ఏకవాక్యత తెలుస్తూన్నది కదా? (అందువల్ల వేదాంతాలలో ప్రధానప్రతిపాద్యం బ్రహ్మయే కాని సృష్ట్యాదికం కాదు గాన దానిని గూర్చి అంతగా పట్టించుకొనవలసిన పనిలేదని అర్థం). సృష్ట్యాదిప్రపంచం కూడ బ్రహ్మను తెలుసుకొనడం కొరకే అనే విషయాన్ని "అన్నేన... అన్విచ్ఛ" ఇత్యాది వాక్యంచేత చెప్పనున్నాడు. "సౌమ్యుడా! శుంగమైన అనగా

లింగమైన, అన్నంచేత (పృథివిచేత) దాని కారణమైన జలం గూర్చి తెలుసుకో, శుంగమైన జలంచేత దాని మూలమైన తేజస్సును తెలుసుకో; శుంగమైన తేజస్సుచేత దాని మూలమైన సత్‌ను (బ్రహ్మను) తెలుసుకో (అనగా ఒక కార్యాన్ని పట్టి దాని కారణాన్ని, దానిని పట్టి దాని కారణాన్ని వెదకుకుంటూపోతే చివరికి మూల కారణమైన బ్రహ్మను గుర్తించవచ్చు అని భావం) అని ఈ శ్రుతివాక్యానికి అర్థం. మృత్ (మట్టి) మొదలైన దృష్టాంతాలచేత కార్యం కారణంకంటె అభిన్నం (వేరుగా లేదు) అని చెప్పడం కోసమే సృష్ట్యాదిప్రపంచం శ్రుతిలో చూపబడినది అని తెలుస్తున్నది. సంప్రదాయవేత్తలైన (గౌడపాదాచార్యులు) "మృల్లోహ... కథంచన" అని చెప్పినారు. "మట్టి, ఇనుము, నిప్పునెరసు మొదలైన దృష్టాంతాలతో ఏ సృష్టి వేరుగా చెప్పిబడిందో ఆ సృష్టి (ప్రపంచం) అంతా అసలు విషయం మనస్సులో ప్రవేశించడంకొరకు మాత్రమే. ఏ విధంగానూ కూడ బ్రహ్మయందు భేదం లేదు. అనగా జగత్తును పట్టి బ్రహ్మయొక్క అద్వితీయత్వానికి విఘాతం ఏదీ లేదు" అని ఈ కారికకు భావం. అయితే- "బ్రహ్మవిదాప్నోతి పరమ్" "తరతి శోకమాత్మవిత్", "తమేవ విదిత్వాతిమృత్యుమేతి" అని బ్రహ్మజ్ఞానానికి సంబంధించిన ఫలం వినబడుతున్నది. ఈ ఫలం ప్రత్యక్షంగా అనుభవించడానికి శక్యమైనది కూడ; "తత్త్వమసి" అనే వాక్యంచేత తాను అసంసారియైన ఆత్మ అని తెలియగానే సంసార్యాత్మత్వం నివర్తిస్తున్నది కదా? 14.

## భాష్యమ్

యత్పునః కారణవిషయం విగానం దర్శితమ్- "అసద్వా ఇదమగ్ర ఆసీత్" ఇత్యాది తత్పరిహర్తవ్యమ్. అత్రోచ్యతే-

### సూ. సమాకర్షాత్. 1.4.15.

"అసద్వా ఇదమగ్ర ఆసీత్" (తై.ఉ.2.7) ఇతి నాత్రాసన్నిరాత్మకం కారణత్వేన శ్రావ్యతే. యతః "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదుః" ఇత్యసద్వాదాపవాదేన అస్తిత్వ లక్షణం బ్రహ్మ అన్నమయాదికోశపరమపరయా ప్రత్యగాత్మానం నిర్ధార్య "సోఽకామయత" ఇతి తమేవ ప్రకృతం సమాకృష్య సప్రపఞ్చాం సృష్టిం తస్మాచ్ఛ్రావయిత్వా "తత్సత్యమిత్యాచక్షతే" ఇతి చోపసంహృత్య "తదప్యేష శ్లోకో భవతి" ఇతి తస్మిన్నేవ ప్రకృతేఽర్థే శ్లోకమిమముదాహరతి "అసద్వా

ఇదమగ్ర ఆసీత్" ఇతి. యది త్వసన్నిరాత్మకమస్మిన్ శ్లోకేఽభిప్రేయేత తతో ఽన్యసమాకర్షణేఽన్యస్యోద్ధరణాత్ అసంబద్ధం వాక్యమాపద్యేత. తస్మాన్నామరూపవ్యాకృతవస్తువిషయః ప్రాయేణ సచ్ఛబ్దః ప్రసిద్ధ ఇతి తద్వ్యాకరణాభావాపేక్షయా ప్రాగుత్పత్తేః సదేవ బ్రహ్మ అసదివాసీదిత్యుపచర్యతే. ఏషైవ "అసదేవేదమగ్ర ఆసీత్" (ఛా.ఉ.3.19.1)ఇత్యత్రాపి యోజనా."తత్సదాసీత్" ఇతిసమాకర్షాత్."తద్ధైక ఆహురసదేవేదమగ్ర ఆసీత్" (ఛా.ఉ.6.2.1) ఇత్యత్రాపి న శ్రుత్యన్తరాభిప్రాయేణాయమేకీయమతోపన్యాసః; క్రియాయామివ వస్తుని వికల్పస్యాసంభవాత్. తస్మాత్ శ్రుతిపరిగృహీతసత్పక్షదార్ఢ్యాయైవాయం మన్దమతిపరికల్పితస్యాసత్పక్షస్యోపన్యస్య నిరాస ఇతి ద్రష్టవ్యమ్.

బాలానందిని

**యదితి:-** "అసద్వా ఇదమగ్ర ఆసీత్" ఇత్యాదివాక్యాలలో కారణానికి సంబంధించిన ఏ విగానం చూపబడిందో దానిని పరిహరించవలసి ఉంది. ఈ విషయంలో చెప్పబడుచున్నది -

**సమాకర్షాత్ ఇతి:-** "సమాకర్షాత్=ప్రకృతమైన బ్రహ్మనే సమాకర్షించడంవల్ల, ముందుకు లాగడంవల్ల, అసత్ కారణంగా చెప్పబడలేదు" అని సూత్రానికి అర్థం.

**అసద్వేతి:-** "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అని ఇక్కడ స్వరూపశూన్యమైన, అనగా తుచ్ఛమైన, అసత్ కారణం అని చెప్పబడడం లేదు. ఎందువల్ల ననగా "అసన్నేవ... విదుః" (ఎవడు బ్రహ్మ అసత్ అని తెలుసుకొంటాడో అతడు కూడ అసన్ (లేనివాడె) అవుతాడు. బ్రహ్మ ఉన్నది అని తెలుసుకొన్న ట్లయితే అప్పుడు వానిని కూడ 'సన్' అని అంటారు) అని అసద్వాదాన్ని నిరాకరించడం ద్వారా అస్తిత్వం అనే లక్షణం గల (సద్రూపమైన) బ్రహ్మను అన్నమయాదికోశాల పరంపర ద్వారా ప్రత్యగాత్మనుగా నిర్ధారణ చేసి, ప్రకృతమైన ఆ ఆత్మనే "సోఽకామయత" అని ఆకర్షించి (ముందుకు లాగికొనివచ్చి), దానినుండి విస్తృతమైన సృష్టి జరిగినట్లు వినిపించి "తత్సత్యమిత్యాచక్షతే" (దానినే సత్యమని అంటారు) అని ఉపసంహరించి "తదప్యేష శ్లోకో భవతి" (ఈ సందర్భంలో ఈ మంత్రం ఉన్నది) అని ఆ ప్రకృతార్థం విషయంలోనే "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అనే ఈ మంత్రాన్ని ఉదాహరించాడు. ఈ శ్లోకంలో నిరాత్మకమైన అసత్ అంగీకరింపబడిన ట్లయితే అప్పుడు వెనుకనుండి

ముందుకు ఆకర్షింపబడినది ఒకటి ఉదాహరించబడింది మరొకటి అని ఈ వాక్యం అసంబద్ధం అవుతుంది. సాధారణంగా సత్‌శబ్దం నామరూపాలతో వ్యాకృతమైన వస్తువు అనే అర్థాన్ని బోధిస్తుంది అని ప్రసిద్ధంగా ఉంది. అందువల్ల ఆ నామరూపాల వ్యాకరణం లేకపోవడాన్ని పట్టి, సృష్టికి పూర్వం బ్రహ్మ సత్తే అయినా అసత్తు వలె ఉందని ఉపచారంచేత (ఆరోపణచేత) చెప్పబడుతున్నది. "అసదేవేదమగ్ర ఆసీత్" అనేచోట కూడ ఇదే సమన్వయం; ఎందువల్ల ననగా అక్కడ కూడ "తత్సదాసీత్" (అది సత్‌గా ఉండేది) అనేది ఆకర్షింపబడుతుంది. "తద్ధైక ఆహుః అసదేవేదమగ్ర ఆసీత్" అన్నప్పుడు కూడ ఇక్కడ చెప్పిన అన్యమతం మరొక శ్రుతి ఇలా చెపుతూన్నది అనే అభిప్రాయంచేత కాదు. క్రియలో వికల్పం ఉన్నట్లు వస్తువులో వికల్పం ఉండదు కదా? అందువల్ల మందమతులు కల్పించిన ఈ అసత్పక్షాన్ని చెప్పి ఖండించడం శ్రుతిచేత అంగీకరించబడిన సత్పక్షాన్ని దృఢం చేయడానికే అని గ్రహించాలి.

## భాష్యమ్

"తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్" (బృ.ఉ.1.4.8) ఇత్యత్రాపి న నిరధ్యక్షస్య జగతో వ్యాకరణం కథ్యతే. "స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" ఇత్యధ్యక్షస్య వ్యాకృతకార్యానుప్రవేశిత్వేన సమాకర్షాత్. నిరధ్యక్షే వ్యాకరణాభ్యుపగమే హ్యనన్తరేణ ప్రకృతావలమ్బినా స ఇత్యనేన సర్వనామ్నా కః కార్యానుప్రవేశిత్వేన సమాకృష్యేత? చేతనస్య చాయమాత్మనః శరీరేఽను ప్రవేశః శ్రూయతే, అనుప్రవిష్టస్య చేతనత్వశ్రవణాత్- "పశ్యంశ్చక్షుః శృణ్వన్‌శ్రోత్రం మన్వానో మనః" ఇతి. అపి చ యాదృశమిదమద్యత్వే నామరూపాభ్యాం వ్యాక్రియమాణం జగత్సాధ్యక్షం వ్యాక్రియతే ఏవమాదిసర్గేఽపీతి గమ్యతే; దృష్టవిపరీతకల్పనానుపపత్తేః. శ్రుత్యన్తరమపి "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా.ఉ.6.3.2) ఇతి సాధ్యక్షామేవ జగతో వ్యాక్రియాం దర్శయతి. వ్యాక్రియత ఇత్యపి కర్మకర్తరి లకారః సత్యేవ పరమేశ్వరే వ్యాకర్తరి సౌకర్యమపేక్ష్య ద్రష్టవ్యః, యథా లూయతే కేదారః స్వయమేవేతి సత్యేవ పూర్ణకే లవితరి. యద్వా కర్మణ్యేవాయం లకారః అర్థాక్షిప్తం కర్తారమపేక్ష్య ద్రష్టవ్యః- యథా గమ్యతే గ్రామః ఇతి.15.

## బాలానందిని

తద్ధేతి:- "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్" అన్న చోట కూడ అధ్యక్షుడు (కర్త) లేని జగత్తుయొక్క వ్యాకరణం చెప్పబడడం లేదు. ఎందువల్ల ననగా అధ్యక్షుడు "స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః" (ఆ ఆత్మ నఖాగ్రం వరకూ కూడ దీనిలో ప్రవేశించి ఉన్నాడు) అని వ్యాకృతమైన కార్యంలో ప్రవేశించి నట్లు ఆకర్షింపబడ్డాడు. అర్యక్షుడు లేని వ్యాకరణం అంగీకరించిన పక్షంలో ప్రకృతాన్ని నిర్దేశించే తరవాత వచ్చిన'స': అనే సర్వనామశబ్దంచేత కార్యాను ప్రవేశం చేసినట్లుగా ఎవరిని ఆకర్షించడం కుదురుతుంది? ప్రవేశించినది చేతనుడు అని - "పశ్యంశ్చక్షుః... మనః" (ఆత్మ చూచుచు చక్షుస్సు అయింది, వింటూ శ్రోత్రం అయింది, మననం చేస్తూ మనస్సు అయింది) అనే వాక్యంచేత తెలుస్తూన్నది గాన ఆ శరీరంలో చేతను డైన ఆత్మ ప్రవేశించి నట్లు వినబడుతుంది. మరొక విషయ మేమనగా ఇప్పుడు నామరూపాలచేత వ్యాకృతమౌతున్న జగత్తు (ఘటాదికం) అధ్యక్షుడు ఉండడంవల్లనే ఏ విధంగా వ్యాకృతం అవుతున్నదో సృష్టిప్రారంభంలో కూడ ఇట్లే అని తెలుస్తున్నది. (ఘటాదులను ఒక కర్త నిర్మించి వాటికి నామరూపాలు ఇవ్వడం మనం ఈనాడు చూస్తున్నాం. అదేవిధంగా సృష్టిప్రారంభంలో కూడ ఒక కర్త నామరూపాదివ్యాకరణం చేశా డని చెప్పాలి అని అర్థం). ప్రత్యక్షంగా కనబడేదానికి విరుద్ధమైన కల్పన చేయడం యుక్తం కాదు కదా? "అనేన... వ్యాకరవాణి" అను మరొక శ్రుతి కూడ జగత్తుయొక్క వ్యాకరణం అధ్యక్షునితో కూడినదే అని చూపుతూన్నది. "నామ రూపాభ్యామేవ వ్యాక్రియత" అనే దానిలోని "వ్యాక్రియత" అనే కర్మకర్తరిలకారం పరమేశ్వరుడు వ్యాకర్తగా ఉండగానే సౌకర్యాన్ని సూచించడంకోసం ప్రయోగించబడింది అని గ్రహించాలి. పూర్ణకుడనే చేను కోసేవాడు ఉన్నా కూడ ఏ విధంగా "లూయతే కేదారః స్వయమేవ" పంటపొలం స్వయంగానే తెగిపోతున్నది అని అంటామో అట్లే ఇది కూడ.

వి. "దేవదత్తేన ఛిద్యతే శాఖా" (దేవదత్తునిచేత కొమ్మ నరకబడుతున్నది) అనేది కర్మణిప్రయోగం. నరకడంలో దేవదత్తుడు కర్త, కొమ్మ కర్మ. ఆ కొమ్మ

అనాయాసంగా ఛేదింపబడుచున్నది అని సూచించడంకోసం "ఛిద్యతే శాఖా" అని ప్రయోగించబడుతుంది. "కొమ్మ తెగిపోతూన్నది" అని అర్థం. దీనికి కర్మకర్తరిప్రయోగం అని పేరు. ఇక్కడ కర్మయైన శాఖయే కర్తగా ఉపయోగించబడింది. నామరూపాలు వ్యాకరరించిన కర్త యైన పరమేశ్వరు డున్నా కూడ వాటి వ్యాకరణం అనాయాసంగా జరిగింది అని సూచించడానికి "వ్యాక్రియత" అని కర్మకర్తరిప్రయోగం చేయబడింది అని అర్థం.

యద్వేతి:- లేదా ఈ లకారం కర్మణిలకారమే. అర్థాన్ని పట్టి కర్తను అపేక్షించి ఇది ప్రయోగించబడింది అని చూచుకొనవచ్చు. గ్రామం వెళ్లబడుచున్నది అన్నప్పుడు కర్తయైన పురుషుణ్ణి చెప్పకపోయినా పురుషుడు ఏ విధంగా అర్థాన్ని పట్టి తెలుస్తాడో అట్లే ఇక్కడ కూడ. 15

కారణత్వాధికరణం సమాప్తం

## 5. బాలాక్యధికరణమ్. సూ.16-18

## సూ. జగద్వాచిత్వాత్. 1.4.16

కౌషీతకిబ్రాహ్మణే బాలాక్యజాతశత్రుసంవాదే శ్రూయతే- "యో వై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వైతత్కర్మ స వేదితవ్యః" (కౌ.బ్రా.4.29) ఇతి. తత్ర కిం జీవో వేదితవ్యత్వేనోపదిశ్యతే, ఉత ముఖ్యః ప్రాణఃఉత పరమాత్మా ఇతి విశయః. కిం తావత్ప్రాప్తమ్? ప్రాణ ఇతి. కుతః? "యస్య వై తత్ కర్మ" ఇతి శ్రవణాత్. పరిస్పన్దలక్షణస్య చ కర్మణః ప్రాణాశ్రయత్వాత్. వాక్యశేషే చ "అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి" ఇతి ప్రాణశబ్దదర్శనాత్ ప్రాణశబ్దస్య చ ముఖ్యే ప్రాణే ప్రసిద్ధత్వాత్. యే చైతే పురస్తాద్బాలాకినా "ఆదిత్యే పురుషశ్చన్ద్రమసి పురుషః" ఇత్యేవమాదయః పురుషా నిర్దిష్టాః తేషామపి భవతి ప్రాణః కర్తా. ప్రాణావస్థావిశేషత్వాదాదిత్యాది దేవతాత్మనామ్. "కతమ ఏకో దేవ ఇతి, ప్రాణ ఇతి స బ్రహ్మ త్యదిత్యాచక్షతే" (బృ.ఉ.3.9.9) ఇతి శ్రుత్యన్తరప్రసిద్ధేః. జీవో వాయమిహ వేదితవ్యతయా ఉపదిశ్యతే. తస్యాపి ధర్మాధర్మలక్షణం కర్మ శక్యతే శ్రావయితుం "యస్య వైతత్కర్మ" ఇతి. సోఽపి భోక్తృత్వాద్భోగోపకరణభూతానామేతేషాం పురుషాణాం కర్తోపపద్యతే. వాక్యశేషే చ జీవలిఙ్గమవగమ్యతే. యత్కారణం

వేదితవ్యతయోపన్యస్తస్య పురుషాణాం కర్తుర్వేదనాయోపేతం బాలాకిం ప్రతి బుబోధయిషురజాతశత్రుః సుప్తం పురుషమామన్త్ర్య, ఆమన్త్రణశబ్దాశ్రవణాత్ ప్రాణాదీనామభోక్తృత్వం ప్రతిబోధ్య యష్టిఘాతోత్థాపనాత్ ప్రాణాదివ్యతరిక్తం జీవం భోక్తారం ప్రతిబోధయతి. తథా పరస్తాదపి జీవలిఙ్గమవగ్యమతే- "తద్యథా శ్రేష్ఠీ స్వైర్భుఙ్క్తే స్వాః శ్రేష్ఠినం భుఞ్జన్తి ఏవమేవైష ప్రజ్ఞాత్మా ఏతైరాత్మభిర్భుఙ్క్తే ఏవమేవైత ఆత్మాన ఏతమాత్మానం భుఞ్జన్తి" (కౌ.బ్రా.4.20) ఇతి. ప్రాణభృత్త్వాచ్చ జీవస్యోపపన్నం ప్రాణశబ్దత్వమ్. తస్మా జ్జీవముఖ్యప్రాణయోరన్యతర ఇహ గ్రహణీయో న పరమేశ్వరః; తల్లిఙ్గానవగమాత్ ఇతి.

## బాలానందిని

జగదితి:- "జగద్వాచిత్వాత్= ఏతచ్ఛబ్దం ఇక్కడ జగత్తును చెపుతున్నది గాన అజాతశత్రువు చెప్పిన వేదితవ్యుడు పరమేశ్వరుడే" అని సూత్రార్థం.

కౌషీతకి బ్రాహ్మణంలోని బాలాక్యజాతశత్రుసంవాదంలో- "యో వై... వేదితవ్యః" (బాలాకీ!ఈ! ఈ పురుషులకు ఎవడు కర్తయో, ఇది (ఈ జగత్తు) ఎవని కార్యమో అతడు తెలిసికొనదగినవాడు) అని వినబడుతున్నది. అక్కడ వేదితవ్యుడుగా చెప్పబడుచున్నది జీవుడా లేక ముఖ్యప్రాణమా లేక పరమాత్మయా అని సంశయం. ఏమి ప్రాప్తించినది? ప్రాణం అని. ఎందువల్ల? "యస్య వైతత్కర్మ' అని వినబడడంవల్ల. కదలిక అనే లక్షణం గల కర్మ ప్రాణాన్ని ఆశ్రయించి ఉంటుంది కదా? వాక్యశేషంలో కూడ "అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి" అని ప్రాణశబ్దం వినబడుచున్నది. ప్రాణశబ్దానికి ముఖ్యప్రాణం అనే అర్థంలో ప్రసిద్ధి ఉంది. బాలాకి ముందుగా "ఆదిత్యే... పురుషః" (ఆదిత్యునిలో పురుషుడు, చంద్రునిలో పురుషుడు) మొదలైన ఏ పురుషుణ్ణి నిర్దేశించి ఉన్నాడో వాళ్లకు కూడ ప్రాణం కర్త కావచ్చును. ఆదిత్యాదిదేవతాత్మ లన్నీ కూడ ప్రాణం యొక్క అవస్థావిశేషాలే కదా? మరొక శ్రుతిలో కూడ "కతమ... ఆచక్షతే" (ఒక్క ఆ దేవు డెవడు? ప్రాణం; అదే బ్రహ్మ అని అంటారు) అని ప్రసిద్ధి ఉంది. లేదా ఇక్కడ జీవుడు తెలియదగినవాడుగా చెప్పబడుతున్నాడు. "యస్య వైతత్కర్మ" అని ధర్మాధర్మలక్షణమైన వాని కర్మ కూడ (ఇక్కడ) చెప్పడానికి శక్యమైనదే. జీవుడు కూడ భోక్త అవడంచేత భోగానికి సాధనాలైన ఈ పురుషులకు కర్త అని చెప్పడం

కుదురుతుంది. వాక్యశేషంలో కూడ జీవుని లింగం కనబడుతున్నది. ఎందువల్ల ననగా- పురుషుల కర్త తెలియదగినవాడు అని చెప్పగా తెలుసుకొనడానికి వచ్చిన బాలాకికి బోధించదలచి అజాతశత్రువు నిద్రపోతూన్న పురుషుణ్ణి పిలిచాడు. అతడు పిలుపును వినలేదు. అప్పుడు అతడు ప్రాణాదులు ఆత్మ కాదు అని బోధించి నిద్రపోతూన్నవానిని కఱ్ఱతో కొట్టి లేపి, అలా లేపడంవల్ల, ప్రాణాదులకంటె భిన్నుడైన కర్తయైన జీవు డొక డున్నాడు అని బోధిస్తాడు. అట్లే తరవాత కూడ "తద్యథా.. భుఞ్జన్తి" అని జీవలింగం కనబడుతున్నది. "ప్రధానుడైన వ్యక్తి ఏ విధంగా తనవాళ్లతో (తనవాళ్లను) అనుభవిస్తాడో, ఏ విధంగా తనవాళ్లు (వానికి సంబంధించిన వాళ్లు) ఆ శ్రేష్ఠిని అనుభవిస్తారో అట్లే ఈ జీవుడు ఈ ఆత్మలచేత (ఆదిత్యాదిపురుషులను భోగోపకరణాలనుగా చేసికొని) అనుభవిస్తాడు. ఈ ఆత్మలు (ఆదిత్యాదిపురుషులు) ఈ జీవాత్మను అనుభవిస్తారు" అని ఈ వాక్యానికి అర్థం. జీవుడు ప్రాణాలు ధరిస్తాడు గాన అతని విషయంలో ప్రాణశబ్ద ప్రయోగం యుక్తమే. అందువల్ల ఇక్కడ జీవ-ముఖ్యప్రాణాలలో ఏదో ఒకదానిని గ్రహించాలి; పరమేశ్వరుణ్ణి మాత్రం గ్రహింపకూడదు.

వి. "యో వై బాలాకే"ఇత్యాదివాక్యం (వాక్యంలోని 'ప్రాణ' శబ్దం) విషయం. వెనుకటి అధికరణంలో ఒకే వాక్యంలో ఉన్న సదాదిశబ్దాల బలంచేత అసచ్ఛబ్దానికి మరొక అర్థం చెప్పబడింది. ఇక్కడ వాక్యాలు రెండు గాన బాలాకి వాక్యంలో ఉన్న బ్రహ్మశబ్దాన్ని పట్టి ప్రాణాదిశబ్దాన్ని బ్రహ్మపరంగా చెప్పడం కుదరదు అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం. ఈ వాక్యం ప్రాణాద్యుపాసనాపరం గాన బ్రహ్మవిషయంలో సమన్వయం కుదరకపోవడం పూర్వ పక్షానికి ఫలం. సమన్వయం సిద్ధించడం సిద్ధాంతానికి ఫలం.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- పరమేశ్వర ఏవాయమేతేషాం పురుషాణాం కర్తా స్యాత్. కస్మాత్? ఉపక్రమసామర్థ్యాత్. ఇహ హి బాలాకిరజాతశత్రుణా సహ "బ్రహ్మ తే బ్రవాణి" ఇతి సంవదితుముపచక్రమే. స చ కతిచిదా దిత్యాద్యధికరణాన్ పురుషాన్ అముఖ్యబ్రహ్మదృష్టిభాజః ఉక్త్వా తూష్ణీం బభూవ. తమజాతశత్రుః "మృషా ఖలు మా సంవదిష్ఠా బ్రహ్మ తే ప్రబ్రవాణి"

ఇత్యముఖ్యబ్రహ్మవాదితయాపోద్య తత్కర్తారమన్యం వేదితవ్యతయోపచిక్షేప. యది సోఽ ప్యముఖ్యబ్రహ్మదృష్టిభాక్ స్యాదుపక్రమో బాధ్యేత. తస్మాత్పరమేశ్వర ఏవాయం భవితుమర్హతి. కర్తృత్వం చైషాం పురుషాణాం న పరమేశ్వరాదన్యస్య స్వాతంత్ర్యేణావకల్పతే. "యస్య వైతత్కర్మ" ఇత్యపి నాయం పరిస్పన్దలక్షణస్య, ధర్మాధర్మలక్షణస్య వా కర్మణో నిర్దేశః. తయోరన్యతరస్యాప్యప్రకృతత్వాదసంశబ్దితత్వాచ్చ. నాపి పురుషాణామయం నిర్దేశః, ఏతేషాం పురుషాణాం కర్తేత్యేవ తేషాం నిర్దేశాత్; లిఙ్గవచనవిగానాచ్చ. నాపి పురుషవిషయస్య కరోత్యర్థస్య క్రియాఫలస్య వాయం నిర్దేశః, కర్తృశబ్దేనైవ తయోరుపాత్తత్వాత్. పారిశేష్యాత్ప్రత్యక్ష సంనిహితం జగత్సర్వనామ్నైతచ్ఛబ్దేన నిర్దిశ్యతే. క్రియతే ఇతి చ తదేవ జగత్కర్మ.

బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం. ఈ పురుషుల కర్త పరమేశ్వరుడే కావాలి. ఎందువల్ల? ఉపక్రమసామర్థ్యంవల్ల. ఇక్కడ బాలాకి అజాతశత్రువుతో- "బ్రహ్మ తే బ్రవాణి" (నీకు బ్రహ్మను గూర్చి చెపుతాను) అని సంవాదం చేయడానికి ఉపక్రమించాడు. అతడు ఆదిత్యాదులలో ఉన్న, అముఖ్యబ్రహ్మగా చెప్పదగిన కొందరు పురుషులను గూర్చి చెప్పి ఊరుకొన్నాడు. అప్పుడు అజాతశత్రువు "మృషా... ప్రబ్రవాణి" (నీకు బ్రహ్మ చెపుతాను అని అంటూ అసత్యంగా సంవాదం చేయకు) అని అతడు అముఖ్యబ్రహ్మను గూర్చి చెపుతున్నాడు అని నిరాకరించి ఆ పురుషులకు కర్తయైన మరొకడు తెలియదగినవాడు అని చెప్పాడు. అతడు కూడ అముఖ్యబ్రహ్మదృష్టి కలవాడే అయితే ఉపక్రమం బాధించబడుతుంది. అందుచేత ఇతడు పరమేశ్వరుడే అవడానికి తగి ఉన్నాడు. ఈ పురుషులను సృజించడం పరమేశ్వరుడు తప్ప మరెవ్వరూ స్వతంత్రంగా చేయజాలరు. "యస్య వైతత్కర్మ' ' అనేది కూడ చలనరూపమైన కర్మయొక్క గాని, ధర్మాధర్మలక్షణమైన కర్మయొక్క గాని నిర్దేశం కాదు. ఆ రెండింటిలో ఏ ఒక్కటీ కూడ ప్రకృతం కాదు, ఇక్కడ చెప్పబడలేదు. ఇది పురుషుల నిర్దేశం కూడ కాదు; "ఏతేషాం పురుషాణాం కర్తా" అనే మాటలలో వారు (వేరుగా) నిర్దేశింపబడినారు. లింగవచనాలలో భేదం కూడ ఉంది. (''పురుషాః'' అనేది పుంలింగబహువచనం; 'ఏతత్ కర్మ' అనేది నపుంసకైకవచనం. అందుచేత 'ఏతత్ కర్మ' అనే దానిచేత పురుషనిర్దేశం కుదరదు

అని అర్థం). పురుష విషయమైన కరోత్యర్థం కాని, క్రియాఫలం గాని నిర్దేశించబడుతున్నది అని చెప్పడం కూడ యుక్తం కాదు. కర్తృశబ్దంచేతనే ఆ రెండూ చెప్పబడ్డాయి కదా?

వి. కరోత్యర్థం అనగా కృఞ్ ధాతువుయొక్క అర్థం. అనగా చేయడం అనే వ్యాపారం. క్రియాఫలం అనగా చేయడం అనే వ్యాపారంయొక్క ఫలం, అనగా పుట్టడం. "ఏతత్కర్మ" అనే దానిచేత పురుషులను నిర్దేశించకపోయినా ఆ పురుషులను పుట్టించడాన్ని లేదా పుట్టడాన్ని నిర్దేశించవచ్చును కదా అని ప్రశ్న. ఈ రెండూ కర్తృశబ్దం చేతనే గ్రహించబడ్డాయి కదా? (అనగా కర్త అనగానే వ్యాపారం, ఫలమూ కూడ నిర్దిష్టము లయినట్లే. అవి లేకపోతే కర్తృత్వం అనేది ఉండదు కదా అని అర్థం). ఇంక పారిశేష్యంచేత ప్రత్యక్షంగా కనబడుతూన్న జగత్తు సర్వనామమైన ఏతచ్ఛబ్దంచేత నిర్దేశింపబడుతుంది. "క్రియతే ఇతి కర్మ" (చేయబడుతుంది గాన కర్మ) అనువ్యుత్పత్తిచేత జగత్తే కర్మ.

## భాష్యమ్

నను జగదప్యప్రకృతమసంశబ్దితం చ? సత్యమేతత్. తథాప్యసతి విశేషోపాదానే సాధారణేనార్థేన సంనిధానేన సంనిహితవస్తుమాత్రస్యాయం నిర్దేశ ఇతి గమ్యతే, న విశిష్టస్య కస్య చిత్; విశేషసంనిధానాభావాత్. పూర్వత్ర చ జగదేకదేశభూతానాం పురుషాణాం విశేషోపాదానాత్, అవిశేషితం జగదేవేహోపాదీయ త ఇతి గమ్యతే. ఏతదుక్తం భవతి- య ఏతేషాం పురుషాణాం జగదేకదేశభూతానాం కర్తా, కిమనేన విశేషేణ, యస్య కృత్స్నమేవ జగదవిశేషితం కర్మేతి. వా శబ్ద ఏకదేశావచ్ఛిన్నకర్తృత్వవ్యావృత్త్యర్థః. యే బాలాకినా బ్రహ్మత్వాభిమతాః పురుషాః కీర్తితాస్తేషామబ్రహ్మత్వఖ్యాపనాయ విశేషోపాదానమ్. ఏవం చ బ్రాహ్మణపరివ్రాజకన్యాయేన సామాన్య విశేషాభ్యాం జగతః కర్తా వేదితవ్యతయోపదిశ్యతే. పరమేశ్వరశ్చ సర్వజగతః కర్తా సర్వవేదాన్తేష్వవధారితః 16.

## బాలానందిని

నన్వితి:- జగత్తు కూడ అప్రకృతమే, దానిని గూర్చి చెప్పబడలేదు కూడ కదా? నువ్వు చెప్పినది నిజమే. ఇక్కడ విశేషం ఏదీ చెప్పబడ లేదు గాన సాధారణ

మైన అర్థాన్ని పురస్కరించుకొని సంనిహితమైన వస్తువు నిర్దేశించబడుతున్నది అని తెలుస్తూన్నది; విశిష్టమైన అర్థం ఏదీ దగ్గర లేదు కదా?

వి. సర్వనామశబ్దానికి ముందు ఏదైన ఒక విశిష్టమైన వస్తువు చెప్పి ఉన్నట్లయితే అప్పుడు అది (సర్వనామశబ్దం) దానిని నిర్దేశిస్తుంది. కాని అలాంటి దేదీ చెప్పనప్పుడు సాధారణరూపంలో బుద్ధిలో ఉన్నదానినంతనీ గ్రహిస్తుంది. ఇక్కడ 'ఏతత్' అనే సర్వనామశబ్దానికి వెనుక విశిష్టమైన ఏ వస్తువూ చెప్పలేదు. అందుచేత 'ఇదంతా' అనగానే ప్రస్తుతం సృష్టిని గూర్చి మాట్లాడుతున్నారు గాన 'ఈ జగత్తంతా' అని సామాన్యరూపంలో జగత్తు గ్రహించబడుతుంది.

పూర్వత్రేతి:- వెనుక జగత్తులో ఒకభాగమైన పురుషులను విశేషించి గ్రహించి ఉండడంవల్ల ఇక్కడ విశేషం ఏదీ లేకుండా, సామాన్యరూపంలో, జగత్తు అంతా గ్రహించబడుతుంది. ఏతావతా చెప్పిన దేమనగా - ఎవడైతే, జగత్తులో ఒక భాగమైన పురుషులకు కర్తయో, పురుషుల కన్న మాటేమిటి; విశేషితం కాని, అనగా జగత్తులోని ఒక భాగానికి మాత్రమే అని సంకుచితం కాని, అంత జగత్తూ కూడ ఎవని కార్యమో అని అర్థం. వాశబ్దం జగత్తులోని ఒక భాగానికి మాత్రమే కర్త అనే అర్థాన్ని నివర్తింపచేయడం కోసం ప్రయోగించబడింది. బాలాకి ఏ పురుషులను బ్రహ్మగా భావించాడో వాళ్లు బ్రహ్మ కాదు అని చెప్పడంకోసం వాళ్లని ప్రత్యేకంగా పేర్కొనడం జరిగింది. ఈ విధంగా బ్రాహ్మణపరివ్రాజకన్యాయంచేత సామాన్యవిశేషరూపంలో జగత్తుకు, అనగా సామాన్యరూపంలో జగత్తు కంతకీ, విశేషించి పురుషులకూ, కర్తయైన వానిని గూర్చి తెలుసుకొనాలి అని చెప్పబడుచున్నది. సర్వ జగత్తుకి కర్త పరమేశ్వరుడే అని నిర్ధారణ చేయబడింది.

**వి.** "బ్రాహ్మణాః భోజయితవ్యాః పరివ్రాజకాశ్చ" "బ్రాహ్మణులకు భోజనం పెట్టండి, పరివ్రాజకులకు కూడ" అన్నప్పుడు బ్రాహ్మణశబ్దం పరివ్రాజకులకంటె భిన్నులైన బ్రాహ్మణులు అను అర్థం బోధిస్తుంది. వాస్తవానికి పరివ్రాజకులు కూడ బ్రాహ్మణులలో చేరినవాళ్లే. అయినా వాళ్ల విషయంలో శ్రద్ధావిశేషం చూపడానికి వాళ్లని ప్రత్యేకంగా పేర్కొనడం జరిగింది. అదేవిధంగా పురుషులు కూడ జగత్తులో అంతర్గతులైనా వాళ్లు అబ్రహ్మలు అని చెప్పడంకోసం వాళ్లను వేరుగా పేర్కొని, ఇతరమైన జగత్తును వేరుగా పేర్కొనడం జరిగింది.

## సూ. జీవముఖ్యప్రాణలిఙ్గాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతమ్. 1.4.17.

అథ యదుక్తమ్- వాక్యశేషగతాజ్జీవలిఙ్గాన్ముఖ్యప్రాణలిఙ్గాచ్చ తయోరేవాన్యతరస్య ఇహ గ్రహణం న్యాయ్యం న పరమేశ్వరస్యేతి తత్పరిహర్తవ్యమ్.అత్రోచ్యతే-పరిహృతం చైతత్- "నోపాసాత్రై విధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్" (బ్ర.సూ.1.1.31) ఇత్యత్ర. త్రివిధం హ్యత్రోపాసనమేవం సతి ప్రసజ్యేత, జీవోపాసనం, ముఖ్యప్రాణోపాసనమ్ బ్రహ్మోపాసనం చేతి. న చైతన్న్యాయ్యమ్. ఉపక్రమోపసంహారాభ్యాం హి బ్రహ్మవిషయత్వమస్య వాక్యస్యాగవమ్యతే. తత్రోపక్రమస్య తావద్బ్రహ్మ విషయత్వం దర్శితమ్. ఉపసంహారస్యాపి నిరతిశయఫలశ్రవణాత్ బ్రహ్మవిషయత్వం దృశ్యతే- "సర్వాన్ పాప్మనోఽపహత్య సర్వేషాం చ భూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్యమాధిపత్యం పర్యేతి య ఏవం వేద" ఇతి. నన్వేవం సతి ప్రతర్దనవాక్యనిర్ణయేనైవేదమపి వాక్యం నిర్ణీయేత? న నిర్ణీయతే. "యస్య వైతత్కర్మ" ఇత్యస్య బ్రహ్మవిషయత్వేన తత్రానిర్ధారితత్వాత్. తస్మాదత్ర జీవముఖ్యప్రాణశఙ్కా పునరుత్పద్యమానా నివర్త్యతే. ప్రాణశబ్దోఽపి బ్రహ్మవిషయో దృష్టః "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" (ఛాం.ఉ.6.8-2) ఇత్యత్ర.జీవలిఙ్గమప్యుపక్రమోపసంహరయోర్బ్రహ్మ విషయత్వాదభేదాభిప్రాయేణ యోజయితవ్యమ్.17.

## బాలానందిని

జీవేతి:- "జీవముఖ్యప్రాణలిఙ్గాత్= జీవలింగమూ, ముఖ్యప్రాణలింగమూ ఉండడంవల్ల, నేతి చేత్= పరమేశ్వరుణ్ణి గ్రహించకూడదు అన్నట్లయితే, తత్=అది, వ్యాఖ్యాతమ్=వెనుక ప్రతర్దనాధికరణంలో వివరించబడింది" అని సూత్రార్థం.

అథేతి:- వాక్య శేషంలో ఉన్న జీవలింగంవల్ల, ముఖ్య ప్రాణలింగంవల్ల వాటిలో ఏదో ఒకదానిని గ్రహించాలి కాని పరమేశ్వరుని గ్రహించకూడదు అని ఏది చెప్పబడిందో దానిని పరిహరించవలసి ఉంది. ఇక్కడ చెప్పబడుచున్నది- "నోపాసాత్రై విధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్" అనే చోట ఇది పరిహరించబడింది. ఇలా చెప్పిన పక్షంలో జీవోపాసనం, ముఖ్యప్రాణోపాసనం, బ్రహ్మోపాసనం అని మూడు విధాలైన ఉపాసనం ప్రసక్తం అవుతుంది. ఇది న్యాయసంమతం కాదు. ఎందువల్ల ననగా- ఈ వాక్యం బ్రహ్మ విషయకమని ఉపక్రమోపసంహారాలచేత తెలుస్తూన్నది. ఉపక్రమం

బ్రహ్మవిషయం అనే విషయం పైన చూపబడింది. "సర్వాన్... వేద" (ఈ విధంగా తెలుసుకొన్నవాడు సమస్తపాపాలను పోగొట్టుకొని సమస్త భూతాలలో శ్రేష్ఠత్వాన్ని స్వారాజ్యాన్ని, ఆధిపత్యాన్ని పొందుతాడు (స్వారాజ్యం అనగా ఎవరి అధీనంలోను ఉండకపోవడం) అని ఉపసంహారం కూడ నిరతిశయమైన (దేనికంటె అతిశయం లేదో అట్టి) ఫలం వినబడడంవల్ల బ్రహ్మవిషయక మని కనబడుతున్నది. (ప్రశ్న) అట్లయితే ప్రతర్దనాధికరణంలో చేసిన వాక్యనిర్ణయంచేతనే ఇక్కడ కూడ (ఆ న్యాయాన్ని ప్రవర్తింపచేసి) నిర్ణయం చేయవచ్చును కదా? (ఈ అధికరణం ఎందుకు?) అలా నిర్ణయించడం కుదరదు. "యస్య వైతత్కర్మ" అనేది బ్రహ్మవిషయకం అని అక్కడ నిర్ధారణ చేయబడలేదు కదా? (అనగా కర్మ శబ్దం రూఢిచేత చలనాదికర్మను లేదా ధర్మాధర్మాదికర్మను బోధిస్తుంది గాన పూర్వపక్షానికి అవకాశం ఉంది. తన్నిరాకరణం కొరకు ఈ అధికరణం ప్రత్యేకంగా చెప్పవలసిన పని ఉంది అని భావం) అందువల్ల జీవముఖ్యప్రాణశంక మళ్ళీ పుడుతున్నది గాన అది నివర్తింపచేయబడుచున్నది. "ప్రాణబన్ధనం హి సోమ్య మనః" అని ప్రాణశబ్దం కూడ బ్రహ్మ అనే అర్థంలో ప్రయోగించడం కనబడుతున్నది. ఉపక్రమోపసంహారాలు బ్రహ్మ విషయంగా ఉన్నాయి గాన జీవలింగం, జీవునికి బ్రహ్మకూ అభేదం అనే అభిప్రాయంచేత చెప్పబడినట్లు సమన్వయించాలి. 17.

**సూ. అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపి చైవమేకే. 1.4.18.**

అపి చ నైవాత్ర వివదితవ్యమ్- జీవప్రధానం వేదం వాక్యం స్యాద్బ్రహ్మ ప్రధానం వా ఇతి. యతోఽన్యార్థం జీవపరామర్శం బ్రహ్మప్రతిపత్త్యర్థమస్మిన్ వాక్యే జైమినిరాచార్యో మన్యతే. కస్మాత్? ప్రశ్నవ్యాఖ్యానాభ్యామ్. ప్రశ్నస్తావత్ సుప్తపురుషప్రతిబోధనేన ప్రాణాదివ్యతిరిక్తే జీవే ప్రతిబోధితే పునర్జీవవ్యతిరిక్తవిషయో దృశ్యతే "క్వైష ఏతద్ బాలాకే పురుషోఽశయిష్ట క్వ వా ఏతదభూత్కుత ఏతదాగాత్" (కౌ.బ్రా.4.19) ఇతి. ప్రతివచనమపి "యదా సుప్తః స్వప్నం న కంచన పశ్యతి అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి" ఇత్యాది; "ఏతస్మాదాత్మనః ప్రాణా యథాయతనం విప్రతిష్ఠన్తే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః" (కౌ.బ్రా.4.19.20) ఇతి చ. సుషుప్తికాలే చ పరేణ బ్రహ్మణా జీవ ఏకతాం గచ్ఛతి, పరస్మాచ్చ బ్రహ్మణః ప్రాణాదికం

జగజ్జాయంత ఇతి వేదాన్తమర్యాదా. తస్మాద్యత్రాస్య జీవస్య నిఃసమ్బోధతాస్వచ్ఛతారూపః స్వాప ఉపాధిజనితవిశేషవిజ్ఞానరహితం స్వరూపం యతః తద్భ్రంశ రూపమాగమనం సోఽత్ర పరమాత్మా వేదితవ్యతయా శ్రావిత ఇతి గమ్యతే. అపి చైవమేకే శాఖినః వాజసనేయినః అస్మిన్నేవ బాలాక్యజాతశత్రుసంవాదే స్పష్టం విజ్ఞానమయశబ్దేన జీవమామ్నాయ తద్వ్యతిరిక్తం పరమాత్మానమామనన్తి- "య ఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదాభూత్క్వత ఏతదాగాత్ (బృ.ఉ.2.1.16) ఇతి ప్రశ్నే, ప్రతివచనేఽపి "య ఏషోఽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్ శేతే" ఇతి. ఆకాశశబ్దశ్చ పరమాత్మని ప్రయుక్తః "దహరోఽస్మిన్నన్తరాకాశః" ఇత్యత్ర. "సర్వ ఏవ ఆత్మనో వ్యుచ్ఛన్తి" ఇతి చోపాధిమతామాత్మనామన్యతో వ్యుచ్చరణమామనన్తః పరమాత్మానమేవ కారణత్వేనామనన్తీతి గమ్యతే. ప్రాణనిరాకరణస్యాపి సుషుప్తపురుషోత్థాపనేన ప్రాణాదివ్యతిరిక్తోపదేశః అభ్యుచ్ఛయః. 18.

## బాలానందిని

అన్యేతి:- "ప్రశ్నవ్యాఖ్యానాభ్యామ్= ప్రశ్నను వ్యాఖ్యానమును (సమాధానమును) పట్టి, అన్యార్థమ్= జీవుని పరామర్శ బ్రహ్మజ్ఞానంకోసం చేయబడింది అని, జైమినిః= జైమిన్యాచార్యుడు అభిప్రాయపడుతున్నాడు. అపి చ= మరియు, ఏకే=ఒక శాఖవారు, ఏవమ్= ఇట్లే, అనగా జీవాత్మకంటె భిన్నమైన పరమాత్మను స్పష్టంగా చెపుతున్నారు" అని సూత్రానికి అర్థం.

అపిచేతి:- మరొక విషయ మేమనగా- ఈ వాక్యం జీవప్రధానమా లేక బ్రహ్మ ప్రధానమా అనే విషయంలో వివాదం చేయకూడదు. ఎందువల్ల ననగా ఈ వాక్యంలోని జీవుణ్ణి గూర్చిన పరామర్శ, బ్రహ్మను తెలుసుకొనడంకొరకే అని జైమిన్యాచార్యుడు తలచుచున్నాడు. ఎందువల్ల? ప్రశ్నవ్యాఖ్యానాలవల్ల. నిద్రించుచున్న పురుషుణ్ణి మేలుకొల్పడం ద్వారా జీవుడు ప్రాణాదులకంటె భిన్నుడని తెలిపిన తరవాత మళ్లీ జీవునికంటె భిన్నమైనవానిని గూర్చిన ప్రశ్న "క్వ... అగాత్" అనే వాక్యంలో కనబడుతున్నది. "బాలాకీ! ఈ పురుషుడు, ఈ విధంగా, అనగా విశేషజ్ఞానం ఏదీ లేకుండా, దేనిమీద (ఏ ఆధారంమీద) శయనించాడు.

ఈ పురుషుడు ఈ విధంగా (కలిసి పోయినట్లుగా) ఎక్కడ ఉన్నాడు? అనగా ఎవరితో ఐక్యం పొందాడు? "ఈ విధంగా ఎక్కడినుండి తిరిగివచ్చాడు" అని ఈ ప్రశ్నవాక్యానికి అర్థం. "యదా.... భవతి" అని, "ఏతస్మాత్.. లోకాః" అనీ ప్రతివచనం చెప్పబడింది. జీవుడు సుషుప్తికాలంలో పరబ్రహ్మతో ఏకత్వం పొందుతా డనీ, ప్రాణాదికమైన జగత్తు పరబ్రహ్మనుండి పుడుతుంది అనీ వేదాంతమర్యాద. అందువల్ల- ఏ పరమాత్మయందు ఈ జీవునికి విశేషజ్ఞానం ఏదీ లేకపోవడం స్వచ్ఛత్వం అనగా విక్షేపా లేవీ లేకపోవడం, అనే రూపం గల నిద్ర కలుగుతుందో, ఉపాధులవల్ల కలిగిన విశేషవిజ్ఞానం ఏదీ లేని స్వరూపం మాత్రమే ఉంటుందో, అట్టి స్థితినుండి భ్రంశం పొందడం అనే రూపం గల తిరిగి బైటకు రావడం ఏ పరమాత్మనుండి జరుగుతుందో అట్టి పరమాత్మయే తెలియదగిన వాడుగా ఇక్కడ వినిపింపబడుతున్నాడు అని తెలుస్తున్నది. మరొక విషయం ఏమనగా- వాజసనేయిశాఖకు చెందినవారు ఈ బాలాక్యజాతశత్రుసంవాదంలోనే- "య... ఆగాత్' ' (ఈ విజ్ఞానమయపురుషుడు ఎక్కడ ఉన్నాడు, ఈ విధంగా ఎక్కడినుండి తిరిగి వచ్చాడు) అనే ప్రశ్నలోను, "య... శేతే" (హృదయంలోపల ఏ ఆకాశం ఉన్నదో దానిలో శయనిస్తున్నాడు) అని ప్రతివచనంలోనూ కూడ పరమాత్మనే చెపుతున్నారు. "దహరోఽస్మిన్నన్తరాకాశః" అనేచోట ఆకాశశబ్దం పరమాత్మ అనే అర్థంలో ప్రయోగించబడింది. "సర్వ...వ్యుచ్చరన్తి" (అన్ని ఆత్మలు కూడ పైకి వస్తున్నాయి) అని ఉపాధులతో కూడిన ఆత్మ లన్నీ మరొకచోటి నుండి లేస్తున్నాయి. అని చెపుతూ పరమాత్మయే కారణ మని చెపు తున్నట్లు తెలుస్తూన్నది. సుషుప్త పురుషుణ్ణి లేపడం ద్వారా జీవుడు ప్రాణాదులకంటె భిన్నుడు అని ఉపదేశం ప్రాణనిరాకరణానికి (ఈ వాక్యంలో ప్రతిపాదింపబడేది ప్రాణం కాదు అని చెప్పడానికి) ఉపయోగించే అభ్యుచ్చయం (మరొక లాభం). అనగా జీవుణ్ణి గూర్చి చెప్పడం పరమాత్మ ప్రతిపాదనకోసమే. అయితే జీవుడు ప్రాణాదులకంటె భిన్నుడు అని చెప్పడం, ఈ వాక్యంలో చెప్పబడేది ప్రాణం కాదు అని చెప్పడానికి ఉపయోగించే మరొక కారణం అని భావం.

బాలాక్యధికరణం సమాప్తం

## 6. వాక్యాన్వయాధికరణమ్. సూ.19-22

### సూ. వాక్యాన్వయాత్. 1.4.19.

బృహదారణ్యకే మైత్రేయీబ్రాహ్మణేఽ భిధీయతే- "న వా అరే పత్యుః కామాయ" ఇత్యుపక్రమ్య "న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదధ్యాసితవ్యః మైత్రేయి, ఆత్మనో వా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా, విజ్ఞానేనేదం సర్వం విదితమ్" (బృ.ఉ.4.5.6) ఇతి. తత్రైతద్విచికిత్స్యతే- కిం విజ్ఞానాత్మైవాయం ద్రష్టవ్యశ్రోతవ్యత్వాది రూపేణోపదిశ్యతే ఆహోస్విత్పరమాత్మేతి. కుతః పునరేషా విచికిత్సా? ప్రియసంసూచితేనాత్మనా భోక్త్రా ఉపక్రమాద్విజ్ఞానాత్మోపదేశ ఇతి ప్రతిభాతి. తథాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానోపదేశాత్ పరమాత్మోపదేశ ఇతి. కింతావత్ప్రాప్తమ్? విజ్ఞానాత్మోపదేశఇతి.కస్మాత్? ఉపక్రమసామర్థ్యాత్. పతిజాయా పుత్రవిత్తాదికం హి భోగ్యజాతం సర్వం జగత్ ఆత్మార్థతయా ప్రియం భవతీతి ప్రియసంసూచితం భోక్తారమాత్మానముపక్రమ్య అనన్తరమిదమాత్మనః దర్శనాద్యుపదిశ్యమానం కస్యాన్యస్యాత్మనః స్యాత్? మధ్యేఽపి "ఇదం మహద్భూతమనన్తమపారం విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి" ఇతి ప్రకృతస్యైవ మహతో భూతస్య ద్రష్టవ్యస్య భూతేభ్యః సముత్థానం విజ్ఞానాత్మభావేన బ్రువన్ విజ్ఞానాత్మన ఏవేదం ద్రష్టవ్యత్వం దర్శయతి. తథా- "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" ఇతి కర్తృవచనేన శబ్దేనోపసంహరన్ విజ్ఞానాత్మానమేవోపదిష్టం దర్శయతి. తస్మాదాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానవచనం భోక్త్రర్థత్వాద్భోగ్యజాతస్య ఔపచారికం ద్రష్టవ్యమితి.

### బాలానందిని

వాక్యేతి:- "వాక్యాన్వయాత్= పూర్వాపరపరామర్శ చేయగా వాక్యం పరమాత్మయందే అన్వయించడంవల్ల, పరమాత్మయే ప్రతిపాదించబడుతున్నాడు" అని సూత్రార్థం.

బృహదారణ్యక ఇతి:- బృహదారణ్యకంలోని మైత్రేయీబ్రాహ్మణంలో "న వా అరే పత్యుః కామాయ" అని ఉపక్రమించి "న వా... విదితమ్" (ఓ! మైత్రేయీ! ప్రతిదాని యొక్క కామంకొరకు ప్రతిదీ ఇష్టం అవడం లేదు. ప్రతిదీ ఆత్మకొరకే (తన కామం కొరకే ప్రియం అవుతుంది. (అందుచేత) ఆత్మ చూడదగినది, ఎరుగదగినది, మననం చేయదగినది, నిదిధ్యాసనం చేయదగినది. ఆత్మయొక్క దర్శనంచేత, శ్రవణంచేత, మననంచేత, విజ్ఞానంచేత ఇదంతా తెలియబడినది అవుతుంది) అని పఠించబడుతున్నది. అక్కడ ఇది సందేహింపబడుతున్నది (విచారించబడుతున్నది)- ద్రష్టవ్యుడుగాను శ్రోతవ్యుడుగాను చెప్పబడుచున్నది, విజ్ఞానాత్మయా లేక పరమాత్మయా. ఈ సంశయం ఎందుకు కలిగింది? ప్రియవస్తువులచేత సూచించబడిన (ప్రియమైన జాయాదులు జీవునకే ఉంటాయి గాన) భోక్తయైన ఆత్మతో ప్రారంభించడంచేత ఇది విజ్ఞానాత్మయొక్క ఉపదేశ మని తోస్తుంది. అట్లే ఆత్మవిజ్ఞానంచేత సర్వమూ తెలుస్తుంది అని చెప్పడంచేత పరమాత్మోపదేశం కావచ్చు నని కూడ తోస్తుంది. ఏమి ప్రాప్తించింది? విజ్ఞానాత్మోపదేశం అని. ఎందువల్ల? ఉపక్రమసామర్థ్యంవల్ల. భోగ్యమైన పతి-భార్యా-పుత్ర-ధనాదికమైన ఈ జగత్తంతా తనకోసమే ప్రియం అవుతుం దని ప్రియసంసూచితమైన భోక్తయైన ఆత్మను ఉపక్రమించి తరవాత చెప్పబడుచున్న ఈ ఆత్మదర్శనాదికం మరి ఏ ఆత్మకు సంబంధించినది అవుతుంది? మధ్యలో కూడ "ఇదం... సంజ్ఞాస్తి" (అపరిచ్ఛిన్నమూ, సత్యమూ అనంతమూ, సర్వగతమూ, కేవలచిద్రూపమూ అయిన ఇది దేహేంద్రియాదిరూపంలో ఆవిర్భవిస్తూన్న భూతాలతో పాటు లేచి అనగా భూతాలు ఉపాధిగా గల జన్మను పొంది లీనమై వాటితో పాటే నశిస్తున్నది; మరణానంతరం విశేషజ్ఞానం ఏదీ లేదు) అని ప్రకృతమైన ద్రష్టవ్యమైన ఆ మహాభూతమే విజ్ఞానాత్మ రూపంలో భూతాలనుండి లేస్తున్నది (ఆవిర్భవిస్తూన్నది) అని చెప్పి; ఈ ద్రష్టవ్యత్వం విజ్ఞానాత్మకే (చూడాలని చెప్పబడింది విజ్ఞానాత్మయే) అని చూపుతున్నది. అట్లే "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" (విజ్ఞాతను అనగా విజ్ఞానకర్తను దేనిచేత తెలుసుకొనడం కుదురుతుంది) అని కర్తృవాచకమైన (విజ్ఞాతారమ్ అనే) శబ్దంచేత ఉపసంహరిస్తూ ఇక్కడ ఉపదేశించబడినది విజ్ఞానాత్మయే అని చూపుతున్నాడు. అందువల్ల ఆత్మవిజ్ఞానంవల్ల సర్వమూ తెలియబడుతుంది అని చెప్పడం భోగ్యా లన్నీ భోక్తకోసం ఏర్పడినవే గాన ఔపచారిక మని గ్రహించాలి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- పరమాత్మోపదేశ ఏవాయమ్. కస్మాత్ వాక్యాన్వయాత్. వాక్యం హీదం పౌర్వాపర్యేణావేక్ష్యమాణం పరమాత్మానం ప్రత్యన్వితావయవం లక్ష్యతే. కథమితి? తదుపపాద్యతే- "అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన" ఇతి యాజ్ఞవల్క్యాదుపశ్రుత్య "యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహి'' ఇత్యమృతత్వమాశాసానాయై మైత్రేయ్యై యాజ్ఞవల్క్య ఆత్మవిజ్ఞాన మేతదుపదిశతి.న చాన్యత్ర పరమాత్మవిజ్ఞానాదమృతత్వమస్తీతి శ్రుతిస్మృతి వాదా వదన్తి. తథాచాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానముచ్యమానం నాన్యత్ర పరమకారణవిజ్ఞానాన్ముఖ్యమవకల్పతే.న చైతదౌపచారికమాశ్రయితుం శక్యమ్, యత్కారణమాత్మవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాయానన్తరేణ గ్రన్థేన తదేవోపపాదయతి "బ్రహ్మ తం పరాదాద్యోన్యత్రాత్మనో బ్రహ్మ వేద" ఇత్యాదినా. యో హి బ్రహ్మక్షత్రాదికం జగదాత్మనోఽన్యత్ర స్వాతన్త్ర్యేణ లబ్ధ సద్భావం పశ్యతి తం మిథ్యాదర్శినం తదేవ మిథ్యాదృష్టం బ్రహ్మక్షత్రాదికం జగతపరాకరోతీతి భేదదృష్టిమపోద్య "ఇదం సర్వం యదయమాత్మా"ఇతి సర్వస్య వస్తుజాతస్యాత్మావ్యతిరేకమవతారయతి. దున్దుభ్యాదిదృష్టాన్తైశ్చ (బృ.ఉ.4.4.8) తమేవావ్యతిరేకం ద్రఢయతి. "అస్య మహతో భూతస్య నిః శ్వసితమేతద్యదృగ్వేదః" (బృ.ఉ.4.5.11) ఇత్యాదినా చ ప్రకృతస్యాత్మనో నామరూపకర్మప్రపఞ్చకరణతాం వ్యాచక్షాణః పరమాత్మానమేనం గమయతి. తథైవైకాయనప్రక్రియాయామపి (బృ.ఉ..4.5.12) సవిషయస్యేన్ద్రియస్య సాన్తఃకరణస్య ప్రపఞ్చస్యైకాయతనమనన్తరమబాహ్యం కృత్స్నం ప్రజ్ఞానఘనం వ్యాచక్షాణః పరమాత్మానమేనం గమయతి. తస్మాతపరమాత్మన ఏవాయం దర్శనాద్యుపదేశ ఇతి గమ్యతే.

వి. "న వా అరే పత్యుః కామాయ" ఇత్యాదివాక్యం విషయవాక్యం. వెనుకటి ప్రకరణంలో "బ్రహ్మ తే బ్రవాణి" అని ఉపక్రమంలో ఉండడంవల్ల దాని బలంచేత అది బ్రహ్మపరం అని నిర్ణయించబడింది. అట్లే ఇక్కడ ఉపక్రమంలో జీవుని సూచన

ఉండడంచేత ఈ వాక్యం జీవపరం అని దృష్టాంతసంగతిచేత పూర్వపక్షం. పూర్వపక్షంలో వాక్యం జీవోపాసనను బోధిస్తుంది. సిద్ధాంతంలో జ్ఞేయమైన బ్రహ్మయందు వాక్యానికి సమన్వయం.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించిచగా చెపుతున్నాం- ఇది పరమాత్మయొక్క ఉపదేశమే. ఎందువల్ల? వాక్యాన్వయంవల్ల. ఈ వాక్యాన్ని పౌర్వాపర్యంతో (ముందు వెనుకలతో) పరిశీలిస్తే దీని అవయవా లన్నీ పరమాత్మ విషయంలో సమన్వయించేవిగా కనబడుతున్నాయి. అది ఎట్లు? అది నిరూపించబడుతున్నది- "అమృతత్వస్య...విత్తేన" (ధనంచేత మోక్షం లభిస్తుం దనే ఆశ లేదు) అని యాజ్ఞవల్క్యునినుండి విని "యేన...బ్రూహి" (నేను దేనివల్ల అమృతురాలను కానో అలాంటి ధనంతో నేనేమి చేసికొంటాను? పూజ్యుడవైన నువ్వు నీకు తెలిసినదానినే నాకు ఉపదేశించుము) అని అమృతతత్వాన్ని కోరుతూన్న మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు ఆత్మవిజ్ఞానం ఉపదేశిస్తున్నాడు. పరమాత్మజ్ఞానం తప్ప మరి దేనివల్లా అమృతత్వం లభించదు అని శ్రుతి-స్మృతివాదాలు చెపుతున్నాయి. అట్లే ఆత్మవిజ్ఞానంచేత సర్వమూ తెలుస్తుంది అని చెప్పిన ముఖ్య మైన సర్వవిజ్ఞానం పరమకారణ మైన పరమాత్మయొక్క జ్ఞానంవల్ల తప్ప మరొకదానివల్ల సంభవించదు. ఇది ఔపచారికం అనడానికి వీలులేదు. ఎందువల్ల ననగా- ఆత్మవిజ్ఞానంచేత సర్వవిజ్ఞానాన్ని ప్రతిజ్ఞచేసి "బ్రహ్మ...వేద" (ఎవడు బ్రహ్మ ఆత్మకంటె భిన్నమైనది అని భావిస్తాడో వానిని ఆ బ్రహ్మయే తినివేస్తుంది) ఇత్యాదికమైన తరవాతి గ్రంథంచేత ఆ విషయాన్నే ఉపపాదిస్తాడు (సమర్థిస్తాడు). బ్రహ్మక్షత్రాదికమైన ఈ జగత్తు ఆత్మకంటె భిన్నంగా స్వతంత్రంగా ఉన్నది అని ఎవడు అనుకుంటాడో మిథ్యాదర్శి యైన (అసత్యదృష్టి గల)వానిని మిథ్యాదృష్టమైన (పొరబాటుగా చూడబడిన) ఆ బ్రహ్మక్షత్రాదికజగత్తే శ్రేయోమార్గంనుండి దూరం చేస్తుంది అని భేదదృష్టిని నిరాకరించి "ఇదం సర్వం యదయమాత్మా" అని సమస్తవస్తుసముదాయమూ కూడ ఆత్మకంటె భిన్నంగా లేదు అనే విషయాన్ని అవతరింపచేస్తాడు (ప్రవేశపెడతాడు). ఆ అవ్యతిరేకాన్నే (పరమాత్మకంటె భిన్నంగా జగత్తు లేదు అనే విషయాన్నే) దుందుభ్యాదిదృష్టాంతంచేత చూపుతాడు.

వి. దుందుభి, శంఖం, వీణ మొదలైన వాద్యా లన్నీ ఒక్క మాటుగా ప్రయోగించినప్పుడు ఒక సామాన్యమైన పెద్ద ధ్వని మాత్రమే వినిపిస్తుంది. దుందుభ్యాదుల విశేషధ్వనులు ఆ సామాన్యధ్వనిలో లీన మైపోతాయి. అందుచేత

ఇది దుందుభి ధ్వని, ఇది శంఖ ధ్వని, ఇది వీణాధ్వని అని వేరు వేరుగా తెలియదు. అయితే ఆ విశేషధ్వనులు కూడ వినబడుతూనే ఉంటాయి. ఆ సామాన్యధ్వనిమీద విశేషధ్వనులు ఆరోపించబడ్డాయి. శుక్తికను గ్రహించడంచేత గ్రహింపబడిన రజతం ఆ శుక్తికమీద ఆరోపించబడి నట్లే సామాన్యధ్వనిగ్రహణంచేత గ్రహింపబడిన ఆ విశేషధ్వనులు సామాన్యధ్వనిమీద ఆరోపించబడుతున్నాయి. అదే విధంగా ఆత్మయొక్క భానంచేత భాసింపబడే సర్వమూ కూడ ఆత్మమాత్రమే, ఆత్మకంటె భిన్నం కాదు అని దుందుభిదృష్టాంతం ద్వారా చెప్పబడింది.

"అస్య...ఋగ్వేదః" (ఋగ్వేదాదికం ఈ మహాభూతంయొక్క నిఃశ్వాసమే) ఇత్యాదికంచేత ప్రకృతమైన ఆత్మయే నామ-రూప-కర్మాత్మకమైన ప్రపంచానికి కారణం అని చెపుతూ ఇది పరమాత్మయే అని తెలుపుతున్నాడు. అట్లే ఏకాయనప్రక్రియలో కూడ విషయాలతో, ఇంద్రియాలతో, అంతఃకరణంతో సహా ప్రపంచాని కంతకీ, లోపలా, వెలుపలా అనే భేదం లేకుండా పూర్తి ప్రజ్ఞానంయొక్క ముద్ద అయిన పరమాత్మయే ఏకైక స్థానం అని చెపుతూ ఇది పరమాత్మయే యని తెలుపుతున్నాడు. (అన్ని జలాలకీ సముద్రమే ఏ విధంగా ఏకైకస్థానమో అట్లే సకల ప్రపంచం ప్రలయం పొందే ఏకైకస్థానం బ్రహ్మయే అని ఏకాయతన ప్రక్రియలో చెప్పబడింది). అందుచేత ఈ దర్శనాద్యుపదేశం పరమాత్మకు సంబంధించినదే (అనగా ఇక్కడ చూడాలి, వినాలి, మననం చెయ్యాలి అని చెప్పినది పరమాత్మను గూర్చియే)అని తెలుస్తూన్నది. 19.

## భాష్యమ్

యత్పునరుక్తం-ప్రియసంసూచితోపక్రమాద్విజ్ఞానాత్మన ఏవాయం దర్శనాద్యుపదేశ ఇతి, అత్ర బ్రూమః—

సూ. ప్రతిజ్ఞాసిద్ధేర్లిఙ్గమాశ్మరథ్యః. 1.4.20.

అస్త్యత్ర ప్రతిజ్ఞా "ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి", "ఇదం సర్వం యదయమాత్మా" ఇతి చ. తస్యాః ప్రతిజ్ఞాయాః సిద్ధిం సూచయత్యేతల్లిఙ్గంయత్ప్రియసంసూచితస్యాత్మనో ద్రష్టవ్యత్వాది సంకీర్తనమ్. యది హి విజ్ఞానాత్మా పరమాత్మనోఽన్యః స్యాత్తతః పరమాత్మవిజ్ఞానేఽపి విజ్ఞానాత్మా న విజ్ఞాత ఇత్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం యత్ ప్రతిజ్ఞాతం తద్ధీయేత. తస్మాత్ ప్రతిజ్ఞాసిద్ధ్యర్థం విజ్ఞానాత్మపరమాత్మనోరభేదాంశేనోపక్రమణమిత్యాశ్మరథ్య ఆచార్యో మన్యతే. 20.

## బాలానందిని

ప్రతిజ్ఞేతి:- "ప్రతిజ్ఞాసిద్ధేః= "ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" ఇత్యాదిప్రతిజ్ఞకు, లిఙ్గమ్=ద్రష్టవ్యత్వాద్యుపదేశం లింగం" అని ఆశ్మరథ్యుని అభిప్రాయం" అని సూత్రార్థం.

అస్తీతి:- ఇక్కడ "ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" అని "ఇదం సర్వం యదయమాత్మా" అనీ ప్రతిజ్ఞ ఉంది. ప్రియసంసూచితమైన జీవాత్మ ద్రష్టవ్యం, శ్రోతవ్యం ఇత్యాదివిధంగా చెప్పడం ఆ ప్రతిజ్ఞయొక్క సిద్ధిని సూచిస్తూన్నది. విజ్ఞానాత్మ (జీవుడు) పరమాత్మకంటె అన్యుడైతే పరమాత్మను తెలుసుకొన్నా కూడ విజ్ఞానాత్మను తెలుసుకొనడం ఉండదు గాన 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్" అని చెప్పిన మాట కుదరదు. అందువల్ల ఆ ప్రతిజ్ఞ సిద్ధించడంకోసం విజ్ఞానాత్మపరమాత్మలలో ఉన్న అభేదాంశాన్ని పురస్కరించుకొని ఈ ఘట్టం ప్రారంభించబడింది అని ఆశ్మరథ్యు డనే ఆచార్యుడు అభిప్రాయపడుతున్నాడు.

వి. జీవబ్రహ్మల మధ్య భేదమూ ఉంది అభేదమూ ఉంది. అభేదాంశాన్ని దృష్టిలో పెట్టుకొని జీవునితో ప్రారంభించి "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్" అనేది సమర్థించబడింది అని ఈ ఆచార్యుని అభిప్రాయం.20.

## సూ. ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః 1.4.21

విజ్ఞానాత్మన ఏవ దేహేన్ద్రియమనోబుద్ధిసంఘాతోపాధిసంపర్కాత్ కలుషీభూతస్య జ్ఞానధ్యానాదిసాధనానుష్ఠానాత్ సంప్రసన్నస్య దేహాదిసంఘాతాదుత్క్రమిష్యతః పరమాత్మైక్యోపపత్తేరిదమభేదేనోపక్రమణమిత్యౌడులోమిరాచార్యోమన్యతే. శ్రుతిశ్చైవం భవతి-"ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయపరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛా.ఉ.8.2.3) ఇతి. క్వచిచ్చ జీవాశ్రయమపి నామరూపం నదీనిదర్శనేన జ్ఞాపయతి-

"యథా నద్యః స్యన్దమానాః సముద్రేఽస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ,

తథా విద్వాన్ నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్" (ము.ఉ.3.2.8) ఇతి. యథా లోకే నద్యః స్వాశ్రయమేవ నామరూపం విహాయ సముద్రముపయన్త్యేవం జీవోఽపి స్వాశ్రయమేవ నామరూపం విహాయ పరంపురుషముపైతీతి హి తత్రార్థః ప్రతీయతే,దృష్టాన్త దార్ష్టాన్తిక యోస్తుల్యతాయై.21.

### బాలానందిని

ఉత్క్రమిష్యత ఇతి:- "ఉత్క్రమిష్యతః= దేహాద్యుపాధులనుండి పైకి లేచిపోబోయే జీవునకు, ఏవంభావాత్= పరమాత్మతో ఐక్యం కుదురుతుంది గాన విజ్ఞానాత్మోపదేశం చేయబడింది" అని, ఔడులేమిః= ఔడులేమి చెపుతున్నాడు" అని సూత్రార్థం.

విజ్ఞానాత్మన ఇతి:- దేహేంద్రియమనోబుద్ధ్యాదుల సంఘాతం అనే ఉపాధితో సంపర్కంవల్ల కలుష మైపోయిన జీవుడే జ్ఞానధ్యానాదిసాధనాలను అనుష్ఠించి సంప్రసన్నుడై (నిర్మలుడై) దేహాదిసముదాయంనుండి పైకి వెళ్లిపోయి నప్పుడు పరమాత్మతో ఐక్యం కుదురుతుంది గాన ఈ విధంగా (జీవపరమాత్మల) అభేదంతో ఉపక్రమం చేయబడింది అని ఔడులోమి అనే ఆచార్యుడు భావిస్తున్నాడు. ఈ విధంగా "ఏష... అభినిష్పద్యతే" అని శ్రుతి కూడ చెపుతూన్నది. కొన్ని చోట్ల "యథా... దివ్యమ్" (ప్రవహిస్తూన్న నదులు తమ నామరూపాలను విడచి ఏ విధంగా సముద్రంలో లీనమైపోతాయో అట్లే జ్ఞానవంతుడు తన నామరూపాలను విడచి దివ్యుడైన పరాత్పరుణ్ణి చేరుతాడు) ఇత్యాదిశ్రుతులు నదులను ఉదాహరణంగా చూపి జీవునికి నామరూపాలు ఉన్నాయి అని చెవుతున్నాయి. ఆ శ్రుతివాక్యంలో దృష్టాంతదార్‌ష్టాంతికాలకు సామ్యం చెప్పడానికై- ఏ విధంగా లోకంలో, నదులు తమ కున్న నామరూపాలను విడచి సముద్రంలో లీనం అయిపోతాయే అట్లే జీవుడు కూడ తన కున్న నామరూపాలను విడచి పరమ పురుషుణ్ణి చేరుతాడు అనే అర్థం తెలుస్తూన్నది కదా.

వి. సంసారదశ సత్యమే. ఆ దశలో భేదం కూడ సత్యమే. ముక్తావస్థలో మాత్రమే అభేదం అని ఔడులోమి అభిప్రాయం. 21.

### సూ. అవస్థితేరితి కాశకృత్స్నః 1.4.22

అస్యైవ పరమాత్మనోఽనేఽనాపి విజ్ఞానాత్మభావేనావస్థానాదుప పన్నమిదమభేదేనోపక్రమణమితి కాశకృత్స్న ఆచార్యో మన్యతే. తథా చ బ్రాహ్మణమ్- "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా.ఉ.6.3.2) ఇత్యేవంజాతీయకం పరస్యైవాత్మనో జీవభావేనావస్థానం దర్శయతి. మన్త్రవర్ణశ్చ "సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాభివదన్యదాస్తే" (తై.ఆ.3.12.7) ఇత్యేవంజాతీయకః. న చ తేజః ప్రభృతీ నాం సృష్టౌ జీవస్య పృథక్ సృష్టిః శ్రుతా యేన పరస్మాదాత్మనోఽన్యస్తద్వికారో జీవః స్యాత్.

కాశకృత్స్నస్యాచార్యస్య అవికృతః పరమేశ్వరో జీవో నాన్య ఇతి మతమ్. ఆశ్మరథ్యస్య తు యద్యపి జీవస్య పరస్మాదనన్యత్వమభిప్రేతం తథాపి ప్రతిజ్ఞాసిద్ధేరితి సాపేక్షత్వాభిధానాత్ కార్యకారణభావః కియానప్యభిప్రేత ఇతి గమ్యతే. ఔడులోమిపక్షే పునః స్పష్టమేవావస్థాన్తరాపేక్షౌ భేదాభేదౌ గమ్యేతే. తత్ర కాశకృత్స్నీయం మతం శ్రుత్యనుసారీతి గమ్యతే ప్రతిపిపాదయిషితార్థానుసారాత్-తత్త్వమస్యాదిశ్రుతిభ్యః.

బాలానందిని

అవస్థితేరితి:- పరమాత్మయే విజ్ఞానాత్మరూపంలో ఉండడంచేత అభేదంచేత ఉపక్రమించడంలో దోషం లేదు అని కాశకృత్స్ను డనే ఆచార్యు డన్నాడు. "అనేన...వ్యాకరవాణి" ఇత్యాదివిధమైన బ్రాహ్మణం పరమాత్మయే జీవుడుగా ఉన్నాడు అని చూపుతూన్నది. "సర్వాణి...ఆస్తే" (సర్వజ్ఞుడైన పరమాత్మ సమస్తరూపాలను సృజించి, వాటికి పేర్లు కూడ పెట్టి ఆ బుద్ధ్యాదులయందు ప్రవేశించి మాటలాడుతూ (వ్యవహరిస్తూ) ఉంటాడు) అని, ఇంకా ఇటువంటి మంత్రవర్ణాలు పరమాత్మయే జీవుడుగా ఉన్నా డని చూపుతున్నాయి. తేజస్సు మొదలైన వాటిని సృష్టించి నట్లు చెప్పి నప్పుడు జీవుణ్ణి కూడ పరమాత్మ సృజించాడు అని చెప్పలేదు. అలా చెప్పి ఉన్నట్లయితే జీవుడు కూడ పరమాత్మకంటె భిన్నమైన ఒక కార్యం అయి ఉండేవాడు.

ఎట్టి వికారాలు లేని పరమేశ్వరుడే జీవుడు, భిన్నుడు కాడు అని కాశకృత్స్ముని మతం. ఆశ్మరథ్యుని కైతే జీవుడు పరమాత్మకంటె భిన్నుడు కాడని మతమే అయినా కూడ 'ప్రతిజ్ఞాసిద్ధేః, అని ఆ అభేదం సాపేక్ష మైన దని (కొన్ని షరతులమీద ఆధారపడి ఉందని) అనడంవల్ల ఏదో కొంత కార్యకారణభావం (జీవపరమాత్మల మధ్య) ఉన్నట్లు అతడభిప్రాయపడుతున్నాడని కనబడుతున్నది. ఔడులోమి పక్షంలో నైతే జీవపరమాత్మల మధ్య అవస్థాభేదాన్ని పట్టి భేదాభేదాలు (సంసార్యవస్థలో భేదం, ముక్తావస్థలో అభేదం) ఉన్నట్లు స్పష్టంగా కనబడుతుంది. ఈ మూడు మతాలలో కాశకృత్స్ముని మతం "తత్త్వమసి" ఇత్యాదివాక్యాల ననుసరించి శ్రుతి చెప్పదలచిన అభేదరూపార్థాన్ని అనుసరించడంచేత శ్రుత్యనుసారిగా ఉన్నట్లు కనబడుతున్నది.

భాష్యమ్

ఏవం చ సతి తద్జ్ఞానాదమృతత్వమవకల్పతే. వికారాత్మకత్వే హి జీవస్యాభ్యుపగమ్యమానే వికారస్య ప్రకృతిసంబన్ధే విలయప్రసఙ్గాత్ న తద్

జ్ఞానాదమృతత్వమవకల్పేత. అతశ్చ స్వాశ్రయస్య నామరూప స్యాసంభవాదుపాధ్యాశ్రయం నామరూపం జీవ ఉపచర్యతే. అత ఏవోత్పత్తిరపి జీవస్య క్వచిదగ్నివిస్ఫులిఙ్గోదాహరణేన శ్రావ్యమాణో పాధ్యాశ్రయైవ వేదితవ్యా.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లయితేనే అనగా జీవేశ్వరులకు అత్యంతాభేదం ఉంటేనే దాని జ్ఞానంవల్ల (అభేదజ్ఞానంవల్ల) అమృతత్వం కుదురుతుంది. (ఘటం మృద్వికారం అన్నట్లు) జీవుడు పరమేశ్వరుని వికారం అని అంగీకరిస్తే వికారానికి తన ప్రకృతితో సంబంధం కలగగానే ప్రలయం కలుగుతుంది గాన జీవుడు కూడ ప్రలయం పొందుతాడు అని చెప్పవలసి వస్తుంది. అప్పుడు అభేదజ్ఞానంవల్ల అమృతత్వం కలుగుతుంది అని చెప్పడం కుదరదు. అనగా కుండ మట్టిలో లీనం అయిపోయి నట్లు ప్రలయం చెందడమే అవుతుంది. దానికి 'అమృతత్వం' అనే గొప్ప పేరు అనుచితం అవుతుంది. అందువల్లనే (జీవుడు పరమేశ్వరాభిన్నుడు అవడంవల్లనే) జీవునకు తన నామరూపాలు అంటూ ఏవీ ఉండడానికి వీలు లేదు గాన ఉపాధులకు సంబంధించిన నామరూపమే వానియందు ఆరోపించబడుతున్నది. అందుచేత నిప్పు నెరసులను ఉదాహరణంగా చూపి (జీవుడు పరమాత్మనుండి మహాగ్నినుండి నెరసులు బయలుదేరి నట్లు పుట్టుచున్నాడు) అని కొన్ని చోట్ల వినబడుతున్న జీవుని ఉత్పత్తి కూడ ఉపాధికల్పితమే అని తెలుసుకోవాలి.

## భాష్యమ్

యదప్యుక్తం-ప్రకృతస్యైవ మహతో భూతస్య ద్రష్టవ్యస్య భూతేభ్యః సముత్థానం విజ్ఞానాత్మభావేన దర్శయన్ విజ్ఞానాత్మన ఏవేదం ద్రష్టవ్యత్వం దర్శయతి ఇతి, తత్రాపీయమేవ త్రిసూత్రీ యోజయితవ్యా. "ప్రతిజ్ఞాసిద్ధేర్లిఙ్గమాశ్మరథ్యః". ఇదమత్ర ప్రతిజ్ఞాతమ్- "ఆత్మని విదితే సర్వం విదితం భవతి" ఇతి, "ఇదం సర్వం యదయమాత్మా" (బృ.ఉ.2.4.6) ఇతి చ. ఉపపాదితం చ సర్వస్య నామరూపకర్మప్రపఞ్చస్యైకప్రసవత్వాదేక ప్రలయత్వాచ్చ దున్దుభ్యాదిదృష్టాన్తైశ్చ కార్యకారణయోరవ్యతిరేక ప్రతిపాదనాత్. తస్యా ఏవ ప్రతిజ్ఞాయాః సిద్ధిం సూచయత్యేతల్లిఙ్గం

యన్మహతో భూతస్య ద్రష్టవ్యస్య భూతేభ్యః సముత్థానం విజ్ఞానాత్మభావేన కథితమిత్యాశ్మరథ్య ఆచార్యో మన్యతే. అభేదే హి సత్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాతమవకల్పత ఇతి. "ఉత్క్రమిష్యత ఏవం భావాదిత్యౌడులోమిః"- ఉత్క్రమిష్యతో విజ్ఞానాత్మనో జ్ఞానధ్యానాదిసామర్థ్యాత్ సంప్రసన్నస్య పరేణాత్మనైక్యసంభవాదిదమభేదాభిధానమిత్యౌడులోమిరాచార్యో మన్యతే. "అవస్థితేరితి కాశకృత్స్నః"- అస్యైవ పరమాత్మనోఽనేనాపి విజ్ఞానాత్మభావేన అవస్థానాదుపపన్నమిదమభేదాభిధానమితి కాశకృత్స్న ఆచార్యో మన్యతే.

## బాలానందిని

యదితి:- ప్రకృతము, ద్రష్టవ్యమూ అయిన మహాభూతమే విజ్ఞానాత్మగా భూతములనుండి (భూతరూపోపాధితో) ఉత్థిత మైనది అని చెపుతూ ఇక్కడ ద్రష్టవ్యంగా చెప్పబడినది విజ్ఞానాత్మయే అని (పూర్వపక్షి) చెప్పినదానికి సమాధానంగా ఈ మూడు సూత్రాలనే అన్వయించుకోవాలి. "ప్రతిజ్ఞాసిద్ధేర్లిఙ్గమాశ్మరథ్యః"- ఇక్కడ "ఆత్మని...భవతి' ' అని, "ఇదం సర్వంయదయమాత్మా" అనీ చెప్పబడింది. సమస్తమైన నామ-రూప-కర్మ రూపమైన ప్రపంచం ఒకదానినుండే పుట్టడంవల్ల దానియందే లీనమవడంవల్లా, దుందుభ్యాదిదృష్టాంతాలచేత, కార్యకారణాలకు భేదం లేదు అని ప్రతిపాదించి ఈ విషయం (సర్వం విదితం భవతి' అనే విషయం) ఉపపాదించబడింది కూడ. ద్రష్టవ్యమైన మహాభూతం విజ్ఞానాత్మగా భూతాలనుండి పుట్టింది అని ఏదైతే చెప్పబడిందో ఈ లింగం ఆ ప్రతిజ్ఞయొక్క సిద్ధినే సూచిస్తూన్నది అని ఆశ్మరథ్యుడనే ఆచార్యుడు చెపుతున్నాడు. అభేదం ఉన్నప్పుడే 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం' అనే ప్రతిజ్ఞ కుదురుతుంది కదా?

వి. మహాభూతమే, అనగా ప్రకృతమైన బ్రహ్మయే, శరీరేంద్రియద్యుపాధులతో విజ్ఞానాత్మగా పుట్టింది అని చెప్పడంచేత కార్యకారణాలైన విజ్ఞానాత్మపరమాత్మలకు అభేదం చెప్పినట్లయింది. ఇలా చెప్పడంచేత 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం' అనే ప్రతిజ్ఞ కుదురుతుంది అని భావం.

ఉత్క్రమిష్యత ఇతి:- "ఉత్క్రమిష్యత ఏవం భావాదిత్యౌడులోమిః" జ్ఞానధ్యానాదిసామర్థ్యంవల్ల పరిశుద్ధుడై ఈ దేహంనుండి ఉత్క్రమింప నున్న విజ్ఞానాత్మ పరమాత్మతో ఐక్యం పొందడం సంభవమే గాన అభేదం చెప్పబడింది అని ఔడులోమి అనే ఆచార్యుడు అభిప్రాయపడుతున్నాడు. "అవస్థితేరితి కాశకృత్స్నః"- ఈ పరమాత్మయే విజ్ఞానాత్మరూపంలో కూడ ఉండడంవల్ల ఈ అభేదవచనం యుక్తమే అని కాశకృత్స్ను డనే ఆచార్యుడు చెపుతున్నాడు.

భాష్యమ్

ననూచ్ఛేదాభిధానమేతత్- "ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి, న ప్రేత్య సంజ్ఞాస్తి" (బృ.ఉ.2.4.12) ఇతి. కథమేతదభేదాభిధానమ్? నైష దోషః. విశేషవిజ్ఞానవినాశాభిప్రాయమేతద్వినాశాభిధానం నాత్మోచ్ఛేదాభిప్రాయమ్. "అత్రైవ మా భగవానమూముహన్న ప్రేత్య సంజ్ఞాస్తి" ఇతి పర్యనుయుజ్య, స్వయమేవ శ్రుత్యార్థాన్తరస్య దర్శితత్వాత్- "న వా అరేఽహం మోహం బ్రవీమి, అవినాశీ వా అరేఽయమాత్మాఽనుచ్ఛిత్తిధర్మా మాత్రాసంసర్గస్త్వస్య భవతి" ఇతి. ఏతదుక్తం భవతి-కూటస్థనిత్య ఏవాయం విజ్ఞానఘన ఆత్మా, నాస్యోచ్ఛేదప్రసఙ్గోఽస్తి. మాత్రాభిస్త్వస్య భూతేన్ద్రియలక్షణాభిః అవిద్యాకృతాభిః అసంసర్గో విద్యయా భవతి. సంసర్గాభావే చ తత్కృతస్య విశేషవిజ్ఞానస్యాభావాన్న ప్రేత్య సంజ్ఞాస్తీత్యుక్తమితి.

బాలానందిని

నన్వితి:- "ఏతేభ్యో... అస్తి" అనేది వినాశాన్ని చెప్పేది కదా? ఇది అభేదాన్ని చెప్పేది ఎట్లవుతుంది? ఈ దోషం లేదు. ఈ వినాశవచనం విశేషవిజ్ఞానం నశిస్తుందని చెప్పడమే కాని ఆత్మయే నశిస్తుం దని చెప్పడం కాదు. "అత్రైవ... అస్తి" (పూజ్యుడవైన నువ్వు "న ప్రేత్య సంజ్ఞాస్తి" అని చెప్పి నన్ను మోహింపచేయకుము- అలా చెపితే జీవాత్మ నశిస్తుంది అని చెప్పిన ట్లవుతుంది కదా అని భావం) అని ఎదురు ప్రశ్న వేసి శ్రుతిచేత స్వయంగా మరొక అర్థం-"న...భవతి" (ఓయీ! నేను మోహకరమైన వాక్యం పలకడంలేదు, ఈ ఆత్మ వినాశం పొందడానికి తగిన హేతువు లేవీ లేనిది, వినాశం లేనిది, కేవలం దీనికి మాత్రాస్పర్శ (ఇంద్రియాల ద్వారా విషయసంబంధం) ఉంటుంది అని చూపబడింది. ఈ విషయం చెప్పి నట్లవుతుంది- విజ్ఞానఘన మైన ఈ ఆత్మ కూటస్థనిత్యమే. ఇది నశించే ప్రసక్తి లేదు. కేవలం దీనికి భూతేంద్రియరూపాలైన మాత్రలతో, అవిద్యచేత, సంబంధం ఏర్పడుతుంది. ఆ సంబంధం లేకపోతే దానివల్ల కలిగే విశేషజ్ఞానం లేకపోవడంచేత "న ప్రేత్య సంజ్ఞాస్తి" అని చెప్పబడింది.

భాష్యమ్

యదప్యుక్తమ్ - 'విజ్ఞాతారమరే కేన విజానీయాత్" ఇతి కర్తృవచనేన

ఉపసంహారాత్ విజ్ఞానాత్మన ఏవేదం ద్రష్టవ్యత్వమ్ ఇతి తదపి కాశకృత్స్నీయేనైవ దర్శనేన పరిహరణీయమ్. అపి చ "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి" (బృ.ఉ.2.4.13) ఇత్యారభ్యావిద్యావిషయే తస్యైవ దర్శనాదిలక్షణం విశేషవిజ్ఞానం ప్రపఞ్చ్య "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" ఇత్యాదినా విద్యావిషయే తస్యైవ దర్శనాదిలక్షణస్య విశేషవిజ్ఞానస్యాభావమభిదధాతి. పునశ్చ విషయాభావే ఽపి ఆత్మానం విజానీయాత్ ఇత్యాశఙ్క్య "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" ఇత్యాహ. తతశ్చ విశేషవిజ్ఞానాభావోపపాదనపరత్వాద్వాక్యస్య విజ్ఞానధాతురేవ కేవలః సన్ భూతపూర్వగత్యా కర్తృవచనేన తృచా నిర్దిష్ట ఇతి గమ్యతే. అతశ్చ విజ్ఞానాత్మపరమాత్మనోర విద్యాప్రత్యుప స్థాపితనామరూపరచిత దేహాద్యుపాధినిమిత్తో భేదో న పారమార్థిక ఇత్యేషో ఽర్థః సర్వైర్వే దాన్తవాదిభిరభ్యుపగన్తవ్యః-"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్" (ఛా.ఉ.6.2.1) "ఆత్మైవేదం సర్వమ్" (ఛా.ఉ.7.25.2)"బ్రహ్మైవేదం సర్వమ్" (ము.ఉ.2.2.11) "ఇదం సర్వం యదయమాత్మా" (బృ.ఉ.2.4.6) "నాన్యోతో ఽస్తి ద్రష్టా" (బృ.ఉ.3.7.23) "నాన్య ఽ దతో ఽ స్తి ద్రష్టృ" (బృ.ఉ.3.8.11) ఇత్యేవంరూపాభ్యః శ్రుతిభ్యః; స్మృతిభ్యశ్చ- "వాసుదేవః సర్వమితి" (భ.గీ.7.19) "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" (భ.గీ.13.2), "సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్" (భ.గీ.13.27) ఇత్యేవంరూపాభ్యః.

### బాలానందిని

యదపీతి:- "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" అని కర్తను చెప్పే శబ్దంతో ఉపసంహరించడంవల్ల ఇక్కడ ద్రష్టవ్యుడుగా చెప్పబడినవాడు విజ్ఞానాత్మయే అనేవాదం కూడ కాశకృత్స్నమతానుసారం పరిహరింపదగినది. మరొక విషయ మేమనగా- "యత్ర... పశ్యతి" (ఏ స్థితిలో భేదం ఉన్నట్లు కనబడుతుందో అక్కడ ఒకడు మరొకనిని చూస్తాడు) అని ప్రారంభించి అవిద్యావస్థలో ఆ జీవునికే దర్శనం మొదలైన విశేషజ్ఞానం ఉంటుం దని వివరించి "యత్ర... పశ్యేత్" ఇత్యాదివాక్యంచేత విద్యావిషయంలో (విద్య కలిగిన తరవాత) ఆ జీవునికే దర్శనాదిరూపమైన విశేషవిజ్ఞానం ఉండ దని చెపుతున్నాడు. విషయం

లేకపోయినా ఆత్మను చూడవచ్చును కదా అని మళ్లీ ఆశంకించుకొని "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" అని అన్నాడు. అందుచేత ఈ వాక్యానికి విశేషవిజ్ఞానం ఉండదని చెప్పడంలోనే తాత్పర్యం గాన, ఆత్మ కేవలం విజ్ఞానధాతుస్వరూపమే అయినా కూడ (అనగా జ్ఞానపు ముద్ద మాత్రమే అయినా కూడ) భూతపూర్వగతిచేత కర్తను చెప్పే 'తృచ్' ప్రత్యయంచేత నిర్దేశించబడుతున్నది అని తెలుస్తూన్నది.

వి. 'విజ్ఞాతా' అనే పదం విపూర్వకమైన జ్ఞాధాతువుకు తృచ్ అనే ప్రత్యయం చేరడం చేత ఏర్పడినది. ఈ ప్రత్యయం కర్త అనే అర్థాన్ని బోధిస్తుంది. అందుచేత 'విజ్ఞాతా' అనగా తెలుసుకొనడం అనే పని చేసేవాడు అని అర్థం. ఇప్పుడు తెలియదగిన విషయా లేవీ లేకపోవడంచేత కేవలం జ్ఞానస్వరూపంగా మాత్రమే ఉన్నా భూతపూర్వగతిచేత, అనగా పూర్వం అలాంటి జ్ఞానాన్ని చేసే అలవాటు కలవాడవడంచేత, అలా నిర్దేశింపబడినది అని అర్థం.

దర్శితమితి:- కాశకృత్స్నుని మతం శ్రుతిసంమతం అనే విషయం వెనుక చూపబడింది. అందువల్ల విజ్ఞానాత్మ-పరమాత్మల భేదం అవిద్యచేత ఏర్పడిన నామరూపాలచేత చేయబడిన ఉపాధులను పట్టి వచ్చినదే కాని పారమార్థికం కాదు అని వేదాంతవాదు లందరూ అంగీకరించాలి. ఇందుకు "సదేవ... అద్వితీయమ్", "ఆత్మైవేదం సర్వమ్", "బ్రహ్మైవేదం సర్వమ్" "ఇదంసర్వం యదయమాత్మా", నాన్యోఽతోఽస్తి ద్రష్టా" "నాన్యదతోఽస్తి ద్రష్టృ" ఇత్యాదిశ్రుతులు, "వాసుదేవః సర్వమితి". "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత", "సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్" ఇత్యాదిస్మృతులు ప్రమాణం.

## భాష్యమ్

భేదదర్శనాపవాదాచ్చ- "అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశుః" (బృ.ఉ.1.4.10), "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (బృ.ఉ.4.4.19) ఇత్యేవంజాతీయకాత్. "స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృ.ఉ.4.4.25) ఇతి చాత్మని సర్వవిక్రియాప్రతిషేధాత్. అన్యథా చ ముముక్షూణాం నిరపవాదవిజ్ఞానానుపపత్తేః, సునిశ్చితార్థత్వానుపపత్తేశ్చ.నిరపవాదం హి విజ్ఞానం సర్వాకాఙ్క్షానివర్తకమాత్మవిషయమిష్యతే, "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః" (ము.ఉ.3.2.6) ఇతి చ శ్రుతేః. "తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః" (ఈ.ఉ.7) ఇతి

చ. స్థితప్రజ్ఞలక్షణస్మృతేశ్చ (భ.గీ.2.54). స్థితే చ క్షేత్రజ్ఞపరమాత్మైకత్వవిషయే సమ్యగ్దర్శనే క్షేత్రజ్ఞః పరమాత్మేతి నామమాత్రభేదాత్ క్షేత్రజ్ఞోఽయం పరమాత్మనో భిన్నః, పరమాత్మాయం క్షేత్రజ్ఞాద్భిన్న ఇత్యేవంజాతీయక ఆత్మభేదవిషయో నిర్బన్ధ నిరర్థకః. ఏకో హ్యయమాత్మా నామమాత్రభేదేన బహుధాభిధీయతే ఇతి, న హి "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ", "యో వేద నిహితం గుహాయామ్" (తై.ఉ.2.1) ఇతి కాం చిదేవైకాం గుహామధికృత్యైతదుక్తమ్. న చ బ్రహ్మణోఽన్యో గుహాయాం నిహితోఽస్తి, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై.ఉ.2.6) ఇతి స్రష్టురేవ ప్రవేశశ్రవణాత్. యే తు నిర్బన్ధం కుర్వన్తి తే వేదార్థం బాధమానాః శ్రేయోద్వారం సమ్యగ్దర్శనమేవ బాధన్తే, కృతకమనిత్యం చ మోక్షం కల్పయన్తి, న్యాయేన చ న సంగచ్ఛన్త ఇతి. 22.

## బాలానందిని

భేదేతి: "అన్యో... పశుః" (ఈ పరమాత్మ వేరు నేను వేరు అని ఎవడు అనుకొంటాడో వాడు సరిగా తెలిసికొనుట లేదు. అతడు పశువు వంటివాడే) అని, "మృత్యోః... పశ్యతి" ఇత్యాదిశ్రుతులు భేదదర్శనాన్ని నిరాకరిస్తున్నాయి. (అందువల్ల జీవేశ్వరులకు భేదాభేదం అనే మతం యుక్తం కాదని అర్థం), "స... బ్రహ్మ" (సర్వవ్యాపి యైన ఈ ఆత్మ పుట్టుక లేనిది, వికారం లేనిది మరణం లేనిది, భయం లేనిది, ఇదే బ్రహ్మ అని ఆత్మలో ఏ విధమైన వికారాలూ లేవని నిషేధించడంవల్ల కూడ (భేదాభేదాంగీకారం అయుక్తం). అట్లు కాకపోతే అనగా భేదం కూడ సత్యమైతే ముముక్షువులకు ఎట్టి ఆశంకలు లేని విజ్ఞానం గలగడం కుదరదు గాన వాళ్లు విషయాన్ని సునిశ్చితంగా తెలుసుకొనడం కుదరదు. ఎట్టి అపవాద (బాధాజ్ఞానమూ)లేని, సమస్త ఆకాంక్షలను (సందేహాలను) తొలగించే ఆత్మ విజ్ఞానమే- "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః" (వేదాంతజ్ఞానంచేత బాగా నిశ్చిత మైన విషయం గలవారు) అనే శ్రుతిచేత (అవశ్యక మని) చెప్పబడుచున్నది. "తత్ర... అనుపశ్యతః" (ఏకత్వాన్ని చూచేవానికి మోహానికి కాని శోకానికి గాని అవకాశం ఎక్కడ?) అని కూడ శ్రుతి చెప్పుచున్నది. (భగవద్గీతాది స్మృతులలో) స్థితప్రజ్ఞుని (ఆత్మ విషయంలో నిశ్చితమైన జ్ఞానం కలవాని) లక్షణాలు కూడ చెప్పబడి ఉన్నాయి. ఈ విధంగా క్షేత్రజ్ఞపరమాత్మల ఏకత్వానికి సంబంధించిన యథార్థదర్శనం ఉన్నప్పుడు క్షేత్రజ్ఞుడు, పరమాత్మ అని ఇది కేవలం పేర్లలో మాత్రమే భేదం. అందువల్ల

ఈ క్షేత్రజ్ఞుడు పరమాత్మకంటె భిన్నుడు, పరమాత్మ క్షేత్రజ్ఞునికంటె భిన్నుడు- ఈ రకమైన, ఆత్మభేదాన్ని గూర్చిన నిర్బంధం అర్థం లేనిది. ఎందువల్ల ననగా- ఒకే ఆత్మ నామమాత్రభేదంచేత అనేక విధాలుగా చెప్పబడుతున్నది. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయామ్" అనేది ఏదో ఒక గుహను గూర్చి మాత్రమే చెప్పబడలేదు కదా? "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (దానిని సృజించి దానిలోనే ప్రవేశించింది) అని స్రష్టయే ప్రవేశించి నట్లు చెప్పడంచేత బ్రహ్మయే తప్ప మరేదీ గుహలో నిహితం కాదు. (క్షేత్రజ్ఞ-పరమాత్మలకు భేదం ఉందనో, భేదాభేదా లున్నాయనో) ఎవరు నిర్బంధం చేస్తున్నారో వాళ్లు వేదాంతార్థాన్ని బాధిస్తూ శ్రేయస్సుకు ద్వారమైన సమ్యగ్దర్శనాన్నే (యథార్థదర్శనాన్నే) బాధించినవా ళ్లవుతున్నారు. మోక్షం కృత్రిమ మనీ, అనిత్య మనీ కల్పిస్తున్నారు. అనగా వీళ్ల మతం ప్రకారం మోక్షం కృత్రిమ మైన దనీ, అనిత్య మనీ చెప్పి నట్లవుతుంది అని అర్థం. న్యాయంతో కలవరు. (వీరి మతం యుక్తిసంమతం కూడ కాదు) 22.

### వాక్యాన్వయాధికరణం సమాప్తం

## 7. ప్రకృత్యధికరణమ్. 23.27.

### సూ. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్. 1.4.23.

యథాభ్యుదయహేతుత్వాద్ధర్మో జిజ్ఞాస్య ఏవం నిఃశ్రేయసహేతుత్వాద్బ్రహ్మ జిజ్ఞాస్యమిత్యుక్తమ్. బ్రహ్మ చ "జన్మాద్యస్య యతః" (బ్ర.సూ.1.1.2) ఇతి లక్షితమ్. తచ్చ లక్షణం ఘటరుచకాదీనాం మృత్సువర్ణాదివత్ ప్రకృతిత్వే, కులాలసువర్ణకారాదివన్నిమిత్తత్వే చ సమానమిత్యతో భవతి విమర్శః- కిమాత్మకం పునర్బ్రహ్మణః కారణత్వం స్యాత్ ఇతి. తత్ర నిమిత్తకారణమేవ కేవలం స్యాదితి ప్రతిభాతి. కస్మాత్? ఈక్షాపూర్వకకర్తృత్వశ్రవణాత్. ఈక్షాపూర్వకం హి బ్రహ్మణః కర్తృత్వమవగమ్యతే- "స ఈక్షాంచక్రే" (ప్ర.ఉ.6.3), "స ప్రాణమసృజత" (ప్ర.ఉ.6.4) ఇత్యాదిశ్రుతిభ్యః. ఈక్షాపూర్వకం చ కర్తృత్వం నిమిత్తకారణేష్వేవ కులాలాదిషు దృష్టమ్. అనేకకారకపూర్వికా చ క్రియాఫలసిద్ధిర్లోకే దృష్టా. స చ న్యాయ ఆదికర్తర్యపి యుక్తః సంక్రామయితుమ్. ఈశ్వరత్వప్రసిద్ధేశ్చ. ఈశ్వరాణాం హి రాజవైవస్వతాదీనాం నిమిత్తకారణత్వమేవ కేవలం ప్రతీయతే. తద్వత్పరమేశ్వరస్యాపి నిమిత్తకారణత్వమేవ యుక్తం ప్రతిపత్తుమ్.

కార్యం చేదం జగత్సావయవమచేతనమశుద్ధం చ దృశ్యతే, కారణేనాపి తస్య తాదృశేనైవ భవితవ్యమ్, కార్యకారణయోః సారూప్యదర్శనాత్. బ్రహ్మ చ నైవంలక్షణమవగమ్యతే- "నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్" (శ్వే.ఉ.6.19) ఇత్యాదిశ్రుతిభ్యః. పారిశేష్యాద్బ్రహ్మణోఽన్యదుపాదానకారణమశుద్ధ్యాదిగుణకం స్మృతిప్రసిద్ధమభ్యుపగన్తవ్యమ్. బ్రహ్మకారణత్వశ్రుతేర్నిమిత్తత్వమాత్రే పర్యవసానాదితి.

## బాలానందిని

ప్రకృతిశ్చేతి:- "ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్=శ్రుతిలోని ప్రతిజ్ఞకు, దృష్టాంతానికి ఉపరోధం కలగకుండా ఉండడంవల్ల, ప్రకృతిశ్చ= బ్రహ్మ ప్రకృతి కారణము, నిమిత్తకారణమూ కూడ" అని సూత్రార్థం.

యథా ఇతి:- అభ్యుదయానికి (ఐహిక పారలౌకికసుఖానికి) హేతు వవడంవల్ల ధర్మం ఏ విధంగా జిజ్ఞాస్యమో అట్లే నిఃశ్రేయసానికి (మోక్షానికి) హేతువు అవడంవల్ల బ్రహ్మ జిజ్ఞాస్యం అని చెప్పబడింది. బ్రహ్మకు "జన్మాద్యస్య యతః" అనే సూత్రంచేత లక్షణం చెప్పబడింది. ఆ లక్షణం ఘటరుచకాదులకు (రుచకమ్=మెడలో వేసుకొనే బంగారు గొలుసు) మట్టి; బంగారం వలె ప్రకృతి (ఉపాదానకారణం) అవడానికీ, కుమ్మరి కంసాలి మొదలైనవాళ్ల వలె నిమిత్తకారణం అవడానికీ కూడ సమానం గాన బ్రహ్మకు చెప్పిన ఈ జగత్కారణత్వం ఎలాంటిది అని విమర్శ చేయబడుతున్నది. అయితే- బ్రహ్మ కేవలం నిమిత్తకారణమే కావాలి అని తోస్తుంది. ఎందువల్ల? ఈక్షాపూర్వకత్వం వినబడడంవల్ల, "స ఈక్షాంచక్రే" "స ప్రాణమసృజత" ఇత్యాది శ్రుతులను బట్టి బ్రహ్మ కున్న కర్తృత్వం ఈక్షాపూర్వకం (అనగా ముందు ఆలోచనతో కూడినది) అని తెలుస్తూన్నది. ఈక్షాపూర్వక మైన కర్తృత్వం నిమిత్తకారణాలైన కులాలాదులలోనే కనబడుతున్నది. లోకంలో ఏదైన ఒక పని సఫలం కావాలంటే అనేకమైన కారకాలు (కర్త,కర్మ,కరణం, అధికరణం మొదలైనవి) ముందుగా ఉండాలి అనే విషయం చూస్తున్నాం. ఆ న్యాయాన్ని ఆదికర్త యైన పరమేశ్వరుని విషయంలో కూడ ప్రవర్తింపచేయడం యుక్తం. అనగా పరమేశ్వరుడు కూడ అనేకసాధనాల సహాయంతో జగత్సృష్టి చేస్తున్నాడు అని చెప్పడం యుక్తం. బ్రహ్మ ఈశ్వరుడు (సమర్థుడు, ప్రభువు) అని కూడ ప్రసిద్ధి ఉంది. ఈశ్వరులైన రాజులు, యముడు మొదలైన వాళ్లు కేవలం నిమిత్తకారణంగా మాత్రమే తెలియబడుతున్నారు. అట్లే పరమేశ్వరుడు కూడ నిమిత్తకారణమే అని గ్రహించడం యుక్తం. కార్యమైన ఈ

జగత్తు అనేకమైన అవయువాలతో కూడి, అచేతనంగాను, అపరిశుద్ధంగాను కనబడుచున్నది. దాని కారణం కూడ అలాంటిదే కావలసి ఉంటుంది. కార్యకారణాలు ఒకే విధంగా ఉంటాయి కదా? అయితే- "నిష్కలం... నిరఞ్జనమ్" ఇత్యాది శ్రుతులను బట్టి బ్రహ్మ ఈ లక్షణాలతో ఉన్నట్లు తెలియడం లేదు. ఇంక పారిశేష్యంచేత (పరిశేషన్యాయంచేత) బ్రహ్మకంటె భిన్నమైనది, అశుద్ధ్యాదిగుణాలు కలదీ. సాంఖ్యాదిస్మృతి ప్రసిద్ధమూ అయిన మరొకటి ఏదైనా ఉపాదానం అని అంగీకరించాలి. బ్రహ్మ జగత్కారణం అని చెప్పే శ్రుతి కేవలం నిమిత్తకారణం మాత్రమే అని చెప్పడంలో పర్యవసానం చెందుతుంది.

వి. ఈ అధికరణానికి జన్మాధికరణంతో సంగతి. వెనుకటి అధికరణంలో ఏకవిజ్ఞానంవల్ల సర్వవిజ్ఞానం కలుగుతుంది అనే ప్రతిజ్ఞయొక్క బలంవల్ల ఆ వాక్యం జీవపరం కాదు అని సిద్ధాంతీకరించబడింది. అయితే బ్రహ్మకు నిమిత్తకారణత్వమే కాని ఉపాదానకారణత్వం లేదు; అందుచేత ఏకవిజ్ఞానే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ గౌణమే అని ఆక్షేపసంగతితో పూర్వపక్షం. పూర్ణపక్షానికి ఫలం ద్వైతసిద్ధి. ఉత్తరపక్షానికి ఫలం అద్వైతసిద్ధి.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- ప్రకృతిశ్చ ఉపాదానకారణం చ బ్రహ్మాభ్యుపగన్తవ్యం నిమిత్తకారణం చ, న కేవలం నిమిత్తకారణమేవ. కస్మాత్? ఏవం హి ప్రతిజ్ఞాదృష్టాన్తౌ శ్రౌతౌ నోపరుధ్యేతే. ప్రతిజ్ఞా తావత్- "ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం" (ఛా.ఉ.6.1.2) ఇతి. తత్ర చైకేన విజ్ఞాతేన సర్వమన్యదవిజ్ఞాతమపి విజ్ఞాతం భవతీతి ప్రతీయతే. తచ్చ ఉపాదానకారణవిజ్ఞానే సర్వవిజ్ఞానం సంభవతి; ఉపాదానకారణావ్యతిరేకాత్కార్యస్య. నిమిత్తకారణావ్యతిరేకస్తు కార్యస్య నాస్తి లోకే, తక్ష్ణః ప్రాసాదవ్యతిరేకదర్శనాత్. దృష్టాన్తోఽపి "యథా సోమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" ఇత్యుపాదానకారణగోచర ఏవామ్నాయతే. తథా "ఏకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాత్" "ఏకేన నఖనికృన్తనేన సర్వం కార్ష్ణాయసం విజ్ఞాతం స్యాత్" (ఛా.ఉ.6.1.4, 5, 6) ఇతి చ. తథాన్యత్రాపి "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ము.ఉ.11.2) ఇతి ప్రతిజ్ఞా, "యథా పృథివ్యామోషధయః సంభవన్తి"

(ము.ఉ.1.1.7) ఇతి దృష్టాన్తః. తథా 'ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్'' ఇతి ప్రతిజ్ఞా, ''స యథా దున్దుభేర్హన్యమానస్య న బాహ్యాన్ శబ్దాన్ శక్నుయాద్ గ్రహణాయ దున్దుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః'' (బృ.ఉ.4.5.6.8) ఇతి దృష్టాన్తః. ఏవం ప్రతివేదాన్తం ప్రతిజ్ఞాదృష్టాన్తౌ ప్రకృతిత్వసాధనౌ ప్రత్యేయౌ.

## బాలానందిని

ఏవమితి:- ఇట్లు ప్రాప్తించగా చెపుతున్నాం. బ్రహ్మ కేవలం నిమిత్తకారణమే కాదు, ప్రకృతిశ్చ= ఉపాదానకారణంగాను నిమిత్తకారణంగానూ కూడ అంగీకరించతగినది. ఎందువల్ల? అట్లు అంగీకరిస్తేనే శ్రుతిలో కనబడే ప్రతిజ్ఞాదృష్టాంతాలకు ఉపరోధం (బాధ) కలగకుండా ఉంటుంది. "ఉత... విజ్ఞాతమ్" అని ప్రతిజ్ఞ. ఇక్కడ- ఒకదానిని తెలుసుకొనడంచేత (ప్రత్యేకించి) తెలిసికొనబడని ఇతరమైన సమస్తమూ కూడ తెలియబడుతుంది అని తెలుస్తూన్నది. ఆ విధమైన సర్వవిజ్ఞానం, కార్యం ఉపాదానకారణంకంటె వేరే లేదు గాన, ఉపాదానకారణం తెలుసుకొంటేనే సంభవిస్తుంది. కార్యం నిమిత్తకారణంకంటె అభిన్నం కాదు, లోకంలో ప్రాసాదంకంటె దాని నిమిత్త కారణమైన వడ్రంగి వేరుగా కనబడుతున్నాడు కదా? "యథా... సత్యమ్" అనే దృష్టాంతం కూడ ఉపాదానకారణానికి సంబంధించినదే చెప్పబడుతున్నది. అట్లే "ఏకేన... విజ్ఞాతం స్యాత్" (ఒక లోహమణిచేత లోహంతో తయారు చేసిన ప్రతీదీ ఎట్లు తెలియబడుతుందో), "ఏకేన... స్యాత్" ఒక గోళ్లు తీసికొనే సాధనంచేత ఇనుపవస్తువు లన్నీ ఎలా తెలియబడతాయో) అని కూడ దృష్టాంతం. అట్లే "ఆత్మని... విదితమ్" అని ప్రతిజ్ఞ "స యథా... శబ్దో గృహీతః" అని దృష్టాంతం. ఈ విధంగా ప్రతీ ఉపనిషత్తులోనూ బ్రహ్మ ప్రకృతి అని చెప్పడాన్ని సాధించే ప్రతిజ్ఞాదృష్టాంతాలను గుర్తించాలి.

## భాష్యమ్

యత ఇతీయం పఞ్చమీ ''యతో వా ఇమాని భూతాని జాయన్తే'' ఇత్యత్ర 'జనికర్తుః ప్రకృతిః' (పా.సూ.1.4.30) ఇతి విశేషస్మరణాత్ప్రకృతిలక్షణ ఏవాపాదానే ద్రష్టవ్యా. నిమిత్తత్వం త్వధిష్ఠాత్రన్తరభావాదధిగన్తవ్యమ్. యథా హి లోకే మృత్సువర్ణాదికముపాదానకారణం కులాలసువర్ణకారాదీనధిష్ఠాతౄనపేక్ష్య ప్రవర్తతే నైవం బ్రహ్మణ ఉపాదానకారణస్య సతోఽన్యోఽధిష్ఠాతాపేక్ష్యోఽస్తి; ప్రాగుత్పత్తేరేకమేవాద్వితీయమిత్యవధారణాత్.

అధిష్ఠాత్రన్తరాభావోఽపి ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాదేవోదితో వేదితవ్యః అధిష్ఠాతరి హ్యుపాదానాదన్యస్మిన్నుపగమ్యమానే పునరప్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానస్యా సంభవాత్ ప్రతిజ్ఞాదృష్టాన్తోపరోధ ఏవ స్యాత్. తస్మాదధిష్ఠాత్రన్తరాభావాదాత్మనః కర్తృత్వముపాదానాన్తరాభావాచ్చ ప్రకృతిత్వమ్. 23.

బాలానందిని

పఞ్చమీతి:- "యతో వా ఇమాని భూతాని జాయన్తే" అనే వాక్యంలో (యతః అనే) పంచమి "జనికర్తుః ప్రకృతిః" అను విశేషసూత్రంచేత ప్రకృతియైన అపాదానం కంటె విధించబడినదిగా గ్రహించాలి.

వి. కొన్నింటికి 'అపాదానం' అనే పేరు విధించి ఆ సంజ్ఞ ఉన్న వాటిని పంచమీ విభక్తిలో ప్రయోగించాలి అని పాణినీయవ్యాకరణంలో చెప్పబడింది. అపాదానసంజ్ఞావిధాయకసూత్రాలలో 'జనికర్తుః ప్రకృతిః" అనేది ఒకటి. పుట్టేదానికి ఏది ప్రకృతియో, అనగా దేనినుంచి అది పుట్టుచున్నదో, ఆ ప్రకృతికి అపాదానం అని పేరు అని ఈ సూత్రానికి అర్థం. 'గోమయాత్ వృశ్చికాః జాయన్తే" (గోమయనుంచి తేళ్లు పుడుతున్నాయి) ఇత్యాదులు ఉదాహరణ. వృశ్చికాలకి ప్రకృతి గోమయం. అందువల్ల దానికి అపాదానసంజ్ఞ వచ్చి అది పంచమీ విభక్తిలో ప్రయోగించబడింది. 'యతో వా' ఇత్యాదిశ్రుతిలో 'యతః' అనేది పంచమిలో ఉంది (తస్' అనేది పంచమ్యర్థకమైన తద్ధితప్రత్యయం). దీనిని పట్టి ఏ బ్రహ్మనుండి భూతాలు పుడుతున్నాయో వాటికి బ్రహ్మ ప్రకృతి, అనగా ఉపాదానం, అని తెలుస్తున్నదని అర్థం.

నిమిత్తత్వమితి:- అయితే మరొక అధిష్ఠాత (నిమిత్తకారణం-కర్త) ఎవడూ లేకపోవడంచేత బ్రహ్మయే నిమిత్తకారణం కూడ అని గ్రహించాలి. లోకంలో ఏ విధంగా మృత్తు, సువర్ణం మొదలైన ఉపాదానకారణం కులాలుడు సువర్ణకారుడు మొదలైన అధిష్ఠాతలను అపేక్షించి (వాళ్ల సహాయంతో ప్రవర్తిస్తుందో , తన కార్యాలను పుట్టిస్తుందో) ఆ విధంగా ఉపాదానకారణంగా ఉన్న బ్రహ్మకు మరొక అధిష్ఠాతయొక్క ఆపేక్ష లేదు. సృష్టికి పూర్వం "ఏకమేవాద్వితీయమ్" అని బ్రహ్మ తప్ప మరేమీ లేదని నిశ్చయించబడింది కదా? మరొక అధిష్ఠాత ఎవరూ లేరనే విషయం కూడ ప్రతిజ్ఞాదృ ష్టాన్తానుపరోధంవల్లనే చెప్పబడినట్లు గ్రహించాలి. ఉపాదానంకంటె వేరుగా మరొక అధిష్ఠాత ఉన్నా డని అంగీకరిస్తే "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం" అనేది కుదరదు గాన ప్రతిజ్ఞాదృష్టాంతాలకు ఉపరోధం కలుగుతుంది. మృత్తుకంటె వేరుగా కులాలు డున్నట్లు ఉపాదానమైన బ్రహ్మకంటె వేరుగా మరొక కర్త ఉన్నట్లయితే బ్రహ్మ కార్యాల జ్ఞానంచేత బ్రహ్మ తెలియవచ్చును కాని వేరుగా ఉన్న కర్త తెలియడు అని భావం. అందువల్ల మరొక అధిష్ఠాత ఎవరూ లేకపోవడంచేత

ఆత్మయే కర్త, మరొక ఉపాదానం ఏదీ లేకపోవడంచేత ఆత్మయే ప్రకృతి అని సిద్ధించింది.23.

## భాష్యమ్

కుతశ్చాత్మనః కర్తృత్వప్రకృతిత్వే-

### సూ. అభిధ్యోపదేశాచ్చ. 1.4.24.

అభిధ్యోపదేశశ్చాత్మనః కర్తృత్వప్రకృతిత్వే గమయతి- "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయ ఇతి, "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" ఇతి చ. తత్రాభిధ్యానపూర్వికాయాః స్వాతన్త్ర్యప్రవృత్తేః కర్తేతి గమ్యతే. బహు స్యామితి ప్రత్యగాత్మవిషయత్వాద్బహుభవనాభిధ్యానస్య ప్రకృతిరిత్యపి గమ్యతే. 24.

## బాలానందిని

కుత ఇతి:- ఆత్మకు కర్తృత్వప్రకృతిత్వాలు మరి ఏ కారణంవల్ల కూడ?-

అభిధ్యేతి:- "అభిధ్యోపదేశాచ్చ=సృష్టిసంకల్పంవల్ల కూడ బ్రహ్మకు కర్తృత్వప్రకృతిత్వాలు తెలుస్తున్నాయి" అని సూత్రార్థం.

అభిధ్యోపదేశ ఇతి: "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ" అని, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అనీ ఆత్మకు అభిధ్య (సంకల్పం) కలిగిం దని చెప్పడం కూడ ఆత్మకు ప్రృతిత్వకర్తృత్వాలు రెండూ ఉన్నా యని తెలుపుచున్నది. సంకల్పపూర్వకంగా స్వతంత్రంగా ప్రవర్తించడంచేత కర్త అని తెలుస్తూన్నది. "బహు స్యామ్" (అనేకమైన ఆకారాలలో ఉన్నవాడనుగా అవుతాను) అను బహుభవనసంకల్పం ప్రత్యగాత్మవిషయకం గాన అనగా ఈశ్వరుడు నేను ఇలా అవుతాను అని తనను గూర్చి సంకల్పించాడు గాన ప్రకృతి కూడ అని తెలుస్తూన్నది. 24.

### సూ. సాక్షాచ్చోభయామ్నానాత్. 1.4.25

ప్రకృతిత్వస్యాయమభ్యుచ్చయః- ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ, యత్కారణం సాక్షాద్ బ్రహ్మైవ కారణముపాదాయోభౌ ప్రభవప్రలయావామ్నాయేతే "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే ఆకాశం ప్రత్యస్తం యన్తి" (ఛా.ఉ.1.9.1) ఇతి. యద్ధి యస్మాత్ప్రభవతి యస్మింశ్చ ప్రలీయతే తత్తస్యోపాదానం ప్రసిద్ధమ్ యథా వ్రీహియవాదీనాం పృథివీ. సాక్షాదితి

చోపాదానాన్తరానుపాదానం దర్శయత్యాకాశాదేవేతి. ప్రత్యస్తమయశ్చ నోపాదానాదన్యత్ర కార్యస్య దృష్టః. 25.

బాలానందిని

సాక్షాదితి:- "సాక్షాత్: సాక్షాత్తుగా, ఉభయామ్నానాత్ చ=ఉత్పత్తిప్రలయాలు రెండూ బ్రహ్మనుండి జరుగుచున్నాయి అని చెప్పడంవల్ల కూడ బ్రహ్మ ఉపాదానకారణం' ' అని సూత్రార్థం.

ప్రకృతిత్వస్యేతి:- ఇది ప్రకృతిత్వానికి మరొక హేతువు. సాక్షాత్తు బ్రహ్మనే కారణంగా నిర్దేశిస్తూ 'సర్వాణి హ వా... యన్తి" అని ఉత్పత్తి ప్రలయాలు రెండూ చెప్పబడుతున్నాయి. ఆ కారణంవల్ల కూడా బ్రహ్మ ప్రకతి. ఏది దేనినుండి పుడుతుందో, దేనిలో లీన మవుతుందో అది దానికి ఉపాదానం అని ప్రసిద్ధమైనది. ఉదాహరణకు- వ్రీహియవాదులకు భూమి ఉపాదానకారణం. ఆకాశంనుండి మాత్రమే అని అంటూ శ్రుతి మరొక ఉపాదానాన్ని దేనినీ చెప్పలేదు అని సూత్రకారుడు 'సాక్షాత్' అనే పదంచేత చూపుతున్నాడు. ఉపాదానకారణంలో తప్ప మరి దేనిలోను కార్యం లీనమవడం కనబడదు. 25.

## సూ. ఆత్మకృతేః పరిణామాత్. 1.4.26

ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ, యత్కారణం బ్రహ్మప్రక్రియాయాం "తదాత్మానం స్వయమకురుత" (తై.ఉ.2.7) ఇత్యాత్మనః కర్మత్వం కర్తృత్వంచ దర్శయతి, ఆత్మానమితి కర్మత్వం, స్వయమకురుతేతి కర్తృత్వమ్. కథం పునః పూర్వసిద్ధస్య సతః కర్తృత్వేన వ్యవస్థితస్య క్రియమాణత్వం శక్యం సంపాదయితుమ్. పరిణామాదితి బ్రూమః. పూర్వసిద్ధోఽపి సన్నాత్మా విశేషేణ వికారాత్మనా పరిణమయామాసాత్మానమితి. వికారాత్మనా చ పరిణామో మృదాద్యాసు ప్రకృతిషు ఉపలబ్ధః. స్వయమితి చ విశేషణాన్నిమిత్తాన్తరానపేక్షత్వమపి ప్రతీయతే.

పరిణామాదితి వా పృథక్ సూత్రమ్. తస్యైషోఽర్థః. ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ యత్కారణం బ్రహ్మణ ఏవ వికారాత్మనాయం పరిణామః సామానాధికరణ్యేనామ్నాయతే- 'సచ్చ త్యచ్చాభవత్, నిరుక్తం చానిరుక్తం చ" (తై.ఉ.2.6) ఇత్యాదినేతి. 26.

బాలానందిని

ఆత్మేతి:- "పరిణామాత్=పరిణామం ద్వారా, ఆత్మకృతేః= తనను తానే చేసికొనుట వలన కూడ బ్రహ్మ ప్రకృతి (ఉపాదానకారణం). లేదా- ఆత్మకృతేః= బ్రహ్మ తనను తానే కార్యరూపంగా చేసికొనడంవల్ల ఉపాదానకారణం. పరిణామాత్=కార్యరూపంలో పరిణమించడంవల్ల కూడ ఉపాదానకారణం" అని సూత్రార్థం.

ఇతశ్చేతి: ఈ కారణంవల్ల కూడ బ్రహ్మ ప్రకృతి; ఎందువల్ల ననగా బ్రహ్మ ప్రక్రియలో "తదాత్మానం స్వయమకురుత" అని ఆత్మకు కర్తృత్వాన్ని కర్మత్వాన్ని కూడ చూపుచున్నది. 'ఆత్మానమ్' అని కర్మత్వం, 'స్వయమ్ అకురుత' అని కర్తృత్వం. కర్తగా ముందుగానే సిద్ధమై ఉన్నదానికి క్రొత్తగా చేయడాన్ని సంపాదించడం ఎట్లు శక్యం అవుతుంది? (కర్త అనగా పుట్టించదగిన కార్యంకంటె ముందుగా ఉన్న వాడు. కర్మ అనగా క్రియచేత పుట్టింపదగినది. కర్తగా ముందుగానే ఉన్న ఆత్మయే కర్మ కూడ ఎలా అవుతుంది అని అర్థం). పరిణామంవల్ల అని చెపుతాం. ఆత్మ పూర్వమే సిద్ధమై ఉన్నా కూడ తనను విశేషమైన వికార (కార్య) స్వరూపంలో పరిణమింప చేసింది. వికారరూపంలో పరిణామం చెందడం అనేది మట్టి మొదలైనవాటిలో చూడబడుచున్నది. అనగా ముందుగానే సిద్ధంగా ఉన్న మట్టి కార్యమైన ఘటరూపంలో పరిణమిస్తున్నది. అట్లే ఇది కూడ అని అర్థం. స్వయమ్ అని విశేషణం ఉపయోగించడంవల్ల ఈ పరిణామానికి మరొక నిమిత్తం ఏదీ అపేక్షింపబడదు అని తెలుస్తున్నది. లేదా- 'పరిణామాత్' అనే దానిని వేరే సూత్రంగా గ్రహించవచ్చును. దానికి అర్థం ఇది- ఈ కారణంవల్ల కూడ బ్రహ్మ ప్రకృతి; ఎందువల్ల ననగా- "సచ్చ... అనిరుక్తం చ" బ్రహ్మయే ప్రత్యక్షమైన పృథివీ-అప్-తేజోరూపమైన భూతత్రయం గాను అప్రత్యక్షమైన వాయ్వాకాశరూపభూతద్వయంగాను, చెప్పడానికి శక్యమైన ఘటాదికంగాను, చెప్పడానికి శక్యం కాని పావురం రంగు మొదలైనది గాను అయింది) ఇత్యాదివాక్యాలచేత సామానాధికరణ్యంచేత (అనగా బ్రహ్మశబ్దాన్ని వికారవాచకశబ్దాలైన 'సచ్చ' ఇత్యాదులను ఒకే విభక్తి మొదలైనవాటిలో ప్రయోగించి) ఇది వికారరూపంలో బ్రహ్మయొక్క పరిణామమే అని చెప్పబడుచున్నది. 26.

## సూ. యోనిశ్చ హి గీయతే. 1.4.27.

ఇతశ్చ ప్రకృతిర్బ్రహ్మ, యత్కారణం బ్రహ్మ యోనిరిత్యపి పఠ్యతే వేదాన్తేషు "కర్తారమీశం పురుషం బ్రహ్మ యోనిమ్" (ము.ఉ.3.1.3) ఇతి, "యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" (ము.ఉ.1.1.6) ఇతి చ. యోనిశబ్దశ్చ ప్రకృతివచనః సమధిగతో లోకే 'పృథివీ యోనిరోషధివనస్పతీనామ్' ఇతి. స్త్రీయోనేరప్యస్త్యేవావయవద్వారేణ గర్భం ప్రత్యుపాదానకారణత్వమ్. క్వచిత్ స్థానవచనోఽపి "యోనిష్ట ఇన్ద్ర నిషదే అకారి" (ఋ.సం.1.104.1) ఇతి. వాక్యశేషాత్త్వత్ర ప్రకృతివచనతా పరిగృహ్యతే- "యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ" (ము.1.1.7) ఇత్యేవంజాతీయకాత్. తదేవం ప్రకృతిత్వం బ్రహ్మణః ప్రసిద్ధమ్. యత్పునరిదముక్తమ్. ఈక్షాపూర్వకం కర్తృత్వం నిమిత్తకారణేష్వేవ కులాలాదిషు లోకే దృష్టం నోపాదానేషు ఇత్యాది- తత్ప్రత్యుచ్యతే- న లోకవదిహ భవితవ్యమ్. న హ్యయమనుమానగమ్యోఽర్థః. శబ్దగమ్యత్వాత్త్వస్యార్థస్య యథాశబ్దమిహ

భవితవ్యమ్. శబ్దశ్చేక్షితురీశ్వరస్య ప్రకృతిత్వం ప్రతిపాదయతీత్యవోచామ. పునశ్చైతత్సర్వం విస్తరేణ ప్రతివక్ష్యామః. 27.

బాలానందిని

యోనిరితి:- "యోనిః చ= యోని అని కూడ, గీయతే= బ్రహ్మ శ్రుతులలో చెప్పబడుచున్నది" అని సూత్రార్థం.

ఈ కారణంవల్ల కూడ బ్రహ్మ ప్రకృతి; "ఎందువల్ల ననగా- కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్" అని, "యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అనీ బ్రహ్మ వేదాంతాలలో యోని అని కూడ చెప్పబడుచున్నది. యోనిశబ్దానికి అర్థం ప్రకృతి అని "ఓషధులకు వృక్షాలకు పృథివి యోని" ఇత్యాదిప్రయోగాలను పట్టి లోకంలో తెలుస్తూన్నది. స్త్రీయోని కూడ అవయవాల ద్వారా గర్భానికి ఉపాదానకారణమే. కొన్ని చోట్ల "యోనిష్ట ఇన్ద్ర నిషదే అకారి" (ఇంద్రా నువ్వు కూర్చొనడానికి స్థానం ఏర్పరచబడింది) ఇత్యాదులలో యోనిశబ్దానికి స్థానం అని కూడ అర్థం. ఇక్కడైతే "యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ" ఇత్యాది వాక్యశేషాన్ని పట్టి ఈ శబ్దం ప్రకృతి అనే అర్థాన్ని బోధించేదిగా గ్రహించబడుతుంది. ఈ విధంగా బ్రహ్మ ప్రకృతి అనేది ప్రసిద్ధం.

లోకంలో నిమిత్తకారణాలైన కులాలాదులలోనే ఈక్షాపూర్వక మైన కర్తృత్వం చూడబడుతున్నది గాని ఉపాదానకారణాలలో లేదు అని ఏది చెప్పబడిందో అది నిరాకరించబడుతున్నది- ఇక్కడ లోకంలో వలె కావలసిన పని లేదు. ఈ విషయం అనుమానప్రమాణంచేత తెలిసేది కాదు. ఈ అర్థం శబ్దంవల్ల మాత్రమే తెలిసేది కాబట్టి శబ్దం ఎలా చెపితే అలా గ్రహించాలి. శబ్దమైతే ఈక్షితయైన ఈశ్వరునికి ప్రకృతిత్వాన్ని చెపుతున్నది అని చెప్పాం. దీని నంతనీ మరల సవిస్తరంగా నిరాకరిస్తాం.

ప్రకృత్యధికరణం సమాప్తం

## 8. సర్వవ్యాఖ్యానాధికరణమ్. సూ. 28.

## సూ. ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః 1.4.28

"ఈక్షతే ర్నాశబ్దమ్" (బ్ర.సూ.1.1.5) ఇత్యారభ్య ప్రధానకారణవాదః సూత్రైరేవ పునః పునరాశఙ్క్య నిరాకృతః. తస్య హి పక్షస్యోపోద్బలకాని కాని చిల్లిఙ్గాభాసాని వేదాన్తేష్వాపాతేన మన్దమతీన్ ప్రతిభాన్తీతి. న చ కార్యకారణానన్యత్వాభ్యుపగమాత్, ప్రత్యాసన్నో వేదాన్తవాదస్య. దేవలప్రభృతిభిశ్చ కైశ్చిద్ధర్మసూత్రకారైః స్వగ్రన్థేష్వాశ్రితః, తేన తత్ప్రతిషేధే యత్నోఽతీవ కృతో నాణ్వాదికారణవాదప్రతిషేధే. తేఽపి తు బ్రహ్మకారణవాదపక్షస్య ప్రతిపక్షత్వాత్ ప్రతిషేద్ధవ్యాః. తేషామప్యుపోద్బలకం

వైదికం కించిల్లిఙ్గమాపాతేన మన్దమతీన్ ప్రతిభాయాదితి. అతః ప్రధానమల్లని బర్హణన్యాయేనాతిదిశతి- ఏతేన ప్రధానకారణవాదప్రతిషేధన్యాయకలాపేన సర్వేఽణ్వాదికారణవాదా అపి ప్రతిషిద్ధతయా వ్యాఖ్యాతా వేదితవ్యాః. తేషామపి ప్రధానవదశబ్దత్వాచ్ఛబ్దవిరోధిత్వాచ్చేతి. వ్యాఖ్యాతా వ్యాఖ్యాతా ఇతి పదాభ్యాసోఽధ్యాయపరిసమాప్తిం ద్యోతయతి. 28.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే ప్రథమాధ్యాయస్య చతుర్థః పాదః.

ఇతి శ్రీమద్బ్రహ్మసూత్రశాఙ్కరభాష్యే సమన్వయాఖ్యః ప్రథమోఽధ్యాయః

## బాలానందిని

ఏతేనేతి:- "ఏతేన=ఈ ప్రధానకారణవాదనిరాకరణపూర్వకంగా బ్రహ్మయందు వేదాంతవాక్యాల సమన్వయాన్ని నిరూపించడంచేత, సర్వే= ఇతరమైన వైశేషికాదిమతాలన్నీ, వ్యాఖ్యాతాః=అశబ్దములుగా నిరూపింపబడినవి" అని సూత్రార్థం.

ఈక్షతేరితి:- "ఈక్షతేర్నాశబ్దమ్" మొదలుకొని సూత్రాలచేతనే ప్రధానకారణవాదం, మళ్లీ మళ్లీ ఆశంకించుకొని నిరాకరించబడింది. ఎందువల్ల ననగా లింగాల వలె కనబడే కొన్ని వాక్యాలు వేదాంతాలలో ఆ ప్రధానకారణవాదాన్ని సమర్థిస్తున్నట్లుగా, పై పైకి మందమతులకు కనబడవచ్చును. ప్రధానకారణవాదం కార్యకారణాలకు అభేదం అంగీకరించడంవల్ల వేదాంతవాదానికి సంనిహితంగా ఉంది. దేవలుడు మొదలైన కొందరు ధర్మసూత్రకారులు దానిని తమ గ్రంథాలలో ఆశ్రయించి ఉన్నారు. అందుచేత దానిని నిరాకరించడంకొరకే ఎక్కువ ప్రయత్నం చేయబడింది కాని అణ్వాదికారణవాద నిరాకరణానికి చేయబడలేదు. అవి కూడ బ్రహ్మకరణవాదపక్షానికి ప్రతిపక్షా లవడంచేత నిరాకరించదగినవే. ఎందువల్ల ననగా వాటికి కూడ ఉపోద్బలకంగా ఉన్నట్లు పైకి కనబడే ఏదైన వైదికమైన లింగం మందమతులకు కనబడవచ్చు. (ఉపోద్బలకంగా కనబడవచ్చు). అందువల్ల ప్రధానమల్లనిబర్హణన్యాయంచేత (పదిమంది మల్లుల్లో ప్రధానమైనవాణ్ణి జయిస్తే అందరినీ జయించినట్లే అనేది ప్రధానమల్లనిబర్హణన్యాయం) వెనుక చెప్పినదానిని వాటి విషయంలో కూడ అతిదేశిస్తున్నాడు.

(ఒకదాని విషయంలో చెప్పిన అంశాన్ని మరొకదానికి వర్తింపచేయడం అతిదేశం). -ఏతేన= ప్రధానకారణవాదాన్ని నిషేధించే న్యాయాల సముదాయంచేత, సర్వే=సమస్తమైన అణ్వాదికారణవాదాదులు కూడ, నిషేధింపబడినవిగా

విశదీకరించబడినట్లు తెలియదగినవి. అవి కూడ ప్రధానం వలెనే అశబ్దాలు, శబ్దానికి విరుద్ధంగా కూడ ఉన్నాయి. 'వ్యాఖ్యాతాః' అనే పదాన్ని రెండు మార్లు చెప్పడం అధ్యాయం సమాప్తమైన దని సూచిస్తున్నది. 28.

'బాలానందిని' అనే శ్రీమచ్ఛంకరభగవత్పాదకృతశారీరకమీమాంసా భాష్యాంధ్రవ్యాఖ్యానంలో ప్రథమాధ్యాయంలో చతుర్థపాదం సమాప్తం.

శ్రీమద్బ్రహ్మసూత్రశాంకరభాష్యంలో సమన్వయాధ్యాయం అనే పేరు గల ప్రథమాధ్యాయం సమాప్తం.

## ద్వితీయోఽధ్యాయః

(ద్వితీయే అవిరోధాఖ్యే అధ్యాయే ప్రథమపాదే సాంఖ్యయోగకాణాదాదిస్మృతిభిఃసాంఖ్యాదిప్రయుక్తతర్కైశ్చ వేదాన్తసమన్వవిరోధపరిహారః)

### స్మృత్యధికరణమ్. సూ.1-3

### భాష్యమ్

ప్రథమేఽధ్యాయే సర్వజ్ఞః సర్వేశ్వరో జగత ఉత్పత్తికారణం మృత్సువర్ణాదయ ఇవ ఘటరుచకాదీనామ్, ఉత్పన్నస్య జగతో నియన్తృత్వేన స్థితికారణం మాయావీవ మాయాయాః. ప్రసారితస్య చ జగత పునః స్వాత్మన్యేవోపసంహారకారణమ్, అవనీవ చతుర్విధస్య భూతగ్రామస్య. స ఏవ చ సర్వేషాం న ఆత్మేత్యేతద్వేదాన్తవాక్యసమన్వయప్రతిపాదనేన ప్రతిపాదితమ్. ప్రధానాదికారణవాదాశ్చ అశబ్దత్వేన నిరాకృతాః. ఇదానీం స్వపక్షే స్మృతిన్యాయవిరోధపరిహారః, ప్రధానాదివాదానాం చ న్యాయాభాసోపబృంహితత్వం, ప్రతివేదాన్తం చ సృష్ట్యాదిప్రక్రియాయాః అవిగీతత్వమిత్యస్యార్థజాతస్య ప్రతిపాదనాయ ద్వితీయోఽధ్యాయ ఆరభ్యతే. తత్ర ప్రథమం తావత్ స్మృతివిరోధముపన్యస్య పరిహరతి-

సూ. స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నాన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్.2.1.1.

### బాలానందిని

ప్రథమ ఇతి:- ఘటరుచకాదులకు మృత్సువర్ణాదులు వలె జగత్తుకు సర్వజ్ఞుడైన సర్వేశ్వరుడు ఉత్పత్తికి కారణం అని, మాయావి మాయకు వలె, పుట్టిన జగత్తుకు పరమేశ్వరుడే నియంత అవడంచేత దాని స్థితికి కారణం అనీ, భూమి నాలుగు

విధాలైన (జరాయుజ-అండజ, ఉద్భిజ్జ-స్వేదజా లని నాలుగు విధిలైన) భూత గ్రామానికి వలె ఆ పరమేశ్వరుడే ప్రసారితమైన ఆజగత్తు మళ్లీ తనలో లీనం అయిపోవడానికి కారణం అనీ, ఆ పరమేశ్వరుడే మన అందరికీ ఆత్మ అనీ ప్రథమాధ్యాయంలో వేదాంతవాక్యసమన్వయప్రదర్శనద్వారా ప్రతిపాదించబడింది. ప్రధానాదికారణవాదాలు కూడ అశబ్దము లని చెప్పి నిరాకరించబడ్డాయి. ఇప్పుడు తన పక్షంలో స్మృతులతోగాని న్యాయంతో గాని విరోధం లేదనీ, ప్రధానాదివాదాలు కేవల న్యాయాభాసలచేత ఉపబృంహితాలనీ (వాటిని సమర్థిస్తూన్నట్లు చూపేవి న్యాయాభాసలే కాని సరియైన న్యాయాలు కావనీ), ప్రతీ వేదాంతంలోను (అన్ని ఉపనిషత్తులలోను) సృష్ట్యాదిప్రక్రియకు విగానం (పరస్పరం విరోధం) లేదనీ- ఈ విషయా లన్నీ ప్రతిపాదించడంకోసం ద్వితీయాధ్యాయం ప్రారంభించబడుతున్నది. వాటిలో ముందు స్మృతివిరోధాన్ని ఉపన్యసించి పరిహరిస్తున్నాడు.

వి. ద్వితీయాధ్యాయంలోని ప్రథమపాదంలో సాంఖ్యాదుల స్మృతులతోను, వాళ్లు చూపిన యుక్తులతోను విరోధం లేదు అని చెప్పబడుతుంది. ద్వితీయపాదంలో సాంఖ్యాద్యాగమాలు భ్రాంతిమూలకాలు అని చెప్పడం ద్వారా అవిరోధం ప్రతిపాదింపబడుతుంది. తృతీయపాదంలో అన్ని ఉపనిషత్తులలోను ఉన్న సృష్టిశ్రుతులకు, జీవాత్మశ్రుతులకు విరోధం లేదని ప్రతిపాదించబడుతున్నది. చతుర్థపాదంలో లింగశరీరశ్రుతులకు అవిరోధం ప్రతిపాదించబడింది.

స్మృతీతి:- "స్మృత్యనవకాశదోషప్రసంగః ఇతి చేత్= సాంఖ్యస్మృతికి అవకాశం లేకుండా పోతుంది అనే దోషం వస్తుంది కదా అంటే, న=అది యుక్తం కాదు, ఎందువల్లననగా, అన్యస్మృత్యనవకాశ దోష ప్రసంగాత్=ఇతరస్మృతులకు అవకాశం లేకుండా పోవడం అనే దోషం ప్రసక్తం అవుతుంది" అని సూత్రానికి అర్థం.

## భాష్యమ్

యదుక్తం- బ్రహ్మైవ సర్వజ్ఞం జగతః కారణమ్ ఇతి, తదయుక్తమ్; కుతః? స్మృత్యనవకాశదోషప్రసఙ్గాత్. స్మృతిశ్చ తన్త్రాఖ్యా పరమర్షిప్రణీతా శిష్టపరిగృహీతా, అన్యాశ్చ తదనుసారిణ్యః స్మృతయః, ఏవం సత్యనవాకాశాః ప్రసజ్యేరన్. తాసు హ్యచేతనం ప్రధానం స్వతన్త్రం జగతః కారణముపనిబధ్యతే. మన్వాదిస్మృతయస్తావచ్చోదనాలక్షణేనాగ్నిహోత్రాదినా ధర్మజాతేనాపేక్షితమర్థం సమర్పయన్త్యః సావాకాశా భవన్తి, అస్య వర్ణ స్యాస్మిన్

కాలేఽనేన విధానేనోపనయనమ్, ఈదృశశ్చాచారః ఇత్థం వేదాధ్యయనమ్, ఇత్థం సమావర్తనమ్, ఇత్థం సహధర్మచారిణీసంయోగ ఇతి. తథా పురుషార్థాంశ్చ వర్ణాశ్రమధర్మాన్నానావిధాన్ విదధతి. నైవం కపిలాదిస్మృతీనామనుష్ఠేయే విషయేఽవకాశోఽస్తి. మోక్షసాధనమేవ హి సమ్యగ్దర్శనమధికృత్య తాః ప్రణీతాః. యది తత్రాప్యనవకాశాః స్యురానర్థక్యమేవాసాం ప్రసజ్యేత. తస్మాత్తదవిరోధేన వేదాన్తా వ్యాఖ్యాతవ్యాః.

## బాలానందిని

యదితి:- బ్రహ్మయే సకలజగత్కారణం అని ఏది చెప్పబడిందో అది అయుక్తం. ఎందువల్ల? స్మృత్యనవకాశదోషప్రసంగంవల్ల, పరమర్షిచేత రచింపబడిన తంత్రం అనే పేరు గల స్మృతి ఉన్నది. దానిని శిష్టులు పరిగ్రహించారు. ఆ స్మృతీ, దానినే అనుసరించిన మరి కొన్ని స్మృతులూ కూడ, ఈ విధంగా చెపితే అవకాశం లేని వైపోతాయి. అచేతనమైన ప్రధానం స్వతంత్రమైన జగత్కారణం అని ఆ స్మృతులు ప్రతిపాదిస్తున్నాయి. మనుస్మృత్యాదు లైతే చోదనాలక్షణ మైన అగ్నిహోత్రాదిధర్మసముదాయంచేత అపేక్షించబడిన విషయాలను- ఈవర్ణానికి ఈ కాలంలో ఈ విధానంచేత ఉపనయనం, ఆచారం ఈ విధంగా ఉంటుంది, వేదాధ్యనం ఈ విధంగా చెయ్యాలి. సమావర్తనం (గురుకులంనుండి తిరిగి రావడం) ఈ విధంగా చెయ్యాలి, భార్యాసంబంధం ఈ విధంగా ఉండాలి- ఈ విధంగా బోధించడం ద్వారా అవకాశం కలవౌతాయి. అట్లే పురుషార్థాలైన అనేకవిధాలైన వర్ణాశ్రమధర్మాలను విధిస్తున్నాయి. కపిలాదుల స్మృతులకు ఈ విధంగా అనుష్ఠించవలసిన ధర్మాదుల విషయంలో అవకాశం లేదు. అవన్నీ మోక్ష సాధన మైన సమ్యగ్దర్శనాన్ని మాత్రమే బోధించడానికి రచింపబడ్డాయి. ఆ విషయంలో కూడ వాటికి అవకాశం లేకపోతే అవి వ్యర్థము లైపోతాయి. అందువల్ల ఆ స్మృతులకు విరోధం లేకుండా చూచుకొంటూ వేదాంతాలను వ్యాఖ్యానించాలి.

## భాష్యమ్

కథం పునరీక్షత్యాదిభ్యో హేతుభ్యః బ్రహ్మైవ సర్వజ్ఞం జగతః కారణమిత్యవధారితః శ్రుత్యర్థః స్మృత్యనవకాశదోషప్రసంగేన పునరాక్షిప్యతే? భవేయదయమనాక్షేపః స్వతన్త్రప్రజ్ఞానామ్. పరవన్త్రప్రజ్ఞాస్తు ప్రాయేణ జనాః స్వాతన్త్ర్యేణ శ్రుత్యర్థమవధారయితుమశక్నువన్తః ప్రఖ్యాతప్రణేతృకాసు స్మృతిష్వవలమ్బేరన్. తద్బలేన చ శ్రుత్యర్థం ప్రతిపిత్సేరన్. అస్మత్కృతే చ వ్యాఖ్యానే న విశ్వస్యుర్బహుమానాత్ స్మృతీనాం ప్రణేతృషు. కపిలప్రభృతీనాం

నార్షం జ్ఞానమప్రతిహతం స్మర్యతే. శ్రుతిశ్చ భవతి. "ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానం చ పశ్యేత్" (శ్వే.ఉ.5.2.) ఇతి. తస్మాన్నైషాం మతమయథార్థం శక్యం సంభావయితుమ్. తర్కావష్టమ్భేన చైతేఽర్థం ప్రతిష్ఠాపయన్తి. తస్మాదపి స్మృతిబలేన వేదాన్తా వ్యాఖ్యేయా ఇతి పునరాక్షేపః.

## బాలానందిని

కథమితి:- ఈక్షత్యాదిహేతువులను చూపి సర్వజ్ఞమైన బ్రహ్మయే జగత్తుకు కారణం అని నిర్ణయించబడిన శ్రుత్యర్థం స్మృత్యనవకాశదోషంచేత మళ్లీ ఎందుకు ఆక్షేపించబడుతున్నది? స్వతంత్రప్రజ్ఞులకు (స్వతంత్రంగా ఆలోచించే శక్తి గలవాళ్లకు) ఇలాంటి ఆక్షేపం కలగకపోవచ్చు. కాని సాధారణంగా మనుష్యు లందరూ పరతంత్రప్రజ్ఞులు. అందుచేత స్వతంత్రంగా శ్రుత్యర్థాన్ని నిర్ధారణ చేయజాలక ప్రసిద్ధులైన రచయితలు గల స్మృతులమీద ఆధారపడతారు. ఆ స్మృతుల బలంచేత శ్రుత్యర్థాన్ని తెలుసుకోవాలనుకొంటారు. స్మృతికర్తలమీద ఉన్న గౌరవంచేత మనం చేసిన వ్యాఖ్యానాలు విశ్వసించరు. కపిలుడు మొదలైనవాళ్ల ఆర్షమైన జ్ఞానం అడ్డులేనిదిగా చెప్పబడుతున్నది. "ఋషిం... పశ్యేత్" అని శ్రుతి కూడ ఉంది. "ఏ పరమేశ్వరుడు ఆదియందు పుట్టే కపిలుణ్ణి సృజిస్తాడో, పుట్టిన తరవాత ఆతనిని జ్ఞానాలతో నింపుతాడో అట్టి పరమేశ్వరుణ్ణి చూడాలి" అని దీని అర్థం. అందువల్ల వీళ్ల మతం అయథార్థం అనుకోడానికి శక్యం కాదు. వీళ్లు తర్కబలంచేత విషయప్రతిపాదనం చేస్తారు. ఆ కారణంవల్ల కూడా వేదాంతాలను స్మృతిబలంచేతనే వాఖ్యానించాలి అని మళ్లీ ఆక్షేపం.

వి. శ్రుతుల సమన్వయంలో ఉన్న విరోధాలను తొలగించడం ఈ పాదంయొక్క ప్రయోజనం. అందుచేత శ్రుతి-శాస్త్ర-అధ్యాయసంగతులు, దీనిలోని అధికరణా లన్నీ స్వమతం స్థాపించడంకోసం ఉద్దిష్టమైనవి. అందుచేత ఈ పాదంతో సంగతి. బ్రహ్మయందు వేదాంతసమన్వయం విషయం. అది సాంఖ్యస్మృతితో విరోధిస్తుందా విరోధించదా అని సంశయం. పూర్వపక్షం ప్రకారం స్మృతివిరోధంవల్ల సమన్వయం సిద్ధించకపోవడం ఫలం; సిద్ధాంతంలో సిద్ధించడం ఫలం.

## భాష్యమ్

తస్య సమాధిః- నాన్యస్మృత్యనవకాశదోషప్రసంగాదితి. యది స్మృత్యనవకాశదోషప్రసంగేన ఈశ్వరకారణవాద ఆక్షిప్యేత, ఏవమప్యన్యా ఈశ్వరకారణవాదిన్యః స్మృతయః అనవాకాశాః ప్రసజ్యేరన్. తా ఉదాహరిష్యామః- "యత్తత్సూక్ష్మమవిజ్ఞేయమ్" (శాంతిప. 336-28) ఇతి.

పరం బ్రహ్మ ప్రకృత్య "స హ్యన్తరాత్మా భూతానాం క్షేత్రజ్ఞశ్చేతి కథ్యతే" ఇతి చోక్త్వా "తస్మాదవ్యక్తముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ" (శాంతిప. 336.30) ఇత్యాహ. తథా అన్యత్రాపి "అవ్యక్తం పురుషే బ్రహ్మన్నిష్కలే ప్రవిలీయతే" (శాంతిప. 341.31) ఇత్యాహ.

"అతశ్చ సంక్షేపమిమం శృణుధ్వం నారాయణః సర్వమిదం పురాణః,
స సర్గకాలే చ కరోతి సర్గం (సర్వం) సంహారకాలే చ తదత్తి భూయః"
(శాంతిప.303.115) ఇతి పురాణే. భగవద్గీతాసు చ—

"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా (భ.గీ.7.6) ఇతి. పరమాత్మానమేవ చ ప్రకృత్య ఆపస్తమ్బః పఠతి- "తస్మాత్కాయాః ప్రభవన్తి సర్వే స మూలం శాశ్వతికం స నిత్యః" (ఆ.ధ.సూ.1.8.23.2) ఇతి. ఏవమనేకశః స్మృతిష్వపి ఈశ్వరః ఉపాదానత్వేన కారణత్వేన చ ప్రకాశ్యతే. స్మృతిబలేన ప్రత్యవతిష్ఠమానస్య స్మృతిబలేనైవోత్తరం వక్ష్యామీత్యతోఽయమన్యస్మృత్య నవకాశదోషోపన్యాసః. దర్శితం తు శ్రుతీనామీశ్వరకారణవాదం ప్రతి తాత్పర్యమ్. విప్రతిపత్తౌ చ స్మృతీనామ వశ్యకర్తవ్యేఽన్యతరపరిగ్రహేఽన్యతరత్యాగే చ శ్రుత్యనుసారిణ్యః స్మృతయః ప్రమాణమ్. అనపేక్ష్యా ఇతరాః. తదుక్తం ప్రమాణలక్షణే- "విరోధే త్వనపేక్షం స్యాదసతి హ్యనుమానమ్" (జై.సూ.1.3.3) ఇతి. న చాతీన్ద్రియానర్థాన్ శ్రుతిమన్తరేణ కశ్చిదుపలభత ఇతి శక్యం సంభావయితుమ్; నిమిత్తాభావాత్. శక్యం కపిలాదీనాం సిద్ధానామ ప్రతిహతజ్ఞానత్వాదితి చేత్, న సిద్ధేరపి సాపేక్షత్వాత్. ధర్మానుష్ఠానాపేక్షా హి సిద్ధిః. న చ ధర్మశ్చోదనాలక్షణః. తతశ్చ పూర్వసిద్ధాయాశ్చోదనాయా అర్థో న పశ్చిమసిద్ధపురుషవచనవశేనాతిశఙ్కితుం శక్యతే. సిద్ధవ్యపాశ్రయకల్పనా యామపి బహుత్వాత్సిద్ధానాం ప్రదర్శితేన ప్రకారేణ స్మృతివిప్రతిపత్తౌ సత్యాం న శ్రుతివ్యపాశ్రయాదన్యన్నిర్ణయకారణమస్తి.

బాలానందిని

**తస్యేతి:-** దానికి "న అన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్" అని సమాధానం. స్మృత్యనవకాశదోషప్రసంగంవల్ల ఈశ్వరకారణవాదం ఆక్షేపింపబడితే, ఇదే విధంగా ఈశ్వరకారణత్వాన్ని అంగీకరించే ఇతరస్మృతులు అవకాశం లేనివైపోతాయి. వాటిని ఉదాహరిస్తాం- "యత్తత్సూక్ష్మమవిజ్ఞేయమ్" (సూక్ష్మమూ తెలియ శక్యంకానిదీ అయినది

ఏది కలదో) అని పరబ్రహ్మను గూర్చి చెప్పడం ప్రారంభించి "స హ్యన్తరాత్మా.. కథ్యతే" (అతడే భూతాల అంతరాత్మ. అతనికే క్షేత్రజ్ఞు డని కూడపేరు) అని కూడ చెప్పి "తస్మాదవ్యక్త... ద్విజసత్తమ" (ఓ! ద్విజశ్రేష్ఠుడా! వానినుండి త్రిగుణమైన అవ్యక్తం పుట్టింది) అని అన్నాడు. అట్లే మరొక చోట కూడ 'అవ్యక్తం... సంప్రలీయతే' (ఓ! బ్రాహ్మణా! ఆ అవ్యక్తం నిర్గుణమైన బ్రహ్మలో లీనం అవుతుంది) అని అంటాడు. "అతశ్చ భూయః" (అందువల్ల సంక్షిప్తంగా చెప్పే ఈ విషయం వినండి ఇదంతా పురాణుడైన నారాయణుడే. అతడే సృష్టిసమయంలో సమస్తమును సృష్టిస్తాడు. తరవాత సంహారసమయంలో దానినంతనీ మ్రింగివేస్తాడు) అని పురాణంలో కూడ ఉంది. (మూలంలో చూపి నట్లు ఇది భారతంలో కూడ ఉంది. ఏదైన పురాణంలో కూడ ఉండవచ్చును). భగవద్గీతలో కూడ "అహం...తథా" (నేనే సమస్తజగత్తుకు ఉత్పత్తిహేతువైనవాడను. ప్రలయం కూడ నేనే) అని చెప్పబడింది. పరమాత్మను గూర్చియే మాటలాడుతూ ఆపస్తంబుడు"తస్మాత్...నిత్యః" (ఆ పరమాత్మనుండియే ఈ దేహా లన్నీ పుడుతున్నాయి. నిత్యుడైన ఆ పరమాత్మయే మూలకారణం. ఎల్లప్పుడు ఉండేవాడు అతడే) అని అన్నాడు. ఈ విధంగా అనేక మైన స్మృతులలో కూడ ఈశ్వరుడు కారణంగాను, ఉపాదానంగాను చెప్పబడుతున్నాడు. స్మృతిబలం చూచుకొని ఎదురుతిరిగే వానికి స్మృతిబలంచేతనే సమాధానం చెపుతాను అనే అభిప్రాయంతో ఈ అన్యస్మృత్యనవకాశదోషప్రసంగం చెప్పబడింది. ఈశ్వరకారణవాదాన్ని గూర్చి శ్రుతులకు ఏవిధంగా తాత్పర్యం ఉందో చూపించబడింది. స్మృతులలో అభిప్రాయభేదం వచ్చినప్పుడు, ఒకదానిని గ్రహించి మరొకదానిని తప్పకుండా విడవవలసివచ్చినప్పుడు శ్రుతిని అనుసరించే స్మృతులే ప్రమాణం; ఇతర మైనవి విసర్జించదగినవి. (ఈ విషయమే మీమాంసాశాస్త్రంలో "విరోధే త్వనపేక్షం స్యాదసతి హ్యనుమానమ్" (జైసూ. 1-3-3) అని చెప్పబడింది (స్మృతికి శ్రుతితో విరోధం ఉన్నప్పుడు ఆ స్మృతి అనపేక్షం, అనగా పరిత్యజించదగినది. స్మృతికి లభించే శ్రుతితో విరోధం లేకపోతేనే దానిని పట్టి మూలశ్రుతిని ఊహించాలి అని అర్థం). అతీంద్రియా లైన విషయాలను శ్రుతి సాహాయ్యం లేకుండా ఎవడైనా తెలుసుకొనకలుగుతా డనేది ఊహించడానికి శక్యం కాదు. అలా తెలుసుకొనడానికి నిమిత్తం ఏదీ లేదు కదా? కపిలుడు మొదలైన సిద్ధులు అడ్డు లేని జ్ఞానం కలవారవడంచేత వాళ్లకు శక్యమే అంటే, అది యుక్తం కాదు. సిద్ధి కూడ సాపేక్షమే కదా? అనగా వాళ్లకు సిద్ధి కలిగిందంటే దానికేదో కారణం ఉండాలి. సిద్ధి ధర్మానుష్ఠానంవల్ల లభిస్తుంది. ఆ ధర్మం చోదనాలక్షణం. అందుచేత పూర్వం ఎప్పుడో సిద్ధమైన చోదనయొక్క అర్థం తరవాత వచ్చిన పురుషుని మాటను పట్టి శంకించడం శక్యం కాదు. సిద్ధవ్యపాశ్రయం కల్పించినా

శక్యం

కూడ, అనగా సిద్ధుల వాక్యాలను ఆశ్రయించి వేదార్థం నిర్ణయించాలి అని కల్పించినా కూడ, సిద్ధులు చాలమంది ఉండడంవల్ల పైన చూపిన రీతిలో స్మృతుల మధ్య విప్రతిపత్తి ఏర్పడి నప్పుడు శ్రుతివ్యపాశ్రయం (శ్రుతినాశ్రయిచడం) తప్ప మరొక నిర్ణయకారణం (ఇది ఇట్లు అని నిర్ణయించడానికి తగిన హేతువు) లేదు.

భాష్యమ్

పరతన్త్రప్రజ్ఞస్యాపి నాకస్మాత్ స్మృతివిశేషవిషయః పక్షపాతో యుక్తః.కస్య చిత్ క్వచిత్పక్షపాతే సతి పురుషమతివైశ్వరూప్యేణ తత్త్వావ్యవస్థానప్రసంగాత్. తస్మాత్తస్యాపి స్మృతివిప్రతిపత్త్యుపన్యాసేన శ్రుత్యనుసారాననుసారవిషయవివేచనేన చ సన్మార్గే ప్రజ్ఞా సంగ్రహణీయా. యా తు శ్రుతిః కపిలస్య జ్ఞానాతిశయం ప్రదర్శయన్తీ ప్రదర్శితా న తయా శ్రుతివిరుద్ధమపి కాపిలం మతం శ్రద్ధాతుం శక్యమ్, కపిలమితి శ్రుతిసామాన్యమాత్రత్వాత్. అన్యస్య చ కపిలస్య సగరపుత్రాణాం ప్రతప్తుర్వాసుదేవనామ్నః స్మరణాత్. అన్యార్థదర్శనస్య చ ప్రాప్తిరహితస్యా సాధకత్వాత్. భవతిచాన్యా మనోర్మాహాత్మ్యం ప్రఖ్యాపయన్తీ శ్రుతిః "యద్వై కిఞ్చ మనురవదతద్భేషజమ్" (తై.సం.2.2.10.2) ఇతి". మనునా చ-

"సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,

సంపశ్యన్నాత్మయాజీ వై స్వారాజ్యమధిగచ్ఛతి" (12.91)

ఇతి సర్వాత్మత్వదర్శనం ప్రశంసతా కాపిలం మతం నిన్ద్యత ఇతి గమ్యతే. కపిలోఽహి న సర్వాత్మత్వదర్శనమనుమన్యతే, ఆత్మభేదాభ్యుపగమాత్. మహాభారతే పి చ "బహవః పురుషా బ్రహ్మన్నుతాహో ఏక ఏవ తు"(శాం.ప.352.1) ఇతి విచార్య, "బహవః పురుషా రాజన్ సాంఖ్యయోగవిచారిణామ్" శాం.ప. 352.2) ఇతి పరపక్షముపన్యస్య తద్వ్యుదాసేన-

"బహూనాం పురుషాణాం హి యథైకా యోనిరుచ్యతే.

తథా తం పురుషం విశ్వమాఖ్యాస్యామి గుణాధికమ్" (శాం.ప.352.3)

ఇత్యుపక్రమ్య

"మమాన్తరాత్మా తవ చ యేఽచాన్యే దేహసంస్థితాః,

సర్వేషాం సాక్షిభూతోఽసౌ న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్.

విశ్వమూర్ధా విశ్వభుజో విశ్వపాదాక్షినాసికః,

ఏకశ్చరతి భూతేషు స్వైరచారీ యథాసుఖమ్" (శాం.ప.353.4,5)

ఇతి సర్వాత్మతైవ నిర్ధారితా. శ్రుతిశ్చ సర్వాత్మతాయాం భవతి—

"యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః,

తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః" (ఈ.ఉ.7)

ఇత్యేవంవిధా. అతశ్చ సిద్ధమాత్మభేదకల్పనయాపి కపిలస్య తన్త్రం వేద విరుద్ధం, వేదానుసారివచనవిరుద్ధం చ న కేవలం స్వతన్త్రప్రకృతికల్పనయైవేతి. వేదస్య హి నిరపేక్షం స్వార్థే ప్రామాణ్యం రవేరివ రూపవిషయే. పురుషవచసాం తు మూలాన్తరాపేక్షం వక్తృస్మృతివ్యవహితం చేతి విప్రకర్షః. తస్మాద్వేదవిరుద్ధే విషయే స్మృత్యనవకాశప్రసంగో న దోషః.

బాలానందిని

పరతన్త్రేతి:- పరతంత్రప్రజ్ఞునికైనా అకస్మాత్తుగా (ఏ కారణమూ లేకుండ) ఒక స్మృతి విషయంలో పక్షపాతం యుక్తం కాదు. ఒకనికి ఒక స్మృతి విషయంలో పక్షపాతం ఉంటే (మరొకనికి మరొకదానియందు నిష్కారణమైన పక్షపాతం ఉండవచ్చును గాన) పురుషుల బుద్ధి అనేకవిధాలుగా ఉండడంచేత తత్త్వం విషయంలో వ్యవస్థ లేకుండా పోతుంది. అందుచేత పరతంత్రప్రజ్ఞునికి స్మృతుల మధ్య ఉన్న విప్రతిపత్తిని చూపి శ్రుతిని అనుసరించడం అనుసరించకపోవడం అనే విషయాన్ని వివేచించడం ద్వారా వాని ప్రజ్ఞను సన్మార్గంలో ప్రవర్తించే టట్లు చెయ్యాలి. కపిలుని జ్ఞానాతిశయాన్ని ప్రదర్శించే శ్రుతివాక్యం ఉంది కదా అని ఆ కపిలుని మతం శ్రుతివిరుద్ధ మైనా కూడ నమ్మడం శక్యం కాదు. (ఆ శ్రుతిలో) 'కపిలమ్, అని సామాన్యరూపంలో పేరు చెప్పబడింది. (ఫలాన కపిలుడు అని ఏదీ లేదు కదా అని అర్థం). సగరపుత్రులను కాల్చివేసిన వాసుదేవు డనే పేరు గల మరొక కపిలుడు కూడ (పురాణాదులలో) చెప్పబడుతున్నాడు ఇతర ప్రమాణాలచేత తెలియబడనిది, మరొక విషయాన్ని చెప్పడంకోసం (చెప్పే సందర్భంలో) చెప్పినదీ అయినది సర్వజ్ఞత్వాన్ని సాధించజాలదు.

వి. "ఋషిం ప్రసూతమ్" ఇత్యాదిశ్రుతివాక్యంలో "ఏ పరమేశ్వరుడు కపిలుని సృజించి వానికి జ్ఞానం ఇచ్చాడో ఆ పరమేశ్వరుణ్ణి చూడాలి" అని చెప్పడంచేత ప్రధానంగా చెప్పబడినది పరమేశ్వరదర్శనమే; కపిలుని సర్వజ్ఞత్వం కేవలం అనువదించబడింది కాని విధించబడలేదు. అతడు సర్వజ్ఞుడు అని చెప్పే మరొక ప్రమాణం ఏదైనా

లేనంతవరకు ఈ అనువ్యాదమాత్రంచేత అతనికి సర్వజ్ఞత్వం అంగీకరించవలసిన పని లేదు అని భావం.

భవతి:- మనువుయొక్క గొప్పతనాన్ని చాటే "యద్వై...భేషజమ్" అనే శ్రుతి కూడ ఉంది ("మనువు చెప్పిన దల్లా మంచి ఔషధం అని దాని అర్థం). "సర్వభూతేషు..అధిగచ్ఛతి' ' (తనను సకలభూతాలలోను, సకలభూతాలను తనలోను చూచే ఆత్మయాజి స్వారాజ్యం పొదుతాడు) అని సర్వాత్మత్వదర్శనాన్ని ప్రశంసిస్తూన్న మనువు కపిలమతాన్ని నిందిస్తున్నా డని తెలుస్తున్నది. ఆత్మభేదం అంగీకరించిన కపిలుడు సర్వాత్మత్వదర్శనాన్ని అంగీకరించడం లేదు కదా? మహాభారతంలో కూడ- "బహవః...ఏవ తు" (ఓ బ్రాహ్మణుడా! పురుషులు అనేకులా లేక ఒక్కడేనా అని విచారణ చేసి ''బహవః.. విచారిణామ్'' (రాజా! సాంఖ్యపయోగమతానుసారులకు పురుషులు అనేకులు అని పూర్వపక్షం ఉపన్యసించి దానిని నిరాకరిస్తూ - "బహూనాం...గుణాధికమ్" (అనేకపురుషులకు ఒకే కారణం అని చెప్పడానికి అనువుగా విశ్వస్వరూపుడు, గుణాలచేత అధికుడు అయిన ఆ పురుషుణ్ణి గూర్చి చెపుతాను) అని ఉపక్రమించి "మమ...యథాసుఖమ్" అని సర్వాత్మత్వమే నిర్ధారణచేయబడింది. ''నాకు నికు సకలదేహధారులకు అంతరాత్మ యైనవాడు, అందరికీ సాక్షి అయిన ఈ పరమాత్మ ఎవనిచేత, ఎక్కడా కూడ గ్రహింపశక్య మైనవాడుకాడు. అనేకశిరస్సులు కలవాడు, అనేకభుజాలు కలవాడు, అనేకమైన పాదాలు, నేత్రాలు, ముక్కులూ కలవాడు అయిన ఆ పరమాత్మ, ఒక్కడే, సుఖంగా స్వేచ్ఛగా సంచరిస్తూ ప్రాణులలో సంచరిస్తున్నాడు'' అని ఈ రెండు శ్లోకాల అర్థం. "యస్మిన్..అనుపశ్యతః" ఈ విధమైన శ్రుతికూడ సర్వాత్మత్వాన్ని బోధిస్తూన్నది. ''ఏ జ్ఞానకాలంలో జ్ఞానియైనవానికి సకలభూతాలూ కూడ ఆత్మగానే అయ్యాయో అట్టి స్థితిలో ఏకత్వాన్ని చూస్తున్నవానికి మోహం ఏమిటి శోకం ఏమిటి అని ఈ శ్రుతికి అర్థం అందుచేత కేవలం స్వతంత్రమైన ప్రకృతిని కల్పించడంచేతనే కాకుండా ఆత్మభేదాన్ని కల్పించడంచేత కూడ కపిలతంత్రం వేదవిరుద్ధం అనీ, వేదాన్ని అనుసరించే స్మృత్యాదివచనాలకి విరుద్ధ మనీ సిద్ధించింది. రూపం విషయంలో సూర్యునికి ఇతరాపేక్ష లేని ప్రామాణ్యం ఉన్నట్లు వేదానికి స్వార్థబోధనవిషయంలో ఉన్న ప్రామాణ్యం ఇతరాపేక్ష లేనిది. పురుషవాక్యాల ప్రామాణ్యం అయితే మరొక మూలం మీద ఆధారపడి ఉంటుంది, వక్తయొక్క స్మరణంచేత వ్యవహితం అయి ఉంటుంది, అందుచేత (ప్రామాణ్యంవిషయంలో) దూరం ఉంది. అందువల్ల వేదవిరుద్ధమైన విషయంలో స్మృత్యనవకాశప్రసంగం ఉన్నా అది దోషం కాదు.

వి. వక్తృస్మృతివ్యవహితం అనగా స్మృతికారులు మొదలైనవాళ్లు వేదంలో బోధించబడిన అర్థాలను స్మరించి వాటిని తమ మాటలలో చెపుతారు. అందుచేతనే వాటికి స్మృతులు అనిపేరు. ఒక విషయం స్మృతిలో చెప్పబడింది కాబట్టి ప్రమాణం

అనడానికి వీలులేదు. దీనికి మూలమైన శ్రుతివాక్యం ఉంది కాబట్టి దీనికి ప్రామాణ్యం. అందుచేత వక్తయొక్క స్మరణంచేత వ్యవహితంగా ఉంటుంది దీని ప్రామాణ్యం. దీని ప్రామాణ్యానికి శ్రుతికీ మధ్య వక్తృస్మరణం ఉంటుంది అని భావం. 1.

## భాష్యమ్

కుతశ్చ స్మృత్యనవకాశప్రసఙ్గో న దోషః?

## సూ. ఇతరేషాం చానుపలబ్ధేః 2.1.2

ప్రధానాదితరాణి యాని ప్రధానపరిణామత్వేన స్మృతౌ కల్పితాని మహదాదీని న తాని వేదే లోకే వోపలభ్యన్తే. భూతేన్ద్రియాణి తావల్లోకవేదప్రసిద్ధత్వాచ్ఛక్యన్తే స్మర్తుమ్. అలోకవేదప్రసిద్ధత్వాత్తు మహదాదీనాం షష్ఠస్యేవేన్ద్రియార్థస్య న స్మృతిరవకల్పతే. యదపి క్వచిత్తత్పరమివ శ్రవణమవభాసతే తదప్యతత్పరం వాఖ్యాతమ్ "ఆనుమానికమప్యేకేషామ్" (బ్ర.సూ. 1.4.1.) ఇత్యత్ర.కార్యస్మృతేరప్రామాణ్యాత్కారణస్మృతేరప్యప్రామాణ్యం యుక్తమిత్యభిప్రాయః. తస్మాదపి న స్మృత్యనవకాశప్రసఙ్గో దోషః. తర్కావష్టంభం తు "న విలక్షణత్వాత్" (బ్ర.సూ. 2.1.14) ఇత్యారభ్యోన్మథిష్యతి.2

## బాలానందిని

కుత ఇతి:- స్మృత్యనవకాశప్రసంగం మరి ఏ కారణంచేత కూడ దోషం కాదు?

ఇతరేషామితి:- ఇతరేషామ్ = ప్రధానంకంటె భిన్నమైన, దాని కార్యాలైన మహదాదులు, అనుపలబ్ధేః చ = వేదంలో కాని, లోకంలో కాని కనబడకపోవడంవల్ల కూడ దోషం కాదు" అని సూత్రార్థం

ప్రధానాదితి:- ప్రధానంకంటె ఇతరములైన ఏ మహదాదులు ప్రధానంయొక్క పరిణామాలుగా సాంఖ్యస్మృతిలో కల్పించబడ్డాయో అవి వేదంలో గాని లోకంలో గాని కనబడడంలేదు. స్థూలభూతాలు, ఇంద్రియాలు అయితే లోకంలోను వేదంలోను కూడ ప్రసిద్ధం అవడంచేత వాటిని స్మరించడం (స్మృతిలో చెప్పడం) శక్యమే కాని మహత్తుమొదలైనవి అనగా మహత్తు, అహంకారం, అహంకారంనుండి పుట్టినవిగా చెప్పబడే తన్మాత్రలు లోకంలో గాని వేదంలో గాని షష్ఠమైన ఇంద్రియార్థం వలె అప్రసిద్ధమైనవి గాన వాటి స్మృతి కుదరదు (ఐదు ఇంద్రియాలచేత అనుభవించినవాటిని స్మరించవచ్చు. కాని ఆరవ ఇంద్రియమూ లేదూ దానిచేత

గ్రహించే విషయమూ లేదు. అలాంటి విషయాన్ని స్మరించడం ఎట్లు అశక్యమో మహదాదులను స్మృతినిబద్ధం చేయడం కోసం స్మరించడం కూడ అదే విధంగా అశక్యం అని భావం. శ్రుతిలో మహదాదులను గూర్చి చెపుతున్నట్లు పైకి కనబడేది కూడ ఆ మహదాదులకు సంబంధించినది కాదు అని "ఆనుమానికమప్యేకాషామ్" అనే అధికరణంలో చెప్పబడింది. కార్యాలైన మహదాదుల స్మృతి అప్రమాణం అవడంవల్ల కారణమైన ప్రధానంయొక్క స్మృతి కూడ అప్రమాణమే అని చెప్పడం యుక్తం అని అభిప్రాయం అందువల్ల కూడ స్మృత్యనకాశప్రసంగం దోషం కాదు. తర్కంయొక్క అవష్టంభాన్నైతే (అవష్టంభం అనగా చేయూత, ఆలంబనం) న విలక్షణత్వాత్ అని ప్రారంభించి మథించివేస్తాడు.2

స్మృత్యధికరణం సమాప్తం

## 2.యోగప్రత్యుక్త్యధికరణమ్. సూ.3.

## సూ. ఏతేన యోగః ప్రత్యుక్తః 2.1.3.

ఏతేన సాంఖ్యస్మృతిప్రత్యాఖ్యానేన యోగస్మృతిరపి ప్రత్యాఖ్యాతా ద్రష్టవ్యేత్యతిదిశతి. తత్రాపి శ్రుతివిరోధేన ప్రధానం స్వతన్త్రమేవ కారణం మహదాదీని చ కార్యాణ్యలోకవేదప్రసిద్ధాని కల్ప్యన్తే. నన్వేవం సతి సమానన్యాయత్వాత్పూర్వేణైవైతద్గతం; కిమర్థం పునరతిదిశ్యతే? అస్తి హ్యత్రాభ్యధికాశఙ్కా. సమ్యగ్దర్శనాభ్యుపాయో హి యోగో వేదే విహితః "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (బృ.ఉ.2.4.5) ఇతి." త్రిరున్నతం స్థాప్య సమం శరీరమ్ (శ్వే.ఉ.2.8) ఇత్యాదినా చాసనాదికల్పనాపురఃసరం బహుప్రపఞ్చం యోగవిధానం శ్వేతాశ్వతరోపనిషది దృశ్యతే. లిఙ్గాని చ వైదికాని యోగవిషయాణి సహస్రశ ఉపలభ్యన్తే "తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణామ్" (క.ఉ.2.6.11) ఇతి, "విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్" (క.ఉ.2.6.18) ఇతి చైవమాదీని. యోగశాస్త్రేఽపి "అథ తత్త్వదర్శనోపాయో యోగః" ఇతి సమ్యగ్దర్శనాభ్యుపాయత్వేనైవ యోగోఽ ఙ్గీక్రియతే. అతః సంప్రతిపన్నార్థైకదేశత్వాదష్టకాదిస్మృతివద్యోగస్మృతిరప్య నపవదనీయా భవిష్యతీతి, ఇయమప్యధికాశఙ్కాఽతిదేశేన నివర్త్యతే. అర్థైకదేశసంప్రతిపత్తావప్యర్థైకదేశవిప్రతిపత్తేః పూర్వోక్తాయా దర్శనాత్.

బాలానందిని

ఏతేనేతి:- "ఏతేన = దీనిచేత, యోగః = యోగస్మృతి కూడ, ప్రత్యుక్తః = నిరాకరించ బడినది" అని సూత్రార్థం. ఇది అతిదేశం కాబట్టి సంగత్యాదికం పూర్వాధికరణంలో వలెనే ఉంటాయి.

ఏతేనేతి:- ఏతేన= ఈసాంఖ్యస్మృతిప్రత్యాఖ్యానంచేత యోగస్మృతి కూడ నిరాకరించబడిందిగా చూచుకొనవలెనని అతిదేశం చేస్తున్నాడు. యోగస్మృతిలో కూడ శ్రుతివిరుద్ధంగా స్వతంత్రాకారణమైన (స్వతంత్రకారణంగా) ప్రధానమూ మహదాదికార్యాలు, లోకంలో గాని వేదంలో గాని ప్రసిద్ధములు కానివి కల్పించబడుతున్నాయి (ప్రశ్న) -అట్లయితే న్యాయం సమానంగానే ఉండడంచేత వెనుకటి అధికరణంచేతనే ఇది గతార్థ మైనది. మళ్లీ అతిదేశం చేయడం ఎందుకు? (సమాధానం) - ఇక్కడ అధికమైన ఆశంక ఉంది "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" అని సమ్యగ్దర్శనానికి ఉపాయంగా వేదంలో యోగం విధించబడింది. "త్రిరున్నతం స్థాప్య సమం శరీరమ్" (వక్షస్థలం కంఠం శిరస్సు ఈ మూడు ఎత్తుగా ఉన్న శరీరాన్ని సమంగా ఉంచి) ఇత్యాదికంచేత ఆసనాదివిధానం చూపుతూ శ్వేతాశ్వతరోపనిషత్తులో అతివిస్తృతమైన యోగవిధానం కనబడుతున్నది. "తాం...ధారణామ్" (స్థిరమైన ఆ ఇంద్రియనిగ్రహాన్ని యోగం అంటారు) "విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్" ( ఈ విద్యను సమస్తమైన యోగంవిధానాన్ని) ఇత్యాదులైన యోగానికి సంబంధించిన వైదికాలైన లింగాలు వేలకొలది కనబడుచున్నవి. "అథ తత్త్వదర్శనోపాయో యోగః" (తత్త్వాన్ని చూచే ఉపాయం యోగం) అని అంటూ యోగశాస్త్రంలో కూడ యోగం సమ్యగ్దర్శనానికి ఉపాయంగా అంగీకరించబడుతున్నది. అందుచేత ఈ శాస్త్రంలో ప్రతిపాదించబడిన కొంత అర్థం (వేదాంతంలో కూడ) అంగీకరించబడింది గాన యోగస్మృతి కూడ, అష్టకాదిస్మృతి వలె, నిరాకరించ తగనిది అవుతుంది అనే ఈ అధికమైన శంక అతిదేశంచేత నివర్తింపచేయబడుచున్నది. శాస్త్ర విషయంలోని కొంత భాగం విషయంలో సంప్రతిపత్తి (అంగీకారం) ఉన్నాకూడ కొంత భాగం విషయంలో వెనుక చెప్పిన విప్రతిపత్తి కనబడుతున్నది కదా?

## భాష్యమ్

సతీష్వప్యధ్యాత్మవిషయాసు బహ్వీషు స్మృతిషు సాంఖ్యయోగస్మృత్యోరేవ నిరాకరణే యత్నః కృత.ః సాంఖ్యయోగౌ హి పరమపురుషార్థసాదనత్వేన లోకే ప్రఖ్యాతౌ శిష్టైశ్చ పరిగృహీతౌ, లిఙ్గేన శ్రౌతేన చోపబృంహితౌ - "తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" (శ్వే.ఉ.6.13.) ఇతి. నిరాకరణం తు న సాంఖ్యజ్ఞానేన వేదనిరపేక్షేణ యోగమార్గేణ వా నిఃశ్రేయసమధిగమ్యత ఇతి. శ్రుతిర్హి వైదికాదాత్మైకత్వవిజ్ఞానాదన్యన్ని శ్రేయససాధనం వారయతి - "తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పన్థా

విద్యతేఽయనాయ" (శ్వే.ఉ.3.8) ఇతి. ద్వైతినో హి తే సాంఖ్యాః యోగాశ్చ నాత్మైకత్వదర్శినః. యత్తు దర్శనముక్తం - "తత్కారణం సాంఖ్యయోగాభిపన్నమ్" ఇతి, వైదికమేవ తత్ర జ్ఞానం ధ్యానం చ సాంఖ్యయోగశబ్దాభ్యామభిలప్యతే ప్రత్యాసత్తేరిత్యవగన్తవ్యమ్.

యేన త్వంశేన న విరుధ్యేతే తేనేష్టమేవ సాంఖ్యయోగస్మృత్యోః సావకాశత్వమ్. తద్యథా - అసఙ్గో హ్యయం పురుషః" (బృ.ఉ.4.3.16) ఇత్యేవమాది శ్రుతిప్రసిద్ధమేవ పురుషస్య విశుద్ధత్వం నిర్గుణపురుషనిరూపణేన సాంఖ్యైరభ్యుపగమ్యతే. తథా చ యోగైరపి - "అథ పరివ్రాడ్వివర్ణవాసా ముణ్డోఽపరిగ్రహః" (జాబా.5) ఇత్యేవమాది శ్రుతిప్రసిద్ధమేవ నివృత్తినిష్ఠత్వం ప్రవ్రజ్యాద్యుపదేశేనానుగమ్యతే. ఏతేన సర్వాణి తర్కస్మరణాని ప్రతివక్తవ్యాని. తాన్యపి తర్కోపపత్తిభ్యాం తత్త్వజ్ఞానాయోపకుర్వన్తి చేదుపకుర్వన్తు నామ. తత్త్వజ్ఞానం తు వేదాన్తవాక్యేభ్య ఏవ భవతి - "నావేదవిన్మనుతే తం బృహన్తమ్" (తై.బ్రా.3.12.9.7) "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ.ఉ.3.9.26) ఇత్యేవమాదిశ్రుతిభ్యః 3.

బాలానందిని

సతీష్వితి:- అధ్యాత్మవిషయకాలైన చాలా స్మృతు లున్నా కూడ సాంఖ్యయోగస్మృతులను నిరాకరించడానికి ప్రయత్నం చేయబడింది. సాంఖ్యయోగాలు పరమపురుషార్థానికి (మోక్షానికి) సాధనాలుగా లోకంలో ప్రసిద్ధి పొందాయి. వీటిని శిష్టులు కూడ పరిగ్రహించారు. "తత్కారణం..పాశైః" ఇత్యాదిశ్రుతులలో లభించే లింగంచేత పరిష్టా లవుతున్నాయి. "కామాలకు కారణము, సాంఖ్యయోగాలచేత అనగా వివేకధ్యానాలచేత పొందబడినవాడు అయిన ఆ దేవుణ్ణి తెలుసుకొని సర్వపాపాలనుండి విముక్తు డవుతాడు" అని శ్రుతివాక్యాని కర్థం. అయితే - వేదాపేక్ష లేని సాంఖ్యమార్గంచేత గాని, యోగమార్గంచేత గాని మోక్షం లభించదు అనే అభిప్రాయంతో వాటి నిరాకరణం చేయబడుతున్నది. "తమేవ..అయనాయ" అనే శ్రుతి వైదికమైన ఆత్మైకత్వవిజ్ఞానం తప్ప మరి ఏదీ కూడ మోక్షసాధనం కాదు అని చెపుతున్నది. సాంఖ్యులు యోగులు కూడ ద్వైతులే, ఆత్మైకత్వాన్ని అంగీకరించినవాళ్లు కాదు. "తాత్కారణం సాంఖ్యయోగాభిపన్నమ్" అని సాంఖ్యయోగాల నిర్దేశం ఏది శ్రుతిలో కనబడుతున్నదో అక్కడ సాంఖ్యయోగపదాలచేత, అక్కడ దగ్గరగా ఉండడంచేత, వేదోక్తమైన జ్ఞానధ్యానాలే

చెప్పబడుతున్నాయి అని గ్రహించాలి. సాంఖ్యయోగస్మృతులు ఏ అంశంచేత వేదవిరుద్ధాలు కావో ఆ అంశంలో వాటికి సావకాశత్వం (ప్రామాణ్యం) మాకు కూడ ఇష్టమే. అదెట్లనగా – సాంఖ్యులు "అసంగో హ్యయం పురుషః" ఇత్యాదిశ్రుతులలో ప్రసిద్ధమైన పురుషుని విశుద్ధత్వాన్నే నిర్గుణపురుషుణ్ణి నిరూపించడం ద్వారా అంగీకరిస్తున్నారు. అట్లే యోగులు కూడ సంన్యాసాదులను ఉపదేశిస్తూ "అథ పరివ్రాట్..అపరిగ్రహః" (మాసిపోయిన వస్త్రాలు ధరించినవాడు, ముండితశిరస్కుడు, ధనసంచయం చేయనివాడు, దేశసంచారం చేసేవాడు) అని శ్రుతిప్రసిద్ధమే అయిన నివృత్తిమార్గనిష్ఠను అనుసరిస్తూన్నది (బోధిస్తూన్నది). దీనిచేత (ఈ చెప్పిన యుక్తులచేత) తర్కంమీద ఆధారపడిన స్మృతులన్నీ నిరాకరింపదగినవి. అయితే అవి కూడ కొన్ని అంశాలలో తర్కం (అనుమానం) చేత ఉపపత్తి (యుక్తి) చేత తత్త్వజ్ఞానానికి ఉపయోగిస్తే ఉపయోగించవచ్చును తత్త్వజ్ఞానం మాత్రం "నావేదవిన్మనుతే తం బృహన్తమ్" (వేదవేత్త కానివాడు ఆ బ్రహ్మను తెలుసుకొనజాలడు) "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" ఇత్యాది శ్రుతుల ననుసరించి వేదాంతవాక్యాలవల్ల మాత్రమే కలుగుతుంది.3.

యోగప్రత్యుక్త్యధికరణం సమాప్తం

## 3. విలక్షణత్వాధికరణమ్. సూ. 4 -12

## సూ. న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్. 2.1.4

బ్రహ్మాస్య జగతః నిమిత్తకారణం ప్రకృతిశ్చేత్యస్య పక్షస్యాక్షేపః స్మృతినిమిత్తః పరిహృతః తర్కనిమిత్త ఇదానీమాకేపః పరిహ్రియతే. కుతః పునరస్మిన్నవధారిత ఆగమార్థే తర్కనిమిత్తస్యాక్షేపస్యావకాశః; నను ధర్మ ఇవ బ్రహ్మణ్యప్యనపేక్ష ఆగమో భవితుమర్హతి? భవేదయమవష్టమ్భో యది ప్రమాణన్తరానవగాహ్య ఆగమమాత్రప్రమేయోఽయమర్థః స్యాదనుష్ఠేయరూప ఇవ ధర్మః. పరినిష్పన్నరూపం తు బ్రహ్మావగమ్యతే. పరినిష్పన్నే చ వస్తుని ప్రమాణాన్తరాణామస్త్యవకాశో యథా పృథివ్యాదిషు. యథా చ శ్రుతీనాం పరస్పరవిరోధే సత్యేకవశేనేతరా నీయన్తే ఏవం ప్రమాణాన్తరవిరోధేఽపి తద్వశేనైవ శ్రుతిర్నీయేత. దృష్టసామ్యేన చాదృష్టమర్థం సమర్థయన్తీ యుక్తిరనుభవస్య సంనికృష్యతే. విప్రకృష్యతే తు శ్రుతిరైతిహ్యమాత్రేణ స్వార్థాభిధానాత్. అనుభవావసానం చ బ్రహ్మవిజ్ఞానమవిద్యాయా నివర్తకం మోక్షసాధనం చ దృష్టఫలతయేష్యతే. శ్రుతిరపి "శ్రోతవ్యో మన్తవ్యః" ఇతి శ్రవణవ్యతిరేకేణ మననం విదధతీ తర్కమప్యాదర్తవ్యం దర్శయతి. అతస్తర్కనిమిత్తః పునరాక్షేపః క్రియతే "న విలక్షణత్వాదస్య" ఇతి.

## బాలానందిని

నేతి:- "విలక్షణత్వాత్ = జగత్తు బ్రహ్మకంటె విలక్షణం అవడంవల్ల, న = జగత్తుకు కారణం కాదు. తథాత్వం చ = విలక్షణత్వం, శబ్దాత్ = శబ్దంవల్లనే తెలుస్తూన్నది' అని సూత్రార్థం.

బ్రహ్మేతి:- ఈ జగత్తుకు బ్రహ్మ నిమిత్తకారణం, ప్రకృతి కూడ అనే పక్షానికి స్మృతినిమిత్తక మైన ఆక్షేపం పరిహరించబడింది. ఇప్పుడు తర్కాన్ని పట్టి ఆక్షేపం పరిహరించబడుతున్నది. (ప్రశ్న) ఈ శాస్త్రీయార్థం నిశ్చయంచేసివేసిన తరవాత మళ్లీ తర్కనిమిత్తక మైన ఆక్షేపానికి అవకాశం ఎక్కడ? ధర్మవిషయంలో వలెనే బ్రహ్మ విషయంలో కూడ శ్రుతికి ఇతరప్రమాణాల ఆపేక్ష ఏమీ ఉండదు కదా? (సమాధానం) ఈ విషయం అనుష్ఠించదగిన ధర్మంవలె ఇతరప్రమాణాలచేత తెలియబడనిది, కేవలం శ్రుతిచేతనే తెలియదగినదీ అనేటట్లయితే అప్పుడు ఈ అవష్టంభం. (ఎదురుసమాధానం చెప్పడం) కుదిరి ఉండేది. కాని బ్రహ్మ సిద్ధరూపమైనదిగా తెలుస్తూన్నది. నిష్పన్నమైన (సిద్ధమైన) వస్తువు విషయంలో పృథివి మొదలైన సిద్ధవస్తువుల విషయంలో వలె, ఇతరప్రమాణాలకి కూడ అవకాశం ఉంటుంది. శ్రుతులకు పరస్పరం విరోధం ఏర్పడినప్పుడు ఒక శ్రుతిని పట్టి ఇతరశ్రుతులు ఏ విధ:గా సమన్వయించబడతాయో అట్లే ప్రమాణాంతరాలతో విరోధం కలిగినప్పుడు కూడ శ్రుతిని వాటిని పట్టే అర్థం చేసుకోవాలి. చూచినదానితో ఉన్న పోలికను పట్టి చూడబడనిదానిని సమర్థించే యుక్తి అనుభవానికి దగ్గరగా ఉంటుంది. ఐతిహ్యమాత్రంచేత (ఇది ఇలాగట అని) తన అర్థాన్ని బోధించే శ్రుతి అనుభవానికి దూరంగా ఉంటుంది. చివరికి అనుభవరూపంలోనే తేలే బ్రహ్మజ్ఞానం అవిద్యను తొలగిస్తుం దనీ మోక్షసాదన మనీ దృష్టఫలంగా (ప్రత్యక్షంగా అనుభవించదగిన ఫలంకలదిగా) అంగీకరించబడుతున్నది. "శ్రోతవ్యో మన్తవ్యః" అని శ్రవణమే కాకుండా మననాన్ని కూడ విధిస్తూన్న శ్రుతియే తర్కం కూడ ఆదరించదగినదే అని సూచిస్తూన్నది. అందువల్ల "న విలక్షణత్వాదస్య" అని తర్కనిమిత్తక మైన ఆక్షేపం మళ్లీ చేయబడుచున్నది.

## భాష్యమ్

యదుక్తమ్ - చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిః ఇతి, తన్నోపపద్యతే - కస్మాత్? విలక్షణత్వాదస్య వికారస్య ప్రకృత్యాః. ఇదం హి బ్రహ్మకార్యత్వేనాభి ప్రేయమాణం జగత్ బ్రహ్మవిలక్షణమచేతనమశుద్ధం చ దృశ్యతే. బ్రహ్మ చ జగద్విలక్షణం చేతనం శుద్ధం చ శ్రూయతే. న చ విలక్షణత్వే ప్రకృతి - వికారభావః

దృష్టః. న హి రుచకాదయో వికారా మృత్ప్రకృతికా భవన్తి. శరావాదయో వా సువర్ణప్రకృతికాః. మృదైవ తా మృదన్వితా వికారాః క్రియన్తే. సువర్ణేన చ సువర్ణాన్వితాః. తథేదమపి జగదచేతనం సుఖదుఃఖమోహాన్వితం సదచేతనస్యైవ సుఖదుఃఖమోహాత్మకస్య కారణస్య కార్యం భవితుమర్హతీతి న విలక్షణస్య బ్రహ్మణః.బ్రహ్మవిలక్షణత్వం చాస్య జగతోఽశుద్ధ్యచేతనత్వదర్శనాదవగన్తవ్యమ్ అశుద్ధం హి జగత్సుఖదుఃఖమోహాత్మకతయా ప్రీతిపరితాపవిషాదాదిహేతుత్వాత్స్వర్గనరకాద్యుచ్చావచప్రపఞ్చత్వాచ్చ. అచేతనం చేదం జగత్, చేతనం ప్రతి కార్యకరణభావేనోపకరణభావోపగమాత్. న హి సామ్యే సత్యుపకార్యోపకారకభావో భవతి, న హి ప్రదీపౌ పరస్పరస్యోపకురుతః. నను చేతనమపి కార్యకరణం స్వామిభృత్యన్యాయేన భోక్తురుపకరిష్యతి? న. స్వామిభృత్యయోరప్యచేతనస్యైవ చేతనం ప్రత్యుపకారకత్వాత్. యో హ్యేకస్య చేతనస్య పరిగ్రహో బుద్ధ్యాదిరచేతనభాగః స ఏవాన్యస్య చేతనస్యోపకరోతి, న తు స్వయమేవ చేతనశ్చేతనస్యోపకరోత్యపకరోతి వా. నిరతిశయా హ్యకర్తారశ్చేతనా ఇతి సాంఖ్యా మన్యన్తే. తస్మాదచేతనం కార్యకరణమ్. న చ కాష్ఠలోష్టానాం చేతనత్వే కించిత్ ప్రమాణమస్తి. ప్రసిద్ధశ్చాయం చేతనాచేతనవిభాగో లోకే. తస్మాత్ బ్రహ్మవిలక్షణత్వాత్ నేదం జగత్ తత్ప్రకృతికమ్.

## బాలానందిని

యదితి:- చేతనమైన బ్రహ్మ జగత్తుకు కారణం; అదే దానికి ప్రకృతి అని ఏది చెప్పబడినదో అది కుదరదు. ఎందువల్ల? ఈ వికారం (జగత్తు) ప్రకృతికంటె (బ్రహ్మకంటె) విలక్షణం కనక. బ్రహ్మయొక్క కార్యంగా అంగీకరించబడిన ఈ జగత్తు బ్రహ్మకంటె విలక్షణమై అచేతనంగాను, అశుద్ధంగాను కనబడుతున్నది. బ్రహ్మ జగత్తుకంటె విలక్షణంగా చేతనంగాను శుద్ధంగాను వినబడుచున్నది. వైలక్షణ్యం ఉన్నప్పుడు ప్రకృతివికారభావం ఎక్కడా చూడబడలేదు. రుచకంమొదలైన వికారాలకి మృత్తు ప్రకృతి కాజాలదు, మూకుడు మొదలైనవాటికి బంగారం ప్రకృతి కాజాలదు కదా? మృత్తుతో కూడిన వికారాలు మృత్తుతోనే చేయబడతాయి, బంగారంతో కూడినవి బంగారంతో చేయబడతాయి. అట్లే అచేతనము, సుఖదుఃఖమోహాన్వితమూ అయిన ఈ జగత్తు కూడ అచేతనము, సుఖదుఃమోహాన్వితమూ అయిన కారణంయొక్క

కార్యం అవడానికి తగి ఉంటుంది కాని విలక్షణమైన బ్రహ్మయొక్క కార్యం కాజాలదు. ఈ జగత్తులో అశుద్ధి అచేతనత్వమూ కనబడడంవల్ల ఇది బ్రహ్మకంటె విలక్షణము అని తెలియదగినది. సుఖదుఃఖమోహాత్మకం అవడంచేత, ప్రేమ, తాపం, విషాదం మొదలైనవాటికి కారణం అవడంవల్ల, స్వర్గం నరకం, మొదలైన అనేకవిధాలైన ప్రపంచం(విస్తారం) కలవడంవల్ల జగత్తు అశుద్ధ మైనది కదా? కార్యం గాను, కరణం గాను అయి (దేహేంద్రియాదిరూపాలలో) ఈ జగత్తు చేతనంయొక్క ఉపభోగానికి సాధనంగా అవుతున్నది గాన అచేతనం. రెండూ సమంగానే ఉంటే ఉపకార్యోపకారక భావం కుదరదు కదా? రెండు దీపాలు ఒకదాని కొకటి ఉపకరించవు కదా? (ప్రశ్న) - చేతనమైన దేహేంద్రియాదికం కూడ స్వామిభృత్యన్యాయంచేత భోక్తకు ఉపకరిస్తుంది. కదా? (అనగా చేతనుడైన భృత్యుడు చేతనుడైన స్వామికి ఉపకరించి నట్లు రెండు చేతనాలు పరస్పరం ఉపకరించుకొనవచ్చును కదా?). అది యుక్తం కాదు. స్వామి భృత్యులలో కూడ అచేతనాంశమే చేతనానికి ఉపకారకంగా ఉంటూన్నది. ఒక చేతనుని పరిగ్రహం (సొత్తు) అయిన బుద్ధి మొదలైన అచేతనభాగమే మరొక చేతనునికి ఉపకరిస్తున్నది. అంతే కాని ఒక చేతనుడు, స్వయంగా, మరొకచేతనునికి ఉపకారం కాని అపకారం కాని చేయడం లేదు. చేతనులు (నిరతిశయులు.ఎట్టి గుణాద్యతిశయమూ లేనివారు) కర్తృత్వం లేని వారు అని సాంఖ్యులు అంగీకరిస్తున్నారు కదా? అందుచేత కార్యకరణం అచేతనం. కఱ్ఱలు, మట్టిపెడ్డలు మొదలైనవి చేతనాలు అని చెప్పడానికి ప్రమాణం ఏదీ లేదు కదా? ఈ చేతనాచేతనవిభాగం లోకంలో ప్రసిద్ధంగా ఉంది. అందువల్ల బ్రహ్మకంటె విలక్షణం అవడంవల్ల ఈ జగత్తుకు బ్రహ్మ ప్రకృతి కాదు.

## భాష్యమ్

యోఽపి కశ్చి దాచక్షీత శ్రుత్యా జగతశ్చేతనప్రకృతికతాం, తద్బలేనైవ సమస్తం జగచ్చేతనమవగమయిష్యామి, ప్రకృతిరూపస్య వికారేఽన్వయ దర్శనాత్. అవిభావనం తు చైతన్యస్య పరిణామవిశేషాద్భవిష్యతి. యథా స్పష్టచైతన్యానామప్యాత్మనాం స్వాపమూర్ఛాద్యవస్థాసు చైతన్యం న విభావ్యతే ఏవం కాష్ఠలోష్టాదీనామపి చైతన్యం న విభావయిష్యతే. ఏతస్మాదేవ చ విభావితత్వావిభావితత్వకృతాత్ విశేషాత్ రూపాదిభావాభావాభ్యాం చ కార్యకరణానామాత్మనాం చ చేతనత్వావిశేషేఽపి గుణప్రధానభావో న

విరోత్స్యతే. యథా చ పార్థివత్వావిశేషే ఽపి మాంససూపౌదనాదీనాం ప్రత్యాత్మవర్తినో విశేషాత్ పరస్పరోపకారిత్వం భవతి ఏవమిహాపి భవిష్యతి. ప్రవిభాగప్రసిద్ధిరప్యత ఏవ న విరోత్స్యతే ఇతి; తేనాపి కథం చిచ్చేనాచేనత్వ లక్షణం విలక్షణత్వం పరిహ్రియేత. శుద్ధ్యశుద్ధిలక్షణం తు విలక్షణత్వం నైవ పరిహ్రియతే. న చేతరదపి విలక్షణత్వం పరిహర్తుం శక్యత ఇత్యాహ -- "తథాత్వం చ శబ్దాత్" ఇతి. అనవగమ్యమానమేవ హీదం లోకే సమస్తస్య వస్తునశ్చేతనత్వం చేతనప్రకృతికత్వశ్రవణాత్ శబ్దశరణతయా కేవల యోత్ప్రేక్ష్యతే. తచ్చ శబ్దేనైవ విరుధ్యతే. యతః శబ్దాదపి తథాత్వమవగమ్యతే. తథాత్వమితి ప్రకృతివిలక్షణత్వం కథయతి. శబ్ద ఏవ "విజ్ఞానం చావిజ్ఞానం చ" (తై. 2.6 ఇతి కస్య చిద్విభాగస్యాచేతనతాం శ్రావయచ్చేతనాద్బ్రహ్మణో విలక్షణమచేతనం జగచ్ఛ్రావయతి. 4.

## బాలానందిని

యోఽపీతి :- ''శ్రుతిచేత జగత్తుకు చేతనం ప్రకృతి అని, దాని (శ్రుతియొక్క) బలంచేతనే సమస్తజగత్తూ చేతనం అనీ తెలియపరుస్తాను. (చెపుతాను); ప్రకృతియొక్క రూపం వికారంలో అన్వయించడం కనబడుతున్నది కదా? చైతన్యం పైకి కనబడకపోవడ మైతే చైతన్యంయొక్క పరిణామవిశేషంవల్ల ఏర్పడగలదు. స్పష్టమైన చైతన్యం కలవైనా ఆత్మలయొక్క చైతన్యం నిద్ర, మూర్ఛ మొదలైన అవస్థలలో ఏ విధంగా పైకి కనబడదో అట్లే కాష్ఠలోష్టాదుల చైతన్యం పైకి కనబడడం కనబడకపోవడం అనేదానివల్ల ఏర్పడిన విశేషంచేతనే గుణప్రధానభావం (స్పష్టంగా చైతన్యం కనబడేవాటికి ప్రాధాన్యం, అలా కనబడనివాటికి అప్రధానత్వం). విరుద్ధం కాకుండా ఉంటుంది. మాంసం, పప్పు అన్నం మొదలైనవి అన్నీ పార్థివములే అయినా కూడ ప్రతి ఆత్మలోను ఉండే విశేషంవల్ల అవి ఏ విధంగా పరస్పరోపకారకాలుగా ఉంటాయో అట్లే ఇక్కడ కూడ కావచ్చును. చేతనం అచేతనం అనే విభాగం యొక్క సిద్ధి కూడ విరుద్ధం కాదు'' అని ఎవడైనా అన్నట్లయితే అతడు ఏదో విధంగా చేతనత్వాచేతనత్వరూపమైన విలక్షణత్వాన్ని పరిహరిస్తే పరిహరించవచ్చును. శుద్ధత్వ -అశుద్ధత్వరూపమైన వైలక్షణ్య మైతే అతడు కూడ పరిహరింపజాలడు. నిజానికి - ఇతరవెలక్షణ్యం (చేతనాచేతనత్వకృతవైలక్షణ్యం) కూడ పరిహరింప శక్యం కాదని "తథాత్వం చ శబ్దాత్" అని చెపుతున్నాడు. సమస్తవస్తువుల చేతనత్వం లోకంలో

కనబడకపోయినా చేతనం ప్రకృతి అని వినబడడంచేత కేవలం శబ్దాన్నే (శ్రుతివాక్యాన్నే) శరణంగా తీసికొని ఊహించబడుతున్నది. అదిశబ్దానికే విరుద్ధంగా ఉంది. ఎందువల్ల ననగా శబ్దంవల్ల కూడ అట్లు ఉండడం తెలుస్తూన్నది. ''తథాత్వం' అనే పదం ప్రకృతికంటె విలక్షణంంగా ఉండడం అనే అర్థాన్ని చెపుతున్నది. "విజ్ఞానం చావిజ్ఞానం చ" అని శబ్దమే ఒక విభాగం అచేతనం అని వినిపింప చేస్తూ (తెలుపుతూ) అచేతనమైన జగత్తు చేతన మైన బ్రహ్మకంటె విలక్షణ మని వినిపింప చేస్తూన్నది. 4.

## భాష్యమ్

నను చేతనత్వమపి క్వచిద చేతనత్వాభిమతానాం భూతేన్ద్రియాణాం శ్రూయతే, యథా - 'మృదబ్రవీత్' 'ఆపోఽ బ్రువన్" (శ.ప.బ్రా 6.1.3.2.4) ఇతి, "త త్తేజఐక్షత" ''తా ఆపాఐక్షన్త'' (ఛా.ఉ. 2-3-6., 4) ఇతి చైవమాద్యా భూతవిషయా చేతనత్వశ్రుతిః. ఇన్ద్రియవిషయాపి - "తే హేమే ప్రాణా అహంశ్రేయసే వివదమానా బ్రహ్మ జగ్ముః'' ఇతి; ''తే హ వాచమూచుః త్వం న ఉద్గాయేతి" (బృ.ఉ. 1-3-2) ఇత్యేవమాద్యేన్ద్రియవిషయేతి. అత ఉత్తరం పఠ్యతే-

### సూ. అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్ 2-1-5.

తు శబ్ద శఙ్కామపనుదతి. న ఖలు మృదబ్రవీదిత్యేవంజాతీయకయా శ్రుత్యా భూతేన్ద్రియాణాం చేతనత్వమాశ ఙ్కనీయమ్; యతోఽభిమానివ్యపదేశ ఏషః. మృదాద్యభిమానిన్యో వాగాద్యభిమానిన్యశ్చ చేతనా దేవతా వదనసంవదనాదిషు చేతనోచితేషు వ్యవహారేషు వ్యపదిశ్యన్తే, న భూతేన్ద్రియమాత్రమ్. కస్మాత్? విశేషానుగతిభ్యామ్. విశేషో హి భోక్తౄ ణాం భూతేన్ద్రియాణాంచ చేతనాచేతనప్రవిభాగలక్షణః ప్రాగభిహితః. సర్వచేతనతాయాం చాసౌ నోపపద్యేత.

## బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) అచేతనా లని చెప్పబడే భూతాలు, ఇంద్రియాలు కూడ కొన్ని చోట్ల చేతనాలు అన్నట్లు వినబడుతున్నది. ఎట్లనగా - "మృదబ్రవీత్" (మట్టి పలికినది) "ఆపోఽబ్రువన్" (జలం పలికింది) అని, "తత్తేజ ఐక్షత" (ఆ తేజస్సు చూచింది - ఆలోచించింది)'' తా అప ఐక్షన్త'' (ఆ జలం చూచింది) ఈ మొదలైనది

భూతాలకు సంబంధించిన చేతనత్వశ్రుతి. ఇంద్రియాలకు సంబంధించినది 'తే హేమే... జగ్ముః" (అ ఈ ప్రాణాలు నేనే గొప్పదానను అని కలహిస్తూ బ్రహ్మ దగ్గరికి వెళ్లాయి) అని, "తే... ఉద్గాయేతి" (నువ్వు మాకు ఉద్గానం చెయ్యి అని వాక్కుతో పలికినవి) ఇత్యాదిశ్రుతి ఇంద్రియవిషయకమైనది. ఇందుకు సమాధానంగా సూత్రం పఠిస్తున్నాడు-

అభిమానీతి :- "విశేషానుగతిభ్యామ్ = చేతనాచేతనరూపమైన విశేషం ఉండడం చేత, అంతటా కూడ అభిమానిదేవతలను గూర్చి చెప్పడంచేత, అభిమానివ్యపదేశః తు = ఇది భూతేంద్రియాభిమానిదేవతల నిర్దేశం మాత్రమే" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దం ఆశంకను తొలగిస్తుంది. అనగా ఈ ఆశంక యుక్తం కాదు అని అర్థం. "మృదబ్రవీత్" ఇత్యాదిశ్రుతిని పట్టి భూతేంద్రియాలు చేతనా లని ఆశంకించగూడదు. ఎందువల్ల ననగా అది అభిమానిదేవతలను చెప్పడమే. చేతనాలైన మృదాద్యభిమానిదేవతలు, వాగాద్యభిమానిదేవతలు మాటలాడడం, సంవాదం చేయడం మొదలైన చేతనాలు చేసే వ్యవహారాలలో నిర్దేశింపబడుతున్నాయి కాని కేవలం భూతేంద్రియాలు నిర్దేశించబడడం లేదు. ఎందువల్ల? విశేషానుగతులవల్ల. భోక్తలైన జీవులకు భూతేంద్రియాలకు ఉన్న చేతనాచేతనవిభాగం అనే విశేషం వెనుక చెప్పబడింది కదా. అన్నీ చేతనాలే అయిన పక్షంలో ఈ విభాగం కుదరకుండా పోతుంది.

## భాష్యమ్

అపి చ కౌషీతకినః ప్రాణసంవాదే కరణమాత్రాశఙ్కానివృత్తయేఽధిష్ఠాతృచేతనపరిగ్రహాయ దేవతాశబ్దేన విశింషన్తి- "ఏతా హ వై దేవతా అహం శ్రేయసే వివదమానాః" ఇతి. "తా ఏతాః సర్వా దేవతాః ప్రాణే నిఃశ్రేయసం విదిత్వా" (2.14) ఇతి చ. అనుగతాశ్చ సర్వాభిమానిన్యశ్చేతనా దేవతా మన్త్రార్థవాదేతిహాసపురాణాదిభ్యోఽవగమ్యన్తే. "అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" (ఐ.ఆ. 2-4-2-4) ఇత్యేవమాదికా చ శ్రుతిః కరణేష్వనుగ్రాహికాం దేవతామను గతాం దర్శయతి. ప్రాణసంవాదవాక్యశేషే చ "తే హ ప్రాణాః ప్రజాపతిం పితరమేత్యోచుః" (ఛా. ఉ. 5-1-7) ఇతి శ్రేష్ఠనిర్ధారణాయ ప్రజాపతిగమనం తద్వచనాచ్చైకైకోత్క్రమణేనాన్వయవ్యతిరేకాభ్యాం ప్రాణశ్రైష్ఠ్యప్రతిపత్తిః, తస్మై బలిహరణమ్ (బృ. ఉ. 6-1-13) ఇతి చైవం జాతీయకః అస్మదాదిష్వివ వ్యవహారః అనుగమ్యమానః అభిమానివ్యపదేశం ద్రఢయతి. "తత్తే జ ఐక్షత" ఇత్యపి పరస్యా ఏవ దేవతాయా అధిష్ఠాత్ర్యాః

స్వవికారేష్వనుగతాయా ఇయమీక్షా వ్యపదిశ్యత ఇతి ద్రష్టవ్యమ్. తస్మాద్విలక్షణమేవేదం బ్రహ్మణో జగత్; విలక్షణత్వాచ్చ న బ్రహ్మప్రకృతికమిత్యాక్షిప్తే ప్రతివిధత్తే -

## సూ. దృశ్యతే తు 2-1-6.

### బాలానందిని

**అపి చేతి :-** మరొక విషయమేమనగా కౌషీతకులు ప్రాణసంవాదంలో, ఇవి ఇంద్రియాలు మాత్రమే అనే శంకను నివర్తింప చేయడం కోసం "ఏతా హి... వివదమానాః" (ఈ దేవతలు తమ తమ గొప్పతనాన్ని గూర్చి పోటీపడుతూ అని, "తా ఏతా... విదిత్వా" (ఆ సమస్త దేవతలు ప్రాణమునందే శ్రేష్ఠత్వాన్ని గ్రహించి) అనీ ఆ ప్రాణాలను 'దేవతా' శబ్దంచేత విశేషించి పేర్కొంటున్నారు. (ఇది సూత్రంలో ఉన్న విశేషశబ్దానికి మరొక అర్థం). ఈ భూతేంద్రియాదులలో అన్నింటిలోను అభిమాను లైన దేవతలు సంబంధించి ఉన్నట్లు మంత్ర-అర్థ-వాద-ఇతిహాస-పురాణాలవల్ల తెలుస్తూన్నది. "అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" (అగ్ని వాక్కుగా అయి ముఖంలో ప్రవేశించింది) ఇత్యాదిశ్రుతి ఇంద్రియాలలో అనుగ్రాహకమైన దేవత అనుగతంగా (సంబంధించి) ఉన్నట్లు చూపుతున్నది. ప్రాణసంవాదవాక్యశేషంలో కూడ "తే... ఊచుః" (ఆ ప్రాణాలు తండ్రియైన ప్రజాపతి దగ్గరికి వెళ్లి పలికినవి) అని తమలో ఎవరు శ్రేష్ఠులో తెలుసుకొనడం కోసం ప్రాణాలు ప్రజాపతి దగ్గరికి వెళ్లడం, ప్రజాపతి చెప్పినట్లు ఒక్కొక్క ప్రాణం (ఇంద్రియం) దేహంనుండి పైకి వెళ్లిపోవడం ద్వారా అన్వయవ్యతిరేకాలచేత ప్రాణంయొక్క శ్రేష్ఠత్వాన్ని తెలుసుకొనడం దానికి పూజలు అందించడం ఈ మొదలైన, మనవంటి వాళ్లు చేసే వ్యవహారం అనుగమించ బడుతూ (నడపబడుతూ) అభిమానివ్యపదేశాన్ని ధృఢం చేస్తూన్నది.

వి. ప్రాణాలన్నీ (ఇంద్రియాలు కూడ) బ్రహ్మ దగ్గరకి వెళ్లి మాలో ఎవరు శ్రేష్ఠుడు చెప్పమని కోరుతాయి. అప్పుడు ప్రజాపతి మీలో ఒక్క రొక్కరే దేహాన్ని విడిచి వెళ్లండి అని అంటాడు. ఇతర ప్రాణాలన్నీ ఒక్కొక్కటే బైటకు పోయినా శరీరానికి అంధత్వాదిదోషాలు కలిగాయి కాని శరీరం పడిపోలేదు. అవన్నీ మళ్లీ తిరిగి వచ్చాయి. చివరికి ప్రాణశక్తి శరీరాన్ని విడచి బైటకు వెళ్లడానికి ప్రయత్నించగానే మిగిలిన ప్రాణాలన్నీ కూడ చలించిపోయాయి. దీనిని పట్టి ఆ ప్రాణమే అన్నింటికంటె శ్రేష్ఠమని నిర్ధారణ చేయబడింది. ప్రాణం ఉంటే దేహం నిలిచింది, ఇది అన్వయం. ప్రాణం బైటకు వెళ్లిపోబోతే శరీరం పడిపోబోయింది. ఇది వ్యతిరేకం. అన్వయవ్యతిరేకాలచేత

ప్రాణం గొప్పదని నిర్ణయించబడింది. ఈ విధంగా ప్రాణాదులలో చేతనవ్యవహారం అనుగతంగా కనబడుతున్నది. ఇది 'అనుగతి' అనేదానికి రెండవ అర్థం.

మూడవ అర్థం చెపుతున్నారు. తత్తేజ ఇతి :- "తత్తేజ ఐక్షత" అన్నప్పుడు కూడ తన వికారాలలో అనుగతమై ఉన్న అధిష్ఠాత్రియైన పరదేవతయే ఈక్షణం చేసినట్లు చెప్పబడుచున్నది అని గ్రహించాలి. అందువల్ల ఈ జగత్తు బ్రహ్మకంటె విలక్షణమే. విలక్షణం గాన దీనికి బ్రహ్మ ప్రకృతి కాదు అని ఆక్షేపింబడగా సమాధానం చెపుతున్నాడు -

దృశ్యతే ఇతి :- "చేతనాలనుండి అచేతనాల ఉత్పత్తి అచేతనాలనుండి చేతనాల ఉత్పత్తి కనబడుతున్నది" అని ఈ సూత్రానికి అర్థం.

## భాష్యమ్

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. యదుక్తం విలక్షణత్వాన్నేదం జగద్బ్రహ్మ ప్రకృతికమితి; నాయమేకాన్తః. దృశ్యతే హి లోకే చేతనత్వేన ప్రసిద్ధేభ్యః పురుషాదిభ్యః విలక్షణానాం కేశనఖాదీనాముత్పతిః, అచేతనత్వేన చ ప్రసిద్ధేభ్యఃగోమయాధిభ్యః వృశ్చికాదీనామ్. నన్వచేతనాన్యేవ పురాషాది శరీరాణ్యచేతనానాం కేశనఖాదీనాం కారణాని, అచేతనాన్యేవ చ వృశ్చికాదిశరీరాణ్యచేతనానాం గోమయాదీనాం కార్యాణీతి. ఉచ్యతే- ఏవమపి కించిదచేతనం చేతనస్యాయతనభావముపగచ్ఛతి కించిన్నేత్యస్త్యేవ వైలక్షణ్యమ్. మహాంశ్చాయం పారిణామికః స్వభావవిప్రకర్షః పురుషాదీనాం కేశనఖాదీనాం చ స్వరూపాదిభేదాత్; తథా గోమయాదీనాం వృశ్చికాదీనాంచ. అత్యన్తసారూప్యే చ ప్రకృతివికారభావ ఏవ ప్రలీయేత. అథోచ్యే త అస్తి కశ్చిత్పార్థివత్వాదిస్వభావః పురుషాదీనాం కేశనఖాదిష్వనువర్తమానో, గోమయాదీనాం చ వృశ్చికాదిషు ఇతి; బ్రహ్మణోఽ పి తర్హి సత్తాలక్షణః స్వభావ ఆకాశాదిషు అనువర్తమానో దృశ్యతే. విలక్షణత్వేన చ కారణేన బ్రహ్మ ప్రకృతికత్వం జగతో దూషయతా కిమశేషస్య బ్రహ్మస్వభావస్యాననువర్తనం విలక్షణత్వమభిప్రేయత ఉత యస్య కస్య చిదథ చైతన్యస్యేతి వక్తవ్యమ్. ప్రథమే వికల్పే సమస్తవికారోచ్ఛేద ప్రసఙ్గః. న హ్యసత్యతిశయే ప్రకృతిర్వికార ఇతి భవతి. ద్వితీయే చాసిద్ధత్వమ్; దృశ్యతే హి సత్తాలక్షణః బ్రహ్మస్వభావః

ఆకాశాదిష్వనువర్తమాన ఇత్యుక్తమ్. తృతీయే తు దృష్టాన్తాభావః, కిం హి యచ్చైతన్యేనానన్వితం, తద్ బ్రహ్మప్రకృతికం దృష్టమితి బ్రహ్మవాదినం ప్రత్యుదాహ్రియేత? సమస్తస్య వస్తు జాతస్య బ్రహ్మప్రకృతికత్వాభ్యుపగమాత్. ఆగమవిరోధస్తు ప్రసిద్ధ ఏవ, చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతి శ్చేత్యాగమతాత్పర్యస్య ప్రసాధితత్వాత్.

## బాలానందిని

తుశబ్ద ఇతి :- తుశబ్దం పూర్వపక్షాన్ని నివారిస్తుంది. ఈ జగత్తు విలక్షణం గాన దీనికి బ్రహ్మ ప్రకృతి కాదు అని ఏదైతే చెప్పబడిందో ఇది ఏకాంతం (తప్పనిసరియైన నియమం) కాదు. చేతనాలని ప్రసిద్ధులైన పురుషాదులనుండి విలక్షణాలైన వెంట్రుకలు గోళ్లు మొదలైనవి, అచేతనము లని ప్రసిద్ధాలైన గోమయాదులనుండి వృశ్చికాదులు పుట్టడం కనబడుతున్నది కదా? (ప్రశ్న) - అచేతనాలైన పురుషాదుల శరీరాలే కేశనఖాదులకు కారణం గదా? అచేతనాలైన వృశ్చికాది శరీరాలే అచేతనాలైన గోమయాదుల కార్యాలు గదా? (సమాధానం) చెప్పబడుచున్నది - అయినా కూడ అచేతనమైన ఒకటి (శరీరాదికం) చేతనానికి స్థానం అవుతున్నది ఒకటి (కేశనఖాదికం) కావడం లేదు అనే వైలక్షణ్యం ఉండనే ఉంది. పురుషాదులకు కేశనఖాదులకు మధ్య, పరిణామంవల్ల ఏర్పడిన స్వభావంలో దూరం అత్యధికమైనది. వాటి స్వరూపాదులలో చాల భేదం ఉంది కదా? గోమయాదుల మధ్య వృశ్చికాదుల మధ్య ఉన్న స్వభావవిప్రకర్షం కూడ ఇలాంటిదే. పూర్తిగా సారూప్యం ఉంటే ఇది ప్రకృతి ఇది వికృతి అనే భేదమేలీనమైపోతుంది. అది కాదు; కేశనఖాదులలోనికి పురుషాదులకు సంబంధించిన పార్థివత్వం (పృథివీవికారత్వం) మొదలైన స్వభావం అనువర్తిస్తూన్నది, గోమయాదుల స్వభావం వృశ్చికాదులలో అనువర్తిస్తుంది అన్నట్లయితే బ్రహ్మకు సంబంధించిన 'సత్త' (ఉండుట) అనే స్వభావం ఆకాశాదులలో అనువర్తిస్తూ కనబడుతున్నది. విలక్షణత్వం అనే కారణంచేత బ్రహ్మ జగత్తుకు కారణం కాదు అని దూషించేవానిచేత విలక్షణత్వం అనగా బ్రహ్మకు సంబంధించిన స్వభావం అంతా పూర్తిగా అనువర్తించకపోవడం అని అంగీకరించబడుతున్నదా, లేక ఏదో ఒక స్వభావం అనువర్తించకపోవడమా లేక చైతన్యం అనువర్తించకపోవడమా? మొదటి వికల్పంలో సమస్తమైన ప్రకృతి - వికారభావమే (ఇది ప్రకృతి ఇది వికారం అనే భేదమే) ఉచ్ఛిన్నం అయిపోతుంది. ఏదో కొంత అతిశయం (భేదం) లేకపోతే ఇది ప్రకృతి అని ఇది వికారం అనీ చెప్పడం

కుదరదు కదా? రెండవవికల్పంలో అసిద్ధత్వం దోషం. అనగా ఆ వికల్పం పట్టదు. సత్త అనే బ్రహ్మస్వభావం ఆకాశాదులలో అనువర్తిస్తూన్నది అని చెప్పాం. మూడవ వికల్పంలో దృష్టాంతం లేదు, అనగా నువ్వు దృష్టాంతం ఏదీ చూపజాలవు. దీనిలో చైతన్యం లేదు, అందుచేత దీనికి బ్రహ్మ ప్రకృతి కాదు అని దేనిని బ్రహ్మవాదికి దృష్టాంతంగా చూపిస్తావు? ఎందువల్ల ననగా బ్రహ్మవాదిచేత సమస్తవస్తుసముదాయమూ కూడ బ్రహ్మ ప్రకృతికమే. (బ్రహ్మ ప్రకృతిగా గలదే) అని అంగీకరించబడింది. (అనగా ప్రతి వస్తువులోను కూడ చేతనాంశం తప్పకుండా ఉంటుంది అని భావం). చేతనమైన బ్రహ్మ కారణం, ప్రకృతీ కూడ అని శాస్త్రతాత్పర్యం సాధించబడింది గాన ఆగమ విరోధమైతే ప్రసిద్ధమే.

## భాష్యమ్

యత్తూక్తమ్ - పరినిష్పన్నత్వాద్బ్రహ్మణి ప్రమాణాన్తరాణి సంభవేయుః ఇతి తదపి మనోరథమాత్రమ్. రూపాద్యభావాద్ధి నాయమర్థః ప్రత్యక్షగోచరః. లిఙ్గాద్యభావాచ్చ నానుమానాదీనామ్. ఆగమమాత్రసమధిగమ్య ఏవ త్వయమర్థో ధర్మవత్. తథా చ శ్రుతిః- "నైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ" (క.ఉ. 1-2-9) ఇతి. "కో అద్ధా వేద క ఇహ ప్రావోచత్" "ఇయం విసృష్టిర్యత ఆ బభూవ" (ఋ.సం. 1-30-6) ఇతి చైతౌ ఋచౌ సిద్ధానామపీశ్వరాణాం దుర్బోధతాం జగత్కారణస్య దర్శయతః. స్మృతిరపి భవతి "అచిన్త్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ యోజయేత్" ఇతి. "అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే" (భ.గీ. 2.-25) ఇతి చ.

"న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః" (భ.గీ. 10-2)

ఇతిచైవంజాతీయకా. యదపి శ్రవణవ్యతిరేకేణ మననం విదధచ్ఛబ్ద ఏవ తర్కమప్యాదర్తవ్యం దర్శయతి ఇత్యుక్తమ్, నానేన మిషేణ శుష్కతర్కస్యాత్రాత్మలాభః సంభవతి, శ్రుత్యనుగృహీత ఏవ హ్యత్ర తర్కోఽనుభవాఙ్గత్వేనాశ్రీయతే- స్వప్నాన్తబుద్ధాన్తయోరుభయోరితరేతర వ్యభిచారాదాత్మనోఽనన్వాగతత్వమ్, సంప్రసాదే చ ప్రపఞ్చపరిత్యాగేన సదాత్మనా సంపత్తేర్నిష్ప

పఞ్చసదాత్మత్వం, ప్రపఞ్చస్య బ్రహ్మప్రభవత్వాత్కార్య కారణానన్యత్వ న్యాయేన బ్రహ్మావ్యతిరేక ఇత్యేవంజాతీయకః. "తర్కాప్రతిష్ఠానాత్" (బ్ర.సూ2-1-11) ఇతి చ కేవలస్య తర్కస్య విప్రలమ్భకత్వం దర్శయిష్యతి. యోఽపి చేతనకారణశ్రవణబలేనైవ సమస్తస్య జగతః చేతనతాముత్ప్రేక్షేత తస్యాపి 'విజ్ఞానం చావిజ్ఞానం చ'' ఇతి చేతనాచేతన విభాగశ్రవణం విభావనావిభావనాభ్యాం చైతన్యస్య శక్యత ఏవ యోజయితుమ్. పరస్యైవ త్విదం విభాగశ్రవణం న యుజ్యతే. కథమ్? పరమకారణస్య హ్యత్ర సమస్తజగదాత్మనా సమవస్థానం శ్రావ్యతే "విజ్ఞానం చావిజ్ఞానం చాభవత్" ఇతి. తత్ర యథా చేతనస్య అచేతనభావో నోపపద్యతే విలక్షణత్వాత్ ఏవమచేతనస్యాపి చేతనభావో నోపపద్యతే. ప్రత్యుక్తత్వాత్తు విలక్షణత్వస్య యథాశ్రుత్యేవ చేతనం కారణం గ్రహీతవ్యం భవతి. 6.

### బాలానందిని

యత్త్వితి:- బ్రహ్మ సిద్ధమైన వస్తువు గాన దాని విషయంలో ఇతరప్రమాణాలు కూడ ప్రసరించవచ్చును అని ఏది చెప్పబడిందో అది కూడ మనోరథం మాత్రమే (వాస్తవం కాదు అని అర్థం). రూపాదులు లేకపోవడంచేత ఈ అర్థం (బ్రహ్మ) ప్రత్యక్షానికి గోచరం కాదు. లింగాదులు లేకపోవడంవల్ల అనుమానాదిప్రమాణాలకి గోచరం కాదు. ఈ అర్థం, ధర్మం వలె కేవలం శాస్త్రం చేతనే తెలియదగినది "నైషా ... ప్రేష్ఠ" (బ్రహ్మను గూర్చిన ఈ జ్ఞానం తర్కంచేత పొందదగినది కాదు. ఓ ప్రేష్ఠుడా! ప్రియతముడా, ఇది మరొకని చేత, అనగా బ్రహ్మవేత్తయైన ఆచార్యునిచేత చెప్పబడినదై పొందబడుతుంది) అని శ్రుతి ఈ విషయమే చెప్పుచున్నది. "కో... ప్రావోచత్" "ఇయమ్... బభూవ" (ఈ సృష్టి ఎవనివల్ల జరిగిందో ఈ విషయాన్ని ఎవడు ప్రత్యక్షంగా ఎరుగును, ఎవడు చెప్పగలడు) అని ఈ రెండు ఋక్కులూ కూడ జగత్కారణం సిద్ధులైన ఈశ్వరులకు కూడ తెలియ శక్యం కానిది అని చెపుతున్నాయి.

"అచిన్త్యాః... యోజయేత్" (ఊహింప శక్యం కాని విషయాలు తర్కంతో చేర్చగూడదు, అనగా వాటిని గూర్చి తర్కించగూడదు) అని స్మృతి కూడ చెప్పుచున్నది. "అవ్యక్తో... ఉచ్యతే" (ఈ పరమాత్మ అవ్యక్తం; ఊహింప శక్యం కానిది. వికారాలులేనిది) అని, "న... సర్వశః" (దేవతాగణాలు గాని, మహర్షులు గాని నా ఉత్పత్తిని గూర్చి ఎరుగరు. నేను దేవతలకు మహర్షులకు అందరికీ కూడ ఆదియైనవాడను) అని ఈ విధమైన స్మృతులు కూడ ఈ విషయమే చెపుతున్నాయి.

శ్రవణమే కాకుండా మననం కూడా విధించిన శబ్దమే (శ్రుతివాక్యమే) తర్కం కూడ ఆదరించదగిన దని చూపుచున్నది అని ఏది చెప్పబడిందో ఈ వంకచేత దాని విషయంలో శుష్కతర్కానికి కూడ ప్రవేశం ఉండదు. ఇక్కడ స్వప్నావస్థ, జాగ్రదవస్థ ఈ రెండూ ఒకదానికంటె ఒకటి వేరవడంచేత ఆ అవస్థలలో అనుస్యూతంగా ఉన్న ఆత్మకు వాటితో ఎలాంటి సంబంధమూ లేకపోవడం, సంప్రసాదంలో (సుషుప్తిలో) ప్రపంచాన్ని విడచి సద్రూపంలో ఉండడంచేత (ఆత్మ)నిష్ప్రపంచసద్రూపం అవడం, ప్రపంచం బ్రహ్మనుండి పుట్టడంవల్ల కార్యం కారణంకంటె అభిన్నమనే న్యాయంచేత బ్రహ్మకంటె వ్యతిరిక్తంగా ప్రపంచం లేకపోవడం, ఈ విధమైన శ్రుత్యనుగృహీతమైన (శ్రుతిసంమతమైన) తర్కమే అనుభవానికి అంగంగా గ్రహించబడుతుంది.

కేవలం తర్కం మోసం చేస్తుంది అని "తర్కా ప్రతిష్ఠానాత్" అనే సూత్రంలో చూపనున్నాడు. చేతనం కారణం అని వినబడడంయొక్క బలంచేతనే,సమస్త జగత్తు చేతనమే అని ఎవడు ఊహిస్తాడో అతడు కూడ "విజ్ఞానం చా విజ్ఞానం చ" వినబడే చేతనాచేతనవిభాగం చైతన్యంయొక్క విభావనావిభావనాలచేత (చైతన్యం స్పష్టంగా కనబడడం కనబడకపోవడం అనేవాటిచేత) అన్వయించడం తప్పకా కుదురుతుంది. నిజానికి ఈ విభాగ శ్రవణం పరునికి (సాంఖ్యునికే) కుదరుదు. ఎట్లు? ఇక్కడ "విజ్ఞానం చావిజ్ఞానం చాభవత్" అని పరమకారణం సమస్తజగద్రూపంలో ఉన్నట్లు వినిపింపబడుచున్నది. (చెప్పబడుచున్నది). అలాంటిప్పుడు విలక్షణం అవడంవల్ల చేతనం అచేతనం అవడం ఎలా కుదరదో అట్లే అచేతనం (ప్రధానం) చేతనం అవడం కూడ కుదరదు. విలక్షణత్వం నిరాకరించబడింది గాన శ్రుత్యనుసారంగా చేతనం కారణ మని గ్రహించవలసి ఉంటుంది. 6.

## సూ. అసదితి చేన్న ప్రతిషేధమాత్రత్వాత్ 2-1-7

యది చేతనం శుద్ధం శబ్దాదిహీనం చ బ్రహ్మ తద్విపరీతస్యాశుద్ధస్య శబ్దాదిమతశ్చ కార్యస్య కారణమిష్యేత అసత్తర్హి కార్యం ప్రాగుత్పత్తేరితి ప్రసజ్యేత, అనిష్టం చేదం సత్కార్యవాదినస్తవేతి చేత్, నైష దోషః; ప్రతిషేధమాత్రత్వాత్. ప్రతిషేధమాత్రం హీదం, నాస్య ప్రతిషేదస్య ప్రతిషేధ్యమస్తి. న హ్యాయం ప్రతిషేధః ప్రాగుత్పత్తేః సత్త్వం కార్యస్య ప్రతిషేద్ధుం శక్నోతి. కథమ్? యథైవ హీదానీమపీదం కార్యం కారణాత్మనా సత్ ఏవం ప్రాగుత్పత్తేరపీతి గమ్యతే. న హీదానీమపీదం కార్యం కారణాత్మానమన్తరేణ స్వతన్త్రమేవాస్తి. "సర్వం తం పరాదాద్యోఽ న్యత్రాత్మనః సర్వం వేద"

ఇత్యాదిశ్రవణాత్. కారణాత్మనా తు సత్త్వం కార్యస్య ప్రాగుత్పత్తేరవిశిష్టమ్. నను శబ్దాదిహీనం బ్రహ్మ జగతః కారణమ్? బాఢమ్. న తు శబ్దాదిమత్కార్యం కారణాత్మనా హీనం ప్రాగుత్పత్తేరిదానీం వాస్తి; తేన న శక్యతే వక్తుం ప్రాగుత్పత్తేరసత్కార్యమితి. విస్తరేణ చైతత్కార్యకారణానన్యత్వవాదే వక్ష్యామః 7.

బాలానందిని

అసదితి:- "అసదితి చేత్ = బ్రహ్మకారణవాదపక్షంలో కార్యం ఉత్పత్తికంటె పూర్వం అసత్ అవుతుంది అన్న ట్లయితే, న = కాదు. ప్రతిషేధమాత్రత్వాత్ = ఇది కేవలం ఆధారం లేని నిషేధం మాత్రమే" అని సూత్రార్థం.

యదీతి:- చేతనము, శుద్ధము, శబ్దాదిహీనము అయిన బ్రహ్మ అందుకు విపరీతము, అచేతనము అశుద్ధమూ, శబ్దాదిమత్తూ అయిన కార్యానికి కారణంగా అంగీకరించబడిన ట్లయితే అప్పుడు, ఉత్పత్తికి పూర్వం కార్యం అసత్తు అని ప్రసక్తం అవుతుంది ( అసత్తనే మాట వస్తుంది). ఇది సత్కార్యవాదివైన నీకు అనిష్టం కదా అంటే - ఇది దోషం కాదు. ఇది కేవలం ప్రతిషేధంమాత్రమే. ఇది కేవలం ప్రతిషేధమే కాని ఈ ప్రతిషేధానికి ప్రతషేధ్యం (ప్రతిషేధించవలసినది) లేదు. ఈప్రతిషేధం ఉత్పత్తికి పూర్వం కార్యంయొక్క ఉనికిని నిషేధించజాలదు కదా? ఎట్లు. ఈ కార్యం ఇప్పుడు కూడ ఏ విధంగా కారణరూపంలో సత్తో అట్లే ఉత్పత్తికి పూర్వం కూడ సత్తు అని తెలియబడుచున్నది. ఇప్పుడు కూడ కార్యం కారణరూపంలోనే తప్ప స్వతంత్రంగా లేదు కదా? "సర్వం...వేద" అని శ్రుతి చెపుతున్నది కదా? శబ్దాదిహీనమైన బ్రహ్మ జగత్తుకూ కారణం గదా? నిజమే. కాని శబ్దాదిమత్తైన కార్యం కారణాత్మతో సంబంధం లేకుండా ఉత్పత్తికి పూర్వం గాని ఇప్పుడు గాని లేదు కదా? అందువల్ల ఉత్పత్తికి పూర్వం కార్యం అసత్తు అవుతుంది అని చెప్పడం శక్యం కాదు. ఈ విషయం సవిస్తరంగా కార్యకారణానన్యత్వవాదంలో (కార్యానికీ కారణానికీ భేదం లేదు అని ప్రతిపాదించే ఘట్టంలో) చెపుతాం.

వి. మట్టి, బంగారం మొదలైన కారణాలనుంచి కుండ కుండలం మొదలైన కార్యాలు పుడుతున్నాయి. ఈ కార్యాలు పుట్టడానికి ముందు తమ కారణంలో ఉన్నాయా లేక అసలు లేనివి ఆ కారణంనుంచి పుడుతున్నాయా అని ప్రశ్న. నైయాయికాదులు అసలు లేని కార్యమే క్రొత్తగా పుడుతున్నది అని అంటారు. ఈ వాదానికి ఆరంభవాదం అని పేరు. పుట్టడానికి ముందు కూడ కార్యం తన కారణంలో ఉంటుది. అప్పుడు సూక్ష్మరూపంలో ఉంటుంది. కులాలాదుల ప్రయత్నంచేత అది

పైకి కనబడుతుంది అని కొంద రంటారు. దీనికి సత్కార్యవాదం అని పేరు. సాంఖ్యులువేదాంతులూ కూడ ఈ సత్కార్యవాదాన్ని అంగీకరిస్తారు. మట్టి లక్షణాలే కుండలోను, బంగారం లక్షణాలే కుండలంలోను ఉంటాయి కాబట్టి కుండమొదలైన కార్యాలు తాము స్థూలరూపంలో కనబడడానికి పూర్వం కూడ సూక్ష్మరూపంలో తమతో సమానమైన లక్షణాలు గల మృత్సువర్ణాదులలో ఉండవచ్చును కాని అచేతనం, అశుద్ధం, శబ్దాదిమత్తు అయిన జగత్తు ఉత్పత్తికి పూర్వం చేతనం, శుద్ధం, శబ్దాదివిహీనం అయిన బ్రహ్మలో ఎలా ఉంటుంది? అందుచేత బ్రహ్మమే జగత్తుకు ప్రకృతి అని చెప్పేమీరు అసలు లేని జగత్తు క్రొత్తగా పుట్టిందని చెప్పవలసివస్తుంది. ఇది మీరు అంగీకరించే సత్కార్యవాదానికి విరుద్ధం కదా అని పూర్వపక్షి ప్రశ్న. కార్యం ఉత్పన్నం అయిన తరవాత కూడ కారణంలోనే ఉంటుంది కదా? కుండ మట్టిలోనే ఉంటుంది; కుండలం బంగారంలోనే ఉంటుంది. అట్లే బ్రహ్మనుండి పుట్టిన జగత్తు తన కారణమైన బ్రహ్మలోనే ఉంటుంది. శబ్దాదిసహిత మైన జగత్తు ఉత్పత్త్యనంతరం కూడ శబ్దాదిహీనమైన బ్రహ్మయందే ఎట్లు ఉంటూన్నదో అట్లే ఉత్పత్తికి పూర్వం కూడ బ్రహ్మయందు ఉండవచ్చు. ఈ విధంగా సత్కార్యవాదానికి ఏమీ భంగం లేదు అని సమాధానం.

బ్రహ్మ ఉపాదానకారణం. దానిమీద జగత్తు కల్పించబడింది; అందుచేత జగత్తుయొక్క స్వరూపమూ, బ్రహ్మస్వరూపమూ ఒకటే అని మేం అనడంలేదు, రజ్జువుమీద కల్పించబడిన సర్పంయొక్క పారమార్థికరూపం రజ్జువే. శుక్తియందు కల్పించబడిన రజతానికి పారమార్థికరూపం శుక్తియే. అట్లే జగత్తుయొక్క పారమార్థికరూపం బ్రహ్మ. అందుచేత జగదుత్పత్త్యనంతరం దాని పారమార్థికరూపం మైన బ్రహ్మ ఏ విధంగా ఉన్నదో ఉత్పత్తికి పూర్వం కూడ ఆ జగత్తుయొక్క పారమార్థికరూమైన బ్రహ్మ ఉండనే ఉంది. అందుచేత సత్కార్యవాదాని కేమీ భంగం లేదని తాత్పర్యం.

### సూ. అపీతౌ తద్వత్ప్రసఙ్గాదసమఞ్జసమ్. 2.1.8.

[1] అత్రాహ - యది స్థౌల్యసావయవత్వా చేతనత్వపరిచ్ఛిన్నత్వా శుద్ధ్యాదిధర్మకం కార్యం బ్రహ్మకారణమభ్యుపగమ్యేత తదాపీతౌ ప్రలయే ప్రతిసంసృజ్యమానం కార్యం కారణావిభాగమాపద్యమానం కారణమాత్మీ యేన ధర్మేణ దూషయేదిత్యపీతౌ కారణస్యాపి బ్రహ్మణః కార్యస్యేవా శుద్ధ్యాదిరూపప్రసంగాత్ సర్వజ్ఞం బ్రహ్మ జగత్కారణ మిత్యసమఞ్జసమి దమౌపనిషదం దర్శనమ్.[2] అపి చ మస్య చ విభాగస్యావిభాగప్రాప్తేః పునరు త్పత్తౌ నియమకారణాభావాద్భోక్తృభోగ్యాదివిభాగేనోత్పత్తిర్న ప్రాప్నోతీత్య

సమఞ్జసమ్. అపి చ భోక్తౄణాం పరేణ బ్రహ్మణా ఽ విభాగం గతానాం కర్మాదినిమిత్తప్రలయేఽపి పునరుత్పత్తావభ్యుపగమ్యమానాయాం ముక్తానామపి పునరుత్పత్తిప్రసఙ్గాదసమఞ్జసమ్. అథేదం జగదపీతావపి విభక్తమేవ పరేణ బ్రహ్మణావతిష్ఠేత, ఏవమప్యపీతిశ్చ న సంభవతి, కారణావ్యతిరిక్తం చ కార్యం న సంభవతీత్యసమఞ్జసమేవేతి. 8.

## బాలానందిని

**అపీతావితి:-** "అపీతౌ = ప్రలయమునందు, తద్వత్ = కార్యమునందు వలె, ప్రసఙ్గాత్ = బ్రహ్మకు అశుద్ధ్యాదుల ప్రసంగంవలన (అశుద్ధ్యాదులు వచ్చే అవకాశం ఉండడంవలన), అసమఞ్జసమ్ = బ్రహ్మకారణవాదం అసమంజస మైనది" అని సూత్రార్థం.

**అత్రేతి:-** ఇక్కడ పూర్వపక్షి అంటున్నాడు - స్థూలత్వం, అవయావాలతో ఉండడం, అచేతనత్వం, పరిచ్ఛిన్నత్వం అశుద్ధి మొదలైన ధర్మాలు గల కార్యానికి బ్రహ్మ కారణం అని చెప్పిన ట్లయితే అప్పుడు ప్రలయంలో కారణంతో కలిసిపోయే కార్యం కారణంతో పూర్తిగా కలిసిపోయి తన ధర్మాలచేత దానిని పాడుచేస్తుంది. అప్పుడు ప్రలయకాలంలో కారణమైన బ్రహ్మకు కూడ కార్యమైన జగత్తుకు వలె అశుద్ధ్యాదుల ప్రసంగం ఉంటుంది గాన సర్వజ్ఞమైన బ్రహ్మ జగత్కారణ మని చెప్పే ఈ ఔపనిషదదర్శనం అసమంజసం. (మరొక అర్థం) మరియు సమస్తమైన విభాగమూ కూడ కలిసిపోవడంవల్ల మళ్లీ పుట్టే టప్పుడు వేరు వేరుగా పుట్టడానికి తగిన కారణం లేకపోవడంవల్ల ఇది భోక్త, ఇది భోగ్యం అనే విభాగం ఉండదు, అందువల్ల కూడ బ్రహ్మకారణవాదం అసమంజసం. (మరొక అర్థం) మరియు పరబ్రహ్మతో కలిసిపోయిన జీవులకు మళ్లీ కర్మాదినిమిత్తంచేత ఉత్పత్తిని అంగీకరిస్తే ముక్తులు కూడ మళ్లీ పుట్ట వలసి ఉంటుంది గాన ఈ బ్రహ్మకారణవాదం అసమంజసం (మరొక అర్థం) అట్లు కాక ఈ జగత్తు ప్రలయకాలంలోకూడ బ్రహ్మతో పూర్తిగా కలిసిపోకుండా వేరుగానే ఉంటుందన్న ట్లయితే అప్పుడు ప్రళయమే కుదరదు (అది ప్రలయమే కాదు). అప్పుడు కార్యం కారణంకంటె అభిన్నం కాదు. ఈ విధంగా కూడ ఈ వాదం అసమంజసమ్. 8.

## భాష్యమ్

అత్రోచ్యతే -

### సూ. న తు దృష్టాన్తభావాత్ 2.1.9.

నైవాస్మదీయే దర్శనే కించిదసామంజస్యమస్తి. యత్తావదభిహితం కారణమపిగచ్ఛత్కార్యం కారణమాత్మీయేన ధర్మేణ దూషయేదితి, తదదూషణమ్ - కస్మాత్? దృష్టాన్తసంభవాత్. సన్తి హి దృష్టాన్తాః, యథా కారణమపిగచ్ఛత్కార్యం కారణమాత్మీయేన ధర్మేణ న దూషయతి. తద్యథా శరావాదయో మృత్ప్రకృతికా వికారాః విభాగావస్థాయాముచ్చావచ మధ్యమప్రభేదాః పునః ప్రకృతిమపిగచ్ఛన్తో న తామాత్మీయేన ధర్మేణ సంసృజన్తి. పృథివీవికారశ్చతుర్విధో భూతగ్రామో న పృథివీమపీతావాత్మీయేన ధర్మేణ సంసృజతి. త్వత్పక్షస్య తు న కశ్చిద్దృష్టాన్తోఽస్తి. అపీతిరేవ హి న సంభవేత్ యది కారణే కార్యం స్వధర్మేణైవావతిష్ఠేత. అనన్యత్వేఽపి కార్యకారణయోః కార్యస్య కారణాత్మత్వం న తు కారణస్య కార్యాత్మత్వమ్ ఆరమ్భణశబ్దాదిభ్యః (బ్ర. సూ. 2.1.14.) ఇతి వక్ష్యామః

బాలానందిని

అత్రేతి:- ఈ విషయంలో చెప్పబడుచున్నది -

నేతి:- "న తు = నీవుచెప్పినది యుక్తం కాదు. దృష్టాన్తభావాత్ = బ్రహ్మకారణవాదానికి అనుగుణమైన దృష్టాంతాలు ఉండడంవల్ల" అని సూత్రార్థం.

నైవేతి:- మా దర్శనంలో అసామంజస్యం ఏదీ లేదు. కారణంలో కలిసి పోతున్న కార్యం తన ధర్మంచేత కారణాన్ని చెడగొడుతుంది అని ఏది చెప్పబడిందో అది దూషణం కాదు (ఆ దూషణం లేదు). ఎందువల్ల? దృష్టాంతాలు ఉండడంవల్ల. కారణంలో కలిసిపోయిన కార్యం తన ధర్మంచేత కారణాన్ని దూషించదు అనడానికి దృష్టాంతాలు ఉన్నాయి కదా. అదెట్లనగా - మట్టి ప్రకృతిగా గలవి, విభాగావస్థలో అనేకవిధాలైన మధ్యమప్రమాణం గల భేదాలు గలవి అయిన మూకుళ్లు మొదలైన వికారాలు తిరిగి తమ ప్రకృతిలోనికి చేరిపోతూ ఆ ప్రకృతిని తమ ధర్మంతో కలిసే టట్లు చేయడంలేదు. బంగారం వికారాలైన రుచకాదులు లీనమై నప్పుడు బంగారాన్ని తమ ధర్మంతో కలిసే టట్లు చేయడంలేదు. పృథివీవికారమైన చతుర్విధభూత సముదాయం ( జరాయుజాదికం) పృథివిలో లీనమైనప్పుడు పృథివిని తన ధర్మంతో కలిసేటట్లు చేయడం లేదు. నీ పక్షానికైతే దృష్టాంతం ఏదీ లేదు. కార్యం స్వధర్మంతో పాటే కారణంలో ఉండే పక్షంలో ప్రలయమే సంభవించడదు (అది లీనమవడమే కాదు). కార్యకారణాలకు అనన్యత్వం (అభేదం ఉన్నా) కార్యం కారణాత్మకం అవుతుంది కాని కారణం కార్యాత్మకం కాదని ఆరమ్భణశబ్దాదిభ్యః అనే చోట చెపుతాం.

## భాష్యమ్

అత్యల్పం చేదముచ్యతే - కార్యమపీతావాత్మీయేన ధర్మేణ కారణం సంసృజేత్ ఇతి. స్థితావపి సమానోఽయం ప్రసంగః; కార్యకారణయోర నన్యత్వాభ్యుపగమాత్. "ఇదం సర్వంయదయమాత్మా" (బృ.ఉ.2.4.6.) "ఆత్మైవేదం సర్వమ్" "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" (ము. ఉ. 2.2.11) "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛా.ఉ.3.14.1) ఇత్యేవమాద్యాభిర్హి శ్రుతిభిరవిశేషేణ త్రిష్వపి కాలేషు కార్యస్య కారణానన్యత్వం శ్రావ్యతే. తత్ర యః పరిహారః కార్యస్య తద్ధర్మాణాం చావిద్యాధ్యారోపి తత్వాన్న తైః కారణం సంసృజ్యత ఇతి, అపీతావపి స సమానః. అస్తి చాయమపరో దృష్టాన్తః యథా స్వయంప్రసారితయా మాయయా మాయావీ త్రిష్వపి కాలేషు న సంస్పృశ్యతే, అవస్తుత్వాత్ ఏవం పరమాత్మాపి సంసారమాయయా న సంస్పృశ్యత ఇతి. యథా చ స్వప్నదృగేకః స్వప్నదర్శనమాయయా న సంస్పృశ్యతే ప్రబోధ సంప్రసాదయోరనన్వాగతత్వాత్, ఏవమవస్థాత్రయసాక్ష్యేకోఽవ్యభిచార్య వస్థాత్రయేణ వ్యభిచారిణా న సంస్పృశ్యతే. మాయామాత్రం హ్యేతద్యత్పర మాత్మనోఽవస్థాత్రయాత్మనావభాసనమ్, రజ్జ్వా ఇవ సర్పాదిభావేనేతి. అత్రోక్తం వేదాన్తార్థసంప్రదాయవిద్భిరాచార్యైః-

**"అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే,**

**అజమనిద్రమస్వపప్నమద్వైతం బుధ్యతే తదా" (గౌ.పా.కా.1.1.16) ఇతి.**

తత్ర యదుక్తమ్ - అపీతే కారణస్యాపి కార్యస్యేవ స్థౌల్యాదిదోషప్రసంగ ఇతి ఏతదయుక్తమ్.

## బాలానందిని

అత్యల్పమితి:- ప్రలయంలో కార్యం తన ధర్మాన్ని కారణానికి సంక్రమించేటట్లు చేస్తుంది అని చెప్పినది చాలా చిన్న విషయం. కార్యకారణాలకు అనన్యత్వాన్ని అంగీకరించడంచేత స్థితిసమయంలో కూడా ఈ దోషం సమానమే. "ఇదం సర్వం యదయమాత్మా" (ఇదంతా ఆత్మయే) "ఆత్మైవేదం సర్వమ్" "బ్రహ్మైవేదమమృతం పురస్తాత్" "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులు విశేషం ఏదీ లేకుండా (ప్రలయకాలం, స్థితికాలం అనే విశేషం ఏదీ లేకుండా) మూడు కాలాలలోనూ కూడ

కార్యం కారణంకంటె అనన్యం (అభిన్నం) అని వినిపిస్తున్నాయి. కార్యమూ, దాని ధర్మాలూ కూడ అవిద్యచేత ఆరోపింపబడినవి అవడంచేత వాటితో కారణం సంబంధించదు అని అక్కడ ఏ పరిహారమో అది ప్రలయంలో కూడ సమానమే. ఈ మరొక దృష్టాంతం కూడ ఉంది - తానే ప్రసరింపచేసిన మాయచేత, అది వాస్తవం కాదు గాన, మాయావి ఏ విధంగా మూడు కాలాలలోను కూడ స్పృశింపబడడో అట్లే పరమాత్మ కూడ సంసారమాయచేత స్పృశింపబడడు. స్వప్నం చూసిన ఒకడు ఆ స్వప్నదర్శనమాయచేత ఎలా స్పృశింపబడడో, ఎందువల్ల ననగా అది జాగ్రదవస్థలోను సుషుప్తిలోను అనుగతం అవడం లేదు, అదే విధంగా అవస్థాత్రయానికీ సాక్షిగా ఉంటూ, వ్యభిచారం (మార్పు) లేకుండా ఉన్న ఒక్క ఆత్మ (పరమేశ్వరుడు) వ్యభిచారియైన అవస్థాత్రయంతో (జగజ్జన్మ-స్థితి-సంహారాలతో) సంబంధించడు. ఆత్మచేతనే భాసిస్తూన్న పరమాత్మయొక్క ఈ అవస్థాత్రయం ( జగజ్జన్మస్థితిరూపమైన అవస్థాత్రయం) మాయా మాత్రమే కదా? ఈ విషయంలో వేదాంతార్థసంప్రదాయవేత్త ఐన (గౌడపాద) ఆచార్యులచేత - "అనాదిమాయయా...తదా" అని చెప్పబడింది. "అనాదియైన మాయతో నిద్రపోతూన్న జీవుడు ఎప్పుడైతే (తత్త్వమస్యాద్యుప దేశకాలంలో) మేల్కొంటాడో అప్పుడు అజరము (జన్మస్థితిలయశూన్యము) నిద్ర లేనిది, స్వప్నం లేనిదీ అయిన అద్వైతాత్మత్వాన్ని తెలుసుకుంటాడు" అని దీని అర్థం. అలాంటప్పుడు ప్రళయంలో కారణానికి కార్యానికి వలె స్థౌల్యాదిదోషాలు సంక్రమించే దోషం ఉన్న దని ఏది చెప్పబడిందో అది అయుక్తం.

## భాష్యమ్

యత్పునరేతదుక్తం - నమస్తన్య విభాగస్యావిభాగప్రాప్తేః పునర్విభాగేనోత్పత్తౌ నియమకారణం నోపపద్యత ఇతి, అయమప్యదోషః. దృష్టాన్తభావాదేవ. యథా హి సుషుప్తిసమాధ్యాదావపి సత్యాం స్వాభావిక్యామ విభాగప్రాప్తౌ మిథ్యాజ్ఞానస్యానపోదితత్వాత్ పూర్వవత్పునఃప్రబోధే విభాగో భవత్యేవమిహాపి భవిష్యతి. శ్రుతిశ్చాత్ర భవతి - "ఇమాః సర్వాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి సంపద్యామహ ఇతి త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతఙ్గో వా దంశో వ మశకో వా యద్యద్భవన్తి తత్తదా భవన్తి" (ఛా.ఉ. 6.9.2,3.) ఇతి. యథా హ్యవిభాగేఽపి పరమాత్మని మిథ్యాజ్ఞానప్రతిబద్ధో విభాగవ్యవహారః స్వప్నవదవ్యాహతః స్థితౌ దృశ్యతే, ఏవమపీతావపి మిథ్యాజ్ఞానప్రతిబద్ధైవ విభాగశక్తిరనుమాస్యతే. ఏతేన

ముక్తానాం పునరుత్పత్తిప్రసఙ్గః ప్రత్యుక్తః. సమ్యగ్జ్ఞానేన మిథ్యా జ్ఞానస్యాపోదితత్వాత్. యః పునరయమన్తే౽పరో వికల్ప ఉత్ప్రేక్షితః - అథేదం జగదపీతావపి విభక్తమేవ పరేణ బ్రహ్మణావతిష్ఠేత - ఇతి సో౽ప్యనభ్యు పగమాదేవ ప్రతిషిద్ధః. తస్మాత్సమఞ్జసమౌపనిషదం దర్శనమ్.9.

బాలానందిని

యదపీతి:- సమస్తమైన విభాగము కలిసిపోయి నప్పుడు మళ్లీ విభాగంతో (వేరు వేరుగా) పుట్టడానికి నియామకమైన కారణం ఏదీ ఉండదు అని ఏది చెప్పబడినదో - ఇది కూడ దోషం కాదు; దృష్టాంతం ఉండడంవల్లనే. సుషుప్తి - సమాధ్యాదులలో కూడ స్వాభావిక మైన అవిభాగం పొందబడినా కూడ మిథ్యాజ్ఞానం తొలగింపబడకపోవడంవల్ల మెలకువ రాగానే మళ్లీ విభాగం ఏ విధంగా కలుగుతుందో అట్లే ఇక్కడ (ప్రళయంలో) కూడ కాగ్గలదు. ఈ విషయంలో "ఇమాః.... భవన్తి" ( ఈ ప్రాణు లన్నీ బ్రహ్మయందు ఏకత్వాన్ని పొంది (కలిసిపోయి) బ్రహ్మలో కలిసిపోతున్నా మని ఎరుగవు. అవి సుషుప్తికి పూర్వం వ్యాఘ్రంగా గాని, సింహంగా గాని, వరాహంగా గాని, పురుగుగా గాని, మిడతగా గాని, ఈగగా గాని, దోమగా గాని ఏ జాత్యాది విభాగంతో ఉండేవో అవిగానే మేల్కొన్న తరవాత అవుతాయి) అని శ్రుతి చెప్పుచున్నది. (సుషుప్తిలో) పరమాత్మయందు అవిభాగం ఏర్పడినప్పటికీ మిథ్యాజ్ఞానంచేత ఏర్పడిన విభాగవ్యవహారం, స్వప్నం వలె, అవ్యాహత మైనట్లు (అడ్డులేనట్లు) ఏవిధంగా స్థితికాలంలో కనబడుచున్నదో అట్లే ప్రలయంలో కూడ విభాగశక్తి మిథ్యాజ్ఞానంచేత ఏర్పడుతుంది అని ఊహింపబడగలగదు (అనుమానప్రమాణంచేత తెలియ బడగలదు).

వి. స్వప్నసమయంలో జరుగుతూన్న వ్యవహారం అది జరుగుతూన్నంత కాలమూ కూడ అబాధితంగా జరుగుతూనే ఉంటుంది. దానికి కారణం ఆ సమయంలో యథార్థజ్ఞానం లేకపోవడమే. అదే ప్రకారం స్థితికాలంలోని సుషుప్త్యవస్థలో ప్రాణు లన్నీ బ్రహ్మలో ఐక్యం పొందుతూన్నా కూడ తిరిగి పూర్వం ఏ ప్రాణులు ఏ విధంగా ఉండేవో అవే ప్రాణులుగా మేల్కొంటున్నాయి. అందుకు కారణం వాటి మిథ్యాజ్ఞానం (అజ్ఞానం) తొలగిపోకుండా ఉండడమే. అనగా వాటి అజ్ఞానసంస్కారం అలాగే ఉండడంచేత ఆ అజ్ఞానంయొక్క శక్తిచేత అవి మళ్లీ పూర్వం వలె విభాగాన్ని పొందుతున్నాయి. అట్లే మహాప్రలయంలోకూడ ఆ యా ప్రాణుల మిథ్యాజ్ఞానానికి సంబంధించిన శక్తి ఒకటి ఉందని అనుమానప్రమాణంచేత తెలియబడుతుంది. ఆ శక్తియే విభాగానికి కారణం అని అర్థం.

ఏతేనేతి:- దీనిచేత ముక్తులకు మళ్లీ జన్మ కలుగుతుంది. అనే ప్రసంగం నిరాకరించబడింది. ఎందువల్ల ననగా వాళ్ల మిథ్యాజ్ఞానం సమ్యగ్జ్ఞానంచేత పూర్తిగా తొలగింపబడిపోయింది. ఈ జగత్తు ప్రలయంలోకూడ బ్రహ్మనుండి వేరుగానే ఉన్నట్లయితే - అంటూ చివర ఏ మరొక వికల్పం ఊహించబడిందో అది అనంగీకారంచేతనే నిరాకరించబడింది. అనగా మేం ఆ విధంగా అంగీకరించే ప్రసక్తియే లేదు గాన ఈ వికల్పానికి ఉత్థానమేలే దని అర్థం. అందువల్ల ఈ ఔపనిషదదర్శనం సమంజస మైనదే.9.

## సూ. స్వపక్షదోషాచ్చ. 2.1. 10.

### భాష్యమ్

స్వపక్షే చ ఏతే ప్రతివాదినః సాధారణా దోషాః ప్రాదుఃష్యుః. కథమిత్యుచ్యతే. యత్తావదభిహితమ్ - విలక్షణత్వాన్నేదం జగద్ బ్రహ్మ ప్రకృతికమ్ ఇతి, ప్రధానప్రకృతికతాయామపి సమానమేతత్. శబ్దాదిహీనాత్ ప్రధానాత్ శబ్దాదిమతో జగత ఉత్పత్త్యభ్యుపగమాత్. అత ఏవ చ విలక్షణకార్యోత్పత్త్యభ్యుపగమాత్సమానః ప్రాగుత్పత్తేరసత్కార్య వాద ప్రసంగః. తథాపీతౌ కార్యస్య కారణావిభాగాభ్యుపగమా త్తద్వత్ప్రసంగో ఽపి సమానః. తథా మృదితసర్వవిశేషేషు వికారేష్వపీతావ విభాగాత్మకతాం గతేష్విదమస్య పురుషస్యోపాదానమిదమస్యేతి ప్రాక్ప్రలయాత్ప్రతిపురుషం యే నియతా భేదాః న తే తథైవ పునరుత్పత్తౌ నియన్తుం శక్యన్తే, కారణాభావాత్. వినైవ చ కారణేన నియమేఽభ్యుపగమ్యమానే కారణాభావసామ్యాన్ముక్తానామపి పునర్బన్ధప్రసఙ్గః. అథ కేచిద్భేదాః అపీతావవిభాగమాపద్యన్తే కేచిన్నేతి చేత్ యేనాపద్యన్తే తేషాం ప్రధానకార్యత్వం న ప్రాప్నోతీత్యేవ మేతే దోషాః సాధారణత్వాన్నాన్యతరస్మిన్ పక్షే చోదయితవ్యా భవన్తీత్యదోషతామేవైషాం ద్రఢయతి, అవశ్యాశ్రయితవ్యత్వాత్. 10.

### బాలానందిని

స్వేతి:- "స్వపక్షదోషాచ్చ = స్వపక్షంలోనే (మీ పక్షంలోనే) దోషాలుండడంవల్ల కూడ ఈ ఆక్షేపం యుక్తం కాదు" అని సూత్రార్థం.

స్వపక్ష ఇతి:- ఈ దోషాలు ప్రతివాదియొక్క స్వపక్షంలో కూడ సమంగానే ప్రాదుర్భవిస్తాయి (కనబడతాయి). ఎట్లనగా చెప్పబడుచున్నది- ఈ జగత్తు విలక్షణంగా ఉంది గాన దీనికి బ్రహ్మ ప్రకృతి కాదు అని ఏది చెప్పబడిందో అది ప్రధానం ప్రకృతి అని అంగీకరించిన పక్షంలో కూడ సమానమే. ఎందువల్ల ననగా (సాంఖ్యులు) శబ్దాదిహీనమైన ప్రధానం నుండి శబ్దాదులు గల జగత్తుయొక్క ఉత్పత్తిని అంగీకరిస్తున్నారు. ఈ విధంగా విలక్షణ మైన కార్యాన్ని అంగీకరించడంవల్ల ఉత్పత్తికి పూర్వం అసత్కార్యవాదం ప్రసక్తం అవడం సమానమే. అట్లే ప్రలయంలో కార్యం కారణంతో అవిభాగం పొందుతుంది అని అంగీకరించడంవల్ల కార్యం వలె ప్రధానంకూడ రూపాదిమత్తు అవుతుందనడానికి అవకాశం ఉంది. అట్లే సమస్తవిశేషాలు నశించిన కార్యాలు ప్రలయంలో అవిభాగాత్మత్వాన్ని (ప్రకృతితో అవిభాగాన్ని) పొందినప్పుడు ఇది (ఈ కర్మాదికం) ఈ పురుషుని ఉపాదానం (భోగ్యం), ఇది (కర్మాదికం) వీని భోగ్యం అని ప్రతీపురుషుని విషయంలోను ప్రలయానికి పూర్వం ఏ భేదాలు నియతంగా ఉన్నాయో అవి అదే విధంగా మళ్లీ ఉత్పత్తిలో కూడ ఉంటాయని నియమించడానికి తగిన కారణం ఏదీ లేకపోవడంచేత, శక్యం కావు. ఏ కారణమూ లేకుండానే నియమం అంగీకరిస్తే కారణం లేకపోవడం అనేది సమానమే గాన ముక్తులకు కూడ మళ్లీ బంధం ప్రసక్త మవుతుంది. అట్లు కాక కొన్ని భేదాలు (బద్ధులకు సంబంధించినవి) ప్రలయంలో ప్రధానంతో అవిభాగం పొందుతాయి, కొన్ని (ముక్తులకు సంబంధించినవి) పొందవు అని చెప్పిన ట్లయితే అవి (అవిభాగం చెందనివి) ప్రధానకార్యాలు కావు అని చెప్పవలసి వస్తుంది. ఈ విధంగా ఈ దోషాలన్నీ సాధారణాలే (ఇద్దరికీ సమంగా పట్టేవే) అవడంవల్ల వీటిని ఒక పక్షంలో ఎత్తి చూపవలసిన పని లేదు గాన వీటిని దోషాలుగా పరిగణింపగూడదు అనే విషయాన్ని దృఢీకరిస్తున్నది. ఇవన్నీ తప్పక ఆశ్రయించతగినవే కదా? (అయితే ఈ దోషాలు మా పక్షంలో లేవనే విషయం ప్రతిపాదించబడింది).

**సూ. తర్కాప్రతిష్ఠానాదన్యథానుమేయమితి చేదేవమప్యనిర్మోక్షప్రసంగః. 2.1.11**

ఇతశ్చ నాగమగమ్యేఽర్థే కేవలేన తర్కేణ ప్రత్యవస్థాతవ్యమ్, యస్మాన్నిరాగమాః పురుషోత్ప్రేక్షామాత్రనిబన్ధనాస్తర్కాః అప్రతిష్ఠితా భవన్తి, ఉత్ప్రేక్షాయా నిరఙ్కుశత్వాత్. తథాహి - కైశ్చిదభియుక్తైర్యత్నేనోత్ప్రేక్షితాస్తర్కాః అభియుక్తతరైరన్యైరాభాస్యమానా దృశ్యన్తే. తైరుత్ప్రేక్షితాః సన్తస్తతోఽన్యైరాభాస్యన్త ఇతి న ప్రతిష్ఠితత్వం తర్కాణాం శక్యమాశ్రయితుమ్,

పురుషమతివైరూప్యాత్. అథ కస్య చిత్ప్రసిద్ధమాహాత్మ్యస్య కపిలస్య అన్యస్య వా సంమతస్తర్కః ప్రతిష్ఠిత ఇత్యాశ్రీయేత ఏవమప్యప్రతిష్ఠితత్వమేవ. ప్రసిద్ధమాహాత్మ్యానుమతానామపి తీర్థకరాణాం కపిలకణాదప్రభృతీనాం పరస్పరవిప్రతిపత్తిదర్శనాత్. అథోచ్యేత - అన్యథా వయమనుమాస్యామహే యథా నాఽప్రతిష్ఠాదోషో భవిష్యతి. న హి ప్రతిష్ఠితస్తర్క ఏవ నాస్తీతి శక్యతే వక్తుమ్. ఏతదపి హి తర్కాణామప్రతిష్ఠితత్వం తర్కేణైవ ప్రతిష్ఠాప్యతే. కేషాంచిత్తర్కాణామప్రతిష్ఠితత్వదర్శనేనాన్యేషామపి తజ్జాతీయకానాం తర్కాణామప్రతిష్ఠిత్వకల్పనాత్. సర్వతర్కాప్రతిష్ఠాయాం చ లోకవ్యవహారోచ్ఛేదప్రసఙ్గః. అతీత వర్తమానాధ్వసామ్యేన హ్యనాగతేఽప్యధ్వని సుఖదుఃఖప్రాప్తిపరిహారాయ ప్రవర్తమానో లోకో దృశ్యతే.

### బాలానందిని

తర్కేతి :- "తర్కాప్రతిష్ఠానాత్ = తర్కానికి ప్రతిష్ఠ (నిలకడ) లేకపోవడంవల్ల, అన్యథా = మరొక విధంగా, అనుమేయమ్ = అనుమానం చేయదగినది, ఇతి చేత్ = అన్నట్లయితే, ఏవమపి = ఇలా చేసినా కూడ; అవిమోక్షప్రసంగః = ఈ దోషం నుండి విడుదల లభించకపోవడం ప్రసక్త మౌతుంది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి :- ఆగమంచేతనే తెలియదగిన విషయంలో, ఈ కారణంచేత కూడ, కేవలతర్కబలంచేత ఎదరు తిరగకూడదు - ఎందువల్ల ననగా, ఆగమాల సహాయం లేని, పురుషుల ఊహలమాత్రంమీదనే ఆధారపడిన తర్కాలు అప్రతిష్ఠి తాలుగా (నిలకడ లేనివిగా) ఉంటాయి. అందుచేత కొందరు బుద్ధిమంతులు ప్రయత్న పూర్వకంగా ఊహించిన తర్కాలను వాళ్లకంటె ఎక్కువ బుద్ధి ఉన్నవాళ్లు ఆభాసలనుగా (అర్థరహితాలనుగా) చేయడం కనబడుతుంది. వాళ్లు ఊహించిన తర్కాలను వాళ్లకంటె ఎక్కువ బుద్ధిబలం ఉన్న వాళ్ళు ఆభాసం చేస్తున్నారు. అందుచేత పురుషుల బుద్ధులు అనేక విధాలుగా ఉండడంవల్ల తర్కాలు ప్రతిష్ఠితంగా (నిశ్చితంగా, అబాధితంగా) ఉంటాయని చెప్పడం శక్యం కాదు.

వి :- ఈ సందర్భంలో భామతీకారుడు ఈ క్రింది శ్లోకం ఉదాహరించి ఉన్నాడు-

• "యత్నేనానుమితోఽప్యర్థః కుశలైరనుమాతృభిః,
అభియుక్తతరైరన్యైరన్యథైవోపపాద్యతే" వాక్యపదీయం - బ్రహ్మకాండము 3.

**అథేతి** :-అట్లు కాక మాహాత్మ్యవంతుడుగా ప్రసిద్ధుడైన కపిలునికి లేదా మరొకనికి సంమతమైన తర్కం ప్రతిష్ఠితం అని అంగీకరించినా అప్రతిష్ఠితత్వం తప్పదు. ఎందువల్ల ననగా మాహాత్మ్యం కలవారుగా ప్రసిద్ధుడైన కపిలకణాదాదులైన తీర్థకరుల (దార్శనికాచార్యుల) మతాలలో పరస్పరవిరోధం కనబడుతున్నది.

వి : అందుచేతనే -

"కపిలో యది సర్వజ్ఞః కణాదో నేతి కా ప్రమా,

తావుభౌ యది సర్వజ్ఞౌ మతభేదః కుతస్తయోః"

అని ఒక అభియుక్తోక్తి ఉంది.

**అథేతి** :- అది కాదు - అప్రతిష్ఠాదోషం లేని విధంగా మేం మరొక విధంగా అనుమానం చేస్తాం. ప్రతిష్ఠితమైన తర్కమే లేదని చెప్పడానికి శక్యం కాదు కదా? కొన్ని తర్కాలు అప్రతిష్ఠితాలుగా కనబడడంచేత, ఆ జాతికే చెందిన ఇతరతర్కాలు కూడ అప్రతిష్ఠితాలే అని కల్పించడం ద్వారా ఈ తర్కాప్రతిష్ఠితత్వం కూడ తర్క బలం మీదనే స్థాపించబడుతున్నది కదా? తర్కాలన్నీ అప్రతిష్ఠితాలే అంటే లోక వ్యవహారమే నడవదు. గడచిన, నడుస్తున్న మార్గాల సామ్యంచేతనే, అనగా పాకభోజనాదివిషయాలలో పూర్వం ఏ పద్ధతులు అవలంబింపబడ్డాయో, ఇప్పుడు ఏవి అవలబింపబడుతున్నాయో వాటి పోలికలను మనస్సులో ఉంచుకొని, లోకులు సుఖప్రాప్తికి దుఃఖపరిహారానికి ప్రయత్నిస్తూన్నట్లు చూస్తున్నాం కదా.

## భాష్యమ్

శ్రుత్యర్థవిప్రతిపత్తౌ చ అర్థాభాసనిరాకరణేన సమ్యగర్థనిర్ధారణం తర్కేణైవ వాక్యవృత్తినిరూపణరూపేణ క్రియతే - మనురపి చైవం మన్యతే—

"ప్రత్యక్షమనుమానం చ శాస్త్రం చ వివిధాగమమ్,

త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధిమభీప్సతా" ఇతి,

ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా,

యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" (మ.స్మృ.12.105,106)

ఇతి చ బ్రువన్. అయమేవ తర్కస్యాలంకారో యదప్రతిష్ఠితత్వం నామ. ఏవం హి సావద్యతర్కపరిత్యాగేన నిరవద్యస్తర్కః ప్రతిపత్తవ్యో భవతి. న హి పూర్వజో మూఢ ఆసీదిత్యాత్మనాపి మూఢేన భవితవ్యమితి కించిదస్తి

ప్రమాణమ్. తస్మాన్న తర్కాప్రతిష్ఠానం దోష ఇతి చేత్ - ఏవమప్యవిమోక్ష ప్రసంగః. యద్యపి క్వచిద్విషయే తర్కస్య ప్రతిష్ఠితత్వముపలక్ష్యతే తథాపి ప్రకృతే తావద్విషయే ప్రసజ్యత ఏవాప్రతిష్ఠితత్వదోషాదవిమోక్షస్తర్కస్య. నహీ దమతిగమ్భీరం భావయాథాత్మ్యం ముక్తినిబన్ధనమాగమమన్తరేణో త్ప్రేక్షితుమపి శక్యమ్. రూపాద్యభావాద్ధి నాయమర్థః ప్రత్యక్ష గోచరః, లిఙ్గాద్యభావాచ్చ నానుమానాదీనామిత్యవోచామ

## బాలానందిని

శ్రుత్యర్థేతి :- శ్రుతియొక్క అర్థం విషయంలో విప్రతిపత్తి ఏర్పడినప్పుడు అర్థాభాసను (అర్థం వలె పైకి కనబడే అయుక్తమైన అర్థాన్ని) నిరాకరించి సరియైన అర్థంయొక్క నిర్ధారణ వాక్యంయొక్క వృత్తిని, ప్రవృత్తిని, తాత్పర్యాన్ని నిరూపించడం అనే రూపం గల తర్కంచేతనే, అనగా మీమాంసాన్యాయాల రూపంలో ఉన్న తర్కం చేతనే, చేయబడుచున్నది. "ప్రత్యక్ష... అభీప్సతా" అని, "ఆర్షం ... నేతరః" అనీ అంటూ మనువు కూడ ఇట్లే అభిప్రాయపడుతున్నాడు. "ధర్మశుద్ధిని (ధర్మానికి అధర్మానికీ ఉన్న భేదాన్ని) పొంద దలచిన వాడు (తెలుసుకొన దలచిన వాడు) ప్రత్యక్షాన్ని, అనుమానాన్ని, అనేకవేదాల రూపంలో ఉన్న శాస్త్రాన్ని, ఈ మూడింటినీ బాగా తెలుసుకోవాలి". "ఋషి ప్రోక్తమైన (వేదబోధితమైన) ధర్మోపదేశాన్ని వేదశాస్త్రాలకు విరుద్ధం కాని తర్కంతో ఎవడు అనుసంధానం చేస్తాడో అతడే ధర్మాన్ని తెలుసుకొన కలుగుతాడు, ఇతరుడు తెలుసుకొన జాలడు" అని ఈ శ్లోకాల తాత్పర్యం. నిజానికి అప్రతిష్ఠితంగా ఉండడమే తర్కానికి అలంకారం. ఇలా అయితేనే దుష్టమైన తర్కాన్ని పరిహరించి నిర్దుష్టమైన తర్కాన్ని స్వీకరించడం కుదురుతుంది. ముందు పుట్టిన వాడు మూఢుడు కదా తను కూడ మూఢుడే అయి ఉండాలి అనడంలో ప్రమాణం ఏదీ లేదు కదా? అందుచేత తర్కాప్రతిష్ఠానం దోషం కాదు అన్నట్లయితే - ఇలా చెప్పినా కూడ తర్కానికి ఉన్న అప్రతిష్ఠితత్వం అనే దోషంనుండి విముక్తి లేదు. కొన్ని విషయాలలో తర్కానికి ప్రతిష్ఠితత్వం ఉంటే ఉండవచ్చును. అయినా కూడ ప్రకృత విషయంలో అయితే తర్కానికి అప్రతిష్ఠితత్వ దోషం నుండి విముక్తి లేదు. అతిగంభీరమూ, ముక్తికి హేతువు అయిన ఈ భావయాథాత్మ్యం (జగత్కారణంయొక్క అద్వయత్వం అనే యథార్థం) శాస్త్రసాహాయ్యం లేకుండా ఊహించడానికి కూడ శక్యం కాదు కదా? ఈ విషయం (బ్రహ్మ) రూపాదులు లేని దవడం చేత ప్రత్యక్షాదులకు గోచరం కాదు, లింగాదులు లేకపోవడంచేత అనుమానాదులకు కూడ గోచరం కాదు అని చెప్పి ఉన్నాం.

## భాష్యమ్

అపి చ సమ్యగ్జ్ఞానాన్మోక్ష ఇతి సర్వేషాం మోక్షవాదినామభ్యుపగమః. తచ్చ సమ్యగ్జ్ఞానమేకరూపం, వస్తుతన్త్రత్వాత్. ఏకరూపేణ హ్యవస్థితో యోఽర్థః స పరమార్థః. లోకే తద్విషయం జ్ఞానం సమ్యగ్జ్ఞానమిత్యుచ్యతే యథాగ్నిరుష్ణ ఇతి. తత్రైవంసతి సమ్యగ్జ్ఞానే పురుషాణాం విప్రతిపత్తిరనుపపన్నా. తర్కజ్ఞానానాం త్వన్యోన్యవిరోధాత్ప్రసిద్ధా విప్రతిపత్తిః. యద్ధి కేనచిత్తార్కికేణ ఇదమేవ సమ్యగ్జ్ఞానమితి ప్రతిపాదితం తదపరేణ వ్యుత్థాప్యతే, తేనాపి ప్రతిష్ఠాపితం తతోఽపరేణ వ్యుత్థాప్యత ఇతి చ ప్రసిద్ధం లోకే. కథమేకరూపానవస్థితవిషయం తర్కప్రభవం సమ్యగ్జ్ఞానం భవేత్? న చ ప్రధానవాదీ తర్కవిదాముత్తమ ఇతి సర్వై స్తార్కికైః పరిగృహీతో యేన తదీయం మతం సమ్యగ్జ్ఞానమితి ప్రతిపద్యే మహి. న చ శక్యన్తేఽతీతానగతవర్తమానా స్తార్కికా ఏకస్మిన్ దేశే కాలే చ సమాహర్తుమ్, యేన తన్మతిరేకరూపా ఎకార్థ విషయా సమ్యఙ్మతిరితి స్యాత్. వేదస్య తు నిత్యత్వే విజ్ఞానోత్పత్తిహేతుత్వే చ సతి వ్యవస్థితార్థవిషయత్వోపపత్తేః తజ్జనితస్య జ్ఞానస్య సమక్త్వమతీతానాగతవర్తమానైః సర్వైరపి తార్కికైరపహ్నోతుమ శక్యమ్. అతః సిద్ధమస్యోపనిషద స్యైవ జ్ఞానస్య సమ్యగ్జ్ఞానత్వమ్. అతోఽన్యత్ర సమ్యగ్జ్ఞానత్వానుపపత్తేః సంసారావిమోక్ష ఏవ ప్రసజ్యేత. అత ఆగమవశేన ఆగమానుసారితర్కవశేన చ చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిశ్చేతి స్థితమ్. 11

## బాలానందిని

**అపి చేతి :-** మరొక విషయ మేమనగా - సమ్యగ్జ్ఞానంవల్ల (యథార్థమైన జ్ఞానంవల్ల) మోక్షం కలుగుతుంది అని మోక్షవాదు లందరూ అంగీకరించిన విషయం. ఆ సమ్యగ్జ్ఞానం అనేది వస్తువు మీద ఆధారపడి ఉంటుంది గాన ఒకే విధంగా ఉండాలి. ఏ అర్థం (వస్తువు) ఒకే రూపంలో ఉంటుందో అదే పరమార్థం కదా? అలాంటి వస్తువును గూర్చిన జ్ఞానమే లోకంలో, అగ్ని వేడిగా ఉంటుంది అనే జ్ఞానం వలె, సమ్యగ్జ్ఞానం అని చెప్పబడుతుంది. ఇది ఇలా ఉండగా సమ్యగ్జ్ఞానం విషయంలో పురుషులకు విప్రతిపత్తి (అభిప్రాయభేదం) ఉపపన్నం కాదు (ఉండగూడదు). తర్కంవల్ల కలిగే జ్ఞానాలైతే పరస్పరము విరుద్ధంగా ఉంటాయిగాన

వాటి విషయంలో విప్రతిపత్తి ఉండడం ప్రసిద్ధమే. ఒక తార్కికుడు ఇదే సమ్యగ్జ్ఞానం అని ప్రతిపాదించిన దానిని మరొకడు లేపేస్తాడు. అతడు ప్రతిపాదించిన దానిని మూడోవాడు లేపేస్తాడు అనే విషయం లోకంలో ప్రసిద్ధమే. ఈ విధంగా ఒక రూపంలో స్థిరంగా విషయం లేని, తర్కంవల్ల కలిగిన జ్ఞానం సమ్యగ్జ్ఞానం ఎలా లవుతుంది? ప్రధానవాది తార్కికు లందరిలోకీ ఉత్తముడు అని అందరు తార్కికులు అంగీకరించరు. అలా అంగీకరిస్తే వాని మతం సమ్యగ్జ్ఞానం అని గ్రహించే వాళ్లం. భూతభవిష్యద్వర్తమానకాలాలకి సంబంధించిన తార్కికు లందరినీ ఒక సమయంలో, ఒక దేశంలో చేర్చడం కుదరదు. అలా చేర్చకలిగితే ఒకే విషయాన్ని గూర్చి ఒకే విధంగా ఉన్న వాళ్ల మతి సమ్యఙ్మతి (సమ్యగ్జ్ఞానం) అనడానికి వీలుండేది. వేదమైతే నిత్యమైనది, అది విజ్ఞానం కలిగించడానికి హేతువు. అందుచేత అది వ్యవస్థితమైన (నిశ్చితమైన) అర్థాన్ని గూర్చి చెపుతుంది అని చెప్పడం కుదురుతుంది గాన దానివల్ల కలిగిన జ్ఞానం సమ్యగ్జ్ఞానం అనే విషయాన్ని భూతభవిష్యద్వర్తమానకాలాలకు చెందిన అందరు తార్కికులూ కూడ కప్పిపుచ్చజాలరు (నిరాకరించజాలరు). దానికంటె భిన్నమైనది సమ్యగ్జ్ఞానం కాజాలదు. అందుచేత సంసారంనుండి విముక్తియే లభించదనే స్థితి ఏర్పడుతుంది. అందువల్ల శాస్త్రానుసారంగాను, శాస్త్రానుసారితర్కం ప్రకారమూ కూడ చేతనమైన బ్రహ్మ జగత్తుకు కారణ మనీ, ప్రకృతి అనీ నిర్ణీతమై ఉంది.11.

విలక్షణత్వాధికరణం సమాప్తం

## 4. శిష్టాపరిగ్రహాధికరణమ్ .సూ.12

## సూ. ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః. 2.1.12.

వైదికస్య ధర్శనస్య ప్రత్యాసన్నత్వాత్, గురుతరతర్కబలోపేతత్వాత్, వేదానుసారిభిశ్చ కైశ్చిచ్ఛిష్టైః కేన చిదంశేన పరిగృహీతత్వాత్ ప్రధాన కారణవాదం తావద్వ్యపాశ్రిత్య యస్తర్కనిమిత్త ఆక్షేపో వేదాన్త వాక్యేషూద్భావితః స పరిహృతః. ఇదానీమణ్వాదివాదవ్యపాశ్రయేణాపి కైశ్చిన్మన్దమతిభిర్వేదాన్తవాక్యేషు పునస్తర్కనిమిత్త ఆక్షేప ఆశఙ్క్యేత ఇత్యతః ప్రధానమల్లనిబర్హణన్యాయేన అతిదిశతి. పరిగృహ్యన్త ఇతి పరిగ్రహాః. న పరిగ్రహాః అపరిగ్రహాః. శిష్టానామపరిగ్రహాః శిష్టాపరిగ్రహాః. ఏతేన ప్రకృతేన ప్రధానకారణవాదనిరాకరణేన శిష్టైః మనువ్యాసప్రభృతిభిః కేన చిదప్యంశేన అపరిగృహీతా యేఽణ్వాదికారణవాదాః తేఽపి ప్రతిషిద్ధతయా వ్యాఖ్యాతాః

నిరాకృతాః ద్రష్టవ్యాః. తుల్యత్వాన్నిరాకరణకారణస్య నాత్ర పునరాశఙ్కితవ్యం కించిదస్తి. తుల్యమత్రాపి [1]పరమగమ్భీరస్య జగత్కారణస్య తర్కానవగాహ్యత్వం, తర్కస్య చాప్రతిష్ఠితత్వమ్, అన్యథానుమానేఽప్యవిమోక్షః ఆగమవిరోధశ్చేత్యేవంజాతీయకం నిరాకరణకారణమ్. 12

బాలానందిని

ఏతేనేతి:- "ఏతేన = దీనిచేత, శిష్టాపరిగ్రహాః అపి = శిష్టులచేత అంగీకరించబడని అణుకారణత్వాదివాదాలు కూడ, వ్యాఖ్యాతాః = నిరాకరించబడినవిగా, విశదీకరిక బడినవి" అని సూత్రార్థం.

వైదికస్యేతి :- ప్రధానకారణవాదం వైదికదర్శనానికి దగ్గరగా ఉంటుంది. గట్టి తర్కబలం దీనికి ఉంది. వేదానుసారులైన కొందరు శిష్టులు దీనిలోని కొన్ని అంశాలు అంగీకరించారు. అందుచేత ఈ వాదాన్ని అనుసరించి వేదాంతవాక్యాల విషయంలో తర్కాన్ని ఆధారంగా చేసికొని చేసిన ఆక్షేపం పరిహరించబడింది. ఎవరైనా మందబుద్ధులు అణ్వాదివాదాలను కూడ ఆధారంగా తీసికొని వేదాంతవాక్యాల విషయంలో తర్కనిమిత్తమైన ఆక్షేపాన్ని ఆశంకించవచ్చును అని, ఇప్పుడు, ప్రధానమల్లనిబర్హణన్యాయంచేత వాటి విషయంలో కూడ పూర్వాధికరణన్యాయాన్ని అతిదేశిస్తున్నాడు.

వి. జగత్తుకు బ్రహ్మ ఉపాదానం అని చెప్పే వేదాంతసమన్వయం విషయం. అది వైశేషికాదిమతానికి విరుద్ధమా కాదా అని సంశయం. సాంఖ్యులు అంతగా తర్కనైపుణ్యం లేనివారైనా వైశేషికాదులు మంచి తర్కనైపుణ్యం గలవారు గాన వాళ్ల మతానికి ఇది విరుద్ధం అని ప్రత్యుదాహరణసంగతిచేత పూర్వపక్షం.

పరిగృహ్యన్త ఇతి :- పరిగృహ్యన్త ఇతి పరిగ్రహాః = పరిగ్రహింపబడేవి. పరిగ్రహింపబడనివి అపరిగ్రహాలు. శిష్టానామ్ అపరిగ్రహాః శిష్టాపరిగ్రహాః = శిష్టుల చేత పరిగ్రహింపబడనివి. ఏతేన = ప్రకృతమైన ప్రధానకారణవాదాన్ని నిరాకరించడానికి చూపిన కారణంచేతనే, శిష్టులైన మనువ్యాసాదులచేత ఏ అంశంలోను కూడ స్వీకరించబడని అణ్వాదికారణవాదాలు కూడ ప్రతిషేధింపబడినట్లు వివరింపబడినవిగా, నిషేధింపబడినవిగా, చూడదగినవి. నిరాకరించడానికి చూపిన కారణం తుల్యమే గాన వీటి విషయంలో మళ్లీ ఆశంకించ దగినది ఏదీ లేదు. పరమగంభీరమైన జగత్కారణాన్ని గూర్చి తర్కంచేత తెలుసుకొనడానికి శక్యం కాకపోవడం, తర్కం అప్రతిష్ఠితంగా ఉండడం, మరొక విధంగా అనుమానం చేసినా కూడ ఈ దోషంనుండి

విముక్తి లేకపోవడం, శాస్త్రవిరోధం ఈ మొదలైన నిరాకరణకారణాలు ఈ వాదాల విషయంలో కూడ సమానమైనవే. 12.

శిష్టాపరిగ్రహాధికరణం సమాప్తం

## 5. భోక్త్రాపత్త్యధికరణమ్. సూ. 13.

### సూ. భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్. 2.1.13.

అన్యథాపునర్బ్రహ్మకారణ వాదః తర్కబలేనైవాక్షిప్యతే. యద్యపి శ్రుతిః ప్రమాణం స్వవిషయే భవతి తథాపి ప్రమాణాన్తరేణ విషయాపహారేఽన్యపరా భవితుమర్హతి, యథా మన్త్రార్థవాదౌ. తర్కోఽపి హి స్వవిషయాదన్యత్రా ప్రతిష్ఠితః స్యాత్, యథా ధర్మాధర్మయోః. కిమతో యద్యేవమ్? అత ఇదమయుక్తం యత్ప్రమాణాన్తరప్రసిద్ధార్థబాధనం శ్రుతేః. కథం పునః ప్రమాణాన్తరప్రసిద్ధోఽర్థః శ్రుత్యా బాధ్యత ఇతి? అత్రోచ్యతే - ప్రసిద్ధో హ్యయం భోక్తృభోగ్యవిభాగో లోకే - భోక్తా చేతనః శారీరో, భోగ్యాః శబ్దాదయో విషయా ఇతి; యథా భోక్తా దేవదత్తో భోజ్య ఓదనః ఇతి. తస్య చ విభాగస్యాభావః ప్రసజ్యేత యది భోక్తా భోగ్యభావమాపద్యేత. భోగ్యం వా భోక్తృభావ మాపద్యేత. తయోశ్చేతరేతరభావాపత్తిః పరమకారణాద్బ్రహ్మణోఽనన్యత్వా ప్రత్యసజ్యేత. న చాస్య ప్రసిద్ధస్య విభాగస్య బాధనం యుక్తమ్. యథా త్వద్యత్వే భోక్తృభోగ్యయోర్విభాగో దృష్టస్తథాతీవానాగతయోరపి కల్పయితవ్యః. తస్మాత్ప్రసిద్ధస్యాస్య భోక్తృభోగ్యవిభాగస్యాభావప్రసఙ్గాదయుక్తం బ్రహ్మకారణతావధారణమ్.

### బాలానందిని

భోక్త్రాపత్తేరితి:- "భోక్త్రాపత్తేః = భోగ్యం భోక్తృరూపం అయిపోవడంవల్ల, అవిబాగశ్చేత్ = భోక్తృభోగ్యాలకు విభాగం లేకుండా పోతుంది అన్నట్లయితే (ఆ దోషం లేదు), లోకవత్ = లోకంలో వలెనె చూచుకొన వచ్చును" అని సూత్రార్థం.

అన్యథా ఇతి :- బ్రహ్మకారణవాదం మళ్లీ తర్కబలంచేతనే మరొక విధంగా ఆక్షేపింపబడుచున్నది. శ్రుతి స్వవిషయంలో (తను క్రొత్తగా ప్రతిపాదించ వలసిన దాని విషయంలో) ప్రమాణమే అయినా, మరొక ప్రమాణంచేత దీని విషయం అపహరించ బడినప్పుడు, మంత్రార్థవాదల వలె, మరొకదానిని ప్రతిపాదించేది అవుతుంది. (విషయాపహారం అనగా దీనిచేత ప్రతిపాదించబడే విషయాన్ని మరొక ప్రమాణం బాధిచడం). తర్కం కూడ తన విషయం కాని స్థలాలలో, ధర్మాధర్మాల

విషయంలో వలె, అప్రతిష్ఠితం కావచ్చును. అయితే ఏమిటి? అందుచేత శ్రుతి ప్రమాణాంతరాలచేత ప్రసిద్ధమైన అర్థాన్ని బాధించడం అయుక్తం. ప్రమాణాంతర ప్రసిద్ధమైన అర్థాన్ని శ్రుతి ఎక్కడ బాధించిది? ఈ విషయంలో చెప్పబడుచున్నది. చేతను డైన జీవుడు భోక్త (అనుభవించేవాడు), శబ్దాదివిషయాలు భోగ్యాలు (అనుభవింప తగినవి). దేవదత్తుడు భోక్త, అన్నం భోజ్యం అనే ఈ భోక్తృ భోగ్యవిభాగం లోకంలో ప్రసిద్ధంగా ఉంది కదా? భోక్త భోగ్యంగా అయిపోయినా, భోగ్యం భోక్తగా అయిపోయినా ఈ విభాగం లేకుండా పోతుంది. ఇవి పరమకారణమైన బ్రహ్మకంటె అభిన్నమవడంచేత ఈ రెండు (భోక్తృ - భోగ్యాలు) ఇతరేతరభావాన్ని పొందినవి అయిపోతాయి. అనగా భోగ్యం భోక్తగాను భోక్త భోగ్యంగాను అయిపోయే ప్రసక్తి ఉంది. ప్రసిద్ధమైన ఈ విభాగాన్ని బాధించడం యుక్తం కాదు. ఇప్పుడు భోక్తృభోగ్య విభాగం ఏ విధంగా కనబడుతున్నదో అట్లే భూతభవిష్యత్కాలలో కూడ ఉండేది, ఉండబోతుంది అని కల్పించాలి. అందువల్ల, ప్రసిద్ధమైన ఈ భోక్తృభోగ్యవిభాగం లేకుండా పోయే ప్రసక్తి ఉండడంచేత బ్రహ్మను కారణంగా నిర్ణయించడం అయుక్తం.

వి. అద్వితీయబ్రహ్మనుండి జగత్సృష్ట్యాదులను బోధించే వేదాంతసమన్వయం విషయం. అది భేదప్రత్యక్షానికి విరుద్ధమా కాదా అని సంశయం. బ్రహ్మవిషయంలో తర్కం అప్రతిష్ఠిత మైనా జగద్భేదం విషయంలో ప్రతిష్ఠితమే గాన విరోధం ఉంది అని ప్రత్యుదాహరణ సంగతితో పూర్వపక్షం. అద్వైతం సిద్ధించక పోవడం పూర్వపక్షఫలం, సిద్ధించడం సిద్ధాంతానికి ఫలం.

## భాష్యమ్

ఇతి చేత్కశ్చిచ్చోదయేత్ తం ప్రతి బ్రూయాత్ - స్యాల్లోకవదితి. ఉపపద్యత ఏ వాయమస్మత్పక్షేఽపి విభాగః, ఏవం లోకే దృష్టత్వాత్. తథాహి - సముద్రాదుదకాత్మనోఽనన్యత్వేఽపి తద్వికారాణాం ఫేనవీచీతరఙ్గ బుద్బుదాదీనామితరేతరవిభాగః, ఇతరేతసంశ్లేషాదిలక్షణశ్చ వ్యవహార ఉపలభ్యతే. న చ సముద్రాదుదకాత్మనోఽనన్యత్వేఽపి తద్వికారాణాం ఫేనతరఙ్గాదీనామితరేతరభావాపత్తిర్భవతి, న చ తేషామితరేతభావానాపత్తావపి సముద్రాత్మనోఽన్యత్వం భవతి; ఏ వమిహాపి, న చ భోక్తృభోగ్యయోరితరేతర భావాపత్తిః న చ పరస్మాద్బ్రహ్మణోఽ న్యత్వం భవిష్యతి. యద్యపి భోక్తా న బ్రహ్మణో వికారః "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" (తై. ఉ. 2. 6) ఇతి

స్రష్టురేవావికృతస్య కార్యాను ప్రవేశేన భోక్తృత్వశ్రవణాత్, తథాపి కార్యమను ప్రవిష్టస్యాస్త్యుపాధినిమిత్తో విభాగ ఆకాశస్యేవ ఘటాద్యుపాధినిమిత్త ఇత్యతః పరమకారణాద్బ్రహ్మణోఽనన్యత్వేఽప్యుపపద్యతే భోక్తృభోగ్యలక్షణో విభాగః సముద్రతరఙ్గాదిన్యాయేనేత్యుక్తమ్. 13.

బాలానందిని

అవ. పై పూర్వపక్షానికి సమాధానంగా పరిణామదృష్టాంతం చూపడం ద్వారా ఆపాతతః సిద్ధాంతం చెపుతున్నారు (రత్నప్రభ)–

ఇతీతి :- ఈ విధంగా ఎవరైనా ఆక్షేపిస్తే అతనికి సమాధానంగా 'స్యాల్లోకవత్' అని చెప్పాలి. మా పక్షంలో కూడ ఈ విభాగం ఉపపన్నమే. ఈ విధంగా లోకంలో కనబడుతున్నది కదా? అదెట్లనగా - ఉదకరూప మైన సముద్రంకంటె భిన్నం కాకపోయినా కూడ దాని వికారాలైన నురుగు, తరంగాలు, బుడగలు మొదలైనవాటికి పరస్పరవిభాగం, ఒక దానితో ఒకటి కలవడం మొదలైన వ్యవహారం కూడ కనబడుతున్నది. సముద్రవికారాలైన ఫేనతరంగాదులు ఉదకరూప పైన సముద్రంకంటె అభిన్నములే అయినా, ఇవి అవిగాను అవి ఇవిగాను అనడం లేదు కదా? వాటికి ఇతరేతరభావాపత్తి లేకపోయినా అవి సముద్రంకంటె అన్యము లైపోవడం లేదు కదా? అట్లే ఇక్కడ కూడ భోక్తృభోగ్యాలకి ఇతరేతరభావాపత్తి గాని, పరబ్రహ్మకంటె అన్యత్వం కాని కలగదు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతి ఎట్టి వికారాలు చెందని స్రష్టయే (బ్రహ్మయే) కార్యంలో ప్రవేశించి భోక్తగా ఉన్నాడు అని చెప్పడంవల్ల భోక్త బ్రహ్మయొక్క వికారం (కార్యం) కాకపోయినా, కార్యంలో ప్రవేశించిన బ్రహ్మకు, ఘటాద్యుపాధులను బట్టి ఆకాశానికి వలె, ఉపాధినిమిత్త మైన విభాగం ఉంటుంది. అందుచేత పరమకారణమైన బ్రహ్మకంటె అనన్యమే అయినా కూడ, సముద్ర తరంగాది న్యాయంచేత, భోక్తృభోగ్యరూపమైన విభాగం ఉండవచ్చు అని చెప్పి ఉన్నాం. 13.

భోక్త్రాపత్త్యధికరణం సమాప్తం

## 6. ఆరమ్భణాధికరణమ్. సూ.14-20

### సూ. తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః. 2.1.14.

అభ్యుపగమ్య చేమం వ్యావహారికం భోక్తృభోగ్యలక్షణం విభాగం స్యాల్లోకవదితి పరిహారోఽభిహితః, న త్వయం విభాగః పరమార్థతోఽస్తి, యస్మాత్తయోః కార్యకారణయోరనన్యత్వమవగమ్యతే. కార్యమాకాశాదికం

బహుప్రపఞ్చం జగత్, కారణం పరం బ్రహ్మ, తస్మాత్కారణాత్ పరమార్థతో నన్యత్వం వ్యతిరేకేణాభావః కార్యస్యావగమ్యతే. కుతః? ఆరమ్భణశబ్దాదిభ్యః. ఆరమ్భణశబ్దస్తావత్ - ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాయ దృష్టాన్తాపేక్షాయా ముచ్యతే - "యథా సోమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" (ఛా.ఉ.6.1.1) ఇతి. ఏతదుక్తం భవతి - ఏకేన మృత్పిణ్డేన పరమార్థతో మృదాత్మనా విజ్ఞాతేన సర్వం మృన్మయం ఘటశరా వోదఞ్చనాదికం మృదాత్మకత్వావిశేషాద్విజ్ఞాతం భవేత్, యతో వాచారమ్భణం వికారో నామధేయం వాచైవ కేవలమస్తీత్యారభ్యతే - వికారో ఘటః శరావ ఉదఞ్చనం చ ఇతి, న తు వస్తువృత్తేన వికారో నామ కశ్చిదస్తి నామధేయమాత్రం హ్యేతదనృతం మృత్తికేత్యేవ సత్యమితి. ఏష బ్రహ్మణో దృష్టాన్తః అమ్నాతః. తత్ర శ్రుతాద్వాచారమ్భణ శబ్దాత్ దార్ష్టాన్తికేఽపి బ్రహ్మవ్యతిరేకేణ కార్యస్యాభావ ఇతి గమ్యతే. పునశ్చ తేజో బన్నానాం బ్రహ్మకార్యతాముక్త్వా తేజోబన్న కార్యాణాం తేజోబన్నవ్యతిరేకేణాభావం బ్రవీతి - "అపాగాదగ్నేరగ్నిత్వం, వాచారమ్భణం వికారో నామధేయం త్రీణి రూపాణీత్యేవ సత్యమ్" (ఛా.ఉ. 6.4.1) ఇత్యాదినా. ఆరమ్భణ శబ్దాదిభ్య ఇత్యాదిశబ్దాత్ "ఐతదాత్మ్యమిదం సర్వం, తత్సత్యం, స ఆత్మా తత్త్వమసి" (ఛా.ఉ.6.7), "ఇదం సర్వం యదయమాత్మా" (బృ.ఉ.2.4.6), "బ్రహ్మైవేదం సర్వమ్" (ము.ఉ.2.2.11), "ఆత్మైవేదం సర్వమ్" (ఛా.ఉ. 7.25.2), "నేహ నానాస్తి కించన" (బృ.ఉ. 11.11.19) ఇత్యేవమాద్యస్యాత్మైకత్వప్రతిపాదనపరం వచన జాతముదాహర్తవ్యమ్. న చాన్యథా ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం సంపద్యతే. తస్మాద్యథా ఘటకరకాద్యాకాశానాం మహాకాదనన్యత్వం, యథా చ మృగతృష్ణికోదకాదీనా మూషరాదిభ్యోఽనన్యత్వం దృష్టనష్టస్వరూపత్వాత్స్వ రూపేణానుపాఖ్యత్వాత్, ఏవమస్య భోగ్యభోక్త్రాదిప్రపఞ్చ జాతస్య బ్రహ్మవ్యతిరేకేణాభావ ఇతి.

## బాలానందిని

అవ . వెనుకటి పూర్వపక్షానికి లోకప్రసిద్ధమైన భేదాభేదవాదాన్ని (సముద్రానికి దాని కార్యాలైన తరంగబుద్బుదాదులకీ భేదం, అభేదమూ కూడ ఉందనే వాదాన్ని) పురస్కరించుకొని వెనుకటి అధికరణంలో సమాధానం చెప్పబడింది. దీనివల్ల బ్రహ్మకు

జగుత్తకూ మధ్య భేదాభేదాలున్నాయనే భ్రాంతి కలుగుతుంది. దానిని తొలగించడానికి ఈ అధికరణంలో వివర్తవాదాన్ని పురస్కరించుకొని వాస్తవంలో వాటికి భేద మేమాత్రమూ కూడ లేదని ప్రతిపాదించ బడుచున్నది. పైన చెప్పిన సమాధానం కేవలం వ్యావహారిక దృష్టితో చెప్పినది. ఇది పారమార్థికదృష్టితో చెప్పిన సమాధానం. రజ్జువును సర్పంగా గాని, కఱ్ఱగా గాని, భూచ్ఛిద్రంగా (నేల నెరద) గాని గ్రహించినా కూడ రజ్జువుకు ఏ విధంగా ఎట్టి భేదమూ ఉండదో అట్లే అసత్యమైన ద్వైతప్రపంచాన్ని ఆరోపించినా కూడ బ్రహ్మకు ఏ వికారమూ ఉండదు. అందుచేత అద్వైతసమన్వయానికి ఏ విరోధమూ లేదు.

**తదితి** :- "ఆరమ్భణ శబ్దాదిభ్యః = "వాచారమ్భణమ్" ఇత్యాదిశబ్దాలవల్ల, తదనన్యత్వమ్ = కార్యకారణాలకు భేదం లేదు" అని సూత్రార్థం.

**అభ్యుపగమ్యేతి** :- వ్యావహారికమైన, భోక్త, భోగ్యం అనే ఈ విభాగాన్ని అంగీకరించి 'స్యాల్లోకవత్' అని పరిహారం చెప్పబడింది. వాస్తవంలో వీటికి ఈ విభాగం లేదు. ఎందువల్ల ననగా కార్యకారణాలు అభిన్నమైన వని తెలుస్తున్నది. ఆకాశం మొదలైన అనేక విధాలైన విస్తారం గల జగత్తు వేద్యం. పరబ్రహ్మ కారణం. కార్యానికి ఆ కారణంకంటె వాస్తవంలో అనన్యత్వం, అనగా కారణం కంటె భిన్నంగా లేకపోవడం తెలుస్తూన్నది. దేనివల్ల? ఆరంభణశబ్దాదులవల్ల. ఆరంభణశబ్దం ఏదనగా - ఏకవిజ్ఞానంచేత సర్వవిజ్ఞానాన్ని ప్రతిజ్ఞ చేసి దీనికి దృష్టాంతం ఏది అన్నప్పుడు - "యథా... సత్యమ్" అని చెప్పబడింది. ఇది చెప్పినట్ల వుతుంది. వాస్తవంలో మృత్స్వరూపమైన ఒక మృత్పిండం (మట్టి ముద్ద) తెలుసుకొనడంచేత మట్టితో చేసిన ఘటం, శరావం, ఉదంచనం (చేద) మొదలైనవి అన్నీ, మట్టితోనే చేయబడడం చేత, తెలియబడతాయి. ఇందుకు కారణం ఏమనగా - "వాచారమ్భణం వికారో నామధేయమ్" - ఘటం, శరావం, ఉదంచనం అని వికారం (కార్యం) మాట మాత్రం చేతనే అది ఉన్న దని చెప్పబడుతూన్నది. వాస్తవంలో వికారం అంటూ ఏదీ లేదు. ఇది కేవలం పేరు మాత్రమే. అసత్యం. సత్యమైనది మృత్తిక మాత్రమే - అని ఇది బ్రహ్మకు దృష్టాంతంగా చూపబడింది. అక్కడ వినబడుతూన్న "వాచారమ్భణ" శబ్దం వల్ల దార్ష్టాంతికంలో కూడ బ్రహ్మకంటె వ్యతిరిక్తంగా కార్యసముదాయం ఏదీ లేదని తెలుస్తూన్నది. మళ్లీ తేజోబన్నాలు బ్రహ్మయొక్క కార్యం అని చెప్పి తేజోబన్నా లనే కార్యాలు తేజోబన్నాలకంటె వేరుగా లేవని "అపాగాత్... సత్యమ్" అనే వాక్యంలో చెపుతున్నాడు.

వి. తేజస్సు, ఉదకం, భూమి ఇవి బ్రహ్మనుండి పుట్టాయి. తన్మాత్రరూపంలో ఉన్న ఈ మూడింటినీ, ఒక్కొక్క దానిలో మిగిలిన రెండింటి భాగాలు కలపడంచేత,

మూడు భూతాల కలయికగా చేయడం (త్రివృత్కరణం) జరిగింది. ఆ సందర్భంలో ఉన్న వాక్యం ఇది - "యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపమ్. యచ్ఛుక్లంతదపామ్, యత్కృష్ణమ్ తదన్నస్యాపాగాదగ్నేరగ్నిత్వం... వాచారమ్భణ... సత్యమ్". అగ్నిలో ఉన్న ఎఱ్ఱని రూపం త్రివృత్కృతం కాని తేజస్సుది, తెల్లని రూపం త్రివృత్కృతం కాని ఉదకానిది, నల్లని రూపం త్రివృత్కృతం కాని పృథ్విది. ఈ విధంగా అగ్నిలో ఉన్న మూడు రూపాలూ విడతీసి వేస్తే ఇంక అగ్ని అంటూ ఏమీగలదు. రూపతన్మాత్రల కలయికయే అగ్ని. ఈ విధంగా కారణంకంటె వేరుగా కార్యం లేదనీ, కేవలం ఇది నామమాత్రమే అనీ, నిజమైనది కారణమే అనీ భావం. ఈ విధంగా కార్యా లన్నింటినీ విడదీసుకొంటూ పోతే మిగిలే బ్రహ్మయే సత్యం, మిగిలిన వన్నీ కాల్పనికాలు.

"ఆరమ్భణశబ్దాదిభ్యః" లోని 'ఆది' శబ్దంచేత, ఆత్మైకత్వాన్ని ప్రతిపాదించే - "ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం, స ఆత్మా, తత్త్వమసి" "ఇదం సర్వం యదయ మాత్మా", "బ్రహ్మైవేదం సర్వమ్", "ఆత్మైవేదం సర్వమ్", "నేహ నానాస్తి కించన" ఇత్యాది శ్రుతి వాక్యసముదాయం కూడ ఉదాహరించాలి. అట్లు కాకపోతే (ఆత్మైకత్వం లేకపోతే) ఒకదానిని తెలుసుకోవడంచేత అన్నీ తెలుసుకోవడం కుదరదు కదా? అందువల్ల ఘటకరకాద్యాకాశాలు ఏ విధంగా మహాకాశంకంటె అనన్యమైనవో, కనబడి వెంటనే నష్టమైన స్వరూపం కలవవడం చేత, ఇవి ఈ విధంగా ఉన్నాయి అని వాటి స్వరూపాన్ని గూర్చి చెప్పడం శక్యం కాకపోవడం చేతా ఎండమావులలోని నీళ్లు మొదలైనవి ఊషరాదులకంటె (ఊషరం అనగా చవిటి పఱ్ఱ) అనన్యమైనవో అట్లే ఈ భోగ్యభోక్త్రాది ప్రపంచసముదాయం కూడ బ్రహ్మకంటె భిన్నంగా లేదు.

## భాష్యమ్

నన్వనేకాత్మకం బ్రహ్మ, యథా వృక్షోఽనేకశాఖ ఏవమనేకశక్తిప్రవృత్తి యుక్తం బ్రహ్మ. అత ఏకత్వం నానాత్వమపి చోభయమపి సత్యమేవ, యథా వృక్ష ఇత్యేకత్వం శాఖా ఇతి నానాత్వమ్. యథా చ మృదాత్మనా ఏకత్వం ఘటశరావాద్యాత్మనా నానాత్వమ్. తత్రైకత్వాంశేన జ్ఞానాన్మోక్షవ్యవహారః సేత్స్యతి. నానాత్వాంశేన తు కర్మకాణ్డాశ్రయౌ లౌకికవైదికవ్యవహారౌ సేత్స్యతః ఇతి. ఏవఞ్చ మృదాదిదృష్టాన్తా అనురూపా భవిష్యన్తీతి. నైవం స్యాత్, "మృత్తి కేత్యేవ సత్యమ్" ఇతి ప్రకృతిమాత్రస్య దృష్టాన్తే సత్యత్వావధారణాత్. వాచారమ్భణశబ్దేన చ వికారజాతస్యానృతత్వాభిధానాత్. దార్ష్టాన్తికేఽపి

"ఐతదాత్మ్యమిదం సర్వమ్ తత్సత్యమ్" ఇతి చ పరమకారణస్యైవైకస్య సత్యత్వావధారణాత్. "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" ఇతి చ శారీరస్య బ్రహ్మభావోపదేశాత్. స్వయం ప్రసిద్ధం హ్యేతచ్ఛారీరస్య బ్రహ్మాత్మత్వము పదిశ్యతే, న యత్నాన్తర ప్రసాధ్యమ్. అతశ్చేదం శాస్త్రీయం బ్రహ్మాత్మత్వమవ గమ్యమానం స్వాభావికస్య శారీరాత్మత్వస్య బాధకం సంపద్యతే, రజ్జ్వాది బుద్ధయ ఇవ సర్పాదిబుద్ధీనామ్. బాధితే చ శారీరాత్మత్వే తదాశ్రయః సమస్తః స్వాభావికో వ్యవహారః బాధితో భవతి. యత్ప్రసిద్ధయే నానాత్వాంశోఽపరో బ్రహ్మణః కల్ప్యేత, దర్శయతి చ - "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.4.5.15) ఇత్యాదినా బ్రహ్మాత్మదర్శినం ప్రతి సమస్తస్య క్రియాకారకఫలలక్షణస్య వ్యవహారస్యాభావమ్.

బాలానందిని

అవ. తమ మత మైన శుద్ధాద్వైతమతాన్ని చెప్పి ఇప్పుడు భేదాభేదమతాన్ని ప్రతిపాదిస్తూ చేసే పూర్వపక్షం అనుసరిస్తున్నారు - నన్వితి. బ్రహ్మ అనేకాత్మక మైనది. వృక్షంలో అనేకశాఖ లున్నట్లు బ్రహ్మయందు కూడ అనేకశక్తులు అనేకప్రవృత్తులు ఉన్నాయి. అందువల్ల ఏకత్వం, నానాత్వం ఉభయమూ సత్యమే. 'వృక్షః' అంటే ఏకత్వం అయింది. 'శాఖాః' అంటే నానాత్వం అయింది. సముద్రం అంటే ఏకత్వం అయింది, ఫేనతరంగాలరూపంలో నానాత్వం ఏర్పడింది. మట్టిగా ఏకత్వం, ఘటశరావాదిరూపంలో నానాత్వం. (ఈ ఉదాహరణలలో ఎట్లో బ్రహ్మ విషయంలో కూడ అట్లే). అలా ఉండగా ఏకత్వాంశాన్ని పట్టి జ్ఞానం మోక్షం అనే వ్యవహారం సిద్ధిస్తుంది. నానాత్వాంశాన్ని పట్టి కర్మకాండకు సంబంధించిన లౌకికవైదికవ్యవహారాలు సిద్ధిస్తాయి. ఇలా చెపితే మృదాదిదృష్టాంతాలు అనురూపంగా ఉంటాయి. (సమాధానం) - ఇలా కుదరదు. ఎందు వల్లననగా "మృత్తికేత్యేవ సత్యమ్" అని దృష్టాంతంలో ప్రకృతి మాత్రమే సత్యం అని నిర్ధారణ చేయబడింది. 'వాచారమ్భణ' శబ్దంచేత కార్యసముదాయం అంతా అసత్యం అని చెప్పబడింది. దార్ష్టాంతికంలో (బ్రహ్మవిషయంలో) కూడ "ఐతదాత్మ్యమిదం సర్వమ్, తత్సత్యమ్" అని పరమకారణం ఒక్కటే సత్యమని నిర్ధారణ చేయబడింది. "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అని జీవునకు బ్రహ్మత్వం ఉపదేశించబడింది. జీవునికి స్వతః సిద్ధంగా ఉన్న బ్రహ్మాత్మత్వమే ఉపదేశించబడుతూన్నది గాని ఏదో మరొక ప్రయత్నం చేత సాధ్యమైన బ్రహ్మాత్మత్వం

ఉపదేశించ బడడం లేదు. అందుచేత, రజ్జ్వాదిబుద్ధులు (ఇది తాడు అనే జ్ఞానం వంటివి) సర్పాదిబుద్ధులను బాధించినట్లు శాస్త్రబోధితమైన ఈ బ్రహ్మాత్మత్వం తెలియబడినదై స్వాభావికమైన (అవిద్యచేత అనాదిగా వస్తూన్న) జీవత్వాన్ని బాధిస్తుంది. శారీరాత్మత్వం (జీవాత్మత్వం) బాధించబడగానే, ఏ వ్యవహారాన్ని సాధించడం కోసం నువ్వు బ్రహ్మలో మరొక నానాత్వాంశాన్ని కల్పించాలను కుంటున్నావో, ఆ జీవభావాన్ని పట్టి ఏర్పడిన స్వాభావికమైన (అవిద్యాకృతమైన) సమస్త వ్యవహారమూ కూడ బాధించ బడిపోతుంది. "యత్ర.. పశ్యేత్" ఇత్యాది వాక్యాలచేత బ్రహ్మాత్మదర్శికి క్రియాకారక - ఫల రూపమైన సమస్తవ్యవహారమూ ఉండదు అని చూపుతున్నాడు.

## భాష్యమ్

న చాయం వ్యవహారాభావోఽవస్థావిశేషనిబద్ధోఽభిధీయత ఇతి యుక్తం వక్తుమ్, 'తత్త్వమసి' ఇతి బ్రహ్మాత్మభావస్య అనవస్థావిశేషనిబన్ధనత్వాత్. తస్కరదృష్టాన్తేన చానృతాభిసంధస్య బన్ధనం సత్యాభిసంధస్య చ మోక్షం దర్శయన్నేకత్వమేవైకం పారమార్థికం దర్శయతి (ఛా.ఉ.6.16), మిథ్యాజ్ఞాన విజృమ్భితం చ నానాత్వమ్. ఉభయసత్యతాయాం హి కథం వ్యవహార గోచరోఽపి జన్తురనృతాభిసంధ ఇత్యుచ్యతే? "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (బృ.ఉ.4.4.19) ఇతి చ భేదదృష్టిమపవదన్నేతదేవ దర్శయతి. న చాస్మిన్ దర్శనే జ్ఞానాన్మోక్ష ఇత్యుపపద్యతే, సమ్యగ్జ్ఞానా పనోద్యస్య కస్య చిన్మిథ్యాజ్ఞానస్య సంసారకారణత్వేనానభ్యుపగమాత్. ఉభయసత్యతాయాం హి కథమేకత్వజ్ఞానేన నానాత్వజ్ఞానమపనుద్యత ఇత్యుచ్యతే?

## బాలానందిని

న చేతి :- అవస్థావిశేషాన్ని పట్టి ఈ వ్యవహారాభావం చెప్పబడుతున్నది అనడానికి వీలు లేదు. (అనగా ప్రమాతృత్వం మొదలైన వ్యవహారం సంసారావస్థలో మాత్రమే ఉంటుంది, మోక్షావస్థలో ఉండదు అని చెప్పబడుతున్నది అనడం యుక్తం కాదు అని అర్థం). ఎందువల్ల ననగా 'తత్త్వమసి' అని బోధించబడిన బ్రహ్మాత్మభావం అవస్థావిశేషాన్ని పట్టి ఏర్పడుతుంది అని చెప్పలేదు. (అనగా "నువ్వు ఇప్పుడు బ్రహ్మగా ఉన్నావు" అని చెప్పబడింది గాని ఎప్పుడో మరణానంతరం బ్రహ్మవు అవుతావు అని చెప్పబడలేదు. అందుచేత బ్రహ్మాత్మభావం మూడుకాలాలలోను ఉంది. నిత్యసిద్ధం

అని అర్థం). దొంగ యొక్క దృష్టాంతంచేత అసత్యం పలికిన వానికి బంధనము, సత్యం పలికిన వానికి మోక్షం (విడుదల) కలుగుతుంది అని చూపుతూ ఒక్క ఏకత్వమే పారమార్థికం, నానాత్వం అజ్ఞానకృతం అని చూపుతున్నది.

వి. దొంగతనం చేశాడని బంధింపబడిన పురుషుడు దివ్యపరీక్షలో బాగా ఎఱ్ఱగా కాల్చిన ఇనుపగొడ్డలిని స్పృశించినా కూడ నిజం చెపితే వానికి కాలదు. అసత్యం చెపితే కాలుతుంది. దీనిని దృష్టాంతంగా చూపి సత్యమైన బ్రహ్మైకత్వాన్ని గుర్తించినవాడు బద్ధుడు కాడు, అసత్యమైన భేదాన్ని చూచేవాడు బద్ధుడౌతాడు అని ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది. దీనిని పట్టి ఏకత్వమే పారమార్థికం అనీ అనేకత్వం అసత్యం అనీ తెలుస్తూన్నది.

**ఉభయేతి** :- రెండూ కూడ (భేదాభేదాలు రెండూ కూడ) సత్యమైన పక్షంలో లోక వ్యవహారలగ్నుడైన వాడు అసత్యాభి సంధు డని ఎలా చెప్పబడుతుంది? "మృత్యోః... పశ్యతి" అని భేదదృష్టిని నిరాకరించి ఈ విషయాన్నే (అభేదమే సత్యమని) చూపుతున్నాడు. మరొక విషయం మేమనగా - ఈ దర్శనంలో (భేదాభేదమతంలో) జ్ఞానంవల్ల మోక్షం కలుగుతుంది అనేది కుదరదు. ఎందుచేత ననగా సమ్యగ్జ్ఞానం చేత తొలగింపతగిన సంసారకారణ మైన మిథ్యాజ్ఞానాన్ని వీరు అంగీకరించలేదు. భేదమూ అభేదమూ కూడ సత్యమే అయినప్పుడు ఏకత్వజ్ఞానం నానాత్వజ్ఞానాన్ని తొలగిస్తుందని చెప్పడం ఎలా కుదురుతుంది.

## భాష్యమ్

నన్వేకత్వైకాన్త్యాభ్యుపగమే నానాత్వాభావాత్ప్రత్యక్షాదీని లౌకికాని ప్రమాణాని వ్యాహన్యేరన్, నిర్విషయత్వాత్, స్థాణ్వాదిష్వవ పురుషాది విజ్ఞానాని. తథా విధిప్రతిషేధశాస్త్రమపి భేదాపేక్షత్వాత్తదభావే వ్యాహన్యేత. మోక్షశాస్త్రస్యాపి శిష్యశాసిత్రాదిభేదాపేక్షత్వాత్తదభావే వ్యాఘాతః స్యాత్. కథం చానృతేన మోక్షశాస్త్రేణ ప్రతిపాదితస్యాత్మైకత్వస్య సత్యత్వముపపద్యేతేతి. అత్రోచ్యతే - నైష దోషః. సర్వవ్యవహారాణామేవ ప్రాగ్ బ్రహ్మాత్మతావిజ్ఞానాత్ సత్యత్వోపపత్తేః, స్వప్నవ్యవహారస్యేవ ప్రాక్ ప్రబోధాత్. యావద్ధి న సత్యాత్మై కత్వప్రతిపత్తిస్తావత్ ప్రమాణప్రమేయఫలలక్షణేషు వికారేష్వనృతత్వబుద్ధిర్న కస్య చిదుత్పద్యతే. వికారానేవ త్వహం మమేత్యవిద్యయాత్మాత్మీయేన భావేన సర్వో జన్తుః ప్రతిపద్యతే స్వాభావికీం బ్రహ్మాత్మతాం హిత్వా. తస్మాత్ప్రా

గ్బహ్మాత్మతాప్రతిబోధాదుపపన్నః సర్వో లౌకికో వైదికశ్చ వ్యవహారః, యథా సుప్తస్య ప్రాకృతస్య జనస్య స్వప్నే ఉచ్చావచాన్ భావాన్ పశ్యతః నిశ్చితమేవ ప్రత్యక్షాభిమతం విజ్ఞానం భవతి ప్రాక్ప్రబోధాత్, న చ ప్రత్యక్షాభాస ప్రత్యయస్తత్కాలే భవతి తద్వత్.

## బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) - కేవలం ఏకత్వాన్ని మాత్రమే అంగీకరిస్తే భేదం లేకపోవడం వల్ల ప్రత్యక్షాదులైన లౌకికప్రమాణాలన్నీ, వాటికి వేరు వేరు విషయాలు లేకపోవడంచేత, స్థాణ్వాదుల విషయంలో పురుషాదిజ్ఞానాల వలె (అనగా స్థాణ్వాదులను పురుషాదులనుగా గ్రహిస్తే ఆ జ్ఞానాలు ఏ విధంగా వ్యాహతా లైపోతాయో ఆ విధంగా) వ్యాహతా లవుతాయి, అనగా అడ్డుకొనబడినవై నిప్ప్రయోజనా లవుతాయి. విధిశాస్త్రమూ, ప్రతిషేధశాస్త్రమూ కూడ భేదం మీదనే ఆధారపడి ఉంటాయి కాబట్టి అది (భేదం) లేకపోతే వ్యాహతం అవుతాయి. మోక్షశాస్త్రం కూడ శిష్యుడు, శాసించే వాడు (ఆచార్యుడు) ఇత్యాది భేదాన్ని అపేక్షిస్తుంది గాన ఆ భేదం లేకపోతే అది కూడ వ్యాహతం అవుతుంది. మరొక విషయమే మనగా - అసత్యమైన మోక్షశాస్త్రంచేత ప్రతిపాదించబడిన ఆత్మైకత్వం సత్యం ఎలా అవుతుంది? (సమాధానం) - ఇక్కడ చెప్పబడుచున్నది. ఈ దోషం లేదు. సమస్తవ్యవహారాలూ కూడ బ్రహ్మాత్మతాజ్ఞానానికి పూర్వం, మెలకువ రావడానికి పూర్వం స్వప్నవ్యవహారం వలె, సత్యం అవడం ఉపపన్నమే. సత్యమైన ఆత్మైకత్వజ్ఞానం కలగనంతవరకు, ఎవనికీ కూడ ప్రమాణప్రమేయఫలస్వరూపాలైన వికారాల విషయంలో అసత్యత్వబుద్ధి కలగదు. ఎందువల్ల ననగా ప్రతీ ప్రాణీ కూడ తన సహజమైన బ్రహ్మాత్మత్వాన్ని విడచి వికారాలనే (కార్యాలనే) అవిద్యచేత, నేను, నాది అనే భావంతో తాను, తనది అనే భావంతో చూస్తూంటాడు. అందువల్ల బ్రహ్మాత్మతాజ్ఞానానికి ముందు లౌకికమూ వైదికమూ అయిన సమస్తవ్యవహారమూ కూడ కుదురుతుంది. నిద్రిస్తూన్న సామాన్యమానవుడు స్వప్నంలో అనేకవిధాలైన వస్తువులను చూస్తూన్నంత సేపూ, మేల్కొనడానికి ముందు ప్రత్యక్షం అని చెప్పబడే జ్ఞానం నిశ్చితంగానే ఎలా ఉంటుందో ఆ సమయంలో వానికి (ఇది ప్రత్యక్షం కాదు) ప్రత్యక్షాభాసం అనే బుద్ధి ఎట్లు కలగదో ఇది కూడ అట్లే.

## భాష్యమ్

కథం త్వసత్యేన వేదాన్తవాక్యేన సత్యస్య బ్రహ్మాత్మత్వస్య ప్రతిపత్తి రుపపద్యేత, న హి రజ్జుసర్పేణ దష్టో మ్రియతే, నాపి మృగతృష్ణికామ్భసా

ష్నానావగాహనాదిప్రయోజనం క్రియత ఇతి. నైష దోషః. శఙ్కావిషాదినిమిత్త మరణాదికార్యోపలబ్ధేః. స్వప్నదర్శనావస్థస్య చ సర్పదంశనోదకస్నానాది కార్యదర్శనాత్. తత్కార్యమప్యనృతమేవేతి చేద్బ్రూయాత్, అత్ర బ్రూమః. యద్యపి స్వప్నదర్శనావస్థస్య సర్పదంశనోదకస్నానాది కార్యమనృతం తథాపి తదవగతిః సత్యమేవ ఫలమ్, ప్రతిబుద్ధస్యాప్యబాధ్యమానత్వాత్. న హి స్వప్నాదుత్థితః స్వప్నదృష్టం సర్పదందశనోదకస్నానాదికార్యం మిథ్యేతి మన్యమానః తదవగతిమపి మిథ్యేతి మన్యతే కశ్చిత్. ఏతేన స్వప్నదృశోఽవగత్యబాధనేన దేహమాత్రాత్మవాదో దూషితో వేదితవ్యః. తథా చ శ్రుతిః-

"యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి
సమృద్ధిం తత్ర జానీయా త్తస్మిన్ స్వప్న నిదర్శనే" (ఛా.ఉ. 5.2.9)

ఇత్యసత్యేన స్వప్నదర్శనేన సత్యాయాః సమృద్ధేః ప్రతిపత్తిం దర్శయతి. తథా ప్రత్యక్షదర్శనేషు కేషు చిదరిష్టేషు జాతేషు "న చిరమివ జీవిష్యతీతి విద్యాత్" ఇత్యుక్త్వా, "అథ స్వప్నాః - పురుషం కృష్ణం కృష్ణదన్తం పశ్యతి స ఏనం హన్తి" (ఐ.ఆ. 3.2.4) ఇత్యాదినా తేన అసత్యేనైవ స్వప్నదర్శనేన సత్యం మరణం సూచ్యత ఇతి దర్శయతి. ప్రసిద్ధం చేదం లోకేఽన్వయవ్యతిరేక కుశలానామీదృశేన స్వప్నదర్శనేన సాధ్వాగమః సూచ్యతే ఈదృశేన అసాధ్వాగమ ఇతి. తథాఽకారాదిసత్యాక్షరప్రతిపత్తిర్దృష్టా రేఖానృతాక్షర ప్రతిపత్తేః

## బాలానందిని

కథమితి :- (ప్రశ్న) అసత్యమైన వేదాంతవాక్యంచేత సత్యమైన బ్రహ్మాత్మత్వం యొక్క జ్ఞానం ఎలా కలుగుతుంది? రజ్జుసర్పం కరచినవాడు మరణించడం లేదు కదా? ఎండమావులలోని నీళ్లతో త్రాగడం, స్నానం చేయడం మొదలైన ప్రయోజనం చేయబడడం లేదు కదా? (సమాధానం) ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా సర్పం కరకవకపోయినా శంకా విషాదుల (విషం ఉందేమో అనే శంక మొదలైనవాటి) కారణంగా మరణాదికార్యం కనబడుతున్నది. స్వప్నదర్శనావస్థలో ఉన్నవానికి (స్వప్నం చూస్తున్నవానికి) సర్పం కరిచి నట్లు నీళ్ల స్నానం చేసినట్లు ఈ విధమైన కార్యాలు

కనబడుతున్నాయి. ఆ కార్యం కూడ అసత్యమే అన్నట్లయితే - ఇక్కడ చెపుతున్నాం - స్వప్న దర్శనావస్థలో ఉన్నవానికి సర్పదంశనోదకస్నానాదికార్యం అసత్యమే అయినా దాని జ్ఞానం సత్యమైన ఫలమే. మేల్కొన్న తరవాత కూడ (ఆ జ్ఞానం) బాధించబడడం లేదు. స్వప్నంనుండి లేచినవాడు స్వప్నంలో చూచిన సర్పదంశనోదకస్నానాదికార్యం అసత్య మని అనుకొన్నా దాని జ్ఞానం కూడ (తనకు సర్పదంశోదక స్నానాదుల జ్ఞానం కలిగింది అనే విషయం కూడ) అసత్యమే అని అనుకొనడం లేదు కదా? ఈ విధంగా స్వప్నం చూచినవాని జ్ఞానం బాధించ బడకపోవడంచేత దేహాత్మవాదం దూషించబడినదిగా తెలియదగినది.

వి. స్వప్నంలో ఒకడు సర్పదంశనోదకస్నానాదులు చూస్తున్నాడు. ఆ సమయంలో వాని దేహం నిశ్చేష్టంగా శయ్యమీద ఉంది. మేల్కొన్న తరవాత కూడ తనకు ఆ జ్ఞానం కలిగిన దని స్మరిస్తున్నాడు. దీనిని పట్టి స్వప్నంలో అలా గ్రహించినది దేహం కాదనీ, దేహం కంటె భిన్నమైనదేదో గ్రహించిన దనీ తెలుస్తూన్నది. దీనిని పట్టి దేహమే ఆత్మ అనే వాదం యుక్తం కాదని తెలుస్తున్నది. ఇది ఇక్కడ ప్రసంగవశంచేత చెప్పిన విషయం.

**తథాచేతి** :- "యదా... నిదర్శనే" (కామ్యకర్మలు చేసే టప్పుడు స్వప్నంలో స్త్రీని చూచినట్లయితే, అలాంటి స్వప్నం కనబడినప్పుడు ఆ కర్మలో సమృద్ధి కలుగుతుంది అని తెలుసుకొన వలెను) అను శ్రుతి వాక్యం అసత్యమైన స్వప్నదర్శనం చేత సత్యమైన సమృద్ధియొక్క జ్ఞానాన్ని చూపుచున్నది. అట్లే ప్రత్యక్షంగా కనబడే కొన్ని అరిష్టాలు కలిగినప్పుడు "చిరకాలం జీవించడు అని గ్రహించాలి" అని చెప్పి "అథ .... హన్తి" (ఇక స్వప్నాలు - నల్లటి దంతా లున్న నల్లని పురుషుణ్ణి చూస్తే అతడే వానిని చంపివేస్తాడు) ఇత్యాదికంచేత ఆ అసత్యమైన స్వప్నదర్శనంచేత సత్యమైన మరణం సూచింపబడుతుంది అని చూపుచున్నది. ఇలాంటి స్వప్నంచేత శుభం కలుగుతుంది. ఇలాంటిదానిచేత చెడు కలగ బోతుం దని సూచింపబడుతుంది అని, అన్వయ వ్యతిరేకాలలో నేర్పు గలవారికి లోకంలో ప్రసిద్ధమే. అట్లే రేఖారూపమైన అసత్యమైన అక్షరంయొక్క జ్ఞానంవల్ల సత్యమైన అకారాద్యక్షరాల జ్ఞానం కూడ చూడబడుతున్నది.

## భాష్యమ్

అపి చాన్త్యమిదం ప్రమాణమాత్మైకత్వస్య ప్రతిపాదకం నాతః పరం కించిదాకాఙ్క్ష్యమస్తి. యథా హి లోకే యజేతేత్యుక్తే కిమ్ః కేన, కథమ్

ఇత్యాకాఙ్క్ష్యతే నైవం 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' ఇత్యుక్తే కిం చిదన్య దాకాఙ్క్ష్యమస్తి, సర్వాత్మైకత్వవిషయత్వావగతేః. సతి హ్యన్యస్మిన్నవశిష్య మాణ అర్థే ఆకాఙ్క్షా స్యాత్. న త్వాత్మైకత్వవ్యతిరేకేణావశిష్యమాణోఽన్యో ర్థోఽస్తి య ఆకాఙ్క్ష్యేత. న చేయమవగతిర్నోత్పద్యత ఇతి శక్యం వక్తుమ్, "తద్ధాస్య విజజ్ఞౌ" (ఛాం. ఉ. 6.16.3) ఇత్యాదిశ్రుతిభ్యః. అవగతి సాధనా నాం చ శ్రవణాదీనాం వేదానువచనాదీనాం చ విధానాత్. న చేయమవ గతిరనర్థికా భ్రాన్తిర్వేతి శక్యం వక్తుమ్, అవిద్యానివృత్తిఫలదర్శనాత్; బాధకజ్ఞా నాన్తరాభావాచ్చ. ప్రాక్చాత్మైకత్వావగతేః అవ్యాహతః సర్వః సత్యానృత వ్యవహారః లౌకికో వైదిక శ్చేత్యవోచామ. తస్మాదన్త్యేన ప్రమాణేన ప్రతిపాదితే ఆత్మైకత్వే సమస్తస్య ప్రాచీనస్య భేదవ్యవహారస్య బాధితత్వాన్నానేకాత్మక బ్రహ్మకల్పనావకాశోఽస్తి.

బాలానందిని

అవ. లోకంలో ఏకత్వవ్యవహారం, నానాత్వవ్యవహారం రెండూ ఉన్నాయి గాన రెండూ సత్యాలే అని చెప్పడం యుక్తం కాదు. రెండు వ్యవహారాలూ ఒకే సమయంలో ఉంటే అలా చెప్పవచ్చు నేమో కాని రెండు వ్యవహారాలూ ఒకే సమయంలో ఉండవు. భేదవ్యవహారం ఉన్నప్పుడు అభేదవ్యవహారం ఉండదు. అభేదవ్యవహారం ఎప్పుడో చివర కలిగేది. అది ఒకమారు ఏర్పడిందా భేదవ్యవహారానికి అవకాశమే ఉండదు. అందుచేత భేదవ్యవహారం వ్యావహారికం, అభేదవ్యవహారం పారమార్థికం అని చెపుతున్నారు—

**అపి చేతి** :- మరొక విషయమేమనగా - ఆత్మైకత్వాన్ని ప్రతిపాదించే ఈ ప్రమాణం చిట్టచివరిది. దీని తరవాత ఆంకాంక్షించ దగినది మరేదీ లేదు. లోకంలో 'యజేత' అనగానే దేనిని, దేనిచేత, ఎట్లు అని ఏ విధంగా ఆకాంక్ష చేయబడుతుందో ఆ విధంగా 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి' అని చెప్పగానే ఆకాంక్షించ వలసినది మరొకటి ఏదీ లేదు. ఎందువల్ల ననగా పై వాక్యాలవల్ల కలిగిన ఈ బోధ సర్వాత్మైకత్వానికి సంబంధించినది అని తెలుస్తూన్నది. ఏదైన అర్థం ఇంకా మిగిలితే ఆకాంక్ష కలుగుతుంది. ఆత్మైకత్వంకంటె భిన్నంగా మరొక అర్థం ఏదీ, ఆకాంక్షించడానికి, మిగలడం లేదు కదా? ఈ జ్ఞానం కలగదు అని చెప్పడం శక్యం కాదు. "తద్ధాస్య విజజ్ఞౌ" ఇత్యాదిశ్రుతులు ఈ జ్ఞానం కలుగుతుందని చెపుతున్నాయి కదా. "తండ్రి

ఉపదేశం విన్న శ్వేతకేతువు ఆత్మతత్వాన్ని తెలుసుకొన్నాడు" అని పై వాక్యానికి అర్థం). అవగతికి సాధనాలైన శ్రవణాదులు, వేదానువచనం మొదలైనవి (వేదాధ్యయనాధ్యాపనాదులు) విధింపబడి ఉన్నాయి కదా? ఈ అవగతి అనర్థక మైనదని కాని భ్రాంతి అని కాని చెప్పడానికి శక్యం కాదు; ఎందువల్ల ననగా అవిద్యానివృత్తి అనే ఫలం కనబడుతున్నది, ఈ జ్ఞానాన్ని బాధించే మరొక జ్ఞానం ఏదీ కూడ కనబడడం లేదు. ఆత్మైకత్వావగతికి పూర్వం లౌకికమూ, వైదికమూ అయిన సమస్తమైన సత్య - అసత్య వ్యవహారానికి ఏ విధమైన అడ్డూలేదని చెప్పి ఉన్నాం. అందువల్ల అంత్యప్రమాణమైన అద్వైతవేదాంతవాక్యంచేత ఆత్మైకత్వం ప్రతిపాదించబడిన తరవాత అంతకు పూర్వం ఉన్న భేదవ్యవహారం అంతా బాధిత మవుతుంది గాన బ్రహ్మ అనేక రూపాలలో ఉంటుంది అని కల్పించడానికి అవకాశం లేదు.

## భాష్యమ్

ననుమృదాదిదృష్టాన్తప్రణయనాత్పరిణామవద్బ్రహ్మ శాస్త్రస్యాభిమత మితి గమ్యతే. పరిణామినో హి మృదాదయః అర్థా లోకే సమధిగతా ఇతి. నేత్యుచ్యతే. "స ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృ.ఉ. 4.4.25) "స ఏష నేతి నేత్యాత్మా" (బృ.ఉ.3.9.16), "అస్థూలమనణు" (బృ.ఉ.3.8.8) ఇత్యాద్యాభ్య సర్వవిక్రియాప్రతిషేధశ్రుతిభ్యః బ్రహ్మణః కూటస్థత్వావగమాత్. న హ్యేకస్య బ్రహ్మణః పరిణామధర్మత్వం తద్రహితత్వం చ శక్యం ప్రతిపత్తుమ్. స్థితిగతివత్స్యాదితి చేత్, న. కూటస్థస్యేతి విశేషణాత్. న హి కూటస్థస్య బ్రహ్మణః స్థితిగతివదనేకధర్మాశ్రయత్వం సంభవతి. కూటస్థం చ నిత్యం బ్రహ్మ సర్వవిక్రియాప్రతిషేధాదిత్యవోచామ. న చ యథా బ్రహ్మణ ఆత్మైకత్వదర్శనం మోక్షసాధనమేవం జగదాకారపరిణామిత్వదర్శనమపి స్వతన్త్రమేవ కస్మైచిత్ఫలాయాభిప్రేయేత, ప్రమాణాభావాత్. కూటస్థబ్రహ్మాత్మత్వజ్ఞానాదేవ హి ఫలం దర్శయతి శాస్త్రమ్ "స ఏష నేతి నేత్యాత్మా" ఇత్యుపక్రమ్య "అభయం వై జనక ప్రాప్తోఽసి" (బృ.ఉ.4.2.4) ఇత్యేవంజాతీయకమ్.

## బాలానందిని

(ప్రశ్న) మృదాదులను దృష్టాంతంగా చూపడం వల్ల బ్రహ్మకు పరిణామం ఉంటుందనే శాస్త్రాభిమతం అన్నట్లు తెలుస్తూన్నది కదా? లోకంలో పదార్థాలన్నీ పరిణామం కలవిగానే కనబడుతున్నాయి కదా? (సమాధానం) - కాదు అని అంటాం. "స... బ్రహ్మ", "స... ఆత్మా", "అస్థూలమనణు", మొదలైన, బ్రహ్మకు ఏ విధమైన వికారాలు లేవు అని నిషేధించే శ్రుతులవల్ల బ్రహ్మ కూటస్థం అని తెలియ బడుచున్నది కదా? ఒకే బ్రహ్మకు పరిణామరూపమైన ధర్మం ఉంటుందనీ, అది ఉండదనీ చెప్పడం కుదరదు కదా? స్థితిగతుల వలె ఉండవచ్చును అన్నట్లయితే, అనగా ఒకే వ్యక్తి ఒక చోట ఉన్నప్పుడు స్థితి, నడచి వెడుతున్నప్పుడు గతి ఉన్నట్లు పరిణామం, తదభావమూ కూడ ఉండవచ్చును కదా అని అన్నట్లయితే అది యుక్తం కాదు. కూటస్థం అని బ్రహ్మకు విశేషణం ఉంది. కూటస్థమైన బ్రహ్మకు స్థితిగతుల వలె అనేకధర్మా లుండడం సంభవం కాదు కదా? సర్వవికారాలూ లేని దవడంచేత బ్రహ్మ కూటస్థము నిత్యము (లేదా కూటస్థనిత్యమని) చెప్పి ఉన్నాం. బ్రహ్మ విషయంలో ఆత్మైకత్వదర్శనం ఏ విధంగా మోక్ష సాధనమో అదే విధంగా జగదాకారాంలో పరిణమిస్తుంది అని తెలుసుకోవడం కూడా స్వతంత్రంగా ఏదో ఫలం ఇస్తుందని చెప్పడం కుదరదు. అందుకు ప్రమాణం ఏదీ లేదు. ఎందువల్ల ననగా - "స ఏష నేతి నేత్యాత్మా" అని ఉపక్రమించి "అభయం వై జనక ప్రాప్తోఽసి" వంటి శాస్త్రం కూటస్థబ్రహాత్మత్వం తెలుసుకొనడంవల్లనే ఫలం చూపుతున్నది.

## భాష్యమ్

తత్రైతత్సిద్ధం భవతి- బ్రహ్మప్రకరణే సర్వధర్మవిశేషరహితబ్రహ్మ దర్శనాదేవ ఫలసిద్ధౌ సత్యాం యత్తత్రాఫలం శ్రూయతే బ్రహ్మణో జగదాకార పరిణామిత్వాది తద్బ్రహ్మదర్శనోపాయత్వేనైవ వినియుజ్యతే, ఫలవత్సంనిధా వఫలం తదఙ్గమితివత్, న తు స్వతన్త్రం ఫలాయ కల్ప్యతే ఇతి. న హి పరిణామవత్త్వవిజ్ఞానాత్పరిణామవత్త్వమాత్మనః ఫలం స్యాదితి వక్తుం యుక్తమ్, కూటస్థనిత్యత్వాన్మోక్షస్య. నను కూటస్థబ్రహ్మాత్మవాదినః ఏకత్వై కాన్త్యాదీశిత్రీశితవ్యాభావే ఈశ్వరకారణప్రతిజ్ఞావిరోధ ఇతి చేత్, న. అవిద్యాత్మకనామరూపబీజవ్యాకరణాపేక్ష త్వాత్సర్వజ్ఞత్వస్య. "తస్మాద్వా ఏత స్మాదాత్మన ఆకాశః సమ్భూతః" (తై. ఉ. 2.1) ఇత్యాదివాక్యేభ్యో నిత్యశుద్ధ

బుద్ధముక్తస్వరూపాత్సర్వజ్ఞాత్సర్వశక్తేరీశ్వరాజ్జగజ్జనిస్థితిప్రలయాః, నా చేత నాత్ప్రధానాదన్యస్మాద్వేత్యేషోఽర్థః ప్రతిజ్ఞాతః "జన్మాద్యస్య యతః" (బ్ర.సూ. 1.1.2) ఇతి. సా ప్రతిజ్ఞా తదవస్థైన, న తద్విరుద్ధోఽర్థః పునరిహోచ్యతే. కథం నోచ్యతే, అత్యన్తమాత్మన ఏకత్వమద్వితీయత్వం చ బ్రువతా? శృణు యథా నోచ్యతే. సర్వజ్ఞస్యేశ్వరస్య ఆత్మభూత ఇవ అవిద్యాకల్పితే నామరూపే తత్త్వాన్యత్వాభ్యామనిర్వచనయే సంసారప్రపఞ్చబీజభూతే సర్వజ్ఞస్యేశ్వరస్య మాయాశక్తిః ప్రకృతిరితి చ శ్రుతిస్మృతిస్మృత్యోరభిలప్యేతే. తాభ్యామన్యః సర్వజ్ఞ ఈశ్వరః "ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ" (ఛా.ఉ. ఇతి శ్రుతేః. "నామరూపే వ్యాకరవాణి" (చా.ఉ. 6.3.2), "సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్ యదాస్తే" (తై.ఆ. 3.12.7), "ఏకం బీజం బహుధా యః కరోతి" (శ్వే. ఉ. 6.12) ఇత్యాది శ్రుతిభ్యశ్చ.

బాలానందిని

తత్రేతి :- ఇంతవరకూ చెప్పినదానివల్ల సిద్ధించినది ఇది - ఎలాంటి ధర్మ విశేషాలు లేని బ్రహ్మ యొక్క జ్ఞానంవల్లనే ఫలం కలుగుతుందని బ్రహ్మ ప్రకరణంలో నిశ్చయింవబడింది గాన, ఆ ప్రకరణంలో కనబడుతున్న ఫలంలేని జగదాకారపరిణామిత్వం మొదలైనది, "ఫలం ఉన్నదాని సన్నిధిలో ఉన్న ఫలం లేనిది దానికి (ఫలవత్తుకు) అంగం" అని చెప్పిన విధంగా, బ్రహ్మదర్శనానికి ఉపాయంగా వినియోగించబడుతుంది, అంతేకాని అది స్వతంత్రమైన ఫలానికి దేనికీ ఉపయోగించదు. మోక్షం కూటస్థనిత్యం, అందువల్ల బ్రహ్మకు పరిణామం ఉందని తెలుసుకొనడంచేత ఆత్మకు పరిణామవత్త్వమే ఫలం అని చెప్పడం యుక్తం కాదు. - కూటస్థబ్రహ్మవాది ప్రకారం ఏకత్వం మాత్రమే ఉండడంవల్ల 'ఈశిత' (అధికారం చేసేవాడు) ఈశితవ్యం (దేనిమీద అధికారం చేయబడుతుందో అది) ఇత్యాదిభేదం లేకపోవడంచేత ఈశ్వరుడు కారణం అని చేసిన ప్రతిజ్ఞకు విరోధం అన్నట్లయితే (సమాధానం) - అది యుక్తం కాదు. సర్వజ్ఞత్వం అవిద్యాత్మకములైన నామరూపా లనే బీజంయొక్క వ్యాకరణంమీద, అనగా స్థూలరూపసృష్టిని పట్టి ఏర్పడినది. "తస్మాద్వా... సంభూతః" ఇత్యాదివాక్యాలను బట్టి నిత్యశుద్ధ బుద్ధముక్తస్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి అయిన ఈశ్వరునినుండియే జగత్తుయొక్క సృష్టిస్థితిప్రళయాలు

జరుగుచున్నాయి కాని అచేతనమైన ప్రధానం నుండి గాని, మరొకటి దేని నుండియో గాని కాదని "జన్మాద్యస్య యతః" అనే సూత్రంచేత చెప్పబడింది. ఈ ప్రతిజ్ఞ అలాగే ఉంది. ఇక్కడ దానికి విరుద్ధమైన విషయం ఏదీ చెప్పబడడంలేదు. ఒక ప్రక్క ఆత్మకు అత్యంతము, పూర్తిగా, ఏకత్వాన్ని అద్వితీయత్వాన్ని చెపుతూన్న నీవు విరుద్ధార్థం చెప్పకపోవడం ఏమిటి? ఎలా చెప్పడం లేదో విను! సర్వజ్ఞుడైన ఈశ్వరుని స్వరూపమే అన్నట్లుండేవీ, అవిద్యాకల్పితాలూ, తత్త్వాన్యత్వాలచేత అనిర్వచనీయములు, అనగా ఈశ్వరస్వరూపములే అని కాని, ఈశ్వరస్వరూపాలు కావని కాని చెప్పడానికి శక్యం కానివి, సంసారప్రపంచాలకి బీజములూ అయిన నామరూపాలు సర్వజ్ఞుడైన ఈశ్వరునికి చెందిన మాయాశక్తి అనీ, ప్రకృతి అనీ శ్రుతి స్మృతులలో చెప్పబడు తున్నాయి. "ఆకాశో... తద్బ్రహ్మ" అను శ్రుతి ననుసరించి సర్వజ్ఞుడైన ఈశ్వరుడు వాటికంటె భిన్నుడు. "నామరూపే వ్యాకరణవాణి", "సర్వాణి... ఆస్తే", "ఏకం బీజం బహుధా యః కరోతి" ఇత్యాదిశ్రుతులు కూడ ఈ విషయమే చెపుతున్నాయి.

భాష్యమ్

ఏవమవిద్యాకృతనామరూపోపాధ్యనురోధీశ్వరో భవతి, వ్యోమేవ ఘటకరకాద్యనురోధి. స చ స్వాత్మభూతానేవ ఘటాకాశస్థానీయాస విద్యా ప్రత్యుపస్థాపితనామరూపకృతకార్యకరణసంఘాతానురోధినః జీవాఖ్యాన్ విజ్ఞానాత్మనః ప్రతి ఈష్టే వ్యవహారవిషయే. (తదేవమవిద్యాత్మకోపాధిపరిచ్ఛేదాపేక్షమేవేశ్వరస్యేశ్వరత్వం, సర్వజ్ఞత్వం, సర్వశక్తిత్వం చ న పరమార్థతో విద్యాపాస్తసర్వోపాధి స్వరూపే ఆత్మనీశిత్రీశితవ్యసర్వజ్ఞత్వాది వ్యవహారః ఉపపద్యతే) తథాచోక్తమ్" యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" (ఛా.ఉ.7.24.1) ఇతి, "యత్ర... త్వస్య సర్వమాత్మైవాభూ త్తత్కేనం కం పశ్యేత్" (బృ.ఉ.4.5.15) ఇత్యాది చ. ఏవం పరమార్థావస్థాయాం సర్వవ్యవహారాభావం వదన్తి వేదాన్తాః సర్వే. తథేశ్వర గీతాస్వపి -

"న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.
నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః". (భ.గీ.5.14,15)

ఇతి పరమార్థావస్థాయామీశిత్రీశితవ్యాదివ్యవహారాభావః ప్రదర్శ్యతే. వ్యవహారావస్థాయాం తూక్తః శ్రుతావపీశ్వరాదివ్యవహారః- "ఏష సర్వేశ్వర ఏషభూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధారణ ఏషాం లోకానామ్ అసంభేదాయ" (బృ.ఉ.4.4.22) ఇతి. తథేశ్వరగీతాస్వపి-

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,

భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా." (భ.గీ.18.6)

ఇతి. సూత్రకారోఽపి పరమార్థాభిప్రాయేణ తదనన్యత్వమిత్యాహ. వ్యవహారాభిప్రాయేణ తు "స్యాల్లోకవత్" ఇతి మహాసముద్రస్థానీయతాం బ్రహ్మణః కథయతి. అప్రత్యాఖ్యాయైవ కార్యప్రపఞ్చం పరిణామప్రక్రియాం చాశ్రయతి సగుణేషూపాసనేషూపయోక్ష్యత ఇతి. 14.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా ఆకాశం - ఘటం, చిన్న పాత్ర మొదలైన ఉపాధులను అనుసరించి నట్లు, ఈశ్వరుడు నామరూపోపాధులను అనుసరించి ఉంటాడు. ఆ ఈశ్వరుడు ఘటాకాశంవంటివాళ్లు, అవిద్యచేత ఏర్పడిన నామరూపాలచేత చేయబడిన కార్యకరణసంఘాతాలను (దేహేంద్రియాదులను) అనుసరించి ఉండేవాళ్లు అయిన జీవు లనే పేరు గల తన స్వరూపాలే అయిన విజ్ఞానాత్మలను, వ్యవహార విషయంలో నియమిస్తూ ఉంటాడు. అందుచేత ఈశ్వరుని ఈశ్వరత్వం, సర్వజ్ఞత్వం, సర్వశక్తిత్వం కూడ అవిద్యారూప మైన ఉపాధులచేత కలిగిన పరిచ్ఛేదాన్ని (సంకుచితత్వాన్ని) పట్టి ఏర్పడినవే. అంతే కాని విద్యచేత తొలగించబడిన సమస్తమైన ఉపాధుల స్వరూపం గల ఆత్మయందు ఈశిత, ఈశితవ్యుడు, సర్వజ్ఞుడు ఇత్యాది వ్యవహారం పరమార్థతః (వాస్తవంలో) కుదరదు. అందుచేతనే- "యత్ర... భూమా" అని "యత్ర... పశ్యేత్" ఇత్యాదికమూ కూడ చెప్పబడినది. ఈ విధంగా పరమార్థావస్థలో ఏ వ్యవహారాలూ లేవని వేదాంతాలు చెపుతున్నాయి. అట్లే భగవద్గీతలో కూడ "న... జన్తవః" అని పరమార్థావస్థలో ఈశిత్రీశితవ్యాదివ్యవహారం లేదని చూపబడుచున్నది. "ఆత్మ లోకానికి కర్తృత్వం కాని, కర్మత్వం (ప్రాసాదాదిభోగ్యవస్తుజాతం) కాని సృజించడం లేదు. కర్మఫలసంబంధాన్ని కూడ సృజించడం లేదు. కేవలం అవిద్య మాత్రమే ఈ విధంగా ప్రవర్తిస్తూన్నది. ప్రభువైన ఆత్మ ఎవని యొక్క పాపాన్నీ పుణ్యాన్నీ కూడ తీసుకొనడం

లేదు. జ్ఞానం అజ్ఞానంచేత ఆవరించబడింది. దానిచేతనే ప్రాణులు (కర్తృత్వాదులను తమపై ఆరోపించుకొని) మోహపడుతున్నారు'' అని ఈ శ్లోకాల అర్థం. వ్యవహారదశలో అయితే ఈశ్వరాదివ్యవహారం ఉంటుంది అని "ఏష... అసంభేదాయ" అను శ్రుతి కూడ చెప్పుచున్నది. భగవద్గీతలో కూడ "ఈశ్వరః... మాయయా" అని (వ్యవహారావస్థలో ఈశ్వరత్వాదికం) చెప్పబడింది. సూత్రకారుడు కూడ పారమార్థికదృష్టితో "తదనన్యత్వమ్' ' అని చెప్పుచున్నాడు. వ్యవహారికదృష్టితో నైతే "స్యాల్లోకవత్" అని బ్రహ్మ మహాసముద్రం వంటిది అని చెపుతున్నాడు. సగుణోపాసనలలో ఉపయోగిస్తుంది అనే అభిప్రాయంతో కార్యప్రపంచాన్ని ప్రత్యాఖ్యానం చేయకుండానే పరిణామప్రక్రియను అవలంబిస్తున్నాడు.14.

### సూ. భావే చోపలబ్ధేః. 2.1.15.

ఇతశ్చ కారణాదనన్యత్వం కార్యస్య, యత్కారణం భావ ఏవ కారణస్య కార్యముపలభ్యతే, నాఽభావే. తత్యథా సత్యాం మృది ఘట ఉపలభ్యతే సత్సు చ తన్తుషు పట ఉపలభ్యతే.న చ నియమేనాన్యభావేఽన్యస్యోప లబ్ధిర్దృష్టా, న హ్యశ్వో గోరన్యః సన్ గోర్భావ ఏవోపలభ్యతే. న చ కులాలభావ ఏవ ఘట ఉపలభ్యతే సత్యపి నిమిత్తనైమిత్తికభావే, అన్యత్వాత్. నన్వన్యస్య భావేఽప్యన్యస్యోపలబ్ధిర్నియతా దృశ్యతే. యథాగ్నిభావే ఏవ ధూమస్యేతి. నేత్యుచ్యతే. ఉద్వాపితేఽప్యగ్నౌ గోపాలఘుటికాధారితస్య ధూమస్య దృశ్యమానత్వాత్. అథ ధూమం కయాదవస్థయా విశింష్యాదీదృశో ధూమో నాసత్యగ్నౌ భవతీతి, నైవమపి కశ్చిద్దోషః, తద్భావానురక్తాం హి బుద్ధిం కార్యకారణయోరనన్యత్వే హేతుం వదామః, న చాసావగ్నిధూపయోర్విద్యతే.

బాలానందిని

భావే ఇతి:- భావే కారణం ఉన్నప్పుడే, ఉపలబ్ధేః=కార్యం కనబడడంవల్ల ఆ రెండూ అభిన్నములు'' అని సూత్రానికి అర్థం.

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ కార్యం కారణంకంటె అభిన్నం; ఎందువల్ల ననగా కారణం ఉన్నప్పుడే కార్యం కనబడుతున్నది గాని కారణం లేనప్పుడు కనబడడం లేదు. అదెట్లనగా- మట్టి ఉన్నప్పుడే ఘటం కనబడుతున్నది; దారాలు ఉన్నప్పుడే బట్ట కనబడుతున్నది. ఒకటి ఉన్నప్పుడు దానికంటె భిన్నమైన మరొకటి తప్పకుండా కనబడడం అనేది లేదు కదా. గోవుకంటె భిన్నమైన అశ్వం గోవు ఉన్నప్పుడే కనబడడం

అనేది లేదు కదా. కులాలునికీ ఘటానికీ నిమిత్తనైమిత్తికభావం ఉన్నా (కులాలుడు ఘటానికి నిమిత్తకారణం అయినా కూడ) కులాలు డున్నప్పుడే ఘటం కనబడడం అనేది లేదు కదా. (ప్రశ్న) ఒకటి ఉన్నప్పుడు దానికంటె భిన్నమైన మరొకటి తప్పనిసరిగా ఉండడం కనబడుతున్నది. ఉదాహరణకి- అగ్ని ఉన్నప్పుడే ధూమం కనబడుతుంది. (సమాధానం)- అలా కాదు అని అంటాం. అగ్ని ఆర్పివేసినా కూడ గోపాలులు చిన్న పాత్రలలో నింపిన ధూమం (అగ్ని లేకపోయినా ఉండడం) కనబడుతున్నది కదా? అలాకాక "అవిచ్ఛిన్నమూలదీర్ఘరేఖావస్థః" అని (విచ్ఛిన్నం కాని మూలంతో దీర్ఘరేఖాకారంలో ఉన్న) అని- ఈ విధమైన ఏదో ఒక అవస్థచేత ధూమాన్ని విశేషించి ఇలాంటి ధూమం అగ్ని లేకుండా ఉండదు అని చెప్పినా కూడ దోషం ఏమీ లేదు. కార్యకారణాల అభేదానికి తద్భావానురక్తమైన బుద్ధి హేతువు అని అంటాం. అది అగ్నిధూమాలకు లేదు (గాన పైన చెప్పిన వ్యభిచారదోషం లేదు).

వి. కార్యకారణాల భావంచేత అనగా ఉనికిచేత సహకృతమైన బుద్ధి కార్యకారణాల అనన్యత్వానికి హేతువు అని అంటాం. అనగా ఇది కార్యం, ఇక్కడ ఉంది, ఇది కారణం, ఇక్కడనే ఉంది అనే జ్ఞానం ఉన్నప్పుడే కార్యకారణాలు అభిన్నములు అని చెపుతాం. గోపాలఘుటికాసంగృహీతమైన ధూమం అగ్నిబుద్ధి (జ్ఞానం) లేకపోయినా కూడ తెలుస్తూన్నది గాన ఆ రెండింటికి అనన్యత్వం లేదని అర్థం. గోపాలఘుటికాగృహీతధూమమే కాదు పైకి ఎగురుతున్న ధూమం చూచి నప్పుడు కూడ ఆ సమయంలో అగ్నిజ్ఞానం ఉండదు గాన వాటికి అనన్యత్వం లేదు. లేదా తద్భావః అనగా సామానాధికరణ్యం. సామానాధికరణ్యం విషయంగా ఉన్న బుద్ధిచేత గ్రహించబడి నప్పుడే అనన్యత్వం అని అర్థం. 'మృద్ ఘటః" (మట్టియే కుండ) అనే సామానాధికరణ్య బుద్ధి వలె, "ధూమః అగ్నిః" (ధూమమే అగ్ని) అని సామానాధికరణ్యం లేదు గాన వీటికి అభేదం లేదని అర్థం.

అవ. సూత్రాన్ని అనుమానపరంగా వ్యాఖ్యానించి ఇప్పుడు పాఠాంతరాన్ని గ్రహించి ప్రత్యక్షపరంగా కూడ వ్యాఖ్యానిస్తున్నారు- (రత్నప్రభ)

## భాష్యమ్

"భావాచ్చోపలబ్ధేః" ఇతి వా సూత్రమ్. న కేవలం శబ్దాదేవ కార్యకారణయోరనన్యత్వమ్;ప్రత్యక్షోపలబ్ధిభావాచ్చ తయోరనన్యత్వమిత్యర్థః. భవతి హి ప్రత్యక్షోపలబ్ధిః కార్యకారణయోరనన్యత్వే. తద్యథా తన్తుసంస్థానే పటే తన్తువ్యతిరేకేణ పటో నామ కార్యం నైవోపలభ్యతే, కేవలాస్తు తన్తవ

అత్తానవితానవన్తః ప్రత్యక్షముపలభ్యన్తే, తథా తన్తుష్వంశవో, అంశుషు తదవయవాః. అనయా ప్రత్యక్షోపలబ్ధ్యా లోహితశుక్లకృష్ణాని త్రీణి రూపాణి తతో వాయుమాత్రమాకాశమాత్రం చేత్యనుమేయమ్ (ఛాం.ఉ.6.4), తతః పరం బ్రహ్మైకమేవాద్వితీయం, తత్ర సర్వప్రమాణానాం నిష్ఠామవోచామ. 15.

## బాలానందిని

భావాదితి:- లేదా "భావాచ్చోపలబ్ధేః" అని సూత్రం. కార్యకారణాలు అనన్యములనే విషయం కేవలం శబ్దంవల్లనే కాదు, ప్రత్యక్షంగా కనబడుతూండడంవల్ల కూడ వాటికి అనన్యత్వం అంగీకరించాలి. కార్యకారణముల అనన్యత్వం విషయంలో ప్రత్యక్షజ్ఞానం ఉంది కదా? అదెట్లనగా- తంతువుల ఒక విధమైన కూర్పు మాత్రమే అయిన పటంలో తంతువులకంటె భిన్నంగా పటం అనే కార్యం ఏదీ కనబడడం లేదు. పడుగు పేకలుగా ఉన్న తంతువులు మాత్రమే ప్రత్యక్షంగా కనబడుతున్నాయి; అట్లే దారాలలో వాటి ఏసిలు, వాటిలో వాటి అవయవాలు కనబడుతున్నాయి. ఈ విధమైన ప్రత్యక్షోపలబ్ధిచేత (ప్రత్యక్షంగా కనబడడంచేత) మూడు లోహిత-శుక్ల-కృష్ణరూపాలు, తరవాత కేవలం వాయువు; తరవాత ఆకాశమాత్రం; ఈ విధంగా అనుమానం చేయాలి. (లోహితశుక్లకృష్ణరూపమైన అగ్నికి కారణం వాయువు; దానికి ఆకాశం అని వెనుకకు వెళ్లాలి అని అర్థం). దాని తరవాత అద్వితీయం, ఏకం అయిన బ్రహ్మయే. సర్వప్రమాణాలు అక్కడనే ఆగిపోతాయి అని చెప్పి ఉన్నాం. 15.

## సూ. సత్త్వాచ్చావరస్య. 2.1.16.

ఇతశ్చ కారణాత్కార్యస్య అనన్యత్వం యత్కారణం ప్రాగుత్పత్తేః కారణాత్మనైవ కారణే సత్త్వమవరకాలీనస్య కార్యస్య శ్రూయతే- "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (చా.ఉ.6.2.1) "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" (ఐ.బ్రా.2.4.1.1) ఇత్యాదావిదంశబ్దగృహీతస్య కార్యస్య కారణేన సామానాధికరణ్యాత్. యచ్చ యదాత్మనా యత్ర న వర్తతే న తత్తత ఉత్పద్యతే, యథా సికతాభ్యస్తైలమ్. తస్మాత్ ప్రాగుత్పత్తేః అనన్యత్వాదుత్పన్నమప్యనన్యదేవ కారణాత్కార్యమిత్యవగమ్యతే. యథా చ కారణం బ్రహ్మ త్రిషు కాలేషు సత్త్వం న వ్యభిచరత్యేవం కార్యమపి జగత్త్రిషు సత్త్వం న వ్యభిచరతి. ఏకం చ పునః సత్త్వమ్; అతోఽప్యనన్యత్వం కారణాత్కార్యస్య. 16.

## బాలానందిని

సత్త్వాదితి:- "అవరస్య=తరవాత కనబడిన కార్యం, సత్త్వాత్ = కారణంలో ఉంది గాన, అందువల్ల కూడ కార్యకారణాలకు అనన్యత్వం" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఇందువల్ల కూడ కార్యం కారణంకంటె అనన్యం. ఎందువల్ల ననగా- తరవాతి కాలానికి సంబంధించిన కార్యం ఉత్పత్తికి పూర్వం కారణస్వరూపంతోనే కారణంలో ఉన్నట్లు శ్రుతిలో వినబడుచున్నది. ఎందువల్ల ననగా- "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్", "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" ఇత్యాదులలో ఇదం శబ్దంచేత నిర్దేశించబడిన కార్యానికి కారణంతో ('ఇదం సదేవ' 'ఇదమ్ ఆత్మైవ' అని) సామానాధికరణ్యం కనబడుతున్నది. ఏది దేని రూపంలో దేనియందు ఉండదో అది దానినుండి పుట్టదు. ఉదాహరణకు తైలం ఇసుకనుండి పుట్టదు. అందువల్ల కార్యం ఉత్పత్తికి పూర్వం కారణంకంటె అనన్యం గాన పుట్టిన తరవాత కూడ అనన్యమే అని తెలుస్తూన్నది. కారణ మైన బ్రహ్మ ఎట్లు మూడు కాలాలలోను సత్త్వాన్ని వ్యభిచరించదో (సత్ కాకుండా ఉండదో) అట్లే కార్యం కూడ మూడు కాలాలలోను సత్త్వాన్ని వ్యభిచరించదు. సత్త్వం అనేది ఒక్కటే, అనగా కారణమైన బ్రహ్మలో ఉన్న సత్త్వమూ, కార్యమైన జగత్తులో ఉన్న సత్త్వమూ కూడ ఒకటే. అందువల్ల కూడ కార్యం కారణంకంటె అనన్యం. 16.

### సూ. అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాన్తరేణ వాక్యశేషాత్. 2.1.17.

నను క్వచిదసత్త్వమపి ప్రాగుత్పత్తేః కార్యస్య వ్యపదిశతి శ్రుతిః- "అసదేవేదమగ్ర ఆసీత్" (ఛా.ఉ.7.19.9) ఇతి, "అసద్వా ఇదమగ్ర ఆసీత్" (తై.ఉ.2.7.1) ఇతి చ. తస్మాదసద్వ్యపదేశాన్న ప్రాగుత్పత్తేః కార్యస్య సత్త్వమితి చేత్, నేతి బ్రూమః. న హ్యయమత్యన్తాసత్త్వాభిప్రాయేణ ప్రాగుత్పత్తేః కార్యస్యాసద్వ్యపదేశః, కిం తర్హి? వ్యాకృతనామరూపత్వాద్ధర్మాత్ అవ్యాకృత నామరూపత్వం ధర్మాన్తరమ్; తేన ధర్మాన్తరేణాయమసద్వ్యపదేశః ప్రాగుత్పత్తేః సత ఏవ కార్యస్య కారణరూపేణానన్యస్య. కథమేతదవగమ్యతే? వాక్యశేషాత్. యదుపక్రమే సందిగ్ధార్థం వాక్యం తచ్ఛేషాన్నిశ్చీయతే. ఇహ చ తావత్ "అసదేవేదమగ్ర ఆసీత్" ఇత్యసచ్ఛబ్దేనోపక్రమే నిర్దిష్టం యత్తదేవ పునస్తచ్ఛబ్దేన పరామృశ్య సదితి విశినష్టి "తత్సదాసీత్" ఇతి. అసతశ్చ పూర్వాపరకాలా

సంబన్ధాదాసీచ్ఛబ్దానుపపత్తేశ్చ. "అసద్వా ఇదమగ్రసీత్" ఇత్యత్రాపి "తదాత్మానం స్వయమకురుత" ఇతి వాక్యశేషే విశేషణాన్నాత్యన్తాసత్త్వమ్. తస్మాద్ధర్మాన్తరేణైవాయమసద్వ్యపదేశః ప్రాగుత్పత్తేః కార్యస్య. నామరూపవ్యాకృతం హి వస్తు సచ్ఛబ్దార్హం లోకే ప్రసిద్ధమ్. అతః ప్రాఙ్నామరూపవ్యాకరణాదసదివాసీదిత్యుపచర్యతే.17.

## బాలానందిని

**అసదితి:-** "అసదుపదేశాత్ = సృష్టికి పూర్వం లేదని చెప్పడం వల్ల, న=సృష్టికి పూర్వం కార్యం లేదు, ఇతి చేత్= అన్నట్లయితే, న=కాదు; వాక్యశేషాత్= వాక్యశేషం వల్ల, ధర్మాన్తరేణ మరొక ధర్మంచేతనే అసత్ అని తెలుస్తూన్నది" అని సూత్రార్థం.

నన్వితి:- (ప్రశ్న) కొన్ని చోట్ల "**అసదేవేదమగ్ర ఆసీత్**" అని "**అసద్వా ఇదమగ్ర ఆసీత్**" అని శ్రుతి ఉత్పత్తికి పూర్వం కార్యం అసత్తని కూడ చెప్పుచున్నది. అందువల్ల అసద్వ్యపదేశంవల్ల ఉత్పత్తికి పూర్వం కార్యానికి సత్త్వం లేదు అన్నట్లయితే (సమాధానం) కాదు అంటాం. ఉత్పత్తికి పూర్వం కార్యం లేదనే ఈ వ్యపదేశం కార్యం అసలే లేదనే అభిప్రాయంచేత కాదు; మరేమనగా- వ్యాకృతములైన నామరూపాలు కలిగి ఉండడంకంటె భిన్నమైన ధర్మం అవ్యాకృతనామరూపత్వం. కారణరూపంచేత అనన్యమై ఉత్పత్తికి పూర్వం కూడ సత్తుగానే ఉన్న కార్యాన్ని ఈ ధర్మాంతరంచేత (అవ్యాకృతనామరూపత్వంచేత) అసత్తు అని వ్యపదేశం చేయడం జరిగింది. ఇది ఎలా తెలుస్తూన్నది? వాక్యశేషంవల్ల. ఉపక్రమంలో ఏ వాక్యంయొక్క అర్థం సందిగ్ధంగా ఉంటుందో అది వాక్యశేషంచేత (చివరవచ్చే వాక్యభాగంచేత) నిర్ణయించబడుతుంది. ఇక్కడ ఉపక్రమంలో ఏది "**అసదేవేదమగ్ర ఆసీత్**" అని నిర్దేశించబడిందో దానినే మళ్లీ తచ్ఛబ్దంచేత "తత్సదాసీత్" అని పరామర్శించి 'సత్' అని విశేషిస్తున్నాడు (విశేషరూపంలో నిర్దేశిస్తున్నాడు). (అనగా దేనినైతే నామరూపవ్యాకృతం కాకపోవడంచేత అసత్ అన్నాడో దానినే సత్ అంటున్నాడు). మరొక విషయ మేమనగా 'అసత్'కు, అసలే లేనిదానికి, పూర్వకాలంతో కాని అపరకాలంతో కాని సంబంధం ఉండదు గాన 'ఆసీత్' (ఉండేది) అనే శబ్దం ప్రయోగించడం కూడ ఉపపన్నం కాదు. "**అసద్వా ఇదమగ్ర ఆసీత్**" అనే చోట కూడ వాక్యశేషంలో "**తదాత్మానం స్వయమకురుత**" అని విశేషించడం చేత (ఆ అసత్తు తానే ఈ విధంగా చేసికొన్నది అని చెప్పడంచేత) దానికి అత్యంతాసత్త్వం లేదు. అందువల్ల ఉత్పత్తికి పూర్వం కార్యం అసత్ అని చెప్పడం ధర్మాంతరంచేతనే. నామరూపాలతో వ్యాకృతమైన (ఆకారమూ పేరూ ఉన్న) వస్తువు

'సత్' శబ్దానికి తగినదిగా లోకంలో ప్రసిద్ధం. అందువల్ల నామరూపవ్యాకరణానికి పూర్వం ఇది అసత్ వలె ఉన్నది అని ఉపచారంచేత చెప్పబడుతున్నది. 17.

## సూ. యుక్తేః శబ్దాన్తరాచ్చ. 2.1.18

యుక్తేశ్చ ప్రాగుత్పత్తేః కార్యస్య సత్త్వమనన్యత్వం చ కారణాదవగమ్యతే, శబ్దాన్తరాచ్చ. యుక్తిస్తావద్వర్ణ్యతే- దధిఘటరుచకాద్యర్థిభిః ప్రతినియతాని కారణాని క్షీరమృత్తికాసువర్ణాదీన్యుపాదీయమానాని లోకే దృశ్యన్తే. న హి దధ్యర్థిభిర్మృత్తికోపాదీయతే, న ఘటార్థిభిః క్షీరమ్, తదసత్కార్యవాదే నోపపద్యతే. అవిశిష్టే హి ప్రాగుత్పత్తేః సర్వత్ర సర్వస్యాసత్త్వే కస్మాత్ క్షీరాదేవ దధ్యుత్పద్యతే, న మృత్తికాయాః; మృత్తికాయా ఏవ చ ఘట ఉత్పద్యతే, న క్షీరాత్? అథ అవిశిష్టేఽపి ప్రాగసత్త్వే క్షీరే ఏవ దధ్నః కశ్చిదతిశయో న మృత్తికాయాం, మృత్తికాయామేవ చ ఘటస్య కశ్చిదతిశయో న క్షీర ఇత్యుచ్యేత తర్హ్యతిశయవత్త్వాత్ ప్రాగవస్థాయా అసత్కార్యవాదహానిః, సత్కార్యవాదసిద్ధిశ్చ. శక్తిశ్చ కారణస్య కార్యనియమార్థా కల్ప్యమానా నాన్యా అసతీ వా కార్యం నియచ్ఛేత్; అసత్త్వావిశేషాదన్యత్వావిశేషాచ్చ. తస్మాత్కారణస్యాత్మభూతా శక్తిః, శక్తేశ్చాత్మభూతం కార్యమ్.

### బాలానందిని

యుక్తేరితి:- "యుక్తేః" = యుక్తివల్ల, శబ్దాన్తరాచ్చ = కార్యానికి సత్త్వాన్ని చెప్పే మరొక శబ్దంవల్ల కూడ కార్యం ఉత్పత్తికి పూర్వం సత్తు" అని సూత్రార్థం.

యుక్తేశ్చేతి:- యుక్తివల్ల, శబ్దాంతరంవల్ల కూడ ఉత్పత్తికంటె పూర్వం కూడ కార్యం సత్ అని, కారణం కంటె అనన్యం అని తెలుస్తూన్నది. ముందు యుక్తి చెప్పబడుచున్నది - లోకంలో పెరుగు, ఘటం, రుచకం మొదలైనవి కావాలనుకొనే వాళ్లు వాటి వాటికి నియతాలైన (తప్పక సంబంధించిన) పాలు, మట్టి, బంగారం మొదలైనవాటిని సంగ్రహించడం చూస్తున్నాం. పెరుగు కావా లను కొన్నవాళ్లు మట్టి సంగ్రహించరు, కుండ కావాలనుకొన్నవాళ్లు పాలు సంగ్రహించరు. అసత్కార్యవాదంలో (పుట్టడానికి పూర్వం కార్యం కారణంలో లేదు అనే వాళ్ల మతంలో) ఇది కుదరదు. ఉత్పత్తికి పూర్వం ఏదీ దేనిలోనూ లేకపోవడం సమానమే అయినప్పుడు పెరుగు పాలనుండే ఎందుకు పుడుతుంది, మట్టినుండి ఎందుకు పుట్టదు? ఘటం మృత్తిక

నుంచి మాత్రమే ఎందుకు పుడుతుంది. పాలనుంచి ఎందుకు పుట్టదు? అలా కాదు- కార్యం లేకపోవడం అన్నింటిలోనూ సమానమే అయినా దధికి సంబంధించిన ఒకానొక అతిశయం పాలల్లోనే ఉంది మట్టిలో లేదు, కుండకు సంబంధించిన ఒకానొక అతిశయం మట్టిలోనే ఉంది పాలల్లో లేదు అని అన్నట్లయితే, కార్యప్రాగవస్థ (కార్యం పుట్టడానికి పూర్వం ఉన్న కారణస్థితి)లో ఒకానొక అతిశయం ఉంది అని చెప్పడంవల్ల సత్కార్యవాదాన్ని అంగీకరించినట్లే అవుతుంది; అసత్కార్యవాదం కుదరదు. కార్యనియమం కోసం (దీనినుండి ఈ కార్యమే పుడుతుంది అనే నియమంకోసం) కారణంలో కల్పించబడే శక్తి కారణంకంటె అన్యమైనా, కారణంలో లేకపోయినా ఆ కార్యాన్ని నియమించజాలదు. ఎందువల్ల ననగా దాని అసత్త్వంలోను (లేకపోవడంలోను) అన్యత్వంలోను విశేషం ఏదీ లేదు. అందుచేత శక్తి కారణస్వరూప మైనది, కార్యం శక్తి స్వరూప మైనది. ఈ విధంగా కార్యం కారణస్వరూపమైన దని అంగీకరించవలసి ఉంటుంది అని అర్థం.

## భాష్యమ్

అపి చ కార్యకారణయోర్ద్రవ్యగుణాదీనాం చ అశ్వమహిషవద్భేదబుద్ధ్యభావాత్తాదాత్మ్యమభ్యుపగన్తవ్యమ్. సమవాయకల్పనాయామపి సమవాయస్య సమవాయిభిః సమ్బన్ధేఽభ్యుపగమ్యమానే తస్య తస్యాన్యోఽన్యః సమ్బన్ధః కల్పయితవ్య ఇత్యనవస్థాప్రసంగః. అనభ్యుపగమ్యమానే విచ్ఛేదప్రసంగః. అథ సమవాయః స్వయం సంబన్ధరూపత్వాదనపేక్ష్యైవాపరం సంబన్ధం సంబధ్యతే, సంయోగోఽపి తర్హి స్వయం సంబన్ధరూపత్వాదనపేక్ష్యైవ సమవాయం సంబధ్యేత. తాదాత్మ్యప్రతీతేశ్చ ద్రవ్యగుణాదీనాం సమవాయకల్పనానర్థక్యమ్. కథం చ కార్యమవయవిద్రవ్యం కారణేష్వవయవద్రవ్యేషు వర్తమానం వర్తేత; కిం సమస్తేష్వవయవేషు వర్తేత ఉత ప్రత్యవయవమ్. యది తావత్సమస్తేషు వర్తేత తతోఽవయవ్యనుపలబ్ధిః ప్రసజ్యేత; సమస్తావయవసంనికర్షస్యాశక్యత్వాత్. న హి బహుత్వం సమస్తేష్వవయవేషు వర్తమానం వ్యస్తాశ్రయగ్రహణేన గృహ్యతే.

## బాలానంధిని

అపి చేతి:- మరొక విషయ మేమనగా- అశ్వం వేరు మహిషం వేరు అని వాటి మధ్య స్పష్టంగా భేదం కనబడుతున్నట్లు కార్యకారణాల మధ్య, ద్రవ్యగుణాదుల

మధ్య భేదం కనబడడం లేదు గాన వాటికి (కార్యకారణాలకి, ద్రవ్యగుణాదులకీ) తాదాత్మ్యం (ఒక విధమైన అభేదం) అంగీకరించాలి.

వి. కార్యకారణాలు, ద్రవ్యగుణాలు, అవయవావయవులు మొదలైనవాటి మధ్య నైయాయికులు సమవాయసంబంధం అనే సంబంధాన్ని అంగీకరిస్తారు. కార్యం కారణంకంటె భిన్నమే అయినా, గుణం (పీతరూపాదికం) ద్రవ్యంకంటె (వస్త్రాదికం కంటె) భిన్నమే అయినా సమవాయసంబంధం ద్వారా వాటితో సంబంధించి ఉండడం చేత అవి వేరు వేరు అనే బుద్ధి కలగడం లేదు అని వాళ్ల మతం. ఘటం అనే కార్యం మృత్తిక అనే కారణంతో సమవాయసంబంధంచేత సంబంధించి ఉంటుంది. అట్లే శాఖ అనే అవయవం అవయవి అయిన వృక్షంతో సమవాయసంబంధంచేత సంబంధించి ఉంటుంది అని వాళ్లంటారు. సంయోగం, సమవాయం అని సంబంధాలు రెండు. రెండు మూర్తద్రవ్యాల సంబంధం సంయోగసంబంధం. ఉదాహరణకి హస్తంలో పుస్తకం పట్టుకొన్నప్పుడు వాటి సంబంధం సంయోగ సంబంధం. హస్త పుస్తకాలలో సంయోగసంబంధం ఉంది. ఈ సంయోగ సంబంధం హస్తపుస్తకాలలో ఏ సబంధంచేత ఉంది? సమవాయసంబంధంచేత ఉంది. కార్యకారణాల మధ్య ఉన్న సమవాయసంబంధం ఏ సంబంధంచేత వాటిలో ఉంది అనే ప్రశ్నకు నైయాయికలు దానికి మరొక సంబంధం అవసరం లేదు, ఇతర సంబంధా పేక్ష లేకుండానే సమవాయసంబంధం కార్యకారణ - అవయవాయ వ్యాదులలో ఉంటుంది అని సమాధానం చెపుతారు.

అవ. సమవాయం అనే సంబంధం అంగీకరించడం అనావశ్యకమని ప్రతిపాదిస్తున్నారు -

సమవాయేతి :- సమవాయసంబంధాన్ని కల్పించినా కూడ సమవాయం సమవాయులతో (కార్యకారణాదులతో) సంబంధిస్తుంది అని అంగీకరించి నప్పుడు ఆ సమవాయం వాటితో సంబంధించడానికి మరొక సంబంధం చెప్పాలి. అది సంబంధించడానికి మరొక సంబంధం చెప్పాలి అని అనవస్థాదోషం ప్రసక్తం అవుతుంది. సమవాయులతో సమవాయం సంబంధించదు అన్నట్లయితే విచ్ఛేదం ప్రసక్తం అవుతుంది. అనగా సమవాయానికి సమవాయులతో సంబంధం లేకపోతే కార్యం కారణంతో సంబంధించినది, అవయవం అవయవితో సంబంధించినది ఇత్యాది జ్ఞానం కలగదు అని అర్థం. అలా కాదు, సమవాయమే స్వయంగా ఒక సంబంధం గాన ఇది కార్యాదులతో సంబంధించడానికి మరొక సంబంధంయొక్క ఆపేక్ష దాని కుండదు అన్నట్లయితే, ఆ పక్షంలో సంయోగంకూడ సంబంధమే గాన సమవాయం అనే

మరొక సంబంధాన్ని అపేక్షించకుండా హస్తపుస్తకాదులతో సంబంధించాలి. ద్రవ్యగుణాదుల మధ్య తాదాత్మ్యమే కనబడుతూన్నది గాన సమవాయసంబంధాన్ని కల్పించడం అనవసరం. కారణాలైన అవయవద్రవ్యాలలో కార్యమైన అవయవద్రవ్యం ఏ విధంగా ఉంటుంది? అన్ని అవయవాలలోనూ కూడ ఉంటుందా లేక ఒక్కొక్క అవయవంలో ఉంటుందా?

వి. తంతువులు అవయవద్రవ్యాలు, పటం అవయవి, అది కార్యం. కార్యమూ అవయవీ అయిన పటం మొత్తం అన్ని తంతువుల మీదా ఉంటుందా లేక వేరు వేరు తంతువుల మీద ఉంటుందా అని ప్రశ్న.

యదీతి :- సమస్తావయవాలలోను ఉంటుంది అన్నట్లయితే అవయవియొక్క జ్ఞానం కలగదు. ఎందువల్ల ననగా సమస్త మైన అవయవాలతోను చక్షుస్సుకు సంబంధం ఒకే సమయంలో కుదరదు. సమస్తమైన ఆశ్రయాలలో ఉన్న బహుత్వం వ్యస్తమైన ఆశ్రయాన్ని గ్రహించడంచేత తెలియబడదు కదా?

వి. మూడు లేదా మూడుకంటె వస్తువులున్నప్పుడు వాటిలో బహుత్వం ఉంది. ఉదా: నాలుగు మామిడి పండ్లలో బహుత్వం ఉంది. ఆ నాలుగు పండ్లను ఒక్క మాటు చూస్తేనే వాటిలోని బహుత్వం కనబడుతుంది గాని వాటిలో ఒక మామిడిపండు మాత్రమే చూస్తే ఆ పండ్లలోని బహుత్వం తెలియదు. అట్లే వస్త్రం మొత్తం తంతువులలో ఉంది అన్నట్లయితే వస్త్రజ్ఞానం కలగాలంటే మొత్తం అన్ని తంతువులను చూడాలి. అది అసంభవం. అందుచేత కార్యమైన అవయవి మొత్తం కారణావయవాలమీద ఉంటుందనడం కుదరదు.

## భాష్యమ్

అథ అవయవశః సమస్తేషు వర్తేత తదాప్యారమ్భకావయవ వ్యతిరేకేణ అవయవినోఽవయవాః కల్ప్యేరన్ యైరారమ్భకేష్వవయవేషు అవయవశోఽవయవీ వర్తేత. కోశావయవాతిరిక్తైర్హ్యవయవైరసిః కోశం వ్యాప్నోతి. అనవస్థాచైవం ప్రసజ్యేత, తేషు తేష్వవయవేషు వర్తయితుమన్యేషామన్యేషామవయవానాం కల్పనీయత్వాత్. అథ ప్రత్యవయవం వర్తేత తదైకత్ర వ్యాపారేఽన్యత్రావ్యాపారః స్యాత్; న హి దేవ దత్తః స్రుఘ్నే సంనిధీయమానః తదహరేవ పాటలిపుత్రే పిఽసంనిధీయతే. యుగపదనేకత్ర వృత్తౌ అనేకత్వ ప్రసంగః స్యాత్, దేవదత్తయజ్ఞదత్తయోరివ స్రుఘ్న పాటలిపుత్రనివాసినోః.

గోత్వాదివత్ప్రత్యేకం పరిసమాప్తేర్న దోష ఇతి చేత్, న. తథా ప్రతీత్యభావాత్. యది గోత్వాదివత్ప్రత్యేకం పరిసమాప్తో వయవీ స్యాద్యథా గోత్వంప్రతివ్యక్తి ప్రత్యక్షం గృహ్యతే ఏవమవయవ్యపి ప్రత్యవయవం ప్రత్యక్షం గృహ్యేత; న చైవం నియతం గృహ్యతే. ప్రత్యేక పరిసమాప్తౌ చావయువినః కార్యేణాధికారాత్తస్య చైకత్వాత్ శృఙ్గేణాపి స్తనకార్యం కుర్యాదురసా చ పృష్ఠకార్యమ్. న చైవం దృశ్యతే.

బాలానందిని

అవ. "కిం సమస్తేష్వవయవేషు వర్తతే ఉత ప్రత్యవయవమ్" అనే వాక్యంలో కార్యం మొత్తం అన్ని అవయవాలలోనూ ఉంటుందా. (2) లేక వేరు వేరు అవయవాలలో ఉంటుందా అని రెండు వికల్పాలు చూపబడ్డాయి. మొదటి వికల్పంలోనే అవయవద్రవ్యాలన్నింటిలోనూ, ద్విత్వత్రిత్వాదికం రెండు వస్తువులు మూడు వస్తువులు మొదలైనవాటిలో ఉన్నట్లు ఉంటుందా లేక ఒక కత్తి ఒరలో దాని అన్ని అవయవాలూ వ్యాపించి ఉన్నట్లు ఉంటుందా అని రెండు వికల్పాలు ఊహించుకొని మొదటి వికల్పం కుదర దని "యది తావత్" అనే వాక్యంచేత సమాధానం చెప్పారు. ఇప్పుడు మొదటి వికల్పంలోని రెండవ వికల్పానికి సమాధానం చెపుతున్నారు— **అథావయవశ ఇత్యాది:-** అట్లు కాక అవయవి తనయొక్క ఒక్కొక్క అవయవంతో కారణావయవద్రవ్యా లన్నింటిని ఒక్కొక్కదానిని ఆక్రమించి ఉంటుంది అన్నట్లయితే అవయవి ఆరంభకావయవాలలో (కారణమైన అవయవాలలో) తన ఏ అవయవాలతో ఉంటుందో అలాంటివి ఆరంభ కావయకాలకంటె భిన్నమైనవి అయిన అవయవాలు ఉన్నాయని కల్పించ వలసివస్తుంది. కత్తి కోశంయొక్క అవయవాలకంటె భిన్నమైన అవయవాలతో కోశాన్ని వ్యాపించి ఉంటుంది కదా? ఆ యా అవయవాలలో ఉంటేటట్లు చేయడానికి భిన్నభిన్నమైన అవయవాలను కల్పించవలసి ఉంటుంది గాన అనవస్థాదోషం కూడ కలుగుతుంది.

వి. కార్యం తన అవయవా లన్నింటిచేత కారణావయవాలను ఆక్రమించి నట్లు ఆక్రమించి ఆ అవయవాలమీద ఉంటుంది అన్నట్లయితే కోశావయవాలను పూర్తిగా తన అవయవాల చేత ఆక్రమించి కోశంలో ఉన్న కత్తికి కోశావయవాలకంటె వేరుగా అవయవాలు ఉన్నట్లు ఈ కార్యానికి, కారణం ఏ అవయవాలతో తనను (అనగా కార్యాన్ని) పుట్టించిందో ఆ అవయవాలకంటె భిన్నంగా దానికి (కార్యానికి) వేరే అవయువాలున్నాయని చెప్ప వలసివస్తుంది. అదే విధంగా కారణానికి

సంబంధించిన ఒక్కొక్క అవయవంతో కార్యానికి సంబంధించిన ఒక్కొక్క అవయవం కలిసి ఉండడానికి కార్యంలో అనేకమైన అవయవాలను కల్పించవలసి ఉంటుంది. గాన అనవస్థాదోషం ఏర్పడుతుంది. అనగా కారణావయవాలకంటె వేరుగా కార్యానికి అవయవాలున్నాయంటే మరొక క్రొత్త అవయవి ఒకటి ఏర్పడిందని అర్థం. ఆ అవయవి ఆ అవయాలలో ఎలా ఉంది అంటే మళ్లీ కొన్ని అవయవాలు కల్పించాలి. ఈ విధంగా కల్పిస్తూనే పోవాలి గాన అనవస్థాదోషం అని భావం. రత్న ప్రభా - ఆనందగిరీయాలు వివరించిన అనవస్థాదోషం సంతృప్తికరంగా లేదు. భామతీ- బ్రహ్మవిద్యాభరణాలు వివరించలేదు.

**అథేతి :-** అలాకాక కార్యం కారణావయవద్రవ్యాల ఒక్కొక్క అవయవం మీద ఉంటుంది అన్నట్లయితే ఒక భాగంలో వ్యాపారం ఉన్నప్పుడు మరొక భాగంలో వ్యాపారం ఉండదు. అనగా ఒక తంతువులో వస్త్రం ఉన్నప్పుడు ఇతర తంతువులలో ఉండదు. స్రుఘ్నంలో ఉన్న దేవదత్తుడు అదే రోజున పాటలి పుత్రంలో కూడ ఉండ జాలడు కదా? కార్యం ఒకే సమయంలో ఒక్కొక్క కారణావయవంమీదా ఉంటుంది అని చెప్పినట్లయితే స్రుఘ్న - పాటలిపుత్రనగరాలలో ఉన్న దేవదత్త - యజ్ఞదత్తులు వేరై నట్లు ఒక అవయవంమీద ఉన్న కార్యం మరొక అవయవంమీద ఉన్న కార్యం కంటె భిన్నం అయి ఎన్ని అవయవాలుంటాయో అన్ని కార్యాలుంటాయని చెప్పవలసి వస్తుంది. (ప్రశ్న) గోత్వాదికం వలె ఒక్కొక్కదానియందు పరిసమాప్తం అవుతుంది, అనగా గోత్వం అనే జాతి అనేకగోవులకు సంబంధించినదే అయినా ఒక గోవులోనే గోత్వం పరిపూర్ణంగా ఉన్నట్లు, ఒక అవయవంలోనే కార్యమైన పటాదికం పూర్తిగా ఉండవచ్చును కదా అని ప్రశ్న. (సమాధానం) అది యుక్తం కాదు. ఆ విధంగా ప్రతీతి లేదు కదా? అలా గైతే గోత్వం ప్రతీ గోవ్యక్తిలోను పరిసమాప్తంగా (పూర్తిగా) ప్రత్యక్షంగా కనబడి నట్లు ప్రతీ అవయవంలోను అవయవి పరిసమాప్తం అయి ప్రత్యక్షంగా కనబడాలి. అలా తప్పకుండా కనబడడంలేదు. (మరొక దోషం ఏ మనగా) అవయవి ఒక్కొక్క అవయవంలో పరిసమాప్తం అయితే అది తాను చేయవలసిన కార్యం (పని) చేయవసి ఉంటుంది గాన స్తనాల దగ్గర చేయవలసిన పనిని కొమ్ములతో చేయ గలిగి ఉండాలి, వీపుచేత చేయవలసిన పని వక్షస్థలంచేత చేయగలిగి ఉండాలి. (కొమ్ముల్లో ఒక ఆవు, స్తనాలలో ఒక ఆవు, వీపుమీద ఒక మనిషి, వక్షస్థలం మీద ఒక మనిషి ఉన్నారు కదా అని భావం). కాని అలా కనబడడం లేదు.

## భాష్యమ్

ప్రాగుత్పత్తేశ్చ కార్యస్యాసత్త్వే ఉత్పత్తిరకర్తృకా నిరాత్మికా చ స్యాత్. ఉత్పత్తిశ్చ నామ క్రియా. సా సకర్తృకైవ భవితుమర్హతి, గత్యాదివత్. క్రియా

చ నామ స్యాదకర్తృకాచేతి విప్రతిషిధ్యేత. ఘటస్య చోత్పత్తిరుచ్యమానా న ఘటకర్తృకా కిం తర్హి అన్యకర్తృకేతి కల్ప్యా స్యాత్. తథా కపాలాదీనా మప్యుత్పత్తిరుచ్యమానాఽన్యకర్తృకైవ కల్ప్యేత. తథా చ సతి ఘట ఉత్పద్యత ఇత్యుక్తే కులాలాదీని కారణాన్యుత్పద్యన్త ఇత్యుక్తం స్యాత్. న చ లోకే ఘటోత్పత్తిరిత్యుక్తే కులాలాదీనాముత్పద్యమానతా ప్రతీయతే, ఉత్పన్నతా ప్రతీతేశ్చ. అథ స్వకారణసత్తాసంబన్ధ ఏవ ఉత్పత్తిరాత్మలాభశ్చ కార్యస్యేతి చేత్, కథమలబ్ధసత్తాకం సంబధ్యేతేతి వక్తవ్యమ్. సతోర్హి ద్వయోః సంబన్ధః సంభవతి న సదసతోరసతోర్వా. అభావస్య చ నిరుపాఖ్యత్వాత్ ప్రాగుత్పత్తే రితి మర్యాదాకరణమనుపపన్నమ్, సతాం హి లోకే క్షేత్రగృహాదీనాం మర్యాదా దృష్టా నాభావస్య. న హి వన్ధ్యాపుత్రో రాజా బభూవ ప్రాక్ పూర్ణవర్మణః అభిషేకాదిత్యేవంజాతీయకేన మర్యాదాకరణేన నిరుపాఖ్యో వన్ధ్యాపుత్రో రాజా బభూవ, భవతి, భవిష్యతీతి వా విశేష్యతే. యది చ వన్ధ్యాపుత్రోఽపి కారక వ్యాపారాదూర్ధ్వమభవిష్యత్ తత ఇదముపాపత్స్యత కార్యాభావోఽపి కారకవ్యాపారాదూర్ధ్వం భవిష్యతీతి. వయం తు పశ్యామో వన్ధ్యాపుత్రస్య కార్యాభావస్య చాభావత్వా విశేషాద్యథా వన్ధ్యాపుత్రః కారకవ్యాపారాదూర్ధ్వం న భవిష్యత్యేవం కార్యాభావోఽపి కారకవ్యాపారాదూర్ధ్వం న భవిష్యతీతి.

బాలానందిని

ప్రాగితి:- ఉత్పత్తికి పూర్వం కార్యం లేకపోతే పుట్టడం కర్త లేనిదై స్వరూపం లేనిది అవుతుంది. ఉత్పత్తి అనగా ఒక క్రియ. దానికి గత్యాదిక్రియలకు వలె కర్త ఉండాలి. అది క్రియయే కాని దానికి కర్త లేదు అనడం పరస్పర విరుద్ధ మైన మాట.

వి. "ఘటః పతతి" (ఘటం పడుచున్నది) అన్నప్పుడు పతనక్రియలో కర్త ఘటం. అట్లే ఘటః ఉత్పద్యతే (ఘటం పుట్టుచున్నది) అన్నప్పుడు కూడ ఉత్పత్తి క్రియలో ఘటం కర్త అని అంగీకరించాలి. ఉత్పత్తికి పూర్వం ఘటం లేకపోతే లేని ఘటం కర్త ఎలా అవుతుంది? అందుచేత ఉత్పత్తికి పూర్వం కూడ ఘటం ఉన్న దని అంగీకరించాలి అని ఈ ఘట్టంలో ప్రతిపాదించ బడుతున్నది.

ఘటస్యేతి :- (ఉత్పత్తికి పూర్వం ఘటం లేదనే పక్షంలో) ఘటానికి చెప్పబడిన ఉత్పత్తికి కర్త ఘటం కాదు మరేదో అని కల్పించవలసి వస్తుంది. అదే విధంగా

ఘటావయవాలైన కపాలాదుల ఉత్పత్తిక్రియలో కూడ మరేదో కర్త (కపాలాదులు కావు) అని కల్పించవలసి వస్తుంది. అప్పుడు "ఘటః ఉత్పద్యతే" అనగా కులాలాది కారణాలు ఉత్పన్న మవుతున్నాయి అని చెప్పిన ట్లవుతుంది. లోకంలో 'ఘటోత్పత్తిః' అనగానే కులాలాదులు కూడ పుట్టడం అనేది తెలియడం లేదు. అంతే కాక ఘటం పుట్టుచున్నది అని మాత్రమే (ఈ మాటవల్ల) తెలుస్తూన్నది. అలా కాదు; కార్యం తన ఉపాదానకారణంతో సంబంధించడం, లేదా 'సత్త' (ఉండుట) అనే జాతితో సంబంధించడం, ఇదే దాని ఉత్పత్తి, ఇదే దాని ఆత్మలాభం (స్వరూపప్రాప్తి) అన్నట్లయితే - అలబ్ధాత్మక మైనది (ఏది తన స్వరూపాన్నే పొందలేదో అది) మరొకదానితో ఎలా సంబంధిస్తుంది? సంబంధం అనేది ఉన్న రెండు వస్తువులకు కుదురుతుంది గాని ఒక సత్తుకు ఒక అసత్తుకూ లేదా రెండు అసత్తులకు కుదరదు కదా? ఇంకొక విషయమేమనగా - అభావానికి అనగా అసత్తు కి ఒక స్వరూపం అనేది ఉండదు. అలాంటి దానికి ఉత్పత్తికి పూర్వం అని మర్యాద (అవధి) ఏర్పరచడం కుదరదు. లోకంలోఉన్న పొలాలు, ఇళ్లు మొదలైనవాటికి మర్యాద కనబడుతున్నది గాని అభావానికి (అసత్తుకు) మర్యాద కనబడదు. పూర్ణవర్మకు రాజ్యాభిషేకం చేయడానికి ముందు వంధ్యాపుత్రుడు రాజుగా ఉన్నాడు అని, ఈ విధమైన మర్యాదను చేయడంచేత నిరుపాఖ్యుడైన (స్వరూపంలేని) వంధ్యాపుత్రుడు రాజు అయ్యాడు, రాజుగా ఉన్నాడు, రాజు అవబోతాడు అని విశేషించడం కుదరదు కదా? కారక వ్యాపారం (కర్తృ - కర్మ - కరణాదివ్యాపారం) తరవాత వంధ్యాపుత్రునికి స్థితి ఏర్పడితే అప్పుడు కార్యాభావం కూడ (అసత్తైన కార్యం కూడ) కారకవ్యాపారం తరవాత ఉండగలదు (పుట్టగలదు) అనడం యుక్తంగా ఉండేది. మేమైతే ఇలా భావిస్తున్నాం. వంధ్యాపుత్రుడు కార్యాభావమూ కూడ అభావాలే (అసత్తులే). ఈ విధంగా అసత్త్వంలో విశేషం ఏదీ లేక పోవడంచేత కారకవ్యాపారం తరవాత కూడ వంధ్యాపుత్రుడు ఏ విధంగా ఉండబోడో అదే విధంగా కార్యాభావం కూడ (అసత్కార్యం కూడ) కారక వ్యాపారానంతరం పుట్టబోదు.

## భాష్యమ్

నన్వేవం సతి కారకవ్యాపారః అనర్థకః ప్రసజ్యేత. యథైవ హి ప్రాక్సిద్ధత్వాత్కరణస్య స్వరూపసిద్ధయే న కశ్చిద్వ్యాప్రియతే, ఏవం ప్రాక్సిద్ధత్వాత్తదనన్యత్వాచ్చ కార్యస్య స్వరూపసిద్ధ యేఽపి న కశ్చిద్వ్యాప్రియేత.

వ్యాప్రియతే చ. అతః కారకవ్యాపారార్థవత్త్వాయ మన్యామహే ప్రాగుత్పత్తే రభావః కార్యస్యేతి. నైష దోషః. యతః కార్యాకారేణ కారణం వ్యవస్థాపయతః కారకవ్యాపారస్యార్థవత్త్వముపపద్యతే. కార్యాకారోఽపి కారణస్యాత్మభూత ఏవ, అనాత్మభూతస్య అనారభ్యత్వాదిత్యభాణి. న చ విశేషదర్శనమాత్రేణ వస్త్వన్యత్వం భవతి. న హి దేవదత్తః సంకుచితహస్తపాదః ప్రసారితహస్త పాదశ్చ విశేషేణ దృశ్యమానోఽపి వస్త్వన్యత్వం గచ్ఛతి. స ఏవేతి ప్రత్యభి జ్ఞానాత్. తథా ప్రతిదినమనేకసంస్థానానామపి పిత్రాదీనాం న వస్త్వన్యత్వం భవతి. మమ పితా, మమ భ్రాతా, మమ పుత్ర ఇతి ప్రత్యభిజ్ఞానాత్. జన్మోచ్ఛే దానన్తరితత్వాత్తత్ర యుక్తం నాన్యత్రేతి చేత్, న క్షీరాదీనామపి దధ్యాకారసం స్థానస్య ప్రత్యక్షత్వాత్. అదృశ్యమానానామపి వటధానాదీనాం సమానజాతీయా వయవాన్తరోపచితానామఙ్కురాదిభావేన దర్శనగోచరతాపత్తౌ జన్మసంజ్ఞా, తేషామేవావయవానామ పచయవశాదదర్శనాపత్తావుచ్ఛేదసంజ్ఞా. తత్రేదృగ్జన్మోచ్ఛేదాన్తరితత్వాచ్చేదసతః సత్త్వాపత్తిః సతశ్చాసత్త్వాపత్తిః తథా సతి గర్భవాసిన ఉత్తానశాయినశ్చ భేదప్రసఙ్గః. తథా చ బాల్యయౌవనస్థావిరేష్వపి భేదప్రసఙ్గః, పిత్రాదివ్యవహారలోపప్రసఙ్గశ్చ. ఏతేన క్షణభఙ్గవాదః ప్రతివదితవ్యః.

బాలానందిని

నన్వితి:- (ప్రశ్న) - అట్లయితే కారకాల వ్యాపారం వ్యర్థం కావలసి వస్తుంది. కారణం పూర్వమే ఉండడంచేత దాని స్వరూప సిద్ధికొరకు ఎవ్వడూ కూడ ఏ విధంగా వ్యాపారం (ఉద్యమం) చెయ్యడో, అదే విధంగా కార్యం కూడ పూర్వమే సిద్ధంగా ఉండడంచేత, కారణం కంటె అనన్యం అవడంచేత కార్యంయొక్క స్వరూపసిద్ధి కోసం కూడ ఎవ్వడూ వ్యాపారం చేయకుండా ఉండాలి. కాని చేస్తూనే ఉన్నాడు. అందువల్ల కారకవ్యాపారం సార్థకం అవడం కొరకు, ఉత్పత్తికి పూర్వం కార్యం లేదు. (సమాధానం) ఇది దోషం కాదు. కారకవ్యాపారం కారణాన్ని కార్యాకారంలో ఉంచుతుంది గాన దానికి సార్థకత్వం కుదురుతుంది. కార్యాకారం కూడ కారణంయొక్క ఆత్మయే (స్వరూపమే). అది కారణాన్యాత్మఅయితే (కారణస్వరూపం కాకపోతే) దానిని పుట్టించడం శక్యం కాదు అని (వెనుక) చెప్పబడింది. ఏదో విశేషం కనబడినంతమాత్రంచేత వస్తువుకు **అన్యత్వం రాదు (ఆ వస్తువు మరొక వస్తువు**

అయిపోదు). దేవదత్తుడు చేతులూ కాళ్లూ ముడుచుకొని ఉన్నా, చాపుకొని ఉన్నా, ఆ విశేషంతో కనబడుతున్నా కూడ, మరొక వస్తువుగా అయిపోడు గదా? అతడే ఇతడు అని గుర్తింప బడుతున్నాడు కదా? అదే విధంగా ప్రతి రోజూ అనేకమైన భంగిమలలో ఉన్నా కూడ తండ్రి మొదలైనవాళ్లు వేరు వేరు వస్తువులయిపోరు. ఇతడు నా తండ్రి, నా సోదరుడు, నా పుత్రుడు అని ప్రత్యభిజ్ఞ ఉన్నది కదా? (తండ్రి మొదలైనవాళ్ల విషయంలో) వాళ్లు జన్మోచ్ఛేదాలచేత వ్యవహితులు కాక పోవడంచేత అక్కడ నీవు చెప్పినది యుక్తమే కాని ఇతర స్థలాలలో కాదు అన్నట్లయితే - (అనగా మట్టి నుండి కుండ పుట్టి నప్పుడు మట్టి నశించడం, కుండ పుట్టడం అనేవి జరుగుతున్నాయి. అలాంటివాటిచేత పిత్రాదుల విషయంలో విచ్ఛేదం లేదు గాన అక్కడ యుక్తమే కాని ఇక్కడ కాదు అని అర్థం) ఈ ఆశంక యుక్తం కాదు. ఎందువల్ల ననగా క్షీరాదులు దధ్యాద్యాకారం చెందడం కూడ ప్రత్యక్షంగా కనబడుతూన్నది. మఱ్ఱి విత్తు మొదలైనవి కనబడక పోయినా అవి వాటికి సమానజాతీయాలైన ఇతరావయవాలు చేరి పెరగగా అంకురాదిరూపంలో కనబడినప్పుడు జన్మ అని పేరు. ఆ అవయవాలే తగ్గిపోయి నప్పుడు అవి కనబడకుండా పోవడంతో దానికి ఉచ్ఛేదం (నశించడం) అని పేరు. కేవలం ఇలాంటి జన్మనూ ఉచ్ఛేదాన్నీ పట్టి అసత్ సత్ అవుతుందనీ, సత్ అసత్ అవుతుందనీ చెపితే గర్భంలో ఉన్న శిశువు వేరు, అదే పక్కమీద వెల్లగిలా పండుకొని ఉన్నప్పుడు ఆ శిశువు వేరు అని చెప్పవలసి వస్తుంది. అట్లే బాల్యం, యౌవనం వార్ధకం వీటిలో కూడ (ఆ వ్యక్తి వేరు అని) చెప్పవలసి వస్తుంది. 'తండ్రి' మొదలైన వ్యవహారానికి కూడ లోపం వస్తుంది. (కొంత కాలం క్రితం ఉన్నవానికీ ఇప్పటివానికీ మీ అభిప్రాయం ప్రకారం ఏకత్వం ఉండ కూడదు కదా అని భావం). దీని చేత బౌద్ధులు అంగీకరించిన క్షణభంగవాదం (ఇది మున్ముందు రాగలదు) నిరాకరించ దగినది.

## భాష్యమ్

యస్య పునః ప్రాగుత్పత్తేరసత్కార్యం తస్య నిర్విషయః కారక వ్యాపారః స్యాత్, అభావస్య విషయత్వానుపపత్తేః, ఆకాశస్య హనన ప్రయోజనఖడ్గాద్యనేకాయుధప్రసక్తివత్. సమవాయికారణవిషయః కారక వ్యాపారః స్యాదితి చేత్, న. అన్యవిషయేణ కారకవ్యాపారేణ అన్యనిష్పత్తే రతి ప్రసంగాత్. సమవాయికారణస్యైవాత్మాతిశయః కార్యమితి చేత్, న. సత్కార్యతాపత్తేః. తస్మాత్ క్షీరాదీన్యేవ ద్రవ్యాణి దధ్యాదిభావేన అవతి

ష్ఠమానాని కార్యాఖ్యాం లభన్తే ఇతి న కారణాదన్యత్కార్యం వర్షశతేనాపి శక్యం నిశ్చేతుమ్. తథా మూలకారణమేవాన్త్యాత్కార్యాత్తేన తేన కార్యాకారేణ నటవత్సర్వవ్యాపారాస్పదత్వం ప్రతిపద్యతే. ఏవం యుక్తేః కార్యస్య ప్రాగుత్పత్తేః సత్త్వమనన్యత్వం చ కారణాదవగమ్యతే.

## బాలానందిని

యస్యేతి :- ఉత్పత్తికి పూర్వం కార్యం లేదు అనే వానికే కారకవ్యాపారం నిర్విషయం (విషయం లేనిది) అవుతుంది. చంపడానికి ఉపయోగించే ఖడ్గాదులైన అనేకాయుధాల ప్రసక్తి ఆకాశానికి ఏ విధంగా ఉండదో అభావం కూడ కర్త్రాదికారకాల వ్యాపారానికి విషయం కాజాలదు. కారకవ్యాపారం సమవాయికారణాన్ని గూర్చినది (నికి సంబంధించినది) అవుతుంది అని అంటే అది యుక్తం కాదు. ఒక దానిని విషయంగా చేసికొని చేసే కారకవ్యాపారంవల్ల మరొకటి పుడితే (సమవాయికారణ విషయకవ్యాపారంవల్ల ఆ కారణంకన్న భిన్నమైన కార్యం పుడితే) అతిప్రసంగం ఏర్పడుతుంది. (వ్యాపారం ఒక చోట పుట్టేది మరొకటి అని చెప్పినట్లవుతుంది). (ఏ సమావాయికారణం విషయంలో కారకవ్యాపారం జరుగుతుందో) దాని స్వరూపంలోని ఒకానొక అతిశయమే (వైశిష్ట్యమే) కార్యం అన్నట్లయితే అది యుక్తం కాదు. అలా చెప్పిన పక్షంలో సత్కార్యవాదాన్నే అంగీకరించి నట్లవుతుంది. అందువల్ల, క్షీరాదిద్రవ్యాలే దధ్యాదిరూపాలలో ఉన్నప్పుడు వాటికి కార్యం అనే పేరు లభిస్తుంది. అందుచేత కార్యం కారణంకంటె అన్యం అని నిర్ణయించడం నూరు సంవత్సరాలు వాదించినా కూడ శక్యం కాదు. ఈ విధంగా మూలకారణ మైన బ్రహ్మయే చిట్టచివరి కార్యం వరకు ఆ యా కార్యాల ఆకారాలలో ఉంటూ, నటుడు వలె, సమస్త వ్యవహారాలకి స్థానం అవుతున్నది. ఈ విధంగా యుక్తి బలంచేత కార్యం ఉత్పత్తికి పూర్వం సత్ అనీ, కారణంకంటె అనన్యం అనీ తెలుస్తూన్నది. (ఇది "యుక్తేః శబ్దాన్తరాచ్చ" అనే సూత్రంలోని "యుక్తేః" అనేదానికి వివరణం).

## భాష్యమ్

శబ్దాన్తరాచ్చైతదవగమ్యతే. పూర్వసూత్రే అసద్వ్యపదేశినః శబ్దస్యో దాహృతత్వాత్ తతోఽన్యః సద్వ్యపదేశీ శబ్దః శబ్దాన్తరమ్ - "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్" ఇత్యాది. "తద్ధైక ఆహురసదేవేదమగ్ర ఆసీత్" ఇతి చాసత్పక్షముపక్షిప్య, "కథమసతః సజ్జాయేత" ఇత్యాక్షిప్య "సదేవ

సోమ్యేదమగ్ర ఆసీత్" (ఛా. ఉ. 6.2.1) ఇత్యవధారయతి. తత్రేదంశబ్ద వాచ్యస్య కార్యస్య ప్రాగుత్పత్తేః సచ్ఛబ్దవాచ్యేన కారణేన సామానాధికరణ్యస్య శ్రూయమాణత్వాత్ సత్త్వానన్యత్వే ప్రసిధ్యతః. యది తు ప్రాగుత్పత్తే రసత్కార్యం స్యాత్, పశ్చాచ్చోత్పద్యమానం కారణే సమవయేత్ తదాన్యత్ కారణాత్స్యాత్, తత్ర - "యేనాశ్రుతం శ్రుతం భవతి" (ఛా. ఉ. 6.1.3) ఇతీయం ప్రతిజ్ఞా పీడ్యేత. సత్త్వానన్యత్వావగతేస్త్వియం ప్రతిజ్ఞా సమర్థ్యతే. 18.

## బాలానందిని

శబ్దేతి :- ఈ విషయం శబ్దాంతరంనుండి కూడ తెలియ బడుతున్నది. పూర్వ సూత్రంలో అసత్‌ను చెప్పిన శబ్దం ఉదాహరించబడింది. అందుచేత దానికంటె భిన్నమైన సత్‌ను చెప్పే శబ్దం శబ్దాంతరం - "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయం బ్రహ్మ" ఇత్యాదికం. "తద్ధైక ఆహురసదేవేదమగ్ర ఆసీత్" అని అసత్పక్షాన్ని (సృష్టికి పూర్వం అసత్తు ఉండేది అనే పక్షాన్ని) చెప్పి, "కథ మసతః సజ్జాయేత" అని ఆ పక్షాన్ని ఆక్షేపించి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అని నిర్ధారణ చేస్తున్నాడు. ఆ వాక్యంలో ఇదంశబ్దంచేత చెప్పబడే కార్యానికి ఉత్పత్తికి పూర్వం ఉన్న సచ్ఛబ్దవాచ్యమైన కారణంతో సామానాధికరణ్యం (ఈ కార్యం ఆ సత్ అని) వినబడుతున్నది. దీనిని పట్టి కార్యానికి కూడ సత్త్వం అనన్యత్వం (కారణాభేదం) సిద్ధిస్తున్నాయి. కార్యం ఉత్పత్తికి పూర్వం అసత్తే అయి. ఉత్పత్త్యనంతరం కారణంతో (సమవాయసంబంధంచేత) కలిస్తే అప్పుడు కారణంకంటె అన్యమే అవుతుంది. అప్పుడు "యేనాశ్రుతం శ్రుతం భవతి" అనే ప్రతిజ్ఞ పీడింపబడుతుంది. కాని కార్యానికి సత్త్వమూ, అనన్యత్వమూ తెలుస్తున్నాయి గాన ఈ ప్రతిజ్ఞ సమర్థించబడుతుంది. 18.

## సూ. పటవచ్చ 2.1.19

యథా చ సంవేష్టితః పటః న వ్యక్తం గృహ్యతే కిమయం పటః కిం వాన్యద్ద్రవ్యమితి, స ఏవ ప్రసారితో యత్సంవేష్టితం ద్రవ్యం తత్పట ఏవేతి ప్రసారణేనాభివ్యక్తో గృహ్యతే, యథా చ సంవేష్టనసమయే పట ఇవ గృహ్యమాణోఽపి న విశిష్టాయామవిస్తారో గృహ్యతే, స ఏవ ప్రసారణసమయే విశిష్టాయామవిస్తారో గృహ్యతే న సంవేష్టితరూపాదన్యోఽయం భిన్నః పట ఇతి, ఏవం తన్త్వాదికారణావస్థం పటాదికార్యమస్పష్టం సత్ తురీవేమ కువిన్దాదికారకవ్యాపారాదిభిర్వ్యక్తం స్పష్టం గృహ్యతే. అతః సంవేష్టిత ప్రసారితపటన్యాయేనైవానన్యత్కారణాత్కార్యమిత్యర్థః 19.

బాలానందిని

పటేతి :- "పట వచ్చ "వస్త్రం వలె కూడ కార్యం కారణంకంటె అభిన్న మైనది" అని సూత్రార్థం.

**యథా చేతి** :- మడత పెట్టిన వస్త్రం ఇది వస్త్రమా లేక మరొక వస్తువా అని స్పష్టంగా తెలియదు. దానినే విప్పినప్పుడు మడత పెట్టబడిన ద్రవ్యం పటమే అని దానిని విడదీయడంచేత స్పష్టంగా గ్రహించబడుతుంది. మడత పెట్టినప్పుడు ఇది వస్త్రం అని తెలిసినా కూడ దాని పొడవు వెడల్పు మొదలైన విశేషాలు తెలియవు. దానిని పరచినప్పుడు దాని విశిష్టమైన ఆయామవిస్తారాలు తెలుస్తాయి. మడత పెట్టిన దానికంటె ఇది వేరైనది అని గ్రహించబడదు. అట్లే తంతువులు మొదలైన కారణాల స్వరూపంలో ఉన్న పటాదికార్యం అస్పష్టంగా ఉండి తురి (నేసే సాధనం) మగ్గం, సాలెవాడు మొదలైన కారకాల వ్యాపారంచేత అభివ్యక్తమై స్పష్టంగా గ్రహించబడుతుంది. అందుచేత మడత పెట్టిన - మడత విప్పిన వస్త్రంయొక్క న్యాయం చేతనే కార్యం కారణంకంటె అనన్య మైనది అని అర్థం. 19.

## సూ. యథా చ ప్రాణాది. 2.1.20.

యథా చ లోకే ప్రాణాపానాదిషు ప్రాణభేదేషు ప్రాణాయామేన నిరుద్ధేషు కారణమాత్రరూపేణ వర్తమానేషు జీవనమాత్రం కార్యం నిర్వర్త్యతే నాకుఞ్చనప్రసారణాదికం కార్యాన్తరం, తేష్వేవ ప్రాణభేదేషు పునః ప్రవృత్తేషు జీవనాదధికమాకుఞ్చనప్రసారణాదికమపి కార్యాన్తరం నిర్వర్త్యతే, న చ ప్రాణభేదానాం ప్రభేదవతః ప్రాణాదన్యత్వం, సమీరణస్వభావావిశేషాత్, ఏవం కార్యస్య కారణాదనన్యత్వమ్. అతశ్చ కృత్స్నస్య జగతో బ్రహ్మ కార్యత్వాత్తదనన్యత్వాచ్చ సిద్ధైషా శ్రౌతీ ప్రతిజ్ఞా "యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్" (ఛా.ఉ. 6.1.1) ఇతి. 20.

బాలానందిని

యథేతి :- లోకంలో, ప్రాణవాయువుయొక్క భేదాలే అయిన ప్రాణాపానాదులు ప్రాణాయామంచేత నిరోధింపబడి కేవలం కారణరూపంలో ఉన్నప్పుడు జీవించి ఉండడం అనే పని మాత్రమే జరుగుతుంది, అవయవాలు వంచడం, చాపడం

మొదలైన ఇతరమైన పనులు జరగవు. ఆ ప్రాణభేదాలే మళ్లీ పని చేయడం ప్రారంభించి నప్పుడు జీవనంకంటె అధికమైన ఆకుంచనప్రసారణాదికమైన కార్యాంతరం కూడ జరపబడుతుంది. అయితే ప్రాణభేదాలు (ప్రాణాపానవ్యానాదులు) ఈ భేదాలు గల ప్రాణంకంటె అన్యములు కావు; ఎందువల్ల ననగా సమీరణస్వభావంలో (వాయువు అనే స్వభావంలో ) వీటికి విశేషం (భేదం) ఏదీ లేదు. అదే విధంగా కార్యం కారణంకంటె అనన్యం. అందువల్ల సమస్త జగత్తూ కూడ బ్రహ్మయొక్క కార్యం అవడంవల్ల, ఇది బ్రహ్మకంటె అనన్యం అవడం వల్ల "యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్" అని శ్రుతిలో ఉన్న ఈ ప్రతిజ్ఞ సిద్ధమైనది. 20.

ఆరమ్భణాధికరణం సమాప్తం

## ఇతరవ్యపదేశాధికరణమ్. సూ. 21-23

### సూ. ఇతరవ్యపదేశాద్ధితాకరణాదిప్రసక్తిః 2.1.21

అన్యథా పునశ్చేతనకారణవాద ఆక్షిప్యతే. చేతనాద్ధి జగత్ప్రక్రియాయామాశ్రీయమాణాయాం హితాకరణాదయో దోషాః ప్రసజ్యన్తే. ఇతరస్య శారీరస్య బ్రహ్మాత్మత్వం వ్యపదిశతి శ్రుతిః - "స ఆత్మా తత్త్వమసి శ్వేకేతో" ఇతి ప్రతిబోధనాత్. యద్వా ఇతరస్య బ్రహ్మణః శారీరాత్మత్వం వ్యపదిశతి - "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై. ఉ. 2.6) ఇతి స్రష్టురేవ బ్రహ్మణః కార్యానుప్రవేశేన శారీరాత్మత్వప్రదర్శనాత్. "అనేన జీవేనాత్మ నాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా. ఉ. 6.3.2) ఇతి చ పరా దేవతా జీవమాత్మశబ్దేన వ్యపదిశన్తీ న బ్రహ్మణో భిన్నః శారీర ఇతి దర్శయతి. తస్మాద్యద్బ్రహ్మణః స్రష్టృత్వం తచ్ఛారీరకస్యైకవేతి. అతః స స్వతన్త్రః కర్తా సన్ హితమేవాత్మనః సౌమనస్యకరం కుర్యాన్నాహితం జన్మమరణ జరారోగాద్యనేకానర్థజాలమ్. న హి కశ్చిదపరతన్త్రో బన్ధనాగారమాత్మనః కృత్వానుప్రవిశతి. న చ స్వయమత్యన్తనిర్మలః సన్ అత్యన్తమలినం దేహమాత్మత్వేనోపేయాత్. కృతమపి కథం చిద్దుఃఖకరం తదిచ్ఛయా జహ్యాత్, సుఖకరం చోపాదదీత, స్మరేచ్చ మయేదం జగద్బిమ్బం విచిత్రం విరచితమితి. సర్వో హి ఏకః స్పష్టం కార్యం కృత్వా స్మరతి మయేదం కృతమితి. యథా

చ మాయావీ స్వయం ప్రసారితాం మాయామిచ్ఛయాऽ నాయాసేనైవ ఉపసంహరతి, ఏవం శారీరోऽపీమాం సృష్టిముపసంహరేత్. స్వకీయమపి తావచ్ఛరీరం శారీరో న శక్నోత్యనాయాసేనోపసంహర్తుమ్. ఏవం హితక్రియాద్యదర్శనాత్ అన్యాయ్యా చేతనాజ్జగత్ప్రక్రియేతి గమ్యతే. 21.

బాలానందిని

ఇతరేతి :- (ఇది పూర్వపక్షసూత్రం) "ఇతరవ్యపదేశాత్ = జీవునకు బ్రహ్మత్వాన్ని లేదా బ్రహ్మకు జీవస్వరూపత్వాన్ని ఉపదేశించడంవల్ల, హితాకరణాదిదోషప్రసక్తిః = జీవుడు తనకొరకు హితం చేసికొనకపోవడం మొదలైన దోషాల ప్రసక్తి ఉన్నది" అని సూత్రార్థం.

అన్యథేతి :- చేతనకారణవాదం మళ్లీ మరొక విధంగా ఆక్షేపించబడుతున్నది. చేతనంనుండి జగత్ప్రక్రియ (జగత్సృష్ట్యాదికం) అంగీకరించబడినట్లయితే హితాకరణం మొదలైన దోషాలు ప్రసక్త మౌతాయి. ఎందువల్ల? ఇతరవ్యపదేశంవల్ల. "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అని బోధిస్తూ శ్రుతి ఇతరుడు, అనగా శారీరుడు బ్రహ్మాత్మ అని చెపుతూన్నది. లేదా - "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతి ఇతరుడైన బ్రహ్మకు శారీరాత్మత్వాన్ని చెపుతున్నది. ఇక్కడ స్పష్టమైన బ్రహ్మ ఏ వికారాలు చెందకుండగా కార్యంలో ప్రవేశించడంచేత బ్రహ్మ శారీరాత్ముడు అని ప్రదర్శింపబడుతున్నది. "అనేన.... వ్యాకరవాణి" అని పరదేవత జీవుణ్ణి ఆత్మశబ్దంచేత నిర్దేశిస్తూ శారీరుడు బ్రహ్మకంటె భిన్నుడు కాడని చూపుతున్నది. అందువల్ల బ్రహ్మకున్న స్రష్టృత్వం (సృష్టి కర్తృత్వం) శారీరునిదే. అందుచేత శారీరుడు స్వతంత్రుడైన కర్త అయి ఉండడంవల్ల తనకు సుఖకరమైన హితాన్నే చేసుకొంటాడు గాని అహితమైన జన్మమరణజరారోగాదిక మైన అనేకవిధాలైన అనర్థసముదాయం చేసుకొనడు. పరాధీనుడు కాని ఎవ్వడు కూడ తన కొక కైదు కట్టించుకొని దానిలో ప్రవేశించడు కదా? తాను అత్యంతము నిర్మలుడై ఉండి అత్యంతమలిన మైన దేహంలోనికి, దానిని తన ఆత్మగా చేసికొని ప్రవేశించడు కూడ. ఏదో విధంగా అలా చేసినా తనకు దుఃఖం కలిగించే దానిని తన ఇష్టం ప్రకారం విడిచి వెయ్యాలి. సుఖకరమైనదానిని స్వీకరించాలి. నేను విచిత్ర మైన జగద్బింబాన్ని రచించాను అని స్మరించాలి కూడా. ప్రతివాడు కూడ స్పష్టంగా ఏదైన పని చేసి ఇది నేను చేశాను అని స్మరిస్తాడు కదా? (లేదా స్పష్టంగా స్మరిస్తాడు కదా?) మాయావి తాను ప్రసరింపచేసిన మాయను తన ఇచ్ఛ ప్రకారం ఏ విధంగా అనాయాసంగా ఉపసంహరిస్తాడో అదే విధంగా శారీరుడు కూడ ఈ సృష్టిని

ఉపసంహరించాలి. అయితే శారీరుడు తన శరీరాన్ని కూడ అనాయాసంగా ఉపసంహరించ జాలడు! ఈ విధంగా హితక్రియాదులు కనబడకపోవడంవల్ల చేతనం నుండి జగత్ప్రక్రియ అన్యాయ్య మైనది అని తోస్తుంది. 21.

౨. జీవాభిన్నమైన బ్రహ్మ జగత్తుకు ఉపాదానం అని చెప్పే సమన్వయం విషయం. అలాంటి బ్రహ్మ జగత్తును సృష్టిస్తే తనకు అనిష్టమైనదానిని సృష్టించగూడదు అనే తర్కానికి పైన చెప్పిన విషయం విరుద్ధమా కాదా అని సంశయం. జీవధర్మాలైన హితాకరణాదులు బ్రహ్మకు కూడ ప్రసక్తం అవుతాయి అని ఆక్షేపసంగతిచేత పూర్వపక్షం.

## సూ. అధికం తు భేదనిర్దేశాత్. 2.1.22

తుశబ్దః పక్షం వ్యావర్తయతి. యత్సర్వజ్ఞం సర్వశక్తి బ్రహ్మ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం శారీరాదధికమన్యత్, తద్వయం జగతః స్రష్టృ బ్రూమామః. న తస్మిన్ హితాకరణాదయో దోషాః ప్రసజ్యన్తే. న హి తస్య కించిత్కర్తవ్యమస్తి, అహితం వా పరిహర్తవ్యమ్, నిత్యముక్తస్వభావత్వాత్. న చ తస్య జ్ఞానప్రతిబన్ధః శక్తిప్రతిబన్ధో వా క్వచిదప్యస్తి, సర్వజ్ఞత్వాత్ సర్వశక్తిత్వాచ్చ. శారీరస్త్వనేవంవిధః; తస్మిన్ ప్రసజ్యన్తే హితాకరణాదయో దోషాః. న తు తం వయం జగతః స్రష్టారం బ్రూమః. కుత ఏతత్? భేదనిర్దేశాత్. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః (బృ.ఉ. 2.4.5), "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః (ఛాం. ఉ. 8.7.1), "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛా. ఉ. 6.8.1) ఇతి, "శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢః". (బృ.ఉ. 4.3.35) ఇత్యేకవంజాతీయకః కర్తృకర్మాదిభేదనిర్దేశః జీవాదధికం బ్రహ్మ దర్శయతి.

### బాలానందిని

అధికమితి :- "తు=కాని, భేదనిర్దేశాత్ = శారీరపరమాత్మలకు భేదం నిర్దేశించడం వల్ల, అధికమ్ = శారీరునికంటె అధికమైన బ్రహ్మ సృష్టి చేసినది" అని సూత్రార్థం.

తుశబ్ద ఇతి :- తుశబ్దంపూర్వపక్షాన్ని నివారిస్తున్నది. శారీరునికంటె అధికమైన సర్వజ్ఞమూ, సర్వశక్తమూ, నిత్య - శుద్ధ - బుద్ధ - ముక్త స్వభావమూ అయిన ఏ బ్రహ్మ ఉన్నదో అదే జగత్కారణం అని మేం చెపుతున్నాం. ఆ బ్రహ్మ విషయంలో హితం చేసి కొనకపోవడం మొదలైన దోషాలు ప్రసక్తములు కావు. ఆ బ్రహ్మ నిత్యముక్త

స్వభావం గాన దానికి చేయవలసిన హితకార్యం గాని, పరిహరించ దగిన అహితకార్యం కాని ఏదీ లేదు. అది సర్వజ్ఞం, సర్వశక్తి. అందుచేత దానికి ఎక్కడా కూడ జ్ఞాన ప్రతిబంధం గాని, శక్తి ప్రతిబంధం గాని లేదు. శారీరుడైతే ఇలాంటి వాడు కాడు గాన వాని విషయంలో ఈ హితాకరణాదిదోషాలు ప్రసక్తములు కావచ్చును. అయితే మేం శారీరుడు జగత్తును సృష్టించాడు అని చెప్పడం లేదు. ఇది ఎందువల్ల? భేదనిర్దేశం వల్ల. "ఆత్మా... నిదిధ్యాసతవ్యః", "సోఽ న్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" "సతా... భవతి", "శారీర... అన్వారూఢః" ఈ మొదలైన కర్తృకర్మాదిభేదనిర్దేశం (శారీరుడు కర్త అని బ్రహ్మ కర్మ అనీ వేరు వేరుగా నిర్దేశించడం) బ్రహ్మ జీవునికంటె అధికమైన దని (వేరైన దని) చూపుతున్నది.

## భాష్యమ్

నన్వభేదనిర్దేశోఽ పి దర్శితః "తత్త్వమసి" ఇత్యేవంజాతీయకః. కథం భేదాభేదా విరుద్ధౌ సంభవేయాతామ్? నైష దోషః. ఆకాశ ఘటాకాశన్యాయేన ఉభయసంభవస్య తత్ర తత్ర ప్రతిష్ఠాపితత్వాత్. అపి చ యదా 'తత్త్వమసి' ఇత్యేవం జాతీయకేనాభేదనిర్దేశేనాభేదః ప్రతిబోధితో భవత్యపగతం భవతి తదా జీవస్య సంసారిత్వం బ్రహ్మణశ్చ స్రష్టృత్వమ్, సమస్తస్య మిథ్యాజ్ఞాన విజృమ్భితస్య భేదవ్యవహారస్య సమ్యగ్జ్ఞానేన బాధిత్వాత్. తత్ర కుత ఏవ సృష్టిః, కుతో వా హితాకరణాదయో దోషాః? అవిద్యాప్రత్యుపస్థాపిత నామరూపకృతకార్యకరణసంఘాతోపాధ్యవివేకకృతా హి భ్రాన్తిర్హితాకరణాది లక్షణః సంసారో న తు పరమార్థతోఽ స్తీ త్యసకృదవోచామ, జన్మమరణ చ్ఛేదనభేదనాద్యభిమానవత్. అబాధితే తు భేదవ్యవహారే "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" ఇత్యేవం జాతీయకేన భేదనిర్దేశేనావగమ్యమానం బ్రహ్మణో ఽధికత్వం హితాకరణాదిదోషప్రసక్తిం నిరుణద్ధి. 22.

## బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) ''తత్త్వమసి'' ఇత్యాదివాక్యాలచేత అభేదనిర్దేశం కూడ చూపబడింది కదా? విరుద్ధాలైన భేదాభేదాలు ఎలా సంభవిస్తాయి? (సమాధానం) ఈ దోషం లేదు. ఆకాశ- ఘటాకాశన్యాయంచేత భేదాభేదాలు రెండూ సంభవిస్తాయి అని (వెనుక) అక్కడక్కడ స్థాపించబడింది కదా? మరొక విషయం ఏ మనగా ''తత్త్వమసి'' ఇత్యాదికమైన అభేదనిర్దేశంచేత అభేదం బోధించబడినప్పుడు,

మిథ్యాజ్ఞానంచేత విజృంభించిన భేద వ్యవహారం అంతా సమ్యగ్జ్ఞానంచేత బాధించబడుతుంది గాన, అప్పుడు జీవుని సంసారిత్వమూ పోతుంది, బ్రహ్మయొక్క స్రష్టృత్వమూ పోతుంది. అప్పుడింక సృష్టి ఎక్కడ హితాకరణాదిదోషాలెక్కడ? హితాకరణాదిరూప మైన సంసారం, జన్మ-మరణ - ఛేదన - భేదనాద్యభిమానం వలె (వీటిని గూర్చిన భ్రాంతివలె), అవిద్యచేత ఏర్పడిన నామ రూపాలచేత కల్పితమైన కార్యకరణ (దేహేంద్రియాది) సముదాయరూపమైన ఉపాధితో వివేకం లేకపోవడంచేత ఏర్పడిన భ్రాంతియే కాని వాస్తవంలో కాదని అనేక పర్యాయాలు చెప్పి ఉన్నాం. భేదవ్యవహారం బాధించబడ నంతవరకు "సో న్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" ఇత్యాదిభేదనిర్దేశం చేత తెలియబడుతున్న బ్రహ్మయొక్క అధికత్వం హితాకరణాదిదోషాల ప్రసక్తిని అడ్డుకొంటుంది. (అనగా వ్యావహారికమైన ఈ భేదబుద్ధి ఉన్నంతవరకు జీవుని కంటె బ్రహ్మ అధికమే కాన, ఆ బ్రహ్మ సృష్టికర్త గాన హితాకరణాదిదోషాల ప్రసక్తి లేదు అని అర్థం) 22.

## సూ. అశ్మాదివచ్చ తదనుపపత్తిః 2.1.23

యథా చ లోకే పృథివీత్వసామాన్యాన్వితానామప్యశ్మనాం కే చిన్మహార్హా మణయో వజ్రవైడూర్యాదయః, అన్యే మధ్యమవీర్యాః సూర్య కాన్తాదయః, అన్యే ప్రహీణాః శ్వవాయసప్రక్షేపణార్హాః పాషాణా ఇత్యనే కవిధం వైచిత్ర్యం దృశ్యతే, యథా చ ఏకపృథివీవ్యపాశ్రయాణామపి బీజానాం బహువిధం పత్రపుష్పఫలగన్ధరసాదివైచిత్ర్యం చందనకింపాకాది షూపలక్ష్యతే, యథా చైకస్యాప్యన్నరసస్య లోహితాదీని కేశలోమాదీని చ విచిత్రాణి కార్యాణి భవన్తి ఏవమేకస్యాపి బ్రహ్మణో జీవప్రాజ్ఞపృథక్త్వం, కార్యవైచిత్ర్యం చోపపద్యేత ఇత్యతస్తదనుపపత్తిః, పరపరికల్పితదోషానుపపత్తిరిత్యర్థ. శ్రుతేశ్చ ప్రామాణ్యాత్, వికారస్య వాచారమ్భణమాత్రత్వాత్, స్వప్నదృశ్యభావవైచిత్ర్యవచ్చేత్యభ్యుచ్చయః. 23.

### బాలానందిని

అశ్మేతి :-"అశ్మాదివత్ చ = రాళ్లు మొదలైన వాటియందు వలె కార్యవైచిత్ర్యం కుదురుతుంది గాన, తదనుపపత్తిః = పరులు చేసిన ఆక్షేపణకు ఉపపత్తి లేదు" అని సూత్రార్థం.

యథేతి :- అన్ని రాళ్లలోను పృథివీత్వం అనే జాతి సమంగానే ఉన్నా కూడ వజ్రవైదూర్యాదిమణులు కొన్ని చాలా విలువ యైనవి ఉంటాయి. సూర్యకాంతం మొదలైనవి కొన్ని మధ్యమమైన వీర్యం కలవి ఉంటాయి. కొన్ని చాల తక్కువ రకమైన కుక్కల్నీ కాకుల్నీ తోలడానికి విసిరేవి ఉంటాయి. ఈ విధంగా ఆ రాళ్లల్లో అనేక విధాలైన వైచిత్ర్యం కనబడుతున్నది. ఒకే నేలమీద మొలిచే విత్తనాలలో చందన - కింపాకాదులయందు అనేకవిధాలైన ఆకులు, పువ్వులు, పండ్లు, వాసన, రుచి మొదలైనవాటియొక్క వైచిత్ర్యం కనబడుతున్నది. ఒకే అన్నరసానికి రక్తం మొదలైన, కేశాలు, రోమాలు మొదలైన విచిత్రమైన కార్యాలు ఉంటాయి. అదే విధంగా ఒకే బ్రహ్మకు జీవుడు, ప్రాజ్ఞుడు అనే భేదం, కార్యవైచిత్ర్యమూ కూడ ఉపపన్నాలవుతాయి గాన, తదనుపపత్తి, అనగా పరులు చూపిన దోషాలకు అనుపపత్తి, అని అర్థం. శ్రుతి ప్రామాణ్యాన్ననుసరించి వికారం అంతా వాచారంభణమాత్రమే కదా? (సూత్రంలోని చ శబ్దంచేత) స్వప్నంలో కనబడే దృశ్యములైన భావాల (వస్తువుల) వైచిత్ర్యం వలె ఈ భేదం కుదురుతుంది అని అభ్యుచ్చయం (మరొక సమాధానం కూడ). 23.

ఇతరవ్యపదేశాధికరణం సమాప్తం

## 8. ఉపసంహారదర్శనాధికరణమ్. సూ. 24-25

## సూ. ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి. 2.1.24

చేతనం బ్రహ్మ ఏకమద్వితీయం జగతః కారణమితి యదుక్తం తన్నోపపద్యతే. కస్మాత్? ఉపసంహారదర్శనాత్. ఇహ హి కులాలాదయో ఘటపటాదీనాం కర్తారో మృద్దణ్డచక్రసూత్రాద్యనేకకారకోపసంహారేణ సంగృహీతసాధనాః సన్తస్తత్తత్కార్యం కుర్వాణా దృశ్యన్తే. బ్రహ్మ చాసహాయం తవాభిప్రేతమ్. తస్య సాధనాన్తరానుపసంగ్రహే సతి కథం స్రష్టృత్వముపపద్యేత? తస్మాన్న బ్రహ్మ జగత్కారణమితి చేత్. నైష దోషః యతః క్షీరవద్ద్రవ్యస్వభావవిశేషాదుపపద్యతే. యథాహి లోకే క్షీరం జలం వా స్వయమేవ దధిభావేన పరిణమతే అనపేక్ష్య బాహ్యం సాధనం తథేహాపి భవిష్యతి. నను క్షీరాద్యపి దధ్యాదిభావేన పరిణమమానమపేక్షత ఏవ బాహ్యం సాధనమౌష్ణ్యాదికం, కథముచ్యతే క్షీరవద్ధీతి. నైష దోషః. స్వయమపి చ క్షీరం యాం చ యావతీం చ పరిణామమాత్రామనుభవతి తావత్యేవ

త్వార్యతే త్వౌష్ణ్యాదినా దధిభావాయ. యది చ స్వయం దధిభావశీలతా న స్యాత్ నైవౌష్ణ్యాదినాపి బలాద్దధిభావమాపద్యేత. న హి వాయురాకాశో వా బలాద్దధిభావమాపద్యతే, సాధనసామగ్ర్యా చ తస్య పూర్ణతా సంపాద్యతే. పరిపూర్ణశక్తికం తు బ్రహ్మ,న తస్యాన్యేన కేన చిత్పూర్ణ తా సంపాదయితవ్యా. శ్రుతిశ్చ భవతి -

"న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే,
పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"

(శ్వే. ఉ. 6.2) ఇతి. తస్మాదేకస్యాపి బ్రహ్మణో విచిత్రశక్తియోగాత్ క్షీరాదివద్విచిత్రపరిణామ ఉపపద్యతే. 24.

బాలానందిని

ఉపసంహారేతి :- "ఉపసంహారదర్శనాత్ = లోకంలో కర్త ఆ యా సాధనాలను సమకూర్చుకొనడం కనబడడంవల్ల, న = బ్రహ్మ కారణం కాదు, ఇతి చేత్ = అన్నట్లయితే,న = అట్లు కాదు, హి = ఎందువలన అనగా, క్షీరవత్ = క్షీరం వలె కార్యరూపంలో పరిణామం స్వయంగానే కుదురుతుంది" అని సూత్రార్థం.

చేతనమితి :- చేతనము, ఏకము, అద్వితీయమూ అయిన బ్రహ్మ జగత్తుకు కారణం అని చెప్పినది యుక్తం కాదు. ఎందువల్ల? ఉపసంహారదర్శనంవల్ల. ఈ లోకంలో ఘటపటాదులను తయారు చేసే కుమ్మర్లు మొదలైనవాళ్లు మట్టి, కఱ్ఱ,చక్రం, దారం మొదలైన అనేకకారకాలను సమకూర్చుకొనడం ద్వారా సాధనాలు సంగ్రహించుకొని ఆ యా కార్యాన్ని చేస్తున్నట్లు కనబడుతున్నారు. బ్రహ్మకు ఏ సాహాయ్యమూ లేదని నీ అభిప్రాయం. ఇతరసాధనాలను సమకూర్చుకొనకుండా బ్రహ్మ ఎలా సృష్టించకలుగుతుంది? అందువల్ల బ్రహ్మ జగత్కారణం కాదు అన్నట్లయితే -

వి. ఏ సహాయమూ లేని బ్రహ్మ జగత్తును సృష్టించినది అనే సమన్వయం విషయం. అసహాయమైన కారణం కార్యాన్ని పుట్టింప జాలదు అనే ప్రసిద్ధమైన న్యాయానికి ఇది విరుద్ధమా కాదా అని సందేహం. ఉపాధికృతమైన జీవభేదం ఉండడం వల్ల బ్రహ్మయందు జీవుని దోషాలు ప్రసక్తాలు కావు అని వెనుకటి అధికరణంలో సిద్ధాంతీకరించబడింది. ఉపాధిచేత విభక్తమైనది కూడ ఏదీ బ్రహ్మకు సహాయ పడేది లేదు, ఈశ్వరులు చాలామంది లేరు కదా అని ప్రత్యుదాహరణ సంగతిచేత పూర్వ పక్షం చేయబడింది.

నైష ఇతి :- ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా క్షీరం విషయంలో వలె ద్రవ్యంలో ఉన్న స్వభావవిశేషంచేత ఉపపన్నం అవుతుంది. లోకంలో క్షీరము, జలమూ, బాహ్యసాధనాపేక్ష ఏదీ లేకుండానే ఏ విధంగా పెరుగుగాను, మంచుగడ్డగాను అవుతున్నాయో అలాగే ఇక్కడ కూడ అవుతుంది. (ప్రశ్న) - క్షీరాదికం కూడ దధ్యాది రూపంలో పరిణమించడానికి ఉష్ణత్వం మొదలైన బాహ్యసాధనాలను అపేక్షిస్తుంది కదా? 'క్షీరవద్ధి' అని ఎలా చెపుతావు? (సమాధానం) - ఈ దోషం లేదు. క్షీరం స్వయంగానే ఎట్టి, ఎంతటి పరిణామమాత్రను (పరిణామప్రమాణాన్ని) పొందుతుందో అంత పరిణామ మాత్రయే ఉష్ణత్వాదికంచేత ఏర్పడడానికి తొందర పెట్టబడుతుంది. క్షీరానికి స్వయంగా దధిభావాన్ని పొందే స్వభావం లేకపోతే ఉష్ణత్వాదికంచేత కూడ బలాత్కారంగా దధిత్వాన్ని పొందదు. వాయువు గాని, ఆకాశం గాని బలాత్కారంగా ఉష్ణత్వాదికంచేత పెరుగగా అవదు కదా? సాధనసామగ్రి దానికి (వికారానికి) పూర్ణత్వాన్ని సంపాదిస్తుంది. అయితే బ్రహ్మ పరిపూర్ణశక్తి గలది. దానికి మరొకదానిచేత దేనిచేతా కూడ పూర్ణత్వం సంపాదింప వలసిన పని లేదు. ఈ విషయాన్నే "న తస్య... క్రియా చ" అను శ్రుతి చెపుతున్నది. అందువల్ల బ్రహ్మ ఒక్కటే అయినా దానికి విచిత్రమైన శక్తు లుండడంవల్ల క్షీరాదులకు వలె విచిత్రమైన పరిణామం ఉపపన్నం అవుతుంది. 24.

## సూ. దేవాదివదపి లోకే. 2.1.25

స్యాదేతత్; ఉపపద్యతే క్షీరాదీనామచేతనానామనపేక్ష్యాపి బాహ్యం సాధనం దధ్యాదిభావః; దృష్టత్వాత్ - చేతనాః పునః కులాలాదయః సాధనసామగ్రీమపేక్ష్యైవ తస్మై తస్మై కార్యాయ ప్రవర్తమానా దృశ్యన్తే. కథం బ్రహ్మ చేతనం సదసహాయం ప్రవర్తేతేతి. దేవాదివదితి బ్రూమః. యథా లోకే దేవాః పితర ఋషయ ఇత్యేవమాదయో మహాప్రభావాశ్చేతనాః అపి సన్తోఽనపేక్ష్యైవ కించిద్బాహ్యం సాధనమైశ్వర్యవిశేషయోగాదభిధ్యానమాత్రేణ స్వత ఏవ బహూని నానాసంస్థానాని శరీరాణి, ప్రాసాదాదీని రథాదీని చ నిర్మిమాణా ఉపలభ్యన్తే, మన్త్రార్థవాదేతిహాసపురాణప్రామాణ్యాత్, తన్తునాభశ్చ స్వయమేవ తన్తూన్ సృజతి, బలాకా చాన్తరేణైవ శుక్రం గర్భం ధత్తే, పద్మినీ చానపేక్ష్య కించిత్ప్రస్థానసాధనం సరోన్తరాత్సరోన్తరం ప్రతిష్ఠతే

ఏవం చేతనమపి బ్రహ్మ అనపేక్ష్య బాహ్యం సాధనం స్వత ఏవ జగత్స్రక్ష్యతి. స యది బ్రూయాద్య ఏతే దేవాదయో బ్రహ్మణో దృష్టాన్తా ఉపాత్తాస్తే దార్ష్టాన్తికేన బ్రహ్మణా న సమానా భవన్తి, శరీరమేవ హ్యచేతనం దేవాదీనాం శరీరాన్తరాదివిభూత్యుత్పాదన ఉపాదానం న తు చేతన ఆత్మా, తన్తునాభస్య చ క్షుద్రతరజన్తుభక్షణాల్లాలా కఠినతామాపద్యమానా తన్తుర్భవతి. బలాకా చ స్తనయిత్నురవశ్రవణాద్గర్భం దత్తే. పద్మినీ చ చేతనప్రయుక్తా సత్యచేతనేనైవ శరీరేణ సరోన్తరాత్సరోన్తరముపసర్పతి, వల్లీవ వృక్షం, న తు స్వయమేవాచేతనా సరోన్తరోపసర్పణే వ్యాప్రియతే. తస్మాన్నైతే బ్రహ్మణో దృష్టాన్తా ఇతి, తం ప్రతి బ్రూయాన్నాయం దోషః. కులాలాదిదృష్టాన్తవైలక్షణ్యమాత్రస్య వివక్షితత్వాదితి. యథా హి కులాలాదీనాం దేవాదీనాం చ సమానే చేతనత్వే కులాలాదయః కార్యారమ్భే బాహ్యం సాధనమపేక్షన్తే న దేవాదయః, తథా బ్రహ్మ చేతనమపి న బాహ్యం సాధనమపేక్షిష్యత ఇత్యేతావద్వయం దేవాద్యుదాహరణేన వివక్షామః. తస్మాద్యథైకస్య సామర్థ్యం దృష్టం **తథా** సర్వేషామేవ భవితుమర్హతీతి నాస్త్యేకాన్త ఇత్య భిప్రాయః. 25.

### బాలానందిని

దేవేతి:- "లోకే = శాస్త్రమునందు, లోకమునందు కూడ, దేవాదివత్= దేవతలు, **సాలెపురుగులు** మొదలైనవాటికి వలె అసహాయమైన బ్రహ్మకు స్రష్టృత్వం కుదురుతుంది" అని సూత్రార్థం.

**స్యాదేతదితి**:- సరే! ఆ విషయం అలా ఉండనీ! లేదా- ఇలా చెపితే చెప్పవచ్చును- అచేతనాలైన క్షీరాదులు బాహ్యసాధనాన్ని అపేక్షించకుండా దధ్యాదిరూపంలో పరిణమించడం యుక్తమే; మనకు ఎదుటనే కనబడుతుంది కదా? చేతను లైన కులాలాదు లైతే సాధనసామగ్రిని అపేక్షించియే ఆ యా కార్యాలు పుట్టించడానికి ప్రవర్తిస్తూన్నట్లు కనబడుతున్నారు. చేతన మైన బ్రహ్మ అసహాయంగా ఎలా ప్రవర్తిస్తుంది? దేవాదుల వలె అని సమాధానం చెపుతాం. లోకంలో దేవతలు, పితృదేవతలు, ఋషులు మొదలైన మహాప్రభావవంతులు చేతనులే అయినా కూడ ప్రభావవిశేషం ఉన్నవా ళ్లవడంచేత బాహ్యమైన సాధనాన్ని దేన్నీ అపేక్షించకుండగానే, సంకల్పమాత్రంచేత, స్వయంగానే వివిధములైన అవయవసంఘటనలు గల అనేక శరీరాలను, ప్రాసాదాదులను, రథాదులను నిర్మిస్తున్నట్లుగా, మంత్ర-అర్థవాద-ఇతిహాస- పురాణాల

ప్రామాణ్యాన్ని పట్టి ఏ విధంగా తెలియబడుతున్నదో, సాలెపురుగు స్వయంగానే ఏ విధంగా దారాలను సృష్టిస్తున్నదో, ఆడ కొంగ శుక్రం లేకుండానే ఏ విధంగా గర్భం ధరిస్తున్నదో, పద్మలత కూడ మరొక చోటకు వెళ్లడానికి తగిన సాధనం ఏదీ లేకుండానే ఏ విధంగా ఒక సరస్సు నుంచి మరొక సరస్సుకు ప్రయాణం అవుతుందో అదే విధంగా చేతనమైనా కూడ బ్రహ్మ బాహ్యసాధనాన్ని దేన్నీ అపేక్షించకుండానే స్వయంగానే జగత్తును సృష్టిస్తుంది. "బ్రహ్మకు దృష్టాంతంగా చెప్పబడిన ఈ దేవాదులు దార్ష్టాంతికమైన బ్రహ్మతో సమానమైనవి కావు. దేవాదుల అచేతనమైన శరీరాలే శరీరాంతరం మొదలైన విభూతులను పుట్టించడం ద్వారా వాటికి ఉపాదాన కారణం అవుతున్నాయి. అంతే కాని చేతనమైన ఆత్మ ఉపాదానం అవడంలేదు. తంతునాభం కూడ చాలా చిన్నవైన జంతువులను భక్షించడంవల్ల దాని లాలాజలం గట్టిపడి దారం అవుతున్నది. కొంగ కూడ మేఘగర్జనం విని గర్భం ధరిస్తుంది. పద్మలత కూడ చేతనంచేత ప్రేరేపింపబడి అచేతనమైన శరీరంతోనే ఒక సరస్సునుండి మరొక సరస్సుకు వెళ్లుచున్నది. అంతే కాని తాను అచేతనమైన పద్మిని మరొక సరస్సుకు వెళ్లడానికి ప్రవర్తించడంలేదు. అందుచేత ఇవి బ్రహ్మకు దృష్టాంతాలు కావు" అని ఎవడైనా అన్నట్లయితే వానికి ఇలా చెప్పాలి- ఈ దోషం లేదు. కులాలాదులకు, బ్రహ్మకు చేతనత్వం సమంగానే ఉన్నా కూడ కులాలాదులు తమ కార్యాలను ప్రారంభించడానికి బాహ్యసాధనాలను ఏ విధంగా అపేక్షిస్తారో, దేవాదులు అపేక్షించరో, అదే విధంగా చేతనమైనా కూడ బ్రహ్మ బాహ్యసాధనాన్ని అపేక్షించదు అని ఇంత మాత్రమే మేం దేవాదుల ఉదాహరణచేత చెప్పదలచుకొన్నది. అందుచేత ఒకని సామర్థ్యం ఎలా ఉంటుందో అందరిదీ అలాగే ఉండా లని నియమం లేదు అని అభిప్రాయం.

ఉపసంహారదర్శనాధికరణం సమాప్తం

## 9.కృత్స్నప్రసక్త్యధికరణమ్. సూ.26-29.

### సూ. కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా. 2-1-26.

చేతనమేకమద్వితీయం బ్రహ్మ క్షీరాదివద్దేవాదివచ్చానపేక్ష్య బాహ్యసాధనం స్వయం పరిణమమానం జగతః కారణమితి స్థితమ్. శాస్త్రార్థపరిశుద్ధయే తు పునరాక్షిపతి- కృత్స్నప్రసక్తిః, కృత్స్నస్య బ్రహ్మణః కార్యరూపేణ పరిణామః ప్రాప్నోతి, నిరవయవత్వాత్. యది బ్రహ్మ పృథివ్యాదివత్సావయవమభవిష్యత్తతోఽస్యైకదేశః పర్యణం స్యదేకదేశ శ్చావాస్థాస్యత్. నిరవయవంతు బ్రహ్మ శ్రుతిభ్యోఽవగమ్యతే- "నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్" (శ్వే.ఉ.6.19), "దివ్యో హ్యమూర్తః

పురుషః స బాహ్యాభ్యన్తరో హ్యజః" (ము.ఉ.2.1.2), "స ఏష నేతి నేత్యాత్మా" (బృ.ఉ.3.9.26), "అస్థూలమనణు" (బృ.ఉ.2.8.8.) ఇత్యాద్యాభ్యః సర్వవిశేషప్రతిషేధినీభ్యః. తతశ్చైకదేశపరిణామాసంభవాత్ కృత్స్నపరిణామ ప్రసక్తౌ సత్యాం మూలోచ్ఛేదః ప్రసజ్యేత. ద్రష్టవ్యతోపదేశానర్థక్యం చాపన్నమ్. అయత్నదృష్టత్వాత్కార్యస్య, తద్వ్యతిరిక్తస్య చ బ్రహ్మణోఽసంభవాత్. అజత్వాదిశబ్దకోపశ్చ. అథ ఏతద్దోషపరిజిహీర్షయా సావయవమేవ బ్రహ్మాభ్యుపగమ్యేత తథాపి యే నిరవయవత్వస్య ప్రతిపాదకాః శబ్దాస్తే ప్రకుప్యేయుః. సావయవత్వే చ అనిత్యత్వప్రసఙ్గః ఇతి సర్వథాయం పక్షో న ఘటయితుం శక్యత ఇత్యాక్షిపతి. 26.

బాలానందిని

కృత్స్నేతి:- "కృత్స్నప్రసక్తిః = నిరవయవమైన బ్రహ్మ క్షీరాదుల వలె పరిణామం చెందుతుంది అని అంగీకరిస్తే మొత్తం బ్రహ్మ పరిణామం చెందాలి, వా=నిరవయవం కాదు సావయవం అని అంగీకరిస్తే, నిరవయవత్వశబ్దకోపః= బ్రహ్మ నిరవయవం అని చెప్పే శబ్దాలకి కోపం (విఘాతం) ఏర్పడుతుంది" అని సూత్రార్థం.

చేతనమితి:- చేతనము, ఏకము. అద్వితీయమూ అయిన బ్రహ్మ క్షీరాదుల వలె, దేవతాదుల వలె, బాహ్యసాధనాపేక్ష ఏమీ లేకుండగా స్వయంగానే పరిణామం చెందుతూ జగత్తుకు కారణం అవుతున్నది అనేది ఉన్న విషయం. శాస్త్రార్థంయొక్క పరిశుద్ధికొరకు (శాస్త్రీయవిషయాన్ని నిర్దుష్టంగా నిరూపించడంకొరకు) మళ్లీ ఆక్షేపిస్తున్నాడు. (ఇది పూర్వపక్షసూత్రం) కృత్స్నప్రసక్తి కలుగుతుంది. బ్రహ్మ నిరవయవం గాన సమస్తమైన బ్రహ్మ కూడ కార్యరూపంలో పరిణమిస్తుంది అని ప్రాప్తిస్తుంది (చెప్పవలసి వస్తుంది). బ్రహ్మ పృథివ్యాదుల వలె సావయవం అయితే దాని ఒక భాగం పరిణమించి ఉండేది, ఒక భాగం పరిణామం చెందకుండా అలాగే ఉండేది. అయితే బ్రహ్మ నిరవయవం అని "నిష్కలం... నిరఞ్జనమ్", "దివ్యో... అజః", "ఇదం... ఏవ", "స ఏష... ఆత్మా", "అస్థూలమనణు" ఇత్యాదిశ్రుతులవల్ల తెలుస్తూన్నది. అందువల్ల ఒక భాగం మాత్రమే పరిణామం చెందడం అనేది కుదరదు గాన పరిణామం చెందుతే మొత్తమే పరిణామం చెందాలి. అప్పుడు మూలానికే ముప్పు వస్తుంది. కార్యం ఏ ప్రయత్నమూ లేకుండానే కనబడుతున్నది గాన, కార్యంకంటె భిన్నమైన (మిగిలి ఉన్న) బ్రహ్మ లేదు గాన ఆత్మను చూడాలి అనే ఉపదేశం వ్యర్థం అవుతుంది. అంతే కాక (బ్రహ్మకు పరిణామస్వరూపంతో జన్మనాశాలు అంగీకరిస్తే) 'అజః అమరః'

ఇత్యాదిశ్రుతులకు విరోధం కలుగుతుంది. అట్లు కాదని ఈ దోషం పరిహరించడంకోసం బ్రహ్మ సావయవమే అని అంగీకరిస్తే బ్రహ్మకు నిరవయవత్వాన్ని బోధించే పైన ఉదాహరించిన శబ్దాలు ప్రకోపం చెందుతాయి. అది గాక బ్రహ్మ సావయవం అయితే అనిత్యత్వం అనే దోషం ప్రసక్తం అవుతుంది. ఎలా చూచినా కూడ ఈ పక్షాన్ని సరిగా కూర్చడం శక్యం కాదు అని ఆక్షేపిస్తున్నాడు.

వి. లోకంలో అవయవాలు ఉన్నవే ఉపాదానకారణంగా కనబడుతున్నాయి. అందుచేత అవయవాలు లేనిది ఉపాదానం అవడానికి వీలులేదు అనే యుక్తిచేత వేదాంతసమన్వయం బాధింపబుడుతుంతా బాధింపబడదా అని సందేహం. బ్రహ్మకు విచిత్రమైన శక్తులున్నాయి. అది సత్యసంకల్పం. అందుచేత ఉపాదానత్వమూ కర్తృత్వమూ కూడ బ్రహ్మకు కుదురుతుంది అని పూర్వాధికరణంలో చెప్పబడింది. కృత్స్నప్రసక్త్యాదిదోషాలవల్ల బ్రహ్మకు ఉపాదానత్వం కుదరదు అని ఆక్షేపసంగతిచేత పూర్వపక్షం (బ్రహ్మవిద్యాభరణం).

## సూ. శ్రుతేస్తు శబ్దమూలత్వాత్. 2.1.27.

తుశబ్దేనాక్షేపం పరిహరతి. న ఖల్వస్మత్పక్షే కశ్చిద్దోషోఽస్తి. న తావత్కృత్స్నప్రసక్తిరస్తి . కుతః? శ్రుతేః. యథైవ హి బ్రహ్మణో జగదుత్పత్తిః శ్రూయతే ఏవం వికారవ్యతిరేకేణాపి బ్రహ్మణోఽవస్థానం శ్రూయతే, ప్రకృతి వికారయోర్భేదేన వ్యపదేశాత్. "సేయం దేవతైక్షత, హన్తాహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరణాణి" (ఛా.ఉ.6.3.2) ఇతి,

"తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః,

పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఛాం.ఉ.3.12.6) ఇతి చైవంజాతీయకమ్. తథా హృదయాయతనత్వవచనాత్ సత్సంపత్తి వచనాచ్చ. యది చ కృత్స్నం బ్రహ్మ కార్యభావేనోపయుక్తం స్యాత్ "సతా సోమ్య తదా సంపన్నో భవతి" (ఛా.ఉ.6.8.1) ఇతి సుషుప్తిగతం విశేషణ మనుపపన్నం స్యాత్, వికృతేన బ్రహ్మణా నిత్యం సంపన్నత్వాత్. అవికృతస్య చ బ్రహ్మణోఽభావాత్. తథేన్ద్రియగోచరత్వప్రతిషేధాద్బ్రహ్మణః, వికారస్య చ ఇన్ద్రియగోచరత్వోపపత్తేః. తస్మాదస్త్యవికృతం బ్రహ్మ. న చ నిరవయవత్వ శబ్దకోపోఽస్తి;శ్రూయమాణత్వాదేవ నిరవయవత్వస్యాప్యభ్యుపగమ్యమాన

త్వాత్. శబ్దమూలం చ బ్రహ్మ శబ్దప్రమాణకం నేన్ద్రియాదిప్రమాణకమ్; తద్యథాశబ్దమభ్యుపగన్తవ్యమ్. శబ్దశ్చోభయమపి బ్రహ్మణః ప్రతిపాదయత్యకృత్స్నప్రసక్తిం నిరవయవత్వం చ.

### బాలానందిని

శ్రుతేరితి:- ''శ్రుతేస్తు=శ్రుతిప్రామాణ్యంవల్ల ఈ దోషం లేదు. శబ్దమూలత్వాత్ = బ్రహ్మ శబ్దమే మూలంగా గలది కదా'' అని సూత్రార్థం.

తుశబ్దేనేతి:- తుశబ్దంచేత ఆక్షేపాన్ని పరిహరిస్తున్నాడు. మా పక్షంలో ఏ దోషమూ లేదు. కృత్స్నపసక్తి లేదు. ఎందువల్ల? శ్రుతివల్ల. బ్రహ్మనుండి జగత్తు పుట్టినది అని ఏ విధంగా శ్రుతినుండి తెలియబుడుతున్నదో అదే విధంగా వికారంకంటె (కార్యం కంటె) వేరుగా కూడ బ్రహ్మ ఉన్న దని వినబడుచున్నది. "సేయం... వ్యాకరవాణి" అని ప్రకృతివికారాలు వేరు వేరుగా చెప్పబడ్డాయి గదా? "తావానస్య... దివి" ఈ విధమైన శ్రుతులు కూడ ఈ విషయమే చెపుతున్నాయి. అట్లే బ్రహ్మ హృదయంలో ఉంటుం దని, సుషిప్తిలో జీవుడు సత్తుతో (బ్రహ్మతో) సంపన్ను డౌతా డని కూడ చెప్పబడినది. మొత్తం బ్రహ్మ అంతా కార్యరూపంలో వినియోగించబడిపోతే అప్పుడు సుషుప్తికి సంబంధించి "సతా... భవతి" అని విశేషణం (విశేషాన్ని చెప్పడం) అనుపపన్నం అవుతుంది. ఎందువల్ల ననగా జీవాత్మ వికృతమైన (కార్యరూపంలో ఉన్న) బ్రహ్మతో నిత్యమూ సంపన్నమయే ఉంది, అవికృతమైన బ్రహ్మ (మిగిలి) లేదు. అట్లే బ్రహ్మ ఇద్రియాగోచరం కాదు అని చెప్పబడింది. వికారం ఇంద్రియగోచరం అవడం కుదురుతుంది కదా. (మొత్తం బ్రహ్మ అంతా కార్యరూపంలో పరిణామం చెందిన పక్షంలో కార్యరూపమైన ఆ బ్రహ్మ ఇంద్రియాలకు గోచరం అవుతూనే ఉంది. అలాంటప్పుడు బ్రహ్మ ఇంద్రియగోచరం కాదు అని చెప్పడం అర్థరహితం కదా. దీనినిపట్టి కార్యరూపంలోనే కాక ఇంకా బ్రహ్మ ఉంది అని తెలుస్తూన్న దని భావం). అందువల్ల అవికృతమైన (కార్యరూపంగా పరిణతం కాని) బ్రహ్మ ఉంది. నిరవయత్వాన్ని చెప్పే శ్రుతివాక్యానికి విరోధం లేదు. ఎందువల్ల ననగా (బ్రహ్మ కార్య రూపంలో పరిణమించింది అని ఏ విధంగా శ్రుతిలో వినబడుతున్నదో అట్లే) బ్రహ్మ నిరవయవం అని కూడ వినబడుతున్నది గాన నిరవయవత్వం కూడ అంగీకరించాలి. బ్రహ్మ శబ్దమూలం, అనగా శబ్దమే ప్రమాణంగా గలది, దీనిని ఇంద్రియాదిప్రమాణాలు

గ్రహించజాలవు. అందుచేత శబ్దం (శ్రుతి) ఎలా చెపితే అలా అంగీకరించాలి. శబ్దమైతే బ్రహ్మ నిరవయవం అనీ చెపుతున్నది, కృత్స్న ప్రసక్తి లేదనీ చెపుతున్నది.

భాష్యమ్

లౌకికానామపి మణిమన్త్రౌషధిప్రభృతీనాం దేశకాలనిమిత్త వైచిత్ర్యవశాత్ శక్తయో విరుద్ధానేకకార్యవిషయాః దృశ్యన్తే; తా అపి తావన్నోపదేశమన్తరేణ కేవలేన తర్కేణావగన్తుం శక్యన్తే అస్య వస్తునః ఏతావత్యః, ఏతత్సహాయాః ఏతద్విషయాః, ఏతత్ప్రయోజనాశ్చ శక్తయ ఇతి. కి ముతాచిన్త్యప్రభావస్య బ్రహ్మణో రూపం వినాశబ్దేన న నిరూప్యేత. తథాచాహుః పౌరాణికాః-

"అచిన్త్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ యోజయేత్, ప్రకృతిభ్యః పరం యచ్చ తదచిన్త్యస్య లక్షణమ్" ఇతి.
తస్మాచ్ఛబ్దమూల ఏవాతీన్ద్రియయాథార్థ్యాధిగమః.

బాలానందిని

లౌకికానామితి :- లౌకికాలైన మణి-మంత్ర-ఓషధులు మొదలైనవాటిలో కూడ దేశం, కాలం, నిమిత్తం వీటి వైచిత్ర్యంవల్ల విరుద్ధమైన అనేక కార్యాలకు సంబంధించిన శక్తులు కనబడుతున్నాయి. అవి కూడ - ఈ వస్తువుకు ఇన్ని, ఇవి సహాయంగా గల, వీటికి సంబంధించిన, ఈ ప్రయోజనం గల శక్తులున్నాయి అని ఉపదేశం లేకుండా (శాస్త్రాదుల చెప్పకుండా) కేవలతర్కంచేత తెలుసుకొనడానికి శక్యం కావు. అలాంటప్పుడు ఊహింపరాని ప్రభావం గల బ్రహ్మయొక్క స్వరూపం శబ్దసాహాయ్యం లేకుండా నిరూపించబడదు అని వేరుగా చెప్పాలా? అందువల్లనే పౌరాణికులు "అచిన్త్యాః... లక్షణమ్" అని అన్నారు. ఏ విషయాలు ఊహించడానికి శక్యం కావో వాటిని తర్కంతో చేర్చకూడదు (వాటి విషయంలో తర్కం ఉపయోగించగూడదు). ఏది ప్రకృతులకంటే, అనగా ప్రత్యక్షంగా కనబడే వస్తుస్వభావాల కంటె, విలక్షణమైనదో అది అచింత్యము అని అచింత్యానికి లక్షణం" అని ఈ శ్లోకానికి అర్థం. అందువల్ల అతీంద్రియాలైన విషయాలకు సంబంధించిన యాథార్థ్యంయొక్క జ్ఞానం శబ్దంమీదనే ఆధారపడి ఉంటుంది.

## భాష్యమ్

నను శబ్దేనాపి న శక్యతే విరుద్ధోఽర్థః ప్రత్యాయయితుం నిరవయవం చ బ్రహ్మ పరిణమతే, న కృత్స్న మితి. యది నిరవయవం బ్రహ్మ స్యాన్నైవ పరిణమేత కృత్స్నమేవ వా పరిణమేత. అథ కేన చిద్రూపేణ పరిణమేత కేన చిచ్చావతిష్ఠేతేతి రూపభేదకల్పనాత్సావయవమేవ ప్రసజ్యేత. క్రియావిషయే హి "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" "నాతి రాత్రే షోడశినం గృహ్ణాతి" ఇత్యేవం జాతీయకాయాం విరోధప్రతీతావపి వికల్పాశ్రయణం విరోధపరిహారకారణం భవతి; పురుషతన్త్రత్వాచ్చానుష్ఠానస్య. ఇహ తు వికల్పాశ్రయణేనాపి న విరోధ పరిహారః సంభవత్యపురుషతన్త్ర త్వాద్వస్తునః. తస్మాద్దుర్ఘటమేతదితి.

## బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) - బ్రహ్మకు అవయవాలు లేవు, అయినా అది పరిణామం చెందుతుంది. పరిణామం చెందినా మొత్తం చెందదు అని విరుద్ధమైన అర్థాన్ని శబ్దమైనా చెప్పడం శక్యం కాదు కదా. బ్రహ్మ నిరవయవం అయితే పరిణామం చెందగూడదు. అథవా పరిణామం చెందినా మొత్తం బ్రహ్మ పరిణామం చెందాలి. ఒక రూపంతో పరిణామం చెందుతుంది. మరొక రూపంలో అలాగే ఉండి పోతుంది అని రూపభేదాన్ని కల్పిస్తే అప్పుడది సావయవమే అయిపోతుంది. ఎందువల్ల ననగా క్రియ విషయంలో "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" "నాతి రాత్రే షోడశినం గృహ్ణాతి" ఇత్యాదివిధమైన విరోధజ్ఞానం కలిగినా కూడ, అనుష్ఠానం అనేది పురుషుని చేతిలో ఉంటుంది గాన, ఆ విరోధాన్ని పరిహరించడానికి వికల్పం ఆశ్రయించడం కుదురుతుంది. ఇక్కడైతే వస్తువు పురుషుని ఆధీనంలో లేనిది గాన వికల్పాన్ని ఆశ్రయించినా కూడ విరోధపరిహారం కుదరదు. అందుచేత ఇదంతా దుర్ఘటంగా (సమన్వయించడానికి శక్యం కాకుండా) ఉంది.

## భాష్యమ్

నైష దోషః. అవిద్యాకల్పితరూపభేదాభ్యుపగమాత్. న హ్యవిద్యా కల్పితేన రూపభేదేన సావయవం వస్తు సంపద్యతే. న హి తిమిరోపహతన యనేన అనేక ఇవ చన్ద్రమా దృశ్యమానోఽనేక ఏవ భవతి. అవిద్యాకల్పితేన చ నామరూపలక్షణేన రూపభేదేన, వ్యాకృతావ్యాకృతాత్మకేన తత్త్వాన్య త్వాభ్యామనిర్వచనీయేన బ్రహ్మ పరిణామాదిసర్వవ్యవహారాస్పదత్వం ప్రతిపద్యతే. పారమార్థికేన చ రూపేణ సర్వవ్యవహారాతీతమపరిణత

మవతిష్ఠతే. వాచారమ్భణమాత్రత్వాచ్చావిద్యాకల్పితస్య నామరూపభేదస్యేతి న నిరవయవత్వం బ్రహ్మణః కుప్యతి. న చేయం పరిణామశ్రుతిః పరిణామ ప్రతిపాదనార్థా, తత్ప్రతిపత్తేః ఫలానవగమాత్. సర్వవ్యవహారహీనబ్రహ్మాత్మ భావప్రతిపాదనార్థా త్వేషా, తత్ప్రతిపత్తేః ఫలావగమాత్. 'స ఏష నేతి నేత్యాత్మా' ఇత్యు పక్రమ్యాహ - "అభయం వై జనక ప్రాప్తోఽసి" (బృ.ఉ. 4.2.4) ఇతి. తస్మాదస్మత్పక్షే న కశ్చిదపి దోషప్రసంగోఽస్తి. 27.

### బాలానందిని

నైష ఇతి:- అవిద్యాకల్పితమైన రూపభేదాన్ని (బ్రహ్మకు) అంగీకరించడం వల్ల ఈ దోషం లేదు. అవిద్యచేత కల్పించబడిన రూపభేదంచేత వస్తువు సావయవం కాదు కదా? తిమిరదోషంచేత దుష్టమైన నేత్రాలు కలవాడు చంద్రుణ్ణి అనేకచంద్రులనుగా చూచినంత మాత్రాన ఆ చంద్రుడు అనేకచంద్రులు కాడు కదా? వ్యాకృతంగాను అవ్యాకృతంగాను ఉన్నది, బ్రహ్మరూప మని కాని బ్రహ్మరూపం కాని దని కాని నిర్వచించడానికి శక్యం కానిది, అవిద్యాకల్పితమూ అయిన నామరూపాత్మకమైన రూప భేదంచేత బ్రహ్మ పరిణామం మొదలైన సర్వవ్యవహారాలకూ స్థానం అవుతున్నది. పారమార్థికరూపంలో మాత్రం సర్వవ్యవహారాలకు దూరంగా, పరిణామశూన్యంగా ఉంటుంది. అవిద్యాకల్పిత మైన నామరూపభేదం కేవలం వాచారంభణంమాత్రమే (మాట మాత్రమే) అవడంచేత బ్రహ్మయొక్క నిరవయవత్వానికి ఏ విధమైన కోపం (విఘాతం) లేదు. పరిణామాన్ని గూర్చి తెలుసుకొనడంవల్ల ఫలం ఏదీ లేదు. అందుచేత ఈ పరిణామ బోధక శ్రుతి పరిణామాన్ని ప్రతిపాదించడం కోసం వచ్చినది కాదు. ఈ శ్రుతియొక్క పరమ ప్రయోజనం ఏ మనగా సర్వవ్యవహారాతీత మైన బ్రహ్మనే ఆత్మగా ప్రతిపాదించడమే. ఆ బ్రహ్మాత్మభావాన్ని తెలుసుకొంటేనే ఫలం ఉంటుందని తెలుస్తూన్నది. "స ఏష... ఆత్మా" అని ఉపక్రమించి "అభయం వై జనక ప్రాప్తోఽసి" అని చెపుతున్నాడు. (ఈ విధంగా బ్రహ్మాత్మజ్ఞానంవల్ల మోక్షప్రాప్తిరూప మైన ఫలం చెప్పబడింది గాని బ్రహ్మ పరిణామం చెందుతుంది అని తెలుసు కొనడంవల్ల ఫలం ఏమీ చెప్పబడలే దని భావం). అందువల్ల మా పక్షంలో దోషప్రసంగం ఏదీ లేదు. 27.

### సూ. ఆత్మని చైవం విచిత్రాశ్చ హి. 2.1.28

అపి చ నైవాత్ర వివదితవ్యం కథమేకస్మిన్ బ్రహ్మణి స్వరూపాను పమర్దేనైవానేకాకారా సృష్టిః స్యాదితి, యతః ఆత్మన్యప్యేకస్మిన్ స్వప్నదృశి స్వరూపానుపమర్దేనైవానేకాకారా సృష్టిః పఠ్యతే - "న తత్ర రథా న రథయోగా

న పన్థానో భవన్త్యథ రథాన్ రథయోగాన్ పథః సృజతే" (బృ.ఉ. 4.3.10) ఇత్యాదినా. లోకేఽపి దేవాదిషు మాయావ్యాదిషు చ స్వరూపానుపమర్దేనైవ విచిత్రా హస్త్యశ్వాదిసృష్టయో దృశ్యన్తే. తథైకస్మిన్నపి బ్రహ్మణి స్వరూపానుప మర్దేనైవ అనేకాకారా సృష్టిర్భవిష్యతీతి. 28.

### బాలానందిని

**ఆత్మనీతి** :- "హి= ఎందువల్లననగా, ఆత్మని = స్వప్నం చూచే జీవాత్మయందు, ఏవమ్ ఈ విధంగా, విచిత్రాశ్చ = విచిత్రమైన సృష్టులు ఉన్నాయి" అని సూత్రార్థం.

**అపిచేతి** :- మరొక విషయమే వనగా - ఒక బ్రహ్మలో స్వరూపానికి ఉపమర్దం లేకుండా (స్వరూపానికి ఏ విధమైన పరిణామాది వికారమూ లేకుండా) అనేక విధాలైన సృష్టి ఎలా జరుగుతుంది అని ఈ విషయంలో వివాదం చేయవలసిన పని లేదు. ఎందు వల్లననగా - స్వప్నం చూస్తూన్న ఒక ఆత్మలో, దాని స్వరూపానికి ఉపమర్దం ఏదీ లేకుండా అనేకాకార మైన సృష్టి కలుగుతుంది అని "న తత్ర... సృజతే" (అక్కడ రథాలు లేవు, రథయోగాలు (గుఱ్ఱాలు) లేవు, మార్గాలు లేవు అయినా రథాలను, రథయోగాలను మార్గాలను సృష్టిస్తున్నాడు) ఇత్యాదివాక్యంచేత చెపుతున్నాడు. లోకంలో కూడ దేవతలు మొదలైనవాళ్లు, మాయావులు మొదలైనవాళ్లు స్వరూపానికి ఉపమర్దం ఏదీ లేకుండానే చేసే విచిత్రమైన హస్త్యశ్వాదిసృష్టులు కనబడుతున్నాయి. అట్లే బ్రహ్మ ఒక్కటే అయినా కూడ దాని స్వరూపానికి ఉపమర్దం ఏదీ లేకుండగానే అనేకాకారమైన సృష్టి జరుగుతుంది. 28.

### సూ. స్వపక్షదోషాచ్చ. 2.1.29

పరేషామప్యేష సమానః స్వపక్షే దోషః. ప్రధానవాదినోఽపి హి నిరవయవమపరిచ్ఛిన్నం శబ్దాదిహీనం ప్రధానం సావయవస్య పరిచ్ఛిన్నస్య శబ్దాదిమతః కార్యస్య కారణమితి స్వపక్షః. తత్రాపి కృత్స్నప్రసక్తిః నిరవయవత్వాత్ ప్రధానస్య ప్రాప్నోతి, నిరవయవత్వాభ్యుపగమకోపో వా. నను నైవ తైర్నిరవయవం ప్రధానమభ్యుపగమ్యతే, సత్త్వరజస్తమాంసి హి త్రయో గుణా నిత్యాః, తేషాం సామ్యావస్థా ప్రధానం, తైరేవావయవైస్తత్సావ యవమితి. నైవంజాతీయకేన సావయవత్వేన ప్రకృతో దోషః పరిహర్తుం పార్యతే, యతః సత్త్వరజస్తమసామప్యేకైకస్య సమానం నిరవయవత్వమ్. ఏకైకమేవ చేతరద్వయానుగృహీతం సజాతీయస్య ప్రపఞ్చస్య ఉపాదానమితి

సమానత్వాత్స్వపక్ష దోషప్రసఙ్గస్య. తర్కాప్రతిష్ఠానాత్సావయవత్వమేవేతి చేత్; ఏవమప్యనిత్యత్వదోషప్రసంగః, అథ శక్తయ ఏవ కార్యవైచిత్ర్యసూచితాః అవయవా ఇత్యభిప్రాయః, తాస్తు బ్రహ్మవాదినోఽప్యవిశిష్టాః. తథా అణువాదినోఽప్యణురణ్వన్తరేణ సంయుజ్యమానో నిరవయవత్వాద్యది కార్త్స్న్యేన సంయుజ్యేత తతః ప్రథిమానుపపత్తేః అణుమాత్రత్వప్రసంగః. అథైకదేశేన సంయుజ్యేత తథాపి నిరవయవత్వాభ్యుపగమకోప ఇతి స్వపక్షేఽపి సమాన ఏష దోషః. సమానత్వాచ్చ నాన్యతరస్మిన్నేవ పక్షే ఉపక్షేప్తవ్యో భవతి. పరిహృతస్తు బ్రహ్మవాదినా స్వపక్షే దోషః. 29.

బాలానందిని

స్వేతి :- "స్వపక్ష దోషాచ్చ = సాంఖ్యులు, వైశేషికులు మొదలైన ప్రతివాదుల పక్షాలలో కూడ ఈ దోషా లున్నాయి గాన బ్రహ్మవాదిని మాత్రమే ఆక్షేపించ పని లేదు" అని సూత్రార్థం.

పరేషామితి :- ఈ దోషం పరుల స్వపక్షంలో కూడ సమానమే. అవయవ రహితము, అపరిచ్ఛిన్నమూ, శబ్దాదిహీనమూ అయిన ప్రధానం, సావయవమూ, పరిచ్ఛిన్నమూ, శబ్దాదిమత్తూ అయిన కార్యానికి కారణం అని ప్రధానవాదియొక్క స్వపక్షం. ఆ పక్షంలో కూడ ప్రధానం నిరవయవం గాన కృత్స్నప్రసక్తి కలుగుతుంది, లేదా నిరవయవం అనే సిద్ధాంతానికి భంగం కలుగుతుంది. (ప్రశ్న) - సాంఖ్యులు ప్రధానం నిరవయవ మని అంగీకరించడం లేదు కదా? (ప్రధానంలో) సత్త్వ-రజస్ - తమస్సులనే నిత్యాలైన మూడు గుణాలున్నాయి, వాటి సామ్యావస్థయే ప్రధానం. ఆ అవయవాలచేత ప్రధానం సావయవమే కదా? (సమాధానం) - ఈ విధమైన సావయవత్వంచేత ప్రకృతమైన దోషం (కృత్స్నప్రసక్తి) నివారించడం శక్యం కాదు; ఎందువల్ల ననగా సత్త్వరజస్తమస్సులలో ఒక్కొక్కటి నిరవయవం అనే విషయం సమానమే కదా? మిగిలిన రెండు గుణాలచేత అనుగ్రహించబడిన (సహకరించబడిన) ఒక్కొక్క గుణం తనకు సజాతీయమైన ప్రపంచానికి ఉపాదానం అని వాళ్లు అంగీకరిస్తారు. అందుచేత సమానమే గాన (నిరవయవత్వం సమానమే గాన) స్వపక్ష దోషప్రసంగం అలాగే ఉంది. ఈ విధంగా నిరవయవత్వాన్ని సాధించే తర్కం నిలవదు గాన గుణాలు సావయవాలే అని అంగీకరిస్తే అప్పుడు గుణాలూ ప్రధానమూ కూడ అనిత్యము లని చెప్పవలసి వస్తుంది. అట్లు కాదు - కార్యవైచిత్ర్యాన్ని పట్టి

(ప్రధానంలోను, గుణాలలోను) వివిధశక్తులున్నాయి అని ఊహిస్తాం. ఆ శక్తులే అవయవాలు అని చెప్ప బడుతున్నాయి కాని నిజంగా అవయవాలంటూ ఏవీ లేవు అన్నట్లయితే, అలాంటి శక్తులు బ్రహ్మవాదికి కూడ అవిశిష్టములే. (అనగా బ్రహ్మలో అనేక శక్తులున్నాయి. దానిచేత వివిధవిచిత్ర కార్యోత్పత్తి జరుగుతూన్నది. వాస్తవంలో బ్రహ్మ నిరవయవమే అని బ్రహ్మవాది కూడ అంగీకరిస్తాడు అని భావం). అట్లే మరొక అణువుతో కలిసే అణువు దానికి అవయవాలు లేకపోవడంచేత పూర్తిగా దానితో కలిసిపోతే అప్పుడు ప్రమాణం పెరగదు గాన రెండు అణువులు కలిసినా కూడ ఒక్క అణువుగానే అయిపోతాయి అనే దోషం అణువాదికి ప్రసక్తం అవుతుంది. అణువు అణువుతో పూర్తిగా కలిసిపోదు, దాని ఒక భాగంతో కలుస్తుంది అని అంటే అణువులో భాగాలు ఉండవు అనే సిద్ధాంతానికి భంగం కలుగుతుంది. ఈ విధంగా వాళ్ల పక్షంలో కూడ దోషం సమానమే. అందరి పక్షంలోను దోషం సమానమే అయినప్పుడు ఒకరి పక్షంలోనే దోషం ఉన్నట్లు వ్రేలెత్తి చూపడం యుక్తం కాదు. అయితే బ్రహ్మవాది చేతనైతే తన పక్షంలో ఉన్న దోషం వెనుక చూపిన విధంగా పరిహరించ బడింది. 29.

కృత్స్నప్రసక్త్యధికరణం సమాప్తం

## 10. సర్వోపేతాధికరణమ్. సూ. 30-31

## సూ. సర్వోపేతా చ తద్దర్శనాత్. 2.1.30

ఏకస్యాపి బ్రహ్మణో విచిత్రశక్తియోగాదుపపద్యతే విచిత్రో వికార ప్రపఞ్చ ఇత్యుక్తమ్. తత్పునః కథమవగమ్యతే విచిత్రశక్తియుక్తం పరం బ్రహ్మేతి. తదుచ్యతే - "సర్వోపేతా చ తద్దర్శనాత్". సర్వశక్తియుక్తా చ పరా దేవతేత్యభ్యుపగన్తవ్యమ్. కుతః? తద్దర్శనాత్. తథా హి దర్శయతి శ్రుతిః సర్వశక్తియోగం పరస్యా దేవతాయాః - "సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః సర్వమిదమభ్యాత్తో౽వాక్యనాదరః" (ఛాం.ఉ.3.14.4) "సత్య కామః సత్యసంకల్పః" (ఛా. ఉ. 8.7.1), "యః సర్వజ్ఞః సర్వవిత్" (ము. ఉ. 1.1.9), "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః" (బృ.ఉ. 3.8.9) ఇత్యేవంజాతీయకా.

## బాలానందిని

సర్వేతి :- "తద్దర్శనాత్ = ఆ విధంగా శ్రుతిలో కనబడడంవల్ల, సర్వోపేతా చ = ఆ పరదేవత సమస్తశక్తులతో కూడినది" అని సూత్రార్థం.

వి. మాయాశక్తి గల బ్రహ్మనుండి జగుత్తు పుట్టినది అని చెప్పే సమన్వయానికి, 'శరీరం లేనివానికి మాయాసంబంధం ఉండదు' అనే న్యాయంతో విరోధం ఉందా లేదా అని సందేహం. ఆ న్యాయం ఆభాస కాదు గాన విరోధం ఉంది అని పూర్వపక్షం. పూర్వాధికరణంలో చెప్పినట్లు బ్రహ్మకు శక్తి ఉన్నది అని సమర్థించడంచేత ఈ రెండు అధికరణాలకీ విషయం ఒకటే.

ఏకస్యాపీతి :- బ్రహ్మ ఒక్కటే అయినా దానిలో విచిత్రమైన శక్తులు ఉండడం చేత విచిత్రమైన కార్యప్రపంచాన్ని సృష్టించడం ఉపపన్నమే అని చెప్పబడింది. అయితే, బ్రహ్మ విచిత్రశక్తియుక్తం అని ఎలా తెలుస్తున్నది? చెపుతున్నాం - "సర్వోపేతా చ తద్దర్శనాత్". ఆ పరదేవత సర్వశక్తియుక్త మైనది అని అంగీకరించాలి. ఎందు వల్ల? అలా కనబడడం వల్ల. "సర్వ కర్మా... అనాదరః" (సమస్తమైన కర్మలు కలది, సమస్తమైన కామాలు గలది. సమస్తగంధాలు గలది, సమస్తరసాలు గలది, దీని నంతనీ వ్యాపించి ఉన్నది, వాగింద్రియం లేనిది, కోరిక లేనిది), "సత్యకామః సత్యసంకల్పః", "యః సర్వజ్ఞః సర్వవిత్", "ఏతస్య... తిష్ఠతః" ఈ విధమైన శ్రుతి బ్రహ్మకు సర్వవిధ శక్తులతో సంబంధాన్ని చూపుతూన్నది. 30.

### సూ. వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్. 2.1.31

స్యాదేతత్, వికరణాం పరాం దేవతాం శాస్తి శాస్త్రమ్ "అచక్షుష్క మశ్రోత్రమవాగమనాః" (బృ.ఉ. 3.9.8) ఇత్యేవంజాతీయకమ్. కథం సా సర్వ శక్తియుతాపి సతీ కార్యాయ ప్రభవేత్? దేవాదయో హి చేతనాః సర్వ శక్తియుక్తా అపి ఆధ్యాత్మికకార్యకారణసంపన్నా ఏవ తస్మై తస్మై కార్యాయ ప్రభవన్తో విజ్ఞాయన్తే. కథం చ "నేతి నేతి" (బృ.ఉ. 3.9.26) ఇతి ప్రతిషిద్ధ సర్వవిశేషాయాః దేవతాయాః సర్వశక్తియోగః సంభవేదితి చేత్ - యదత్ర వక్తవ్యం తత్పురస్తా దేవోక్తమ్. శ్రుత్యవగాహ్యామేవేదమతిగమ్భీరం బ్రహ్మ న తర్కావగాహ్యమ్. న చ యథైకస్య సామర్థ్యం దృష్టం తథాన్యస్యాపి సామర్థ్యేన భవితవ్యమితి నియమోఽస్తీతి. ప్రతిషిద్ధసర్వవిశేషస్యాపి బ్రహ్మణః సర్వశక్తియోగః సంభవతీత్యేతదప్యవిద్యాకల్పితరూపభేదోపన్యాసేనోక్తమేవ.

తథా చ శాస్త్రమ్ - "అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః" (శ్వే.ఉ. 3.19) ఇత్యకరణస్యాపి బ్రహ్మణః సర్వసామర్థ్యయోగం దర్శయతి. 31.

బాలానందిని

వికరణత్వాదితి :- "వికరణత్వాత్ = దేహేంద్రియాదులు లేకపోవడంచేత, న= బ్రహ్మకు సర్వశక్తిమత్త్వం లేదు అన్నట్లయితే, తత్ = అది, ఉక్తమ్ = పూర్వమే చెప్పబడింది" అని సూత్రార్థం.

స్యాదేతదితి :- ఈ విషయం ఇలా ఉండనీ. "అచక్షుష్కమశ్రోత్రమవాగమనాః" ఇత్యాదిశాస్త్రం పరదేవతకు దేహేంద్రియాదులు లేవని చెపుతున్నది. అలాంటి పరదేవత సర్వశక్తులూ ఉన్నా కూడ కార్యం చేయడానికి ఎలా సమర్థం అవుతుంది? చేతనులైన దేవాదులు సర్వశక్తులు ఉన్నవారైనా కూడ ఆధ్యాత్మికమైన (శరీరానికి సంబంధించిన) దేహేంద్రియాలతో కూడి ఉండి మాత్రమే ఆ యా కార్యాలను సాధించడానికి సమర్థులై ఉన్నారని తెలుస్తూన్నది. "నేతి నేతి" అని ఏ విశేషాలు లేవని చెప్పిన పరదేవతకు సర్వశక్తులతో సంబంధం ఎలా సంభవిస్తుంది అన్నట్లయితే - ఈ విషయంలో చెప్పదగినది పూర్వమే చెప్పబడింది. అతిగంభీరమైన ఈ బ్రహ్మ శ్రుతుల సాహాయ్యంతో తెలియదగినదే కాని తర్కంచేత తెలియదగినది కాదు. ఒకని సామర్థ్యం ఎలా ఉందో ఇతరుని సామర్థ్యం కూడ అలాగే ఉండాలని నియమం ఏమీ లేదు. ఏ విశేషాలూ లేవని చెప్పిన బ్రహ్మకు కూడ శక్తితో సంబంధం ఉంటుందనే విషయం కూడా అవిద్యాకల్పితమైన రూపభేదం ఉండవచ్చు అని ప్రతిపాదించడం చేత పూర్వమే చెప్పబడింది. అందుచేతనే "అపాణిపాదో... అకర్ణః" అని శాస్త్రం దేహేంద్రియాదులు లేకపోయినా బ్రహ్మకు సర్వసామర్థ్యాలూ ఉంటాయని చూపుతున్నది. 31.

సర్వోపేతాధికరణం సమాప్తం

## 11. ప్రయోజనవత్త్వాధికరణమ్ - సూ. 32-33

### సూ. న ప్రయోజనవత్త్వాత్. 2.1.32

అన్యథా పునశ్చేతనకర్తృత్వం జగతః ఆక్షిపతి. న ఖలు చేతనః పరమాత్మా ఇదం జగద్బిమ్బం విరచయితుమర్హతి. కుతః? ప్రయోజన

వత్త్వాత్ ప్రవృత్తీనామ్. చేతనో లోకే బుద్ధిపూర్వకారీ పురుషః ప్రవర్తమానః న మన్దోపక్రమామపి తావత్ప్రవృత్తిమ్ ఆత్మప్రయోజనానుపయోగినీ మారభమాణో దృష్టః, కిముత గురుతరసంభారామ్. భవతి చ లోక ప్రసిద్ధ్యనువాదినీ శ్రుతిః "న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" (బృ.ఉ. 2.4.4) ఇతి. గురుతరసంరమ్భా చేయం ప్రవృత్తిః యదుచ్చావచప్రపఞ్చం జగద్బిమ్బం విరచితవ్యమ్. యదీయమపి ప్రవృత్తిశ్చేతనస్య పరమాత్మన ఆత్మ ప్రయోజనోపయోగినీ పరికల్ప్యేత పరితృప్తత్వం పరమాత్మనః శ్రూయమాణం బాధ్యేత. ప్రయోజనాభావే వా ప్రవృత్త్యభావోఽపి స్యాత్. అథ చేతనో2 పి సన్నున్మత్తో బుద్ధ్యపరాధాదన్తరేణైవాత్మప్రయోజనం ప్రవర్తమానో దృష్టః తథా పరమాత్మాపి ప్రవర్తిష్యత ఇత్యుచ్యేత తథా సతి సర్వజ్ఞత్వం పరమాత్మనః శ్రూయమాణం బాధ్యేత. తస్మాదశ్లిష్టా చేతనాత్ సృష్టిరితి. 32

బాలానందిని

**నేతి** :- "ప్రయోజనవత్త్వాత్ = ప్రతీ కార్యానికి ఏదో ఒక ప్రయోజనం ఉండాలి; అలాంటి దేదీ ఇక్కడ లేదు, అందుచేత, న = చేతను డైన పరమేశ్వరుడు జగత్స్రష్ట కాడు" అని సూత్రార్థం. ఇది పూర్వపక్షసూత్రం.

**అన్యథేతి** :- జగత్తును చేతనమైన బ్రహ్మ సృజించినది అనే విషయం మరొక విధంగా మళ్లీ ఆక్షేపిస్తున్నాడు. ఈ జగద్బింబాన్ని (జగత్తు అనే ఈ దృశ్యమానమైన వస్తువును) చేతనుడైన పరమాత్మ చేయడానికి తగదు. ఎందువల్ల? ప్రవృత్తులకు ఏదో ఒక ప్రయోజనం ఉండాలి కదా? బుద్ధిపూర్వంగా చేసే ఏదైనా పనిలో ప్రవర్తిస్తూన్న చేతనుడైన పురుషుడు, చిన్న ప్రయత్నంచేత సాధ్యమైన ప్రవృత్తిని కూడ అది తనకు లాభకరం కాకపోతే ప్రారంభిస్తున్నట్లు ఎక్కడా లోకంలో కనబడడంలేదు, పెద్ద ప్రయత్నం చేయవలసినదాని విషయం చెప్పాలా? లోకంలో ఉన్న ప్రసిద్ధినే అనువదిస్తూ "న...భవతి" అనే శ్రుతి ఉంది. వివిధమైన విస్తృతవిషయా లున్న ఈ జగద్బింబాన్ని రచించాలంటే ఈ ప్రవృత్తి చాల గొప్ప ప్రయత్నంతో కూడినది. చేతను డైన పరమాత్మయొక్క ఈ ప్రవృత్తి తన ప్రయోజనానికి ఉపయోగించేదే అని చెప్పిన పక్షంలో పరమాత్మ నిత్యతృప్తుడు అని వినబడేది (శ్రుతి) బాధితం అయిపోతుంది. ప్రయోజనం లేదు అంటే ప్రవృత్తి కూడ ఉండకపోవచ్చును. అట్లు కాక ఉన్మత్తుడు

చేతనుడైనా కూడ బుద్ధిదోషంవల్ల తన కేమీ ప్రయోజనం లేకపోయినా ప్రవర్తిస్తున్నట్లు కనబడుతున్నాడు, పరమాత్మ కూడ ఆ విధంగానే ప్రవర్తిస్తాడు అని అంటే అప్పుడు పరమాత్మ సర్వజ్ఞుడని చెప్పే శ్రుతివాక్యం బాధితం అవుతుంది. అందువల్ల చేతనం వల్ల సృష్టి కలిగిందనడం కుదరడం లేదు.

వి. పరితృప్తుడైన పరమాత్మచేత జగత్తు సృజింపబడింది అని చెప్పే సమన్వయం విషయం. తెలివైనవా డెవడూ నిష్ఫలమైన పని చెయ్యడు అనే లోక ప్రసిద్ధన్యాయానికి ఇది విరుద్ధమా కాదా అని సంశయం. దేహం లేకపోయినా బ్రహ్మ శక్తిసహితం అని శ్రుతిబలంచేత వెనుకటి అధికరణంలో చెప్పబడింది. దానిని ఆక్షేపిస్తూ ఇక్కడ పూర్వపక్షం చేయబడుతున్నది. 32.

## సూ. లోకవత్తు లీలాకైవల్యమ్ . 2-1.33

తుశబ్దేనాక్షేపం పరిహరతి. యథా లోకే కస్య చిదాప్తైషణస్య రాజ్ఞో రాజామాత్యస్య వా వ్యతిరిక్తం కించిత్ప్రయోజనమనభిసంధాయ కేవలం లీలారూపాః ప్రవృత్తయః క్రీడావిహారేషు భవన్తి, యథా చోచ్ఛ్వాసప్రశ్వాసాద యోఽనభిసంధాయ బాహ్యం కించిత్ ప్రయోజనం స్వభావాదేవ సంభవన్తి, ఏవమీశ్వరస్యాప్యనపేక్ష్య కించిత్ప్రయోజనాన్తరం స్వభావాదేవ కేవలం లీలారూపా ప్రవృత్తిర్భవిష్యతి. న హి ఈశ్వరస్య ప్రయోజనాన్తరం నిరూప్యమాణం న్యాయతః శ్రుతితో వా సంభవతి; న చ స్వభావః పర్యనుయోక్తుం శక్యతే. యద్యప్యస్మాకమియం జగద్బిమ్బరచనా గురుతరసంరమ్భేవాభాతి తథాపి పరమేశ్వరస్య లీలైవ కేవలేయమ్, అపరిమితశక్తిత్వాత్. యది నామ లోకే లీలాస్వపి కించిత్సూక్ష్మం ప్రయోజనముత్ప్రేక్ష్యేత తథాపి నైవాత్ర కించిత్ప్రయోజనముత్ప్రేక్షితుం శక్యతే, ఆప్తకామశ్రుతేః. నాప్యప్రవృత్తిరున్మత్త ప్రవృత్తిర్వా, సృష్టిశ్రుతేః, సర్వజ్ఞత్వశ్రుతేశ్చ. న చేయం పరమార్థవిషయా సృష్టిశ్రుతిః, అవిద్యాకల్పితనామరూపవ్యవహారగోచరత్వాత్, బ్రహ్మాత్మభావప్రతిపాదనపరత్వాచ్చేత్యపి నైవ విస్మర్తవ్యమ్. 33.

### బాలానందిని

లోకవదితి :- "లోకవత్తు = లోకమునందు వలె, లీలాకైవల్యమ్ = కేవలం లీలయే జగత్సృష్టికి ప్రయోజనం" అని సూత్రార్థం.

తుశబ్దేనేతి :- తుశబ్దంచేత ఆక్షేపాన్ని పరిహరిస్తున్నాడు. లోకంలో అన్ని కోరికలూ తీరిన రాజుగాని, రాజుయొక్క అమాత్యుడు గాని వేరుగా ఏ ప్రయోజనాన్ని

అపేక్షించకుండా క్రీడావిహారాదులలో కేవలం లీలారూపంగా ఏ విధంగా ప్రవర్తిస్తూ ఉంటారో, బాహ్యమైన ప్రయోజనాన్ని దేనినీ అపేక్షించకుండా ఉచ్ఛ్వాసనిఃశ్వాసాదులు స్వభావం చేతనే ఏ విధంగా జరుగుతుంటాయో అదే విధంగా ఈశ్వరుడు కూడ ఏ ప్రయోజనాన్నీ అపేక్షించకుండానే, స్వభావంచేతనే కేవలం లీలారూపంలో ప్రవర్తిస్తూంటాడు. న్యాయంచేత (యుక్తిచేత) గాని, శ్రుతిచేత గాని ఈశ్వరునికి మరొక ప్రయోజనం ఏదీ కల్పించడం కుదరదు కదా? అదే విధంగా స్వభావాన్ని ప్రశ్నించడం కుదరదు కదా? ఈ జగద్బింబనిర్మాణం మనకు చాల గొప్ప సంరంభంతో నిర్వహించవలసి నట్లు కనబడినా అపరిమితశక్తి గల పరమేశ్వరునికి ఇదిలీల మాత్రమే. లోకంలో (రాజాదుల) లీలలో కూడ ఏదైన చాల చిన్న ప్రయోజనం ఉన్నట్లు ఊహించ వచ్చు నేమోకాని పరమాత్మ విషయంలో కొంచెం కూడ ప్రయోజనం ఊహింప శక్యం కాదు. పరమేశ్వరుడు సర్వ కామాలను పొందినవాడు అని శ్రుతి చెప్పుచున్నది కదా? అసలు ప్రవృత్తియే లేకపోవడం గాని, ఉన్మత్తప్రవృత్తి వంటి ప్రవృత్తి అని గాని చెప్పకూడదు. ఎందువల్ల ననగా - సృష్టిని గూర్చి శ్రుతి చెప్పుచున్నది. (అందుచేత అప్రవృత్తి లేదు), సర్వజ్ఞుడని కూడ శ్రుతి చెప్పుచున్నది (అందుచేత ఉన్మత్తప్రవృత్తి కాదు). నిజానికి ఈ సృష్టిశ్రుతి సృష్టి పరమార్థమైనది అని చెప్పడం కోసం బయలుదేరినది కాదు, ఎంవదువల్ల ననగా ఇది అవిద్యాకల్పితమైన నామరూప వ్యవహారాలను నిర్దేశిస్తూ ప్రధానంగా బ్రహ్మాత్మభావాన్ని ప్రతిపాదించడంలో పరమతాత్పర్యం కలది అనే విషయం కూడ మరువకూడదు. (పై ఆక్షేపానికి అసలు సమాధానం ఇదే అని అర్థం). 33.

ప్రయోజనవత్త్వాధికరణం సమాప్తం

## 12. వైషమ్యనైర్ఘృణ్యాధికరణమ్. సూ. 34-36

### సూ. వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహి దర్శయతి. 2.1.34.

పునశ్చ జగజ్జన్మాదిహేతుత్వమీశ్వరస్య ఆక్షిప్యతే, స్థూణానిఖననన్యాయేన ప్రతిజ్ఞాతస్యార్థస్య దృఢీకరణాయ. నేశ్వరో జగతః కారణముపపద్యతే; కుతః? వైషమ్యనైర్ఘృణ్యప్రసంగాత్. కాంశ్చిదత్యన్తసుఖభాజః కరోతి దేవాదీన్, కాంశ్చిదత్యన్తదుఃఖభాజః పశ్వాదీన్, కాంశ్చిన్మధ్యమభోగభాజో మనుష్యాదీనిత్యేవం విషమాం సృష్టిం నిర్మిమాణస్య ఈశ్వరస్య పృథగ్జనస్యేవ రాగద్వేషోపపత్తేః శ్రుతిస్మృత్యవధారిత స్వచ్ఛత్వాదీశ్వరస్వభావవిలోపః ప్రసజ్యేత. తథా ఖలజనైరపి జుగుప్సితం

నిర్ఘృణత్వమతి క్రూరత్వం దుఃఖయోగవిధానాత్, సర్వప్రజోపసంహారాచ్చ ప్రసజ్యేత. తస్మాద్వైషమ్య నైర్ఘృణ్యప్రసంగాన్నేశ్వరః కారణమితి.

బాలానందిని

వైషమ్యేతి :- "వైషమ్యనైర్ఘృణ్యే = పక్షపాతము, జాలి లేకపోవడమూ, న = పరమేశ్వరునికి లేవు. సాపేక్షత్వాత్ = సృష్టింపబడేవాళ్ల కర్మలను అపేక్షించి సృష్టించడం వల్ల, తథా = అట్లు, దర్శయతి హి = శ్రుతి చూపుచున్నది కదా?" అని సూత్రార్థం.

పునరితి :- ఈశ్వరుడు జగజ్జన్మాదులకు హేతువు అనే ప్రతిజ్ఞ చేసిన (చెప్పిన) విషయం దృఢం చేయడంకొరకు, స్థూణానిఖననన్యాయంచేత మళ్లీ ఆక్షేపించ బడుచున్నది. (ఏనుగులు మొదలైన వాటిని కట్టడం కోసం నేలలో పాతిన గట్టి స్తంభం మొదలైనవి 'స్థూణ'. ఆ స్థూణ గట్టిగా కదలకుండా ఉండడం కోసం త్రవ్విన చోటనే ఇంకా లోతుగా త్రవ్వి దానిని పాతడం స్థూణానిఖననన్యాయం). ఈశ్వరుడు జగత్తుకు కారణం అని చెప్పడం కుదరదు. ఎందువల్ల? వైషమ్యనైర్ఘృణ్య ప్రసంగంవల్ల. దేవతలు మొదలైన కొందరిని అత్యంతసుఖం కలవాళ్లనుగా చేస్తున్నాడు, పశువులు మొదలైన కొన్ని ప్రాణులను చాలా దుఃఖం కలవాటినిగా చేస్తున్నాడు; మనుష్యులు మొదలైన కొందరిని మధ్యమభోగం అనుభవించే వాళ్లనుగా చేస్తున్నాడు. ఈ విధంగా విషమమైన సృష్టి చేస్తూన్న ఈశ్వరునికి కూడ పామరజనునికి వలె (మామూలు మనిషికి వలె) రాగద్వేషాలు ఉన్నాయని చెప్పవలసి ఉంటుంది. అందుచేత శ్రుతి స్మృతులలో చెప్పిన స్వచ్ఛత్వం మొదలైన ఈశ్వరస్వభావానికి లోపం ఏర్పడుతుంది. అల్లా చాలామందికి దుఃఖం ఇవ్వడంచేత, అందరినీ సంహరిస్తూండడంచేత కూడ పరమేశ్వరునికి దుష్టజనులు కూడ ఏవగించుకొనే నిర్ఘృణత్వం, అతి క్రూరత్వం ప్రసక్తం అవుతుంది. అందుచేత వైషమ్య నైర్ఘృణ్యాలు ప్రసక్త మవుతాయి గాన ఈశ్వరుడు కారణం కాదు.

వి. ఎట్టి దోషాలు లేని బ్రహ్మ జగత్తును సృష్టించుచున్నది అని చెప్పే శ్రుతి సమన్వయం విషయం. అది, అందర్నీ సమంగా చూడక విషమంగా చూచేవాడు దోషవంతుడు అనే ప్రసిద్ధన్యాయానికి విరుద్ధమా కాదా అని సంశయం.లీలచేత జగత్తును సృజిస్తున్నాడు అని వెనుక చెప్పబడింది. పరమేశ్వరుడు కర్మాదులమీద ఆధారపడి సృష్టిస్తున్నాడు అని చెపితే అతని ఈశ్వరత్వానికి భంగం. కర్మాద్యపేక్ష లేకపోతే రాగద్వేషాదు లున్నవాడన్న ట్లవుతుంది. ఈ ఆక్షేపసంగతిచేత (వెనుక చెప్పిన స్రష్టృత్వం కుదరదని) పూర్వపక్షం చేయబడింది.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- వైషమ్యనైర్ఘృణ్యే నేశ్వరస్య ప్రసజ్యేతే. కస్మాత్? సాపేక్షత్వాత్. యది హి నిరపేక్షః కేవల ఈశ్వరో విషమాం సృష్టిం నిర్మిమీతే స్యాతామేతౌ దోషౌ వైషమ్యం నైర్ఘృణ్యం చ. న తు నిరపేక్షస్య నిర్మాతృత్వమస్తి. సాపేక్షో హీశ్వరో విషమాం సృష్టిం నిర్మిమీతే. కిమపేక్షత ఇతి చేత్; ధర్మాధర్మావపేక్షత ఇతి వదామః. అతః సృజ్యమానప్రాణిధర్మాధర్మాపేక్షయా విషమా సృష్టిరితి నాయమీశ్వరస్యాపరాధః. ఈశ్వరస్తు పర్జన్యవద్ద్రష్టవ్యః. యథా హి పర్జన్యో వ్రీహియవాదిసృష్టౌ సాధారణం కారణం భవతి, వ్రీహియవాదివైషమ్యే తు తత్తద్బీజగతాన్యేవ అసాధారణాని సామర్థ్యాని కారణాని భవన్తి, ఏవమీశ్వరో దేవమనుష్యాదిసృష్టౌ సాధారణం కారణం భవతి, దేవమనుష్యాదివైషమ్యే తు తత్తజ్జీవగతాన్యేవాసాధారణాని కర్మాణి కారణాని భవన్తి, ఏవమీశ్వరః సాపేక్షత్వాన్న వైషమ్యనైర్ఘృణ్యాభ్యాం దుష్యతి. కథం పునరవగమ్యతే సాపేక్ష ఈశ్వరో నీచమధ్యమోత్తమం సంసారం నిర్మిమీత ఇతి. తథాహి దర్శయతి శ్రుతిః - "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషత ఏష ఉ ఏవాసాధు కర్మ కారయతి తం యమధో నినీషతే" (కౌ.బ్రా. 3.8) ఇతి. "పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" (బృ.ఉ.3.2.17) ఇతి చ. స్మృతిరపి ప్రాణికర్మవిశేషాపేక్ష మేవ ఈశ్వరస్యానుగ్రహీతృత్వం నిగ్రహీతృత్వం చ దర్శయతి - "యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్" (భ.గీ. 4.11) ఇత్యేవం జాతీయకా. 34.

## బాలానందిని

ఏవమితి :- ఇట్లు పూర్వపక్షం ప్రాప్తించగా చెపుతున్నాం - ఈశ్వరునికి వైషమ్య నైర్ఘృణ్యాలు ప్రసక్తాలు కావు. ఎందువల్ల? సాపేక్షత్వంవల్ల. కేవలం ఈశ్వరుడే మరి దేని ఆపేక్షా లేకుండా విషమమైన సృష్టి చేస్తే వైషమ్యం, నైర్ఘృణ్యం అనే ఈ దోషాలు ప్రసక్తం కావచ్చును. నిరపేక్షు డైన ఈశ్వరుడు జగత్తును నిర్మించడం లేదు. ఈశ్వరుడు ఏదో ఒక దానిని ఆపేక్షించియే (ఒక దానిని నిమిత్తంగా చేసి కొనియే) విషమమైన సృష్టిని నిర్మిస్తున్నాడు. దేన్ని అపేక్షిస్తున్నాడు అంటే - ధర్మాధర్మాలను అపేక్షిస్తున్నా డని అంటాం. అందువల్ల విషమమైన ఈ సృష్టి సృజించబడుచున్న ప్రాణుల

ధర్మాధర్మాలను అపేక్షించి ఉంటుంది గాన ఇది ఈశ్వరుని అపరాధం కాదు. ఈశ్వరుడైతే మేఘం వంటివా డని గుర్తుంచుకోవాలి. మేఘం వరి, యవలు మొదలైన వాటిని సృజించడంలో సాధారణ కారణంగా ఉంటుంది. కొన్ని వరిధాన్యం గాను, కొన్ని యవలు గాను మొలవడానికి ఆ యా విత్తనాలలోని అసాధారణమైన సామర్థ్యాలే కారణాలవుతాయి. ఇట్లే ఈశ్వరుడు కూడ దేవమనుష్యాదిసృష్టికి సాధారణకారణంగా ఉంటాడు. దేవమనుష్యాదులలో ఉన్న వైషమ్యానికి ఆ యా జీవులలో ఉన్న అసాధారణాలైన కర్మలే (కర్మవిశేషాలే) కారణా లవుతాయి. ఈ విధంగా ఈశ్వరుడు సాపేక్షుడు గాన వైషమ్యనైర్ఘృణ్యాలచేత దూషితుడు కాడు. ఈశ్వరుడు సాపేక్షుడుగానే ఉండి నీచ- మధ్యమ- ఉత్తమరూపమైన సంసారాన్ని నిర్మిస్తాడని ఎలా తెలుస్తున్నది? "ఏష... నినీషతే" (ఎవనినైతే ఈ లోకాలనుండి పైకి తీసికొని వెళ్లాలని అనుకుంటాడో వానిచేత ఈశ్వరుడు మంచి కర్మ చేయిస్తాడు. ఎవనిని క్రిందికి తీసికొని పోవాలనుకుంటాడో వానిచేత చెడ్డ పని చేయిస్తాడు), "పుణ్యో... పాపేన" (పుణ్యకర్మచేత పుణ్యుడౌతాడు, పాపకర్మచేత పాపు డవుతాడు) అని శ్రుతి ఆ విధంగా చూపుచున్నది. "యే... భజామ్యహమ్" (నన్ను ఎవరు ఏ విధంగా ఆశ్రయిస్తారో వాళ్లని అదే విధంగా ఆదుకొంటాను) ఇత్యాదిస్మృతులు కూడ ఈశ్వరుడు అనుగ్రహించడం, నిగ్రహించడం అనేవి ప్రాణుల కర్మ విశేషం మీదనే ఆధారపడి ఉంటాయని చూపుతున్నది.

వి. ఎవనిని పైకి తీసికొని వెళ్లా లనుకుంటాడో వాడిచేత మంచి పని చేయిస్తాడు; క్రిందికి గెంటి వేయదలచినవానిచేత చెడ్డ పనులు చేయిస్తాడు అన్నప్పుడు అలా చేయించడంలో కూడ వైషమ్యం ఉంది కదా అని ఆశంక కలుగుతుంది. దానికి సమాధాన మేమనగా ఈశ్వరుడు అలా చేయించడానికి కారణం కూడ అనాదిగా వస్తూన్న ఆ యా ప్రాణుల కర్మయే. ఆ విషయంలో కూడ ఈశ్వరుడు సాధారణ కారణమే. 34.

## సూ. న కర్మావిభాగాదితిచేన్నానాదిత్వాత్. 2.1.35

"సదేవ సోమ్యేదమగ్ర ఆసేత్ ఏకమేవాద్వితీయమ్" (ఛా. ఉ. 6.2.1) ఇతి ప్రాక్ సృష్టేః అవిభాగావధారణాత్ నాస్తి కర్మ యదపేక్ష్య విషమా సృష్టిః స్యాత్. సృష్ట్యుత్తరకాలం హి శరీరాదివిభాగాపేక్షం కర్మ, కర్మాపేక్షశ్చ శరీరాదివిభాగ ఇతీత రేతరేతరాశ్రయత్వం ప్రసజ్యేత. అతో విభాగాదూర్ధ్వం కర్మాపేక్ష ఈశ్వరః ప్రవర్తతాం నామ; ప్రాగ్విభాగాద్వైచిత్ర్యనిమిత్తస్య కర్మణో ऽభావాత్ తుల్యైవాద్యా సృష్టిః ప్రాప్నోతీతి చేత్, నైష దోషః. అనాదిత్వాత్సం

సారస్య. భవేదేష దోషో యద్యాదిమాన్సంసారః స్యాత్. అనాదౌ తు సంసారే బీజాఙ్కురవద్ధేతుహేతుమద్భావేన కర్మణః సర్గవైషమ్యస్య చ ప్రవృత్తిర్న విరుధ్యతే. 35.

### బాలానందిని

నేతి :- "కర్మ = కర్మ, న = లేదు, అవిభాగాత్ = సృష్టికి పూర్వం విభాగం లేదు గాన, ఇతి చేత్ = ఇట్లు అంటే, న = కాదు, అనాదిత్వాత్ = సంసారం అనాది కదా" అని సూత్రార్థం.

సదేవేతి :- "సదేవ... అద్వితీయమ్" అని సృష్టికి పూర్వం విభాగం ఏదీ లేదని నిర్ధారణ చేయడంవల్ల, ఏ కర్మను అపేక్షించి విషమమైన సృష్టి జరగాలో అలాంటి కర్మయే లేదు కదా? శరీరాదుల విభాగాన్ని అపేక్షించి జరిగే కర్మ సృష్టికి తరవాతనే చేయబడుతుంది, కర్మ చేస్తేనే శరీరాదివిభాగం ఏర్పడుతుంది అని అన్యోన్యాశ్రయ దోషం ప్రసక్తం అవుతుంది. అందువల్ల, విభాగం తరవాత ఈశ్వరుడు కర్మాపేక్షుడై ప్రవర్తిస్తే ప్రవర్తించుగాక, విభాగంకంటె పూర్వమైతే వైచిత్ర్యానికి నిమిత్తమైన కర్మ లేదు గాన మొట్టమొదటి సృష్టి (ఏ వైషమ్యాలూ లేకుండా) ఒకే విధంగా ఉండాలి అన్నట్లయితే - ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా ఈ సంసారం అనాది. సంసారానికి ఆది అనేది ఉండి ఉంటే ఈ దోషం ఉండేది. కాని అనాది యైన సంసారంలో కర్మ, సృష్టివైషమ్యమూ కూడ బీజాంకురాలవలె, హేతుహేతుమద్భావంతో ప్రవర్తించడంలో విరోధం లేదు.

వి. విత్తు ముందా చెట్టు ముందా అనేదాని సమాధానం - సంసారం అనాది గాన ఏది ముందు ఏది తరవాత అని చెప్పలేం అని చెప్పాలి. అదే విధంగా హేతువైన కర్మ, హేతుమత్ (హేతువువల్ల ఏర్పడిన) అయిన సంసారమూ కూడ అనాదిగా వస్తున్నాయి అని అర్థం. 35

### భాష్యమ్

కథం పునరవగమ్యతే[2] నాదిరేష సంసార ఇతి. అత ఉత్తరం పఠతి-

**సూ. ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ. 2.1.36**

ఉపపద్యతే చ సంసారస్యానాదిమత్త్వమ్. ఆదిమత్త్వే హి సంసారస్య అకస్మాదుద్భూతేర్ముక్తానామపి పునః సంసారోద్భూతిప్రసంగః, అకృతా

భ్యాగమప్రసంగశ్చ; సుఖదుఃఖాదివైషమ్యస్య నిర్నిమిత్తత్వాత్. న చేశ్వరో వైషమ్యహేతురిత్యుక్తమ్. న చావిద్యా కేవలా వైషమ్యస్య కారణమ్, ఏక రూపత్వాత్. రాగాదిక్లేశవాసనాక్షిప్తకర్మాపేక్షా త్వవిద్యా వైషమ్యకరీ స్యాత్. న చ కర్మాన్తరేణ శరీరం సంభవతి, న చ శరీరమన్తరేణ కర్మ సంభవతీతరేతరా శ్రయత్వప్రసంగః. అనాదిత్వే తు బీజాఙ్కురన్యాయేన ఉపపత్తేః న కశ్చిద్దోషో భవతి. ఉపలభ్యతే చ సంసారస్యానాదిత్వం శ్రుతిస్మృత్యోః. శ్రుతౌ తావత్ "అనేన జీవేనాత్మనా" (ఛా. ఉ. 6.3.2) ఇతి సర్గప్రముఖే శారీరమాత్మానం జీవశబ్దేన ప్రాణధారణనిమిత్తేనాపలపన్ అనాదిః సంసార ఇతి దర్శయతి. ఆదిమత్త్వే తు ప్రాగనవధారితప్రాణః సన్ కథం ప్రాణధారణనిమిత్తేన జీవశబ్దేన సర్గప్రముఖేఽభిలప్యేత? న చ ధారయిష్యతీత్యతోఽభిలప్యేత, అనాగతాద్ధి సంబన్ధాదతీతః సంబన్ధో బలవాన్ భవతి, అభినిష్పన్నత్వాత్. "సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమ కల్పయత్" (ఋ.స. 10.190.3) ఇతి చ మన్త్రవర్ణః పూర్వకల్పసద్భావం దర్శయతి. స్మృతావప్యనాదిత్వం సంసారస్యో పలభ్యతే - "న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా" (భ.గీ. 15-3) ఇతి. పురాణే చాతీతానామనాగతానాం చ కల్పానాం న పరిమాణ మస్తీతి స్థాపితమ్. 36.

## బాలానందిని

కథమితి :- ఈ సంసారం అనాది అని ఎలా తెలుస్తూన్నది? ఇందుకు సమాధానంగా సూత్రం చెపుతున్నాడు-

ఉపపద్యతే ఇతి :- ఉపపద్యతే = సంసారంయొక్క అనాదిత్వం ఉపపన్నం అవుతుంది (కుదురుతుంది), ఉపలభ్యతే చ = శ్రుతిస్మృతులలో చూడబడు తున్నది కూడ" అని సూత్రార్థం.

ఉపపద్యతే ఇతి :- సంసారంయొక్క అనాదిత్వం ఉపపన్నం అవుతుంది. సంసారానికి ప్రారంభం ఉంటే అది ఎప్పుడో ఒకనాడు అకస్మాత్తుగా (ఏ కారణమూ లేకుండా) పుట్టిందని చెప్పాలి. అలాగైతే ముక్తులు కూడ మళ్లీ సంసారంలో పుట్టడం జరుగుతుంది. సుఖదుఃఖాదుల వైషమ్యానికి నిమిత్తం ఏదీ లేకపోవడంచేత అకృతాభ్యాగమప్రసంగం అనగా ఏమీ చేయకుండగానే ఫలం కలగడం అనేది

ఏర్పడుతుంది. (ఈ విధంగా జ్ఞానకాండ కర్మకాండా వ్యర్థం అయిపోతాయి అని అర్థం). (సుఖదుఃఖాదివైషమ్యానికి) ఈశ్వరుడే హేతువు అనడం యుక్తం కాదని చెప్పి ఉన్నాం. కేవల మైన అవిద్య కూడ వైషమ్యానికి కారణం కాజాలదు. ఎందువల్ల ననగా అది (అందరి విషయంలోనూ) ఒకే విధంగా ఉంటుంది. అయితే రాగాది క్లేశాల (రాగ - ద్వేష-మోహాల) వాసనలచేత చేయబడిన కర్మల సహాయంతో అవిద్య వైషమ్యాన్ని కలిగించేది కావచ్చును. (అనగా అవిద్యకు సహాయపడడానికి క్లేశ- కర్మల యొక్క అనాదిప్రవాహాన్ని అంగీకరించాలి అని భావం). కర్మ లేకుండా శరీరం సంభవించదు, శరీరం లేకుండా కర్మ సంభవించదు అని ఇతరేతరాశ్రయ దోషం కూడ ప్రసక్తమవుతుంది. సంసారం అనాది అయితే బీజాంకురన్యాయంచేత కుదురుతుంది కాబట్టి (కర్మ - శరీరసంబంధాల మధ్య హేతుహేతుమద్భావం కుదురుతుంది కాబట్టి) దోషం (అన్యోన్యాశ్రయాదికం) ఏదీ ఉండదు. సంసారం అనాది అని శ్రుతులలోను స్మృతులలోను కూడ కనబడుచున్నది. శ్రుతిలో ఎట్లనగా - "అనేన జీవేనాత్మనా" అని సృష్టి ప్రారంభంలో శరీరంతో సంబంధించిన ఆత్మను ప్రాణధారణం నిమిత్తంగా గల జీవశబ్దంచేత నిర్దేశిస్తూ సంసారం అనాది అని సూచిస్తున్నాడు.

వి. జీవు డనగా ప్రాణాలను నిలిపే ఆత్మ. "ఈ జీవాత్మతో వీటిలో ప్రవేశిస్తాను" అని అనడంవల్ల ప్రవేశించక మునుపే జీవుడు అనే పేరు పెట్టి నట్లయింది. దీనిని పట్టి ప్రాణాలు, ప్రాణధారణం చేసే జీవాత్మా కూడ అనాదులనీ "ఆ జీవాత్మ స్వరూపంతో లోపల ప్రవేశిస్తాను" అని చెప్పబడుతున్న దని తెలుస్తున్నది. అనగా ఆత్మ లోపల ప్రవేశించిన తరవాతనే ప్రాణధారణం జరుగుతుంది. అప్పుడు ప్రాణధారణం చేసిన ఆత్మకు జీవుడు అనే పేరు వస్తుంది. ఇక్కడ సృష్టి ప్రారంభంలోనే, ప్రాణంతో ఆత్మకు సంబంధం కలగక పూర్వమే 'జీవుడు' అని శ్రుతి అంటున్నది. దీనిని పట్టి ఇది సృష్టి ప్రారంభం కాదనీ అనాది కాలంనుంచి జీవ-ప్రాణసంబంధం కొనసాగుతూ వస్తున్న దని ప్రలయసమయంలో తిరోహితమైన అది ఈ సృష్టి ప్రారంభంలో మళ్లీ కనబడుతున్న దనీ అర్థం.

ఆదీతి :- సంసారానికి అది ఉన్నట్లయితే అంతకు ముందు ప్రాణధారణం చేయనిదానిని ప్రాణధారణం చేయడంచేత వచ్చిన జీవశబ్దంచేత సృష్టిప్రారంభంలో నిర్దేశించడం ఎలా కుదురుతుంది.

**అవ** :- అప్పటి కింకా ప్రాణధారణం చేయకపోయినా మున్ముందు చేయనున్నాడు కాబట్టి జీవశబ్దంచేత నిర్దేశింప బడవచ్చును కదా, "గృహస్థః సదృశీం భార్యాముపేయాత్" (గృహస్థుడు తగిన భార్యను సంపాదించాలి) ఇత్యాది వాక్యాలలో భార్యను సంపాదించడానికి ముందు అతడు గృహస్థుడు కాకపోయినా రాబోయే గృహస్థత్వాన్ని బట్టి 'గృహస్థః' అని నిర్దేశించబడుచున్నాడు. ఇక్కడ అట్లే గ్రహించ వచ్చును అని ఆశంకించుకొని చెపుతున్నారు - న చేతి :- ప్రాణాలను మున్ముందు ధరించనున్నాడు గాన జీవశబ్దంచేత చెప్పబడుచున్నాడు అనడం యుక్తం కాదు. రాబోయే సంబంధం కంటె పూర్వంనుండీ ఉన్న సంబంధం బలం గలది కదా? ఎందువల్ల ననగా అది అప్పటికే ఏర్పడి ఉంది. (అందుచేత ఇక్కడ జీవశబ్దనిర్దేశం ఎప్పటినుంచో ఉన్న ప్రాణధారణరూపసంబంధాన్ని పట్టే కాని రాబోయేదానిని పట్టి కాదు అని అర్థం). "సూర్యా... **అకల్పయత్**" (బ్రహ్మ సూర్యచంద్రులను పూర్వం వలెనే కల్పించాడు) అను మంత్రం పూర్వకల్పాలు ఉన్నాయని చూపుతున్నది. "న రూప... సంప్రతిష్ఠా' ' (ఈ సంసారవృక్షంయొక్క స్వరూపం మిథ్యయా సత్యమా అని ఉపదేశం లేకుండా తెలియదు. దీనికి జ్ఞానం లేకుండా అంతం లేదు. ఆది లేదు. మధ్యలో స్థితి కూడ (మిథ్య కాబట్టి) లేదు) అను స్మృతిలో కూడ సంసారం అనాది అని కనబడుతున్నది. పురాణంలో కూడ గడచిపోయిన కల్పాలకు రాబోయే కల్పాలకు ప్రమాణం (ఇన్ని అనే సంఖ్య) లేదు అని స్థాపించబడింది. 36.

## వైషమ్యనైర్ఘృణ్యాధికరణం సమాప్తం

## 13. సర్వధర్మోపపత్త్యధికరణమ్. సూ. 37

## సూ. సర్వధర్మోపపత్తేశ్చ. 2.1.37

చేతనం బ్రహ్మ జగతః కారణం ప్రకృతిశ్చే త్యస్మిన్న వధారితే వేదార్థే పరైరుపక్షిప్తాన్ విలక్షణత్వాదీన్ దోషాన్ పర్యహార్షీదాచార్యః. ఇదానీం పరపక్ష ప్రతిషేధప్రధానం ప్రకరణం ప్రారిప్సమానః స్వపక్షపరిగ్రహప్రధానం ప్రకరణముపసంహరతి, యస్మాదస్మిన్ బ్రహ్మణి కారణే పరిగృహ్యమాణే ప్రదర్శితేన ప్రకారేణ సర్వే కారణధర్మా ఉపపద్యన్తే సర్వజ్ఞం, సర్వశక్తి, మహామాయం చ బ్రహ్మ ఇతి, తస్మా దనతిశఙ్కనీయమిదమౌపనిషదం దర్శనమితి. 37

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిన్దభగవత్పూజ్యపాద
శిష్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే
ద్వితీయాధ్యాయస్య ప్రథమః పాదః

బాలానందిని

సర్వేతి :- "సర్వధర్మోపపత్తేశ్చ = సమస్తమైన కారణధర్మాలు కుదురుతాయి గాన బ్రహ్మ జగత్కారణము" అని సూత్రార్థం.

వి. నిర్గుణమైన బ్రహ్మ జగత్తుకు ఉపాదానం అని చెప్పే వేదాంతాల సమన్వయం విషయం. నిర్గుణమైనది ఉపాదాన కారణం కాకూడదు అనే న్యాయానికి ఇది విరుద్ధమా కాదా అని సంశయం. విషమసృష్టికి కారణమైన కర్మ ఉన్నది గాన బ్రహ్మ నిమిత్తకారణం అయితే కావచ్చును. కాని నిర్గుణం అవడంచేత ఉపాదానం మాత్రం కాకూడదు అని ప్రత్యుదాహరణసంగతి చేత పూర్వపక్షం. బ్రహ్మ నిర్గుణమే అయినా దానికి ఉపాదాదకారణాని కుండవలసిన ధర్మాలన్నీ ఉన్నాయి గాన అది ఉపాధాన కారణం అని సిద్ధాంతం. నిర్గుణమైనా కూడ మాయోపాధిచేత ఈ ధర్మాలుండడానికి అభ్యంతరం లేదు అని సూచించబడుతున్నది.

చేతనమితి :- చేతనమైన బ్రహ్మ జగత్తుకు కారణం, అదే ప్రకృతి కూడ అని నిర్ణయించబడిన వేదార్థం విషయంలో పరులు చూపిన విలక్షణత్వాదిదోషాలను ఆచార్యుడు (సూత్రకారుడు) పరిహరించాడు. ఇప్పుడు పరుల పక్షాలను నిషేధించడానికి ఉద్దిష్టమైన ప్రకరణాన్ని (ద్వితీయపాదాన్ని) ప్రారంభింపబోతూ, పరబ్రహ్మను కారణంగా పరిగ్రహిస్తే (ఇంతవరకు) చూపిన పద్ధతిలో బ్రహ్మ సర్వజ్ఞం, సర్వశక్తి, మహామాయ గలది అని సమస్తమైన కారణధర్మాలు కూడ ఉపపన్నము లవుతున్నాయి (కుదురుతున్నాయి) గాన ఈ ఔపనిషదదర్శనం విషయంలో ఎలాంటి శంకలకు తావు లేదు అని స్వపక్షనిర్ణయప్రధానమైన ప్రకరణాన్ని ఉపసంహరిస్తున్నాడు. 37.

'బాలానందిని' అను శ్రీశారీరకమీమాంసాంధ్రవ్యాఖ్యానంలో
ద్వితీయాధ్యాంలో ప్రథమపాదం సమాప్తం.

## ద్వితీయాధ్యాయే ద్వితీయః పాదః

## (అత్ర పాదే సాంఖ్యాదిమతానాం దుష్టత్వప్రదర్శనమ్)

### 1. రచనానుపపత్త్యధికరణమ్ . సూ. 1-10

### సూ. రచనానుపపత్తేశ్చ నానుమానమ్. 2.3.1

యద్యపీదం వేదాన్తవాక్యానామైదంపర్యం నిరూపయితుం శాస్త్రం ప్రవృత్తం న తర్కశాస్త్రవత్కేవలాభిర్యుక్తిభిః కం చిత్సిద్ధాన్తం సాధయితుం దూషయితుం వా ప్రవృత్తం, తథాపి వేదాన్తవాక్యాని వ్యాచక్షాణైః సమ్యగ్దర్శన ప్రతిపక్షభూతాని సాంఖ్యాదిదర్శనాని నిరాకణీయానీతి తదర్థః పరః పాదః ప్రవర్తతే. వేదాన్తార్థనిర్ణయస్య చ సమ్యగ్దర్శనార్థత్వాత్తన్నిర్ణయేన స్వపక క్షస్థాపనం ప్రథమం కృతం, తద్ధ్యభ్యర్హితం పరపక్షప్రత్యాఖ్యానాదితి. నను ముముక్షుణాం మోక్ష సాధనత్వేన సమ్యగ్దర్శననిరూపణాయ స్వపక్షస్థాపన మేవ కేవలం కర్తుం యుక్తం, కిం పరపక్షనిరాకరణేన పరద్వేషకరేణ? బాఢమేవమ్. తథాపి మహాజనపరిగృహీతాని మహాన్తి సాంఖ్యాదితన్త్రాణి సమ్యగ్దర్శనవ్యపదేశేన ప్రవృత్తాన్యుపలభ్య భవేత్కేషాంచిన్మన్దమతీనామే తాన్యపి సమ్యగ్దర్శనాయోపాదేయానీతి. తథా యుక్తిగాఢత్వసంభవేన, సర్వజ్ఞభాషితత్వాచ్చ శ్రద్ధా చ తేషు ఇత్యతస్తదసారతోపపాదనాయ ప్రయత్యతే.

### బాలానందిని

రచనేతి :- 'రచనానుపపత్తేః = సృష్టి కుదరదు గాన, అనుమానమ్ = ప్రధానము, న = జగత్కారణం కాదు'' అని సూత్రార్థం.

యద్యపీతి :- ఈ శాస్త్రం వేదాంతవాక్యాల తాత్పర్యాన్ని చెప్పడం కోసమే ప్రారంభించ బడింది కాని తర్కశాస్త్రం వలె కేవలం యుక్తులచేత ఒక సిద్ధాంతాన్ని సాధించడానికి గాని, దూషించడానికి కాని ఇది బయలు దేరలేదు, అయినా కూడ వేదాంతవాక్యాలను వ్యాఖ్యానించేవాళ్లు సమ్యగ్దర్శనానికి (యథార్థజ్ఞానానికి, తత్త్వ జ్ఞానానికి) విరుద్ధమైన సాంఖ్యాదిదర్శనాల నిరాకరణం కూడ చేయ్యాలి. అందుచేత ఈ పాదం ప్రవర్తిస్తుంది. ఉపనిషదర్థనిర్ణయానికి ప్రయోజనం తత్త్వజ్ఞానం. అందుచేత ముందుగా, పరపక్షప్రత్యాఖ్యానంకంటె అధికంగా ఆదరణీయమైన స్వపక్షస్థాపనం చేయబడింది. (ప్రశ్న) - ముముక్షువులకు మోక్షసాధనం అవడం చేత సమ్యగ్దర్శనాన్ని నిరూపించడం కోసం కేవలం స్వపక్ష స్థాపనం చేయడమే తగిన పని. పరులకు ద్వేషం కలిగించే పరపక్షనిరాకరణం ఎందుకు? (సమాధానం) - ఇది నిజమే. అయినా కూడ

పెద్దలచేత స్వీకరించబడిన కొన్ని గొప్ప సాంఖ్యాదిదర్శనాలు కూడ సమ్యగ్దర్శనా లనే పేరుతో ప్రచారంలో ఉండడం చూచి ఇవి కూడ సమ్యగ్దర్శనం కోసం గ్రహించ దగినవే అనే అభిప్రాయం మందమతులకు ఎవరికైనా కలగవచ్చు. అట్లే వీటిలో యుక్తులు చాలా బలంగా ఉన్నాయనీ, ఇవి సర్వజ్ఞులచేత బోధింపబడ్డా యనీ కూడ వీటియందు శ్రద్ధ కలగవచ్చును. అందుచేత అవన్నీ నిఃసారములు అని ప్రతి పాదించడం కోసం ప్రయత్నం చేయబడుతున్నది.

## భాష్యమ్

నను "ఈక్షతేర్నాశబ్దమ్" (బ్ర. సూ. 1.1.5). 'కామాచ్చ నానుమా నాపేక్షా' (బ్ర.సూ. 1.1.18), 'ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః" (బ్ర.సూ.1.4.28) ఇతి చ పూర్వత్రాపి సాంఖ్యాదిపక్షప్రతిక్షేపః కృతః, కిం పునః కృతకరణేనేతి? తదుచ్యతే - సాంఖ్యాదయః స్వపక్షస్థాపనాయ వేదాన్తవాక్యాన్యప్యుదాహృత్య స్వపక్షానుగుణ్యేనైవ యోజయన్తో వ్యాచక్షతే. తేషాం యద్వ్యాఖ్యానం తద్వ్యాఖ్యానాభాసం, న సమ్యగ్వ్యాఖ్యానమిత్యేతావత్పూర్వం కృతమ్. ఇహ తు వాక్యనిరపేక్షః స్వతన్త్రస్తద్యుక్తిప్రతిషేధః క్రియతే ఇత్యేష విశేషః.

## బాలానందిని

నన్వితి :- (ప్రశ్న) - 'ఈక్షతేర్నాశబ్దమ్, "కామాచ్చ నానుమానాపేక్షా", "ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః" అని వెనుక కూడ సాంఖ్యాదిపక్షాల నిరాకరణం చేయబడింది కదా? చేసినదే మళ్లీ చేయడం ఎందుకు? ఈ విషయంలో (సమాధానం) చెప్పబడుతున్నది. సాంఖ్యాదులు తమ పక్షాలను స్థాపించడం కోసం వేదాంతవాక్యాలను కూడ ఉదాహరించి తమ పక్షాలకు అనుగుణంగా వాటిని సమన్వయిస్తూ వ్యాఖ్యానిస్తున్నారు. వాళ్లు చేసిన వ్యాఖ్యానం వ్యాఖ్యానాభాసమే కాని సరియైన వ్యాఖ్యానం కాదు అనే విషయం మాత్రమే పూర్వం ప్రతిపాదించబడింది. ఇక్కడైతే వాక్యాల అపేక్ష లేకుండా, స్వతంత్రంగా వాళ్ల యుక్తులు నిరాకరించ బడుతున్నాయి. ఇదే విశేషం.

వి. అచేతనమైన ప్రధానం జగత్తుకు ఉపాదానకారణం అనే సాంఖ్యసిద్ధాంతం ఈ అధికరణంలో విషయం. అది ప్రమాణమూలకమా లేక భ్రాంతిమూలకమా అని సందేహం. "సర్వధర్మోపపత్తేశ్చ" అని వెనుక చెప్పిన సర్వధర్మోపపత్తి ప్రధానం విషయంలో కూడ సంభవమే అనే ఆక్షేపసంగతితో పూర్వపక్షం. పూర్వపాదంలో స్వసిద్ధాంతం ప్రతిపాదించబడింది. అది పరసిద్ధాంతనిరాకరణంమీద ఆధారపడి ఉంటుంది గాన పాదాలకు సంగతి; అనగా ఆ పాదం తరవాత ఈ పాదం చెప్పడానికి కారణం. ఈ

పాదంలోని అన్ని అధికరణాలు కూడ పరమతనిరాకరణం చేసేవే గాన వాటికి ఈ పాదంతో సంగతి. ప్రమాణమూలకములైన సాంఖ్యాదిమతాలతో విరోధంవల్ల పైన చెప్పిన శ్రుతిసమన్వయం కుదరకపోవడం పూర్వపక్షఫలం; కుదరడం ఉత్తరపక్షఫలం. ఈ విధంగా మొత్తం ఈ పాదంలో అంతటా చూచుకోవాలి. ఈ పాదంలో శ్రుతి సమన్వయం దృఢంగా ఉండడం కోసం పరమతనిరాకరణం చేయబడుచున్నది గాన ఈ పాదానికి శ్రుతిసంగతి.

## భాష్యమ్

తత్ర సాంఖ్యా మన్యన్తే - యథా ఘటశరావాదయో భేదా మృదాత్మ నాన్వీయమానా మృదాత్మకసామాన్యపూర్వకా లోకే దృష్టాః తథా సర్వ ఏవ బాహ్యాధ్యాత్మికా భేదాః సుఖదుఃఖమోహాత్మతయాన్వీయమానాః సుఖదుఃఖ మోహాత్మకసామాన్యపూర్వకా భవితుమర్హన్తి. యత్తత్సుఖదుఃఖమోహాత్మకం సామాన్యం తత్త్రిగుణం ప్రధానం మృద్వదచేతనం చేతనస్య పురుషస్యార్థం సాధయతుం స్వభావేనైవ విచిత్రేణ వికారాత్మనా (ప్ర) వివర్తత ఇతి. తథా పరిమాణాదిభిరపి లిఙ్గైః తదేవ ప్రధానమనుమిమతే. తత్ర వదామః- యది దృష్టాన్తబలేనైవైతన్నిరూప్యేత, నాచేతనం లోకే చేతనానధిష్ఠితం స్వతన్త్రం కించిద్విశిష్టపురుషార్థనిర్వర్తనసమర్థాన్వికారాన్విరచయద్దృష్టమ్. గేహప్రాసాద శయనాసనవిహారభూమ్యాదయో హి లోకే ప్రజ్ఞావద్భిః శిల్పిభిర్యథాకాలం సుఖదుఃఖప్రాప్తిపరిహారయోగ్యా రచితా దృశ్యన్తే. తథేదం జగదఖిలం పృథివ్యాది నానానకర్మ ఫలోపభోగయోగ్యం బాహ్యమ్, ఆధ్యాత్మికం చ శరీరాది నానాజాత్యన్వితం, ప్రతినియతావయవవిన్యాసమ్, అనేకకర్మ ఫలానుభవాధిష్ఠానం దృశ్యమానం ప్రజ్ఞానవద్భిః సంభావితతమైః శిల్పిభిర్మనసాప్యాలోచయితుమశక్యం సత్ కథమచేతనం ప్రధానం రచయేత్? లోష్టపాషాణాదిష్వదృష్టత్వాత్.

## బాలానందిని

తత్రేతి :- ప్రతిపక్షులలో సాంఖ్యులు ఈ విధంగా అభిప్రాయ పడుతున్నారు. కుండలు మూకుళ్లు మొదలైనవాటిలో మట్టి అనుస్యూతంగా ఉంటుంది. ఆ విధంగా అవి మట్టి అనే సామాన్యంతో (అన్నింటికి సంబంధించిన మట్టితో) సంబంధించినవిగా లోకంలో చూడబడుతున్నాయి. అదే విధంగా బాహ్యాలు, ఆధ్యాత్మికాలూ అయిన

భేదాలన్నీ సుఖదుఃఖమోహాత్మకత్వంతో అనుస్యూతాలుగా ఉన్నాయి గాన అవి సుఖదుఃఖ మోహాత్మకమైన ఒక సామాన్యవస్తువుతో సంబంధించినవిగా, దానిచేత తయారు చేయుబడినవిగా, అవడానికి యుక్తాలవుతాయి. (ఘటశరావాదు లన్నింటిలోను మట్టి కనబడుతున్నది. అందుచేత అవన్నీ మట్టి అనే, వాటి కన్నింటికీ సంబంధించిన వస్తువుచేత నిర్మించబడి నట్లు తెలుసుకుంటున్నాం. అదే విధంగా జగత్తులోని బాహ్యమైన వస్తువులలోను, ఆధ్యాత్మికమైన, అనగా శరీరానికి సంబంధించిన, వస్తువులలోను అన్నింటిలోను కూడ సుఖం, దుఃఖం, మోహం అనేవి అనుస్యూతంగా ఉన్నట్లు కనిపిస్తున్నాయి గాన ఇవన్నీ సుఖదుఃఖమోహాత్మకమైన ఏదో ఒక పదార్థంనుంచి పుట్టాయని చెప్పాలి అని భావం). ఆ సుఖదుఃఖమోహాత్మకమైన సామాన్యమే (అన్నింటిలోను ఉన్న పదార్థమే) మూడు గుణాలు గల ప్రధానం. అది మట్టి వలె అచేతనమైనది. చేతనమైన పురుషునికి (జీవునకు) ప్రయోజనాన్ని (భోగం, మోక్షం అనే ప్రయోజనాన్ని) సాధించడం కోసం విచిత్రమైన వికారాల (కార్యాల) రూపంలో పరిణామం చెందుతుంది. అని సాంఖ్యులంటారు. అట్లే వాళ్లు పరిమాణం మొదలైన లింగాలచేత (హేతువులచేత) ఆ ప్రధానాన్ని అనుమానిస్తున్నారు (అనుమానప్రమాణంచేత తెలుసుకుంటున్నారు)

వి. ప్రధానం అనేవి ఒకటి ఉంది, అదే సర్వజగత్తుకు కారణం అని సాంఖ్యులు అనుమాన ప్రయోగంచేత సాధిస్తున్నారు. ఈ క్రింది కారికలో ఆ హేతువులు చూపబడ్డాయి—

"భేదానాం పరిమాణాత్సమన్వయాచ్ఛక్తితః ప్రవృత్తేశ్చ,
కారణకార్యవిభాగాదవిభాగాద్వైశ్వరూప్యస్య,
కారణమస్త్యవ్యక్తం..." (సాంఖ్యకారిక. 15, 16 శ్లోకాలు)

ప్రధానానికి అవ్యక్తం అని కూడ పేరు. ప్రధానంనుంచి మహదహంకారాది తత్త్వాలు ఒకదానినుండి ఒకటిగా పుడుతున్నాయి. అవి పుట్టడానికి పూర్వం అవన్నీ ప్రధానంలో లీనములై, అవ్యక్తంగా ఉంటాయి. అందుచేతనే ప్రధానానికి అవ్యక్తం అని పేరు. మహదాదుల అవ్యక్తావస్థ అని అర్థం. అవ్యక్తం అని చెప్పబడే ప్రధానం ఉంది అని సాధించడానికి ఈ కారికలో ఐదు హేతువులు చూపబడ్డాయి! భేదాలనగా ఇక్కడ కార్యాలని అర్థం. కార్యాలన్నింటికి ఒక పరిమితమైన పరిమాణం ఉంటుంది. ఘటంలో అంతటా మట్టి ఉంటుంది కాని మట్టి అంతలోనూ ఘటం ఉండదు. ఘటం పరిమాణం మట్టి పరిమాణం కంటె తక్కువ. ఘటానికి అవ్యక్తావస్థ మృత్పిండం,

మట్టి ముద్ద. అనగా ఘటం, పుట్టడానికి పూర్వం, మట్టిముద్దలో అవ్యక్తంగా ఉంది. ఈ విధంగా ప్రతికార్యానికీ అవ్యక్తం ఒకటి ఉంటుందని తెలుస్తూన్నది. ఘటానికి మృత్పిండం అవ్యక్తం అయినట్లు మహత్తు మొదలైన వాటికి కారణమైన అవ్యక్తం ఒకటుంది. అదే ప్రధానం. ఇది మొదటి హేతువు. 'సమన్వయాత్' అనేది రెండవ హేతువు. కారణరూపం కార్యాలన్నింటిలోనూ అనుస్యూతంగా ఉంటుంది గాన ఆ అనుస్యూతంగా ఉన్నదే కారణం అని అంగీకరించాలి. ఈ హేతువునే భాష్యంలో వివరించారు. "శక్తితః ప్రవృత్తేశ్చ" అనేది మూడవ హేతువు. కారణంలో కార్యాన్ని పుట్టించే శక్తి ఉంటుంది. ఉదాహరణకి ఘటాన్ని పుట్టించే శక్తి మట్టిలోనే ఉంది. పటాన్ని పుట్టించే శక్తి దానిలో లేదు. దీనిని పట్టి కార్యాన్ని పుట్టించే శక్తి దేనిలో ఉంటుందో అదే అవ్యక్తం. మహదాదులను పుట్టించే శక్తి గల ప్రధానం ఉందని దీనిని పట్టి తెలుస్తున్నది. నాల్గవ హేతువు "కారణకార్యవిభాగాత్' కారణం నుండి కార్యం పుడుతుంది. మృత్తునుండి ఘటాదికం పుడుతున్నది. దీనిని పట్టి మహదాదులు కార్యాలు గాన వాటి కొక కారణం ఉండాలి. అదే ప్రధానం. 'వైశ్వరూప్యస్య అవిభాగాత్' అనేది ఐదవ హేతువు. కార్యాలన్నీ కొంత కాలానికి కారణంలో, కుండ మట్టిలో లీనం అయినట్లు, లీనమైపోతాయి. దానితో కలిసి పోతాయి. మహదాదులు కలిసి పోయే కారణం ప్రధానం. ఈ విధంగా పరిమాణాదిహేతువులచేత గూడ సాంఖ్యులు ప్రధానాస్తిత్వాన్ని సాధిస్తున్నారు.

తత్రేతి :- ఆ విషయంలో చెపుతున్నాం. దృష్టాంతబలంచేతనే మీరు ఇది (అచేతనమైన ప్రధానం జగత్తుకు కారణం అని) నిరూపిస్తే-మరి లోకంలో ఎక్కడా చేతనంచేత అధిష్ఠింపబడని(ప్రేరేపింపబడని) అచేతనమైనది ఏదీ కూడ స్వతంత్రంగా పురుషార్థాన్ని సాధించడానికి ఉపయోగించే వికారాలను (కార్యాలను) రచిస్తూన్నట్లు కనబడడం లేదు, లోకంలో ఇళ్లు, ప్రాసాదాలు, శయనాలు, ఆసనాలు, విహార భూములు మొదలైనవి ప్రజ్ఞావంతులైన శిల్పులచేత, కాలానుసారంగా సుఖప్రాప్తికి, దుఃఖపరిహారానికీ యోగ్యమైనవిగా రచింపబడుతున్నట్లు కనబడుతున్నాయి. అనేక విధాలైన కర్మల భోగానికి యోగ్యమైన బాహ్యమైన ఈ పృథివ్యాదిసమస్తజగత్తునూ, అనేకజాతులతో కూడి నిశ్చితమైన అవయవవిన్యాసాలతో అనేక కర్మల ఫలాల అనుభవానికి స్థానంగా కనబడుతూన్న, శిల్పులచేత మనసా కూడ ఆలోచించడానికి శక్యం కాని, ఆధ్యాత్మికమైన ఈ శరీరాదికాన్ని అచేతనమైన ప్రధానం ఎలా రచించకలుగుతుంది? (అచేతనాలైన) మట్టిబెడ్డ. రాయి మొదలైన వాటిలో ఇలాంటి శక్తి ఏదీ కనబడంలేదు కదా?

## భాష్యమ్

మృదాదిష్వపి కుమ్భకారాద్యధిష్ఠితేషు విశిష్టాకారా రచనా దృశ్యతే, తద్వత్ప్రధానస్యాపి చేతనాన్తరాధిష్ఠితత్వప్రసంగః. న చ మృదాద్యుపాదాన స్వరూపవ్యపాశ్రయేణైవ ధర్మేణ మూలకారణమవధారణీయమ్, న బాహ్యకుమ్భకారాదివ్యపాశ్రయేణేతి కించిన్నియామకమస్తి. న చైవం సతి కించిద్విరుధ్యతే, ప్రత్యుత శ్రుతిరనుగృహ్యతే చేతనకారణసమర్పణాత్. అతో రచనానుపపత్తేశ్చ హేతోర్నాచేతనం జగత్కారణమనుమాతవ్యం భవతి. అన్వయాద్యనుపపత్తే శ్చేతి చశబ్దేన హేతోరసిద్ధిం సముచ్చినోతి. న హి బాహ్యాధ్యాత్మికానాం భేదానాం సుఖదుఃఖమోహాత్మకతయాన్వయ ఉపపద్యతే; సుఖాదీనాం చాన్తరత్వప్రతీతేః, శబ్దాదీనాం చ అతద్రూపత్వ ప్రతీతేః, తన్నిమిత్తత్వప్రతీతేశ్చ. శబ్దాద్యవిశేషేఽపి చ భావనావిశేషాత్సుఖాది విశేషోపలబ్ధేః. తథా పరిమితానాం భేదానాం మూలాఙ్కురాదీనాం సంసర్గ పూర్వకత్వం దృష్ట్వా బాహ్యాధ్యాత్మికానాం భేదానాం పరిమితత్వాత్ సంసర్గ పూర్వకత్వమనుమిమానస్య సత్త్వరజస్తమసామపి సంసర్గపూర్వకత్వప్రసంగః, పరిమితత్వావిశేషాత్. కార్యకారణభావస్తు ప్రేక్షాపూర్వకనిర్మితానాం శయనాసనాదీనాం దృష్ట ఇతి న కార్యకారణభావాద్బాహ్యాధ్యాత్మికానాం భేదానామచేతనపూర్వకత్వం శక్యం కల్పయితుమ్.

## బాలానందిని

మృదాదిష్వితి :- మట్టి మొదలైన వాటిలో కూడ అవి కుంభాకారాదుల చేతనే అధిష్ఠితములై నప్పుడే విశిష్టమైన ఆకారాలు గల రచన కనబడుచున్నది. అట్లే ప్రధానం కూడ మరొక చేతనంచేత అధిష్టింపబడుతుంది అని చెప్పవలసి వస్తుంది. మూలకారణాన్ని నిర్ధారణ చేయడానికి మట్టి మొదలైన ఉపాదానకారణాల స్వరూపాన్ని మాత్రమే (దృష్టాంతంగా) గ్రహించాలి, బాహ్యాలైన కుంభకారాదిచేతనులను కూడ ఆశ్రయించకూడదు (దృష్టాంతంలో చేర్చకూడదు) అనడానికి నియామకమైన కారణం ఏదీ లేదు. చేతనాలను కూడ గ్రహిస్తే దేనికీ విరోధం రాదు. విరోధం లేకపోవడమే కాకుండా చేతనాన్ని కారణంగా చూపడంవల్ల శ్రుతి కూడ అనుగ్రహించబడుతుంది. అందువల్ల రచనానుపతిపత్తి అనే కారణంవల్లకూడ అచేతన మైనదానిని జగత్కారణంగా

అనుమానించకూడదు. (సూత్రంలోని చశబ్దంచేత (కేవలం రచనానుపపత్తివల్లనే కాదు) అన్వయాదుల అనుపపత్తిచేత కూడ అని ప్రధానాన్ని సాధించడానికి సాంఖ్యులు చూపిన హేతువులు అసిద్ధమైనవి (కుదరనివి) అని సముచ్చయం చేస్తున్నాడు. బాహ్యాలు, అధ్యాత్మికాలూ అయిన భేదాలకు సుఖదుఃఖమోహాత్మకత్వంతో అన్వయం (సంబంధం) కుదరదు. ఎందువల్ల ననగా సుఖాదులు అంతరములుగా కనబడుతున్నాయి. శబ్దాదులు సుఖాదిరూపాలుగా కనబడకపోవడమే కాకుండా సుఖాదులకు నిమిత్తములుగా కూడ కనబడుతున్నాయి.

వి. ప్రధానంలో సత్త్వరజస్తమస్సు లనే మూడు గుణా లున్నాయి. సత్త్వం సుఖాన్ని, రజస్సు దుఃఖాన్నీ, తమస్సు మోహాన్నీ కలిగిస్తుంది. ఈ విధంగా ప్రధానం సుఖదఃఖమోహాత్మకం. జగత్తంతా కూడ సుఖదుఃఖమోహాత్మకంగానే ఉంది. అందుచేత ప్రధానం జగత్తుకు కారణం అనీ, కారణంలో ఉండే సుఖదఃఖమోహాలే కార్యమైన జగత్తులో కనబడుతున్నా యనీ సాంఖ్యుల అభిప్రాయం. అది యుక్తం కాదు. సుఖదుఃఖమోహాలు అంతఃకరణకి సంబంధించినవి. శబ్దాదిబాహ్యవిషయాలలో సుఖ దుఃఖమోహాలు లేవు. అంతే కాకుండా శబ్దాదులు సుఖదుఃఖమోహాలకు నిమిత్తంగా కనబడుతున్నాయి గాని సుఖదుఃఖమోహాత్మకాలుగా లేవు. అందుచేత జగత్తులో (బాహ్యజగత్తుతో సహా) సుఖదుఃఖమోహాలు అనుస్యూతంగా ఉన్నాయి కాబట్టి అలాంటి కారణాన్ని అనుమానంచేత తెలుసుకొంటున్నాం అని చెప్పడం యుక్తం కాదు. ఈ విధంగా "సుఖదుఃఖమోహాత్మకతయా అన్వయాత్" అనే హేతువు అసిద్ధం; లేనే లేదు.

అవ. ఈ హేతువులోనే మరొక దోషం చూపుతున్నారు. ఘటంలో మట్టి అన్వితంగా ఉన్నట్లు శబ్దాదులలో సుఖాదులు అన్వితాలుగా ఉంటే, ఘటంలోని మట్టి అందరికీ సమంగానే కనబడుచున్నట్లు, శబ్దాదులవల్ల అందరికీ కూడ ఒకే విధంగా సుఖాదులు కలగాలి. అలా కలగడం లేదు. అందుచేత కూడ ఈ హేతువు అయుక్తం అని చెపుతున్నారు-

శబ్దాదీతి:- శబ్దాదులలో విశేషం లేకపోయినా భావనావిశేషంవల్ల సుఖాది విశేషాలు కనబడుతున్నాయి. (అనగా ఒకే శబ్దం, విలేవాని మానసికస్థితిని పట్టి, ఒకనికి సుఖం కలిగిస్తే మరొకనికి దుఃఖం కలిగిస్తుంది, మరొకనికి మోహం కలిగిస్తున్నది. దీనిని పట్టి ఈ సుఖాదులు శబ్దాదులలో లేవు; మానవుని తత్తద్వాసనాసహితమైన చిత్తంలోనే ఉన్నాయి అని అర్థం). అట్లే పరిమితాలైన మూలాంకురాదికార్యాలు సంసర్గపూర్వకాలై ఉండడం చూచి, అనగా మూలాంకు రాదులకు కొన్నింటి కలయికచేత ఏర్పడిన

పదార్థాలు కారణంగా ఉండడం చూచి మహదాదులకు మూడు గుణాల కలయికచేత ఏర్పడిన ప్రధానం కారణం అని ఊహించే సాంఖ్యుని మతంలో సత్త్వరజస్తమస్సులు కూడ పరిమితాలే గాన వాటికి కూడ సంసర్గపూర్వకత్వం చెప్పవలసి వస్తుంది, అనగా వాటికి కూడ ఏదో సంసర్గరూపమైన కారణం ఉందని చెప్పవలసి వస్తుంది.

వి. మొదళ్లు అంకురాలు మొదలైనవి పరిమితమైన ప్రమాణం గలవి. వాటికి కొన్ని పదార్థాల కలయికచేత ఏర్పడిన పదార్థాలు కారణంగా ఉన్నట్లు ప్రత్యక్షంగా చూస్తున్నాం. అదే విధంగా బుద్ధి మొదలైనవి కూడ పరిమిత ప్రమాణం కలవే గాన వాటి కారణం కూడ కొన్నింటి కలయిక ఉన్న పదార్థమే అని చెప్పాలి. ఈ అనుమానాన్ని పట్టి త్రిగుణాత్మకమైన ప్రధానం సిద్ధిస్తుంది. ఆ కారణం బ్రహ్మ అవడానికి వీలు లేదు. అది కొన్ని వస్తువుల సంసర్గం (కలయిక) ఉన్నది కాదు కదా అని సాంఖ్యుల అభిప్రాయం. అలా చెప్పిన పక్షంలో గుణాలు కూడ పరిమితప్రమాణాలే గాన వాటికి కూడ కారణం ఏదో ఉందని చెప్పవలసి వస్తుందని అభిప్రాయం. గుణాలు నిత్యాలని సాంఖ్యుల మతం.

కార్యేతి:- ఆలోచనాపూర్వకంగా నిర్మించబడిన శయనాసనాదులలో కార్యకారణ భావం కనబడుతున్నది గాన కారణకార్యవిభాగాన్ని పట్టి కార్యాలు అచేతనపూర్వకాలు (అచేతనమైన కారణం నుండి పుట్టినవి) అని కల్పించడం యుక్తం కాదు.

వి. మృత్తునుండి ఘటం పుట్టుచున్నది. భూమినుండి మృత్తు పుట్టుచున్నది. ఈ విధంగా కార్యం కారణంవల్ల పుట్టుచున్నది గాన, ఇలా పుట్టుచున్నవి కారణ మైనవీ కూడ అచేతనాలే గాన మొట్టమొదటికి వెళ్లేటప్పటికి కూడ అచేతనమైన ప్రధానమే కారణం అని సాంఖ్యులు చెప్పిన హేతువు సరియైనది కాదు. లోకంలో చేతనులు ఆలోచనాపూర్వకంగానే శయనాపనాదులను నిర్మిస్తున్నట్లు చూస్తున్నాం. అందుచేత కార్యకారణభావం కూడ చేతనపూర్వక మనే చెప్పాలి అని అర్థం.1.

## సూ. ప్రవృత్తేశ్చ. 2.2.2

ఆస్తాం తావదియం రచనా, తత్సిద్ధ్యర్థా యా ప్రవృత్తిః, సామ్యావస్థానాత్ప్రచ్యుతిః, సత్త్వరజస్తమసామఙ్గాఙ్గిభావరూపాపత్తిః, విశిష్ట కార్యాభిముఖప్రవృత్తితా సాపి నాచేతనస్య ప్రధానస్య స్వతన్త్రస్యోపపద్యతే. మృదాదిష్వదర్శనాత్, రథాదిషు చ. న హి మృదాదయో రథాదయో వా స్వయమచేతనాః సన్తశ్చేతనైః కులాలాదిభిరశ్వాదిభిర్వానధిష్ఠితా విశిష్టకార్యాభి

ముఖప్రవృత్తయో దృశ్యన్తే. దృష్టాచ్చాదృష్టసిద్ధిః. అతః ప్రవృత్త్యనుపపత్తేరపి హేతోః నాచేతనం జగత్కారణమనుమాతవ్యం భవతి. నను చేతనస్యాపి ప్రవృత్తిః కేవలస్య న దృష్టా? సత్యమేతత్. తథాపి చేతనసంయుక్తస్య రథాదేరచేతనస్య ప్రవృత్తిర్దృష్టా, న త్వచేతనసంయుక్తస్య చేతనస్య ప్రవృత్తిర్దృష్టా. కింపునరత్ర యుక్తమ్- యస్మిన్ ప్రవృత్తిర్దృష్టా తస్య సా, ఉత యత్సంప్రయుక్తస్య తస్య సేతి? నను యస్మిన్ దృశ్యతే ప్రవృత్తిస్తస్యైవ సేతి యుక్తమ్, ఉభయోః ప్రత్యక్షత్వాత్, న తు ప్రవృత్త్యాశ్రయత్వేన కేవలశ్చేతనో రథాదివత్ప్రత్యక్షః. ప్రవృత్త్యాశ్రయదేహాది సంయుక్తస్యైవ తు చేతనస్య సద్భావసిద్ధిః, కేవలాచేతనరథాదివైలక్షణ్యం జీవద్దేహస్య దృష్టమితి. అత ఏవ చ ప్రత్యక్షే దేహే సతి దర్శనాదసతి చాదర్శనాద్దేహస్యైవ చైతన్యమపీతి లోకాయతికాః ప్రతిపన్నాః. తస్మాదచేతనస్యైవ ప్రవృత్తిరితి.

## బాలానందిని

ప్రవృత్తేరితి:- 'ప్రవృత్తేశ్చ=ప్రధానముయొక్క ప్రవృత్తి కూడ సంభవం కాదు గాన ప్రధానం జగత్కారణం కాదు'' అని సూత్రార్థం.

ఆస్తామితి:- జగద్రచన మాట అలా ఉంచు; జగద్రచనకోసమై ఏ ప్రవృత్తి గలదో, సత్త్వరజస్తమస్సులు సామ్యావస్థనుండి చ్యుతములై (వాటి సామ్యావస్థ పోయి) అంగాంగిభావాన్ని పొందడం, విశిష్టమైన కార్యానికి అభిముఖమైన ప్రవృత్తి కలిగి యుండడం ఏది కలదో, అది కూడ అచేతన మైన ప్రధానానికి, స్వతంత్రంగా కుదరదు. ఎందువల్ల ననగా మట్టి మొదలైనవాటిలోను, రథాదులలోను స్వతంత్రప్రవృత్తి కనబడడం లేదు.

వి. ప్రధానంలో సత్త్వరజస్తమోగుణా లుంటాయి. అవి సమంగా ఉన్నప్పుడే దానికి (సామ్యావస్థకు) ప్రధానం అని పేరు. అప్పుడు సృష్టి ఉండదు. ఆ గుణాల సామ్యావస్థ తొలగి వాటిలో ఒక గుణం అంగిగాను, మిగిలినవి అంగాలుగాను ఏర్పడి నప్పుడు విశిష్ట మైన కార్యాన్ని (కార్యవిశేషాలను) పుట్టించడానికి అభిముఖమైన ప్రవృత్తి ప్రధానంలో కలుగుతుంది. కాని ప్రధానం అచేతనం గాన ఇలాంటి ప్రవృత్తియే కలగదు. అది కలుగుతే కదా జగద్రచన అని భావం.

న హీతి:- తాము అచేతనాలుగా ఉన్న మృదాదులు గాని, రథాదులు గాని చేతనాలైన కులాలాదులచేత గాని, అశ్వాదులచేత గాని అధిష్ఠింపబడకుండా

(ప్రేరేపింపబడకుండా) విశిష్టమైన కార్యాలకు అభిముఖమైన ప్రవృత్తి కలవిగా కనబడడంలేదు. చూచినదానిని పట్టి చూడనిదానిని కల్పించాలి. అందువల్ల ప్రవృత్తి కుదరదు అనే హేతువుచేత కూడ అచేతనం జగత్కారణ మని అనుమానించదగినది కాదు. (ప్రశ్న)- కేవలచేతనం కూడ ప్రవర్తించడం చూడబడలేదు కదా? (సమాధానం)- ఇది సత్యమే. అయితే చేతనంతో కూడిన రథాదికంలో ప్రవృత్తి కనబడుతున్నది గాని అచేతనంతో కూడిన చేతనంలో ప్రవృత్తి కనబడడం లేదు. ఇక్కడ ఏది యుక్తం? ప్రవృత్తి దేనియందు కనబడుతున్నదో దానికి ఆ ప్రవృత్తి చెందిన దని చెప్పడం యుక్తమా, దేనితో కలవడంచేత ప్రవృత్తి కనబడుతున్నదో దానికి సంబంధించిన దని చెప్పడం యుక్తమా? (పూర్వపక్షి అభిప్రాయం) ప్రవృత్తీ, ప్రవృత్తి ఉన్నదీ రెండూ కూడ ప్రత్యక్షంగా కనబడుతున్నాయి కాబట్టి ప్రవృత్తి దేనియందు కనబడుతున్నదో దానికే అది చెందిన దని చెప్పడం యుక్తం. కేవలచేతనుడు ప్రవృత్త్యాశ్రయంగా, రథాదుల వలె కనబడడం లేదు కదా? జీవించి ఉన్న దేహం కేవలమూ అచేతనా లైన (అచేతనాలు మాత్రమే అయిన) రథాదులకంటె విలక్షణంగా కనబడుతున్నది. అందుచేత ప్రవృత్తికి ఆశ్రయమైన దేహాదులతో కలిసి నప్పుడే చేతనం అనేది ఉంది అని చెప్పడానికి వీలు కలుగుతున్నది. దేహం ప్రవర్తిస్తూంటే చేతనం ఉంది అని ఊహిస్తున్నాం. అందుచేత ప్రవృత్తి అచేతనమైన దేహంలోనే ఉంది గాని చేతనమైన ఆత్మలో కాదు అని అర్థం). అందుచేతనే దేహం ప్రత్యక్షంగా ఉన్నప్పుడు ప్రవృత్తి కనబడడంవల్ల, అది లేనప్పుడు కనబడకపోవడంవల్ల దేహానికే చైతన్యం అని కూడ లోకాయతికులు అంగీకరిస్తున్నారు. అందువల్ల ప్రవృత్తి అచేతనానికే.

## భాష్యమ్

తదభిధీయతే- న బ్రూమో యస్మిన్నచేతనే ప్రవృత్తిర్దృశ్యతే న తస్య సేతి; భవతు తస్యైవ సా. సా తు చేతనాద్భవతీతి బ్రూమః; తద్భావే భావాత్తదభావే చాభావాత్. యథా కాష్ఠాదివ్యపాశ్రయాపి దాహప్రకాశలక్షణా విక్రియాऽ నుపలభ్యమానాపి చ కేవలే జ్వలనే జ్వలనాదేవ భవతి, తత్సంయోగే దర్శనాత్తద్వియోగే చాదర్శనాత్; తద్వత్. లోకాయతికానామపి చేతన ఏవ దేహోऽచేతనానాం రథాదీనాం ప్రవర్తకో దృష్ట ఇత్యవిప్రతిషిద్ధం చేతనస్య ప్రవర్తకత్వమ్. నను తవ దేహాదిసంయుక్తస్యాప్యాత్మనో విజ్ఞానస్వరూపమాత్రవ్యతిరేకేణ ప్రవృత్త్యనుపపత్తేః అనుపపన్నం

ప్రవర్తకత్వమితి చేత్, న, అయస్కాన్తవద్రూపాదివచ్చ ప్రవృత్తిరహితస్యాపి ప్రవర్తకత్వోపపత్తేః. యథాయస్కాన్తో మణిః స్వయం ప్రవృత్తిరహితోఽప్యయసః ప్రవర్తకో భవతి, యథా వా రూపాదయో విషయాః స్వయం ప్రవృత్తిరహితా అపి చక్షురాదీనాం ప్రవర్తకా భవన్తి ఏవం ప్రవృత్తిరహితోఽపీశ్వరః సర్వగతః, సర్వాత్మా, సర్వజ్ఞః, సర్వశక్తిశ్చ సన్ సర్వం ప్రవర్తయేదిత్యుపపన్నమ్. ఏకత్వాత్ప్రవర్త్యాభావే ప్రవర్తకత్వానుపపత్తిరితి చేత్, న. అవిద్యాప్రత్యుపస్థాపిత నామరూపమాయావేశవశేనాసకృత్ప్రత్యుక్తత్వాత్. తస్మాత్సంభవతి ప్రవృత్తిః సర్వజ్ఞకారణత్వే, న త్వచేతనకారణత్వే.

### బాలానందిని

తదితి:- ఈ విషయంలో (సమాధానం) చెప్పబడుచున్నది - ఏ అచేతనంలో ప్రవృత్తి కనబడుతున్నదో ఆ ప్రవృత్తి దానిది కాదని మేం అనడం లేదు. అది దానిదే అవుగాక. అయితే అది చేతనంవల్ల జరుగుతున్న దని మాత్రం మేం అంటున్నాం. ఎందువల్ల ననగా అది చేతనం ఉంటే జరుగుతుంది. అది లేకపోతే జరగడంలేదు. కాల్చడం, ప్రకాశించడం మొదలైన వికారం కఱ్ఱ మొదలైనవాటిలోనే ఉంది, కేవలమైన అగ్నిలో కనబడడంలేదు, అయినా కూడ అది అగ్నివల్లనే జరుగుతున్నది; ఎందువల్ల ననగా దానితో (కాష్ఠాదులకు) సంబంధం ఉన్నప్పుడే కలుగుతూన్నది అది లేనప్పుడు కలగడంలేదు; ఇక్కడ కూడ అట్లే. లోకాయితులు కూడ చేతనమైన దేహమే అచేతనాలైన రథాదుల్ని ప్రవర్తింపచేస్తున్నట్లు చెప్పుచున్నారు గాన చేతనం ప్రవర్తకం అనే దానికి విరోధం ఏదీ లేదు. (ప్రశ్న)- నీ మతం ప్రకారం దేహాదులతో కలిసిన ఆత్మ కూడ కేవలం విజ్ఞానస్వరూపంగా మాత్రమే ఉంటుంది; అంతకంటె వేరు ప్రవృత్తి ఏదీ దానికి ఉండదు; అలాంటప్పుడు అది ప్రవర్తకం ఎలా అవుతుంది? (సమాధానం) ఈ ఆశంక యుక్తం కాదు. ప్రవృత్తిశూన్య మైన ఆత్మ కూడ అయస్కాంతం వలె, రూపాదుల వలె, (ఇతరమైనవాటిని) ప్రవర్తింపచేయడం కుదురుతుంది. అయస్కాంతమణి ఏ విధంగా తాను ఏ ప్రవృత్తీ లేనిదైనా ఇనుమును ప్రవర్తింపచేస్తుందో, రూపాదివిషయాలు తాము ఏ ప్రవృత్తీ లేనివైనా చక్షురాదులను ప్రవర్తింపచేస్తున్నాయో అట్లే సర్వగతుడు, సర్వాత్మ, సర్వజ్ఞుడు, సర్వశక్తీ అయిన ఈశ్వరుడు కూడ తాను ఏ ప్రవృత్తీ లేనివాడే అయినా సమస్తాన్నీ ప్రవర్తింపచేస్తాడు అనేది కుదురుతుంది. (ప్రశ్న)- ఈశ్వరుడు ఒక్కడే అయినప్పుడు అనగా బ్రహ్మ తప్ప ఇంక ఏదీ లేనప్పుడు, ప్రవర్తింపచేయదగినదే లేదు కదా; ఇంక ప్రవర్తకత్వం ఎలా కుదురుతుంది అంటే (సమాధానం)- అది కాదు; అవిద్యచేత

ఏర్పడిన నామరూపా లనే మాయయొక్క ఆవేశంవల్ల (ఆత్మకు సంబంధంవల్ల) ఇది జరుగుతుం దని అనేక పర్యాయాలు దీనికి సమాధానం చెప్పబడింది కదా? అందువల్ల సర్వజ్ఞుడు కారణం అని అంగీకరిస్తేనే ప్రవృత్తి కుదురుతుంది కాని అచేతనం కారణం అని చెపితే కుదరదు.2.

## సూ. పయోమ్బువచ్చేత్తత్రాపి.2.2. 3.

స్యాదేతత్. యథా క్షీరమచేతనం స్వభావేనైవ వత్సవివృద్ధ్యర్థం ప్రవర్తతే, యథా చ జలమచేతనం స్వభావేనైవ లోకోపకారాయ స్యన్దతే ఏవం ప్రధానమచేతనం స్వభావేనైవ పురుషార్థసిద్ధయే ప్రవర్తిష్యతి. నైతత్సాధూచ్యతే. యతస్తత్రాపి పయోమ్బునోశ్చేతనాధిష్ఠితయోరేవ ప్రవృత్తిరిత్యనుమిమీమహే; ఉభయవాదిప్రసిద్ధే రథాదావచేతనే కేవలే ప్రవృత్త్యదర్శనాత్.శాస్త్రం చ "యోఽప్సు తిష్ఠన్నద్భ్యోఽన్తరో యోఽపోఽన్తరో యమయతి" (బృ.ఉ.3.7-4), "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనేగార్గి ప్రాచ్యోఽన్యా నద్యః స్యన్దన్తే" (బృఉ.3.8.9) ఇత్యేవంజాతీయకం సమస్తస్య లోకపరిస్పన్దితస్య ఈశ్వరాధిష్ఠితతాం శ్రావయతి. తస్మాత్సాధ్యపక్షనిక్షిప్తత్వాత్పయోమ్బువదిత్యనుపన్యాపః. చేతనాయాశ్చ ధేన్వాః స్నేహేచ్ఛయా పయసః ప్రవర్తకత్వోపపత్తేః; వత్సచోషణేన చ పయస ఆకృష్యమాణత్వాత్.న చామ్బునోఽప్యత్యన్తమనపేక్షా; నిమ్నభూమ్యాద్యపేక్షత్వాత్స్యన్దనస్య. చేతనాపేక్షత్వం తు సర్వత్రోపదర్శితమ్. "ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి" (బ్ర.సూ.2.1.24) ఇత్యత్ర తు బాహ్యనిమిత్తనిరపేక్షమపి స్వాశ్రయం కార్యం భవతీత్యేతల్లోకదృష్ట్యా నిదర్శితమ్. శాస్త్రదృష్ట్యా తు పునః సర్వత్రైవేశ్వరాపేక్షత్వమాపద్యమానం న పరాణుద్యతే. 3.

### బాలానందిని

పయ ఇతి:- "పయోమ్బువత్ చేత్= పాలు నీరు వలె అచేతనం కూడ ప్రవర్తిస్తుంది అన్నట్లయితే, తత్రాపి=అక్కడ కూడ చేతనప్రేరణ ఉన్నది" అని సూత్రార్థం.

స్యాదేతదితి:- (పూర్వపక్షం) ఈ విషయం అలా ఉండనీ, (ఇలా ఆశంకించవచ్చు-) అచేతనమైన క్షీరం స్వభావంచేతనే, లేగదూడయొక్క పోషణంకొరకు ఏ విధంగా (పరప్రేరణ లేకుండా) ప్రవర్తిస్తుందో, అచేతనమైన జలం లోకోపకారంకొరకు ఏ విధంగా,

స్వభావంచేతనే. ప్రవహిస్తుందో అదే విధంగా అచేతనమైన ప్రధానం కూడ పురుషార్థసిద్ధికొరకు, స్వభావంచేతనే ప్రవర్తిస్తుంది. (సమాధానం)- ఈ చెప్పినది బాగులేదు. ఎందువల్ల ననగా- వాదు లిద్దరూ (సాంఖ్యులూ వేదాంతులూ కూడ) అంగీకరించిన అచేతనమైన కేవలరథాదులలో ప్రవృత్తి కనబడడంలేదు గాన, అక్కడ కూడ చేతనాధిష్ఠితములైన క్షీరజలాలే ప్రవర్తిస్తున్నాయని ఊహిస్తాం. "యో ఽప్సు... యమయతి" (ఎవడు జలంలో ఉంటూ, జలంకంటె లోపలివాడై, జలాన్ని లోపల నియమిస్తాడో), "ఏతస్య...స్యన్దన్తే" (గార్గీ! ఈ అక్షరంయొక్క ఆజ్ఞ ప్రకారమే ఇతరమైన తూర్పు నదులు ప్రవహిస్తున్నాయి) ఇత్యాదిశాస్త్రం కూడ సమస్తమైన లోకంయొక్క స్పందనం ఈశ్వరునిచే అధిష్ఠింపబడిన దని చెపుతూన్నది. అందుచేత క్షీరమూ, నీరూ కూడ సాధ్యపక్షంలోనే ఉంచబడ్డాయి గాన 'పయోమ్బువత్' అనేది సరియైన మాట కాదు.

వి. ప్రతీ అచేతనవస్తువుయొక్క ప్రవృత్తీ కూడ చేతనాధిష్ఠితం అని సాధించ వలసిఉంది. ఇప్పుడు మీరు చూపిన పయస్సు, జలమూ కూడ అలాంటి వస్తువుల కోవకు చెందినవే. వాటియందు కూడ చేతనాధిష్ఠితత్వం ఉందని సాధించవలసినదే- అందుకు తగిన యుక్తులు కూడ చూపబడ్డాయి. అందుచేత వాటిని దృష్టాంతంగా చూపి అచేతనం చేతనాధిష్ఠితం కాకుండానే ప్రవర్తిస్తుంది అని చెప్పడం యుక్తం కాదని అర్థం.

చేతనాయా ఇతి:- మరొక విషయ మేమనగా చేతనమైన ఆవు స్నేహంచేత కలిగిన ఇచ్ఛచేత పాలను చేపడం కూడ ఉంటుంది. అంతే కాక లేగదూడ చప్పరించడంచేత పాలు పైకి ఆకర్షింపబడతాయి. నీటికి కూడ పూర్తిగా దేని అపేక్షా లేదనడానికి వీలులేదు. ప్రవహించడం పల్లపు భూమి మొదలైనవాటిని అపేక్షిస్తుంది కదా? అన్ని ప్రవృత్తులలోను చేతనాపేక్ష ఉంటుం దని చూపించి ఉన్నాం.

అవ. "ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి" అనే సూత్రంలో క్షీరం దేని సహాయమూ లేకుండానే పెరుగుగా మారుతుంది అని దృష్టాంతం చూపబడింది కదా? ఇక్కడ చెప్పినది దానికి విరుద్ధం కదా అని ఆశంక కలుగుతుంది. దానికి సమాధానం చెపుతున్నారు-

ఉపసంహారేతి:- ఆ సూత్రంలో- బాహ్యనిమిత్తాల అపేక్ష లేకపోయినా కూడ క్షీరాదులకు సంబంధించిన కార్యం ఉత్పన్నం అవుతుంది అని కేవలం లోకదృష్ట్యా చెప్పబడింది. శాస్త్రదృష్టిచేత నైతే ప్రతీప్రవృత్తికీ వెనుక పరమేశ్వరుని ప్రేరణ ఉంటుంది అనే విషయం నిరాకరింపబడదు.3.

### సూ. వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్. 2.2.4.

సాంఖ్యానాం త్రయో గుణాః సామ్యేనావతిష్ఠమానాః ప్రధానమ్, న తు తద్వ్యతిరేకేణ ప్రధానస్య ప్రవర్తకం నివర్తకం వా కించిద్బాహ్యమపేక్ష్యమవస్థితమస్తి. పురుషస్తూదాసీనో న ప్రవర్తకో న నివర్తక ఇత్యతోఽనపేక్షం ప్రధానమ్. అనపేక్షత్వాచ్చ కదాచిత్ప్రధానం మహదాద్యాకారేణ పరిణమతే కదాచిన్న పరిణమత ఇత్యేతదయుక్తమ్. ఈశ్వరస్య తు సర్వజ్ఞత్వాత్, సర్వశక్తిత్వాత్, మహామాయత్వాచ్చ ప్రవృత్త్యప్రవృత్తీ న విరుధ్యేతే.4.

## బాలానందిని

వ్యతిరేకేతి:- "వ్యతిరేకానవస్థితేః = ప్రధానంకంటె భిన్నమైన ప్రవర్తకం గాని నివర్తకం గాని లేకపోవడంవల్ల, అనపేక్షత్వాత్= ప్రధానం ఇతరాపేక్షలేని దవడంవల్ల దానికి జగత్కారణత్వం కుదరదు" అని సూత్రార్థం.

సాంఖ్యానామితి:- సాంఖ్యుల మతం ప్రకారం సామ్యావస్థలో ఉన్న మూడు గుణాలే ప్రధానం. దానికంటె వేరుగా ప్రధానాన్ని ప్రవర్తింపచేసేది గాని, నివర్తింపచేసేది గాని అయిన, అపేక్షించదగినది ఏదీ లేదు. పురుషు డైతే ఉదాసీనుడు; ప్రవర్తకుడూ కాదు నివర్తకుడూ కాదు. అందుచేత ప్రధానం అనపేక్షం (దేని అపేక్షా లేనిది). ఈ విధంగా ప్రధానం అనపేక్షంగా ఒక మాటు మహదాద్యాకారంలో పరిణామం చెందుతుంది, ఒకమాటు చెందదు అని చెప్పడం అయుక్తం. ఈశ్వరు డైతే సర్వజ్ఞుడు, సర్వశక్తి, మహామాయుడు, అందుచేత ఈశ్వరుడు ఒకప్పుడు ప్రవర్తించినా ఒకప్పుడు ప్రవర్తించకపోయినా విరోధం లేదు. 4.

## సూ. అన్యత్రాభావాచ్చ న తృణాదివత్. 2.2.5.

స్యాదేతత్; యథా తృణపల్లవోదకాది నిమిత్తాన్తరనిరపేక్షం స్వభావాదేవ క్షీరాద్యాకారేణ పరిణమతే ఏవం ప్రధానమపి మహదాద్యాకారేణ పరిణంస్యత ఇతి. కథం చ నిమిత్తాన్తరనిరపేక్షం తృణాదీతి గమ్యతే? నిమిత్తాన్తరానుపలమ్భాత్. యది హి కించిన్నిమిత్తముపలభేమహి తతో యథాకామం తేన తృణాద్యుపాదాయ క్షీరం సంపాదయేమహి, న తు సంపాదయామహే. తస్మాత్స్వాభావికస్తృణాదేః పరిణామః; తథా ప్రధానస్యాపి స్యాదితి.

### బాలానందిని

అన్యత్రేతి:- "అన్యత్ర=ధేనువులు కాని వాటియందు, అభావాత్=తృణాలను పాలుగా మార్చడం లేకపోవడంవల్ల, తృణాదివత్=తృణాదులవలె ప్రధానం తనంతట తానే పరిణామం చెందుతుంది అనేది, న=యుక్తం కాదు" అని సూత్రార్థం.

స్యాదితి:- ఇది ఇలా ఉండనీ- గడ్డి, చిగుళ్లు, నీరు మొదలైనవి మరొక నిమిత్తం యొక్క అపేక్ష ఏమీ లేకుండా స్వభావంచేతనే ఏ విధంగా క్షీరాదిరూపంలో పరిణామం చెందుతున్నాయో అట్లే ప్రధానం కూడ మహదాదిరూపంలో పరిణామం చెందుతుంది. తృణాదులకు మరొక నిమిత్తంయొక్క అపేక్ష లేదని ఎలా తెలుస్తూన్నది? మరొక నిమిత్తం ఏదీ కనబడడం లేదు గాన. మరొక నిమిత్తం ఏదైనా ఉన్నట్లు మనకు కనబడితే అప్పుడు కావలసినప్పుడల్లా తృణాదులను సంగ్రహించి క్షీరం సంపాదించకలిగి ఉండేవాళ్లం. అలా సంపాదించడం లేదు. అందుచేత తృణాదుల పరిణామం స్వాభావికమైనది. ప్రధానంయొక్క పరిణామం కూడ అలాగే జరగవచ్చును.

### భాష్యమ్

అత్రోచ్యతే- భవేత్తృణాదివత్స్వాభావికః ప్రధానస్యాపి పరిణామః యది తృణాదేరపి స్వాభావికః పరిణామోఽభ్యుపగమ్యేత. న త్వభ్యుపగమ్యతే; నిమిత్తాన్తరోపలబ్ధేః. కథం నిమిత్తాన్తరోపలబ్ధిః? అన్యత్రాభావాత్. ధేన్వైవ హ్యుపభుక్తం తృణాది క్షీరీభవతి న ప్రహీణమనడుహాద్యుపభుక్తం వా. యది హి నిర్నిమిత్తమేతత్స్యాత్ ధేనుశరీరసంబన్ధాదన్యత్రాపి తృణాది క్షీరీభవేత్. న చ యథాకామం మానుషైః న శక్యం సంపాదయితుమిత్యేతావతా నిర్నిమిత్తం భవతి. భవతి హి కించిత్కార్యం మానుషసంపాద్యమ్ కించిద్దైవసంపాద్యమ్. మనుష్యా అపి శక్నువన్త్యేవ ఉచితేనోపాయేన తృణాద్యుపాదాయ క్షీరం సంపాదయితుమ్. ప్రభూతం హి క్షీరం కామయమానాః ప్రభూతం ఘాసం ధేనుం చారయన్తి, తతశ్చ ప్రభూతం క్షీరం లభన్తే. తస్మాన్న తృణాదివత్ స్వాభావికః ప్రధానస్య పరిణామః.5.

### బాలానందిని

అత్రేతి:- (సమాధానం) ఇక్కడ చెప్పబడుతున్నది. తృణాదులకు పరిణామం స్వాభావికంగానే ఉంటుంది అని అంగీకరిస్తే తృణాదులవలె ప్రధానానికి కూడ పరిణామం

స్వాభావికంగా ఉంటుంది (జరుగుతుంది) అని చెప్పడానికి వీలుండేది. కాని ఆ విధంగా అంగీకరించబడదు. ఎందువల్ల ననగా (తృణాదులు క్షీరాదిరూపంలో పరిణమించడానికి) మరొక నిమిత్తం కనబడుతున్నది. నిమిత్తాంతరం ఎలా కనబడుతున్నది? మరొక చోట లేకపోవడంవల్ల. ధేనువు తిన్న తృణాదికమే క్షీరంగా అవుతున్నది; పారవేసినది గాని ఎద్దులు మొదలైనవి తిన్నది గాని అవడంలేదు. ఏ నిమిత్తం లేకుండానే క్షీరంగా అవుతుంది అన్నట్లయితే ధేనుశరీరసంబంధం లేకపోయినా కూడ తృణాదికం క్షీరంగా మారాలి. మనుష్యులు కావలసి నప్పుడల్లా సంపాదించజాల రన్నంతమాత్రంచేత దానికి నిమిత్తమే లేదని చెప్పడం కుదరదు. ఎందువల్ల ననగా కొన్నింటిని మనుష్యులు సంపాదించ కలుగుతారు; కొన్నింటిని దైవమే సంపాదించకలుగుతుంది. మనుష్యులు కూడ తృణాదులు తీసికొని తగిన ఉపాయంచేత క్షీరాదులను సంపాదింప కలుగుతారు. చాలా క్షీరం కావాలనుకొన్నవాళ్లు ధేనువుకు అధికంగా పచ్చగడ్డి మొదలైనది తినిపించి, అలా చేయడంవల్ల అధికంగా క్షీరం పొందకలుగుతారు. అందువల్ల ప్రధానంయొక్క పరిణామం తృణాదిపరిణామం వలె స్వాభావికం కాదు.5.

## సూ. అభ్యుపగమేఽప్యర్థాభావాత్. 2.2.6.

స్వాభావికీ ప్రధాన ప్రవృత్తిర్న భవతీతి స్థాపితమ్; అథాపి నామ భవతః శ్రద్ధామనురుధ్యమానాః స్వాభావికీమేవ ప్రధానస్య ప్రవృత్తిమభ్యుపగచ్ఛేమ తథాపి దోషోఽనుషజ్యేతైవ. కుతః? అర్థాభావాత్. యది తావత్స్వాభావికీ ప్రధానస్య ప్రవృత్తిః న కించిదన్యదిహాపేక్షత ఇత్యుచ్యతే తతో యథైవ సహకారి కించిన్నాపేక్షతే ఏవం ప్రయోజనమపి కించిన్నాపేక్షిష్యతే ఇత్యతః ప్రధానం పురుషస్యార్థం సాధయితుం ప్రవర్తత ఇతి ప్రతిజ్ఞా హీయేత. స యది బ్రూయాత్ సహకార్యేవ కేవలం నాపేక్షతే న ప్రయోజనమపీతి, తథాపి ప్రధానప్రవృత్తేః ప్రయోజనం వివేక్తవ్యం భోగో వా స్యాదపవర్గో వా ఉభయం వేతి. భోగశ్చేత్-కీదృశోఽనాధేయాతిశయస్య పురుషస్య భోగో భవేత్? అనిర్మోక్షప్రసంగాచ్చ. అపవర్గశ్చేత్-ప్రాగపి ప్రవృత్తేః అపవర్గస్య సిద్ధత్వాత్ ప్రవృత్తిరనర్థికా స్యాత్, శబ్దాద్యనుపలబ్ధిప్రసంగశ్చ. ఉభయార్థతాభ్యుపగమేఽపి భోక్తవ్యానాం ప్రధానమాత్రాణామానన్త్యాదనిర్మోక్షప్రసంగ ఏవ. న చౌత్సుక్యనివృత్త్యర్థా ప్రవృత్తిః. న హి ప్రధానస్య అచేతనస్య ఔత్సుక్యం సంభవతి. న చ పురుషస్య నిర్మలస్య నిష్కలస్య ఔత్సుక్యమ్. దృక్శక్తిసర్గ

శక్తివైయర్థ్యభయాచ్చేత్ప్రవృత్తిః, తర్హి దృక్శక్త్యనుచ్ఛేదవత్ సర్గశక్త్యనుచ్ఛేదాత్ అనిర్మోక్షప్రసంగ ఏవ. తస్మాత్ప్రధానస్య పురుషార్థా ప్రవృత్తిరిత్యే తదయుక్తమ్.6.

బాలానందిని

అభ్యుపగమ ఇతి:- "అభ్యుపగమేఽపి= ప్రధానానికి స్వాభావికమైన ప్రవృత్తి ఉన్న దని అంగీకరించినా కూడ, అర్థాభావత్= ప్రవృత్తికి ప్రయోజనం లేదు కదా" అని సూత్రార్థం.

స్వాభావికీతి:- ప్రధానానికి స్వాభావికంగానే ప్రవృత్తి ఉంటుం దనడానికి వీలులేదు అని స్థాపించబడింది. నీ శ్రద్ధను కాదనలేక ప్రధానానికి స్వభావసిద్ధంగానే ప్రవృత్తి ఉంటుం దని అంగీకరించినా కూడ దోషం అనుషక్తం అవుతూనే ఉంది. ఎందువల్ల? అర్థాభావం వల్ల. ప్రధానంయొక్క ప్రవృత్తి స్వాభావిక మైనదే, మరొకదానిని దేనినీ కూడ అపేక్షించదు అని అన్నట్లయితే అప్పుడు అది సహకారిని దేనినీ ఏ విధంగా అపేక్షించడం లేదో అదేవిధంగా ప్రయోజనాన్ని కూడా దేనినీ అపేక్షించకూడదు గాన, పురుషుని ప్రయోజనాన్ని సాధించడంకోసం ప్రధానం ప్రవర్తిస్తుంది అన్న మీ ప్రతిజ్ఞ బాధిత మవుతుంది. అది కాదు; ప్రధానం సహకారిని మాత్రమే అపేక్షించదు కాని ప్రయోజనాన్ని అపేక్షించకపోవడం లేదు అని అతడు (సాంఖ్యుడు) అన్నట్లయితే, ప్రధాన ప్రవృత్తికి ప్రయోజనం ఏమిటి- భోగమా, మోక్షమా, రెండూనా అని వివేచించి చెప్పవలసి ఉంటుంది. భోగము అన్నట్లయితే ఎట్టి అతిశయాన్నీ సమకూర్చడానికి శక్యంకాని పురుషునికి ఎలాంటి భోగం సంభవం అవుతుంది? (నిజంగా వానికి భోగం ఉంటుది అని చెప్పినా ఎల్లప్పుడూ ఆ భోగం ఉంటూనే ఉంటుంది గాన) మోక్షం అనేది కుదరదు. (ప్రయోజనం భోగం కాదు) అపవర్గమే ప్రయోజనం అన్నట్లయితే ప్రధానం ప్రవర్తించడానికి పూర్వం కూడ (పురుషుడు స్వస్వరూపంలో ఉండడం అనే) ముక్తి పురుషునికి సహజంగానే ఉంది గాన దానికోసం ప్రధానం ప్రవర్తించడం అనావశ్యకం. మరొక టేమనగా కేవలం అపవర్గమే ప్రయోజనం గాన శబ్దాదిజ్ఞానరూపమైన భోగం పురుషునికి ఉండగూడదు. భోగాపవర్గాలు రెండింటికోసమూ ప్రధానప్రవృత్తి అన్నట్లయితే అనుభవించదగిన, ప్రధానానికి సంబంధించిన, మాత్రలు (భోగ్యవస్తువులు) అనంతాలు గాన పురుషునికి మోక్షం పొందే అవకాశమే ఉండదు.

అవ. లోకంలో జనులు ఔత్సుక్యం తీర్చుకొనడంకోసం కొన్ని పనులలో ఏ విధంగా ప్రవర్తిస్తారో అదే విధంగా ప్రధానం తన ఔత్సుక్యాన్ని తీర్చుకొనడంకోసం పురుషునికి మోక్షం ఇవ్వడానికి ప్రవర్తిస్తుంది అని సాంఖ్యు లంటారు-

"ఔత్సుక్యనివృత్త్యర్థం యథా క్రియాసు ప్రవర్తతే లోకః,
పురుషస్య విమోక్షార్థం ప్రవర్తతే తద్వదవ్యక్తమ్". (సాం.కా.58).

ఔత్సుక్యం అనగా ఏదో ఒక పని చెయ్యాలనే తహతహ. ఒక విధమైన కోరిక. దానిని ఖండిస్తున్నారు-

న చేతి:- ఔత్సుక్యాన్ని నివర్తింపచేసుకొనడంకోసం ప్రధానం ప్రవర్తిస్తుంది అని చెప్పడం కూడ యుక్తం కాదు. అచేతన మైన ప్రధానానికి ఔత్సుక్యం కుదరదు కదా? నిర్మలుడూ, నిష్కలుడూ అయిన పురుషునికి కూడ ఔత్సుక్యం కుదరదు. (అందుచేత 'ఔత్సుక్యనివృత్త్యర్థమ్' అనగా ప్రధానం యొక్క ఔత్సుక్యాన్ని నివర్తించుకొనడంకోసం కాదు, పురుషుని ఔత్సుక్యం నివర్తించడం కోసం అని కూడ చెప్పడానికి వీలు లే దని అర్థం).

అవ. పురుషునిలో దృక్శక్తి (తెలుసుకొనే శక్తి) ఉంది. ప్రధానంలో సర్గశక్తి (సృష్టించే శక్తి) ఉంది. ఈ రెండు శక్తులూ వ్యర్థం కాకుండా ఉండా లంటే సృష్టి జరగాలి. సృష్టి లేకపోతే పురుషుడు దేనిని చూస్తాడు. చూసేవాడు లేకపోతే సృజించి ఏమి ప్రయోజనం? అందుచేత ప్రధానం సృజిస్తుంది అనే సాంఖ్యుల వాదానికి సమాధానం చెపుతున్నారు-

దృక్శక్తీతి:- దృక్శక్తి. సర్గశక్తులు వ్యర్థమైపోతా యనే భయంచేత ప్రవృత్తిని అంగీకరించే పక్షంలో పురుషుని దృక్శక్తి ఏ విధంగా నిత్యమో అదే విధంగా ప్రధానంయొక్క సర్గశక్తి కూడ నిత్యమే గాన సంసారానికి ఉచ్ఛేదం అంటూ ఉండదు, అప్పుడు మోక్షమే లేకుండా పోతుంది. అందుచేత ప్రధానంయొక్క ప్రవృత్తి పురుషునికోసం జరుగుతున్నదనడం యుక్తం కాదు.6.

## సూ. పురుషాశ్మవదితి చేత్తథాపి. 2.2.7.

స్యాదేతత్. యథా కశ్చిత్పురుషో దృక్శక్తిసంపన్నః ప్రవృత్తిశక్తివిహీనః పఙ్గురపరం పురుషం ప్రవృత్తిశక్తిసంపన్నం దృక్శక్తివిహీనమన్ధమధిష్ఠాయ ప్రవర్తయతి. యథా వాఽయస్కాన్తోఽశ్మా స్వయమప్రవర్తమానోఽపి అయః ప్రవర్తయతి ఏవం పురుషః ప్రధానం ప్రవర్తయిష్యతీతి దృష్టాన్తప్రత్యయేన పునః ప్రత్యవస్థానమ్. అత్రోచ్యతే- తథాపి నైవ దోషాన్నిర్మోక్షోఽస్తి. అభ్యుపేతహానం తావద్దోష ఆపతతి; ప్రధానస్య స్వతన్త్రస్యాఽప్రవృత్త్యభ్యుపగమాత్, పురుషస్య చ ప్రవర్తకత్వానభ్యుపగమాత్. కథం చోదాసీనః పురుషః ప్రధానం ప్రవర్తయేత్? పఙ్గురపి హ్యన్ధం పురుషం వాగాదిభిః

ప్రవర్తయతి. నైవం పురుషస్య కశ్చిదపి ప్రవర్తనవ్యాపారోఽస్తి, నిష్క్రియత్వా న్నిర్గుణత్వాచ్చ. నాప్యయస్కాన్తవత్సంనిధిమాత్రేణ ప్రవర్తయేత్. సంనిధినిత్యత్వేన ప్రవృత్తినిత్యత్వప్రసంగాత్. అయస్కాన్తస్యత్వ నిత్యసంనిధేరస్తి స్వవ్యాపారః సంనిధిః. పరిమార్జనాదినాద్యపేక్షా చాస్యాస్తీత్యనుపన్యాసః పురుషాశ్మవదితి. తథా ప్రధానస్యాచైతన్యాత్, పురుషస్య చౌదాసీన్యాత్, తృతీయస్య చ తయోః సంబన్ధయితుః అభావాత్ సంబన్ధానుపపత్తిః.యోగ్యతానిమిత్తే చ సంబన్ధే యోగ్యతానుచ్ఛేదాద నిర్మోక్షప్రసంగః. పూర్వవచ్చేహాప్యర్థాభావో వికల్పయితవ్యః. పరమాత్మనస్తు స్వరూపవ్యపాశ్రయమౌదాసీన్యం మాయావ్యపాశ్రయం చ ప్రవర్తకత్వమిత్యస్త్యతిశయః. 7.

బాలానందిని

పురుషేతి:- "పురుషాశ్మవత్= కుంటివాడైన పురుషుడు గ్రుడ్డివానిని నడిపి నట్లు అయాస్కాంతం ఇనుమును ప్రేరేపించినట్లు పురుషుడు ప్రధానాన్ని ప్రేరేపిస్తాడు అన్నట్లయితే, తథాపి= అలాగైనా కూడ దోషం నుండి విముక్తి లేదు" అని సూత్రార్థం.

స్యాదేతదితి:- (పూర్వపక్షం) ఇది అలా ఉండనీ; చూచే శక్తి ఉన్నవాడు, ప్రవర్తించే శక్తి లేనివాడు అయిన కుంటివాడైన ఒక పురుషుడు, ప్రవర్తించే శక్తి ఉన్నవాడూ, చూచే శక్తి లేనివాడూ అయిన అంధుణ్ణి అధిష్ఠించి ఏ విధంగా ప్రవర్తింపచేస్తాడో, అయస్కాంతం అనే రాయి తాను ప్రవర్తించకపోయినా ఏ విధంగా ఇనుమును ప్రవర్తింపచేస్తుందో అట్లే పురుషుడు ప్రధానాన్ని ప్రవర్తింపచేస్తాడు అని దృష్టాంతం మీద నమ్మకంచేత మళ్లీ ఎదురు తిరగడం. (సమాధానం)- ఇక్కడ చెప్పబడుతున్నది. అయినా కూడ దోషంనుండి నిర్మోక్షం (విడుదల) లేదు. (నువ్వు) ప్రధానం స్వతంత్రంగానే ప్రవర్తిస్తుం దని అంగీకరిస్తున్నావు. పురుషుడు ప్రవర్తింపచేస్తాడు అని అంగీకరించడం లేదు; అందువల్ల ముందుగా నీ మతానికి విరోధం అనే దోషం వచ్చిపడుతుంది. ఉదాసీను డైన పురుషుడు ప్రధానాన్ని ఎలా ప్రవర్తింపచేస్తాడు? కుంటివాడు కూడ గ్రుడ్డివానిని మాటలు మొదలైనవాటితో ప్రేరేపిస్తాడు. ఈ విధంగా పురుషునికి ప్రవర్తనావ్యాపారం (ప్రవర్తింపచేసే పని) ఏదీ లేదు; ఎందువల్ల ననగా పురుషుడు క్రియారహితుడు, గుణాలు లేనివాడు. అయస్కాంతం వలె సంనిధిమాత్రంచేతనే ప్రవర్తింపచేయడు; అలా చేస్తే సంనిధి (దగ్గర ఉండడం) నిత్యం గాన ప్రవృత్తి కూడ నిత్యం అయే ప్రసక్తి ఏర్పడుతుంది. అయస్కాంతం సంనిధి యైతే అనిత్యం, అందుచేత దగ్గరకు రావడం అనే వ్యాపారం దానిలో ఉంటుంది.

దానిని తుడిచి శుభ్రం చేయడం వంటివాటి అపేక్ష దానికి ఉంటుంది. అందుచేత "పురుషాశ్మవత్" అనేది ఉపన్యాసం కాదు; (సరిగా చెప్పినది కాదు). అట్లే ప్రధానమూ అచేతనం, పురుషుడా ఉదాసీనుడు. వీళ్లిద్దరికీ సంబంధం ఏర్పరచే మూడవది ఏదీ లేదు. అందుచేత కూడ వీటి సంబంధం అనుపపన్నం. యోగ్యతానిమిత్త మైన సంబంధం ఉంది అన్నట్లయితే ఈ యోగ్యత ఎప్పటికీ తొలగనిది గాన మోక్షం అనేది ఉండదు.

వి. పురుషునిలో దృక్శక్తి ఉంది. అందుచేత దృశ్యాన్ని చూడగలడు. జడంలో దృశ్యత్వం (చూడదగి ఉండడం) ఉంది. ఈ విధంగా పురుషునిలో ద్రష్టృత్వమూ, ప్రధానంలో దృశ్యత్వమూ ఉన్నాయి గాన ఈ యోగ్యతయే వాటి సంబంధం అని చెపుతాం అన్నట్లయితే అనిర్మోక్షప్రసంగం అని భావం.

పూర్వవదితి:- పూర్వం వలెనే ఇక్కడ కూడ ప్రయోజనాభావం వికల్పింపదగినది. పరమాత్మ కైతే స్వరూపాన్ని పట్టి ఔదాసీన్యం, మాయను బట్టి ప్రవర్తకత్వమూ ఉండవచ్చును గాన పరమాత్మలో ఒక అతిశయం (విశేషం) ఉంది.

వి. స్వయంగా ప్రవర్తించే ప్రధానం భోగంకోసం ప్రవర్తిస్తుందా, అపవర్గంకోసం ప్రవర్తిస్తుందా లేక రెండింటి కోసమూ ప్రవర్తిస్తుందా అని వెనక మూడు వికల్పాలు లేవదీసి మూడూ నిరాకరించబడ్డాయి. ప్రధానప్రవృత్తి పురుషాధీన మైనది అనే పక్షంలో కూడ ఈ మూడు వికల్పాలు లేవదీసి నిరాకరించవచ్చును అని పూర్వవదిత్యాది వాక్యానికి భావం.7.

## సూ. అఙ్గిత్వానుపపత్తేశ్చ. 2.2.8.

ఇతశ్చ న ప్రధానస్య ప్రవృత్తిరవకల్పతే. యద్ధి సత్త్వరజస్త మసా మన్యోన్య గుణప్రధానభావముత్సృజ్య. సామ్యేన స్వరూపమాత్రేణావస్థానం సా ప్రధానావస్థా, తస్యామవస్థాయామనపేక్షస్వరూపాణాం స్వరూపప్రణాశభ యాత్పరస్పరం ప్రత్యఙ్గాఙ్గిభావానుపపత్తేః. బాహ్యస్య చ కస్య చిత్ క్షోభయితురభావాద్గుణ వైషమ్యనిమిత్తో మహదాద్యుత్పాతో న స్యాత్.8.

### బాలానందిని

ఇతశ్చేతి:- ఈ కారణంవల్ల కూడ ప్రధానానికి ప్రవృత్తి కుదరదు. సత్త్వరజస్త మోగుణాలు గుణ ప్రధానభావాన్ని (రెండు అప్రధానంగా ఉండడం ఒకటి ప్రధానంగా ఉండడం అనేదాన్ని) విడచి, సమంగా వాటి స్వరూపమాత్రంతో ఉండడమే ప్రధానావస్థ కదా? అలాంటి అవస్థలో (ప్రలయకాలంలో ఉన్న ప్రధానవస్థలో) ఒకదాని అపేక్ష

మరొకదానికి లేకుండా ఉన్న గుణాలకు స్వరూపప్రణాశభయంవల్ల పరస్పరాన్నీ గూర్చి అంగాంగిభావం కుదరదు.

వి. ప్రళయకాలంలో మూడు గుణాలూ ఒకదాని అపేక్ష మరొకదానికి లేకుండా తమ తమ రూపంలోనే ఉంటాయి; అదే ప్రధానావస్థ. ప్రళయానంతరం సృష్టి ప్రారంభం కావాలంటే ఈ గుణాలలో వైషమ్యం రావాలి. ఒకదానికి ప్రాధాన్యం, మిగిలిన రెండింటికీ అప్రాధాన్యమూ రావాలి. అలా వస్తే అంతవరకూ ఉన్న వాటి స్వరూపమే మారిపోతుంది. అందుచేత అవి అలాంటి అంగాంగిభావాన్ని పొందవు; అప్పుడు సృష్టియే ఉండదు అని భావం.

(గుణాలు వాటంతట అవి గుణప్రధానభావాన్ని పొందకపోయినా బాహ్యమైన కారణంచేత దేనిచేతనైనా పొందవచ్చును అనడానికి కూడ వీలులేదు). గుణాల సామ్యాన్ని క్షోభింపచేసే బాహ్యమైన నిమిత్తం కూడ ఏదీ లేకపోవడంచేత గుణవైషమ్యాన్ని బట్టి జరగవలసిన మహదాద్యుత్పత్తి జరగదు.8.

## సూ. అన్యథానుమితౌ చ జ్ఞశక్తివియోగాత్.2.2.9.

అథాపి స్యాదన్యథా వయమనుమిమీమహే యథా నాయమనన్తరో దోషః ప్రసజ్యేత. న హ్యనపేక్షస్వభావాః కూటస్థాశ్చాస్మాభిర్గుణా అభ్యుపగమ్యన్తే, ప్రమాణాభావాత్. కార్యవశేన తు గుణానాం స్వభావోఽభ్యుపగమ్యతే. యథా యథా కార్యోత్పాద ఉపపద్యతే తథా తథైషాం స్వభావోఽభ్యుపగమ్యతే. చలం గుణవృత్తమితి చాస్త్యభ్యుపగమః. తస్మాత్సామ్యావస్థాయామపి వైషమ్యోపగమయోగ్యా ఏవ గుణా అవతిష్ఠన్తే ఇతి. ఏవమపి ప్రధానస్య జ్ఞశక్తివియోగాద్రచనానుపపత్త్యాదయః పూర్వోక్తా దోషాస్తదవస్థా ఏవ. జ్ఞశక్తిమపి త్వనుమిమానః ప్రతివాదిత్వాన్నివర్తేత, చేతనమేకమనేకప్రపఞ్చస్య జగత ఉపాదానమితి బ్రహ్మవాదప్రసంగాత్. వైషమ్యోపగమయోగ్యా అపి గుణాః సామ్యావస్థాయాం నిమిత్తాభావాన్నైవ వైషమ్యం భజేరన్, భజమానా వా నిమిత్తాభావావిశేషాత్సర్వదా వైషమ్యం భజేరన్నితి ప్రసజ్యత ఏవాయమనన్తరోఽపి దోషః 9.

## బాలానందిని

అన్యథేతి:- "అన్యథానుమితౌ చ= గుణాలను గూర్చి మరొక విధంగా అనుమానం చేసినా కూడ. దోషంనుండి విముక్తి లేదు. జ్ఞశక్తివియోగాత్=ప్రధానానికి దృక్శక్తి లేదు కదా" అని సూత్రార్థం.

అథాపి స్యాదితి:- "ఇప్పుడే చెప్పినదోషం (పైదోషం) లేని విధంగా మేం మరొక విధంగా అనుమానం చేస్తాం; గుణాలు ఇతరాపేక్ష ఏదీ లేనివి, కూటస్థములు అని మేం అంగీకరించము; అందుకు తగిన ప్రమాణం ఏదీ లేదు కదా? కార్యాలను బట్టి గుణాల స్వభావాన్ని అంగీకరిస్తాం; కార్యోత్పత్తి ఏ యే విధంగా చెపితే కుదురుతుందో ఆ విధంగా వీటి స్వభావాన్ని అంగీకరిస్తాం; "గుణాల స్వభావం చంచల మైనది (అస్థిరమైనది)" అని అంగీకారం కూడ ఉంది; అందువల్ల "సామ్యావస్థలో కూడ గుణాలు వైషమ్యాన్ని పొందడానికి యోగ్యాలు గానే ఉంటాయి" అని చెప్పినా కూడ ప్రధానానికి జ్ఞశక్తి లేదుగాన రచనానుపపత్తి మొదలైన పైన చెప్పిన దోషాలు అలాగే ఉన్నాయి. ప్రధానానికి జ్ఞశక్తి (దృక్శక్తి) కూడ ఉంది అని నువ్వు అనుమానం చేస్తే అప్పుడు నువ్వు మాకు ప్రతివాదివే కావు. అలా అనుమానం చేసిన పక్షంలో అది ఒకే చేతనం అనేకవిధాల విస్తృతమైన జగత్తుకు ఉపాదనం అని చెప్పే బ్రహ్మవాదమే అవుతుంది. (గుణాల విషయంలో మరొక విధంగా ఆలోచించినా కూడ దోషవిముక్తి లేదు). సామ్యావస్థలో ఉన్న గుణాలు వైషమ్యం పొందడానికి యోగ్యాలే అయినా కూడ నిమిత్తం ఏదీ లేకపోవడంచేత వైషమ్యాన్ని పొందవు. పొందినా కూడ నిమిత్తం లేకపోవడం అనేది సమానమే గాన సర్వదా వైషమ్యాన్ని పొందుతాయి. అందుచేత పైన చెప్పిన (మోక్షాభావప్రసంగం అనే) దోషం అలాగే ఉండిపోతుంది.9.

## సూ. విప్రతిషేధాచ్చాసమఞ్జసమ్. 2.2.10.

పరస్పరవిరుద్ధశ్చాయం సాంఖ్యానామభ్యుపగమః. క్వచిత్సప్తేన్ద్రియాణ్యను క్రామన్తి క్వచిదేకాదశ,తథా క్వచిన్మహతస్తన్మాత్ర సర్గముపదిశన్తి. క్వచిదహఙ్కారాత్. తథా క్వచిత్త్రీణ్యన్తః కరణాని వర్ణయన్తి క్వచిదేకమితి. ప్రసిద్ధ ఏవ తు శ్రుత్యా ఈశ్వరకారణవాదిన్యా విరోధః, తదనువర్తిన్యా చ స్మృత్యా. తస్మాదప్యసమఞ్జసం సాంఖ్యానాం దర్శనమితి.

అత్రాహ:- నన్వౌపనిషదానామప్యసమఞ్జసమేవ దర్శనం, తప్యతాపకయోర్జాత్యన్తరభావానభ్యుపగమాత్. ఏకం హి బ్రహ్మ సర్వాత్మకం

సర్వస్య ప్రపఞ్చస్య కారణమభ్యుపగచ్ఛతామేకస్యైవాత్మనో విశేషౌ తప్యతాపకౌ న జాత్యన్తరభూతౌ ఇత్యభ్యుపగన్తవ్యం స్యాత్. యది చైతౌ తప్యతాపకౌ ఏకస్యాత్మనో విశేషౌ స్యాతాం స తాభ్యాం తప్యతాపకాభ్యాం న నిర్ముచ్యతే ఇతి తాపోపశాన్తయే సమ్యగ్దర్శనముపదిశచ్ఛాస్త్రమనర్థకం స్యాత్. న హ్యుష్ణప్రకాశధర్మకస్య ప్రదీపస్య తదవస్థస్యైవ తాభ్యాం నిర్మోక్ష ఉపపద్యతే.

బాలానందిని

విప్రతిషేధాదితి:- "విప్రతిషేధాచ్చ=పరస్పరవిరోధంవల్ల కూడ, అసమఞ్జసమ్= సాంఖ్యదర్శనం అసమంజస మైనది" అని సూత్రార్థం.

పరస్పరేతి:- సాంఖ్యుల ఈ అభ్యుపగమం (మతం) పరస్పరవిరుద్ధ మైనది. కొన్ని చోట్ల ఏడు ఇంద్రియాలను (త్వగింద్రియం, ఐదు కర్మేంద్రియాలు, మనస్సు అని ఏడు ఇంద్రియాలను) గూర్చి మాటలాడతారు. కొన్ని చోట్ల పదకొండు ఇంద్రియాలను (పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు మనస్సు అని) గూర్చి మాటలాడతారు. కొన్ని చోట్ల మహత్తు నుండి భూతతన్మాత్రలు పుట్టినట్లు మాటలాడతారు. కొన్ని చోట్ల అహంకారంనుంచి పుట్టి నట్లు చెపుతారు. కొన్నిచోట్ల (బుద్ధి, అహంకారం, మనస్సు అని) మూడు అతఃకరణాలను గూర్చి మాట లాడతారు. కొన్ని చోట్ల బుద్ధి ఒకటే అంతఃకరణం అంటారు. ఈశ్వరుడు కారణం అని చెప్పే శ్రుతితోను దానిని అనుసరించిన స్మృతితోను దీని కున్న విరోధం ప్రసిద్ధమే. ఆ కారణంవల్ల కూడ సాంఖ్యుల దర్శనం సమంజసం కాదు.

ఇక్కడ (సాంఖ్యుడు) ఇలా అంటున్నాడు. తప్యుడు (పీడించబడే జీవుడు) తాపకం (పీడించే సంసారం)- ఇవి వేరువేరు జాతికి చెందినవని అంగీకరించక పోవడంచేత మీ ఔపనిషదుల దర్శనం కూడ సమంజసం కాదు. బ్రహ్మ ఒకటే, అది సర్వాత్మక మైనది, సమస్త ప్రపంచానికీ కారణం అని అంగీకరించినవాళ్లు తప్యతాపకాలు ఒకే ఆత్మయొక్క విశేషాలు, అంతే కాని మరొక జాతికి చెందినవి కావు అని అంగీకరించవలసి ఉంటుంది. ఈ తప్యతాపకాలు ఒక్కటే యైన ఆత్మయొక్క విశేషా లయితే ఆ ఆత్మ ఆ తప్యతాపకాలనుండి విడుదల పొందజాలదుగాన తాపం శాంతించడం కొరకు సమ్యగ్దర్శనాన్ని ఉపదేశిస్తూన్న శాస్త్రం వ్యర్థం అవుతుంది. ఉష్ణత్వమూ, ప్రకాశ అనే ధర్మం గల దీపం అలాగే ఉండగా అది వాటినుండి విముక్తం కాదు కదా?

## భాష్యమ్

యోఽపి జలతరఙ్గవీచీఫేనాద్యుపన్యాసః తత్రాపి జలాత్మన ఏకస్య వీచ్యాదయో విశేషాః ఆవిర్భావతిరోభావరూపేణ నిత్యా ఏవేతి సమానో జలాత్మనో వీచ్యాదిభిరనిర్మోక్షః. ప్రసిద్ధశ్చాయం తప్యతాపకయోర్జాత్యన్తరభావః లోకే. తథాహి- అర్థీ చార్థశ్చాన్యోన్యభిన్నౌ లక్ష్యేతే. యద్యర్థినః స్వతోఽన్యోఽర్థో న స్యాత్, యస్యార్థినో యద్విషయమర్థిత్వం స తస్యార్థో నిత్యసిద్ధ ఏవేతి తస్య తద్విషయమర్థిత్వం న స్యాత్. యథా ప్రకాశాత్మనః ప్రదీపస్య ప్రకాశాఖ్యోఽర్థః నిత్యసిద్ధ ఏవేతి న తస్య తద్విషయమర్థిత్వం భవతి. అప్రాప్తే హ్యర్థేఽర్థినోఽర్థిత్వం స్యాదితి. తథార్థస్యాప్యర్థత్వం న స్యాత్, యది స్యాత్స్వార్థత్వమేవ స్యాత్; న చైతదస్తి. సంబన్ధిశబ్దౌ హ్యేతావర్థీ చార్థశ్చేతి. ద్వయోశ్చ సంబన్ధః స్యాత్ నైకస్యైవ. తస్మాద్భిన్నావేతావర్థార్థినౌ, తథానర్థానర్థినావపి. అర్థినోఽనుకూలోఽర్థః, ప్రతికూలోఽనర్థః, తాభ్యామేకః పర్యాయేణోభాభ్యాం సంబధ్యతే. తత్రార్థస్య అల్పీయస్త్వాత్ భూయస్త్వాచ్చ అనర్థస్య ఉభావప్యర్థానర్థౌ అనర్థ ఏవేతి తాపకః స ఉచ్యతే. తప్యస్తు పురుషో య ఏకః పర్యాయేణోభాభ్యాం సంబధ్యత ఇతి తయోస్తప్యతాపకయోరేకాత్మతాయాం మోక్షానుపపత్తిః. జాత్యన్తరభావే తు తత్సంయోగహేతు పరిహారాత్ స్యాదపి కదాచిన్మోక్షోపపత్తిరితి.

## బాలానందిని

2-1-13

యోఽపీతి:- ("భోక్త్రాపత్తేరవిభాగశ్చే" దిత్యాదిసూత్రంలో) జలము, దాని తరంగాలు, అలలు, నురుగు, బుడగలు మొదలైనవి చెప్పబడ్డాయి. అక్కడ కూడ జలస్వరూపంలో ఉన్న ఒక సముద్రానికి సంబంధించిన వీచులు మొదలైన విశేషాలు ఆవిర్భావతిరోభావరూపంచేత (ఒకసారి కనబడుతు ఒకసారి అణగిపోతూ ఉండడంచేత) నిత్యాలే గాన జలాత్మయైన సముద్రానికి వీచ్యాదులతో అనిర్మోక్షం (విడుదల లేకపోవడం) సమానమే. తప్యానికీ తాపకానికీ జాత్యంతరభావం (భేదం) లోకంలో ప్రసిద్ధంగా ఉంది కదా? అదెట్లనగా- అర్థి (ఒక వస్తువు కావాలని కోరుకొనేవాడు) అర్థం (కోరబడే వస్తువు) ఇవి పరస్పర భిన్నాలుగా కనబడుతున్నాయి. స్వతః అర్థం అర్థికంటె భిన్నం కాకపోతే ఏ అర్థాన్ని అర్థి కోరుతున్నాడో అది వానికి

నిత్యసిద్ధమే కాబట్టి (అతనిలోనే అభిన్నంగా ఉన్నది కాబట్టి) అతడు దానిని గూర్చి కోరడం ఉండదు. ఉదాహరణకి- దీపానికి ప్రకాశ అనే అర్థం నిత్యసిద్ధమే గాన ఆ దీపం ఆ ప్రకాశరూపార్థాన్ని కోరడం అనేది ఉండదు. అర్థి తనకు అంతవరకు లభించని అర్థాన్నే కదా కోరుకొంటాడు? అదే విధంగా (అర్థార్థులు ఒకటే అయిన పక్షంలో) అర్థం కూడ అర్థం కాదు. అది అర్థం అయితే స్వార్థమే అన్నట్లవుతుంది. అలాంటిది లేదు కదా?

ఏ. అర్థం అర్థీ ఒక్కటే అన్నట్లయితే అపుడు అర్థాన్ని అర్థం అనడానికి వీలుండదు. కోరేవాడు కోరబడేది అని భేదం ఉంటేనే కోరేవాడు అర్థి అనీ కోరబడేది అర్థం అనీ చెప్పడానికి వీలవుతుంది. ఈ రెండు ఒకటే అంటే అర్థం తననే తాను కోరుకుంటూన్నది అని చెప్పవలసి వస్తుంది. ఇది లోక విరుద్ధం కదా?

సంబన్ధీతి:- అర్థం అర్థి అనేవి సంబంధిశబ్దాలు. సంబంధం అనేది రెండు వస్తువుల మధ్య ఉంటుంది కాని ఒకదానికి దానితోనే సంబంధం అనే మాట ఉండదు. అందుచేత అర్థం, అర్థి అనేవి వేరువేరైనవి. ఇట్లే అనర్థం, అనర్థం అనేవి కూడ వేరువే రైనవి. అర్థికి అనుకూలమైనది అర్థం, ప్రతికూల మైనది అనర్థం. ఒకే పురుషుడు ఆ రెండింటితోను పర్యాయంచేత (ఒకదాని తరవాత మరొకదానితో) సంబంధిస్తాడు. వీటిలో అర్థం చాలా అల్పంగా ఉంటుంది, అనర్థం అధికంగా ఉంటుంది. అందుచేత రెండూ కూడ అనర్థంగానే పరిగణింపబడతాయి కాబట్టి అది 'తాపకం' అని చెప్పబడుతుంది. ఈ రెండింటితోను పర్యాయంచేత సంబంధించే పురుషుడు తప్యుడు. అందుచేత ఈ తప్యతాపకాలు రెండూ ఒకటే అన్నట్లయితే మోక్షం కుదరదు. జాత్యంతరభావం ఉంటే మాత్రం (అతి భిన్న మైనవి అంటే మాత్రం) వాటి (తప్యతాపకాల) సంయోగానికి హేతువైనదానిని తొలగించడంవల్ల మోక్షానికి అవకాశం లభించవచ్చును.

ఏ. మా మతం ప్రకారం (సాంఖ్యమతం ప్రకారం) తప్యం బుద్ధి. తాపకం అనర్థరూపమైన సంసారం. తప్యమైన బుద్ధితో పురుషుడు స్వస్వామిభావరూప సంబంధాన్ని కల్పించుకొన్నాడు. దీనికి కారణం అనాదియైన అవివేకం. ఈ సంబంధానికి హేతువైన అవివేకాన్ని తొలగిస్తే పురుషుడు తన నిత్యముక్తరూపాన్ని తెలుసుకొని మోక్షం పొందవచ్చును. నిజానికి బంధమోక్షాలు పురుషునికంటె అత్యంతభిన్నమైన బుద్ధికి సంబంధించినవే. వాటిని పురుషుడు తనమీద ఆరోపించుకొంటున్నాడు. అందుచేత తప్యమైన బుద్ధితో సంయోగానికి హేతువైన అవివేకం తొలగిపోతే మా పురుషుడు మోక్షం పొందవచ్చు నేమో కాని తప్యతామకాలకు అభేదాన్ని అంగీకరించిన నీ మతంలో మోక్షం కుదరదు అని భావం.

## భాష్యమ్

న. ఏకత్వాదేవ తప్యతాపకభావానుపపత్తేః. భవేదేష దోషో యద్యేకాత్మతాయాం తప్యతాపకావన్యోన్యస్య విషయవిషయిభావం ప్రతిపద్యేయాతామ్; న త్వేతదస్తి, ఏకత్వాదేవ. న హ్యగ్నిరేకః సన్ స్వమాత్మానం దహతి ప్రకాశయతి వా సత్యప్యౌష్ణ్యప్రకాశాదిధర్మభేదే పరిణామిత్వే చ. కిము కూటస్థే బ్రహ్మణ్యేకస్మింస్తప్యతాపకభావః సంభవేత్. క్వ పునరయం తప్యతాపకభావః స్యాదితి? ఉచ్యతే- కిం న పశ్యసి కర్మభూతో జీవద్దేహః తప్యః తాపకః సవితేతి? నను తప్తిర్నామ దుఃఖమ్, సా చేతయితుః, నాచేతనస్య దేహస్య. యది హి దేహస్యైవ తప్తిః స్యాత్ సా దేహనాశే స్వయమేవ నశ్యతీతి తన్నాశాయ సాధనం నైషితవ్యం స్యాదితి. ఉచ్యతే. దేహాభావేఽపి కేవలస్య చేతనస్య తప్తిర్న దృష్టా. న చ త్వయాపి తప్తిర్నామ విక్రియా చేతయితుః కేవలస్యేష్యతే. నాపి దేహచేతనయోః సంహతత్వమ్, అశుద్ధ్యాదిదోషప్రసంగాత్. న చ తప్తేరేవ తప్తిమభ్యుపగచ్ఛసి; కథం తవాపి తప్యతాపకభావః. సత్త్వం తప్యం తాపకం రజ ఇతి చేత్, న. తాభ్యాం చేతనస్య సంహతత్వానుపపత్తేః. సత్త్వానురోధిత్వాచ్చేతనోఽపి తప్యత ఇవేతి చేత్, పరమార్థతస్తర్హి నైవ తప్యత ఇత్యాపతతి ఇవశబ్ద ప్రయోగాత్. న చేత్తప్యతే నేవశబ్దో దోషాయ. న హి డుణ్డుభః సర్ప ఇవేత్యేవతా సవిషో భవతి, సర్పో వా డుణ్డుభ ఇవేత్యేతావతా నిర్విషో భవతి. అతశ్చావిద్యాకృతోఽయం తప్యతపకభావో న పారమార్థిక ఇత్యభ్యుపగన్తవ్యమితి నైవం సతి మమాపి కించిద్దుష్యతి.

## బాలానందిని

అత్రేతి:- ఇక్కడ (సమాధానం) చెప్పబడుచున్నది. నువ్వు చెప్పిన దోషం ఏదీ లేదు. ఎందువల్ల ననగా ఏకత్వం అంగీకరించడంవల్లనే తప్యతాపకభావం కుదరదు. ఏకాత్మత్వాన్ని అంగీకరించడంలో నువ్వు చెప్పిన దోషం ఎప్పుడు కలుగుతుం దనగా- తప్యతాపకాలు పరస్పరమూ విషయవిషయిత్వాన్ని పొందుతా యని అంగీకరిస్తేనే. (తప్యం విషయం, తాపకం విషయి. ఈ విధంగా తాపకమైన దానికి తప్యం విషయం- తపింపబడేది- అవుతుం దనీ, తప్యానికి తాపకం విషయి అవుతుం దనీ మేం అంటే

ఏకాత్మవాదానికి భంగం వస్తుంది. మేం అలా అనడంలేదు కదా అని భావం). ఇది (తప్యతాపకాలకు విషయ- విషయిభావం) లేదు; ఎందుచేత? ఏకత్వాన్ని అంగీకరించాం కాబట్టి. అగ్నిలో ఉష్ణత్వం, ప్రకాశ మొదలైన వేరు వేరు ధర్మాలు ఉన్నాయి. పరిణామిత్వం కూడ ఉంది. అలాంటి అగ్ని కూడ తనను ప్రకాశింపచేయదు. కాల్చదు. అలాంటప్పుడు, కూటస్థము (పరిణామాదివికారా లేవీ లేనిది) అద్వితీయమూ అయిన బ్రహ్మలో తప్యతాపకభావం ఎలా సంభవిస్తుంది? అయితే ఈ తప్యతాపకభావం ఎక్కడుంది? (సమాధానం) చెప్పబడుతున్నది- కర్మయైన (తాపనక్రియలో కర్మయైన) జీవించి ఉన్నవాని దేహం తప్యం సూర్యుడు తాపకుడు అని నువ్వు లోకంలో చూడడం లేదా? (ప్రశ్న) తప్తి (తపించడం) అనగా దుఃఖం; అది చేతనానికే ఉంటుంది కాని అచేతనమైన దేహానికి ఉండదు కదా? తప్తి దేహానికే ఉండే పక్షంలో దేహం నశిస్తే అది కూడా దానితో పాటే నశిస్తుంది గాన దాని నాశంకోసం సాధనం ఏదీ వెదకికొనవలసిన పని ఉండదు. (సమాధానం) చెప్పబడుతున్నది- దేహం లేకపోతే కూడ కేవల చేతనానికి తప్తి కనబడడంలేదు. తప్తి అనేది కేవల చేతయితకు (పురుషునికి) కలిగే వికార మని నువ్వూ అంగీకరించవు కదా? పోనీ దేహమూ చేతనమూ కలిసిపోతాయి అని చెప్పడం కూడ యుక్తం కాదు. అప్పుడు చేతనానికి అశుద్ధి మొదలైన దోషాలు ప్రసక్తమవుతాయి. తప్తికే తప్తి అని కూడ నువ్వు అంగీకరించడం లేదు. అందుచేత నీ మతంలో మాత్రం తప్యతాపకభావం ఎలా కుదురుతుంది? సత్త్వగుణం తప్యం, రజోగుణం తాపకం అన్నట్లయితే అది కుదరదు. ఆ రెండింటితోను చేతనం కలవడం అనుపపన్నం కదా. (అప్పుడు పురుషునికి బంధం లేదు గాన శాస్త్రారంభాదులు వ్యర్థం అవుతాయి అని భావం). చేతనుడు కూడ సత్త్వంతో సంబంధించి ఉండడంవల్ల తపింపచేయబడుచున్నవాడు వలె ఉన్నాడు అని అంటే 'తప్యత ఇవ' అని ఇవ శబ్దం ప్రయోగించడంచేత వాస్తవంలో తపింపబడడం లేదు అనే అర్థం వస్తుంది. నిజంగా పురుషుడు తపింపబడకపోతే 'ఇవ' శబ్ద ప్రయోగంలో దోషం లేదు. అనగా "పురుషః తప్యత ఇవ" అన్నదానికి పురుషుడు తపింపబడచేయబడుతున్న సత్త్వంవలె ఉన్నాడు అని అర్థం. అనగా పురుషుణ్ణి తపింపచేయబడుచున్న సత్త్వంతో పోల్చడం జరుగుతున్నది. అలా చెప్పడంచేత పురుషునికి తప్యత్వం లేదనే అర్థం. బురదపాము సర్పంవలె ఉన్నది అని చెప్పినంతమాత్రాన దానికి విషం రాదు, సర్పం బురదపాము వలె ఉన్న దని చెప్పిన మాత్రాన దాని విషం పోదు. అందుచేత ఈ తప్యతాపకభావం అవిద్యచేత ఏర్పడినదే కాని పారమార్థికం కాదు అని అంగీకరించాలి. అలా అంగీకరిస్తే నాకు కూడ ఏమీ (నష్టం లేదు) దోషం లేదు.

## భాష్యమ్

అథ పారమార్థికమేవ చేతనస్య తప్యత్వమభ్యుపగచ్ఛసి తవైవ సుతరామనిర్మోక్షః ప్రసజ్యేత. నిత్యత్వాభ్యుపగమాచ్చ తాపకస్య. తప్యతాపకశక్త్యో ర్నిత్యత్వేఽపి సనిమిత్తసంయోగాపేక్షత్వాత్తప్తేః సంయోగనిమిత్తాదర్శన నివృత్తావాత్యన్తికః సంయోగోపరమః, తతశ్చాత్యన్తికో మోక్ష ఉపపన్న ఇతి చేత్; న.అదర్శనస్య తమసో నిత్యత్వాభ్యుపగమాత్. గుణానాం చోద్భ వాభిభవయోరనియతత్వాదనియతః సంయోగనిమిత్తోపరమ ఇతి వియోగస్యాప్యనియతత్వాత్ సాంఖ్యస్యైవ అనిర్మోక్షోఽపరిహార్యః స్యాత్. ఔపనిషదస్యత్వాత్మైకత్వాభ్యుపగమాదేకస్య చ విషయవిషయిభావానుపపత్తేః, వికారభేదస్య చ వాచారమ్భణమాత్రత్వశ్రవణాదనిర్మోక్షశఙ్కా స్వప్నేఽపి నోపజాయతే. వ్యవహారే తు యత్ర యథా దృష్టస్తప్యతాపకభావస్తత్ర తథైవ స ఇతి న చోదయితవ్యః పరిహర్తవ్యో వా భవతి.10.

## బాలానందిని

**అథేతి:-** అలా కాక చేతనానికి పారమార్థికమైన తప్యత్వం ఉంటుం దని అంగీకరిస్తావా, నీకే పూర్తిగా అనిర్మోక్షం ప్రసక్తం అవుతుంది. ఎందువల్ల ననగా నువ్వు తాపకాన్ని నిత్యం అని అంగీకరిస్తున్నావు. తాప్యతాపకశక్తులు నిత్యమైనా కూడ తప్తికి ఏదో నిమిత్తంచేత ఏర్పడిన సంయోగంయొక్క అపేక్ష ఉండడంవల్ల సంయోగానికి నిమిత్తమైన అదర్శనరూపమైన (అవివేకరూప మైన) తమస్సు నివర్తించగా పూర్తిగా సంయోగం తొలగిపోతుంది, దానివల్ల మోక్షం యుక్తమే అన్నట్లయితే, అది యుక్తం కాదు. తమోరూప మైన అదర్శనం నిత్యం అని అంగీకరించబడింది కదా. గుణాల ఉద్భవాభిభవాలు (పైకి ఉద్బుద్ధం అవడం అణిగిపోవడం) అనియతాలు గాన (ఎప్పుడు ఉ ద్భవం జరుగుతుందో ఎప్పుడు అభిభవం జరుగుతుందో నిశ్చితంగా తెలియదు గాన సంయోగనిమిత్తంయొక్క ఉపరమం (తప్యతాపకాల సంయోగానికి కారణమైనదాని ఉపరమం) అనియతం; అదే విధంగా వియోగం కూడ అనియతమే; అందుచేత సాంఖ్యునికే అనిర్మోక్షప్రసంగం.

వి. సత్త్వం అనగా బుద్ధిలో ఉన్న సత్త్వాంశం. అది సుఖాధిజ్ఞానరూపంలో పరిణామం చెందుతుంది. అది తప్యం. తాపకమైన రజస్సు అనగా బుద్ధిలోనే ఉన్న రజోంశం. అది రాగాద్యుత్పాదనం ద్వారా దుఃఖం కలిగిస్తుంది. తామసవృత్తి తప్యమైన

బుద్ధితో పురుషునకు అభేదభ్రాంతిని కలిగిస్తుంది. దానిచేత పురుషుడు తప్య డని చెప్పబడుతున్నాడు. ఇది సాంఖ్యుల అభిప్రాయం. ఈ విషయం సర్వదర్శనసంగ్రహంలో ఉదాహరించిన ఈ క్రింది శ్లోకంవల్ల స్పష్టం అవుతుంది -

"తదుక్తమాచార్యైః-

"సత్త్వం తప్యం బుద్ధిభావేన వృత్తం భావా యే వా రాజసాస్తాపకాస్తే,
తస్యాభేదగ్రాహిణీ తామసీ యా వృత్తిస్తస్యాం తప్య ఇత్యుక్త ఆత్మా"

(సర్వదర్శనసంగ్రహం. పాతంజలదర్శనం. పేజి.334)

అయితే- తప్యతాపకాలైన సత్త్వరజస్సులు నిత్య మైనవిగాన సాంఖ్యసిద్ధాంతం ప్రకారమే అనిర్మోక్ష ప్రసంగం అని సిద్ధాంతి ఆక్షేపం. దానికి సమాధానంగా సాంఖ్యుడు ఇలా చెపుతున్నాడు. తప్యతాపకశక్తులు నిత్యమే అయినా పురుషునికి బుద్ధితో సంయోగం ఉన్నంతవరకే అతడు బద్ధుడౌతాడు. ఈ సంయోగానికి కారణం తమస్సు. అదే అదర్శనహేతువు అవడంచేత అదర్శనం అని (అవివేకం అని) చెప్పబడుతుంది. అది నివర్తిస్తే సంయోగోపరమం కలుగుతుంది గాన అత్యంతికమైన మోక్షం కలుగుతుంది. ఇది కూడ యుక్తం కాదంటాడు సిద్ధాంతి. తమస్సు కూడ నిత్యమే గాన దానివల్ల కలిగే సంయోగానికి ఉపరమం ఉండదు. అందుచేత పైన చెప్పిన దోషం యథాతథంగా ఉంటుంది. తమస్సు పూర్తిగా నివర్తించకపోయినా అది అనుద్భూతం అయినప్పుడు వివేకంచేత సంయోగోపరమం కలిగి మోక్షం కలగవచ్చును అని కూడ అనడానికి కుదరదు. ఎందువల్ల ననగా గుణముల ప్రవృత్తి చంచలము అని కదా మీ సిద్ధాంతం? అందుచేత గుణాల ఉద్భవాభిభవాలు అనియతాలు గాన సంయోగనిమిత్తం ఉపరమించడం కూడ అనియతమే. తమస్సుయొక్క ఉద్భవం ఏ విధంగా అనియతమో అభిభవం కూడ అనియతమే గాన అభిభవావస్థ పోయి మళ్లీ ఉద్భవావస్థ వచ్చినప్పుడు వివేకం నశించి ముక్తులు కూడ బంధం పొందవచ్చు. అందుచేత మీ మతంలో అనిర్మోక్షప్రసంగం తప్పదు.

ఔపనిషదస్యేతి:- ఔపనిషదర్శనంలో అయితే ఆత్మైకత్వాన్ని అంగీకరించడం వల్ల ఒకే వస్తువునకు విషయవిషయిభావం (ఇక్కడ తప్యతాపకభావం) కుదరదు. వికారభేదం అంతా వాచారంభణం మాత్రమే. అందుచేత అనిర్మోక్షశంక స్వప్నంలో కూడ కలగడానికి అవకాశం లేదు. వ్యవహారంలో నైతే తప్యతాపకభావం ఎక్కడ ఎలా కనిపిస్తుందో అక్కడ అలాగే అంగీకరించబడుతుంది. అందుచేత దీనిని గూర్చి ఆక్షేపించడానికి, పరిహారానికీ అవసరం లేదు. 10.

రచనానుపపత్త్యధికరణం సమాప్తం

## 2. మహద్దీర్ఘాధికరణమ్. సూ.11.

### భాష్యమ్

ప్రధానకారణవాదో నిరాకృతః. పరమాణుకారణవాద ఇదానీం నిరాకర్తవ్యః. తత్ర ఆదౌ తావద్యోఽణువాదినా బ్రహ్మవాదిని దోష ఉత్ప్రేక్ష్యతే న ప్రతిసమాధీయతే. తత్రాయం వైశేషకాణామభ్యుపగమః- కారణ ద్రవ్యసమవాయినో గుణాః కార్యద్రవ్యే సమానజాతీయం గుణాన్తరమారభన్తే, శుక్లేభ్యస్తన్తుభ్యః శుక్లస్య పటస్య ప్రసవదర్శనాత్, తద్విపర్యయాదర్శనాచ్చ. తస్మాచ్చేతనస్య బ్రహ్మణో జగత్కారణత్వేఽభ్యుపగమ్యమానే కార్యేఽపి జగతి చైతన్యం సమవేయాత్. తదదర్శనాత్తు న చేతనం బ్రహ్మ జగత్కారణం భవితుమర్హతి- ఇతి. ఇమమభ్యుపగమం తదీయయైవ ప్రక్రియయా వ్యభిచారయతి-

### సూ. మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమణ్డలాభ్యామ్. 2.2.11

### బాలానందిని

ప్రధానేతి:- ప్రధానకారణవాదం నిరాకరించబడింది. ఇప్పుడు పరమాణుకారణ వాదాన్ని నిరాకరించవలసి ఉంది. అందులో ముందు పరమాణుకారణవాది బ్రహ్మవాది విషయంలో చూపిన దోషానికి సమాధానం చెప్పబడుతున్నది. వైశేషికులు అంగీకరించిన విషయం ఇది- కారణమైన ద్రవ్యంలో సమవాయసంబంధంతో ఉండే గుణాలు కార్యద్రవ్యంలో తమతో సమానమైన జాతి గల మరొక గుణాన్ని ఆరంభిస్తాయి (పుట్టిస్తాయి). తెల్లని దారాలనుండి తెల్లని వస్త్రమే పుట్టుచున్నట్లు కనబడుతూన్నది గాని అందుకు విపరీతంగా కనబడడం లేదు.

వి. పటం కార్యం. దీనికి కారణం తంతువులు. తంతువులలో తెలుపు అనే గుణం ఉంది. తంతువులకీ ఆ గుణానికీ విడదీయరాని సంబంధం సమవాయ సంబంధం ఉంది. తంతువులు వస్త్రాన్ని పుట్టించి నట్లు తంతువులలో ఉన్న శుక్లగుణం పటంలోని శుక్లగుణాన్ని పుట్టిస్తుంది. శుక్లమైన తంతువులనుండి పుట్టిన పటం శుక్లంగానే ఉంటుంది కాని కృష్ణాదిరూపాలలో ఉండదు కదా?

తస్మాదితి:- అందువల్ల చేతనమైన బ్రహ్మ జగత్కారణం అని అంగీకరిస్తే దాని కార్యమైన జగత్తులో కూడ (పటంలో తంతువుల శుక్లరూపం ద్వారా శుక్లరూపం

వచ్చినట్లు) సమవాయసంబంధంతో చైతన్యం ఉండాలి. కాని అది కనబడడంలేదు. అందుచేత చేతనమైన బ్రహ్మ జగత్కారణం అవడానికి వీలులేదు. వైశేషికుల ఈ అభ్యుపగమాన్ని (అంగీకారాన్ని) వాళ్ల ప్రక్రియచేతనే వ్యభిచరింపచేస్తున్నాడు-

మహదితి:- "హ్రస్వపరిమణ్డలాభ్యామ్= హ్రస్వ-పరిమణ్డలాలనుండి, మహద్దీర్ఘవద్వా= మహద్దీర్ఘాలు పుట్టినట్లు, చేతనమైన బ్రహ్మనుండి అచేతనమైన జగత్తు పుట్టవచ్చును" అని సూత్రార్థం. (దీని అర్థం మున్ముందు స్పష్టం కాగలదు)

వి. ఈ అధికరణంలో వైశేషికులు వేదాంతుల మతం విషయంలో చేసిన ఆక్షేపానికి సమాధానం చెప్పబడుతున్నది. అందుచేత వాస్తవంలో ఈ అధికరణం కూడ స్వపక్షదోషనిరాకరణరూప మైన వెనుకటి పాదంలోనే ఉండాలి. అయినా కూడ వెనుకటి అధికరణంలో- ప్రధానగుణాలైన సుఖాదులు జగత్తులో అన్వితాలుగా లేవు గాన ప్రధానం జగత్కారణం కాదు అని చెప్పినట్లుగా బ్రహ్మలోని చైతన్యం జగత్తులో కనబడడం లేదు గాన బ్రహ్మ కూడ కారణం కాకూడదు అను దృష్టాంత సంగతిచేత పూర్వపక్షం బయలుదేరడంచేత దానికి సమాధానం చెప్పబడుచున్నది. చేతనమైన బ్రహ్మనుండి జగత్సృష్టిని చెప్పే వేదాంతసమన్వయం విషయం. సమవాయికారణగుణం కార్యంలో సజాతీయమైన మరొక గుణాన్ని పుట్టిస్తుంది అనే న్యాయానికి ఇది విరుద్ధమా కాదా అని సంశయం. విరుద్ధ మనే పూర్వపక్షం నిరాకరించబడుతున్నది.

## భాష్యమ్

ఏషా తేషాం ప్రక్రియా- పరమాణవః కిల కం చిత్కాలమనారబ్ధ కార్యాః యథాయోగం రూపాదిమన్తః పారిమాణ్డల్యపరిమాణాశ్చ తిష్ఠన్తి. తే చ పశ్చాదదృష్టాదిపురఃసరాః, సంయోగసచివాశ్చ సన్తో ద్వ్యణుకాదిక్రమేణ కృత్స్నం కార్యజాతమారభన్తే. కారణగుణాశ్చ కార్యే గుణాన్తరమ్. యదా ద్వౌ పరమాణూ ద్వ్యణుకమారభేతే తదా పరమాణుగతా రూపాదిగుణవిశేషాః శుక్లాదయో ద్వ్యణుకే శుక్లాదీనపరానారభన్తే. పరమాణుగుణవిశేషస్తు పారిమాణ్డల్యం న ద్వ్యణుకే పారిమాణ్డల్యమపరమారభతే; ద్వ్యణుకస్య పరిమాణాన్తరయోగాభ్యుపగమాత్. అణుత్వహ్రస్వత్వే హి త్ర్యణుకవర్తినీ పరిమాణే వర్ణయన్తి. యదాపి ద్వే ద్వ్యణుకే చతురణుకమారభేతే తదాపి సమానం ద్వ్యణుకసమవాయినాం శుక్లాదీనామారమ్భకత్వమ్. అణుత్వహ్రస్వత్వే తు ద్వ్యణుకసమవాయినీ అపి నైవారభేతే, చతురణుకస్య

మహత్త్వదీర్ఘత్వపరిమాణయోగాభ్యుపగమాత్. యదాపి బహవః పరమాణవః బహూని వా ద్వ్యణుకాని, ద్వ్యణుకసహితో వా పరమాణుః కార్యమారభతే తదాపి సమానైషా యోజనా. తదేవం యథా పరమాణోః పరిమణ్డలాత్సతః అణు హ్రస్వం చ ద్వ్యణుకం జాయతే, మహద్దీర్ఘం చ త్ర్యణుకాది న పరిమణ్డలమ్, యథా వా ద్వ్యణుకాదణోః హ్రస్వాచ్చ సతః మహద్దీర్ఘం చ త్ర్యణుకం జాయతే, నాణు నో హ్రస్వమ్, ఏవం చేతనాద్బ్రహ్మణః అచేతనం జగజ్జనిష్యత ఇత్యభ్యుపగమే కిం తవ చ్ఛిన్నమ్?

బాలానందిని

ఏషా ఇతి:- ఇదీ ఆవైశేషికుల ప్రక్రియ- పరమాణువులు కార్యాన్ని ఆరంభించకుండా (పుట్టించకుండా) వాటి వాటి రూపాదులతో పారిమాండల్య మనే పరిమాణంతో కొంత కాలం (ప్రళయకాలంలో) వేరు వేరుగా (కలవకుండా) ఉంటాయి. (వాయవీయపరమాణువులలో స్పర్శగుణం మాత్రం ఉంటుంది. తేజఃపరమాణువులలో స్పర్శరూపాలు ఉంటాయి. జలపరమాణువులలో స్పర్శ-రూప-రసా లుంటాయి. పృథివీపరమాణువులలో స్పర్శరూపరసగంధా లుంటాయి. (ఆకాశం నిత్యం, విభువు గాన దీనికి (ఆకాశ) పరమాణువు లుండవు) తరవాత ఆ పరమాణువులు జీవుల అదృష్టాదులను పురస్కరించుకొని (అనగా జీవులు వాళ్లవాళ్ళ కర్మల నను సరించి సుఖదుఃఖాలు అనుభవించాలి గాన, అనుభవించాలంటే జగత్తు ఉండాలి గాన, జగత్సృష్టి కోసం) పరస్పరమూ సంయోగం పొంది ద్వ్యణుకాదిక్రమంచేత సమస్తమైన కార్యసముదాయాన్ని ఆరంభిస్తాయి. కారణాలలో ఉన్న గుణాలు కార్యాలలో మరొక (సజాతీయమైన) గుణాన్ని ఆరంభిస్తాయి. రెండు పరమాణువులు ద్వ్యణుకాన్ని ఆరంభిస్తే ఆ పరమాణువులలో ఉన్న రూపాదిగుణవిశేషాలు, (శుక్లరూపం మొదలైనవి), ద్వ్యణుకంలో వేరైన కొన్ని శుక్లాదులను ఆరంభిస్తాయి. అయితే పరమాణువులో ఉండే పారిమాండల్యం (ఇదొక పరిమాణం) మాత్రం ద్వ్యణుకంలో మరొక పారిమాండల్యాన్ని ఆరంభించదు. ఎందువల్ల ననగా ద్వ్యణుకానికి మరొక పరిమాణం ఉంటుం దని అంగీకరించబడింది. ద్వ్యణుకంలో అణుత్వం, హ్రస్వత్వం అనే పరిమాణాలు ఉంటా యని వాళ్లు వర్ణిస్తారు. రెండు ద్వ్యణుకాలు కలిసి చతురణుకాన్ని ప్రారంభించినపుడు కూడ ద్వ్యణుకంలో సమవాయసంబంధంతో ఉన్న శుక్లాదులు చతురణుకంలో శుక్లాదులను ఆరంభించడం సమానమే. అయితే ద్వ్యణుకంలో సమవాయసంబంధంతో ఉన్న అణుత్వహ్రస్వత్వాలు మాత్రం (చతురణుకంలో) అణుత్వహ్రస్వత్వాలను

ఆరంభించవు. కారణం- చతురణుకానికి మహత్-దీర్ఘ ప్రమాణా లుంటాయని అంగీకరించబడింది. అనేకమైన పరమాణువులు గాని, అనేకద్వ్యణుకాలు గాని, ద్వ్యణుకాలతో కూడిన పరమాణువుగాని కార్యాన్ని ఆరంభించినప్పుడు కూడ ఇదే పద్ధతి. ఈ విధంగా పరిమండలప్రమాణం గల పరమాణువు నుండి అణువు, హ్రస్వమూ అయిన ద్వ్యణుకం ఏ విధంగా పుట్టుచున్నదో, మహద్దీర్ఘప్రమాణాలు గల త్ర్యణుకాదికం ఎలా పుట్టు చున్నదో, అంతే కాని పరిమండలం ఏ విధంగా పుట్టడం లేదో, అణువు, హ్రస్వమూ అయిన ద్వ్యణుకాదినుండి మహత్తు, దీర్ఘమూ అయిన త్ర్యణుకం ఏ విధంగా పుట్టుచున్నదో అణువు గాని హ్రస్యం గాని పుట్టడం లేదో అదే విధంగా చేతన మైన బ్రహ్మ నుండి అచేతన మైన జగత్తు పుడుతుంది అని అంగీకరిస్తే నీ కేమి నష్టం వచ్చింది?

వి. వైశేషికులు అణువు, హ్రస్వం, మహత్, దీర్ఘం అని పరిమాణాన్ని నాలుగు విధాలుగా అంగీకరించారు. పరమాణువులో పరమాణుపరిమాణం, పరమహ్రస్వ పరిమాణం ఉంటాయి. ఆకాశాదులలో పరమమహత్పరిమాణం, పరమదీర్ఘత్వం ఉంటాయి. ద్వ్యణుకంలో అవాంతర అణు-హ్రస్వపరిమాణాలు ఉంటాయి. మిగిలిన వాటిలో మహద్దీర్ఘపరిమాణాలుంటాయి. "తచ్చ పరిమాణం చతుర్విధమ్- మహత్త్వమణుత్వం దీర్ఘత్వం హ్రస్వత్వం చ. తత్ర పరమమహత్త్వపరమదీర్ఘత్వే విభుచతుష్టయవర్తినీ. పరమాణుత్వపరమహ్రస్వత్వే పరమాణువర్తినీ. అవాన్తరాణుత్వావాన్తరహ్రస్వత్వే ద్వ్యణుకవర్తినీ. త్రసరేణుమారభ్య మహావయవిపర్యన్తం మహత్త్వదీర్ఘత్వే. ఏవఞ్చ సర్వాణ్యపి ద్రవ్యాణి పరిమాణద్వయవన్తి" (వైశేషికసూత్రోపస్కారం. వై.సూ.7.1.8). అణుపరిమాణం నిత్య మనీ అనిత్య మనీ రెండు విధాలు. నిత్యమైన పరమాణువులో ఉన్నది నిత్యాణుపరిమాణం. అనిత్యమైన ద్వ్యణుకంలో ఉన్నది అనిత్యాణుపరిమాణం. నిత్యాణుపరిమాణానికి "పరిమండలం" అని పేరు. "నిత్యం పరిమణ్డలమ్" (వై.సూ.7.1.20) కారణం కార్యాన్ని ఆరంభిస్తుంది, అనగా పుట్టిస్తుంది. కారణంలో ఉన్న గుణాలు కార్యంలో ఉన్న గుణాలను ఆరంభిస్తాయి. తంతువులలో ఉన్న శుక్లగుణం పటంలో ఉన్న శుక్లగుణాన్ని ఆరంభిస్తుంది. ఇది సాధారణ నియమం. రెండు అణువులు కలియడంవల్ల ద్వ్యణుకం పుడుతుంది. అనగా ద్వ్యణుకానికి అణువులు కారణం. అణువులలో ఉన్న శుక్ల-రక్తాదిగుణాలు ద్వ్యణుకంలోని శుక్లరక్తాదిగుణాలను ఆరంభిస్తాయి. అయితే- అణువులో ఉన్న పరమాణుపరిమాణం, దీనికే "పారిమాండల్యం" అని పేరు, అణువులో ఉన్న పరమహ్రస్వత్వం- ఇవి ద్వ్యణుకంలో పరిమండల ప్రమాణాన్ని గాని, పరమహ్రస్వత్వాన్ని గాని ఆరంభించవు. కారణ మేమనగా- ద్వ్యణుకంలో అణుపరిమాణం, హ్రస్వపరిమాణం ఉంటాయి. వీటికి

కారణం అణుగతపరిమాణాలు కావు; ద్వ్యణుకంలో ఉన్న ద్విత్వసంఖ్య వీటికి కారణం. మూడు ద్వ్యణుకాలు కలిస్తే త్ర్యణుకం అవుతుంది. ఈ త్ర్యణుకంలో ఉన్న ప్రమాణాలు మహత్త్వదీర్ఘత్వాలు. త్ర్యణుకానికి కారణమైన ద్వ్యణుకాలలో ఉన్న అణుత్వ-హ్రస్వత్వాలు ఈ త్ర్యణుకంలో ఇతరమైన అణుత్వహ్రస్వత్వాలను ప్రారంభించవు. దీనిలోని మహత్త్వదీర్ఘత్వాలకి కారణం ద్వ్యణుకాలలోని బహుత్వం. నాలుగు ద్వ్యణుకాలు కలిస్తే చతురణుకం. ఇది ప్రస్తుతం మనకు ప్రచుర ప్రచారంలో కనబడుతున్న గ్రంథాలలో కనబడే వైశేషికసిద్ధాంతం.

భాష్యంలో "ఏషా తేషాం ప్రక్రియా" అని ప్రారంభించి వైశేషిక సిద్ధాంతానికి సంబంధించిన కొన్ని విషయాలు చెప్పబడ్డాయి. వీటిలో కొన్ని విషయాలు వైశేషికులు అంగీకరించినదానికి భిన్నంగా ఉన్నాయి. 'రెండు ద్వ్యణుకాలు చతురణుకాన్ని ప్రారంభించి నప్పుడు కూడ ద్వ్యణుకాలలోని అణుత్వహ్రస్వత్వాలు చతురణుకంలో అణుత్వహ్రస్వత్వాలను ప్రారంభించవు. ఎందువల్ల ననగా చతురణుకంలో మహత్త్వదీర్ఘత్వా లుంటా యని వైశేషికుల మతం" అని చెప్పబడింది. వైశేషికుల మతం ప్రకారం నాలుగు ద్వ్యణుకాలు చతురణుకాన్ని ఆరంభిస్తాయి, కాని రెండు ద్వ్యణుకాలు ఆరంభించవు. అందుచేత "ద్వే ద్వ్యణుకే" అనే చోట మరొక 'ద్వే' కూడ ఉండి ఉంటుంది. "ద్వే ద్వే ద్వ్యణుకే" అని అవడంచేత నాలుగు ద్వ్యణుకాలు అనే అర్థం వస్తుంది అనీ, మరొక విధంగానూ కూడ భామతీకారులు సమర్థించారు. రత్నప్రభాకారులు కూడ "ద్వే ద్వే ఇతి శబ్దద్వయం పఠితవ్యమ్" అని చెప్పి "ద్వే ద్వ్యణుకే" అనే పాఠాన్ని కూడ వైశేకసూత్రాలపై ఉన్న రావణభాష్యం ప్రకారం సమర్థించవచ్చు నని ప్రకటార్థవివరణకారులన్నా రని కూడ అన్నారు. రెండు ద్వణుకాలచేత ఆరంభింపబడిన కార్యంలో ప్రచయాన్ని పట్టి (శిథిలమైన అవయవ సంయోగాన్ని పట్టి - దూది యందు వలె) మహత్పరిమాణం రావచ్చు నని ఆ సమర్థన.

రెండు ద్వ్యణుకాలు కార్యాన్ని ఆరంభించవు. ఆ కార్యంవల్ల ప్రయోజనం లేదు. అందుచేత మూడు ద్వ్యణుకాలే ఆరంభిస్తాయి. అది త్ర్యణుకం. అది మహద్దీర్ఘ ప్రమాణం అని తార్కికులు చెప్పేది యుక్తం

కాదు; రెండు ద్వ్యణుకాలుమాత్రం కార్యం ఎందుకు ఆరంభించకూడదు? ఆ కార్యం నిష్ప్రయోజనం అన్నట్లయితే రెండు అణువులచేత ఆరంభించబడిన ద్వణుకం కూడ నిష్ఫలమే కదా? ఈ విధంగా వాళ్ల మతంలో ఉన్న దోషాన్ని సూచించడంకోసం భాష్యంలో ఇలా చెప్పబడింది అని బ్రహ్మవిద్యా భరణకారులు సమర్థించారు. రెండు ద్వణుకాలచేత ఏర్పడిన చతురణుకంలో మహద్దీర్ఘప్రమాణా లుంటాయి అనే భాష్యానికి అభిప్రాయం అది ద్వ్యణుకం కంటె పెద్దదిగా ఉంటుంది అని చెప్పడం మాత్రమే అని కూడ ఈ వ్యాఖ్యాత అభిప్రాయం.

"యదాపి బహవః పరమాణవః... యోజనా" (చాలా పరమాణువులు కాని, చాలా ద్వ్యణుకాలు కాని, ద్వ్యణుకంతో కూడిన పరమాణువు గాని కార్యం ఆరంభించినపుడు కూడ ఇదే ప్రక్రియ'' అనే భాష్యవాక్యం కూడ వైశేషికమతానుగుణం కాదు. ఎందువల్ల ననగా వైశేషికులు- రెండు అణువులు ద్వణుకాన్ని ఆరంభిస్తాయి, మూడు ద్వ్యణుకాలు త్ర్యణుకాన్ని ప్రారంభిస్తాయి ఇత్యాదివిధంగా చెప్పారు గాని చాలా పరమాణువులు, చాలా ద్వ్యణుకాలు, ద్వ్యణుకసహితపరమాణువు కార్యాలను ఆరంభిస్తాయి అని చెప్పలేదు. అందుచేత ఈ భాష్యవాక్యం కూడ వైశేషికుల తర్కం సరియైనది కాదు అని సూచించడంకోసం ఉద్దిష్టమైనదే అన్నట్లు రత్నప్రభాకారులు సమర్థించారు. వాచస్పతిమిశ్రులు కూడ ఇంచుమించు ఇదే అభిప్రాయం సూచించారు.- "ఏవం వ్యవస్థితాయాం వైశేషిక ప్రక్రియాయాం తద్దూషణస్య వ్యభిచార ఉక్తః. అథావ్యవస్థితా తథాపి తదవస్థితో వ్యభిచార ఇత్యాహ- యదాపి బహవః పరమాణవః ఇతి" (భామతి). బ్రహ్మవిద్యాభరణకారులు కూడ ఇది వైశేషికమతం కాకపోయినా వాళ్ల మతం అసంగతం అని చెప్పడం కోసం భాష్యకారులు ఈ విధంగా వ్రాశారు అని అంటూ, అణువులు ద్వ్యణు కాద్యారంభం ద్వారానే సృష్టికి హేతువులవుతాయి అనడంలో యుక్తి లేదు; చాలా పరమాణువులు మాత్రం ఒకేసారి ఎందుకు కలవకూడదు అని వైశేషికమతాన్ని దూషించారు. ప్రస్తుతం లభ్యం అవుతున్న వైశేషిక గ్రంథాలనే దృష్టిలో పెట్టు కొని అర్థం చెపితే సూత్రార్థం కూడ సంగతం కాదు. అందుచేత

'మహద్దీర్ఘ' తరవాత 'అణు' చేర్చి 'మహద్దీర్ఘాణువత్' అని పఠించుకొని "హ్రస్వంనుంచి మహద్దీర్ఘాలు, పరిమండలంనుండి అణువు ఆరబ్ధ మైనట్లు అని అర్థం చెప్పుకోవా లని రత్నప్రభలో చెప్పబడింది. బ్రహ్మామృతవర్షిణిలో కూడ ఇట్లే వ్యాఖ్యానించబడింది. 'మహద్దీర్ఘ' తరవాత 'అణుహ్రస్వ' చేర్చుకొని హ్రస్వపరిమాణం గల ద్వ్యణుకం నుండి త్ర్యణుకంలోని మహద్దీర్ఘపరిమాణాలు, పరిమండలంనుండి ద్వ్యణుకంలోని అణుహ్రస్వాలు ఆరబ్ధము లైనట్లు అని బ్రహ్మ విద్యాభరణంలో చెప్పబడింది. కాని భాష్యకారుల వ్యాఖ్య ఈ విధంగా లేదు.

ఇక్కడ ఒక విషయం ఆలోచించవలసి ఉంది. వైశేషికుల మతం యుక్తి సంగతంగా లేదని మరొక సందర్భంలో చెప్పవచ్చును గాని వాళ్ల మతాన్ని అనువదించే సందర్భంలో వాళ్లు ఏమి చెప్పారో అదే యథాతథంగా చెప్పడం యుక్తం కదా? దీనిని పట్టి పూర్వవైశేషికగ్రంథాలలో శంకర భగవత్పాదులు అనువదించిన విధంగానే వైశేషికమతం ఉండి ఉండాలి. సూత్రకారులకు కూడ అదే పరిచితం అయి ఉంటుంది. అందుచేతనే సూత్రం ఆ విధంగా రచింపబడింది. దాని అర్థం భాష్యకారోక్తవిధంగానే గ్రహించడం న్యాయ్యం కాని అధ్యాహారాదులచేత మరొక విధంగా గ్రహించడం యుక్తం కాదు. బహుశా పూర్వవైశేషికుల మతం ప్రకారం (1) రెండు ద్వ్యణుకాల చేత చతురణుకం ఆరబ్ధంకావచ్చును. దానిలో మొత్తం నాలుగు పరమాణువు లుండడంచేత ఆ పేరు (2) అదే విధంగా త్ర్యణుకం మూడు ద్వ్యణుకాల కలయికవల్లనే కాక మూడు పరమాణువుల కలయికచేత కూడ పుట్టవచ్చు. (3) కొన్ని పరమాణువుల సముదాయం గాని, కొన్ని ద్వ్యణుకాల సముదాయం గాని, ద్వ్యణుక సహితపరమాణువు గాని కార్యారంభకం కావచ్చు. అప్పు డిది త్ర్యణుకం అవుతుంది. అందుచేతనే భాష్యంలో వాళ్లమతం ఈ విధంగా అనువదించబడింది. రెండు ద్వ్యణుకాలచేత ఆరబ్ధమైన చతురణుకంలోను, మూడు పరమాణువులచేత ఆరబ్ధమైన త్ర్యణుకంలోను, మూడు ద్వ్యణుకాలచేత ఆరబ్ధమైన త్ర్యణుకంలోను, ఒక ద్వ్యణుకం ఒక పరమాణువు కలవగా ఏర్పడిన త్ర్యణుకంలోను కూడ బహుత్వసంఖ్యచేత

మహత్త్వదీర్ఘత్వాలు ఆరబ్ధములు కావచ్చును. నిజానికి మూడు ద్వ్యణుకాల కలయికచేత ఉత్పన్న మయేది షడణుకం కావాలి గాని త్ర్యణుకం ఎలా అవుతుంది. నిజమైన త్ర్యణుకం అణుత్రయసంయోగంచేత లేదా ఒక ద్వ్యణుకం ఒక అణువు కలవడంచేత ఏర్పడినదే కావాలి. ద్వ్యణుకత్రయ సంయోగజ మైనదానికి త్ర్యణుకసంజ్ఞ కేవలం పారిభాషికమే. అదైనా తరువాతికాలంలో వచ్చినదే అయి ఉంటుంది.

వైశేషిక సూత్రంలో మూడు ద్వ్యణుకాలు త్ర్యణుకాన్ని ఆరంభిస్తాయి అని ఎక్కడా చెప్పలేదు "కారణబహుత్వాచ్చ" (వై.సూ.7.1.9) అనే సూత్రంలో మహత్త్వదీర్ఘత్వాల కారణాలలో కారణబహుత్వం ఒకటి అని చెప్పబడింది. ఉపస్కారంలో "కారణబహుత్వం త్ర్యణుకే మహత్త్వదీర్ఘత్వే జనయతి, మహత్త్వ ప్రచయయోః తత్కారణే అభావాత్" అని మాత్రమే చెప్పబడింది కాని త్ర్యణుకం మూడు ద్వ్యణుకాల కలయికవల్ల పుడుతుంది అని చెప్పలేదు. అందుచేత ఈ త్ర్యణుకం పరమాణుత్రయసంయోగజం కావచ్చు, ద్వ్యణుక-పరమాణు సంయోగజం కావచ్చు. అనగా పరమాణుత్రయసంయోగంవల్ల పుట్టిన త్ర్యణుకంలో కూడ మహత్త్వం, కారణబహుత్త్వంచేత కలగవచ్చును. మూడు ద్వ్యణుకాలు కలవగా ఏర్పడిన త్రసరేణువే ప్రత్యక్షవిషయం అవుతుంది అని తరువాతి వారు చెప్పిన విషయం కావచ్చును లేదా అప్రత్యక్షం అయినంతమాత్రాన మహత్త్వానికి విఘాతం లేదని చెప్పవచ్చును.

బహుత్వసంఖ్య మహత్త్వదీర్ఘత్వాలకి కారణం అని చెప్పే సందర్భంలో "తత్రేశ్వరబుద్ధిమపేక్ష్య ఉత్పన్నా పరమాణుద్వ్యణుకేషు బహుత్వసంఖ్యా తైరారబ్ధే కార్యద్రవ్యే త్ర్యణుకాదిలక్షణే రూపాద్యుత్పత్తిసమకాలం మహత్త్వం దీర్ఘత్వం చ కరోతి" అని ప్రశస్తపాదభాష్యంలో చెప్పబడింది. ఇక్కడ ఉన్న "పరమాణు ద్వ్యణుకేషు బహుత్వసంఖ్యా" అనే పదాలు గమనార్హాలు. పరమాణువు లలోను, ద్వ్యణుకాలలోను ఉన్న బహుత్వసంఖ్య అని అర్థం. అనగా పరమాణు త్రయసంయోగంవల్ల కూడ మహత్త్వం ఆరబ్ధం అవుతుంది అని అర్థం. అయితే ఈ 'పరమాణుద్వ్యణుకేషు' అనే పదానికి న్యాయకందలిలో

"పరమాణుభ్యామారబ్ధం ద్వ్యణుకం పరమాణుద్వ్యణుకమిత్యుచ్యతే" అని అంటూ 'ద్వ్యణుకములలోని' అని అర్థం చెప్పబడింది. దీనిని పట్టి త్ర్యణుకం ద్వ్యణుకత్రయారబ్ధమే అనే భావం న్యాయకందలీకారుని నాటికి స్థిర మైనదని, ప్రశస్తపాదుని కాలానికి పరమాణుత్రయసంయోగం కూడ మహత్త్వ దీర్ఘత్వాలకు కారణంగా (బహుత్వం ద్వారా) అంగీకరించబడే దనీ తెలుస్తూన్నది.

ఇలా చెప్పుకొన్న ట్లయితే "మహద్దీర్ఘవద్వా" ఇత్యాది సూత్రానికి అర్థం అధ్యాహారాదిశ్రమ లేకుండా కుదురుతుంది. హ్రస్వ-పరిమండలాలనుండి మహద్దీర్ఘాలు పుట్టినట్లుగా అని అర్థం. ఇక్కడ యథాసంఖ్యత్వం లేదు. హ్రస్వం నుండి మహత్త్వం, పరిమండలంనుండి దీర్ఘత్వం పుట్టుచున్నాయి అనే అర్థం కుదరదు. మహద్దీర్ఘత్వాలు ఒకేచోట ఉంటాయి కదా- దీనిని పట్టి అణువు హ్రస్వమూ అయిన ద్వణుకం నుండీ, పరమహ్రస్వమూ, పరిమండల ప్రమాణమూ అయిన పరమాణువు నుండీ కూడ మహద్దీర్ఘత్వాలు పుట్టవచ్చునని వైశేషికమతం అని సూత్రాకారుని అభిప్రాయ మన్నట్లు స్పష్టం అవుతున్నది. పరిమండలపరమహ్రస్వత్వాలున్న పరమాణువునుండి అణుహ్రస్వత్వాలు పుట్టడం అనేది ఈ సూత్రంలో చెప్పకపోయినా దానిని భాష్యకారులు చేర్చారు అని చెప్పవచ్చును. ఇలా చెప్పుకుంటే "యథా పరమాణోః పరిమణ్డలాత్సతః అణు హ్రస్వం చ ద్వ్యణుకం జాయతే, మహద్దీర్ఘం చ త్ర్యణుకాది, న పరిమణ్డలమ్" అనే భాష్యపంక్తి సరిగా కుదురుతుంది. ఈ విధంగా భాష్యకారులు ప్రాచీనవైశేషికమతాన్ని ఇక్కడ అనువదించా రని చెప్పుకుంటే విరోధం ఏమీ ఉండదు. ఏమైనా ఇది పండితులు పునః పరిశీలించవలసిన విషయం.

## భాష్యమ్

అథ మన్యసే- విరోధినా పరిమాణాన్తరేణాక్రాన్తం కార్యద్రవ్యం ద్వణు కాదీత్యతో నారమ్భకాణి కారణగతాని పారిమాణ్డల్యాదీ న్యత్యభ్యుపగచ్ఛామి, న తు చేతనావిరోధినా గుణాన్తరేణ జగత ఆక్రాన్తత్వమస్తి, యేన కారణగతా చేతనా కార్యే చేతనాన్తరం నారభేత. న హ్యచేతనా నామ చేతనావిరోధీ

కశ్చిద్గుణోఽస్తి; చేతనాప్రతిషేధమాత్రత్వాత్. తస్మాత్ పారిమాణ్డల్యాదివైషమ్యాత్ ప్రాప్నోతి చేతనాయా ఆరమ్భకత్వమ్ ఇతి. మైవం మంస్థాః. యథా కారణే విద్యమానానామపి పారిమాణ్డల్యాదీనామనారమ్భకత్వమ్ ఏవం చైతన్య స్యాపీత్యస్యాంశస్య సమానత్వాత్. న చ పరిమాణాన్తరాక్రాన్తత్వం పారిమాణ్డల్యాదీ నామనారమభకత్వే కారణమ్, ప్రాక్ ప్రరిమాణాన్తరారమ్భాత్పారిమాణ్డల్యాదీ నామారమ్భకత్వోపపత్తేః. ఆరబ్ధమపి కార్యద్రవ్యం ప్రాగ్గుణారమ్భాత్ క్షణమాత్రమ గుణం తిష్ఠతీత్యభ్యుపగమాత్. న చ పరిమాణాన్తరారమ్భే వ్యగ్రాణి పారిమాణ్డల్యాదీనీత్యతః స్వసమానజాతీయం పరిమాణాన్తరం నారభన్తే. పరిమాణాన్తరస్య అన్యహేతుత్వాభ్యుపగమాత్. "కారణబహుత్వాత్ కారణమహత్త్వాత్ప్రచయవిశేషాచ్చ మహత్" (వై.సూ.7.1.9), "తద్విపరీతమణు" (7.1.10), "ఏతేన దీర్ఘత్వమహత్త్వే వ్యాఖ్యాతే" (7.1.17) ఇతి హి కాణభుజాని సూత్రాణి. న చ సంనిధానవిశేషాత్ కుతశ్చిత్కారణబహుత్వాదీన్యేవారభన్తే న పారిమాణ్డల్యాదీనీత్యుచ్యేత; ద్రవ్యాన్తరే గుణాన్తరే వా ఆరభ్యమాణే సర్వేషామేవ కారణగుణానాం స్వాశ్రయసమవాయావిశేషాత్. తస్మాత్స్వభావాదేవ పారిమాణ్డల్యాదీనామనారమ్భకత్వమ్, తథా చేతనాయా అపీతి ద్రష్టవ్యమ్.

## బాలానందిని

**అథేతి:-** (పూర్వపక్షి అభిప్రాయం) - "ద్వ్యణుకం మొదలైన కార్యద్రవ్యాలు (కారణంలో ఉన్న పరిమాణానికి) విరుద్ధమైన మరొక పరిమాణంచేత ఆక్రమించబడి ఉంటాయి; అందుచేతనే కారణంలో ఉన్న పారిమాండల్యాదులు ఆరంభకాలు కావని నేను అంగీకరిస్తున్నాను. జగత్తైతే చేతనా విరోధి యైన మరొక గుణంచేత ఆక్రమించబడింది అని చెప్పడానికి అవకాశం లేదు; అలాంటి దేదైనా ఉంటే కారణంలో ఉన్న చేతన కార్యంలో మరొక చేతనను ఆరంభించదు అని చెప్పడానికి అవకాశం ఉండేది. అచేతన అంటూ చేతనావిరుద్ధ మైన గుణం ఏదీ లేదు కదా? అచేతన అనగా చేతనానిషేధ మాత్రమే (చేతనలేనిది అని చెప్పడం మాత్రమే) కదా? అందువల్ల (మేం చెప్పే) పారిమాండల్యాదులకీ (మీరు చెప్పే) చేతనకీ చాలా భేదం ఉంది గాన చేతన జగత్తులో చేతనాంతరాన్ని ఆరంభించవలసియే ఉంటుంది" అని అనుకుంటున్నావా- ఇలా అనుకొనకుము. కారణంలో పారిమాండల్యాదు లున్నా

కూడ అవి ఏ విధంగా అనారంభకాలో అదే విధంగా చైతన్యం కూడ అనారంభకం కావచ్చును (జగత్తులో చైతన్యాన్ని పుట్టించకపోవచ్చును) అనే అంశంలో సామ్యం ఉంది కదా? కార్యం పరిమాణాన్తరంచేత (మరొక పరిమాణంచేత) ఆక్రమించబడి ఉండడం పారిమాండల్యాదులు ఆరంభకాలు కాకపోవడంలో కారణం అని చెప్పడం కూడ యుక్తం కాదు. మరొక పరిమాణం పుట్టడానికి ముందే పారిమాండల్యాదులు (మరొక పారిమాండల్యపరిమాణాదికాన్ని)ఆరంభించడం కుదురుతుంది కదా? పుట్టిన కార్యద్రవ్యం గుణం పుట్టడానికి ముందు క్షణకాలంపాటు గుణరహితంగా ఉంటుం దని అంగీకరించబడింది కదా?

వి. "ఉత్పన్నం ద్రవ్యం క్షణమగుణం నిష్క్రియం చ తిష్ఠతి" (పుట్టిన ద్రవ్యం క్షణకాలంపాటు ఏ గుణాలూ, క్రియా లేకుండా ఉంటుంది) అని తార్కికులు అంగీకరిస్తారు. అందుచేత పారిమాండల్యపరిమాణం గల అణువులనుండి పుట్టిన ద్వ్యణుకం అనే కార్యం పుట్టిన వెంటనే క్షణకాలంపాటు ఏ గుణమూ లేకుండా ఉంటుంది. అందుచేత మరొక పరిమాణం ఏదీ వచ్చి దానిని పుట్టిన వెంటనే ఆక్రమించదు. ఈలోగా పారిమాండల్యపరిమాణమే మరొక పారిమాండల్య పరిమాణాన్ని ద్వ్యణుకంలో ఆరంభించవచ్చును కదా అని అభిప్రాయం.

న చేతి:- అది కాదు; పరిమాండల్యాదులు మరొక పరిమాణాన్ని పుట్టించే తొందరలో ఉంటాయి; అందుచేత స్వసమానజాతీయమైన మరొక పరిమాణాన్ని పుట్టించజాలవు అని అనడానికి కూడ వీలు లేదు; ఎందుచేత ననగా పరిమాణాంతరానికి హేతువు సంఖ్యాబహుత్వాదికం అని మీరు అంగీకరించి ఉన్నారు. "కారణ... మహత్", "తద్విపరీతమణు", ఏతేన దీర్ఘత్వహ్రస్వత్వే వ్యాఖ్యాతే" అనేవి ఈ సందర్భంలో చెప్పిన కణాదుని సూత్రాలు

వి. ఒక కార్యంలో మహత్పరిమాణం పుట్టడానికి (1) కారణాలు రెండు కంటె ఎక్కువగా ఉండడం, లేదా (2) కారణం మహత్ప్రమాణం అయి ఉండడం లేదా (3) ప్రచయవిశేషం- ఇవి కారణాలు. I ద్వ్యణుకం అణుపరిమాణం కలదైనా మూడు ద్వ్యణుకాల కలయికవలన పుట్టిన త్ర్యణుకం మహత్పరిమాణంలో ఉంటుంది. దీనికి కారణం త్ర్యణుకానికి కారణాలైన ద్వ్యణుకాలు బహుత్వసంఖ్యలో ఉండడం. II మృత్తునుండి పుట్టిన ఘటం మహత్పరిమాణంలో ఉంటుంది. దీనికి కారణం ఘటకారణమైన మృత్తులో మహత్పరిమాణం ఉండడం. III రెండు దూది పింజెలు కలపగా తయారైన కార్యం (పెద్ద దూది పింజె) మహత్ప్రమాణంలో ఉంటుంది. ఇందుకు కారణం రెండు దూది పింజెలు శిథిలంగా కలుసుకొనడం. ప్రచయవిశేషం

అనగా ఇదే. ఈ విధంగా "కారణబహుత్వాత్" ఇత్యాదిసూత్రంలో మహత్త్వానికి కారణాలు వేరుగా చెప్పబడ్డాయి. ఉపస్కారసహితమైన వైశేషికసూత్రంలో ఈ సూత్రం "కారణబహుత్వాచ్చ" అని మాత్రమే ఉంది "చకారో మహత్త్వప్రచయౌ సముచ్చినోతి" అని ఉపస్కారంలో ఉంది. దీనినిపట్టి భగవత్పాదులకు లభ్యమైన సూత్రం పాఠం వేరని తెలుస్తున్నది. అట్లే భాష్యంలో ఉదాహరించిన "తద్విపరీతమణు"కు బదులు "అతో విపరీతమణు" అను సూత్రం ఉంది. 'తద్విపరీతమణు' అను సూత్రానికి "మహత్పరిమాణం కంటె విపరీతమైనది అణుపరిమాణం" అని అర్థం. అనగా మహత్తు ప్రత్యక్షం అయితే అణువు అప్రత్యక్షం అనీ, మహత్తుకు కారణబహుత్వాదికం కారణం అయితే అణు పరిమాణానికి ద్విత్వసంఖ్య కారణం అనీ భావం. "దీనిచేత దీర్ఘత్వహ్రస్వత్వాలను కూడ వ్యాఖ్యానించి నట్లే" అని పైన ఉదాహరించిన మూడవ సూత్రానికి అర్థం. అనగా మహత్త్వానికి ఏది అసమవాయికారణమో (కారణబహుత్వాదికం) అదే దీర్ఘత్వానికి అసమవాయికారణం, అణుత్వానికి ఏది అసమవాయికారణమో అది హ్రస్వత్వానికి అసమవాయికారణం అని భావం. ఈ విధంగా కార్యంలో పుట్టిన మహత్త్వదీర్ఘత్వాలకీ, అణుత్వానికీ కారణగతా లైన అణుత్వానికీ, కారణగతాలైన అణుత్వ హ్రస్వత్వాలు గాని, పారిమాండల్యం కాని కారణం కాకుండా ఇతరమైనవి ఏవేవో కారణాలని కణాదుడు చెప్పి ఉన్నాడు అని భావం.

న చేతి :- అలా కాదు; సంనిధానంలోని ఒక విశేషంవల్ల కారణబహుత్వాదులే (మహత్త్వాదుల్ని) ఆరంభిస్తాయి కాని పారిమాండల్యాదులు ఆరంభించవు- అని అనడం కూడ కుదరదు. పారిమాండల్యం, ద్విత్వం, బహుత్వం మొదలైన వన్నీ కూడ కారణంలో (పరమాణు-ద్వ్యణుకాదులలో) ఒకే విధంగా సమవాయసంబంధంతో కలిసి ఉన్నప్పుడు సంనిధానవిశేషం అంటూ ఏదీ లేదు కదా?

వి. రెండు పరమాణువులలో ద్విత్వసంఖ్య ఏ విధంగా సమవాయ సంబంధంతో ఉందో పారిమాండల్యం కూడ వాటిలో అదే సంబంధంతో ఉంది. మూడు ద్వ్యణుకాలలో బహుత్వసంఖ్య ఏ విధంగా సమవాయసంబంధంతో ఉన్నదో అణుపరిమాణం కూడ అదే సంబంధంతో వాటిలో ఉంది. అందుచేత సంనిధానంలో విశేషం అంటూ ఏముంది అని భావం.

తస్మాదితి:- అందువల్ల పారిమాండల్యాదులు స్వసజాతీయపరిమాణాన్ని కార్యంలో ఆరంభించడం లేదనగా అది స్వభావం చేతనే అని చెప్పాలి. చేతనవిషయంలో కూడ (అనారంభకత్వం-జగత్తులో చేతనాన్ని ఆరంభించకపోవడం) ఇట్లే అని గ్రహించాలి.

## భాష్యమ్

సంయోగాచ్చ ద్రవ్యాదీనాం విలక్షణానాముత్పత్తిదర్శనాత్ సమానజాతీయోత్పత్తివ్యభిచారః. ద్రవ్యే ప్రకృతే గుణోదాహరణమయుక్తమితి చేత్, న.దృష్టాన్తేన విలక్షణారమ్భమాత్రస్య వివక్షితత్వాత్. న చ ద్రవ్యస్య ద్రవ్యమేవోదాహర్తవ్యం, గుణస్య వా గుణ ఏవేతి కశ్చిన్నియమే హేతురస్తి. సూత్రకారోఽపి భవతాం ద్రవ్యస్య గుణముదాజహార- "ప్రత్యక్షా ప్రత్యక్షాణామ ప్రత్యక్షత్వాత్ సంయోగస్య పఞ్చాత్మకం న విద్యతే" (వై.సూ.4.2.2) ఇతి. యథా ప్రత్యక్షాప్రత్యక్షయోర్భూమ్యాకాశయోః సమవయన్ సంయోగః అప్రత్యక్షః ఏవం ప్రత్యక్షాప్రత్యక్షేషు పఞ్చసు భూతేషు సమవయచ్ఛరీరమప్రత్యక్షం స్యాత్. ప్రత్యక్షం హి శరీరమ్, తస్మాన్న పాఞ్చభౌతికమితి. ఏదదుక్తం భవతి- గుణశ్చ సంయోగః, ద్రవ్యం శరీరమ్.

"దృశ్యతే తు" (బ్ర.సూ.2.1.6) ఇతి చాత్రాపి విలక్షణోత్పత్తిః ప్రపఞ్చితా. నన్వేవం సతి తేనైవైతద్గతమ్. నేతి బ్రూమః. తత్సాంఖ్యం ప్రత్యుక్తమ్. ఏవత్తు వైశేషికం ప్రతి. నన్వతిదేశోఽపి సమానన్యాయతయా కృతః "ఏతేన శిష్టాపరిగ్రహా వ్యాఖ్యాతాః" (బ్ర.సూ2.1.12) ఇతి. సత్యమేతత్. తస్యైవ త్వయం వైశేషికప్రక్రియారమ్భే తత్ప్రక్రియానుగతేన నిదర్శనేన ప్రపఞ్చః కృతః.

### బాలానందిని

సంయోగాదితి:- కొన్ని వస్తువుల సంయోగంవల్ల విలక్షణా లైన కొన్ని ద్రవ్యాలు పుట్టడం చూస్తున్నాం. అందుచేత ఒక కారణం సమానజాతీయమైనదానినే పుట్టిస్తుంది అని నువ్వు చెప్పే నియమానికి వ్యభిచారం.

వి. సంయోగంవల్ల దానికి విజాతీయమైన ద్రవ్యం పుట్టుతున్నది. అయితే సంయోగం గుణం, కార్యం ద్రవ్యం. అదే విధంగా చేతనం తనకు సమానజాతీయం కాని అచేతనాన్ని పుట్టించవచ్చును అని భావం.

ద్రవ్యం ప్రకృతమైనప్పుడు (ద్రవ్యాన్ని గూర్చి చర్చిస్తున్నప్పుడు) గుణాన్ని ఉదాహరించడం యుక్తం కాదు అన్నట్లయితే అది (అలా అనడం) యుక్తం కాదు.

వి. బ్రహ్మ ద్రవ్యం. చేతనమైన బ్రహ్మ అచేతనమైన (ద్రవ్యమైన) జగత్తుకు కారణం కావచ్చునా కాకూడదా అని విచారిస్తున్నప్పుడు కారణంగా ఉన్న గుణాన్ని ఉదాహరించకూడదు: ద్రవ్యాన్నే ఉదాహరించాలి అని ఆక్షేపం చేసినవాని అభిప్రాయం.

దృష్టాన్తేనేతి:- కారణం విలక్షణమైన కార్యాన్ని ఆరంభిస్తుంది అనే విషయం చెప్పడంకోసం మాత్రమే దృష్టాంతం చూపబడింది. ద్రవ్యానికి ద్రవ్యాన్నే దృష్టాంతంగా చూపాలి. గుణానికి గుణాన్నే దృష్టాంతంగా చూపాలి అనే నియమానికి హేతు వేమీ లేదు. మీ సూత్రకారుడు కూడ- "ప్రత్యక్షా... విద్యతే" అనే సూత్రంలో ద్రవ్యానికి గుణాన్ని ఉదాహరణంగా చూపించాడు. "ప్రత్యక్షా ప్రత్యక్షాలైన భూమ్యాకాశాలయందు సమవాయసంబంధంతో ఉన్న సంయోగం ఏ విధంగా అప్రత్యక్షమో అదే విధంగా ప్రత్యక్షాప్రత్యక్షాలైన పంచభూతాలలో సమవాయసంబంధంతో ఉన్న శరీరం అప్రత్యక్షం కావలసి వస్తుంది. కాని శరీరం ప్రత్యక్షం కదా? అందుచేత ఇది పాంచభౌతికం కాదు" అని ఈ సూత్రానికి అర్థం. ఇక్కడ మేం చెప్పదలచిన దేమనగా- సంయోగం (భూమ్యాకాశ సంయోగం) గుణం, శరీరం ద్రవ్యం. (అయినా ద్రవ్యమైన శరీరాన్ని గూర్చి మాట్లాడుతూ మీ సూత్రకారుడు గుణాన్ని దృష్టాంతంగా చూపాడు అని అర్థం.)

వి. వైశేషికమతం ప్రకారం పృథివిమీద పుట్టి సంచరించే మానవాదుల శరీరాలు కేవలం పార్థివాలు. అంతే కాని పంచభూతాల కలయికచేత నిర్మింపబడినవి కావు. పాంచభౌతికాలు అని చెప్పిన ట్లయితే పంచభూతాల కార్యమైన ఈ శరీరం పంచభూతాలలో సమవాయసంబంధంచేత సంబంధించి ఉంటుం దని చెప్పాలి. ఈ ఐదింటిలో వాయ్వాకాశాలు రెండూ రూపరహితాలు గాన ఈ శరీరం కూడ కంటికి కనబడకూడదు. ఆకాశానికీ భూమికీ సంయోగం ఉంది. అయినా ఆ సంయోగం ప్రత్యక్షం కాదు అందుకు కారణం ఈ సంయోగం ఏ రెండింటిలో ఉందో వాటిలో ఒకటి అప్రత్యక్షం. అదే విధంగా శరీరం కూడా అప్రత్యక్షం అయి ఉండేది. అందుచేత శరీరం పాంచభౌతికం కాదు అని భావం.

దృశ్యతే ఇతి:- ఒక కారణంనుండి విలక్షణమైన కార్యం పుట్టవచ్చు ననే విషయం "దృశ్యతే తు" అనే సూత్రంలో కూడ వివరించబడింది. అయితే ఇక్కడ చెప్పిన దంతా దానిచేతనే గతార్థం అయిపోయింది కదా? అనగా ఈ విషయాన్ని అక్కడ సమర్థించి ప్రతిపాదించిన తరువాత ఇక్కడ మళ్ళీ చెప్పడం ఎందుకు అని ప్రశ్న. (సమాధానం)- కాదంటాం. అది సాంఖ్యుణ్ణి గూర్చి చెప్పబడింది, ఇది వైశేషికుణ్ణి గూర్చి చెప్పబడింది. (ప్రశ్న)- న్యాయం (రెండు చోట్లా) సమానంగానే ఉండడంచేత "ఏతేన శిష్టాపరిగ్రహా వ్యాఖ్యాతాః" అనే సూత్రంచేత ఆ న్యాయం ఇతరవిషయాలలో కూడ అతిదేశించబడింది కదా? అది నిజమే. ఆ విషయాన్నే ఇక్కడ వైశేషికుల ప్రక్రియను విమర్శించే సందర్భంలో వాళ్ల ప్రక్రియనే అనుసరించిన నిదర్శనం చూపి వివరింపబడింది. 11.

మహద్దీర్ఘాధికరణం సమాప్తం

## పరమాణుజగదకారణత్వాధికరణమ్. సూ. 12-17

### సూ. ఉభయథాపి న కర్మాతస్తదభావః. 2.2.12.

ఇదానీం పరమాణుకారణవాదం నిరాకరోతి. స చ వాద ఇత్థం సముత్తిష్ఠతి. పటాదీని హి లోకే సావయవాని ద్రవ్యాణి స్వానుగతైరేవ సంయోగసచివైః తన్త్వాదిభిర్ద్రవ్యైరారభ్యమాణాని దృష్టాని. తత్సామాన్యేన యావత్కిఞ్చిత్సావయవం తత్సర్వం స్వానుగతైరేవ సంయోగసచివైః తైస్తైర్ద్రవ్యైరారబ్ధమితి గమ్యతే. స చాయమవయవావయవివిభాగో యతో నివర్తతే సోఽయమపకర్షపర్యన్తగతః పరమాణుః; సర్వం చేదం గిరిసముద్రాదికం సావయవమ్. సావయవత్వాచ్చాద్యన్తవత్. న చాకారణేన కార్యేణ భవితవ్యమిత్యతః పరమాణవో జగతః కారణమితి కణభుగభిప్రాయః.

బాలానందిని

ఉభయథేతి:- "ఉభయథాపి=రెండు విధాలుగాను కూడ, కర్మ=కర్మ, న=పరమాణువులలోఉండదు. అతః=అందువల్ల, తదభావః= ద్వ్యణుకాద్యుత్పత్తిక్రమంచేత సృష్టియొక్క అభావం" అని సూత్రార్థం.

ఇదానీమితి:- ఇప్పుడు పరమాణుకారణవాదాన్ని నిరాకరిస్తున్నాడు. ఆ వాదం ఈ విధంగా బయలుదేరుతున్నది. అవయవాలతో కూడి ఉన్న పటం మొదలైన ద్రవ్యాలు తమతో అనుగతమైనవి (సంబంధించి కూడా ఉండేవి) సంయోగం గలవి (పరస్పరం సంయుక్త మైనవి) అయిన దారాలు మొదలైన ద్రవ్యాలచేత ఆరంభింపబడు చున్నట్లు లోకంలో చూస్తున్నాం. ఆ సామాన్యంచేత (ఆ సాదృశ్యంచేత అనగా అదే విధంగా) అవయవాలున్న ప్రతీ ద్రవ్యమూ కూడ తనతో అనుగతాలైన, సంయోగసహితాలైన ద్రవ్యాలచేత ఆరంభించబడిన దని తెలుస్తూన్నది. ఈ అవయవాయవిభావం ఎక్కడైతే నివర్తిస్తుందో (ఆగిపోతుందో) అపకర్షానికి పర్యంతమైన (చిన్నతనంలో చిట్టచివరిదైన) ద్రవ్యమే పరమాణువు. అనగా ద్రవ్యంలోని అవయవాలను విడదీసికొంటూ పోగా పోగా చివరికి విడదీయడానికి శక్యం కానిది చాలా చిన్నది అయిన ఏ అవయవం మిగులుతుందో అది పరమాణువు. పర్వతాలు, సముద్రాలు మొదలైన ఈ జగత్తంతా అవయవాలతో కూడినది. అవయవా లున్నది గాన ఆద్యంతాలు (పుట్టుక వినాశము) కలది. కారణం లేకుండా కార్యం పుట్టదు. అందుచేత పరమాణువులే జగత్తుకు కారణ మని కణాదుని అభిప్రాయం.

## భాష్యమ్

తానీమాని చత్వారి భూతాని భూమ్యుదకతేజఃపవనాఖ్యాని సావయవాన్యుపలభ్య చతుర్విధాః పరమాణవః పరికల్ప్యన్తే. తేషాం చాపకర్షపర్యన్తత్వేన పరతో విభాగాసంభవాద్వినశ్యతాం పృథివ్యాదీనాం పరమాణుపర్యన్తో విభాగో భవతి; స ప్రలయకాలః. తతః సర్గకాలే చ వాయవీయేష్వణుష్వదృష్టాపేక్షం కర్మోత్పద్యతే. తత్ కర్మ స్వాశ్రయమణు అణ్వన్తరేణ సంయునక్తి. తతో ద్వ్యణుకాదిక్రమేణ వాయురుత్పద్యతే ఏవమగ్నిరేవమాప ఏవం పృథివీ, ఏవమేవ శరీరం సేన్ద్రియమితి. ఏవం సర్వమిదం జగదణుభ్యః సంభవతి. అణుగతేభ్యశ్చ రూపాదిభ్యో ద్వ్యణుకాదిగతాని రూపాదీని సంభవన్తి తన్తుపటన్యాయేనేతి కాణాదా మన్యన్తే.

## బాలానందిని

ఈ భూమి, ఉదకం, తేజస్సు, వాయువు అనే నాలుగు భూతాలూ అవయవాలతో కూడి ఉండడం చూచి నాలుగు విధాలైన పరమాణువులు కల్పించబడతాయి. ఆ పృథివ్యాదిభూతాలు నశించే టప్పుడు చిట్టచివరి అవయవం దాకా విడిపోగా ఇంక విభాగం (విడిపోవడం) కుదరదు. పరమాణువుల స్థితి వరకే విభాగం కుదురుతుంది. అది (భూతా లన్నీ పరమాణువుల వరకూ విడిపోయిన స్థితి) ప్రలయ కాలం. తరవాత సృష్టి సమయంలో వాయుపరమాణువులలో అదృష్టంచేత (సుఖ దుఃఖాలు అనుభవించవలసి ఉన్న జీవుల అదృష్టవశంచేత) కర్మ పుడుతుంది. ఆ కర్మ ఏ అణువులో పుట్టిందో ఆ అణువును మరొక అణువుతో కలుపుతుంది. తరవాత ద్వ్యణుకాదిక్రమంచేత (రెండు అణువుల కలయికవల్ల ద్వ్యణుకం, మూడు అణువుల (లేదా ద్వ్యణుకాల) కలయికవల్ల త్ర్యణుకం, నాలుగు ద్వ్యణుకాల కలయికవల్ల చతురణుకం ఇత్యాదివిధంగా వాయువు పుడుతుంది. ఇట్లే అగ్ని, ఇట్లే ఉదకం, ఇట్లే పృథివి పుడుతుంది. ఇంద్రియాలతో కూడిన శరీరం కూడ ఈ విధంగానే పుడుతుంది. ఈ విధంగా ఈ జగత్తంతా అణువులనుండి పుడుతుంది. తంతువులలో ఉన్న రూపాదులనుండి పటంలోని రూపాదులు పుట్టి నట్లు అణువులలో (అణ్వాదులలో) ఉన్న రూపాదులనుండి ద్వ్యణుకాదులలోని రూపాదులు పుడతాయి; అని కణాదులు అనుకుంటారు (భావిస్తున్నారు).

వి. దీని వెనుకటి అధికరణం ప్రాసంగికం గాన ఈ అధికరణానికి సంగతి దానితో కాక దాని వెనుక ఉన్న అధికరణంతో చూచుకోవాలి. అచేతనమైన ప్రధానం ఈశ్వరాధిష్ఠితం కాకపోవడంచేత జగత్కారణం కాకపోయినా ఈశ్వరాధిష్ఠితాలైన అణువులు కావచ్చును కదా అని ప్రత్యుదాహరణ సంగతి. (కేవలం నిమిత్తకారణంగా ఉన్న ఈశ్వరుడు నియామకుడు కాజాలడు అని 'పత్యురసామఞ్జస్యాత్' (బ్ర.సూ.2.2.37) అనే అధికరణంలో చెప్పబోతున్నారు. అందుచేత ఈశ్వరుడు అదృష్టాది ప్రేరకుడు కావచ్చును కదా అనే ఆశంకకు అవకాశం లేదు). పరమాణువులు ద్వ్యణుకాదిక్రమం చేత జగత్సృష్టికి హేతువులు అనే వైశేషికసిద్ధాంతం విషయం. అది ప్రమాణమూలకమా లేక భ్రాంతిమూలకమా అని సంశయం. ప్రమాణమూలకం అని పూర్వపక్షం, భ్రాంతి మూలకం అని సిద్ధాంతం.

## భాష్యమ్

తత్రేదమభిధీయతే - విభాగావస్థానాం తావదణూనాం సంయోగః కర్మాపేక్షోఽభ్యుపగన్తవ్యః- కర్మవతాం తన్త్వాదీనాం సంయోగదర్శనాత్. కర్మణశ్చ కార్యత్వాన్నిమిత్తం కిమప్యభ్యుపగన్తవ్యమ్. అనభ్యుపగమే నిమిత్తాభావాన్నాణుష్వాద్యం కర్మ స్యాత్. అభ్యుపగమేఽపి యది ప్రయత్నో ఽభిఘాతాదిర్వా యథాదృష్టం కిమపి కర్మణో నిమిత్త మభ్యుపగమ్యేత తస్యాసంభవాన్నైవాణుష్వాద్యం కర్మ స్యాత్.న హి తస్యామవస్థాయామాత్మగుణః ప్రయత్నః సంభవతి, శరీరాభావాత్. శరీరప్రతిష్ఠే హి మనస్యాత్మనః సంయోగే సత్యాత్మగుణః ప్రయత్నో జాయతే. ఏతేనాభిఘాతాద్యపి దృష్టం నిమిత్తం ప్రత్యాఖ్యాతవ్యమ్. సర్గోత్తరకాలం హి తత్సర్వం నాద్యస్య కర్మణో నిమిత్తం సంభవతి.

## బాలానందిని

ఆ విషయంలో ఇది చెప్పబడుచున్నది. విడిపోయిన అవస్థతో ఉన్న అణువులు కలవా లంటే అది (సంయోగం) కర్మవల్లనే జరుగుతుంది అని అంగీకరించాలి. ఎందువల్ల ననగా తంతువులు మొదలైనవాటిలో కర్మ ఉన్నప్పుడే వాటి పరస్పరసంయోగం జరగడం చూస్తున్నాం. కర్మ కార్యం కాబట్టి దాని కొక నిమిత్త మేదైనా అంగీకరించాలి. నిమిత్తాన్ని అంగీకరించకపోతే అణువులలో ఆద్యకర్మ (మొట్ట మొదటి కర్మ అనగా కదలిక) కలగదు. అంగీకరించిన పక్షంలో కూడ, లోకంలో కనబడుతున్న విధంగా, ప్రయత్నం గాని

అఘాతాదికం (ఏదైనా వచ్చి ఢీకొనడం వంటిది) గాని కర్మకు నిమిత్తం అని అంగీకరించ వలసి ఉంటుంది. కాని అదేదీ సంభావ్యం కాదు గాన అణువులలో ఆద్యకర్మ పుట్టదు. ఎందుచేత ననగా ఆ సమయంలో (ప్రలయకాలంలో) శరీరం లేదు గాన ఆత్మ గుణమైన ప్రయత్నం సంభవం కాదు. శరీరంలో ఉన్న మనస్సుతో ఆత్మకు సంయోగం ఏర్పడినప్పుడు కదా ఆత్మగుణమైన ప్రయత్నం పుట్టడం? ఇదే రీతిలో (మనకు లోకంలో) కనబడే ప్రత్యాఘాతాదికమైన నిమిత్తాన్ని కూడ నిరాకరించాలి. అదంతా సృష్టి తరవాత జరుగుతుంది గాన అది ఆద్యకర్మకు నిమిత్తం కాజాలదు కదా?

వి. తార్కికుల మతం ప్రకారం ఆత్మ జడం. ఇది విభువు, అనగా అంతటా వ్యాపించి ఉండేది. అన్ని జీవాత్మలూ విభువులే. శరీరంలో ఉన్న మనస్సుతో సంయోగం ఏర్పడడంవల్ల ఆత్మలో చైతన్యం ఏర్పడుతుంది. దీనికి బుద్ధి-సుఖ-దుఃఖ- ఇచ్ఛా-ద్వేష-ప్రయత్న- ధర్మ-అధర్మ-సంస్కారా లనే విశేషగుణాలు ఉంటాయి. ఇవి ఆత్మలో మాత్రమే ఉంటాయి గాన ఆత్మవిశేషగుణాలు. సంఖ్య, పరిమాణం, పృథక్త్వం, సంయోగం, విభాగం అనే అయిదు సామాన్య గుణాలు ఉంటాయి. ప్రలయకాలంలో ఆత్మకు శరీరమనస్సులతో సంబంధం లేదు గాన ప్రయత్నం ఉండదు. ఈ విధంగా అణువులలో కర్మకు నిమిత్తం ఉందని అంగీకరించినా లేదని అంగీకరించినా రెండు విధాలా కూడ కుదరదు.

## భాష్యమ్

అథ అదృష్టమాద్యస్య కర్మణో నిమిత్త మిత్యుచ్యేత- తత్పునరాత్మ సమవాయి వా స్యాదణుసమవాయి వా? ఉభయథాపి నాదృష్ట నిమిత్తమణుషు కర్మావకల్పేత; అదృష్టస్యాచేతనత్వాత్. న హ్యచేతనం చేతనేనానధిష్ఠితం స్వతన్త్రం ప్రవర్తతే ప్రవర్తయతి వేతి సాంఖ్య ప్రక్రియాయామభిహితమ్. ఆత్మనశ్చానుత్పన్నచైతన్యస్య తస్యామవస్థాయామ చేతనత్వాత్. ఆత్మసమవాయిత్వాభ్యుపగమాచ్చ నాదృష్టమణుషు కర్మణో నిమిత్తం స్యాదసంబన్ధాత్. అదృష్టవతా పురుషేణాస్తి అణూనాం సంబన్ధ ఇతి చేత్- సంబన్ధసాతత్యాత్ ప్రవృత్తిసాతత్యప్రసంగో, నియామకాన్తరాభావాత్, తదేవం. నియతస్య కస్య చిత్కర్మనిమిత్తస్య అభావాన్నాణుష్వాద్యం కర్మ స్యాత్;కర్మాభావాత్తన్నిబన్ధనః సంయోగో న స్యాత్. సంయోగాభావాచ్చ తన్నిబన్ధనం ద్వ్యణుకాది కార్యజాతం న స్యాత్.

## బాలానందిని

**అథేతి**: అట్లు కాక- ఆద్యకర్మకు అదృష్టం నిమిత్తం అని అంగీకరిస్తే- అది ఆత్మసమవాయి యా (సమవాయి అనగా సమవాయసంబంధంతో రూపాదికం ఘటాది ద్రవ్యంలో ఉన్నట్లు ఉండేది అని అర్థం) లేక అణుసమవాయియా? రెండు విధాలా కూడ అణువులలో అదృష్టనిమిత్తక మైన కర్మ కుదరదు. కర్మ అచేతనం కదా? చేతనం చేత అధిష్ఠించబడని అచేతనం తాను ప్రవర్తించజాలదు. మరొకదానిని ప్రవర్తింపచేయజాలదు అని సాంఖ్యప్రక్రియలో చెప్పి ఉన్నాం. ఆ ప్రలయావస్థలో చైతన్యం ఇంకా పుట్టదు గాన ఆత్మ కూడ అచేతనమే కదా? అదృష్టం ఆత్మలో సమవాయసంబంధంతో ఉంటుంది అని అంగీకరించడంచేత, దానికీ అణువులకీ సంబంధం లేదు గాన, ఆ అదృష్టం అణువులలో కలిగే కర్మకు నిమిత్తం కాజాలదు. అణువులకు అదృష్టంతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా అదృష్టవంతుడైన పురుషునితో సంబంధం ఉంది అని అంటే- ఆ సంబంధం ఎల్లప్పుడూ ఉండడంచేత ప్రవృత్తికూడ నిరంతరం జరుగుతుం దని చెప్పవలసి వస్తుంది. నియామక మైనది మరొకటి ఏదీ లేదు కదా? (అదృష్టం తప్ప మరొక టేదీ కర్మను (అణువులలో జరిగే పనిని) నియమించేది లేదు కదా అని అర్థం). ఈ విధంగా నియతమైన (నిశ్చితమైన) కర్మనిమిత్తం ఏదీ లేకపోవడంచేత అణువులలో ఆద్యకర్మ కలగదు; కర్మ లేకపోతే దానివల్ల కలగవలసిన సంయోగం కలగదు; సంయోగం లేకపోతే దానివల్ల ఏర్పడే ద్వ్యణుకాదికార్యసముదాయం కూడ పుట్టదు.

## భాష్యమ్

సంయోగశ్చాణోరణ్వన్తరేణ సర్వాత్మనా వా స్యాదేకదేశేన వా? సర్వాత్మనా చేదుపచయానుపపత్తేః అణుమాత్రత్వప్రసంగః, దృష్టవిపర్యయ ప్రసంగశ్చ. ప్రదేశవతో ద్రవ్యస్య ప్రదేశవతా ద్రవ్యాన్తరేణ సంయోగస్య దృష్టత్వాత్. ఏకదేశేన చేత్సావయవత్వప్రసంగః. పరమాణూనాం కల్పితాః ప్రదేశాః స్యురితి చేత్- కల్పితానామవస్తుత్వాత్ అవస్త్వేవ సంయోగ ఇతి వస్తునః కార్యస్య అసమవాయికారణం న స్యాత్. అసతి చాసమవాయికారణే ద్వ్యణుకాదికార్యద్రవ్యం నోత్పద్యేత. యథా చాదిసర్గే నిమిత్తాభావాత్ సంయోగోత్పత్త్యర్థం కర్మ నాణూనాం సంభవత్యేవం మహాప్రలయే ఽపి విభాగోత్పత్త్యర్థం కర్మ నైవాణూనాం సంభవేత్. న హి తత్రాపి కించిన్నియతం తన్నిమిత్తం దృష్టమస్తి. అదృష్టమపి భోగప్రసిద్ధ్యర్థం విభాగోత్పత్త్యర్థం వా

కర్మ. అతశ్చ సంయోగవిభాగాభావాత్తదాయత్తయోః సర్గప్రలయయోరభావః ప్రసజ్యేత. తస్మాదనుపపన్నోఽయం పరమాణుకారణవాదః.

బాలానందిని

అవ. సూత్రంలోని 'ఉభయథాపి' అనేదానికి రెండు విధాలా కూడ అని అర్థం. దీనికి భాష్యంలో (1) పరమాణువులలో జరగవలసిన కర్మకు నిమిత్తం ఉందని అంగీకరించినా అంగీకరించకపోయినా (2) కర్మ నిమిత్తమైన అదృష్టం ఆత్మసమవాయియైనా అణుసమవాయియైనా, అని రెండు విధాల అర్థం చెప్పి అణుజగత్కారణత్వవాదం కుదర దని నిరూపించబడింది. సంయోగానికి గాని విభాగానికి గాని ఆవశ్యకమైన కర్మ లేదు గాన రెండు విధాలా కూడ అని మూడవ అర్థం చెప్పబడుతున్నది. అప్పుడు 'తదభావః' అనగా సర్గప్రలయాల అభావం అని అర్థం.

సంయోగశ్చేతి:- అణువు మరొక అణువుతో సర్వాత్మనా (పూర్తిగా దానిలో ఇమిడిపోయేటట్లు) సంయోగం పొందుతుందా లేక దాని ఒక భాగంతో సంయోగం పొందుతుందా? పూర్తిగా సంయోగం పొందుతుంది అని చెపితే ఉపచయం (పరిమాణంలో వృద్ధి) ఉండదు గాన రెండు అణువులూ కలిసినా కూడ ఒక్క అణువే అవుతాయి; ఇలాంటి సంయోగం లోకంలో కనబడేదానికి విరుద్ధంగా కూడ ఉంటుంది. ఎందువల్ల ననగా (వేరు వేరు) ప్రదేశాలు (భాగాలు) ఉన్న ఒక ద్రవ్యం ప్రదేశా లున్న మరొక ద్రవ్యంతో సంయోగం పొందడమే (లోకంలో) కనబడుతుంది. రెండవ అణువుయొక్క ఒక భాగంతో కలుస్తుంది అన్నట్లయితే అణువులలో అవయవాలు ఉన్నట్లు అంగీకరించిన ట్లవుతుంది. పరమాణువులకు (వాస్తవంగా లేకపోయినా) కల్పితాలైన ప్రదేశాలు ఉంటాయి అన్నట్లయితే కల్పితమైనవి యథార్థ మైనవి కావు గాన సంయోగం కూడ అయథార్థమే అవుతుంది. అలాంటి అయథార్థమైన సంయోగం యథార్థమైన కార్యానికి అసమవాయికారణం కాజాలదు. అసమవాయికారణం లేకపోతే ద్వ్యణుకాదికార్యం పుట్టదు. ఆదిసృష్టిలో (పరమాణువుల మధ్య) సంయోగం పుట్టడానికి అణువులలో కర్మ ఏ విధంగా సంభవం కాదో అట్లే మహాప్రలయంలో కూడ విభాగం పుట్టడంకోసం అణువులలో కర్మ సంభవించదు. అక్కడ కూడ నియతమైన నిమిత్తం ఏదీ కనబడడం లేదు కదా? (అదృష్టం నిమిత్తం అని చెప్పడానికి కూడ వీలు లేదు), అదృష్టం భోగం సిద్ధించడానికి ఉపయోగిస్తుంది కాని ప్రలయం రావడానికి ఉపయోగించదు. ఈ విధంగా నిమిత్తం ఏదీ లేకపోవడంచేత అణువులలో సంయోగం పుట్టడానికి గాని, విభాగం పుట్టడానికి గాని కర్మ ఉండదు. అందువల్ల సంయోగవిభాగాలు రెండూ కూడ ఉండవు గాన వాటిమీద ఆధారపడిన సృష్టిప్రలయాలు కూడ లేకుండా పోతాయి. అందువల్ల ఈ పరమాణుకారణవాదం అనుపపన్న మైనది (కుదరనిది).

వి. తార్కికులు సమవాయికారణం, అసమవాయి కారణం, నిమిత్త కారణం అని మూడు కారణాలను అంగీకరిస్తారు. కార్యం దేనినుంచి విడదీయరానిదిగా

ఉంటుందో అది సమవాయికారణం. ఉదా: బట్టకు దారాలు సమవాయికారణం. దీనినే వేదాంతులు మొదలైనవాళ్లు ఉపాదానకారణం అనీ, ప్రకృతి అనీ అంటారు. దారాల సంయోగం బట్టకి అసమవాయికారణం. సాలెవాడు, మగ్గం మొదలైనవి నిమిత్తకారణం. దారాల సంయోగానికి ఇవి ఉపకరిస్తాయి. వీటివల్లనే సంయోగం ఏర్పడుతుంది. ద్వ్యణుకాదులకు అణ్వాదులు సమవాయికారణం, అణ్వాదుల సంయోగం అసమవాయికారణం. ఇంక వివాదం అంతా నిమిత్త కారణాన్ని గూర్చి. 12.

### సూ. సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితే : 2.2.13.

సమవాయాభ్యుపగమాచ్చ తదభావ ఇతి ప్రకృతేన అణువాద నిరాకరణేన సంబధ్యతే. ద్వాభ్యాం చాణుభ్యాం ద్వ్యణుకముత్పద్య మానమత్యన్తభిన్నమణుభ్యామణ్వోః సమవైతీత్యభ్యుప గమ్యతే భవతా. న చైవమభ్యుపగచ్ఛతా శక్యతేఽ ణుకారణతా సమర్థయితుమ్. కుతః సామ్యాదనవస్థితేః. యథైవ హ్యణుభ్యామత్యన్తభిన్నం సద్ద్వ్యణుకం సమవాయలక్షణేన సంబన్ధేన తాభ్యాం సంబధ్యతే, ఏవం సమవాయోఽపి సమవాయిభ్యోఽత్యన్తభిన్నః సన్సమవాయలక్షణేనాన్యేనైవ సంబన్ధేన సమవాయిభిః సంబధ్యేత, అత్యన్తభేదసామ్యాత్. తతశ్చ తస్య తస్యాన్యోఽన్యః సంబన్ధః కల్పయితవ్య ఇత్యనవస్థైవ ప్రసజ్యేత. నన్విహప్రత్యయగ్రాహ్యః సమవాయః నిత్యసంబద్ధ ఏవ సమవాయిభిర్గృహ్యతే, నాసంబద్ధః సంబన్ధాన్తరాపేక్షో వా. తతశ్చ న తస్యాన్యః సంబన్ధః కల్పయితవ్యః యేనానవస్థాప్రసజ్యేతేతి. నేత్యుచ్యతే. సంయోగోఽప్యేవం సతి సంయోగిభిర్నిత్యసంబద్ధ ఏవేతి సమవవాయవన్నాన్యం సంబన్ధమపేక్షేత. అథార్థాన్తరత్వాత్సంయోగః సంబన్ధాన్తరమపేక్షతే, సమవాయోఽపి తర్హి అర్థాన్తరత్వాత్సంబన్ధాన్తరమపేక్షేత. న చ గుణత్వాత్సంయోగః సంబన్ధాన్తరమపేక్షతే న సమవాయో గుణత్వాదితి యుజ్యతే వక్తుమ్; అపేక్షాకారణస్య తుల్యత్వాత్. గుణపరిభాషా యాశ్చాతన్త్రత్వాత్. తస్మాదర్థాన్తరం సమవాయమభ్యుపగచ్ఛతః ప్రసజ్యేతైవానవస్థా. ప్రసజ్యమానాయాం చానవస్థాయామేకాసిద్ధౌ సర్వాసిద్ధేర్ద్వాభ్యామణుభ్యాం ద్వ్యణుకం నైవోత్పద్యేత. తస్మాదప్యనుపపన్నః పరమాణుకారణవాదః.13.

## బాలానందిని

సమవాయేతి:- ''సమవాయాభ్యుపగమాచ్చ= సమవాయసంబంధాన్ని అంగీకరించడం వల్ల, సామ్యాత్=ద్వ్యణుక సమవాయాలు పరమాణువులకంటె వేరవడంలో సామ్యం ఉండడంవల్ల (రెండూ అణువులకంటె భిన్నములై ఉండడంలో భేదం ఏదీ లేకపోవడం వల్ల), అనవస్థితేః=అనవస్థాదోషంవల్ల, పరమాణుకారణవాదం అయుక్తం'' అని సూత్రార్థం.

సమవాయేతి:- "సమవాయాభ్యుపగమాచ్చ" అనేది "తదభావః" అనే ప్రకృతమైన అణువాదనిరాకరణంతో సంబంధిస్తుంది. (సమవాయాన్ని అంగీకరించడంవల్ల కూడ అణుకారణవాదం కుదరదు అని అర్థం). రెండు అణువులనుండి పుట్టిన ద్వ్యణుకం అణువులకంటె పూర్తిగా భిన్నమైనది. అది అణువులలో సమవాయసంబంధంతో ఉంటుంది అని నువ్వు అంగీకరిస్తున్నావు. ఇలా అంగీకరిస్తూన్న నువ్వు అణుకారణత్వాన్ని సమర్థించజాలవు. ఎందువల్ల? సామ్యంవల్ల, అనవస్థాదోషంవల్ల. అణువులకంటె పూర్తిగా భిన్నమైన ద్వ్యణుకం ఏ విధంగా అణువులతో సమవాయం అనే సంబంధంచేత సంబధిస్తుందో అదే విధంగా సమవాయులకంటె (ఇక్కడ అణు-ద్వ్యణుకాలు) అత్యంతభిన్నమైన సమవాయం కూడ, సమవాయం అనే మరొక సంబంధంచేతనే సమవాయులతో సంబంధించాలి. భేదం అనేది రెండు స్థలాలలోను సమానమే కదా. (ద్వ్యణుకానికీ అణువులకీ భేదం ఉండడంచేత ద్వ్యణుకం సమవాయసంబంధాన్ని పురస్కరించుకొని అణువులలో ఉంటూన్నది. అదే విధంగా సమవాయం కూడా అణు ద్వ్యణుకాలకంటె భిన్నమైనదే గాన వాటితో అది సంబంధించి ఉండా లంటే మరొక సమవాయసంబంధం అంగీకరించాలి అని భావం). అది ( ఆరెండవ సమవాయసంబంధం) కూడ ప్రథవసమవాయద్వ్యణుకాదులతో సంబంధించాలంటే మూడవ సమవాయ సంబంధం అంగీకరించాలి. ఈ విధంగా సమవాయం తరవాత సమవాయం అంగీకరిస్తూనే పోవాలి. అందుచేత అనవస్థాదోషం ఏర్పడుతుంది. (ప్రశ్న) (''ఇహ తన్తుషు పటో వర్తతే'' ఈ తంతువులలో వస్త్రం ఉంది'' అనే) ఇహప్రత్యయంచేత (ఇహ ఇత్యాదిజ్ఞానంచేత) సమవాయం అనేది సమవాయులతో (తంతుపటాదులతో) నిత్యమూ సంబంధించనదిగా గ్రహింపబడుతున్నది. వాటితో సంబంధించినదిగా కాని, మరొక సంబంధంయొక్క అపేక్ష ఉన్నదిగా గాని గ్రహించబడడంలేదు. అందువల్ల దానికి మరొక సంబంధం కల్పించవలసిన అవసరం లేదు; అందుచేత అనవస్థాదోషం కూడ లేదు అన్నట్లయితే (సమాధానం) ఇది యుక్తం కాదు అని అంటాం.

వి. "ఈ తంతువులలో పటం ఉంది" అన్నప్పుడు పటానికీ తంతువులకీ సంబంధం ఉన్నట్లు ప్రత్యక్షంగా తెలుస్తూన్నది. అది విడదీయరాని సంబంధం. అందుచేత పటతంతువులలో విడదీయరాని, సమవాయసంబంధం అనే, సంబంధం ఉన్నట్లు, దానికి మరొక ఏ సంబంధంయొక్క అపేక్ష లేనట్లు స్పష్టంగా తెలుస్తూన్నది. అందుచేత ఆ సమవాయసంబంధం ఏ సంబంధంచేత ఉంటుంది అనే ప్రశ్న ఉదయించదు; అనవస్థాదోషం కూడ లేదు అని పూర్వపక్షి అభిప్రాయం.

సంయోగ ఇతి:- (అట్లైతే) సంయోగం కూడ సంయోగులతో నిత్యసంబద్ధమే గాన సమవాయం వలెనే ఇది కూడ మరొక సంబంధాన్ని అపేక్షించకూడదు. అది కాదు; సంయోగం మరొక పదార్థం గాన అది మరొకదానితో సంబంధించాలంటే మరొక సంబంధాన్ని అపేక్షిస్తుంది అని అంటే, అలాంటప్పుడు సమవాయం కూడ మరొక పదార్థమే గాన దానికి కూడ మరొక సంబంధంయొక్క అపేక్ష ఉంటుం దని చెప్పాలి.

వి. ఒక వస్తువు మరొక వస్తువుతో కలిసి ఉంటుంది అంటే దానికీ దీనికీ ఏదో సంబంధం ఉందని అర్థం. కార్యమైన పటం కారణమైన తంతువులలో ఉంటుంది. వాటి సంబంధం విడదీయరాని సమవాయసంబంధం, ఈ సమవాయసంబంధం పటతంతువులు రెండింటిలోనూ ఉంటుంది. ఒక తంతువును మరొక తంతువుతో కలిపి నప్పుడు ఆ సంబంధం సంయోగసంబంధం. అది విడదీయడానికి వీలైన సంబంధం. ఇది కూడ రెండు తంతువులలోను ఉంటుంది. అనగా సంయోగసంబంధానికీ, తంతుద్వయానికీ ఏదో సంబంధం ఉందన్నమాట. ఆ సంబంధం ఏమిటి అనగా సమవాయసంబంధం అని తార్కికులు చెపుతారు. అనగా సంయోగసంబంధం రెండు తంతువులలో సమవాయసంబంధంచేత ఉంది అని అర్థం. సంయోగం తంత్వాదులతో సంబంధించడానికి సమవాయసంబంధం అనే మరొక సంబంధం అంగీకరించిట్లే సమవాయం ద్వ్యణుకపరమాణ్వాదులతో సంబంధించడానికి మరొక సంబంధం అవసరం లేదని ఎలా చెపుతావు అనేది సిద్ధాంతి తార్కికుణ్ణి అడిగే ప్రశ్న.

న చేతి:- సంయోగం గుణం కాబట్టి మరొక సంబంధాన్ని అపేక్షిస్తుంది. సమవాయం గుణం కాదు గాన దానికి మరొక సంబంధంయొక్క అపేక్ష లేదు అని చెప్పడం కూడ యుక్తం కాదు. అపేక్షాకారణం సమానమే కదా? (అనగా ఒక పదార్థం మరొక పదార్థంతో సంబధిస్తే ఆ రెండింటినీ కలిపే సంబంధం ఒకటి ఉందని అంగీకరించాలి. ఇదే అపేక్షాకారణం. ఈ అపేక్షాకారణం సంయోగసమవాయాలు రెండింటిలోనూ సమానంగానే ఉన్నప్పుడు సంయోగం గుణం కాబట్టి సంబంధాంతరాన్ని అపేక్షిస్తుంది, సమవాయం గుణం కాదు గాన అపేక్షించదు అని చెప్పడంలో అర్థం లేదు అని భావం)

గుణేతి. గుణపరిభాష కార్యనిర్వాహకం కాదు కదా?

వి. ఇంతకీ సంయోగం గుణం అనేది మీరు ఏర్పరచుకొన్న పరిభాషయే గాని దానిని అందరూ అంగీకరించవలసిన పని లేదు. ఆ పేరు పెట్టినంతమాత్రాన క్రొత్త నియమం ఏర్పడదు అని భావం.

తస్మాదితి:- అందువల్ల సమవాయం వేరైన పదార్థం అని అంగీకరించే పక్షంలో అనవస్థాదోషం తప్పక ప్రసక్తం అవుతుంది. ఈ విధంగా అనవస్థ ప్రసక్త మైనప్పుడు సమవాయం అనేదే సిద్ధించదు. ఒకటి సిద్ధించకపోతే దానిపై ఆధారపడిన మిగిలిన వన్నీ సిద్ధించవు గాన రెండు అణువులనుండి ద్వ్యణుకం పుట్టదు. అందువల్ల కూడ పరమాణుకారణవాదం కుదరదు. 13.

## సూ. నిత్యమేవ చ భావాత్. 2.2-14

అపి చాణవః ప్రవృత్తిస్వభావా వా నివృత్తిస్వభావా వా, ఉభయ స్వభావా వా అనుభయస్వభావా వాభ్యుపగమ్యేరన్, గత్యన్తరాభావాత్. చతుర్ధాపి ఽనోపపద్యతే. ప్రవృత్తిస్వభావత్వే నిత్యమేవ ప్రవృత్తేర్భావాత్ ప్రలయాభావప్రసంగః. నివృత్తిస్వభావత్వేఽపి నిత్యమేవ నివృత్తేర్భావాత్ సర్గాభావప్రసంగః. ఉభయస్వభావత్వం చ విరోధాదసమఞ్జసమ్. అనుభయస్వభావత్వే తు నిమిత్తవశాత్ ప్రవృత్తినివృత్త్యోరభ్యుపగమ్యమాన యోరదృష్టాదేర్నిమిత్తస్య నిత్యసన్నిధానాత్ నిత్యప్రవృత్తిప్రసంగాత్. అతన్త్రత్వేఽప్యదృష్టాదేర్నిత్యాప్రవృత్తిప్రసంగాత్. తస్మాదప్యనుపపన్నః పరమాణుకారణవాదః.14.

### బాలానందిని

నిత్యమేవేతి:- "నిత్యమేవ=నిత్యంగా, భావాత్ చ=అణువులలో ప్రవృత్తి గాని నివృత్తి గాని ఉండడంవల్ల కూడ, అణుకారణవాదం యుక్తం కాదు" అని సూత్రార్థం.

అపిచేతి:- అణువులు ప్రవృత్తిస్వభావములని గాని (ఎల్లప్పుడూ సృష్టిని చేసే ప్రవృత్తిలో ఉండేవి అని గాని), నివృత్తి స్వభావములని గాని (సృష్టినుండి నివర్తించి విడిపోయి ప్రలయం కలిగించే స్వభావం గల వని గాని) ఉభయస్వభావము లని గాని, రెండు స్వభావాలూ లేనివని గాని అంగీకరించవలసి ఉంటుంది. మరొక మార్గం ఏదీ లేదు. ఈ నాలుగు విధా లైన వికల్పాలూ కూడ కుదరవు. అణువులు ప్రవృత్తి

స్వభావా లైతే ఆ ప్రవృత్తి ఎల్లప్పుడూ ఉంటూంది గాన ప్రలయం లేకుండా పోతుంది. నివృత్తిస్వభావా లైతే నిత్యమూ నివృత్తియే ఉంటుంది గాన సృష్టియే ఉండదు. విరుద్ధం అవడంచేత ఉభయస్వభావత్వం సమంజసం కాదు. అనుభయస్వభావములు అన్నట్లయితే ప్రవృత్తి గాని నివృత్తి గాని ఏదో ఒక నిమిత్తంచేత కలుగుతుంది అని అంగీకరించాలి గాన అప్పుడు నిమిత్త మైన అదృష్టాదికం నిత్యమూ సంనిహితమై ఉండడంచేత ప్రవృత్తి నిత్యమూ జరుగుతూ ఉండవలసివస్తుంది. అదృష్టాధికం నిమిత్తం అని అంగీకరించని పక్షంలో నిత్యమూ అప్రవృత్తియే ఉంటుంది. అందువల్ల కూడ పరమాణుకారణవాదం అనుపపన్న మైనది. 14.

## సూ. రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్. 2.2.15

సావయవానాం ద్రవ్యాణామవయవశో విభజ్యమానానాం యతః పరో విభాగో న సంభవతి తే చతుర్విధా రూపాదిమన్తః పరమాణవశ్చతుర్విధస్య రూపాదిమతో భూతభౌతికస్య ఆరమ్భకా నిత్యాశ్చేతి వైశేషికా అభ్యుపగచ్ఛన్తి. స తేషామభ్యుపగమో నిరాలమ్బన ఏవ; యతో రూపాదిమత్త్వాత్పరమాణూ నామణుత్వనిత్యత్వవిపర్యయః ప్రసజ్యేత. పరమకారణాపేక్షయా స్థూల త్వమనిత్యత్వం చ తేషామభిప్రేతవిపరీతమాపద్యేతేత్యర్థః. కుతః? ఏవం లోకే దృష్టత్వాత్. యద్ధి లోకే రూపాదిమద్వస్తు తత్స్వకారణాపేక్షయా స్థూలమనిత్యం చ దృష్టమ్; తద్యథా పటస్తన్తూనపేక్ష్య స్థూలోఽ నిత్యశ్చ భవతి; తన్తవశ్చాంశూనపేక్ష్య స్థూలా అనిత్యాశ్చ భవన్తి; తథాచామీ పరమాణవో రూపాదిమన్తస్తైరభ్యుపగమ్యన్తే. తస్మాత్తేఽపి కారణవన్తః, తదపేక్షయా స్థూలా అనిత్యాశ్చ ప్రాప్నువన్తి.

### బాలానందిని

రూపాదీతి:- "రూపాదిమత్త్వాత్= (పరమాణువులు) రూపాదులు కల వవడంవల్ల, విపర్యయః= వాటి అణుత్వనిత్యత్వాలకు విపర్యయం (విరుద్ధమైన ధర్మం) ఏర్పడుతుంది. దర్శనాత్=లోకంలో ఆ విధంగా కనబడడంవల్ల" అని సూత్రార్థం.

సావయవానామితి:- అవయవా లున్న ద్రవ్యాలను ఏ అవయవానికి ఆ అవయవం విడగొట్టగా చివరికి విడగొట్టడానికి వీలు కాకుండా ఏవి మిగులుతాయో అలాంటి, రూపాదులు గల, పరమాణువులు రూపాదులున్న భూతాలకీ (పంచభూతాలకీ)

భౌతికాలకీ (పంచహాభూతాలవల్ల పుట్టేవాటికీ) ఆరంభకాలు (వాటిని పుట్టించేవి) నిత్యములు కూడ అని వైశేషుకుల అభ్యుపగమం (అంగీకారం) ఆధారరహిత మైనది. ఎందువల్ల ననగా అణువులకు రూపాదు లుండడంవల్ల అణుత్వానికీ, నిత్యత్వానికీ విరుద్ధ మైన స్థితి (అనగా అనణుత్వ-అనిత్యత్వాలు) ప్రసక్తం అవుతుంది. వాళ్లు అంగీకరించిన దానికి విరుద్ధంగా ఏదో పరమకారణం ఉందనీ, దానికంటె ఇవి స్థూలము లనీ అనిత్యా లనీ చెప్పవలసి వస్తుంది. ఎందువల్ల? లోకంలో ఈ విధంగా కనబడడంవల్ల. లోకంలో రూపాదులున్న వస్తువు తన కారణంకంటె స్థూలంగాను, అనిత్య మైనదిగాను ఉన్నట్లు కనబడుతున్నది. అందుచేత తంతువుల అపేక్ష చేత=(దృష్ట్యా) పటం ఏవిధంగా స్థూలమో, అనిత్యమో, తంతువులు కూడ అంశువుల (ఏసుల) అపేక్షచేత ఏ విధంగా స్థూలాలు గాను, అనిత్యాలు గాను ఉంటాయో అట్లే, ఈ పరమాణువులు వాళ్లచేత రూపాదులు కలవిగా అంగీకరించబడుతున్నాయి గాన, అవి కూడ కారణం కలవై (తమకంటె సూక్ష్మమైన ఏదో కారణం ఉన్నవై) దాని అపేక్షచేత స్థూలమైనవి, అనిత్య మైనవి అని ప్రాప్తిస్తాయి (చెప్పవలసి ఉంటాయి).

## భాష్యమ్

యచ్చ నిత్యత్వే కారణం తైరుక్తమ్- "సదకారణవన్నిత్యమ్" (వై.సూ. 4.1.1) ఇతి తదప్యేవం సతి అణుషు న సంభవతి. ఉక్తేన ప్రకారేణ అణూనామపి కారణవత్త్వోపపత్తేః యదపి నిత్యత్వే ద్వితీయం కారణముక్తమ్- "అనిత్యమితి చ విశేషతః ప్రతిషేధాభావః" (వై.సూ.4.1.4) ఇతి తదపి నావశ్యం పరమాణూనాం నిత్యత్వం సాధయతి. అసతి హి యస్మిన్ కస్మింశ్చిన్నిత్యే వస్తుని నిత్యశబ్దేన నఞః సమాసో నోపపద్యతే; న పునః పరమాణు నిత్యత్వమేవాపేక్షతే. తచ్చాస్త్యేవ నిత్యం పరమకారణం బ్రహ్మ. న చ శబ్దార్థవ్యవహారామాత్రేణ కస్య చిదర్థస్య ప్రసిద్ధిర్భవతి. ప్రమాణాన్తరసిద్ధయోః శబ్దార్థయోర్వ్యవహారావతారాత్. యదపి నిత్యత్వే తృతీయం కారణముక్తమ్ "అవిద్యా చ" (వై.సూ.4.1.5) ఇతి, తద్యద్యేవం వివ్రియేత-సతాం పరి దృశ్యమానకార్యాణాం కారణానాం ప్రత్యక్షేణాగ్రహణమ్ అవిద్యా-ఇతి తతో ద్వ్యణుకనిత్యతాప్యాపద్యేత. అథాద్రవ్యత్వే సతీతి విశేష్యేత తథాప్య కారణవత్త్వమేవ నిత్యతానిమిత్తమాపద్యేత. తస్య చ ప్రాగేవోక్తత్వాత్ "అవిద్యా చ" ఇతి పునరుక్తం స్యాత్. అథాపి కారణవిభాగాత్కారణ వినాశాచ్చాన్యస్య

తృతీయస్య వినాశహేతోరసంభవోఽవిద్యా, సా పరమాణూనాం నిత్యత్వం ఖ్యాపయతీతి వ్యాఖ్యాయేత, నావశ్యం వినశ్యద్వస్తు ద్వాభ్యామేవ హేతుభ్యాం వినష్టుమర్హతీతి నియమోఽస్తి. సంయోగసచివే హ్యనేకస్మింశ్చ ద్రవ్యే ద్రవ్యాన్తరస్యారమ్భకేఽ భ్యుపగమ్యమాన ఏతదేవం స్యాత్-యదా త్వపాస్తవిశేషం, సామాన్యాత్మకం కారణం విశేషవదవస్థాన్తర మాపద్యమాన మారమ్భకమభ్యుపగమ్యతే తదా ఘృతకాఠిన్యవిలయనవన్మూర్త్యవ స్థావిలయనేనాపి వినాశ ఉపపద్యతే. తస్మాద్రూపాదిమత్త్వాత్ స్యాదభిప్రేతవి పర్యయః పరమాణూనామ్, తస్మాదప్యనుపపన్నః పరమాణుకారణవాదః 15.

బాలానందిని

యచ్చేతి:- ఇది ఇలా ఉన్నప్పుడు పరమాణువులు నిత్యము లని చెప్పడానికి హేతువుగా వాళ్లచేత "సదకారణవన్నిత్యమ్" అని ఏది చెప్పబడిందో అది కూడ అణువుల విషయంలో వర్తించదు. పైన చెప్పిన విధంగా అణువులకు కూడ కారణం ఉందని చెప్పవలసి ఉంటుంది కదా?

వి. ఏది సత్ (భావపదార్థం) అయి ఉండి కారణం ఏదీ లేనిదిగా ఉంటుందో అది నిత్యం అని ఈ సూత్రానికి అర్థం. పరమాణువు సత్పదార్థం. దీనికి కారణం ఏదీ కనబడడంలేదు. అందుచేత ఇది నిత్యం అని అభిప్రాయం. పైన చెప్పిన యుక్తుల ననుసరించి పరమాణువునకు కూడ కారణం ఉంటుం దని ప్రతిపాదించబడింది గాన అది అకారణం కాదు, అందుచేత నిత్యమూ కాదు అని భావం.

యదపీతి:- "అనిత్యమితి... అభావః" అని నిత్యత్వానికి మీవాళ్లు చెప్పిన రెండవ కారణం కూడ తప్పక పరమాణువులే నిత్యా లని సాధించదు.

వి. అనిత్యం అనగా నిత్యం కానిది అని అర్థం. అసలు నిత్యమైనది ఒకటి ఉంటేనే అనిత్యం అని వ్యవహారం కుదురుతుంది. అందుచేత కార్యా లన్నీ అనిత్యా లన్నప్పుడు కారణం అయిన అణువు నిత్యం అని సిద్ధిస్తుంది. "నిత్యవస్తువు ఒకటి లేకపోతే అనిత్యం అని విశేషమైన నిత్యత్వంయొక్క ప్రతిషేధం కుదరదు" అని సూత్రానికి అర్థం. శంకరమిశ్రకృతోపస్కరసహితవైశేషికసూత్రంలో "ప్రతిషేధభావః" అని ఉంది. దానికి శంకరమిశ్రుడు రెండువిధాల వ్యాఖ్యానించాడు. అది అక్కడే చూచుకొనవలెను. అయితే ప్రధానమైన భావం మాత్రం ఒక్కటే.

అసతి హీతి:- ఏదో ఒక నిత్యవస్తువు లేకపోతే నిత్యశబ్దంతో నఞ్ కు సమాసం కుదరదు. తావన్మాత్రంచేత పరమాణువు నిత్యం అని అంగీకరిస్తేనే ఈ సమాసం కుదురుతుంది అని చెప్పడానికి వీలు లేదు. అలాంటి నిత్యమైన పరమకారణం బ్రహ్మ ఉండనే ఉంది కదా? మరొక విషయ మేమనగా శబ్దార్థాలవ్యవహారం మాత్రం చేత ఏదైన ఒక వస్తువును సాధించడం కుదరదు. మరొక ప్రమాణంచేత సిద్ధించిన శబ్దార్థాలే వ్యవహారంలో ఉంటాయి. (అనగా ఇతర ప్రమాణాలచేత నిత్యమైన వస్తువు ఉంది అని తెలిసిన తరవాత- నిత్య మనీ, అనిత్య మనీ శబ్దార్థ వ్యవహారాలు ఉంటాయి. అంతే కాని శబ్దార్థవ్యవహారమాత్రంచేత ఇది నిత్యం ఇది అనిత్యం అని చెప్పకూడదు అని భావం). పరమాణువుల నిత్యత్వాన్ని సాధించడానికి మూడవ కారణం "అవిద్యా చ" అని చెప్పబడింది. సత్తులైన (అనగా భావపదార్థాలైన) చూడబడుచున్న కార్యాలు గల కారణాలను ప్రత్యక్షంగా చూడకపోవడం 'అవిద్య' (అనగా కార్యాలను పుట్టించిన కారణాలు ప్రత్యక్షంగా కనబడకపోవడం అని అర్థం) అన్నట్లయితే అప్పుడు ద్వ్యణుకాలు కూడ నిత్యాలు కావలసి వస్తుంది. (ద్వ్యణుకాలు త్ర్యణుకాదికార్యాలను పుట్టిస్తున్నాయి; వాటి కారణాలైన అణువులు ప్రత్యక్షంగా కనబడవు. అందుచేత అవి కూడ నిత్యా లని చెప్పవలసి వస్తుంది). ఈ దోషం తగలకుండా ఉండడానికి 'అద్రవ్యత్వే సతి" అని విశేషణం ఉపయోగిస్తే అప్పుడు కారణం ఏదీ లేకపోవడమే అవిద్య, అది నిత్యత్వానికి కారణం అని అర్థం వస్తుంది. ఆ విషయం ముందుగానే చెప్పబడింది గాన పునరుక్తిదోషం తగులుతుంది.

వి. కారణం కనబడకపోవడం అవిద్య అని చెపితే ద్వ్యణుకాల కారణ మైన అణువులు కూడ ప్రత్యక్షంగా కనబడవు గాన ఆ ద్వ్యణుకాలు కూడ నిత్యం కావలసి వస్తుంది అనే దోషాన్ని పరిహరించడంకోసం అద్రవ్యత్వే సతి అని విశేషణం చేరుస్తాం. అప్పుడు కార్యాలున్న కారణం ప్రత్యక్షంగా కనబడకపోవడం అని మాత్రమే కాకుండా ఆ కారణానికి ఆరంభక మైన ద్రవ్యం ఏదీ ఉండకూడదు అని అర్థం అవుతుంది. అప్పుడు ద్వ్యణుకం విషయంలో వ్యభిచారం రాదు. దానికి ఆరంభమైన అణువు లున్నాయి కదా? అందుచేత అది అనిత్యమే అవుతుంది అని పూర్వపక్షి అభిప్రాయం. దీనిని పట్టి కారణం ఏదీ లేకపోవడం ఒక వస్తువుయొక్క నిత్యత్వానికి కారణం అని అర్థం అవుతుంది. ఆ విషయం "సదకారణవన్నిత్యమ్" అనే సూత్రంలోనే చెప్పబడింది గాన పౌనరుక్త్యదోషం అని అర్థం.

అథాపీతి:- అది కాదు- కారణవిభాగం (కారణం విడిపోవడం) కారణనాశం (కారణం నశించిపోవడం) ఈ రెండూ తప్ప మూడవ కార్య వినాశహేతువు లేకపోవడం అవిద్య; అది పరమాణువులు నిత్యాలని స్థాపిస్తుంది అని వ్యాఖ్యానిస్తే-

వి. పటాదులకు కారణమైన, వాటి అవయవాలైన తంత్వాందులు విడిపోయినా, ఆ తంత్వాదులు నశించినా పటాదులు నశిస్తాయి. పరమాణువు విషయంలో ఈ రెండు వినాశహేతువులూ కూడ లేవు. దానికి అవయవాలు లేవు గాన అవి విడిపోవడం చేత గాని, అవి నశించడంచేత గాని పరమాణువులు నశించే ప్రసక్తి లేదు. ఈ అవిద్య పరమాణునిత్యత్వానికి కారణం అని పూర్వపక్షి అభిప్రాయం.

నావశ్యమితి:- నశించే వస్తువు ఈ రెండు హేతువులచేతనే నశించాలి అనే నియమం లేదు. అనేకద్రవ్యాలు (తంత్వాదులు) సంయోగంయొక్క సహాయంతో తమకంటె భిన్నమైన ద్రవ్యాన్ని ఆరంభిస్తాయి అని అంగీకరిస్తే (నువ్వు చెప్పినట్లు) కార్యవినాశానికి ఈ రెండే హేతువులు అని చెప్పడానికి వీలుంటుంది. కాని విశేషాలు ఏవీ లేని సామాన్యం విశేషం గల మరొక అవస్థను పొందడమే దానిని ఆరంభించడం అనగా అని అంగీకరిస్తే అప్పుడు నెయ్యియొక్క కాఠిన్యం కరిగిపోయి నట్లు మూర్త్యవస్థ (ఒక మూర్తావస్థ) అణగిపోవడంచేత కూడ వినాశం కురుదుతుంది. అందువల్ల పరమాణువులకు రూపాదు లుండడంవల్ల మీరు అనుకొన్నదానికి విరుద్ధ మైనది ఏర్పడుతుంది. అందువల్ల కూడ పరమాణుకారణవాదం అనుపపన్నం.

వి. తంతువులు పటానికి సమవాయికారణం. మట్టి ఘటానికి సమవాయి కారణం. తంతువులు పరస్పరం కలవడంవల్ల, మట్టితో చేసిన కపాలాలు (చిప్పలు) కలవడంవల్ల పటం, ఘటం క్రొత్తగా పుడుతాయి. తంతువులు వేరు, పటం వేరు. కపాలాదులు వేరు ఘటం వేరు. కార్యం కారణంకంటె పూర్తిగా భిన్న మైనది. కారణం అంతవరకూ లేని కార్యాన్ని క్రొత్తగా ఆరంభిస్తుంది, అనగా పుట్టిస్తుంది. అందుచేతనే దీనికి ఆరంభవాదం అని పేరు. ఈ విధంగా కారణంచేత ఆరంభించబడిన కార్యం నశించడానికి దాని అవయవాలు (తంత్వాదులు) విడిపోవడం గాని, అవి నశించడం కాని కారణం. ఈ రెండు కారణాలను మించిన మూడవ కారణం ఏదీ లేదు. ఇది వైశేషికుల అభిప్రాయం. దానికి సమాధానంగా ఇక్కడ చెప్పిన విషయ మేమనగా- మీరు చెప్పిన ఆరంభవాదాన్ని అంగీకరిస్తే మీరు చెప్పిన దంతా యుక్తమే కావచ్చు. కాని ఆరంభవాదమే అంగీకార్యం కాదు. కుండ, మూకుడు, పిడత మొదలైనవాటి అన్నింటిలోను మట్టి అనుస్యూతంగా కనబడుతున్నది. కుండలాలు, కంఠసూత్రం మొదలైనవాటిలో అన్నింటిలోను బంగారం అనాస్యూతంగా కనబడుతున్నది. కుండ, కుండలాలు మొదలైన విశేషా లన్నీ తీసివేస్తే ఉండే సామాన్యాత్మకమైన మృత్, సువర్ణం సామాన్యకారణం. ఆ సామాన్యకారణమే కుండ, కుండలాలు మొదలైన విశేష రూపాలలో కనబడితే కార్యం అంటున్నాం. వాస్తవంలో కార్యం కారణంకంటె

భిన్నంకాదు. కార్యం నశించడం అనగా కారణం రూపంలోనికి మారడమే. కారణంలో లీన మవడమే. పేరుకొన్న నెయ్యి ఉంది. అప్పుడు దానిలో కొంత కాఠిన్యం ఉంది. వెచ్చపెట్టగానే అది కరిగిపోతుంది. అనగా దాని పూర్వావస్థ మారిపోయింది. నెయ్యి గట్టిగా ఉన్నప్పుడు అక్కడ నెయ్యి అనుస్యూతంగా ఉంది. కరిగి నప్పుడు కూడ అది అనుస్యూతంగా ఉంది. కార్యకారణాలవిషయంలో కూడ ఇట్లే. అందుచేత పరమాణువులు నశించా లంటే కారణవిభాగమైనా ఉండాలి, కారణవినాశమైనా జరగాలి, ఆ రెండూ లేవు గాన, మూడవ వినాశహేతువు లేదు గాన (ఇదే ఇక్కడ అవిద్య) అవి నిత్యములు అని చెప్పడం యుక్తం కాదు. కుండ మట్టిలోను, కుండలం బంగారం లోనూ లీన మైనట్లు పరమాణువులు కూడ పరమకారణ మైన బ్రహ్మలో లీనం అయిపోతాయి. అదే వాటి వినాశం. అందుచేత అవి నిత్యము లని అంగీకరించడం యుక్తం కాదు. 15.

### సూ. ఉభయథా చ దోషాత్. 2-2.16.

గన్ధరసరూపస్పర్శగుణా స్థూలా పృథివీ. రూపరసస్పర్శగుణాః సూక్ష్మా ఆపః. రూపస్పర్శగుణం సూక్ష్మతరం తేజః. స్పర్శగుణః సూక్ష్మతరో వాయుః ఇత్యేవమేతాని చత్వారి భూతాని ఉపచితాపచితగుణాని స్థూలసూక్ష్మ సూక్ష్మతరసూక్ష్మతమతారతమ్యోపేతాని చ లోకే లక్ష్యన్తే. తద్వత్పరమాణవోఽపి ఉపచితాపచితగుణాః కల్ప్యేరన్న వా? ఉభయథాపి దోషానుషఙ్గోఽపరిహార్య ఏవ స్యాత్. కల్ప్యమానే తావదుపచితాపచితగుణత్వే ఉపచితగుణానాం మూర్త్యుపచయాదపరమాణుత్వప్రసఙ్గః. న చాన్తరేణాపి మూర్త్యుపచయం గుణోపచయో భవతీత్యుచ్యేత, కార్యేషు భూతేషు గుణోపచయే మూర్త్యు పచయదర్శనాత్.అకల్ప్యమానే తూపచితాపచితగుణత్వే, పరమాణుత్వసామ్య ప్రసిద్ధయే యది తావత్సర్వ ఏకైకగుణా ఏవ కల్ప్యేరంస్తతస్తేజసి స్పర్శస్యోపలబ్ధిర్న స్యాత్, అప్సు రూపస్పర్శయోః, పృథివ్యాం చ రసరూప స్పర్శానామ్; కారణగుణపూర్వకత్వాత్కార్యగుణానామ్. అథ సర్వే చతుర్గుణా ఏవ కాల్ప్యేరన్ తతోఽప్స్వపి గన్ధోపలబ్ధిః స్యాత్, తేజసి గన్ధరసయోః, వాయౌ గన్ధరూపరసానామ్. న చైవం దృశ్యతే. తస్మాదప్యనుపపన్నః పరమాణు కారణవాదః. 16.

## బాలానందిని

ఉభయథేతి:- "ఉభయథా= రెండు విధాలుగా కూడ, దోషాత్= దోషం ఉండడంవల్ల, పరమాణుకారణవాదం ఉపపన్నం కాదు" అని సూత్రార్థం.

గన్ధేతి:- గంధ-రస-రూప-స్పర్శ గుణాలు గల పృథివి స్థూల మైనది. రూప-రస-స్పర్శలు గల ఉదకం సూక్ష్మమైనది. రూప-స్పర్శ గుణాలు గల తేజస్సు సూక్ష్మతర మైనది. స్పర్శగుణం గల వాయువు సూక్ష్మతమ మైనది. ఈ విధంగా హెచ్చుతగ్గులలో ఉన్న గుణాలు గల ఈ నాలుగు భూతాలూ తారతమ్యంతో స్థూల-సూక్ష్మ-సూక్ష్మతర-సూక్ష్మతమాలుగా లోకంలో కనబడుతున్నాయి. అదే విధంగా (వాటి) పరమాణువులు కూడ ఎక్కువ గుణా లున్నవి గాను, తక్కువ గుణా లున్నవి గాను కల్పించబడతాయా కల్పింపబడవా? రెండు విధాలా కూడ దోషసంబంధం తప్పనిసరి అవుతుంది. ఉపచితగుణత్వము (ఎక్కువ గుణా లుండడం), అపచితగుణత్వం (తక్కువ గుణా లుండడం) కల్పించబడిన పక్షంలో ఉపచితగుణాలైనవాటి మూర్తి కూడ ఉపచితం అవుతుంది (పెరుగుతుంది) గాన అవి పరమాణువులు కాకుండా పోతాయి. మూర్త్యు పచయం లేకుండగానే గుణోపచయం కలగవచ్చును అని చెప్పడానికి వీలులేదు. కార్యాలైన మహాభూతాలలో గుణోపచయం ఉన్నప్పుడు మూర్త్యుపచయం కనబడుతున్నది కదా? ఉపచితాపచితగుణత్వాలు కల్పించకుండా పరమాణువు లన్నింటింటోను సమత్వాన్ని తీసికొనిరావడంకోసం అన్ని పరమాణువులలోను ఒక్కొక్క గుణమే ఉంటుందని కల్పించే పక్షంలో తేజస్సులో స్పర్శయొక్క ఉపలబ్ధి (జ్ఞానం) కలగదు. ఉదకంలో రూపస్పర్శోపలబ్ధి ఉండదు, పృథివిలో రసరూపస్పర్శల ఉపలబ్ధి ఉండదు. ఎందువల్ల ననగా కార్యంలోని గుణాలు కారణంలోని గుణాలను పట్టి మాత్రమే ఉంటాయి. అలా కాకుండా అన్ని పరమాణువులలోను నాలుగు గుణాలూ ఉంటాయి అని కల్పిస్తే అప్పుడు నీళ్లల్లో కూడ గంధం కనబడాలి. తేజస్సులో గంధరసాలు కనబడాలి. వాయువులో గంధరూపరసాలు కనబడాలి. కాని ఇలా కనబడడంలేదు. ఆ కారణంవల్ల కూడ పరమాణుకారణవాదం అనుపపన్నం. 16.

## సూ. అపరిగ్రహాచ్చాత్యన్తమనపేక్షా. 2.2.17.

ప్రధానకారణవాదో వేదవిద్భిరపి కైశ్చిన్మన్వాదిభిః సత్కార్యత్వాద్యంశోపజీవనాభిప్రాయేణోపనిబద్ధః. అయం తు పరమాణుకారణవాదో న కైశ్చిదపి శిష్టైః కేన చిదప్యంశేన పరిగృహీత ఇత్యత్యన్తమేవానాదరణీయో వేదవాదిభిః.

## బాలానందిని

అపరిగ్రహాదితి:- "అపరిగ్రహాత్ చ=శిష్టు లెవ్వరూ దీనిని స్వీకరించకపోవడం వల్ల కూడ, అత్యన్తమ్= అత్యంతమూ. అనపేక్షా=పరమాణుకారణవాదం విషయంలో అనాదరం" అని సూత్రార్థం.

ప్రధానేతి:- వేదవేత్త లైన మనువు మొదలైన కొందరు సత్కార్యత్వం మొదలైన కొన్ని అంశాలను స్వీకరించా లనే అభిప్రాయంతో ప్రధానకారణవాదాన్ని (తమ గ్రంథాలలో) చేర్చుకొన్నారు. ఈ పరమాణుకారణవాదాన్నైతే శిష్టులెవ్వరూ కూడ, ఏ అంశంలోనూ కూడ పరిగ్రహించలేదు. అందుచేత ఇది వేదవాదులచేత ఏ మాత్రమూ ఆదరించ దగినది కాదు.

## భాష్యమ్

అపి చ వైశేషికాస్తన్త్రార్థభూతాన్ షట్పదార్థాన్ ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేషసమవాయాఖ్యాన్, అత్యన్తభిన్నాన్, భిన్నలక్షణానభ్యుపగచ్ఛన్తి, యథా మనుష్యో ऽ శ్వః శశ ఇతి. తథాత్వం చాభ్యుపగమ్య తద్విరుద్ధం ద్రవ్యాధీనత్వం శేషాణామభ్యుపగచ్ఛన్తి. తన్నోపపద్యతే. కథమ్? యథా హి లోకే శశకుశపలాశప్రభృతీనామత్యన్తభిన్నానాం సతాం నేతరేతరాధీనత్వం భవతి, ఏవం ద్రవ్యాదీనామత్యన్తభిన్నత్వాన్నైవ ద్రవ్యాధీనత్వం గుణాదీనాం భవితుమర్హతి. అథ భవతి ద్రవ్యాధీనత్వం గుణాదీనాం తతో ద్రవ్యభావే భావాత్ ద్రవ్యాభావే చాభావాద్ద్రవ్యమేవ సంస్థానాదిభేదాదనేకశబ్దప్రత్యయ భాగ్భవతి. యథా దేవదత్త ఏక ఏవ సన్ అవస్థాన్తరయోగాదనేకశబ్ద ప్రత్యయ భాగ్భవతి తద్వత్. తథా సతి సాంఖ్యసిద్ధాన్తప్రసంగః స్వసిద్ధాన్తవిరోధశ్చాపద్యే యాతామ్. నన్వగ్నేరన్యస్యాపి సతో ధూమస్యాగ్న్యధీనత్వం దృశ్యతే? సత్యం దృశ్యతే; భేదప్రతీతేస్తు తత్రాగ్నిధూమయోరన్యత్వం నిశ్చీయతే. ఇహ తు శుక్లః కమ్బలః, రోహిణీ ధేనుః, నీలముత్పలమితి ద్రవ్యస్యైవ తస్య తస్య తేన తేన విశేషేణ ప్రతీయమానత్వాన్నైవ ద్రవ్యగుణయోరగ్నిధూమయోరివ భేదప్రతీతిరస్తి. తస్మాద్ద్రవ్యాత్మకతా గుణస్య. ఏతేన కర్మసామాన్య విశేషసమవాయానాం ద్రవ్యాత్మకతా వ్యాఖ్యాతా.

## బాలానందిని

**అవ.** ఇప్పుడు వైశేషికమతంలోని మరికొన్ని అసంగతవిషయాలు ఎత్తి చూపబడు తున్నాయి - అపి చేతి:- మరియు వైశేషికులు తమ శాస్త్రంలోని ప్రతిపాద్యవిషయాలనుగా ద్రవ్య-గుణ-కర్మ-సామాన్య- విశేష- సమవాయా లనే, ఆరు పదార్థాలను అంగీకరిస్తున్నారు. వీటికి వేరు వేరు లక్షణాలు చెపుతూ, ఇవి మనుష్యుడు, అశ్వము, చెవులపిల్లి మొదలైనవి ఏ విధంగా పరస్పరమూ భిన్న మైనవో అట్లే భిన్న మైన వని అంగీకరిస్తూనే, అందుకు విరుద్ధంగా మిగిలిన వన్నీ ద్రవ్యానికి అధీన మైన వని అంగీకరిస్తున్నారు. అది కుదరదు. ఎట్లు? లోకంలో ఒక దానికి ఒకటి అత్యంత భిన్నాలైన శశ-కుశ-పలాశాదులు ఒకదానికి మరొకటి అధీనమై ఉండడం ఏ విధంగా కుదరదో అట్లే ద్రవ్యాదులు కూడ పూర్తిగా వేరు వేరైన వవడంచేత గుణాదులు ద్రవ్యాధీనము లవడం తగదు. అలా కాక గుణాదులు ద్రవ్యాధీనములే అని చెప్పిన ట్లయితే అప్పుడు అవి ద్రవ్యం ఉంటే ఉంటున్నాయి, ద్రవ్యం లేకపోతే ఉండడంలేదు గాన ద్రవ్యమే దాని విన్యాసాదుల భేదంవల్ల వేరు వేరు పేర్లకు వేరు వేరు జ్ఞానాలకు గోచరం అవుతున్నదని చెప్పాలి. దేవదత్తుడు ఒక్కడే అయినా వేరు వేరు అవస్థలతో సంబంధం ఏర్పడడం వల్ల ఏ విధంగా అనేకమైన శబ్దాలనూ జ్ఞానాలనూ పొందుతుంటాడో అట్లే ఇక్కడ కూడ. అలాగయితే సాంఖ్యుల సిద్ధాంతాన్ని అంగీకరించిన ట్లవుతుంది. మీ స్వసిద్ధాంతానికి విరోధం ఏర్పడుతుంది.

వి. ధర్మవిశేషంవల్ల జగత్తులో ఉన్న పదార్థాల తత్త్వం తెలుసుకో కలిగినవానికి మోక్షం కలుగుతుం దని వైశేషుకుల సిద్ధాంతం. "ధర్మవిశేషప్రసూతాత్ ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయానాం పదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసమ్" (వై.సూ.1.1.4) అని వైశేషిక సూత్రం. అందుచేత వైశేషికులు ఆ యా పదార్థాలను గూర్చి చర్చించారు. ద్రవ్య-గుణ-కర్మ-సామాన్య-విశేష-సమవాయా లని పదార్థాలు ఆరు విధాలు. తరవాత వీటితో అభావం కూడ చేర్చబడింది. దానితో మొత్తం ఏడు పదార్థాలు (1) ద్రవ్యాలు- పృథివి, అప్ (ఉదకం) తేజస్, వాయువు, ఆకాశం, కాలం, దిక్, ఆత్మ, మనస్ అని పది. (2) గుణాలు ఇరవైనాలుగు - రూపం, రసం, గంధం, స్పర్శ, సంఖ్య, పరిమాణం, పృథక్త్వం (వేరుగా ఉండడం) సంయోగం, విభాగం, పరత్వం, అపరత్వం, గురుత్వం, ద్రవత్వం, స్నేహం, శబ్దం, బుద్ధి, సుఖం, దుఃఖం, ఇచ్ఛ, ద్వేషం, ప్రయత్నం, ధర్మం, అధర్మం, సంస్కారం. (3) కర్మ ఐదు విధాలు - ఉత్క్షేపణం (పైకి ఎత్తడం), అపక్షేపణం

(విసరడం)ఆకుంచనం (వంచడం) ప్రసారం (చాపడం), గమనం. (4) సామాన్యం అనగా జాతి. వృక్షత్వ-గోత్వాదికం. ఇది పరజాతి (విస్తృతమైనది) అపరజాతి (చిన్న పరిధి గలది) అని రెండు విధాలు (5) విశేషా లనేవి ఆకాశం, పరమాణువులు మొదలైన నిత్యద్రవ్యాలలో ఉంటాయి. ఇవి అనంత మైనవి. పరమాణువులు అనంతములు కదా? (6) గుణం-గుణి, అవయవం - అవయవి మొదలైనవాటి మధ్య ఉన్న సంబంధం సమవాయసంబంధం. ఇది విడదీయరానిది. (7) ప్రాగభావం, ప్రధ్వంసాభావం, అత్యంతాభావం, అన్యోన్యాభావం అని అభావం నాలుగు విధాలు. ఈ విధంగా ఆరు పదార్థాలను (అభావంతో సహా ఏడు పదార్థాలను) అంగీకరించిన వైశేషికులు వాటికి వేరు వేరు లక్షణాలు ప్రతిపాదించారు. దీనిని పట్టి ఇవన్నీ ఒకదానితో మరొకదానికి సంబంధం లేని శశ-కుశ-పలాశాదుల వలె స్వతంత్రవస్తువులు అన్నట్లు కనబడుతున్నది. కాని చివరి ఐదు కూడ ద్రవ్యం మీద ఆధారపడి ఉంటా యని వాళ్లు అంగీకరించారు. గుణాదులు ద్రవ్యంలోనే ఉంటాయి కాని ద్రవ్యాన్ని విడచి స్వతంత్రంగా ఉండజాలవు అని అర్థం. చలనాదికర్మాదులలో కూడ చలనత్వాది జాతులున్నా ఆ చలనాదులు ద్రవ్యంలోనే ఉంటాయి కాబట్టి ఆ జాతులు కూడ ద్రవ్యంమీదనే ఆధారపడినట్లు గ్రహించాలి. ఈ విధంగా గుణాదులు వేరు వేరు లక్షణాలతో వేరు వేరు స్వతంత్రపదార్థాలుగా ఉన్నప్పుడు అవన్నీ ద్రవ్యమనే పదార్థానికి అధీనములై ఉండకూడదు. శశం కుశం మీదా, కుశం పలాశంమీదా ఆధారపడి ఉండడం లేదు కదా? అలా ద్రవ్యాధీనా లని చెప్పే పక్షంలో వాటికి ద్రవ్యంతో తాదాత్మ్యాన్నే అంగీకరించాలి గాని అవి ద్రవ్యం కంటె అత్యంతభిన్నములు అనగూడదు. దేవదత్తుడు కాళ్లూ చేతులూ చాపినా, ముణుచుకొని కూర్చున్నా దేవదత్తుడే కదా? కొడుకు, తండ్రి, భర్త, అన్న మొదలైన స్థితులను పొందినా అతడు దేవదత్తుడే కదా? అదే విధంగా ద్రవ్యమే ఆ యా గుణాదులతో వేరు వేరు విధంగా కనబడుతున్నది కాని ద్రవ్యం కంటె వేరుగా గుణాదులున్నా యని చెప్పడం యుక్తం కాదు. ద్రవ్యం ఉంటేనే ఉండి ద్రవ్యం లేకపోతే లేని వాటికి స్వతంత్రప్రతిపత్తి ఎక్క డుంటుంది? అందుచేత ద్రవ్యమే వేరు వేరు రూపాలలో కనబడుతున్న దని అంగీకరించాలి. అప్పుడు సాంఖ్యులు చెప్పిన పరిణామవాదాన్ని అంగీకరించి కాణాదులు తమ సిద్ధాంతాన్ని వదలుకొన్నట్లవుతుంది.

అవ. ఒక వస్తువు మరొకదానిమీద ఆధారపడి ఉన్నంతమాత్రంచేత ఆ రెండింటికీ తాదాత్మ్యం అంగీకరించవలసిన పని లేదు అని దృష్టాంతపూర్వకంగా పూర్వపక్షి ప్రశ్నిస్తున్నాడు. - నన్వితి:- ధూమం అగ్ని కంటె వేరైనా కూడ అది అగ్న్యధీనం అయి ఉండడం కనబడుతున్నది కదా? (సమాధానం)- నిజమే, కనబడుతున్నది. అక్కడ భేదం స్పష్టంగా తెలుస్తూన్నది గాన అగ్ని- ధూమాలు వేరు వేరని నిశ్చయించబడుతుంది. ఇక్కడైతే 'తెల్లని కంబళీ', 'ఎఱ్ఱని ఆవు', 'నల్లని కలువ' అని ఆ యా ద్రవ్యాలే ఆయా విశేషాలతో (శుక్లత్వాదులతో) కనబడుతున్నాయి కాని అగ్ని ధూమాలకు మధ్య భేదప్రతీతి కలిగి నట్లు భేదప్రతీతి కలగడం లేదు. అందుచేత గుణం ద్రవ్యరూపమే (కాని ద్రవ్యంకంటె భిన్నం కాదు). దీనిచేత కర్మ సామాన్యవిశేషసమవాయాలు కూడ ద్రవ్యరూప మైనవే అని నిరూపించిన ట్లయింది.

## భాష్యమ్

గుణాదీనాం ద్రవ్యాధీనత్వం ద్రవ్యగుణయోరయుతసిద్ధత్వాదితి యదుచ్యతే, తత్పునరయుతసిద్ధత్వమ్ అపృథగ్దేశత్వం వా స్యాత్, అపృథక్కాలత్వం వా అపృథక్స్వభావత్వం వా? సర్వథాపి నోపపద్యతే. అపృథగ్దేశత్వే తావత్స్వాభ్యుపగమో విరుధ్యేత. కథమ్? తన్త్వారబ్ధో హి పటః తన్తుదేశోఽభ్యుపగమ్యతే న పటదేశః. పటస్య తు గుణాః శుక్లత్వాదయః పటదేశా అభ్యుపగమ్యన్తే న తన్తుదేశాః తథా చాహుః- "ద్రవ్యాణి ద్రవ్యాన్తరమారభన్తే గుణాశ్చ గుణాన్తరమ్" (వై.సూ.1.1.10) ఇతి. తన్తవో హి కారణ ద్రవ్యాణి కార్యద్రవ్యం పటమారభన్తే, తన్తు గతాశ్చ గుణాః శుక్లాదయః కార్యద్రవ్యే పటే శుక్లాదిగుణాన్తరమారభన్త ఇతి హి తేఽభ్యుపగచ్ఛన్తి. సోఽభ్యుపగమో ద్రవ్యగుణయోరపృథగ్దేశత్వేఽభ్యుపగమ్యమానే బాధ్యేత. అథ అపృథక్కాలత్వమయుతసిద్ధత్వముచ్యేత, సవ్యదక్షిణయోరపి గోవిషాణ యోరయుతసిద్ధత్వం ప్రసజ్యేత. తథా అపృథక్స్వభావత్వే తు అయుతసిద్ధత్వే న ద్రవ్యగుణయోరాత్మభేదః సంభవతి, తస్య తాదాత్మ్యేనైవ ప్రతీయమానత్వాత్.

## బాలానందిని

గుణాదీనామితి:- ద్రవ్యగుణాలు అయుతసిద్ధాలు గాన గుణాలు ద్రవ్యాధీనాలు అని మీరు (వైశేషికులు) అంటారు కదా- అందులో అయుతసిద్ధత్వం

అంటే ఏమిటి? అపృథగ్దేశత్వమా (వేరు వేరు దేశాలలో ఉండకపోవడమా), అపృథక్కాలత్వమా (వేరు వేరు కాలాలలో ఉండకపోవడమా), అపృథక్స్వభావత్యమా (వేరు వేరు స్వభావాలు లేకపోవడమా)? అపృథగ్దేశత్వం అన్నట్లయితే తమ అభ్యుపగమానికి (తాము అంగీకరించినదానికి) విరోధం కలుగుతుంది. ఎట్లు? తంతువులచేత ఆరంభించబడిన పటం తంతుదేశం (తంతువులలో ఉంటుంది) అని (మీచేత) అగీకరించబడుతున్నది కాని పటదేశం (పటంలో ఉన్నట్లు)గా అంగీకరించబడడంలేదు. పటగుణా లైన శుక్లాదు లైతే పటదేశా లని అంగీకరించ బడుతున్నాయి గాని తంతుదేశాలుగా అంగీకరించబడడం లేదు. అందుచేతనే "ద్రవ్యాణి... గుణాన్తరమ్" (ద్రవ్యాలు మరొక ద్రవ్యాన్ని ఆరంభిస్తాయి, గుణాలు మరొక గుణాన్ని ఆరంభిస్తాయి) అని వైశేషికు లంటారు. కారణద్రవ్యా లైన తంతువులు కార్యద్రవ్య మైన పటాన్ని ప్రారంభిస్తాయి, తంతువులలో ఉన్న శుక్లాది గుణాలు కార్యద్రవ్య మైన పటంలో మరొక శుక్లాదిగుణాన్ని ఆరంభిస్తాయి అని కదా వాళ్ళు అంగీకరిస్తారు. (ఈ విధంగా పటం తంతువులలోను, శుక్లత్వాదికం పటంలోను ఉండడంచేత ద్రవ్యగుణాల అపృథగ్దేశత్వం అయుతసిద్ధత్వం అని అగీకరిస్తే పైన చెప్పిన వాళ్ల అభ్యుపగమం బాధితం అవుతుంది. అయుతసిద్ధత్వ మనగా అపృథక్కాలత్వం అని అంగీకరిస్తే అప్పుడు గోవుయొక్క కుడి ఎడమ కొమ్ములు కూడ (ఒకే కాలంలో పుడతాయి కాబట్టి) అవి కూడ అయుతసిద్ధా లని చెప్పవలసి వస్తుంది. అయుతసిద్ధత్వ మనగా అపృథక్స్వభావత్వం అని అంగీకరిస్తే అప్పుడు గుణద్రవ్యాల మధ్య స్వరూపభేదం ఉండదు. ఎందువల్ల ననగా ఆ గుణం తాదాత్మ్యంతో (ద్రవ్యస్వరూపంగానే) తెలుస్తూన్నది.

వి. "యయోర్మధ్యే ఏకమవినశ్యదపరాశ్రితమేవావతిష్ఠతే తావయుతసిద్ధౌ యథా అవయవావయవినౌ, గుణగుణినౌ, క్రియాక్రియావన్తౌ, జాతివ్యక్తీ, విశేషనిత్యద్రవ్యే చేతి" (తర్కభాష. పే.13.) అని వైశేషికాదులు చెప్పిన అయుతసిద్ధలక్షణం. ఏ రెండింటిలో ఒకటి తాను నశించ నంతవరకు మరొకదానిని ఆశ్రయించియే ఉంటుందో ఆ రెండూ అయుతసిద్ధాలు. ఉదాహరణకి అవయవావయవులు, గుణగుణిలు, క్రియాక్రియా వత్తులు, జాతివ్యక్తులు, విశేషనిత్యద్రవ్యాలు ఇవి అయుతసిద్ధాలు. కొమ్మలు, అవయవాలు, చెట్టు అవయవి. అవయవియైన చెట్టు తానున్నంతవరకు అవయవాలను ఆశ్రయించుకొనే ఉంటుంది. అవయవాలు పోతే తాను పోతుంది. గుణం శుక్లరూపం, గుణి అది ఉన్న పటం. గుణం తానున్నంతవరకు పటాన్ని ఆశ్రయించుకొనే ఉంటుంది. పటం నశించినా, దానికి మరొక రంగు వేసినా తాను

నశిస్తుంది. క్రియ పైకి లేపడం మొదలైనది. క్రియ ఉన్నది క్రియావత్తు. క్రియ క్రియావత్తైన ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఆ ద్రవ్యంలో మరొక క్రియ ఏర్పడగానే ఈ క్రియ పోతుంది. గోత్వం అనేది జాతి. అది అన్ని గోవులలోను ఉంటుంది. తానున్నంతవరకు గోవును ఆశ్రయించుకొని ఉంటుంది. ఒక గోవు నశించగానే అక్కడ ఆ గోత్వం కనబడకుండా పోతుంది. విశేషాలు నిత్య పదార్థాలను ఆశ్రయించుకొని ఉంటాయి గాన వాటిలో ఒకటి నశించడం అనేది లేదు. ఈ విధంగా అయుతసిద్ధాలైన వాటి మధ్య నున్న సంబంధం సమవాయసంబంధం అని వైశేషికుల ప్రక్రియ. ఇక్కడ చెప్పిన అయుత సిద్ధత్వంయొక్క స్వరూపం ఏమిటని విచారిస్తే ఏ విధంగాను కూడ కుదరదు గాన చివరికి గుణ- గుణ్యాదులకు తదాత్మ్యమే అంగీకరించాలి అని సిద్ధాంతి అభిప్రాయం.

## భాష్యమ్

యుతసిద్ధయోః సంబన్ధః సంయోగః, అయుతసిద్ధయోస్తు సమవాయ ఇత్యయమభ్యుపగమో మృషైవ తేషామ్; ప్రాక్సిద్ధస్య కార్యాత్కారణస్య అయుతసిద్ధ్యత్వానుపపత్తేః. అథాన్యతరాపేక్ష ఏవ అయమభ్యుపగమః స్యాదయుతసిద్ధస్య కార్యస్య కారణేన సంబన్ధః సమవాయః ఇతి; ఏవమపి ప్రాగసిద్ధస్యాలబ్ధాత్మకస్య కార్యస్య కారణేన సంబన్ధో నోపపద్యతే, ద్వయాయత్తత్వాత్సంబన్ధస్య. సిద్ధం భూత్వా సంబధ్యత ఇతి చేత్, ప్రాక్కారణసంబన్ధాత్కార్యస్య సిద్ధావభ్యుపగమ్యమానాయామ్ అయుతసిద్ధ్యభావాత్ "కార్యకారణయోః సంయోగవిభాగౌ న విద్యేతే" ఇతీదం దురుక్తం స్యాత్. యథా చోత్పన్నమాత్రస్య అక్రియస్య కార్యద్రవ్యస్య విభుభిరాకాశాదిభిః సంబన్ధః సంయోగ ఏవాభ్యుగమ్యతే, న సమవాయః, ఏవం కారణద్రవ్యేణాపి సంబన్ధః సంయోగ ఏవ స్యాన్న సమవాయః. నాపి సంయోగస్య సమవాయస్య వా సంబన్ధస్య సంబన్ధివ్యతిరేకేణాస్తిత్వే కించిత్ప్రమాణమస్తి. సంబన్ధిశబ్దప్రత్యయవ్యతిరేకేణ సంయోగసమవాయశబ్దప్రత్యయదర్శనాత్ తయోరస్తిత్వమితి చేత్, న. ఏకత్వేఽపి స్వరూపబాహ్యరూపేక్షయా అనేకశబ్దప్రత్యయదర్శనాత్. యథైకోఽపి సన్ దేవదత్తో లోకే స్వరూపం సంబన్ధిరూపం చాపేక్ష్యానేకశబ్దపత్యయభాగ్భవతి- మనుష్యో,

బ్రాహ్మణః, శ్రోత్రియో, బాలో, యువా, స్థవిరః, పితా, పుత్రః, పౌత్రో, భ్రాతా, జామాతా- ఇతి, యథా చైకాపి రేఖా స్థానాన్యత్వేన వినివిశమానా ఏకదశశతసహస్రాదిశబ్ద ప్రత్యయభేదమనుభవతి, తథా సంబన్ధినోరేవ సంబన్ధిశబ్దప్రత్యయవ్యతిరేకేణ సంయోగసమవాయశబ్దప్రత్యయార్హత్వం, న వ్యతిరిక్తవస్త్వస్తిత్వేన, ఇత్యుపలబ్ధిలక్షణప్రాప్తస్యానుపలబ్ధేరభావో వస్త్వన్తరస్య. నాపి సంబన్ధివిషయత్వే సంబన్ధశబ్దప్రత్యయోః సతత భావప్రసంగః, స్వరూపబాహ్యరూపాపేక్షయా ఇత్యుక్తోత్తరత్వాత్.

### బాలానందిని

యుతేతి:- యుతసిద్ధము లైనవాటియొక్క, అనగా ఒకప్పుడు కలువకుండా ఉన్నవాటియొక్క, సంబంధం సంయోగం, అయుతసిద్ధము లైనవాటియొక్క సంబంధం సమవాయం అని వాళ్ల అభ్యుపగమం కూడ అసత్యమే, అనగా దుష్టమే. కార్యంకంటె పూర్వమే ఉన్న కారణానికి (కార్యంతో) అయుతసిద్ధత్వం కుదరదు. ఎందుచేత ననగా సంబంధం అనేది రెండింటిమీద ఆధారపడి ఉంటుంది. కార్యం సిద్ధమై తరవాత కారణంతో సంబధిస్తుంది అన్నట్లయితే- కారణంతో సంబంధం ఏర్పడడానికి పూర్వమే కార్యం పుడుతుంది అని అంగీకరించిన ట్లయితే- అప్పుడు అయుతసిద్ధి లేకపోవడంచేత కార్యకారణాలకు సంయోగవిభాగాలు లేవు అని మీరనేది దురుక్తం (చెడ్డ మాట) అవుతుంది. (అనగా కార్యం సిద్ధమైన తరవాత కారణంతో కలుస్తుంది అని చెప్పే పక్షంలో ఒకదానితో ఒకటి కలవకుండా ఉన్న రెండు సత్పదార్థాలు కలుస్తే సంయోగం కావాలి గాన కార్యకారణాల సంబంధం సంయోగసంబంధం అని చెప్పవలసి వస్తుంది. అప్పుడు కార్యకారణాలకి సంయోగం కాని విభాగం కాని ఉండదు అనే మీ సిద్ధాంతం అపసిద్ధాంతం అయిపోతుంది అని భావం). పుట్టిన వెంటనే క్రియ ఏదీ లేకపోయినా కూడ కార్యద్రవ్యానికి విభువులైన (సర్వవ్యాపులైన) ఆకాశాదిద్రవ్యాంతరాలతో ఏ విధంగా సంయోగమే అంగీకరించబడుచున్నది గాని సమవాయం అంగీకరించబడడంలేదో అదే విధంగా కారణద్రవ్యంతో కూడ (కార్యానికి) సంయోగమే ఉండాలి గాని సమవాయం ఉండకూడదు. మరొక విషయమేమనగా- సంబంధులైన వస్తువులకంటె భిన్నంగా సంయోగసంబంధం గాని సమవాయసంబంధం గాని ఉందని చెప్పడానికి ప్రమాణం ఏదీ లేదు. (ఘటమూ పటమూ, ఘటమూ రూపమూ మొదలైన) సంబంధిశబ్దాలకంటె వాటి జ్ఞానంకంటె భిన్నంగా 'సంయోగం' 'సమవాయం' అనే శబ్దాలూ, జ్ఞానమూ కనబడడంచేత వాటికి అస్తిత్వం ఉంది (సంయోగ-సమవాయాలు

ఉన్నాయి) అన్నట్లయితే, అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా లోకంలో ఒక వస్తువు ఒక్కటే అయినా కూడ దాని స్వరూపాన్ని పట్టి, బాహ్యరూపాన్ని పట్టి అనేకమైన శబ్దాలు, ప్రత్యయాలూ కనబడుతున్నాయి. ఎట్లనగా- లోకంలో దేవదత్తుడు ఒక్కడే అయినా కూడ తన స్వరూపాన్ని, వానితో సంబంధించిన వాటి రూపాన్నీ అపేక్షించి (స్వరూపాన్ని పట్టి) మనుష్యు డనీ, (ఇతర విషయాల లేదా వ్యక్తుల సంబంధాన్ని పట్టి) బ్రాహ్మణుడు, శ్రోత్రియుడు, బాలుడు, యువకుడు, వృద్ధుడు, తండ్రి, పుత్రుడు, పౌత్రుడు,సోదరుడు, అల్లుడు అనీ ఏ విధంగా శబ్దప్రత్యయభేదాన్ని పొందుతున్నాడో, (అంకె రూపంలో ఉన్న) రేఖ ఒక్కటే అయినా కూడ వేరు వేరు స్థానాలలో చేర్చబడి, ఏ విధంగా, ఒకటి, పది, వంద, వెయ్యి మొదలైన శబ్దప్రత్యయాలను పొందుతున్నదో అట్లే సంబంధులే (ఘట-పటాలు, ఘట-రూపాలు మొదలైనవే) సంబంధిశబ్దాలకంటె, వాటి ప్రత్యయం (జ్ఞానం) కంటె భిన్నంగా, సంయోగ-సమవాయాదిశబ్దప్రత్యయార్హత్వాన్ని పొందుతున్నాయి., అంతేనే కాని తమకంటె భిన్నంగా (సంయోగం, సమవాయం అనే) ఇతర వస్తువు లుండడంచేత కాదు. ఈ విధంగా ఉపలబ్ధి అనే లక్షణంచేత (లింగం చేత) ప్రాప్తించినది (వస్త్వంతరం) ఏదీ కనబడకపోవడంచేత వస్త్వంతరానికి అభావమే. (మరొక వస్తువు ఏదీ లేదు)

వి. దేవదత్తుడు ఒక్కడే అయినా వానిని వాని స్వరూపాన్ని పట్టి మనిషి అంటున్నాం. వానికి తండ్రి ఉండడంచేత పుత్రుడంటున్నాం. వానికి పుత్రు డుండడంచేత వానినే తండ్రి అంటున్నాం. మనిషి అయిన దేవదత్తుడు తప్ప వానికంటె వేరుగా పుత్రుడు గాని, తండ్రి గాని లేదు. పుత్రత్వ-పితృత్వాదులు బాహ్యులైన పితృ-పుత్రాదుల సంబంధాన్ని పట్టి ఏర్పడినవే. ఒక అంకెను, ఉదాహరణకు మూడు '3' అనే రేఖను, ఒకట్ల స్థానంలో వేస్తే అది మూడు అనే సంఖ్యను బోధిస్తుంది. ఎడమవైపు రెండవస్థానంలో వేస్తే ముప్పై అనే సంఖ్యను బోధిస్తుంది. మూడవ స్థానంలో వేస్తే మూడు వందలు అనే సంఖ్యను బోధిస్తుంది. ఈ అర్థభేదం అంతా స్థానాన్ని పట్టి ఏర్పడినదే కాని మూడు (3) అనే రేఖలో భేదం ఏదీ లేదు. అయితే భేదం ఉన్నట్లు వ్యవహారం ఉంది. దీనికి కల్పితమైన అనిర్వచనీయభేదమే హేతువు. అదే విధంగా రెండు వ్రేళ్లు నిరంతరంగా ఉన్నా, బదరం కుండలో ఉన్నా సంయోగం అంటున్నాం. వ్రేళ్లకంటె, కుండబదరాలకంటె భిన్నంగా సంయోగం అంటూ ఏదీ లేదు. కార్యం వేరు కారణం వేరు అని కల్పించి కార్యం కారణంలో సమవాయసంబంధంతో ఉందంటున్నాం. వాస్తవంలో కార్యకారణాలకంటె భిన్నంగా సమవాయం అంటూ ఏదీ లేదు. ఇదంతా కల్పితమైన, అనిర్వచనీయమైన భేదాన్ని పట్టి, ఏర్పడిన

వ్యవహారమే. అందుచేత సంయోగం, సమవాయం అనే పదాలు, వాటి జ్ఞానం ఉన్నాయి కాబట్టి ఆ శబ్దప్రత్యయాలను లక్షణంగా (లింగంగా, హేతువుగా) చేసికొని పూర్వపక్షి సాధిద్దా మనుకొన్న వస్త్వంతరం (సంయోగసమావాయరూపవస్త్వంతరం) విచారణ చేయగా కనబడడం లేదు గాన ఈ అనుపలబ్ధిప్రమాణాన్ని పట్టి అవి లేవు అని నిశ్చయించబడుతున్నది అని ఇత్యుపలబ్ధిలక్షణేత్యాదివాక్యానికి అర్థం.

అవ. ఇంతవరకు చెప్పినదానిని పట్టి సంయోగం, సమవాయం అనే శబ్దాలు ప్రత్యయాలు కూడ సంబంధులనే (ఘట-పట, ఘట-రూపాదులనే) నిర్దేశిస్తాయి గాని వాటికంటె భిన్నంగా సంయోగసమవాయాలు లేవని చెప్పినట్లయింది. అట్లయితే ఘటపటాదులను సంయోగసమవాయాదిశబ్దాలచేతనే ఎల్లప్పుడూ నిర్దేశించవలసి వస్తుంది కదా అని ఆశంకించుకొని సమాధానం చెప్పబడుచున్నది- **నాపీతి**:- (సంయోగ-సమవాయాదిశబ్దప్రత్యయాలు) సంబంధుల విషయంలోనే ప్రవర్తిస్తున్నాయి అన్నట్లయితే, ఎల్లప్పుడు వాటి విషయంలో ఆ శబ్దప్రత్యయాలే ఉండవలసి వస్తుంది కదా అనడానికి అవకాశం లేదు "స్వరూపబాహ్యరూపాపేక్షచేత" అని దీనికి సమాధానం పూర్వమే చూపి ఉన్నాం. (ఘటపట, ఘట-రూపాదుల స్వరూపాన్ని నిర్దేశించవలసివచ్చి నప్పుడు ఆ శబ్దప్రత్యయాలతో వ్యవహారం ఉంటుంది; నైరంతర్యావస్థ అనే బాహ్యస్వరూపాన్ని నిర్దేశించవలసివచ్చినప్పుడు సంయోగ-సమవాయశబ్దప్రత్యయాలతో వ్యవహారం ఉంటుంది అని భావం).

## భాష్యమ్

తథాణ్వాత్మమనసామప్రదేశత్వాన్న సంయోగః సంభవతి; ప్రదేశవతో ద్రవ్యస్య ప్రదేశవతా ద్రవ్యాన్తరేణ సంయోగదర్శనాత్. కల్పితాః ప్రదేశాః అణ్వాత్మమనసాం భవిష్యన్తీతి చేత్; న.అవిద్యమానార్థకల్పనాయాం సర్వార్థసిద్ధిప్రసంగాత్. ఇయానేవావిద్యమానో విరుద్ధో వావిరుద్ధో వార్థః కల్పనీయో నాతోఽధిక ఇతి నియమహేత్వభావాత్. కల్పనాయాశ్చ స్వాయత్తత్వాత్ప్రభూతత్వసంభవాచ్చ. న చ వైశేషికైః కల్పితేభ్య షడ్భ్యః పదార్థేభ్యః అన్యేఽధికాః శతం సహస్రం వార్థా న కల్పయితవ్యా ఇతి నివారకో హేతురస్తి. తస్మాద్యస్మై కస్మై యద్యదోచ్రతే తత్తత్సిధ్యేత్. కశ్చిత్కృపాలుః ప్రాణినాం దుఃఖబహులః సంసార ఏవ మాభూదితి కల్పయేత్. అన్యో వా వ్యసనీ ముక్తానామపి పునరుత్పత్తిం కల్పయేత్. కస్తయోర్నివారకః స్యాత్?

## బాలానందిని

అవ. పరమాణువులకు సంయోగం కుదరదు గాన ద్వ్యణుకాద్యుత్పత్తి ద్వారా జగదుత్పత్తి పూర్వం నిరాకరించబడింది. అదృష్టం గల ఆత్మతో అణువుల సంయోగం అణువులలో క్రియ కలగడానికి హేతువు; ఆత్మతో అణుపరిమాణం గల మనస్సుకు సంయోగం జ్ఞానాదులకు హేతువు అనే కాణాదపక్షాన్ని ఇప్పుడు నిరాకరిస్తున్నారు-

తథేతి:- పరమాణువులకు విభువైన ఆత్మకు, మనస్సుకు కూడ ప్రదేశం లేకపోవడంచేత, అణ్వాత్మలకు, ఆత్మ మనస్సులకు సంయోగం కుదరదు. ఎందువల్ల ననగా ప్రదేశం ఉన్న ద్రవ్యానికి ప్రదేశం ఉన్న మరొక ద్రవ్యంతో మాత్రమే సంయోగం (లోకంలో) చూడబడుచున్నది. వాస్తవమైన ప్రదేశాలు లేకపోయినా అణ్వాత్మమనస్సులకు కల్పించబడిన ప్రదేశాలు ఉంటాయి అన్నట్లయితే అది యుక్తం కాదు. లేని విషయాలను కల్పించడం ప్రారంభిస్తే సిద్ధించని దంటూ ఏదీ ఉండదు. విరుద్ధమైనా, అవిరుద్ధమైనా లేని అర్థం (విషయం) ఇంతమాత్రమే కల్పించాలి కాని ఇంతకు మించి కల్పించకూడదు అని చెప్పడానికి నియమమేమీ లేదు కదా? కల్పన తన చేతిలో ఉంటుంది గాన ఎంత కల్పనైనా చేయవచ్చు. వైశేషికులు కల్పించిన ఆరు పదార్థాలకు మించి నూరు లేదా వెయ్యి పదార్థాలను కల్పించకూడదు అని నివారించే హేతు వేదీ లేదు కదా? అందుచేత ఎవనికి ఏది ఇష్టమో అదంతా సిద్ధించేస్తుంది. దయాలుడైన ఒకడు ప్రాణులకు దుఃఖభూయిష్టమైన ఈ సంసారమే ఉండకూడదు అని కల్పించవచ్చును. వెఱ్ఱి పట్టుదల గల మరొకడు ముక్తులు కూడ మళ్ళీ పుడతా రని కల్పించవచ్చు. వాళ్ళిద్దర్నీ కాదనేవాడు ఎవడు?

## భాష్యమ్

కించాన్యత్. ద్వాభ్యాం పరమాణుభ్యాం నిరవయవాభ్యాం సావయవస్య ద్వ్యణుకస్యాకాశేన సంశ్లేషానుపపత్తిః. న హ్యాకాశస్య పృథివ్యాదీనాం చ జతుకాష్ఠవత్ సంశ్లేషోఽస్తి? కార్యకారణద్రవ్యయోరాశ్రితాశ్రయభావోఽన్యథా నోపపద్యతే ఇత్యవశ్యం కల్ప్యః సమవాయ ఇతి చేత్, న. ఇతరేతరాశ్రయాత్. కార్యకారణయోర్హి భేదసిద్ధావాశ్రితాశ్రయభావసిద్ధిః, ఆశ్రితాశ్రయభావసిద్ధౌ చ తయోర్భేదసిద్ధిః, కుణ్డబదరవదితీతరేతరాశ్రయతా స్యాత్. న హి కార్యకారణయోర్భేద ఆశ్రితాశ్రయభావో వా వేదాన్తవాదిభిరభ్యుపగమ్యతే. కారణస్యైవ సంస్థాన మాత్రం

కార్యమిత్యభ్యుపగమాత్. కిం చాన్యత్-పరమాణూనాం పరిచ్ఛిన్నత్వా ద్యావత్యో దిశః షడష్టౌ దశ వా తావద్భిరవయవైః సావయవాస్తే స్యుః; సావయవత్వాదనిత్యాశ్చేతి నిత్యత్వనిరవయవత్వాభ్యుపగమో బాధ్యేత. యాంస్త్వం దిగ్భేదభేదినోఽవయవాన్ కల్పయసి త ఏవ మమ పరమాణవ ఇతి చేత్, న. స్థూలసూక్ష్మతారతమ్యక్రమేణ ఆపరమకారణాద్వినాశోపపత్తేః. యథా పృథివీ ద్వ్యణుకాపేక్షయా స్థూలతమా వస్తుభూతాపి వినశ్యతి, తతః సూక్ష్మం, సూక్ష్మతరం చ పృథివ్యేకజాతీయకం వినశ్యతి, తతో ద్వ్యణుకం, తథా పరమాణవోఽపి పృథివ్యేకజాతీయకత్వాద్వినశ్యేయుః. వినశ్యన్తోఽప్యవయవవి భాగేనైవ వినశ్యన్తీతి చేత్; నాయం దోషః. యతో ఘృతకాఠిన్యవిలయనవదపి వినాశోపపత్తిమవోచామ. యథా హి ఘృతసువర్ణాదీనామవిభజ్యమా నావయవానామప్యగ్నిసంయోగాద్ద్రవభావాపత్త్యా కాఠిన్యవినాశో భవిష్యతి, ఏవం పరమాణూనామపి పరమకారణభావాపత్త్యా మూర్త్యాదివినాశో భవిష్యతి. తథా కార్యారమ్భోఽపి నావయవసంయోగేనైవ కేవలేన భవతి. క్షీరజలాదీనామన్తరేణావ్యవయవసంయోగాన్తరం దధిహిమాది కార్యారమ్భదర్శనాత్. తదేవమసారతర్కసన్దృబ్ధత్వాత్, ఈశ్వరకారణశ్రుతి విరుద్ధత్వాత్, శ్రుతిప్రవణైశ్చ శిష్టైర్మన్వాదిభిః అపరిగృహీతత్వాత్, అత్యన్తమేవానపేక్షాస్మిన్ పరమాణుకారణవాదే కార్యా శ్రేయోర్థిభిరితి వాక్యశేషః. 17.

## బాలానందిని

కిం చాన్యదితి:- మరొక టేమనగా- అవయవాలు గల ద్వ్యణుకం అవయవాలు కాని రెండు అణువులతో సంశ్లేషం పొందడం (ఒకప్రక్క పట్టుకొని లాగితే మొత్తం కదిలి వచ్చే టట్లు కలవడం) ఆకాశంతో వలెనే, కుదరదు. ఆకాశమూ పృథివి మొదలైనవి, రెండు లక్కపుల్లలు అతుక్కొన్నట్లు అతుక్కొనడం కుదరదు కదా? అలా కాకపోతే (సంశ్లేషం లేకపోతే) కార్యకారణద్రవ్యాలకు ఆశ్రితాశ్రయభావం (కార్యం ఆశ్రితం, ఆశ్రయించినది కారణం ఆశ్రయం) కుదరదు గాన తప్పనిసరిగా సమవాయాన్ని కల్పించాలి అన్నట్లయితే అది యుక్తం కాదు. అన్యోన్యాశ్రయదోషం కలుగుతుంది. కార్యకారణాలకు భేదం సిద్ధిస్తే ఆశ్రితాశ్రయభావం సిద్ధిస్తుంది. ఆశ్రితాశ్రయభావం సిద్ధిస్తే వాటికి, కుండబదరాలకి వలె భేదం సిద్ధిస్తుంది అని

అన్యోన్యాశ్రయదోషం కలుగుతుంది. (కుండ, రేగిపళ్లు వేరు వేరైనవి. బదరాలను కుండలో పోస్తే వాటికి (కుండబదరాలకు) ఆశ్రయాశ్రితభావం ఉంటుంది. కాని ఇక్కడ కార్యం వేరు కారణం వేరు అని నిశ్చయించకలుగుతే ఆశ్రితాశ్రయభావం చెప్పవచ్చు. ఆశ్రితాశ్రయభావం నిశ్చితం అవుతే భేదం చెప్పవచ్చు. ఈ విధంగా అన్యోన్యాశ్రయదోషం అని అర్థం). వేదాంతవాదులు కార్యకారణాలకి భేదం గాని, వాటి మధ్య ఆశ్రితాశ్రయభావసంబంధాన్ని అంగీకరించరు కదా? ఎందువల్ల ననగా-కారణం ఒకానొక భంగిమలో ఉండడమే కార్యం అని వాళ్లు అంగీకరిస్తారు.

అవ. పరమాణువులకు అవయవాలు లేవని చెప్పడం కూడ యుక్తం కా దని చెపుతున్నారు-

కించేతి:- పరమాణువులు పరిచ్ఛిన్నమైనవి, అనగా నిశ్చిత మైన పరిమాణం గలవి. అందుచేత వాటికి (వాటిచుట్టూ) ఆరు గాని, ఎనిమిది గాని, పది గాని ఎన్ని దిక్కులైతే ఉన్నాయో అన్ని అవయవాలు వాటికి (పరమాణువులకు) ఉన్నాయని అంగీకరించాలి. అప్పుడు అవి సావయవా లవడంచేత అనిత్యము లైపోతాయి. అందుచేత అణువులు నిరవయవాలు, నిత్యమైనవి అనే మీ అభ్యుపగమం బాధితం అవుతుంది. దిగ్భేదంచేత భిన్నములైన ఏ అవయవాలను నువ్వు కల్పిస్తున్నావో అవే నాకు పరమాణువులు అన్నట్లయితే, అది యుక్తంకాదు. ఎందువల్ల ననగా స్థూల సూక్ష్మతారతమ్యంచేత పరమకారణం వరకు వినాశం జరగవలసి ఉంటుంది. పృథివి ద్వ్యణుకాదుల అపేక్షచేత స్థూలతమమైనది. అది వాస్తవమే అయినా కూడ నశిస్తూన్నది. దానికంటె సూక్ష్మమూ సూక్ష్మతరమూ అయిన, పృథివీ జాతికి చెందినది నశిస్తుంది. దాని తరవాత ద్వ్యణుకం నశిస్తుంది. (ఈ విధంగా స్థూల-సూక్ష్మ-సూక్ష్మతరాలైన పృథివీజాతికి చెందిన వన్నీ, తరవాత పృథివీజాతికి చెందిన ద్వ్యణుకమూ ఏ విధంగా నశిస్తున్నాయో) అదే విధంగా పృథివీజాతికి చెందినవే గాన పరమాణువులు కూడ నశించాలి. నశించేవి అవయవ విభాగం ద్వారానే నశిస్తాయి. (అణువులకు అవయవాలు లేవు గాన అవయవ విభాగం ద్వారా నశించడం కుదరదు కదా?) అన్నట్లయితే ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా ఘృతకాఠిన్యవిలయనం వలె కూడ వినాశం జరగవచ్చు అని చెప్పి ఉన్నాం. నెయ్యి. బంగారం మొదలైనవాటి అవయవాలు విడిపోకుండా ఉండగానే అగ్నిసంయోగంచేత ద్రవ్యత్వం ఏర్పడి వాటి కాఠిన్యం ఏ విధంగా నశిస్తుందో అదే విధంగా పరమాణువులు కూడా పరమకారణస్వరూపాన్ని (తమ కారణమైన ఆత్మయొక్క స్వరూపాన్ని) పొందడం ద్వారా వాటి మూర్త్యాదుల వినాశం జరుగుతుంది.

అవ. కార్యారంభం అవయవాల సంయోగం ద్వారానే కలగాలి అనే నియమం కూడ లేదని చెపుతున్నారు.

తథేతి:- కార్యారంభం కూడ కేవలం అవయవాల సంయోగంమాత్రంచేతనే కలగదు. పాలు, నీళ్లు మొదలైనవి (క్రొత్తగా) మరొక అవయవసంయోగం ఏదీ లేకుండానే పెరుగు, మంచుగడ్డ మొదలైన కార్యాల ఆరంభం చేయడం కనబడుతున్నది కదా? ఈ విధంగా సారం లేని తర్కంచేత అల్లబడడంవల్ల, ఈశ్వరుడు కారణం అని చెప్పే శ్రుతికి విరుద్ధ మవడంవల్లా, శ్రుతియందు శ్రద్ధావంతులైన మన్వాదులచేత స్వీకరించబడకపోవడంవల్లా కూడ, ఈ పరమాణుకారణవాదంలో శ్రేయస్సు కోరుకొనేవారు ఏ మాత్రమూ ఆసక్తి చూపకూడదు అని వాక్యశేషం (చివర చెప్పవలసిన మాట). 17.

పరమాణుజగదకారణత్వాధికరణం సమాప్తం.

## 4. సముదాయాధికరణమ్. సూ.18-27

### సూ. సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః 2.2.18

వైశేషికరాద్ధాన్తో దుర్యుక్తియోగాద్వేదవిరోధాచ్ఛిష్టాపరిగ్రహాచ్చ నాపేక్షిత ఇత్యుక్తమ్; సోఽర్ధవైనాశిక ఇతి వైనాశికత్వసామ్యాత్సర్వవైనాశికరాద్ధాన్తో న తరామపేక్షితవ్య ఇతీదమిదానీముపపాదయామః. స చ బహుప్రకారః ప్రతిపత్తిభేదాద్వినేయభేదాద్వా. తత్రైతే త్రయో వాదినో భవన్తి-కేచిత్సర్వాస్తిత్వ వాదినః. కేచిద్విజ్ఞానాస్తిత్వమాత్రవాదినః. అన్యే పునః సర్వశూన్యత్వవాదిన ఇతి. తత్ర యే సర్వాస్తిత్వవాదినః బాహ్యమాన్తరం చ వస్త్వభ్యుపగచ్ఛన్తి, భూతం, భౌతికం చ చిత్తం చైత్తికం చ, తాంస్తావత్ప్రతి బ్రూమః. తత్ర భూతం పృథివీధాత్వాదయః. భౌతికం రూపాదయశ్చక్షురాదయశ్చ. చతుష్టయే చ పృథివ్యాదిపరమాణవః ఖరస్నేహోష్ణేరణస్వభావాః. తే పృథివ్యాదిభావేన సంహన్యన్తే ఇతి మన్యన్తే. తథా రూపవిజ్ఞాన వేదనాసంజ్ఞాసంస్కారసంజ్ఞకాః పఞ్చ స్కన్ధాః. తేఽప్యధ్యాత్మం సర్వవ్యవహారాస్పదభావేన సంహన్యన్త ఇతి మన్యన్తే.

### బాలానందిని

సముదాయ ఇతి:-'ఉభయహేతుకేఽపి= రెండు హేతువులు గల, సముదాయే = భూతభౌతికసంహతిరూపము, పంచస్కంధీరూపమూ అయిన సముదాయం

అంగీకరించబడినట్లయితే, తదప్రాప్తిః= సముదాయం ప్రాప్తించదు; ఆ సముదాయద్వయం ఏర్పడే సాధనం ఏదీ లేదు" అని సూత్రార్థం.

వైశేషికేతి:- దుర్యుక్తులతో కూడినందువల్లా, వేదవిరోధంవల్లా, శిష్టులు స్వీకరించకపోవడంవల్లా వైశేషికుల సిద్ధాంతం ఆదరింపదగినది కాదు అని చెప్పబడింది. వైశేషికుడు అర్ధవైనాశికుడు గాన వైనాశికత్వంలో పోలిక ఉండడంవల్ల సర్వవైనాశికుల సిద్ధాంతం ఏ మాత్రమూ కూడ ఆదరింపతగినది కాదని ఇప్పుడు ప్రతిపాదిస్తున్నాం.

వి. వైశేషికులు పరమాణు-ఆకాశ-దిక్-కాల -ఆత్మ-మనస్, సామాన్య-విశేష - సమవాయాలను, పరమాణ్వాదులోని కొన్ని గుణాలను నిత్యాలని అంగీకరించి ఇవి తప్ప మిగిలిన వన్నీ పూర్తిగా నశిస్తాయి అని అంటారు. కార్యకారణాలకు అభేదం అంగీకరిస్తే కార్యం పూర్తిగా నశిస్తుం దని చెప్పవలసిన పని లేదు, అది కారణరూపంలో ఉంటుంది గాన పూర్తిగా నశించదు. వైశేషికులు అలా అంగీకరించరు గాన పైన చెప్పినవి కాక మిగిలినవన్నీ పూర్తిగా నశిస్తా యనే వాళ్ల సిద్ధాంతం. అందుచేత వాళ్లు అర్ధవైనాశికు లని భామతీకారుడు. బ్రహ్మవిద్యాభరణంలో వైశేషికుల అర్ధవైనాశికత్వం మరొక విధంగా ప్రతిపాదించబడింది. వైశేషికుల మతం ప్రకారం పరిమాణభేదాన్ని పట్టి ద్రవ్యం మారిపోతూ ఉంటుంది. తిన్న త్రాగిన ఆహారపానీయాదుల పాకంచేత శరీరంలోని కొన్ని అవయవాలు పెరుగుతూంటాయి. ఈ పెరిగిన అవయవాలచేత ఏర్పడిన అవయవి (శరీరం) పూర్వశరీరంకంటె భిన్నమైనది. అలా ఆరంభించబడిన శరీరంనుండి మలాదులు తొలగిపోవడంవల్ల, రాపిడి మొదలైనవి కలగడంవల్ల, ధాతువుల వైషమ్యం వల్లా కొన్ని అవయవాలు శిథిలము లైపోతాయి. అప్పుడు కొన్ని అవయవాలు తొలగిపోయిన శరీరం మళ్లీ వెనుకటి శరీరంకంటె భిన్న మైనది. ఈ విధంగా శరీరంలో ప్రతిక్షణమూ జరిగే ఉపచయాపచయాలు స్పష్టంగా కనబడకపోయినా కొన్ని రోజులలోను, పక్షాలలోను, మాసాలలోను, సంవత్సరాలలోను స్పష్టంగా కనబడుతూనే ఉంటాయి. సూర్యచంద్రాదుల గతిని ఊహించి నట్లు, అనగా సూర్యుడు చంద్రుడు నడుస్తున్నట్లు మన కంటికి కనబడకపోయినా ఇప్పు డొక చోట కనబడిన సూర్యచంద్రులు కొన్ని నిమిషాల తరవాత మరొక చోట చేరడంచేత వాళ్ల గమనాన్ని ఊహించి నట్లు, ఊహించాలి. ఈ విధమైన అవయవోపచయాప చయాలు వాయ్వభిఘాతాదులచేత సావయవాలైన పర్వత-మేఘాదిసర్వవస్తువులలోను ఉంటాయి. వైశేషికుల లెక్క ప్రకారం ఒక వస్త్రంలోని ఒక దారపు పోచ తీసి వేసినా కూడ వెనుకటి వస్త్రం నశించి క్రొత్త వస్త్రం పుట్టినట్లు. అందుచేత అర్ధంలో అనగా అవయవియొక్క భాగంలో వినాశాన్ని అంగీకరిస్తారు గాన వాళ్లు అర్ధవైనాశికులు. (బ్ర.వి.ఆ.2 భాగం. 146 పేజి).

బౌద్ధుల మతం ప్రకారం ప్రతీ భావపదార్థమూ కూడ క్షణికమే. ప్రతీవస్తువు పుట్టిన మరు క్షణంలో నశిస్తుంది. వీళ్లలోని శూన్యవాదం ప్రకారం చివరికి అంతా శూన్యమే. అందుచేత వీళ్లు సర్వవైనాశికులు. అర్థవైనాశికులను గూర్చి చెప్పి తరవాత సర్వవైనాశికుల మాట గుర్తుకు రావడం సహజం గాన ఆ మతం ఇప్పుడు విమర్శించబడుచున్న దని అర్థం. అందుచేత ఈ అధికరణానికి పూర్వాధికరణంతో ప్రసంగసంగతి.

స చేతి: అర్థం చేసుకొనడంలో భేదం ఉండడంచేతనో, శిష్యభేదంచేతనో ఆ బౌద్ధరాద్ధాంతం అనేకవిధాలుగా ఉంది.

వి. బౌద్ధులలో సౌత్రాంతికులు, వైభాషికులు, యోగాచారులు మాధ్యమికులు అని నాల్గువిధాలవాళ్లు ఉన్నారు. బుద్ధుడు చేసిన ఉపదేశం ఒకే విధంగానే ఉన్నా కూడ శిష్యులు వేరు వేరు విధాలుగా అర్థం చేసుకొనడంవల్ల ఈ భేదాలు వచ్చాయి; లేదా శిష్యుల అధికారతారతమ్యాన్ని పట్టి బుద్ధుడే నాలుగు విధాలుగా బోధించి ఉంటాడు. అయితే బుద్ధుని పరమతాత్పర్యం మాత్రం శూన్యవాదాన్ని బోధించడంలోనే. ఈ విషయం బోధిచిత్తవివరణం అనే గ్రంథంలో చెప్పబడింది-

"దేశనా లోకనాథానాం సత్త్వాశయవశానుగాః,
భిద్యన్తే బహుధా లోక ఉపాయైర్బహుభిః పునః.
గమ్భీరోత్తానభేదేన క్వచిచ్చోభయలక్షణా
భిన్నాపి దేశనాఽభిన్నా శూన్యతాద్వయలక్షణా" (భామతి)

"లోకనాథు లైన బుద్ధుల ఆగమాలు ప్రాణుల (మనుష్యుల) అభిప్రాయాలను పట్టి అనేకమైన ఉపాయాలచేత అనేకవిధాలుగా కనబడుతూంటాయి. దేశన (ఉపదేశం) కొన్ని చోట్ల గంభీరంగా ఉంటుంది; కొన్నిచోట్ల పై పై విషయాలు చెప్పిన ట్లుంటుంది. అయితే అద్వితీయశూన్యరూపమైన దేశనమాత్రం ఒక్కటే. అనగా శిష్యులలో కొందరు హీనమతులు, కొందరు మధ్యమమతులు, కొందరు ఉత్కృష్టమతులు ఉంటారు. ఉత్కృష్టమతులకు ముందుగానే శూన్యసిద్ధాంతాన్ని ఉపదేశించినా మిగిలిన రెండు రకాలవాళ్లకీ ముందుగా వాళ్లకి తెలిసే విధంగా చిన్న చిన్న స్థూలవిషయాలు చెప్పి చివరికి వాళ్లని కూడా శూన్యసిద్ధాంతంలోనికి తీసికొనివెళ్లడం జరుగుతుందని భావం.

తత్రేతి:- వాళ్లలో మూడు రకాలైన వాదు లుంటారు- కొందరు అన్ని పదార్థాలూ ఉన్నా యని అంగీకరిస్తారు. కొందరు విజ్ఞానం మాత్రమే ఉన్న దని అంగీకరిస్తారు. కొందరు సర్వమూ శూన్యమే అని అంగీకరిస్తారు. ఈ మూడు రకాల వాళ్లలో

సర్వాస్తిత్వవాదులైన (అన్నిపదార్థాల అస్తిత్వాన్ని అంగీకరించేవాళ్లు) ఎవరు భూతం భౌతికం అనే బాహ్యవస్తువులను, చిత్తం, చైత్తం అనే ఆంతర (లోపలనున్న) వస్తువునూ కూడ అంగీకరిస్తారో వాళ్లని గూర్చి చెప్తున్నాం.

వి. బౌద్ధులలో సౌత్రాంతికులు, వైభాషికులూ కూడ బాహ్యమైన పదార్థాలు ఉన్నా యని అంగీకరిస్తారు. అయితే సౌత్రాంతికులు పదార్థా లన్నీ పరోక్షాలు (ప్రత్యక్షంగా కనబడవు) అని అంటారు. వైభాషికులు అవి ప్రత్యక్షంగా కనబడతా యని అంటారు. ఈ విధమైన భేదం ఉన్నా కూడ ఇద్దరూ బాహ్యపదార్థాస్తిత్వాన్ని అంగీకరించారు గాన ఇక్కడ ఆ ఇద్దరి సిద్ధాంతమూ ఏకం చేసి ఒకటిగా నిర్దేశించడం జరిగింది.

తత్రేతి:- వాటిలో పృథివీ ధాతువు మొదలైనది భూతం. (ధాతుశబ్దాన్ని బౌద్ధులు పదార్థం అనే అర్థంలో ఉపయోగిస్తారు). రూపాదులు, (నదీపర్వతాదులు) చక్షురాదీంద్రియాలు భౌతికం. పృథివ్యాదిపరమాణువులు (పృథివీ-ఆప్.తేజస్-వాయు పరమాణువులు) నాలుగు విధాలైనవి ఉన్నాయి. అవి వరసగా ఖర-స్నేహ-ఉష్ణ-ఈరణ స్వభావం గలవి. (పార్థిమాణువులు కఠినంగాను, ఆప్యపరమాణువులు స్నిగ్ధంగాను, తైజసపరమాణువులు ఉష్ణంగాను, వాయు పరమాణువులు చలనస్వభావంతోను ఉంటాయి). అవన్నీ పృథివ్యాదిరూపంలో కలుస్తాయి అని వాళ్లు అంటారు. అదే విధంగా రూప-విజ్ఞాన-వేదనా-సంజ్ఞా-సంస్కారా లనే ఐదు స్కంధాలు శరీరంలో కలుస్తాయి, అవి సర్వవ్యవహారాలకి కారణం అవుతాయని కూడ వాళ్లు అంటారు.

వి. కాణాదుల ప్రకారం అణువులు ద్వ్యణుకాదిక్రమంలో కలిసి మహాభూతాలుగా అవుతాయి. అయితే బౌద్ధులు రెండు అణువుల నుండి ద్వ్యణుకాలు పుడతాయి, ద్వ్యణుకాదుల నుండి త్ర్యణుకాదులు పుడతాయి అని అంగీకరించరు. మనకు ప్రత్యక్షంగా కనబడే పృథివ్యాదులు ఆ యా అణువుల సముదాయాలే అని వాళ్ల మతం. పృథివ్యాద్యణువులనుండి పుట్టినది భూతభౌతికసముదాయం. రాగాదిస్కంధపంచకం ఆధ్యాత్మికమైన చిత్తచైత్యసముదాయం. విషయాలు, ఇంద్రియాలు రూపస్కంధం. విషయాలైన పృథివ్యాదులు బాహ్యాలైనా అవి కూడ శరీరంలో ఉండడంచేత, లేదా శరీరంలో ఉన్న ఇంద్రియాలచేత గ్రహింపబడడంచేత అంతరాలుగా చైత్తాలుగా చెప్పబడ్డాయి. ఇంద్రియాలు పృథివ్యాదిజన్యాలవడంచేత భౌతికాలే అయినా శరీరంతో సంబంధించి ఉండడంచేత ఆంతరాలుగా చెప్పబడ్డాయి. నేను అనే విజ్ఞానప్రవాహం విజ్ఞానస్కంధం. దీనికి ఆలయవిజ్ఞానం అని కూడపేరు. నిర్వికల్పకమూ, సవికల్పకమూ అయిన రూపాదిజ్ఞానానికి ప్రవృత్తివిజ్ఞానం అని పేరు.

ఇది కూడ విజ్ఞానస్కంధంలో చేరుతుంది. సుఖదుఃఖాద్యనుభవం వేదనాస్కంధం. మనుష్యుడు, గోవు, అశ్వం ఇత్యాది సంజ్ఞల జ్ఞానం రూపంలో ఉన్న సవికల్పకజ్ఞానం సంజ్ఞాస్కంధం. రాగాదిక్లేశాలు, మదమానాద్యుపక్లేశాలు, ధర్మాధర్మాలు ఇవి సంస్కారస్కంధం. వీటిలో విజ్ఞానస్కంధం చిత్తం అని, ఆత్మ అనీ చెప్పబడుతుంది. మిగిలిన నాలుగూ చైత్తాలు (చిత్తానికి సంబంధించినవి). (సవికల్పమూ నిర్వికల్పమూ అని జ్ఞానం రెండు విధాలు. ఏదైన ఒక వస్తువును చూచిన వెంటనే దానికి సంబంధించిన విశేషా లేమీ తెలియకుండా ఏదో ఒక వస్తువు అని మాత్రమే ముందుగా కలిగే జ్ఞానం నిర్వికల్పకం. మరుక్షణంలో ఇది గోవు, నల్లగా ఉంది, పొట్టిగా ఉంది ఇత్యాది విశేషా లన్నీ తెలిసిన జ్ఞానం సవికల్పకం).

## భాష్యమ్

తత్రేదమభిధీయతే- యోఽయముభయహేతుక ఉభయప్రకారః సముదాయః పరేషామభిప్రేతః అణుహేతుకశ్చ భూతభౌతికసంహతిరూపః, స్కన్ధహేతుకశ్చ పఞ్చస్కన్ధీరూపః, తస్మిన్నుభయహేతుకేఽపి సముదాయే ఽభిప్రేయమాణే తదప్రాప్తిః సముదాయభావానుపపత్తిరిత్యర్థః, కుతః? సముదాయానామచేతనత్వాత్. చిత్తాభిజ్వలనస్య చ సముదాయసిద్ధ్యధీనత్వాత్. అన్యస్య చ కస్య చిచ్చేతనస్య భోక్తుః ప్రశాసితుర్వా స్థిరస్య సంహన్తురనభ్యుపగమాత్. నిరపేక్ష ప్రవృత్త్యభ్యుపగమే చ ప్రవృత్త్యనుపరమప్రసంగాత్. ఆశయస్యాప్యన్యత్వానన్యత్వాభ్యామ్ అనిరూప్యత్వాత్. క్షణికత్వాభ్యుపగమాచ్చ నిర్వ్యాపారత్వాత్ప్రవృత్త్యనుపపత్తేః. తస్మాత్సముదాయానుపపత్తిః.సముదాయానుపపత్తౌచ తదాశ్రయా లోకయాత్రా లుప్యేత. 18.

తత్రేతి:- ఈ విషయంలో ఇది చెప్పబడుచున్నది. భూతభౌతికాల కలయిక అనే స్వరూపం గల సముదాయం అణుహేతుకం (అణువులు హేతువుగా కలది: అణువులచేత ఏర్పడుతుంది); పంచస్కంధి అనే పేరు గల సముదాయం (చిత్తచైత్తాత్మకమైనది) స్కంధహేతుకం; ఈ విధంగా ఉభాయప్రకారకమైన (రెండు విధాలైన) సముదాయం ఉభయహేతుక మైనది అని ఇట్టి ఉభయహేతుక మైన సముదాయాన్ని పరులు (బౌద్ధులు) అంగీకరిస్తున్నారు. ఇలా వాళ్లు అంగీకరిస్తున్నారు కాని అది లభించదు. అనగా సముదాయభావం (సముదాయత్వం) లభించదు.

ఎందువల్ల? సముదాయులు (అ సముదాయాలలో చేరినవి) అచేతనాలు గాన (చిత్తాభిజ్వలనం (చిత్తరూపమైన విజ్ఞానం) సముదాయానికి హేతువు అనడానికి కుదరదు). ఎందువల్ల ననగా చిత్తాభిజ్వలనం సముదాయసిద్ధిమీద ఆధారపడి ఉంటుంది. (అనగా సముదాయం ఏర్పడిన తరవాతనే చిత్తాభిజ్వలనం ఉంటుంది గాన అది సముదాయానికి హేతువు కాజాలదు). అణుస్కంధాలు తప్ప మరొక చేతనుడైన భోక్తను గాని, ప్రశాసితను (ఈశ్వరుణ్ణి) గాని మీరు అంగీకరించలేదు. ఎవరి అపేక్షా లేకుండానే అణుస్కంధాలలో (భూతభౌతిక చిత్తచైత్తాలలో) ప్రవృత్తి ఉంటుంది (అందుచేత సముదాయం ఏర్పడుతుంది) అని అంగీకరిస్తే ఆ ప్రవృత్తి ఆగిపోవడం అంటూ ఉండదు. (అందుచేత అనిర్మోక్షప్రసంగం ఏర్పడుతుంది). ఆశయం కూడ అన్యమా భిన్నమా అని చెప్పడం శక్యం కాదు.

వి. ఆశేరతే అస్మిన్ రాగాదయ- ఇతి (దేనియందు రాగాదులు నిలిచి ఉంటాయో అది ఆశయం) అనే వ్యుత్పత్తిచేత ఆలయవిజ్ఞాన సంతానానికి, అనగా అవిచ్ఛిన్నమైన విజ్ఞానప్రవాహానికి 'ఆశయం' అని పేరు. స్థిరమైన ఆత్మ అనేది లేదు, ఈ విజ్ఞానప్రవాహమే ఆత్మ. ఈ విజ్ఞానప్రవాహసంతానం సముదాయానికి హేతువు కావచ్చును అని కూడ చెప్పడానికి వీలులేదు. ఆ సంతానం సంతానులైన విజ్ఞానాలకంటె భిన్నమా అభిన్నమా? భిన్నమైన పక్షంలో కూడ స్థిరమా, క్షణికమా? స్థిరమైనది అని అంటే మా సిద్ధాంతాన్నే (నిత్యాత్మవాదాన్నే) అంగీకరించిన ట్లవుతుంది. ఈ విధంగా సంతానం విజ్ఞానాలకంటె అన్యమని గాని అనన్యమని గాని చెప్పడం కుదరదు.

క్షణికత్వేతి:- (అన్యమే అని అంగీకరించి అది కూడ క్షణికమే అన్నట్లయితే) పుట్టిన మరో క్షణంలో నశించేదానికి ఏ వ్యాపారమూ ఉండదుగాన ప్రవృత్తి (సముదాయాన్ని ఏర్పరచ గలిగిన వ్యాపారం) ఉండదు. అందుచేత ఉభయవిధాలైన సముదాయాలు ఏర్పడడం కుదరదు. సముదాయాలు ఏర్పడకపోతే వాటిమీద ఆధారపడి ఉన్న లోకయాత్ర లోపిస్తుంది. 18.

### సూ. ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్.2.2.19

యద్యపి భోక్తా ప్రశాసితా వా కశ్చిచ్చేతనః సంహన్తా స్థిరో నాభ్యుపగమ్యతే తథాప్యవిద్యాదీనామితరేతరకారణత్వాత్ ఉపపద్యతే లోకయాత్రా. తస్యాం చోపపద్యమానాయాం న కించిదపరమపేక్షితవ్యమస్తి. తే చావిద్యాదయోఽవిద్యా, సంస్కారో, విజ్ఞానమ్, నామరూపమ్, షడాయతనమ్, స్పర్శో, వేదనా, తృష్ణా, ఉపాదానం, భవః, జాతిః

జరా,మరణమ్, శోకః, పరిదేవనా, దుఃఖమ్, దుర్మనస్తా ఇత్యేవంజాతీయకాః ఇతరేతరహేతుకాః సౌగతసమయే క్వచిత్సంక్షిప్తా నిర్దిష్టాః క్వచిత్ ప్రపఞ్చితాః. సర్వేషామప్యయమవిద్యాదికలాపోఽప్రత్యాఖ్యేయః. తదేవమవిద్యాకలాపే పరస్పరనిమిత్తనైమిత్తికభావేన ఘటీయన్త్రవదనిశమావర్తమానేఽర్థాక్షిప్త ఉపపన్నః సంఘాత ఇతి చేత్, తన్న. కస్మాత్? ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్. భవేదుపపన్నః సంఘాతః యది సంఘాతస్య కించిన్నిమిత్తమవగమ్యేత. న త్వవగమ్యతే. యత ఇతరేతరప్రత్యయత్వేఽప్యవిద్యాదీనాం పూర్వం పూర్వముత్తరోత్తరస్యోత్పత్తిమాత్రనిమిత్తం భవద్భవేన్న తు సంఘాతోత్పత్తేః కించిన్నిమిత్తం సంభవతి.

## బాలానందిని

ఇతరేతి:- "ఇతరేతరేతరప్రత్యయత్వాత్= అవిద్యాదులు పరస్పరము ఉత్పత్తి హేతువులు గాన సముదాయభావము, లోకయాత్రా కూడ కుదురుతాయి, ఇతి చేత్= అన్నట్లయితే, న=కాదు. ఉత్పత్తిమాత్రనిమిత్తత్వాత్= అవిద్యాదులు కేవలం ఉత్పత్తికి మాత్రమే హేతువు లవడంవల్ల" అని సూత్రార్థం.

యద్యపీతి:- భోక్త అయిన లేదా ప్రశాసకుడైన చేతనుడు ఒకడు స్థిరంగా ఉంటాడు, అతడు వీటిని (భూతభౌతికాలను, చిత్తచైత్తాలను) కలుపుతాడు అని అంగీకరించకపోయినా కూడ అవిద్యాదులు పరస్పరము (ఒకదాని కొకటి) కారణంగా ఉండడంవల్ల లోకయాత్ర జరుగుతుంది. ఆ లోకయాత్ర ఉపపన్నమైన తరవాత అపేక్షించదగినది మరొకటి ఏదీ ఉండదు. ఆ అవిద్యాదులు -అవిద్య, సంస్కారం, విజ్ఞానం, నామరూపం, షడాయతనం, స్పర్శ, వేదన, తృష్ణ, ఉపాదానం, భవం, జాతి, జర, మరణం, శోకం, పరిదేవన, దుఃఖం, దుర్మనస్త ఈ రకమైనవి పరస్పరహేతుకములుగా (ఒకదాని కొకటి హేతువులుగా కలవిగా- హేతువులుగా) సౌగతుల సిద్ధాంతంలో కొన్ని చోట్ల సంక్షిప్తంగాను, కొన్నిచోట విస్తృతంగాను ప్రతిపాదించబడ్డాయి. ఈ అవిద్యాదికలాపాన్ని ఎవరూ ప్రత్యాఖ్యానించజాలరు. అనగా అందరు దార్శనికులూ వీటిని అంగీకరించవలసినదే. ఈ విధంగా అవిద్యాదుల సముదాయం పరస్పర నిమిత్తనైమిత్తికభావంతో (ఒకదాని కొకటి కారణం అవుతూ కార్యం అవుతూ) ఘటీయంత్రం వలె (మోటబావిలో నీళ్లు తోడడానికి పెద్ద చక్రానికి చుట్టూ ఘటాలు కట్టి ఏర్పరచిన యంత్రం వలె) నిరంతరమూ తిరుగుతున్నప్పుడు భూతభౌతికాదులు

సంఘాతభావాన్ని పొందుతాయి అనేది అర్థాత్సిద్ధం- చెప్పకుండానే తెలిసే విషయం- అని అన్నట్లయితే అది యుక్తం కాదు. ఎందువల్ల? అవి ఉత్పత్తి మాత్రానికే నిమిత్తాలు అవడంవల్ల. సంఘాతంగా ఏర్పడడానికి ఏదైనా నిమిత్తం కనబడితే (నువ్వు చెప్పినట్లు) సంఘాతం ఏర్పడడం ఉపపన్నం కావచ్చు. కాని అలాంటి నిమిత్తం ఏదీ కనబడడం లేదు. ఎందువల్ల ననగా అవిద్యాదులు ఇతరేతరప్రత్యయా లైనా కూడ (పరస్పరకారణా లైనా కూడ) పూర్వపూర్వ మైనది ఉత్తరోత్తరమైనదానికి (అది పుట్టడానికి) నిమిత్తం మాత్రం కావచ్చును కాని సంఘాతం పుట్టడానికి కారణం ఏదీ సంభవం కాదు.

వి. అనిత్యాలు, అశుచులు, క్షణికాలు అయిన, శరీరాకారంగా పరిణమించించిన, అనాత్మలైన భూతాల విషయంలో ఇవి నిత్యాలు, శుచి యైనవి, ఇవే స్థిరమైన ఆత్మ అనే బుద్ధి 'అవిద్య'. దానివల్ల శరీరాదులయందు రాగం, అనుకూలంగా లేనివాటి విషయంలో ద్వేషం, దానినిపట్టి ఐహికమూ, ఆముష్మికమూ అయిన వ్యాపారం (ఆ యా పనులు చేయడం) ఇదంతా 'సంస్కారం'. జన్మాంతరానికి సంబంధించిన ఈ అవిద్యాసంస్కారాలచేత గర్భంలో ఉన్న శుక్లశోణితసముదాయంలో 'నేను' అనే ఆలయవిజ్ఞానం ఆవిర్భవించడం 'విజ్ఞానం'. గర్భంలో ఉన్న శుక్లశోణితాలకు ఆలయవిజ్ఞానంతో సంబంధం వల్ల అవి కలలంగాను (చిక్కగాను) బుద్బుదం (బుడగ) గాను ఏర్పడగా ఆ స్థితి 'నామరూపం'. తరవాత గర్భంలో ఉండగానే ఆరు ఇంద్రియాలు ఆయతనరూప మైన (తమకు స్థానమైన) శరీరాకారంలో పరిణమించడం 'షడాయతనం'. శరీరి గర్భంలో ఉండగానే శీతోష్ణాదులను అనుభవించడం 'స్పర్శ'. అక్కడనే సుఖ దుఃఖాదులను అనుభవించడం 'వేదన'. అక్కడ ఉండగానే శరీరి సుఖం కావాలని కోరడం, దుఖం విడవాలని కోరడం- ఇవి 'తృష్ణ'. దీనికి తగిన వ్యాపారం 'ఉపాదానం'. గర్భనుండి నిర్గమించడం (పుట్టడం) 'భవం'. పుట్టినవానికి తలిదండ్రుల జాతిని పట్టి మనుష్యత్వాదిజాతి లభించడం 'జాతి'. తరవాత జర (ముసలితనం). తరవాత 'మరణం'. అంతకుముందు చావనున్నవానికి అన్ని కోరికలు భగ్నము లవడం 'శోకం'. కోరికలు తీరనివాని ఏడుపు పరిదేవనం. బాహ్యేంద్రియాల ద్వారా విషయాలను అనుభవించి నప్పుడు కలిగిన దుఃఖం 'దుఃఖం'. మానసికవిషయాల అనుభవంవల్ల కలిగిన దుఃఖం 'దుర్మనస్త'. చివరికి మరణం - 'ఏతంజాతీయకాః' అవడంచేత లోకాంతరప్రాప్తి, మళ్లీ రావడం మొదలైనవి గ్రహించాలి (బ్రహ్మవిద్యాభరణం).

ప్రతీత్యసముత్పాదాన్ని గూర్చి వాచస్పతి మిశ్రులు భామతిలో ఈ విధంగా వివరించి ఉన్నారు. "ఇదం ప్రత్యయలక్షణమ్", "ఉత్పాదాద్వా తథాగతానామనుత్పాదాద్వా స్థితైవైషాం ధర్మాణాం ధర్మతా", "ధర్మస్థితితా ధర్మనియామకతా ప్రతీత్యసముత్పాదానులోమతా"-

ఇవి ప్రతీత్యసముత్పాదాన్ని గూర్చిన బుద్ధసూత్రాలు. ఈ సూత్రాలకు కల్పతరువులో ఈ విధంగా అర్థం చెప్పబడింది- "ప్రత్యయతే ఇతి ప్రత్యయః'= మరొక హేతువును గూర్చి వెళ్ళేది గాన. 'ప్రత్యయం' అని పేరు. అనగా ఇతర సహకారులతో కలిసి మరొక హేతువు దగ్గరికి వెళ్లేది ప్రత్యయం. ఇదమ్=ఈ కార్యం, ప్రత్యయఫలమ్= కారణ సముదాయంయొక్క ఫలమే కాని, ఏ చేతనము యొక్క ఫలం కాదు అని మొదటి సూత్రానికి అర్థం. తథాగతానామ్= బుద్ధుల మతంలో, ధర్మాణామ్= (ధర్మం అనగా కారణమూ కార్యమూ కూడ) కార్యకారణములయొక్క, ధర్మతా=ధర్మత్వము, అనగా కార్యకారణభావము. ఉత్పాదాద్వా=పుట్టడంవల్ల గాని, అనుత్పాదాద్వా=పుట్టకపోవడం వల్ల గాని, స్థితా=ఉన్నది, ఏర్పడినది. అనగా ఏది ఉంటే ఏది పుడుతుందో, ఏది లేకపోతే ఏది పుట్టదో అది దానికి కార్యం. ఆ కార్యానికి అది కారణం. కార్యకారణ భావాన్ని ఈ విధంగానే నిశ్చయించాలి గాన చేతన మైన కారణం ఏదీ లేదు అని భావం. ప్రతీత్యసముత్పాదానులోమతా= కారణం ఉన్నప్పుడు దానిని చేరి సముత్పాదాన్ని అనుసరించడం అనగా ఉన్న కారణం నుంచి పుట్టడం, ధర్మస్థితితా=కార్యంయొక్క స్థితి. అదే, ధర్మనియామకతా= కారణం కార్యాన్ని నియమించడం. కారణం ఉంటే దాన్ని అనుసరించి కార్యం పుడుతుంది, ఆ కార్యాన్ని ఆ కారణం నియమిస్తుంది (తానే దానికి కారణం అని నియమిస్తుంది) అని భావం. ఇంతే తప్ప కార్యోత్పత్తిలో చేతనంయొక్క అపేక్ష ఏమీ లేదు. (సర్వదర్శనసంగ్రహంలో కూడ ఈ సూత్రాలు ఉదాహరించబడ్డాయి).

ప్రతీత్యసముత్పాదం, హేతూపనిబంధం (ఒకే ఒక కారణంతో సంబంధం) ప్రత్యయోపనిబంధం (కారణసముదాయంతో సంబంధం) అనే రెండు కారణాలవల్ల జరుగుతంది. అది (ప్రతీత్యసముత్పాదం) బాహ్య మనీ ఆధ్యాత్మిక మనీ మళ్లీ రెండు విధాలు. వాటిలో బాహ్యమైన ప్రతీత్యసముత్పాదానికి హేతూపనిబంధం ఎట్లనగా- బీజంనుంచి అంకురం పుడుతుంది. అంకురంనుండి ఆకు, ఆకునుండి కాండం, కాండంనుండి నాలం(గొట్టం), నాలం నుండి గర్భం, గర్భంనుండి శూకం(వెన్ను), శూకం నుండి పుష్పం, పుష్పంనుండి ఫలం పుడతాయి. బీజం లేకపోతే అంకురం లేదు; ఈ విధంగా చివరిదాకా వెళ్లగా పుష్పం లేకపోతే ఫలం లేదు. బీజం ఉంటే అంకురం ఉంటుంది; ఈ విధంగా చివరివరకూ వెళ్లగా పుష్పం ఉంటే ఫలం ఉంటుంది. అయితే నేను అంకురాన్ని పుట్టిస్తున్నా ననే జ్ఞానం బీజానికి ఉండదు. నన్ను బీజం పుట్టించిం దని అంకురానికి కూడ జ్ఞానం ఉండదు. ఈ విధంగా చివరి వరకూ వెళ్లగా నేను ఫలాన్ని పుట్టిస్తున్నా ననే జ్ఞానం పుష్పాని కుండదు; నన్ను పుష్పం పుట్టించిం

దనే జ్ఞానం ఫలానికి ఉండదు. ఈ విధంగా చైతన్యం లేకపోయినా, బీజాదులకు మరొక అధిష్ఠాత (ప్రేరకుడు) లేకపోయినా, కార్యకారణభావనియమం కనబడుతున్నది. ఇది హేతూపనిబంధం.

ఇప్పుడు ప్రతీత్యసముత్పాదానికి ప్రత్యయోపనిబంధం చెప్పబడుచున్నది- ప్రత్యయం అనగా అనేక హేతువుల సముదాయం (కలయిక). బీజం కారణంగా గల అంకురం ఆరు ధాతువుల సమువాయంవల్ల కలుగుతుంది. వాటిలో పృథివీధాతువు బీజాన్ని సంగ్రహిస్తుంది. దానివల్ల అంకురం కఠినం అవుతుంది. జలాధాతువు బీజంలో తేమ పుట్టిస్తుంది. తేజోధాతువు బీజాన్ని పక్వం చేస్తుంది. వాయుధాతువు బీజాన్ని కొడుతుంది, దానిచేత అంకురం బీజంనుంచి బైటకు వస్తుంది. ఆకాశధాతువు బీజానికి అనావరణం కల్పిస్తుంది. ఋతువు బీజంలో పరిణామం చేస్తుంది. ఈ విధంగా ఈ అన్ని ధాతువులూ, ఏ ఒక్కటీ తక్కువ కాకుండా కలిసి నప్పుడే బీజంనుంచి అంకురం పుడుతుంది కాని మరొక విధంగా పుట్టదు. వాటిలో పృథివీధాతువుకు నేను బీజానికి సంగ్రహకృత్యం చేస్తున్నాననే జ్ఞానం కలగదు. ఈ విధంగా చివరిదాకా వెడితే నేను బీజంలో పరిణామం చేస్తున్నా నని ఋతువు అనుకొనదు. అంకురం కూడ నన్ను ఈ ప్రత్యయాలు (హేతువులు) పుట్టించా యని అనుకొనదు.

ఇదే విధంగా ఆధ్యాత్మికమైన ప్రతీత్యసముత్పాదం కూడ హేతూపనిబంధం ప్రత్యయోపనిబంధం అనే రెండు కారణాలవల్ల జరుగుతుంది. వాటిలో అవిద్యా ప్రత్యయాలు (అవిద్యారూపమైన భ్రాంతులు, సంస్కారాలు) మొదలు జాతిప్రత్యయ- జరామరణాదులవరకు దీని హేతూపనిబంధం. అవిద్య ఉండిఉండకపోతే సంస్కారాలు పుట్టేవి కావు. ఈ విధంగానే జాతివరకు. జాతి లేకపోతే జరామరణాదులు కలిగేవి కాదు. నేను సంస్కారాలను పుట్టిస్తున్నా నని అవిద్య అనుకొనదు. మమ్మల్ని అవిద్య పుట్టిస్తూన్న దని సంస్కారాలు అనుకొనవు. ఈ విధంగానే జాతివరకు. నేను జరామరణాదులను కలిగిస్తున్నా నని జాతి అనుకొనదు. మనల్ని జాత్యాదులు పుట్టిస్తున్నా యని జరామరణాదులు అనుకొనవు. అయితే తాము అచేతనాలైన అవిద్యాదు లున్నప్పుడు, అవి చేతనాధిష్ఠితాలు కాకపోయినా, బీజాదులు చేతనాలు కాకపోయినా, మరొక చేతనంచేత అధిష్ఠితాలు కాకపోయినా అంకురాదులు పుట్టినట్లు, సంస్కారాదులు పుడతాయి. ఇది దీనిని, ప్రతీత్య=పొంది, ఉత్పద్యతే=పుట్టుచున్నది అనేది మాత్రమే కనబడుతున్నది గాని అది చేతనాధిష్ఠితమై ఉన్నట్లు కనబడడం లేదు కదా? ఇది ఆధ్యాత్మికప్రతీత్యసముత్పాదానికి హేతూపనిబంధం.

ఇంక ప్రత్యయోపనిబంధం- పృథివీ-అప్-తేజస్-వాయు -ఆకాశ-విజ్ఞానధాతువుల సమవాయంనుండి కాయం (శరీరం) పుడుతున్నది. పృథివీ ధాతువు కాయానికి కాఠిన్యాన్ని కలిగిస్తుంది. అబ్ధాతువు శరీరంలో స్నేహం (తడి) ఉండేటట్లు చేస్తుంది. తేజోధాతువు శరీరంలో ఉన్న ఆహారాన్ని జీర్ణింపచేస్తుంది. వాయుధాతువు శరీరంలో శ్వాసాదులను కలగజేస్తుంది. ఆకాశధాతువు కాయంలోపల రంధ్రం (అవకాశం) ఏర్పరుస్తుంది. 'దేవదత్తుడు' ఇత్యాది నామానికి, శుక్లత్వం మొదలైన రూపానికి ఆశ్రయమైన శరీరం నామరూపం. దాని సూక్ష్మావస్థ కలలబుద్బుదాది రూపంతో ఉన్న నామరూపం. ఆ అంకురాన్ని శబ్దాదివిషయాలను గ్రహించి కార్యాలైన ఐదు విజ్ఞానాలతో కలిసేటట్లు ఏది చేస్తుందో, ఆస్రవంతో (కర్మతో) కూడినది, సమనంతరప్రత్యయరూపమైనదీ (వెంటనే జ్ఞానాల రూపమైనదీ) అయిన మనో విజ్ఞానాన్ని ఏది పుట్టిస్తుందో అది విజ్ఞానధాతువు. అదే ఆలయవిజ్ఞానం. ఆధ్యాత్మికాలైన పృథివ్యాదులు, ఏ ఒక్కటీ లోపించకుండా ఉండి అవి అన్నీ కలియడంవల్ల కాయం ఉత్పన్నమవుతుంది. మేం కాయానికి కాఠిన్యాదులు కల్పిస్తున్నాం అని పృథివ్యాదులు అనుకొనవు. కాయం కూడ నన్ను ఈ ప్రత్యయాలు పుట్టించాయి అని అనుకొనదు. అయినా కూడ అచేతనాలైన పృథివ్యాదిధాతువులనుండి, అవి చేతనాంతరాధిష్ఠితాలు కాకపోయినా, అంకురం వలె, కాయం పుట్టుచున్నది. ప్రత్యక్షంగా కనబడుతూన్న ఈ ప్రతీత్యసముత్పాదాన్ని లేదనడానికి వీలులేదు. కాయాకారంలో పరిణమించిన ఈ ధాతువులకు ఒకటి అనీ, ఒక పిండం అనీ, నిత్య మనీ, సుఖ మనీ, సత్త్వ మనీ, పుద్గల మనీ మనుష్య డనీ, తల్లి అనీ, కొమార్తె అనీ, అహంకార మనీ, మమకార మనీ ఏ సంజ్ఞ లున్నాయో అవే అవిద్య. సంసారానర్థానికి మూలకారణం. అవిద్యవల్ల రాగ-ద్వేష-మోహాలు పుడతాయి. వస్తువుల విషయమైన జ్ఞానం విజ్ఞానం. దానివల్ల నాలుగు రూపాలు గల ఉపాదానస్కంధాలు (ఉపాదానకారణాలైన పృథివ్యాదులు) పుడతాయి. వాటికి 'నామ' అని పేరు. ఈ ఉపాదానాలను కారణంగా స్వీకరించి రూపం అనగా రూపం, గల శరీరం ఏర్పడుతుంది. కలలం, బుద్బుదం మొదలైన అవస్థలు శరీరానికే. నామరూపాలతో కలిసిన ఇంద్రియాలు షడాయతనం. నామ-రూప-ఇంద్రియాల మూడింటియొక్క సముదాయం (కలయిక) స్పర్శ. స్పర్శవల్ల కలిగే సుఖాదికం వేదన. వేదనవల్ల ఈ సుఖం మళ్లీ నేను సంపాదించుకోవాలి అనే నిశ్చయం తృష్ణ. దానివల్ల కలిగే వాక్కాయచేష్ట ఉపాదానం. దానివల్ల కలిగే ధర్మాధర్మాలు 'భవం' దానివల్ల కలిగే స్కంధోత్పత్తి జాతి. జన్మవల్ల జరామరణాదులు. పుట్టిన స్కంధాల పరిపాకం 'జర'. స్కంధాల నాశం 'మరణం'. మరణించనున్నవానికి పుత్రకలత్రాదుల

యందు అత్యాసక్తి వలన కలిగిన అంతర్దాహం 'శోకం'. దానివల్ల అయ్యో! అమ్మా! ఓ నాపుత్రకలత్రాదులారా! అనే ప్రలాపం "పరిదేవన'. అనిష్టానుభవం 'దుఃఖం'. మానసమైన దుఃఖం 'దౌర్మనస్యం'. దుఃఖాదులకు ఉపాయాలైన మదమానాద్యుప క్లేశాలు (భాష్యంలోని) ఏవంజాతీయకం అనే శబ్దంచేత సూచింపబడుతున్నాయి. ఇవన్నీ పరస్పరహేతుకాలు- జన్మాదులవల్ల అవిద్యాదులు కలుగుతున్నాయి. అవిద్యాదులవల్ల జన్మాదులు కలుగుతున్నాయి. ఈ విధంగా ఇవన్నీ ఘటీయంత్రంవలె తిరుగుతున్నా యి. అందుచేత ఈ అవిద్యాదులను పట్టి సంఘాతం ఆక్షిప్తం అవుతుంది అని అర్థం.

## భాష్యమ్

నన్వవిద్యాదిభిరర్థాదాక్షిప్యతే సంఘాత ఇత్యుక్తమ్? అత్రోచ్యతే. యది తావదయమభిప్రాయః- అవిద్యాదయః సంఘాతమన్తరేణ ఆత్మా నమలభమానాః అపేక్షన్తే సంఘాతమ్ ఇతి తతస్తస్య సంఘాతస్య నిమిత్తం వక్తవ్యమ్. తచ్చ నిత్యేష్వప్యణుష్వభ్యుపగమ్యమానేషు ఆశ్రయా శ్రయిభూతేషు చ భోక్తృషు సత్సు న సంభవతీత్యుక్తం వైశేషికపరీక్షాయామ్; కిమఙ్గ పునః క్షణికేష్వణుషు భోక్తృరహితేష్వాశ్రయాశ్రయిశూన్యేషు వాభ్యుపగమ్యమానేషు సంభవేత్! అథాయమభిప్రాయః- అవిద్యాదయ ఏవ సంఘాతస్య నిమిత్తమ్- ఇతి; కథం తమేవాశ్రిత్యాత్మానం లభమానాస్తస్యైవ నిమిత్తం స్యుః? అథ మన్యసే సంఘాతా ఏవానాదౌ సంసారే సంతత్యానువర్తన్తే, తదాశ్రయాశ్చా విద్యాదయ ఇతి; తదపి సంఘాతాత్సంఘాతాన్తరముత్ప ద్యమానం నియమేన వా సదృశముత్పద్యేత, అనియమేన వా సదృశమసదృశం వోత్పద్యేత. నియమాభ్యుపగమే మనుష్యపుద్గలస్య దేవతిర్యగ్యోనినారకప్రాప్త్యభావః ప్రాప్నుయాత్. అనియమాభ్యుపగమేఽపి మనుష్యపుద్గలః కదాచిత్ క్షణేన హస్తీ భూత్వా దేవో వా పునర్మనుష్యో వా భవేదితి ప్రాప్నుయాత్. ఉభయ మప్యభ్యుపగమవిరుద్ధమ్. అపి చ యద్భోగార్థః సంఘాతః స్యాత్ నాస్తి స్థిరో భోక్తేతి తవాభ్యుపగమః. తతశ్చ భోగో భోగార్థ ఏవ, స నాన్యేన ప్రార్థనీయః. తథా మోక్షో మోక్షార్థ ఏవేతి ముముక్షుణా నాన్యేన భవితవ్యమ్. అన్యేన చేత్ప్రార్థ్యేతోభయం భోగమోక్షకాలావస్థాయినా తేన భవితవ్యమ్. అవస్థాయిత్వే

క్షణికత్వాభ్యుపగమవిరోధః. తస్మాదితరేతరోత్పత్తిమాత్రనిమిత్తత్వమ విద్యాదీనాం యది భవేద్భవతు నామ; న తు సంఘాతః సిధ్యేత్, భోక్త్రభావాదిత్యభిప్రాయః.

## బాలానందిని

నన్వితి: (ప్రశ్న)- అవిద్యాదులచేత సంఘాతం అర్థాత్ ఆక్షేపించబడుతుంది, అనగా అవిద్యాదు లుండడాన్ని పట్టి సంఘాతం కూడా ఉన్నట్లు ఊహించబడుతుంది అని చెప్పాం కదా? (సమాధానం) ఇలా చెప్పడంలో మీ అభిప్రాయం- సంఘాతం లేకుండా అవిద్యాదు లుండవు (పుట్టవు) కాబట్టి అవి సంఘాతాన్ని అపేక్షిస్తాయి (వాటికి సంఘాతం యొక్క అపేక్ష ఉంటుంది) అని అయిన ట్లయితే అప్పుడు ఆ సంఘాతానికి నిమిత్తం ఏమిటో చెప్పాలి. ఆశ్రయాశ్రయులైన, నిత్యములైన అణువులు, భోక్తలు ఉన్నప్పుడే సంఘాతం కుదర దని వైశేషికదర్శనంలో చెప్పాం. అలాంటప్పుడు అణువులు క్షణికాలనీ, భోక్తలు లేని వనీ, ఆశ్రయాశ్రయిశూన్యా లనీ అంగీకరించినప్పుడు కుదర దని వేరుగా చెప్పాలా?

వి. ఈ వాక్యంలోని 'ఆశ్రయాశ్రయిభూతేషు' అనేదానిని 'భోక్తృషు' అనేదానికి విశేషణంగా గ్రహించి రత్నప్రభలో 'అదృష్టానికి ఆశ్రయమైన భోక్తలు' అని అర్థం చెప్పబడింది. కాని ఈ పదాన్ని 'అణుషు' అనేదానికి విశేషణంగా చేసి 'ఉపకార్యోపకార భావం పొందిన' అని బ్రహ్మవిద్యాభరణంలో అర్థం చెప్పబడింది. అణువులు స్థిరంగా ఉంటే ఏదైనా ఒక కారణంచేత వాటి సంఘాతం ఏర్పడవచ్చును. అవి లేనప్పుడు సంఘాతం ఎలా ఏర్పడుతుంది? సంఘంగా ఏర్పరచడమే ఉపకారం. ఆ విధంగా ఉపకరించేది ఏదో అది ఒక నిమిత్తం. ఉపకరించబడేవి పరమాణువులు. భామతీవ్యాఖ్యానం కూడ దీనికే అనుగుణంగా ఉంది. తరవాతి వాక్యంలో వచ్చే "ఆశ్రయాశ్రయిశూన్యేషు' అనే పదం 'అణుషు' అనేదానికి విశేషణంగా చేయడం కుదురుతుంది. అందుచేత ఇక్కడ కూడ అలాగే గ్రహించడం యుక్తం. అయితే రత్నప్రభాకారుడు "ఆశయాశ్రయిశూన్యేషు" అనే పాఠం కూడా ఉన్నట్లుచూపాడు. ఆశయాశ్రయుడు అనగా సంఘాతకర్త.

అథేతి:- అలా కాక, అవిద్యాదులే సంఘాతానికి నిమిత్తం అని మీ అభిప్రాయ మైతే, ఆ సంఘాతంనుంచే పుట్టిన అవిద్యాదులు దానికి కారణం ఎలా అవుతాయి. అలా కాక- ఈ అనాదియైన సంసారంలో సంఘాతాలే నిరంతరమూ అనువర్తిస్తూ ఉన్నాయి; అవిద్యాదులు వాటిని ఆశ్రయించుకొని ఉన్నాయి అన్నట్లయితే, అలా చెప్పినా కూడ ఒక సంఘాతం నుండి పుట్టుచున్న మరొక సంఘాతం తప్పకుండా

దానితో సమానమైనదే పుడుతుందా, నియమం లేకుండా దానితో సమాన మైనదీ సమానం కానిదీ కూడ పుడుతుందా? దానితో సమానమైనదే పుడుతుంది అని నియమం అంగీకరిస్తే మనుష్యపుద్గలానికి (శరీరానికి) దేవ-తిర్యగ్యోనులు గాని, నరకయోగ్యమైన శరీరాలు గాని లభించవు. నియమం లేదని అంగీకరించే పక్షంలో (ఆ సంఘాతాలు క్షణికాలు గాన) ఒక మనుష్య పుద్గలం ఒక మాటు క్షణకాలంలో ఏనుగగా గాని, దేవుడుగా గాని అయి మళ్లీ మనుష్యుడు కావచ్చును. ఈ రెండూ కూడ మీ సిద్ధాంతానికి విరుద్ధాలే. మరొక విషయ మేమనగా- ఏ భోక్తకు భోగాన్ని ఏర్పరచడం కోసం సంఘాతం ఏర్పడాలో అలాంటి స్థిరుడైన భోక్తయే లేడని నువ్వంటున్నావు. అప్పుడు భోగం భోగం కోసమే అన్నట్లవుతుంది. దానిని ప్రార్థించేవా డెవడూ ఉండడు. (అనగా కావాలనుకొనేవాడు మరు క్షణంలోనే లేకుండా పోయినప్పుడు ఆ కోరిక వ్యర్థమే కదా అని అర్థం). అదే విధంగా మోక్షం కూడ మోక్షంకోసమే అన్నట్లు అవుతుంది గాన మోక్షార్థి ఎవడూ ఉండే అవకాశం లేదు. అలా భోగం అనుభవించేవాడు, మోక్షం పొందేవాడూ ఉంటాడని అంగీకరిస్తే మీ క్షణికత్వ సిద్ధాంతానికి విరోధం వస్తుంది. అందుచేత అవిద్యాదులు పరస్పరోత్పత్తికి హేతువు అవుతే అవుగాక, కాని భోక్త లేకపోవడంచేత సంఘాతం మాత్రం సిద్ధించదు అని అభిప్రాయం. 19.

## సూ. ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్. 2.2-20.

ఉక్తమేతదవిద్యాదీనాముత్పత్తిమాత్రనిమిత్తత్వాన్న సంఘాత సిద్ధిరస్తీతి.తదపి తూత్పత్తిమాత్రనిమిత్తత్వంన సంభవతీతీదమి దానీముపపాద్యతే. క్షణభఙ్గవాదినోఽ యమభ్యుపగమః, ఉత్తరస్మిన్ క్షణ ఉత్పద్యమానే పూర్వః క్షణః నిరుధ్యతే ఇతి. న చైవమభ్యుపగచ్ఛతా పూర్వోత్తరయోః క్షణయోః హేతుఫలభావః శక్యతే సంపాదయితుమ్. నిరుధ్యమానస్య నిరుద్ధస్య వా పూర్వక్షణస్యాభావగ్రస్తత్వాదుత్తరక్షణ హేతుత్వానుపపత్తేః. అథ భావభూతః పరినిష్పన్నావస్థః పూర్వక్షణ ఉత్తరక్షణస్య హేతురిత్యభిప్రాయస్తథాపి నోపపద్యతే. భావభూతస్య పునర్వ్యాపార కల్పనాయాం క్షణాన్తరసంబన్ధప్రసంగాత్. అథ భావ ఏవ అస్య వ్యాపార ఇత్యభిప్రాయస్తథాపి నైవోపపద్యతే, హేతుస్వభావానుపరక్తస్య ఫలస్యోత్పత్త్యసంభవాత్. స్వభావోపరాగాభ్యుపగమే చ హేతుస్వభావస్య

ఫలకాలావస్థాయిత్వే సతి క్షణభఙ్గాభ్యుపగమత్యాగప్రసంగః. వినైవ చ స్వభావోపరాగేణ హేతుఫలభావమభ్యుపగచ్ఛతః సర్వత్ర తత్రాప్తేరతిప్రసంగః.

### బాలానందిని

ఉత్తరేతి:- "ఉత్తరోత్పాదే=తరువాతది పుట్టేటప్పటికి, పూర్వనిరోధాత్ చ=వెనుకటిది నిరుద్ధం అవుతుంది కాబట్టి కూడ అవిద్యాదులకు పరస్పరహేతుకత్వం కుదరదు" అని సూత్రార్థం.

ఉక్తమితి:- అవిద్యాదులు కేవలం తమ ఉత్పత్తికి మాత్రమే నిమిత్తం అవుతాయి గాన సంఘాతం సిద్ధించదు అని చెప్పబడింది. అయితే నిజానికి ఆ ఉత్పత్తి మాత్ర నిమిత్తత్వం కూడ సంభవించదు అని ఇప్పుడు ఉపపాదించబడుతున్నది. క్షణభంగ వాదులు (ప్రతి వస్తువు ఒక్క క్షణం మాత్రమే ఉంటుంది, మరు క్షణంలో భగ్న మవుతుంది, నశిస్తుంది అని చెప్పే బౌద్ధులు) ఉత్తరక్షణం పుడుతున్నప్పుడు పూర్వ క్షణం నిరుద్ధ మవుతుంది, అనగా వినాశోన్ముఖం అవుతుంది, అని అంగీకరిస్తారు.

వి. క్షణం అనగా క్షణకాలం ఉండే వస్తువు అని అర్థం. వీళ్ల మతం ప్రకారం ఘటం, పటం మొదలైన స్థిరమైన పదార్థా లంటూ ఏవీ లేవు. ఈ క్షణంలో ఉన్న ఘటంనుండి మరొక ఘటం పుడుతుంది. మళ్లీ ఆ ఘటం ఈ క్షణంతోనే నశిస్తుంది. క్రొత్త ఘటం పుడుతుంది. మళ్లీ ఆ ఘటం మరొక ఘటాన్ని పుట్టిస్తుంది. ఈ విధంగా జగత్తులో ఉన్న ప్రతి వస్తువూ కూడ క్షణికమే. కనబడేది ఒక ఘటం కాదు. ఘటప్రవాహం. నిరుధ్యమానం అనగా నశించడానికి సిద్ధంగా ఉన్నది. నిరుద్ధం అనగా నశించినది. అవిద్యాదులు కూడ క్షణికాలే. క్షణికాలైన అవిద్యాదుల నుండి సంస్కారాదులు పుట్టడం కూడ కుదర దని చెప్పడం కోసం ఈ విచారణ చేయబడుచున్నది. పూర్వక్షణం (పూర్వక్షణంలో ఉన్న వస్తువు) నిమిత్తం, ఉత్తరక్షణం (ఉత్తరక్షణంలో పుట్టిన లేదా పుట్టబోయే వస్తువు) ఫలం.

న చేతి:- ఈ విధంగా అంగీకరించిన క్షణికవాదిచేత పూర్వోత్తరక్షణాలకు హేతుఫలభావం (పూర్వక్షణం హేతువు, ఉత్తరక్షణం ఫలం అనేది) సంపాదించడానికి శక్యం కాదు. నిరోధింపబడుచున్న లేదా నిరుద్ధ మైపోయిన పూర్వక్షణం అభావంచేత గ్రస్త మైపోవడంవల్ల (లేనిదే అయిపోవడంవల్ల) అది ఉత్తరక్షణానికి హేతువు అవడం ఉపపన్నం కాదు. అట్లు కాక భావమైన, అనగా పుట్టిన, పరినిష్పన్నమైన అవస్థ గల

(పూర్తిగా తయారైన స్థితిలో ఉన్న) పూర్వక్షణం ఉత్తరక్షణానికి హేతువు అని నీ అభిప్రాయ మైతే అలా చెప్పినా కూడ ఉపపన్నం కాదు.

వి. ఒక క్షణం తాను పుడుతూన్నప్పుడే ఉత్తరక్షణాన్ని పుట్టిస్తుంది అని మేం అనడం లేదు. పుట్టి పరినిష్ఠితరూపంలో ఉన్న తరవాతనే అది ఉత్తరక్షణాన్ని పుట్టిస్తుం దని మా అభిప్రాయం అని క్షణికవాది అభిప్రాయం. అది కూడ యుక్తం కాదంటున్నారు.

భావేతి:- భావభూతమైనదానికి (పుట్టి ఒక వస్తువుగా ఉన్నదానికి) మళ్లీ వ్యాపారం (ఉత్తరక్షణాన్ని పుట్టించడం అనే వ్యాపారం) కల్పిస్తే మరొక క్షణకాలంతో సబంధం చెప్పవలసి వస్తుంది. (అనగా పుట్టిన క్షణం కాక మరొక క్షణాన్ని (క్షణికవస్తువును) పుట్టించడంకోసం వ్యాపారం చేయడానికి మరొక క్షణకాలం ఉండాలి గాన క్షణికత్వం కాక ద్విక్షణావస్థితత్వం వస్తుంది అని భావం). అది కాదు; (దీనికి వ్యాపారం అంటూ మరొకటి ఏదీ లేదు) భావమే (ఉండడమే) దీనికి వ్యాపారం అని అభిప్రాయ మైతే అలా చెప్పినా కూడ కుదరదు. ఎందువల్ల ననగా హేతువుయొక్క స్వరూపంతో ఉపరక్తంకాని, (అనగా కూడి ఉండని, ఆ స్వరూపం సంక్రమించని) ఫలం పుట్టడం కుదరదు. (హేతువుయొక్క స్వరూపం లేదా స్వభావం కొంతవరకు ఫలంలో సంక్రమిస్తేనే అది హేతు వవుతుంది. ఇది ఫలం అవుతుంది. అలా సంక్రమించకపోతే అది హేతువూ కాదు ఇది ఫలమూ కాదు అని భావం). స్వభావోప రాగాన్ని అంగీకరిస్తే, హేతుస్వభావం ఫలకాలం వరకూ ఉన్నట్లయితే, క్షణభంగమతాన్ని విడిచి పెట్టవలసివస్తుంది. స్వభావోపరాగం లేకపోయినా హేతుఫలభావాన్ని అంగీకరిస్తే అన్నింటి విషయంలోను దానిని అంగీకరించవలసిన అగత్యం ఏర్పడుతుంది.

వి. ఫలంలో హేతుస్వభావోపరాగం ఉండాలని నియమం లేదు అంటే ఏదైనా ఒకదానికి హేతు వనీ, ఏదైనా మరొకదానికి దేనికైనా ఫలం అనీ చెప్పవలసి వస్తుంది. ఉదాహరణకి మృత్క్షణం కుండలక్షణానికి హేతు వనీ, సువర్ణక్షణం కలశక్షణానికి హేతువనీ కూడ చెప్పడానికి అవకాశం ఏర్పడుతుంది. నువ్వు చెప్పినదాని ప్రకారం కుండలంలో మృత్స్వభావోపరాగం గాని కలశంలో సువర్ణస్వభావోపరాగం గాని ఉండవలసిన అవసరం లేదు కదా?.

## భాష్యమ్

అపి చోత్పాదనిరోధౌ నామ వస్తునః స్వరూపమేవ వా స్యాతామ్ అవస్థాన్తరం వా, వస్త్వన్తరమేవ వా? సర్వథాఽపి నోపపద్యతే. యది తావద్వస్తునః

స్వరూపమేవోత్పాదనిరోధౌ స్యాతాం, తదో వస్తుశబ్ద ఉత్పాదనిరోధశబ్దౌ చ పర్యాయాః ప్రాప్నుయుః. అథాస్తి కశ్చిద్విశేష ఇతి మన్యేత, ఉత్పాదనిరోధశబ్దాభ్యాం మధ్యవర్తినః వస్తునః ఆద్యన్తాఖ్యే అవస్థే అభిలప్యేతే ఇతి, ఏవమప్యాద్యన్తమధ్యక్షణత్రయసంబన్ధిత్వాద్వస్తునః క్షణికత్వాభ్యుపగమహానిః. అథాత్యన్తవ్యతిరిక్తావేవ ఉత్పాదనిరోధౌ వస్తునః స్యాతామశ్వమహిషవత్, తతో వస్తు ఉత్పాదనిరోధాభ్యామసంస్పృష్టమితి వస్తునః శాశ్వతత్వప్రసంగః. యది చ దర్శనాదర్శనే వస్తున ఉత్పాదనిరోధే స్యాతామ్, ఏవమపి ద్రష్టృధర్మౌ తౌ న వస్తుధర్మావితి వస్తునః శాశ్వతత్వప్రసంగ ఏవ. తస్మాదప్యసంగతం సౌగతం మతమ్. 20.

బాలానందిని

అపి చేతి:- మరొక విషయం ఏమనగా- ఉత్పాదనిరోధా లనేవి వస్తువుయొక్క స్వరూపమే అవుతాయా, మరొక అవస్థయా, లేదా మరొక వస్తువా? అన్ని విధాలా కూడ కుదరదు. ఉత్పాదనిరోధాలు వస్తువుయొక్క స్వరూపమే అయితే అప్పుడు 'వస్తు' శబ్దం, 'ఉత్పాద' 'నిరోధ' శబ్దాలు పర్యాయశబ్దాలు అన్నట్లవుతుంది. ఉత్పాద నిరోధశబ్దాలచేత మధ్యనున్న వస్తువుయొక్క ఆద్యంతావస్థలు చెప్పబడతాయి; అందుచేత వస్తువునకు ఉత్పాదనిరోధాలకు కొంచెం విశేషం ఉంది అన్నట్లయితే అప్పుడు ఆ వస్తువు ఆది క్షణంతోను, చివరి క్షణంతోను, మధ్యక్షణంతోను సంబంధించినది గాన ఆ వస్తువు క్షణికం అనే మీ అభ్యుపగమానికి విరోధం కలుగుతుంది. అట్లుకాక ఉత్పాదనిరోధాలు, అశ్వమహిషాల వలె, వస్తువుకంటె అత్యంతం భిన్నములైతే అప్పుడు వస్తువుకు ఉత్పాదనిరోధాలతో ఏమీ సంబంధం లేదు గాన ఆ వస్తువు శాశ్వతం అయే ప్రసంగం ఏర్పడుతుంది. అట్లు కాక ఒక వస్తువుయొక్క ఉత్పాదనిరోధా లనగా దర్శనాదర్శనములు (ఆవస్తువు కనబడడం ఉత్పాదం, కనబడకపోవడం నిరోధం) అన్నట్లయితే ఇలా చెప్పినా కూడ అవి ద్రష్టయొక్క ధర్మాలే కాని వస్తుధర్మాలు కావు గాన వస్తువు శాశ్వతం కావలసిన ప్రసక్తి ఏర్పడుతుంది. ఆ కారణంవల్ల కూడ బౌద్ధమతం అసంగత మైనది. 20.

## సూ. అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా. 2.2-21

క్షణభఙ్గవాదే పూర్వక్షణో నిరోధగ్రస్తత్వాన్నోత్తరస్య క్షణస్య హేతుర్భవతీత్యుక్తమ్. అథాసత్యేవ హేతౌ ఫలోత్పత్తిం బ్రూయాత్, తతః

ప్రతిజ్ఞోపరోధః స్యాత్. "చతుర్విధాన్ హేతూన్ ప్రతీత్య చిత్తచైత్తా ఉత్పద్యన్తే" ఇతీయం ప్రతిజ్ఞా హీయేత. నిర్హేతుకాయాం చోత్పత్తావ ప్రతిబన్ధాత్సర్వం సర్వత్రోత్పద్యేత. అథ ఉత్తరక్షణోత్పత్తిర్యావత్తావదవతిష్ఠతే పూర్వక్షణ ఇతి బ్రూయాత్, తతో యౌగపద్యం హేతుఫలయోః స్యాత్. తథాపి ప్రతిజ్ఞోపరోధ ఏవ స్యాత్; క్షణికాః సర్వే సంస్కారా ఇతీయం ప్రతిజ్ఞా ఉపరుధ్యేత. 21.

## బాలానందిని

అసతీతి:- అసతి=హేతువైన పూర్వక్షణం లేకపోయినా, కార్యం ఉత్పన్నం అవుతుంది అని అంగీకరించినట్లయితే, ప్రతిజ్ఞోపరోధః= మీ ప్రతిజ్ఞకు భంగం కలుగుతుంది. అన్యథా=అలా కాకపోతే అనగా ఉత్తరక్షణం పుట్టేవరకు పూర్వక్షణం ఉంటుంది అని అంటే, యౌగపద్యమ్=కారణమూ కార్యమూ ఒకే సమయంలో ఉన్నా యని చెప్పవలసి వస్తుంది" అని సూత్రార్థం.

క్షణేతి:- క్షణభంగవాదంలో పూర్వక్షణం నిరోధగ్రస్తం అవడంచేత ఉత్తర క్షణానికి హేతువు (ఉపాదానకారణం) కాజాల దని పైన చెప్పబడింది. హేతువు లేకుండానే (అనగా కార్యకాలంవరకు హేతువు ఉండకుండానే) ఫలం (కార్యం) ఉత్పన్నం అవుతుంది అని చెప్పిన ట్లయితే అప్పుడు మీ ప్రతిజ్ఞకు ఉపరోధం కలుగుతుంది. చిత్త-చైత్తాలు నాలుగు విధాలైన హేతువులను చేరి పుడతాయి అనే ప్రతిజ్ఞ (మీరు చెప్పిన మాట) భగ్నం అవుతుంది. హేతువు ఏదీ లేకుండానే కార్యం ఉత్పన్నం అవుతుంది అని అంగీకరిస్తే అప్పుడు ఏ విధమైన అడ్డూ లేకపోవడంచేత ప్రతివస్తువూ (అన్ని కాలాలలోను) అంతటా పుట్టవలసి ఉంటుంది.

వి. అధిపతి-సహకారి-సమనన్తరప్రత్యయ-ఆలంబనాలు అనే నాలుగు హేతువులను చేరి చిత్తం, చైత్యాలు పుడతాయి అని బౌద్ధు లంటారు. పుట్టిన జ్ఞానం రూపాదులకు సంబంధించినది (రూపాదులు విషయంగా గలది) అని నియమించడం చేత చక్షురాదికమైన ఇంద్రియానికి అధిపతి అని పేరు. వెలుతురు సహకారి. సమనంతరప్రత్యయం అనగా వెనుకటి జ్ఞానం క్షణికాలైన జ్ఞానాల సంతానంలో (నిరంతరప్రవాహంలో) పూర్వజ్ఞానం ఉత్తరజ్ఞానానికి కారణం అని బౌద్ధులు అంగీకరిస్తారు. దానికే మనస్సు అని పేరు. ఘటాదికం ఆలంబనం. ఈ చతుర్విధహేతువులను పొంది చిత్తచైత్తాలు పుడతాయి అని అర్థం. చిత్తం అనగా జ్ఞానం. చైత్తం అనగా సుఖాదులు. హేతువు కార్యం పుట్టే కాలంవరకు అనువర్తించకపోతే పైన చెప్పిన బౌద్ధుల ప్రతిజ్ఞకు విరోధం వస్తుంది అని అర్థం. ఈ నాలుగు హేతువులలో ఒకటి ఆలంబనం. ఘటజ్ఞానానికి

ఘటం ఆలంబనం. ఇది ఘటం అని గ్రహించినప్పుడు ఆ ఘటం వర్తమానకాలంతో సంబంధించి నట్లు గ్రహించబడుతున్నది. అందుచేత అది వర్తమానకాలంలో ఉండాలి. ఈ జ్ఞానానికి హేతువైన ఆలంబనంగా పూర్వక్షణంలో కూడ ఉండాలి. ఈ విధంగా ఆ ఘటం కనీసం రెండుక్షణా లున్నట్లు చెప్పాలి. అది క్షణభంగవాదానికి విరుద్ధం

అథేతి:- అలా కాక పూర్వక్షణం ఉత్తరక్షణం పుట్టేవరకు ఉంటుంది అని అంగీకరిస్తే అప్పుడు హేతువు ఫలమూ రెండూ కూడ ఒకే సమయంలో ఉన్నాయని చెప్పవలసి వస్తుంది. (అప్పుడు క్షణభంగవాదానికి భంగం కలుగుతుంది) అలా చెప్పి నప్పుడు కూడ "సంస్కారాలన్నీ క్షణికాలు" అనే ప్రతిజ్ఞకు ఉపరోధం కలుగుతుంది.

వి. బౌద్ధమతం ప్రకారం ఉత్తరక్షణానికి హేతువైన పూర్వక్షణానికి సంస్కారం అనీ, వాసన అనీ పేరు. "సంస్కరింపబడుతుంది గాన సంస్కారం" అనే వ్యుత్పత్తిచేత కార్యం కూడ సంస్కారమే. అందుచేత- "కార్యకారణాత్మకమైన సమస్త భావపదార్థాలూ కూడ క్షణికాలు" అని "క్షణికాః సర్వే సంస్కారాః" అనే దానికి అర్థం. హేతుఫలాలకు యౌగపద్యం కలుగుతే కూడ ఈ ప్రతిజ్ఞకు కూడ విఘాతం కలుగుతుంది అని అర్థం.

### సూ. ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్. 2.2.22

అపి చ, వైనాశికాః కల్పయన్తి- "బుద్ధిబోధ్యం త్రయాదన్యత్ సంస్కృతం క్షణికం చ"- ఇతి. తదపి చ త్రయం ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధౌ ఆకాశం చ ఇత్యాచక్షతే. త్రయమపి చైతత్ అవస్తు అభావమాత్రం నిరుపాఖ్యమితి మన్యన్తే. బుద్ధిపూర్వకః కిల వినాశో భావానాం ప్రతిసంఖ్యానిరోధోనామ భాష్యతే, తద్విపరీతః అప్రతిసంఖ్యా నిరోధః. ఆవరణాభావమాత్రమాకాశమ్ ఇతి.

2-2-24

తేషాం చ ఆకాశం పరస్తాత్ ప్రత్యాఖ్యాస్యతి. నిరోధద్వయమిదానీం ప్రత్యాచష్టే. ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధయోః అప్రాప్తిః అసంభవ ఇత్యర్థః. కస్మాత్? అవిచ్ఛేదాత్. ఏతౌ హి ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధౌ సంతానగోచరౌ వా స్యాతాం భావగోచరౌ వా. న తావత్సన్తానగోచరౌ. సంతానవిచ్ఛేదస్యాసంభవాత్. నాపి భావగోచరౌ సంభవతః. న హి భావానాం నిరన్వయో నిరుపాఖ్యో వినాశః సంభవతి. సర్వాస్వప్యవస్థాసు ప్రత్యభిజ్ఞానబ లేన అన్వయ్యవిచ్ఛేదదర్శనాత్. అస్పష్టప్రత్యభిజ్ఞానాస్వప్యవస్థాసు క్వచిద్దృష్టేనాన్వయ్య విచ్ఛేదేన అన్యత్రాపి తదనుమానాత్. తస్మాత్ పరపరికల్పితస్య నిరోధద్వయస్య అనుపపత్తిః.22.

ప్రతిసంఖ్యేతి:- "అవిచ్ఛేదాత్=సంతానానికి విచ్ఛేదం లేకపోవడంవలన, ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిః= ప్రతిసంఖ్యానిరోధము, అప్రతిసంఖ్యానిరోధము ఉండవు" అని సూత్రార్థం.

అపిచేతి:- మరొక విషయ మేమనగా- "త్రయంకంటె భిన్నమైన సంస్కృతమైన అనగా ఉత్పాద్యమైన, బుద్ధిబోధ్యం, అనగా బుద్ధిచేత తెలియదగిన (ప్రమేయం) క్షణికము' 'అని కల్పిస్తున్నారు. ఆ త్రయ మేమనగా ప్రతిసంఖ్యానిరోధం అప్రతిసంఖ్యానిరోధం, ఆకాశం అని అంటారు. ఈ త్రయమూ కూడ నిరుపాఖ్యమైన అనగా వస్తుస్వరూపమే లేని (శశశృంగాదుల వంటి) వస్త్వభావమాత్రమే అని అంటారు. బుద్ధిపూర్వకంగా చేసిన భావాల (వస్తువుల) వినాశం (రోకలితో కుండ బ్రద్దలుకొట్టి నశింప చేసినట్లు) ప్రతి సంఖ్యా నిరోధం అని చెప్పబడుతుంది. దానికి విపరీతమైన, అనగా బుద్ధిపూర్వకంగా చేయబడని భావాల వినాశం అప్రతిసంఖ్యానిరోధం. (యుక్తిచేత సాధించతగినది కంటికి కనిపించనిది అయిన, ప్రతిక్షణమూ ఘటాదులకు కలిగే వినాశం అప్రతిసంఖ్యా నిరోధం అని అర్థం). ఆవరణం లేకపోవడమే ఆకాశం. వాటిలో ఆకాశాన్ని తరవాత నిరాకరిస్తాడు. ఇప్పుడు నిరోధద్వయాన్ని నిరాకరిస్తున్నాడు. ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యా నిరోధాల, అప్రాప్తి, అనగా అసంభవం అని అర్థం. ఎందువల్ల? అవిచ్ఛేదంవల్ల. ఈ ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాలు సంతానానికి సంబంధించినవా లేక భావాలకు అనగా సంతానంలో ఉన్న పదార్థాలకు సంబంధించినవా?

వి. బౌద్ధుల సిద్ధాంతం ప్రకారం భావపదార్థా లన్నీ క్షణికాలు. ఒక వృక్షం ఉంది. అది ఆ క్షణంలో మాత్రమే ఉంటుంది; మరొక్క చెట్టును పుట్టించి అది మరు క్షణంలో నశిస్తుంది. ఈ విధంగా క్షణక్షణానికీ క్రొత్త క్రొత్త వృక్షాన్ని పుట్టిస్తూ వెనుకటి క్షణంలో ఉన్న వృక్షం నశిస్తూంటుంది. ఈ విధంగా చెట్టుయొక్క అవిచ్ఛిన్న మైన ధార మాత్రమే మనకు కనబడుతుంది. అదే సంతానం. వృక్ష సంతానంలో ఉన్న వృక్షాలు సంతానులు. ఈ ప్రతిసంఖ్యాపతిసంఖ్యానిరోధాలు సంతానానికి సంబంధించినవా (అనగా సంతానం నశిస్తుందా) లేక సంతానులకు సంబంధించినదా, అనగా సంతానంలో వరసగా ఉన్న పదార్థాలు నశిస్తాయా అని ప్రశ్న.

నేతి:- సంతానానికి సంబంధించిన ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాలు సంభవించవు. ఎందువల్ల ననగా అన్ని సంతానాలలోను కూడ సంతానులకు అవిచ్ఛిన్నమైన హేతుఫలభావం ఉంటుంది గాన సంతానవిచ్ఛేదం సంభవం కాదు.

వి. సంతానుల హేతుఫలభావం (పూర్వసంతాని హేతువు తరువాతది ఫలం అనే రీతిలో) అవిచ్ఛిన్నంగా ఉండడమే కదా సంతానం అనగా. అలాంటి సంతానానికి ఈ ప్రతిసంఖ్యానిరోధం గాని అప్రతిసంఖ్యానిరోధం గాని కుదరదు. ఎందువల్ల ననగా భావాల ఈ సంతానంలో ఈ నిరోధం జరుగుతుంది అనగా ఒక క్షణం దగ్గర ఆ సంతానం తెగిపోతుం దని అర్థం. అప్పుడు భావాల ఈ సంతానంలో చివరి క్షణం మరొక క్షణాన్ని పుట్టిస్తుందా పుట్టించదా. పుట్టిస్తుంది అని అంగీకరిస్తే అది చివరిక్షణం అనడానికి వీలులేదు. అప్పుడు సంతానానికి విచ్ఛేదం లేదు కదా? రెండవపక్షంలో అనగా చరమక్షణం మరొక క్షణాన్ని పుట్టిచందు అనే పక్షంలో ఆ చరమక్షణం అసత్ (లేనిది) అని చెప్పవలసి వస్తుంది. "అర్థక్రియాకారిత్వం సత్త్వమ్"- (ఏదైన ఒక పనిని చేయకలిగి ఉండడమే సత్త్వం) అని కదా మీ అంగీకారం. చివరి దని చెప్పే క్షణం మరొక క్షణాన్ని పుట్టించని పక్షంలో అది అర్థక్రియాకారి కాదు. అర్థక్రియాకారి కాకపోతే అది సత్తు కాదు. అప్పుడు అదే కాక దానిని పుట్టించి నట్లుగా చెప్పే దాని పూర్వక్షణం కూడా సత్తుకాదు. అది సత్పదార్థాన్ని దేనినీ పుట్టించలేదు కదా? ఈ విధంగా పూర్వం ఉన్న అన్ని క్షణాలూ కూడ అసత్తులు కావలసివస్తుంది. అందుచేత ఈ ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యానిరోధాలు సంతానానికి కలుగుతా యని చెప్పడానికి వీలుండదు. (భామతి.రత్నప్రభ).

నాపీతి:- ఇవి భావానికి (వస్తువునకు) సంబంధించినవి అని చెప్పడం కూడ కుదరదు. భావాలకు నిరన్వయము, నిరుపాఖ్యము అయిన వినాశం సంభవించదు కదా? అన్ని అవస్థలలోను కూడ అన్వయి అవిచ్ఛిన్నంగా ఉన్నట్లు ప్రత్యభిజ్ఞను పట్టి తెలుస్తూన్నది కదా? ప్రత్యభిజ్ఞానం స్పష్టంగా లేని అవస్థలలో కూడ, కొన్నిచోట్ల కనబడుతూన్న అన్వయ్యవిచ్ఛేదాన్ని బట్టి అక్కడ కూడ దానిని (అన్వయ్యవిచ్ఛేదాన్ని) ఊహించవలసి ఉంటుంది. అందువల్ల పరులు కల్పించిన రెండు రకాల నిరోధమూ కూడ కుదరదు.

వి. నిరన్వయం అనగా ఏ వస్తువూ కూడ అనుస్యూతంగా ఉండని అని అర్థం. నిరుపాఖ్యం అనగా స్వరూపం లేని, నామరూపాలు లేకుండా అనగా పూర్తి స్వరూపమే నశించిన అని అర్థం. ఘటం, కపాలం (కుండపెంకు) చూర్ణం మొదలైన అవస్థలు మారినా కూడ ఆ అన్ని అవస్థలలోను మట్టి అనుస్యూతంగా వస్తున్నట్లు ఆ మట్టియే ఇది అనే ప్రత్యభిజ్ఞానంచేత తెలుస్తూన్నది. అందుచేత ఒక వస్తువు పూర్తిగా నశించడం అనేది ఉండదు. ఒక ఆకారంలో నశించినా మరొక ఆకారంలో ఉంటూనే ఉంటుంది అని చెప్పడానికి ప్రత్యభిజ్ఞయే ప్రమాణం. అయితే బాగా కాలిన

ఊయిమీద పడిన నీటిచుక్క పూర్తిగా నశిస్తున్నది కదా. అది నిరన్వయమూ, నిరుపాఖ్యమూ అయిన నాశమే కదా అని ప్రశ్నించవచ్చును. అక్కడ కూడ ఆ నీటిని తేజస్సు మేఘంగా మార్చడంకోసం మార్తాండమండలంలోనికి తీసికొనిపోవుతున్నది అని ఊహించవలసి ఉంటుంది. ఘటకపాలచూర్ణాదులలో మృదాదులు అన్వయిస్తున్నట్లు కనబడుతున్నది గాన అక్కడ కూడ ఈ విధంగా అనుమానంచేత తెలియవలసి ఉంటుంది. లేదా ఉదకబిందువులో ఉన్న ఉదకత్వానికీ, సముద్రంలో ఉన్న ఉదకత్వానికీ భేదం లేదు. అక్కడ బిందువు నశించినా (కనబడకున్నా) దానికి సముద్రజలాన్వయం ఉంది అని ప్రత్యక్ష ప్రమాణంచేతనే చెప్పవచ్చును.

ఉదబిన్దౌ చ సింధౌ చ తోయభావో న భిద్యతే.
వినష్టేఽపి తతో బిన్దావస్తి తస్యాన్వయోఽమ్బుధౌ" (భామతి). 22

## సూ. ఉభయథా చ దోషాత్ 2.2.23.

యోఽయమవిద్యాదినిరోధః ప్రతిసంఖ్యానిరోధాన్తఃపాతీ పరికల్పితః స సమ్యగ్జ్ఞానాద్వా సపరికరాత్ స్యాత్ స్వయమేవ వా. పూర్వస్మిన్ వికల్పే నిర్హేతుకవినాశాభ్యుపగమహానిప్రసంగః. ఉత్తరస్మింస్తు మార్గోపదేశానర్థక్య ప్రసంగః. ఏవముభయథాపి దోషప్రసంగాదసమఞ్జసమిదం దర్శనమ్. 23.

### బాలానందిని

ఉభయథేతి:- "ఉభయథా చ= రెండు విధాలా కూడ, దోషాత్=దోషంవల్ల. అవిద్యాదినిరోధం కుదరదు" అని సూత్రార్థం.

యోఽయమితి:- ప్రతిసంఖ్యానిరోధంలో అంతర్గత మై (మీ చేత) కల్పించబడిన అవిద్యాదినిరోధం పరికరంతో (సాధనాలతో) కూడిన సమ్యగ్జ్ఞానంవల్ల కలుగుతుందా లేదా తనంతట తానే కలుగుతుందా? మొదటిపక్షంలో వినాశం నిర్హేతుకంగానే జరుగుతుంది అనే అంగీకారానికి విరోధం. రెండవ పక్షంలో మార్గోపదేశం (సర్వం దుఃఖమ్, సర్వం క్షణికం అనే భావన చేయడంవల్ల అవిద్య నశిస్తుంది అని ఉపదేశించిన మోక్షమార్గం) వ్యర్థం అవుతుంది. (వాటి వినాశం స్వయంగానే జరిగి నప్పుడు ఈ మార్గం ఎందుకు?). ఈ విధంగా రెండు విధాలా కూడ దోషం ప్రసక్తం అవుతున్నది గాన ఈ దర్శనం అసమంజస మైనది.

బ్రహ్మవిద్యాభరణంలో ఈ భాష్యానికి భావం ఈ విధంగా వివరించబడింది:- "ఘటమహం జానామి" (నేను ఘటాన్ని తెలుసుకొనుచున్నాను) అనే సవికల్పకజ్ఞానమే

బౌద్ధుల ప్రకారం అవిద్య. అలాంటి సవికల్పకజ్ఞానా లన్నీ నశించి నిర్వికల్పకమైన ఆలయవిజ్ఞానంయొక్క సంతతి మిగలడమే మోక్షం. "ఆలయ విజ్ఞానం సహజంగా నిర్వికల్పకమే. వాసనలు మొదలైన ఉపాధులవల్ల సవికల్పకత్వం కలుగుతున్నది" అని విచారపూర్వకంగా అనుసంధానం చేయడం పరికరం. అది పరిపక్వం అయినప్పుడు, ప్రాథమికమైన విశుద్ధమైన ఆలయవిజ్ఞానం ఉత్పన్నం కావడమే సమ్యగ్జ్ఞానం అని వాళ్ల సిద్ధాంతం.

అవిద్యాదినిరోధం ప్రతిసంఖ్యానిరోధం (కారణంవల్ల కలిగిన నిరోధం) అని వాళ్లు అంగీకరిస్తున్నప్పుడు "పూర్వస్మిన్ వికల్పే నిర్హేతుకవినాశాభ్యుపగమహానిప్రసంగః" అనేది ఎలా కుదురుతుంది? వాళ్లు అవిద్యాదినిరోధం అప్రతిసంఖ్యానిరోధం అని అంగీకరించలేదు కదా అని ప్రశ్న కలుగుతుంది. దానికి సమాధానం బ్రహ్మవిద్యాభరణంలో ఇలా చెప్పబడింది- ముముక్షు వైన సాధకుడు కూడ క్షణికుడే. అందుచేత మోక్షావస్థలో ఆ సాధకు డుండడు గాన సాధనం విషయంలో వానికి ప్రవృత్తి ఉండదు. అందుచేత మీరు అవిద్యయొక్క ప్రతిసంఖ్యానిరోధం కూడ హేతువు లేని నిరోధమే అని అంగీకరించాలి అని ఆపాదించి ఈ దూషణం చేయబడింది.

## సూ. ఆకాశే చావిశేషాత్. 2.2.24

యచ్చ తేషామేవాభిప్రేతం- నిరోధద్వయమాకాశం చ నిరుపాఖ్యమితి తత్ర నిరోధద్వయస్య నిరుపాఖ్యత్వం పురస్తాన్నిరాకృతమ్. ఆకాశస్య ఇదానీం నిరాక్రియతే. ఆకాశే చ అయుక్తో నిరుపాఖ్యత్వా భ్యుపగమః; ప్రతి సంఖ్యాప్రతిసంఖ్యానిరోధయోరివ వస్తుత్వ ప్రతిపత్తేరవిశేషాత్. ఆగమప్రామాణ్యాత్తావత్- "ఆత్మన ఆకాశః సంభూతః" (తై.ఉ.2.1) ఇత్యాదిశ్రుతిభ్యః ఆకాశస్య చ వస్తుత్వప్రసిద్ధిః. విప్రతిపన్నాన్ ప్రతి తు శబ్దగుణానుమేయత్వం వక్తవ్యమ్; గన్ధాదీనాం గుణానాం పృథివ్యాది వస్త్వాశ్రయత్వదర్శనాత్. అపి చావరణాభావమాత్రమాకాశమిచ్ఛతా మేకస్మిన్ సుపర్ణే పతత్యావరణస్య విద్యమానత్వాత్ సుపర్ణాన్తరస్యోత్పిత్సతోఽనవ కాశత్వప్రసంగః. యత్రావరణాభావస్తత్ర పతిష్యతీతి చేత్. యేనావరణాభావో విశేష్యతే తత్తర్హి వస్తు భూతమేవాకాశం స్యాత్, నావరణాభావమాత్రమ్. అపి చావరణాభావమాత్రమాకాశం మన్యమానస్య సౌగతస్య స్వాభ్యుపగమవిరోధః ప్రసజ్యేత. సౌగతే హి సమయే "పృథివీ భగవన్ కిం సంనిశ్రయా" ఇత్యస్మిన్

ప్రశ్నప్రతివచనప్రవాహే పృథివ్యాదీనామన్తే "వాయుః కింసంనిశ్రయః" ఇత్యస్య ప్రశ్నస్య ప్రతివచనం భవతి "వాయురాకాశసంనిశ్రయః" ఇతి. తదాకాశస్యావస్తుత్వే న సమఞ్జసం స్యాత్. తస్మాదప్యయుక్తమాకాశస్య అవస్తుత్వమ్. అపి చ నిరోధద్వయమాకాశం చ త్రయమప్యేతన్నిరుపాఖ్యమవస్తు నిత్యం చేతి విప్రతిషిద్ధమ్. న హ్యవస్తునో నిత్యత్వమనిత్యతం వా సంభవతి. వస్త్వాశ్రత్వాద్ధర్మధర్మివ్యవహారస్య. ధర్మధర్మిభావే హి ఘటాదివద్వస్తుత్వమేవ స్యాన్న తు నిరుపాఖ్యత్వమ్. 24.

## బాలానందిని

ఆకాశ ఇతి:- "అవిశేషాత్=వస్తుత్వజ్ఞానంలో విశేషం లేకపోవడంవల్ల, ఆకాశే చ=ఆకాశంలో కూడ నిరుపాఖ్యత్వాన్ని అంగీకరించడం యుక్తం కాదు" అని సూత్రార్థం.

యచ్చేతి:- నిరోధద్వయము ఆకాశమూ కూడ నిరుపాఖ్య మైనవి. అనగా స్వరూపం లేనివి, అసత్తులు, అని సౌగతులు అంగీకరించినదానిలో నిరోధద్వయం నిరుపాఖ్యం అనే విషయం వెనుక నిరాకరించబడింది. ఇప్పుడు ఆకాశంయొక్క నిరుపాఖ్యత్వం నిరాకరించబడుతున్నది. ఆకాశం నిరుపాఖ్యం అని అంగీకరించడం కూడ యుక్తం కాదు. ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాలయందు వలె దీనియందు కూడ వస్తువుగా తెలియడంలో విశేషం ఏదీ లేదు. "ఆత్మనః ఆకాశః సంభూతః" ఇత్యాది శ్రుతుల ప్రామాణ్యాన్నిపట్టి యైతే (ఆత్మనుండి ఆకాశం అనేది పుట్టింది అని చెప్పడంచేత) ఆకాశం ఒక వస్తువు అనే ప్రసిద్ధి ఉండనే ఉంది. శ్రుతిప్రామాణ్యాన్ని అంగీకరించనివాళ్లతో నైతే ఆకాశాన్ని ఒక వస్తువుగా అనుమానప్రమాణంచేత గ్రహించాలి అని చెప్పవచ్చును. ఎందువల్ల ననగా గంధం మొదలైన గుణాలన్నీ పృథివి మొదలైన వస్తువులను ఆశ్రయించి ఉన్నాయి గాన శబ్దం అనే గుణం ఆకాశాన్ని ఆశ్రయించి ఉందనీ, అందుచేత శబ్దగుణానికి ఆశ్రయమైన ఆకాశం కూడ వస్తువే అనే అనుప్రమాణంచేత తెలుస్తూన్నది. మరొక విషయ మేమనగా ఆకాశం అనగా ఆవరణం లేకపోవడం మాత్రమే అని అంగీకరిస్తే ఆకాశంలోనికి ఒక పక్షి ఎగరగానే అక్కడ ఆవరణం ఉండడంచేత (ఏర్పడడంచేత) పైకి ఎగురుదాం అనుకొనే మరొక పక్షికి అవకాశం ఉండకూడదు.

వి. ఒక చోట ఘటం లేదు. అప్పుడు ఘట సామాన్యాభావం అక్కడ ఉంది. తరవాత ఒక ఘటం తీసికొనివచ్చినా కూడ అక్కడ ఘటసామాన్యాభావం ఉండదు. అట్లే మూర్తద్రవ్యం ఏదీ లేకపోవడం ఆకాశం అన్నప్పుడు అక్కడికి ఏదైన ఒక

మూర్తద్రవ్యం చేరినా కూడ ఆకాశం లేనట్లే అవుతుంది. అందుచేత ఒక పక్షి ఆకాశం లోనికి ఎగరగానే ఆవరణం ఏర్పడింది గాన, ఆవరణాభావం పోయింది గాన, రెండవ పక్షికి అక్కడ చోటు ఉండగూడదు అని భావం.

యత్రేతి:- ఎక్కడైతే ఆవరణం లేదో అక్కడ ఈ రెండవ పక్షి ఎగురుతుంది అన్న ట్లయితే 'యత్రావరణాభావః అని దేనిచేత నైతే నువ్వు ఆవరణాభావాన్ని విశేషిస్తున్నావో (ఒక విశిష్టరూపంలో చూపుతున్నవో) అది వస్తువే అయిన ఆకాశం అవుతుంది కాని ఆవరణాభావమాత్రమే కాదు.

వి. ఈ భూతలం మీద ఘటం లేదు అన్నప్పుడు ఘటం లేదని ఏ భూతలాన్ని చూపుతున్నామో ఆ భూతలం, అనగా ఘటాభావావచ్ఛిన్నమైన భూతలం, ఒక వస్తువే అయినట్లు పక్ష్యభావావచ్ఛిన్న మైన, పక్ష్యభావానికి స్థాన మైన ఆకాశం కూడ ఒక వస్తువే కావాలి కాని అసత్పదార్థం కాకూడదు.

అపి చేతి:- మరొక విషయ మేమనగా- ఆకాశం అంటే ఆవరణాభావమాత్రమే అని అంగీకరించే సౌగతునికి స్వసిద్ధాంతవిరోధం కూడ కలగుతుంది. సౌగతుల సిద్ధాంతంలో- "పూజ్యుడా! భూమి దేనిని ఆశ్రయించి ఉంది?" అనే ప్రశ్న ప్రతివచనాల ప్రవాహంలో పృథివ్యాదుల చివర "వాయువు దేనిని ఆశ్రయించుకొని ఉన్నది?" అనే ప్రశ్నకు "వాయుడు ఆకాశాన్ని ఆశ్రయించుకొని ఉన్నది" అని ప్రతివచనం చెప్పబడింది. ఆకాశం అనేది వస్తువు కాకపోతే, అసత్ అయితే, ఈ సమాధానం సమంజసం కాదని చెప్పవలసి వస్తుంది. ఆ కారణంవల్ల కూడ ఆకాశం వస్తువు కాదనడం అయుక్తం. మరొక విషయ మేమనగా- నిరోధద్వయము, ఆకాశము ఈ మూడు కూడ నిరుపాఖ్యాలు, అవస్తువులు (వస్తువులు కానివి), అయితే ఇవి నిత్యమైనవి అని చెప్పడం పరస్పరవిరుద్ధమైన మాట. అవస్తువుకు, అసత్తుకు నిత్యత్వం కాని అనిత్యత్వం కాని సంభవములు కావు కదా? ధర్మధర్మివ్యవహారం, అనగా ఒకటి ధర్మం ఒకటి ధర్మి, ధర్మంకలది అనే వ్యవహారం, వస్తువునే ఆశ్రయించి ఉంటుంది కదా? ఈ విధంగా ధర్మధర్మిభావాన్ని అంగీకరించి నట్లయితే ఆ ధర్మి, ఘటాదుల వలె వస్తువే అవుతుంది కాని నిరుపాఖ్యం కాజాలదు.24.

## సూ. అనుస్మృతేశ్చ. 2.2.25

అపి చ వైనాశికః సర్వస్య వస్తునః క్షణికతామభ్యుపయన్ ఉపలబ్ధురపి క్షణికతామభ్యుపేయాత్. న చ సా సంభవతి. అనుస్మృతేః

అనుభవమ్, ఉపలబ్ధిమ్ అనూత్పద్యమానం స్మరణమేవానుస్మృతిః. సా చ ఉపలబ్ధ్యేకకర్తృకా సతీ సంభవతి. పురుషాన్తరోపలబ్ధవిషయే పురుషాన్తరస్య స్మృత్యదర్శనాత్. కథం హ్యహమదోఽ ద్రాక్షమిదం పశ్యామీతి చ పూర్వోత్తరదర్శిన్యేకస్మిన్నసతి ప్రత్యయః స్యాత్? అపి చ దర్శనస్మరణయోః కర్తర్యేకస్మిన్ ప్రత్యక్షః ప్రత్యభిజ్ఞాప్రత్యయః సర్వస్య లోకస్య ప్రసిద్ధః అహమదోఽద్రాక్షమిదం పశ్యామీతి. యది హి తయోర్భిన్నః కర్తా స్యాత్తతోఽహం స్మరామ్యద్రాక్షీదన్య ఇతి ప్రతీయాత్. న త్వేవం ప్రత్యేతి కశ్చిత్. యత్రైవం ప్రత్యయస్తత్ర దర్శనస్మరణయోర్భిన్నమేవ కర్తారం సర్వలోకోఽవగచ్ఛతి- స్మరామ్యహమసావదోఽద్రాక్షీదితి. ఇహ త్వహమదోఽద్రాక్షమితి దర్శనస్మరణయోర్వైనాశికోఽప్యాత్మానమేవైకం కర్తారమవగచ్ఛతి. న నాహమిత్యాత్మనో దర్శనం నిర్వృత్తం నిహ్నుతే, యథాగ్నిరనుష్ణోఽ ప్రకాశ ఇతి వా. తత్రైవం సత్యేకస్య దర్శనస్మరణక్షణద్వయసంబన్ధే క్షణికత్వాభ్యుపగమహానిరపరిహార్యా వైనాశికస్య స్యాత్.

## బాలానందిని

**అనుస్మృతేరితి:-** "అనుస్మృతేశ్చ=అనుభవాన్ని అనుసరించి ఏర్పడిన స్మృతి కలగడంవల్ల కూడ ఆత్మ అస్థిరం కాదు" అని సూత్రార్థం.

**అపి చేతి:-** మరియు, అన్ని వస్తువులూ క్షణికాలే అని అంగీకరించే వైనాశికుడు ఉపలబ్ధకు (జ్ఞాతకు) కూడ క్షణికత్వాన్ని అంగీకరించవచ్చును. కాని అది (జ్ఞాతయైన ఆత్మకు క్షణికత్వం) కుదరదు. అనుస్మృతి ఉండడంవల్ల. అనుభవాన్ని, అనగా ఉపలబ్ధిని (జ్ఞానాన్ని) అనుసరించి పుట్టే స్మరణమే అనుస్మృతి. ఉపలబ్ధికి ఎవడు కర్తయో అతడే దీనికి కూడ కర్త అవుతేనే ఈ అనుస్మృతి కుదురుతుంది. మరొక పురుషుని ఉపలబ్ధికి (జ్ఞానానికి) విషయమైన దానిని మరొక పురుషుడు స్మరించడం చూడబడడం లేదు. పూర్వమూ తరువాత కూడ చూచే ఒక పురుషుడు లేకపోతే "నేను దానిని చూచాను, దీనిని చూస్తున్నాను" అనే ప్రత్యయం, జ్ఞానం, ఎలా కలుగుతుంది? (ఇంతక్రితం ఆ వస్తువును చూచిన నేనే ఇప్పు డీ వస్తువును చూస్తున్నాను అనే ప్రత్యభిజ్ఞ ఉండడంచేత ఆత్మ స్థిరమైన దని అంగీకరించా లని భావం). మరియు- "నేను దానిని, అనగా ఇప్పుడు నేనే దేనిని స్మరిస్తున్నానో దానిని, చూచి ఉన్నాను. ఇప్పుడిది చూస్తున్నాను" అని దర్శన, స్మరణాలు రెండింటికీ కర్తయైన ఒకే పురుషుని విషయంలో ప్రత్యభిజ్ఞారూపమైన జ్ఞానం సకలజనులకు, ప్రసిద్ధ మైనదే. ఆ దర్శనస్మరణాల కర్త వేరైన పక్షంలో అప్పుడు "నేను స్మరిస్తున్నాను, మరొకడు చూచాడు"

అనే జ్ఞానం కలగాలి. అలా ఎవడూ అనుకొనడం లేదు "నేను స్మరిస్తున్నాను, అతడు ఆ వస్తువును చూచాడు" అని ఎక్కడైతే జ్ఞానం ఉంటుందో అక్కడ దర్శనస్మరణాల కర్తలు భిన్నులే అని అందరూ తెలుసుకొంటున్నారు. ఇక్కడైతే వైనాశికుడు కూడ "నేను దానిని చూచాను" అని దర్శన స్మరణాలలో తానొక్కడే కర్త అయినట్లు తెలుసుకొంటున్నాడు కాని తనకు కలిగిన దర్శనాన్ని "నేను చూడలేదు" అని, అగ్నికి వేడి లేదు, ప్రకాశ లేదు అని అగ్నిలో ఉష్ణత్వప్రకాశాలను కప్పిపుచ్చినట్లు, కప్పిపుచ్చుకొనడం లేదు (నిరాకరించడం లేదు). ఈ విధంగా ఒకనికే దర్శనస్మరణాలతో సంబంధం ఉన్నప్పుడు వైనాశికుడు తాను అంగీకరించిన (ఆత్మ) క్షణికత్వాన్ని తప్పకుండా విడవవలసివస్తుంది.

## భాష్యమ్

తథా అనన్తరామనన్తరామాత్మన ఏవ ప్రతిపత్తిం ప్రత్యభిజానన్ ఏకకర్తృకామ్ ఓత్తమాదుచ్ఛ్వాసాత్, అతీతాశ్చ ప్రతిపత్తీరాజన్మనః ఆత్మైకకర్తృకాః ప్రతిసందధానః కథం క్షణభఙ్గవాదీ వైనాశికో నాపత్రపేత! స యది బ్రూయాత్-సాదృశ్యాదేతత్సంపత్స్యతే ఇతి. తం ప్రతి బ్రూయాత్, తేనేదం సదృశమితి ద్వయాయత్తత్వాత్సాదృశ్యస్య క్షణభఙ్గవాదినః సదృశయోర్ద్వయోర్వస్తునోర్గ్రహీతురేకస్యాభావాత్ సాదృశ్యనిమిత్తం ప్రతిసంధానమితి మిథ్యాప్రలాప ఏవ స్యాత్. స్యాచ్చేత్పూర్వోత్తరయోః క్షణయోః సాదృశ్యస్య గ్రహీతైకః తథా సత్యేకస్య క్షణద్వయావస్థానాత్ క్షణికత్వప్రతిజ్ఞా పీడ్యేత. తేనేదం సదృశమితి ప్రత్యయాన్తరమేవేదం న పూర్వోత్తరక్షణ ద్వయగ్రహణనిమిత్తమితి చేత్; న. తేనేదమితి భిన్నపదార్థోపాదానాత్. ప్రత్యయాన్తరమేవ చేత్సాదృశ్యవిషయం స్యాత్ తేనేదం సదృశమితి వాక్యప్రయోగోఽనర్థకః స్యాత్; సాదృశ్యమిత్యేవ ప్రయోగః ప్రాప్నుయాత్. యదా హి లోకప్రసిద్ధః పదార్థః పరీక్షకైర్న పరిగృహ్యతే తదా స్వపక్షసిద్ధిః పరపక్షదోషో వా ఉభయమప్యుచ్యమానం పరీక్షకాణామాత్మనశ్చ యథార్థత్వేన న బుద్ధిసన్తానమారోహతి. ఏవమేవైషోఽర్థ ఇతి నిశ్చితం యత్తదేవ వక్తవ్యమ్. తతోఽన్యదుచ్యమానం బహుప్రలాపిత్వమత్మనః కేవలం ప్రఖ్యాపయేత్. న చాయం సాదృశ్యాత్సంవ్యహారో యుక్తః తద్భావావగమాత్తత్సదృశ భావానవగమాచ్చ. భవేదపి కదాచిద్బాహ్యవస్తుని విప్రలమ్భసంభవాత్త దేవేదం స్యాత్తత్సదృశం వేతి సందేహః; ఉపలబ్ధరి తు సందేహోఽపి న కదాచిద్భవతి-స ఏవాహం స్యాం తత్సదృశో వా-ఇతి. య ఏవాహం పూర్వేద్యురద్రాక్షం స ఏవాహమద్య స్మరామీతి నిశ్చితాత్తద్భావోపలమ్భాత్. తస్మాదప్యనుపపన్నో వైనాశికసమయః. 25.

## బాలానందిని

తథేతి:- అదే విధంగా చివరి ఉచ్ఛ్వాసం వరకు (మరణించేవరకు) ఒకదాని తరవాత ఒకటిగా కలుగుతూన్న తనయొక్క జ్ఞానాన్ని తాను ఒక్కడే కర్తగా కలదానినిగా (ఆ జ్ఞానానికి కర్త తానొక్కడే అని) ప్రత్యభిజ్ఞానం చేస్తూ (గుర్తిస్తూ కూడ) తాను పుట్టినది మొదలు ఈ క్షణం వరకూ గడచిపోయిన జ్ఞానాలకు కూడ తానొక్కడే కర్త అని గుర్తిస్తూ కూడ క్షణభంగవాదం చేస్తూన్న ఈ వైనాశికుడు ఎందుకు సిగ్గుపడడం లేదో! ఇది కేవలం సాదృశ్యంవల్లనే అలా కనబడుతున్నది, (అనగా పూర్వోత్తరక్షణాలలో ఉన్న విజ్ఞానాలకి సాదృశ్యం ఉండడంవల్ల క్షణక్షణానికీ మారిపోతూన్న దీపం విషయంలో ఒకే దీపం అనే జ్ఞానం కలిగినట్లు విజ్ఞానం ఒక్కటే అనీ, స్థిరం అనీ, అదే కర్త అనీ భాసిస్తున్నది గాని వాస్తవంలో ఇది క్షణికమే) అని అతడంటే వానికి ఇలా సమాధానం చెప్పాలి- సాదృశ్యం అనేది, "తేన సదృశమ్ ఇదమ్" (ఇది దానితో సమానము)అని రెండు వస్తువులమీద ఆధారపడి ఉంటుంది. క్షణభంగవాది మతంలో సాదృశ్యం ఉన్న రెండు వస్తువులను గ్రహించే ఒక గ్రహీతయే లేనప్పుడు, ఈ ప్రతిసంధానం (ప్రత్యభిజ్ఞానం) సాదృశ్యంవల్ల ఏర్పడింది అని చెప్పడం నిరర్థకమైన పేలాపనే అవుతుంది. పూర్వోత్తరక్షణాల సాదృశ్యాన్ని గ్రహించే ఒక గ్రహీత ఉంటాడు అని అంగీకరిస్తే, ఒకే ఆత్మ రెండు క్షణాలపాటు ఉండడంచేత మీ క్షణికత్వసిద్ధాంతం బాధించబడుతుంది.

అవ. మేం చెప్పే ఈ సాదృశ్యం పూర్వోత్తరవస్తువుల జ్ఞానంవల్ల కలిగినది కాదు; రెండు వస్తువులలో ఉన్న సాదృశ్యాన్ని చెప్పేది కాదు. ఇది కేవలం ఒక వికల్పం, ఆరోపితజ్ఞానం. తన ఆకారాన్నే బాహ్యంగా ఉన్నట్లు విషయంగా చేసుకుంటుంది. ఇది ఒక క్షణంతో సంబంధించదు. అందుచేత స్థిరుడైన ద్రష్ట, ఒకడుండవలసిన పని లేదు అని పూర్వపక్షి ఆశంకిస్తున్నాడు-

తేనేదమితి:- (విజ్ఞానవాదులైన బౌద్ధుల సిద్ధాంతం ప్రకారం బాహ్యమైన ఘటపటాదివస్తువు లేవీ లేవు. అంతరమైన విజ్ఞానమే బాహ్యఘటపటాదిరూపాలలో భాసిస్తుంది. ఆ విజ్ఞానం కూడ క్షణికమే. ఆ సిద్ధాంతం ప్రకారం ఒక్క క్షణంలో సాదృశ్యం భాసిస్తుంది. విజ్ఞానమే బాహ్యమైన సాదృశ్యంగా కనబడుతుంది. మరుక్షణంలో అది పోతుంది. అందుచేత విజ్ఞానం క్షణికం అని అంగీకరించడంలో విరోధం ఏదీ లేదు అని ఆశంక చేసేవాళ్ల అభిప్రాయం). 'ఇది దానితో సమానము' అనే ఈ మొత్తం అంతా ఒక ప్రత్యయమే కాని పూర్వోత్తరక్షణాలను రెండింటినీ గ్రహించడంవల్ల కలిగినది కాదు అని అన్నట్లయితే, అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా తేన (దానితో)

ఇదమ్ (ఇది) అని వేరు వేరు పదార్థాలు గ్రహించబడుతున్నాయి. (అందుచేత 'తేన', 'ఇదమ్', 'సదృశమ్' అని మూడు వస్తువులు కనబడుతున్నాయి గాన ఇది కేవలం సాదృశ్యంయొక్క ప్రత్యయమే అనడానికి వీలులేదు). ఇది సాదృశ్యాన్ని గూర్చిన మరొకప్రత్యయం మాత్రమే అయితే అప్పుడు "తేన ఇదం సదృశమ్" అనే వాక్య ప్రయోగానికి అర్థం ఉండదు. 'సాదృశ్యమ్' అని మాత్రమే ప్రయోగించవలసి ఉంటుంది. (అందుచేత ఈ ప్రతీతిలో అనేక పదార్థాలు భాసిస్తున్నాయి అని చెప్పక తప్పదు).

అవ. వస్తుత్రయం ప్రత్యయంలో భాసిస్తున్న దన్న మాట నిజమే. అయితే ఆ మూడు కలిసి ఒక ప్రత్యయమే, అనగా ఆ మూడూ ప్రత్యయాలూ అభిన్న మైనవే. అందుచేత ప్రత్యయంకంటె వేరుగా బాహ్యపదార్థం ఏదీ లేదు అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నారు.

యదా హీతి:- పరీక్షకులు లోకసిద్ధమైన పదార్థాన్ని, అనగా లోకంలో ప్రసిద్ధమైన బాహ్యపదార్థాన్ని, అంగీకరించకపోతే స్వపక్షసిద్ధి కాని, పరపక్షదోషం కాని, ఈ ఉభయమునూ చెప్పినప్పుడు అది యదార్థమే అని పరీక్షకుల బుద్ధిసంతానంలోనికి తన బుద్ధిసంతానంలోనికీ కూడ ప్రవేశించదు.

వి. బౌద్ధులతో సహా దార్శనికు లెవరైనా తమ పక్షం స్థాపించా లన్నా, పరపక్షాన్ని దూషించా లన్నా అనేకబాహ్యపదార్థాలను అంగీకరించాలి. విజ్ఞానమే అలా కనబడుతున్న దనడం యుక్తం కాదు. స్వపక్షసిద్ధ్యాదికం జరగాలంటే తాను, మరొక ప్రతివాది, పక్షము, హేతువు మొదలైన ఎన్నో బాహ్యపదార్థా లుండాలి. బాహ్యపదార్థాలను అంగీకరించకపోతే ఇవన్నీ కుదరవు. అందుచేత అనుభవాన్ని పట్టి జ్ఞానం వేరు జ్ఞేయం వేరు అని అంగీకరించాలి. అప్పుడు 'తేనేదం సదృశమ్" ఇత్యాదులలో, ముందుగా బాహ్యార్థలను గ్రహించి తరవాత వాటి సాదృశ్యాన్ని గ్రహించే స్థిరమైన ఆత్మ ఉన్న దని చెప్పవలసి వస్తుంది అని భావం.

అవ. ఇప్పుడు బాహ్యార్థం ఉన్నదని అంగీకరిస్తూ పూర్వపక్షి ఈ ఆశంక చేయవచ్చును-బాహ్యార్థాలు ఉన్నాయి. అవి క్షణికాలు. నిర్వికల్పకజ్ఞానంచేత గ్రహించబడతాయి. అయితే వాటిలో కననబడే స్థాయిత్వం, సాదృశ్యం మొదలైనవి సవిక్పకజ్ఞానంచేత గ్రహింపదగినవి. ఈ సవికల్పకజ్ఞానంచేత విప్రతిపత్తి సాదృశ్యప్రతీతి మొదలైన వ్యవహారాలు జరుగవచ్చును. అందుచేత స్థిరమైన ఆత్మను అంగీకరించవలసిన అవసరం లేదు. ఈ ఆశంకకు సమాధానం చెపుతున్నారు-

ఏవమితి:- ఇది భామత్యనుసారంగా రత్నప్రభాకారుడు చూపిన ఆశంక. బ్రహ్మవిద్యాభరణంలో ఆశంక ఈ విధంగా చూపబడింది. బాహ్యపదార్థాన్ని అంగీకరించి ప్రతియోగ్యాదివిశిష్టసాదృశ్య ప్రత్యయాన్ని, స్థిరమైన ఆత్మ లేకపోయినా సంపాదించడం శక్యమే. ఒక సంతతిలో (జ్ఞానసంతతిలో) ఉన్న ప్రతియోగిజ్ఞానంవల్ల కలిగే ఉత్తరోత్తర ప్రతీతి ప్రతియోగితో కూడిన పదార్థాన్ని విషయంగా చేసుకొనియే ప్రవర్తిస్తుంది అని అంగీకరిస్తాం అని ఆశంక. దానికి సమాధానంగా ఏవమిత్యాదివాక్యం చెప్పబడింది.

వి. సాదృశ్యం అనగా పోలిక. ఒకదానికి మరొకదానితో సాదృశ్యం చెప్పినప్పుడు దేనికి సాదృశ్యం చెప్పబడుతుందో అది 'అనుయోగి', దేనితో సాదృశ్యం చెప్పబడుతుందో అది 'ప్రతియోగి'. ఉదాహరణకి-ముఖానికి చంద్రునితో సాదృశ్యం చెప్పినప్పుడు ముఖం అనుయోగి, చంద్రుడు ప్రతియోగి. అందుచేత ఇది ఏ సాదృశ్యం అని అంటే ముఖానుయోగికచంద్రప్రతియోగికసాదృశ్యం అంటారు. అందుచేత ఒక జ్ఞాన సంతానంలో అనుయోగిజ్ఞానం ఉంటుంది. ఆ అనుయోగిజ్ఞానం తరవాత ఆ క్షణికజ్ఞానంవల్ల పుట్టిన క్షణికజ్ఞానంలో ప్రతియోగి భాసిస్తుంది. తరవాతి జ్ఞానంలో సాదృశ్యం భాసిస్తుంది. ఈ విధంగా జ్ఞానక్షణాలలోనే సాదృశ్యజ్ఞానం కలగవచ్చును గాన స్థిర మైన ఆత్మ అవసరం లేదు అని ఆశంక అభిప్రాయం.

దీనికి సమాధానం- ఇది ఇట్లే అని ఏ విషయమైతే నిశ్చిత మైనదో అదే చెప్పాలి కాని లోకప్రసిద్ధికి విరుద్ధంగా ఏదేదో చెపితే అది అలా చెప్పేవాడు ఏదేదో అధికంగా పేలుతున్నాడు అనే భావాన్నే శ్రోతలకు కలిగిస్తుంది.

అవ. నిజానికి 'అహమదోऽద్రాక్షమ్, ఇదం పశ్యామి' అనేది ప్రత్యభిజ్ఞానమే కాని సాదృశ్యజ్ఞానం అవడానికి అవకాశమే లేదు అని చెపుతున్నారు- న చాయమితి:- ఈ వ్యవహారం సాదృశ్యంవల్ల జరుగుతుంది అనడం కూడ కుదరదు. ఎందువల్ల ననగా అదే ఇది అనే జ్ఞానమే కలుగుతున్నది గాని ("ఏ నేను పూర్వం చూచి ఉన్నానో ఆ నేనే ఇప్పుడు స్మరిస్తున్నాను" అని కాని "ఏ నేను పూర్వం చూచినదానిని స్మరిస్తున్నానో ఆ నేనే ఇప్పుడు మరొకటి చూస్తున్నాను" అనిగాని రెండు జ్ఞానాల కర్త ఒక్కడే అనే జ్ఞానం కలుగుతున్నది గాని) "ఈ స్మరిస్తున్నవాడు చూచినవానివంటివాడు" అనే జ్ఞానం కలగడం లేదు. బాహ్యవస్తువు విషయంలో ఒకప్పుడు, భ్రాంతికి అవకాశం ఉండడంచేత "అదే ఇదా లేక దానివంటిదా" అనే సందేహం కలిగితే కలగవచ్చును. అంతే కాని "నేను ఆ నేనేనా లేక ఆ నాతో సమానుడనా" అనే సందేహం ఎన్నడూ కలగదు. ఏ నేను నిన్న చూచానో ఆ నేనే నేడు స్మరిస్తున్నాను అని నిశ్చితంగా తద్భావం (చూచినవాడు స్మరించేవాడూ ఒకరే అవడం) కనబడుతున్నది కదా? ఆ కారణంవల్ల కూడ వైనాశికసమయం అనుపపన్న మైనది. 25.

## సూ. నాసతోఽదృష్టత్వాత్. 2.2.26.

ఇతశ్చానుపపన్నో వైనాశికసమయః, యతః స్థిరమనుయాయి కారణ మనభ్యుపగచ్ఛతామభావాద్భావోత్పత్తిరిత్యేతదాపద్యతే. దర్శయన్తి చాభావాద్భావోత్పత్తిమ్- "నానుపమృద్య ప్రాదుర్భావాత్" ఇతి. వినష్టాద్ధి కిల బీజాదఙ్కుర ఉత్పద్యతే, తథా వినష్టాత్ క్షీరాద్దధి; మృత్పిణ్డాచ్చ ఘటః. కూటస్థాచ్చేత్కారణాత్కార్యముత్పద్యేత అవిశేషాత్సర్వం సర్వత ఉత్పద్యేత. తస్మాదభావగ్రస్తేభ్యః బీజాదిభ్యోఽ ఙ్కురాదీనాముత్పద్యమానత్వాదభా వాద్భావోత్పత్తిరితి మన్యన్తే. తత్రేదముచ్యతే- "నాసతోఽ దృష్టత్వాత్" ఇతి. నాభావాద్భావ ఉత్పద్యతే. యద్యభావాద్భావ ఉత్పద్యేతాభావత్వావిశేషాత్ కారణవిశేషాభ్యుపగమోఽనర్థకః స్యాత్. న హి బీజాదీనాముపమృదితానాం యోఽభావస్తస్యాభావస్య శశవిషాణాదీనాం చ నిఃస్వభావత్వావిశేషాదభావత్వే కశ్చిద్విశేషోఽస్తి, యేన బీజాదేవాఙ్కురో జాయతే, క్షీరాదేవ దధీత్యేవంజాతీయకః కారణవిశేషాభ్యుపగమోఽ ర్థవాన్ స్యాత్. యది పునరభావస్యాపి విశేషోఽభ్యుపగమ్యేతోత్పలాదీనామివ నీలత్వాదిస్తతో విశేషవత్త్వాదేవాభావస్య భావత్వముత్పలాదివత్ప్రసజ్యేత. అభావాచ్చ భావోత్పత్తౌ అభావాన్వితమేవ సర్వం కార్యం స్యాత్, న చైవం దృశ్యతే; సర్వస్య చ వస్తునః స్వేన స్వేన రూపేణ భావాత్మనైవోపలభ్యమానత్వాత్. న చ మృదన్వితాః శరావాదయో భావాస్తన్త్వాదివికారాః కేన చిదభ్యుపగమ్యన్తే. మృద్వికారానేవ తు మృదన్వితాన్ భావాన్ లోకః ప్రత్యేతి.

### బాలానందిని

నేతి:- "అసతః=అభావంనుండి, న=భావం పుట్టదు, అదృష్టత్వాత్= ఆ విధంగా లోకంలో చూడబడడంలేదు గాన" అని సూత్రార్థం.

అవ. అభావం శశవిషాణం వలె అత్యంతము అసత్ (లేనిది), అనగా శశవిషాణం వలె అసలే లేకపోవడం 'అభావం' అని అంగీకరించి సౌగతులు అసత్తైన మృదాదినాశంవల్ల ఘటాదికం పుడుతుంది అని అంటారు, దానిని నిరాకరిస్తున్నారు- ఇతశ్చేతి:- సౌగతసిద్ధాంతం ఈ కారణంవల్ల కూడ అనుపపన్నమైనది. ఎందువల్ల ననగా స్థిరమూ, అనుయాయి (కార్యంలోనికి అనువర్తించేది) అయిన కారణాన్ని అంగీకరించనప్పుడు అభావంనుంచియే

భావం పుడుతుంది అని చెప్పినట్లవుతుంది. అభావంనుంచే భావం పుడుతుం దని వాళ్లు స్పష్టంగానే "నానుపమృద్య ప్రాదుర్భావాత్" అని చెపుతున్నారు కూడ. (నానుపమృద్య= మృదాదికమైన కారణాన్ని ఉపమర్దించకపోవడం (నశింపచేయకపోవడం) అనేది లేకుండా, అనగా నశింపచేసి మాత్రమే, ప్రాదుర్భావాత్=కార్యమైన ఘటాదికం పుడుతూన్నది గాన, భావం అభావంనుండి పుట్టుచున్నది అని ఈ సూత్రానికి అర్థం). నశించిన బీజంనుండి అంకురం పుడుతున్నది. నశించిన క్షీరంనుండి పెరుగు పుట్టుచున్నది. నశించిన మృత్పిండం నుండి ఘటం పుట్టుచున్నది. కూటస్థమైన (నశించకుండా ఉండి నిత్యమైన) కారణంనుండి కార్యం పుట్టేటట్లయితే విశేషం ఏమీ లేకపోవడంచేత అన్ని కార్యాలూ అన్నింటినుండీ పుట్టాలి.

వి. కూటస్థ మైనదానికి కార్యాన్ని పుట్టించే స్వభావం ఉంటుందా ఉండదా? ఉంటుంది అన్నట్లయితే అప్పుడు అది ఎన్ని కార్యాలను పుట్టించకలుగుతుందో వాటి నన్నింటినీ వెంటనే పుట్టించివెయ్యాలి. సమర్థ మైనది అలసించకూడదు కదా? పుట్టించే స్వభావం లేని పక్షంలో ఎన్నడూ కూడ కార్యాన్ని పుట్టించకూడదు. సమర్థమైనా కూడ ఒక క్రమంలో లభించే సహకారుల సహాయంతో అది కార్యాన్ని క్రమంగా పుట్టిస్తుంది అనడం యుక్తం కాదు. అప్పుడు ఈ వికల్పాలకు (ప్రశ్నలకు) సమాధానం చెప్పవలసి ఉంటుంది- ఆ కూటస్థకారణానికి సహకారులు ఏదైనా ఉపకారం సమకూరుస్తాయా, సమకూర్చవా? సమకూర్చవు అని అంటే, వాటివల్ల ఏ ఉపకారమూ జరగదు అన్నట్లయితే, అలాంటి సహకారులను అపేక్షించడమే ఉండదు. అలా కాక సహకారులు ఏదైన ఉపకారాన్ని సమకూరుస్తాయి అన్నట్లయితే దానికంటె భిన్నమైన ఉపకారాన్ని సమకూరుస్తాయా, అభిన్నమైన ఉపకారాన్ని సమకూరుస్తాయా? అభిన్నమైన ఉపకారాన్ని సమకూరుస్తాయి అన్నట్లయితే, అనగా సామగ్రిచేత కల్పింపబడిన ఉపకారం భావంకంటె అభిన్నమైతే, అది అన్యకృత మైతే, అప్పుడు దాని కూటస్థత్వం చెడిపోతుంది. భిన్నమైన ఉపకారాన్ని సమకూరుస్తాయి అన్నట్లయితే అప్పుడు అది లేకపోతే కార్యం కలగడం లేదు అని చెప్పినట్లయిందిగాన అప్పుడు ఆ కార్యాన్ని పుట్టించినది ఉపకారమే కాని భావం కాదు అన్నట్లవుతుంది. అప్పుడు దానికి (భావానికి) అర్థకారిత్వం ఉండదు గాన సత్త్వం లేకుండా పోతుంది. అందుచేతనే పెద్దలు ఇలా చెప్పారు-

"వర్షాతపాభ్యాం కిం వ్యోమ్నశ్చర్మణ్యస్తి తయోః ఫలమ్.
చర్మోపమశ్చేత్సోఽనిత్యః ఖతుల్యశ్చేదసత్ఫలః"

"వర్షం కురిసినా ఎండ కాసినా ఆకాశానికి ఏమీ అవదు. వాటి ఫలం చర్మంలో కనబడుతుంది. (వర్షాని కది ఉబ్బుతుంది, ఎండకు సంకోచం పొందుతుంది). అది

(కారణం) చర్మవంటిది అని అంటే అప్పుడు అనిత్య మని చెప్పాలి. ఆకాశంవంటి దైతే ఫల ంలేని దని చెప్పాలి" అని ఈ కారికకు అర్థం. అందుచేత ఏమీ చేయని కూటస్థంనుండి కార్యం పుడితే అన్నింటినుండీ అన్నీ పుట్టవలసివస్తుంది (భామతి).

తస్మాదితి:- అందువల్ల అభావంచేత ఆక్రమించబడిన, అభావోన్ముఖాలైన, బీజాదులనుండియే అంకురాదులు పుడుతున్నాయి గాన భావం అభావంనుంచి పుడుతుంది అని (సౌగతులు) భావిస్తున్నారు. ఈ విషయంలో సమాధానంగా "నాసతో ఽదృష్టత్వాత్" అని చెప్పబడుచున్నది- అభావంనుంచి భావం పుట్టదు. అభావంనుంచి భావం పుట్టే టట్లయితే అభావత్వంలో విశేషం ఏదీ లేదు గాన కారణవిశేషాన్ని అంగీకరించడం నిరర్థకం అవుతుంది. అలాంటి విశేషం ఏదైనా ఉంటే అప్పుడు బీజంనుండి మాత్రమే అంకురం పుడుతుంది, పాల నుండి మాత్రమే పెరుగు పుడుతుంది ఇత్యాదివిధంగా కారణవిశేషాన్ని అంగీకరించడం సార్థకం అయి ఉండేది. ఏ విశేషమూ లేని అభావం కారణం అని అంగీకరిస్తే శశవిషాణాదులనుండి కూడ అంకురాదులు పుట్టేవి. అలాంటి వేమీ కనబడడంలేదు. ఉత్పలం మొదలైనవాటికి నీలత్వం మొదలైన విశేషాలు అంగీకరించినట్లు అభావానికి కూడ విశేషం ఏదైనా అంగీకరిస్తే అప్పుడు విశేషం ఉండడంచేతనే ఆ అభావం ఉత్పలాదుల వలె భావమే అయిపోతుంది. మరొక విషయం ఏమనగా అభావం దేనియొక్క ఉత్పత్తికీ హేతువు కాజాలదు. కారణం-అది శశవిషాణం వలె అభావం అవడమే. అభావంనుంచి భావం పుడితే అలా పుట్టిన ప్రతీకార్యమూ కూడ (ఘటాదులు మట్టితో అన్వితములై ఉన్నట్లు) అభావంతో అన్వితములై ఉండాలి. కాని అలా కనబడడం లేదు. సమస్త వస్తువులూ కూడ తమ తమ రూపంలో భావరూపాలుగానే కనబడుతున్నాయి కదా? మృత్తుతో అన్వితాలైన శరావాదిభావాలను తంత్వాదివికారా లని (తంత్వాదులతో చేయబడిన కార్యాలని) ఎవ్వడూ అంగీకరించడు కదా? మృత్తుతో అన్వితాలైన భావాలను మృద్వికారా లని మాత్రమే జనం గుర్తిస్తారు కదా? (అందుచేత అభావంనుండి భావాలు పుడతాయి అని అంగీకరిస్తే భావాలన్నింటిలోను అభావం అనుస్యూతంగా ఉండవలసివస్తుంది అని భావం).

## భాష్యమ్

యత్తూక్తమ్- స్వరూపోపమర్దమన్తరేణ కస్య చిత్కూటస్థస్య వస్తునః కారణత్వానుపపత్తేరభావాద్భావోత్పత్తిర్భవితుమర్హతి ఇతి, తద్దురుక్తమ్. స్థిరస్వభావానామేవ సువర్ణాదీనాం ప్రత్యభిజ్ఞాయమానానాం

రుచకాదికార్యకారణభావదర్శనాత్. యేష్వపి బీజాదిషు స్వరూపోపమర్దో లక్ష్యతే తేష్వపి నాసావుపమృద్యమానా పూర్వావస్థోత్తరావస్థాయాః కారణమభ్యుపగమ్యతే; అనుపమృద్యమానానామేవ అనుయాయినాం బీజాద్యవయవానామఙ్కురాదికారణభావాభ్యుపగమాత్. తస్మాదసద్భ్యః శశవిషాణాదిభ్యః సదుత్పత్త్యదర్శనాత్, సద్భ్యశ్చ సువర్ణాదిభ్యః సదుత్పత్తిదర్శనాత్ అనుపపన్నోఽయమభావాద్భావోత్పత్త్యభ్యుపగమః. అపి చ చతుర్భిశ్చిత్తచైత్తా ఉత్పద్యన్తే, పరమాణుభ్యశ్చ భూతభౌతికలక్షణః సముదాయ ఉత్పద్యేత ఇత్యభ్యుపగమ్య పునరభావాద్భావోత్పత్తిం కల్పయద్భిరభ్యుపగతమపనిహ్నువానైర్వైనాశికైః సర్వో లోక ఆకులీక్రియతే. 26.

బాలానందిని

యత్త్వితి:- ఏ కూటస్థ వస్తువూ కూడ స్వరూపోపమర్ధం (స్వరూపవినాశం) లేకుండా కారణం కాజాలదు కాబట్టి అభావంనుండి భావం పుడుతుంది అని ఏది చెప్పబడిందో అది దురుక్తమే (చెడ్డగా చెప్పిన మాటయే). ఎందువల్లననగా స్థిరమైన స్వభావం గల, ఆ విధంగా గుర్తింపబడుచున్న, సువర్ణాదులే రుచకం మొదలైన కార్యాలకు కారణాలుగా అవడం చూస్తున్నాం. స్వరూపోపమర్దం కనబడుచున్న బీజాదులలో కూడ ఉపమర్దించబడుచున్న పూర్వావస్థ ఉత్తరావస్థకు కారణం అని అంగీకరించబడడం లేదు. ఉపమర్దింపబడ కుండా అనుగతాలుగా ఉంటూన్న బీజాద్యవయవాలే అంకురాదులకు కారణం అని అంగీకరించబడుతుంది. అందువల్ల అసత్పదార్థాలైన శశవిషాణాదులనుండి సత్పదార్థాలు పుట్టడం కనబడడంలేదు గాన, అదే విధంగా సత్పదాదార్థాలైన సువర్ణాదులనుండి సత్పరార్థాలు పుట్టడం కనబడుతూన్నది గాన, అభావంనుంచి భావం పుడుతుంది అనే ఈ అంగీకారం అనుపన్నమైనది. మరొక విషయ మేమనగా- నాలుగు భూతాలచేత చిత్తచైత్తాలు పుడతా యనీ పరమాణువుల నుండి భూతభౌతికరూపమైన సముదాయం పుడుతుం దనీ అంగీకరించి మళ్లీ అభావంనుంచి భావం పుడుతుంది అని కల్పించి తాము అంగీకరించిన విషయాన్నే కప్పిపుచ్చుతూన్న వైనాశికులు లోకా న్నంతనీ కంగారుపెట్టేస్తున్నారు. 27.

## సూ. ఉదాసీనానామపి చైవం సిద్ధిః 2.2.27

యది చాభావాద్భావోత్పత్తిరభ్యుపగమ్యేత ఏవం సత్యుదాసీనానామనీహమానానామపి జనానామభిమతసిద్ధిః స్యాత్, అభావస్య సులభత్వాత్.

కృషీవలస్య క్షేత్రకర్మణ్యప్రయతమానస్యాపి సస్యనిష్పత్తిః స్యాత్. కులాలస్య చ మృత్సంస్క్రియాయామప్రయతమానస్యాప్యమత్రోత్పత్తిః, తన్తువాయస్యాపి తన్తూనతన్వానస్యాపి తన్వానస్యేవ వస్త్రలాభః. స్వర్గాపవర్గయోశ్చ న కశ్చిత్ కథంచిత్ సమీహేత. న చైతదుయుజ్యతే ఽభ్యుపగమ్యతే వా కేన చిత్. తస్మాదప్యనుపపన్నో ఽయమభావాద్భావోత్పత్త్యభ్యుపగమః.27.

బాలానందిని

ఉదాసీనానామితి:- "ఏవమ్=ఇట్లైతే, ఉదాసీనానామపి= ఏ పనీ చేయకుండా ఉన్నవాళ్లకి కూడ, సిద్ధిః=కార్యసిద్ధి కలుగుతుంది" అని సూత్రార్థం.

యదీతి:- అభావంనుంచి భావం పుడుతుంది అని అంగీకరిస్తే ఉదాసీనులకు కూడ, ఏ ప్రయత్నమూ చేయని జనులకు కూడ, కావలసిన కార్యాల సిద్ధి కలుగుతుంది; అభావం అందరికీ సులభమే కదా? వ్యవసాయదారుడు పొలం దున్నడం మొదలైన పనులు చేయకపోయినా కూడ సస్యం పండాలి; కులాలుడు మట్టిని సంస్కరించడంలో ప్రయత్నించకపోయినా కూడ పాత్రలు పుట్టాలి. సాలీడు దారం నేయకపోయినా కూడ నేసినవానికి వలె వానికి వస్త్రాలు లభించాలి. ఎవ్వడూ, ఏ విధంగానూ కూడ స్వర్గ- మోక్షాలకోసం ప్రయత్నించకపోవచ్చును. ఇది యుక్తమూ కాదు, ఎవ్వరూ కూడ అంగీకించనూ అంగీకరించరు. అందువల్ల కూడ అభావంనుంచి భావం పుడుతుంది అనే ఈ అభ్యుపగమం అనుపపన్నం. 27.

సముదాయాధికరణం సమాప్తం.

## 5. అభావాధికరణమ్. సూ.28-32

### సూ. నాభావ ఉపలబ్ధేః. 2.2.28.

ఏవం బాహ్యార్థవాదమాశ్రిత్య సముదాయాప్రాప్త్యాదిషు దూషణేషూద్భావితేషు విజ్ఞానవాదీ బౌద్ధ ఇదానీం ప్రత్యవతిష్ఠతే. కేషాం చిత్కిల వినేయానాం బాహ్యే వస్తున్యభినివేశమాలక్ష్య తదనురోధేన బాహ్యార్థవాదప్రక్రియేయం విరచితా. నాసౌ సుగతాభిప్రాయః; తస్య తు విజ్ఞానైకస్కన్ధవాద ఏవాభిప్రేతః. తస్మింశ్చ విజ్ఞానవాదే బుద్ధ్యారూఢేన రూపేణాన్తఃస్థ ఏవ ప్రమాణప్రమేయఫలవ్యవహారః సర్వ ఉపపద్యతే. సత్యపి బాహ్యార్థే బుద్ధ్యారోహమన్తరేణ ప్రమాణాదివ్యవహారానవతారాత్. కథం

పునరవగమ్యతేఽన్తఃస్థ ఏవాయం సర్వవ్యవహారో న విజ్ఞానవ్యతిరిక్తో బాహ్యోర్థోఽస్తీతి? తదసంభవాదిత్యాహ. స హి బాహ్యోర్థః అభ్యుపగమ్యమానః పరమాణవో వా స్యుః తత్సమూహో వా స్తమ్భాదయః స్యుః. తత్ర న తావత్పరమాణవః స్తమ్భాదిప్రత్యయపరిచ్ఛేద్యా భవితుమర్హన్తి, పరమాణ్వాభాసజ్ఞానానుపపత్తేః. నాపి తత్సమూహాః స్తమ్భాదయః, తేషాం పరమాణుభ్యోఽన్యత్వానన్యత్వాభ్యాం నిరూపయితుమశక్యత్వాత్. ఏవం జాత్యాదీనపి ప్రత్యాచక్షీత. అపి చానుభవమాత్రేణ సాధారణాత్మనో జ్ఞానస్య జాయమానస్య యోఽయం ప్రతివిషయం పక్షపాతః స్తమ్భజ్ఞానం కుడ్యజ్ఞానం, ఘటజ్ఞానం, పటజ్ఞానమితి, నాసౌ జ్ఞానగతవిశేషమన్తరేణోపపద్యత ఇత్యవశ్యం విషయసారూప్యం జ్ఞానస్యాఙ్గీకర్తవ్యమ్. అఙ్గీకృతే చ తస్మిన్విషయాకారస్య జ్ఞానేనైవావరుద్ధత్వాద పార్థికా బాహ్యోర్థసద్భావకల్పనా.

## బాలానందిని

నేతి:- "ఉపలబ్ధేః=బాహ్యార్థం కనబడుతున్నదిగాన, అభావః=బాహ్యార్థం యొక్క అభావం, న=లేదు" అని సూత్రార్థం.

ఏవమితి:- ఈ విధంగా బాహ్యార్థవాదాన్ని (బాహ్యపదార్థాలు ఉన్నాయి అని అంగీకరించే సౌత్రాంతికవైభాషికుల మతాన్ని) అనుసరించి (అనగా వాళ్ల మతంలో) సముదాయాప్రాప్తిమొదలైన దోషాలను చూపగా ఇప్పుడు విజ్ఞానవాదియైన బౌద్ధుడు (యోగాచారుడు) ఎదురుకుంటున్నాడు. కొందరు శిష్యులకు బాహ్యవిషయాలమీద ఉన్న అభినివేశాన్ని (పట్టుదలను) చూచి దానికి అనుగుణంగా బాహ్యార్థవాదప్రక్రియ రచించబడింది. అయితే ఇది బుద్ధుని అభిప్రాయం కాదు. బుద్ధుని కైతే విజ్ఞానైకస్కంధ వాదం (ఉన్నది విజ్ఞానస్కంధం ఒకటే, బా.హ్యార్థా లేవీ లేవు అనే వాదమే) ఇష్ట మైనది. ఆ విజ్ఞానవాదంలో ప్రమాణం, ప్రమేయం, ఫలం అనే సమస్తవ్యవహారమూ కూడ బుద్ధిని అధిష్ఠించిన రూపంలో లోపలనే ఉన్నట్లుగా కుదురుతుంది. బాహ్యార్థం ఉంది అని అంగీకరించినా కూడ అది బుద్ధిలో ప్రవేశిస్తే తప్ప ప్రమాణాదివ్యవహారం జరగదు కదా?

వి. ఘటం మొదలైన వస్తువుల జ్ఞానం కలిగి నప్పుడు నాలుగు అంశాలు ఉంటాయి- ప్రమాత, ప్రమేయం, జ్ఞానం, ఫలం. గ్రహించేవాడు ప్రమాత. చక్షురాదికం ప్రమాణం. చక్షురాదులకు పదార్థంతో సంబంధం కలిగినప్పుడు కలిగేది జ్ఞానం. ఆ

జ్ఞానానికి ఫలం ఆ వస్తువు భాసించడం (తెలియడం). నైయాయికాదులు సాధారణంగా ఏదైన విషయాన్ని గూర్చి మాట్లాడే టప్పుడు ఉదాహరణంగా ఘటం, పటం మొదలైనవి చూపుతుంటారు. బౌద్ధులు నీలం, పీతం, ఇత్యాదులు చూపుతుంటారు. నీలం అనగా నల్లని వస్తువు. పీతం అనగా పచ్చని వస్తువు. విజ్ఞానవాదుల ప్రకారం విజ్ఞానమే నీలాద్యాకారంతో కల్పితమై ప్రమేయం అవుతుంది. ఆ నీలాదికం తెలిసిన ట్లవడం మానానికి (జ్ఞానానికి) ఫలం. విజ్ఞానమే శక్తిస్వరూపంచేత మానం; అనగా విజ్ఞానంలోని శక్తియే మానం. అదే శక్తికి ఆశ్రయం అనే రూపంలో ప్రమాత. ఇవన్నీ విజ్ఞానంలోనే కల్పించిన భేదాలు. వాస్తవంలో విజ్ఞానం తప్ప పదార్థం గాని, ప్రమాణం గాని, దానిని తెలుసుకొనడం గాని, తెలుసుకొనేవాడు గాని ఇవేవీ లేవు. భేదకల్పనచేతనే వ్యవహారం అంతా జరుగుతున్నది.

కథమితి:- ఈ వ్యవహారం అంతా లోపల మాత్రమే ఉంది, విజ్ఞానంకంటె భిన్న మైన బాహ్యపదార్థం అంటూ ఏదీ లేదు అని ఎలా తెలుస్తూన్నది. అలాంటి బాహ్యపదార్థం అనేది ఉండడం సంభవం కాదు గాన మేం అలా అంగీకరిస్తున్నాం అని అంటాడు (విజ్ఞానవాది). బైట ఉన్నట్లుగా అంగీకరించబడే ఆ పదార్థం పరమాణువులైనా కావాలి లేదా వాటి సమూహాలైన స్తంభం మొదలైనవైనా కావాలి. 'ఇది స్తంభం' ఇత్యాది ప్రత్యయాలచేత (జ్ఞానాలచేత) పరిచ్ఛేద్య మైనవి (తెలియబడేవి) పరమాణువులు కాజాలవు; ఎందువల్ల ననగా పరమాణువులు విషయంగా గల జ్ఞానం (ఇవి పరమాణువులు అనే జ్ఞానం) ఎవరికీ కలగదు కదా. స్తంభాదులు పరమాణువుల సమూహాలే అని కూడ చెప్పడానికి కుదరదు. ఎందువల్ల ననగా అవి పరమాణువుల కంటె భిన్నములా అభిన్నములా అని చెప్పడం కష్టం. (అందుచేత పరమాణువుల సముదాయమే స్తంభాదికం అని చెప్పడం కూడ యుక్తం కాదు). జాత్యాదులను కూడ (జాతిగుణకర్మలను) ఈ విధంగానే నిరాకరించాలి. (ఏతన్నిరాకరణపద్ధతి తార్కికసమయవిచారంలో సిద్ధాంతిచేతనే చెప్పబడింది). మరొక విషయ మేమనగా- జ్ఞానం సాధారణరూపంలో కేవలం అనుభవంగా పుట్టుచున్నది. అయితే దీనికి స్తంభజ్ఞాన మనీ, కుడ్యజ్ఞానం అనీ, ఘటజ్ఞానం అనీ, పటజ్ఞానం అనీ ఏదో ఒక విషయంలో పక్షపాతం కనబడుతున్నది. ఇది జ్ఞానంలో ఉన్న ఏదో ఒక విశేషం లేకుండా కలగదు. అందుచేత జ్ఞానానికి విషయంతో సారూప్యం ఉందని తప్పక అంగీకరించాలి. అలా అంగీకరించిన తరవాత విషయంయొక్క ఆకారం జ్ఞానంచేతనే ఆక్రమించబడింది గాన బాహ్యార్థాలు ఉన్నా యని కల్పించడం వ్యర్థం.

వి. అనుభవమే జ్ఞానం. (అనుభవం అనగా ఒక విషయాన్ని తెలుసుకొనడం). ఆ యా వస్తువులు వేరైనా వాటి జ్ఞానం మాత్రం అనుస్యూతంగా వస్తూన్నది గాన సాధారణ మైనది. అయితే ఈ జ్ఞానం శుద్ధజ్ఞానరూపంలో కలగదు. దానిలో ఏదో విషయం భాసిస్తూనే ఉంటుంది. స్తంభజ్ఞానం, ఘటజ్ఞానం- ఇత్యాదివిధంగా జ్ఞానం ఆ యా విషయాలతో (స్తంభాదులతో) ఉపరక్తమై ఉంటుంది. అందుచేత జ్ఞానం ఎల్లప్పుడు విషయంతో సారూప్యాన్ని పొంది ఉండడంవల్ల జ్ఞానమే విషయ స్వరూపాన్ని కప్పివేసి ఉంటుంది అన్నట్లు కనబడుతుంది. అనగా విషయం జ్ఞానంలోనే ఉందని అర్థమవుతున్నది. అలాంటప్పుడు విషయం వెలపల ఉందని కల్పించడం అనవసరం. జ్ఞానమే విషయాకారంగా పరిణమించి అలా కనబడుతున్నది అని అర్థం.

## భాష్యమ్

అపి చ సహోపలమ్భనియమాదభేదో విషయజ్ఞానయోరాపతతి. న హ్యనయోరేకస్యానుపలమ్భే ఽన్యస్యోపలమ్భో ఽస్తి. న చైతత్స్వభావవివేకే యుక్తమ్. ప్రతిబన్ధకారణాబావాత్. తస్మాదప్యర్థాభావః. స్వప్నాదివచ్చేదం ద్రష్టవ్యమ్. యథా హి స్వప్నమాయామరీచ్యుదకగన్ధర్వనగరాదిప్రత్యయా వినైవ బాహ్యేనార్థేన గ్రాహ్యగ్రాహకాకారా భవన్తి ఏవం జాగరితగోచరా అపి స్తమ్భాదిప్రత్యయా భవితుమర్హన్తీత్యవగమ్యతే; ప్రత్యయత్వావిశేషాత్. కథం పునరసతి బాహ్యార్థే ప్రత్యయవైచిత్ర్యముపపద్యతే? వాసనావైచిత్ర్యాదిత్యాహ. అనాదౌ హి సంసారే బీజాఙ్కురవద్విజ్ఞానానాం వాసనానాం చాన్యోన్య నిమిత్తనైమిత్తికభావేన వైచిత్ర్యం న విప్రతిషిధ్యతే. అపి చాన్వయవ్యరేకాభ్యాం వాసనానిమిత్తమేవ జ్ఞానవైచిత్ర్యమిత్యవగమ్యతే; స్వప్నాదిష్వన్తరేణాప్యర్థం వాసనానిమిత్తస్య జ్ఞానవైచిత్ర్యస్యోభాభ్యామప్యా వాభ్యామభ్యు పగమ్యమానత్వాత్. అన్తరేణ తు వాసనామర్థనిమిత్తస్య జ్ఞానవైచిత్ర్యస్య మయానభ్యుపగమ్యమానత్వాత్. తస్మాదప్యభావో బాహ్యార్థస్యేతి.

## బాలానందిని

అపి చేతి:- మరొక విషయ మేమనగా- జ్ఞేయమైన విషయమూ జ్ఞానమూ కూడ తప్పక ఒకే సమయంలో కలిసి గ్రహించబడుచున్నాయి. అందుచేత ఆ రెండింటికి అభేదం లభిస్తుంది (ఆరెండు అభిన్నములే అని చెప్పక తప్పదు). ఎందువల్ల ననగా

వీటిలో ఒకటి తెలియబడ నప్పుడు మరొకటి తెలియబడడంలేదు, అనగా జ్ఞేయం జ్ఞానమూ కూడ ఎల్లప్పుడూ కలిసే ఉంటున్నాయి కాని ఒకటి లేనప్పుడు రెండవది ఉండడం లేదు. ఆ రెండూ వేరు వేరు వస్తువు లైతే ఈ విధమైన అవినాభావం యుక్తం కాదు. ఎందుచేత ననగా క్షణిక మైన జ్ఞానానికి విషయంతో సంబంధం కలగడానికి హేతు వేదీ లేదు. అందువల్ల కూడ (విజ్ఞానంకంటె వేరుగా) బాహ్యపదార్థం లేదు. ఇది స్వప్నాదుల వంటి దని చూచుకోవాలి. స్వప్నము, మాయ (మాజిక్) ఎండమావులలో నీరు, గంధర్వనగరం (ఆకాశంమీద ఏదో పెద్ద నగరం ఉన్నట్లు ఇంద్రజాలలచేత చూపబడే నగరం గంధర్వనగరం)- ఈ మొదలైన జ్ఞానాలు బాహ్యమైన వస్తు వేదీ లేకపోయినా కూడ గ్రాహ్యం (తెలియబడేది) గాను, గ్రాహకం (తెలుసుకొనేది)గాను ఏ విధంగా ఉంటున్నాయో (స్వప్నాదులలో జ్ఞానం తప్ప బాహ్యపదార్థా లేవీ ఏ విధంగా ఉండవో) జాగరితావస్థకు చెందిన స్తంభాదిజ్ఞానాలు కూడ ఈ విధంగానే ఉంటాయి అని తెలుస్తూన్నది. అందుకు కారణం ప్రత్యయత్వావిశేషం; అనగా అదీ జ్ఞానమే ఇదీ జ్ఞానమే అయి ఉండడం. బాహ్యార్థం లేకపోతే జ్ఞానాలలో వైచిత్ర్యం (అనగా వైవిధ్యం) ఎలా కుదురుతుంది? వాసనావైచిత్ర్యంవల్ల కుదురుతంది అని అంటున్నాడు. అనాది యైన సంసారంలో బీజాలకు అంకురాలకూ ఏ విధంగా పరస్పరము నిమిత్తనైమిత్తకభావం (బీజం నిమిత్తం అంకురం నైమిత్తికం అనే పద్ధతి) కనబడుతున్నదో అట్లే వాసనలకు విజ్ఞానాలకూ పరస్పరం నిమిత్తనైమిత్తికభావం ఉండడంచేత వైచిత్ర్యం ఉండడంలో ఏమీ విరోధం లేదు. జ్ఞానవైచిత్ర్యానికి నిమిత్తం వాసనల వైచిత్ర్యమే అనే విషయం అన్వయవ్యతిరేకాలచేత కూడ తెలుసస్తూన్నది. (వాసనలుంటే జ్ఞానవైచిత్ర్యం కనబడుతున్నది. లేకపోతే లేదు. ఇవే అన్వయవ్యతిరేకాలు). ఎందువల్ల ననగా స్వప్నాదులలో పదార్థా లేవీ లేకపోయినా కూడ వాసనలను పట్టి జ్ఞానవైచిత్ర్యం (విచిత్రమైన జ్ఞానాలు) కలుగుతున్నట్లు మనం ఇద్దరమూ కూడ అంగీకరించిన విషయమే. (అయితే నేను అధికంగా చెప్పే దేమనగా జాగరితాదులలో కూడా) వాసనలు లేకుండా అర్థాలను పట్టి జ్ఞానవైచిత్ర్యం కలుగుతుం దని మాత్రం నేను అంగీకరించడం లేదు. అందుచేత కూడ బాహ్యార్థాలు లేవు.

## భాష్యమ్

ఏవం ప్రాప్తే బ్రూమః- "నాభావ ఉపలబ్ధేః" ఇతి. న ఖల్వభావో బాహ్యస్యార్థస్యాధ్యవసాతుం శక్యతే. కస్మాత్? ఉపలబ్ధేః. ఉపలభ్యతే హి ప్రతిప్రత్యయం బాహ్యోర్థః స్తమ్భః, కుడ్యమ్, ఘటః, పట ఇతి. న

చోపలభ్యమానస్యైవాభావో భవితుమర్హతి. యథా హి కశ్చిద్భుఞ్జానో భుజి సాధ్యాయాం తృప్తౌ స్వయమనుభూయమానాయమేవం బ్రూయాన్నాహం భుఞ్జే న వా తృప్యామీతి, తద్వదిన్ద్రియసంనికర్షేణ స్వయముపలభమాన ఏవ బాహ్యమర్థం, నాహముపలభే, న చ సోఽస్తీతి బ్రువన్ కథముపాదేయ వచనః స్యాత్? నను నాహమేవం బ్రవీమి న కం చిదర్థముపలభే ఇతి, కిం తూపలబ్ధివ్యతిరిక్తం నోపలభ ఇతి బ్రవీమి. బాఢమేవం బ్రవీషి నిరఙ్కుశత్వాత్తే తుణ్డస్య. న తు యుక్త్యుపేతం బ్రవీషి, యత ఉపలబ్ధివ్యతిరేకోఽపి బలాదర్థస్యాభ్యుపగన్తవ్యః ఉపలబ్ధేరేవ. న హి కశ్చిదుపలబ్ధిమేవ స్తమ్భః కుడ్యం చేత్యుపలభతే. ఉపలబ్ధివిషయత్వేనైవ తు స్తమ్భకుడ్యాదీన్ సర్వే లౌకికా ఉపలభన్తే. అతశ్చైవమేవ సర్వే లౌకికా ఉపలభన్తే యత్ ప్రత్యాచక్షణా అపి బాహ్యార్థమేవం వ్యాచక్షతే యదన్తర్జ్ఞేయరూపం తద్బహిర్వదవభాసత ఇతి. తేఽపి సర్వలోకప్రసిద్ధాం బహిరవభాసమానాం సంవిదం ప్రతిలభమానాః ప్రత్యాఖ్యాతుకామాశ్చ బాహ్యమర్థం బహిర్వదితి వత్కారం కుర్వన్తి. ఇతరథా హి కస్మాద్బహిర్వదితి బ్రూయుః? న హి విష్ణుమిత్రో వన్ధ్యాపుత్రవదవభాసతే ఇతి కశ్చిదాచక్షీత. తస్మాద్యథానుభవం తత్త్వమభ్యుపగచ్ఛద్భిర్బహిరేవావభాసత ఇతి యుక్తమభ్యుపగన్తుం న తు బహిర్వదవభాసత ఇతి.

వి. అఖండము, నిర్విశేషము, విజ్ఞానరూపము అయిన బ్రహ్మ బాహ్యపదార్థాలన్నింటికీ ఉపాదనకారణం అనే వేదాంతసిద్ధాంతానికి, వేరు వేరైనది, సాకారము, క్షణికమూ అయిన విజ్ఞానం తప్ప బాహ్యార్థాలు లేవు అని చెప్పే యోగాచరమతంతో విరోధం ఉందా లేదా అని సంశయం. ఆ మతం కూడ ప్రామాణికమే గాన విరోధం ఉంది అని పూర్వపక్షం. అది ప్రామాణికం కాదు గాన విరోధం లేదని సిద్ధాంతం.

### బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా పూర్వపక్షం ప్రాప్తించగా చెపుతున్నాం. బాహ్యార్థం లేదని నిర్ణయించడం శక్యం కాదు. ఎందువల్ల? కనబడుతూన్నందువల్ల. ప్రతీ జ్ఞానం లోనూ స్తంభం, గోడ, కుండ, బట్ట అని బాహ్యార్థం కనబడుతున్నది కదా? తెలియబడుతున్న దానికే (కనబడుతున్నదానికే) అభావం ఉండతగదు కదా? (కనబడుతున్న దానిని

లేదనడం యుక్తం కాదు కదా?). భోజనం చేస్తూన్న ఒకడు భోజనంవల్ల కలిగిన తృప్తిని స్వయంగా అనుభవిస్తూనే నేను తినడం లేదు, తృప్తి పొందడం లేదు అని అంటే ఎలా ఉంటుందో ఇంద్రియాల సంబంధంచేత బాహ్యార్థాన్ని స్వయంగా తెలుసుకొంటూనే నాకు బాహ్యార్థం ఏదీ తెలియడంలేదు, అది అసలు లేనే లేదు అని అనడం కూడ అలాగే ఉంటుంది. అలా మాటలాడే వాని మాటలు ఎలా గ్రాహ్యము లవుతాయి? (పూర్వపక్షి) - ఏ పదార్థాన్నీ గ్రహించడం లేదు అని నేను అనడం లేదు, జ్ఞానంకంటె భిన్నంగా ఏ పదార్థాన్నీ నేను తెలుసుకొనడం లేదు అనే నేను అంటున్నాను. (సిద్ధాంతి) నిజమే! అలాగే అంటున్నావు; నీ నోటికి అడ్డు లేదు కదా? (ఏదేదో అంటున్నావు గాని) యుక్తి యుక్త మైన మాట పలకడం లేదు. ఎందువల్ల ననగా నీకు కలిగిన జ్ఞానాన్నే పట్టి జ్ఞానంకంటె అర్థానికి బేధం ఉంది అని బలంవల్ల (జ్ఞానంయొక్కబలంవల్ల) అంగీకరించాలి. ఎవడూ కూడ జ్ఞానాన్నే స్తంభం గోడ అని గ్రహించడం లేదు కదా? లోకంలో ఉన్న ప్రతీ ఒక్కడూ కూడ స్తంభకుడ్యాదులను జ్ఞానానికి విషయాలను గానే గ్రహిస్తున్నాడు. లోకంలో ఉన్న అందరూ ఇలాగే గ్రహిస్తున్నా రనడానికి మరొక కారణం ఏమనగా - బాహ్యార్థాన్ని నిరాకరించే వాళ్లు కూడ "లోపలనే ఉన్న జ్ఞేయమైన పదార్థం బైట ఉన్నట్లు (బాహ్య పదార్థం వలె) భాసిస్తూన్నది" అని అంటున్నారు. ఈ విధంగా వాళ్లు కూడ బైట భాసిస్తూన్న సర్వలోక ప్రసిద్ధమైన జ్ఞానాన్ని పొందుతూనే దీన్ని నిరాకరించాలనే అభిప్రాయంతో "బహిర్వత్" (బైటవలె) అని వత్ అనే ప్రత్యయం ప్రయోగిస్తున్నారు. అలా కాకపోతే, అనగా వాళ్లు ఆ వస్తువును బైట చూడకపోతే, బాహ్యపదార్థమే లేకపోతే 'బహిర్వత్' అని ఎలా అంటారు? విష్ణుమిత్రుడు వంధ్యాపుత్రుడు వలె కనబడుతున్నాడు అని ఎవరూ అనరు కదా? అందుచేత అనుభవానుసారం తత్త్వాన్ని అంగీకరించే వాళ్లు "బహిరేవ అవభాసతే" (బైటనే కనబడుతున్నది) అని అంగీకరించాలి కాని "బహిర్వత్ అవభాసతే" అని అంగీకరించకూడదు (అనగూడదు).

## భాష్యమ్

నను బాహ్యస్యార్థస్యాసంభవార్భహిర్వదవభాసత ఇత్యధ్యవసితమ్. నాయం సాధురధ్యవసాయః, యతః ప్రమాణప్రవృత్త్యప్రవృత్తిపూర్వకౌ సంభవాసంభవావవధార్యేతే, న పునః సంభవాసంభవపూర్వికే ప్రమాణ ప్రవృత్త్యప్రవృత్తీ. యద్ధి ప్రత్యక్షాదీనామన్యతమేనాపి ప్రమాణేనోపలభ్యతే తత్సంభవతి. యత్తు న కేన చిదపి ప్రమాణేనోపలభ్యతే తన్న సంభవతి.

ఇహ తు యథాస్వం సర్వైరేవ ప్రమాణైర్బాహ్యోఽర్థ ఉపలభ్యమానః కథం వ్యతిరేకావ్యతిరేకాదివికల్పైర్న సంభవతీత్యుచ్యేత? ఉపలభ్యేరేవ. న చ జ్ఞానస్య విషయసారూప్యాద్విషయనాశో భవతి, అసతి విషయే విషయ సారూప్యానుపపత్తేః, బహిరుపలబ్ధేశ్చ విషయస్య. అత ఏవ సహోపలమ్భని యమోఽపి ప్రత్యయవిషయయోరుపాయోపేయభావహేతుక ఇత్య భ్యుపగన్తవ్యమ్. అపి చ ఘటజ్ఞానం, పట జ్ఞానమితి విశేషణయోరేవ ఘటపటయోర్భేదో న విశేష్యస్య జ్ఞానస్య, యథా శుక్లో గౌః, కృష్ణో గౌరితి శౌక్ల్యకార్ష్ణ్యయోరేవ భేదో న గోత్వస్య. ద్వాభ్యాం చ భేద ఏకస్య సిద్ధో భవత్యేకస్మాచ్చ ద్వయోః. తస్మాదర్థజ్ఞానయోర్భేదః. తథా ఘటదర్శనమ్, పటస్మరణమ్ ఇత్యత్రాపి ప్రతిపత్తవ్యమ్. అత్రాపి హి విశేషయోరేవ దర్శనస్మరణయోర్భేదో న విశేషణస్య ఘటస్య. యథా క్షీరగన్ధః, క్షీరరసః ఇతి విశేష్యయోరేవ గన్ధరసయోర్భేదో న విశేషణస్య క్షీరస్య తద్వత్.

## బాలానందిని

నన్వితి :- బాహ్యార్థం ఉండడం అసంభవం గాన "బహిర్వదవభాసతే" అని మేం నిశ్చయించాం అన్నట్లయితే - ఈ నిశ్చయం సరియైనది కాదు. ఎందువల్ల ననగా - ప్రమాణాల ప్రవృత్త్యప్రవృత్తులను పట్టి సంభవాసంభవాలను నిర్ధారణ చెయ్యాలి గాని సంభవాసంభవాలను పట్టి ప్రమాణాల ప్రవృత్త్యప్రవృత్తులను నిర్ధారణ చేయకూడదు.

వి. ప్రత్యక్షాదిప్రమాణంచేత ఒక వస్తువు ఉన్న దని తెలిసినట్లయితే అది సంభవం అనీ, అలా తెలియకపోతే అది సంభవం కాదనీ నిర్ధారణ చేయాలి కాని, ఫలానాది సంభవం కాదని ముందుగా అనుకొని అందుచేతనే అది ప్రమాణాలచేత గ్రహింప శక్యం కాని దనీ, ఫలానాది సంభవ మని ముందుగా అనుకొని అందుచేత అది ప్రమాణగ్రాహ్యమే అనీ నిర్ణయించడం యుక్తం కాదు. ప్రత్యక్షాది ప్రమాణాల చేత ఉన్నట్లు కనబడేదానిని సంభవం అనీ, అలా కాని దానిని అసంభవ మనీ నిర్ణయించాలి.

<u>యద్ధీతి :</u> ప్రత్యక్షాది ప్రమాణాలలో ఏ ఒక్క ప్రమాణంచేత గ్రహింపబడినా అది సంభవ మని చెప్పాలి; ఏ ప్రమాణంచేత కూడ తెలియబడనిది అసంభవం. ప్రస్తుతంలో అయితే ప్రమాణా లన్నింటిచేత, వాటి వాటి (ఆ ప్రమాణాల) స్వభావాన్ని పట్టి బాహ్యార్థం గ్రహింప బడుతున్నప్పుడు "ఆ బాహ్యార్థం పరమాణువులకంటె వ్యతిరిక్తమా

అతిరిక్తం కాదా; పరమాణుసముదాయరూపమా కాదా'' అంటూ ఏవేవో వికల్పాలు లేవ దీసి అది సంభవం కాదు అని ఎలా చెపుతారు? అవి స్పష్టంగా తెలుస్తున్నాయి కావుననే అవి లేదనడం కుదరదు. జ్ఞానం విషయంతో సరూపం అయిపోవడంచేత ఉన్న విషయం నశించదు. విషయం అంటూ లేకపోతే జ్ఞానానికి విషయసారూప్యం ఎలా కలుగుతుంది? ఆ విషయం బైట కనబడుతూనే ఉంది కూడ. ప్రత్యయ విషయాల కున్న (జ్ఞానవిషయాల కున్న) సహోపలంభనియమం కూడ (ఈ రెండు తప్పక కలిసే ఉంటాయి, గ్రహించబడతాయి అనే నియమం కూడ) ఉపాయోపేయ భావంచేత మాత్రమే ఏర్పడినది అని అంగీకరించాలి.

వి. జానం ఉపాయం, అర్థం ఉపేయం (తెలియదగినది). గ్రాహకం ఉన్నప్పుడు తప్పకుండా గ్రాహ్యం ఉండాలి, గ్రాహ్యం ఉన్నప్పుడు తప్పకుండా గ్రాహకం ఉండాలి. అందుచేత వీటి మధ్య ఉన్న సహోపలంభనియమానికి కారణం ఉపాయోపేయ భావమే (గ్రాహ్య గ్రాహక భావమే) గాని అభేదం కాదు. వెలుతురు ఉంటేనే కాని ఘటం కనబడదు. తావన్మాత్రంచేత ఆ రెండూ ఒకటే అనడం ఎలా కుదరదో ఇక్కడ కూడ అట్లే.

**అపి చేతి** :- మరొక విషయ మేమనగా - ఘటజ్ఞానం, పటజ్ఞానం అన్నప్పుడు జ్ఞానంలో భాసిస్తున్న ఘటపటాలకే భేదం కాని ఆ రెండు జ్ఞానాలలోను అనుస్యూతంగా ఉన్న జ్ఞానానికి భేదం లేదు. 'తెల్లని ఎద్దు', 'నల్లని ఎద్దు' అన్నప్పుడు శుక్లత్వ - కృష్ణత్వాలలోనే భేదం గాని ఆ రెండు ఎద్దులలోను ఉన్న గోత్వజాతికి భేదం ఏ విధంగా లేదో ఇక్కడ కూడ (ఘట జ్ఞానం పటజ్ఞానం ఇత్యాదులలో కూడ) అంతే. ఈ విధంగా ఆ ఘటపటజ్ఞానాలలో విశేషణాలైన ఘట పటాలు ఏ విధంగా భిన్నాలో, వాటి జ్ఞానం కూడ వాటికంటె భిన్నమైనది; ఆ జ్ఞానంకంటెఈ రెండూ (ఘటపటాలు) భిన్నమైనవి. అందుచేత అర్థజ్ఞానాలకు భేదమే కాని అభేదం లేదు. ఘటదర్శనం (ఘటాన్ని చూడడం) ఘటస్మరణం (ఘటాన్ని గూర్చి స్మరించడం) వీటిలో కూడ ఈ విధంగానే చూచుకోవాలి. ఇక్కడ కూడ విశేష్యాలైన దర్శన - స్మరణాలకే భేదం కాని విశేషణమైన ఘటం మాత్రం అభిన్నమే. 'క్షీరగన్ధః' (పాల సువాసన) 'క్షీరరసః' (పాల రుచి) అన్నప్పుడు విశేష్యాలైన గంధరసాలకే భేదం కాని విశేషణమైన క్షీరానికి భేదం ఎలా లేదో అట్లే ఇక్కడ కూడ.

## భాష్యమ్

అపి చ ద్వయోర్విజ్ఞానయోః పూర్వోత్తరకాలయోః స్వసంవేదనే నైవోపక్షీణయోః ఇతరేతరగ్రాహ్యగ్రాహకత్వానుపపత్తిః. తతశ్చ విజ్ఞానభేద ప్రతిజ్ఞా, క్షణికత్వాదిధర్మప్రతిజ్ఞా, స్వలక్షణ- సామాన్యలక్షణ -వాస్య-వాసకత్వా విద్యోపప్లవ- సదసద్ధర్మ-బన్ధ-మోక్షాదిప్రతిజ్ఞాశ్చ స్వశాస్త్రగతాస్తా హీయేరన్. కిం చాన్యత్ - విజ్ఞానం విజ్ఞానమిత్యభ్యుపగచ్ఛతా బాహ్యోర్థః స్తమ్భః, కుడ్యమిత్యేవంజాతీయకం కస్మాన్నాభ్యుపగమ్యత ఇతి వక్తవ్యమ్. విజ్ఞానమనుభూయతే ఇతి చేత్, బాహ్యోఽ ప్యర్థోఽనుభూయత ఏవేతి యుక్తమభ్యుపగన్తుమ్. అథ విజ్ఞానం ప్రకాశాత్మకత్వాత్ ప్రదీపవత్ స్వయమేవానుభూయతే న తథా బాహ్యోఽప్యర్థ ఇతి చేత్, అత్యన్తవిరుద్ధాం స్వాత్మని క్రియామభ్యుపగచ్ఛస్యగ్నిరాత్మానం దహతీతి వత్, అవిరుద్ధం తు లోకప్రసిద్ధం స్వాత్మవ్యతిరిక్తేన విజ్ఞానేన బాహ్యోఽ ర్థోఽ నుభూయత ఇతి నేచ్ఛస్యహో పాణిత్యం మహద్దర్శితమ్. న చార్థావ్యతిరిక్తమపి విజ్ఞానం స్వయమేవానుభూయతే, స్వాత్మని క్రియావిరోధాదేవ.

## బాలానందిని

**అపిచేతి :-** మరొక విషయ మేమనగా - పూర్వోత్తరకాలాలకు (క్షణాలకు) చెందిన రెండు విజ్ఞానాలు తమ జ్ఞానంచేతనే (తమను తాము తెలుసుకొన్న వెంటనే) క్షీణ మౌతాయి గాన అవి పరస్పరము (ఒక దాని నొకటి) గ్రహించజాలవు. అప్పుడు మీ శాస్త్రాలలో చేసిన విజ్ఞానాలు భిన్నమైనవి అనే ప్రతిజ్ఞ, క్షణికత్వం మొదలైన ధర్మాల ప్రతిజ్ఞ, స్వలక్షణ - సామాన్యలక్షణ - వాస్యవాసకత్వ - అవిద్యోపప్లవ - సదసద్ధర్మ - బంధ - మోక్షాదిప్రతిజ్ఞలూ కూడ కుదరకుండా పోతాయి.

వి. క్రమంగా ఉన్న రెండు క్షణికవిజ్ఞానాలు స్వప్రకాశాలు. అవి మరు క్షణంలోనే నశిస్తాయి. అందుచేత అవి ఒకదానిని ఒకటి తెలుసుకొనజాలవు. అలాంటప్పుడు అవి రెండు వేరయిన వనే ప్రతిజ్ఞ యుక్తం కాదు. అవి ఒకదాని నొకటి తెలుసుకొనడం లేదు, వాటిని తెలుసు కొనగలిగిన మరొక స్థిరమైన ఆత్మ కూడ ఏదీ లేదు. అలాంటప్పుడు అవి భిన్నమైనవని చెప్పకలిగిన వారెవరు? ఇట్లే పక్షం, సాధ్యం, హేతువు, దృష్టాంతం అనే భేదాలు లేనప్పుడు 'ఇది క్షణికం'. 'ఇది

అసత్ అని ప్రతిజ్ఞ ఎలా కుదురుతుంది? [3] ఇతరమైన వస్తువు లన్నింటికంటె భిన్నమైన వ్యక్తిమాత్రం స్వలక్షణం. స్థిరమైన జ్ఞాత ఎవరూ లేనప్పుడు ఇది ఇతరపదార్థాల కంటె భిన్న మైనది, ఇది దాని స్వరూపం అని తెలుసుకొనేవా రెవరు? [4] సామాన్యలక్షణం అనగా ఒక వస్తువును, ఇతర వస్తువులనుండి వేరు చేసే ఒక ధర్మం. నైయాయికాదులు జాతిని అంగీకరిస్తారు. దానికే సామాన్యం అని పేరు. ఇది భేదం తెలుసుకొనడానికి ఉపయోగిస్తుంది. గోవు అశ్వంకంటె భిన్న మైనది. ఎందుచేత గోవులో గోత్వం అనే జాతి ఉంది. అశ్వంలో అది లేదు. అశ్వత్వం అనే మరొక జాతి ఉంది. బౌద్ధులు ఈ జాతిని అంగీకరించకుండా అతద్వ్యావృత్తిరూప మైన సామాన్యాన్ని అంగీకరిస్తారు. గోవు అనగా అర్థం గోత్వం కలది అని కాదు. గోవుకంటె భిన్నా లైన అశ్వాదులకంటె భిన్నమైనది. గోభిన్నసర్వవస్తువులను తెలిసికొనగలిగిన స్థిరాత్మ లేనప్పుడు ఈ ప్రతిజ్ఞ ఎలా కుదురుతుంది. [5] నీలాదిజ్ఞానాలలో ఉత్తరజ్ఞానం వాస్యం పూర్వజ్ఞానం వాసకం. ఈ రెండూ జ్ఞానాత్మకాలే గాన వీటికంటె భిన్నుడైన జ్ఞాత లేనప్పుడు ఈ భేదం గ్రహించడం ఎట్లు? [6] అవిద్యోపప్లవం అనగా అవిద్యాసంబంధం; దీనిచేత ఏర్పడిన సవికల్పకజ్ఞానం. [7] నీలం అనేది సద్ధర్మం (ఉన్న ధర్మం). నరవిషాణం అనేది అసద్ధర్మం, అమూర్తం అనేది సదసద్ధర్మం. సత్తైన విజ్ఞానం, అసత్తైన నరవిషాణం ఇవి అమూర్తాలు గాన ఇది సదసద్ధర్మం. ఈ ప్రతిజ్ఞ కుదరదు. ఇది ఎన్నో విషయాలు తెలిసికొన్నతరవాతనే సాధ్యం కదా? [8] సాకారజ్ఞానసంతానం బంధం. [9] నిరాకారజ్ఞానసంతానం మోక్షం. ఇలాంటి ప్రతిజ్ఞల ప్రకారం విషయాన్ని స్థాపించడానికీ, తెలుసుకొనడానికీ స్థిరమైన ఆత్మ ఉండాలి. కేవలం క్షణికవిజ్ఞానం మాత్రమే అంగీకరిస్తే మీ శాస్త్రంలో చేసిన ఈ ప్రతిజ్ఞ లన్నీ నిరర్థకా లవుతాయి అని భావం.

కిం చేతి:- విజ్ఞానం, విజ్ఞానం అంటూ దానిని అంగీకరిస్తున్న వాడు స్తంభం, గోడ మొదలైన బాహ్యపదార్థాలను ఎందుచేత అంగీకరించడో చెప్పాలి. విజ్ఞానం అనుభవించబడుతున్నది (అందుచేత అంగీకరిస్తున్నాం) అంటే బాహ్యార్థం కూడ అనుభవించబడుతున్నది. (తెలియబడుతూనే ఉంది) గాన దాన్ని కూడ అంగీకరించడం యుక్తం. అలా కాదు-విజ్ఞానం ప్రకాశాత్మకం అవడంచేత దీపంవలె స్వయంగానే అనుభవించబడుతుంది, కాని బాహ్యార్థం ఆ విధంగా అనుభవించబడడం లేదు అని అంటే- ఆహా! చాలా గొప్ప పాండిత్యం ప్రదర్శించావు! అగ్ని తనను తానే కాల్చుకొంటూన్నది అన్నట్లు స్వాత్మయందే అత్యంతవిరుద్ధమైన క్రియను (విజ్ఞానం తనను తానే తెలుసుకొంటున్నది అని) అంగీకరిస్తున్నావు, కాని బాహ్యార్థం తనకంటె

భిన్నమైన విజ్ఞానం చేత తెలియబడుతుంది అనే లోకప్రసిద్ధమైన, అవిరుద్ధ మైన విషయాన్ని అంగీకరించడానికి ఇష్టపడడం లేదు!

అవ. జ్ఞానం స్వవేద్య మని అంగీకరించి పైన దోషం చూపబడింది. నిజానికి జ్ఞానం స్వవేద్యం కాజాలదు అని చెపుతున్నారు- న చేత్:- విజ్ఞానం అర్థంకంటె అభిన్నమే అయినా కూడ తనను తానే గ్రహించదు; కారణం ఏ మన్గా తన విషయంలో తానే క్రియను చేయడం విరుద్ధం అవడమే. (ఇది ఈ వాక్యానికి రత్నప్రభలో చెప్పిన భావం. బ్రహ్మవిద్యాభరణంలో 'అర్థావ్యతిరిక్తమపి'కి బదులు 'అర్థవ్యతిరిక్తమపి' అనే పాఠం గ్రహించి విజ్ఞానం అర్థంకంటె భిన్నమే అని అంగీకరించినా కూడ అది (విజ్ఞానం) తనను తానే గ్రహించడం కుదరదు అని అర్థం చెప్పబడింది. ఈ అర్థం బాగున్నట్లు తోస్తుంది. అప్పుడు 'అపి' శబ్దానికి సార్థక్యం ఉంటుంది. భామతి ఉన్న ప్రతిలో 'అర్థావ్యతిరిక్తమపి' అనే పాఠమే ఉంది కాని దానికి వ్యాఖ్య లేదు).

## భాష్యమ్

నను విజ్ఞానస్య స్వరూపవ్యతిరిక్తగ్రాహ్యత్వే తదప్యన్యేన గ్రాహ్యం, తదప్యన్యేనేత్యనవస్థా ప్రాప్నోతి. అపి చ ప్రదీపవదవభాసాత్మకత్వాద్ జ్ఞానస్య జ్ఞానాన్తరం కల్పయతః సమత్వాదవభాసకభావానుపపత్తేః కల్పనానర్థక్యమితి. తదుభయమప్యసత్. విజ్ఞానగ్రహణమాత్ర ఏవ విజ్ఞానసాక్షిణో గ్రహణాకాఙ్క్షానుత్పాదాదనవస్థాశఙ్కానుపపత్తేః, సాక్షిప్రత్యయయోశ్చ స్వభావవైషమ్యాదుపలబ్ధృపలభ్యభావోపపత్తేః. స్వతఃసిద్ధస్య చ సాక్షిణోఽప్రత్యాఖ్యేయత్వాత్. కిం చాన్యత్- ప్రదీపవద్విజ్ఞానాన్తరావభాసకనిరపేక్షం స్వయమేవ ప్రథత ఇతి బ్రువతా ప్రమాణాగమ్యం విజ్ఞానమ్ అనవగన్తృకమిత్యుక్తం స్యాత్, శిలాఘనమధ్యస్థప్రదీపసహస్రప్రథనవత్. బాఢమేవమ్; అనుభవరూపత్వాత్తు విజ్ఞానస్యేష్టో నః పక్షస్త్వయానుజ్ఞాయత ఇతి చేత్. న. అన్యస్యావగన్తుః చక్షుఃసాధనస్య ప్రదీపాదిప్రథనదర్శనాత్. అతో విజ్ఞానస్యాప్యవభాస్యత్వావిశేషాత్ సత్యేవాన్యస్మిన్నవగన్తరి ప్రథనం ప్రదీపవదిత్యవగమ్యతే. సాక్షిణోఽవగన్తుశ్చ స్వయంసిద్ధతాముపక్షిపతా స్వయం ప్రథతే విజ్ఞానమిత్యేష ఏవ మమ పక్షస్త్వయా వాచోయుక్త్యన్తరేణాశ్రిత ఇతి చేత్; న. విజ్ఞానస్యోత్పత్తిప్రధ్వంసానేకత్వాదివిశేషవత్త్వాభ్యుపగమాత్. అతః ప్రదీపవద్విజ్ఞానస్యాపి వ్యతిరిక్తావగమ్యత్వమస్మాభిః ప్రసాధితమ్.28.

## బాలానందిని

నన్వితి:- (ఆశంక)- విజ్ఞానం స్వరూపంకంటె (తనకంటె) భిన్నమైన మరొక దానిచేత భాసింపచేయబడాలి (అనగా విజ్ఞానాన్ని తెలుసుకొనేది మరొకటి ఉండాలి) అన్నట్లయితే దానిని కూడ గ్రహించేది మరొకటి, దానిని కూడ గ్రహించేది మరొకటి ఉండాలి అని చెప్పవలసి వస్తుంది గాన అనవస్థ ప్రాప్తిస్తుంది. మరొక విషయ మేమనగా జ్ఞానమే దీపం వలె ప్రకాశాత్మక మైనది. దానిని తెలుసుకొనడానికి మరొక జ్ఞానాన్ని కల్పించినా కూడ ఆ రెండూ సమానస్వభావం కలవే అవడంచేత ఒకటి అవభాస్యం (ప్రకాశింపచేయదగినది, తెలియదగినది) రెండవది అవభాసకం అనేది కుదరదు గాన ఆ విధంగా కల్పించడం వ్యర్థం అవుతుంది. (సమాధానం)- ఈ రెండు ఆశకంలూ అసత్తులే (చెడ్డవే). విజ్ఞానానికి సాక్షిగా ఉన్నట్లు, అనగా విజ్ఞానాన్ని ప్రకాశింపచేసేదిగా, అంగీకరించబడిన సాక్షి విజ్ఞానాన్ని గ్రహించడానికి మాత్రమే అంగీకరింపబడింది గాన దానిని తెలుసుకొనవలసిన మరొకదానిని గూర్చిన ఆకాంక్ష కలుగదు; అందుచేత అనవస్థాశంకకు తావు లేదు.

వి. నువ్వు చెప్పే విజ్ఞానం ఉత్పత్తివినాశాలు కల దవడంచేత అనిత్యం. అందుచేత అది ఘటాదుల వలె జడమైనది గాన తన జన్మాదులను గూర్చి తెలుసుకొనజాలదు. అందుచేత దానికి గ్రాహకాకాంక్ష (దీనిని గ్రహించేది ఏది అనే ఆకాంక్ష)ఉంటుంది. అప్పుడు దానిని గ్రహించేది కూటస్థమైన సాక్షిచైతన్యం అని చెప్పాం. సాక్షికైతే దాని ఉనికి విషయంలోను, ప్రకాశించడం విషయంలోను పరాపేక్ష లేదు గాన అనవస్థాదోషం లేదు. విజ్ఞానసాక్షులకు సామ్యం కూడ లేదు. ఎందువల్ల ననగా మీ విజ్ఞానం జడం, మేం చెప్పేది కూటస్థనిత్యమైన సాక్షి చైతన్యరూపమైనది.

సాక్షీతి:- సాక్షిస్వభావానికీ, ప్రత్యయంయొక్క (విజ్ఞానంయొక్క) స్వభావానికీ భేదం ఉంది. అందుచేత సాక్షి ఉవలబ్ధ (తెలుసుకొనేది, ప్రకాశింపచేసేది) విజ్ఞానం ఉపలభ్యం అని చెప్పడం కుదురుతుంది. సాక్షి స్వయంసిద్ధ మైనది. అలాంటి సాక్షిని నిరాకరించడానికి శక్యం కాదు.

వి. క్షణికాలైన విజ్ఞానాల భేదాన్ని గుర్తించగలిగిన, ఇతరాపేక్ష ఏదీ లేని సాక్షిని అంగీకరించకపోతే మీరు చెప్పే క్షణికవిజ్ఞానభేదం సిద్ధించదు గాన సాక్షిని అంగీకరించితీరాలి. అంతే కాక ఆంతరాలైన సుఖదుఃఖాదులను, వాటి అభావాదులను భాసింపచేసేది సాక్షి. సాక్షి లేకపోతే వాటి భానం, ప్రతీతి, కుదరదు. ఈ విధంగా సాక్షి స్వయంసిద్ధం అని భావం.

అవ. అనిత్యమైన జ్ఞానాల స్వరూపాన్ని సాధించేదిగా కూడ (ఇప్పుడు ఈ జ్ఞానం కలిగింది, నశించింది, దీని స్వరూపం ఇది అని గ్రహించే) సాక్షిని అంగీకరించాలి అని చెపుతున్నారు- కిం చాన్యదితి:- మరొక విషయ మేమనగా- విజ్ఞానం దీపం వంటిది. అందుచేత మరొక ప్రకాశింపచేసేదాని అపేక్ష లేకుండా స్వయంగానే ప్రకాశిస్తుంది అని నువ్వు అంటున్నావు. దీనిని పట్టి విజ్ఞానం ఏ ప్రమాణాలచేత తెలియబడేది కాదు; దీనిని తెలుసుకొనేది ఏదీ లేదు అని చెప్పిన ట్లయింది. అనగా ఈ విజ్ఞానం (విజ్ఞానసమూహం) ఱాతిబండ మధ్యలో ఉన్న వెయ్యిదీపాల ప్రకాశవంటిది అని చెప్పిన ట్లయింది. (విజ్ఞానవాది)- ఔను, ముమ్మాటికీ అంతే. విజ్ఞానం అనుభవరూప మైనది. జ్ఞానరూపమైనది, గాన మాకు ఇష్టమైన పక్షానికే నువ్వు అనుజ్ఞ ఇస్తున్నావు అని అంటే (సిద్ధాంతి)- అట్లు కాదు. (లోకంలో దీపాదికం ప్రకాశకమే అయినా ఆ) దీపాదికాన్ని ప్రకాశింపచేసే (తెలుసుకొనే) నేత్రా లనే సాధనం గల మరొకడు (చూచేవాడు) కనబడుతున్నాడు. అందుచేత విజ్ఞానం కూడ అవభాస్యమే కాబట్టి (మరొకదానిచేత ప్రకాశింపచేయదగినదే కాబట్టి), ఈ అవభాస్యత్వానికి సంబంధించి నంతవరకు దీపానికీ దానికీ భేదం లేదు గాన, దాని ప్రథనం (ప్రకాశ, జ్ఞానం) కూడ, ప్రదీపప్రథనం వలె, తెలుసుకొనే మరొకడు ఉంటేనే కుదురుతుంది అని తెలుస్తున్నది. (విజ్ఞానాన్ని ప్రకాశింపచేసేదే సాక్షిచైతన్యం అని అర్థం). (పూర్వపక్షి)- అవగంత (తెలుసుకొనే)ఈ సాక్షి స్వయంసిద్ధ మని చెపుతూ నువ్వు, "విజ్ఞానం స్వయంగానే ప్రకాశిస్తుంది" అనే నా పక్షాన్నే వేరు మాటలలో అంగీకరిస్తున్నావు అన్నట్లయితే- (సిద్ధాంతి)-అది కాదు. (నువ్వు) విజ్ఞానానికి ఉత్పత్తి, వినాశం, అనేకత్వం మొదలైన విశేషా లున్నాయని అంగీకరిస్తున్నావు. అందువల్ల దీపం వలె, విజ్ఞానం కూడ, దానికంటె భిన్నమైనదానిచేత గ్రహింపదగినది అని మేం సాధించాం.

వి. విజ్ఞానం జన్మవినాశాదు లున్నది అని నువ్వు అంగీకరిస్తున్నావు. జన్మవినాశా లున్నది కార్యమే అవుతుంది. అలాంటిది జడమే కూడ. అందుచేత దానిని తెలుసుకొనడానికి దానికంటె భిన్న మైనది మరొకటి ఉండాలి అనీ, అదే కూటస్థనిత్యమైన చైతన్యరూపమైన సాక్షి అనీ అలాంటి కూటస్థచిదాత్మకు మరొక జ్ఞాత ఉండవలసిన పని లేదనీ మేం చెపుతున్నాం. అందుచేత మీ క్షణికవిజ్ఞానానికీ, మా నిత్యసాక్షిచైతన్యానికీ పోలిక లేదు. మీ విజ్ఞానం కూడ గ్రాహకాంతరవేద్యమే అని భావం. 28.

## సూ. వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్. 2.2.29.

యదుక్తం - బాహ్యార్థాపలాపినా స్వప్నాదిప్రత్యయవజ్జాగరితగోచరా అపి స్తమ్భాదిప్రత్యయా వినైవ బాహ్యేనార్థేన భవేయుః ప్రత్యయత్వావిశేషత్వాత్, ఇతి; తత్ప్రతివక్తవ్యమ్. అత్రోచ్యతే- న స్వప్నాదివజ్జాగ్రత్ప్రత్యయా భవితుమర్హన్తి. కస్మాత్? వైధర్మ్యాత్. వైధర్మ్యం హి భవతి స్వప్నజాగరితయోః. కిం పునర్వైధర్మ్యమ్? బాధాబాధావితి బ్రూమః. బాధ్యతే హి స్వప్నోపలబ్ధం వస్తు ప్రతిబుద్ధస్య మిథ్యా మయోపలబ్ధో మహాజనసమాగమ ఇతి; న హ్యస్తి మమ మహాజనసమాగమః. నిద్రాగ్లానం తు మే మనో బభూవ తేనైషా భ్రాన్తిరుద్బభూవేతి. ఏవం మాయాదిష్వపి భవతి యథాయథం బాధః. న చైవం జాగరితోపలబ్ధం వస్తు స్తమ్భాదికం కస్యాం చిదప్యవస్థాయాం బాధ్యతే. అపి చ స్మృతిరేషా యత్ స్వప్నదర్శనమ్; ఉపలబ్ధిస్తు జాగరితదర్శనమ్. స్మృత్యుపలబ్ధ్యోశ్చ ప్రత్యక్షమన్తరం స్వయమనుభూయతే అర్థవిప్రయోగసంప్రయోగాత్మకమ్, ఇష్టం పుత్రం స్మరామి, నోపలభే, ఉపలబ్ధుమిచ్ఛామీతి. తత్రైవం సతి న శక్యతే వక్తుం మిథ్యా జాగరితోపలబ్ధిః, ఉపలబ్ధిత్వాత్, స్వప్నోపలబ్ధివదిత్యుభయోరన్తరం స్వయమనుభవతా. న చ స్వానుభవాపలాపః ప్రాజ్ఞమానిభిర్యుక్తః కర్తుమ్. అపి చానుభవవిరోధప్రసంగాజ్జాగరితప్రత్యయానాం స్వతో నిరాలమ్బనతాం వక్తుమశక్నువతా స్వప్నప్రత్యయసాధర్మ్యాద్వక్తుమిష్యతే. న హి యో యస్య స్వతో ధర్మో న సంభవతి సోऽన్యస్య సాధర్మ్యాత్తస్య సంభవిష్యతి. న హ్యగ్నిరుష్ణోऽనుభూయమానః ఉదకసాదర్మ్యాచ్ఛీతో భవిష్యతి. దర్శితం తు వైధర్మ్యం స్వప్నజాగరితయోః. 29.

### బాలానందిని

వైధర్మ్యాదితి:- "వైధర్మ్యాత్ చ= భేదం (తేడా) ఉండడంవల్ల, స్వప్నాదివత్= స్వప్నాదుల వలె, న=కాదు" అని సూత్రార్థం.

యదుక్తమితి:- బాహ్యార్థాలు లేవు అని వాదిస్తూ విజ్ఞానవాది చెప్పిన-జాగ్రదవస్థలో కనబడే స్తంభాదుల జ్ఞానాలు కూడ, స్వప్నాదులలో కలిగే జ్ఞానాల వలెనే, బాహ్యార్థాలు లేకుండానే కలుగుతాయి. ఈ రెండూ ప్రత్యయాలే (జ్ఞానాలే)

కదా అనేదానికి సమాధానం చెప్పవలసి ఉన్నది. ఈ విషయంలో సమాధానం చెప్పబడుచున్నది- జాగ్రదవస్థలో కలిగే ప్రత్యయాలు (జ్ఞానాలు) స్వప్నాదిప్రత్యయములవంటివి అవడానికి తగినవి కాదు. ఎందువల్ల? భేదంవల్ల. స్వప్నజాగరితాలకి వైధర్మ్యం (పోలిక లేకపోవడం, భేదం) ఉంది కదా? ఏమి టా వైధర్మ్యం? బాధాబాధలు అని అంటాం. "నాకు కనబడిన మహాజనసమాగమం (చాలామందితో కలవడం) అసత్యమైనదే. నాకు మహాజనసమాగమం కలగనే లేదు. నా మనస్సు నిద్రచేత అలసి ఉంది. అందువల్ల ఈ భ్రాంతి కలిగింది" అని నిద్రనుండి మేల్కొన్నవానికి స్వప్నంలో కనబడిన వస్తువు) బాధిత మవుతుంది కదా? మాయాదులలో కూడ ఈ విధంగానే తగు విధంగా బాధకలగడం కనబడుతున్నది. అయితే జాగ్రదవస్థలో తెలియబడిన స్తంభాదికమైన వస్తు వేదీ కూడ ఏ అవస్థలోను బాధించబడడంలేదు. మరొక విషయమేమనగా- స్వప్నదర్శనం అనేది స్మృతిరూప మైనది. జాగ్రదవస్థలో కలిగే దర్శనం అనుభవం. వస్తువు దూరంగా ఉండడం, దగ్గరగా ఉండడం అనే, స్మృతికి ఉపలబ్ధికీ (ప్రత్యక్షజ్ఞానానికి) ఉన్న భేదం స్వయంగానే తెలియబడుతుంది. "ఇష్టుడైన పుత్రుణ్ణి స్మరిస్తున్నాను, వానిని చూడడం లేదు; (అతడు కనబడడం లేదు). కాని చూడాలని కోరుతున్నాను" అని స్మరించేవాడు అనుకుంటాడు. అలాంటప్పుడు ఈ రెండింటికీ ఉన్న భేదాన్ని గుర్తించినవాడు ఉపలబ్ధయే కాబట్టి జాగరితోపలబ్ధి కూడ స్వప్నోపలబ్ధి వలె అసత్యమే అనడానికి శక్యం కాదు. తెలివైనవాళ్లం అనుకొనే వాళ్లు తమ అనుభవాన్ని కప్పిపుచ్చడం యుక్తం కాదు. జాగరితప్రత్యయాలు సహజంగా నిరాలంబనము లైనవి (విషయాలైన బాహ్యపదార్థా లేవీ లేకుండానే కలుగుతాయి) అని చెపితే అనుభవానికి విరుద్ధంగా ఉంటుందని శంకించి, అలా చెప్పజాలక స్వప్నప్రత్యయాలతో సాధర్మ్యం (సామ్యం) చూపించి అలా చెప్పడానికి ప్రయత్నించబడుతున్నది. స్వతః ఏది దేని ధర్మం కాదో అది ఏదో సాధర్మ్యం చూపినంతమాత్రంచేత, దాని ధర్మం కాజాలదు కదా? నీటితో ఏదో సాధర్మ్యం చూపినంతమాత్రాన, వేడిగా ప్రత్యక్షంగా కనబడుతున్న అగ్ని చల్లగా ఉండదు కదా? స్వప్నజాగరితాల కున్న వైధర్మ్యం కూడ పైన చూపించబడింది. (అందుచేత దానిని దృష్టాంతంగా చూపడం యుక్తం కాదని భావం). 29.

## సూ. న భావోఽనుపలబ్ధేః. 2.2.30.

యదప్యుక్తమ్- వినాప్యర్థేన జ్ఞానవైచిత్ర్యం వాసనావైచిత్ర్యా దేవావకల్పత ఇతి, తత్ప్రతివక్తవ్యమ్. అత్రోచ్యతే. న భావో

వాసనానాముపపద్యతే; త్వత్పక్షేఽనుపలబ్ధేర్బాహ్యార్థానామ్. అర్థోపలబ్ధినిమిత్తా హి ప్రత్యర్థం నానారూపా వాసనా భవన్తి. అనుపలభ్యమానేషు కింనిమిత్తా విచిత్రా వాసనా భవేయుః? అనాదిత్వేఽప్యన్ధపరమ్పరాన్యాయేన అప్రతిష్ఠైవానవస్థా వ్యవహారవిలోపినీ స్యాన్నాభిప్రాయసిద్ధిః. యావప్యన్వయవ్యతిరేకౌ అర్థాపలాపినోపన్యస్తౌ వాసనానిమిత్తమేవేదం జ్ఞానజాతం నార్థనిమిత్తమితి, తావప్యేవం సతి ప్రత్యుక్తౌ ద్రష్టవ్యౌ; వినార్థోపలబ్ధ్యావాసనానుత్పత్తేః. అపి చ- వినాపి వాసనాభిరర్థోపలబ్ధ్యుపగమాద్వినా త్వర్థోపలబ్ధ్యా వాసనోత్పత్త్యనభ్యుపగమాత్ అర్థసద్భావమేవాన్వయవ్యతిరేకావపి ప్రతిష్ఠాపయతః. అపి చ వాసనా నామ సంస్కారవిశేషాః. సంస్కారాశ్చ నాశ్రయమన్తరేణావకల్పన్తే. ఏవం లోకే దృష్టత్వాత్. న చ తవ వాసనాశ్రయః కశ్చిదస్తి ప్రమాణతోఽనుపలబ్ధేః. 30.

బాలానందిని

నేతి:- "అనుపలబ్ధేః= మీ మతం ప్రకారం బాహ్యార్థాలు లేకపోవడంవల్ల, భావః=వాసనల ఉనికి, న =లేదు' అని సూత్రార్థం.

యదప్యుక్తమితి:- బాహ్యపదార్థాలు లేకపోయినా వాసనావైచిత్ర్యంవల్లనే జ్ఞానవైచిత్ర్యం కుదురుతుంది అని వైజ్ఞానికుడు చెప్పినదానికి సమాధానం చెప్పవలసి ఉంది. ఈ విషయంలో చెప్పబడుచున్నది- నీ పక్షంలో బాహ్యపదార్థాల జ్ఞానం లేదు గాన వాసనల భావం (ఉనికి) కుదరదు. అర్థాల జ్ఞానాన్ని నిమిత్తంగా చేసుకొని, ప్రతివస్తువు విషయంలోను అనేకవిధా లైన వాసనలు కలుగుతూంటాయి. అర్థాలే తెలియబడనప్పుడు విచిత్రమైన వాసనలు దేనిని నిమిత్తంగా చేసుకొని బయలుదేరుతాయి? అనాదిత్వం ఉన్నా కూడ అంధపరంపరాన్యాయంచేత ప్రతిష్ఠ (నిలకడ) లేనిది, వ్యవహారానికి లోపం కలిగించేదీ అయిన అనవస్థ ఏర్పడుతుందే కాని మీరు అనుకొన్నది సిద్ధించదు.

వి. బీజం నుండి అంకురం పుట్టడం చూస్తున్నాం. దీనిని పట్టి ఏది ముందు ఏది తరవాత అని చెప్పడానికి వీలు లేకపోవడంచేత అనాదికాలంనుంచి ఇది వస్తూన్నది అని చెప్పడంలో ఔచిత్యం ఉంది. ప్రస్తుత విషయంలో నయితే అర్థానుభవంయొక్క అపేక్ష లేకుండానే వాసన పుట్టుచున్నది అని చెప్పడంచేత ఈ వాసనకు ఈ అనుభవం మూలం అని ఏదీ ప్రత్యక్షంగా కనబడకపోవడంచేత, అర్థానుభవం లేకుండానే వాసన

కలుగుతుం దని చెప్పవలసి ఉంటుంది. అందుచేత ఈ అనాదిత్వకల్పన నిరాధార మైనది, అంధపరంపర (ఒక గ్రుడ్డివాడు మరొక గ్రుడ్డివానిమీద ఆధారపడడం) వంటిది. దీనివల్ల మీ వాదానికి ఏమీ బలం చేకూరదు.

యావితి:- (స్వప్నంలో అర్థాలు లేకపోయినా వాసనలు ఉండడంవల్ల జ్ఞానవైచిత్ర్యం ఉంది, అవి లేకపోతే ఈ వైచిత్ర్యం లేదు అనే అన్వయవ్యతిరేకాలను బట్టి) జ్ఞానసముదాయం అంతా వాసనలను పట్టి ఏర్పడినదే కాని అర్థాలను నిమిత్తంగా చేసికొని పుట్టినది కాదు అని బాహ్యార్థాలను కప్పిపుచ్చే యోగాచారుడు చూపిన అన్వయవ్యతిరేకాలు కూడ ఈ విధంగా (పైన చెప్పిన యుక్తిచేత) నిరాకరించబడిన వని గ్రహించాలి. అర్థజ్ఞానం లేకుండా వాసనలు పుట్టవు కదా? ఇంకొక విషయ మేమనగా- అన్వయవ్యతిరేకాలు బాహ్యార్థం ఉంది అనే విషయాన్నే స్థాపిస్తున్నాయి (కాని బాహ్యార్థం లేదని స్థాపించడంలేదు). ఎందుచేతననగా వాసనలు లేకపోయినా లోకంలో ఆ యా అర్థాల (వస్తువుల) జ్ఞానం కలుగుతున్నది. అర్థంయొక్క ఉపలబ్ధి (జ్ఞానం) లేకుండా వాసనలు పుడతా యని అంగీకరించడం కుదరదు. మరొక విషయ మేమనగా- వాసన లనగా ఒక విధ మైన సంస్కారాలు. ఆశ్రయం లేకుండా సంస్కారాలు ఉండవు. లోకంలో ఈ విధంగానే కనబడుతున్నది. వాసనలకు ఆశ్రయమైనవా డెవడూ నీకు లేడు; ప్రమాణాలను పట్టి కనబడడం లేదు కదా? (ఇది "అనుపలబ్ధేః" అనేదానికి మరొక అర్థం) 30.

## సూ. క్షణికత్వాచ్చ. 2.2.31

యదప్యాలయవిజ్ఞానం నామ వాసనాశ్రయత్వేన పరికల్పితం తదపి క్షణికత్వాభ్యుపగమాదనవస్థితస్వరూపం సత్ ప్రవృత్తివిజ్ఞానవన్న వాసనానామధికరణం భవితుమర్హతి. న హి కాలత్రయసంబన్ధిన్యేకస్మిన్నన్వయిన్యసతి కూటస్థే వా సర్వార్థదర్శిని దేశకాలనిమిత్తాపేక్ష వాసనాధానస్మృతిప్రతిసంధానాదివ్యవహారః సంభవతి. స్థిరస్వరూపత్వే త్వాలయవిజ్ఞానస్య సిద్ధాన్తహానిః. అపి చ విజ్ఞానవాదేఽపి క్షణికత్వాభ్యుపగమస్య సమానత్వాద్యాని బాహ్యార్థవాదే క్షణికత్వనిబన్ధనాని దూషణాన్యుద్భావితాని "ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్" ఇత్యేవమాదీని తానీహాప్యనుసంధాతవ్యాని. ఏవమేతౌ ద్వావపి వైనాశికపక్షౌ నిరాకృతౌ బాహ్యార్థవాదపక్షో విజ్ఞానవాదపక్షశ్చ. శూన్యవాదిపక్షస్తు సర్వప్రమాణప్రతిషిద్ధ

ఇతి తన్నిరాకరణాయ నాదరః క్రియతే. న హ్యయం సర్వప్రమాణసిద్ధో లోకవ్యవహారః అన్యత్తత్త్వమనధిగమ్య శక్యతేఽపహ్నోతుమ్, అపవాదాభావే ఉత్సర్గప్రసిద్ధేః.31.

బాలానందిని

క్షణికత్వాచ్చేతి:- "క్షణికత్వాత్ చ=ఆలయవిజ్ఞానం క్షణికం అవడంవల్ల కూడ వాసనలను అంగీకరించడం కుదరదు" అని సూత్రార్థం.

యదపీతి:- వాసనలకు ఆశ్రయంగా ఆలయవిజ్ఞాన మనేది ఏది కల్పించబడిందో అది కూడ ప్రవృత్తి విజ్ఞానం వలె క్షణికమే అని అంగీకరించబడడంచేత నిలకడ లేని స్వరూపం కలదై, వాసనలకు ఆధికరణం (స్థానం) అవడానికి తగదు. (అహమ్, అహమ్ అనే విజ్ఞానం ఆలయవిజ్ఞానం. నీలపీతాదివిజ్ఞానం ప్రవృత్తివిజ్ఞానం). మూడు కాలాలకీ సంబంధించి, కార్యాలన్నింటిలోనికీ అన్వయించే ఒక వస్తువు లేకపోతే, లేదా సకల పదార్థాలను చూడగలిగే ఒక కూటస్థమైన వస్తువు లేకపోతే, దేశాన్నీ, కాలాన్నీ, ఇతర నిమిత్తాలనూ అపేక్షించే వాసనలను ఉంచడం (పుట్టించడం), స్మృతి, ప్రత్యభిజ్ఞ మొదలైన వ్యవహారం సంభవించదు. ఆలయవిజ్ఞానం స్థిరం అని అంగీకరిస్తే తమ సిద్ధాంతానికే ముప్పు వస్తుంది. మరొక విషయం- విజ్ఞానవాదంలో కూడ క్షణికత్వాన్ని అంగీకరించడం అనేది సమానమే గాన బాహ్యార్థవాదంలో క్షణికత్వానికి సంబంధించిన ఏ దూషణాలు, "ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్" ఇత్యాదిసూత్రాలలో వెనక చూపబడ్డాయో వాటిని ఇక్కడ (విజ్ఞానవాదంవిషయంలో) కూడ కూర్చుకొనవచ్చును. ఈ విధంగా బాహ్యార్థవాదిపక్షమూ, విజ్ఞానవాది పక్షమూ, ఈ వైనాశికపక్షాలు రెండూ నిరాకరించబడ్డాయి. శూన్యవాదిపక్ష మైతే సర్వప్రమాణాలకీ విరుద్ధం గాన దానిని నిరాకరించడానికి (సూత్రకారునిచేత) ఆదరం చూపబడలేదు. (కొత్తగా సూత్రాలు రచించలేదు. ఉన్న సూత్రాలనే ఆ వాదాన్ని నిరాకరించడానికి కూడ అన్వయించవచ్చును). ఏదో ఒక (బ్రహ్మవంటి) తత్త్వాన్ని అంగీకరించకుండా సకలప్రమాణసిద్ధ మైన ఈ లోకవ్యవహారాన్ని కప్పిపుచ్చడం కుదరదు. అపవాదం లేకపోతే సామాన్యమే సిద్ధిస్తుంది కదా?

వి. శూన్యవాదులు ఇలా అంటారు:- బాహ్యమైన పదార్థం ఏదీ లేదు. విజ్ఞానవాదులు చూపిన ఆ బాహ్యార్థం పరమాణురూపమా, పరమాణుసమూహ రూపమా ఇత్యాదిదూషణాలచేతనే బాహ్యార్థం దూషింపబడింది కదా? విజ్ఞానవాదులు అంగీకరించే క్షణికవిజ్ఞానవాదం కూడ అయుక్తమే. ఇతరులు అంగీకరించిన

బాహ్యపదార్థాలు ఆంతరా లని (లోపలనే ఉన్నా యని) కదా వాళ్లంటారు. ఆ ఆంతరపదార్థాల విషయంలో కూడ అవి పరమాణు రూపాలా. వాటి సమూహాలా ఇత్యాదివికల్పాలచేత వాటిని నిషేధించవచ్చును. ఈ విధంగా బాహ్యపదార్థం కాని ఆంతరపదార్థం కాని ఉన్న దని నిరూపించడం కష్టం గాన అది సత్ కాదు అని చెప్పాం. 'అసత్' కూడ కాదు; ప్రత్యక్షంగా కనబడు తున్నది కదా? 'సదసత్' కాదు. అలా అవడం విరుద్ధం కదా? సదసద్విలక్షణం కూడ కాదు. సద్విలక్షణమైతే అసత్ అని తప్పక అంగీకరించాలి, అసద్విలక్షణ మైతే సత్ అయి తీరాలి; అందుచేత ఉభయవిలక్షణమైన వస్తువేదీ ఉండదు. అందుచేత బాహ్యవస్తువు, ఆంతరవస్తువూ కూడ పైన చెప్పిన నాలుగు కోటులకూ అతీతమైనది గాన పరమార్థమైనది కాదు. సర్వశూన్యత్వమే పరమార్థతత్త్వం. బుద్ధుని కిష్టమైన ముఖ్యమైన సిద్ధాంతం ఇదే. మిగిలిన వాదా లన్నీ మందబుద్ధులకోసం ఉపదేశించినవి. ఇది శూన్యవాదుల మతం. ఈ శూన్యవాదం సర్వప్రమాణవిరుద్ధం గాన సూత్రకారుడు ప్రత్యేకంగా దీనిని ఖండించడానికి సూత్రాలు వ్రాయలేదు.

అయితే ఇతరవాదాల ఖండనకోసం వ్రాసిన సూత్రాలే దీనిని ఖండించడానికి కూడ ఉపయోగిస్తాయి అని చెప్పుతూ రత్నప్రభాకారుడు కొన్ని సూత్రాలకు శూన్యవాదఖండనపరంగా అర్థం వ్రాశాడు. "నాభావ ఉపలబ్ధేః"- జ్ఞానార్థాలకు అభావం లేదు. ఎందువల్ల ననగా అవి తెలియబడుతున్నాయి. సుషుప్తిలో వలె జాగ్రత్స్వప్నాలలో కూడ జ్ఞానార్థాలు లేవని చెపుతాం అని అంటే దానికి సమాధానం- "వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్". 'స్వప్నాది' అనగా స్వప్నం ప్రారంభంలో ఉన్న సుషుప్త్యవస్థ. వైధర్మ్యాత్=జాగత్స్వప్నావస్థలకీ సుషుప్తికీ అర్థజ్ఞానాలు కనబడడం కనబడకపోవడం అనే వైధర్మ్యం ఉండడంవల్ల, స్వప్నాదివత్=సుషుప్తివలె, న=కాదు. 'న భావోఽనుపలబ్ధేః' - ఏదైన నిషేధించి నప్పుడు ఆ నిషేధానికి అధిష్ఠానం ఏదైనా ఉండాలి. ఘటం లేదు అన్నప్పుడు ఆ నిషేధానికి అధిష్ఠానం భూతలం. సర్వమూ శూన్యం అనే నీ పక్షంలో అంతనీ నిషేధించినప్పుడు దానికి (నిషేధానికి) అధిష్ఠానం ఏదైనా చూపాలి. నీ మతంలో అదేమీ లేదు. ఏ ప్రమాణం చేత కూడ అది కనబడడంలేదు కదా? "క్షణికత్వాచ్చ" అనే సూత్రాన్ని "క్షణికత్వోపదేశాచ్చ" అని చదువుకోవాలి. మీ బౌద్ధమతంలోనే శూన్యత్వానికి విరుద్ధమైన క్షణికత్వం ఉపదేశించబడింది. ఈ విధంగా చెప్పడం పరస్పరవిరుద్ధంగా ఉంది. ఇది రత్నప్రభలో చూపిన సూత్రాల వ్యాఖ్య. అయితే బ్రహ్మవిద్యాభరణకారులు ఏదో విధంగా సూత్రకారునిచేతనే ఈ శూన్యవాదాన్ని కూడ నిషేధింపచెయ్యాలంటే "సర్వథానుపపత్తేశ్చ" అనే రాబోయే సూత్రాన్ని తత్పరంగా

వ్యాఖ్యానించుకొనవచ్చును అని వ్రాశారు. పై సూత్రాలకు వేటికీ రత్నప్రభలో వలె శూన్యవాదనిరాసపరంగా వ్యాఖ్య వ్రాయలేదు.

శూన్యవాదంలో ఉన్న దోషాలను బ్రహ్మవిద్యాభరణకారులు ఈ విధంగా చూపించారు- శూన్యమే తత్త్వం అన్నప్పుడు శూన్యం అనేదానికి సకలప్రపంచాతీతమైన ఒక భావరూపపదార్థం అని అర్థమా లేక అభావరూపమనియా? మొదటిది కుదరదు. భావరూప మని అంగీకరిస్తే వేరు మాటలలో బ్రహ్మవాదాన్నే అంగీకరించి నట్లవుతుంది. రెండవపక్షం సర్వప్రమాణవిరుద్ధం గాన అది కూడ యుక్తం కాదు. సకలప్రమాణాలచేతా ప్రపంచం ఉన్నట్లు తెలుస్తూండగా దాని అభావమే తత్త్వం అని ఎలా చెపుతారు? ప్రత్యక్షాదులవల్ల కలిగే జ్ఞానం భ్రమ మాత్రమే; ఎందువల్ల ననగా ఇది యుక్తులకు విరుద్ధంగా ఉంది అనడానికి వీలు లేదు. ప్రత్యక్షాదిప్రమాణాలతో విరోధం ఏర్పడి నప్పుడు యుక్తులే ఆభాసమాత్రము లని చెప్పాలి. శుక్తిరజతాదిస్థలాలలో ప్రత్యక్షంచేత రజతం కనిపించినా యుక్తిచేత అది భ్రాంతి అని అంటున్నాం కదా? అట్లే ప్రపంచ జ్ఞానం కూడ భ్రాంతి అంటాం అనడం కూడ కుదరదు. ఎందువల్ల ననగా భ్రాంతిజ్ఞానానికి అధిష్ఠాన మైన శుక్తి అనేది ఒకటి ఉంది. నువ్వు ప్రపంచజ్ఞానం భ్రాంతిరూపం అన్నప్పుడు దానికి అధిష్ఠానమైనదానిని దేనినైనా సత్యమైనదానిని చూపాలి. అదేదీ లేదంటున్నావు. అలాంటప్పుడు దీనిని భ్రాంతి అనడం ఎలా కుదురుతుంది? అభావమే అధిష్ఠానం అనడం కూడ కుదరదు. అభావానికి ప్రతియోగ్యనుయోగుల అపేక్ష ఉంటుంది. ఘటంయొక్క అభావం అన్నప్పుడు ఆ అభావానికి భూతలం అనుయోగి ఘటం ప్రతియోగి. ఆ విధంగా ఈ అభావానికి అనుయోగి ఏది? అందుచేత వేదాంతులు బ్రహ్మను సర్వనిషేధాలకీ అధిష్ఠానంగా గ్రహించినట్లు శూన్యవాది కూడ ఏదైన ఒక నిత్యమైన, సత్యమైన తత్త్వాన్ని చూపకలుగుతేనే అది యుక్తిసంగతంగా ఉంటుంది. అలా ఏదీ చూపలేదు గాన ఇది ప్రమాణవిరుద్ధం. "న హ్యయం సర్వప్రమాణసిద్ధో వ్యవహారః అన్యత్తత్త్వమనధిగమ్య శక్యతే అపహ్నోతుమ్" అనే భాష్యవాక్యానికి ఇదే అర్థం.

ప్రపంచంయొక్క ప్రతీతి భ్రమయే అని అపవాదంయొక్క బలంచేత చెప్పవచ్చును కదా అని శూన్యవాది ప్రశ్నించవచ్చును. అది కూడ యుక్తం కాదు. అపవాదం 'ఇది ఇక్కడ లేదు' అనే ఆకారంలో కాని, 'ఇది ఇది కాదు' అనే ఆకారంలో గాని ఉండాలి. అప్పుడు ఏది నిషేధించబడిందో దానికంటె భిన్నమైన అధిష్ఠానం మిగలాలి. అలాంటి దానిని దేనినీ మీరు అంగీకరించడంలేదు. అందుచేత అపవాదం కుదరదు. అపవాదం లేకపోతే ప్రత్యక్షాదిప్రమాణాలచేత ఉన్నట్లుగా భాసిస్తూన్న ప్రపంచాన్ని అంగీకరించాలి. "అపవాదాభావే ఉత్సర్గప్రసక్తేః" అనే భాష్యవాక్యానికి ఇదే అర్థం.

బౌద్ధమతంలో ప్రధానంగా నాలుగు వాదాలు ఉన్నాయి- వైబాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు (మాధ్యమికులే శూన్యవాదులు) అనే నలుగురు నాలుగు వాదాలను అంగీకరించారు. వారిలో వైభాషికులు బాహ్యవస్తువులు ఉన్నాయి, అవి క్షణికాలు; వాటిని ప్రత్యక్షాదిప్రమాణాలచేత తెలుసుకొనవచ్చును అని అంగీకరిస్తారు. సౌత్రాంతికులు కూడ క్షణికాలైన బాహ్యపదార్థాలను అంగీకరిస్తారు కాని అవి ప్రత్యక్షములు కావు, అనుమానంచేత తెలియబడతాయి అని అంటారు. ఇంద్రియాలకీ విషయాలకీ సంబంధం ఏర్పడి నప్పుడు విషయం పుట్టే జ్ఞానంలో తన స్వరూపాన్ని సమర్పిస్తుంది. అలా సమర్పించబడిన ఆకారంచేత బాహ్య వస్తువులు ఉన్నా యని అనుమానంచేత తెలియబడుతుంది. అంతే కాని చక్షురాదులు బాహ్యార్థాలను గ్రహించవు అని వీళ్ల అభిప్రాయం. వాళ్ల వాళ్ల యుక్తులతో ఈ రెండు రకాల వాదాలనూ వాళ్లు సమర్థించుకుంటారు. బాహ్యార్థం ఉంది అనే విషయంలో మాత్రం ఇద్దరికీ మతభేదం లేదు. ఈ రెండు అధికరణాలలో మొదటిదానిచేత బాహ్యార్థాస్తిత్వాన్ని అంగీకరించిన వైభాషిక-సౌత్రాంతికుల మతాన్నీ, రెండవ అధికరణంచేత యోగాచారుల మతాన్నీ ఖండించారు. శూన్యవాదాన్ని భాష్యకారులు సంగ్రహంగా స్పృశించారు.

## సూ. సర్వథానుపపత్తేశ్చ. 2.2.32

కిం బహునా? సర్వప్రకారేణ యథా యథాయం వైనాశికసమయ ఉపపత్తిమత్త్వాయ పరీక్ష్యతే తథా తథా సికతాకూపవద్విశీర్యత ఏవ. న కాం చిదత్రోపపత్తిం పశ్యామః. అతశ్చానుపపన్నో వైనాశికతన్త్రవ్యవహారః. అపి చ బాహ్యార్థవిజ్ఞానశూన్యవాదత్రయమితరేతరవిరుద్ధముపదిశతా సుగతేన స్పష్టీకృతమాత్మనోఽసంబద్ధప్రలాపిత్వమ్, ప్రద్వేషో వా ప్రజాసు విరుద్ధార్థప్రతిపత్త్యా విముహ్యేయురిమాః ప్రజా ఇతి. సర్వథాప్యనాదరణీయోఽయం సుగతసమయః శ్రేయస్కామైరిత్యభిప్రాయః.32.

### బాలానందిని

సర్వథేతి:- "సర్వథా=అన్నివిధాల, అనుపపత్తేశ్చ= ఉపపన్నం కాక పోవడంవల్ల కూడ సుగతమసయం ఆదరణీయం కాదు" అని సూత్రార్థం.

కిమితి:- ఇంక చాలా చెప్పడం ఎందుకు? వైనాశికసమయంలో ఏమైనా ఉపపత్తి ఉన్నదా అని అన్ని విధాలా పరీక్షించిన కొలది అన్ని విధాలా ఇసుక నేలలోని

నుయ్యి ఒక ప్రక్కనుండి తవ్వితే మరొకప్రక్కనుండి కూలిపోయి నట్లు కూలిపోతూనే ఉంది. దీనిలో ఏ మాత్రమూ ఉపపత్తి కనబడడంలేదు. అందువల్ల కూడ వైనాశికతంత్రవ్యవహారం అసంగత మైనది. మరొక టేమనగా పరస్పరవిరుద్ధ మైన బాహ్యార్థవాదం, విజ్ఞానవాదం, శూన్యవాదం అనే మూడు వాదాలను ఉపదేశించిన ఆ సుగతుడు తన అసంబద్ధప్రలాపిత్వాన్ని లేదా విరుద్ధమైన విషయాలు గ్రహించి ప్రజ లందరూ మోసపోవుదురుదాక అని వాళ్ల విషయంలో ఉన్న ద్వేషాన్ని స్పష్టం చేశాడు. అన్నివిధాలా కూడ, శ్రేయస్కాములు ఈ సుగతసమయాన్ని ఆదరించకూడదు అని (ఈ సూత్రానికి) అభిప్రాయం.32.

అభావాధికరణం సమాప్తం

## 6. ఏకస్మిన్నసంభవాధికరణమ్. సూ.33-36

## సూ. నైకస్మిన్నసంభవాత్. 2.2.33

నిరస్తః సుగసమయః. వివసనసమయ ఇదానీం నిరస్యతే. సప్త చైషాం పదార్థాః సంమతాః జీవాజీవాస్రవసంవరనిర్జరబన్ధమోక్షా నామ. సంక్షేపతస్తు ద్వావేవ పదార్థౌ జీవాజీవాఖ్యౌ, యథాయోగం తయోరేవేతరాన్తర్భావాదితి మన్యన్తే. తయోరిమమపరం ప్రపఞ్చమాచక్షతే, పఞ్చాస్తికాయా నామ-జీవాస్తికాయః, పుద్గలాస్తికాయః, ధర్మాస్తికాయః, అధర్మాస్తికాయః, ఆకాశాస్తికాయశ్చేతి. నర్వేషామప్యేషామవాన్తరప్రభేదాన్ స్వసమయపరికల్పితాన్ వర్ణయన్తి. సర్వత్ర చేమం సప్తభఙ్గనయం నామ న్యాయమవతారయన్తి- స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాదస్తి చ నాస్తి చ, స్యాదస్తి వక్తవ్యః, స్యాదస్తి చావక్తవ్యశ్చ. స్యాన్నాస్తి చావక్తవ్యశ్చ, స్యాదస్తి చ నాస్తి చావక్తవ్యశ్చేతి. ఏవమేకత్వనిత్యత్వాదిష్వపీమం సప్తభఙ్గీనయం యోజయన్తి.

బాలానందిని

నైకస్మిన్నితి:- "ఏకస్మిన్= ఒక వస్తువునందు, అసంభవాత్=విరుద్ధధర్మాలకు సంభవం ఉండదు గాన, న=జైనసిద్ధాంతం యుక్తం కాదు" అని సూత్రార్థం.

నిరస్త ఇతి:- (ముక్తకచ్ఛులైన) బౌద్ధుల సిద్ధాంతం నిరసింపబడింది. ఇప్పుడు దిగంబరుల సిద్ధాంతం నిరసింపబడుతున్నది. వీళ్లు జీవ- అజీవ-ఆస్రవ- సంవర-

నిర్జర-బన్ధ-మోక్షా లనే ఏడు పదార్థాలను అంగీకరిస్తారు. సంక్షిప్తంగా జీవుడు, అజీవమూ అని రెండే పదార్థాలు. మిగిలిన వన్నీ తగు విధంగా రెండింటిలోనే అంతర్గతా లవుతా యని అంటారు.

వి. జీవు డనగా భోక్త. భోగ్యం అజీవం. ఇంద్రియాలు విషయాభిముఖంగా ప్రవర్తించడం ఆస్రవం. అలాంటి ప్రవృత్తిని ఆపే యమనియమాదికం సంవరం. పాపాలను నశింపచేసే తప్తశిలారోహణాదికం (బాగా వేడిగా ఉన్న రాతిబండమీద పడుక్కోవడం మొదలైనది) నిర్జరం. కర్మబంధం. కర్మపాశం నశించగా అలోకాకాశంలో ప్రవేశించి నిరంతరమూ పైపైకి ఎగరడం మోక్షం.

తయోరితి:- ఆ రెండింటికీ మరొక విస్తారాన్ని ఈ విధంగా చెపుతున్నారు. జీవాస్తికాయం, పుద్గలాస్తికాయం, ధర్మాస్తికాయం, అధర్మాస్తికాయం, ఆకాశాస్తికాయం అని ఐదు అస్తికాయా లున్నాయి. వీటి కన్నింటికీ తమ సిద్ధాంతాన్ని అనుసరించి కల్పించిన అనేకవిధాలైన అవాంతరభేదాలను వర్ణిస్తున్నారు. వీటి అన్నింటి విషయంలోను కూడ- స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాదస్తి చ నాస్తి చ, స్యాదవక్తవ్యః, స్యాదస్తి చావక్తవ్యశ్చ, స్యాన్నాస్తి చావక్తవ్యశ్చ, స్యాదస్తి నాస్తి చావక్తవ్యశ్చ అనే సప్తభంగీనయం అనే న్యాయాన్ని ప్రవర్తింపచేస్తున్నారు.

వి. 'అస్తికాయ' శబ్దం జైనుల పారిభాషికశబ్దం. దీనికి పదార్థం అని అర్థం. 'జీవాస్తికాయం' అనగా జీవుడు. పుద్గలాస్తికాయం అనగా పరమాణుసముదాయ రూపమైన శరీరం. "పూర్యన్తే గలన్తి చ ఇతి పుద్గలాః" (నింపబడుతుంటాయి జారిపోతూంటాయి అని విగ్రహం. మంచి నడవడికచేత అనుమేయ మైనది (ఊహించపబడేది) ధర్మాస్తికాయం. పై పైకి ఎగిరి వెళ్లిపోతూండడం జీవుని స్వభావం. దానికి విరుద్ధంగా జీవుణ్ణి శరీరంలో బంధించి ఉంచేది అధర్మాస్తికాయం. ఆవరణాలు లేకపోవడం ఆకాశాస్తికాయం. జీవాస్తికాయం మూడు విధాలు (1) అర్హన్ మొదలైన కొందరు జీవులు నిత్యముక్తులు. (2) కొందరు ఇప్పుడే ముక్తి పొందినవారు. (3) కొందరు బద్ధులు. పుద్గలాస్తికాయం ఆరు విధాలు - పృథివి మొదలైన నాలుగు భూతాలు, స్థావరం, జంగమం. పైన చెప్పిన ధర్మానికి లింగం ప్రవృత్తి. అధర్మానికి లింగం 'స్థితి'. ఆకాశాస్తికాయం రెండు విధాలు (1) సాంసారికమైన (మనకు కనబడేది) లోకాకాశం (2) ముక్తులకు ఆశ్రయ మైనది అలోకాకాశం. నాలుగు ఘాతికర్మలు, నాలుగు అఘాతికర్మలు అని బంధరూపమైన కర్మ ఎనిమిది విధాలు. జ్ఞానావరణీయం, దర్శనావరణీయం, మోహనీయం, అంతర్యం అనేవి ఘాతికర్మలు. (1) తత్త్వజ్ఞానంవల్ల

ష విశేషానవధారణం మోహనీయం; మోక్ష మార్గ ప్రవృత్తి విఘ్నకరణం అంతరాయమ్॥



ముక్తి కలగదు అనే జ్ఞానం దర్శనావరణీయం. (3) చాలామంది దార్శనికులు చూపినమోక్షమార్గాలలో విశేషాన్ని గుర్తించలేకపోవడం మోహనీయం (4) మోహమార్గప్రవృత్తికి విఘ్నం కలిగించేది అంతర్యం. ఈ నాలుగూ శ్రేయోవిఘాతకాలు గాన ఘాతికర్మలు. వేదనీయం, నామికం, గోత్రికం, ఆయుష్కం అనేవి నాలుగు అఘాతికర్మలు. (1) నేను తెలుసుకొనవలసిన తత్త్వం ఉంది అనే అభిమానం వేదనీయం. (2) ఇది నా పేరు అనే అభిమానం నామికం. (3) నేను పూజ్యుడైన ఫలానా గురువుయొక్క శిష్యవంశంలో ప్రవేశించాను అనే అభిమానం గోత్రికం. (4) శరీరస్థితికోసం చేసే కర్మ ఆయుష్కం. లేదా (4) శుక్రశోణితమిశ్రణం ఆయుష్కం. (3) తత్త్వజ్ఞానానికి అనుకూలమైన దేహంగా పరిణమించే దాని శక్తి గోత్రికం (2) ఆ విధమైన శక్తి గల అది కలల- బుద్బుదావస్థలు పొందే టట్లు చేసే క్రియావిశేషం నామికం (1) సక్రియమైన అది జఠరాగ్నివాయువులచేత కొంచెం ఘనీభావం పొందడం వేదనీయం. ఈ ఎనిమిది విధాలైన కర్మలు ఆస్రవం ద్వారా జన్మకు హేతువు లవుతాయి గాన బంధం.

సప్తభంగీనయం జైనుల సిద్ధాంతంలో ఒక ప్రధానమైన విషయం. జగత్తులో ఉన్న ఏ వస్తువుకు కూడ ఏకాంతత్వం లేదు అని చెప్పడం దీని లక్ష్యం. దీని స్వరూపం ఇదే అని నిశ్చితంగా చెప్పగలిగి ఉండడం ఏకాంతత్వం. అలాంటి ఏకాంతత్వానికి భంగం ఏడు విధాలుగా ఉంటుంది. అందుచేత దీనికి 'సప్తభఙ్గి' (ఏడు ఏకాంతత్వభంగాల సముదాయం) అని పేరు. భాష్యంలో 'సప్తభఙ్గీనయమ్'కి బదులు 'సప్తభఙ్గినయమ్' అనే పాఠం ఉండి ఉంటుంది. దీని ప్రకారం బ్రహ్మవిద్యాభరణంలో - "సప్తానాం నియమానాం భఙ్గః సప్తభఙ్గః" (ఏడు నియమాల భంగం). అది ఉన్నది 'సప్తభఙ్గీ' అని వ్యాఖ్యానించబడింది. "స్యాన్నాస్తి" ఇత్యాదులలోని 'స్యాత్' అనేది తిఙన్తం వలె (అసధాతు విధిలిఙ్ ప్రథమపురుషైకవచనరూపం వలె) కనబడే అవ్యయం. దీనికి 'కథం చిత్' (ఏదో ఒక విధంగా) అని అర్థం. అట్లే ఏడు పదాలలోను 'స్యాత్' అనుదాని అర్థం. 'స్యాదస్తి' అనగా ఒక విధంగా ఉంది అని, 'స్యాన్నాస్తి' అనగా ఒక విధంగా లేదు అని అర్థం. అట్లే ఏడు పదాలలోను 'స్యాత్' అనుదాని అర్థం (1) స్యాదస్తి అనగా ఒక విధంగా ఉంది అని అర్థం (2) స్యాన్నాస్తి:- అదే వస్తువు ఒక విధంగా లేదు అని అర్థం. (3) స్యాదస్తి చ నాస్తి చ= ఒక విధంగా ఉంది, ఒక విధంగా లేదు (4) స్యాదవక్తవ్యః= ఒక విధంగా చెప్ప శక్యం కానిది. (5) స్యాదస్తి చావక్తవ్యః=ఒక విధంగా ఉందని చెప్పశక్యం కానిది. (6) స్యాన్నాస్తి చావక్తవ్యశ్చ= ఒక విధంగా లేదని చెప్ప శక్యం కానిది (7) స్యాదస్తి చ నాస్తి చావక్తవ్యశ్చ= ఒక విధంగా ఉందనీ లేదనీ చెప్ప

శక్యం కానిది అని వీటి అర్థాలు. అనగా ఒక వస్తువును గూర్చి నిశ్చితంగా ఏమీ చెప్పడం కష్టం. అందుచేత ఈ సప్తభంగీనయాన్ని అంగీకరిస్తే అనావశ్యకమైన వివాదాలకు అవకాశం ఉండదు అని జైనుల అభిప్రాయం. ఇందుకు వారు ఒక యుక్తి కూడ చూపుతున్నారు. ఘటం సద్రూపమా అసద్రూపమా? సద్రూపమే అయితే దానిని పుట్టించడంకోసం వ్యాపారం వ్యర్థం అవుతుంది. అసత్తే అయితే కారణవ్యాపారంచేత కూడ అది పుట్టదు. అందుచేత కారణవ్యాపారం సార్థకం కావాలంటే ఒకే ఘటం ఒక విధంగా 'సత్' అనీ, ఒక విధంగా 'అసత్' అనీ అంగీకరించాలి. ఇతర భంగాల విషయంలో కూడ ఈ విధంగానే చూచుకోవాలి. సప్తభంగీనయం ఏకత్వనిత్యత్వాదులవిషయంలో కూడ వర్తిస్తుంది. ఆ వస్తువు ఒక విధంగా ఒకటి, అదే వస్తువు ఒక విధంగా అనేకం; ఒక విధంగా అనిర్వచనీయం. ఈ విధంగా ఏ వస్తువూ ఒకే విధంగా ఉంటుం దని చెప్పకూడదు.

ముక్తకచ్ఛులైన బౌద్ధుల మతం పరిశీలించిన తరవాత దిగంబరుల మతం బుద్ధిస్థం అవుతంది గాన దీనికి వెనుకటి అధికరణంతో ప్రసంగసంగతి. బ్రహ్మ ఏకరూప మైనది అనే వైదికమతానికి అనేకాంతవాదంతో విరోధం ఉందా లేదా అని సంశయం. అది కూడ ప్రమాణమూలకమే కాబట్టి విరోధం ఉందని పూర్వపక్షం. అది ప్రమాణమూలకం కాదు గాన విరోధం లేదు అని సిద్ధాంతం.

## భాష్యమ్

అత్రాచక్ష్మహే- నాయమభ్యుపగమో యుక్త ఇతి. కుతః? ఏకస్మిన్నసంభవాత్. న హ్యేకస్మిన్ ధర్మిణి యుగపత్సదసత్త్వాది విరుద్ధధర్మసమావేశః సంభవతి శీతోష్ణవత్. య ఏతే సప్తపదార్థా నిర్ధారితాః ఏతావన్త ఏవంరూపాశ్చేతి తే తథైవ వా స్యుర్నైవ వా తథా స్యుః? ఇతరథా హి-తథా వా స్యుః అతథా వేత్యనిర్ధారితరూపం జ్ఞానం సంశయజ్ఞానవద ప్రమాణమేవ స్యాత్. నన్వనేకాత్మకం వస్త్వితి నిర్ధారితరూపమేవ జ్ఞానముత్పద్యమానం సంశయజ్ఞానవన్నాప్రమాణం భవితుమర్హతి. నేతి బ్రూమః. నిరఙ్కుశం హ్యనేకాన్తత్వం సర్వవస్తుషు ప్రతిజానానస్య నిర్ధారణస్యాపి వస్తుత్వావిశేషాత్ స్యాదస్తి, స్యాన్నాస్తీత్యాది వికల్పోపనిపాతాదనిర్ధారణాత్మకతైవ స్యాత్. ఏవం నిర్ధారయితుర్నిర్ధారణ ఫలస్య చ స్యాత్పక్షేఽస్తితా, స్యాచ్చ పక్షే నాస్తితేతి. ఏవం సతి కథం

ప్రమాణభూతః సంస్తీర్థకరః ప్రమాణప్రమేయప్రమాతృప్రమితిషు అనిర్ధారితాసు ఉపదేష్టుం శక్నుయాత్? కథం వా తదభిప్రాయానుసారిణః తదుపదిష్టేఽర్థేఽనిర్ధారితరూపే ప్రవర్తేరన్? ఐకాన్తికఫలత్వనిర్ధారణే హి సతి తత్సాధనానుష్ఠాయ సర్వో లోకః అనుకూలః ప్రవర్తతే నాన్యథా. అతశ్చానిర్ధారితార్థం శాస్త్రం ప్రణయన్మత్తోన్మత్తవదనుపాదేయవచనః స్యాత్.

బాలానందిని

అత్రేతి:- ఈ విషయంలో చెపుతున్నాం. ఈ అభ్యుపగమం (జైనులు ఈ విధంగా అంగీకరించడం) యుక్తం కాదు. ఎందువల్ల? ఒకదానియందు కుదరవు కాబట్టి. ఒక ధర్మియందు (వస్తువునందు) సత్త్వం (ఉండడం) అసత్త్వం (లేకపోవడం) మొదలైన విరుద్ధధర్మాలు ఒకే సమయంలో కలిసి ఉండడం, శీతోష్ణాలు కలిసి ఉండడంవలె, సంభవం కాదు కదా? ఇవి ఇన్ని, వీటి స్వరూపం ఇది అని మీచేత నిర్ధారణ చేయబడిన ఏడు పదార్థాలు అలాగే ఉంటాయా, అలాగే ఉండవా? అలాగే ఉండకపోతే, ఇవి అలాగే ఉంటాయో మరొక విధంగా ఉంటాయో నిర్ధారణ చేయబడని రూపం గల జ్ఞానం, సంశయంవలె, అప్రమాణమే అవుతుంది. (ప్రశ్న) వస్తువు అనేకాత్మకంగా ఉంటుంది అని నిర్ధారితరూపంలోనే పుట్టిన జ్ఞానం సంశయజ్ఞానం వలె అప్రమాణం అవడానికి వీలు లేదు కదా? (సమాధానం)- అలా కాదంటాం. నువ్వు అనేకాంతత్వాన్ని ఏ అడ్డూ లేకుండా అన్ని వస్తువుల విషయంలోను ప్రతిజ్ఞ, చేస్తూన్నప్పుడు (ఉంటుందని చెపుతున్నప్పుడు) నిర్ధారణ అనేది కూడ ఒక వస్తువే గాన దాని విషయంలో కూడ 'స్యాదస్తి', 'స్యాన్నాస్తి' ఇత్యాదివికల్పాలు కలుగుతాయి గాన అది అనిర్ధారణమే అవుతుంది.ఇదే విధంగా నిర్ధారణ చేసేవాడు, నిర్ధారణ చేయడంవల్ల కలిగే ఫలమూ కూడ ఒకపక్షంలోఉండవచ్చు, మరొక పక్షంలో లేకపోవచ్చు. అలాం టప్పుడు ప్రమాణం, ప్రమేయం, ప్రమాత, ప్రమితి (జ్ఞానం) ఇవన్నీ నిర్ధారితాలు కాకుండా తీర్థంకరుడు ప్రమాణంగా ఉన్నవాడై ఎలా ఉపదేశించడానికి సమర్థు డవుతాడు? అతని అభిప్రాయాన్ని అనుసరించేవాళ్లు సరిగా నిర్ధారితం కాని అర్థం విషయంలో ఎలా ప్రవర్తిస్తారు? దీనివల్ల తప్పక ఫలం లభిస్తుం దని నిర్ధారణ జరిగినప్పుడు కదా లోకు లందరూ ఏ ఆకులత్వమూ లేకుండా దాని సాధనాలను ఆచరించడానికి ప్రయత్నిస్తారు? అందువల్ల అనిశ్చితార్థమైన శాస్త్రాన్ని రచించినవాడు మత్తుడు వలె ఉన్మత్తుడు వలె స్వీకరింపదగని మాటలు కలవాడవుతాడు.

## భాష్యమ్

తథా పఞ్చానామస్తికాయానాం పఞ్చత్వసంఖ్యాఽస్తి వా నాస్తి వేతి వికల్ప్యమానా స్యాత్తావదేకస్మిన్ పక్షే పక్షాన్తరే తు న స్యాదిత్యతో న్యూనసంఖ్యాత్వమ్ అధికసంఖ్యాత్వం వా ప్రాప్నుయాత్. న చైషాం పదార్థానామవక్తవ్యత్వం సంభవతి. అవక్తవ్యాశ్చేన్నోచ్యేరన్ ఉచ్యన్తే చావక్తవ్యాశ్చేతి విప్రతిషిద్ధమ్; ఉచ్యమానాశ్చ తథైవావధార్యన్తే నావధార్యన్తే ఇతి చ. తథా తదవధారణఫలం స్యగ్దర్శనమస్తి వా న వా? ఏవం తద్విపరీత మసమ్యగ్దర్శనమప్యస్తి వా నాస్తి వేతి ప్రలపన్మత్తోన్మత్తపక్షస్యైవ స్యాన్న ప్రత్యయితవ్యస్య పక్షస్య. స్వర్గాపవర్గయోశ్చ పక్షే భావః పక్షే చాభావస్తథా పక్షే నిత్యతా పక్షే చానిత్యతేతి అనవధారణాయాం ప్రవృత్త్యనుపపత్తిః. అనాదిసిద్ధజీవప్రభృతీనాం చ స్వశాస్త్రావధృతస్వభావానామయథావ ధృతస్వభావత్వప్రసంగః. ఏవం జీవాదిషు పదార్థేషు ఏకస్మిన్ ధర్మిణి సత్త్వాసత్త్వయోర్విరుద్ధయోర్ధర్మయోరసంభవాత్, సత్త్వే చైకస్మిన్ ధర్మేఽసత్త్వస్య ధర్మాన్తరస్యాసంభవాత్, అసత్త్వే చైవం సత్త్వస్యాసంభవాత్ అసంగత మిదమార్హతం దర్శనమ్. ఏతేనైకానేకనిత్యానిత్యవ్యతిరిక్తావ్యతిరిక్తా ద్యనేకాన్తాభ్యుపగమా నిరాకృతా మన్తవ్యాః. యత్తు పుద్గలసంజ్ఞకేభ్యోఽ ణుభ్యః సంఘాతాః సంభవన్తీతి కల్పయన్తి తత్పూర్వేణైవాణువాదనిరాక రణేన నిరాకృతం భవతీత్యతో న పృథక్తన్నిరాకరణాయ ప్రయత్యతే. 33.

## బాలానందిని

తథేతి:- అట్లే ఐదు అస్తికాయాల పంచత్వసంఖ్య ఉందా లేదా అని వికల్పం చేసినప్పుడు ఒక పక్షంలో ఉంది మరొక పక్షంలో నైతే ఉండదు అనడంవల్ల వాటి సంఖ్య తక్కువైనా కావలసివస్తుంది ఎక్కువైనా కావలసివస్తుంది. ఈ పదార్థాలకు అవక్తవ్యత్వం (చెప్ప వీలుకాకపోవడం) కూడ కుదరదు. అవి అవక్తవ్యా లైతే చెప్పడకూడదు. చెప్పబడుతున్నాయి అవక్తవ్యాలు కూడ అనడం విరుద్ధం. చెప్పబడుచున్న అవి ఎట్లు చెప్పబడుతున్నాయో అట్లే ఉంటా యని నిర్ధారణ చేయబడుచున్నాయి, అలా నిర్ధారణ చేయబడడం లేదు కూడ. వాటిని నిర్ధారణచేయడంవల్ల కలిగే ఫలమైన సమ్యగ్దర్శనం ఉండవచ్చు లేకపోవచ్చు. దానికి

విపరీత మైన అసమ్యగ్దర్శనం కూడ ఉండవచ్చు లేకపోవచ్చు. ఈ విధంగా పేలేవాడు మత్తులయొక్క ఉన్మత్తులయొక్క పక్షానికే చేరుతాడు కాని నమ్మవలసినవాని తెగకు చెందడు. స్వర్గమోక్షాలు కూడ ఒక పక్షంలో ఉంటాయి, ఒక పక్షంలో ఉండవు; అవి ఒక పక్షంలో నిత్య మైనవి, ఒక పక్షంలో అనిత్య మైనవి అని నిర్ధారణ లేనప్పుడు వాటి విషయంలో ప్రవృత్తి కుదరదు. తమ శాస్త్రంచేత నిర్ణయింపబడిన స్వభావాలు గల అనాదిసిద్ధులైన జీవులు మొదలైన వాటికి కూడ (త్రివిధజీవాదులకు కూడ) నిర్ణయించబడిన స్వభావంకంటె భిన్నమైన స్వభావం ఉండే ప్రసంగం ఏర్పడుతుంది. అదే విధంగా జీవులు మొదలైన పదార్థాలలో ఒకొక్క ధర్మికి సత్త్వము అసత్త్వము అనే విరుద్ధ మైన ధర్మాలు అసంభవం గాన, సత్త్వ మనే ఒక ధర్మం ఉంటే అసత్త్వ మనే మరొక ధర్మం ఉండదు గాన ఇట్లే అసత్త్వం అనే ధర్మం ఉంటే సత్త్వం అనే ధర్మం ఉండదు గాన ఈ ఆర్హతమతం అసంగత మైనది. దీనిచేత (ఈ యుక్తిచేతనే) ఏకం అనేకం. నిత్యం- అనిత్యం, వ్యతిరిక్తం- అవ్యతిరిక్తం ఇత్యాదులైన (జైనులు చేసిన) అనేకమైన అభ్యుపగమాలు నిరాకరింపబడినవిగా తెలుసుకొనాలి. పుద్గలా లనే పేరు గల అణువులనుండి సంఘాతాలు (సమూహరూపాలైన శరీరాదులు) పుడతాయి అని వాళ్లు చేసే కల్పనలు కూడ వెనుక (వైశేషిక- బౌద్ధమతపరిశీలన సందర్భంలో) చేసినఅణువాదనిరాకరణంచేతనే నిరాకరింపబడినది అవుతుంది గాన దానిని నిరాకరించడానికి వేరుగా ప్రయత్నం చేయబడడంలేదు . 33.

## సూ. ఏవం చాత్మాకార్త్స్న్యమ్ 2.2. 34

యథైకస్మిన్ ధర్మిణి విరుద్ధధర్మాసంభవో దోషః స్యాద్వాదే ప్రసక్తః ఏవమాత్మనోఽపి జీవస్యాకార్త్స్న్యమపరో దోషః ప్రసజ్యేత. కథమ్? శరీరపరిమాణో హి జీవ ఇత్యార్హతా మన్యన్తే. శరీర పరిమాణతాయాం చ సత్యామకృత్స్నోఽసర్వగతః పరిచ్ఛిన్న ఆత్మేత్యతో ఘటాదివదనిత్యత్వమాత్మనః ప్రసజ్యేత. శరీరాణాం చానవస్థితపరిమాణత్వాన్మనుష్యజీవో మనుష్య శరీరపరిమాణో భూత్వా పునః కేన చిత్ కర్మవిపాకేన హస్తిజన్మ ప్రాప్నువన్న కృత్స్నం హస్తిశరీరం వ్యాప్నుయాత్; పుత్తికాజన్మ ప్రాప్నువన్ న కృత్స్నః పుత్తికాశరీరే సంమీయేత. సమాన ఏష ఏకస్మిన్నపి జన్మని కౌమారయౌవన స్థావిరేషు దోషః. స్యాదేతత్- అనన్తావయవో జీవః; తస్య త ఏవానన్తా అవయవాః అల్పే శరీరే సంకుచేయుర్మహతి చ వికసేయురితి. తేషాం పునరనన్తానాం జీవావయవానాం సమానదేశత్వం ప్రతిహన్యతే వా న వేతి

వక్తవ్యమ్. ప్రతిఘాతే తావన్తానన్తావయవాః పరిచ్ఛిన్నే శరీరే సంమీయేరన్. అప్రతిఘాతేఽప్యేకావయవదేశోపపత్తేః సర్వేషామవయవానాం ప్రథిమానుపపత్తేర్జీవస్యాణుమాత్రత్వప్రసంగః స్యాత్. అపి చ శరీరమాత్రపరిచ్ఛిన్నానాం జీవావయవానామానన్త్యం నోత్ప్రేక్షితుమపి శక్యమ్. 34.

బాలానందిని

ఏవమితి:- "ఏవమ్= ఈ విధంగానే అత్మాకార్త్స్న్యమ్ = ఆత్మకు అసర్వగతత్వం, అనగా మధ్యమపరిమాణం అనే దోషం ప్రసక్త మవుతుంది" అని సూత్రార్థం

యథేతి:- ఒక ధర్మియందు విరుద్ధ మైన అనేకధర్మాలు అసంభవం అనే దోషం స్యాద్వాదంలో ఏ విధంగా ప్రసక్తమో అదే విధంగా ఆత్మకు, జీవాత్మకు అకార్త్స్న్యం అనే మరొక దోషం కూడ ప్రసక్త మవుతుంది. ఎట్లు? జీవుని పరిమాణం శరీరం పరిమాణం ఎంతో అంత అని జైను లంటారు. ఆత్మ శరీరపరిమాణకం అయితే ఆత్మ అకృత్స్నుడు, సర్వగతుడు కాడు; పరిచ్ఛిన్నుడు అని, అందువల్ల ఘటాదుల వలె అనిత్యుడు అని ప్రసక్తం అవుతుంది. శరీరాల పరిమాణం ఒకే విధంగా ఉండదు గాన మనుష్యజీవుడు మనుష్యపరిమాణంతో ఉండి తిరిగి ఏదో కర్మవిపాకంచేత ఏనుగు జన్మను పొందినట్లయితే మొత్తం ఏనుగ శరీరాన్ని వ్యాపింపజాలకపోతాడు. చిన్న ఈగ జన్మ పొందితే మొత్తం ఆత్మ ఆ ఈగ శరీరంలో ఇమడకుండా పోతాడు. ఒక్క జన్మలోనే కౌమారయౌవనవార్ధకాదులందు (శరీరపరిమాణం మారిపోతూంటుంది గాన) ఈ దోషం సమానమే. (పూర్వపక్షి) అది సరే- జీవుని అవయావాలు అనంతాలు, వాని అవయవాలే శరీరం అల్పం అయితే ముడుచుకొని పోతాయి, పెద్ద దైతే వికసిస్తాయి. (సిద్ధాంతి) అనంతమైన ఆ జీవావయవాలు ఒకే ప్రదేశంలో ఉండడానికి అడ్డం ఏర్పడుతుందా ఏర్పడదా? అడ్డం ఏర్పడితే అనంతావయవాలు పరిచ్ఛిన్నమైన (పరిమితమైన) దేశంలో (దేహంలో) ఇమడవు.(ఇమడక కొన్ని పైకి పోతా యని అర్థం). వాటికి (అడ్డు) తగలదు అని అంటే అన్ని అవయవాలు కూడ ఒక్క అవయవం ఉన్నచోటనే ఇమిడిపోవచ్చును గాన వాటికి పృథుత్వం (పరిమాణం పెరగడం) కుదరదు గాన జీవుడు కేవలం అణుమాత్ర ప్రమాణం కలవా డని చెప్పవలసి వస్తుంది. మరొక విషయ మేమనగా - శరీరం మాత్రంచేత పరిచ్ఛిన్నాలైన (శరీరం ఎంత ఉందో అంతే ప్రమాణం గల) అవయవాలకు అనంతత్వం ఊహించడానికి కూడ శక్యం కాదు. 34.

### భాష్యమ్

అథ పర్యాయేణ బృహచ్ఛరీరప్రతిపత్తౌ కేచిజ్జీవావయవాః ఉపగచ్ఛన్తి, తనుశరీరప్రాప్తౌ చ కేచిదపగచ్ఛన్తీత్యుచ్యేత తత్రాప్యుచ్యతే-

### సూ. న చ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః 2.2.35

న చ పర్యాయేణాప్యవయవోపగమాపగమాభ్యామేతద్దేహ పరిమాణత్వం జీవస్యావిరోధేనోపపాదయితుం శక్యతే. కుతః? వికారాదిదోష ప్రసంగాత్. అవయవోపగమాపగమాభ్యాం హ్యనిశమాపూర్యమాణస్యాపక్షీయ మాణస్య చ జీవస్య విక్రియావత్త్వం తావదపరిహార్యమ్. విక్రియావత్త్వే చ చర్మాదివదనిత్యత్వం ప్రసజ్యేత. తతశ్చ బన్ధమోక్షాభ్యుపగమో బాధ్యేత కర్మాష్టకపరివేష్టితస్య జీవాస్యాలాబువత్సంసారసాగరే నిమగ్నస్య బన్ధనోచ్ఛేదా దూర్ధ్వగామిత్వం భవతీతి. కిం చాన్యత్ - ఆగచ్ఛతామపగచ్ఛతాం చావయవా నామాగమాపాయధర్మవత్త్వాదేవానాత్మత్వం శరీరాదివత్. తతశ్చావస్థితః కశ్చిదవయవ ఆత్మేతి స్యాత్. న చ స నిరూపయితుం శక్యతేఽయమసావితి. కిం చాన్యత్ - ఆగచ్ఛన్తశ్చైతే జీవావయవాః కుతః ప్రాదుర్భవన్తి, అపగచ్ఛన్తశ్చ క్వ వా లీయన్త ఇతి వక్తవ్యమ్. న హి భూతేభ్యః ప్రాదుర్భవేయుః, భూతేషు చ నిలీయేరన్, అభౌతికత్వాజ్జీవస్య. నాపి కశ్చిదన్యః సాధారణోఽసాధారణో వా జీవానామవయవాధారో నిరూప్యతే, ప్రమాణాభావాత్. కిం చాన్యత్- అనవధృతస్వరూపశ్చైవం సత్యాత్మా స్యాత్ ఆగచ్ఛతామపగచ్ఛతాం చావయవానామనియతపరిమాణత్వాత్. అత ఏవమాదిదోషప్రసంగాన్న పర్యాయేణాప్యవయవోపగమాపగమావాత్మన ఆశ్రయితుం శక్యేతే.

### బాలానందిని

అథేతి:- అట్లు కాక పెద్ద శరీరం పొందినప్పుడు కొన్ని జీవావయవాలు వచ్చి చేరుతాయి చిన్న శరీరం పొందినప్పుడు కొన్ని అవయవాలు తొలగిపోతాయి అని చెప్పిన ట్లయితే ఆ విషయంలో కూడ చెప్పబడుచున్నది.

నేతి:- "పర్యాయాదపి = పర్యాయంవల్ల కూడ, అవిరోధః = జీవునకు శరీరప్రమాణాన్ని అంగీకరించడంలో విరోధం లేకపోవడం, న = లేదు. వికారాదిభ్యః= వికారాదిదోషాలు కలుగుతాయి గాన" అని సూత్రార్థం.

న చేతి:- జీవుని అవయవాలు పర్యాయంచేత వస్తూంటాయి పోతూంటాయి అని చెప్పినా కూడ జీవుడు శరీరంతో సమానమైన పరిమాణం కలిగి ఉంటా డనడం విరోధం లేకుండా సమర్థించడానికి శక్యం కాదు. ఎందువల్ల? వికారం మొదలైన దోషాలు ప్రసక్త మవుతాయి గాన. ఎల్లప్పుడూ అవయవాలు వచ్చి చేరడంవల్ల నింపబడుతూ అవయవాలు తొలగిపోవడంవల్ల క్షీణిస్తూ ఉంటే జీవునకు వికారం కలుగుతుంది అనే దోషమైతే పరిహరింప శక్యం కానిది. వికారం ఉంటే చర్మవలె జీవుడు కూడ అనిత్యు డని చెప్పవలసివస్తుంది. అప్పుడు ఎనిమిది విధాలైన కర్మలచేత చుట్టబడి (తాళ్లతో నీళ్లలోని ఏదో రాయికి కట్టబడిన) ఆనపకాయబుఱ్ఱ వలె సంసారసముద్రంలో మునిగి ఉన్న జీవుడు బంధనం తొలగిపోవడంవల్ల పై పైకి వెళ్లి పోతూంటాడు అని మీరుచెప్పిన బంధమోక్షం (బంధంనుండి మోక్షం) బాధింపబడుతుంది. మరొక విషయం- వచ్చి చేరుతూ తొలగిపోతూ ఉండే అవయవాలు రావడం పోవడం అనే ధర్మా లుండడంవల్ల శరీరాదుల వలె ఆత్మ భిన్నములు అని చెప్పవలసివస్తుంది. అప్పుడు (వస్తూ పోతూ ఉండకుండా) నిలకడగా ఉన్న ఒక అవయం ఆత్మ అని చెప్పవలసి ఉంటుంది. అయితే ఆ అవయవం ఏదో చెప్పడానికి శక్యం కాదు. మరొక విషయం- వచ్చే జీవావయవాలు ఎక్కడ పుడుతున్నాయో పోయేవి ఎక్కడ లీనం అవుతున్నాయో చెప్పవలసి ఉంటుంది. భూతాలనుండి పుట్టి భూతాలలో లీన మవుతున్నాయి అనడానికి వీలు లేదు, జీవుడు భూతాలనుండి పుట్టినవాడు కాదు కదా? జీవుల అవయవాలకు సాధారణమూ లేక అసాధారణమూ అయిన మరొక ఆధారం ఏదీ చూపడం కుదరదు. అలాంటి ప్రమాణం ఏదీ లేదు కదా? మరొకవిషయం- వస్తూ పోతూ ఉండే అవయవాల పరిమాణం నియతం కాకపోవడంచేత ఆత్మస్వరూపం ఇలా ఉంటుంది అని నిశ్చయించడానికి వీలుకూడ ఉండదు. అందుచేత ఇలాంటి దోషా లన్నీ ప్రసక్తమూ లౌతాయి గాన పర్యాయంచేత కూడ ఆత్మకు అవయవాలు వచ్చి చేరడం తొలగిపోవడం అనేదానిని ఆశ్రయించడం శక్యం కాదు.

## భాష్యమ్

అథవా పూర్వేణ సూత్రేణ శరీరపరిమాణస్యాత్మనః ఉపచితాప చితశరీరాన్తరప్రతిపత్తావకార్త్స్న్యప్రసంజనద్వారేణానిత్యతాయాం

చోదితాయాం పునః పర్యాయేణ పరిమాణానవస్థానేఽపి స్రోతఃసంతాన నిత్యతాన్యాయేన ఆత్మనో నిత్యతా స్యాత్ యథా రక్తపటాదీనాం విజ్ఞానానవస్థానే పి తత్సన్తాననిత్యతా తద్వద్విసిచామపీత్యాశఙ్క్యానేన సూత్రేణోత్తరముచ్యతే. సన్తానస్య తావదవస్తుత్వే నైరాత్మ్యవాదప్రసఙ్గః. వస్తుత్వే ప్యాత్మనః వికారాదిదోషసంగాదస్య పక్షస్యానుపపత్తిరితి. 35.

బాలానందిని

అవ. ఈ సూత్రానికే మరొక అర్థం చెపుతున్నారు - అథవేతి :- లేదా శరీరపరిమాణం గల ఆత్మకు పెరుగుతూ తరుగుతూ ఉండే వేరు వేరు శరీరాలను పొందినప్పుడు అకార్త్స్న్యం వస్తుంది అనే దోషాన్ని ప్రసక్తం చేయడం ద్వారా వానికి (జీవునకు) అనిత్యత్వం కలుగుతుంది కదా అని ప్రశ్నించగా మళ్లీ పర్యాయంచేత, అనగా ప్రవాహసంతాననిత్యతాన్యాయంచేత, (అనగా జలప్రవాహం నిరంతరమూ ప్రవహిస్తూండడంచేత అది నిత్యంగా కనబడినట్లు) కషాయవస్త్రధారులైన బౌద్ధుల మతంలో విజ్ఞానం స్థిరం కాకపోయినా (క్షణికం అవడంచేత నశిస్తూన్నా) దాని ప్రవాహం నిత్య మని ఏ విధంగా అంగీకరించబడిందో అదే విధఃగా దిగంబరుల మతంలో కూడ పరిమాణం నశించినా కూడ ఆత్మకు నిత్యత్వం చెప్పవచ్చును అని పూర్వసూత్రంచేతనే ఆశంకించి దానికి సమాధానం ఈ సూత్రంచేత చెప్పబడుచున్నది.

వి. అప్పుడు పర్యాయాత్ అనగా సంతానంవల్ల, ప్రవాహంవల్ల అని అర్థం. "పర్యాయాదపి = సంతానం అంగీకరించినా, అవిరోధః= విరోధం లేకపోవడం, న=లేదు. వికారాదిభ్యః= వికారాదిదోషాలు కలుగుతాయి కదా" అని సూత్రానికి అర్థం.

సన్తానస్యేతి:- ఈ సంతానం వాస్తవం కాకపోతే నైరాత్మ్యవాదం (ఆత్మయే లేదు అనే వాదం) ప్రసక్త మవుతుంది. అది వాస్తవ మని అంగీకరించినా కూడ ఆత్మకు వికారం మొదలైన దోషాలు ప్రసక్త మవుతాయి. అందువల్ల ఈ పక్షం కుదరదు అని అర్థం.

## సూ. అన్త్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః 2.2.36.

అపి చాన్త్యస్య మోక్షావస్థాభావినో జీవపరిమాణస్య నిత్యత్వమిష్య తే జైనైః. తద్వత్ పూర్వయోరప్యాద్యమధ్యయోర్జీవపరిమాణయోర్నిత్యత్వ ప్రసంగాత్ అవిశేషప్రసంగః స్యాత్. ఏకశరీరపరిమాణతైవ స్యాన్నోపచితాపచిత

శరీరాన్తరప్రాప్తిః. అథవా - అన్త్యస్య జీవపరిమాణస్యావస్థితత్వాత్ పూర్వయోరప్యవస్థయోరవస్థితపరిమాణ ఏవ జీవః స్యాత్. తతశ్చావిశేషేణ సర్వదైవాణుర్మహాన్వా జీవోఽభ్యుపగన్తవ్యః న శరీరపరిమాణః. అతశ్చ సౌగతవదార్హతమపి మతమసంగతమిత్యుపేక్షణీయమ్.

## బాలానందిని

అన్త్యేతి:- "అన్త్యావస్థితేః=చివరిదైన ఆత్మపరిమాణం నిత్యంగా ఉండడంవల్ల, ఉభయనిత్యత్వాత్ =మొదటిది మధ్యలో వచ్చినది అయిన రెండు ఆత్మపరిమాణాలు కూడ నిత్యము లవడంవల్ల, అవిశేషః= ఆ మూడింటి ప్రమాణంలోను భేదం ఉండకూడదు" అని సూత్రార్థం.

అపి చేతి:- మరొక విషయ మేమనగా - మోక్షావస్థలో ఉండే చివరిదైన జీవపరిమాణం నిత్య మని జైనులు అంగీకరిస్తారు. దాని వలెనే పూర్వం ఉన్న మొదటిదీ మధ్యమమూ అయిన జీవపరిమాణాలు కూడ నిత్యములే అని చెప్పవలసి ఉంటుంది. అందుచేత ఒక్క శరీరానికి ఎంత పరిమాణం ఉంటుందో అంతే జీవునకు కూడ ఉంటుంది అని చెప్పాలి. అప్పుడు పెరిగిన, తరిగిన ఇతరశరీరాల ప్రాప్తి ఉండదు.

వి. మోక్షకాలంలో జీవుని పరిమాణం ఒక నిశ్చితరూపంలో నిత్యంగా ఉంటుంది అని అంగీకరించి నప్పుడు మోక్షానికి పూర్వం కూడ అదే నిశ్చిత మైన పరిమాణం ఉంటుం దని చెప్పాలి. ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉన్నదే కదా నిత్య మనగా? మోక్షపూర్వావస్థలలో ఉపచయాపచయాలు అంగీకరిస్తే నిత్యత్వానికి భంగం వస్తుంది. అందుచేత ఎల్లప్పుడూ ఒక శరీరంయొక్క పరిమాణమే ఉంటుం దని అంగీకరిస్తే పెరిగి తరిగే ఇతరశరీరాలలోనికి ఈ ఆత్మ వెళ్లడం కుదరదు. అనగా మోక్షావస్థలో నిత్యమైన ఏ పరిమాణం ఉటుందో ఆ పరిమాణం గల శరీరంలో మాత్రమే ఆ ఆత్మ మోక్షానికిముందు ఉంటుంది. దాని కంటె పెరగడం కాని తరగడం కాని ఉంటే శరీరాలలోనికి వెళ్లదు అని చెప్పవలసివస్తుంది. అని భావం.

మరొక వ్యాఖ్యానం చెపుతున్నారు - అథవేతి:- లేదా చివరిదైన జీవపరిమాణం నిత్యం గాన పూర్వావస్థలలో కూడ జీవుని పరిమాణం అదే ఉంటుంది అని అంగీకరించాలి. (నిత్య మైనది అణు వైనా కావాలి. మహత్ప్రమాణ మైనా కావాలి). అందుచేత జీవుడు అణుపరిమాణుడని గాని మహత్ప్రమాణు డని గాని అంగీకరించాలి కాని శరీరం తో సమానమైన పరిమాణం కలవాడు అని చెప్పడం

కుదరదు. అందుచేత కూడ సౌగతమతం వలె ఆర్హతమతం కూడ అసంగతమే కాన ఉపేక్షించదగినది.36.

ఏకస్మిన్నసంభవాధికరణం సమాప్తం

## 7. పత్యధికరణమ్. సూ. 37 - 41

## సూ. పత్యురసామఞ్జస్యాత్ 2.2.37.

ఇదానీం కేవలాధిష్ఠాత్రీశ్వరకారణవాదః ప్రతిషిధ్యతే. తత్కథమవగమ్యతే? "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్" "అభిధ్యోపదేశాచ్చ" (బ్ర.సూ. 1.4.23,24) ఇత్యత్ర ప్రకృతిభావేన అధిష్ఠాతృభావేన చోభయస్వభావస్యేశ్వరస్య స్వయమేవాచార్యేణ ప్రతిష్ఠాపితత్వాత్. యది పునరవిశేషేణేశ్వరకారణవాదమాత్రమిహ ప్రతిషిధ్యేత పూర్వోత్తర విరోధాద్వ్యాహతాభివ్యాహారః సూత్రకార ఇత్యాపద్యేత. తస్మాదప్రకృతి రధిష్ఠాతా కేవలం నిమిత్తకారణమీశ్వర ఇత్యేష పక్షో వేదాన్తవిహిత బ్రహ్మైకత్వప్రతిపక్షత్వాద్యత్నేనాత్ర ప్రతిషిధ్యతే. సా చేయం వేదబాహ్యేశ్వర కల్పనానేకప్రకారా. కేచిత్తావత్సాంఖ్యయోగవ్యపాశ్రయాః కల్పయన్తి- ప్రధానపురుషయోరధిష్ఠాతా కేవలం నిమిత్తకారణమీశ్వరః, ఇతరేతర విలక్షణాః ప్రధానపురుషేశ్వరా ఇతి. మాహేశ్వరాస్తు మన్యన్తే కార్యకారణయోగవిధిదుః ఖాన్తాః పఞ్చపదార్థాః పశుపతినేశ్వరేణ పశుపాశవిమోక్షణాయోపదిష్టాః, పశుపతిరీశ్వరో నిమిత్తకారణమితి వర్ణయన్తి. తథా వైశేషికాదయోఽపి కేచిత్ కథంచిత్ స్వప్రక్రియానుసారేణ నిమిత్తకారణమీశ్వర ఇతి వర్ణయన్తి.

### బాలానందిని

పత్యురితి:- "పత్యుః = ఈశ్వరునకు, కేవలనిమిత్తకారణత్వం కుదరదు అసామఞ్జస్యాత్ = సామంజస్యం లేకపోవడంవల్ల" అని సూత్రార్థం.

ఇదానీమితి:- ఇప్పుడు కేవలం అధిష్ఠాత మైన ఈశ్వరుడు (జగత్తుకు) కారణం అనే వాదం నిరాకరించబడుతున్నది. (అధిష్ఠాత అనగా పైన ఉండేవాడు, నిమిత్తకారణం అని అర్థం). ఇది ఎలా తెలుస్తూన్నది? ఆచార్యుడు (సూత్రకారుడు) స్వయంగా "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్" "అభిధ్యోపదేశాచ్చ" అని ఈశ్వరుడు జగత్తుకు ప్రకృతి

(ఉపాదానకారణం), అధిష్ఠాతా కూడ అని ఈశ్వరునకు రెండుస్వభావా లున్నట్లు చెప్పి ఉన్నాడు. ఇక్కడ భేదం ఏదీ లేకుండా ఈశ్వరకారణత్వాన్నే నిషేధించే పక్షంలో పూర్వోత్తరవిరోధంవల్ల సూత్రకారుడు పరస్పరవిరుద్ధమైన మాటలు చెప్పుచున్నాడు. అన్న అభిప్రాయం ఏర్పడుతుంది. అందుచేత ఈశ్వరుడు ప్రకృతి కాదు, కేవలం అధిష్ఠాతయే, నిమిత్తకారణంమాత్రమే, అనే పక్షం వేదాంతాలలో చెప్పిన బ్రహ్మైకత్వపక్షానికి విరుద్ధం గాన అది ప్రయత్నపూర్వకంగా ఇక్కడ నిరాకరించబడుచున్నది. వేదవిరుద్ధమైన ఈ ఈశ్వరకల్పన అనేకవిధాల ఉంది. సాంఖ్యయోగమంతాలను ఆశ్రయించిన కొందరు ప్రధానపురుషుల అధిష్ఠాతయైన ఈశ్వరుడు కేవలం నిమిత్తకారణం మాత్రమే. ప్రధాన-పురుష - ఈశ్వరులు పరస్పరం వేరు వేరైనవారు అని అంటారు. మాహేశ్వరులైతే కార్యం (మహదాదికం), కారణం (ప్రధానం, ఈశ్వరుడు) యోగం (సమాధి) విధి (త్రిషవణస్నానాదికం) దుఃఖాంతం (మోక్షం) అనే ఐదు పరార్థాలు పశుపతియైన ఈశ్వరునిచేత పశువుల (జీవుల) పాశాల (బంధాల) మోక్షంకొరకు ఉపదేశింపబడ్డాయి. పశుపతి యైన ఈశ్వరుడు నిమిత్తకారణం అని వర్ణిస్తారు,

వి. ఈ మాహేశ్వరులు నాలుగు రకాలవా ళ్లున్నా రని రత్నప్రభలో- శైవులు, పశుపతులు, కారుణికసిద్ధాంతులు, కాపాలికులు అని నాలుగు పేర్లు చెప్పబడ్డాయి. అయితే బ్రహ్మవిద్యాభరణంలో మాహేశ్వరు లనగా శివుడు భోధించిన ఆగమాలను అనుసరించే నకులీశ లేదా లగుడీశపాశుపతు లని చెప్పబడింది. ఆ సిద్ధాంతానికి సంబంధించిన కొన్ని విషయాలు కూడ ఈ వ్యాఖ్యానంలోచెప్పబడ్డాయి. సర్వదర్శనసంగ్రహంలో నకులీశపాశుపతదర్శనం, శైవదర్శనం, ప్రత్యభిజ్ఞాదర్శనం అను మూడు శైవదర్శనాల చర్చ ఉంది.

తగేతి:- అట్లే వైశేషికులు మొదలైనవాళ్లు కొంతమంది ఏదో విధంగా తమ తమ ప్రక్రియను అనుసరించి ఈశ్వరుడు నిమిత్తకారణం అని వర్ణిస్తున్నారు.

<u>వి.</u> లుఞ్చితకేశుల (ఒక్కొక వెంట్రుకచొప్పున వెంట్రుకలను ఊడబెరుకుకొనే జైనుల) మతం తరవాత జటాధారులైన శైవుల మతం బుద్ధిస్థం అవుతుంది గాన దీనికి వెనుకటి అధికరణంతో ప్రసంగసంగతి. అద్వితీయమైన బ్రహ్మ జగత్తుకు ప్రకృతి, నిమిత్తకారణమూ కూడ అని చెప్పే వేదాంతసమన్వయానికి ఈశ్వరుడు కర్తయే గాని ప్రకృతి కాడు అని చెప్పే మతాలలో విరోధం ఉందా లేదా అని సంశయం. అవి ప్రామాణికాలే గాన విరోధం ఉంది అని పూర్వపక్షం. అవి అప్రామాణికాలు గాన విరోధం లేదు అని ఉత్తరపక్షం.

## భాష్యమ్

అత ఉత్తరముచ్యతే - పత్యురసామఞ్జస్యాత్" ఇతి. పత్యురీశ్వరస్య ప్రధానపురుషయోరధిష్ఠాతృత్వేన జగత్కారణత్వం నోపపద్యతే. కస్మాత్? అసామఞ్జస్యాత్. కిం పునరసామఞ్జస్యమ్? హీనమధ్యమోత్తమభేదేన హి ప్రాణిభేదాన్విదధత ఈశ్వరస్య రాగద్వేషాదిదోషప్రసక్తేః అస్మదాదివత్ అనీశ్వరత్వం ప్రసజ్యేత. ప్రాణికర్మాపేక్షత్వా (క్షితత్వా) దదోష ఇతి చేత్, న. కర్మేశ్వరయోః ప్రవర్త్యప్రవర్తయితృత్వే ఇతరేతరాశ్రయదోషప్రసంగాత్. నానాదిత్వాదితి చేత్; న. వర్తమానకాలవదతీతేష్వపి కాలేష్వితరేతరాశ్రయదోషావిశేషాదన్ధపరంపరాన్యాయాపత్తేః. అపి చ "ప్రవర్తనాలక్షణా దోషాః" (న్యా. సూ. 1.1.18) ఇతి న్యాయవిత్సమయః. న హి కశ్చిదదోషప్రయుక్తః స్వార్థే పరార్థే వా ప్రవర్తమానో దృశ్యతే. స్వార్థే ప్రయుక్త ఏవ చ సర్వో జనః పరార్థేఽపి ప్రవర్తత ఇత్యేవమప్యసామఞ్జస్యమ్. స్వార్థవత్త్వాదీశ్వరస్యానీశ్వరత్వప్రసంగాత్. పురుషవిశేషత్వాభ్యుపగమాచ్చేశ్వరస్య పురుషస్య చౌదాసీన్యాభ్యుపగమాదసామఞ్జస్యమ్.37.

## బాలానందిని

అత ఇతి:-అందువల్ల సమాధానం చెప్పబడుతున్నది -"పత్యురసామఞ్జస్యాత్" పత్యుః= ఈశ్వరునకు ప్రధానపురుషాధిష్ఠాతగా జగత్కారణత్వం కుదరదు. ఎందువల్ల? అసామంజస్యంవల్ల. ఏమి టా అసామంజస్యం? హీనులను గాను మధ్యములను గాను ఉత్తములను గాను వివిధప్రాణులను సృష్టిస్తున్న ఈశ్వరునకు రాగద్వేషాదులున్నా యనే దోషం ప్రసక్తం అవుతుంది గాన ఈశ్వరుడు కూడ అస్మదాదుల వలె అనీశ్వరు డైపోతాడు. ప్రాణుల కర్మలను అపేక్షించి సృష్టించడంవల్ల ఏ దోషమూ లేదు అన్నట్లయితే అది యుక్తం కాదు. కర్మేశ్వరులకు ప్రవర్త్యప్రవర్తకభావం ఉన్నట్లయితే ఇతరేతరేతరాశ్రయదోషం ఏర్పడుతుంది.

వి. కర్మ ఈశ్వరుణ్ణి ప్రేరేపిస్తుంది ఈశ్వరుడు కర్మను ప్రేరేపిస్తాడు అన్నట్లయితే అన్యోన్యాశ్రయదోషం ఏర్పడుతుంది. కర్మ అచేతనం గాన ఈశ్వరుణ్ణి ప్రేరేపించజాలదు అలాంటి కర్మ ప్రేరణ లేనిదే ఈశ్వరుడు ప్రవర్తించడు. ఈశ్వరుడే కర్మను ప్రవర్తింపచేస్తాడు అనగా ప్రాణులచేత కర్మ చేయిస్తాడు. తరవాత ఆ కర్మ ఈశ్వరుణ్ణి

ప్రేరేపిస్తుంది అనగా ఆ కర్మను బట్టి ఈశ్వరుడు ప్రాణులచేత మరొక కర్మ చేయిస్తాడు అన్నట్లయితే పైన చెప్పిన అన్యోన్యాశ్రయదోషం

**నానాదిత్వాదితి:-** ఈ సంసారం అనాది కాబట్టి ఈ అన్యోన్యాశ్రయదోషం లేదు అన్నట్లయితే అది కుదరదు. వర్తమానకాలంలో ఏ విదంగా అన్యోన్యాశ్రయదోషం ఉందో అట్లే గడచిన కాలాలలో కూడ అన్యోన్యాశ్రయదోషం ఉడడంవల్ల అనాదిత్వకల్పన అంధపరంపరాన్యాయానికి గురి అవుతుంది.

వి. సిద్ధాంతంలో కూడ అనాదిత్వాన్ని అంగీకరించి ఇలాంటి అన్యోన్యాశ్రయదోషం వెనుక పరిహరించబడింది. అయితే సిద్ధాంతి శ్రుతిస్మృత్యాదుల ప్రామాణ్యాన్ని అంగీకరించి ఉన్నాడు గాన శ్రుతిస్మృతులలోచెప్పినట్లు అనాదిత్వం అంగీకరించడంలో దోషం లేదు. మీరు ప్రమాణంగా చూపే ఆగమాల ప్రామాణ్యమే అసిద్ధంగాన మీ మతాన్ని సమర్థించుకొనడం కోసం కల్పించిన ఈ అనాదిత్వం అంధపరంపరాన్యాయానికే చెందుతుంది. శ్రుతిస్మృత్యనుసారమే మేం కూడ అనాదిత్వాన్ని అంగీకరిస్తాం అని అంటే అప్పుడు శ్రుతిస్మృత్యనుసారంగా ఈశ్వరునికి ఉపాదానత్వం కూడ అంగీకరించాలి అని భావం.

**అపి చేతి:-** మరొక విషయ మేమనగా - "ప్రవర్తనా లక్షణాః దోషాః" అని న్యాయవేత్తల సిద్ధాంతం. "ప్రవర్తింపచేసేవే దోషాలు; ప్రవర్తింపచేయడమే దోషాల లక్షణం" అని దీని అర్థం. అందువల్ల ఏ ఒక్కడూ కూడ దోషాలచేత ప్రేరేపింప బడకుండా స్వార్థం విషయంలో కాని పరార్థం విషయంలో కాని ప్రవర్తిస్తూన్నట్లు కనబడడంలేదు (అయితే పరుల లాభంకోసం ప్రవర్తించేవాడు తన లాభం కోసం ప్రవర్తిండంలేదు కదా అని శంక కలగవచ్చును. అది యుక్తం కాదు) పరార్థం ప్రవర్తించేవాడు కూడ స్వప్రయోజనంకొరకే ప్రవర్తిస్తాడు. (అనగా పరుల కష్టాలను చూడలేక ఆ కష్టాలను తొలగించేవానికి ఆ కష్టాలు చూడడంవల్ల కలిచే దుఃఖం పోతుంది. అది స్వార్థమే. అట్లే తాను చేసిన ఉపకారానికి పరుడు సంతోషిస్తే తనకు సంతోషం కలుగుతుంది. అది కూడ స్వార్థమే అని భావం). ఈ విధంగా ఈశ్వరుడు కూడ స్వార్థం కలవాడవడంచేత అనీశ్వరు డయ్యే ప్రసక్తి ఉంది గాన ఈ విధంగా కూడ ఇది అసమంజసమే. (ఇది రెండవ అసామంజస్యం). (యోగశాస్త్రం ప్రకారం) ఈశ్వరుడు కూడా ఒకానొక పురుషుడే గాన, పురుషుడు ఉదాసీనుడు గానే ఉంటా డని అంగీకరించబడింది గాన ఈశ్వరుడు ప్రవర్తకు డని అంగీకరించడం ఆ శాస్త్రం ప్రకారం అసమంజసం అవుతుంది. (ఇది మూడవ అసామంజస్యం). 37.

## సూ. సంబన్ధానుపపత్తేశ్చ 2.2. 38

పునరప్యసామఞ్జస్యమేవ. న హి ప్రధానపురుషవ్యతిరిక్త ఈశ్వరః అన్తరేణ సంబన్ధం ప్రధానపురుషయోరీశితా. న తావత్సంయోగలక్షణః సంబన్ధః సంభవతి, ప్రధానపురుషేశ్వరాణాం సర్వగతత్వాన్నిరవయవత్వాచ్చ. నాపి సమవాయలక్షణః సంబన్ధః, ఆశ్రయాశ్రయిభావానిరూపణాత్. నాప్యన్యః కశ్చిత్కార్యగమ్యః సంబన్ధః శక్యతే కల్పయితుమ్, కార్యకారణభావస్యైవాద్యాప్యసిద్ధత్వాత్. బ్రహ్మవాదినః కథమితి చేత్, న.తస్య తాదాత్మ్యలక్షణ సంబన్ధోపపత్తేః. అపి చాగమబలేన బ్రహ్మవాదీ కారణాదిస్వరూపం నిరూపయతీతి నావశ్యం తస్య యథాదృష్టమేవ సర్వనుభ్యుపగన్తవ్యమితి నియమోఽస్తి. పరం తు దృషాన్తబలేన కారణాదిస్వరూపం నిరూపయతః యథాదృష్టమేవ సర్వమభ్యుపగన్తవ్యమిత్యయమస్త్యతిశయః. పరస్యాపి సర్వజ్ఞప్రణీతాగమసద్భావాత్సమానమాగమబలమితి చేత్ న. ఇతరేవరాశ్రయత్వప్రసంగాత్, ఆగమప్రత్యయాత్సర్వజ్ఞత్వసిద్ధిః సర్వజ్ఞ. ప్రత్యయాచ్చాగమసిద్ధిరితి. తస్మాదనుపపన్నా సాంఖ్యయోగవాదినా మీశ్వరకల్పనా. ఏవమన్యాస్వపి వేదబాహ్యాస్వీశ్వరకల్పనాసు యథాసంభవమ సామఞ్జస్యం యోజయితవ్యమ్. 38.

### బాలానందిని

సంబన్ధేతి:-"సంబన్ధానుపపత్తేశ్చ = ప్రధానాదులకు ఈశ్వరునికీ సంబంధం కుదరదు గాన అ కారణంచేత కూడ అసామంజస్యం" అని సూత్రార్థం.

పునరపీతి :- మళ్లీ కూడ అసామంజస్యమే చూపబడుచున్నది. ప్రధాన పురుషులకంటె భిన్నుడైన ఈశ్వరుడు వాటితో సంబంధం లేకుండా వాటి విషయంలో ఈశిత్వం వహింపజాలడు కదా? ప్రధానము, పురుషులు, ఈశ్వరుడూ కూడ సర్వగతాలు (అంతటా వ్యాపించి ఉన్నవి). అవయవాలులేనివి. అందుచేత సంయోగరూప మైన సంబంధం కుదురదు. ఈశ్వరునికీ ప్రధానపురుషులకీ మధ్య ఆశ్రయాశ్రయిభావం (ఘటం ఆశ్రయం దానిలో సమవాయసంబంధంతో ఉన్న గుణాదకం ఆశ్రయి అన్నట్లు) కనబడడంలేదు గాన సమవాయసంబంధం కూడ కుదరదు. కార్యాన్ని పట్టి ఊహించదగిన మరొక సంబంధాన్ని దేనినీ కల్పించడానికి వీలులేదు. ఇప్పటికీ వాటి

మధ్య కార్యకారణభావమే నిశ్చయింపబడలేదు కదా? అయితే బ్రహ్మవాదికి ఎలా కుదురుతుంది. అని అంటే, అది యుక్తం కాదు (ఆ దోషం లేదు). బ్రహ్మవాది ఈశ్వరునికీ జగత్తుకీ (అనిర్వచనీయమైన) తాదాత్మ్యం అనే సంబంధం ఉందని అంగీకరించవచ్చును. మరొక విషయ మేమనగా - బ్రహ్మవాది కారణాదుల స్వరూపాన్ని శ్రుతిబలంచేత నిరూపిస్తాడు. అందుచేత ప్రతీదీ లోకంలో ఎలా చూడబడుతున్నదో అట్లే తప్పకుండా అంగీకరించా లనే నియమం లేదు. ప్రతిపక్షు లైతే కారణాదుల స్వరూపాన్ని దృష్టాంతబలంచేత నిరూపిస్తాం అవి అటూనప్పుడు ప్రతీదానినీ ఎలా చూస్తామో అలాగే అంగీకరించా లనే ఈ అతిశయం (విశేషం) ఉంది. ప్రతిపక్షికి కూడా సర్వజ్ఞులు రచించిన ఆగమం ఉంది గాన ఆగమబలం వానికీ సమానమే అన్నట్లయితే అది యుక్తం కాదు. ఎందువల్ల ననగా ఆగమంమీద నమ్మకం ఉంది గాన అది రచించినవాడు సర్వజ్ఞు డని చెప్పవచ్చును అనీ, సర్వజ్ఞుడు రచించాడు కాబట్టి ఆగమం ప్రమాణం అనీ చెప్పడంవల్ల అన్యోన్యాశ్రయదోషం కలుగుతుంది. అందువల్ల సాంఖ్యులు, యోగవాదులు చేసిన ఈశ్వరకల్పన అనుపపన్నమైనది. వేదబాహ్యాలైన ఇతరమైన ఈశ్వరకల్పనల విషయంలో కూడ యథాసంభవంగా అసామంజస్యాన్ని నిరూపించాలి. 38.

## సూ. అధిష్ఠానానుపపత్తేశ్చ. 2.2.39.

ఇతశ్చానుపపత్తిస్తార్కికపరికల్పితస్యేశ్వరస్య. స హి పరికల్ప్యమానః కుమ్భకార ఇవ మృదాదీని ప్రధానాదీన్యధిష్ఠాయ ప్రవర్తయేత్.న చైవముపపద్యతే. న హ్యప్రత్యక్షం రూపాదిహీనం చ ప్రధానమీశ్వరస్యాధిష్ఠేయం సంభవతి; మృదాదివైలక్షణ్యాత్. 39.

### బాలానందిని

అధిష్ఠానేతి:- "అధిష్ఠానానుపపత్తేశ్చ = ఈశ్వరుడు ప్రధానాదులను అధిష్ఠించడం కుదరదు; అందుచేత కూడ తార్కికుల ఈశ్వర కల్పన కుదరదు" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- తార్కికులు కల్పించిన ఈశ్వరుడు ఈ కారణంచేత కూడ అనుపపన్నుడే (కుదరడు). అలా కల్పింపబడిన ఆ ఈశ్వరుడు కుంభకారుడు మట్టి మొదలైన వాటిని అధిష్ఠించి (వాటి సంపూర్ణజ్ఞానంతో వాటి సంబంధం ఏర్పరచుకొని) వాటిని ప్రవర్తింపచేసినట్లు (వివిధ రీతులలో ఉపయోగించినట్లు) ప్రధానాదులను అధిష్ఠించి ప్రవర్తింపచెయ్యాలి. కాని అలా చేయడం కుదరదు. ప్రధానం

మృదాదులకంటె విలక్షణం అయినది. ప్రత్యక్షం కానిదీ రూపాదులు లేనిదీ అయిన ప్రధానాన్ని ఈశ్వరుడు అధిష్ఠించడం సంభవించదు. 39.

## సూ. కరణవచ్చేన్న భోగాదిభ్యః 2.2.40.

స్యాదేతత్ - యథా కరణగ్రామం చక్షురాదికమప్రత్యక్షం రూపాది హీనం చ పురుషోఽధితిష్ఠతి ఏవం ప్రధానమపీశ్వరోఽధిష్ఠాస్యతీతి. తథాపి నోపపద్యతే. భోగాదిదర్శనాద్ధి కరణగ్రామస్యాధిష్ఠితత్వం గమ్యతే. న చాత్ర భోగాదయో దృశ్యన్తే. కరణగ్రామసామ్యే వాభ్యుపగమ్యమానే సంసారిణామివేశ్వరస్యాపి భోగాదయః ప్రసజ్యేరన్.

### బాలానందిని

కరణేతి:- "కరణవచ్చేత్=ఇంద్రియాల విషయంలో వలె అధిష్ఠించడం కుదురుతుంది అన్నట్లయితే, న=కాదు, బోగాదిభ్యః ఈశ్వరునకు భోగాదులు ప్రసక్తమవుతాయి" అని సూత్రార్థం.

స్యాదేతదితి:- ఇది ఇలా ఉండనీ; ప్రత్యక్షం కానిదీ, రూపాదులు లేనిదీ అయిన చక్షురాదీంద్రియసముద్రాదూన్ని ఏ విధంగా పురుషుడు అదిష్ఠించి ఉంటాడో అదే విధంగా ఈశ్వరుడు ప్రధానాన్ని అధిష్ఠించి ఉంటాడు. (సమాధానం) అలా చెప్పినా కుదరదు. భోగాదులు కనబడడంవల్ల జీవుడు ఇంద్రియసముదాయాన్ని అధిష్ఠించి నట్లు తెలుస్తున్నది. ఇక్కడ అలాంటి భోగాదు లేవీ కనబడడం లేదు. ఇంద్రియ సముదాయంతో పోలికను అంగీకరిస్తే సంసారులకు వలె ఈశ్వరునికి కూడ భోగాదులు ప్రసక్తం అవుతాయి.

### భాష్యమ్

అన్యథా వా సూత్రద్వయం వ్యాఖ్యాయతే- "అధిష్ఠానానుపపత్తేశ్చ"- ఇతశ్చానుపపత్తిస్తార్కికపరికల్పితస్యేశ్వరస్య. సాధిష్ఠానో హి లోకే సశరీరో రాజా రాష్ట్రస్యేశ్వరో దృశ్యతే న నిరధిష్ఠానః. అతశ్చ తద్దృష్టాన్తవశేనాదృష్టమీశ్వరం కల్పయితుమిచ్ఛత ఈశ్వరస్యాపి కించిచ్ఛరీరం కరణాయతనం వర్ణయితవ్యం స్యాత్, న చ తద్వర్ణయితుం శక్యతే. సృష్ట్యుత్తరభావిత్వాచ్ఛరీరస్య ప్రాక్ సృష్టేస్తదనుపపత్తేః. నిరధిష్ఠానత్వే చేశ్వరస్య ప్రవర్తకత్వానుపపత్తిః. ఏవం లోకే దృష్టత్వాత్.

"కరణవచ్చేన్న భోగాదిభ్యః" అథ లోకదర్శనానుసారేణేశ్వరస్యాపి కించిత్కరణానామాయతనం శరీరం కామేన కల్ప్యేత, ఏవమపి నోపపద్యతే. సశరీరత్వే హి సతి సంసారివద్భోగాదిప్రసంగాదీశ్వర స్యాప్యనీశ్వరత్వం ప్రసజ్యేత. 40.

బాలానందిని

అన్యథేతి:- లేదా ఈ రెండు సూత్రాలు మరొక విధంగా కూడా వ్యాఖ్యానించబడుతున్నాయి.

"అధిష్ఠానానుపత్తేశ్చ" తార్కికులచేత కల్పించబడిన ఈశ్వరునికి ఈ కారణంచేత కూడ అనుపపత్తి. లోకంలో సాధిష్ఠానుడైన, అనగా శరీరంతో కూడిన రాజు రాష్ట్రానికి ఈశ్వరుడుగా కనబడుచున్నాడు కాని శరీరం లేనివాడు ఈశ్వరుడుగా కనబడడం లేదు. (ఈ అర్థంలో అధిష్ఠానశబ్దానికి దేహం అని అర్థం). అందువల్ల ఆ దృష్టాంతంచేత, కనబడని ఈశ్వరుణ్ణి కల్పించకోరేవాళ్లు ఈశ్వరుడికి కూడ ఇంద్రియాలకు స్థానమైన ఒకానొక శరీరం ఉంటుందని చెప్పవలసి ఉంటుంది. అలా చెప్పడం కుదరదు. ఎందువల్ల ననగా శరీరం సృష్టి తరవాత ఏర్పడుతుంది కాని సృష్టికి పూర్వం అది కుదరదు. ఈశ్వరునికి శరీరం లేకపోతే (ప్రధానాదుల్ని ప్రవర్తింపచేయడం ఉపపన్నం కాదు. లోకంలో ఇలాగే చూడబడుతున్నది కదా? "కరణవచ్చేన్న భోగాదిభ్యః"- అలా కాక, లోకంలో కనబడుతున్నదానిని పట్టి ఈశ్వరునికి కూడ ఇంద్రియాదులకు స్థానమైన ఒక శరీరం స్వేచ్ఛచేత ఉండవచ్చును అని కల్పిస్తే అలా కూడ కుదరదు. ఈశ్వరుడు సశరీరుడైతే సంసారికి వలె భోగాదు లుండే ప్రసక్తి ఏర్పడుతుంది గాన ఈశ్వరుడు కూడ అనీశ్వరు డైపోతాడు. 40.

**సూ. అన్తవత్త్వమసర్వజ్ఞతా వా. 2.2.41.**

ఇతశ్చానుపపత్తిః తార్కికపరికల్పితస్యేశ్వరస్య. స హి సర్వజ్ఞ స్తైరభ్యుపగమ్యతే, అనన్తశ్చ. అనన్తం చ ప్రధానమనన్తాశ్చ పురుషా మిథో భిన్నా అభ్యుపగమ్యన్తే. తత్ర సర్వజ్ఞేనేశ్వరేణ ప్రధానస్య పురుషాణామ్, ఆత్మనశ్చ ఇయత్తా పరిచ్ఛిద్యేత వా న వా పరిచ్ఛిద్యేత, ఉభయథాపి దోషో ౽ను షక్త ఏవ. కథమ్? పూర్వస్మింస్తావద్వికల్పే ఇయత్తాపరిచ్ఛిన్నత్వాత్ప్రధాన పురుషేశ్వరాణామన్తవత్త్వమవశ్యంభావి. ఏవం లోకే దృష్టత్వాత్. యద్ధి లోకే ఇతుత్తాపరిచ్ఛిన్నం వస్తు ఘటాది తదన్తవద్దృష్టం, తథా ప్రధానపురుషేశ్వర

త్రయమపీయత్తాపరిచ్ఛిన్నత్వాదన్తవత్స్యాత్. సంఖ్యాపరిమాణం తావత్ ప్రధానపురుషేశ్వరత్రయరూపేణ పరిచ్ఛిన్నమ్.స్వరూపపరిమాణమపి తద్గతమీశ్వరేణ పరిచ్ఛిద్యేతేతి. పురుషగతా చ మహాసంఖ్యా. తతశ్చేయత్తా పరిచ్ఛిన్నానాం మధ్యే యే సంసారిణః సంసారాన్ముచ్యన్తే తేషాం సంసారో న్తవాన్ సంసారిత్వం చ తేషామన్తవత్. ఏవమితరేష్వపి క్రమేణ ముచ్యమానేషు సంసారస్య సంసారిణాం చాన్తవత్త్వం స్యాత్. ప్రధానం చ సవికారం పురుషార్థమీశ్వరస్యాధిష్ఠేయం సంసారత్వేనాభిమతమ్, తచ్ఛూన్య తాయామీశ్వరః కమధితిష్ఠేత్? కింవిషయే వా సర్వజ్ఞతేశ్వరతే స్యాతామ్? ప్రధానపురుషేశ్వరాణాం చైవమన్తవత్త్వే సత్యాదిమత్త్వప్రసంగః. ఆద్యన్తవత్త్వే చ శూన్యవాదప్రసంగః. అథ మా భూదేష దోష ఇత్యుత్తరో వికల్పోఽభ్యుప గమ్యేత-న ప్రధానస్య, పురుషాణామ్, ఆత్మనశ్చేయత్తా ఈశ్వరేణ పరిచ్ఛిద్యేత ఇతి తత ఈశ్వరస్య సర్వజ్ఞత్వాభ్యు పగమహానిరపరో దోషః ప్రసజ్యేత. తస్మాదప్యసంగతస్తార్కికపరిగృహీత ఈశ్వరకారణవాదః. 41.

బాలానందిని

అన్తేతి:- "అన్తవత్త్వమ్ = ప్రధాన పురుషేశ్వరులకు అంతవత్త్వం (అంతం) కాని, అసర్వజ్ఞ తా వా = ఈశ్వరునికి అసర్వజ్ఞత్వం కాని ప్రాప్తిస్తుంది" అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- తార్కికులు కల్పించిన ఈశ్వరునకు ఈ కారణంచేత కూడ అనుపపత్తి. ఈశ్వరుడు సర్వజ్ఞు డనీ, అనంతు డనీ వాళ్లు అంగీకరిస్తున్నారు. అనంత మైన ప్రధానము, అనంతు లైన పురుషులూ కూడ పరస్పరమూ వేరైనవాళ్లుగా అంగీకరించబడుతున్నారు. ఇలా ఉండగా సర్వజ్ఞుడైన ఈశ్వరుడు ప్రధానంయొక్క పురుషులయొక్క, తనయొక్క ఇయత్తను (ఇంత సంఖ్య ఇంత పరిమాణం అనే కొలతను) పరిచ్ఛేదం చేస్తాడా చెయ్యడా? రెండు విధాలా కూడ దోషం ఏర్పడుతుంది. ఎట్లు? మొదటి వికల్పంలో ప్రధానపురుషేశ్వరులు ఇయత్తచేత (ఇంత అని) పరిచ్ఛిన్నా లవడంచేత (కొలవబడడంచేత) తప్పక వాటికి నాశం కలుగుతుంది. లోకంలో ఈ విధంగా చూస్తున్నాం కదా? లోకంలో ఇయత్తచేత పరిచ్ఛిన్నమైన ఘటాదికమైన వస్తువు అంతం కలదిగా కనబడుతున్నది. అదే విధంగా ప్రధానం, పురుషులు ఈశ్వరుడు అనే ఈ త్రయం కూడ ఇయత్తచేత పరిచ్ఛిన్నం అవడంచేత నశించేది కావాలి. సంఖ్యారూపమైన పరిమాణ మైతే ప్రధానం, పురుషులు, ఈశ్వరుడు అనే త్రయ

మనే రూపంలో పరిచ్ఛిన్న మైనది. వాటిలో ఉన్న స్వరూపపరిమాణం, పురుషులలో ఉన్న మహాసంఖ్యా కూడ ఈశ్వరునిచేత పరిచ్ఛిన్నం (కొలవబడింది) కావాలి. అప్పుడు ఇయత్తచేత పరిచ్ఛిన్ను లైన వాళ్లలో (ఇంతమంది అని లెక్కింపబడిన పురుషులలో) ఏ సంసారులు సంసారంనుంచి ముక్తులౌతారో వాళ్ల సంసారం అంత మైపోతుంది. వాళ్ల సంసారిత్వం కూడ అంత మౌతుంది. అదే విధంగా ఇతరులు కూడా క్రమంగా ముక్తి పొందుతూండగా సంసారం సంసారులూ కూడ అంత మైపోతారు. పురుషుల కోసమై (పురుషుల) కర్మ ఫలాదులను ఇవ్వడం కోసమై) ఈశ్వరుని చేత అధిష్ఠించబడిన, వికారాలతో (దాని కార్యాలతో) కూడిన ప్రధానమే సంసార మని చెప్పబడుతుంది. ఆ పురుషులే లేకపోతే ఈశ్వరుడు దేనిని అధిష్ఠిస్తాడు? ఈశ్వరుని సర్వజ్ఞత్వ- ఈశ్వరత్వాలు దేనికి సంబంధించి ఉంటాయి? ఈ విధంగా ప్రధానపురుషేశ్వరులకు అంతం ఉంటే ఆది కూడ ఉండాలి. ఆద్యంతాలు ఉంటే శూన్యత్వం ఏర్పడే ప్రసక్తి కలుగుతుంది. అట్లు కాక, ఈ దోషం కలగకుండా ఉండా లని రెండవ వికల్పాన్ని (ఈశ్వరుడు ప్రధానంయొక్క పురుషులయొక్క, తనయొక్క ఇయత్తను పరిచ్ఛేదించడు అనే వికల్పాన్ని) అంగీకరిస్తే ఈశ్వరుడు సర్వజ్ఞుడు అనే అభ్యుపగమానికి హాని కలగడం అనే మరొక దోషం ప్రసక్తం అవుతుంది. అందువల్ల కూడ తార్కికులు అంగీకరించిన ఈశ్వరకారణవాదం అసంగతమే. 41.

పత్యధికరణం సమాప్తం

## 8. ఉత్పత్త్యసంభవాధికరణమ్. సూ. 42-45.

## సూ. ఉత్పత్త్యసంభవాత్ 2.2.42.

యేషామప్రకృతిరధిష్ఠాతా కేవలనిమిత్త కారణమీశ్వరోఽభిమతస్తేషాం పక్షః ప్రత్యాఖ్యాతః. యేషాం పునః ప్రకృతిశ్చాధిష్ఠాతా చోభయాత్మకం కారణమీశ్వరోఽభిప్రేతస్తేషాం పక్షః ప్రత్యాఖ్యాయతే. నను శ్రుతిసమాశ్రయణే నాప్యేవంరూప ఏవేశ్వరః ప్రాజ్ నిర్ధారితః ప్రకృతిశ్చాధిష్ఠాతా చేతి. శ్రుత్యను సారిణీ చ స్మృతిః ప్రమాణమితి స్థితిః. తత్కస్య హేతోరేష పక్షః ప్రత్యాచిఖ్యాసిత ఇతి. ఉచ్యతే - యద్యప్యేవంజాతీయకోంఽశః సమాన త్వాన్న విసంవాదగోచరో భవతి అస్తి త్వంశాన్తరం విసంవాదస్థానమిత్యతస్తత్ప్రత్యాఖ్యానాయారమ్భః. తత్ర భాగవతా మన్యన్తే — భగవానేవైకో వాసుదేవో నిరఞ్జనజ్ఞానస్వరూపః పరమార్థతత్త్వమ్. స చతుర్ధాత్మానం ప్రవిభజ్య ప్రతిష్ఠితో వాసుదేవవ్యూహరూపేణ, సంకర్షణ

వ్యూహరూపేణ, ప్రద్యుమ్నవ్యూహరూపేణ, అనిరుద్ధవ్యూహరూపేణ చ. వాసుదేవో నామ పరమాత్మోచ్యతే. సంకర్షణో నామ జీవః. ప్రద్యుమ్నో నామ మనః. అనిరుద్ధో నామాహంకారః. తేషాం వాసుదేవః పరా ప్రకృతిః. ఇతరే సంకర్షణాదయః కార్యమ్. తమిత్థంభూతం పరమేశ్వరం భగవన్తమభిగమనోపాదానేజ్యాస్వాధ్యాయయోగైర్వర్షశతమిష్ట్వా క్షీణక్లేశో భగవన్తమేవ ప్రతిపద్యత ఇతి.

## బాలానందిని

**ఉత్పత్తీతి:-** "ఉత్పత్త్యసంభవాత్ = జీవుని ఉత్పత్తి అసంభవం గాన, భాగవతమతం యుక్తం కాదు" అని సూత్రార్థం.

**యేషామితి:-** ఈశ్వరుడు ప్రకృతి కాదు, కేవలం అధిష్ఠాతయైన నిమిత్త కారణం మాత్రమే అని చెప్పేవాళ్ల మతం నిరాకరించబడింది. ఈశ్వరుడు ప్రకృతి అధిష్ఠాత కూడ అయిన రెండు విధాలైన కారణం అని అంగీకరించేవాళ్ల పక్షం నిరాకరించబడుచున్నది. (ప్రశ్న) శ్రుతిని ఆశ్రయించినా కూడ ఈశ్వరుడు ఈ విధమైనవాడే; ప్రకృతి అధిష్ఠాత కూడ అని పూర్వం నిర్ధారణ చేయబడింది కదా? శ్రుతిని అనుసరించి ఉన్న స్మృతి ప్రమాణం అని కదా స్థితి (సంప్రదాయం)? అందుచేత ఈ పక్షాన్ని ఏ కారణంచేత నిరాకరించా లని అనుకొంటున్నారు? (సమాధానం) చెప్పబడుతున్నది. ఈ రకమైన అంశం సమానమే గాన వివాదగోచరం కాకపోయినా వివాదానికి స్థానమైన మరొక అంశం ఉంది; అందుచేతనే ఈ మతాన్ని నిరాకరించడానికి ఈ ప్రారంభం. భాగవతులు ఇలా అనుకుంటారు. నిర్మలజ్ఞానస్వరూపుడైన భగవంతుడైన ఒక్క వాసుదేవుడే పరమార్థతత్త్వం. ఆ వాసుదేవుడు వాసుదేవవ్యూహ (మూర్తి) రూపంలోను, సంకర్షణవ్యూహరూపంలోను, ప్రద్యుమ్నవ్యూహరూపంలోను, అనిరుద్ధవ్యూహరూపంలోను తననే నాలుగు విధాలుగా విభజించుకొని ఉంటున్నాడు. వాసుదేవు డనగా పరమాత్మ. సంకర్షణుడు అనగా జీవుడు. ప్రద్యుమ్ను డనగా మనస్సు. అనిరుద్ధు డనగా అహంకారం. ఆ వ్యూహాలలో వాసుదేవుడు పరప్రకృతి. మిగిలిన సంకర్షణాదివ్యూహాలు కార్యం. ఇలాంటి భగవంతుడైన పరమేశ్వరుణ్ణి అభిగమన ఉపాదాన-ఇజ్యా-స్వాధ్యాయ-యోగాలచేత నూరు సంవత్సరాలు పూజించి క్లేశా లన్నీ క్షీణించగా (భక్తుడు) ఆ భగవంతుణ్ణే చేరుతాడు. (మనోవాక్కాయాలను సావధానంగా ఉంచు కొని దేవతాగృహానికి వెళ్లడం అభిగమనం. పూజాద్రవ్యాలు సంపాదించుకొనడం ఉపాదానం. పూజ ఇజ్య. అష్టాక్షరాదిమంత్రజపం స్వాధ్యాయం. ధ్యానం యోగం.

వి. పంచపదార్థాలను అంగీకరించిన మాహేశ్వరుల మతాన్ని నిరాకరించిన తరువాత చతుర్వ్యూహవాదం బుద్ధిస్థం అవడంచేత అది నిరాకరించబడుతున్నది. ఈ విధంగా వెనుకటి అధికరణంతో ప్రసంగ సంగతి. భాగవతపాంచరాత్రాగమం విషయం. అది జీవోత్పత్త్యాద్యంశంలో ప్రమాణమా కాదా అని సంశయం. ప్రమాణ మని పూర్వపక్షం; కాదని సిద్ధాంతం.

## భాష్యమ్

తత్ర యత్తావదుచ్యతే యోఽసౌ నారాయణః పరోఽవ్యక్తాత్ప్రసిద్ధః పరమాత్మా, సర్వాత్మా స ఆత్మనాత్మానమనేకధా వ్యూహ్యావస్థితః ఇతి తన్న నిరాక్రియతే "స ఏకధా భవతి త్రిధా భవతి" (ఛాం. ఉ 7.26.2) ఇత్యాది శ్రుతిభ్యః పరమాత్మనోఽనేకధాభావస్యాధిగతత్వాత్. యదపి తస్య భగవతోఽభిగమనాదిలక్షణమారాధనమజస్రమనన్యచిత్తతయాభిప్రేయతే, తదపి న ప్రతిషిధ్యతే, శ్రుతిస్మృత్యోరీశ్వరప్రణిధానస్య ప్రసిద్ధత్వాత్. యత్పునరిద ముచ్యతే వాసుదేవాత్సఙ్కర్షణ ఉత్పద్యతే సంకర్షణాచ్చ ప్రద్యుమ్నః, ప్రద్యుమ్నా చ్చానిరుద్ధ ఇతి అత్ర బ్రూమః- న వాసుదేవసంజ్ఞకాత్ పరమాత్మనః సంకర్షణసంజ్ఞకస్య జీవస్యోత్పత్తిః సంభవతి; అనిత్యత్వాది దోషప్రసంగాత్. ఉత్పత్తిమత్త్వే హి జీవస్య అనిత్యత్వాయో దోషాః ప్రసజ్యేరన్, తతశ్చ నైవాస్య భగవత్ప్రాప్తిర్మోక్షః స్యాత్. కారణప్రాప్తౌ కార్యస్య ప్రవిలయ ప్రసంగాత్. ప్రతిషేధిష్యతి జీవస్యోత్పత్తిమ్-"నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః" (బ్ర.సూ 2.3ఙ17)ఇతి. తస్మాదసంగతైషా కల్పనా 42.

## బాలానందిని

తత్రేతి:- అవ్యక్తంకంటె పరుడుగా ప్రసిద్ధుడు, పరమాత్మ, సర్వాత్మస్వరూపుడు అయిన ఏ నారాయణు డున్నాడో ఆ నారాయణుడు తనను అనేకరూపాలలో నిర్మించుకొని ఉన్నాడు అని ఏది చెప్పబడిందో దానిని నిరాకరించడం లేదు. "స....భవతి"(అ పరమాత్మయే ఒకడుగా అవుతన్నాడు. మూడుగా అవుతున్నాడు) ఇత్యాదిశ్రుతులవల్ల పరమాత్మ అనేకరూపాలలో ఉంటున్నాడు అని తెలుస్తూన్నది గదా?ఎల్లప్పుడూ ఏకాగ్రమైన చిత్తంతో అభిగమనాదులచేత ఆ భగవంతుణ్ణి ఆరాధనం చెయ్యాలి అని చెప్పినది కూడ నిషేధింపబడడంలేదు. ఈశ్వరప్రణిధానం (ఈశ్వరధ్యానం, సేవాదికం) శ్రుతిస్మృతులలో ప్రసిద్ధమేకదా? కాని వాసుదేవునినుండి

ణు
సంకర్షణు,సంకర్షణునినుండి ప్రద్యుమ్నుడు. ప్రత్యుమ్నునినుండి అనిరుద్ధుడు పుట్టాడు అని ఏది చెప్పబడిందో దాని విషయంలో చెపుతున్నాం. వాసుదేవు డనే పరమాత్మనుండి సంకర్షణుడనే జీవుని ఉత్పత్తి సంభవముకాదు. అట్లంగీకరిస్తే జీవునికి అనిత్యత్వం మొదలైన దోషాలు ప్రసక్తమౌతాయి. జీవుడు ఉత్పత్తి కలవాడైతే అనిత్యత్వం మొదలైన దోషాలు ప్రసక్తాలవుతాయి. అప్పుడా జీవుడు భగవంతుణ్ణి పొందడం మోక్షం కా[illegible]దు (పూర్వం లేకుండా ఒక కాలంలో పుట్టిన వస్తువు వలె జీవుడు తిరిగి భగవంతుణ్ణి చేరుతాడు అన్నట్లయితే) కార్యం కారణాన్ని పొంది నప్పుడు (మట్టిలో చేరిన కుండవలె) అది లీనమైపోతుంది కదా? ఆచార్యుడు "నాత్మా ఽ శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః"అనే సూత్రంచేత జీవునకు ఉత్పత్తిని నిషేధించనున్నాడు కూడ.అందువల్ల ఈ కల్పన అసంగత మైనది. 42.

## సూ. న చ కర్తుః కరణమ్ 2.2.43.

ఇతశ్చాసంగతైషా కల్పనా, యస్మాన్న హి లోకే కర్తుర్దేవదత్తాదేః కరణం పరశ్వాద్యుత్పద్యమానం దృశ్యతే. వర్ణయన్తి చ భాగవతాః కుర్తుర్జీవాత్సం కర్షణసంజ్ఞకాత్ కరణం మనః ప్రద్యుమ్నసంజ్ఞముత్పద్యతే, కర్తృజాచ్చ తస్మాదనిరుద్ధసంజ్ఞకోఽహంకార ఉత్పద్యత ఇతి.న చైతద్దృష్టాన్త మన్తరేణాధ్యవ సాతుం శక్నుమః; న చైవంభూతాం శ్రుతిముపలభామహే. 43.

### బాలానందిని

నేతి:- "కర్తుః = కర్త నుండి, కరణమ్= కరణం, న చ = పుట్టదు కూడ అని సూత్రార్థం.

ఇతశ్చేతి:- ఈ కారణం వల్ల ఈ కల్పన అసంగతమైనది. ఎందువల్ల ననగా లోకంలో ఎక్కడా కర్తయైన దేవదత్తాదినుండి కరణమైన పరశువు (గండ్రగొడ్డలి)మొదలైనవి పుడుతున్నట్లు చూడబడడం లేదు. సంకర్షణు డనే పేరు గల కర్తయైన జీవునినుండి ప్రద్యుమ్ను డనే మనస్సు పుడుతుందనీ కర్తనుండి పుట్టిన ఆ మనస్సునుండి అనిరుద్ధు డనే అహంకారం పుడుతుందనీ భాగవతులు వర్ణిస్తారు. దీనిని ఏదైన దృష్టాంతం చూపుతేనే కాని అర్థం చేసుకొనజాలం.ఇలాంటి శ్రుతి కూడ ఏదీ కనబడడం లేదు. 43.

## సూ. విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః 2.2.44.

అథాపి స్యాన్న చైతే సంకర్షణాదయో జీవాదిభావేనాభిప్రేయన్తే;కిం తర్హి? ఈశ్వరా ఏవైతే జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజోభిరైశ్వరైర్ధర్మైరన్వితా అభ్యుపగమ్యన్తే, వాసుదేవా ఏవైతే సర్వే నిర్దోషా, నిరధిష్ఠానా నిరవద్యాశ్చేతి.

తస్మాన్నాయం యథావర్ణిత ఉత్పత్త్యసంభవో దోషః ప్రాప్నోతీతి -అత్రో చ్యతే.ఏవమపి తదప్రతిషేధః ఉత్పత్త్యసంభవస్యాప్రతిషేధః ప్రాప్నోత్యేవ. అయముత్పత్త్యసంభవో దోషః ప్రకారాన్తరేణేత్యభిప్రాయః. కథమ్? యది తావదయమభిప్రాయః పరస్పరభిన్నా ఏవైతే వాసుదేవాదయశ్చత్వార ఈశ్వరాస్తుల్యధర్మాణో నైషామేకాత్మత్వమస్తీతి, తతోఽ నేకేశ్వరకల్పనా నర్థక్యమ్. ఏకేనైవేశ్వరేణేశ్వరకార్యసిద్ధేః. సిద్ధాన్తహానిశ్చ;భగవానేకో వాసుదేవః పరమార్థతత్త్వమిత్యభ్యుపగమాత్.అథాయమభిప్రాయః- ఏకస్యైవ భగవతశ్చత్వారో వ్యూహాస్తుల్యధర్మాణ ఇతి, తథాపి తదవస్థ ఏవోత్పత్త్య సంభవః.న హి వాసుదేవాత్సంకర్షణస్యోత్పత్తిః సంభవతి, సంకర్షణాచ్చ ప్రద్యుమ్నస్య ప్రద్యుమ్నాచ్చానిరుద్ధస్య.అతిశయాభావాత్.భవితవ్యం హి కార్యకారణయోరతిశయేన యథా మృద్ఘటయోః. న హ్యసత్యతిశయే కార్యం కారణమిత్యవకల్పతే.న చ పఞ్చరాత్రసిద్ధాన్తిభిర్వాసుదేవాదిష్వేకైకస్యైకైకస్మిన్ సర్వేషు వా జ్ఞానైశ్వర్యాదితారతమ్యకృతః కశ్చిద్భేదోఽభ్యుపగమ్యతే; వాసుదేవ ఏవ హి సర్వే వ్యూహా నిర్విశేషా ఇష్యన్తే. న చైతే భగవద్వ్యూహాశ్చతుః సంఖ్యాయామేవావతిష్ఠేరన్; బ్రహ్మాదిస్తమ్బపర్యన్తస్య సమస్తస్యైవ జగతో భగద్వ్యూహత్వావగమాత్. 44.

## బాలానందిని

విజ్ఞానేతి:- "విజ్ఞానాదిభావే వా=సంకర్షణాదుదాలలో విజ్ఞానాదులు ఉన్నా యని అంగీకరించినా కూడ, తదప్రతిషేధః=ఉత్పత్త్యసంభవానికి ప్రతిషేధం లేదు" అని సూత్రార్థం.

**అథాపీతి:-** ఈ సంకర్షణాదులు జీవాదులుగా అంగీకరించబడడంలేదు. మరేమనగా వీళ్లందరూ జ్ఞాన-ఐశ్వర్య-శక్తి-బల-వీర్య-.తేజస్సు లనే ఈశ్వరధర్మాలతో కూడిన ఈశ్వరులుగానే అంగీకరించబడుతున్నారు, వీళ్లందరూ దోషరహితులూ,మరొక అధిష్ఠానం ఏదీ లేనివారూ, అనగా ప్రకృతినుండి జనించనివారు,నాశరహితులూ అయినా వాసుదేవులే,అందుచేత పైన వర్ణించి చెప్పిన ఈ ఉత్పత్త్యసంభవదోషం ప్రవర్తించదు అని అన్నా కూడ, ఈ విషయంలో చెప్పబడుచున్నది.ఇలా చెప్పినా కూడ, తదప్రతిషేధం అనగా, ఉత్పత్త్యసంభవానికి అప్రతిషేధం ప్రాప్తిస్తూనే ఉంది.

ఈ ఉత్పత్త్యసంభవదోషం మరొక పద్ధతిలో ప్రాప్తిస్తుంది అని అభిప్రాయం. ఎట్లు?వాసుదేవాదులైన ఈ నలుగురూ పరస్పరభిన్ను లైన, తుల్యధర్మాలు గల ఈశ్వరులే. వీళ్లకు ఏకస్వరూపత్వం లేదు అని (మీరు చెప్పినదానికి) అభిప్రాయమైతే, అప్పుడు ఒకే ఈశ్వరునితో పని జరిగిపోతూన్నప్పుడు అనేకేశ్వరులను కల్పించడం వ్యర్థం. భగవంతుడైన వాసుదేవు డొక్కడే పరమార్థతత్త్వం అని (మీరు) అంగీకరించడం వల్ల మీ సిద్ధాంతానికి భంగం వస్తుంది. అట్లు కాక - ఈ నాలుగు వ్యూహాలూ కూడ ఒకే భగవంతుని నాలుగు సమానధర్మాలు గల వ్యూహాలు అని అభిప్రాయమైతే అప్పుడు కూడ ఉత్పత్త్యసంభవదోషం అలాగే ఉంది. వాసుదేవునినుంచి సంకర్షణుని ఉత్పత్తి, సంకర్షణునినుండి ప్రద్యుమ్నుని ఉత్పత్తి, ప్రద్యుమ్నునినుండి అనిరుద్ధుని ఉత్పత్తి కుదరవు కదా? ఎందువల్ల ననగా అతిశయం ఏదీ లేదు. మృద్ఘటాలలో కొంచెం అతిశయం, విశేషం, ఉన్నట్లు కార్యకారణాల మధ్య ఏదో కొంత అతిశయం (విశేషం) ఉండాలి కదా? అలాంటి విశేషం ఏదీ లేకపోతే ఒకటి కారణ మనీ మరొకటి కార్య మనీ చెప్పడం కుదరదు కదా? వాసుదేవాదులలో ఒక్కొక్కరిలో గాని అందరిలోనూ గాని జ్ఞానైశ్వర్యాదుల తారతమ్యంచేత ఏర్పడిన తారతమ్యం ఉందని పాంచరాత్రసిద్ధాంతులచేత అంగీకరించబడడం లేదు కదా? ఈ వ్యూహా లన్నీ ఎట్టి విశేషమూ లేని వాసుదేవులే అని అంగీకరించబడుతున్నాయి. మరొక విషయ మేనగా - ఈ భగద్వ్యూహాలు నాలిగింటితోనే ఆగిపోవు. ఎందువల్ల ననగా బ్రహ్మదేవుడు మొదలు స్తంబం(ఒక గడ్డి లేదా పురుగు) వరకు ఉన్న సమస్తజగత్తూ కూడా భగవంతుని వ్యూహమే (మూర్తియే, శరీరమే) అని తెలుస్తూన్నది కదా? 44.

## సూ. విప్రతిషేధాచ్చ. 2.2.45

విప్రతిషేధశ్చాస్మిన్ శాస్త్రే బహువిధ ఉపలభ్యతే గుణగుణిత్వాది కల్పనాలక్షణః. జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజాంసి గుణాః, ఆత్మాన ఏవైతే భగవన్తో వాసుదేవా ఇత్యాదిదర్శనాత్.విప్రతిషేధశ్చ భవతి—చతుర్షు వేదేషు పరం శ్రేయోఽలబ్ధ్వా శాణ్డిల్య ఇదం శాస్త్రమధిగతవాన్ (అధీతవాన్)ఇత్యాది వేదనిన్దాదర్శనాత్. తస్మాదసంగతైషా కల్పనేతి సిద్ధమ్.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యశ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్య

శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతౌ శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యే

ద్వితీయాధ్యాయస్య ద్వితీయః పాదః

## బాలానందిని

విప్రతిషేధాదితి:- ''విప్రతిషేధాచ్చ= చెప్పిన విషయాలలో పరస్పర విరోధమూ,వేదవిరోధమూ ఉండడంవల్ల కూడ ఈ కల్పన అసంగతము'' అని సూత్రార్థం.

విప్రతిషేధ ఇతి:- ఒకే వస్తువును గుణ మనీ, గుణి అనీ చెప్పడం మొదలైన అనేకవిధాలైన పరస్పరవిరోధం కూడ ఈ శాస్త్రంలో కనబడుతున్నది. ఎందువల్ల ననగా జ్ఞాన-ఐశ్వర్య-శక్తి-బల-వీర్య తేజస్సులు గుణాలు, ఇవన్నీ భగవంతులైన వాసుదేవులైన ఆత్మలే ఇత్యాదులు చాలా కనబడుతున్నాయి. (జ్ఞానాదులు గుణా లని చెప్పి అవే వాసుదేవులు అనగా ఆ గుణా లున్న గుణులు, అని చెప్పడం పరస్పరవిరుద్ధం) వేదవిరోధం కూడ ఉంది. శాండిల్యుడు నాలుగు వేదాలలోను పరమశ్రేయస్సును పొందజాలక ఈ శాస్త్రం సంపాదించాడు (చదివాడు)ఇత్యాదివేదనింద ఈ పాంచరాత్రాగమంలో కనబడుతున్నది. అందువల్ల ఈ శాస్త్రంలో చెప్పిన కల్పన అసంగత మైనది.

ఉత్పత్త్యసంభవాధికరణం (పాంచరాత్రాధికరణం) సమాప్తం

"బాలానందిని" అను శ్రీమచ్ఛాఙ్కరశారీరకమీమాంసాభాష్యాంధ్రవ్యాఖ్యానంలో ద్వితీయాధ్యాయంలోని ద్వితీయపాదం సమాప్తం.